# శ్రీలలిత

(ప్రథమ భాగము - 108 నామములకు వివరణము)

మాస్టర్ కె. పార్వతీకుమార్



ధనిష్ఠ

ప్రథమ ముద్రణ : 2004
ప్రతులు : 1,000

వెల : రూ॥ **40-00**

ప్రాప్తిస్థానము :
జగద్గురు మందిరము
(ది వరల్డ్ టీచర్ టెంపుల్)
'రాధామాధవమ్',
14-38-2, ముప్పిడి కోలనీ,
విశాఖపట్నం - 530 002.

ముద్రణ :
♒ ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్
విశాఖపట్నం - 530 016.
☏ 2747320, 2751329.



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువలేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శృతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జన్మించినది.

**"ధనిష్ఠ"**, డా॥ కంభంపాటి పార్వతీకుమార్ గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపము లోను, పుస్తకముల రూపములోను భద్రపరచి సత్సాధకుల కందునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును, సద్గోష్ఠికై వలసిన వాతావరణమును - "జగద్గురు మందిరము" గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

## *సంకలనకర్త : మాస్టర్ కంభంపాటి పార్వతీకుమార్*

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగా భ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయులకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ కంభంపాటి పార్వతీకుమార్** గారు. వారి బోధనలు లెక్కకు మించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియ వచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసర ణీయమై, ఆచరణయోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించుచున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళా రంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో - మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే, దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, "మానవ సేవయే మాధవసేవ" అను మాటకు సరియైన అర్థము యిదేనని శ్రీ కుమార్‌గారు తమ ప్రవర్తన ద్వారా తెలియపరచుచున్నారు. శ్రీ పార్వతీకుమార్ బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు,

విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక - మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, అనేక గ్రంథముల సంకలనకర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొను చుండుననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు శ్రీ కుమార్‌గారి దృఢవిశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

శ్రీ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశవిదేశములలో పరహితసేవ గావించుచున్నవి. “పరహితము పరమధర్మ” మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

"శ్రీ లలిత" అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతి మాసము నావాణి దర్శన మాస పత్రికయందు ప్రచురింపబడుచున్నవి. మొదటి 108 నామములను ఒక పుస్తకముగ నేర్పరచుటకు పాఠకుల కోరికపై "ధనిష్ఠ" పూనుకొన్నది. దాని ఫలమే ఈ వ్యాఖ్యాన గ్రంథము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీరమగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారి నుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారి యందు, వారి భాషణ యందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహ పరములకు పరిష్కారమని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

\- ధనిష్ఠ

# పరిచయము

లలితా దేవి, శ్రీ దేవి, దుర్గ, మహాలక్ష్మి, మహా సరస్వతి, మహా కాళి, రాజ రాజేశ్వరి, త్రిపుర సుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణ ములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమేయేమూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్తస్థితి యందు సత్యముగను, వక్త స్థితి యందు మహాచైతన్యము గను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితిగొనుటకు వినియోగ పడును. అందులచే పారాయణము. అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు. వాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వాఖ్యానము. సామాన్యులకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

– పార్వతీకుమార్.

# విషయసూచిక

# 1. 'శ్రీమాతా'

**'శ్రీ'** యనగా లక్ష్మి, సరస్వతి, భూమి, భాగ్యము, సంపద, జయము, కాంతి, జ్ఞానము అను అర్థములు కలవు. 'శ్రీమాత' అనగా వీరికి తల్లి అని అర్థము. అనగా లలితాదేవి లక్ష్మి, సరస్వతి, రుద్రాణిలకు కూడా తల్లియై పరమశివుని పత్నియైన పరాశక్తి, పరాభట్టారిక అని తెలుపబడుచున్నది. అంతటికీ అమ్మ ముగురమ్మల మూలపుటమ్మ. అట్టి మాతృదేవి మోక్షార్థులచే కూడ స్తుతింప దగినది. ఈమె వేదములకు, బ్రహ్మకు కూడ ముందుగ నున్నది.

శ్రీ యన విషము అను అర్థము కూడ కలదు. మాత యన కంఠమున నుంచుకొనినది. అనగా ఈమె సృష్టి సంహారకారిణి కూడ.

లలితాదేవి సర్వజనయిత్రి. సమస్త భూతములు ఆమె నుండి పుట్టుచున్నవి. సర్వసృష్టికి మూలకారణము. లోకమున బాధ కలిగినపుడు తల్లిని స్మరించుట కద్దు. లోకములోని తల్లులు తాపత్రయములను పోగొట్టు సమర్థురాండ్రు కారు. సంసార సాగరమందు పడి అన్య రక్షణ లేక భయగ్రస్తులైనవారు దురంత దుఃఖములను పొందువారు జగన్మాత యగు శ్రీమాతను తలచినచో అభయము కలుగును. దయావతిగాన మాతృమూర్తిగా స్తుతింప దగినది. సృష్టి మొత్తమునకు మూలాధారశక్తియై సకల బ్రహ్మాండములు ఈమె యందుండుటచే శ్రీమాతయైనది. జనులచే ఆశ్రయింపబడిన దగుటచే కూడ శ్రీమాత అగుచున్నది. నిర్గుణ పరబ్రహ్మమే సృష్ట్యాదుల నొనర్ప సగుణ బ్రహ్మముగా వచ్చినపుడు శ్రీమాత యగుచున్నది.

# 2. 'శ్రీ మహారాజ్ఞీ'

సమస్త ప్రపంచముల గుంపును పాలించు అధికారము గలది అని అర్థము. రాజ శబ్దమునకు పాలించువాడు అని, రాజ్ఞి అను శబ్దమునకు పాలించునది అను అర్థములు గలవు. ఎవరిచే సమస్త ప్రపంచము పుట్టింపబడి పాలింపబడుచున్నదో ఆ మహాశక్తిని ఇచ్చట స్మరించుట జరుగుచున్నది. శ్రీ మహారాజ్ఞి పదమును, శ్రీం, అ, హ, రాజ్ఞి అని గ్రహించిన, శ్రీం–షోడశకళగను, అ–పరతత్త్వముగను, హ–అందుండి వెలువడిన వెలుగుగను, రాజ్ఞి–మాయకు అధిదేవతగను తెలియదగును. శ్రీ, శ్రీవిద్యలో పరమ రహస్యమైన షోడశాక్షరీ మంత్రము నందు మొదటి అక్షరము. సద్గురువు నందు పూర్ణభక్తి విశ్వాసములు గల శిష్యునకు మాత్రము ఉపదేశింపదగిన అక్షరము. గురూపదేశము ననే ఈ అక్షరము పదహారు కళలను అంతర్ముఖముగ వికసింప చేయును. చతుర్లక్ష్మి మంత్రములలో కూడ శ్రీ మొదటి వర్ణముగ లల్లుడు వ్యాఖ్యానించెను. అకారము పరతత్త్వమే. అక్షరములలో అకారము నేనని భగవంతుడు నుడివియున్నాడు కదా! (భగవద్గీత 10వ అధ్యాయము). అకారము శక్తి అని ఇచ్చట సంకేత పద్ధతిలో చెప్పబడినది. అనగా పరతత్త్వము వెలుగు, వెలుగు యొక్క షోడశ కళలుగ ఏర్పడు సృష్టి. దానిని ఆవరించియుండు మాయ ఈ నామమున కీర్తింపబడుచున్నది.

# 3. 'శ్రీమత్సింహాసనేశ్వరి'

**సిం**హము ఆసనముగా కలది, సింహము నధిరోహించునది అని అర్థము. సింహము నధిష్ఠించి మహిషాసురుని చంపినదిగాన అమ్మవారికీ నామము వచ్చినది. సింహ శబ్దమునకు హింసించునది అని అర్థము. ఇచ్చట హింసించుట శమింపజేయుటగా పరిణమించునని గ్రహింపవలెను. దేవి అసురులను హింసించి, లోకమును శమింప జేయును. అవతారమూర్తులు కూడ అధర్మపరులను శిక్షించి లోకహితము చేయుదురు.

శివ–వశ; కశ్యప–పశ్యక అను శబ్దములుకూడ ఇట్లే వర్ణ వ్యత్యయముచే ఏర్పడినవే. అధర్మమును హింసించి, ధర్మమును ప్రతిష్ఠించు నని ఈ నామమున దేవి కీర్తింపబడుచున్నది. అజ్ఞానమున పడిన మానవు లను జ్ఞానమార్గమున నిలుపుటకు కూడ కాలక్రమమున హింసింపబడుట గమనింపవలెను. ధర్మాధర్మ సమ్మిశ్రమముగ జీవనము సాగుచున్నప్పుడు మానవుడు కొంత హింసకు లోనగును. ఘర్షణ యుండును. క్రమశః వివేకియై ధర్మము నవలంబించుచు హింసింపబడని స్థితికి పరిణతి చెందుచుండును. బాహ్యప్రపంచమున సంగము కల వాడు, అంతః ప్రపంచమున జ్ఞానము లేనివాడు కూడ ఘర్షణ చెందు చుండును. అంతర్ముఖుడై హృదయమున జీవించువానిని కూడ సింహా సనమును అధిష్ఠించిన వాడని యోగము తెలుపుచున్నది. ధర్మాత్ములు హృదయము ఆధారముగా జీవింతురు. హృదయముతో ఆలోచింతురు. ఇతరుల

శ్రేయస్సు తమ శ్రేయస్సుకన్న ప్రాధాన్యము వహించి యుండును. యోగమున ప్రత్యాహార స్థితియందు సింహము నధిష్ఠించి యున్నట్లుగా అనగా హృదయమునందు స్థితి గొన్నట్లుగా యోగము తెలుపుచున్నది. దేవి యొక్క సహజస్థితి హృదయమే. అమె హృదయము సింహమును అధిష్ఠించి సమస్త సృష్టి కార్యమును నిర్వర్తించు చున్నదని ఈ నామము తెలుపుచున్నది. పరమాత్మ హృదయమునుండి వ్యక్తమై ప్రేమయే ఆధార ముగా సమస్త సృష్టిని పరిపాలించుచున్నదని ఈ నామము తెలుపుచున్నది.

జ్యోతిషమున సింహరాశిని ఈ సందర్భమున వివరించుకొనుట ఉచితము. మనస్సును శ్వాసపై నిలిపి, అంతర్ముఖుడై 'సోఽహం' అను స్పందనమును సామగానముగ అనుభూతిచెందుట సింహరాశి లక్షణము. హృదయమనెడి గుహలో నిరంతరము ఈ గానమునందు అనురక్తి చెందియుండు వారు ఆధ్యాత్మికముగ సింహములని పిలువ బడుదురు. హృదయభాగము సింహరాశికి సంబంధించినదే. మానవ చేతన హృదయమును చేరినపుడు అమ్మను చేరినట్లుగను, సింహమను ఆసనమున ఆసీనుడైనట్లుగను జ్యోతిషము తెలుపుచున్నది. అనాహత చక్రము సింహరాశి సంబంధితమే. అచట అహతముకాక వ్యక్తమగు చున్న ప్రణవమును అనుభవింతురుగాన అనాహత మనిరి. అట్లు అనాహత శబ్దమును అధిష్ఠించియున్నది కనుక దేవి సింహాసనాసీన అని కూడా తెలుపబడుచున్నది.

సింహము నధిష్ఠించినవారు మాత్రమే మహిషమును వధించ గలరు. పశుప్రాయముగ జీవించు స్వభావముగల మానవుడు దున్న

పోతుతో సమానము. యమ నియమ ఆసన ప్రాణాయామాదుల మార్గమున ఈ మహిషమును వధించి సింహాసనము నధిష్ఠించుటయే యోగ మార్గము. మహిష స్వభావము జీవించి యున్నంతకాలము హృదయమను సింహాసనమున ఆసీనుడగుట దుర్లభము. సమస్త దేవతారాధనములు, యజ్ఞయాగములు, పరహిత కార్యములు, జ్ఞాన యజ్ఞములు, మహిష తత్త్వమును వధించుటకే. ఇచ్చట మహిషమును హింసించి, సింహమును అధిష్ఠించుట హెచ్చరికగ చెప్పబడుచున్నది. *"హింస, సింహ, సోఽహం, హంస"* అను ద్వయాక్షర మంత్రములు ఈ నామమునకు సంబంధించి యున్నవి.



# 4. 'చిదగ్నికుండసంభూతా'

**చి**దగ్ని యను కుండమునుండి పుట్టినది అని అర్థము. పరతత్త్వము నుండి ఏర్పడిన మొదటి సంకల్పమే యజ్ఞకుండము. అందుండియే సమస్త సృష్టి ఏర్పడును. సంకల్ప మేర్పడగానే చైతన్యము కూడ ఏర్పడును. ఆ చైతన్యము కోటి సూర్యులను మించిన అగ్నిగా వ్యక్తమగును. సృష్టి యజ్ఞకుండమున చైతన్యాగ్ని ఈ విధముగ ఉద్భవించును. అందుండి సమస్త లోకములు, ఆ లోకములందుండు జీవులు ఉద్భవింతురు. ఉద్భవించిన సమస్త లోకములయందు, లోకుల యందు కూడ చైతన్యమను అగ్ని అంతర్హితముగ నున్నది. ఏ అగ్ని నుండి ఈ సమస్తము ఉద్భవించినదో ఆ చైతన్యాగ్ని కూడ పరబ్రహ్మ స్వరూపిణియైన దేవి నుండి సంకల్పమాత్రముగ ఉద్భవించినదని భావన.

మానవుడు నిద్ర నుండి మేల్కాంచుట ప్రతినిత్యము జరుగు చున్నది. స్థితి లేక సత్యము నందున్నటువంటి తత్త్వము చైతన్యముగ మేల్కాంచుచున్నది. ఈ మేల్కొనుటకు వలసిన సంకల్పము మానవుని ఎరుకలో లేదు. అంతర్హితముగ నున్న తత్త్వము నుండి ప్రేరణ (సంకల్పము) కలిగి, చైతన్యవంతుడుగ మేల్కాంచుచున్నాడు. ఇట్లు సత్యవంతుడు చైతన్యవంతుడగు చున్నాడు. అట్లే పెంజీకటి కవ్వలనున్న తత్త్వము *(తమసః పరస్తాత్)* ఈ మొదటి సంకల్పమును వ్యక్తముజేసి, దాని నాధారముగ గొని చైతన్యాగ్నిగ వ్యక్తమగును.

మేల్కాంచిన మానవుని నుండి మరల సంకల్పములు కలిగి, తన చుట్టును తన జీవితమను సృష్టి నేర్పరచుకొనుచున్నాడు. అట్లే పరతత్త్వము నుండి సంభవించిన చైతన్యమను అగ్నికూడ మేల్కొన

బడినదై సృష్టి కార్యమునకు పూనుకొనును. చైతన్యాగ్ని సంభవించగనే తమస్సను చీకటి హరింపబడి, వెలుగు వ్యాపించును.

సత్యవంతుడు చైతన్యవంతుడగుట కూడ తమస్సు (నిద్ర) నుండి పరతత్త్వము చైతన్యముగా మేల్కాంచుటయే. ఇట్లు మేల్కాంచిన తత్త్వము మరల పరతత్త్వములోనికి కాలగతిని యిమడగలదు. అనగా మరల తమోగుణము ఆవరింపగలదు. రాత్రి ఏర్పడగనే జీవులన్నియు నిద్ర యను తమస్సులోనికి తీసుకొనబడి పోవుచున్నవి కదా! కావున యజ్ఞార్థమై సృష్టి నిర్మాణము చేయుటకు చైతన్యాగ్నిగ సంకల్పము నుండి వ్యక్త మగుట, మరల తిరోధానము చెందుట అనునవి పరతత్త్వ మాధారముగ జరుగుచున్నవి. తమస్సు కవ్వలనుండు తత్త్వము తమస్సును ఛేదించు కొని రజస్సుగ నుద్భవించును. తిరోధానమున మరల రజస్సును తమస్సు హరించుకొనును. ఆ తమస్సున కవ్వల స్థితి యున్నది. ఆ తమస్సున కివ్వల కూడ స్థితి యున్నది. తమస్సున కీవలి స్థితి సత్త్వగుణము నాశ్రయించి యుండును. తమస్సున కవ్వలిస్థితి త్రిగుణ ములకును ఆశ్రయము.

ఈ చిదగ్ని శోక మోహములను దహింపగలదు. ఇది సమస్త ధర్మములను ధరించియుండును. దీనిని చేరుటయే దేవిని చేరుట.

సంభూత అని చెప్పుటలో ఉన్నదే వ్యక్తమైనదని అవగాహన (సమ్యక్+భూత). చైతన్యాగ్ని రూపముగ వ్యక్తమగుటకు పూర్వము ధర్మముగ పరతత్త్వమున నున్నదియే కాని, పుట్టినదని అర్థము కాదు. అనగా దేవి యొక్క శాశ్వతత్త్వము సంభూతా అను పదముతో అద్భుతముగ ప్రతిపాదింపబడినది. భూతమనగా ఉన్నది వ్యక్తమైనదని అర్థము. అనగా గుణాతీత తత్త్వము సగుణమైనదని గ్రహింపవలెను.

ఈ నామము అష్టాక్షరీ నామము కనుక ఏడు లోకములకు ఆశ్రయము నిచ్చు ఎనిమిదవది అనికూడ గ్రహింపవలెను.

# 5. 'దేవకార్య సముద్యతా'

**ఈ** నామము కూడ అష్టాక్షరియే. దేవతల కార్యమును నిర్వర్తించుటకై వ్యక్తమైనదని అర్థము. సమస్త దేవతలు చైతన్యాగ్ని నుండియే వెలువడి, సృష్టి నిర్మాణము చేయుచున్నారు. బ్రహ్మాది దేవతలందరు కూడ ఈ చైతన్యమనెడి అగ్నికుండము నుండి పుట్టిన వారే. చైతన్యాగ్నిగ యజ్ఞకుండమున ఆవిర్భవించగనే దేవతా కార్యము నకు దేవి ఉద్యుక్తురాలగును గాని, విశ్రాంతి గొనుట యుండదు. మానవుడు కూడ మేల్కాంచగనే కార్యములందు ఉద్యుక్తు డగుచున్నాడు కదా! ఈ ఉద్యుక్తత మానవులయందు గల దేవీ లక్షణమే. మేల్కాంచి బద్ధకముగ నుండుట, మరల పండుకొనుట తమోగుణ లక్షణము. దేవి భక్తు డట్లుండడు, మేల్కాంచగనే ఈశ్వరార్చనముగ చేయవలసిన పనులయందు తనను తాను నియమించుకొనును. ఇది చైతన్యవంతుని లక్షణము. దేవి చైతన్యాగ్నిగ వ్యక్తమవగనే దేవకార్యము సిద్ధించుటకై తనను తాను నియమించుకొనునని, ఆ విధముగ అత్యంత అప్రమత్తురా లని తెలియవలెను. పిలిచిన వెంటనే ఆలస్యము చేయక ప్రతిస్పందించు ప్రేమ స్వరూపిణియని గమనించవలెను.

సృష్ట్యారంభమున వ్యక్తమై త్రిగుణాత్మకముగ తనను తాను విభజించుకొన్నప్పటికీ దేవతల ప్రార్థనకు ప్రతిస్పందించి తానావిర్భవించి మహిషాసుర, భండాసురాదులను వధించినది. దేవి ఒక్కరే అయినను ముగ్గురుగ కూడ గోచరించుచుండును. ఆమె నిత్యురాలు. దేవ సృష్టికి,

దేవ రక్షణకు, ఏర్పడుట ఆమె 'స' రూప స్థితి. ఆమె అరూప అని కూడ తెలియవలెను. అరూపయే సరూప అగుచుండును. అట్లగుట అవసరమునుబట్టి జరుగును.

సృష్టి అంతయు దేవి నుండి దిగివచ్చిన దేవతలయొక్క యజ్ఞార్థ కర్మగా జరుగుచూ ఉండును. అట్లు జరుగు దేవతా యజ్ఞమున అసురులు కూడ ఉద్భవించుచుందురు. సురలనగా వెలుగు ప్రజ్ఞలు. వారి వలననే సృష్టియజ్ఞము జరుగుచుండును. అసురులనగా ఆ వెలుగులను ఆవరించి కమ్ముకొను చీకటి లేక తమస్సు. అట్లు జరిగినప్పుడెల్ల దేవి ఆవిర్భవించుటయు, ఆమె ఆవిర్భావ కారణముగ కమ్మిన చీకట్లు (తమస్సు) హరింబడుటయు జరుగుచుండును. ఇదియే దేవి యొక్క దేవతారక్షణ స్వభావము. అంతమాత్రము చేత దేవి సుర పక్షపాతి యని అనతగదు. సృష్టి నిర్మాణమున, సృష్టి స్థితి కాలమున ఇట్లు రక్షించినను, తిరోధాన సమయమున తమోగుణమును లేక అసురమును అనుమతించును కదా! అందుచే సృష్టికార్యము జరుగు నపుడు దేవతలను రక్షించుచుండును. ప్రళయ కాలమున తమమును అనుమతించును. అట్లనుమతించినచో మేల్కొంచిన జీవునకు నిదుర యుండదు. ఈ విధముగ దేవి జీవులను, లోకములను అనురక్షణము చేయుచుండును.



# 6. 'ఉద్యద్భానుసహస్రాభా'

**ఉ**దయించుచున్న వేయి సూర్యుల కాంతి గలది అని అర్థము. ఉదయించుచున్న సూర్యుడు ఎఱ్ఱని కాంతి కలవాడై ఉండును. వేయి సూర్యు లొక్కమారు ఉదయించినచో ఏర్పడు ఎఱ్ఱని కాంతిని దేవి కలిగియున్నదని తెలియవలెను. అనగా మిక్కిలి ఎఱ్ఱని దేహచ్ఛాయ గలదై దేవి ఉద్భవించుచున్నదని, అట్లే ఉపాసించ తగినదని ఈ నామము తెలుపుచున్నది. 'జపా కుసుమ భాసురా' అని కూడ దేవికి నామము కలదు. అనగా ఆమె శరీర కాంతి దాసానిపూవు వంటి ఎరుపుదనము కలిగినదని అర్థము.

అరుణత్వము అమ్మ ఉద్భవించునప్పటి కాంతి. అరుణము రజస్సునకు, సంకల్పబలమునకు సంకేతము. దేవి అరుణత్వము కనులకు అగపడునది కాదు. వాక్కునకు అందునది కాదు. బ్రహ్మాండ మంతయు వ్యాపించియుండు తేజస్సే ఈ అరుణత్వము. అవ్యక్తమగు తత్త్వము నందు మొట్టమొదట వ్యక్తమగు కాంతి కూడ ఎరుపే నని తెలియవలెను. ఈ ఎఱ్ఱదనము దేవి పరాక్రమమునకు, శక్తికి కూడ చిహ్నము.



# 7. 'చతుర్బాహుసమన్వితా'

**నా**లుగు బాహువులు కలది, నాలుగు బాహువులుగా ఏర్పడినది లేక నాలుగు బాహువులతో కూడినది అని అర్థము. సంకల్పము నుండి ఏర్పడిన చేతనాగ్ని ఉద్భవించు సమయమున వేయి సూర్యుల అరుణకాంతిగా ఇంతకు ముందటి నామమున చెప్పబడినది. అచటి నుండి క్రమశః నాలుగు బాహువులు పొందినదిగా ఈ నామము తెలుపుచున్నది. ఈ నాలుగు బాహువులే బ్రహ్మ జనించు నాలుగు దళముల పద్మముగను, అటుపై బ్రహ్మకేర్పడు నాలుగు ముఖములుగను, బ్రహ్మ ధరించు నాలుగు వేదములుగను తెలియవలెను. అటులే దేవి ఉద్భవించినదై, సృష్టియందు నాలుగు స్థితుల యందున్నదని కూడ తెలియవలెను. ఈ నాలుగు స్థితులను పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరి అని యందురు. వైష్ణవ సంప్రదాయమున వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులుగా పేర్కొందురు. శాక్తేయులు ఆదిశక్తి, ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులుగ పేర్కొందురు. నాలుగు కాలముల యందు నిండియున్న శక్తి స్వరూపిణిగ కూడ దేవిని గ్రహింపవచ్చును. అనగా కృత, త్రేతా, ద్వాపర, కలియుగములలో వ్యాపించిన శక్తిగా భావన చేయవచ్చును. సృష్టి సమస్తము చతురస్రమే అని వేదము ఘోషించు చున్నది. విష్ణునామ సహస్రమునందు కూడ 'చతురస్రో' అను నామము కలదు. ఉద్భవించిన దేవి చతురస్రముగ రూపుగొనునని దీని భావము.

ఎర్రని కాంతితో కూడిన దేవి నాలుగు బాహువులు కలదిగ ధ్యానింపవలెనని కూడ ఇందలి సూచన. సృష్టి సమస్తము నందును

ఈ నాలుగు బాహువులను దర్శింపవచ్చును. ప్రతి వస్తువునకును రూపముండును. ఆ రూపమునకు ఆధారముగ వర్ణముండును. ఆ వర్ణమున కాధారముగ శబ్దముండును. శబ్దమున కాధారముగ తత్త్వముండును. తత్త్వము, శబ్దము, వర్ణము, రూపము అను నాలుగు స్థితులను ఒక వస్తువునందు దర్శించుటయే చతుర్బాహు దర్శనము.

కనబడు ప్రతి వస్తువు నందును కనపడక మూడు స్థితులు ఇమిడి యున్నవని తెలియవలెను. పురుష సూక్తమున ఈ ధర్మమునే "కనపడు విశ్వము, దానియందలి జీవులు ఒక పాదమని, కనపడక యున్న పాదములు మూడు అని, మొత్తము నాలుగు పాదములు పురుషునకు కలవని" వివరింపబడినది. అటులనే గుణాతీతమైన తత్త్వము మూడు గుణములుగ ఏర్పడుట యందు కూడ ఈ చతుర్బాహువులను దర్శింపవచ్చును. దినము నందలి నాలుగు భాగములు (ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, అర్ధరాత్రి); మాసము నందలి నాలుగు భాగములు (శుక్లాష్టమి, పౌర్ణమి, కృష్ణాష్టమి లేక బహుళాష్టమి, అమావాస్య); సంవత్సరమందలి నాలుగు భాగములు (మకర సంక్రమణము, వసంత సంక్రమణము (ఉత్తర), కర్కాటక సంక్రమణము, శరత్ సంక్రమణము (దక్షిణ) కూడ దేవి నాలుగు బాహువులేనని భావన చేయవలెను.

మానవులందు కూడ దేవి నాలుగు బాహువులు – అహంకారము, బుద్ధి, చిత్తము, మనస్సు అను అంతఃకరణ చతుష్టయముగ పనిచేయు చుండును. అహంకార మనగా తానున్నానని తెలివి. ఇట్లు తన యందును, తన చుట్టును ఉన్న సృష్టియందును ఈ నాలుగు స్థితులను భావించి, ధ్యానించి, దర్శించుట ఒక చక్కని సాధనా మార్గము. ఈ

దర్శనమున దేవి ఎంత అద్భుతముగ నాలుగు బాహువులతో కూడి యున్నదో తెలియగలదు.

బాల్య, యౌవన, కౌమార, వార్ధక్యములు, బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములను కూడ ఈ సందర్భముగా దేవి చతుర్బాహువులుగ గమనింపవచ్చును. జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయావస్థల యందు కూడ ఈ చతుర్బాహువులను దర్శింపవచ్చును.

తురీయము దేవి సహజస్థితి. సిద్ధుని సహజస్థితి కూడ ఇదియే. తురీయమను తెరపై సుషుప్తి, స్వప్న, జాగ్రదవస్థలు వచ్చి పోవుచు నుండును. మేల్కొనినపుడు, స్వప్నమునందును, నిద్రయందును, తానున్నానని తెలిసి యుండుటయే తురీయస్థితి. దేవి సృష్టియందును, ప్రళయము నందును, వానికతీతముగను గోచరించును. ఇట్లు శాశ్వ తత్త్వము ఆధారముగ త్రిగుణాత్మకముగ సృష్టి స్థితి లయాదులు జరుగు నని తెలుపుటయే నాలుగు బాహువుల సంకేతము. భారతీయ సంస్కృతి యందు దేవతల కిట్లు నాలుగు బాహువులను రూపించుట కిదియే రహస్యార్థము.



# 8. 'రాగస్వరూపపాశాఢ్యా'

**అ**మ్మవారి సృష్టి నిర్మాణ కార్యక్రమమున అత్యంత ప్రతిభావంత మైనది అనురాగ మను పాశము. ఈ పాశమే లేకున్నచో సృష్టి కథయే లేదు. దేవి నుండి ఈ అనురాగ పాశమే ఇచ్ఛాశక్తిగా స్రవించి సృష్టికథను నడుపును. జీవునియందు కూడ ఈ శక్తి కోరికగా పనిచేసి, తనదైన జీవితమును అల్లుకొనుచుండును. సమస్త ప్రపంచమును దేవి ఇచ్ఛాశక్తిచే నడుపబడుచున్నది. ప్రతి జీవియును తన వ్యక్తిగతమైన కోరికలచే నడుపబడుచున్నాడు కదా! కోరిక తనదని అనుకొనుచు సృష్టి కార్యమును చేయుచున్నాడు కదా! నిజమునకు తన కోరికగా వ్యక్తమగుచున్నది దేవి ఇచ్ఛాశక్తియే.

ఇచ్ఛ సృష్టి నిర్మాణమునకు గాని, వ్యక్తిగత జీవన నిర్మాణము నకు గాని పునాదిరాయియై నిలచును. ఇచ్ఛ యుండరాదనుకొనుట మెట్ట వేదాంతమగును. ఇచ్ఛను సృష్టియందు ధర్మముతో జతపరచుట వలన జీవనము ప్రశాంతముగ జరుగగలదు. కోరికయే చెడ్డది అనుకొనరాదు. ఎట్లు కోరుకొనవలెనో తెలియవలెను. డబ్బు పాపిష్ఠిది అందురు. ఇది చేతకానివాడు పలుకు మాట. డబ్బు నెట్లు వినియోగ పరచవలెనో తెలిసినవాని చేతిలో అదే ధనము శోభను, వైభవమును కూర్చును. చేతకాని వానిని భ్రష్టుని చేయును. అట్లే కోరిక కూడ. కోరికయే లేనిచో భగవంతునితో యోగము చెందుట కూడ ఉండదు

కదా! సత్యమును కోరి దానికి సంబంధించిన మార్గమును తపనతో అన్వేషించి, మార్గమున అందింపబడిన నియమములను తీవ్రమైన నిష్ఠతో నిర్వర్తించినగాని, దైవమును పొందలేడు కదా ! దైవమును పొందు తీవ్రమైన కోరికనే తపస్సందురు. తపన లేని వానికి ఏదియును అందదు. పదార్థము వైపునకుగాని, పరమార్థము వైపునకుగాని పయనించుటకు వానియందనురాగ ముండవలెను. అనురాగ మనగా ఎడతెరిపిలేని రాగము. ప్రియునికి ప్రేయసిపై ఎట్లహర్నిశలు ఉండునో, అట్లు తాను పొందదలచిన విషయమున రాగ ముండవలెను. రాగమను పాశమును దేనిపై ప్రయోగింతుమో అది మనకు దక్కగలదు. అట్టి అనురాగము ధర్మబద్ధము కానిచో బంధనమునకు కారణమగును. బంధకారణమైన అనురాగము పాశమువలె పనిచేయును. బంధ కారణము కాని అనురాగము ఉపకరణమై నిలచును. జీవులపై మహాత్ముల అనురాగము ఉపకరణముగ కన్పట్టుచున్నది కదా! సంసార జీవులయొక్క అనురాగము ఎడతెగని బంధములుగ ఏర్పడుచున్నవి కదా! జ్ఞానము నందలి తారతమ్యములే ఇట్టి స్థితులను కలిగించును.

దేవియొక్క రాగ స్వరూప పాశము బంధస్థితిని హెచ్చరించు చున్నది, మోక్షస్థితిని సూచించుచున్నది అని తెలియవలెను.



# 9. 'క్రోధాకారాంకుశోజ్జ్వలా'

క్రోధమనెడు గుణమునకు ఆకారము దాల్చినదిగా దేవి అంకుశమును తెలియవలెను. అట్టి అంకుశమును ధరించిన ఉజ్జ్వల మూర్తిగా ఈ నామము దీనిని ప్రస్తుతి చేయుచున్నది. మదించిన ఏనుగువంటి స్వభావమును కూడ నియమింపగలనని అంకుశము తెలుపును. మదించిన వారికి భయము లేదు. భక్తి ఉండదు. అట్టి వారిని సైతము ఉజ్జ్వలమైన తన క్రోధమను అంకుశముతో సర్వశక్తి మయి అయిన దేవి శిక్షించి, రక్షించగలదు. మదము కరుడుగట్టిన అజ్ఞానము. దానిని పటాపంచలు చేయగల ఆయుధముగ దేవి అంకుశ మును భావింపవలెను.

యమించునది అంకుశమను సత్యము తెలియవలెను. అంకుశా కారము జ్యోతిషమున శనిగ్రహమునకు వినియోగింతురు. లోకమున ధర్మము తప్పి వర్తించువారిని యముని రూపమున దేవియే శాసించు చుండును. కాలక్రమమున ఎంతటి మొనగాడినైనను శనిగ్రహ చారము ద్వారా దేవి బలహీన పరచగలదు. ఏనుగైనను కాలవశమున పీనుగ కాగలదు కదా! కాల రూపమున సమస్త జీవులను నిష్కర్షగా నియమించు శనిగ్రహ తత్త్వమును అంకుశముగా వేదఋషులు సంకేతించిరి. ధర్మమున దేవి జీవులను నియమించునని సందేశ మిచ్చుటకే క్రోధమే ఆకారముగా గల అంకుశమును ధరించినట్లుగా తెలియవలెను.

సామాన్యులను కాలము రూపమున దేవి నియమించును. కొందరిని కష్టముల ద్వారా, మరికొందరిని నష్టముల ద్వారా, ఇంకొందరిని అజపయము, అపకీర్తి ద్వారా, రోగముల ద్వారా మరియు పీడల ద్వారా కర్మఫలముల ననుభవింపజేసి, ధర్మమార్గమున

నిలబెట్టును. అన్నిటికీ మించి, మృత్యువు రూపమున జీవుల సమస్త సంపాదనములను హరించి, జీవనము పునః ప్రారంభమగునట్లు చేయును. విశేష ప్రజ్ఞకలిగి అధర్మము నాచరించువారిని తానే అవతార మూర్తిగ దిగివచ్చి శిక్షించును. అతి విశేషశక్తులతో విజృంభించిన మహిష, భండాసురాదులను తానే స్వయముగ దిగివచ్చి శిక్షించును. ఎవనికి ఏ శిక్ష విధించిన రక్షింపబడునో అట్టి శిక్షను సమతూకముగ అందించగల శక్తియే అంకుశమను దేవి ఆయుధము. త్రిమూర్తులు సైతము ఆమె ఆజ్ఞకు లోబడి సృష్టి నిర్వహణము గావించుచున్నారు. వారికి సృష్టియం దవరోధము లేర్పడినచో తానే స్వయముగ చక్కదిద్ద గలదు.

అజ్ఞానాంధకారమును తగు విధముగ శిక్షించి జీవప్రజ్ఞను జ్ఞానమునందు నిలుపు ఉపకరణముగ అంకుశము వినియోగపడు చున్నది. కావున దేవి భక్తులు క్రోధముతో కూడిన ఈ అంకుశమును జ్ఞాన ప్రదమని భావించి, నమస్కరించి స్తుతింతురు. రాగమను పాశము ఒక హస్తమున ధరించిన దేవి, మరియొక హస్తమున క్రోధమను అంకుశమును ధరించి, సృష్టిజీవులయందు రాగము మితిమీరకుండు నట్లుగ చక్కబెట్టుకొనుచున్నది. సృష్టియందు ఈ విధముగ రాగమును పెంచునది, మితిమీరినపుడు త్రుంచునది కూడ దేవియే. సత్సాధకుడు వీనిని గమనించి, కష్టనష్టములు, అపజయము కలిగినపుడు దేవియే కాలరూపమున త్రుంచుచున్నదని భావించి, ప్రతీకార వాంఛ లేక, నిరాశా నిస్పృహలు చెందక, దేవిని శరణుపొంది ధర్మమున తనను తాను నియమించుకొనును. ఇష్టకాలము వచ్చువరకు తలదాచుకొని మౌనముగ జీవించును. నలుడు, ధర్మరాజు, హరిశ్చంద్రుడు వంటి మహాత్ముల జీవితములయందు ఈ సత్యమును గమనింపవచ్చును.

# 10. 'మనోరూపేక్షుకోదండా'

ఇక్షు కోదండమనగా చెఱకువిల్లు. జీవుని మనస్సు రూపమున దేవియే ఈ విల్లును ధరించియున్నది. చేతన దేవియైనపుడు అందుండి వ్యక్తమైన మనస్సు ధరించు కోరిక కూడ ఆమె ఆధారముగ నున్నదియే కదా! జీవి మనసుయందు ఏర్పడు వేలాది సంకల్ప వికల్పములు యిచట సూచింపబడుచున్నవి. మనసునకు కలుగు ఈ సంకల్ప వికల్పములకు చైతన్యమే ఆధారము. దేవి విశ్వాత్మ చైతన్యమే. ఆ చైతన్యమే ప్రతి జీవియందును జీవచైతన్యముగ భాసించుచుండును. దాని ఆధారమున జీవుల మనస్సుల నుండి చిత్తప్రవృత్తులు వ్యక్త మగుచుండును.

దేవి హస్తమందలి చెఱకు విల్లు, భక్తుడు తన మనస్సుగా భావింపవలెను. తన మనస్సు అనెడి విల్లు దేవి అధీనమున నున్నదని ధ్యానింపవలెను. దేవికి సమర్పణ చేయబడిన మనస్సుగా తన మనస్సును మలచుకొనవలెను. ఆమె అధీనముననున్న తన మనస్సు చెఱకు రసమువలె జీవిత సారమును రుచి చూపించగలదు. ఆమె అధీనమున నిలువని మనస్సు వివిధములైన వికారములను పొందుచుండును. చెఱకు తీపి తెలిసిన మానవుడు దానినే మరల మరల పొందుటకు ప్రయత్నించునట్లే దేవి అధీనమున చేరిన మనస్సు అదే విధముగ ఆమె సాన్నిధ్యమందు చేరుటకు ప్రయత్నించగలదు. ఒకవైపు పాశము,

మరియొకవైపు అంకుశము. డోలాయమానముగ జీవిని త్రిప్పలు పెట్టుచుండగా అలసట చెందిన మనస్సునకు ఇక్షుదండము ఉపాయ మును సూచించు చున్నట్లు దేవి రూపమును ఇచట ప్రస్తుత పరచబడినది.

**"నా వలెనే నీ మనస్సు కూడ దేవుని అధీనమున నిలుపుము. అప్పుడు పాశము, అంకుశము బారినుండి నీవు రక్షింపబడుదువు"** అని దేవి హస్తమునందలి ఇక్షుదండము బోధించుచున్నదని గ్రహింపవలెను.



# 11. 'పంచతన్మాత్రసాయకా'

**పం**చతన్మాత్రలు బాణములుగా గలది. దేవి నాలుగవ హస్తమున పంచతన్మాత్రలు అను ఐదు బాణములు ధరించి యున్నదని అర్థము. రాగమను పాశము, క్రోధమను అంకుశము, మనోరూపమైన ఇక్షు దండము మూడు బాహువులలో ధరించి యున్నట్లుగా ముందు తెలుపబడినది. నాలుగవ బాహువునందు సృష్టి నిర్మాణ కారకములైన శబ్దము స్పర్శ రూపము రసము (రుచి) గంధములు ఈ ఐదు బాణములు- శబ్దము ఆకాశగుణము. స్పర్శ వాయు లక్షణము. రూపము వెలుగు లక్షణము. రుచి జల లక్షణము. గంధము లేక వాసన పృథివీ లక్షణము. పంచభూతములకు, పంచతన్మాత్రలకు ఇట్టి అనుబంధము కలదు. అటులనే శబ్దము వలన వినుట, అది వినుటకు చెవి; వాయువు వలన స్పర్శ, అది గ్రహించుటకు చర్మము; వెలుగు వలన రూప దర్శనము, అది చూచుటకు కన్ను; జలము వలన రుచి, రుచి చూచుటకు నాలుక; పృథివి వలన గంధము, అది వాసన చూచుటకు ముక్కు; ఐదు జ్ఞానేంద్రియములుగ ఏర్పరుపబడును. ఇట్లు పంచతన్మాత్రలు, పంచభూతములు, పంచజ్ఞానేంద్రియములు వెరసి పదిహేను తత్త్వము లుగా ఏర్పడుచున్నవి. ఇవి నిజమునకు అయిదే, ఒక్కొక్కటి త్రివిధముగ విభజివింపబడి పదిహేనుగ గోచరించుచున్నవి. ఇందు ఒక్కొక్క త్రిభుజ మున ఒకదానికన్న నొకటి సూక్ష్మముగ నుండును. ఇంద్రియము స్థూలము. అందు పని చేయు తన్మాత్ర సూక్ష్మము. ఆ తన్మాత్రకు ఆధారముగ నున్న ఆకాశాది భూతములు సూక్ష్మతరములు. "పరతత్త్వ

మును పంచీకరణము చేయుచున్నాను" అని ఈ హస్తము నందలి ఐదు బాణముల ద్వారా దేవి సూచించుచున్నది. ఈ పంచీకరణమే లేకుండినచో సృష్టి కేవలము త్రిగుణాత్మకముగ, సూక్ష్మముగ నుండెడిది. "పంచభూతాత్మకమైన సృష్టి నిర్మాణము చేయుచున్నాను" అని తెలుపుటకే పంచ బాణములు. పంచభూతములు, పంచతన్మాత్రలు, పంచేంద్రియము లతోపాటు పంచ కర్మేంద్రియములను కూడ ఏర్పరచుటచే అందు పరతత్త్వము నాలుగు స్థితులలో వర్తించగలదు (వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ స్థితులు).

ఇట్లు నాలుగు వ్యూహములు, నాలుగు పంచారములను అధిష్ఠించి యుండినట్లు దేవి ఇరువది నాలుగు తత్త్వములుగ (గాయత్రీ ఛందస్సుగ) సృష్టి నిర్మాణము చేయుచున్నదని గ్రహించవలెను. పై తెలుపబడిన పంచారములే పంచముఖిగను, పంచభుజిగను లేక మకరముగను పెద్దలు పేర్కొందురు. 'మ' అను అక్షరమునకు సంఖ్యా శాస్త్రమున విలువ '5'. ఈ సందర్భమున మకరమును గూర్చి కొంత గ్రహించుట ఆవశ్యకము. మకరమనగా మొసలియని కూడ అర్థము కలదు. అనగా పట్టి యుంచునది అని అర్థము. నాలుగు మకరములు పరతత్త్వమును నాలుగు స్థితులలో పట్టియుంచినవని గ్రహింపవలెను. "పరమ పురుషుని కర్మేంద్రియముల యందును, జ్ఞానేంద్రియముల యందును, పంచతన్మాత్రల యందును, పంచభూతముల యందును ఇమిడ్చి యుంచుచున్నాను. అట్లిముడ్చుట అతని సంకల్పము. ఆ సంకల్పమును నిర్వర్తించుటకే నేను చిదగ్నికుండము నుండి చతుర్బాహువు లతో ఉద్భవించితిని అని దేవి సందేశ మిచ్చుచున్నది.

దేహముయొక్క పట్టు, ఇంద్రియములయొక్క పట్టు, జీవునకు బంధహేతువు లగుచున్నవి. బహిరంగమున కల వైభవమునకు ఆకర్షింప బడుట వలన ఈ పట్టు ఏర్పడుచున్నది. అంతరంగ మందలి దివ్యత్త్వము నందు ఆకర్షణము కలిగి, పెరిగినచో బహిరంగ ఆకర్షణలు తగ్గును. భాగవతమందలి గజేంద్ర మోక్షణము ఈ ధర్మమునే తెలుపుచున్నది. సరస్సునందలి జలముల యందు అత్యాసక్తి (నీరాశ) కలిగి, గజేంద్రుడు ప్రవర్తించుటచే పట్టుబడెను. అంతర్యామి యగు భగవంతుని శరణు కోరి మోక్షణము పొందెను.

అంతరంగమున కూడ సూక్ష్మముగ, సూక్ష్మతరముగ మరి రెండు మొసళ్ళు గలవు. అందు మొదటిది విజ్ఞానమునకు లోబడుట. మానవుడు తనకు తెలిసిన విషయములతో ఆనందించుటతోపాటు గర్వపడుచుండును కూడ. గర్వము దంభమునకు దారితీయును. దంభము ఆడంబరమునకు దారితీయును. అది కారణముగ తెలియని వారిని అవహేళన చేయుచుండును. ఆత్మస్తుతి, పరనింద దినచర్య యందు భాగమగును. చదివినవార మనుకొను వారందరు ఈ మొసలికి పట్టుబడి యుందురు.

సూక్ష్మతరమైన పంచారము తానొకడున్నాడను భావము. దీనినే అహంకార భావ మనిరి. పరతత్త్వమే తానుగా ఉన్నడనియు, తనకు ప్రత్యేక అస్తిత్వము లేదనియు తెలియువరకు ఈ మొసలి పట్టు యుండును. అది తెలుపుటకే 'సోఽహ మస్మి' అను మహా మంత్రము.

పై తెలిపిన నాలుగు మకరములు పరతత్త్వము నాలుగు స్థితుల లోనికి దిగివచ్చుటకు దేవి ఏర్పరచు వాహనములు. స్వామిత్వము

కలవాడు ఈ వాహనముల నధిష్టించి విహరించు చుండును. అది లేనివాడు వాహనములకు పట్టుబడును. "అత్యంత కాంతివంతమైన తెల్లని మొసలిపై వరుణదేవత ఆకాశమున త్రిశూలధారియై విహరించు చున్నాడని" వేదము తెలుపుచున్నది. అనగా అశ్విని దేవతయైన వరుణుడు మిత్రునితో కలసి సమస్త సృష్టిని అధిష్ఠించి విహరించు చున్నాడని తెలియవలెను. ఈ నాలుగు మకరములకు నాలుగు వర్ణములు కలవని కూడ తెలియవలెను. అందు మొదటిది తెల్లని మకరము లేక దీనిని నీలముగ కూడ తెలుపుదురు. రెండవది ఎరుపు వర్ణము కలది, మూడవది పసుపు వర్ణము కలది, నాలుగవది గోధుమ వర్ణము గలది. ఈ నాలుగు మకరములు జీవ చైతన్యము నధిష్ఠించి లేక దానికి లోబడి యుండు నాలుగు స్థితులు. వీటినే "ధ్యాన్" అను హీబ్రూ గ్రంథమున నాలుగు గుఱ్ఱములని కూడ పేర్కొనిరి. ఈ మకరములను అంతర్యామి సాధనముననే అధిష్ఠించుట వీలగును. ఇతర మార్గముల వీలుపడదు.

జ్యోతిశ్చక్రమున గల మకర రాశి ఈ సందర్భమున ప్రాముఖ్యము వహించును. మకరముల నుండి మోక్షణము పొందుటకు మకరరాశి తత్త్వము ఎంతయు ఉపయోగకరము. ఇది కారణముగ కూడ మకర మాసమును పుణ్యకాల మందురు. ప్రతి సంవత్సరము మకర మాసమున సూర్యోదయమున భూమిని, భూమి జీవులను ఊర్ధ్వముఖులుగ ప్రచోదన మొనరించుటకు సూర్యకిరణముల నుండి ఉద్ధారకమైన తత్త్వము ప్రసరింపబడుచుండును. ఉత్తరాయణ పుణ్యకాల మనగా జీవులను మకర బంధముల నుండి ఉద్ధరించు పుణ్యకాలముగ భావించవలెను.

అటులనే జ్యోతిశ్చక్రమున ఐదవ రాశియైన సింహరాశి, అపసవ్య మార్గమున ఐదవ రాశియైన ధనుస్సు రాశి కూడ మకరముల నుండి ఉద్ధరింపబడుటకు సహకరించగలవు. జీవుని జాతక చక్రమున ఐదు, పది రాశులలో గల గ్రహముల నుండి తాననుసరించ వలసిన ప్రవర్తనము సూచింపబడుచున్నదని కూడ గ్రహింపవలెను.

ఇట్లు మకరవిద్య అతి విస్తారముగ ఋషులచే వివరింపబడినది. ఇది ఒక ప్రత్యేక విద్యగ సాధనచేయు బృందములు గలవు. ఈ సందర్భమున భాగవత మందలి ఒక పద్యమును ఇచ్చట ప్రస్తుతి చేయుచున్నాము.

మకర మొకటి రవిఁ జొచ్చెను
మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్
మకరాలయమునఁ దిరిగెడు
మకరంబులు కూర్మరాజు మఱువన కరిగెన్.

పై పద్యమును ధ్యానము చేసి మకర రహస్యముల నెరుగవలెను.

అట్లే సంఖ్యా శాస్త్రమున ఐదు (5) అంకెకు అత్యంత ప్రాముఖ్యము కలదు. ఈ ప్రాముఖ్యత ముందు నామములలో వివరింపబడును.



# 12. 'నిజారుణప్రభాపూర మజ్జద్బ్రహ్మాండ మండలా'

**త**న ఎఱ్ఱని కాంతి ప్రవాహము నందు మునిగిన బ్రహ్మాండ మండలములు గలది అని భావము.

సృష్టి ఉదయము, సూర్యుని ఉదయమునకు ముందుగ ఉద్భవించు కాంతి, ఎఱ్ఱని కాంతి. ఈ కాంతి నుండియే సమస్త బ్రహ్మాండ మండలము ఉద్భవించు చుండును. ఈ ఎఱ్ఱని కాంతి యందే బ్రహ్మాండము మునిగి యుండును. ఈ ఎఱ్ఱని కాంతి సౌభాగ్య ప్రదము. దివ్య సంకల్ప అవతరణమునకు సంకేతము. భ్రూమధ్యమున భారతీయులు ఈ ఎఱ్ఱని కాంతి ప్రచోదనమునకే తిలకమును దిద్దుకొనుచుందురు. భగవంతుని ఇచ్ఛాశక్తిగ శ్రీదేవి ఎఱ్ఱని కాంతి ప్రవాహముగ మేల్కొనును. సత్సాధకులు ఈ కాంతి ప్రచోదనము కొఱకే తిలకమును ధరించవలెను. ఇట్లు ధరించుట యాంత్రికముగ కాక ఒక క్రతువుగ నిర్వర్తించవలెను. అట్లు నిర్వర్తించినచో మానవుని యందలి అంతర్యామి ప్రజ్ఞనుండి సంకల్ప ముద్భవించి మానవ మేధస్సుపై ప్రతిబింబిత మగును. సత్సంకల్పము ననుసరించి జీవించు టయే సౌభాగ్యము. అదియే సంపద. ఎఱ్ఱని కాంతి ప్రవాహముగ దేవిని ఆరాధించుట, ఎఱ్ఱని రూపముగ ధ్యానించుట ఈ నామ మందించు సందేశము. అమ్మ అగ్ని వర్ణమని, ఆదిత్య వర్ణమని శ్రుతులు పేర్కొనుచున్నవి.

# 13. 'చంపకాశోకపున్నాగ సౌగంధిక లసత్కచా'

శ్రీదేవి కేశ పాశములు సహజ గంధము గలవి. కావున అవి తమ వాసనను చంపకాది పుష్పముల కొసంగినవనియు, ఆ పుష్పముల నామె ధరించుటచే వానికి శోభ కలిగెననియు భావము.

అగ్నికుండము నుండి దేవి ఉద్భవించుటచే శిరస్సు మొదట కనిపించును. సాధారణముగ దైవ వర్ణనము పాదమునుండి శిఖాంతము వరకు చేయుట పరిపాటి. కాని ఆమె పుట్టుకలో శిరస్సు ముందు కనిపించుటచే శిరస్సు వర్ణన ఆరంభమాయెను. పురుష సూక్తమున పురుషుని కూడ "సహస్రశీర్షా పురుషః" అని స్తుతించు సంప్రదాయము కన్పట్టును. అవతరణము చెందు దివ్యత్వము శిరస్సు నుండి పాదముల వరకు వర్ణించుట వేద సంప్రదాయమని ఎరుగవలెను.

చంపక, అశోక, పున్నాగములు సుగంధము పరిమళించు పుష్పములు. అమ్మ రూపముయొక్క వర్ణనము పుష్ప వర్ణనముతో ప్రారంభింపబడినది. "సర్వము పుష్పార్థము" అని అగ్నిపురాణము తెలుపుచున్నది. పై తెలిపిన పుష్ప వాసనలతో ప్రకాశించుచున్న కేశములు కలది అని శీర్షోదయ సమయమున ధ్యానింపవలెను.

పుష్పములకు పరిమళము అందించునది శ్రీమాతయే. అనగా పుష్పముయొక్క సుందర రూపము, సౌకుమార్యము అమ్మ రూపముకాగ అందలి సుగంధము అమ్మ సాన్నిధ్యమే అని తెలియవలెను.

మానవులు పుష్పములను ధరించి శరీరమునకు సుగంధము

నందింతురు. పుష్పములకే సుగంధము లందించినవి అమ్మ శిరస్సు నందలి కేశపాశములు. వికసించునది పుష్పము కనుక సృష్టిపుష్పము లందుగల సర్వసుగంధము అమ్మ అందించుచున్న సాన్నిధ్యమని తెలియపవలెను. దీని నారాధించుట కారణముగ భక్తుని యందుకూడ అమ్మ సాన్నిధ్య మేర్పడి అతని నుండి సుగంధ వాసనలు వ్యాప్తి చెందు చున్నవి. మహాత్మ్ము లున్నచోట ఇట్టి సుగంధవ్యాప్తి విదితమే. ఆరాధన మున పుష్పమునకు, సుగంధములకు ఇట్టి ప్రత్యేక స్థానము కలదని తెలియవలెను.

దేవి కేశపాశముల సుగంధముననుభూతి పొందినవాడు అదృష్టవంతుడు. ఆ కేశ సమూహమందలి సువాసనతో ఏ పుష్ప సుగంధము సాటిరాదు.



# 14. 'కురువిందమణిశ్రేణీ కనత్కోటీరమండితా'

పద్మరాగ మణులతో గూడి ప్రకాశించు కిరీటముచే నొప్పునది శ్రీ లలిత– అని భావము.

ఈ మణుల కాంతి భక్తుల భక్తిప్రపత్తులను వృద్ధి గావించునని తెలియవలెను. గాయత్రి ప్రార్థనమున కూడ ఇట్టి మణుల కాంతిని ఆరాధించు సంప్రదాయము కలదు. గాయత్రి జపము చేయుటకు ముందు "ముక్తా, విద్రుమ, హేమ, నీల, ధవళ, ఛాయ" వర్ణములను ధ్యానించుట ఇందులకే. ఇట్లు ధ్యానించుటచే భక్తి ప్రపత్తులు వృద్ధిపొంది, మంత్ర జపమున మనస్సు కాంతుల కాకర్షింపబడి రక్తి చెందును.

కురవింద శిలలనుండి పద్మరాగ మణులు పుట్టును. కురువింద స్ఫటికములు నది లోపలనుండు శిలలు. ఆ శిలల గర్భమునుండి మణులుద్భవించును. ఈ మణులకాంతి సూర్యకాంతి వలెను, చంద్రకాంతి వలెను, కెంపు, నీలము, పచ్చల కాంతుల వలెను మెరయు చుండును. ఈ కాంతి అనురాగప్రదము. మనస్సున కాహ్లాదము కలిగించి బుద్ధి యనెడి వెలుగు లోకములలోకి అవి మనస్సు నాకర్షింప గలవు. ఇది కారణముగ దేవతా శిరస్సులను అలంకరించు మణిమయ కిరీటములను ధ్యానించు సత్సాంప్రదాయ మేర్పడినది. మణుల కాంతి స్ఫటిక శిలలనుండి పుట్టుటచే శుభమైన అనురాగము కలిగించును. కామగుణము వానికి లేదు. వానిని స్మరించుట వలన భక్తి వృద్ధియగును.

ఇట్టి మణుల పంక్తిచే ప్రకాశించు కిరీటముతో శ్రీదేవి అలంకరింపబడి యున్నదని ఈ నామము తెలుపుచున్నది.

శుద్ధమైన స్ఫటికముల నుండి వ్యక్తమగునది సప్త వర్ణములు కలిగిన సూర్యకాంతియే. స్ఫటికమునకు గల స్పష్టత వలన వాని నుండి కాంతి ప్రకాశము కలుగుచున్నది. సాధకుడు నిర్మలమైన మనస్సుతో కాంతిని ధ్యానము చేయుటచే తన నుండి కూడ అట్టి కాంతులు ప్రకాశితము లగును. సూర్యుడు ఆత్మకు ప్రతీక. ఆత్మ శుద్ధమగు మనసేంద్రియ శరీరముల నుండి ప్రకాశించుటయే స్ఫటిక శిలల నుండి వికసించు కాంతులుగ తెలియవలెను.

ఈ నామమున వర్ణముల (రంగుల) ధ్యానము ప్రత్యేకముగ ప్రతిపాదింపబడినది. ఈ ధ్యానము మనస్సును భక్తియందుంచి రక్తి కలిగించును.



# 15. 'అష్టమీచంద్రవిభ్రాజ దళికస్థల శోభితా'

**అ**ష్టమి చంద్రుడు అర్ధచంద్రుడు. సగము దృశ్యముగను, సగము అదృశ్యముగను, అష్టమినాడు చంద్రుడు గోచరించును. సృష్టి యందు ప్రకృతి పురుషులు యిట్లే యుందురు. కనపడునది మాత్రమే చూచుట అసంపూర్ణ దృష్టి. కనపడునది ఆధారముగ కనపడనిది ఊహించవలెను, భావించవలెను. పూర్ణమైన చంద్రబింబము సగము భాగము కనుపించ నపుడు ఆ మిగిలిన భాగము లేకుండునా? ఉన్నది. అగుపడక ఉన్నది. అటులనే సృష్టియందు దివ్యమైనది అగుపడక ఉన్నది. లేదు అనుకొనుట అల్పత్వము. అర్ధ చంద్రబింబము దీనినే సంకేతించుచున్నదా అన్నట్లు ఉండును. శుక్లాష్టమినాడు కనపడిన భాగము కృష్ణాష్టమినా డగుపడదు. అటులనే కృష్ణాష్టమినా డగుపడు భాగము శుక్లాష్టమినా డగుపడదు. రెండును అర్ధచంద్రాకారములే అయినను, ఒకటి కాదు. రెండు తత్త్వములు సృష్టిలో ఒకదానికొకటి ఆలంబనములు. ఒకటి పెరుగు చున్న, రెండవది తరుగుచుండును. పదార్థము పెరుగుట జరుగుచున్న కొలది, పరమార్థము అదృశ్య మగుచుండును. అటులనే పరమార్థము పెరుగుచున్నకొలది పదార్థము అదృశ్య మగుచుండును. రెండునూ సమతూకముగా నున్న స్థితిని పూర్ణయోగ మందురు. అష్టమి అట్టి యోగమునకు సంకేతము. అర్ధనారీశ్వరుని తత్త్వము దీనినే బోధించును. గోచరింపనివాడు అవ్యక్త బ్రహ్మము. గోచరింపబడునది అతని వెలుగు.

అదియే అమ్మవారు. తాను గోచరించి, గోచరింపని వానిని తెలియబరచు చుండును. అమ్మవారు, అయ్యవారి శోభనమూర్తి. ఆమెను పూజించుట ద్వారా ఆయనను రుచి చూడవచ్చును. ఆయన కనపడుట ఎపుడును ఆమెగనే యుండును. కేనోపనిషత్తు ఈ విషయమును ప్రతిపాదించు చున్నది. అష్టమి కళను అమ్మవారిగ ఆరాధించుచు, మిగిలిన కనబడని అర్ధచంద్ర బింబమును అయ్యవారిగ ఊహించుచు ధ్యానము చేయు మార్గ మిచట తెలుపబడుచున్నది.



# 16. 'ముఖచంద్ర కళంకాభ మృగనాభి విశేషకా'

**చం**ద్రుని వంటి అందమైన ముఖము నందు చంద్రునిలోని మచ్చవలె కస్తూరి బొట్టును దాల్చినది అని అర్థము. వేదకాలము నుండి భారతీయ సంప్రదాయమున ఫాలభాగమున కస్తూరి బొట్టును అలంకరించుకొనుట కలదు. చాక్షుష మన్వంతరమున మానవు లందరికి నీ మూడవ కన్నుకూడ పనిచేయు చుండెడిది. కాలక్రమమున కామము పెరుగుటచే కాంతులీను దేహములు మరుగుపడి స్థూల దేహము లేర్పడుచు మూడవ కన్నును కప్పివేయుట జరిగినది. మూడవ కన్ను ఆజ్ఞాకేంద్రము. దైవము యొక్క ఆజ్ఞ లేక సంకల్పము జీవునకు తెలియు స్థానము. మానవుల కత్యున్నత ప్రజ్ఞాస్థానము. ఆ స్థానమును స్పృశించుచు, కస్తూరితో అలంకరించుకొనుచు అచటి ప్రజ్ఞను మేల్కాంచునట్లు చేయు విధానమొకటి ఉండెడిది. దానికి సంబంధించిన క్రతువును ప్రతిదినము, స్నానమాచరించిన పిదప స్త్రీలు, పురుషులు కూడ నిర్వర్తించుకొను చుండెడివారు. దైవాజ్ఞ తనయందు భాసింప, దానిని దినమంతయు అనుసరించుటకు ఉద్యుక్తులగుటకే ఈ క్రతువు. కాలక్రమమున అంతర్హితమైన అర్థము మరుగై అలంకారప్రాయముగ మిగిలినది. అటుపై మ్లేచ్ఛుల సంపర్కమున భారతీయ పురుషులీ సంప్రదాయమును వదలినారు. ఉత్తర భారతమున స్త్రీలు కూడ వదలి నారు. శ్రీవిద్యా ఉపాసకులు నేటికిని ఈ సంప్రదాయమును అనుస రించుచుందురు. ఇతరులు వారి వారి భక్తిశ్రద్ధలను బట్టి అనుస రించుదురు. అమ్మవారి ముఖమునగల కస్తూరిబొట్టు మన యందలి ఆజ్ఞ యను ప్రజ్ఞను గుర్తు చేయునదిగ గోచరించును.

చంద్రబింబమందలి మచ్చతో ఫాలభాగమందలి బొట్టును పోల్చుటలో కూడ అంతరార్థ మిమిడియున్నది. మృగనాభి యనగా చంచలమగు బిందుస్థానము. బిందుస్థానము అంతర్యామి ప్రజ్ఞకు, అహంకార ప్రజ్ఞకు నడుమ ముఖద్వారము. అంతర్యామి ప్రజ్ఞ బిందువాధారముగ ప్రత్యగాత్మ లేక అహంకార ప్రజ్ఞయందు భాసించును. కాని, అహంకార ప్రజ్ఞను మాయ ఆవరించినపుడు ఈ బిందువు మాయమగును. అనగా, అంతర్యామి ప్రజ్ఞనుండి వేర్పాటు కలుగును. అహంకార ప్రజ్ఞ స్మరించినపుడే అంతర్యామి ప్రజ్ఞ సాన్నిధ్యము నిచ్చును. స్మరింపనపుడు మాటుగ నుండును. అందువలన ఈ బిందువును చంచలాత్మకమగు మృగము(లేడి)తో పోల్చిరి. చంద్రుని యందలి మచ్చను కూడ అంతర్యామి ప్రజ్ఞకు అనగా మొత్తము వెలుగునకు, బింబాకారముగ ఏర్పడిన వెలుగునకు అనుసంధానము నేర్పరచు బిందువుగ భావించవలెను. పూర్ణచంద్రుని యందలి మచ్చ "ఈ కాంతి నాది కాదు, నా నుండి వెలువడుచున్నది" అని తెలుపు చున్నది. అటులనే అమ్మవారి ముఖమందలి కాంతి పరతత్త్వము యొక్క ప్రతిబింబమే అని తెలుపుచున్నది. ఫాలభాగమున తిలకమును దిద్దుకొను వ్యక్తి కూడ అంతర్యామి ప్రజ్ఞయే తన నుండి భాసించు చున్నదని భావన చేయవలెను. ఈ బొట్టు దివ్య సంకల్పములకు ద్వారమై వ్యక్తులను నడిపించగలదని మూల భావము. "Father thy will be done, not mine" అని తెలుపుటకే ఫాలభాగమందలి తిలకము.

# 17. 'వదనస్మర మాంగళ్య గృహతోరణ చిల్లికా'

**మ**న్మథుని గృహముతో సాటివచ్చు అందముగల ముఖము శ్రీదేవి ముఖమై యుండగా ఆ గృహమున కేర్పరచిన అందమైన తోరణములవలె ఆమె కనుబొమలు ప్రకాశించుచున్నవని భావము.

తోరణములు గృహమునకు శుభప్రదములు. ఏ గృహమునకైనను మకర తోరణము లేర్పరచినపుడు ఆ గృహము పావనమగును. అశుభము లుండవు. ఇది భారతీయుల నమ్మకము. మకర తోరణము దివ్య జీవనమునకు సంకేతము. సంవత్సర చక్రమందలి ఉత్తరాయణ కాలమైన ఆరు నెలలు, మకర తోరణమని జ్యోతిషము ఘోషించుచున్నది. దక్షిణాయనము ఆరునెలలు రాజ తోరణమని తెలుపుచున్నది. మకర తోరణము జీవుల ప్రజ్ఞను ఊర్ధ్వముఖముగ గొనిపోవును. వసంత నవరాత్రి కాలమునకు పరాకాష్ఠకు చేరును. మకర మాసమునుండి కర్కాటక మాసము వరకు గల ఆరు నెలలలో వసంత నవరాత్రులు శిఖరముగ ఏర్పడును. సమస్త సృష్టి కామేశ్వరీ-కామేశ్వరుల కామము నుండి ఏర్పడినదే! సృష్టి మన్మథగృహము. అందు అధో ముఖమునకు ఊర్ధ్వముఖమున జీవులు ప్రయాణించు దారులు, మెట్లు కలవు. శ్రీదేవి కనుబొమలు జీవుల ప్రజ్ఞను ఊర్ధ్వముఖమునకు ఆకర్షించు తోరణము లుగా వర్ణింపబడినవి. గృహతోరణములు కూడా దివ్యజీవనమునకు

పునరంకిత మగుటకై ఏర్పరచుకొనవలెను గాని, కేవల మలంకారప్రాయ ముగ కాదు. పర్వదినమునందు తోరణములు కట్టుకొనుటలో ఇంతటి గంభీరమైన భావము కలదని గుర్తింపవలెను. శ్రీదేవి అనుగ్రహము లేక ఊర్ధ్వముఖముగ ఎవరు చనగలరు? ఆమె కనుబొమలు ఉత్తమ లోకముల ప్రవేశమునకై అనుమతి నిచ్చునట్లుగ ప్రార్థింపవలెను.






# 18. 'వక్త్రలక్ష్మీ పరీవాహ చలన్మీనాభలోచనా'

**ల**క్ష్మీప్రదమైన అనగా సర్వమంగళమైన, శుభప్రదమైన, కాంతి వంతమైన చైతన్య ప్రవాహముతో మిసమిసలాడు రమణీయ మైన ముఖము అమ్మవారిది. అందు మీనములవలె అందముగ, వెలుగు రూపములుగ కదలాడు అమ్మవారి కన్నులు మనోహరములు. అనగా, ధ్యానము చేయువారి మనస్సును హరింపగలిగిన సామర్థ్యము గలవి.

పై వర్ణనము నాధారము చేసుకొని అమ్మవారి ముఖమును, నేత్రములను సదా ధ్యానము చేయు భక్తునికి తన ముఖమునందు ఆకర్షణ పెరుగును. అమ్మ ముఖము ఒక చైతన్య ప్రవాహముగను, ఆమె కనులను మీనములతో పోల్చుటయందును లోతైన భావము ఆవిష్కరింపబడినది. మీన నేత్రములు రక్షణమునకును, పోషణము నకు ప్రతీకలు. చేప తన కనులతోనే తన సంతానమును పోషించుట, వృద్ధి పొందించుట, రక్షించుట చేయును. అంతియే కాని యితర తల్లులవలె పాలిచ్చి పోషించుట యుండదు. అమ్మకూడా నట్లే. తన దృష్టితోనే సృష్టిలోని సమస్త జీవకోటులను, గ్రహ గోళాదులను పుట్టించి, పోషించి, వృద్ధి పరచి, రక్షించు నేత్రములు అమ్మవి. ఆమె జగన్మాతృత్వ మునకు ఈ ప్రక్రియ ఒక తార్కాణము. మీనాక్షిగ ఆమెను ఏకాగ్ర చిత్తముతో ధ్యానించు భక్తజనులకు లోటు ఎట్లుండగలదు? అంతియే కాదు, ఆమె మీన నేత్రములు మీనరాశి స్వభావమును పరిపూర్ణముగ

వర్తింపచేయును. అంత్యమునకు, ఆరంభమునకు అధ్యక్షత వహించునది అమ్మ. ఆరంభములో నంత్యము, అంత్యములో నారంభము ఆమె సృష్టిరచనా రహస్యము. తదతీతమైన చైతన్యముగ తాను సృష్టి స్థితి లయముల నధిష్ఠించి యుండు శాశ్వత ప్రజ్ఞ లేక విశ్వ చైతన్యము అమ్మ.

శ్రీ దేవి వలెనే దేవీ భక్తులు కూడా కన్నులతో పోషించుట, రక్షించుట, అనుగ్రహించుట, ఉద్ధరించుట చేయగలరు. అట్టి వారిలో మైత్రేయ మహర్షి ఈ భూమిపై అగ్రగణ్యులు. వారి కన్నులలోనికి తదేక దృష్టితో చూచువారిని క్షణ కాలముననే ఉద్ధరించగల్గు జగద్గురువులు మైత్రేయులు.



# 19. 'నవచంపకపుష్పాభ నాసాదండ విరాజితా'

**చం**పక పుష్పమనగా సంపెంగ పువ్వు. సంపెంగ పువ్వు వంటి అందమైన నాసికతో అమ్మవారు విరాజిల్లుతూ యున్నది అని భావము. అదికూడా నవచంపక మగుటచే అనగా అప్పుడే వికసించిన సంపెంగ పువ్వని విశేషార్థము.

అప్పుడే వికసించిన సంపెంగ పువ్వు ఎట్లుండును? అను విషయముపైన భక్తుడు లోతుగ భావన చేయవలెను. అట్టి పువ్వు అత్యంత మృదువుగ నుండును. కాంతివంతముగ నుండును. అద్భుత మైన పరిమళములను వెదజల్లుతూ యుండును. పరిమళము నాఘ్రా ణించు ఇంద్రియము నాసిక. అమ్మ నాసిక పరిమళ స్వరూపమేయని తెలియవలెను. అంతియే కాదు, పరిమళ పూరితమగు సంపెంగ పువ్వును చూచినపుడు నిజమైన భక్తునకు అమ్మ నాసిక దర్శనమీయ వలెను. అమ్మ నాసికను చూచుటకు వెఱ్ఱి ఆవేశమును పొందుటకన్నా- సంపెంగ పువ్వును చూసినపుడు అమ్మ నాసికను దర్శించుట సత్వగుణ భక్తి. ఈ భావముచే ఋషి మనకు నాసికా దర్శనము చేయించు చున్నాడు. అట్టి భావన ప్రాతిపదికగా సంపెంగపువ్వు పరిమళమును ఆఘ్రా ణించు భక్తునకు తాదాత్మ్య స్థితి అప్రయత్నముగ కలుగును. సృష్టియందలి సుగంధమును ఆస్వాదించు స్వభావము గల జీవుని నాసికయందు కూడ అమ్మయే ప్రతిష్ఠితయై యున్నది అని కూడ భావన చేయవచ్చును.

# 20. 'తారాకాంతి తిరస్కారి నాసాభరణ భాసురా'

**తా**రల కాంతినికూడా తిరస్కరించ గలిగిన ప్రభగల ముక్కుపుడక కలిగినది అని భావము.

తారలకు కాంతి నందించెడిది అమ్మయే కదా! సమస్త సృష్టియందు గోచరించు వెలుగు అమ్మయే. ఆమె ధరించిన బులాకీ కాంతిని ఈ నామమున ప్రశంస చేయుట జరుగుచున్నది. అత్యంత కాంతివంతమైన నాసికాభరణమును వర్ణించుటలో సాధకుని దృష్టి కాంతిపుంజములపై ప్రసరించును. కనులు మూసుకొని ధగద్ధగాయ మానమైన ఒక 'రవ్వ'ను ధ్యానింపుడు. అది మీ భ్రూమధ్యమున మెఱుపువలె ప్రకాశించి మిమ్ముల నుద్ధరింపజేయును. శ్రద్ధాభక్తులతో నామము నారాధించు భక్తునకు యిట్టి దర్శనము సహజము. కాంతి, ప్రకాశవంతమైన ఒక బిందువువలె గోచరించి అంతవరకూ చర్మ చక్షువులతో దర్శించిన తారాకాంతులను ధిక్కరించగల దర్శనము జరుగగలదు. బిందుకళా దర్శన మిట్లే యగును. అది తెలిసినవారే యిట్టి నామములను కూర్పగలరు. ధ్యానమున, అమ్మ నాసికాభరణ మిట్టి దర్శన భాగ్యము కలిగించగలదు.

'తారా' యనగా మంగళుడు, శుక్రుడు అను దేవతలు. లేక కుజ, శుక్ర నక్షత్రములు. ఈ నక్షత్రముల కాంతిని కూడా తిరస్కరింప జేయు ప్రభావము కలది అమ్మ నాసికాభరణము. అనగా భక్తునియందు

ఒకవేళ కుజ, శుక్ర దోషములున్ననూ, తత్ప్రభావమును నిర్వీర్యము చేయగల శక్తి ఈ నామమును మంత్రముగ జపించినవారి కేర్పడును. అమ్మను శ్రద్ధాభక్తులతో పూజించువారిని ఏ గ్రహ దోషమూ అంటదు. అందు కుజ, శుక్ర దోషములు యిచట ప్రత్యేకముగా తెలుపబడు చున్నవని కూడ అర్థము చేసుకొనవలెను. భారతీయ వాఙ్మయమున యిట్టి క్షేమమును, రక్షణమునూ ఋషు లేర్పరచినారు. అట్టి ఋషుల ఋణము ఎప్పటికినీ తీర్చలేము.



# 21. 'కదంబమంజరీక్లృప్త కర్ణపూర మనోహరా'

అమ్మ చెవి పై భాగమున కదంబ పుష్పగుచ్ఛమును ధరించుటచే మనోహరయై యొప్పుచున్నదని భావము. కదంబ మంజరి యనగా కదంబ పుష్పముల గుత్తి. అవి కర్ణమును పూరించి మనోహరత్వమును కలిగించు రీతిగ నున్నవి.

కర్ణమనగా చెవి యని ఒక అర్థము. లంబకోణ త్రిభుజమున లంబకోణమున కెదురుగా యున్న భుజమును కూడా 'కర్ణ' మందురు. కర్ణము మీది చతురస్రము మిగిలిన రెండు భుజముల మీది చతురస్రములతో సమానమని 'పైథాగరస్' అను ఋషి తెలిపినట్లుగా మనము భావింతుము. కానీ, యీ సిద్ధాంతము వేదకాలము నాటిదే. లంబకోణ త్రిభుజము నందలి నిలువు భుజము అయ్యవారుగను లేక పురుషునిగను, అడ్డము భుజము అమ్మవారిగను లేక మూల ప్రకృతిగను, ఈ రెండింటి సమాగమమే (సమమైన కలయికయే) కర్ణమను వెలుగు నకు కారణమని, అట్టి వెలుగు నాధారముగా అగ్ని పుంజములుగ, పుంఖాను పుంఖములుగ సిందూర వర్ణములో సృష్టి యేర్పడినదని, అట్టి సృష్టి అత్యంత మనోహరమైనదని ఋషులు దర్శించినారు.

కదంబ పుష్పము సిందూర వర్ణముగలదై యుండును. ఆ పుష్పముల గుత్తి సృష్టియనెడి పుష్పగుచ్ఛమే. దానిని ధరించినటు వంటిది కర్ణము లేక వెలుగు లేక మహాచైతన్యము. సృష్టి మనోహరత్వమును గూర్చి వేదములే వర్ణింపలేకపోయినవి. ఇంతటి నర్మగర్భమైన భావమును ఈ మంత్రము ఆవిష్కరించుచున్నది. కర్ణముగ వ్యక్తమై దానిని పూరించు నట్లుగా పుంఖాను పుంఖములుగా సృష్టిగోళము లేర్పడుట ఈ మంత్రార్థము.

# 22. 'తాటంక యుగళీభూత తపనోడుపమండలా'

**సూ**ర్య మండలము, చంద్ర మండలము అను రెండు గోళము లనూ తన చెవులకు దుద్దులుగా ధరించినది అమ్మ అని భావము. అనగా సూర్య చంద్రాత్మకమగు సృష్టిప్రజ్ఞలకు 'అమ్మ'యే మూల స్థానమని తెలియవలెను. సూర్యాత్మప్రజ్ఞ జీవులకు ప్రాణము నందించు చుండగ, చంద్రప్రజ్ఞ శరీరము – దాని పెరుగుదల – మనస్సు యిత్యాది వేర్పరచు చుండగ జీవ స్వరూపముగ సమస్త జీవకోటియందు అమ్మ అధిష్టించి యున్నది. ఇడ–పింగళ నాడులుగ, గంగా యమునల ప్రవాహముగ ఆరు కేంద్రముల నేర్పరచుకొనుచు మానవుని స్వరూపముగా సృష్టి పరిపూర్ణము గావించుచున్నది. శ్రీదేవియే 7వ కేంద్రమైన సహస్రారము నందు తానుండి సుషుమ్న ద్వారమున మూలాధారము వరకూ వ్యాపించి సమస్త లోకములను, మానవుని యందునూ – సృష్టి యందునూ శ్రీదేవియే నిర్వర్తించుచున్నది అని తెలియవలెను.



# 23. 'పద్మరాగశిలాదర్శ పరిభావి కపోలభూః'

**అ**ద్దము కంటె నిర్మలములైనవి పద్మరాగ శిలలు! వానియందలి పదార్థము అత్యంత పారదర్శకముగను, స్పష్టముగను, నిర్మలముగను యుండును. అమ్మవారి కపోలములు అంతకు మించిన పారదర్శకత కలిగినవని యీ నామమున వర్ణించుచున్నారు. పరమాత్మని దర్శించుట యనగా అమ్మను దర్శించుటయే! పరమాత్మ దర్శన మిచ్చుట యనగా అమ్మ దర్శన మిచ్చుటయే యగును.

అవ్యక్తమగు తత్త్వము శివము. అట్టి శివము యథాతథముగా ప్రతిబింబించినపుడే దృగ్గోచరమగును. అమ్మవారి చెక్కిళ్ళు అయ్యవారిని ప్రతిబింబింపగలిగిన పారదర్శకత్వముతో ప్రకాశించుచున్నవని తెలియ వలెను. అయ్యకు ప్రతిబింబము అమ్మ! అమ్మ ప్రతిబింబింప చేయునదీ అయ్యనే! మరొకటి కాదు. ఇంకనూ వివరములు వలసినవారు కేనోపనిషత్ చదువుకొనవచ్చును.



# 24. 'నవవిద్రుమ బింబశ్రీ న్యక్కారి రదనచ్ఛదా'

విద్రుమ బింబమనగా ఎఱ్ఱని కాంతిబింబము. క్రొత్తగా కొనిరాబడిన ఎఱ్ఱని కాంతులతో కూడిన శుభప్రదమైన పెదవులు కలిగినది. సృష్టియందలి అందమైన ఎఱ్ఱని పగడము, దొండపండు వంటి రూపములను, అధిగమించిన అందముగల పెదవులు అని విశ్లేషించబడినవి.

క్రొత్తగా కొనిరాబడిన ఎఱ్ఱని బింబముయొక్క శోభ తెలియవలె నన్నచో తూర్పున ఉదయించుచున్న సూర్యబింబమును దర్శించవలెను. ఉదయ సూర్యబింబపు కాంతి మనస్సున కాహ్లాదము కలిగించును. అనురక్తి ఏర్పరచును. అందుండి వెలువడు కిరణములు నీటిపై పడునపుడు ఉపరితలమున పగడములు పరచినట్లుగా అమితానందము కలిగించును. సూర్యోదయ సమయమున తూర్పు సముద్ర తీరమునను, నదీ తీరమునను, తటాక తీరముననూ ఈ కాంతిని దర్శించి అమ్మ పెదవుల కాంతి అనుభూతి పొందవచ్చును. సృష్టియందలి అత్యంత సుందరమైన కాంతులన్నియూ అమ్మ విన్యాసములే! పై విధముగ పెదవులను వర్ణించుట ఋషి దర్శనము.



# 25. 'శుద్ధవిద్యాంకురాకార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలా'

శుద్ధవిద్య లేక శ్రీ విద్య లేక షోడశీ విద్య. పరా, పశ్యంతి, మధ్యమ. అదిక్రమముగా వైఖరీ రూపమై ముఖము నుండి బహిర్గతమై గురువు నుండి శిష్యునకు విస్తరించును. శబ్ద బ్రహ్మమునకు రూపము బీజము. అట్టి బీజములోని అభివృద్ధియే పరావాక్కు. దాని అంకురిత దశయే పశ్యంతి. విచ్చుకొనియు వ్యక్తముగాక యుండు ఆకుల జంట మధ్యమ. రెండు దళములు విడివడి, వికసించి, మధ్య నుండి వేరు మొలకగా నిలచుట వైఖరీ. దీనినే అంకుర మందురు. అట్టి అంకురము నకు, రెండు వరుసల దంత పంక్తులకు సామ్యముగలదు.

హల్లులు చేరని పదునారు అచ్చులు శుద్ధవిద్య. ఈ అచ్చులకు తాళువుల సంపర్కము లేదు. పదునారు అచ్చులునూ అంకురములు. ఆకుల జంట లేక పైతాళువు లేక క్రింది తాళువుల దంతములు శివశక్తులు. అట్టి ముప్పదిరెండు అంకురములే ముప్పదిరెండు దంతము లుగ నున్నవని తెలియవలెను. అక్షరములను చక్కగ ఉచ్చరించుట, స్పష్టముగ పలుక గలుగుట శుద్ధవిద్యకు ప్రాథమిక అర్హత. ఒత్తులు పలుకలేనివారు, ఞ, ఙ పలుకలేనివారు, శ, ష, స అక్షరాలను స్పష్టముగ పలుకలేనివారు ఆ జన్మమున శుద్ధ విద్య నందలేరు. ఇట్లు పలుకగల్గు సామర్థ్యము గలవారినే శ్రీ విద్యకు గాని, వేద విద్యకుగాని గురువు లెన్నుకొందురు. అర్హత లేని వారియందు విద్య భాసించదు. వారి వారి అర్హతలను బట్టి అర్హమైన విద్యల నందించువాడే సద్గురువు.

శుద్ధ విద్యాంకురము పొందినవారిని బ్రాహ్మణుడందురు. వారు

విద్యాంకుర రూపులు. వారి పంక్తిద్వయముచే శుద్ధవిద్య ప్రపంచమున ప్రకాశించును. వారు దేవీ ముఖమునుండి బయల్పడిన వారే. అందుచే దేవీ దంతములతో సాటిలేని వారని భావము. ఈ అంశమునే 'బ్రాహ్మణోస్య ముఖమాసీత్' అని పురుషసూక్తము గానము చేయు చున్నది.

శుద్ధవిద్యకు ముప్పదిరెండు దీక్షలు ప్రసిద్ధముగ నున్నవని తంత్రశాస్త్రము తెలుపుచున్నది. ఈ ముప్పదిరెండు దీక్షలే ముప్పది రెండు దంతములు. దీక్షలు పొందిన వారందరూ కూడా ద్విజులని శాస్త్రము తెలుపుచున్నది. ఈ శుద్ధవిద్యా దీక్షయందలి ముప్పది రెండు దీక్షలునూ దీక్షిత అంతఃకరణలై నిర్వర్తించినవారు పురుషశ్రేష్ఠులు. వారినే దేవీ ఉపాసకులు అనుట తగును.

ద్విజపంక్తి యనుటలో విశేషార్థమేమన, రెండవసారి జన్మించిన పంక్తులని అర్థము. బాలదంతములు (పాల పండ్లు) వూడి, మరల దంతములు వచ్చును గనుక ఈ దంతములు ద్విజ దంతములు. అవిద్యా మలముతో కూడినటువంటి జ్ఞానము నశించి, శుద్ధవిద్యతో కూడిన జ్ఞానము ఉదయించుట కూడా ద్విజత్వముగ చెప్పబడును. వీరినే బ్రాహ్మణులని, మరల పుట్టినవారని తెలుపుదురు. మొదట, మలమూత్రాదులతో కూడిన శరీరమునందు పుట్టిన జీవుడు విద్యా సాధనము ద్వారా వెలుగు శరీరమున పుట్టుటను మరల పుట్టుట అందురు. వీరికి దేహాత్మ భావనము లేక కేవలము జీవాత్మ భావనయే యుండును. అట్టి వారి మనస్సున భేదభావనము లుండవు. భేద భావనలు లేకపోవుటయే శుద్ధవిద్యకు తార్కాణము. ఇట్టివారికే పరాశక్తి సుసాధ్యము. ఇతరులకు దుర్లభము.

పైన తెలిపిన విధముగా దంతములు గలవారి చిఱునవ్వు ప్రకాశవంతముగ, ఆకర్షణీయముగ, సమ్మోహనముగ నుండును. ఆ మహిమ వారి దంతములనుండి ఉద్భవించు ఉజ్వల ప్రకాశమే. అమ్మ దంతములు మరింత మహోజ్వలముగ ప్రకాశించి సమ్మోహితులను చేయగలవని భావము.

నేను, నీవు, అతడు అను భేదములేని విద్యయే శుద్ధవిద్య. శ్రీవిద్యకు అట్టి భేదము లేదు గనుక అది శుద్ధవిద్య యగుచున్నది. విద్య–శుద్ధ విద్యగాను, అశుద్ధ (అవిద్య) విద్యగాను సృష్టియం దుండును. అవిద్య యను మలములకు విరోధియైన శుద్ధవిద్య, షోడశీరూపమైన విద్య. అనగా పదునారు బీజాక్షరములతో కూడిన విద్య. ఈ బీజాక్షర ములు మెరికల వంటివి. వీటినే పదహారు దంతముల జంట వరుసగా, అమ్మవారి దంతములను వర్ణించుట ఋషి సమన్వయము. అట్టి దంతముల వరుస మిక్కిలి ప్రకాశవంతముగా నున్నది.

ఉజ్వలమైన పదహారు దంతముల వరుసను నీయొక్క శుద్ధ విద్యాంకురములుగ కలిగిన దేవి యని ఈ నామము స్తోత్రము చేయుచున్నది. పదహారు దంతములు పై వరుస యందు, పదహారు దంతములు క్రింది వరుస యందు హెచ్చుతగ్గులు లేక కలిగినవారే ఈ బీజాక్షరములనెడి విద్యాంకురములను చక్కగా ఉచ్చరించగలరు. ఇతరులకు సాధ్యపడదు.

# 26. 'కర్పూరవీటికామోద సమాకర్షద్దిగంతరా'

కర్పూర వీటిక యనగా యాలకులు, లవంగములు, పచ్చ కర్పూరము, కస్తూరి, నాగకేసరములు, జాజికాయ, వక్కలు మొదలగు వాటి పొడి తమలపాకులతో పాటు కూర్పబడినది. దీనినే తాంబూలము అందురు. అట్టి తాంబూల సువాసన తన పది దిక్కులయందు వస్త్రముగా గలది అని భావము. దేవి ఆవిర్భావము చెందిన వెనుక ఆమె ముఖము నుండి ప్రసరించు సువాసన పది దిక్కులయందు దేవతల నేర్పరచెను. వీరినే వరుసగా ఇంద్రుడు, అగ్ని, యముడు, నిర్‌ఋతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు, ఇంద్రా విష్ణువు, అగ్నా విష్ణువు అందురు. దేవి తాంబూల సువాసన నుండి ఏర్పడిన యీ దిగ్దేవతలు కేవలము ఆ సువాసనల యందు ఆసక్తి కలవారై తమ తమ కార్యములను నిర్వర్తించు చున్నారని కవి భావము. దేవి తాంబూలపు సువాసన దశదిశ లకూ వ్యాపించుటచే 'ఆమోద' అను పదమును మంత్రమున వాడిరి. ఆ సువాసనా వ్యాపనమునకు దిగంతరము లన్నియూ సమాకర్ష ణము చెందుచున్నవని భావము.

సాధకుని నోరుకూడా యిట్లు సువాసనలు పొందినచో ఆ నోటి యందు అమ్మవారు నివాసమున్నట్లే! సుశబ్దములు పలుకు నోటియందు సువాసన యుండును. నోటి దుర్వాసన నోటి వినియోగపు తీరును మార్చు కొనమని సందేశమిచ్చును. కేవలము ఖరీదైన పండ్లపొడి, పేస్టులతో నోటి దుర్వాసన నరికట్టలేము కదా! సమ్యగ్భాషణమే నోటి సువాసనా రహస్యము. అట్టివారికి దిగ్దేవతల సహకార ముండునని కూడా తెలియ వలెను. వాక్కుయే సమస్త సృష్టినీ ధరించి యున్నది గాన, వాక్కును సరి చూచుకొనువారు సువాసన వలన దిక్కుల రక్షణ కలిగియున్నారు.

# 27. 'నిజసల్లాపమాధుర్య వినిర్భర్త్సితకచ్ఛపీ'

శ్రీ దేవి సంభాషణ యందలి మాధుర్యము త్రిశక్తులలో నొకరైన సరస్వతీ దేవియొక్క 'కచ్ఛపి' యను వీణానాదమును తిరస్కరించు నట్లుండునని భావము.

వాయిద్యములలో వీణ ఉత్తమోత్తమమైనది. ఉత్తమోత్తమ వీణలు నారదుని మహతి, విశ్వవసువు బృహతి, తుంబురుని కళావతి, సరస్వతీ దేవియొక్క కచ్ఛపి వీణ ప్రథమ స్థానమున నుండును. వ్రేళ్ళ తాకిడితో ఆ వీణ నుండియే సమస్త స్వరములు, అక్షరములు పుట్టుచున్నవి. వర్ణముల స్పష్టత కచ్ఛపీ వీణకే కలదని పెద్దలు చెప్పుదురు. అట్టి స్పష్టత, స్వర మాధుర్యము వ్యక్తము చేయు కచ్ఛపీ వీణానాదము కంటే కూడా శ్రీ దేవి సంభాషణములు మధురాతి మధురముగా నుండునని ఈ మంత్రము ప్రతిపాదించు చున్నది. శ్రీ దేవి పలుకులను వినగలుగు భాగ్యమే భాగ్యము. అంతర్ముఖునకు అట్టి అవకాశము ఏర్పడగలదు. శ్వాసయందలి లయ, తాళముల ద్వారా నాదము చేరి, అట్టి నాదము ఆధారముగ గంధర్వలోకము స్పృశించినచో శ్రీ దేవి సంభాషణా మాధుర్యము నెరుగుట కవకాశ మేర్పడును. నారద – తుంబురు లట్టివారు. ఇటీవలి కాలమున శ్రీ త్యాగరాజు మహాశయులు అట్టి భాగ్యము ననుగ్రహింపబడినారు.

# 28. 'మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశమానసా'

శ్రీదేవి చిరునవ్వు కాంతి ప్రవాహము ఎల్లలు లేనిదగుటచే కామేశ్వరుని మనస్సు కూడ అందు మునుగుచున్నదని భావము. కామేశ్వరుని మనస్సునుండి సంకల్పము వెలువడి శ్రీదేవి ఉద్భవించినది. శ్రీదేవి సహజముగ కాంతి స్వరూపము. ఆ కాంతియే త్రిగుణాత్మక సృష్టికి ఆధారము. సృష్టి సంకల్పమును నిర్వర్తించుటకు సృష్టికాంతిలో కామేశుని మనస్సు ఇముడును. అతని సహకారముచే సృష్టి నిర్వహణము శ్రీదేవి నిర్వర్తించును. అట్లు పరమశివుడు సహకరించుటయే కాంతి యందు మునుగుట. శివ సంకల్పమును తన కాంతియందిముడ్చుకొని శ్రీదేవి లోకములను, లోకేశులను, లోకస్థులను ఏర్పాటు చేయును. వీరందరి యందును శివు డంతర్లీనముగ నుండగ శక్త్యాత్మకము, రూపాత్మకము అయిన సృష్టిని అమ్మ నిర్వర్తించును. శివ శక్తుల కార్యక్రమములను, సకల సృష్టి నిర్వహణము జరుగుచున్నది. కామేశ్వరుని మానసము పొంది చిరునవ్వు కాంతులతో వెలయుచున్న శ్రీదేవిని ఈ నామము ద్వారా ధ్యానింపవలెను. శ్రీదేవి చిరునవ్వు యందలి దర్పము పరమశివుని మానసము తనయందు యిముడు టయే. ఆ చిరునవ్వులోని కాంతి ఆమె ఈశ్వరత్వమునకు చిహ్నము. సకల సృష్టికిని ఆమె ఈశ్వరి. ఆమెకు పరమశివుడు ఈశ్వరుడు.

# 29. 'అనాకలిత సాదృశ్య చుబుక శ్రీవిరాజితా'

**అ**మ్మవారి చుబుకకాంతి నిరుపమానము. అనగా దేనితోనూ పోల్చిచెప్పుటకు సాధ్యపడని అంశము. సరస్వతి మొదలుకొని సమస్త కవులకు వర్ణించుటకు ఏ ఉపమానము లభ్యముకానంత అందమైన చుబుకము అమ్మవారి చుబుకము. సాధకుడు తనకు తానుగ ఊహించు కొనవలసిన అందమైన చుబుకమేగాని, పోల్చిచెప్పుటకు ఉపమానము లేదు.

కొన్ని దివ్య విషయములు సాధకుని ఊహకు వదలుట సహజమైన ఋషి సంప్రదాయము. సాధకుడు తనకు తానుగా కాంతి రూపమును ఊహించుట ఇచ్చట సంకేతింపబడినది. నామమును స్తోత్రము చేయు నప్పుడు తత్సంబంధమైన కాంతిరూపమును ఉపాసకుడు ఊహింపవలెను. కాంతివంతమైన రూపమును తాను ఊహించి దర్శించుచున్న కొలదియూ ఉపాసకునిలో కాంతి పెరుగును. యాంత్రికమైన స్తోత్రాదికములు చేయుటలో శ్రమయేగాని, ఫలము దక్కదు. దేవి నామములను, ప్రత్యేకించి ఆయా రూపములను వర్ణించు నామములను పఠించునపుడు కాంతి రూపమును దర్శించుట ఉపాసకునకు ప్రాథమిక కర్తవ్యము.

కాంతిని స్తోత్రాదికములు చేయుచూ ఊహించుట దీక్షగ సాగినచో సాధకుడు తన పరిసరములను మరచి కాంతిలోకమున చేరును.

కాంతిలోకమున మనసు నిలబడుటవలన బుద్ధికిని, మనసునకును వంతెన నిర్మాణము కాగలదు. అది కారణముగ సాధకునియందు క్రమశః దైవీస్వభావము ఏర్పడుట, ముఖము నందు, కన్నులయందు కాంతి పెరుగుట జరుగగలదు.

నిరుపమానమైన, కాంతివంతమైన చుబుకము అందమైన దేవి ముఖమునకు దీటుగ నూహించి, శ్రీదేవి ముఖధ్యానము పరిపూర్తి గావించుకొన వలెను. కేశపాశములు మొదలుకొని చుబుకము వరకు గల వర్ణనము స్తోత్రము చేయువాని మనస్సును ఆకర్షింపచేయగలదు. పన్నెండవ నామము నుండి ఇరవైతొమ్మిదవ నామము వరకు పదునెనిమిది నామములతో దేవి ముఖ వర్ణనము రమణీయముగ చిత్రింపబడినది. అర్థసహితముగ మనసు పెట్టి ఈ నామములను రాగయుక్తముగ ఆలాపన చేయు సత్సాధకునకు శ్రీదేవి ముఖము సమస్త సన్మంగళములను కూర్చును గాక!



# 30. 'కామేశబద్ధమాంగల్య సూత్రశోభితకంధరా'

**కా**మేశ్వరునిచే కట్టబడిన సౌభాగ్యకారకమైన మంగళసూత్రముచే ప్రకాశించు మెడగలది శ్రీదేవి. ఇచ్చట వర్ణనము శ్రీదేవి మెడనుగూర్చి. అందమైన ఆమె మెడకు మంగళసూత్రము మరింత శోభ కలిగించినది. ఆ మంగళసూత్రము కూడ విశిష్టమైనది. ఎందువలనన కామమునకు ఈశ్వరుడగు శివునిచే కట్టబడినది కదా! శివుడు కామేశ్వరుడు. అనగా మన్మథునకు కూడ ప్రభువు. మన్మథుడు అతని కనుసన్నల ఆజ్ఞల ననుసరించి జీవించవలసినదే. కామమును ఉజ్జీవింప జేయుటకు, హరించుటకు అధికారముగల ఈశ్వరునిచే కట్టబడిన మంగళసూత్ర మిది.

సాధారణముగ జీవులలో మంగళసూత్ర ధారణము చేయు సమయమున పెండ్లి కుమారుడు, పెండ్లి కుమార్తె ఒకరి కనులలోనికి ఒకరు చూచుకొనునప్పుడు కాముడు జనించి ఒకరికొకరు ఆకర్షితు లగుదురు. దాంపత్య జీవనమున పరస్పర ఆకర్షణ ప్రాథమికముగ కామాకర్షణయే. మంగళసూత్ర ధారణ కారణముగ మన్మథుడుద్భవించి చెలరేగును.

కాని, ఇచ్చట మంగళసూత్రము కట్టినది కామేశుడు. మన్మథుడు తనంతట తానుగ చెలరేగుటకు అవకాశము లేదు. అందుచే వర్ణింప

బడిన మంగళసూత్రము విశిష్టమైనది. ఆ మంగళసూత్రము అలంక రించిన మెడకూడ సరిసమానమైన విశిష్టత గలది. శ్రీదేవి కాంతులీను మెడవలన మంగళసూత్రము శోభించుచున్నది. పరమశివుడు కట్టిన మంగళసూత్రము కారణముగ అమ్మవారి మెడకూడ శోభించుచున్నది.

మంగళసూత్రము కామసంజనకము కానప్పుడు అది సౌభాగ్య కారణ మగును. కనులు కనులతో కలసిన సమయమున జీవాకర్షణము జనియించినచో వివాహము సౌభాగ్యప్రదము కాగలదు. అట్టి సౌభాగ్యమును సూచించు సూత్రము కావున అది వట్టి దారముకాక మంగళసూత్రమైనది. మంగళసూత్ర ధారణము వేదమునందు ప్రస్తావింపబడలేదు. దక్షిణభారతమున ఏర్పడిన ప్రాచీన సంప్రదాయ మిది. స్త్రీ–పురుషులకు పరస్పర బాధ్యతలను, బద్ధ జీవనమును గుర్తుచేయు సంకేతమే ధరింపబడిన మంగళసూత్రము.



# 31. 'కనకాంగద కేయూర కమనీయ భుజాన్వితా'

**అం**గదము, కేయూరము అను బంగారపు, కమనీయపు భుజములచే ప్రకాశించుచున్న దేవి అని భావము. అమ్మవారి నాలుగు భుజముల కాంతిని దర్శించుట ఈ నామముయొక్క ధ్యేయము. శ్రీదేవి శరీరమే బంగారు కాంతులను విరజిమ్ముచు నుండును. నాలుగు భుజములు అంతఃకరణ చతుష్టయమునకు సంకేతములని యిదివరకే వివరింపబడి యున్నది. భుజముల కాంతిని ధ్యానించుట వలన అంతః కరణము పరిశుద్ధి నొందగలదు. కరణమునకు (చేతలకు) అంతః కరణ పవిత్రతయే ముఖ్యము. అట్టి పవిత్రత శ్రీదేవి నాలుగు భుజముల ఆభరణముల కాంతిని ధ్యానించుటచే ఏర్పడ గలదు. కాంతివంతమైన ఆమె భుజములు అంగద, కేయూర ఆభరణములను ధరించినట్లు భ్రమకొల్పును కాని, నిజమునకు ఆమె భుజముల సౌష్టవ కాంతి అది. ఆభరణములను పెట్టుకొనుట వలన సామాన్యులు అందముగ కనబడుదురు. అందమైనవారు ఆభరణములను పెట్టుకొనినప్పుడు వారి కాంతి ఆభరణములకు అందమిచ్చును. అమ్మ ధరించిన ఆభరణముల నుండి విరజిమ్మబడుచున్న కాంతి అమ్మ భుజములనుండి జనించినదే కాని, బంగారము నుండి కాదు. బంగారమే అమ్మ శరీరము నుండి పుట్టినదికదా! కావున నాలుగు భుజములు హిరణ్మయముగా భావన చేయుచూ, అందలి కమనీయత్వము గ్రోలుటలో మనస్సు హరింపబడ

వలెను. బహిర్ముఖమైన మనస్సు అంతర్ముఖమై బంగారు కాంతులలో మునిగినప్పుడు అంతఃకరణములు పరిశుద్ధి చెందగలవు. అట్టి అంతః కరణములు బహిఃకరణములను కూడ చైతన్యవంతముగా చేయగలవు. అది కారణముగ లోకహిత కార్యముల నొనర్చు అంగబలము, భుజబలము ఉపాసకునకు ఏర్పడగలవు.

మెడ, బాహువులు, కంఠము మిథునరాశి చిహ్నములు. మిథునరాశి ద్విస్వభావ రాశి. ద్వంద్వముగ కనబడుచున్న సమస్త సృష్టిరహస్యములు ఈ రాశియందు సంకేతింపబడినవి. ముందు తెలుపబడిన నామములలో గల మెడ, మంగళసూత్రములు, ఈ నామమున అంగద, కేయూరములు తెలుపబడుటలో ద్వంద్వము కలిగి అధిష్ఠించబడిన సమన్వయము కలిగిన దేవిగ అమ్మను అవగాహన చేసుకొనవలెను. దేవీ సహస్ర నామములయందు ద్వంద్వములు, పరస్పర విరుద్ధములు అయిన విషయములయందు ఏకత్వము ప్రతిపాదింప బడినది. ఏకత్వమునందు ద్వంద్వములను దర్శించుట మొదలగును.



# 32. 'రత్నగ్రైవేయ చింతాకలోల ముక్తా ఫలాన్వితా'

**ర**త్నములు, బంగారము, ముత్యములతో చేయబడిన కంఠాభరణ ములను దాల్చినది అని అర్థము.

కంఠము ఊర్ధ్వలోకమునకు, మానవ లోకమునకు మధ్యస్థమైన లోకము. మానవప్రజ్ఞ విశిష్ట శుద్ధి నొందనిదే దివ్య లోకానుభవములకు పాత్రత పొందదు. ఈ నామమున చెప్పబడిన కంఠాభరణములలో రత్నములు, ముత్యములు, బంగారము వున్నవి. రత్నములు బంగారములో పొదగబడినవి. అవి కంఠమున అలంకరించగా చలించుచున్న ముత్యపు హారము ఒకటి కంఠాభరణమునకు తగుల్కొని యున్నది. ముత్యపు హారము చలించుట మనో చాంచల్యమును సూచించును. ఈ చపల స్వభావము ఉపాసకుని కంఠములందు చింతలు గలవారిగ సూచించును. చింతలను గూర్చి దేవిని ధ్యానించువారు ఈ కదలు చున్న ముత్యపు హారము వంటివారు. ముత్యమునకు, చంద్రునకు, మనస్సునకు గల స్వాభావిక సంబంధమును యిచ్చుట గమనించదగును.

కంఠమున పరిశుద్ధి కలిగినకొలది నిశ్చలమైన రత్నము, బంగారము కాంతులు దర్శనమగును. అంతకు పూర్వము చింతాకలిత మైన, చంచలమైన ఆరాధన ఇప్పుడు నిశ్చలమైన ఆరాధనగ పరిణతి చెందును. క్రిందవున్న ముత్యపు హారము తను స్వభావము, దైవీ స్వభావము మిశ్రమముగ నుండుటచే కదలుచు నుండును. దాని

కాధారమైన కంఠాభరణము జీవుని భూమికయైన దేహపుంజము (మనసు, ఇంద్రియములు, శరీరము) నధిష్ఠించివున్న ప్రజ్ఞకు సంకేతము. నిశ్చలమైన కాంతిలోక ప్రవేశమునకు కూడ సంకేతము. ఇట్టివారు దేవిని నిశ్చలముగ ధ్యానము చేయగలరు.

పై నిశ్చలత్వము పొందుటకు ఉపాసకుడు వాఙ్మయ తపస్సును చేయవలసి యుండును. కంఠపు లోయనుండి వచ్చు శబ్దములను దైవముగ దర్శించుచూ మాటాడుట ఈ తపోనియమము. ఎట్టి పరిస్థితులలోను అశ్లీలము, అపవిత్రము, అబద్ధము కలుగచేయు ధ్వనులను పలుకరాదు. కంఠాభరణమును, దానిమధ్య వ్రేలాడు ముత్యపు హారమును పై విధముగా ఆరాధన చేయుట ఉపాసకునకు శ్రేయస్కరము.



# 33. 'కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణస్తనీ'

తన స్తనములను ప్రతిపణముగ నిచ్చి పరమశివుని ప్రేమ అను రత్నమును సంపాదించినది అని భావము. అట్టి మణిని ధరించియున్నది అని భావము. అనగా తన హృదయమును భగవంతునకు అర్పణము చేసి భగవంతుని ప్రేమపూరితమైన కాంతిని తన హృదయమున పొందుపరచుకొన్నది. హృదయమును అర్పించుట యనగా తనను తాను సమర్పణము చేసుకొనుట. అనగా దైవము కొరకే తాను జీవించుట. మరియొక జీవనము గాని, అస్థిత్వముగాని లేకుండుట. మనలను మనము భగవంతునికి ఎంత సమర్పణము చేసుకొందుమో, మనకు భగవంతుడు అంత మాత్రముగనే అనుగ్రహించును. "ఎంత మాత్రమున ఎవ్వరు కొలచిన అంత మాత్రమే నీవు" అను అన్నమాచార్య కీర్తన సందేశాత్మకము. భగవంతుడు నీ హృదయమున ప్రతిష్ఠితుడై వెలుగొందుచు నుండవలె నన్నచో నీ హృదయమును భగవంతున కర్పింపవలెను.

శ్రీదేవి హృదయమున భగవత్ కాంతి మెరయుటనే ప్రేమ రత్నమణి అని వర్ణించబడినది. హృదయమునుండి వచ్చు కాంతి ప్రేమ, దాక్షిణ్యము, కారుణ్యము కలిగి యుండును. మణి కావున కాంతులను విరజిమ్మును. ప్రేమ రత్నమణి కావున ప్రేమతో కూడిన కాంతులను ప్రసరింపచేయును. దానిని పొందుటకు శ్రీదేవి తన హృదయమునే ప్రతిపణముగ పెట్టినది. ఇదియే సాధకులకు ఉత్తమోత్తమమైన మార్గము. దీనిని సర్వసమర్పణ మార్గమని, సర్వహుత యజ్ఞమని తెలుపుదురు.

# 34. 'నాభ్యాలవాలరోమాళి లతాఫల కుచద్వయీ'

**నా**భి నుండి ఊర్ధ్వముగ ఏర్పడిన రోమ పంక్తివంటి లత నుండి ఉద్భవించిన రెండు ఫలములవంటి కుచములు కలదానా అని భావము.

సమస్తమైన ప్రకృతియును భగవతి నాభినుండియే పుట్టుకు వచ్చినది. అంధకార బంధురమగు తామర తంపరవంటి సృష్టిని రోమములతో పోల్చి చెప్పుట ఒక సంప్రదాయము. తన మాయాజాల ముచే, త్రిగుణాత్మక శక్తిచే నిర్మింపబడ్డ ప్రకృతి శ్రీదేవి బొడ్డునుండి పాదుకొని లతవలె ప్రాకుతూ అనంతముగ పెరిగియున్నది. ఈ లత కాధారము శ్రీదేవి నాభియే. తన సృష్టియందలి జీవుడు ఇహపర వైభవము లను అనుభవించుటకు తద్వారా ఆనందించుటకు జ్ఞాన విజ్ఞాన ఫలము లను కూడ ఏర్పరచినది. విజ్ఞాన ఫలమును పొంది, ఇహలోక వైభవమను జ్ఞాన ఫలమును పొంది, పరలోక వైభవమును అనుభవించుటకు శ్రీదేవి వద్ద గల రెండు క్షీర కుంభములనే స్తన ద్వయముగ వర్ణింపబడినది.

జ్ఞాన విజ్ఞానములను పొందుటయందు ఆసక్తి గలవారికి తల్లివలె శ్రీదేవి తన స్తనద్వయము నందించును. అందలి క్షీరమును గొని జీవులు వివేకవంతులై వైభవోపేతము, దివ్యము అయిన జీవితములను పొందు చున్నారు. తెనాలి రామకృష్ణునకు అట్టి క్షీర కుంభములను అమ్మ ప్రేమతో అందించినది. అట్లే ద్రవిడ దేశమున జ్ఞాన సంబంధులకు తన స్తన్యము లందించి జ్ఞానము నందించినది. శ్రీదేవి స్తనద్వయమును మాంస మయములుగ చూచుట కరడుగట్టిన అజ్ఞానము. అవి మోహ కారకములు కావు. జ్ఞాన విజ్ఞాన కారకములు.

# 35. 'లక్ష్యరోమ లతాధారతా సమున్నేయ మధ్యమా'

**కం**టిచే చూడదగిన నూగారు తీగకు ఆధార మగుటచే ఊహింపదగిన నడుము కలది. అనగా నడుము వున్నదా? లేదా? అను సందేహము కలిగి, అచట పుట్టిన నూగారుచే నడుము కలదని ఊహింపబడు చున్నది. శ్రీదేవి నడుము మిక్కిలి సూక్ష్మమైనదని, చర్మ చక్షువులకు గోచరము కానిదని, మాయాతీతమైనదని తెలియవలెను.

కనపడుచున్న సృష్టికి, కనపడని సూక్ష్మసృష్టి ఆధారము. ఆకాశము నుండి పంచభూతముల సృష్టి దృగ్గోచరము. దానికి వెనుక గల సూక్ష్మ లోకములో అగుపడనివి. అగుపడనిది, అగుపడు సృష్టి కాధారము. శ్రీదేవి నడుము పై భాగమంతయు అదృశ్యము, దివ్యము, అమృతమయమగు లోకములుగ తెలియదగును. నడుము క్రిందిభాగము నుండి దృగ్గోచర లోకములు కలవని తెలియవలెను. సూక్ష్మబుద్ధికే ఈ లోకములు తెలియబడ గలవని తెలుపుటకు సూక్ష్మమైన (నూనూగు) రోమముల పంక్తికి ఆధారముగ నడుము కలదని చెప్పుట. తెలిసిన దానినుండి తెలియని దానికి ప్రయత్నించుట. పరిమితమైన మనస్సుతో అపరిమితమైన దైవమును తెలియగోరుట ఆరోహణక్రమము. ఈ సూక్ష్మమునకు సంబంధించిన ఆరోహణక్రమమునకు నూగారు లత లేక తీగ ఉదహరింప బడినది.

# 36. 'స్తనభారదళన్మధ్య పట్టబంధవళిత్రయా'

**స్త**నముల బరువుచే వీగుచున్న నడుమునకు దృఢము కలిగించుటకు మూడు వరుసల బంగారు పట్టికచే చుట్టబడిన సన్నని నడుము కలది శ్రీదేవి అని భావము. నడుమును గూర్చి ముందు నామములో తెలియజేయబడినది. నడుము చుట్టును ఏర్పడిన మూడు భౌతిక లోకములు, మూడు కాలములను ఈ నామము సూచించును. ఇక్కడ చెప్పబడిన మూడు లోకములు మణిపూరకము, స్వాధిష్ఠానము, మూలాధారమునకు సంబంధించినవి. ఇవియే త్రిగుణములు. వీటియందే సమస్త జీవులను శ్రీదేవి తన మాయచే బంధించి వుంచును. మనస్సు, ఇంద్రియములు, భౌతిక శరీరము– ఈ త్రివళుల కారణముగ ఏర్పడి జీవునకు ఉపాధి ఏర్పడును. అజ్ఞానము కారణముగ అవి బంధహేతువు లగును. జ్ఞానము సిద్ధించినచో ఈ ఉపాధులు వైభవ కారకము లగును. శ్రీదేవి నడుముచుట్టును వున్న ఈ మూడు వరుసల బంగారుపట్టీని చక్కగ ధ్యానము చేసినవారికి అమ్మయే బంధములను సడలించును.



# 37. 'అరుణారుణ కౌస్తుంభ వస్త్రభాస్వ త్కటీతటీ'

ఎఱ్ఱని వస్త్రమును కటి ప్రదేశమున ధరించిన దేవియని భావము.

అరుణారుణ మనగా ఎఱ్ఱని ఎరుపు యని అర్థము. ఇది సూర్యుడు ఉదయించినపుడు ఆకసమున మరియు సూర్యబింబమున కనపడు ఎరుపు.

కౌస్తుంభ మనగా కుంకుమపువ్వు రంగు. అట్టి రంగుతో వెలుగొందుచున్న వస్త్రమును కటి ప్రదేశమున ధరించినది.

ఎరుపురంగు ఇచ్ఛాశక్తి స్వరూపము. అందుండియే జ్ఞాన క్రియా శక్తులు కూడ క్రమశః ఉద్భవించగలవు. అమ్మ తిరుగులేని సంకల్పశక్తి కలది. సంకల్పబలము దృఢముగ ఏర్పడవలె నన్నచో ఉపాసకులు ఈ అరుణారుణ వర్ణమును బాగుగ ధ్యానము చేయవలసి యుండును. ఈ రంగు మనస్సునందు అపవిత్రతను దగ్ధము చేయగలదు. ఇంద్రియ ప్రవృత్తులను నిర్దేశము చేసి నియమించగలదు. జీవునకు అమితమైన సంకల్పశక్తిని ప్రసాదించ గలదు. కావుననే అమ్మవారికి కుంకుమతో పూజ చేయుట.



# 38. 'రక్తకింకిణికారమ్య రశనాదామభూషితా'

రత్నమయములైన చిరుగంటలచే, రమ్యమైన బంగారు మొలనూలుచే అలంకరింపబడినది. ప్రాచీన కాలమున స్త్రీలు కూడ మొలత్రాటిని ధరించు అలవాటు కలదు. ఉపనయనాది సంస్కారములు కూడ స్త్రీలకు చేయుచుండెడివారు. శ్రీదేవికి సదాచారమన్న అత్యంత ప్రీతి. సదాచార బోధకురాలు కావున తాను మొలత్రాడు ధరించి లోకమునకు బోధించుచున్నది. బంగారము, రత్నములతో పొదిగిన గంటలు గల మొలత్రాడు కటి ప్రదేశమున యమ నియమాది గుణముల నేర్పరచుటకు తోడ్పడును. కామము, మోహము కలిగించు ప్రదేశము కటి భాగము. ఆ భాగమునకు రత్నమయము, హిరణ్మయము అగు కాంతులను స్పృశింపచేయుట, ప్రసరింపచేయుట వలన జీవు డతికాము కుడు కాక యుండును. వైదిక సంస్కారము లన్నియు కూడ జీవుడు కామలోలుడై పతనము చెందకుండుటకు ఏర్పరుపబడిన సదాచారములు. సదాచార మున్నచోట సంపద యుండును. విద్య కూడ అభివృద్ధి చెందును. సదాచారమును నిర్లక్ష్యము చేయకుమని తాను మొలనూలు ధరించి జీవులను హెచ్చరించుచున్నది.



# 39. 'కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరుద్వ యాన్వితా'

**శి**వునికే ఎరుక కలిగిన సౌభాగ్యము, లావణ్యము, మార్దవము గల ఊరువుల (తొడల) జంట గలది అని భావము. ఊరువుల బలము సంతానశక్తికి చిహ్నము. బలిష్ఠమైన, పుష్టికరమైన ఊరువులు కలవారు ఆరోగ్యకరమైన సంతానమును అందించగలరు. సృష్టి అంతయు శ్రీదేవి సంతానమే. శివుని సంకల్పము ఆధారముగ శివుని సహకారముతో శ్రీదేవి సమస్త సృష్టిని జనింప చేయుచున్నది. గత పది నామముల నుండి పరమశివుని కామేశునిగ కీర్తించుట గమనార్హము. సృష్టి సంకల్పము ఏర్పడిన శివుని కామేశు డందురు. అతనికి సంకల్పమే లేనిచో సృష్టికార్యమే లేదు. శివుడు కామేశుడైనప్పుడే అమ్మవారి కల్పన ముందును గాని, కామేశుడు కానప్పుడు కాదు. అట్లుగాని సమయములో శివశక్తులు ఐక్యత చెందియుందురు. అనగా అర్ధనారీశ్వరుడుగ శివుడందును. సత్సంతానము బడయగోరు స్త్రీలు ఈ నామము ధ్యానించినచో సఫలీకృతులు కాగలరు.



# 40. 'మాణిక్యమకుటాకార జానుద్వయ విరాజితా'

**మా**ణిక్యములచే నిర్మింపబడిన మకుటములవలె కన్పించు మోకాలు చిప్పలు గలది అని అర్థము.

మాణిక్యములు సహజముగ ప్రకాశించునవి. వాటితో కూడిన డిప్పలు (మకుటము) వలె గోచరించు గుండ్రని, అందమైన, ప్రకాశవంత మైన, పుష్టికరమైన, ఆకర్షణీయమైన మోకాలు చిప్పలు గలది అమ్మవారు.

శ్రీదేవి ప్రకృతి సౌందర్యమూర్తి. ప్రకృతి యందలి సమస్త సౌందర్యము ఆమె అంగాంగములయందు భావన చేయుచు సౌందర్య ఉపాసన చేయుట భారతీయ సంప్రదాయమున ఒక విశేషము. సౌందర్య మును ఆరాధన చేయుట ద్వారా సాధకునిలోని సౌందర్యము రూపు దిద్దుకొని సాధకుడు కళ కలిగియుండును. అతని యందు శ్రీదేవి కళ పెరుగును. తద్వారా క్షుత్పిపాస వంటి మలినములు తొలగును.

మోకాలు చిప్పలు జ్యోతిషమున మకరరాశి చిహ్నములు. మకరరాశి సంవత్సర చక్రమున సూర్యోదయమునకు సంకేతము. సూర్యోదయ ప్రభలు అన్ని రంగుల కాంతులను వెదజల్లుచుండును. మాణిక్యములు కూడ అట్లే కాంతులను ప్రకాశింపజేయును. ఉదయించు చున్న సూర్యబింబమును శ్రీదేవి మోకాలు చిప్పతో సరిపోల్చవచ్చును.

# 41. 'ఇంద్రగోపపరిక్షిప్త స్మరతూణాభ జంఘికా'

శ్రీదేవి పిక్కలు అమ్ములపొదులతో పోల్చబడినవి. అవి ఎఱ్ఱగ నున్నవని తెలుపబడినవి. మన్మథుడు పుష్పబాణముల నుంచు పొదులవలె తెలుపబడినవి. ఎఱ్ఱని రంగు అనగా ఆరుద్ర పురుగుల రంగు. అది అందమైన ఎరుపు. కదంబ పుష్పపు ఎరుపు. అట్లు అందమైన ఎరుపుతో కాంతివంతముగ నున్న అమ్ముల పొదివలె, అదియును మన్మథుని అమ్ములపొదివలె శ్రీదేవి పిక్కలు గోచరించుచున్నవని భావము. ఆ అమ్ములపొదిలో మన్మథుని బాణములు గోప్యముగ రక్షింపబడుచున్నవి. అవి సమస్త కామములను పూరింపగల శక్తిగలవి.

పిక్కల యందుగల బలమును బట్టి జీవునికి కామమునందు గల బలము తెలియును. శ్రీదేవి సమస్త కామములను వర్షింపగల శక్తి స్వరూపిణి. మోక్షకాములకు కూడ మోక్షము నందించగల శక్తి ఆమె పిక్కల కున్నది. బలహీనపు పిక్కలు గలవారు అమ్మవారి పిక్కల వర్ణమును ఆరాధన చేసినచో కామపూరణము సిద్ధించును.

ధర్మమునకు విరుద్ధము కాని కామము దివ్యమే. కామి కానివాడు మోక్షకామి కూడ కాలేడు. కావున కామమే సృష్టికిని అందుండి మోక్షము నకును ఆధారమగు శక్తి. అట్టి కామశక్తి పిక్కల యందుండునని శాస్త్రములు తెలుపుచున్నవి. సమస్త కామములనెడు అమ్ములను అమ్మవారు తన ఎఱ్ఱని, అందమైన పిక్కలనెడు పొదిలో రహస్యముగ దాచి ఉంచెనని అర్థము.

# 42. 'గూఢగుల్ఫా'

**బ**లిష్ఠమైన చీలమండలు గలది దేవి అని అర్థము. గుల్ఫ అను పదమునకు రక్షణ చేయునది అని అర్థము. గూఢ అనగా రహస్యముగ అని అర్థము. రహస్యముగ తనను ధ్యానించువానిని రక్షించు స్వభావము గలది శ్రీదేవి అని తెలియవలెను.

రహస్యముగ రక్షించుట ఇహజీవనమందలి సమస్యల నుండియే గాక ఇహమునుంచి కూడ రహస్యముగ శ్రీదేవి రక్షించ గలదు. ఆమె మూల ప్రకృతి. ఆమె నుండియే అష్ట ప్రకృతులు ఉద్భవించినవి. ఆమె అవ్యక్తము యొక్క వ్యక్తరూపమే. అష్ట ప్రకృతులు ఆవరణములు సృష్టించగ ఆమె అవ్యక్తమునకు మొదటి ఆవరణముగ నిలచినది. ఆమె పరాప్రకృతి. ఆమె నుండి ఉద్భవించినవి అపర ప్రకృతులు. అపర ప్రకృతుల నుండి దాటించి పరాప్రకృతి అనుభవము నిచ్చి అవ్యక్తమునకు గొనిపోవ సమర్థురాలు శ్రీదేవియే. అమ్మవారి ఆరాధన సకల శుభములను రహస్య ముగ అందించును. బాహాటముగ రక్షణము గోచరింపక పోయినను అమ్మ తప్పక రక్షించును అను దృఢ విశ్వాసముతో ధ్యానించు వారికి ఆమె రక్షణ లభించును.

చీలమండలను ఒకదానిపై నొకటి పేర్చి గుదము క్రిందుగ నుంచి సిద్ధాసనము వహించి ధ్యానించువారికి ప్రకృతి సహకరించి ప్రజ్ఞను ఊర్ధ్వగతి చేర్చి ఆజ్ఞయందు స్థిరపరచునని హఠయోగము బోధించుచున్నది. ఇది కుండలిని ప్రచోదన రహస్యవిద్య. దీని కధిదేవతకూడ అమ్మయే.

# 43. 'కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా'

**అ**మ్మవారి పాదముల పై భాగము (చీలమండల నుండి వ్రేళ్ళ వరకు) తాబేటి వీపుతో పోల్చబడినవి. సాముద్రిక శాస్త్రమును బట్టి కూడ తాబేలు వీపువలె ఎత్తుగ, ఉబ్బుగ ఉన్న పాదపు పైభాగము శుభకర మని తెలుపబడినది. అట్టివారికి జయము సహజముగ కలుగుచున్నది. అపజయము దూరముగ నుండును. వారి అడుగులకు అడ్డులేదు. వారు నడిచిన చోటెల్ల జయముండును.

అమ్మవారి పాదముల పైభాగము తాబేలు డిప్పలవలె చతుర్దశ భువనములకు ఆధారము. పదునాలుగు లోకములకు రక్షణప్రదము. ఆమె పాదముల నాశ్రయించి పూజించువారికి సర్వజయములు కలుగును. పదునాలుగు లోకములలో ఆమె కెదురు లేదు. ఆమె నాశ్రయించిన వారికి కూడ అట్టి "జయిష్ణు" తత్త్వము లభించును. కూర్మ పృష్ఠములను (పై తెలిపిన పాద భాగములను) పూజించువారికి సాధు స్వభావము కలిగి, రజస్తమస్సులు తొలగి సమస్తమును జయించు స్థితి అప్రయత్న ముగ లభించును. అట్టి ప్రశస్తమైన పాదములు గలది శ్రీదేవి. పూజ యంతయు పాదములకే జరుపుటలో గల విశేషార్థము ఇందు సూచింప బడినది. దైవపూజ అంతయు పాదములకే జరుగవలెను. గురుపూజకూడ పాదములకే జరుగవలెను. ఇది గమనించదగును.

# 44. 'నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా'

అమ్మవారి కాలిగోళ్ళ కాంతులు అత్యంత కాంతిమంతములై, ఆమె పాదములకు నమస్కరించువారి తమోగుణమును అనగా అజ్ఞానమును పటాపంచలు చేయుచున్నవని అర్థము.

అమ్మవారి పాదపూజా మహిమ ఇంతింతని చెప్పనలవి కాదు. ఆమె పాద ధ్యానము చేతనే అజ్ఞానము నాశన మగునని నారదాది మహర్షులు కీర్తించిరి. అమ్మవారి పాదములకు శిరస్సువంచి నమస్కరించువారి హృదయముల లోనికి ఆమె పాదకాంతులు ప్రసరించి, హృదయ కల్మషములను తొలగించి, జ్ఞానము ఆవిష్కరింపజేయునని పురాణములు కొనియాడుచున్నవి. చల్లని తెల్లని యగు గోళ్ళకాంతులు ఎల్లప్పుడును ప్రసరించుచునే యుండుటచే ఆమె పాదములు వ్యభిచరించునవిగ నారదమహర్షి హిమవంతునితో చమత్కరించెను.

నఖములు అనగా కాలిగోళ్ళు. అవి ఎంత ప్రకాశవంతమైనవో, అజ్ఞాన మను చీకట్లు ఎట్లు పారద్రోలగలవో ఈ నామము తెలుపుచున్నది. జ్యోతిష శాస్త్రమున శిరమున కెంత ప్రాధాన్యము కలదో, పాదములకు కూడ అంత ప్రాధాన్యత గలదు. శిరములు, అందలి తలపులు పవిత్రముగ నుంచుకొనువారు పాద నఖముల వరకు గూడ పవిత్రతను చేకూర్చు కొనవలెనని అమ్మవారి కాలి నఖములు తెలుపుచున్నవి. పరమగురువుల పాదనఖములు ఇట్లే యుండునని దర్శించినవారు తెలుపుదురు.

# 45. 'పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా'

శ్రీదేవి పాదముల జంట సౌష్టవ పూరితములై, మిక్కిలి లలితములై పద్మములతో కూడిన సరస్సులను కూడ తిరస్కరించు చున్నవని అర్థము.

పద్మాలయము మనగా కమలముల సరస్సు. కమలములు కాంతితో విచ్చుకున్న గ్రహగోళాదులకు సంకేతములు. అట్టి గ్రహతార కాదులు నీలాకాశమను సరస్సునందు విచ్చుకొని వైభవోపేతముగ కన్పట్టును. పద్మాలయ మనగా సృష్టిగోళమని అర్థము. కమలముల సరస్సు అని అర్థము. అట్టి సమస్త సృష్టి సరస్సు కాంతిని కూడ అధిగ మించు కాంతి అమ్మవారి పాద ద్వయములకున్నదని వర్ణన.

మరియు పద్మములు సౌందర్యమునకు, సౌకుమార్యమునకు, ప్రసన్నతకు, స్వచ్ఛతకు చిహ్నములు. అట్టి పద్మములకన్న మిన్నగ పై లక్షణములు అమ్మవారి పాదద్వయమందు గోచరించును. అందులకే ఆమెను 'లలిత' అని సంబోధింతురు.



# 46. 'శింజానమణి మంజీర మండిత శ్రీపదాంబుజా'

**ఈ** నామమున అమ్మవారి కాలి అందెల వర్ణన మున్నది. శబ్దములు చేయుచున్న, మణిమయ కాంతులచే విరాజిల్లుచున్న అందెలుకల పాదములు గలది శ్రీదేవి అని అర్థము.

ఆమె కాలి అందెలు చేయు శబ్దములు వేద నాదములని గ్రహింపవలెను. వాటి మణిమయ కాంతులు చిత్కళ అనుభూతులని తెలియవలెను. ఉత్తమ ఉపాసకులకు అమ్మవారి ధ్యానమున నాదములు వినిపించుట జరుగుచున్నవి. అవి కింకిణి శబ్దములుగ మొదలై దశ విధములగు నాదములుగ వినిపించుచు అనుశ్యూతము, శ్రావ్యము అగు వేణునాదముగ పరిణమించును. అట్లే నాద శ్రవణముతోపాటు చిత్కళను గోచరించుచు తేజోమయమైన కాంతుల వరకు దర్శనము జరుగు చుండును. ఉపాసకులకు గృహము నందు గజ్జల మ్రోతలు వినపడుట నుండి వేదనాదము వరకు వినిపించుట జరుగుచుండును. ఈ నాద ధ్వను లన్నియు అనాహతములే. అట్లే చిత్కళలతో ప్రారంభమై బింబ దర్శనము వరకు దర్శనములు జరుగుచుండును.

పై నాద కళానుభూతులు అమ్మవారి సాన్నిధ్యమును సంకే తించును. పై అనుభూతులు కలవారు దేవీ దర్శనమునకు ప్రాతులగు చున్నారని తెలియవలెను. పరహితము చేయుచు, పవిత్రతను పెంచు కొనుచు వారు శ్రీదేవి పాద దర్శనమునకు చేరువగుచుందురు. ఈ కాలి అందెల తళుకులు, నాదములు తన్మయత్వము కలిగించుచు ఉపాసకుని దివ్యసాన్నిధ్యమున నిలుపును.

# 47. 'మరాళీ మందగమనా'

ఆడుహంసవలె విశేషమైన సౌందర్యముతో కూడిన మెల్లని, ఒయ్యారమైన నడక గలది శ్రీదేవి అని అర్థము.

హంస నడకలు వర్ణింపలేని ఒయ్యారము గలవి. ఆ నడకలు నెమ్మదిగను, సౌందర్యముగను, చూపరులను ఆకర్షించునట్టివిగను, ఆనందదాయకముగను ఉండును. అందున ఆడుహంస మరింత విశేషించి పై లక్షణములను కలిగియుండును. మరాళ మనగా హంస, మరాళి అనగా ఆడుహంస. శ్రీదేవి గమనము ఆడుహంస గమనముతో పోల్చబడినది.

హంస శబ్దమునకు అనేకార్థములు గలవు. హంస అనగా తేజో మూర్తియగు సూర్యుడు. హంస అనగా "నే నతడే" అని యర్థము. అనగా నేను పరమాత్మ స్వరూపుడను అని యర్థము. శ్రీదేవి తేజోమయ మూర్తి. సృష్టియందలి తేజస్సంతయు ఆమెదే. అగ్ని, సూర్యుడు, చంద్రుల కాంతి ఆమెదే. ఆమె పరమాత్మ యొక్క వ్యక్తరూపమే. పరమాత్మ అగుపించుట యనగా ఆమె యగుపించుటయే. ఆమె దర్శనము అతడి దర్శనమే. కేనోపనిషత్తు దీని నద్భుతముగ ప్రకటింపజేసినది. మరియు హంస పరమ మంత్రము. అనగా పరమును చేర్చు మంత్రము. ఇహము నుండి తరింపుచేయు మంత్రము. తారకమంత్రము.

అమ్మవారి హంస గమనము మనయందలి ఉచ్ఛ్వాస నిశ్వాసలుగ గమనించవలెను. సూక్ష్మముగ, మందముగ, మంద్రముగ జరుగు సూక్ష్మ స్పందన శ్రీదేవి కదలిక యని తెలియవలెను.

# 48. 'మహాలావణ్య శేవధిః'

శ్రీదేవి మహాలావణ్య నిధి అని అర్థము. లావణ్య మనగా అతిశయముతో కూడిన సౌందర్యము. మహాలావణ్య మనగా మొత్తము సృష్టి లావణ్యమని గుర్తించవలెను. శేవధి అనగా నిధి అని అర్థము. కావున సృష్టి యందలి అతిశయముతో కూడిన సౌందర్యము, మృదుత్వము ఎక్కడ దర్శనమిచ్చునో అక్కడ శ్రీదేవి ప్రస్ఫుటముగ నున్నదని భావింపవలెను.

నామారాధన కేవలము పూజా సమయమున మాత్రమే గాక, సృష్టి పరిశీలనమున గూడ జరుగుచుండవలెను. అపుడే అది ఉపాసన కాగలదు. కేవలము పూజా గృహమునకే పరిమితము చేసిన ఉపాసన అసంపూర్ణ మగును.

శ్రీదేవియే సృష్టి వెలుగు. ఇచ్చట తెలుపబడిన వెలుగు లావణ్యమైన వెలుగు. ముత్యము లందలి నిగనిగ ఛాయను లావణ్యమని అందురు. అమ్మవారి కాంతి ధవళముగను, లావణ్యముగను, అరుణముగను, నీలముగను, పసుపుగను సాధకుని స్థితులను బట్టి గోచరించును. ముత్యపు కాంతి సౌమ్యమైన మరియు సంపూర్ణమైన కాంతి. అది ధవళకాంతివలె చూపరులకు ఇబ్బంది కలిగించదు. ఆహ్లాదము కలిగించును. చంద్రుని వెన్నెలవలె మనస్సును ఊరట పరచును. చంద్రకాంతి లావణ్యకాంతి. సౌందర్యమునకు చంద్రకాంతియే సరిపోల్చదగినది, సూర్యకాంతి కాదు. అమ్మ సౌందర్య సాన్నిధ్యము మృదువై, మధురమై, సుందరమై ఉపాసకులను లాలించును.

# 49. 'సర్వారుణా'

**అ**రుణ వర్ణము అనగా ఎఱ్ఱని రంగు. అమ్మవారికి ఎఱ్ఱనిరంగు ప్రీతి కలిగించునని పలుమార్లు సహస్ర నామములయందు గోచరించును.

ఆమె వస్త్రము అరుణారుణ వస్త్రమని ముప్పది ఏడవ నామము తెలుపుచున్నది. ఆమె పెదవులు ఎఱ్ఱనివని, ఎఱ్ఱని పగడకాంతి కలిగియున్నవని 24వ నామము వివరించుచున్నది. ఆమె కిరీటమున పద్మరాగమణులు కలవని, 14వ నామము తెలుపుచున్నది. ఆమె ఎఱ్ఱని కాంతి ప్రవాహమున బ్రహ్మాండ మండలములు మునిగియున్నవని తెలుపుచున్నది. 6వ నామమున ఉదయించుచున్న వేయి సూర్యులకాంతి కలదిగ శ్రీదేవిని స్తుతించుట జరిగినది. ఉదయించు సూర్యుడు ఎఱ్ఱనిరంగు కలవాడు కదా! ఆసలామెయే అగ్నిగుండము నుండి పుట్టినదని 4వ నామము తెలుపుచున్నది. అంతవరకేల ధ్యాన శ్లోకమే *'అరుణాం'* అని మొదలగును.

ఇకముందు నామములలో గూడ అరుణ వర్ణము మరల మరల తటస్థించును. అరుణము ఇచ్ఛాశక్తి సంకేతము. ఆమె ఇచ్ఛాశక్తి వలననే సృష్టి, స్థితి, లయములు జరుగుచున్నవి. అందుచే ఆరాధకులు ఎఱ్ఱని పుష్పములు, ఎఱ్ఱని మణులు, ఎఱ్ఱని వస్త్రములు, ఎఱ్ఱని కుంకుమతో ఆరాధన చేయుట శ్రేష్ఠము. 'సర్వారుణ' కావున ఎచ్చట ఎరుపురంగు చూచినను ఆమె అస్థిత్వమును గుర్తించుట సత్సాధన.

# 50. 'అనవద్యాంగీ'

శ్రీదేవి నింద్యములు కాని మంచి లక్షణములతో కూడిన అంగములు కలదని అర్థము. ఆమె రూపము మొత్తము అన్ని అవయవములతో కూడి సలక్షణములు అని తెలియవలెను. దోష రహితములు అని తెలియవలెను. సౌందర్య నిధానములు అని తెలియవలెను.

సృష్టి యందలి అందమంతయు శ్రీదేవిగా దర్శించవలెను. అందమును ఆరాధనము చేయుటవలన ఉపాసకుని యందు కాలుష్యము తగ్గును. చైతన్యము ఉబుకును. పొంగిన చైతన్యము ముఖమునందు, పాదముల యందు, హస్తముల యందు, ప్రత్యేకించి దరహాసము నందు, చూపులయందు గోచరించును. శ్రీదేవి ఉపాసకుడు దేవీ సౌందర్యముతో కళకళలాడుచుండును. అతని కన్నులు చూపరులను ఆకర్షించును. అతని నవ్వు, మాట ఎదుటివారిని ముగ్ధులను చేయును. అతని పాదములు, హస్తములు కోమలముగ నుండును. గులాబీవర్ణముతో అందముగ నుండును. సుకుమారముగ నుండును. అతని దేహచ్ఛాయ క్రమశః పెరిగి నిమ్మపండు ఛాయవలె కాంతివంతముగ నుండును. అతడు అన్ని విధముల సుకుమారుడిగ దీప్తించును. అతడు దేవి పుత్రుడుగ జీవించును.

కేవలము శ్రీదేవియే ఉపాసకుని రూపముగ నున్నదని తెలియ వలెను. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు అట్టి దివ్యమూర్తులు. వారు

త్రిమూర్త్యాత్మకము అయిన అమ్మరూపమే. అందము నారాధించుటలో ఇట్టి వైభవమున్నది.

అందమును చూచి ఆరాధించకపోగ కామించుట దౌర్భాగ్యము, పతన కారణము. ధర్మవిరుద్ధమగు కామము అందము ఎడల కలిగినచో, అది అత్యంత అశుభవాసన. దానియందు ప్రేరణ కలిగినచో పతనము తథ్యము. తాను పతనము చెందుటయేకాక తాను కారణముగ తన వారందరు పతనము చెందుదురు. సంతతి పతనము చెందును. తాను కులనాశకుడుగ శాశ్వత అపఖ్యాతి పొందును. రావణుని కథ ఇదియే.

అందమును, అందును అందమగు కులస్త్రీని అవమానించుట కూడా పై విపత్తునకు కారణము. దుర్యోధనునకు, అతని అనుయాయి లకు సర్వభ్రష్టత్వము స్త్రీ నవమానించుట వలననే.

అందము ఆరాధన అంశము. దానియందు కామము గాని, ద్వేషముగాని కలిగినవాడు దుఃఖపడును. అవమానించినవాడు భంగ పడును. ఆరాధించినవాడు సుఖపడును. సంపదను పొందును. కీర్తి యశస్సును పొందును. సకల శ్రేయస్సును పొందును.

పై కారణముగనే దాదాపు 38 నామములు అమ్మవారి అందమును గూర్చిన ఆరాధన నీయబడినవి.



# 51. 'సర్వాభరణభూషితా'

**శి**రస్సు నుండి పాదముల వ్రేళ్ళ వరకు ఆభరణములచే అలంకరింపబడినది, ఆభరణములను ధరించినది అని భావము.

శ్రీదేవి కాంతియే మూల పదార్థముగ స్త్రీ రూపమును ఊహించి నచో సమస్త అంగములు కాంతిమయములుగ గోచరించి ఆభరణములు ధరించినదిగ అగుపించును. శ్రీదేవి అనుగ్రహము పొందిన సిద్ధజీవులకే అట్టి కాంతి యుండును. ఇక శ్రీదేవిని గూర్చి చెప్పనేల. ఉదాహరణకు సిద్ధుడు, చిరంజీవియగు హనుమంతుని దేహము బంగారు వర్ణముతో దగదగ మెరయుచుండును. ఆ బంగారపుకాంతి అతని సహజ చైతన్య స్థితి. అతని కన్నులు మణిమయ కాంతులను వెదజల్లుచుండును. ఇట్లు దివ్యానుగ్రహము పొందినవారందరు సహజ ఆభరణ భూషితులుగ గోచరింతురు. లలితా దేవి విషయమున ఇక చెప్పవలసిన దేమున్నది? ఆమె విశ్వకాంతి, విశ్వ చైతన్యము. ఆమె రూపాత్మిక అయినప్పుడు సర్వాంగ ములు ఆభరణములు ధరించినట్లు కాంతులు విరజిమ్ము చుండును. దివ్యమంగళరూపులకు ఆభరణములు అలంకారప్రాయము కావు. వారి అంగ సౌష్ఠవము కాంతి ఆభరణములకే శోభ కూర్చును. అమ్మ సహజ కాంతిని దర్శించు ప్రయత్నము, భక్తులు ఆమెను నలుబది నాలుగు ఆభరణ ములతో అలంకరింతురు. క్రమశః ఆమె సహజ కాంతిని దర్శింతురు.

అమ్మ తన కాంతితో ఏడు లోకములను ధరించును. స్థితి భేదమును బట్టి ఒక్కొక్క లోకము ఒక్కొక్క వర్ణముగ గోచరించును. అందుచే ఆమె ధరించినటువంటి ఆభరణములు ఇంద్రధనుస్సువలె ఏడురంగులు కలిగియుండును. సప్తలోక సృష్టి ధారణమే అమ్మ ఆభరణములు ధరించినట్లుగ తెలియబడుచున్నది.

# 52. 'శివకామేశ్వరాంకస్థా'

**మం**గళకరుడైన కామేశ్వరుని తొడపై నధిష్ఠించియున్నది దేవి అని ఈ నామమునకు అర్థము.

ఇచ్చట శివ శబ్దము, కామేశ్వర శబ్దము తెలియవలసిన అంశములు. శివుడనగ మంగళ స్వరూపుడు. సర్వశుభములను చేకూర్చువాడు. అతని అస్థిత్వమే శుభకరము, మంగళకరము. సర్వమునకు అతడు ఈశ్వరుడు. కామమునకు కూడ ఈశ్వరుడు. అందుచేతనే కామేశ్వరుడైనాడు. కామము, శివము ఈశ్వర విభూతులే. శ్రీదేవి ఈశ్వరుని హృదయమే. ఆమె ఆతని సంకల్పమే. అట్టి సంకల్పము నుండి జ్ఞానము, ప్రజ్ఞానము, విజ్ఞానము, సంజ్ఞానము, అజ్ఞానము వెలువడుచున్నవి. అతని నుండి శ్రీదేవి వెలువడుట యనగ అతడు సృష్టిని అనుమతించినాడని అర్థము. అట్లనుమతించుటయే సంకల్పము వ్యక్తమగుట. అట్లు వ్యక్తమైన సంకల్పము క్రమశః సృష్టిని వెలువరించును. అతడొకడే. అతడే జగత్ సృష్టిని చేయగోరెను. అదియే శివకామము. దానిరూపమే శివకామిని యగు శ్రీదేవి. కామము లేనిదే సృష్టిలేదు. జ్ఞానము ప్రజ్ఞానమగుట కామము కారణముగనే. ప్రజ్ఞానము నుండియే మతి, స్మృతి, సంకల్పము, బుద్ధి, మేధ, ప్రాణము ఇత్యాదివి వెలువడును. అందుచేత సమస్త సృష్టి కామమునకు శ్రీదేవి అధిదేవత అని తెలియవలెను. ఆమె శివుని నుండి వ్యక్తమై సృష్టికామమును నిర్వర్తించుచున్నది.

జ్యోతిషమున మానవ దేహమందలి తొడ భాగమును కామము నకు ప్రతిరూపముగ వర్ణింతురు. దేహలావణ్యము, మార్దవ లక్షణము ఊరువులు తెలుపును. ఇవి బలిష్ఠముగ నున్నవారు జీవితమున కామము బలిష్ఠమై యున్నవారుగ నుందురు. కామేశ్వరుని తొడపై ఆసీనురాలై యున్న శ్రీదేవి బలిష్ఠము, పటుత్వము అయిన సృష్టి సంకల్పముతో ఆసీనురాలై యున్నదని అర్థము. కామేశ్వరుని ఒడిలో ఇట్లు ఒయ్యారముగ కూర్చుండిన శ్రీదేవిని ధ్యానించువారికి సర్వశుభములు కలుగును. అశుభములు కలుగవు. కామము ధర్మముతో ముడిపడిన, సర్వము శుభంకరమే.



# 53. 'శివా'

**శి**వుని వెలుగురూపమే 'శివా'. శివుడు నిరాకారుడు. అతడాకారము ధరించినచో శివా యగును. శివుడు గుణాతీతుడు. అతడు గుణములను ధరించినచో శివా యగును. వ్యక్తమైనచో శివా. అవ్యక్తముగనున్నచో శివ. నిజమునకు పంచాక్షరీ మంత్రము నుపాసించు వారు శ్రీదేవినే ఆరాధించు చున్నారు. దేవుని రూపమును, గుణము లను, శక్తిని, బలమును, జ్ఞానమును, తెలివిని ఆరాధన చేయుట యనగ శ్రీదేవి నారాధించుటయే. వీటన్నిటికిని అతీతము అయిన తత్త్వము శివతత్త్వము. వాని నుండియే ఈ సమస్తమును వ్యక్తమవగ, అతడు వానియందు నిండియుండును. అనగ ధరించును. ధరించగనే శివా యగును. అవి తనయందిమిడి యున్నప్పుడు శివుడై యుండును. శ్రీదేవి ఆరాధనమే శివుని సగుణారాధన. అందుచేతనే ఆరాధన మంతయు శివా ఆరాధనమే.

శివకు, శివాకు భేదము లేదు. శివుడెట్లో దేవియును అట్లే. దేవి యెట్లో శివుడును అట్లేయని లింగ పురాణము తెలుపుచున్నది. సృష్టికావలి దైవమే శివుడు. సృష్టియందలి దైవమే శివా.

శివ (శివా) అనగా సమస్తము తన వశమున నున్న స్థితి. సమస్తము శివ వశమే. అనగా శ్రీదేవి వశమే అని కూడ అర్థము.

శివ (శివా) అనగా మేలును కలిగించువాడు. అనగా శ్రీదేవి జీవులకు మేలు కలిగించుచుండును.

శివ (శివా) అనగా సమస్తము విశ్రాంతి చెందు స్థితి. సృష్టి సమస్తమును శ్రీదేవియందు విశ్రాంతి చెందుచున్నది. ఆమె అతనియందు విశ్రాంతి చెందుచున్నది.

శివ (శివా) అనగా సాధుత్వమని గూడ అర్థము. శ్రీదేవి సహజముగ సాధుస్వరూపిణి.

శివ (శివా) యనగా మంగళకర గుణములు అని అర్థము. శ్రీదేవి గుణములన్నియు మంగళకరములే. ఆమె నారాధించువారికి అట్టి గుణములు ప్రసాదించగలదు.

శివ (శివా) యనగా శమింపజేయువాడు (చేయునది) అని అర్థము. శమము, శాంతి శ్రీదేవి ప్రసాదించు పరమోత్కృష్టమైన సంపద.

శివ (శివా) అనగా శుభ ప్రారంభము అని కూడ అర్థము. సర్వశుభములకు శివా– శివులే ప్రారంభకులు.



# 54. 'స్వాధీనవల్లభా'

**అ**ధీనుడైన భర్తకలది అని అర్థము. శ్రీదేవి శక్తి స్వరూపిణి. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి ఆమె నుండియే ఉద్భవించును. త్రిగుణములు, పంచభూతములు ఆమె నుండియే ఉద్భవించును. సమస్త దేవతలకు కూడ ఉద్భవకారిణి శ్రీదేవియే. శివుని నుండి ఆమె ఉద్భవించుట కూడ స్వచ్ఛందమే. అట్లుద్భవించి, నర్తించి మరల శివునిలో చేరుట ఆమె క్రీడ. అందుచే ఆమె సర్వస్వతంత్రురాలు.



# 55. 'సుమేరుశృంగ మధ్యస్థా'

**సు**మేరు పర్వతము మానవదృష్టి కగోచరము. ఆ పర్వతము సురలకు స్థానము. అది సకల భువనములతో కూడియున్నది. వాటి నన్నిటికిని శిఖరస్థానమున శ్రీదేవి యున్నది. సుమేరు శృంగములు మూడు. అవియే సృష్టికాధారమగు త్రిగుణములు. ఆ మూడింటికిని కేంద్ర స్థానమున శ్రీదేవి ఉపస్థితయై ఉన్నదని తెలియవలెను.



# 56. 'శ్రీమన్నగరనాయికా'

నగరమునకు నాయక యని అర్థము. నగరమునకు అర్థము విద్యానగర మనియె. సమస్త విద్యలకు ఏ ప్రదేశ మాలయమో, దానిని ప్రాచీన కాలమున నగరమని పిలిచెడివారు. నాగరికులనగ విద్యల యందు నిపుణులని అర్థము. పూర్వకాలమున విద్యయే సంపదగ భావించుటచే విద్యలు గల తావును నగర మనిరి. వారణాసి, పాటలీ పుత్రము, ఉజ్జయిని అట్టి నగరములే. భవంతుల ఎత్తును బట్టి, ప్రదేశము వైశాల్యమునుబట్టి, జనాభానుబట్టి ప్రస్తుతము నగరములను నిర్వచించు చున్నారు. ఇది కలి ధర్మము.



# 57. 'చిన్తామణి గృహాంతస్థా'

**చిం**తామణులచే నిర్మింపబడిన గృహమునందు నివసించునది అని అర్థము.

తలచిన కోరికలను తీర్చునట్టిది చింతామణి రత్నము. అట్టి రత్నములచే నిర్మించబడిన గృహమునందు వసించునది అని అర్థము. చింతామణి గృహము బ్రహ్మాండము నధిష్ఠించి యుండునని, అందుండియే సమస్త సృష్టి ప్రణాళిక వెలువడునని బ్రహ్మాండ పురాణమున తెలుపబడెను. ఇది కారణముగ చింతామణి గృహమే సమస్త సృష్టికిని, త్రిమూర్తులకును, త్రిశక్తులకును శిరోధార్యముగ భావింతురు. ఆ గృహమున వసించునదియే శ్రీదేవి. మానవ శరీరమందు సహస్రార పద్మము నధిష్ఠించిన మణి గూడ చింతామణియే. మానవ ప్రజ్ఞకు అది పరమోత్కృష్ట స్థానము. అట్లే సృష్టికి పరమోత్కృష్ట స్థానము చింతామణి గృహము.



# 58. 'పంచబ్రహ్మాసనస్థితా'

**పం**చ బ్రహ్మములే ఆసనముగా గలది. వారిని అధిష్ఠించి ఉన్నది అని అర్థము.

సదాశివుడు, ఈశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, బ్రహ్మ వీరిని పంచబ్రహ్మ లందురు. సదాశివు డనగ సృష్టి సమస్తమునందు వసించియున్న తత్త్వము. ఈశ్వరు డనగ ఒక్కొక్క జీవిని అధిష్ఠించి యున్న తత్త్వము. త్రిగుణములను అధిష్ఠించినవారే త్రిమూర్తులు. వీరందరిని అధిష్ఠించి యుండునదే శ్రీదేవి తత్త్వము. ఈ ఐదుగురును శ్రీచక్రమున కోణపంచకముగ గోచరింతురు. ఈ ఐదుగురు బ్రహ్మలును సృష్టి నధిష్ఠించి యుండువారు. పంచ కర్మేంద్రియములకు, పంచ జ్ఞానేంద్రియములకు, పంచ తన్మాత్రలకు, పంచభూతములకు వీరు అధిదేవతలు. వీరి నధిష్ఠించి యున్నది శ్రీదేవి యగుటచే, ఆమెను 'పంచబ్రహ్మాసనస్థితా' అని స్తోత్రము చేయుదురు.



# 59. 'మహాపద్మాటవీ సంస్థా'

**అ**నేకానేక మహత్తరమైన పద్మములు గల అడవిలో నుండునది అని అర్థము.

శరీరమే మహా పద్మముల అడవి. అందలి షట్చక్రములు మహత్తరమైన పద్మములు. అవిగాక అనేక సహస్ర సంఖ్యాకములగు నాడులు కూడ మహా పద్మములే. షట్చక్ర పద్మములను, నాడీ పద్మములను అధిష్ఠించి సహస్రార పద్మమున్నది. మొత్తము పద్మముల అడవికి సహస్రదళ పద్మమే అధిష్ఠాన పద్మము. దానికి పైన వేయి దళములు గల కులపద్మము అధోముఖమై విలసిల్లి యున్నది. దానిపై దేవి యుండును. కులపద్మము బ్రహ్మాండ పద్మము. సహస్రార పద్మము పిండాండ పద్మము. పిండాండమును, బ్రహ్మాండమును అధిష్ఠించియున్న ప్రజ్ఞ శ్రీదేవి. ఈ రెండు అండముల యందు అసంఖ్యాకములగు పద్మములు కలవు. పద్మములనగ ప్రజ్ఞాకేంద్రములని తెలియవలెను. అసంఖ్యాకమగు పద్మములతో కూడిన పిండాండ బ్రహ్మాండములే మహా పద్మాటవి. దాని నధిష్ఠించి అమ్మ యున్నది.



# 60. 'కదంబవనవాసినీ'

**క**దంబ వనమందు ఉండునది అని అర్థము. కదంబ మనగ వెలుగునీడలకు అతీతమైన చోటు. ద్వంద్వాతీత స్థితి. అచట సుఖ దుఃఖములు లేవు. జయాపజయములు లేవు. రాగద్వేషాది ద్వంద్వ భావములకు చోటు లేదు. సురాసుర విభజన లేదు. ప్రజ్ఞ పదార్థ విభజన లేదు. రజస్తమస్సులు లేవు. మంచిచెడులు, ధర్మాధర్మములు లేవు. కేవల ముండుటయే ఉండును. ఉండుటయేగాని ఉన్నానను భావన లేదు. అట్టిది కదంబము. అది నిర్వికారస్థితి. అట్టి వన మొకటి మనయందును, సృష్టియందును కలదు. మనయందది సుషుమ్నయందలి హృదయ పద్మమునుండి ఆజ్ఞాపద్మము వరకు వ్యాపించియున్నది. సృష్టియందలి బంగారము, వెండి ప్రాకారముల మధ్య భూమిగ ఏడు యోజనముల విస్తారము కలిగియున్నది. పై విషయము భైరవ తంత్రమున తెలుపబడినది. ఈ వనమందు ఓంకారనాదము అనుశ్యూతముగ నాదించు చుండును. తపస్విజనులగు సిద్ధులు ఈ వనమునందు ఉందురని ప్రతీతి. బహిరంగమున భూమిపై కూడ కడిమిచెట్ల వనమునందు నాదోపాసన చేయు ఆచార మొకటి యున్నది.

# 61. 'సుధాసాగరమధ్యస్థా'

సుధాసాగర మధ్యలో ఉండునది శ్రీదేవి అని అర్థము. సుధాసాగర మనగా అమృతముతో కూడిన సాగరము. ఈ సాగరము అమృతముచే ఆవరింపబడిన మహానగరము. ఇది బ్రహ్మాండముపై నున్నది. ఇదే సాగరము పిండాండమందు, సహస్రార పద్మ కేంద్రమునందు కలదు. అదికూడ అమృత నగరమే. వీనియందు శ్రీదేవి వసించును. ఈ నగరము లను లేక సాగరములను చేరిన జీవి శ్రీదేవి అనుగ్రహమును పొంది పునర్జన్మ రహితమైన స్థితిని పొందును. శాశ్వత మోక్షము నందును. సత్కర్మ, దేవి ఉపాసన సాధనములుగ జ్ఞానమును పొంది మోక్షము నందుండుట ఇందలి క్రమము.

శ్రీదేవి శివుని ఊరువులపై వసించునని, మేరు శిఖరముపై వసించునని, విద్యానగరమునందు వసించునని, బ్రహ్మాండము పైన ఉన్న చింతామణి గృహమందు వసించునని, పంచబ్రహ్మలతో కూడిన ఆసన మున వసించునని, మహాపద్మముల అడవి యందు వసించునని, కదంబ వనమున వసించునని, అమృత సాగరమున వసించునని తొమ్మిది నివాస స్థానములను శ్రీదేవి ఉనికిపట్టుగ లలితా సహస్రనామమున వర్ణింపబడి యున్నది.

# 62. 'కామాక్షీ'

**క**మనీయమగు కన్నులు కలది అని అర్థము.

శ్రీదేవి కన్నులు అత్యంత ఆకర్షణీయములు. కనుల నుండియే సమస్తమును సృష్టించి పాలించు జగన్మాత శ్రీదేవి. ఆమె కనుల నుండి ప్రసరించు అనుగ్రహ కారణముగనే జీవులు తరింతురు. దేవి అనుగ్రహము లేక జీవునికి మోక్షము లేదు. ఆమె అనుగ్రహమునకు వేచియుండుట తపస్విజనులు తెలుసుకొనిన సత్యము. సత్కర్మా చరణము, ఉపాసన, జ్ఞాన సముపార్జనము చేయుచు శ్రీదేవి కనుల నుండి ప్రసరించు అనుగ్రహ కిరణములకై సమస్త లోకములందు తపస్విజనులు వేచియుందురు.

స్వభావమున కన్యాత్వము చెందినవారినే శ్రీదేవి అనుగ్రహించు నని జ్యోతిషశాస్త్రము తెలుపుచున్నది. కన్యారాశి పవిత్రతకు సంకేతము. దానికి సప్తమ రాశియైన మీనరాశి నుండి, మీనములవలె కమనీయమైన కన్నులు గల జగన్మాత అనుగ్రహము ప్రసరింపజేయగ, కన్యాతత్త్వముగల జీవులు దివ్యజీవులై తరింపు చెందుచున్నారు. ఇట్టి వారిని కన్యా పుత్రులని వేదములు తెలుపుచున్నవి.

# 63. 'కామదాయినీ'

**కో**రికల నిచ్చునది అని భావము.

శ్రీదేవిని సేవించువారికి సకల వాంఛలను ఆమె పరిపూర్తి గావించును. శివుని వ్యక్తరూపమేగాన, శివ సాయుజ్యము కూడ నొసగగలదు. ఇహమును పరమును అందించునది శ్రీదేవి. ఆమె కామేశ్వరుని కూడ భక్తుల కందించగలదు. చిల్లర కామములన్నియు నెరవేర్చగలదని వేరుగ తెలుప నవసరము లేదు. అమ్మ నారాధించిన వారికి కోరికలు తీరుటలో సౌలభ్యమున్నది. కామద + అయిని అని పలుకుటలో సమస్త కామ (కోరిక) పరితృప్తికి అమ్మయే శుభమగు వాహిక అని అర్థము. ఆమె సర్వకామప్రద. భక్తితో సేవించువారికి వరప్రదాత. బ్రహ్మ సహితము ఆమెను ప్రార్థించి ఇచ్ఛాశక్తి కలిగి సృష్టిని నిర్వర్తించు చున్నాడు అని బ్రహ్మాండ పురాణమందు తెలుపబడినది.



# 64. 'దేవర్షిగణసంఘాత స్తూయమానాత్మ వైభవా'

దేవతల చేతను, ఋషిగణముల చేతను స్తుతింపబడుచున్న ఆత్మవైభవము కలదానా అని అర్థము.

దేవగణములైనను, ఋషి గణములైనను, గ్రహతారకాదులైనను సర్వ ప్రాణికోటి, అమ్మ యిచ్ఛ నుండి వ్యక్తమైనవారే. అందరి జీవనము అమ్మ యిచ్ఛపై ఆధారపడియున్నది. ఆమె అనుగ్రహించినచో జ్ఞానవంతు లగుదురు. ఆగ్రహించినచో ఆమె మాయలో పడుదురు. ఎంత తెలిసిన వాడైననూ అమ్మ మాయకు లోబడియే జీవించు చుండును. ఆమె మాయ నెవరునూ దాట లేరు. త్రిమూర్తులు సైతము ఆమె మాయకు లోబడియే యుందురు గనుక ఆమె అనుగ్రహమునకై నిరంతరము స్తుతించుచునే యుందురు.

ఇచ్ఛ, జ్ఞానము, క్రియ అమ్మ ఆత్మవైభవములే. అయ్యవారు తదతీతము. అందువలన సత్సంకల్పము, జ్ఞానము బంధింపని క్రియ, జీవునకు జరుగవలెనన్నచో అమ్మ ఆత్మవైభవమును స్తుతించుటయే శరణ్యము.



# 65. 'భండాసుర వధోద్యుక్త శక్తిసేనా సమన్వితా'

**భం**డాసురుని వధించుటకు శక్తి సేనగా వృద్ధిచెంది ఉద్యుక్తురాలైనదానా అని అర్థము.

భండుడు బూడిదనుండి పుట్టినవాడు. శివుడు మన్మథుని తన కోపాగ్నిచే దహించినపుడు అతని శరీరము బూడిదైనది. అప్పటినుండి మన్మథు డనంగుడైనాడు. ఆ బూడిద మన్మథుని శరీర సౌందర్యమే కాక, రుద్రుని కోపము కూడ పొందియున్నది. దానిని గణపతి చూసి, ఆ బూడిదతో ఒక చిత్రమైన పురుషాకారము నిర్మింపజేసెను. అది జూచి బ్రహ్మ ఆశ్చర్యపడెను. "భండ భండ" అనెను. భండ అనగా ఆశ్చర్యము. ఆశ్చర్యమగు రూపము గలవాడని అర్థము. తన ప్రసక్తి లేకయే పుట్టుట వలన కూడ బ్రహ్మ ఆశ్చర్యపడెను.

రుద్రుని కోపాగ్నిని కలిగిన విభూతి నుండి భండుడు పుట్టుటచే అతడు రుద్ర స్వభావము కలిగిన వాడయ్యెను. రాక్షసుడయ్యెను. రుద్రుని కోపశక్తిని వధించుట కెవ్వరికిని సాధ్యము కాలేదు. అందువలన దేవతలచే, ఋషులచే స్తుతింపబడి, సృష్టి సంరక్షణార్థము శ్రీదేవియే అనంత శక్తి రూపములుగా మారి ఒక సేనగా యేర్పడి, సమభావముతో భండుని చంపుటకు సంకల్పించినది.

భండుడనగా సిగ్గు లేనివాడు అనికూడ అర్థము. సిగ్గు, లజ్జలేనిది, జడమైనది దేహ పదార్థము. దేహి దేహమున గల మమకారముచే జ్ఞాన

హీనుడై సిగ్గు, లజ్జ వదలి ప్రవర్తించును. ధర్మమును మరచును. జడుడై జీవించును. అట్టి జడత్వమును శ్రీదేవి వధించగలదు. జడత్వమును వధించి, జీవు నుద్ధరించుట సమభావమే కదా! ప్రేమభావమే కదా! అమ్మ భండుని వధించుట జీవు నుద్ధరించుట కొరకే.

భండవధకే అమ్మ శక్తి సేనగా ఏర్పడినది. అవియే అనంతమగు జ్ఞానమార్గములు. జీవులను రకరకములుగా ఉద్ధరించుటే తన కర్తవ్యముగా అమ్మ ఉద్యమించును. జగన్మాత కన్న ప్రేమమూర్తు లెవ్వరును లేరు.



# 66. 'సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితా'

సంపత్కరీ అనుదేవిచే రూఢమైన గజములతో గూడిన గుంపుచే సేవింపబడినది శ్రీ లలితాదేవి యని యర్థము.

గజముల గుంపులను తన వశమున వుంచుకొను దేవతను సంపత్కరీ అందురు. సంపత్కరీదేవి ఊహకందని వైభవము కలది. ఆమె అనుగ్రహించినచో సృష్టియందలి సమస్త వైచవము జీవునికి దక్కును. ఆమె సృష్టి వైభవమున కధిపతి. ఆమెవద్ద గుంపులు గుంపులుగ ఏనుగుల సమూహములు ఏడు సముద్రములందు గలవు. అనగా ఏడు లోకముల అంతరములందు గలవు. వాటినుండే ఏడు లోకముల వైభవములు ఏర్పడును. వాటి అన్నిటికిని సంపత్కరీ దేవి అధిపతి.

గజములు వైదిక సంకేతములు. తుష్టి, పుష్టి కలిగించు తత్త్వము గలవి గజములు. సిద్ధిని, బుద్ధిని గూడ ప్రసాదింపగలవు. మానవ శరీరమునందు అవి చిత్తవృత్తులుగ పనిచేయును. చిత్తవృత్తుల బలమును గజబలముగ ఋషులు గుర్తించిరి. ఎంతటి బలవంతుడైనను మాయ వలన చిత్తవృత్తులకు లోబడక తప్పదు. చిత్తవృత్తులు యోగులకు అంతర్ముఖములు, ఇతరులకు బహిర్ముఖములు. అవి బీజప్రాయములై జన్మల తరబడి స్వభావ రూపమున వెంట వచ్చుచుండును. ఇవియే వాసనలు. ఇవి దగ్ధమైననాడే, యోగులకైనను సమాధి స్థితి కలుగును.

"బలాదాకృష్య మోహాయ మహామాయా" అని దుర్గా సప్తశ్లోకి తెలుపుచున్నది. జ్ఞానులైనను, చైతన్యవంతులైనను సంపత్కరి అనుగ్రహ ములేక సృష్టి వైభవమును దాటి తత్త్వమును బడయలేరు. అమ్మ గజసమూహముల బలమట్టిది. ఈ గజ సమూహము లన్నింటిని అధిష్ఠించిన, తన అంశయే సంపత్కరీ. అట్టి సంపత్కరీదేవి గజ సమూహ ముల నధిష్ఠించి అమ్మ నారాధించుచున్నది.

సంపత్కరీదేవి సృష్టియందు సమస్తము నిచ్చును. జ్ఞానమును కూడ నిచ్చును. కాని పరతత్త్వమును చేరుటకు ముందుగా ఆమె అనుగ్రహించవలెను. పరతత్త్వము లలితాదేవిగను, యిహతత్త్వము సంపత్కరీ దేవిగను, స్వభావములు (చిత్తవృత్తులు) గజ సమూహములు గను తెలియవలెను. వైభవములు కోరువారు సంపత్కరీదేవిని, పరతత్త్వములేక మోక్షము కోరువారు లలితాదేవిని ఉపాసించ తగునని తంత్రార్థము.



# 67. 'అశ్వారూఢాధిష్ఠి తాశ్వకోటి కోటిభిరావృతా'

**స్వా**ధీనము చేసుకొనబడిన కోటానుకోట్ల అశ్వములతో శ్రీదేవి కూడియున్నదని భావము.

ముందు నామమున గజారూఢగా శ్రీదేవి తెలుపబడినది. ఈ నామమున అశ్వారూఢగ తెలుపబడినది. ముందు నామమున చిత్తవృత్తులను గజములను స్వాధీనమున నుంచుకొన్న సంపత్కరీ దేవిగ శ్రీదేవి వర్ణింపబడినది. ఇచ్చట ఇంద్రియము లను అశ్వములను తన స్వాధీనమున నుంచుకొని సృష్టిజీవులను నడిపించు చున్నట్లుగ శ్రీదేవి వర్ణింపబడినది. చిత్తవృత్తులు అంతఃకరణము నందుగల చిత్తము యొక్క రీతులు. అవి జన్మాంతర సంస్కారములు. అవి అత్యంత బలమైనవి. ఇంద్రియములు బహిఃకరణమై చిత్తవృత్తిని ప్రేరణచేయగ ప్రవర్తించును. చిత్తము వాసనలను వెదకికొనుచుండగ, ఇంద్రియములు వాటికి తోడై, వాసనా స్థానములను సృష్టియందెక్కడ యున్నవో గమనించి చిత్తమున కందించును. చిత్తము ప్రేరణ చెంది యింద్రియముల ద్వారా వాసనలను అనుభూతి చెందును. అనుభూతి చెందిన వాసన బలమై మరల చిత్తమున ప్రేరణ కలిగించును. మరల యింద్రియము లదేపని చేయును.

ఇది యొక విష వలయము. వాసన, చిత్తప్రేరణ, యింద్రియముల సహాయము, యింద్రియార్థముల గుర్తింపు, యింద్రియములు చిత్తమునకవి తెలుపుట, చిత్తము యింద్రియములతో, యింద్రియార్థములను శరీరము పాధిగ అనుభవించుట, అనుభవమును వాసనగ మరింత

స్థిరపరచుట. ఈ విష వలయమునందు జీవుడు చిక్కుకొని వాసన లాధారముగ తీరుబడిలేక జన్మ లెత్తుచుండును.




ఉదాహరణకు వాసనలయందు దొంగతన మున్నదను కొనుము. ఆ వాసన చిత్తమును ప్రేరేపింపగ చిత్తమెట్లు దొంగతనము చేయవలెనో ఆలోచించును. ఇంద్రియములు దొంగతనము చేయదగు వస్తువులను, ప్రదేశములను చూపి చిత్తమునకు తెలుపును. చిత్తము యింద్రియము లను, శరీరమును ఉపయోగించి నేర్పుతో దొంగతనము చేయును. ఇట్లు దొంగబుద్ధి, రంకుబుద్ధి, మానవుని యుగముల నుండి బంధించివేసినది. ఇవికాక చిల్లరమల్లరగ మానవుని చిత్తము అతివాగుడు, రుచికై మిక్కుటముగ భుజించుట, విచక్షణ లేకయే చూచుట, వినుట, ముట్టుకొనుట సాగుచునే యుండును. మానవుని బలవంతముగ యింద్రియార్థముల వైపుకు యింద్రియములు లాగును. విచక్షణ వద్దని తెలుపుచున్ననూ, కూడని పనులు తన నుండి జరుగుచునే యుండును. కోటానుకోట్లుగ యింద్రియార్థములను లక్షల జన్మల నుండి

పొందుచున్నను, తృప్తి చెందక, మరల నవే కోరుట యింద్రియము లనెడి అశ్వముల బలము.

గజబలము, అశ్వబలము జీవుని బలవంతముగ సృష్టిలోనికి లాగివేయుట 66, 67 నామములలో గమనించదగును. ఇది అంతయు అమ్మ మాయా స్వరూపము. ఈ వ్యాపార మంతయును అధిష్ఠించి అమ్మ యున్నది. ఆమె అనుగ్రహమే ఈ మాయా బంధనమునకు పరిష్కారము. అందుచేత అశ్వారూఢ అయిన మాతగ, కోటానుకోట్ల అశ్వములచే చుట్టబడిన మాతగ అమ్మ నారాధించుట ఈ శ్లోకమున అందించిన సాధనా స్వరూపము.

అశ్వారూఢయైన శ్రీదేవి అధిరోహించి తిరుగు అశ్వము పేరు 'అపరాజిత'. అది మిక్కిలి వేగముగల గుఱ్ఱము. వాయువు కన్నను వేగము కలది. మనోవేగము దాని వేగమని తెలియవలెను. దాని వెనుక మిగిలిన కోటానుకోట్ల అశ్వములు వాయు వేగమున బయలు దేరును. 'అపరాజిత' యను ఈ అశ్వము పగ్గములు అమ్మ చేతియందే యున్నవి. చిత్తమును వశము చేసుకొనుటకు అహంకారపూరితుడైన మానవుడు రకరకముల ప్రయత్నములు చేయును. చిత్తవృత్తి నిరోధనమే యోగ విద్య ఆశయమని తెలుపబడినది. అట్టి యోగవిద్య ఫలింపవలె నన్నచో, అమ్మ ఆశీర్వచనము తప్పనిసరి. అమ్మ అనుగ్రహముతో చిత్తవృత్తి నిరోధమే కాక సమాధిస్థితిని కూడ పొందిన యోగు లనేకులు కలరు. ఇది పాశ్చాత్యులకు ఆధునిక యుగమున అవగాహన కాని విషయము. వారి సంప్రదాయమున స్త్రీ విలాసమున కుపాధియే గాని, మోక్షమున కుపాయమని తెలియదు.

చిత్తము యొక్క గజశక్తి సంపత్కరి కాగ దాని కనురూపమగు యింద్రియశక్తి అశ్వారూఢ అయినది. అశ్వారూఢను గజారూఢను జయించగల శక్తి అమ్మ ఇచ్ఛాశక్తియే. అమ్మ ఇచ్ఛాశక్తియే ఉమగ జనించినది. 'ఉమా కుమారి' ఆమె పూర్తిపేరు. ఇంద్రియ వృత్తులను, చిత్తవృత్తులను జయించి శివుని పొందుటకు ఆమె తపస్సుచేయ సంకల్పింపగ తల్లి భయపడి "వద్దు, వద్దు" అనెను. "నీవాపని చేయ లేవు" అనెను. 'ఉమ' అనగ నీ వా పనికి వద్దు అనుట. 'ఉ' అనగా నీవు. 'మ' అనగ వద్దు. కాని ఆమె కుమారి. కుమారి యనగా మహా మాయను జయించగల ఇచ్ఛాశక్తి. 'కుం' అనగా మహామాయ. 'మారి' అనగా నశింప చేయునది అని అర్థము. తల్లి వద్దన్నను పార్వతీదేవి శివుని గూర్చి తపస్సునకై సంకల్పించెను. ఇచ్ఛాశక్తిచే ఆమె తపస్సున శివుని అనుగ్రహము పొందినది. శివుడనగా ఆత్మజ్ఞాని.

ఉమాకుమారి లేక పార్వతి తపస్సుచే శివుని చేరినది. కాన ఆమె భోగ్యురాలు కాదు. కావుననే శివుడామెతో వశించు చున్నప్పటికిని వారి నడుమ భోగము లేదు. కుమార సంభవమునకై దేవతలు వేడినప్పుడు శివుడు అగ్ని స్వరూపమైన తన వీర్యమును అగ్నిదేవునికి అందించెనే కాని పార్వతీదేవి ద్వారా కాదు. గణపతి అయినను, కుమారుడైనను అమ్మ సంకల్పము నుండి పుట్టిరేగాని శరీరము నుండి కాదు. అశ్వము (ఇంద్రియములు) ల కధిపతిగ కుమారుడును, గజములకు (చిత్తవృత్తులు) అధిపతిగ గణపతిని, ఇచ్ఛాశక్తి కధిపతిగ పార్వతీదేవిని, ఆత్మజ్ఞానమున కధిపతిగ శివుని తెలియనగును.

# 68. 'చక్రరాజ రథారూఢ సర్వాయుధ పరిష్కృతా'

**చ**క్రరాజమను రథము నధిరోహించిన శ్రీదేవి యని, రథము నందామె చుట్టును సర్వాయుధములు పరివృతమై అలంకరింప బడినవని అర్థము.

శ్రీ చక్రమే రథము. అది చక్రరాజము, రథరాజము. చక్ర మనగ తిరుగుచు త్రిప్పునది. రథమనగా ముందుకు సాగునది. అమ్మ, సృష్టి చక్రమును త్రిప్పుచు జీవులనందు తిరుగాడ చేయుచున్నది. సర్వలోకములందు జీవుల కదలిక ఆమె కదలికయే. సృష్టిచక్రము త్రిప్పుచుండగ జీవులందు తిరుగాడుచుందురు. రథమునకు పురో గమనము తిరోగమనము గలవు. రథమందలి ఆయుధము లన్నియు, సృష్టియందు దుష్ట శిక్షణకు, శిష్ట రక్షణకు యేర్పడి యున్నవి. అంతియే కాదు, సమస్తమైన ఆత్మజ్ఞాన ఆయుధములు కూడ అందున్నవి. యోగ సాధన లన్నియు గొనుపోవు వున్నత స్థానము శ్రీ చక్రమే.

శ్రీ చక్ర రథమును చేరినవాడు శుద్ధ విద్యయందు ప్రవేశించును. శుద్ధ విద్యయందు జగత్తును చైతన్యమయముగ చూచుట నియమము. అట్లు చూచినచో తనపై తనకు ఈశత్వము కలుగును. ఈశత్వమున చేరిన జీవుడు దానియందే సాధనా బలమున స్థిరబడినచో సదాశివుని పాదములను స్పృశించిన వాడగును. క్రమశః సదాశివత్వమును పొందును. అపుడు తానే బ్రహ్మమని తెలియును. విశ్వమంతా తానే

నిండియున్నాడని తెలియును. అట్లు తెలియుటయే శుద్ధవిద్య. తెలియక పోవుట వలన భేదబుద్ధి కలుగును. భేదబుద్ధి అవిద్య.

శ్రీచక్రము రథరాజమని కూడ తెలుపబడినది. ఈ రథమునకు ధ్వజము ఆనందము. దీనికి తొమ్మిది కోణములు కలవు. అవియే నవావరణములు. అమ్మ మరియొక రథము ఏడు కోణములతో నుండును. దానిని అమ్మ అధిష్ఠించినపుడు అమ్మపేరు 'మంత్రిణి'. అమ్మకు మరియొక రథము కలదు. దానికి ఐదు కోణములు కలవు. దానిని అమ్మ అధిష్ఠించినపుడు అమ్మను 'ప్రాజ్ఞి' అందురు. ఈ మూడు చక్రములు మూడు లోకములవలె ప్రకాశించుచున్నవి. అందు ఉత్తమోత్తమమైనది శ్రీచక్రమని తెలియవలెను. వీని వివరణములు ముందు నామములతో యింకను తెలియబడును.



# 69. 'గేయచక్ర రథారూఢ మంత్రిణీ పరిసేవితా'

గేయ చక్రము అను రథము నధిరోహించిన శ్రీదేవి అని భావము.

శ్రీచక్రరాజము తొమ్మిది కోణములు లేక పర్వములు కలిగి యుండును. అది చక్రరాజము, దాని తర్వాతి చక్రమే గేయచక్రము. దాని కోణములు లేదా పర్వములు ఏడు అని తెలుపబడినవి. ఈ చక్రము నధిష్ఠించిన దేవత శ్యామల. ఈమె చుట్టును పరివేష్టితమై యుండు శక్తి మంత్రిణి. మంత్రిణి యనగా మంత్రశక్త్యానుభవము. సర్వమంత్రముల అనుభవము. శ్యామలాదేవిని ఉపాసించినచో సర్వమంత్ర సిద్ధి కలుగునని తంత్రశాస్త్రము తెలుపుచున్నది. శ్రీ చక్రము పరదేవతకి సంబంధించినది కాగ, గేయచక్రము పూర్ణమైన నేను అను భావమును ఎరుగచేయును. బ్రహ్మమునే నేను అని తెలియుట పూర్ణమైన నేను భావము. దీనిని 'బ్రహ్మై వాహం' (బ్రహ్మ ఏవ అహం) అందురు. అనగా పరతత్త్వ మున్నది, తా నున్నాడు. అదియే, తానుగ వున్నాడు అని తెలియుట. ఇది ఆత్మానుభవ స్థితి. ఇది పరాశక్తితో, బుద్ధిని అను సంధానము చేయుట వలన తెలియనగును. శ్రీ చక్ర స్థితియందు తాను పరతత్త్వమున ఇమిడిపోవును. గేయచక్ర స్థితియందు పరతత్త్వమే తానుగ నున్నట్లు యుండును. ఈ స్థితి తన యందలి ఏడు లోకముల స్వామిత్వమును ఎరిగిన స్థితి. అట్టివానిని యోగీశ్వరు దందురు. తొమ్మిది పర్వములను అధిష్ఠించిన స్థితి. యోగేశ్వర స్థితి. అమ్మ యోగేశ్వరి.

ఆమెయే శ్రీకృష్ణుడగుటచే అతనిని యోగేశ్వరుడు అందురు. యోగీశ్వరులకు స్వామియే యోగేశ్వరుడు. శ్రీ లలిత, శ్రీకృష్ణుడు ఒకటియే అని పెద్దల అనుభవము. అది శ్రీ చక్రరాజ స్థితి. "లలిత స్కంధము, కృష్ణమూలము" అని భాగవతమున తెలుపబడినది.

గేయచక్రము జీవుని ఈశ్వరస్థితి. పరమేశ్వరుడే జీవులయందీశ్వరుడుగ నున్నాడు. ఈ స్థితి యోగీశ్వరుని స్థితి. ఈ స్థితి యందు అమ్మను 'శ్యామల' అందురు. శ్రీరాముడు శ్యామలమూర్తి యని, శ్రీకృష్ణుడు లలితామూర్తియని తెలుపుటలో రహస్యమేమన శ్రీరాముడు పరిపూర్ణ మానవుడని, శ్రీకృష్ణుడు పరతత్త్వమని తెలియజేయుట.

గేయచక్రము సవితృమండల చక్రముకాగ, శ్రీచక్రము దానికిని ఆధారభూతమగు చక్రము.



# 70. 'కిరిచక్ర రథారూఢ దండనాథ పురస్కృతా'

**కి**రి యనగా వరాహము. వరాహముచే లాగబడు చక్రములు గల రథము అని కిరిచక్రమును తెలియవలెను. ఈ రథమునందు 'వారాహి' అను దేవి దండమును ధరించి యుండును. ఆమెచే అమ్మ పూజింపబడుచున్నది.

'కిరయః' అనగా కిరణములు అని అర్థము. అనగా ఈ చక్రము నుండి కిరణము లుద్భవించును. ఈ చక్రమునకు ఐదు కోణములు లేక ఐదు పర్వములు. దీని నధిష్ఠించిన అమ్మను 'ప్రాజ్ఞి' యందురు. ప్రాజ్ఞి అనగా ప్రకటింపబడిన జ్ఞానము. గేయచక్రమున ఆత్మ తత్త్వము అనుభవైకమేగాని ప్రకటితము కాదు. అది అప్రకటితము. దానికిని మూలము శ్రీచక్రము. కిరిచక్రము ప్రకటితము అనగా కనపడునది. దీనికి ఐదు కోణములు. ఐదు పర్వములు అనగా పంచభూతాత్మక సృష్టి. గ్రహగోళాది సూర్యమండల చక్రము. కిరణములు ప్రకటితములు. ఇది బుద్ధిలోక స్థితి. సూర్యుడు బుద్ధిలోకముగను, సవిత ఆత్మ లోకముగను, ఆదిత్యుడు పరమాత్మ లోకముగను తెలియనగును. 'ఆదిత్యః సవితః సూర్యః' అని ఈ మూడు స్థితులను తెలుపుదురు. వారి పరిధులే చక్రములు లేక రథములు. శ్రీ విద్యయందు వీరిని లలిత, పరదేవత, శ్యామల, ప్రాజ్ఞి యందురు. వైష్ణవమున నారాయణ, వాసుదేవ, విష్ణువు అందురు. శైవమున పరమశివ, సదాశివ, ఈశ్వర (శివ) అందురు.

బుద్ధి స్థితినుండి చిత్తము, ఇంద్రియములు శరీర స్థితికి ఈ చక్రమున చ్యుతిని చెందుట యుండును, అనగా జారుట యుండును జారినవాడు ఈ చక్రమున బంధింపబడును. బంధింపబడినవాడు, ఉద్ధరింపబడవలెను. ఉద్ధరించు తత్త్వము వరాహ తత్త్వము. వరాహావతారము మునిగిపోవుచున్న భూమి నుద్ధరించినది. వారాహి అనుదేవత మునిగిపోవుచున్న జీవులను ఉద్ధరించుటకై ఈ చక్రము నధిష్ఠించి యుండును. అవసరమైనచో ఆమె దండించుట కూడ చేయును. అందుచేత 'దండనాథ' అను శక్తిచే సేవింపబడుచున్నది.

ఈ పై మూడు చక్రములు *'త్రినాభిచక్రం అజరం అనర్వం'* అని వేదములందు కీర్తింపబడినవి. ఈ మూడు చక్రములు లేక రథములు త్రిపురసుందరి యొక్క త్రిభువనములు. వీనిని గడియారములో గంటల చక్రము, నిమిషముల చక్రము, సెకనుల చక్రములుగ కూడ ఉదహరింతురు. ఇందు మూడవ చక్రము తిరుగుట కనపడును. రెండవ చక్రము అనుభవైకము. మొదటది తదతీతము.



# 71. 'జ్వాలామాలినికాక్షిప్తవహ్ని ప్రాకారమధ్యగా'

శ్రీదేవి చుట్టునూ, అగ్నిమయ ప్రాకారము నిర్మింపబడి యుండును. దాని మధ్యమున శ్రీదేవి యుండును. శ్రీదేవి అగ్నిరూపము కాగ ఆమె నుండి విస్తృతమైన అగ్నిజ్వాలలు వంద యోజనముల విస్తీర్ణము కలిగి, ముప్పది యోజనముల ఎత్తు కలిగి, ఆమె చుట్టునూ ప్రాకారములవలె ఏర్పడినవని బ్రహ్మాండ పురాణమునందు, జ్వాలా మాలిని గూర్చి తెలుపబడినది.

చతుర్దశి తిథిని 'జ్వాలామాలిని' యందురు. ఈమె నుండి ఉద్భవించిన జ్వాలలు లోకసృష్టికి ఆధారభూతములు. అమ్మ నారాధించుచు, జ్ఞానమున పెరుగువాడు. అజ్ఞానాంధకారమును ఈ జ్వాలలచే నశింపచేసుకొనును. జ్వాలల మధ్యలోనున్న అమ్మను జ్వాలలు స్పృశించలేవు. అట్లే జ్ఞాని సృష్టి మధ్యలోనున్నను సృష్టి వికారములు జ్ఞానికి వికారములు కలిగించవు. అతడు నిర్వికారిగనే యుండును. అతడు జ్ఞానాగ్నిరూపకుడై అమ్మ సాన్నిధ్యమున నుండగ సృష్టిజ్వాలలు, సృష్టి అతని నంటవు.

జ్వాలామాలినికలు శక్తి త్రికోణములు. అవి ఐదు. వానియందు బిందు రూపమున దేవి యున్నది.

# 72. 'భండసైన్య వధోద్యుక్త శక్తి విక్రమహర్షితా'

**భం**డసైన్యమును వధించుట కుద్యుక్తమైన శక్తుల విక్రమమును చూచి హర్షించుదానా అని అర్థము.

భండు డనగ జీవుడు. జీవునియందు ద్వైత వృత్తులుండును. అవియే ద్వంద్వములు. ఈ ద్వైత వృత్తులను ఆధారముగ జీవుడు సృష్టి యందు జీవనము సాగించుచుండును. రాత్రి-పగలు, మంచి-చెడు, సుగుణము-దుర్గుణము, కుడి-ఎడమ, ఉత్తమము-నీచము, సరి-బేసి, ఆడ-మగ, సుఖము-దుఃఖము, లాభము-నష్టము, జయము-అపజయము. ఇట్లు ద్వంద్వములు మహా సైన్యమువలె యుండి జీవుని బంధించి వేయును. జీవితము అటునిటు లాగబడుచు సాగుచుండును.

ద్వంద్వములు నశించిననేగాని, జీవునికి శాంతి లేదు. అతని యందు కూడ జీవాత్మ భావము-దేహాత్మ భావము, బుద్ధి-మనస్సు, అంతఃకరణములు-బహిఃకరణములు, పశుప్రవృత్తి-పతిప్రవృత్తిగా ద్వందములు భాసించు చుండును.

వీనిని నశింపచేయవలె నన్నచో భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగము అను విద్యలను ఆశ్రయించవలెను. అట్లాశ్రయించినచో క్రమశః జీవుడు ద్వంద్వములను దాటగలడు. ఈ విద్యలు జీవుని ద్వంద్వములను దాటించుచుండగ అమ్మ చూచి ఆనందించునట. అందుచేత ద్వంద్వము లను నశింపచేయు శక్తులున్నచో అమ్మకానందము. ద్వైత శక్తులకు మనస్సు కారణము. అద్వైత శక్తులకు జ్ఞానము కారణము. జ్ఞాన శక్తులే అమ్మకు ఆనంద దాయకములు. జ్ఞానము పొందుతున్న జీవులను చూచి వృద్ధిచెందుచున్న పిల్లలవలె భావించుచు అమ్మ హర్షించును. ఈ అద్వైత శక్తులను 'నకులి' శక్తులందురు.

# 73. 'నిత్యా పరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా'

నిత్యాదేవి యొక్క పరాక్రమ ఆటోపమును చూచుటకు అత్యంత ఉత్సాహముతో కూడినదానా !

నిత్యాదేవి చతుర్దశి తిథి దేవతగ తెలిపితిమి. అటుపైనది పౌర్ణమియే. పౌర్ణమి తిథియనగా పూర్ణత్వమే లేక శ్రీ దేవియే. అమావాస్య నుండి చతుర్దశి వరకు చంద్రకాంతి పెరుగుచు నుండగ, పూర్ణిమ యగు అమ్మవారు, ఆ పెరుగుదలను ఉత్సాహముతో గమనించుచు నిరీక్షించి యుండును. పదునైదు తిథులకు గల కాంతులు, పదిహేను సేనలుగ తంత్రరాజము నందు పేర్కొనిరి. ఈ సేనలు విస్తారమగు పరాక్రమము కలవిగ అందు తెలుపబడినవి. ఈ సేనలకన్నిటికిని నిత్యాదేవి నాయిక. ఈ సేనల శక్తులన్నియు ఆత్మశక్తులు. ఆత్మశక్తులు వృద్ధి పొందుచుండగ జీవుడు దైవమునకు చేరువగుచున్నాడు. అట్టి ఆత్మశక్తుల కోలాహలమును అమ్మ ప్రోత్సహించు చుండును. ఉత్సు కతతో వాని వృద్ధిని గమనించుచుండును.

నిత్య యను దేవత, సృష్టియందలి నిత్యత్వమునకు సంకేతము. అనిత్యమగు విషయముల యందు అనురక్తిని నిత్యవిషయైక జ్ఞానము ద్వారా నశింపచేసుకొన వచ్చును.

# 74. 'భండపుత్రవధోద్యుక్త బాలా విక్రమనందితా'

**భం**డుని లలితాదేవి తన శక్తిసేనలతో కలిసి వధించగా భండ పుత్రులను ఆమె పుత్రికయైన బాల విక్రమించి సంహరించినది.

భండ పుత్రులను వధించిన బాల విక్రమమును చూచి ఆనందించునది అని పై నామమునకు అర్థము.

భండాసురుని లలితాదేవి సంహరించగ అతని పుత్రులు ముప్పదిమంది దేవతలపై దండెత్తిరి. అపుడు లలితాదేవి కుమార్తెయైన బాల ముప్పదిమంది అసురులను సంహరించినది. ఆ మహా యుద్ధమున బాల పరాక్రమమును గమనించి లలితాదేవి ప్రీతి చెందినది అని సామాన్య అర్థము.

'బాల' అనగా అమ్మ యొక్క విమర్శనా శక్తి. భండ పుత్రులందరు బంధన హేతువులు. పంచేంద్రియముల ద్వారా బహిరంగమున సృష్టిని అనుభూతి చెందుచున్న జీవునికి అమ్మ ఆకర్షణలు అమితముగ నుండును. సృష్టి ఆకర్షణమునకు లోనైనవారు బంధముల చిక్కుకుందురు. రకరకముల జీవులు సృష్టియందు ఇట్లు చిక్కుకొనుట చేతనే దివ్య జీవనమును కోల్పోయినారు. బంధములు తొలగవలె నన్నను, యికపై కలుగ రాదనుకొన్నను జీవు డాశ్రయించవలసినది శ్రీ బాలనే. శ్రీ బాల అమ్మవారి శిశురూపము. ఐదేండ్ల శిశువును బాల, లేక బాలుడు

అందురు. బాలకృష్ణుని ఆరాధన, ఐదేండ్ల కుమారస్వామి ఆరాధన శ్రీ బాల ఆరాధన యొక్కటియే.

జీవునికి ఐదేండ్ల వయస్సు వచ్చిన దగ్గరనుండి అతనికి విచక్షణా శక్తి నందించవలెను. యింద్రియము లన్నియు రుద్రుని వశమున నుండుటచే పదకొండు సంవత్సరముల పాటు ఈ శిక్షణను శ్రద్ధతో నిర్వర్తించుకొన్న జీవుడు ప్రౌఢ యగును. అనగా 16 సం॥ల వాడగును. అంతవరకును వలసిన శిక్షణ విచక్షణయే. ఈ విచక్షణ బాల నారాధించి నచో కలుగును. లేక బాలకృష్ణుడు, కుమారి అయినను కావచ్చును. ఇట్లు చిన్నతనముననే విచక్షణను, విమర్శించుకొను శక్తిని అమ్మ అనుగ్రహముగ పొందినవారు బంధములకు లోనుగారు. అనగా భండ పుత్రులు వారి నేమియు చేయరు. అమ్మ బాలారూపము నిట్లు అవగాహన చేసుకొని ఆరాధించి జితేంద్రియత్వమును పొందుట ఋషులందించిన మార్గము. అట్లు జితేంద్రియులైన వారిని చూచి కూడ అమ్మ ఆనందము చెందును. అదియును బాలా విక్రమమే. జీవుని యందు బాల విక్ర మించినదని అర్థము.



# 75. 'మంత్రిణ్యంబావిరచిత విషంగ వధతోషితా'

విషంగుని మంత్రిణ్యంబ వధించిన తీరును చూచి సంతోషించిన అమ్మవారని అర్థము.

విషంగుడు, విశుక్రుడు అను ఇద్దరసురులు భండుని ఎడమ కుడి భుజములనుండి పుట్టిరి. వీరు సృష్టియందలి ద్వంద్వములందు చిక్కినవారు. సృష్టియందు బంధితు లగుచున్నారు. బంధ మజ్ఞాన వశమున కలుగును. అజ్ఞానమే అసురత్వము.

పాపము-పుణ్యము, దుఃఖము- సంతోషము, అసౌకర్యము-సౌకర్యము, నష్టము-లాభము, మరణము-జననము, దరిద్ర్యము-సంపద. ఇట్లెన్నో ద్వంద్వములు కలవు. ఈ జంటల యందు మొదటిది దుఃఖహేతువు. అదియే ఎడమ భుజమందలి అజ్ఞానము. అజ్ఞాన పూరిత మైన ఎడమ భుజము విషంగుడని బ్రహ్మాపురాణము తెలుపుచున్నది.

ద్వంద్వములు మిథునరాశి ప్రభావము కలిగినవి. మిథునము కవలలకు సంకేతము. పై ద్వంద్వములే కవలలు. అందు ఎడమ తత్త్వము వామాచారము. దుఃఖహేతువు. అది జీవునియందు నశించవలె నన్నచో శ్రీ లలితాదేవిని మంత్రిణీ స్వరూపముగ ఆరాధింపవలెను. ముందు నామములలో మంత్రిణి యనగా శ్యామలాదేవి అని తెలిపి యుంటిమి. శ్యామలాదేవి బుద్ధి లోకమున మంత్ర మాధారముగా సేవించబడుచు నుండును. ద్వంద్వాతీత స్థితిని పొందవలె నన్నచో

భ్రూమధ్యమున గురుముఖమున పొందిన మంత్రమును మననము చేయుచు అమ్మ ఆరాధన కొనసాగవలెను. శ్యామల మానవ దేహ మందలి విషపూరితమగు భావములను కోరికలను, చేష్టలను, మాటలను హరింపగల శక్తి కలది. శ్రీ కాళిదాసు విరచిత 'శ్యామలా దండకము' ప్రతినిత్యము భక్తితో పఠించుచు అమ్మ దివ్యరూపమును, భ్రూమధ్య మున దర్శించు ప్రయత్నము చేయువారి యందు విషంగుడు మరణించ గలడు. అందుచే శ్యామల ఆరాధ్య దైవము. ఆమె సర్వ మంత్రములకు మూలము. ఆమె శ్రీచక్ర బిందువు చుట్టును. ఉండు మొదటి త్రికోణము. విషంగుని వధించిన అట్టి శ్యామలా మూర్తిని చూచి అమ్మ తుష్టి చెందినదని అర్థము.

శ్యామలాదేవి గేయచక్రమను రథమును ఎక్కిన అమ్మను ఆరాధించు చుండునని, శ్యామల అనుగ్రహము పొందినవారు ఆత్మ సాక్షాత్కారమును పొందుటకు అర్హత కలిగియుందురని కూడ గుర్తింపవలెను. ఆమెయే 'త్రిపురశక్తి.'



# 76. 'విశుక్రప్రాణహరణ వారాహీ వీర్యనందితా'

విశుక్రుడను రాక్షసుని ప్రాణములను హరించిన వారాహీ దేవి యొక్క పరాక్రమమునకు సంతసించిన దేవి అని అర్థము.

విశుక్రుడు కూడ భండాసురుని సోదరుడు. ఇతడు భండాసురుని కుడిభుజ శిరస్సునుండి పుట్టెను. ఇతడు దైత్యసేనకు రక్షకుడు. రాక్షస గురువైన శుక్రాచార్యునితో సమానుడు. ముందు నామమున తెలిపిన ద్వంద్వములలో ఇతడు రెండవవాడు. మంచిని, సుఖమును, లాభమును, ధనమును, ఇత్యాది విషయములందాసక్తి, దానికి వ్యతిరేక మగు గుణములందు విపరీతమగు ద్వేషము కలవాడు.

ధర్మపరులుగనుండవచ్చును. అంతమాత్రమున అధర్మ పరులను ద్వేషింపనవసరములేదు. ధనముండ వచ్చును. అంత మాత్రమున దరిద్రులను ద్వేషింపపనిలేదు. క్రమశిక్షణ ఉండవచ్చును. కాని అది లేనివారిని హీనముగ చూచుట తగదు. పుణ్యకార్యములు చేయవచ్చును. అంతమాత్రమున పాపులను చూచి అసహ్యించుకొనుట తగదు. జ్ఞాన ముండ వచ్చును. అంత మాత్రమున అజ్ఞానులను నీచముగ చూడవలసిన పనిలేదు. ఆస్తికులుగ నుండవచ్చును. అంతమాత్రమున, నాస్తికుల ద్వేషింప బనిలేదు. ఇట్లు జీవించువారు మంచిచెడుల పోరాటమున శాశ్వతముగ బంధింప బడుదురు.

దేవదానవుల యుద్ధము ద్వంద్వములకు లోబడిన యుద్ధమే. అందరును అమ్మబిడ్డలే. అమ్మకందరును ప్రియులే. సన్మార్గముల

యందున్న వారియందు, దుర్మార్గమున నున్న వారియందు ఒకే అంతర్యామి తత్త్వమున్నది. ఈశ్వరుడు, మంచిచెడులతో సంబంధము లేక అందరి హృదయము లందున్నాడు. యోగులొక్కరే దీనిని గమనించి అందరిని ప్రేమింతురు. అందరియందు సమభావము కలిగి యుందురు. నారదుడు, సనక సనందనాదు లట్టివారు. సద్గురు పరంపర కూడ యట్టిదే. వారు అజ్ఞానులు జ్ఞానులు కావలెనని, జ్ఞానులు ముముక్షువులు కావలెనని కోరుదురు. తమకు నచ్చనివారు నశించవలెనన్న భావము వారి కుండదు. అందరును బాగుండవలెనని యుండును. అది యోగుల ప్రత్యేకత. సద్గురువుల ప్రత్యేకత. వారు దైవమునకు (దేవికి) ప్రతీకలు. వారు సృష్టిలోని అన్ని లోకములందు జీవుల ఉద్ధారణమునకై ప్రయత్నింతురు.

విశుక్రుడు ధర్మమున యుండి అధర్మమును ద్వేషించువాడు. అందువలన అతడు కుడిభుజమున యున్న శిరస్సునుండి పుట్టినవాడని తెలుపబడినది. విషంగుడు ఎడమ భుజపు శిరస్సునుండి పుట్టినవాడు. అతడు అధర్మమున నుండి ధర్మమును ద్వేషించినవాడు. వీరిరువురును ద్వంద్వములందు చిక్కినవారే. బంగారు పంజరమున చిక్కినను తుప్పు పట్టిన ఇనుప పంజరమున చిక్కినను, రెండునూ పంజరములే కదా! పక్షి కది బంధనమే కదా! ఈ రహస్యము తెలియనివారే ఆస్తికులు కూడ. ఆస్తికులు దుష్టులను ద్వేషించుట తగని పని. కావున విశుక్రునికి కూడ బంధమోచన ఆవశ్యకత యున్నది.

ఇతడిని వధించినది వారాహీ దేవి. వారాహీ దేవి, కిరిచక్రమును అదిష్ఠించి యుండునని ముందు తెలుపబడినది. ఈమె హస్తమున

దండము వుండుటచే 'దండిని' అనియు, 'దండనాథా' అనియు తెలియ బడుచున్నది. ఈమె రథమున కొక ప్రత్యేకత కలదు. ఈ రథ మెక్కిన వానిని యముడు కూడ స్పృశించలేడు. అనగా జీవుడు జనన మరణము లను ద్వంద్వములను దాటించు రథమే కిరిచక్రమని తెలియవలెను. ఇట్లు వరాహమువలె జీవుల నుద్ధరించు దేవిని 'వారాహీ' యందురు. ఆమెచే విశుక్రుడు వధింపబడుట శుభదాయకము.

భండాసురు డహంకార ప్రజ్ఞకాగ, అతని ఎడమ భుజమగు విషంగుడు అహంకారుని అధర్మ ప్రవర్తనము. విషంగుడు అహంకారుని ధర్మ ప్రవర్తనము. గేయచక్రము నెక్కిన శ్యామల విషంగుని వధించుట అజ్ఞానము నుండి జ్ఞానమున కుద్ధరించుట. కాళిదాసుని అట్లే యుద్ధ రించెను. కిరిచక్ర మెక్కిన వారాహి ధర్మాధర్మముల కతీతమగు శాశ్వత సత్యమందు జీవుని చేర్చును. ధర్మపరులైనను అహంకారము దాటిన వారు కారు కదా! మంచి వారి యందుకూడ అహంకార మున్నది. అహంకారము ఉన్నంత కాలము ద్వంద్వము లున్నవి. అవి మెడకు రెండు భుజముల వంటివి. రెండింటి నుంచి జీవుని ఉద్ధరించుచున్న శ్యామల, వారాహి శక్తుల నైపుణ్యమునకు అమ్మ ఆనందించు చున్నదని అర్థము.



# 77. 'కామేశ్వరముఖాలోక కల్పిత శ్రీగణేశ్వరా'

**కా**మేశ్వరుని ముఖమును చూచుట తోడనే శ్రీ మహా గణపతిని పుట్టించినదానా! అని అర్థము.

సృష్టి నిర్మాణమున కలుగుచున్న విఘ్నములకు దేవతలు చాలా బాధ పడుచుండగ, అసుర శక్తులచే బంధింపబడుతుండగ, వారి అవస్థను చూచి శ్రీ లలితాదేవి కామేశ్వరుని ముఖమువైపు కడకంటి చూపుతో చూచినదట. దంతపంక్తి కొంత కనపడునట్లు కొంత చిరునవ్వు నవ్వినదట. ఆ చిరునవ్వు నుండి మహాకాంతులు పుట్టినవట. శివుని కనుచూపు తన కనుచూపుతో కలియుటచే ఆమెకి కలిగిన చిరునవ్వు కాంతుల నుండి ఏనుగు రూపముగల ఒక దేవత ఉద్భవించెనట. అతడే మహాగణపతి. ఈ మహాగణపతి అటుపైన పార్వతీదేవి సృష్టించిన వినాయకుడు ఒకరు కారని తెలియవలెను. వినాయకుడు పార్వతీదేవిచే సృష్టి చేయబడి శక్తిస్వరూపుడై శివు నెదిరించి, శివుని అనుగ్రహము ద్వారా గజాననుడైనవాడు.

మహాగణపతి, పరమశివుని ప్రేమతో కూడిన వెన్నెలలచే అమ్మవారి కనుల చేరి అటుపైన అమ్మవారి నవ్వునుండి వ్యక్తమైనవాడు. ఇతడు సకల మంత్రస్వరూపుడు 28 అక్షరములు గల మంత్ర స్వరూపుడై భాసించువాడు నలుగుపిండి నుండి పుట్టిన వినాయకుడు ఇతని అంశ. శ్రీ లలిత పరాప్రకృతి, శివుడు పరమాత్మకాగ వారి నుండి పుట్టినవాడు

మహాగణపతి. త్రిశక్తులలో ఒకరైన పార్వతికి, త్రిమూర్తులలో ఒకరైన శివునికి జన్మించినవాడు వినాయకుడు. పార్వతీదేవి శ్రీ లలిత అంశ. శివుడు త్రిమూర్తులలో ఒకడు అనగా కామేశ్వరుని అంశ. అట్లే వినాయకుడు కూడ గణపతి అంశ.

దేవతలు త్రిగుణముల నుండి పుట్టినవారు. అందువలన వారికి అహంకారము తప్పదు. అహంకారముతో, అభిమానముతో దేవతలు సృష్టి చేయుచుండగ విఘ్నములు తప్పవు. అహంకార మున్నచోట అజ్ఞానము కూడ ఉండును. అజ్ఞానమే విఘ్నములకు కారణము అహంకారము పుట్టినప్పుడే అసురత్వము కూడ జీవులలో పుట్టును. నిరహంకారికి అజ్ఞాన ముండుట కవకాశ ముండదు. కావున విఘ్నము లుండవు.

మహాగణపతి నిరహంకారియగు దేవత, అందువలన అతనికి విఘ్నములు లేవు. అతని నారాధించుట వలన ఆరాధకునిలో అహంకా రము నశించుట ఫలము. నిరంహకారి అగుటచే విఘ్నము లుండవు. అట్టి మహాగణపతికి మాతృమూర్తి శ్రీ లలిత.



# 78. 'మహాగణేశనిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా'

**వి**ఘ్న యంత్రమును ఛిన్నాభిన్నము చేసిన మహాగణేశుని చూచి సంతసించిన దేవి అని అర్థము లేక మహాగణేశునిచే నిశ్శేషముగ నాశనము చేయబడిన విఘ్న యంత్రమును చూచి సంతోషించినది.

సృష్టి యంత్రము నిర్మాణము చేసినది అమ్మయే. తాను మూల ప్రకృతి. తన నుండి త్రిగుణములు త్రిశక్తులుగ పుట్టి అష్ట ప్రకృతుల నేర్పరచినది. అష్టప్రకృతులు అష్టపురములు. అవి అష్టసిద్ధులు. అష్టైశ్వర్య ములు అనుభూతిని కలిగించగల దివ్య లోకములు. కాని అజ్ఞానము కలిగినప్పుడు అవే అష్టప్రకృతులు కారణముగ అష్టకష్టములు, అష్టదరిద్ర ములు ఏర్పడగలవు. జీవులను సృష్టించి లోకములందు ప్రవేశ పెట్టి నపుడు అమ్మ వాత్సల్యముతో స్వతంత్రము నిచ్చినది. స్వతంత్ర మొక బాధ్యత. దానిని బాధ్యతా యుతముగ నిర్వర్తించుకొనని వారు అజ్ఞాన మున పడి బద్ధులగుదురు.

ఇట్లు అష్టప్రకృతులు దివ్యానుభూతికే నిర్మాణము కాబడినను, అజ్ఞానవశమున అవి అష్టబంధములగును. అట్టి బద్ధచేతన గల జీవులకు అష్టబంధములు, అష్టవిఘ్నము లేర్పడును. ఇట్లు అష్ట ప్రకృతులకు సంబంధించి అష్టపురముల యందు విఘ్నము లేర్పరచు ప్రజ్ఞ యొకటి యున్నది. ఇదియే విఘ్నయంత్రము. పురోగతి చెందుచున్న జీవులకు వారియందలి అజ్ఞానమే వారికి విఘ్నములు కలిగించును. తమయందలి అజ్ఞానము అహంకారమును, బుద్ధిని, చిత్తమును పంచేంద్రియములను ఆవరించి యుండును. ఇవియే మానవునందలి అష్టప్రకృతులు లేక

అష్టపురములు. వీనియందలి అజ్ఞాన రూపమున ఎనిమిది స్థానములలో విఘ్నముల ప్రణాళిక యున్నది. దీనినొక యంత్రముగ ఏర్పరచినవాడు విశుక్రుడు. విశుక్రుడు శుక్రాచార్యుని ప్రతీక. ఏ లోకము నుండి తరింప వలెనన్నను ఆ లోకపు టజ్ఞానము నశింపవలెను కదా! అందులకే అతడు జీవులలోని అష్ట ప్రకృతులలో గల అజ్ఞానమును బట్టి విఘ్నము లేర్పరచెను.

విఘ్నములను తొలగింపచేయు దేవత మహాగణపతి. అహంకా రము వరకు గల అజ్ఞానమును అతడే నశింప జేయగలడు. శివతేజమైన కుమారస్వామి యొక్క అహంకారమును కూడ అతడే నేర్పుతో, ప్రేమతో నశింపచేసి సుబ్రహ్మణ్యుని తీర్చి దిద్దెను. కావున మనయందలి అష్టప్రకృతులలో గల అజ్ఞానము నశింపచేయుటకే మహాగణపతి యున్నాడని భావించి అతని అనుగ్రహము కొఱకై ప్రతినిత్యము అతనిని పూజింపవలెను. మహాగణపతి ఆరాధనమున బుద్ధి సిద్ధి కలిగి అజ్ఞాన ప్రతీకలైన విఘ్నములను పరిష్కరించుకొనవచ్చును. ఇట్లు నిత్యము గణపతి జీవుల నుద్ధరించుచునే యున్నాడు. జీవుల యందలి విఘ్న యంత్రములను అతడే నశింప చేయగలడు. ఇట్లు జీవోద్ధరణ కార్యక్రమమున నిమగ్నుడైన మహాగణపతి అనిన అమ్మకు చాల ప్రీతి అతని యెడల ఆమె ఎల్లప్పుడునూ ప్రసన్నయే.

పూర్వము దేవత లహంకరించినపుడు వారిపైన కూడ విశుక్రుని విఘ్నయంత్ర ప్రభావము పడెను. ఆ యంత్రముచే వారు బంధింపబడిరి. వారపుడు మహాగణపతిని ప్రార్థింపగ అతను ప్రసన్నుడై ఆ విఘ్న యంత్రమును ఛిన్నాభిన్నము చేసెను. అహంకారము కల చోట విఘ్న యంత్ర ముండును. ఇక మిగిలిన బుద్ధి, చిత్తము, మనస్సుల విషయము చెప్పనేల?

# 79. 'భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్రవర్షిణీ'

**భం**డాసురునిచే వదలబడిన అస్త్రములకు ప్రత్యస్త్రములను వర్షింపచేసిన దేవి అని అర్థము.

భండాసురుడు అహంకార ప్రజ్ఞయని యిదివరకే తెలిపి యుంటిమి. అహంకార మాధారముగనే జీవుడు తానొకడు ప్రత్యేకముగ నున్నాడని గుర్తించును. ఇతనిని ప్రత్యగాత్మ యందురు. తా నున్నాడు గనుక, తనకితరములు గోచరించుచుండును. అప్పుడు వాటి ననుభూతి చెందవచ్చును. అనుభూతి చెందు ప్రయత్నమున వానిని పొందు ప్రయత్నము కూడ నుండును. అట్టి సమయమున అతనికి స్వార్థ చింత పెరుగును. ఆ స్వార్థమే అతనికి అనర్ధ కారణము. సృష్టి యజ్ఞార్థమే కాని స్వార్థము కాదు. యజ్ఞార్థ సృష్టియందు ఇతరుల శ్రేయస్సు కొరకు పనిచేయుచున్నచో తన శ్రేయస్సుకూడ జీవునకు లభించును. ఇది తెలియక తన కోసము పనిచేసుకొనుటయే మొదటి అజ్ఞానము. ఇది కారణముగ జీవుడు రకరకముల అత్యాచారములు కూడ చేయును. దైవమిచ్చిన బుద్ధిని, బలమును దుర్వినియోగము చేయును. అట్టివాడు సృష్టి కంటకుడు కూడ కావచ్చును. అట్టివాడు చేయు తలపులు పనులే అస్త్రములు.

అస్త్రములు వేరు, బాణములు వేరు. బాణములు ధనస్సు నుండి వదలబడినవి. అస్త్రములు హస్తముల నుండి వదలబడినవి. మనసున

సంకల్పించి చేతితో వదలునది అస్త్రము. మంత్రించి వదలినచో శస్త్రము. ఇట్లు అస్త్ర శస్త్రములను వదలు అహంకారులను నిర్జించవలెను కదా! నిర్జించనిచో సృష్టికే ముప్పు. అందుచే అవసరమైనపుడెల్ల వీనికి ప్రత్యస్త్రములు సృష్టించి వదలవలసిన ఆవశ్యకత కలుగును.

ప్రత్యస్త్రములు సృష్టించుటలో అమ్మ దిట్ట. లోకములను కల్లోలితము చేయు అహంకారులు జన్మించినపుడు త్రిమూర్తులు సైతము వారిని నిర్జించలేని సమయమున అమ్మ వినూత్నమైన రూపమును ధరించి, వినూత్నమగు ప్రత్యస్త్రములు వర్షింపచేసి అహంకారులను నశింపచేసిన సందర్భము లెన్నియో గలవు. మన యందలి అహంకారము నుండి ఎన్నియో దురాలోచనలు, దుర్భాషణములు, చేతలు కలుగుచుండెను. వానిని నిర్మూలించమని అమ్మను ప్రార్థించుటకే ఈ నామము. సృష్టి అహంకార స్వరూపమైన భండాసురునే సంహరించగల అమ్మకు, మనబోటి వారి అహంకారమును జయించుట ఒక లెక్కా? అమ్మను నిజముగ ఆరాధించు వారికి అహంకారము పరిపూర్ణముగ నశించును.



# 80. 'కరాంగుళి నఖోత్పన్న నారాయణ దశాకృతిః'

**కు**డి ఎడమ హస్తముల పదివేళ్ళ గోళ్ళనుండి పుట్టిన నారాయణుని దశావతారములు గలది అని అర్థము లేక జీవేశ్వరుల దశావస్థలు సృష్టి ఆకృతిగా కలది అని అర్థము.

సృష్టి అహంకారమైన భండాసురుడు తాత్కాలికముగ లలితాదేవిచే సంహరింపబడినను సృష్టి యున్నంత కాలము అహంకార ప్రజ్ఞ ఒక సూత్రముగ నున్నది. ఒక సృష్టి ధర్మముగ నున్నది. అది కాలమును, దేశమును బట్టి విజృంభించుచుండును. భండాసుర తత్త్వము అపుడపు డుద్భవించుచుండును. సృష్టికి విపత్తులు కలుగుచునే యుండును. భండాసురుడు అసురశక్తి ప్రతీక. అందువల్లనే అతడును వివిధావతార ములు ఎత్తుచుండును. అట్టి అహంకారశక్తిని సంహరించుటకు లలితా దేవి చేతి గోళ్ళనుండి నారాయణ తత్త్వము అవతరించుచుండును. ఈ సృష్టి మొత్తమును అమ్మకు, భండాసురునికి మధ్య జరుగుచున్న యుద్ధక్రీడగా భావించవచ్చును.

అహంకార ప్రజ్ఞ అమ్మ సంకల్పితమే. దాని నివారణము ఆమె సంకల్పమే. భండాసురుడు, సోమకుడు, హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు, రావణుడు, కుంభకర్ణుడు, శిశుపాలుడు, దంతవక్త్రుడు, కాలయవనుడు వంటి రూపములు ధరించి సృష్టిని కల్లోలితము చేయుచుండును. అమ్మ చేతి గోళ్ళనుండి పుట్టిన నారాయణుడు మత్స్య, కూర్మ, రామ, కృష్ణాది దశావతారములను ధరించు చుండును.

ముందు నామమున భండాసురుడు అహంకారాది అస్త్రములను సంధించుచుండగ, అమ్మ వానిని నిర్జించి నిర్మూలించు ప్రత్యస్త్రములను కురిపించుచున్నది అని తెలుపబడినది. దాని ఉదాహరణమే ఈ నామము. భండాసురుడు సర్వ అసురాస్త్రము. దానికి విరుగుడు అమ్మ నారాయణాస్త్రము. అమ్మ నుండియే నారాయణుడు అవసరమైనపుడెల్ల దిగి వచ్చును. అహంకారమునుండి రక్షించును. అహంకారులకు పరిష్కారము నారాయణ మంత్రమే. అది అమ్మ అనుగ్రహముగ పనిచేయును.

దైవమే జీవుడగుటకు పది స్థితులుగ ఏర్పడుచున్నవి. ఇవి దేవుని పది అవస్థలు. దైవము, జీవుడు, అహంకారము, బుద్ధి, పంచేంద్రియములు, మూలప్రకృతి. ఈ పది అవస్థలు నారాయణుని దశావతారములు. అవి అమ్మనుండే ఏర్పడును. దైవము సృష్టిగ మారుటకు, జీవు లుద్భవించుటకు అమ్మయే కారణము. మరల జీవులు, సృష్టి దైవమును చేరుటకు అమ్మయే మూలము. భండాసురుడు అమ్మ అవరోహణ మార్గమునకు చెందినవాడు. నారాయణుడు ఆరోహణ మార్గమునకు చెందినవాడు. సృష్టించుటకు భండాసురుని, ఉద్ధరించుటకు నారాయణుని తన రెండు అస్త్రములుగ (శక్తులుగ) అమ్మయే నిర్వర్తించుచున్నది. పది స్థితులలో సృష్టి నేర్పరచుట పది విధములుగ సృష్టిని ఉద్ధరించుట. ఇదియే అమ్మ మండలాకృతి. దశాకృతి. ఈ నామము అత్యంత గంభీరమగు నామము.

# 81. 'మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసురసైనికా'

మహా పాశుపతాస్త్రము యొక్క అగ్నిచే అసుర సైన్యమును నిశ్శేషముగ దగ్ధ మొనర్చునది శ్రీదేవి యని అర్థము. అసుర సైన్యమనగా అజ్ఞానపు చేష్టలు. మానవుని యందు అనేకానేక అజ్ఞానపు చేష్టలు తరచు తలయెత్తు చుండును. పాంచభౌతిక సృష్టియందు శరీరధారణ అయిన మానవుడు అజ్ఞానమునకు లోనగుట సహజము. పరిసరము లందలి జీవుల ప్రవృత్తులు ఎక్కువ అజ్ఞాన పూరితములేగాన జ్ఞానవంతులు సైతము అజ్ఞానమున పడుట జరుగుచుండును. పశువులనగా తమ యందు కలిగిన అజ్ఞానముచే బంధింపబడినవారు. బహిః ప్రపంచమునే చూడ గలిగిన కన్నులు కలవారు. లోదృష్టి లేనివారు. బైటికి మాత్రమే చూచువారు.

ఇట్టి జీవులలోన ఈశ్వరుడున్నాడు కదా! అతడే పశుపతి. అతని నాశ్రయించిన జీవుడు అజ్ఞానమున బడడు. "సర్వజీవుల హృదయములో నున్న ఈశ్వరుని ఆశ్రయించని జీవులు మాయ యను యంత్రము నెక్కి సృష్టియందు పరిభ్రమించుచున్నారు" అని కృష్ణుడు గీతలో బోధించెను. హృదయమునందు ఈశ్వరుని ఆశ్రయించని వారి వృత్తులు అన్నియూ అవిద్యావృత్తులే. ఇవి అనంతమైన సైన్యముగ పుట్టుచుండును. వీనిని హరించవలె నన్నచో జీవుడు పొందవలసినది పశుపతి తత్త్వము లేక ఈశ్వర తత్త్వము. అదియే పశుపతి అస్త్రము. సమస్త జీవులయందలి ఈశ్వరుని దర్శించువారికి ఈ అస్త్రము లభించును.

పశుపతి అస్త్రము కన్న మహా పాశుపతము ఉత్కృష్టమైనది. జీవులయందలి ఈశ్వరుని గమనించుట యొక ఎత్తు. వారి ప్రవర్తనము లందు భగవంతుని క్రీడ చూచుట మరియొక ఎత్తు. ఇతరుల ప్రవర్తన ములు నచ్చుట, నచ్చకపోవుట అను ద్వంద్వమున సజ్జనులు సైతము బంధింపబడుచున్నారు. అనేకానేక ప్రవర్తనములు జీవులనుండి వ్యక్త మగుచుండును. వానిని సైతము దైవముగ భావించుట సదాశివ ఆరాధనము. దీనినే వైష్ణవులు 'వాసుదేవ ఉపాసన' అందురు. ఇట్లారాధించు వారికి సృష్టి అంతయు దైవముయొక్క లీలావిలాసముగ గోచరించును. వారు అజ్ఞాన ప్రవర్తనలు కూడ దైవలీలలుగనే చూతురు. కావున వారియందజ్ఞాన మిక పుట్టదు. ఇదియే మహాపాశుపత అస్త్రము. ఇది నిశ్శేషముగ అసురసైన్యమును దగ్ధము చేయగలదు.

పాశుపతాస్త్రము షడాక్షరి. మహాపాశుపతాస్త్రము అష్టాక్షరి. షడాక్షరి అనంతరము పంచభూతములపై ఆధిపత్యము నిచ్చును. అష్టాక్షరి మంత్రము త్రిగుణములపై కూడ ఆధిపత్యము వహించును. షడాక్షరి దేహాత్మ భావమునుండి విముక్తులగుటకు, అష్టాక్షరి అహంకార భావము నుండి విముక్తి చెందుటకు ఈయబడినవి. *'ఓం విష్ణవేనమః'* అనునది షడాక్షరి. *'ఓం నారాయణాయ నమః'* అనునది అష్టాక్షరి. షడాక్షరి దేవత ఈశ్వరుడు లేక విష్ణువు. అష్టాక్షరి దేవత సదాశివుడు లేక నారాయణుడు.

# 82. 'కామేశ్వరాస్త్రనిర్దగ్ధ సభండాసుర శూన్యకా'

**భం**డాసురునితో కూడిన శూన్యకమను అతని పట్టణమును కామేశ్వరాస్త్రముతో నిశ్శేషముగ దహించినది దేవి యని యర్థము.

భండాసురుడు (అహంకార స్వరూపుడు) శూన్యకమను పట్టణమున వసించుచుండును. ప్రతి జీవుడును తన భార్య, పిల్లలు, గో భూ సంపద, తన కీర్తి, తన ప్రతిష్ఠ, తనవూరు, తన వారు, తన దేశము అని భావించుట కలదు. ఇది నిజమునకు మాయయే. అంతయూ ఈశ్వర స్వరూపమే అయి వుండగ, కామము కారణముగ కల్పింపబడిన ఈ సృష్టియందు కామవశుడై, ఉన్నది చూడక తాను చూచుచున్నది ఉన్నదనుకొనుచున్నాడు జీవుడు. ఇది కామ ప్రభావమే.

సృష్టి సమస్తము కామేశ్వర కామేశ్వరీ కల్పితమే. పరమాత్మ నుండి సంకల్పముగ కామేశ్వరీదేవి ఉద్భవించెను. ఆమె సంకల్ప మాత్రముగ సృష్టి ఏర్పడును. కామము సృష్టికి ప్రధాన లక్షణము. కామము లేనిదే సృష్టి లేదు. కామము లేనిదే జీవుడు కదలడు. కామమే ప్రాణముగ అతను జీవించును. అతని జీవనమంతయు కామ పరితృప్తికే. జీవుడు సహజముగ ద్వైత భావమున జీవించును. త్రిగుణ ముల నుండి జనించినవాడు కదా ! కావున నేను, నాది అను భావము సహజముగ నుండును. ఇది అహంకారము వలన జనించునది. ఇది అజ్ఞానపు మొదటి ఆవరణము. ఈశ్వర భావము దీనికి ఔషధము

వంటిది. ఇది అద్వైత భావము. ఉన్నది అద్వైతమే. చూచువాని కది ద్వైతముగ కనిపించును. ద్వైతమునబడి సృష్టి సామ్రాజ్యమున తనదైన సామ్రాజ్య మొకటి నిర్మించును. వాటికి ఎల్లలు ఏర్పరచును. ఒక అంగుళము మేర ఎవరైనను ఆక్రమించినచో ఆగ్రహించును. నిజము నకు అతని ఊహా నిర్మితమగు రాజ్యము ఊహయేగాని సత్యము కాదు.

కామేశ్వరాస్త్ర మనగా కామమును దహించు అస్త్రము. అపుడు మిగులునది అద్వైతమే. జీవునకపుడు నేను, నాది యని యుండదు. అహంకారుడుగ నున్నప్పుడు తనకున్న సామ్రాజ్యమపుడు శూన్యమగును. నిజమునకు జీవుని సామ్రాజ్యము శూన్యమే. అందులకే అహంకారుని పట్టణము శూన్యక మనిరి. ద్వైత భావమున ఏర్పడిన మాయా నిర్మిత స్వజన స్వదేశములన్నియు అద్వైత భావమున అదృశ్యమగును. క్లుప్తముగ చెప్పవలెనన్నచో కామేశ్వరాస్త్రము మాయను ఛేదించి జీవుని సత్య మందుంచును. కావున ముక్తిప్రదము.



# 83. 'బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవసంస్తుత వైభవా'

బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు ఆదిగాగల దేవతలచే స్తుతింపబడిన వైభవము కలది శ్రీదేవి యని అర్థము.

శ్రీదేవి, ఆమె శక్తి పరివారము భండాసురుని, అతని సోదరులను, అతని పుత్రులను వధించిన విధానము, ముందు నామములలో తెలుపబడినది. భండ సైన్యమును 'నకులీ' శక్తులతో వధించినది. భండ పుత్రులను 'బాల' రూపముతో వధించినది. విషంగుని గేయచక్రమును అధిష్ఠించిన 'శ్యామలగ' వధించినది. విశుక్రుని కిరిచక్ర మెక్కిన 'వారాహిగ' వధించినది. భండాసురుని విఘ్నయంత్రమును 'మహాగణేశుని' అవిర్భవింప చేసి, అతనిచే భిన్నము గావించినది. భండాసురుడు వదలిన అస్త్రము లన్నింటికిని ప్రత్యస్త్రములను వర్షించినది. నారాయణాస్త్ర మును, మహా పాశు పతాస్త్రమును కామేశ్వరాస్త్రమును ప్రయోగించి భండాసురుని, అతని శూన్యక పట్టణమును కూడ నశింప చేసినది.

ఇట్టి మహత్తర కార్యములను నిర్వర్తించిన లలితాదేవిని బ్రహ్మాది దేవతలు కీర్తించినారు. ఆమె వైభవమును స్తుతించినారు.

బ్రహ్మాదిదేవతలు కూడ శ్రీదేవి నుండి దిగివచ్చినవారే. భండా సురుడును అట్టివాడే. బ్రహ్మాదిదేవతలు సృష్టి నిర్మాణము కార్యము చేయుచుండగ తద్భిన్నమగు కార్యములు భండాసురుడు చేయుటచే భండాసురుడు దేవతలకు శత్రువయ్యెను. దైవాసురులు శత్రుత్వమునకు

కారణము వారందరూ త్రిగుణాత్మకు లగుటయే. త్రిగుణాతీత శ్రీదేవియే. త్రిగుణాత్మకులు అహంకార రూపులే. ప్రతి మానవుని యందును మంచి చెడుల ఘర్షణ జరుగుచునే యుండును. అవియును దైవాసుర యుద్ధము వంటిదే. ఈ యుద్ధమున కొన్నిమార్లు దేవతలు, కొన్నిమార్లు అసురులు గెలుచుచుందురు. ఈ యుద్ధము జీవులయందు నిరంతరము జరుగు చునే యుండును. యుద్ధమున పరిష్కారములు తాత్కాలికములే. మరల అసురశక్తులు దైవశక్తులు బలమును కూడగట్టుకొనుట, యుద్ధమును చేయుట జరుగుచుండును. దీనికి శాశ్వత పరిష్కారమే గుణాతీత స్థితి. ఇది ఆత్మస్థితి. ఆత్మ నుండి దిగివచ్చినదే చైతన్యము. అట్టి శుద్ధ చైతన్యము నుండి దిగివచ్చినవే త్రిగుణములు. త్రిగుణముల మిశ్రమ రూపమే అహంకారము. శ్రీదేవి సర్వాత్మిక అనగా అందరి యందు ఆత్మ స్వరూపము. చైతన్య స్వరూపము, అసురలయందు ఉన్నదిగాని, ఒకే దైవమగుటచే ఆమె వైభవము అసురులకును లేదు. సురలకునూ లేదు. వారు స్తుతించుచు ఆత్మ తత్త్వమున ప్రవేశింతురు. మానవులకు కూడ నదియే గతి.



# 84. 'హరనేత్రాగ్ని సందగ్ధ కామసంజీవనౌషధిః'

**శి**వుని మూడవ కంటియందలి అగ్నిచే బూడిద చేయబడిన మన్మథుని పునర్జీవింపచేయు ఔషధము శ్రీమాత.

మన్మథు డహంకారుడై కామేశ్వరుని సైతము కామమున నిలుపవలెనని ప్రయత్నించెను. అహంకారుని చేష్టలకు మితి లేదు. అత నెవరిపైన నైనను కాలు దువ్వును. మహాకాలునిపై కాలుదువ్విన కాముని, కామేశ్వరుని నేత్రాగ్ని దగ్ధము చేసెను. శివుని మూడవ కన్ను త్రిగుణాత్మక సృష్టికి మూలము. అది తెరచుకొన్నచో సమస్త సృష్టి అందులోనికి లయమగును. అది కాలాగ్ని స్వరూపము. ఆ అగ్నికి దగ్ధము కాని దేమియు లేదు. నిజమునకు అగ్ని స్వరూపము కూడ అమ్మయే. పరమశివుని నుండి ఉద్భవించు ప్రేరణ అగ్నిగ వ్యక్తమై వెలుగై నిలచును.

కాముడు శివునికి గురిపెట్టెను. అనగా అహంకారముతో నైనను ఆత్మ తత్త్వమునకే గురిపెట్టెను. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, కంసుడు శిశుపాల దంతవక్త్రులు అహంకారముతో నారాయణ తత్త్వము నెదిరించి ఆ తత్త్వమును చేరి శాశ్వతత్వమును పొందిరి. అట్లే కాముడు కూడ దగ్ధమై శివుని చేరి శాశ్వతుడయ్యెను. ఇచట రహస్యమేమన కాముడు జీవుడుగ శాశ్వతుడే కదా! అతనికి మరణము లేదు. కాని అతని చేష్ట వలన అతని అహంకారము

మరణించినది. అహంకారము మరణించిన కాముడు ఆత్మస్వరూపుడై నిలచినాడు. ఇది అనుగ్రహ కార్యమేకాని ఆగ్రహము కాదు. దైవము, కాలము, ప్రకృతియొక్క ఆగ్రహము అనుగ్రహమునకే అని తెలియవలెను. ఆగ్రహించినట్లు గోచరించినను దాని పర్యవసానము అనుగ్రహమే. ఔషధము చేదుగ నున్నప్పటికిని దాని పర్యవసానము శుభప్రదమే కదా!

జీవుని మరణము మూడు దశలలో నుండును. ఒకటి భౌతిక దేహమున మరణించుట, సూక్ష్మ శరీరమున జీవించుట. రెండు సూక్ష్మదేహమున మరణించుట లింగదేహమున జీవించుట. మూడు లింగదేహమున మరణించుట, ఆత్మస్వరూపుడై ప్రకాశించుట. ఇట్లు మూడుసార్లు మరణించి, మూడుసార్లు మరల జీవించి నిజస్థితి యందు నిలచుట జీవునికి ఆరోహణ క్రమమున జరుగును. వీని నన్నింటిని నిర్వర్తించినది శ్రీదేవియే. హరుని నేత్రాగ్నికి భస్మమైన కాముని అహంకారము నుండి నిర్మూలించి ఆత్మ తత్త్వమున నిలిపినది ఆమె సంకల్పమే. కాముని యందు ఇచ్ఛారూపిణియై ప్రవేశించి కామునిచే చేష్టను గావించి శివుని నేత్రమునుండి అహంకారుమును దహించి, కాముని ఉద్ధరించిన 'సంజీవని' ఔషధముగ అమ్మను తెలియవలెను. అపరిమితముగ దూషించిన అహంకార స్వరూపుడగు శిశుపాలుని శిరమును సుదర్శన చక్రముచే ఖండించి హృదయమునకు చేర్చుకొన్న శ్రీ కృష్ణుని చర్య కూడ యిట్టిదే. అతడు లలితా స్వరూపమే.

# 85. 'శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూప ముఖపంకజా'

జ్ఞానము నొసగు మహిమతో కూడిన వాక్కుల పుట్టుక కల తామరము వంటి ముఖము కలది శ్రీదేవి అని అర్థము.

శ్రీమత్ అనగా జ్ఞానము నొసగు మహిమతో కూడినది అని అర్థము. జ్ఞానపూరితమగు వాక్కు అమ్మ ముఖమునుండి వ్యక్తమగు చున్నది. అమ్మ ముఖముయొక్క అందము ముందు నామములలో వివరింపబడినది. ఆమె ముంగురులు, ఫాలభాగము, కనుబొమలు, బొట్టు, నాసిక, చెక్కిళ్ళు, కపోలములు, పెదవులు, దంత పంక్తి, చుబుకము, చెవులు, ముఖమున ధరించిన ఆభరణములు అన్నియు వివరముగ వర్ణింపబడినవి. అట్లే పాదముల వరకు కూడ వర్ణింప బడినవి. ఆమె చిరునవ్వు వర్ణింపబడినది. 14 నామము నుండి 51వ నామము వరకు అమ్మ రూప లావణ్య విశేషములు అందింపబడినవి. ఇది అంతయూ స్థూలరూప ధ్యానము. ఇప్పుడు సూక్ష్మరూప ధ్యానము అందింపబడుచున్నది.

ఆరాధన యందుగాని, సాధన యందుగాని దైవమును స్థూల రూపముగను, సూక్ష్మ రూపముగను ఆరాధించుట గలదు. ముందు స్థూలరూప ఆరాధన, అటుపైన సూక్ష్మరూప ఆరాధన, సూక్ష్మరూపము కూడ మూడు స్థితులలో నుండును. సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మ తమము. అమ్మ పంచదశీ మంత్రమున సూక్ష్మము, సూక్ష్మతరము,

సూక్ష్మతమము ఇమిడియున్నవి. అది వరుసగ ఐదు గుంపులుగ నున్నవి. అందు మొదటి ఐదు అక్షరములు సూక్ష్మరూపమును, రెండవ ఐదు అక్షరములు సూక్ష్మతర రూపమును, మూడవ ఐదు అక్షరములు సూక్ష్మతమమును తెలుపుచున్నవి.

సూక్ష్మరూప మనగా మంత్రరూపము అని అర్థము. అందు మొదటి ఐదు అక్షరముల మంత్రరూపము 'శ్రీమత్' అని పిలుతురు. అది వాగ్రూపము. ఒక జీవుని మహిమ, జ్ఞానము అతని వాక్కు నుండియే తెలియును. జ్ఞానము కలిగిన వాక్కు మహిమతో కూడి యుండును. అట్టి వాక్కు గలవారినే శ్రీమంతులందురు. శ్రీమంతులనగా వాగ్వైభవము కలవారు. సృష్టి అంతయు వాగ్రూపమే. వాక్కుతోనే నిర్మింపబడినది. అది శ్రీదేవి ముఖపంకజము నుండి పుట్టుచు నున్నది. అందువలన జ్ఞానమునకు, మహిమకు, శ్రీమంతమునకు ఆమెయే ఆధారము.

ఈ నామమును ఉచ్చరించువారు, వాఙ్నియమమును పాటించినచో క్రమముగ మహిమాన్వితులు కాగలరు. భగవంతుని ఆరాధన చేయుట, ప్రశంసచేయుట, గోష్ఠి చేయుట, జ్ఞాన యజ్ఞములు చేయుట– ఇత్యాదులకు వాడబడిన వాక్కు క్రమముగ మహిమను పొందును. ఇట్టి సంస్కారము వాక్కునకు కలగవలె నన్నచో పంచదశీ మంత్రమున గల మొదటి ఐదు అక్షరములను ఉపాసించ వలెను.

'క, ఏ, ఈ, ల, హ్రీం' అనునవి మొదటి పంచాక్షరములు.

# 86. 'కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ'

**కం**ఠము నుండి కటి (నడుము) వరకు గల మధ్యమైన కామరాజ కూటము తన నిజరూపముగా గలది.

సృష్టియందు శిరస్సున వెలుగు, మధ్యభాగమున దైవాసుర సంపత్తి, అధో భాగమున పంచభూతాత్మక సృష్టి ఏర్పడి యుండును. మానవుని యందు కూడ ఇదే విధముగ శిరస్సున వెలుగు, కంఠము నుండి బొడ్డు వరకు కుడి ఎడమల భావములు (దైవాసుర భావములు) అచట నుండి మూలాధారము వరకు శక్తికూటము ఉండును.

మధ్యమైన కూటమును కామరాజ కూటమందురు. దీనికి ప్రభువు కామదేవుడు. ధర్మయుక్తమైన కామము దైవీ భావము. అధర్మయుక్త కామము అసురభావము. వీటి సంఘర్షణము సృష్టియందు తప్పదు. ద్వంద్వముల యందున్న వారికి ఈ ఘర్షణ యుండును. కావున ఇంద్రాది దేవతలు సైతము భయమున చిక్కియుందురు. ధర్మపరులకు అధర్మపరుల భయముండనే యున్నది. అట్లే అధర్మపరులకు ధర్మపరుల భయముండనే యున్నది. ఈ మధ్యమకూట మంతయు కామము ప్రధానముగ నిర్వర్తింపబడు చున్నది. అది ధర్మ కామమైనను, అధర్మ కామమైనను కామమే. పైన గల వెలుగు ఈ ద్వంద్వమున కతీతము.

ద్వంద్వమున గల జీవులకు షట్భావములు, షడ్గుణములు, షడ్రుచులు, సమస్తము షడ్యంత్రముగ నడచును. త్రిగుణములు ప్రతి

బింబించుటచే ఈ షట్కోణ మేర్పడెను. అందలి కేంద్రబిందువే జీవ చైతన్యము. ఈ షట్కోణముల నిర్వహణము రాజసికము, తామసికముగ నిర్వర్తింపబడు చున్నప్పుడు సమస్త కార్యములు ఈ మధ్యమ కూటమున జరుగుచున్నవి. సత్త్వమున మాత్రమే ఈ షట్కోణ చక్రము నుండి బయల్పడ వచ్చును. సత్త్వమొక తటస్థ స్థితి. విరుద్ధమగు రెండు భావముల కది కేంద్రము. తటస్థ స్థితి చేరిన వారియందు అవిద్యను, అధర్మమును, అకార్యమును ద్వేషించుట యుండదు. గమనించుట మాత్రమే యుండును. ద్వేషభావము అధర్మము పైన మిక్కుటముగ నున్నచో భావ తీవ్రతచే దాని నాకర్షించుట జరుగును. దారిద్ర్యమును ద్వేషించువారు దారిద్ర్య మును, అనారోగ్యమును ద్వేషించువారు అనారోగ్యమును పొందుట చూచుచున్నాము కదా! దీని నుండి బయల్పడుటకు, వెలుగులోనికి ప్రవేశించుటకు పంచదశీ మంత్రములోని మధ్యమకూటమైన షడక్షరము లను ఉపాసించుట మార్గము.

అవి హ, స, క, హ, ల, హ్రీం.



# 87. 'శక్తి కూటైక తాపన్న కట్యధోభాగధారిణీ'

**శ**క్తికూటము నడుమున కథో భాగముగ ధరించునది శ్రీదేవి యని అర్థము.

కామ మాధారముగనే మధ్యమకూట మంతయు నిర్వర్తింప బడుచున్నది. కామోత్పత్తికి మూలము శ్రీదేవియే. ఆమె శక్తియే. కామశక్తిగ ఉద్భవించును. ఆమె కామేశ్వరి కదా! చతుర్ వ్యూహము లను అమ్మ తన సంకల్పశక్తిచే నిర్వర్తించుచున్నది. (పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరి అను నాలుగును నాలుగు వ్యూహములు లేక వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు.) వీనికి మూలకారణముగ ఆమెయే యున్నది. ఆమె మూలశక్తి, మూలమంత్రము. జీవునియందు ఆమె యుండు స్థానము మూలాధారము. మూలాధారమున అమ్మ కుండలినీ చైతన్యరూపిణియై యుండును. తపస్సుచేత ఈమె ఈ శక్తిని ప్రచోదనమ కావించుట యొక మార్గము. ఇది అనాదిగ భరత దేశమున జరుగుచున్నది. యోగవిద్య ఋషు లందించినది కుండలినీశక్తి ప్రచోదనమునకే. ఈ శక్తిని ప్రచోదనము చేయుటకు శక్తికూటమైన పంచదశీలోని చివరి నాలుగు అక్షరములను శ్రీవిద్య ఉపాసకులు ఆశ్రయింతురు.

ముందు రెండు నామములు, ఈ నామము అమ్మ పంచదశీ

మంత్రమును భక్తులకు పరిచయము చేయుచున్నది. పంచదశి పదిహేను అక్షరముల మంత్రము. మొత్తము మంత్రము ఈ విధముగ వున్నది.

| | | |
|---|---|---|
| **క, ఏ, ఈ, ల, హ్రీం** | – | 5 అక్షరములు |
| **హ, స, క, హ, ల, హ్రీం** | – | 6 అక్షరములు |
| **స, క, ల, హ్రీం** | – | 4 అక్షరములు |
| | | 15 |

ఇందు మొదటిది వాగ్భవ కూటము, రెండవది కామరాజ కూటము, మూడవది శక్తి కూటము.

యోగ విద్యయందు సుషుమ్నా మార్గమున కుండలినీ చైతన్యమును ప్రచోదనము కావించుకొని యోగులు మొదటి కూటమును చేరుచున్నారు.

ఈ మంత్ర రహస్యమును, ఉపాసనా విధానమును గురు ముఖముగ పొందవలెను.



# 88. 'మూలమంత్రాత్మికా'

**మూ**లమంత్ర స్వరూపిణి శ్రీ లలితాదేవి అని అర్థము.

భారతీయ వాఙ్మయమున, సంప్రదాయమున మాత్రమే మంత్ర విద్య మిగిలియున్నది. మంత్రము సర్వకామప్రదమే కాక ఆత్మ సాక్షాత్కారము కూడ కలిగించును. జీవునికి మంత్రము సర్వసిద్ధి ప్రదము. మంత్రములకు మూలము శబ్దము. దీనిని వాక్కుగ వేదములు వర్ణించినవి. వాక్కుకు మూలము అమ్మయే. సర్వమంత్రములకు ఆమెయే మూలము. ఆమెయే ఆత్మ. ఆమె మంత్రాత్మిక.

'మూలమంత్రాత్మిక' అనగా మంత్రాత్మల మూలమని అర్థము. మరియు మూలమంత్ర మనగ పంచదశీ మంత్రము కూడను. పంచదశీ మంత్రమునకు ఆమెయే ఆత్మ గనుక ఆమె మూలమంత్రాత్మిక. పంచదశీ మంత్రమును మూలమంత్ర మనుటలో విశేషమేమన అది చతుర్విధ పురుషార్థములకు మూలకారణము. పంచదశీ మంత్రమును మననము చేయుట వలన జీవునికి ధర్మార్థ కామ మోక్షములు తప్పక ఫలించ గలవని హయగ్రీవుని వాగ్దానము.



# 89. 'మూలకూటత్రయ కళేబరా'

**మూ**లమంత్రము యొక్క కూటత్రయమే స్థూల రూపముగా గలది శ్రీదేవి యని అర్థము.

కూటత్రయము వరుసగా ప్రజ్ఞ, శక్తి, పదార్థము. ప్రజ్ఞ ప్రధాన బిందువుగ శక్తి పదార్థముల త్రిభుజాకార మేర్పడును.

ప్రజ్ఞ



పదార్థము ● ● శక్తి

ఈ మూడు బిందువులు మూడు కేంద్రములుగ భూ, భువ, సువర్లోకము లేర్పడుచున్నవి. సమస్త సృష్టి ఈ మూడు బిందువుల సమ్మిశ్రమమే, అణువునందు కూడ ఈ మూడును గోచరించును (న్యూట్రాన్, ప్రోటాన్, ఎలక్ట్రాన్). ఈ మూడు బిందువులు, మూడు గుణములుగా ఎరుగవలెను. శ్రీదేవి శరీరము త్రిగుణాత్మక సృష్టి.

*త్రయస్త్రింం శత్సహస్రాణి, త్రయస్త్రింం శత్శతానిచ ।*
*త్రయస్త్రింం శచ్చ దేవానాం, సృష్టి స్సంక్షేప లక్షణా ॥*

సమస్తము త్రికూటముతోనే నిర్మింపబడినది. మూడు నుండి ముప్పదిమూడు కోట్ల దేవత లేర్పడిరి. త్రిమూర్తులు, త్రిశక్తులు కూడ నివియే.

మానవుని మూడవ కన్ను, కుడి, ఎడమ కన్నులుగ కూడ దీనిని భావించవచ్చును లేదా సుషుమ్న ఇడ పింగళగ కూడ గుర్తించ వచ్చును. మరియు శ్రీ మహావిష్ణువు, శ్రీదేవి, భూదేవిగ గమనించ వచ్చును. ఇంకను శివుడు గంగ గౌరిగ గుర్తించవచ్చును. గణపతి, సిద్ధి, బుద్ధి, కుమారుడు, శ్రీ వల్లి, దేవసేన; కశ్యపుడు, అదితి, దితి; ఇవి అన్నియు మూలకూటత్రయమునకు సంబంధించినవి. ఈ మూల కూటత్రయము నుండే జీవులు దిగివత్తురు. కావున జీవుని నాలుగవ వానిగ తెలుపుదురు.




మూలమంత్రము సూక్ష్మరూపమున మంత్రముగ నుండగ మూలకూటము మంత్రము యొక్క శరీర మగుచున్నది. ముఖము స్థూల రూపమైన అందలి సూక్ష్మరూపము ఇడ పింగళ సుషుమ్న వాక్కు అట్లే కంఠము నుండి నడుము వరకు స్థూలరూపము. దాని సూక్ష్మరూపము ద్వంద్వములు (దైవాసురులు). నడుము నుండి క్రింది భాగము స్థూలరూపము కాగ అందలి సూక్ష్మరూపము కుండలిని.

పై విధముగ మూలమంత్రమును, కళేబరము (శరీరము) ను త్రివిధముగ తెలియదగును.

# 90. 'కులామృతైక రసికా'

**కు**ళామృతము నందు పరితృప్తి చెందినది అమ్మ యని అర్థము.

'కుః' అన భూమి. అది ఎచట లీనమగుచున్నదో అది కులం. భూతత్త్వము లీనమైనప్పుడు అమృతవర్షము కలుగుట కవకాశ మేర్పడెను. మానవ శరీరమందు భూతత్త్వము లీనమగు కేంద్రము మూలాధారము. అందుండియే సుషుమ్న మార్గము కలదు. సుషుమ్న మార్గమే కులం. దాని ముఖద్వారమే మూలాధార కేంద్రము. భూతత్త్వము లీనమై సాధకునికి కుండలినీ చైతన్యము మూలాధారము నుండి ప్రచోదనమై సుషుమ్న మార్గమున బ్రహ్మరంధ్రమును చేరును. అనగా సహస్రారము చేరును. అప్పుడు అమృతము స్రవించును. ఇదియే కుళామృతము. ఈ కుళామృతమున నున్నది అమ్మయే. దాని యందు వసించి, రమించుచుండును. అట్లు కులమందలి అమృతము నందు రమించునది వసించునది శ్రీదేవి అని ఈ నామార్థము. కుండలినీ మార్గమున ఊర్ధ్వగతి చెందుట, అమృతమును పొందుట, అమరత్వమున వసించి రమించుట ఈ నామము సూచించుచున్నది.

1. జీవస్థితి



2. ముముక్షు



3. అమృత వర్షము



ప్రక్క పేజీలోని రేఖా చిత్రములను గమనింపుడు. మొదటి చిత్రము నందు జీవుడు త్రిగుణములకు లోబడి భూతత్త్వమున నివసించుచున్న నాల్గవవానిగ గుర్తింపవచ్చును. సమస్త భూమ్యాకర్షణల నుండి విముక్తు డైనచో అధోబిందువు త్రిభుజములోనికి చేరును. త్రిభుజములోనికి చేరనపుడు చతుర్భుజముగ నున్నది. చేరినపుడు త్రిభుజమైనది. త్రిభుజమందలి కేంద్రబిందువు సుషుమ్నకు ముఖ ద్వారము. అందుండి ఊర్ధ్వగతి చెంది సహస్రారము చేరుట మూడవ చిత్రమున చూడవచ్చును.

భూమ్యాకర్షణల నుండి విముక్తుడైన జీవుడు అంతర్ముఖుడై దేహాత్మభావన నుండి విముక్తుడగును. అనగా స్థూలము నుండి సూక్ష్మమునకు చేరును. సూక్ష్మమునుండి సూక్ష్మతరము, సూక్ష్మతమము నగు స్థితులను చేరును. అట్టివానికి కలుగునదే మధురానుభూతి. అతనికి సృష్టి మధురా నగరముగను, శ్రీదేవి ఆ నగర మహారాజ్ఞిగను గోచరించును. అట్టివానికి బహిరంతరము లంతయు మధురమే. *'మధురాధిపతే అఖిలం మధురం'* అను స్తోత్రమున ఈ సత్యమే ఆవిష్కరింపబడినది.

'కుః' అనగా భూమి యని, అది లీనమగు చోటు 'కులం' అని ముందు తెలుపబడినది. కులమనగా సజాతీయ సమూహము అని కూడ అర్థము. సజాతీయ సమూహ మనగా ఒక చోటునుండి పుట్టి ఏర్పడిన గుంపు అని అర్థము. త్రిగుణములు చైతన్యము నుండి ఉద్భవింపగ వాటినుండి జీవులు, పంచభూతాత్మక సృష్టి ఏర్పడినది. అన్నిటికిని మూల మొక్కటియే. కావున సృష్టి మొత్తము సజాతీయమే గాని విజాతీయము కాదు. చూడబడునది, చూచువాడు, చూచుట

మూడింటికిని ఆధార మొకటియే. దీనినే జ్ఞానరూపమైన 'త్రిపుటి' అందురు. త్రిపుటిని కూడ కులమనే పిలుతురు. త్రిపుటిగా సృష్టి నేర్పరచి ఆనందించు దేవి కనుక ఆమె 'రసిక' అయినది. సృష్టి వైవిధ్యమును జ్ఞానమార్గమున నెదిగినవారికి సృష్టి వైభవము ఆనందము కలిగించును.

'కుళం' అనగా శరీరము అని కూడ మరియొక అర్థము. రూపములను, శరీరములను ఏర్పరచి అందు శ్రీదేవి రమించుచున్నది. బంధనము లేక శరీరమున జీవించు పూర్ణయోగుల కిది అనుభవైకము. మానవ శరీరము సర్వశక్తిమయము. అందులేనిది సృష్టియందు లేదు. అట్టి శరీరమందు జీవించుట అమితానందము నిచ్చును. శరీరముననే అమృతత్త్వమును అనుభూతి చెందవచ్చును. శరీరము లేనిచో దీని ననుభవించుటకు వీలుకాదు. శరీరము నందలి అమృతము ననుభూతి చెందవలెనన్నచో మథనము సాధింపవలెను. మథనముననే అమృతము పుట్టినది కదా! అమృతము పుట్టుటకు ముందు దివ్యోపేతమగు ఎన్నియో సృష్టి విభూతులు పుట్టినవి కదా! అట్లే యోగాభ్యాసము కారణముగ సాగు సాధనయందు దివ్యానుభూతులు, కలుగుట అటుపైన అమృతత్త్వము నందు వుండుట జరుగును. ఈ రెండింటికిని ముందు అంతర్హితముగ నున్న విషము కూడ బయల్పడునని తెలియవలెను. యోగమార్గమున షట్చ్రక్రములను భేదించుకొనుచు కుండలిని చైతన్యము సహస్రార కమలమును చేరినపుడు అమృతము స్రవించును. ఇట్లు శరీరమందలి అమృతము స్రవించినచో కలుగునది బ్రహ్మానందము. దీని నందించునది కుండలినీ స్వరూపమగు శ్రీదేవి.

# 91. 'కులసంకేత పాలినీ'

సదాచార సంకేతములను పాలించునది శ్రీదేవి అని అర్థము. కులమనగా వంశమని సామాన్య అర్థము. వర్ణమని మరియొక అర్థము. ముందు నామమున కులమును మూడు విధములుగ నిర్వచించుట జరిగినది. కుళామృతమును గురించి తెలుపబడినది. ఇపుడు కుల సంకేతము గురించి తెలుపబడుచున్నది.

కుల సంకేత మనగా సదాచారము వలన అంతఃకరణ శరీరము నందు పొందు దివ్యానుభూతులు మరియు దివ్యబోధనలు. అనుభూతి, బోధనము ఉపాసకునికి అంతరంగమున జరుగుచుండుట తెలిసిన విషయమే. ఉపాసనా యంత్రము లేక విగ్రహము, దానికి వినియోగించు పూజాద్రవ్యములు, వుపాసించువాని మనస్సు, ఉపాసన వలన కలుగు దర్శనములు- ఇవి అన్నియు కలిసి కుల పుస్తకము అని కల్ప సూత్ర మందు తెలుపబడినది. సదాచారమున ఉపాసన చేయువాడు ఉపాసనను రహస్యముగ వుంచును. ఉపాసనా మార్గమున కాని, సాధనా మార్గమున కాని నడచు చున్నవారు తమ మార్గమును కాని, సాధనను కాని బహిరంగము చేయరాదు. రహస్యముగ నుంచుకొనవలెను. వేశ్యలవలె బహిరంగ ప్రదర్శనములు జరుపరాదు. ప్రకటితము చేయరాదు. కుల స్త్రీ పాతివ్రత్యమువలె దీక్షగ సాధన చేసుకొనువారు అంతరంగ విషయ ములను బహిరంగముగ ప్రకటింపరు. సాధకుడు కులస్త్రీవంటి వాడు.

అతడు సంగమము కోరు పురుషుడు పరమ పురుషుడే. సంగమ అనుభూతులు తెలుపుట వేశ్యావృత్తియే. అందువలననే "కుల పుస్తక మును దాచవలెను" అను వాక్యము సత్సాధకుల కీయబడినది. వారి ఉపాస్య దైవమునుగూర్చి గాని, ఉపాసనా ద్రవ్యములనుగూర్చి గాని, ఉపాసనా విధానమును గూర్చి గాని, దర్శనములు, బోధనలు గూర్చిగాని ప్రకటితము చేయరాదు. ఇవి అన్నియు కులసంకేతములు. చైతన్య రూపములు, వీనిని శ్రీదేవి పాలించుచునుండును. అందువలన ఆమె 'కులసంకేతపాలిని'.

యోగమార్గమున కుండలినీ చైతన్యము సుషుమ్న మార్గమున చొచ్చి, షట్చక్రములందు పయనించి, సహస్రార కమలముచేరి అమృత రసమును వర్షించుటకు పై తెలుపబడిన నియమము అత్యవసరము.

ఈ నామమునకు సద్గురువు పరశురాముడు.



# 92. 'కులాంగనా'

శీలము, గుణము గల వంశమున జన్మించిన పతివ్రతా స్త్రీని 'కులాంగనా' అందురు.

ఏ స్త్రీ యందు పై మూడు గుణములుండునో ఆ స్త్రీ, శ్రీదేవి వలె ఉపాస్యదేవత. గుణము, శీలము, పాతివ్రత్యము గలవారు శ్రీదేవి సృష్టియందు రక్షింపబడుదురు. దేవతా ఉపాసనా మార్గము నందు కూడ ఈ మూడు గుణములు అత్యంత ప్రాముఖ్యము గలవి. శీలము లేనివారు, గుణము లేనివారు, ఉపాస్యదైవము నందు అచంచల భక్తి, విశ్వాసము, ప్రేమ (పాతివ్రత్యము) లేనివారు దైవానుగ్రహమునకు పాత్రులు కారు.

ప్రస్తుత కాలమున ఎందరో ఆస్తికులు ఈ మూడు విషయము లందు తగు శ్రద్ధ లేక భక్తిమార్గమున పలు పాట్లు పడుచున్నారు. నగుబాట్లు చెందుచున్నారు. ఆత్మ వికాసమునకు, ఆత్మానుభూతికి, దివ్యజీవనమునకు, పాపహరణమునకు దైవారాధనము గాని ప్రచారము కొరకు, కీర్తి ప్రతిష్ఠల కొరకు, ప్రకటితముగ ఆరాధనలు చేయుట గాదు. కలి ప్రభావముచే జీవులు అంతరంగమున జరుగవలసిన సాధనను, ఆరాధనను, బహిరంగముగ వేదిక లేర్పరచుకొని ప్రచారములు గావించుకొనుచు డంబాచారులై దైవ కార్యములను నిర్వర్తించుచున్నారు. ఇది నిషిద్ధము.

శ్రీవిద్యోపాసకులకు ఇది మరింత నిషిద్ధము. పరశురాము డంతటివాడు ఇతర విద్యలన్నియు వేశ్యవలె ప్రకటితము లనియు, శ్రీవిద్య కులస్త్రీ వలె గుప్త మనియు పవిత్ర మనియు అని తెలిపినాడు. కావున శ్రీవిద్యోపాసకులు పై విషయమున ఎక్కువ నిష్ఠతో, దీక్షతో సద్గుణములు, శీలము ఆధారముగ గుప్తముగ అమ్మ నుపాసించవలెను.

'కులాంగనా' అను నామము దైవారాధకుల కందరికిని యొక హెచ్చరిక వంటిది.



# 93. 'కులాంతస్థా'

**కు**లము నందు అంతర్గతముగ నుండునది శ్రీదేవి అని అర్థము.

కులమనగా సుషుమ్న మార్గమని తెలుపబడినది. కులమున కనేకానేకార్థము లున్నవి. తొంబదవ నామము నుండి వీటిని వివరించు చునే యున్నాము. సుషుమ్న యందు గల చైతన్య ప్రవాహమే శ్రీదేవి. దీనిని కుండలిని చైతన్యమని కూడ యందురు. మూలాధారము నుండి ఆజ్ఞ వరకు వ్యాపించి అటుపైన సహస్రారమున దేదీప్యమగు కాంతులతో ప్రకాశించు చైతన్యమే 'కులాంతస్థ'.

అమ్మను ఉపాసకుడు పై విధముగ భావించుచు ధ్యానించవలెను. క్రమముగ భావన యందలి పరిశుద్ధతను బట్టి ధ్యానమునందలి ఏకాగ్రతను బట్టి, భావించినది భాసించగలదు. అమ్మనట్లు దర్శించుట శ్రేయమని ఈ నామము సూచించుచున్నది.



# 94. 'కౌళినీ'

**శి**వశక్తి సామరస్యమే కౌళము. అట్టి కౌళము గలది శ్రీదేవి యని ఈ నామము తెలుపుచున్నది.

కుళ మనగా శక్తి యని, అకుళము అనగా శివుడని, కూళాకుళ సంబంధమే కౌళమని తంత్రశాస్త్రము తెలుపుచున్నది. అమ్మ శివశక్తియే. శివుని వ్యక్తరూపమే అమ్మ. దైవము సాక్షాత్కరింపవలె నన్నచో రూపమును ధరించవలెను. కనపడుట కిదియే మార్గము. రూపము స్థూలమైనను, సూక్ష్మమైనను, సూక్ష్మకరమైనను, సూక్ష్మతమమైనను అమ్మయే. అమ్మలేక, దేవుడు కనపడడు. కేనోపనిషత్తు ఈ రహస్యమునే బోధించు చున్నది.

శివుడు లేక పరదైవము లేక పరబ్రహ్మము అవికారము, అలక్షణము, అప్రతర్క్యము, అవిజ్ఞేయము, అనూహ్యము, అతీతము, అపరిమితము, అగోచరము. అట్టి తత్త్వము వ్యక్తమగుటయే వెలుగు. ఆ వెలుగే అమ్మ. వెలిగినచో కనపడును. వెలుగక ముందు కనపడదు. కనపడనిది కనిపించుటయే అమ్మ ఆవిర్భావము. వెలుగుటకు కారణము వెలుగున కాధారముగ నున్న తత్త్వము. విద్యుత్తు కనపడదు కాని దాని వెలుగు కనపడుచున్నది కదా! దాని శక్తి తెలియుచున్నది కదా! అట్లు పరతత్త్వము యొక్క వెలుగు, శక్తి అమ్మగ ప్రకటిత మగుచున్నది. విద్యుత్తు లేనిదే వెలుగు లేదు. అట్లే శివుడు లేనిదే శక్తి లేదు.

వెలుగునందు, శక్తినందు విద్యుత్తు వున్నది కదా! అట్లే అమ్మ యందు అయ్య వున్నాడు. అమ్మ కనపడితే అయ్య అనుగ్రహించినట్లే. అయ్య రూపమే అమ్మ. శివరూపమే శివా.

పై కారణముగనే పంచాక్షరీ మంత్రము అమ్మ నుద్దేశించి ఈయబడినదని తెలియవలెను. *'ఓం నమః శివాయ'*. 'శివా' శబ్దము అమ్మ నుద్దేశించినది. శివుడు కనపడుట యనగా శివారూప సాక్షాత్కారమే. ఇది వారి సామరస్యము. అకుళుడైన శివుడు కుళయైన అమ్మ కలిసి కౌళముగ సృష్టి జరుగుచున్నది. జరిపించునది 'కౌళినీ' యగు అమ్మ. శివ సహకారముతో, శివ సంకల్పముగ శివశక్తియై నిలచి జీవుల ననుగ్రహించుచున్న తల్లియే జగన్మాత శ్రీదేవి.



# 95. 'కులయోగినీ'

హృదయాకాశమున శ్రీదేవి పాదపద్మములతో అనుసంధానము చెంది పూజాదులను చేయుట కుళమని, అట్టి విధానమున యోగము చెందుట కుళయోగమని, దాని ననుగ్రహించినది శ్రీదేవి యని అర్థము.

అమ్మ చైతన్య స్వరూపిణి. మనయందు కూడ సుషుమ్న మార్గమున నిలచియున్న చైతన్యము శ్రీదేవియై ఆమె సాన్నిధ్యమును పొందుటయే యోగము. అట్టి యోగము నిర్వర్తించుకొనుటకు అమ్మ రూపమునుగాని, శ్రీచక్రమునుగాని హృదయాకాశమున దర్శించి ఆరాధించుట కౌళమార్గము. బాహ్య పూజలకు ముందుగాని తరువాత గాని ఈ విధముగ హృత్ పద్మమున అమ్మ ఆసీనురాలై యున్నట్లు భావించి అంతరంగమున ధ్యానించవలెను, అచటనే పూజింపవలెను. ఆకాశము పంచభూతములలో అత్యంత పవిత్రము. అది వెలుగుతో కూడినది. అట్టి ఆకాశమును దర్శించి అందు శ్రీదేవి రూపమునుగాని, శ్రీచక్రమునుగాని భావన చేత రూపొందించి, స్థాపించి పూజింపవలెను. అందులకే సహస్ర నామ పారాయణము ముందు ధ్యానశ్లోక మీయ బడినది. అందు అమ్మరూపము వర్ణింపబడినది. "అరుణాం కరుణా *తరంగితాక్షీం.....*"

అను ధ్యానశ్లోకము అమ్మ రూపమును ఆవిష్కరించగలదు. ఆమె మనోహర యగుటచే అంతరంగమున మనసు హరింపబడి, బుద్ధిలోకమున ధ్యానము, పారాయణము నిలువగలదు.

పై విధమైన అంతరంగ ఆరాధనమున హృదయపద్మము ద్వారా సుషుమ్నను చేరవచ్చు లేదా మన చుట్టును గల నీలాకాశమున శ్రీచక్ర మును గాని, అమ్మ రూపమును గాని మానసికముగ, రూపొందించు కొని ధ్యానించుట, పూజించుట చేయవచ్చును. ఇది బాహ్యారాధనము.

కుళయోగము కులమధ్యమున నిర్వర్తించుకొనుట భగవద్గీత యందు బోధించియున్నారు. హృదయపద్మమున నిర్వర్తించుట ఉపనిషత్తు లందు తెలుపబడినది. మూలాధారమున నిర్వర్తించుట సద్గురు సాన్నిధ్య మున మాత్రమే వీలగునని పెద్దల అభిప్రాయము. సహస్రారము దిగువ నుండి మూలాధార కేంద్రము వరకు గల షట్చక్రములను కలుపు సుషుమ్న నాళము అంతయూ కుళమే. జీవ లక్షణమును బట్టి, గురూప దేశమును, నిర్దేశమును బట్టి ఈ నాళమున ఏ కేంద్రము ద్వారా నైనను యోగింపవచ్చును.



# 96. 'అకులా'

సుషుమ్న నాళమునకు పైన వికసించి విరాజిల్లుచున్న సహస్రార పద్మమునందు జ్ఞానరూపిణియై వసించియుండు దేవి అని అర్థము.

సహస్రార పద్మము 'అకుళ'మని చెప్పబడుచున్నది. కుళము పద్మముయొక్క నాళముగా తెలియవలెను. సుషుమ్న నాళము క్రిందనున్న సహస్రదళ పద్మము కుళస్థానము. దానిని రత్న సహస్రదళ పద్మమని అందురు. దానియందు వసించునది కుళదేవి. దాని దళములందు కుళ శక్తులుండును. అచట నుండి సహస్రారము చేరిన (సుషుమ్న నాళము ద్వారా) సహస్రమణి, రత్నకాంతులతో తేజరిల్లు జ్ఞాన స్వరూపిణిని అకుళాదేవి అందురు. మొత్తము మార్గము కుళాకుళము. అనగా శివశక్తి వ్యక్తమగునప్పుడు కుళనాళమున ప్రవేసించును. సప్త లోకములను సృష్టించును. మరల అవ్యక్తరూపిణియై అకుళాదేవిగ శివునితో కలిసియుండును.

అకుళస్థితి అవ్యక్తస్థితి కావున దేహముండదు. రూప ముండదు. లక్షణములుండవు. కేవలము తత్త్వముగనే యుండును. ఇది సమాధి స్థితి. ఈ స్థితిని శ్రీ విద్యోపాసన ద్వారా చేరుట లక్ష్యము. అకుళయే లక్ష్యము. కుళము మార్గము. గనుక సమయాంతస్థా అని దేవి కొలువ బడుచున్నది.

శివశక్తుల సామ్యము, ప్రకృతి పురుషుల సామ్యము మార్గమున సర్వత్ర పొందుచు నుండవలెను. వారి మధ్య అధిక్యత లేదు. సాధకులు కూడ ప్రకృతి పురుషుల సామ్యమునే భావింపవలెను కాని, ప్రకృతిని గర్వించుట చేయరాదు. శివశక్తుల ఆరాధనము సమముగ సాగుటయే సమయమార్గము. వారి సామ్యముననే జీవుడు పురోగతి చెందగలడు. ఏ ఆరాధనమున నైనను ఇరువురిని సమముగ పూజింపవలెను.

పూజాదుల యందేగాక సృష్టియందు కూడ ప్రకృతి పురుషులను సమానముగ దర్శించుటకు ప్రయత్నింపవలెను. రూపమున, నామమున, క్రియల యందు, శివశక్తుల ప్రమేయమును గమనించుట సమయ పథము. రాజయోగము సమయ మార్గమున రాజు వంటిది.



# 97. 'సమయాంతస్థా'

సమయ మార్గములో అంతరంగమందు పూజింపబడు దేవి యని అర్థము.

సమయమార్గ మనగా హృదయకాశ మనియు, కౌళమార్గ మనగా బాహ్యాకాశ మనియు కొందరి మతము. అట్లే కౌళమార్గము అవైదిక మనియు, సమయమార్గము వైదిక మనియు కూడ భావము. తంత్రాది మార్గములకన్న సామ్యమార్గము ఉచితమని ఋషుల సిద్ధాంతము. సర్వ విషయములందు సామ్యమును పొందునది సమయము. సమయ మార్గమున ప్రకృతి పురుషుల సామ్యము ననుసరింతురు. యోగులందరును ఈ మార్గముననే నడతురు. సనక సనందనాది కుమారులు, వశిష్ఠాది ఋషులు, శుకాదియోగులు యోగ మార్గమును ప్రకృతి పురుష సామ్యమార్గముగ బోధించినారు. సమయ మార్గము సాత్త్వికమార్గము. తంత్రమార్గమున రజస్సు, తమస్సు జీవుని వశము చేసుకొను అవకాశమున్నది. ఆ మార్గమున అపాయములు మెండు.

హృదయమందు దైవమును సంకేతపరముగ భావించి ఊహించుట లేక శ్రీచక్రము నూహించి పూజించుట సమయ మార్గము. హృదయాకాశమున

# 98. ‘సమయాచారతత్పరా’

వైదిక సమయాచారములతో పూజించు పద్ధతియందు మిక్కిలి ఆసక్తి చూపునది శ్రీదేవి యని అర్థము.

వైదిక షోడశ ఉపచార పూజావిధానము, శ్రీచక్ర పూజా విధానము గురుముఖమున పొంది వినయ విధేయతలతో భక్తిశ్రద్ధలతో శ్రీదేవిని ఆరాధించుట, గురుముఖమున పొందిన యోగమును కూడ వినయ విధేయతలతో భక్తిశ్రద్ధలతో నిర్వర్తించుకొనుట సమయాచార మని తెలియబడుచున్నది.

1. గురు కటాక్షము (ఉపదేశము), 2. వినయము, 3. విధేయత, 4. భక్తి, 5. శ్రద్ధ. శ్రీదేవి పూజనమునకు గాని, యోగ మార్గముద్వారా ఆమె ప్రచోదనమునకు గాని, అత్యవసరమగు అర్హతలు. ముందు తెలుపబడిన నామములలోవలె 6. అప్రకటితుడై, 7. దీక్షితుడై ఆరాధకుడు, ఆరాధనము కావించవలెను. 8. సాధనా మార్గమున దృఢత్వము, 9. నిత్యానుసంధానము అవసరము.

ఇట్టి తొమ్మిది లక్షణములతో అభ్యాసము చేయువానికి కాలక్రమ మున కుండలినీ శక్తి (శ్రీదేవి) మూలాధారము నుండి ఊర్ధ్వముఖియై మణిపూరకమును చేరును. అపుడారాధనమున శ్రీదేవి పాదపూజ అత్యంత భక్తిశ్రద్ధలతో నిర్వర్తించుకొనుచు, ఆ పాదముల దివ్యకాంతి వైభవము ఊహించుచు దర్శించుటకు ప్రయత్నింప వలెను. నలుబది నాలుగవ నామమున శ్రీదేవి పాదముల గోళ్ళనుండి ప్రసరించు దివ్యకాంతులు అజ్ఞానమును తొలగించి, జ్ఞానము నొసగునని తెలుప

బడినది. రజస్తమోగుణములు హరింపబడి సత్త్వగుణము ఆవిష్కరింప బడుటకు దేవి పాదములను హృదయమందు అత్యంత సుందరముగను, కోమలముగను, కాంతివంతముగను, అలంకార యుతముగను, పసుపు పారాణి దిద్దబడిన వానిగను, గోళ్ళనుండి తేజోమయమగు కాంతులు విరజిమ్ము చున్నట్లుగను, ఊహించుట, భావించుట, దర్శించుట చేయ వలెను. అనుపమానము, అతి సుందరము, అత్యంత శక్తిమంతము అగు పాదములను ఆరాధన చేయుటమే ముఖ్యము. పాదధ్యానము చేతనే, అజ్ఞానము నాశన మగును. హృదయమందలి కల్మషములు హరింపబడుట కిది యొక్కటియే మార్గము. ఈ సందర్భమున 44, 45, 46 నామములు మరల పఠించుట ఉత్తమము.

హృదయమున కల్మషములు హరింపబడగా, స్తోత్రాదికములు గావించి, తాంబూలాది పర్యంతము శ్రీదేవికి హృదయమున ఉపచార ములు చేసినచో దేవి చైతన్యము హృదయము నుండి ఊర్ధ్వగతి చెంది విశుద్ధిని చేరగా మణిమయ కాంతులతో కూడిన దేవి దర్శనము కాగలదు. అవి అన్నియు శ్రీదేవి చంద్రకళా కాంతులు. అటుపైన మంగళహారతి సమయమునకు ఆజ్ఞను చేరిన శ్రీదేవి ధ్యాన పరవశులైన ఆరాధకులకు సహస్రదళ కమలమునందు సదాశివునితో చేరును. శ్రీరామకృష్ణ పరమహంసవంటి మహాభక్తులీ విధముగ దేవి పూజనమున సర్వమును పొందిరి. ఆ మహాత్మునికి దేవిని పూజించు చుండగ లోన సుషుమ్న మార్గమున మూలాధారమున నున్నదేవి, ఊర్ధ్వగతి చెందుచు, తరచూ సహస్రారము చేరుచుండెడిది ఆయన తన్మయుడై సమాధిస్థితి పొందుచు నుండెడివాడు. ఇటీవలి కాలమున శ్రీరామకృష్ణుని కన్న పరమభక్తుడు మరియొకరు గోచరింపరు. అమ్మ అనుగ్రహమున అతను సమస్తమును తెలుసుకొనెను.

# 99. 'మూలాధారైక నిలయా'

**మూ**లాధారము తన నివాస స్థానముగ గలది శ్రీదేవియని అర్థము.

మూలమున శక్తి, శిరస్సు పైభాగమున శివుడు, రెంటిని అను సంధానము చేయు సుషుమ్న, వీని మధ్య సమస్త లోకములు భావింప వచ్చును. మూలాధార చక్రమున కుండలినీ శక్తి నిద్రించుచుండును. ఉపదేశ మార్గమున దేవి మేల్కాంచగలదు. సృష్టి యందామె స్థానము మూలయే. సహస్రారము చేరినచో శివునితో ఐక్యము చెందును. అప్పుడు సృష్టి అదృశ్యమగును. ఆమె శివుని నుండి దిగివచ్చుటయే సృష్టి. మూలాధారమున స్థిరముగ నుండుట స్థితి. తిరోధానము చేయుట లయము. యోగము, ఆరాధనము, మార్గముల ద్వారా జీవుడు తిరోధానము చెందుటకు కూడ అమ్మయే సూత్రధారిణి, ఆమె జీవుని సుషుమ్న మార్గము ద్వారా ఊర్ధ్వమునకు గొనిపోవుచుండగ జీవునికి మాయా మోహములు వీడును. తాను శివశక్తి స్వరూపుడే అని తెలియును. వెంట నుండి జీవుని దేవుని వద్దకు తోడ్కొనిపోవునది అమ్మయే. జీవుని వెన్నంటి యుండి వానికి సమస్త లోకానుభవము అందించి, సర్వవిధముల పరితృప్తిని గావించి పరిపూర్ణుని చేయును.

ఏయే జీవునకు, ఏ అనుభూతి కలుగవలెనో నిర్ణయించి, తదనుభూతి నందించి పరితృప్తుని గావించుచు తోడ్కొని పోవును.

ప్రతి పద్మమునందు గల ప్రతి దళము ఒక లోకానుభవమునకు సంకేతము. మూలాధారము నుండి సహస్రారమునకు గల మార్గమున అన్ని పద్మముల దళముల అనుభూతులు పూర్తి గావించుచు ముందుకు తోడ్కొని పోవునేగాని అసంపూర్ణముగ తోడ్కోనిపోవుట యుండదు. జగన్మాతకు జీవులందరు తన సంతానమే యగుట వలన, అందరునూ శివ సమాను లవవలెనని భావించు చుండును. శివుడు పరిపూర్ణుడు. తన భర్త. తన సంతానము కూడ భర్తతో సరిసమానమగు పరిపూర్ణతను పొందుటకు శ్రీదేవి చేయు కృషి అనిర్వచనీయము. సమస్త గురు పరంపర జీవోద్ధరణమునకు ఆమె నియోగించు యోగసైన్యము. అదియొక మహా సైన్యము. అమ్మ అనుగ్రహ విశేషముతో వారు కారుణ్యమూర్తులై జీవుల నుద్ధరించుటయే తమ జీవనముగ సృష్టియందు నిలచియున్నారు.



# 100. 'బ్రహ్మగ్రంథి విభేదినీ'

బ్రహ్మగ్రంథిని భేదించునది శ్రీదేవి అని అర్థము.

షట్చక్రములందు మొదలు, చివర గ్రంథులు గలవు. చక్రము పైని గ్రంథి, పై నున్న చక్రమును అనుసంధానించును. చక్రము క్రింది గ్రంథి, ఆ చక్రముయొక్క క్రింది వ్యూహమే. వీటినన్నిటిని అనుసంధానించినప్పుడు అది కమలములై విచ్చుకొని జీవులకు స్వస్వరూపము దర్శనమగును.

బ్రహ్మగ్రంథి భౌతిక సృష్టియందు జీవులను బంధించును. భౌతికమగు విషయముల చుట్టును జీవుని మనస్సు పరిభ్రమించు చుండును. ధనము, ఆస్తులు, ఆభరణములు, విలువైన వస్తువులు– ఇత్యాది విషయములపై చేతన ఆసక్తి పొందియుండును. భౌతికముగ తాను పొందిన దేదియు తనవెంట రాదని తెలిసియు మాయచే భౌతిక సృష్టి యందు జీవులు బంధింపబడి యున్నారు. పదార్థము జడమనియు, అచేతన మనియు, అశాశ్వత మనియు, అనిత్య మనియు తెలిసియు కోరుచు నుందురు.

మానవుని భౌతికదేహము పై తెలుపబడిన పదార్థ లక్షణములు కలిగి యున్నవి. దేహమునకు తగుమాత్రము పోషణ గావించి విధులను నిర్వర్తించుటయే ఆర్షమార్గము. దేహ పోషణమే ఆశయము కారాదు.

దేహాభిమానము జీవుని మిక్కిలిగ బంధించును. పలు ధర్మములను సాధించుటకే దేహము. అది జీవునికి వాహనము వంటిది. అది చక్కగ పనిచేయవలెను. అపుడు దానిని ఆధారముగ గొని జీవుడు తన పనులను చక్కబెట్టుకొనవలెను. వాహనము సద్వినియోగమునకే కాని అభిమానపడుటకు కాదు. సద్వినియోగము ముఖ్యము. సరియగు పోషణము ముఖ్యము. అది తామే అనుకొనుట అజ్ఞానము. తాము తమ వాహనము కాదు కదా! ఈ జ్ఞానము నందించునది శ్రీదేవియే. ఆమె మాయ వలననే రూపాత్మకమగు జగత్తునందు జీవుడు బంధింప బడి యున్నాడు. ఆమె అనుగ్రహము వలన దీనిని భేదింపవచ్చును. ఆమెయే 'భేదినీ' శక్తి. మాయ ఆమె వలననే కలుగుచున్నది. అది రహితమగుట కూడ ఆమె అనుగ్రహముగనే జరుగును.



# 101. 'మణిపూరాంత రుదితా'

**మ**ణిపూరక చక్రమందు ఉత్పత్తి యగునది శ్రీదేవి అని అర్థము.

స్వాధిష్ఠానమును భేదించుకొని మణిపూరకము చేరిన కుండలినీ చైతన్యము అచట భావమయ ప్రపంచమున ఉపాసకుని ఆరాధనా రూపమగు దేవిగ మొదట దర్శనమిచ్చును. దేవి రూపము నారాధించుట ద్వారా రూపాతీత స్థితిని చేరుట క్షేమకరమని ఋషులభిప్రాయము. ఆరాధకుడు దేహాస్థుడగుటచే రూపస్థుడు. అందువలన భావనా ప్రపంచమున దైవమును తనకు నచ్చిన రూపమున ఆరాధించుట క్షేమకరము. అవ్యక్తారాధనము దుఃఖము కలిగించునని శ్రీకృష్ణ భగవానుడు గీతయందు తెలిపియున్నాడు. సమయాచార పూజ యందు దేవిని సర్వాలంకార భూషితగ ఆరాధించుట కద్దు. దశ దళ పద్మము నూహించుకొని అందు రత్నములచే అలంకరింపబడిన శ్రీదేవిని దర్శించుచూ ఆరాధించుట వలన మణిపూరక చక్రము భేదింపబడి పద్మము నందు శ్రీదేవి దర్శనమిచ్చును. ఇది భావమయ దర్శనము. ఆరాధకుని మనస్సున ఏర్పరచుకొనిన మూర్తి రూపమున మనస్సున ఈ దర్శన మగును.

మణిపూరక చక్రము భావ పరంపరలకు పుట్టినిల్లు. మానవుడు మనోభావముల నాధారముగ చేసుకొనియే జీవించు చుండును. మనస్సు నందు ప్రాపంచిక భావనలే మెండుగ యుండును. తన ఆలోచనా సరళిని బట్టి మాటచేత యుండును. మాట చేత సరళిని బట్టి మరల

అవే భావములు పుట్టుచుండును. ఇది యొక భావనామయ చక్రము. ఈ చక్రమునందు ప్రాపంచిక వాసనలతో కూడిన మనస్సు వలదన్నను ప్రాపంచిక విషయములనే గుర్తుచేయు చుండును. దీని నంతర్ముఖము గావింపవలెనన్నచో చక్రము స్థానమున దశదళ పద్మమును, పద్మమునందు ఆసీనయైన సర్వాలంకార భూషితయైన శ్రీదేవిని ప్రతిపాదించుకొని ఆరాధించుకొన వలెను. ఆరాధన యొక్క ముఖ్య ఆశయ మిదియే. ప్రపంచమున తగులుకొన్న మనసును దైవీతత్త్వము వైపునకు మళ్ళించుటకు ఆకర్షణీయమగు మూర్తి ఆరాధన ఈయబడి నది. అట్లారాధించుట వలన అత్యంత సౌందర్యమగు దేవి మూర్తి యందు లగ్నమైన మనస్సు ప్రాపంచిక విషయములను క్షణకాలము మరచును. క్రమముగ నిరంత రారాధనా మార్గమున మనస్సు శ్రీదేవి పై లగ్నమైనపుడు మణిపూరక చక్రము భేదింపబడి పద్మము వికసించి ఆరాధకుని దివ్యభావనయందు స్థిరపరచును. దివ్యభావముల యందు రుచి కలిగిన మనస్సు ప్రాపంచిక విషయములపై నిక నారాటపడదు. ప్రపంచమునందు ఆరాధకు డున్నప్పటికిని ప్రాపంచిక విషయములు అంతగ బాధింపవు. అట్లు మణిపూరక చక్ర అంతరమున నుండి జీవుడు బాహ్యము నుండి అంతరమున ప్రవేశించి అందుండి బయల్పడును. అనగా అంతర్ముఖుడగుటకు అర్హతను పొందును.

బహిర్గతము నుండి అంతర్గత మగుట అందలి సాధన. బహిర్ముఖ మగు మనస్సు అంతర్ముఖమై అటు పైన ఆరాధన సాగించును.

# 102. 'విష్ణుగ్రంథి విభేదినీ'

**వి**ష్ణుగ్రంథిని విశేషముగ భేదించునది శ్రీదేవి యని అర్థము.

బ్రహ్మగ్రంథిని భేదించుకొని స్వాధిష్ఠానము నుండి మణిపూరకము చేరి అంతర్ముఖుడై ఆరాధన గావించు సాధకునకు తదుపరి లక్ష్యము విష్ణుగ్రంథి భేదనము. జీవుడు విష్ణురూపుడే. సనాతనుడే. అందుచేత అంతర్ముఖముగా విష్ణు నారాధన చేయవలెను లేక వైష్ణవీ ఆరాధనము చేయవలెను. తనను తాను సూక్ష్మముగ విష్ణురూపునిగ భావింపవలెను. తన స్థూల దేహము తన సూక్ష్మ విష్ణు రూపమునకు కవచమని భావింపవలెను. విష్ణువే నేను. ఈ దేహము నా కవచము. ఈ భావన పరిపూర్ణమైనపుడు జీవునికి పూర్ణ రక్షణ యుండును. నారాయణ కవచము, ఇతర దైవీ కవచములు ఈ మార్గముననే సిద్ధించును.

విష్ణువే నేను అని భావించుట 'సోఽహం' అను మంత్ర సిద్ధి నిచ్చును. 'సోఽహం' అనగా అతడే నేను అని అర్థము. దాని రూపాంతమే విష్ణువే నేను అని భావన. ఈ భావము స్థిరపడునపుడు స్థూలమువలె సూక్ష్మము కూడ అనిత్యమని తెలియును. ప్రాపంచిక భావనలు ప్రాపంచికానుభూతి నిచ్చును. దైవీ భావములు దివ్యానుభూతి నిచ్చును. రెండునూ భావమయములే. తాను నిత్యుడు. తన భావములు నిత్యములు. అందువలన ఈ స్థితియందు దైవీ విభూతుల కారాటపడుట యిక యుండదు. దైవమే తానుగ నున్నాడని తెలియుట మొదలిడును.

అపుడు విష్ణుమాయారూపుడై విష్ణుగ్రంథి భేదింపబడి జీవుడు ముందుకు సాగును.

విష్ణువు దేవతలను రక్షించి, అసురులను శిక్షించి ధర్మమును నిలబెట్టుచుండును. జీవునియందు కూడ దైవాసుర భావము లుత్పత్తి యగుచుండును. దేవతలు, అసురులు పరస్పర విరోధము కలవారు. ఇద్దరును ఒకే తండ్రికి జన్మించినవారు. అట్లే ఒకే జీవుని నుండి పరస్పర విరుద్ధమగు భావములు ఉత్పన్నమగుచుండును. అవి ఘర్షణ కలిగించును. ఇట్టి ఘర్షణను పరిష్కరించు తత్త్వమునే విష్ణువని పలికిరి. ద్వంద్వముల తీరుతెన్నులెరిగి తటస్థుడై కర్తవ్యము నిర్వహించు వారికి విష్ణువు ఆరాధన ఫలించును. చెడును దూషింపక మంచిని పెంపొందిం చుకొనుచు ముందుకు సాగుట ఈ ఆరాధనమున ప్రధానమగు భావము. అట్టివాడు కుడిఎడమల ప్రభావమునకు లోనుగాక మధ్యేమార్గమున భ్రూమధ్యమును చేరును. మణిపూరక పద్మము నుండి భ్రూమధ్యము వరకు గల సుషుమ్న మార్గమును విష్ణుపథము అని భావింపవచ్చును. మణిపూరకమున విష్ణుపాదములు అటు నుండి ఫాలభాగము వరకు గల తన దేహమును విష్ణు వాక్రమించి దైవాసురులు సమన్వయమును నిర్వర్తించుచున్నట్లుగ భావింపవలెను. ఇట్టి భావనతో విష్ణు సహస్రనామ పారాయణ గావించినచో సాధకునకు అంతర్ముఖ ఘర్షణలు ఉపశ మింపగలవు. మంచి చెడుల ఆటుపోట్లను అధిగమించి భ్రూమధ్యము నకు చేరవలెను. ఇట్లు చేరుట విష్ణుగ్రంథి భేదనము అని తెలుపబడినది.

# 103. 'ఆజ్ఞాచక్రాంతరాళస్థా'

ఆజ్ఞాచక్ర మధ్యమున నుండునది శ్రీదేవి యని అర్థము.

మూలాధారము నుండి ఆజ్ఞాకేంద్రము వరకుగల వివరణము రాబోవు నామములో ఇవ్వబడినది. జీవుని పరిణామమును సాధనను, కాలమును, ధర్మమునుబట్టి, జీవచైతన్యము మూలాధారము నుండి క్రమముగ ఊర్ధ్వముఖ మగుచుండును. బహి రంతఃకరణముల శుచి, నిష్కామకర్మ నిర్వహణము, ఫలితము లందాశక్తిలేని బుద్ధి, యజ్ఞార్థ జీవనము, సంకల్ప సన్యాసము, యమ నియమాది గుణములు– ఇవి అన్నియు జీవుని సహజ స్వభావమై, శ్రద్ధ, అనసూయత్వము కలిగి యున్నప్పుడు చైతన్యము ఆజ్ఞను చేరకలదు. ఆజ్ఞను చేరిన చైతన్యము జీవుని కధికార మిచ్చును. తన స్వభావముపై తనకు స్వామిత్వము నందించును. అట్టి జీవుడు ఆజ్ఞా పద్మమునందు ఆసీనుడైయున్న శ్రీ గురు దర్శనము చేయగలడు. మనస్సు ఇంద్రియములు నిర్వహింప బడుటచే బుద్ధిలోకమున స్థిరపడి అంతరాయములు లేక జ్ఞానోపాసను చేయును. ధ్యానము కుదురును. శ్రీకృష్ణుడు, ఆత్మదర్శనమునకై ధ్యానము చేయుటకు ఆజ్ఞాకేంద్రమునే సూచించినాడు. మనసున కవ్వలనున్న తాను తేజోమయ రూపుడని తెలియవలెనన్నచో ఆజ్ఞాచక్రము నందలి పద్మము వికసింపవలెను. అట్లు వికసింపచేయునది శ్రీదేవి యని ఈ నామము తెలుపుచున్నది. ఆజ్ఞాపద్మము వికసించునపుడు జీవుడు,

తాను హంస స్వరూపుడనని తెలుసుకొనుట జరుగును. ఆజ్ఞయందు హంస స్వరూపుల దర్శనము జరుగును. పరమగురువులను దర్శించుట యనగా నిదియే. దీనికి పూర్వము జరుగు దర్శనము లన్నియూ కేవలము చిత్తభ్రాంతియే. చిత్తభ్రాంతి సాధకునకు రుచి కలిగించునేమో కాని భ్రాంతి దర్శనము సత్యదర్శనము కాదు కదా!

ప్రాథమిక దశలో నున్న సాధకునకు కనిపించుట, వినిపించుట తరచుగ జరుగుచుండును. అందలి రుచిని గుర్తించిన సాధకుడు గురుముఖముగ సాధనను శ్రద్ధతో, అనసూయత్వముతో నిర్వర్తించు కొనవలెను. భావమయ లోకముల యందు ముక్తి చెందిన జీవుడే సత్యదర్శనమున కర్హుడు. మైత్రేయాది మహర్షుల దర్శనము ఆజ్ఞ చేరిన వారికే జరుగగలదు. ఆత్మ దర్శనమునకు చేరువలోనే ఆత్మ స్వరూపుల దర్శనము జరుగును. అదియే సద్గురు దర్శనము ఈ దర్శనమునకు చేర్చు అనుగ్రహ దేవతయే శ్రీదేవి.



# 104. 'రుద్రగ్రంథి విభేదినీ'

రుద్రగ్రంథి ద్వయమును విశేషముగ భేదించునది శ్రీదేవి యని అర్థము.

స్వాధిష్ఠానమున బ్రహ్మగ్రంథి భేదనము, మణిపూరకమున విష్ణు గ్రంథి భేదనము తెలుపబడినవి. రుద్రగ్రంథి భేదనము అనాహత చక్రమున జరుగును. పంచభూతములలో భూమి, జలము బ్రహ్మ గ్రంథిచే నియమింపబడును. అగ్ని, దాని తేజస్సు విష్ణుగ్రంథిచే నియ మింపబడును. వాయువు, ఆకాశము రుద్రగ్రంథిచే నియమింపబడును. రుద్ర గ్రంథిని భేదించుట యనగా వాయువును ఆకాశమున చేర్చి, ఆకాశ తరంగములను దాటి చిదానంద స్థితిని చేరుట.

శరీరము పంచభూతాత్మకము. అందు జీవుడు వసించి యుండును. పంచభూతములకు మూలము ఆకాశమే. ఆకాశము నుండి వాయువు, వాయువు నుండి అగ్ని (తేజస్సు), దాని నుండి జలము, దాని నుండి భూమి పుట్టుచున్నవి. వీనియందు ఉపస్థితుడైన జీవుడు క్రమముగ వీనిని దాటుటయే గ్రంథి భేదనము. శ్రీదేవి మొదట త్రిగుణాత్మికయై అందుండి పంచభూతములను సృష్టించినది. త్రిగుణ ములు పంచభూతములు కలిసి ఎనిమిది స్థానముల నేర్పరచినది. అవియే అష్ట ప్రకృతులు. అందు జీవుని ప్రవేశింపజేసి సృష్టి నిర్మాణము పూర్తి చేయును. ఆరోహణ క్రమమున జీవుడు, అమ్మ అనుగ్రహము ద్వారా వీటిని మరల దాటి స్వతంత్రుడై సృష్టి వైభవమును పొందును.

భూమి, జలముల కేంద్రములు మూలాధారము, స్వాధిష్ఠానము. అచట జీవుని నియమించునది బ్రహ్మగ్రంథి. మణిపూరకము అగ్ని స్థానము, భావమయ స్థానము. అచ్చట జీవుని నియమించునది విష్ణుగ్రంథి. అనాహతము, విశుద్ధి వరుసగా వాయువు, ఆకాశమునకు సంబంధించిన కేంద్రములు. వీనిని నిర్వర్తించునది రుద్రగ్రంథి. ఆజ్ఞ యందు జీవుడు స్వస్వరూపుడు, త్రిగుణాత్మకుడు మరియు విదేహుడు. అనగా పంచభూతములతో కూడిన దేహము లేనివాడు. ఇతనినే హంస స్వరూపుడందురు.

విష్ణుగ్రంథి భేదన సమయమున జీవుడు తనయందు విష్ణువే స్వరూపము కొనియున్నాడని, భౌతిక దేహము తన విష్ణు రూపమునకు కవచమని తెలిపితిమి. రుద్రగ్రంథి భేదనమున నిజమునకున్నది విష్ణువే యనియు, తాను కాదనియు తెలియును. 'విశ్వం విష్ణుః' అను సత్యము దర్శనమగును.



# 105. 'సహస్రారాంబుజారూఢా'

వేయి సంఖ్యల దళములు గల పద్మము అధిష్ఠించియున్న శ్రీదేవి అని అర్థము.

సహస్ర అను పదము సంకేత పదము. అది మంత్రము కూడ. 'స' అను అక్షరము పరతత్త్వమునకు సంకేతము. 'హ' అను అక్షరము పరాశక్తికి సంకేతము. 'స్ర' అను అక్షరము అగ్నిబీజము. ఆధారముగ నేర్పడిన సృష్టియని అర్థము. ఈ మంత్రము యొక్క రహస్యార్థము, సహస్రారకమల దర్శనులకు మాత్రమే తెలియగలదు. అత్రి ఆదిగాగల మహర్షులు ఈ మంత్రశక్తి నెరిగియున్నారు. సమస్త సృష్టి స్థితి లయ కార్యములు అవగతమై తమవంతు కర్తవ్యము నిర్వర్తించు శ్రీదేవి పరమ భక్తులకే ఈనామ రహస్యము తెలియగలదు. ఇతరులు తెలియలేరు. ఈ మంత్ర రహస్యము తెలిసినవారు త్రిగుణముల కాధారమైన మూలశక్తిని తెలిసినవారే. మూల ప్రకృతిని తెలిసినవారే. అత్రి మహర్షి అనసూయత్వము ఆధారముగ సాగించిన తపస్సు ఫలముగ ఈ మంత్ర రహస్యము నెరిగినారు. అతడు శాంతివంతుడు, క్రతుక్రియానిష్ఠుడు, సత్త్వగుణోపేతుడు, శ్రద్ధావంతుడు మరియు కళావంతుడును. అతని యందు శ్రీదేవి పదహారు కళలు భాసించును. అనసూయాదేవి అత్రి మహర్షిని ఆరాధించి జగన్మాత స్థితిని పొందినది. త్రిగుణాతీతులే సహస్ర దళ పద్మమున స్థితికొనగలరు.

'సహస్ర' అను నామమునకు వేయి (1,000) అని అర్థము. వేయి అనగా మూడు లోకముల కవ్వలి తత్త్వము అని అర్థము. ఆ తత్త్వ మొకటియే. అది ఆధారముగ సువర్లోకము, భువర్లోకము, భూలోకము ఉద్భవించినవి. సహస్రార దళ పద్మమందు శ్రీదేవి యున్నదనగా ఆమె లోకాతీత, గుణాతీత యని అర్థము. అది పరమ పదము. అచట దేవి శివుని కూడియుండును. శివ తత్త్వము నాధార ముగ సమస్త సృష్టియు త్రిగుణముల ద్వారా ఏర్పరచి మూలాధార చక్రము వరకును వ్యాపించును. ఈ మొత్తము మార్గమంతయు అమ్మ చైతన్యమార్గమే. ఈ మార్గమున అమ్మ నిరాటంకముగ ఆరోహణము, అవరోహణము చేయుచు నుండును. ఆమె స్వస్థానము సహస్రారము.



# 106. 'సుధాసారాభివర్షిణీ'

సహస్రార కమలము యొక్క 'కర్ణిక' (తూడు లేక కాడ) నుండి అమృతధారలు వర్షింప చేయునది శ్రీదేవి అని అర్థము.

సహస్ర దళ పద్మముయొక్క తూడు లేక కాడ వెన్నెముక యందలి సుషుమ్న నాడిగ మూలాధారము వరకు వ్యాపించి యుండును. ఈ నాడి నుండి శ్రీదేవి తెలివిని, ప్రాణమును ప్రసరింపచేయును. తూడు నందు అచ్చుటచ్చుట కణుపు లేర్పడి షట్చక్రము లేర్పడును. అచట గ్రంథులు కూడ ఏర్పడును. గ్రంథులు స్రవించు లక్షణము గలవి. సాధకుని చైతన్యస్ఫూర్తిని బట్టి అమ్మ అనుగ్రహముగ ప్రతి గ్రంథియు తత్సంబంధిత జ్ఞానమును, ప్రాణమును మిక్కుటముగ వర్షింప చేయగలదు. ఇట్లు వర్షింపచేయు గ్రంథులను ధేనువులని, కామధేనువు లని ఋషులు సంకేతించిరి. శ్రీవిద్య, బ్రహ్మ విద్య, యోగవిద్య ఆదిగా గల మార్గమున సుధాసారము వర్షితము కాగలదు.

సామాన్య మానవులకు షట్చక్రముల గ్రంథుల నుండి నరములు, నాడులు ఆధారముగ ప్రాణము, తెలివి శరీరమున తగుమాత్రముగ ప్రసరించు చుండును.

సాధనా మార్గమున ఈ గ్రంథులను పరిపుష్టము గావించుకొని వానిని కామధేనువులుగ తీర్చిదిద్దుకొను విద్య పెద్దలందించినారు.

వశిష్ఠుడు జమదగ్ని ఆదిగా గల మహర్షుల వద్ద కామధేనువు లున్నట్లు పురాణములు తెలుపును. వారి వద్దగల కామధేనువు, ఒక ప్రత్యేకమైన గోవు కాదు. అది వారి ధేనుత్వమే, వారి తపశ్శక్తియే. ఆ తపశ్శక్తి ఒక లక్షణమైన గోవునందు వారు ప్రవేశింపచేసినపుడు ఆ గోవు కామధేను వగుచుండును. ఈ కామధేనుత్వము నందించునది శ్రీదేవియే.

అమ్మ అనుగ్రహ వశమున అమాయకు డొకడు మహాకవి కాళిదాసువలె పరిణమించెను. వేదవ్యాసుడి తరువాత వేదవ్యాసుడంతటి వాడు కాళిదాస మహాకవియే. అమ్మ ఎంత ఆగ్రహించగలదో అంత అనుగ్రహించగలదు. ఆమె పాదములను హృదయమున భావించి పూజించు వారికి అమృతధారలు వర్షించు నవకాశము కలదు. మరణమును దాటుటకు, బ్రహ్మత్వమును పొందుటకు శ్రీదేవి పాదములు చాలును.



# 107. 'తటిల్లతా సమరుచి'

**మె**ఱపుతీగతో సమానమైన కాంతిగలది శ్రీదేవి అని అర్థము.

మెఱపుతీగల కాంతి క్షణముకన్న దర్శించుటకు వీలుపడదు. అదియును అత్యంత దూరముగ మెఱసినపుడే క్షణకాలము చూడనగును. అట్టి కాంతితో కూడిన శ్రీదేవిని చర్మచక్షువులతో చూడలేము. మహాత్ముల దర్శనమే చర్మచక్షువులకు దుర్లభము. ఒకవేళ అగుపించినను ఆ క్షణముననే కన్నులు గ్రుడ్డి వగును. అంతః చక్షువులను సాధనా మార్గమున పొందినవారు మహాత్ముల దర్శనము చేయవచ్చు నేమోకాని శ్రీదేవి దర్శనమును చేయజాలరు. ఆమె కాంతి నిరుపమానము. సృష్టి యందలి ఏ కాంతియైనను ఆమె కాంతిలోని మచ్చుతునకయే. సమస్త దేవతాశక్తులు త్రిమూర్తి సహితముగ ఒక కాంతి నూహించినచో అది అమ్మకాంతికి సమానము ఆమె కాంతిపుంజమే విద్యుత్తు. మెఱపువలె ప్రకాశించినపుడు సుదూరముగ చూడవచ్చును. అందులకే అమ్మ దర్శనమునకు ఆరాట పడుటకన్న, ఆమె పాదముల వేలిగోళ్ల కాంతులను ముందు దర్శించుటకు సిద్ధపడవలెను.

కాంతి దర్శనమునకు ముందు దానితో సరిసమానమైన శక్తి గల శబ్దగర్జన యుండును. మెఱపు మెఱయుటకు ముందు మహత్తర మగు శబ్దము వినిపించును. అటుపైన మెఱపుతీగ కనిపించును. మెఱపు గర్జనయే గుండె పగిలినట్లుండును. అట్టి సమయమున అమ్మ

కనిపించుటకు ముందు ఎట్టి గర్జన యుండవలెను? అమ్మ కనిపించుటకు ముందు వెలువడు గర్జనయే ఆమె సింహము యొక్క గర్జన.

అమ్మతత్త్వము ఈ భూమిపై 'శైలపుత్రి' రూపమున హిమాలయములలో సంచరించు చుండునట. ఆమె సింహవాహిని యట. ఆమె దర్శనమునకు ముందు మహాత్ములకు సైతము గుండె లదరునట్లు సింహ గర్జనము వినపడి సింహము కనపడునట. అపుడు మహాత్ములు అప్రమత్తులై చేతులు జోడించి, కన్నులు మూసుకొని వారి ఆజ్ఞా కేంద్రమున గల మూడవ కన్ను నుండి అమ్మను దర్శించి అమ్మ భాషణమును, ఆదేశమును వినుదురట. విద్యుల్లత వలె మెఱపుతో గూడిన అమ్మ దర్శనము, భాషణము, స్పర్శనము చేయుట యనగా విద్యుత్తును స్పర్శించుటయే. విద్యుత్ సమానమైన కాంతి కలవారే విద్యుత్ స్పర్శనము చేయగలరు.

అట్టి కాంతి దర్శనముతో ఎంతటి అజ్ఞానమైనను నశించునని తెలుపుటలో ఆశ్చర్య మేమున్నది. అది అతిశయోక్తి కానేకాదు. అమ్మ కాంతిని గూర్చి భావన చేయుటయే ఈ నామము యొక్క ముఖ్య ఉద్దేశ్యము. అమ్మ కాంతి నూహింపుడు, భావింపుడు. శక్తికొలది మీ యందు దర్శింపుడు.



# 108. 'షట్చక్రోపరి సంస్థితా'

**ఆ**రు చక్రముల ఉపరితలమున సహస్రార పద్మమందు, సమ్యక్ స్థిత అయినది శ్రీదేవి యని అర్థము.

శ్రీదేవి స్వస్థానము సహస్రార పద్మమని తెలుపబడినది. ఆమె సహస్రార పద్మము నధిష్ఠించి మెఱపువలె మెరయుచుండగ ఆ కాంతియే ఆరు చక్రములందు అవరోహణ క్రమమున అవతరించును. ఆ కాంతి ననుసరించియే తెలివి, ప్రాణము వర్షించును. ఆ కాంతియే జీవుల అస్థిత్వము. అస్థిత్వము, తెలివి, ప్రాణము అను మూడు అంశలతో కూడిన శ్రీదేవి తత్త్వము సుషుమ్న నాడియందు సరస్వతీ నదివలె ప్రవహించు చుండును. ఆ ప్రవాహమున ఏర్పడు ఘట్టములు సృష్టియందు, మానవుని యందు లోకములుగ ఏర్పడును. అవరోహణ క్రమమున పదార్థము సూక్ష్మతమము నుండి, సూక్ష్మతరము, సూక్ష్మము, స్థూలము అగుచుండగ అస్థిత్వ జ్ఞానము, ప్రాణము, తెలివి సన్న గిల్లుచుండును. ఇందు ఒక్కొక్క ఘట్టమునందు దేవి అంశలుగ జ్వాలామాలిని, మంత్రిణి, వారాహి, శ్యామల, బాల ఇత్యాది దర్శనము లగుచుండును. దేవి పరిపూర్ణ దర్శనము మాత్రము సహస్రారము నందే జరుగ గలదు. ప్రాథమికముగ జరుగు దర్శనములు సాధకులకు రుచి కల్పించి ప్రోత్సహించును. శ్రద్ధాభక్తులతో ఏకాగ్ర చిత్తముతో ఆరాధించువారికి లోన నిర్మలత్వము పెరిగి, దర్శనకాంతి

పెరుగుచుండును. శ్రీదేవి అన్ని కాంతులయందు క్రమముగ దర్శన మిచ్చుచుండును. నలుపు నుండి వజ్రకాంతి వరకు గల సమస్తమగు వర్ణముల కాంతి అమ్మ నుండి ఉద్భవించినవే. అట్టి దర్శనము జీవులకు సర్వ శుభంకరము.

*మొదటి భాగము సంపూర్ణము*



శ్రీరస్తు.

*శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః ।*

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రరత్నము

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ ।
చిదగ్నికుండసంభూతా దేవకార్య సముద్యతా ॥ 1

ఉద్యద్భానుసహస్రాభా చతుర్బాహు సమన్వితా ।
రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా ॥ 2

మనోరూపేక్షుకోదండా పంచతన్మాత్రసాయకా ।
నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండ మండలా ॥ 3

చంపకాశోకపున్నాగ సౌగంధిక లసత్కచా ।
కురువిందమణిశ్రేణీ కనత్కోటీర మండితా ॥ 4

అష్టమీచంద్రవిభ్రాజ దళికస్థల శోభితా ।
ముఖచంద్ర కళంకాభ మృగనాభి విశేషకా ॥ 5

వదనస్మరమాంగళ్య గృహతోరణ చిల్లికా ।
వక్త్రలక్ష్మీపరీవాహ చలన్మీనాభలోచనా ॥ 6

నవచంపకపుష్పాభ నాసాదండ విరాజితా ।
తారాకాంతితిరస్కారి నాసాభరణ భాసురా ॥ 7

కదంబమంజరీ క్లృప్త కర్ణపూర మనోహరా ।
తాటంక యుగళీభూత తపనోడుపమండలా ॥ 8

పద్మరాగశిలాదర్శ పరిభావి కపోలభూః ।
నవవిద్రుమ బింబశ్రీ న్యక్కారి రదనచ్ఛదా ॥ 9

శుద్ధవిద్యాంకురాకార ద్విజపఙ్క్తిద్వయోజ్జ్వలా ।
కర్పూరవీటికామోద సమాకర్షద్దిగంతరా ॥ 10

నిజసల్లాపమాధుర్య వినిర్భర్త్సితకచ్ఛపీ ।
మందస్మిత ప్రభాపూర మజ్జత్కామేశమానసా ॥ 11

అనాకలితసాదృశ్య చుబుక శ్రీవిరాజితా ।
కామేశబద్ధమాంగల్య సూత్రశోభితకంధరా ॥ 12

కనకాంగద కేయూర కమనీయ భుజాన్వితా ।
రత్నగ్రైవేయ చింతాక లోలముక్తా ఫలాన్వితా ॥ 13

కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణస్తనీ ।
నాభ్యాలవాలరోమాళి లతాఫల కుచద్వయీ ॥ 14

లక్ష్యరోమ లతాధారతా సమున్నేయ మధ్యమా ।
స్తనభారదళన్మధ్య పట్టబన్ధవళిత్రయా ॥ 15

అరుణారుణ కౌస్తుంభ వస్త్రభాస్వ త్కటీతటీ ।
రత్నకింకిణికారమ్య రశనాదామభూషితా ॥ 16

కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరుద్వ యాన్వితా ।
మాణిక్యమకుటాకార జానుద్వయ విరాజితా ॥ 17

ఇంద్రగోపపరిక్షిప్త స్మరతూణాభ జంఘికా ।
గూఢగుల్ఫా కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా ॥ 18

నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా ।
పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా ॥ 19

శింజానమణి మంజీర మండిత శ్రీపదాంబుజా ।
మరాళీ మందగమనా మహాలావణ్య శేవధిః ॥ 20

సర్వారుణాఽనవద్యాంగీ సర్వాభరణభూషితా ।
శివకామేశ్వరాంకస్థా శివా స్వాధీనవల్లభా ॥ 21

సుమేరుశృంగమధ్యస్థా శ్రీమన్నగరనాయికా ।
చింతామణి గృహాంతస్థా పంచబ్రహ్మాసన స్థితా ॥ 22

మహాపద్మాటవీ సంస్థా కదంబవనవాసినీ ।
సుధాసాగరమధ్యస్థా కామాక్షీ కామదాయినీ ॥ 23

దేవర్షి గణసంఘాత స్తూయమానాత్మ వైభవా ।
భండాసుర వధోద్యుక్త శక్తి సేనా సమన్వితా ॥ 24

సంపత్కరీ సమారూఢ సింధుర వ్రజసేవితా ।
అశ్వారూఢాధిష్ఠి తాశ్వకోటి కోటిభిరావృతా ॥ 25

చక్రరాజ రథారూఢ సర్వాయుధ పరిష్కృతా ।
గేయచక్రరథారూఢ మంత్రిణీ పరిసేవితా ॥ 26

కిరిచక్రరథారూఢ దండనాథ పురస్కృతా ।
జ్వాలామాలినికా క్షిప్తవహ్ని ప్రాకారమధ్యగా ॥ 27

భండసైన్య వధోద్యుక్త శక్తి విక్రమహర్షితా ।
నిత్యా పరాక్రమాటోప నిరీక్షణ సముత్సుకా ॥ 28

భండపుత్రవధోద్యుక్త బాల విక్రమనందితా ।
మంత్రిణ్యంబావిరచిత విషంగ వధతోషితా ॥ 29

విశుక్రప్రాణహరణ వారాహీ వీర్యనందితా ।
కామేశ్వరముఖాలోక కల్పిత శ్రీ గణేశ్వరా ॥ 30

మహాగణేశనిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా ।
భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్రవర్షిణీ ॥ 31

కరాంగులి నఖోత్పన్న నారాయణ దశాకృతిః ।
మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసురసైనికా ॥ 32

కామేశ్వరాస్త్రనిర్దగ్ధ సభండాసుర శూన్యకా ।
బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవసంస్తుత వైభవా ॥ 33

హరనేత్రాగ్ని సందగ్ధ కామసంజీవనౌషధిః ।
శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూప ముఖపంకజా ॥ 34

కంఠాధః కటిపర్యంత మధ్యకూట స్వరూపిణీ ।
శక్తి కూటైక తాపన్న కట్యధోభాగధారిణీ ॥ 35

మూలమంత్రాత్మికా మూలకూటత్రయ కళేబరా ।
కులామృతైక రసికా కులసంకేత పాలినీ ॥ 36

కులాంగనా కులాంతస్థా కౌళినీ కులయోగినీ ।
అకులా సమయాంతస్థా సమయాచారతత్పరా ॥ 37

మూలాధారైక నిలయా బ్రహ్మగ్రంథి విభేదినీ ।
మణిపూరాంత రుదితా విష్ణుగ్రంథి విభేదినీ ॥ 38

ఆజ్ఞాచక్రాంతరాళస్థా రుద్రగ్రంథి విభేదినీ ।
సహస్రారాంబుజారూఢా సుధాఽ ఽ సారాభివర్షిణీ ॥ 39

తటిల్లతా సమరుచి ష్షట్చక్రోపరి సంస్థితా ।

మొదటి భాగము సంపూర్ణము

## OTHER BOOKS THROUGH
# MASTER K. PARVATHI KUMAR

*The following books are available in: English (E), German (G), Spanish (S), French (F), Hebrew (H), Telugu (T), Hindi (HI) and Kannada (K) languages.*

**BOOKLETS :**

| No. | Title | Languages |
|---|---|---|
| 1. | LORD MAITREYA -The World Teacher | E/G/S/F |
| 2. | THE WHITE LOTUS | E/G/S |
| 3. | WISDOM BUDS | E/G/S |
| 4. | SPIRITUALISM, BUSINESS & MANAGEMENT | E/G/S |
| 5. | THE PATH OF SYNTHESIS | E |
| 6. | THE ETHERIC BODY | E/G/S |
| 7. | MARIA MAGDALENA | E/G/S |
| 8. | TIME THE KEY | E/G/S |
| 9. | LISTENING TO THE INVISIBLE MASTER | E/G/S/F/H |
| 10. | GOOD FRIDAY | E/G/S/F/H |
| 11. | BHRIKTA RAHITA TARAKA RAJAYOGAMU | T/K |
| 12. | MARRIAGE - A SACRAMENT | E |
| 13. | MASTER C.V.V. YOGAMU-KARMARAHITYAMU | T |

**BOOKS :**

| No. | Title | Languages |
|---|---|---|
| 14. | MITHILA –A New Age Syllabus | E/G/S |
| 15. | THE AQUARIAN MASTER | E/G/S |
| 16. | SOUND –The Key & its Application | E/G/S |
| 17. | ASHRAM LEAVES | E/G/S |
| 18. | SANKHYA –The Sacred Doctrine | E/G/S |
| 19. | VENUS –The Path to Immortality | E/G/S |
| 20. | THEOSOPHICAL MOVEMENT | E/G/S |
| 21. | SHIRDI SAY SAYINGS | E/G/S |

| | | |
|---|---|---|
| 22. | SPIRITUALITY IN DAILY LIFE | S |
| 23. | THE MASTERS OF WISDOM | S |
| 24. | MEDITATION & GAYATRI | S |
| 25. | WISDOM TEACHINGS OF VIDURA | E/G/S |
| 26. | ON HEALING | E/G/S |
| 27. | SPIRITUAL FUSION OF EAST & WEST | E |
| 28. | SRI SASTRY GARU | E/G/S/F/T |
| 29. | THE AQUARIAN CROSS | E/G/S |
| 30. | HERCULES –The Man & the Symbol | E/G/S |
| 31. | MANTRAMS –Their Significance & Practice | E/G/S |
| 32. | SRI DATTATREYA | E/G/S/T/HI |
| 33. | SATURN –The Path to Systematised Growth | E/S |
| 34. | JUPITER –The Path of Expansion | E/S |
| 35. | MASTER E.K. –The New Age Teacher | E/G/S |
| 36. | AMANASAKUDU | T/K |
| 37. | VRUTRASURA RAHASYAM | T |
| 38. | THE DOCTRINE OF ETHICS | E |
| 39. | DHANAKAMUNI KATHA | T |
| 40. | ANTARDARSANA DHYANAMULU | T |
| 41. | THE SPLENDOR OF SEVEN HILLS | E/T/Hi |
| 42. | DOCTRINE OF ETERNAL PRESENCE | E |
| 43. | ASANGUDU | T |
| 44. | SARASWATHI - THE WORD | E |
| 45. | MANA MASTERU GARU | T |
| 46. | GEETOPANISHAD | T |
| 47. | SRI LALITHA | T |
| 48. | POOJA VIDHANA PRASASTYAMU | T |
| 49. | GAYATRI MANTRA PRASASTYAMU | T |
| 50. | Katha Deepika | T |

# శ్రీలలిత

## ద్వితీయ భాగము

(109 నుండి 200 నామములకు వివరణము)

2

మాస్టర్ పార్వతీకుమార్



ధనిష్ఠ

ప్రథమ ముద్రణ : 2007
ప్రతులు : 1,000

వెల : రూ॥ **40-00**

ప్రాప్తిస్థానము :
జగద్గురు మందిరము
(ది వరల్డ్ టీచర్ టెంపుల్)
'రాధామాధవమ్',
14-38-2, ముప్పిడి కోలనీ,
విశాఖపట్నం - 530 002.

ముద్రణ :
♒ ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్
విశాఖపట్నం - 530 016.
☏ 0891-2747320.



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువలేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జన్మించినది.

**"ధనిష్ఠ",** డా॥ కంభంపాటి పార్వతీకుమార్ గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపము లోను, పుస్తకముల రూపములోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును, సద్గోష్ఠికై వలసిన వాతావరణమును - "జగద్గురు మందిరము" గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

## *సంకలనకర్త :* మాస్టర్ కంభంపాటి పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగా భ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయులకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ కంభంపాటి పార్వతీకుమార్** గారు. వారి బోధనలు లెక్కకు మించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియ వచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసర ణీయమై, ఆచరణయోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించుచున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళా రంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో - మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే, దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, "మానవ సేవయే మాధవసేవ" అను మాటకు సరియైన అర్థము యిదేనని శ్రీ కుమార్‌గారు తమ ప్రవర్తన ద్వారా తెలియపరచుచున్నారు.

శ్రీ పార్వతీకుమార్ బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక - మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, అనేక గ్రంథముల సంకలన కర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొను చుండుననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు శ్రీ కుమార్‌గారి దృఢవిశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

శ్రీ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశవిదేశములలో పరహితసేవ గావించుచున్నవి. *"పరహితము పరమధర్మ"* మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

"శ్రీలలిత" అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతి మాసము 'నావాణి' దర్శన మాస పత్రికయందు ప్రచురింప బడుచున్నవి. పాఠకుల కోరికపై మొదటి 108 నామములను ఒక పుస్తకముగ "ధనిష్ఠ" ప్రచురించినది. దాని తదుపరి 109వ నామము నుండి 200వ నామము వరకు ద్వితీయ భాగముగ ప్రస్తుతము అందించుచున్నాము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీరమగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారినుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారి యందు, వారి భాషణయందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహపరములకు పరిష్కారమని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

**- ధనిష్ఠ**

# పరిచయము

**ల**లితాదేవి, శ్రీదేవి, దుర్గ, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమెయే మూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్తస్థితి యందు సత్యముగను, వక్తస్థితి యందు మహాచైతన్యముగను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు, సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితి గొనుటకు వినియోగ పడును. అందులకే పారాయణము.

అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వ్యాఖ్యానము. సామాన్యు లకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

- పార్వతీకుమార్

# విషయసూచిక

# శ్రీలలిత



ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

# 109. 'మహాసక్తి'

**మ**హాసక్తి అనగా మహత్తరమైన శక్తి. శ్రీదేవి ఆసక్తి కలది అని అర్థము.

ఆసక్తి అనగా ఉత్సవరూప. అమితమైన ఉత్సాహము కలది శ్రీదేవి. ఆమె శివునితో సమయోగము నుండుటచే నిత్యము ఉత్సవము నందుండును. పరమాత్మతో యోగము చెందినవారు పరమానంద భరితులై ఉందురు. అట్టి యోగమున శివుని సహరూపమునుగొని సమయోగమున నిలచినదే శ్రీదేవి. ఆమె నారాధించిన వారికి అట్టి యోగస్థితిని ఆమె అనుగ్రహింపగలదు. ఆమె ఉద్భవమే ఉత్సాహ భరితము. ప్రజ్ఞా ప్రకృతుల సంయోగమున నున్న యోగులుకూడ అట్లే ఉత్సాహభరితులై యుందురు. మేలుకొనినది మొదలు నిదురించువరకు అట్టి ఉత్సాహముననే వారు జీవింతురు.

సృష్టియందు శివతత్త్వము అగ్నియై నిలచుటచే, అగ్ని తేజస్సు నందు ఆసక్తి కలది అనికూడ భావింపవచ్చును. సృష్టియందు నామ రూప సామ్యమును పొందుటయందుకూడ శ్రీదేవికి ఆసక్తి కలదు. తత్త్వమునకు గుణరూపము నేర్పరచి ఉత్సహించుచు నుండును. ఒంటి నలుగుతో వినాయకుని సృష్టించుట యందు ఈ ఉత్సాహమును కనపరచును.

అదే విధముగ ఆత్మ సమాగమమునందు కూడ ఆసక్తి కలది శ్రీదేవి. సృష్టితోను, శివునితోను సమాగమము చెంది చైతన్య స్వరూపిణియై అమితానందమును ఎల్లప్పుడునూ పొందుచు నున్నది శ్రీదేవి. ఆమె ఆసక్తి వర్ణనాతీతము.



# 110. 'కుండలినీ'

**కుం**డలములు కలది శ్రీదేవి అని అర్థము.

గోళాకారముగా సృష్టి నిర్మాణము గావించి, అందుండి అండా కారములుగా బ్రహ్మాండమునుండి పిండాండము వరకు సృష్టి నిర్మాణము చేయునది శ్రీలలిత అని అర్థము.

మూలాధారమందలి అగ్ని తేజస్సు యందు ఉన్న జీవశక్తి కుండలినే. తేజోరూపమైన ప్రాణాకారము కలిగి సర్పమువలె మూలమున స్థితిగొని యుండి, సుషుమ్న మార్గమున సహస్రారము వరకు వ్యాపింపగల తేజస్విని కుండలిని. ప్రాణుల యందలి జీవచైతన్యమే కుండలిని. ఈ కుండలినీ మార్గము సృష్టియందు సత్యలోకము నుండి భూలోకము వరకు తీగవలె చుట్టలు చుట్టలుగా వ్యాపించి యుండును. భూమండలము, సూర్యమండలము, సవితృ మండలము, భర్గోదేవ మండలము వ్యాపించి సర్వమును నిర్వర్తించుచు నుండును. వాక్కు రూపమున ఉద్భవించునది కనుక వాగ్భవ అని కూడ కుండలినీ చైతన్యమును పిలుతురు. జీవ చైతన్యము ఏ లోకమున స్థితి గొనినదో ఆ లోకము వరకు వ్యాపించి కుండలిని యుండును. మానవునియందు భౌతిక, ప్రాణమయ, మనోమయ కోశములయందు వ్యాపించి, విజ్ఞానమయపు అంచుల వరకు కుండలినీ చైతన్యమున్నదని తెలుపుదురు. కారణము ఏమనగా మానవునికి

భౌతికము, ప్రాణమయము, మనోమయము అగు లోకములు అవగతమై ఉండుటయే. కొంత బుద్ధికూడ ప్రతిమానవునియందును ఉండుటచే, మూడున్నర చుట్టలుగా కుండలినీ చైతన్యమున్నదని అందురు. బుద్ధిలోకమున ప్రవేశించిన వారికి కుండలిని నాలుగు చుట్టలుగ ఉండును.

అట్లే ఆనందమయ లోకమున ఐదుగను, అనుపాదక లోకమున ఆరుగను, ఆదిలోకమున ఏడుగను చుట్టలు గలిగి యుండును. ఏడు చుట్టల కుండలినీ చైతన్యము వ్యాపించినపుడు, సహస్రారమందలి శివతత్త్వముతో చేరినప్పుడు, సుస్థిరురాలై యుండును. కుండలినీ చైతన్యము ఊర్ధ్వగతి చెందుట యనగా జీవుడు పరిణతి చెందుటయే.



# 111. 'బిసతంతుతనీయసీ'

**తా**మరతూడులోని దారమువలె మిక్కిలిగా కృశించిన రూపము కలది, అనగా సూక్ష్మమైనది అని అర్థము.

కుండలినీ చైతన్యము సర్పాకారముగ వర్ణింపబడినను, అతి సూక్ష్మమైన దారమువలె దర్శనమిచ్చును. చుట్టలుగా మూలాధారమున ఉండుటచే సర్పాకారమనిరి. నిజమునకు అది సూక్ష్మమగు చైతన్యము. తేజస్సు, ఆ తేజస్సు సుషుమ్న మార్గమున అతి సూక్ష్మమై సాగును. ప్రాణాయామ సాధనమున వాయువు సహకారముతో ఈ చైతన్యము స్వాధిష్ఠానమందు అగ్నివలె ప్రజ్వలించును. అటుపైన గల ప్రజ్ఞా చక్రములను ఛేదించు కొనుచూ సహస్రారము చేరును. ఈ మొత్తము మార్గమును సుషుమ్న నాడిగ తెలుపుదురు. అందు ఊర్ధ్వముఖము చెందు ప్రజ్ఞ తేజోరూపమైన సర్పముగా వర్ణింతురు.

తామరతూడులో కొన్ని వందల దారములున్నవి. అందలి దారము నొకదానిని పరిశీలించినచో, పాఠకునకు కుండలినీ చైతన్యపు సూక్ష్మత్వము కొంత అవగాహన కాగలదు.

అరుణోపనిషత్తు ఈ విధముగా బోధించుచుండును. "ఓ భారతీయుడా! అగ్నిని ఆశ్రయింపుము. సోమస్థితి చేరి తృప్తి పొందుము. సోముడనగా అమృతత్వమునకు చెందిన ప్రజ్ఞ. ఉమతో కూడిన ఈశ్వరుడు. ఇచట ఉమ ఈశ్వరుని చేరుట సిద్ధి. ఆమె సహస్రారమున

ఈశ్వరునితో చేరిన కుండలినీ చైతన్యము. మూలాధారమున ఆమె పుట్టిన బాలికవలె బుసకొట్టుచూ ఈశ్వరుని చేరుటకు ఏడ్చుచుండును. ఇట్టి ఆరాటమును చూపు కుండలినీ శక్తిని 'కుమారి' అందురు. 'కు' అనగా భూతత్త్వము. 'మ్రియతే' అనగా లీనము చేయునది. భూతత్త్వము లీనము చేయుచున్నది గాన 'కుమారి' అని చెప్పబడు చున్నది.

ఇది జిజ్ఞాసగల జీవుని రోదనావస్థగా తెలియవలెను. మూలాధారమందలి కుండము నుండి లేచునపుడు, ఆమె చేయు రోదన ధ్వనియే 'కుమారి'. ఈ కుమారి మంద్ర స్వరముతో నుండును. రోదనమునకు మునుపు ఈమె బాల. రోదనధ్వనిలో కుమారి. అటుపైన స్వాధిష్ఠానమున అగ్నివలె ప్రజ్వలించునపుడు 'యోషిత'. అనగా యవ్వనవతి. అనాహతమును దాటినపుడు 'తరుణి'. అటుపై ఈశ్వరుని చేరి తృప్తి చెంది 'కామేశ్వరి' అగు చున్నది. ఆమెయే రాజరాజేశ్వరి. ఈ మొత్తము మార్గమంతయు సుషుమ్న మార్గము. అదియే 'బిసతంతు'. అందు సూక్ష్మ రూపమున నివాసము చేయునది ప్రజ్ఞ లేక శ్రీదేవి.



# 112. 'భవానీ'

భవమనగా జీవరూపమైన నీరు. శివుని భవుడని పిలుతురు. అనగా జీవరూపమైన నీటికి ఆధారమైన వాడు. ఈ నీటిని నారములని కూడా పిలుతురు. నారాయణుడన్నను, భవుడన్నను ఒక్కటియే. అది అనంతమగు చైతన్యము. అందుండి ప్రత్యేక సంకల్పమున ప్రత్యేకమగు జీవులుగ సృష్టి దిగి వచ్చుచున్నది. 'భవ అవయతి భవాని' అని తెలుపుదురు. అనగా తన ఆజ్ఞచేత అనంతమగు నీటి నుండి బిందు రూపమగు జీవులను జీవింపజేయునది అని అర్థము.

నారమునుండే నరులు ఏర్పడుచున్నారు. నారము లనగా నశింపనివి. నరులనగా కూడా నశింపనివారు అని అర్థము. వారే జీవులు. అనంతమగు సముద్రమునుండి అసంఖ్యాకములగు బిందువులు ఎట్లేర్పడెనో, అట్లే అనంతమగు ఆకాశ జలమునుండి జీవకోట్ల నేర్పరుచుట శ్రీదేవి కార్యము. ఆమె ఇచ్ఛచేతనే సమస్తమూ నిర్వహింపబడుచున్నది. అందుచేత ఆమె భవాని అగుచున్నది. ఆమె ఏర్పరచిన సమస్తమునందు స్థితి భేదము లేక వసించువాడు భవుడు. అతడు భవుడు; ఆమె భవాని.



# 113. 'భావనాగమ్యా'

**భా**వముచే పొందదగినది శ్రీదేవి అని అర్థము.

భజన రూపమున గానీ, స్తోత్రముల రూపమున గానీ, నోములు, వ్రతములు, పూజల రూపమున గానీ, ధ్యాన రూపమున గానీ చేయవలసినది భావనయే. శ్రీదేవి యందు భావన లగ్నము చేయక చేయు పై కార్యము లన్నియు వ్యర్థములు. భావన శ్రీలలితాదేవి యందు నిలచుటకే పూజ, ధ్యానము, స్తోత్రము, భజన మొదలగునవి. అభ్యాస వశమున పైకార్యములన్నియు యాంత్రికముగ సాగుట వలన గమ్యమును చేర్చవు. భావన శ్రీలలితా దేవి యందు లగ్నమగుట ప్రధానము. భావన లేని భక్తి కార్యములు డంబాచారములే. భావనను నిరంతరము చేయుటకు అనుపానములే ధ్యానము, పూజ, కీర్తన, స్తోత్రము, భజన.

చైతన్యమున మనసు లగ్నము కావలెను. శ్రీదేవి చైతన్య స్వరూపిణి. ఆమె మనలో ఎరుకగ నున్నది. సర్వమును తెలియుటకు ఆ ఎరుకయే ఆధారము. అట్టి ఎరుకయందు మనసు నిలుపుట నిజమగు సాధన. ఇది అనన్యము కావలెనని శ్రీకృష్ణుడు బోధించి నాడు. అనన్యమనగా అన్యము లేనిది. తనయందును తన పరిసరము లందును, తనకు గోచరించుచున్న సర్వస్వము పై తెలిపిన చైతన్యము ఆధారముగనే యున్నవని తెలియుట అనన్యము. అన్నిటియందు

చైతన్యమే కూడి యున్నది అని భావించుట వలన, ఆ భావనకు గమ్యముగా చేతన స్వరూపిణి యగు శ్రీలలితా దేవి అనంతమై దర్శన మిచ్చును. ఇది నిజమగు ఉపాసన. ఒక రూపమునకు, ఒక నామము నకు, కాలమునకు, దేశమునకు శ్రీలలితను పరిమితము చేయుట మనలోని పరిమితత్వమునకు తార్కాణము.

అన్యముగా గోచరించునది. ప్రతి వ్యక్తికిని తానుగ గోచరించు నది, తన కతీతమై యున్నది శ్రీదేవి. ఇట్లు మూడు విధములగు భావనలలో ఆమె యున్నది. ఈ మూడు భావనలను సకల, సకల నిష్కళ, నిష్కళ అను మూడు స్థితులలో తెలుపుదురు. బహిరంగ మంతయు సకల, అంతరంగమంతయు సకల నిష్కళ. రెండింటికిని ఆధారము నిష్కళ. మొదటిది స్థూలము. రెండవది సూక్ష్మము. మూడవది రెండింటికిని ఆధారము. క్రమముగ ఈ మూడు స్థితుల యందు అమ్మను దర్శించుట సాధన. విశ్వము నంతను ఆమె రూపముగ దర్శించుట మొదటి మెట్టు. తనయందు తాను, నేను అను కేంద్రమునకు పుట్టుక స్థానమును అంతరంగమున భావించుట రెండవ మెట్టు. తనయందును, విశ్వమునందును భాసించునది, తనకును, విశ్వమునకును అతీతమై యున్నదని దానియందు తన్మయత్వము చెందుట మూడవ మెట్టు. ఇట్లు మూడు సోపానము లలో భావన మార్గమున అమ్మను చేరవచ్చును.

# 114. 'భవారణ్య కుఠారికా'

**జ**న్మ పరంపరలతో కూడిన సంసారము అను అరణ్యమునకు గొడ్డలిపెట్టు వంటిది శ్రీలలిత.

సంసారమనగా సంసరణము చెందుట వలన కరుగు బద్ధత. సంసరణమనగా జారిపోవుట. ఇది మోహము వలన కలుగును. మోహము మమకారమునకు దారితీయును. మమకారము రాగ ద్వేషములకు దారితీయును. కామక్రోధములను, లోభమోహములను, ఈర్ష్యాసూయలను కలిగించునది మోహము. మోహము మాయవలన కలుగును. మాయ శ్రీదేవి ప్రక్రియ. ఆమె మాయనుండి పుట్టినవారే సర్వ జీవులు. శ్రీదేవి త్రిగుణముల ద్వారా సమస్త సృష్టి చేయును. ఒకే చైతన్యమునకు మూడు స్థితులు కల్పించును. అవి మూడు గుణములుగా మారును. అవి ఇచ్ఛ, జ్ఞాన, క్రియా శక్తులు. ఇట్లు ఒకటి మూడగుట ఆమెచేయు మాయ. తెల్లటి సూర్య కిరణము ఏడు రంగులుగా మారుట వంటిది ఈ ప్రక్రియ. నిజమున కున్నది ఒకే చైతన్యము. అది మూడుగ మారుటయే మాయా ఆవిర్భావము. అందు ఇచ్ఛ సృష్టికి కారణమై నిలుచును. ఇచ్ఛ ఉన్నంతకాలము సృష్టి యుండును. మానవులయందు ఇచ్ఛయే అనేకానేక కోరికలుగ వ్యక్తమగుచుండును. ఇచ్ఛయున్నంత కాలము జన్మల పరంపర యుండును. సృష్టియందు ఏ మోహము లేనివానికి ఏ సంసార ముండదు. అట్టివాడు పరమశివుడని తెలుపుదురు. అతడు

త్రిమూర్తులలో ఒకడైన శివుడైనపుడు అతనికి కూడ మోహము కలుగునని, జగన్మోహిని అవతారము తెలుపుచున్నది. జ్ఞానులు సహితము శ్రీదేవి మాయామోహితులే. నారదాది మహర్షులు కూడ దేవి మాయను దాటలేని ఉదంతము లున్నవి.

శ్రీదేవి మాయవలననే మోహితులైన జీవులు ఇచ్ఛ ఆధారముగ ఎడతెరిపి లేక జన్మ లెత్తు చుందురు. ఇచ్చట జనన మరణములు అరణ్యముతో పోల్చబడినవి. అరణ్యమున కొన్ని వృక్షములు కూలినను, మరికొన్ని పుట్టుచునే యుండును. పెంచకపోయినను పెరుగునదే అరణ్యము. కోరికలు కొన్ని తీరగా మరికొన్ని పుట్టుచునే ఉండును. తీరని కోరికలు కారణముగా మరికొన్ని జన్మములు కలుగుచునే యుండును. దీనికి అంతులేదు. సముద్రము నందు అలలకు అంతు లేనట్లు కోరికలకు కూడ అంతులేదు. కాలమును, దేశమును బట్టి ప్రకృతి ప్రేరణగ మునుపు లేనట్టి కోరికలు కూడ జన్మించ వచ్చును. దీనికి మూలము శ్రీదేవి మాయ. దీనికి అంత మెక్కడ? ఆమె సంకల్పించినచో అంతము చేయగలదు. ఏ జీవియైనను బ్రహ్మత్వము నకు లేక శివసాయుజ్యమునకు అనుగ్రహింప బడవలెనన్నచో శ్రీదేవి ఆశీర్వచనము ముఖ్యము. ఆమె అనుగ్రహించినచో జన్మపరంపరల అరణ్యమును గొడ్డలితో నరకినట్లు నరకి వేయగలదు. ఆమె అనుగ్రహమే లేనిచో త్రిమూర్తులతో సహా అందరూ సంసార బంధమున పడగలరు. సంసారమను అరణ్యమునకు కారణము ఆమెయే; పరిష్కారము కూడ ఆమెయే.

# 115. 'భద్రప్రియా'

**మం**గళమగు విషయములయందు ప్రియము కలది శ్రీలలిత.

భద్ర మనగా మంగళము. పవిత్రత గల వస్తువు లన్నియూ మంగళ ప్రదములే. పసుపు, కుంకుమ, గంధము, ఇతర సుగంధ ద్రవ్యములు, కళ, కాంతి, అందము గల వస్తువులు శ్రీలలితకు ప్రియము కలిగించగలవు. ఇవి అన్నియూ లక్ష్మీ ప్రదములు. వాని యందు ఆమె ప్రియముగా వసించి యుండును. ఈ కారణముగనే, శ్రీదేవిని పూజించుటకు పసుపు, కుంకుమ, సుగంధము, సుపుష్పములు (మంచి వాసన గల పువ్వులు; సువాసన లేని పువ్వులతో పూజింపరాదు) అగరు వత్తులు, నేతి దీపములు, ఘుమఘుమలాడు వంటకములు, పట్టు వస్త్రములు, బంగారు నగలు, ఆభరణములు, రత్నములు ఆదిగాగల కాంతివంతమైన వస్తువులు శ్రీ లలితాదేవి పూజా సమయమున వాడుదురు.

ఖనిజములయందు, వృక్షజాతియందు, జంతువులయందు, మానవులయందు, శ్రీ లలితకు ప్రియమగునవి చాల కలవు. వాని వినియోగము ఆమెకు ప్రియము కలిగించగలదు. ఎచ్చట పవిత్రత యుండునో అచ్చట శోభ యుండును. శోభ అంతయూ శ్రీదేవి అస్తిత్వము. ఏనుగులలో భద్రజాతి ఏనుగులని కలవు. ఈ ఏనుగులన్న శ్రీదేవికి అత్యంత ప్రీతి. దేవాలయములందు ఈ జాతి ఏనుగులను పోషించుట అను సంప్రదాయము ఈ కారణముగనే ఏర్పడినది.

# 116. 'భద్రమూర్తి'

**మం**గళప్రదమైన రూపము కలది.

శ్రీలలిత రూపము అత్యంత మంగళకరమైనది. అందము అతిశయించు రూపమది. జగత్తునే మోహింపజేయు రూపము. అట్టిదిట్టిదని వర్ణింపరానిది. నఖశిఖపర్యంతము అత్యంత మాధుర్యమును వర్షింపజేయు రూపము. మొదటి యాభైనాలుగు నామములు ఆమె రూపమును కీర్తించినవిగా ఈ సహస్రనామమున యున్నవి. ఈ నామములను చక్కగ ఉచ్చరించుచు, ఆమె రూపమును దర్శించు వారికి సర్వము మంగళప్రదమై నిలచును. ఆమె సర్వమంగళ. నిరాకారయైనను, నిరుపమానమైన సుందరాకారమున దర్శనమిచ్చి అనుగ్రహింపగలదు. దేవతారూపము హృదయమున ప్రతిష్ఠించుకొని అంతర్ముఖమున ఆరాధించుట సర్వసౌభాగ్యములకు మూలమై యున్నది. హృదయ పీఠమున దివ్యకాంతులతో కూడిన రూపము స్థిరపడి ఆరాధింపబడినపుడు ఆరాధనకు బుద్ధిలోక ప్రవేశము అప్రయత్నముగ కలుగును. భక్తి, జ్ఞానము, యోగము, వైరాగ్యముల ద్వారా జీవుడు చేరు ప్రథమ గమ్యమే బుద్ధిలోకము.



# 117. 'భక్త సౌభాగ్యదాయినీ'

**భా**గ్య మనగా సంపద, కామము, మహాత్మ్యము, వీర్యము, కీర్తి అని అర్థములు చెప్పబడినవి. శుభము, శోభనము అను సంపద, కామము, మమత్తు, వీర్యము, కీర్తి సౌభాగ్యమగుచున్నది. అట్టి సౌభాగ్యమును భక్తులకిచ్చునది శ్రీలలిత అని అర్థము.

పై తెలిపిన భాగ్యము లన్నియు శుభమగునవి కానిచో, దుఃఖమును, నష్టమును కలిగించును. సంపద ఉండవచ్చును కాని దాని నుండి పొందవలసిన సుఖముండకపోవచ్చును. అట్లే సుఖము నిచ్చు కోరికలు కాక, ఇతరములగు కోరిక లుండవచ్చును. అట్లే, మహాత్మ్యము, వీర్యము, కీర్తి.

రావణునికి భాగ్యమున్నది. రాముడికి భాగ్యమున్నది. రాముని భాగ్యము సౌభాగ్యము. ధర్మపరులకు, భక్తులకు కలుగు భాగ్యము ఆనందము నిచ్చునదై యుండును. ఇతరుల భాగ్యము దుఃఖమునకు కారణమై యుండును.



# 118. 'భక్తప్రియా'

**భ**క్తి ప్రియముగా గలది శ్రీదేవి.

భక్తి రెండు విధములు. అవి ముఖ్యభక్తి, గౌణభక్తి. ముఖ్యభక్తి యనగా భవంతునియందు అనురక్తి, భగవంతుని యందు ఆసక్తి, భగవంతునియందు ప్రేమ. అనురక్తి, ఆసక్తి, ప్రేమ గలవస్తువును సతతము స్మరించుచు నుందుము. అట్టి స్మరణకు మరియొక కారణ ముండదు. ఎప్పుడునూ మనస్సు దైవము వైపునకే లాగుచుండును. ఇతర విషయములపై మనస్సు అంతంత మాత్రమే లగ్నమగును. అన్నిటియందు దైవమే స్ఫురించుచుండును. ఇట్టివారికి భగవంతుడు కానిదేమియు ఉండదు. ప్రహ్లాదుడు, అంబరీషుడు, శుకుడు, నారదుడు అట్టివారు. ఈ మార్గము నవలంబించు భక్తులు కలరు. వారికి నిత్యజీవితమంతయు భగవత్ పరముగనే యుండును. వీరే శ్రీకృష్ణుడు తెలిపిన అనన్య చింతనలు, నిత్య అభియుక్తులు, పర్యుపాసకులు, యోగులు.

భజించుట, పూజించుట, కీర్తించుట, శ్రవణము చేయుట, స్మరణము చేయుట, ధ్యానించుట, సేవ చేయుట, గుర్తుంచుకొనుటకు ప్రయత్నించుట వంటి భక్తి గౌణభక్తి. అనగా భగవంతుని కొంత సమయము స్మరించుట, ఇతర సమయమునందు తమదైన విషయము లందు నిమగ్నమగుట యుండును. ఈ భక్తి సర్వసామాన్యము.

ముఖ్యభక్తి గలవారకి గౌణభక్తి అనుపానమై నిలచును. గౌణభక్తి గలవారు క్రమముగా కొన్ని జన్మలలో ముఖ్యభక్తిని పొందవచ్చును. పొందుదురని రూఢి లేదు. భగవంతుని యందు ప్రేమ జనించినపుడే, ముఖ్యభక్తి అను బీజము అంకురించును. కాని అవసరములకై భగవంతుని ప్రార్థించువారికి గౌణభక్తియే మిగులును.

శ్రీలలిత భక్తియందు ప్రియము కలది కావున ముఖ్యభక్తిని గౌణభక్తిని కూడ అనుగ్రహించును. భక్తి అను విషయమున ఆమె కట్టి ప్రియము.



# 119. 'భక్తిగమ్యా'

**భ**క్తిచేత చేరదగినది శ్రీలలిత అని అర్థము.

కేవలము ముఖ్యభక్తి చేతనే శుద్ధచైతన్య స్వరూపిణి యగు శ్రీలలితను చేరవచ్చును. ఇతర మార్గములలో చేరుట అసాధ్యము. ముఖ్యభక్తి అనగా ముందునామములో తెలుపబడిన అనన్యభక్తి. గౌణభక్తి ద్వారా శ్రీదేవి రుచి తెలిసిన భక్తులు అనన్యభక్తిలోనికి ప్రవేశించినచో ఆమె సాన్నిధ్యము లభింప గలదు. అనన్యభక్తియే దివ్యత్వమును చేరు మార్గము. భక్తియనగా దైవముపై అనురక్తి, ఆసక్తి ప్రేమ అని తెలియవలెను.



# 120. 'భక్తివశ్యా'

**భ**క్తికి వశమగునది శ్రీలలిత అని అర్థము.

నిర్మలమగు భక్తి శ్రీదేవిని ఆకర్షించగలదు. నిర్మలత్వము శ్రీదేవికి ప్రీతికలది. అట్టి భక్తితో ప్రార్థన చేయువారికి శ్రీదేవి వశమగును. నిర్మలత్వమున్నంతసేపు శ్రీదేవి వశమున యుండును. క్రోధము, మాత్సర్యము, లోభము, గర్వము, ద్వేషము, ఇతర అశుభ భావనలు చేరినచో ఆమె అదృశ్యమగును. ముఖ్యభక్తులకు శ్రీదేవి సదా వశమై యుండును. రామకృష్ణ పరమహంసకు ఆమె అట్లు వశమై యున్నట్లు ఉదాహరణము లున్నవి. గౌణభక్తులకు కూడ భక్తి యందలి నిర్మలత్వమును బట్టి, తాత్కాలికముగ వశమగు చుండును. దేవతానుగ్రహము నిర్మలులకే సాధ్యము. అట్టివారికే దేవతలు వశమగుదురు. రాజసిక, తామసిక భక్తులకు వశమైనటుల భ్రమ గొల్పుదురు గాని వశమున యుండరు. రావణాదుల దురవస్థ అట్టిది.



# 121. 'భయాపహా'

**భ**యమును అపహరించునది శ్రీదేవి అని అర్థము.

భయమున్న చోట భక్తి లేనట్లే. సమస్తమును రక్షించు దైవము జీవులను రక్షింపడా? భగవంతుడు సర్వజగద్రక్షకుడని తెలిసియు, తనను రక్షించునో రక్షింపడో అని భావించుట, నమ్మకమునకు సంబంధించినది. తనపై తనకు నమ్మకమున్నచో దైవముపై కూడ నమ్మక ముండును. దైవమును ప్రార్థించువారు భయమునకు లొంగుట విశ్వాస లోపమే. శ్రీదేవిని ప్రార్థించుట వలన భయము హరింప బడునని ఈ నామము యొక్క అర్థము. అట్లే ఇతర దేవతల విషయ మున కూడ తెలుపుదురు. భక్తి మార్గమున జ్ఞానోదయ మగుచుండగ భయమను చీకటికి ఆస్కారము లేదు. సూర్యోదయమున చీకటి యుండలేదు కదా! కావున భయపడు వారికి దైవారాధనము ఒక చక్కని పరిష్కారము. ఆరాధించువారు భయమును గూర్చి ఆలోచింప నవసరము లేదు. ప్రగాఢ విశ్వాసముతో ఆరాధించుటొక్కటే మార్గము. సమస్త భయములకు శ్రీదేవి ఆరాధన పరిష్కారమని తెలియవలెను.



# 122. 'శాంభవీ'

**శం**భువు భార్య శ్రీలలిత అని అర్థము.

శంభువు అనగా పరమ శివుడు. అతడు శ్రీలలితచే నిర్మితమగు నవావరణ సృష్టి చక్రమందు ఎచట స్థితిగొని యున్నను, శమము శాంతితోనే యుండును. అతడు శంకరుడు కదా! శంభువాతడే. శివుడు అనుటలో శుభము కలిగించువాడని తెలియును. ఎక్కడ శమము, శాంతియున్నవో అచట ప్రజ్ఞ స్థిరత్వము చెందియుండును. సృష్టికి స్థిరత్వము కలిగించువాడు కూడ శంభుడే. అన్నిటిని అమ్మ సృష్టి చేయగా దానియందు స్థిరముగా నిలిచి స్థిరత్వము నందించు వాడు శంభుడు. ఉండువాడు శంభుడు కాగ క్రీడించునది శాంభవి. అతడు లేని ఆమె లేదు.

శాంభవీ దేవి శాంతి దాంతులను, శమమును ప్రసాదించ గలదు. అట్లనుగ్రహము పొందినవారు శివతత్త్వమున నిలుపగలరు. అట్టివారామెకు ప్రియులు. శాంభవీ దీక్షాపరులు లోపలను, బయటను క్రీడించుచున్న శివశక్తులను మాత్రమే దర్శించుచుందురు. ఇట్టివారు సంసార చక్రమున బడరు.



# 123. 'శారదారాధ్యా'

**శా**రదగా ఆరాధింపబడునది శ్రీ లలిత అని అర్థము.

శారదాదేవిచే పూజింపబడునది అని మరియొక అర్థము. పండితులచే పూజింపబడునది అని మరియొక అర్థము. ఆరాధనకు వాక్కు ప్రధానము. వాక్కు సరస్వతీ దేవియే. ఆమె విద్యలకు అధిదేవత అగుటచే శారద అయినది. అట్టి శారద ఆధారముగ శ్రీదేవి ఆరాధింప బడుచున్నది. వాక్కునకు ఫలశృతి దైవారాధనయే. వాక్కుచే స్వల్ప ఆరాధనము దివ్యత్వమును అవతరింపచేయగలదు. అందులకే సూక్తములు, స్తోత్రములు, కీర్తనములు, గీతములు.

శరదృతువున ప్రత్యేకముగ శ్రీదేవిని ఆరాధించు సంప్రదా యము కలదు. అందువలన కూడ ఆమె శారదారాధ్య. శరన్నవరాత్రు లలో నవమినాటి పూజ శ్రీదేవి కత్యంత ప్రీతికరము.

శ్రీలలితను శారద రూపముగ ఆరాధించు సంప్రదాయము కలదు. శరత్కాల నవమినందు దేవతలచే పూజింపబడి మేల్కొలుప బడుటచే శ్రీలలితను శారదగ భావింతురు. మేల్కొలుపబడిన ఆమె మహిషాసురుని మర్దించును. అందువలన శరత్కాలమున పుట్టిన శ్రీదేవిని శారదాదేవిగ ఆరాధింతురు. శారదా పీఠమున ఆరాధింప బడుచున్న దేవి శ్రీలలితయే కదా! శృంగేరి యందు ప్రప్రథమముగ ఈ పీఠము నేర్పరచినది శ్రీశంకరులే.

# 124. 'శర్వాణీ'

శర్వుని భార్యగా వెలుగొందునది శర్వాణి అని అర్థము.

అష్టప్రకృతులను, మూలప్రకృతియైన శ్రీలలిత నిర్మాణము చేయగ అందు అష్టమూర్తియై శివుడు వసించును. అట్లు ఎనిమిదవది అయిన భూరూపమున వసించు శివతత్వమును శర్వుడు అందురు. అతని భార్య శర్వాణి అయినది. ఆమె భూరూపమే! భూమిపై విశిష్టముగ వృక్షములు మొలకెత్తుటచే ఆమెకు సుకేశి అని నామము కలదు. వీరిరువురికి జనించిన వాడే అంగారకుడు. ఈ విషయము అంగ పురాణమునందు, వాయు పురాణమునందు గోచరించును.

శర్వాణి అనగా భూ ప్రజ్ఞ. మనయందలి భౌతికశరీర ప్రజ్ఞ. భౌతిక శరీరము కుదురుగనుండుటకు శర్వుని, శర్వాణిని ఆరాధించుట ఋషులిచ్చిన ఉపాయము.



# 125. 'శర్మదాయినీ'

**సు**ఖము నొసగునది శ్రీలలిత అని అర్థము.

శర్మ అను బిరుదు నిర్దిష్టముగను, నిశితముగను క్రతువులను ఆచరించు వారికొసగుదురు. క్రతువనగా నియత జీవనము. శ్రీలలితను ఆరాధించువారు క్రమబద్ధములగు జీవితములను నడుపుట జరుగును. ఆరాధన యందలి ఆర్ద్రత, క్రతుబద్ధత కారణములుగ మనసు అట్టి క్రమమును పొంది జీవితమున అన్ని విషయముల యందు అదే క్రమమును వ్యాపింపచేయును. అట్టివారి ఆహారము, వ్యవహారము, భాషణము అంతయు సహజముగ క్రమబద్ధమగును. దానివలన అంతఃసుఖము కలుగును. వారిని బాహ్య సన్నివేశములు చలింప చేయవు. ఈ విధముగ శ్రీలలిత శాశ్వతమగు సుఖమును ఒసగునది అగుచున్నది.

'సురేశః శరణం శర్మ' అనుచు విష్ణు సహస్రనామము నందు కూడ శర్మ శబ్దము కలదు. ఏ దేవత నారాధించినను, విధివిధానముగ ఆరాధించినచో సుఖము కలుగును. రజోగుణ ఆరాధనము, తమోగుణ ఆరాధనము అట్టి సుఖము నీయజాలవు. ఆరాధనయందు సాత్విక గుణమే సుఖమునకు ముఖద్వారము.

# 126. 'శాంకరీ'

**శం**కరుని భార్య శ్రీలలిత అని అర్థము.

శంకరుడనగా సుఖకరుడు అని అర్థము. రజస్తమో గుణములను విసర్జించి సత్వము నాశ్రయించి ప్రసన్న వదనుడైన దైవమును ధ్యానించుట వలన సుఖము కలుగును. శంకరుడు ప్రసన్న వదనుడైన నారాయణుని సతతము ఆరాధించుచు నుండుట వలన శంకరత్వమును, మయస్కరత్వమును పొందినాడు. అందువలన శంకరుని ముఖమున నిరుపమానమగు ప్రశాంతత యుండునని పురాణములు తెలుపుచున్నవి. అట్టి శంకరుని ఆరాధించి ఆయనను పొందినది పార్వతీదేవి. అందువలన ఆమె శాంకరి అయినది.

శంకరుడు ఏకాదశ రుద్రులలో నొకడు. రుద్రమూర్తి సైతము తపస్సువలన శాంతమును, సుఖమును పొందెను. అందువలన శాంతమును, సుఖమును పొందగోరువారు అర్ధనిమీలిత నేత్రుడై చిరుదరహాసముతో ధ్యానము చేయుచున్న శివుని శ్రీగురువుగ ఆశ్రయింతురు. లేదా భగవద్గీతయందు భగవంతునిచే పేర్కొనబడిన సత్వగుణము నుపాసించి కూడ శాంతమును పొందవచ్చును. శ్రీలలిత అట్టి సత్వగుణ సముదాయమునకు కూడ అధిదేవత. ఆమె సుందర సుమనోహర రూపమును ఆరాధించుచు సత్వగుణము నాశ్రయించి జీవించువారికి ఆమెయే స్వయముగ సుఖ శాంతులను ప్రసాదించగలదు.

# 127. ‘శ్రీకరీ’

**“శ్రీ”**ను కలిగించునది శ్రీలలిత అని అర్థము.

శ్రీ అనగా లక్ష్మి లేక సంపద, వైభవము. శ్రీ అనగా సకల విద్యలలో అధిదేవత అయిన సరస్వతి. శ్రీ అనగా సకల శక్తి స్వరూపిణి అయిన పార్వతి. శ్రీలలిత నారాధించువారికి ఈ మూడును వరుసగ సంక్రమించగలవు. ఇవి కలవాడు పరిపూర్ణ ఐశ్వర్యవంతుడు. కేవలము శ్రీకృష్ణునియందే వీనిని దర్శించగలము. అతనియందు లక్ష్మి, సరస్వతి, పార్వతులు పరిపూర్ణముగ వసించి యుండిరి. సంపదలయందుగాని, విద్యలయందుగాని, శక్తిసామర్థ్యములయందు గాని శ్రీకృష్ణుని సాటి ఎవ్వరునూ లేరు. అతడు అవతరించిన లలితా మూర్తియే.



# 128. 'సాధ్వీ'

అనన్యసామాన్యమైన పాతివ్రత్యము కారణముగ శ్రీలలితను సాధ్వీ అని పిలుతురు.

పాతివ్రత్యులకు పార్వతీదేవియే అధిష్ఠాన దేవత. ఆమె పూర్వ జన్మమున సతీదేవి. "సతి, సాధ్వీ, పతివ్రత అని అమరకోశమున సతీదేవిని ఉదహరింతురు. ఆమెయే మరల జన్మించి, మరల శివుని కొఱకై తపస్సుచేసి శివుని చేరినది. భూత, భవిష్యత్, వర్తమాన కాలములందు వేరొక పురుషునితో భర్త సంబంధము లేకపోవుటచే ఆమె పతివ్రత. ముందు జన్మములందు పొందిన భర్తనే జన్మ జన్మలకు పొందుట పాతివ్రత్యమని పురాణములు తెలుపుచున్నవి.

పాతివ్రత్య విషయమున పార్వతీదేవినే స్మరించుటకు శంకరు లీవిధముగా తెలిపినారు. "సరస్వతీ అనుగ్రహముగల కవులందరునూ సరస్వతీపతులే. ధనముగలవాడెల్ల లక్ష్మీపతియే కాని పార్వతీదేవి విషయమట్లు కాదు. మహాదేవులకు తప్ప, ఆమె ఎవ్వరికినీ వశము కాదు". అట్లు అనన్య సామాన్యమైన పతివ్రత అయిన పార్వతిని 'సాధ్వి' అని పిలుతురు.

పర్వతరాజునకు పుట్టినప్పుడు కూడ తాను శివునే వివాహ మాడుదునని ప్రకటించి లోకముల నాశ్చర్యపరచిన మహాసాధ్వి ఆమె.

# 129. 'శరచ్చంద్రనిభాననా'

**శ**రచ్చంద్రునితో సాటియైన ముఖము కలది శ్రీలలిత అని అర్థము.

ఋతువులలో శరదృతువు అత్యంత ఆహ్లాదము కలిగించును. ఈ ఋతువునందు ఎండ, చలి, వాన యుండవు. శీతోష్ణములు సమతుల్యమై ఆనందమును కలిగించును. ప్రకృతి కూడ పుష్టి కలిగి తన సౌందర్యమును ప్రదర్శించుచుండును. కవులు శరదృతువును వేనోళ్ళ కొనియాడుచూ గ్రంథస్థము చేసిరి. శరత్ నందు ప్రకృతి, పురుషుల సమాగమము పరిపూర్ణమై యుండును. శరత్ పూర్ణిమా చంద్రుడు తుష్టిగను, పుష్టిగను, కాంతివంతముగను గోచరించును. అందమునకు, ఆనందమునకు శరత్కాలమందలి పూర్ణచంద్రుని కవు లుదహరించు చుందురు. వర్ణింపనలవికాని అందము కలిగి ఆనందము నిచ్చు శరత్ పూర్ణిమా చంద్రునివంటి ముఖము కలిగినది శ్రీదేవి. ఆమె అందము ఈశ్వరుని సహితము మోహింప చేయగలదు. అట్టి ముఖమునారాధించు భక్తుడు ఆమె అందమునకు ఆకర్షింపబడి ఆమెయందు తన్మయత్వము పొంది మోక్షమును పొందును.



# 130. 'శాతోదరీ'

సన్నని నడుము కలది శ్రీదేవి అని అర్థము.

హిమవంతుని పుత్రిక అని మరియొక అర్థము.

శ్రీలలితాదేవి నడుమును గూర్చి, ఉదరమును గూర్చి అనేకము లగు వర్ణనలున్నవి. ఆమె నడుము పురుషునకు కూడ అందమే. అట్టి పురుషుని సింహమధ్యముడు అందురు. అంతకన్న సన్నమైన నడుము స్త్రీకి అందము. సృష్టియందే స్త్రీకిని లేనంత, ఈర్ష్య పడునంత సన్నని అందమైన నడుము కలదని వర్ణనము. శ్రీలలిత యొక్క అందమును వర్ణించు నామములలో ఇది యొకటి.

శతోదరుడు అనగా హిమవంతుడు. హిమాలయములందు వందలకొలది గుహలు కలవు. అందువలన అతడు శతోదరుడు. అతని పుత్రికగా శ్రీలలిత జనించుటచే 'శాతోదరి' అను నామము కలిగినదని మరియొక అర్థము.



# 131. 'శాంతిమతీ'

**శాం**తమగు మనసు కలది శ్రీలలిత అని అర్థము.

శాంతమనగా ఇంద్రియ నిగ్రహస్థితి. సన్నివేశములతో సంబంధములేక అన్ని సమయములయందు శాంతము ప్రకటించు మనసు. శ్రీదుర్గ, శ్రీకృష్ణుడు, శ్రీరాముడు యుద్ధమునందు కూడ ప్రశాంతమగు మనసు కలిగియున్నట్లు మన వాఙ్మయము తెలుపును. దీనివలన తెలియునదే మనగా, వీరి స్థిర శాంత చిత్తమునకు కారణము అంతరంగమును వారు పరతత్త్వముతో ఏర్పరచుకొనిన నిశ్చలమగు బంధమే. అట్టివారికి బాహ్య ప్రపంచమంతయూ ఒక నాటకరంగముగ గోచరించును. అందు జరుగు మార్పులన్నియు, జగన్నాటక సూత్రధారియగు దైవము చేతియందుండునని తెలిసి, దైవముతో ముడిపడి కార్యములను నిర్వర్తింతురు. కర్తృత్వము దైవమునదే అని తెలిసి యుందురు. తమవంతు కర్తవ్యమును నిమిత్త మాత్రముగ నిర్వర్తించుచుందురు. నిజమునకు యిట్టివారియందు దైవమే తన కర్తృత్వమును నిర్వర్తించును. వారు దైవమునందు ఉండుటచే వారి చిత్తము శాంతముగ నుండును. శ్రీలలిత సృష్టి యున్నప్పుడు, లేనప్పుడు, సృష్టించుచున్నప్పుడు కూడ పరమ శివుని తోనే యుండుటచే ఆమెను మించిన శాంతిమతులు లేరు.

# 132. 'నిరాధారా'

వేరొక ఆధారము లేనిది శ్రీలలిత అని అర్థము.

సకల చరాచర జగత్తునకును శ్రీలలితయే ఆధారము. ఆమెయే సమస్తమును కాలక్రమమున నిర్వర్తించును. సర్వసృష్టి ప్రణాళిక ఆమెదే. శక్తి ఆమెదే. త్రిగుణములు కూడ ఆమెనుండి పుట్టినవే. త్రిమూర్తులు కూడ ఆమె సంతానమే. ఇక యితరుల గూర్చి చెప్పనేల? ఆమెకామెయే ఆధారము. మరియొక ఆధారము లేదు.

పరతత్వము ఆమెయందున్నప్పటికి, స్వభావపరముగ ఆమె పనియే చేయును. చేత అంత శ్రీలలితయే. సృష్టి సమస్యలనుకూడ ఆమెయే పరిష్కరించును. భక్తులకు, జ్ఞానులకు, యోగులకు, దేవతలకు, అసురులకు అందరికిని ఆమె ఆధారము. ఆమె వారిపై ఆధారపడదు. తమపై ఆధారపడువారిపై ఆధారపడుట బలహీనత. విపత్కర సమయములలో ఆమే దుర్గగను, కాళిగను, మహిషాసుర మర్దినిగను అవతరించి దుష్ట సంహారము చేయును.



# 133. 'నిరంజనా'

**అ**జ్ఞానమను చీకటి సోకనిది శ్రీలలిత అని అర్థము.

అజ్ఞానము మూడు విధములు. మలమూత్రములతో కూడిన శరీరమే తాననుకొనుట. కర్మమే సమస్తమని కర్మస్వరూపమెరుగక అనేక జన్మ కర్మలయందు మునిగి యుండుట, తాను, ఇతరము అను భేదబుద్ధి కలిగి యుండుట. ఇట్టి త్రివిధములగు అజ్ఞానమును నలుపుతో పోల్చుదురు. ఇట్టి అజ్ఞానపు నలుపును అంజనము అందురు. అట్టి అజ్ఞానము నశించినపుడు నిరంజనమందురు. నిరంజనమనగా అజ్ఞాన రహితము, అవిద్యారహితము అయిన స్థితి. మిథ్యను మాయను దాటిన స్థితి.

శ్రీలలిత త్రిగుణములతో కూడి మిథ్యాసహితమైన సృష్టి సలుపు చున్నప్పటికీ స్వతః ఆమెకు ఆ మిథ్యగాని, మాయగాని, అజ్ఞానముగాని అంటదు. కవి సన్నివేశములను, పాత్రలను అనేక విధములుగా సృష్టించుచున్నప్పటికి, వాని కతీతుడై అతడెట్లుండునో అట్లే శ్రీలలిత కూడను. సామాన్యజీవులు తాము సృష్టించిన వానియందు చిక్కు బడుదురు. జ్ఞానులు పరహితము కొఱకు సృష్టించి అందు చిక్కుపడక నుందురు. అట్టివారికి శ్రీలలిత ప్రమాణము.

# 134. 'నిర్లేపా'

సృష్టి లేపనము అంటనిది శ్రీలలిత అని అర్థము.

శ్రీలలిత తన త్రిగుణములచేతను, పంచభూతములచేతను, ఎనిమిది ఆవరణములు సృష్టి చేయును. వానికి ఆమె మూలము కనుక ఆమె తొమ్మిదవది. తనయందలి శివతత్త్వము పదవది. ఎనిమిది ఆవరణములు శుద్ధచైతన్యమగు ఆమెకు ఎనిమిది పూతల వంటివి. ఆ పూతలు ఆమెను ఏమియు చేయజాలవు. అందువలన ఆమె నిర్లేప.

జీవుడు కూడ చైతన్య స్వరూపుడే. అతనికి కూడ ఈ ఎనిమిది ఆవరణములున్నవి. అవి వరుసగా అహంకారము, బుద్ధి, చిత్తము, పంచభూతములు. అతడు ఈ ఆవరణములన్నిటిచేత బంధింపబడి యున్నాడు. భౌతిక బంధనమునుండి అహంకారమువరకు అన్ని ఆవరణములయందు బద్ధుడై స్వస్వరూపమును మరచి జీవించు చున్నాడు. అట్టివాడు జ్ఞానము పొందవలెనన్నచో శ్రీలలిత నిర్లేప స్థితిని ఆరాధించవలెను. అది ఎట్లు? శుద్ధము, అనంతము, అమిత ప్రకాశవంతము అయిన వెలుగు నారాధించుటయే. ఈ ఉపాసనము స్థిరపడినచో జీవుడు అష్టబంధములను తొలగించుకొనగలడు.



# 135. 'నిర్మలా'

**అ**జ్ఞానపూరితమగు మలము లేనిది శ్రీలలిత అని అర్థము. మలము లంటనిది శ్రీలలిత.

సృష్టికార్యమంతయు అగ్నికార్యమే. అందువలన ప్రతి ఆవరణమునందు చేతలతోపాటు మలినముకూడ యుండును. నిప్పు ఉన్న చోట పొగయుండును. పొగచూరు యుండును. అద్దమున్నచోట దుమ్ము పట్టును. వంట చేసిన పాత్రకు మసి పట్టును. ఆహారముగొను జీవులకు మలమూత్రాదులేర్పడును. శరీరమునకు, పంచేంద్రియము లకు, మనస్సునకు, బుద్ధి, అహంకారములకు కూడ మలినము సోకుచునుండును. ఎచ్చట జ్ఞానమను అగ్ని యుండునో అచ్చట అజ్ఞానమను పొగకూడ యుండును. ఈ అజ్ఞానమును ప్రతి నిత్యము తొలగించుకొనుట సాధన. తొలగించుకొననిచో మలమునకు బల మేర్పడును. మలములు బలపడినచో మరణానుభూతికూడ యుండును. అన్ని స్థితులయందలి మలినములు నిత్యము తొలగించు కొనుటయే సాధన. దీపపు కాంతి నిశ్చలముగా నిలబడుటకు గాజు చిమ్నీ వాడుచుందుము. చిమ్నీని శుభ్రముగా తుడుచుకొననిచో దీపము గోచరించదుకదా! అట్లే తనయందలి మలినములను నిర్మూలించుకొనని వానికి తాను జ్యోతి స్వరూపుడనని తెలియదు. అట్టి నిర్మూలనమునకు శ్రీలలిత ఉపాసనమును వినియోగించు కొనవలెను.

# 136. 'నిత్యా'

సృష్టి, స్థితి, ప్రళయ కాలములయందు యుండునది శ్రీదేవి అని అర్థము. భూత, భవిష్యత్, వర్తమానకాలముల యందుండునది, ఎప్పుడునూ వుండునది.

పరాశక్తిగను, పరాప్రకృతిగను, అన్ని కాలములయందును శ్రీలలిత ఉన్నది. ఉండుట, లేకుండుట అనునవి అవగాహనను బట్టియేగాని, అసలు సత్యము గాదు. స్థూలముగ నున్నవి కనబడ నపుడు లేవనుకొందుము. స్థూలమున కవతరించినపుడు వున్నది అనుకొందుము. ఇది స్థూలమగు అవగాహన మాత్రమే. స్థూలము నుండి సూక్ష్మమునకు, సూక్ష్మమునుండి స్థూలమునకు అవరోహణ, ఆరోహణ క్రమములలో సృష్టి మొత్తమూ ఎప్పుడునూ వుండనే వున్నది. అందలి జీవులు కూడ ఎప్పుడూ ఉండనే ఉన్నారు. 'ఉన్నది పోదు, లేనిది రాదు' అని శ్రీకృష్ణుడు గీతయందు బోధించినాడు. విత్తనము రూపమున మహత్తరమగు వృక్షముండును. వృక్షము రూపమున విత్తనముండును. విత్తనము వృక్షమైనపుడు, విత్తనము గోచరింపదు. కాని మరల విత్తనము వృక్షము కాగలదు. అట్లే సమస్త జీవులును సూక్ష్మములోనికి పోవుచూ, స్థూలములోనికి వచ్చుచూ నుందురు. ఏదోనొక స్థితిలో వస్తువుండును గాని లేకుండుట యుండదు. ఇది సత్యము. దీనిని దర్శించుట ఋషులకే సాధ్యము. స్థూల దృష్టిగలవారికి సాధ్యము కాదు.

శ్రీలలిత పరాశక్తిగను, పరమాత్మికగ నున్నపుడును, తనకు తానే చోటువలె ఉండును. ఆత్మ ప్రేరణలచేత ఆమె నవావరణలను సృష్టించుచు నుండును. అది ఆమె నిశ్వాశ. మరల సృష్టిని తన లోనికి ఇముడ్చుకొనును. ఆది ఆమె ఉచ్ఛ్వాస. ఇన్ని లోకముల సృష్టియు ఇట్లు ఉండుట లేకుండుటగా భాసించుచునుండును. వీటన్నిటికిని ఆమె ఆధారము. ఆమె ఎప్పుడును ఉండునది. స్థితి భేదముల కావల ఉండునది. అవస్థితులు లేనిది అగుటచే, నిత్య అని పిలువబడుచున్నది. ఆమె ఉద్భవించుట దేవతల కార్యమునకు సహకరించుటయే. ఉన్నది ఉద్భవించును కాని, లేనిది ఉద్భవించదు కదా! ఇది తెలిసినవారు ఋషులు. తెలియనివారు కూడా నిత్యులే కాని, నిత్యులమని తెలియదు.



# 137. 'నిరాకారా'

**ఆ**కారము లేనిది శ్రీదేవి అని అర్థము.

పంచభూతముల సృష్టికి ముందు ఆకారములుండవు. కేవలము వెలుగు, శబ్దము, వాని వలయములు, గుణములుండును. వానికి పూర్వము శుద్ధచైతన్యముండును. దానికి పూర్వము సత్యము మాత్రమే యుండును. శ్రీదేవి సహజ స్థితి అట్టి సత్యము. ఆమె నుండియే పై తెలిపినవన్నియూ వ్యక్తమగుచుండును. ఆ స్థితిలో ఆమెకు గుణములు లేవు. రూపములు లేవు. అందువలననే తరువాతి నామములలో (139) ఆమెని నిర్గుణ అనికూడ అందురు. ఈ విధముగ 25 నామము లిచ్చుట పేర్కొనబడినవి.



# 138. 'నిరాకులా'

**క**లత చెందనిది శ్రీదేవి అని అర్థము.

అజ్ఞానమున్నచోట కలత యుండును. శ్రీలలిత విద్యా స్వరూపిణి అగుటచే, అవిద్యా సంబంధమైన కలత యుండదు. సృష్టి యందు అవిద్య లేక అజ్ఞానము తప్పదు. జ్ఞానము అజ్ఞానముచే కప్పబడియుండును. విద్యాసంపన్నులు అవిద్యను గర్హించక, విద్యను ఆశ్రయించి యుందురు. అవిద్యకూడా సృష్టియందలి భాగమే అని తెలిసి యుందురు. అందువలన వారికి ఘర్షణ యుండదు. అట్టి సమగ్రభావనమునకు శ్రీదేవి అధిష్ఠాన దేవత. ఆమెకు సురులు, అసురులు కూడ సమానమే. మితిమీరినపుడు సర్దుబాట్లు చేయు చుండును. విద్యావంతులు కూడా అవిద్య తాకిడివలన కలత చెందుట జరుగుచుండును. వారి విద్య సమగ్రము కాదు. అజ్ఞానమును దూషించు జ్ఞానము పరిపూర్ణ జ్ఞానము కాదు. అవసర మగుచో దానిని నిర్జించుటయేగాని దూషించుట విద్యావంతులు చేయరు. దూషించువారికి కలత తప్పదు. అట్టివారికి మనస్సు చంచలమగును. చంచలమగు మనస్సు కలతబారిన నీరువలె ఉండును. కలతలు ఎక్కువగ నుండును. భూషణాదులకు దూరముగ ప్రశాంతము, అచంచలము అగు మనస్సుతో నుండుటయే నిజమగు జ్ఞానము. జ్ఞాని, జ్ఞానము అజ్ఞానముల స్వరూపముల నెరిగి తన కర్తవ్యము ననుసరించుచూ జీవించును. అట్టివారు నిరాకులు.

శ్రీదేవి త్రిగుణాతీత కూడ అగుటవలన ఆమెకు కలత యుండదు. కలతలన్నియు త్రిగుణ సృష్టియందే ఉండును. చరితము చంచలము అయిన మనసుగల వారికి శ్రీదేవి దూరము. వారు దేవి ఆరాధన మార్గమున కలతలను బాసి, స్థిరచిత్తమును గొని, అటుపై దేవి అనుగ్రహమునకు ప్రయత్నింపవలెను.



# 139. 'నిర్గుణా'

గుణములు లేనిది గావున శ్రీదేవి నిర్గుణ అని అర్థము.

గుణములకు పుట్టిల్లు శ్రీలలిత. ఆమె నుండియే ఇచ్ఛా జ్ఞాన క్రియలు, సత్వము, రజస్సు, తమస్సు, సృష్టి స్థితి లయములు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఉద్భవించును. ఆమె వానియందున్నప్పటికీ, వానికి అతీతముగా నుండును. అందువలన ఆమె గుణములను గుర్తించుట అసాధ్యము. ఏ గుణములు, ఏ లక్షణములు లేక కేవలము శుద్ధ చైతన్య స్వరూపిణిగా ఆమె ప్రకాశించుచుండును. ఆమెకు ఆమెయే సాటి.

హిమవంతుడు ఉమను గూర్చి నారదుని ప్రశ్నించెనట! ఆమె గుణములను, లక్షణములను తెలియజెప్పుమని మహర్షిని వేడు కొనెనట. అప్పుడు నారద మహర్షి ఇట్లనెను. "కోటాను కోట్ల దేవతలు కలరు. వారినందరిని వారి వారి లక్షణములతో గుర్తింప గలను. వారికి దేహములుండవుకదా! అందువలన వారి లక్షణములను బట్టి వారిని గుర్తింతును. అట్లే శరీరముతో కూడిన జీవులందరిని వారి వారి గుణములచే గుర్తింతును. కాని నీ పుత్రికగ జనించిన ఈ కుమారిని గుర్తించుట నలవికాదు. ఈమెకు లక్షణములు లేవు. గుణములు లేవు. ఈమె నిర్గుణ, సాక్షాత్తూ పరమశివుని వంటిది."

పై తెలిపిన విధముగా శ్రీలలితకు నిర్గుణ నామము సార్థకమైనది.

# 140. 'నిష్కళా'

శ్రీదేవి కళలకు అతీతురాలు అని అర్థము.

నిర్గుణము, నిరాకారము యగు శ్రీలలిత యందు కళలు కూడా గోచరించవు. ఏ కళ లేని ఆమెనుండి పుట్టిన గుణములనుండి సమస్త కళలు పుట్టుచున్నవి. ఆమెయందు అన్నియు వున్నను ఏమీలేనట్లు గోచరించును. రాత్రి యందలి ఆకాశమువలె నుండు ఆమె పగటి ఆకాశమువలె గుణములను ఆశ్రయించి అనేక వెలుగులను ఆవిష్కరించును.

గుణములను ఆశ్రయించిన దైవము నారాధించుట ఒక మతము. ఏ గుణమూ లేక, ఏ కళా లేక, ఏ ఆకారమూ లేక, ఏ ఆధారమూ లేని తత్త్వము నారాధించుట మరియొక మతము. వీరు దైవమును నామరూపముల యందు గాని, గుణముల యందు గాని, లక్షణములయందు గాని వున్నట్లు భావింపరు. వారి దృష్టి యందు ధ్యాన మనగా నిష్కళ చింతయే. దీనిని భక్తికి పరాకాష్ఠగ భావింతురు. కాని శ్రీకృష్ణుడు ఇట్టి నిరాకార నిర్గుణ తత్త్వమును భావించుట సామాన్యులకు సౌకర్యము కాదని, దుఃఖము కలిగించునని సర్వమంగళమగు రూపము నొకదానిని, విశేష గుణములతో కూడిన దానిని భావించుట వలన అనురక్తి, ఆసక్తి, భక్తి ఇనుమడించునని తద్వారా బ్రహ్మైక్యము పొందవచ్చునని తెలిపినాడు.

శ్రీదేవిని మహత్తరమగు గుణములతో ఆరాధించుటకే కదా సహస్ర నామములు. నిర్గుణ ఆరాధనమునకు నామావళితో పనియే లేదు. గుణాతీత స్థితిని పొందిన శంకరులు సైతము శ్రీలలితను, పరమ శివుని అనేక గుణ వర్ణనములతో స్తోత్రము గావించిరి. దీనివలన తెలియునదేమనగా తత్త్వము – వ్యక్తము, అవ్యక్తము కూడ అయివున్నదని, వ్యక్తమైనది మాత్రమే దైవమని భావింపక, అవ్యక్తము అతీతమై కూడా వున్నదని తెలియుట.



# 141. 'శాంతా'

**శ**మము కలది శాంత అని అర్థము.

అంతమున శాంతి కలిగించునది శాంత. 'శ'కారము అంతమున గలదగుటచే ఆరాధనానంతరము ప్రశాంతత నిచ్చునని అర్థము. దైవారాధనమునకు ఫలశ్రుతి శాంతము పొందుటయే. అట్లే సర్వకార్యముల ముగింపు శుభముగను, ఆనందముగను, శాంతి కలుగునట్లు అనుగ్రహించునది శ్రీలలిత.

దైవారాధకులకు ఏ విధముగ శాంతి కలిగించవలెనో ఆ విధముగ శాంతిని ప్రసాదించునది దైవము. ఆర్తులకు ఆర్తి తీర్చుట, కోరికలు గలవారికి కోరికలు తీర్చుట, జిజ్ఞాసువులకు జ్ఞాన మందించుట, జ్ఞానులకు సాన్నిధ్యము ఇచ్చుట వలన వారికి శాంతి కలుగును. తాత్కాలికమగు శాంతి నుండి శాశ్వతమగు శాంతివరకు సమస్తమును అనుగ్రహించు శ్రీలలితను 'శాంత' అని పిలుతురు.



# 142. 'నిష్కామా'

**కా**మము లేనిది, కామముచే బంధింపబడనిది, కామమునకు అతీతమైనది శ్రీలలిత అని తెలియనగును.

అన్ని కోరికలు పొందగలిగిన సమర్థత వుండి, యే కోరిక యందాసక్తి లేక కేవలము పరతత్త్వమునే ఆశ్రయించి వుండు వారిని నిష్కాములందురు. సృష్టియందలి సమస్తము శ్రీలలితకు అందుబాటు లోనిదే. కావున సృష్టి నుండి ఆమె పొందవలసిన దేమియు లేదు. తనయందు ఉన్నదే సృష్టి యందు వెలిసినది. తనయందు ఉన్నవి తనవే కనుక వానిని పొందవలసిన అవసరమేలేదు. జీవులు తమయందు లేనివానిని పొందుటకు శ్రమ పడుచుందురు. అది వారిలోని లేమి. ఉన్నది పొందవలసిన అగత్యము లేదు. నిజమునకు అంతయూ తమలోనే వున్నదని తెలిసిన జ్ఞానులే నిష్కాములు. వారు త్రిగుణములను దాటినవారు. వారిని ఇచ్ఛాశక్తి బంధించదు.

ఇక శ్రీలలిత విషయమునకు వచ్చినచో జ్ఞానులకు సైతము మోహము కలిగించునేమోగాని, తన కెట్టి మోహమూ లేదు. పరమేశ్వరుని యందు కూడ అర్ధ భాగమై స్థిరపడుటవలన యిక పరతత్త్వమును గూర్చి కూడ ఇచ్ఛ లేనిది శ్రీదేవి. పై కారణముగ శ్రీలలిత పూర్ణస్థితి యందున్నది. ఆమెకు తనకన్న అన్యమైనది లేదు. అన్యమున్నచో గదా పొందవలె ననిపించుట. అంతా తానై వుండుట వలన ఆమె నిజమగు నిష్కామ. పరమశివుడు నిష్కాముడు.

శివుని నిష్కామత్వమునకు, శ్రీలలిత నిష్కామత్వమునకు పోల్చి చూచినచో ఒకవిధముగ ఆమె నిష్కామత్వమే గొప్ప దనిపించును. పరమశివు డన్నిట వుండును. శివాని ఆయన ఆధారముగ సృష్టిని అల్లుచు, జీవులకు పరిణామము కలిగించుచు, లోకములను పాలించుచు, కోరికయను మోహమున పడకుండుట నిజమగు నిపుణత. చేయుచూ చేయక యుండుట, అల్లుచూ అల్లికయందు బంధింపబడకుండుట శ్రీదేవి గొప్పదనమేమో అనిపించును. యోగుల కామెయే సంపూర్ణమగు ఉదాహరణము.



# 143. 'నిరుపప్లవా'

**నా**శనము లేనిది శ్రీలలిత అని భావము.

సృష్టి స్థితుల యందు గాక లయమున కూడ వుండునది శ్రీలలిత. ప్రకృతి పురుషులు లయమున కూడ నుందురు. లయమున ఆమెది యోగనిద్ర. అనగా మెలకువా కాదు, లేనిస్థితీ కాదు. వుండియూ లేనట్లుండుట, లేకయూ వుండుట. లేనిచో ఉద్భవించదు కదా! ఉండునుకాని, ఉన్నట్లు ఆమెకు తప్ప మరి ఎవ్వరికిని తెలియదు. కాలము రూపమున మేల్కొనినపుడు చతుర్ముఖ బ్రహ్మ మొదలగు వారికి వున్నామని తెలియును. ఎట్లుంటిమి? అను ప్రశ్న కూడ జనించును. ఎట్లుంటిమో తెలియకపోవుట నిద్రస్థితి. తెలిసి యుండుట యోగనిద్రా స్థితి. శ్రీదేవి లయమునకూడ బీజప్రాయముగ తత్త్వ మందిమిడి యుండును. కావున ఆమె నాశనము లేనిది.

శ్రీలలిత నారాధించు భక్తులు కూడ ఇట్లే నాశనము లేక యుందురు. "నాభక్తులెన్నటికిని నశించరు" అని శ్రీకృష్ణుడు పలికినదీ సత్యమే. సనక సనందనాదులు, నారదుడు అట్టి దేవీ భక్తులు.



# 144. 'నిత్యముక్తా'

శ్రీదేవి నిత్యముక్తురాలని భావము. త్రిగుణములకు లోబడిన వారు బద్ధులు. త్రిగుణముల కతీతముగ నుండువారు ముక్తులు. గుణ బంధనమే ప్రథమ బంధనము. అటుపైన పంచభూతముల బంధనము. వెరసి అష్ట బంధనములు జీవుల కేర్పడు చున్నవి. త్రిగుణములు, పంచభూతములు, సృష్టి కార్యమునకు శ్రీదేవి వినియోగించు సామాగ్రి. అహంకార స్వరూపులైన జీవులు ఈ ఎనిమిది బంధనములలో యిమిడి వుందురు. అహంకార మనగా 'నేను ప్రత్యేకముగా వున్నాను' అని అనిపించుట.

ఇట్లు అనిపించినపుడు, నేను, యితరులు అను భావము తప్పదు. ఈ అహంకారమే జీవులకు మూలము. దీనివలన తాను, యితరులు అను ప్రథమ మగు బంధ మేర్పడును. దీనిని దాటుటకే "యితరములుగ కనిపించు చున్నది కూడ నేనే" అని భావన చేయుట దీనినే 'అనన్య చింతన' మందురు. అనగా చింతనమున అన్యము లేదు. ఈ భావన సిద్ధించిన వారే ముక్తులు. జీవులు ఈ ముక్త స్థితిని చేరుటకే వేయి సాధనా మార్గముల ననుసరింతురు. కోటి మనుషు లలో నొకడు ఈ సాధన యందు స్థితి పొందును. అట్టివారే సిద్ధులు.

సాధన యందలి సత్త్వ గుణమును బట్టి శ్రీదేవి ముక్త స్థితిని అనుగ్రహించు చుండును. అనగా త్రిగుణముల త్రిభుజము నుండి

ఆవలకు గొనిపోవును. త్రిమూర్తులతో కూడి సమస్త దేవకోట్లు త్రిగుణముల వలననే నడిపింపబడుచున్నారు. అట్టి త్రిగుణములను దాటి యెప్పుడునూ వుండునది శ్రీమాతయే. పరతత్త్వము, పరా ప్రకృతి త్రిగుణముల నేర్పరచి సృష్టి కథను నిర్వర్తించు చున్నపుడు వారు త్రిగుణములకు అతీతముగనే యుందురుగదా! వారే నిజమగు ముక్తులు. ఇతరులీ స్థితిని వారి అనుగ్రహమున పొందుటకే సమస్త ఆరాధనలు, సాధనలు.



# 145. 'నిర్వికారా'

**వి**కారము లేనిది శ్రీమాత అని భావన.

వికారమనగా మార్పునకు గురి యగునది. మార్పులు జరుగు చున్ననూ శ్రీమాత మార్పు చెందక వుండును. సృష్టి నిర్వహణ మనగా నొక మహత్తరమగు అగ్ని కార్యము. అగ్నివలన మార్పులు సంభవించి ప్రకృతి పురుషుల నుండి పదునాలుగు లోకము లేర్పడును. అయినను అగ్ని అగ్నిగనే యుండునుగదా!

మార్పులకు స్వామిత్వము వహించువారు అట్టి మార్పులకు అతీతముగ వుండినచో మాత్రమే సంకల్పించిన మార్పులు వలసిన ప్రయోజనమును సిద్ధింప చేయగలవు. అట్లు కానిచో స్వామిత్వమే లేదు.

మూలవస్తువు మారక దాని ఆవరణల యందు మార్పులు జరుగుట ఆత్మ లక్షణము. అట్టి ఆత్మస్వరూపిణియైన శ్రీమాత సృష్టికొఱకై తననుండి ఇరువదిమూడు తత్త్వ వికారములను కల్పించి నప్పటికిని అందు వికారము చెందక ఆమె ఇరువదినాలుగవదిగా యుండును. అందులకే ఆమె 'గాయత్రి' అని కొనియాడబడుచున్నది. ఎట్టి వికారములు లేక ఒకే విధముగ ప్రకాశించు తత్త్వము గలది శ్రీమాత అగుటచే ఆమె నిర్వికార. పరమపురుషుడు నిర్వికారుడు.

# 146. 'నిష్ప్రపంచా'

ప్రపంచము లేనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత నుండి పుట్టినది ప్రపంచము. ప్రపంచ మనగా పంచ భూతములతో విస్తారముగ నేర్పడినది. పంచభూతము లామెపై ప్రభావము చూపలేవు. ప్రపంచ మనగా మొత్తము సృష్టి యను భావన కూడ వున్నది. అట్టి సృష్టికి కూడా ఆమె అతీతము. సృష్టిగాని, సృష్టి యందలి ఏ శక్తిగాని ఆమెపై ప్రభావము చూపలేవు.

దైవమునకు, జీవులకు గల ప్రధానమగు వ్యత్యాసములలో ఇది ఒకటి. జీవులపై గుణములు, పంచభూతములు, ప్రభావము చూపుచునే యుండును. జీవులు కూడా ఒకరిపై నొకరు ప్రభావము చూపుచు నుందురు. ఈ విధముగ జీవుడు అనేకానేక ప్రభావములకు లోనగుచుండును. ఒకపూట యున్నట్లు మనస్సు మరి యొకపూట యుండదు. కారణము జీవులు, సృష్టి వారిపైచూపు నిరంతర ప్రభావమే. కేవలము నిద్రయందు మాత్రమే యెట్టి ప్రభావము సోకక యుండుట వలన జీవులకు విశ్రాంతి దొరకు చున్నది. ఇతర సమయ ములలో ఏదియో యొక విషయము వారి మనస్సులపై ప్రభావము చూపుచు నడిపించుచు నుండును.

దైవ భక్తులు తమ నిరంతర, నిశ్చల ఆరాధన ద్వారమున ఈ ప్రభావమునుండి బయల్పడుటకు ప్రయత్నింతురు. దైవముతో ప్రజ్ఞ

ముడిపడి యున్నప్పుడు ఇతర ప్రభావము లేమియు తమపై నుండవు. ముడివిడినపుడు ఏదియో యొక భావన ద్వారమున సృష్టి, జీవులు, జీవులపై ప్రభావము చూపుచు నుందురు. అనన్య చింతనులు సృష్టి యందు ప్రపంచ ప్రభావము లేక వర్తించుచుందురు. వారే సద్గురువులు, మార్గదర్శకులు. వారు శ్రీమాతకు ప్రియమగు భక్తులు.

పై కారణముగ 'నిష్ప్రపంచ' యగు శ్రీమాత అనుగ్రహము పొందుటకు ప్రపంచమున మునిగిన జీవులు శ్రీమాతను ఆరాధించుట మార్గము. సద్గురు ముఖద్వారమున ఆరాధించుట సౌలభ్యము.



# 147. 'నిరాశ్రయా'

ఏ ఆశ్రయము లేనిది శ్రీమాత అని అర్థము.

సృష్టిలోని ప్రతి జీవునికిని శరీరమే ప్రధానమగు ఆశ్రయమై యున్నది. అల్పులకు ఆస్తిపాస్తులు, కుటుంబము, బంధుమిత్రులు ఆశ్రయమై యుండును. సంఘమున కీర్తి, ప్రతిష్ఠలు, పదవులు, యిత్యాదిని ఆశ్రయించి జీవించువారు ఇంకనూ పతనము చెందిన వారే. కీర్తి, ప్రతిష్ఠ, పదవి, బంధుమిత్రులు, శరీరము కూడ తనపై ఆధారపడి యున్నవి కాని వాటిపై తాను ఆధారపడి లేదు. ప్రధానముగ ప్రతి ఒక్కడును జీవుడు. జీవుడుగ జ్యోతి స్వరూపుడు. నత్త నుండి రసము స్రవించి నత్తగుల్ల ఏర్పడినట్లు తననుండియే తన శరీరము, శరీర సంబంధముగ కుటుంబము, ఆస్తిపాస్తులు, బంధుమిత్రులు, పదవులు, కీర్తిప్రతిష్ఠలు, ఏర్పడుచున్నవి. వాటన్నింటికిని తానాశ్రయము.

తన నాశ్రయించిన వానిపై ఆధారపడువాడు అల్పబుద్ధియే కదా! చక్రవర్తి సైనికునిపై ఆధారపడినట్లు, రాజు బంటుపై ఆధారపడి నట్లు హీనముగ జీవించుట, తనను తానాశ్రయింపక యితరముల నాశ్రయించిన వారికి తప్పదు. శ్రీమాత నుండి కోటానుకోట్ల జీవులు, లోకములు యేర్పడినను వాటన్నింటికిని తానాశ్రయమై నిలచినదే కాని తాను దేనినీ ఆశ్రయించదు. ఆమె శరీరమును కూడ ఆశ్రయించి

యుండదు. అందులకే ఆమె నిరాకార అని చెప్పబడినది. దేవతలు, ఋషులు, యోగులు కారణ శరీరమునుగాని, సూక్ష్మ శరీరమునుగాని, ఆశ్రయించి యుందురు. మానవులు భౌతిక శరీరము నాశ్రయించి యుందురు. కాని మానవులయందు, యోగుల యందు, ఋషుల యందు శ్రీమాత నాశ్రయించినవారు ఆమె వలననే నిరాశ్రయ స్థితి పొందుదురు. వారి నిరాశ్రయత కన్న మించినది శ్రీమాత 'నిరాశ్రయ' స్థితి.



# 148. 'నిత్యశుద్ధా'

ఎల్లప్పుడూ శుద్ధ స్థితి యందుండునది శ్రీమాత.

ఎల్లప్పుడూ అనగా భూత, భవిష్యత్, వర్తమాన కాలములందు అని అర్థము. శాశ్వతముగ శుద్ధమైనది. శుద్ధ అనగా మలినములు లేనిది. అజ్ఞానము, అహంకారము, కోరిక, వైషమ్యము, మోహము ఇత్యాది మలినములు లేకుండుటయే శుద్ధ స్థితి. మాయ తాకనిది శుద్ధ స్థితి. శ్రీమాతకు మాయ ప్రధానమగు పనిముట్టు. మాయతోనే సృష్టి నిర్మాణము, నిర్వహణము గావించు చుండును. మాయ ఆమెపై ఆధిక్యము కలది కాదు.

సృష్టియందు మలినము తప్పనిసరి. సృష్టి కార్యము అగ్ని కార్యమగుటచే మసిబారుట కూడ జరుగు చుండును. అన్ని లోకముల యందు కొద్దియో గొప్పగనో మలినముండుట తప్పనిసరి. దానిని ప్రతినిత్యము పరిశుభ్ర పరచుకొనుట సాధన. బ్రహ్మాదుల కైనను ఇది తప్పదు. త్రిమూర్తులు గూడ అప్పుడప్పుడు మాయా మోహము లను మలినము సోకినవారే అని పురాణములు తెలుపుచున్నవి. అట్టి మలినములు సోకని శాశ్వత శుద్ధత్వము ఇచ్చుట చెప్పబడుచున్నది.

జీవ చైతన్యము కూడ అట్టి శుద్ధత్వము కలిగి యున్నది. ఈ కారణముచేతనే జీవుడు దైవాంశయే కాని అతనిని ఆవరించి యుండు అహంకారాది అష్ట ఆవరణలు మలినముల నుత్పత్తి చేయుచు

నుండును. వీని ప్రభావము జీవునిపై నున్నప్పుడు అతని సహజస్థితి జీవుడు కోల్పోవును. అతడు నిర్మలుడే అయినను, శరీర సహవాసము వలన, శరీర వాసనలు సోకుట జరుగుచుండును.

శరీరము మలినములతో కూడినది. అందుండువాడు నిర్మలుడు. నిర్మలుడు నిర్మలుడుగానే యుండవలెనన్నచో అహంకారాది భావనలు దాటవలెను. "తా నున్నాడు" అని భావించు ప్రతి మానవుడు అహంకారియే. దైవమే తానుగ నున్నాడు. నిజమునకు దైవమే వున్నాడు. "నేనుండుట మాయ" అని నిత్యము తెలిసినవాడు నిత్య శుద్ధు డగును. అట్లగుటకు సాధన కావలెను. సాధనవలన సిద్ధి పొందువాడు జీవుడు. శ్రీమాత నిత్యసిద్ధ. కావున 'నిత్యశుద్ధ'.



# 149. 'నిత్యబుద్ధా'

శ్రీమాత శాశ్వత బుద్ధి స్వరూపిణి అని అర్థము. జ్ఞాన స్వరూపిణి అని అర్థము.

శుద్ధత్వమువలె బుద్ధత్వము కూడ శ్రీమాత సహజ స్థితి. ఆమె బుద్ధి స్వరూపిణి కనుక బుద్ధి ప్రచోదనము చేయుమని ఆమెను ఆరాధించుట జరుగుచున్నది. అందులకే గాయత్రి మంత్రము. శుద్ధి, బుద్ధి అనునవి ఒక దానివెంట ఒకటి కలుగు సిద్ధులు. శుద్ధి నిత్యము గావించుకొను చుండవలెను. అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశముల శుద్ధి శ్రద్ధతో గావించుకొనుచు బుద్ధి ప్రచోదనమునకు ప్రయత్నించుట సాధన. బుద్ధినిగొని శుద్ధిని సాధించుట, శుద్ధితో బుద్ధిని ఆహ్వానించుట నిత్యము జరుగవలెను. అట్టి వారికే సంసారము నుండి తరించుటకు వీలగును.

జైన మతమున తరణమును చెందుటకు ఆరాధించు శ్రీమాతను 'తారాదేవి' అని పిలుతురు. శుద్ధబుద్ధులు అను తీర్థంకరులు తారాదేవి అనుగ్రహముచే తరించిరని తెలుపబడుచున్నది. శుద్ధి, బుద్ధి తరించుటకు ముఖ్యమని తెలియవలెను. ఈ కారణముగనే నిత్యశుద్ధా, 'నిత్యబుద్ధా' అను నామములు వరుసగా పేర్కొనబడినవి.

# 150. 'నిరవద్యా'

నిందకతీత మైనది శ్రీలలిత అని అర్థము.

అవద్య అనగా అవిద్యా వికారము వలన పుట్టిన నింద. శ్రీమాత విద్యా అవిద్యా స్వరూపిణి. అవిద్య యందు వసించుచూ వున్నప్పటికి అవిద్యా ప్రభావము ఆమె నంటదు. మట్టి యందున్ననూ బంగారము బంగారమేకదా!

అవిద్యా వికారము కలవారు అవద్య నరకముల వసింతురు. కారణ మేదైనను అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశముల యందు వుడుకుట వున్న వారందరూ, అవద్య నరక వాసులే. నిత్యము చింత, దుఃఖము, బాధ, భయము, ద్వేషము, ఈర్ష్య, గర్వము, అసూయ, ఇత్యాది భావములలో సతమతమగు వారందరు అవద్యా నరకమున జీవించు చున్నవారే. శ్రీమాత నిరవద్య అగుటచే ఆమె నాశ్రయించి ఆరాధించు వారు పాపకూపములైన ఈ భావములనుండి విముక్తి పొందెదరు. ఆమె నాశ్రయించుట వలన, సతతము స్మరించుట వలన దోష రహితులై జీవింపగలరు. అనుభవమగు భావములు శ్రీదేవి భక్తులను సోకవని శ్రీసూక్తము కూడ చాటి చెప్పుచుండును.

"నక్రోధో నచ మాత్సర్యమ్...."

# 151. 'నిరంతరా'

**అం**తరము లేనిది శ్రీమాత అని అర్థము.

అంతరమనగా భేదమని ఒక అర్థము. ఆమె యందు ఎట్టి భేదములు లేవు. ఆమె పరమప్రేమ స్వరూపిణి గనుక, భేదబుద్ధి లేక అందరిని తగువిధముగా ఆదరించును. తాము, ఇతరులు అను భావము గలవారికి భేదబుద్ధి యుండును. శ్రీదేవికి తనవారు, ఇతరులు అను భావము లేదు. సర్వము నందు ఆత్మదర్శనము చేయువారు నిరంతరము భేదబుద్ధి లేక ఆత్మ యందే యుందురు. వారికి అనాత్మయగు వస్తువు గోచరింపదు.

అంతరమనగా ఎడము అని గూడ అర్థము గలదు. రెండు వస్తువుల మధ్య ఎడమను ఖాళీ చోటుగ మనము భావింతుము. నిజముగ ఆ చోటు యందు వ్యాపించి యున్నది శుద్ధచైతన్యమే. అంతరిక్షము అనగా శుద్ధచైతన్యముచే ఆవరింపబడిన చోటు. అది వస్తువుల యందు, వస్తువుల నడుమ కూడ వ్యాపించి యున్నది. అది నిండి యుండని చోటు లేదు. అట్టి ఖాళీ చోటును అంతరమని అందురు. ఖాళీ చోటునందు శుద్ధచైతన్యమును చూచుట అంతరీక్షణ మగును. అట్లు చూచిన ఋషులు ఆ చోటును అంతరిక్షము అని పిలిచిరి. ఇట్లు శ్రీమాతను యందు, తన పరిసరముల యందు గల చోటుగ చూచుట ఒక విశిష్టమగు ఆరాధనము.

రూపములను చూచు అలవాటు గలవారు చోటును చూడలేరు. చోటును చూడగల ఋషులు రూపము నందు కూడ చోటును చూడగలరు. తమ యందు, అన్ని భూతముల యందు, చోటునందు, శుద్ధచైతన్యమే గోచరించును. ఇట్లు అంతరీక్షణమును చూచువారు ముక్తులు. అచట వీక్షింపబడు దేవి 'నిరంతరా'.



# 152. 'నిష్కారణా'

**కా**రణమేమియు లేకయే సృష్టి నిర్వహించునది శ్రీమాత.

శ్రీమాత సృష్టి నిర్మాణము చేయుటకు వ్యక్తిగతముగా కారణ మేమియు లేదు. తనకోసము కాక జీవుల కొఱకు సృష్టి నిర్మాణము గావించు చున్నది. సృష్టి నిర్మాణము చేయుటలో ఆమె కోరుగునది ఏమియు లేదు. సృష్టి, స్థితి, లయములను జీవుల కొఱకే గావించు చున్నది. తాను ఆనందస్వరూపిణి. అట్టి ఆనందము కొఱకే జీవులు కూడ ప్రయత్నించుచున్నారు. జనన మరణ చక్రముల పడుచు ఆనందము కొఱకై అన్వేషణము గావించువారు జీవులు. వారికి, వారి వారి పరిమణాములను బట్టి దేహములను అందించుచు, లోకములను సృష్టించుచు శాశ్వతముగా ఉండునది శ్రీమాత. ఆమె వరకు ఆమె నిష్కారణయే. కాని ఆమె కారణముగ సృష్టి స్థితి లయములు జరుగుచున్నవి. ఆమె లేనిచో జీవులకు చైతన్యమే లేదు. త్రిగుణములు లేవు. దేహములు లేవు. తామున్నామని కూడ వారికి తెలియుట శ్రీమాత వలననే.

కారణము లేకయే ఇతరుల శ్రేయస్సు కొఱకు వర్తించువారు యోగులు. ఋషులు, సిద్ధులు, దేవతలలో కొందరు ఇట్లు శ్రీదేవి వలె సృష్టి జీవులకు తోడ్పాటు గావించుచున్నారు. ఇట్టి నిష్కారణు లందరూ దేవి సైన్యమే. వీరి జీవితము యజ్ఞార్థము. ప్రతిఫలాపేక్ష

లేక ఇతరుల శ్రేయస్సునకు పనిచేయుట యజ్ఞము. అట్టి యజ్ఞముగ జీవితమును నిర్వర్తించుకొనుట దేవీ సైన్యమున చేరుటకు అర్హత. స్వార్థజీవితము నుండి నిస్వార్థము, శ్రేయోదాయకము అగు జీవనమునకు తమను తాము మలచుకొనుట సాధన. "యజ్ఞార్థమ్ కురు కర్మాణి" అని శ్రీకృష్ణుడు శాసించుటలోని పరమార్థము ఇదే.

యోగి జనులకు, యోగసాధకులకు శ్రీదేవి సాన్నిధ్యమే గమ్యము. జీవులకు, సృష్టికి ఆమె ఆధారము, కారణము. ఆమె మాత్రము 'నిష్కారణ'యే.



# 153. 'నిష్కళంకా'

**క**ళంకము లేనిది శ్రీమాత అని భావము.

శుద్ధమైన విషయము పాపరహితము. శుద్ధచైతన్యము నందు ఎట్టి కళంకములు వుండవు. అహంకారాది అష్టప్రకృతులుగ దిగి వచ్చినప్పుడు ఆయా లోకములలో ఆయా కళంకములు ఏర్పడు చున్నవి. అహంకార స్థితిలో స్వార్థము తనను తాను పరిరక్షించు కొనుటవంటి కళంకములేర్పడును. అట్లే బుద్ధి లోకమున వెలుగులకు బుద్ధిలోపము అను చీకట్లు క్రమ్ముచుండును. మనస్సునకు చంద్రకళల వలె హెచ్చుతగ్గులుండును. చిత్తమునకు భ్రమ, భ్రాంతి అను కళంకములు యుండును. పంచభూతములతోకూడిన సృష్టిలో గల కళంకములు యుండును. పంచభూతములతో కూడిన సృష్టిలో గల కళంకములను గూర్చి వివరింప నవసరము లేదు. అంతఃకరణ చతుష్టయము, బహిఃకరణ పంచకములలో కళంకములు తప్పనిసరి. వీనిని ఎప్పటి కప్పుడు శుభ్రపరచుకొను చుండవలెను. ఈ తెలిపిన తొమ్మిది ఆవరణలకు ఆవలనుండునది శ్రీమాత గనక ఆమెకు కళంకములు అంటవు. జీవులు ప్రతి నిత్యము కళంకములను నిర్మూ లించుకొననిచో పాపమావరించును. అందులకే సాధన చతుష్టయము ఋషులచే నొసంగబడినది. జీవులలో నిత్యశుద్ధు లెవ్వరునూ లేరు. వారు నిష్కళంకులునూ కాదు. శ్రద్ధా భక్తులతో నిత్యము కళంకములను

నిర్మూలించుకొనుటవలన శుద్ధులై శ్రీదేవి సాన్నిధ్యమును పొంద గలరు. "అహం బ్రహ్మాస్మి" అను బ్రహ్మవేత్తకైనను శరీరము లందున్నప్పుడిది తప్పనిసరి.



# 154. 'నిరుపాధి'

**ఉ**పాధిలేనిది, అతీతమైనది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత ఉపాధిలేని స్థితియందుండి జీవులకు ఉపాధి ఏర్పరుచుచుండును. ఉపాధులకు ఉపాధి ధర్మము లున్నవి. ఈ ఉపాధులలో దేవి ఉన్నప్పటికిని ఆయా ధర్మములు ఆమెను సోకవు. ఉదాహరణకు స్ఫటికమునకు చేరువలో ఉన్న పూవు రంగు స్ఫటికమున ప్రతిబింబించును. కాని స్ఫటికమున ఆ రంగు చేరలేదు. అట్లే శ్రీదేవి చుట్టును ఎన్ని ఆవరణలు, ఉపాధులు ఉన్నప్పటికిని వాని ప్రభావము శ్రీదేవిపై యుండదు. ఉపాధులు చైతన్యముపై ప్రభావము చూపినపుడు, అవిద్య ఆవరించినట్లు అగును. ఇతరుల ప్రభావము జీవులపై ఉండుట సర్వసామాన్యము. దానికి కారణము అవిద్యయే. అవిద్య ఎంత బలముగా నున్నచో అంత బలముగా ఇతరుల ప్రవర్తన సాధకులకు కలవరము కలిగించుచుండును. ఇతరుల ప్రవర్తనతో చలింపక తాను తానుగానే ఉండు స్థిరచిత్తుడగు సాధకుడు అవిద్యచే అంత హింసింపబడడు. భాగవతోత్తముని జీవితమున ఈ విధమగు నిశ్చలత్వము గోచరించును. "ఉద్వేగమునకు గురి కాబడనివాడు, ఉద్వేగము కలిగించనివాడు నా భక్తుడు" అని శ్రీకృష్ణుడు తెలిపినాడు. ఇతరము, ఇతరులుగా గోచరించుచున్నది చైతన్యమే అని తెలిసినవారే ఉపాధి ధర్మముల ప్రభావము సోకక జీవింతురు. అట్టి వారికి శ్రీదేవి పరాకాష్ఠ. ఆమె చిత్ స్వరూపిణి అగుటచే ఉపాధి ప్రభావము ఆమెపై ఏమియూ యుండదు.

# 155. 'నిరీశ్వరా'

**జ**గత్తునకు శ్రీమాతయే ఈశ్వరి అని భావము.

శ్రీమాతను ఈశ్వరి అని సంబోధించుటలో ఈశ్వరుడు- ఈశ్వరి సామ్యమును, సరిసమానత్వమును తెలుపబడుచున్నవి. ఈశ్వరుని పొంది యుండునది గనుక ఆమె ఈశ్వరి. సృష్టి యందు ప్రకృతి లేని పురుషుడు లేడు. పురుషుడు లేని ప్రకృతియును లేదు. పురుష ప్రకృతులు అభేద్యమగు తత్త్వము. తత్త్వము నుండియే ఇరువురు ఏర్పడినారు. ఒకటి, రెండుగా ఏర్పడినది. రెండుగా లేనపుడు, ఒకటిగా ఉన్నపుడు ఆ తత్త్వమును పురుషుడనుటకును, ప్రకృతి అనుటకును వలను పడదు. పురుషుడు, ప్రకృతి ఇద్దరును తత్త్వము నుండి ఉద్భవించినవారే. రెంటి యందలి తత్త్వము ఒకటే గనుక వారు పరస్పర ఆకర్షితులు. మొదట అర్ధనారీశ్వరులు. అటుపైన విడిపడిన ప్రకృతి పురుషులు. విడిపడినను ఒకరి యందు మరియొకరి ఆసక్తి కారణముగా చైతన్యముద్భవించినది. అందుండి సమస్త లోకములు ఉద్భవించినవి. ప్రకృతి గాని, పురుషుడు గాని లేని లోక ముండదు. ఉండుటకు వలను పడదు. కావున వారిరువురి మధ్య తారతమ్యము లేదు. అతడు ఈశ్వరుడైనపుడు ఆమె ఈశ్వరి. సృష్టికి వారిరువురును తల్లితండ్రులవంటివారు. గొప్పతనము, తక్కువ తనము, హెచ్చుతగ్గులు అహంకారాది లోకములలో ఉండును గాని

గుణాతీతమగు చైతన్యమునకు, తత్త్వమునకు ఉండదు. ఈశ్వరి ఈశ్వరియే. ఆమెకిక ఈశ్వరుడు లేడు. అందువలన ఆమె నిరీశ్వరి. అట్లే ఈశ్వరుడు ఈశ్వరుడే. అతడును నిరీశ్వరుడే. పై కారణముగనే కైవల్యప్రాప్తికి ఇరువురును అధిష్ఠానదైవములైనారు. శ్రీవిద్య, బ్రహ్మ విద్యా మార్గములేర్పడినవి. రెండిటి సమత్వమును సమన్వయించుచు అన్ని లోకములందు జీవించుటకు యోగవిద్య ఏర్పడినది. స్త్రీ పురుష అభేద స్థితి సమత్వము తెలిసినవారే నిజమగు యోగులు.



# 156. 'నీరాగా'

**అ**నురాగములకు అతీతమైనది శ్రీమాత అని భావము.

రాగమనగా ఇచ్ఛ లేక కోరిక. శ్రీమాత అనురాగమునకు ఆలయమేయైనను ఆమెకు సృష్టి యందలి ఏ విషయము పైనను ప్రత్యేకముగా ఇచ్ఛ లేదు. సమస్త ఇచ్ఛలు తీరిన వారికి ఇక ఇచ్ఛలు ఏమి యుండును? పరిపూర్ణత్వము కారణముగా ఇచ్ఛకవకాశమే లేదు. లేని దానిపై ఇచ్ఛ కలుగును. కాని అన్నియు తానై నిండిన స్థితి యందిచ్ఛ ఎట్లుండగలదు? స్థితి యందుండగ మరియొక ఇచ్ఛ కవకాశమే లేదు.

జీవులకు లేనివి, కావలసినవి చాలా యున్నవి. ఇచ్ఛ పూర్తియగు వరకు ఇచ్ఛనే అనుసరించుచుందురు. వారు రాగబద్ధులు. ఇచ్ఛ వలన కొంత సాధింపబడుట జరుగును. కానీ అట్టి సాధనలో కామ క్రోదాధి అరిషడ్వర్గములు పుట్టి జీవులను బంధించుచుండును. ఇచ్ఛా నిర్వహణము. ఇచ్ఛా పరిపూర్తి, ఆపై ఇచ్ఛను దాటిన స్థితి, ఈ మూడింటిని శ్రీమాతయే ప్రసాదించగలదు. ఆరాధనయే దానికి ఆధారము.

ఆరాధనము వలన ఇచ్ఛాపూర్తి జ్ఞానము కలుగును. ధర్మ యుక్తముగా నిర్వర్తించుకొను బలము కలుగును. క్రమముగా ఆరాధనయే ఇచ్ఛాలేమి స్థితిని కూడ ప్రసాదించుచుండును.

ఉదాహరణకు బంగారునగలపై జీవులకు మోజు కలదు. బంగారమునకు నగలపై యెట్టి మోజు ఉండదు. కారణము తానే నగల రూపమున ఉండుట. అట్లే శ్రీమాత కూడను. తానే సమస్త వస్తుజాలముగ యేర్పడి ఉన్నప్పుడు యిక యిచ్ఛగించవలసినది ఏమియూ లేదు. వశిష్టాది బ్రహర్షులట్టి వారు.

మరియొక మాట! ఇచ్ఛాపరిపూర్ణులు ఇచ్ఛారహితులై యున్నారు. వారే యితరుల ఇచ్ఛను పరిపూర్తి గావింపగలరు. పూర్ణత్వము గలవారే యితరులకు కూడ పూర్ణత్వము నందించగలరు. శ్రీమాత పరిపూర్ణ అగుటచే ఆమెయే నిజమగు నీరాగ.



# 157. 'రాగమథనీ'

రాగద్వేషాది క్లేశములను మథించునది శ్రీదేవి అని అర్థము.

ఇచ్ఛా పరిపూర్తి గూర్చి ముందు నామములో తెలుపబడినది. అట్టి సాధనమున, కాలమును, కర్మమును బట్టి రాగద్వేషములు ఏర్పడుచుండును. కామక్రోధములు కలుగుచుండును. లోభమోహ ములు ఆవరించుచుండును. విజయము కలిగినప్పుడెల్ల మదమున కవకాశముండును. ఇతరులకు విజయము కలిగినపుడు మాత్సర్య భావములు కలుగును.

ఇవి అన్నియూ తన వృద్ధికై జీవుడు పనిచేయుచున్న సమయమున కలుగు మలినములు. వీటి వలన దుఃఖము, బంధము కలుగును.

జీవుడు తన కొరకై తాను పాటుపడుట సహజము. ఇహపర సౌఖ్యమునకు ప్రయత్నించువాడు జీవుడు. ఇది సత్సంకల్పమే. అట్టి సంకల్పమును నిర్వర్తించు సమయమున పై విధమగు క్లేశములుండుట సృష్టి ధర్మము. వానిని తొలగించుకొనుట జీవుని కర్తవ్యము. అవి తొలగింపబడుటకు శ్రీదేవి ఆరాధనము ఎంతయో తోడ్పడగలదు.

అసురశక్తులను మథించి, సురశక్తులను వృద్ధి గావించి, జీవుల వృద్ధికి తోడ్పాటు చేయునది శ్రీదేవి. దైవీశక్తులు జీవుల యందు

పెంపొందింపబడుటకు అసురశక్తుల మథనము కూడ ముఖ్యమై ఉన్నది. భండాసురాది అసురశక్తులను వధించుటలో శ్రీమాత సిద్ధహస్త. ఆమె ఆరాధనముననే అసురశక్తులు మథింపబడగలవు.



# 158. 'నిర్మదా'

**మ**దరహితురాలు శ్రీదేవి అగుటచే నిర్మదా అని పిలువబడు చున్నది.

జీవుడు ప్రత్యగాత్మ అగుటచే అతడు మదమును పొందు అవకాశమున్నది. శ్రీదేవి సదాశివునితో కూడి యుండుటచే ఆమెకు ఆ భావన యుండదు. మదము అజ్ఞాన చిహ్నము. సమర్థులు, అసమర్థులు కూడా అంతో యింతో మదము కలిగి యుందురు. తమనుగూర్చిన దురభిమానమే మదము కలుగుటకు కారణము. అభిమానముండవలెనే గాని దురభిమానముండరాదు. మితిమీరిన అభిమానము తమపై తమకుండుట వలన మదమెక్కి ప్రవర్తింతురు. అసురుల మదమునకిదియే కారణము. మదము అసుర గుణము. అవకాశమును బట్టి దేవతలను కూడా ఈ గుణము ఆవరించగలదు. అప్పుడు వారు కూడా భంగపడుదురు. కానీ దేవతలు సహజముగ దైవీసంపత్తి కలవారగుటచే మదమావరించినను, భంగపడినపుడు తమ తప్పును తాము తెలుసుకొని శ్రీదేవినో లేక శ్రీమహావిష్ణువునో శరణాగతిజొచ్చెదరు.

మానవులలో కూడా దైవీస్వభావము కలవారు, ఆసురీ స్వభావము కలవారు యుందురు. దైవీస్వభావము కలవారు తమ తప్పులను తాము తెలుసుకొని వానిని సరిదిద్దుకొనుటకు దైవమును

ఆశ్రయింతురు. ఆసురీ స్వభావము కలవారు తమ తప్పులను సమర్థించుకొనుచు పతనము చెందుచునుందురు. వారి నాశనమును వారే కొని తెచ్చుకొందురు. ఇట్టివారే దైవముపైనాగ్రహించుట, దూషించుట కూడ చేయుచునుందురు.

శ్రీదేవి ఆరాధనము సక్రమముగా సాగినచో ఆరాధకులకు మదము తగ్గుట జరుగును. ఆరాధన పెరిగిన కొద్ది మదము పెరుగుట జరిగినచో ఆరాధన ఆసురీ మార్గమున ఉన్నదని తెలియవలెను.



# 159. 'మదనాశినీ'

శ్రీదేవి ఎంతటి మదమునైనను నశింపచేయగలదు.

మదమును మర్దించుటలో శ్రీమాత పెట్టింది పేరు. ఆమె అసుర సంహారిణి. అసురశక్తులు మితిమీరినపుడు చీల్చిచెండాడ గలదు. మహిషాసురుని మర్దించినది కదా శ్రీదేవి! మహిషాసురుడు మదమునకు మారుపేరు. ఆరాధకుల విషయమున ఆమె సున్నితముగా మదనిర్మూలనము గావింపగలదు. భక్తి, శ్రద్ధ, ఆర్తి కలిగి ఆరాధనము చేసినచో తప్పక ఆరాధకుని యందు తన సాన్నిధ్యమును ఇనుమడింపచేసి, అసురశక్తులను దమించును.



# 160. 'నిశ్చింతా'

**చిం**తలకతీతమైనది శ్రీమాత అని భావము. చింతలు లేనిది.

చింతలు లేనిది అనగా సృష్టి చింత కూడా లేనిది. శ్రీమాత సృష్టించి, పోషించుట బాధ్యతాయుతమైన విషయము. సృష్టినే నిర్మించుచూ, పోషించుచూ, రక్షించుచూ లోకులను, లోకపాలకులను, లోకములను అధిష్ఠించి యుండుటకన్న మించిన బాధ్యత సృష్టిలో ఏమున్నది? అట్టి బాధ్యత వహించుచూ కూడ శ్రీమాత చింతపడదు. అది ఆమె సామర్థ్యము, స్వామిత్వము కూడ. సర్వముపై స్వామిత్వము కలిగినవారు అట్టి స్థితి యందు క్రీడార్థమై యుండుట పరాకాష్ఠ. ఈ విషయమున శ్రీమాతకు ఆమెయే సాటి. త్రిమూర్తులు సహితము కలవరపడ్డ సన్నివేశములు సృష్టి యందు జరిగినవి. కాని శ్రీమాత! కలవరపడిన సన్నివేశములకు సృష్టి నిర్వహణ భారమంతయూ స్మిత వదనయై నిర్వర్తించుచున్నది. ఇది అరుదైన కళ్యాణగుణము. సృష్టి యందు శ్రీకృష్ణుడు ఒక్కడే అట్లు జీవించి చూపినాడు.

జీవులు చింతాలోలురు. జీవితమంతయూ చింతలతోనే గడిచిపోవును. మనోబుద్ధీంద్రియములు, శరీరము కూడ చింతలతో శుష్కించి పోవుచుండును. వారి చింతలకంతు లేదు. అందునా బాధ్యత కలవారి చింతలధికము. బాధ్యత పడుచున్న కొలది చింతలు పెరుగు చుండును. ఇట్టి చింతాపరులగు జీవులకు శ్రీమాత ఆరాధనమే శరణ్యము.

చింతలు లేని శ్రీమాత భక్తులు జీవులకు మార్గదర్శకులు. వారు జీవితమును ఎట్లు నిర్వర్తించుకొనిరో చూచి నేర్చుకొనుట, శ్రీమాతను ఆరాధన చేయుట ఈ రెండు అంశముల అభ్యాసము జీవులను చింతల నుండి తరింపచేయును. భాగవోత్తోత్తముల జీవిత చరిత్రలు, శ్రీమాత లీలలు (లీలార్థమై ఆమె నిర్వహించిన మహత్కార్యములు) చింతాపరులకు ఉపశమనము కలిగించ గలవు. పరిష్కారములు చూపగలవు. పరమపదమును చేర్చగలవు. చింతలు మనస్సున ఆవేశించినపుడు శ్రీమాత పాదములను ఆశ్రయించుట ఉపాయము.



# 161. 'నిరహంకారా'

అహంకారము లేనిది శ్రీమాత. అహంకారము అష్ట ప్రకృతులలో నొకటి.

అష్టప్రకృతులన్నియూ, మూల ప్రకృతియగు శ్రీమాత నుండి ఏర్పడినవే. వానియందామె యున్నప్పటికినీ వాని ప్రభావము ఆమెపై యుండవు. ఆమెను బంధించున దేమియూ లేదు.

అహంకారమనగా తానొకడు ప్రత్యేకముగ నున్నాడన్న భావన. అది సముద్రమందలి అలవంటిది. అల ప్రత్యేకముగా గోచరించునే గాని, నిజమునకు అలకు ప్రత్యేకమగు అస్తిత్వము లేదు కదా! సముద్ర ముండుటవలన అల యున్నది కానీ, సముద్రము లేక అల లేదు.

సముద్రమందలి అలవలె మానవుడు తానున్నానన్న భావన కలిగియుండును. తానుండుట యనగా శ్రీమాత యుండుటయే. తాను ప్రత్యేకముగా లేడు. అట్లు భావించుట వలన తనను తాను మొత్తము నుండి వేరుచేసుకొనుట జరుగును. ఎంత వేరు చేసుకొన్నచో అంత అహంకార భావము పెరుగును. తమను గూర్చి తాము ప్రత్యేకముగ భావించుట పెరుగును. అపుడహంకారమను ఆవరణము పటిష్ఠముగా బంధించును. వేరుపడుట వలన జీవుడు బలహీను డగును. మొత్తముతో కలిసి యుండుట వలన, మొత్తము బలము తననుండి కూడ వ్యక్తమగుచుండును. వేరుపడువారు అహంకారులు

అని తెలియవలెను. వీరు సహజీవులతో కలియలేరు. ఇక శ్రీమాతతో ఏమి కలియగలరు?

సముద్రమునుండి లేచిన అల సముద్రమునుండి వేరుగ గోచరించును. అంతే కాదు. తనదైన గుణములను కొన్ని సంతరించు కొనును. లేచుట, పడుట, తీరముదాటు ప్రయత్నము చేయుట అల గుణములు. అట్లే ఏర్పాటు భావనవలన పెరుగుట, పడిపోవుట, అతిక్రమించు ప్రయత్నము చేయుట, చచ్చుట, పుట్టుట ఇత్యాదిని జీవులు అనుభవించుచున్నారు. అలల వలెనే జీవితములు అత్యంత చంచలములై, తాత్కాలికములై, నిరుపయోగములై, అహంకారుల జీవితములు సాగుచునుండును. అట్టివారికి కూడ పరిష్కారము నిచ్చునది శ్రీమాత ఆరాధనము.



# 162. 'నిర్మోహా'

**మో**హము లేనిది శ్రీదేవి అని అర్థము.

చిత్తభ్రాంతియే మోహము. అహంకారము కారణముగా మోహ మేర్పడును. అహంకారి – తాను, తనవారు, ఇతరులు, పైవారు అను భావములతో బంధింపబడి యుండును. తనవారనుకొనుటకు ఆధారము తానే. తనకాధారమైన దానికి అంతయూ తానే అగుటచే స్వేతర బుద్ధి యుండదు. అనగా స్వ, ఇతర బుద్ధి. స్వబుద్ధి అనగా తనకు సంబంధించిన బుద్ధి. తనవారనుకొనుట వలన పక్షపాత బుద్ధి ఏర్పడును. పైవారు అనుకొనుట వలన కూడా పక్షపాత బుద్ధి ఏర్పడును. తనవారు అనుకొనినపుడు తప్పులు కనపడవు. అన్నియూ ఒప్పులే. తనవారు కాదనుకున్నప్పుడు, ఇతరులుగ భావింపబడి నప్పుడు తప్పు కనపడుచుండును. ఇదియే చిత్తభ్రాంతి. ఇష్టమైనచో మలినమైనను, ఇంగువవలె అనిపించును. ఇష్టము కానిచో దివ్య మైననూ విమర్శ భావముండును. అహంకారి యిష్టాయిష్టములను బట్టి చూచునే కాని, ఉన్నది ఉన్నట్లుగా దర్శింపలేడు.

అహంకారము కూడ మూడు విధములు. అవి రాజసికము, తామసికము, సాత్వికము యగు అహంకారములు. ఇందు మొదటి రెండునూ అధికమగు భ్రాంతికి లోను చేయును. సాత్విక అహంకారము మాత్రమే సత్యమును దర్శించును. సాత్వికత నుండియే సత్యదర్శన

మున్నది. సాత్విక అహంకారమున చిత్త భ్రాంతి స్వల్పము. ఇతరము లగు అహంకారములందు చిత్తభ్రాంతి హెచ్చు.

చిత్తభ్రాంతివలన లేనిది ఉన్నట్లు, ఉన్నది లేనట్లు కనిపించు చుండును. ఇట్టి మోహమునుండి బయల్పడుటకు మోహాతీత, నిర్మోహ అయిన శ్రీమాతయే శరణ్యము. శ్రీమాత అహంకారమునకు అతీత మైనది. ఆమె సమాశ్రయము వలన చిత్తము భ్రాంతియందు పడక యుండును. అట్లుకానిచో కర్తవ్య నిర్వహణము ఇష్టాయిష్టములకు లోనగును. ఇష్టపడుట వలననే జానకి బంగారు లేడి విషయమున భ్రమపడినది. ఇష్టము లేకుండుట వలననే అర్జునుడు విషాదమున పడినాడు. కర్తవ్యములతో యిష్టాయిష్టములకు ముడి పెట్టుట వలన మోహపడుట యుండును.



# 163. 'మోహనాశినీ'

**జీ**వుల మోహము నాశనము చేయునది శ్రీదేవి అని అర్థము.

నేను, ఇతరము అను భావము ద్వైత బుద్ధి. ఇది యున్నంత కాలము అజ్ఞానముండును. ఇతరుల రూపమున ఉన్నది కూడ నేనే అను భావము అద్వైత బుద్ధి. అపుడే ప్రేమ అవగాహన కలుగును. అందరి యందున్నదీ శివ శక్తులే. శివము, సత్యము, శక్తి, చైతన్యము. వీని నుండి పుట్టినవాడే జీవుడు. అందరి మూలము ఒకటే. కావున జీవు లందరూ, ఒకే ఉదరము నుండి పుట్టినవారనీ, సహోదరులని జ్ఞానము తెలుపును. ఇట్టి జ్ఞానము కలగనంత కాలము మోహ ముండును. సృష్టియందు మోహము సహజము. మోహము వలన దుఃఖము తప్పనిసరి యగును. దుఃఖమువలన జీవుడు విచారమున పడును. దుఃఖమును దాటుటకు ప్రయత్నించును. కానీ ద్వైత బుద్ధి యున్నంత కాలము దుఃఖముండును.

ఈ సత్యము తెలియుటకు కొన్ని జన్మ పరంపరలు సాగును. అనుభవైక జ్ఞానమే జ్ఞానము కాని అధ్యయనము, శ్రవణము వలన జ్ఞానము జీవునియందు స్థితిగొనదు. తెలిసినది ఆచరించినపుడే తత్ఫలముగ జ్ఞానముదయించును.

శ్రీమాతను భక్తి శ్రద్ధలతో ఆరాధించిన వారిని శ్రీమాతయే ఉద్ధరించుకొనును. క్రమముగా జ్ఞానోదయము గావించును. జీవుని

ఆర్తిని బట్టి ఉద్ధారణ ఉండును. సురులైనను, అసురులైనను, మానవులైనను, ఆమె అనుగ్రహమునకు పాత్రులే. జ్ఞానమును ప్రసాదించుటకు శ్రీమాత రకరకములైన ఉపాయములను వినియో గించును. ఎట్లైనను జీవుని ఉద్ధరించుటయే ఆమె లక్ష్యము. సామ దాన భేద దండోపాయములను జీవులపై ప్రయోగించుచు వారి ఉద్ధణకు తగు తోడ్పాటు గావించుచుండును.

సృష్టియందు జీవులకు మోహము సహజము. మోహము దాట యత్నము చేయు జీవులకు శ్రీమాత ఆరాధనము శరణ్యము.



# 164. 'నిర్మమా'

**"ఇ**ది నాది", అను బుద్ధి లేనిది శ్రీమాత.

నేను అను భావము అహంకారము. నాది అను భావము మమకారము. నాది అను భావమున్న చోట బంధమున్నది. నాది అని భావించు వస్తువుపైన, ప్రాణముపైన మమకారము అను జిగురు ప్రసరించి, జీవుడు వానికి అతుకుకొని బద్ధుడగుచుండును. నాది అను వస్తువు కోల్పోయినపుడు బాధపడును.

నిజమున కేదియూ తనది కాదు. తన దగ్గర చేర్చబడినవే యుండును కానీ, తనవి అని ఏమియూ ఉండవు. తన శరీరము తన చుట్టునూ దేవతలచే అల్లబడినది. అందు వర్తించువారు కూడా దేవతలే. శరీరము దేవతలిచ్చినది కానీ, తనది కాదు. అది దైవదత్తము. అట్లే భార్య, భర్త, బిడ్డలు, ముప్పురునూ దైవవశమున చేరినవారే కాని, తనవారు కాదు. వారియందు కర్తవ్యమే యున్నది కాని, అధికారము లేదు. అట్లే బంధువులు, స్నేహితులు, ఆస్తులు, పాస్తులు. ఇవి యన్నియూ తన చుట్టునూ చేరుట, విడిపోవుట కాలక్రమమున తప్పనిసరి. వచ్చినవెల్ల పోవునవే. శరీరముతో సహా సర్వమునూ పోవునవే కాని తనతో నుండునవి కావు. ధర్మమూ, కర్మమూ మాత్రమే తనతో నడచి వచ్చును. అవియునూ మోక్ష మార్గమున సడలును. తానొకడే సత్యము. తాను సనాతనుడు,

సనాతనులైన ఉమామహేశ్వరుల తనయుడు. అట్టి జీవుడు ఐక్యము చెందిననూ, తన అస్తిత్వము కూడ భగవదనుగ్రహముగ కలిగి యుండును. సనక సనందనాదులు, నారదుడు అట్టివారు. వారునూ భేద బుద్ధి లేక, స్వలాభ రహితులై శ్రీమాత అనుచరులుగ జీవులకు జ్ఞాన సంతర్పణము చేయుచున్నారు.

మమకారమున్నంత కాలము బంధముండును. బంధ మున్నంత కాలము బాధ యుండును. తన చుట్టును చేరినవి తనవి అనుకొనక దైవమునవి అనుకొనుట అభ్యసించవలెను. తాను, తన పరసరముల చేరినవి, అన్నియునూ దైవమునకు చెందినవే కాని తనకు చెందినవి కావు. వాని యందు మమకారము దుఃఖము కలి గించును. కావున ఈ భావము దాటిన వారికే ప్రశాంత యుండును.



# 165. 'మమతాహంత్రీ'

**నా**ది అనుభావమును నశింపజేసి అనుగ్రహించునది శ్రీదేవి అని భావము.

నేను అను భావమున్నప్పుడు నాది అను భావము తప్పదు. నేనెవరు? అను ప్రశ్న తాకిడి జీవులకు కలుగును. ఆ ప్రశ్న కలుగుటయే కాక, అది పరిప్రశ్నయై శోధన ప్రారంభమగుట అనుగ్రహ విశేషము. సంకల్పములకు మూలమైన శ్రీమాత, ఈ సంకల్ప మెవరి కందించునో, అట్టివాడు నేను, తాను అనగానేమో తెలియుటకు ప్రయత్నించును. అది అమ్మ అనుగ్రహము. అమ్మ అనుగ్రహముననే మరల శోధన, సాధనగా మారి, సాధన సిద్ధించును. అపుడు మమకారము, అహంకారము లేని స్థితి జీవున కందును. అనుగ్రహము కలుగును. ఆరాధనే ఉపాయము. శోధనకు, సాధనకు, సిద్ధికి కూడ శ్రీమాత ఆరాధనే ప్రధానమని ఋషులు నిశ్చయించినారు. అమ్మ అనుగ్రహము లేనిదే, ఇహ పర లోకానుభూతి లేదు కదా! అందువలన మమకారముతో వ్యథ చెందు జీవులకు, "నిర్మమా మమతాహంత్రీ" అనునది నిత్యస్మరణ మంత్రమైనది.

మమకారము పోవలెనన్నచో సాధ్యమా? లేనిది ఉన్నట్లుగా భావించుటచేత మమకార వికారము కలదు. ఎదుటి వస్తువు కాని, జీవి కాని, నాది అనుకొనుట వలన కదా మమకారము! నిజమునకు అది తనదా? ఆ జీవి తనవాడా? అన్నియూ, అందరూ తన సరసన

చేరినవారే గాని తనవారు కారు. తాను, ఇతరులు, ఇతరములు అన్నియూ దైవమునకు సంబంధించినవే. అందరూ దైవబంధువులే. ఆత్మ బంధువులే. ఇతర బంధుత్వములు మోహము, ద్వేషము కలిగించుచుండును. కొందరిపై మోహము వలన మమకారము, కొందరిపై ద్వేషము. కొడుకుపై మమకారము చేత కోడలిపై ద్వేషము లోకసహజము కదా! అట్లే కూతురిపై మమకారము చేత అల్లుడిపై ద్వేషము. ఇటువంటి మాయను ఎవరు దాటగలరు? ఎంత తెలిసిన వారికైనను, ఇసుమంత మమకారముండక పోదు. మోహమను అగాధమున పడుటకు అది చాలును. ఇదియే అమ్మ మాయ. అందుండి ఉద్ధరించునది కూడ ఆమెయే. మమకారము తీరుటకు అంతయూ, అందరూ దైవమే అని భావించుట, తనకు జరుగుచున్న కర్మానుభవము దైవసంకల్పమే అని సరిపెట్టుకొని తృప్తిపడుట కూడ ఒక ఉపాయము. అందరూ గోవిందునివారే అని భావించుచూ తనవంతు కర్తవ్యము నిర్వర్తించుట నిజమగు వైరాగ్యము. అటుపైన నేనెవరను ప్రశ్న శోధించుట మరియొక ఉపాయము.

మమకారమునకు వైరాగ్యము విరుగుడు. వైరాగ్యమునకు అమ్మ అనుగ్రహము ఆధారము. హరిశ్చంద్రుడు, నలుడు, ధర్మరాజు అమ్మ అనుగ్రహముననే పరిపూర్ణ వైరాగ్యముననుభవించిరి. ఇటీవల కాలమున శ్రీ రామకృష్ణ పరమహంస, అమ్మ అనుగ్రహ విశేషమున పరమహంసగా భౌగోళిక స్ఫూర్తినందించినారు. అమ్మ అనుగ్రహము పొందినవారికి అసాధ్యమగునది ఏమియూ లేదు. మమకారమును ఆమె త్రుటిలో త్రెంచివేయగలదు.

# 166. 'నిష్పాపా'

**పా**పము లేనిది శ్రీమాత అని అర్థము.

సృష్టియొక అగ్నికార్య మగుటచే, తత్కారణముగ కొంత మసిబారుట జరుగుచున్నది. మలినము లేర్పడుచుండును. ఈ మలినములనే పాపములు అందురు. వీనినెప్పటికప్పుడు తొలగించు చుండవలెను. లేనిచో అది జ్ఞానమును కప్పి, జీవుని దుఃఖమున ప్రడదోయును. బ్రహ్మకైనను ఇట్టి అజ్ఞానమావరించుటకు అవకాశ మున్నది. జీవునికి అహంకారము కారణముగ అభిమానము కలుగును. ఇది మొదటి మాయావరణము. దానివలన మోహము పుట్టును. మోహము కారణముగ కోరిక జనించును. మోహము తీరనపుడు, ప్రయత్నము కోపముగ మారును. కోపము తీవ్రమైనపుడు అంధకార మిశ్రము అను ముదురు చీకటి ఏర్పడి ఏమియు తెలియని స్థితి ఏర్పడును. దానివలన మనసుకు చాంచల్యము కలిగి, భ్రమ పుట్టి, అది చిత్త విభ్రమమై లేనిది ఉన్నట్లు గోచరింపజేయును. ఇట్లు ఐదు స్థితులలో, సహజముగ జ్ఞానస్వరూపుడైన జీవుడు అజ్ఞానవశుడై పడియుండును.

చతుర్ముఖ బ్రహ్మకూడ తాను సృష్టిచేయవలెను అని భావించుట వలన, అహంకారమునకు అభిమాన మేర్పడి, మోహము, కోపము, అంధతా మిశ్రము, చిత్తభ్రమ కలిగినవి. ఏ జీవికైనను ఇంతే. తాను

చేయుచున్నాడని భావించినపుడు, బంధింపబడుట తప్పదు. చేయుటకు సంకల్పము దైవమునదని, దాని ననుసరించుచు నిర్వర్తించుట తాను చేయవలసిన పని అని తెలియవలెను. చతుర్ముఖ బ్రహ్మ ఏమి చేయవలెనో తెలియక ఉన్నప్పుడు, అంతర్వాణి తపస్సు చేయుమని నిర్దేశించెను. తపస్సు చేయగా, పరతత్త్వానుభూతి కలిగెను. అటుపైన సృష్టి చేయమని అంతర్వాణి పలికినది. తపస్సు చేయుట, సృష్టి చేయుట తనకందింపబడిన సంకల్పములే కానీ, తనవి కావు. తాను సృష్టి చేయుదుననుకొనుట ఏమి? అదియే అహంకారము వలన కలుగు అభిమానము. అజ్ఞానమున కదియే నాంది.

జీవులు కూడ తామే సంకల్పించుచున్నామని, నిర్వర్తించుచున్నామని భావించుటవలన ఇట్టి అవిద్యయను పాపమునందు పడుచున్నారు.

శ్రీమాత సంకల్పములకు పుట్టినిల్లు. ఆమె పరమాత్మని సంకల్పము. ఆమె సంకల్పించిన పిమ్మటే సృష్టి ఆరంభమగును. స్థితి లయములు కూడ ఆమె సంకల్పమే. ఆమె సంకల్పమేమో తెలిసి అనుసరించుటకే సమస్త ఆరాధనములు. ఆమె జ్ఞానమునకు, అజ్ఞానమునకు కూడ అధిష్ఠాన దైవము. పాప పుణ్యములకు కూడ ఆమెయే పుట్టినిల్లు. ఆమె నుండి పుట్టినవి ఆమెపై ఆధిపత్యము వహించలేవు. అందువలన ఆమె పాపపుణ్యములకు కూడ అతీతమై యున్నది.

# 167. 'పాపనాశినీ'

**భ**క్తుల పాపములను నశింప చేయునది శ్రీమాత అని అర్థము.

పాప కర్మల నొనర్చువాని పాపముల రాశి, మేరుపర్వతమంత గొప్పదియైనను, కాత్యాయనిని పూజించిన– పూజించిన క్షణ మాత్రములో నశించును అని పురాణములు చెప్పుచున్నవి. "దుర్గా రాధనాపరుని మహాపాతకముల వలన కలుగు దోషములు తామరాకు మీది నీటి బిందువులవలె అవి అతని నంటవు" అని పద్మ పురాణము తెలుపుచున్నది. సర్వ పాపములతో కూడిన వాడైననూ శ్రీదేవి నారాధించు నరుడు పవిత్రుడై పరమపదము పొందును, అని దేవీ భాగవతము తెలుపుచున్నది. దేవీ ఆరాధనము అను అగ్ని మహా పాపములను కూడ తృణాగ్రము వలె నశింపజేయును. అగ్నితాకిన వెంటనే, గడ్డిపోచ కొనవెంటనే, భస్మమగును కదా! పాపములను హరించుటలో శ్రీమాతను మించిన శక్తి లేదు.



# 168. 'నిష్క్రోధా'

క్రోధము లేనిది శ్రీదేవి అని అర్థము.

ద్వేషమున్నచో క్రోధముండును. ప్రేమయున్నచోట ద్వేష ముండదు. ప్రేమయున్నచోట తప్పులున్ననూ సహించుట యుండును. సహనము ప్రేమనుండే పుట్టును. క్రోధము తాను అనుకున్నరీతిలో సన్నివేశములు సాగకుండనప్పుడు రజోగుణ ద్వేషమున వుద్భవించును.

హిరణ్యకశిపుని కోపము, రావణుని కోపము క్రోధమునకు తార్కాణములు. తన భావమునకు, చేతకు, మర్యాదకు, గౌరవమునకు అడ్డము వచ్చిన వారినందరిని అణచివేయుట, సంహరించుట, హింసించుట క్రోధ లక్షణములు. క్రోధము ఆసురీ ప్రభావమున కలుగును. మదించిన అహంకారము కలవారికి క్రోధమెక్కువగా నుండును. క్రోధము వలన పరిసరములయందు శత్రుత్వమును పెంచుకొందురు. క్రోధనులు నిత్యమూ దుఃఖమునే అనుభవించు చుందురు.

శ్రీమాతకు క్రోధము లేదు. ఆమె కందరూ ప్రియులే. ఆమె క్రోధమును నటించును గాని క్రోధమను గుణమునకు వశపడదు. ఇది నిజమగు దైవీ సంపత్తి. రాక్షస సంహారము చేయునపుడు శ్రీమాత, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు క్రోధమును తెచ్చిపెట్టుకొనిరే కాని, క్రోధ

వశులు కాలేదు. వారు క్రోధమును తెచ్చిపెట్టుకొని, అధర్మమును శిక్షింతురు. వాలి సంహారమున శ్రీరాముని ప్రవర్తనము, మహిషాసుర వధయందు శ్రీదేవి ప్రవర్తనము గమనించినచో, నిక్రోధ స్థితి అవగాహన యగును.

తల్లితండ్రులకు తమ పిల్లలపై ద్వేషము, క్రోధము యుండవు కదా! కానీ అవసరమగుచో మందలింతురు కదా! వారి నడుమ యున్నది ప్రేమయగుటచే క్రోధము నాయుధముగా వినియోగింతురే గాని, క్రోధవశులు కారు. సమస్త సృష్టి జీవులూ తన బిడ్డలే యుగుటచే శ్రీమాత అందరియందునూ ఒకే విధమగు ప్రేమ కలిగి యుండును. ఆమె కెవ్వరిపైన క్రోధముండదు. ఆమె క్రోధము నటించుట జీవోద్ధరణమునకే. అవతార పురుషులు కూడ అట్టివారే.



# 169. 'క్రోధశమనీ'

**భ**క్తుల క్రోధమును శమింపజేయునది శ్రీదేవి అని అర్థము.

నిత్యమూ శ్రీమాత ఆరాధనము గావించువారి క్రోధమును, మాత్సర్యమును, లోభమును, అశుభభావనలను శ్రీమాత హరించును. "నక్రోధో న చ మాత్సర్యం, నలోభా నాశుభామతిః । భవంతి కృత పుణ్యానాం, భక్తానాం, శ్రీసూక్తం జపేత్సదా॥" శ్రీ సూక్తమందలి ఈ ఋక్కులు పై సత్యమును బోధించుచున్నవి.

కోపము కలవాడు ఎన్ని సత్కార్యములొనర్చిననూ, వాని ఫలముల నాతడు పొందలేడని, తన కోపముతోనే ఫలములను నాశనము చేసుకొనునని పురాణ గాధలు తెలుపుచున్నవి. క్రోధముతో కూడి ఎవడు యాగమొనర్చునో, ఎవ్వడు హోమము చేయునో, ఎవడు పూజించునో వాని ఫలము పచ్చి కుండ యందలి నీరువలె హరింప బడును. కోపముగలవారికి శ్రమ ఎక్కువ, ఫలితము తక్కువగ ఉండును. నందీశ్వరునిపై కోపముతో రావణుడు చేసిన శివతపస్సు ఫలించలేదు. పినతల్లిపై కోపముతో ధ్రువుడు చేసిన తపస్సు ఫలించ లేదు. కోపముతో భీష్మునిపై యుద్ధము చేసిన పరశురామునికి విజయము లభించలేదు. అట్లే విశ్వామిత్రుని తపస్సు కూడ ఆయనను తిప్పలు పెట్టినది.

క్రోధము స్వభావమున ఉన్నవారు క్రోధము ఉండరాదని,

దానిని విసర్జించవలెనని ఎంత ప్రయత్నించిననూ, ఆ ప్రయత్నము కూడ విఫలమే అగుచుండును. జీవులకు అరిషడ్వర్గ విషయమున బలహీనత యుండుట సహజము.

కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, రాగము, ద్వేషము ఇవి అన్నియూ ఒక్కొక్క సమయమున ఒక్కొక్కటిగా స్వభావమునుండి విజృంభించి జీవుని వశము గావించుకొనుచుండును. తనకన్న బలమైన శత్రువును తాను జయించలేడు కదా! ఇట్టి సమయమున దైవారాధనమే శరణ్యము. ఆరాధన వలన భక్తి, శ్రద్ధ, ఆర్ద్రత పెరుగుచున్నకొలది క్రోధాది బలహీనతలు శమించును. మరియొక మార్గము లేదు. అన్ని ప్రయోజనములకు భగవదారాధనమే శరణ్యమని పెద్దలు పరిశోధించి నిర్ణయించిరి. అట్టి భగవదారాధనమందు నిజమైన రుచి ఏర్పడిన వారికి పరిష్కారములు శీఘ్రమగును. జీవులు శమమును పొందుదురు.



# 170. 'నిర్లోభా'

లోభగుణము లేనిది శ్రీదేవి అని అర్థము.

లోభము సర్వ సద్గుణములను రూపుమాపునని, లోభి ఇహ లోక సంతోషమునకే నోచుకొన లేడని, పరలోకానుభూతి అతనికి దుర్లభమని శ్రుతులు తెలుపుచున్నవి. లోభగుణము నింద్యమైనదని, అది కలవాడు వికాసము చెందలేడని తెలియనగును.

దానము లోభమునకు విరుగుడు. ఇచ్చినవారికే వచ్చునని ప్రకృతి ధర్మమొకటి కలదు. పంచువారికే సమృద్ధి యుండునని, అనంతమగు సృష్టియందు సర్వ సమృద్ధియే గాని, అయిపోవుట ఉండదని తెలిసినవాడు ఇచ్చుటకు జంకడని పురాణ గాధలు తెలుపు చున్నవి. సృష్టి అంతము లేదు. అంతమే ఆరంభము; ఆరంభమే అంతముగా అనంతముగ సృష్టి సాగుచున్నది. అందు శక్తులు, సంపదలు కూడ అనంతమే. త్రాగునీరు అయిపోకముందే మరల నీరు వచ్చును. తటాకమునుండి, నదినుండి త్రాగునీరు వచ్చు చుండగా, తటాకములకు, నదులకు వర్షము నీరిచ్చుచున్నది. వర్షము లకు నీరు మేఘము లిచ్చుచున్నవి. మేఘములకు సముద్రము నీరిచ్చుచున్నది. ఇట్లు భూమి జీవులకు మూడు కోట్ల సంవత్సర ములుగా నీరందుచునే ఉన్నది. అయిపోవుట, అంతమగుట సృష్టి యందు లేదు. అట్లే ఓషధులును. ప్రతి సంవత్సరమూ జీవులకు వలసిన ఆహారము, నీరు గాలి, సూర్యరశ్మి అనంతముగ అందుచునే

యున్నవి. సంపదలన్నియూ అట్టివే! కేవలము మానవ మనస్సునందే అంతము అగునని, అయిపోవునని భావన యుండి అతనిని లోభిని చేయును.

దేహము పోయిననూ మరల దేహము వచ్చును. పోవుట వచ్చుట కొఱకే. వచ్చుట పోవుట కొఱకే. అన్నియూ వచ్చిపోవు చుండగా అందు జీవుడు శాశ్వతుడై ఉండును. వచ్చినవానిని ఎంత పట్టుకొనిననూ కాలము రూపమున అవి జరుగును. సంపదలు, భార్యాబిడ్డలు, బంధువులు, మిత్రులు పుట్టుకతో లేరు. జీవన యానమున ఒక్కొక్క మజిలీ యందు ఒక్కొక్కటి చేరుచుండును. అట్లే పోవుచునుండును కూడ. కాలమును, కర్మమును బట్టి వచ్చి చేరుట, జారిపోవుట జరుగుచు నుండును. ఇది తెలిసినవారికి లోభత్వముండదు. హరిశ్చంద్రుడు, శిబి, ధర్మరాజు, నలుడు సర్వమును కోల్పోయి మరల సర్వమును పొందిరి.

లోభికి దేనిపై పట్టు ఉండునో ఆ విషయమే అతనిని పట్టి ఉంచును. కొందరు సంపదను పట్టుకొని ఉందురు. వారు సంపదచే బద్ధులు. కొందరు కీర్తిప్రతిష్ఠలకు ప్రాకులాడుదురు. వారు అట్టివారి చేతిలో పట్టుపడినవారు. మనము పట్టినది మనలను పట్టునని తెలియుట జ్ఞానము. అట్టిపట్టు శ్రీమాతపై ఉన్నచో, శ్రీమాయే మనలను పట్టును. సద్గుణములను, సద్గురువులను పట్టుట శ్రేయస్క రము. ఇతరములు పట్టుట వినాశకరము. శ్రీదేవి శివుని పట్టి యుండును. ఆయనయందు అర్ధభాగమై నిలచినది. అందువలన ఆమెయే నిర్లోభ.

# 171. 'లోభనాశినీ'

**భ**క్తుల లోభమును నాశనము చేయుది శ్రీదేవి అని అర్థము.

పిల్లలను సంస్కరించుకొనుట, సరిదిద్దుకొనుట, ఉద్ధరించు కొనుట తల్లి సహజ గుణము. శ్రీమాత అపరిమితమగు చైతన్యము. జీవులామె సంతతి. తన పిల్లలను తనంతవారిగ తీర్చిదిద్దవలెనని ఆమె భావించును. అందుచేత వారి యందలి పరిమితత్వమును తొలగించుటకు ఆమె అనేకానేక ప్రయత్నములను చేయును. లోభమున్నవాడు తననారాధించునపుడు అతని లోభమును పోగొట్టుటకు ఉపాయములను పన్నును. జీవులను లోభము పరిణతి చెందనీయదు. భక్తుడు పరిణతి చెందుటకై ప్రార్థన చేయునపుడు, ప్రవర్తనయందు దాని కవరోధమగు లోభమును నశింపచేయవలెను కదా! అందువలననే భక్తులు లోభముచే పట్టుబడునప్పుడు వారిని అందుండి రక్షించుటకు వారు లోభమును చెందు విషయమును నష్టము చేయును. సంపదయందు లోభమున్నచో సంపదను నష్టము చేయును. అట్లే ఇతర విషయములు కూడ. నష్టము జరుగు చున్నపుడు కూడ ఆరాధనయందే నిమగ్నమైయున్న భక్తులకు లోభ నాశనమై ఉద్ధారణ కలుగును. ఉద్ధారణ తదుపరి, మరల నష్టమైనది తిరిగి అనుగ్రహించును.

లోభి తనవద్ద చేరినవి తనవనుకొనును. నిజమునకు అవి

యన్నియూ శ్రీమాతవే. తనవద్ద ఉంచబడినవే కాని తనవి కావు. ఆమె వస్తువులను ఆమె ఇచ్చుట, తీసుకొనుట చేయును. మనదగ్గర ఎవరైనా ఒక విలువైన వస్తువు ఉంచినపుడు, అది మనది అనుకొనము కదా! మరల వారు వచ్చి అడిగినపుడు వారి కిత్తుము కదా! ఇవ్వకుండుట లోభము. అట్లే దేహము, సంపద, సంసారము దైవ మేర్పరచినవి. దైవమే గొనినపుడు, బాధపడుట అవివేకము కదా! లోభమునకు కారణము మోహమే. మోహముచేత దైవసంపద మనవద్ద ఉన్నపుడు మనదని భావింతుము. లోభముచేత దానిని పట్టి యుంచుటకు ప్రయత్నింతుము. ఇంద్రు డంతటివాడే లోభము చెందుచుండును. ఇక మానవుల మాట చెప్పనవసరము లేదు. ఇట్టి లోభమును దాటుటకు శ్రీమాత ఆరాధనము ఎంతయూ ఉపయోగకరము. తాను, తనకున్నది శ్రీమాత సంపదేనని తెలిసి, శ్రీమాత నాశ్రయించి యుండుట భక్తుల కర్తవ్యము. అనుగ్రహించుట శ్రీదేవి కారుణ్యము.



# 172. 'నిస్సంశయా'

సంశయము లేనిది శ్రీమాత అని అర్థము.

భక్తి, జ్ఞానము, పూర్ణవిశ్వాసము కలవారికి సంశయ ముండదు. సంశయము అపరిపూర్ణత లక్షణము. సంశయ మున్నవారు దేనినీ సాధింపలేరు. వారి సంశయము వలననే వారు పతనము చెందుదురు. "సంశయాత్మా వినశ్యతి" అని శ్రీకృష్ణుడు ఘంటా పథముగా నిర్ధారించి నాడు. సంశయము కలవాడు నశించును అని అర్థము. సంశయము కలవాడు లేని అపాయమును ఉన్నట్లు చూచును. దానితో జంకు కలుగును. అట్టివాని మనస్సు విషయములను వెనుకకు లాగు చుండును. కావున పురోభివృద్ధి సాధించలేడు. సంశయము కలవాడు ఇతరుల సంశయములను పోగొట్టలేడు. ఏదైన ఒక నిర్ణయము చేసి ఒక కార్యము నారంభించినపుడు, కార్య మధ్యమున సంశయించుట తిరోగమునకే. ఫలితములందాసక్తి, ఆశకన్న కర్తవ్యమునందు దీక్ష కలవారికి సంశయముండదు. ఫలితములందాసక్తిచేత మేలుకన్న కీడునే ఎక్కువ సంశయించినపుడు కర్తవ్యము కుంటుపడును. కర్తవ్య మనునది మేలు కీడులతో సంబంధము కలది కాదు.

మహావీరుడు, సంస్కార సంపన్నుడు అగు అర్జునుడు, యుద్ధ ప్రారంభ సమయమున సంశయపడెను. ఆ సంశయమునుండి అనేక సిద్ధాంతములను పుట్టించుకొనెను. మనసు తికమక పడెను. ఏమియు

తోచని స్థితి కలిగెను. దేహాంగములు భయముతో వణకెను. ధనుస్సు, విల్లంబులు చేయిజారి నేలపై బడెను. అతని అదృష్టముగ శ్రీకృష్ణుడు అచటనే యుండుట వలన, సంశయ నివృత్తి గావించి అర్జునుని కర్తవ్యమునందు నిలిపెను. శ్రీకృష్ణుడు ఆశ లేనివాడు. సంశయము లేమాత్రము లేనివాడు. కావుననే గురుత్వము వహించి అర్జునుని సంశయములను పారద్రోలెను. శ్రీకృష్ణు డనగా శ్రీమాతయే. శ్రీమాత జ్ఞాన స్వరూపిణి. నిత్యపరిపూర్ణ. అనంతముగా సృష్టి గావించి నిర్వహించుచున్ననూ, అట్టి బృహత్తర కార్యమందు ఆమెకు ఏ సంశయమూ లేదు.



# 173. 'సంశయఘ్నీ'

**భ**క్తుల సంశయములను నిర్మూలించునది శ్రీమాత అని అర్థము.

మనస్సున సంశయములతో బాధపడువారు భక్తి శ్రద్ధలతో శ్రీమాత ఆరాధన గావించినచో వారి సంశయములన్నిటినీ ఆమె పటాపంచలు చేయును. భయము, సందేహము, సంశయము కలిగి నప్పుడు, జీవితము అగమ్యగోచరమైనప్పుడు, కష్టనష్టముల పాలై నప్పుడు శ్రీమాత నారాధించు ఎందరెందరో భక్తులు కృతకృత్యులై శాశ్వతానందము పొందిరి.

శ్రీమాత ఆరాధన విశేషముగా, భక్తుడు కర్తవ్యోన్ముఖు డగును. నిర్వర్తించునది కర్తవ్యమైనపుడు లాభనష్టములతోను, జయాపజయ ములతోను సంబంధ ముండదు. కర్తవ్య మనగా చేయవలసిన పని. అందు ఇష్టాయిష్టములకు తావు లేదు. ఇష్టాయిష్టములతో పనిచేయు వారికి కర్తవ్యమెన్నటికిని అర్థము కాదు. సంశయమున పడిన అర్జునునికి ప్రప్రథమముగ శ్రీకృష్ణుడు కర్తవ్యమునే బోధించినాడు. "నీవు క్షత్రియుడవు. ధర్మ రక్షణము నీ కర్తవ్యము. ధర్మము కొఱకై యుద్ధము చేయుచున్నావు. జయాపజయములతో నీకు సంబంధము లేదు. నీకు కలిగిన సంశయము నీకు కర్తవ్యభ్రష్టత్వము కలిగించ గలదు. యుద్ధము చేయుము. ధర్మమును రక్షింపుము. పనికిమాలిన సందేహములను విసర్జింపుము" అని సూటిగ తెలిపినాడు.

ఫలమందాసక్తి కలిగిపుడు, కర్మయందు సందేహము కలుగును. కర్తవ్యమందాసక్తి కలిగినపుడు, ఫలాసక్తి లేక నిర్వర్తింప బడుట యుండును. కర్తవ్య నిర్వహణమున సంపదలు, మానము, ప్రాణము పోయినను, అవమానములు కలిగినను, అంతమున దివ్య వైభవ ముండును. శ్రీరాముని జీవితమంతయు కర్తవ్య నిర్వహణమే. హరిశ్చంద్రుడును అట్లే. సత్పురుషుల జీవితముల యందు కర్తవ్య నిర్వహణమే ప్రధానముగ గోచరించును. శ్రీమాత ఆరాధనమున భక్తులు కర్తవ్య దీక్షను పొందినచో అది సమారాధనయై నిలచును. సమారాధనయనగా సమ్యక్ ఆరాధనము.



# 174. 'నిర్భవా'

పుట్టుక లేనిది శ్రీమాత అని అర్థము.

పుట్టుక, మరణము లేనివారు శాశ్వతులు. అట్టివారు పుట్టిననూ అది పుట్టుక కాదు. పుట్టినట్లుగను, మరణించినట్లుగను పామరులు భావింతురు. వారు కేవలము శరీరములు ధరించుట, విసర్జించుట చేయుచుందురు. వారు పుట్టుట, మరణించుట, వస్త్రములు విసర్జించుట వంటిది. శ్రీకృష్ణుడెప్పుడు పుట్టినాడని ప్రశ్నించిన ఒక వ్యక్తికి, శ్రీకృష్ణుడు పుట్టనే లేదని ఒక మహర్షి సందేశ మిచ్చిరి. ప్రశ్నించిన వ్యక్తి అయోమయమున పడెను. మహర్షి నవ్వుచూ "కృష్ణుడు శాశ్వతుడు. అతడు పుట్టుట, మరణించుట యుండవు. కనిపించుట, కనిపించక పోవుట మానవుల కుండును" అని వివరించెను.

శ్రీమాత కూడ అట్లే అప్పటికప్పుడు అవతరించుట, అదృశ్య మగుట యుండునే గాని ఆమెకు చావు పుట్టుకలు లేవు. పామర దృష్టికి పుట్టుకలు, మరణములు యున్నవి. జ్ఞానదృష్టికవి లేవు. దైవమెట్లు చావుపుట్టుకలు లేని తత్త్వమో, నిజమునకు జీవుడు కూడ అట్టివాడే. అతనికినీ చావు పుట్టుకలు లేవు. ఉన్నవనుకొనుట వలన అవి యున్నవి. జీవుడు కూడ దైవమువలె శాశ్వతుడే, సనాతనుడే. కానీ అపరిపూర్ణుడగుటచే, కారణ, సూక్ష్మ, భౌతిక శరీరములను ధరించి నపుడు పుట్టినాడని అనుకొందుము. అట్లే భౌతిక శరీరమును

విడచినపుడు మరణించినాడని అనుకొందుము. అది భౌతికమునకు మరణించుటే కాని, సూక్ష్మమున జీవించి యుండును. అట్లే సూక్ష్మమున మరణించిననూ, కారణ శరీరమున జీవించి యుండును. కారణ శరీరమును కూడ విసర్జించినపుడు, శుద్ధ చైతన్య ప్రజ్ఞగా యుండును. ప్రతిజీవియూ ఉండుట అనునది శాశ్వతమై యున్నది. అజ్ఞానులూ శాశ్వతులే. జ్ఞానులూ శాశ్వతులే. అజ్ఞానులకు పుట్టుట, చచ్చుట అనునవి గోచరించును. జ్ఞానులకు వ్యక్త, అవ్యక్త స్థితులు తెలిసి యుండుటచే, స్థితి మార్పును మరణమని భావింపరు.

శ్రీమాత తననుండి ఎనిమిది స్థితి మార్పులను కలిగించి, అందామె ప్రవేశించి యుండును. అవియే అష్ట ప్రకృతులు. అందు ఉన్నప్పటికీ వాని ప్రభావము ఆమెపై యుండదు. వస్త్రముపై వస్త్రము చొప్పున ఎనిమిది వస్త్రములు ధరించిననూ మనిషి తానెవరో తెలిసియే యుండును కదా! అట్లే అష్ట ప్రకృతులలో ప్రవేశించిన శ్రీమాత వాటిని ధరించునే కాని వానిచే ప్రభావితము కాదు. ఆమె నిర్భవ.

# 175. 'భవనాశినీ'

**జ**నన మరణములను నశింపజేయునది శ్రీదేవి అని అర్థము.

జనన మరణములు లేని జీవులకు అవి యున్నట్లుగా తోచుటే అజ్ఞానము. ఈ అజ్ఞానమునుండి శ్రీమాత తన భక్తులను ఉద్ధరించును. జ్ఞానభిక్ష నొసగి అజ్ఞానము నశింపజేయును.

దేహి, దేహములు మనిషి, అతని దుసుల వంటివి. దుస్తులు మార్చునట్లుగా జీవుడు దేహమును మార్చును. దుస్తుల కాయుర్దాయ మున్నది. అవి ఒక జీవితకాలమున ఎన్నియోమార్లు మార్చబడు చున్నవి. చివికి, చినిగి, నశించు దుస్తులవలన మనిషికి దుఃఖము కలుగుచున్నదా? మరియొక దుస్తులను ఏర్పరచుకొనునేగాని, దుస్తు లతోపాటు నశింపడు. అట్టివే దేహములు. అవి నశించుట కాల క్రమమున జరుగును. జీవుడు నశించుట యుండదు. కాలక్రమమున అతనికి కారణము, సూక్ష్మము, భౌతికము అను దేహములు ఏర్పడును. అందున్నపుడు వానివలన కలుగు ఆకర్షణకు లోనైనపుడు, వానిదైన స్వభావమేర్పడును. వివిధములగు కోరిక లేర్పడును. అవి కారణముగ లింగ శరీరము, కామ శరీరము కూడ ఏర్పడును. ఇవి వికృతములు, స్వయంకృతములు. శ్రీదేవి ఇచ్చిన కారణ, సూక్ష్మ, భౌతిక శరీరములు ప్రకృతములు కాగ, స్వభావము, కోరికలు కారణముగ ఏర్పరచుకున్న లింగదేహము, కామదేహము వికృతములై బాధించును. వీని వలన

అజ్ఞానము జనించును. నిప్పువలన పుట్టిన పొగ నిప్పును కప్పినట్లు, జ్ఞాన మజ్ఞానముచే కప్పబడును. అట్టి అజ్ఞానమునుండి బయల్పడు టకు జ్ఞానము ప్రధానము. జ్ఞానమునకు కర్తవ్య కర్మాచరణము ప్రధానము. విధియుక్తమైన కర్మలనాచరించుచు దైవము నారాధించుచు జీవించు సంకల్పము, దైవానుగ్రహము వలననే స్థిరపడి నిలబడును. అందువలన శ్రీమాత ఆరాధనము మరణాది అవస్థలనుండి భక్తుల నుద్ధరించ గలదు.



# 176. 'నిర్వికల్పా'

వికల్పము లేనిది శ్రీమాత అని అర్థము.

వికల్పమనగా అభిప్రాయము. అభిప్రాయము ఊహాజనితమే. ఉన్నదానిని గూర్చిన అవగాహన. అవగాహన సంస్కారమును బట్టి యుండును. ఉన్న విషయమును ఉన్నట్లుగా చూచుటయే గాని, దానిపై ఏర్పరచుకొను అభిప్రాయము లన్నియూ అసత్యములే అగును. శ్రీరామ పట్టాభిషేక అనంతరము సన్మాన సభలో లక్ష్మణుడు నవ్వెనట. ఆ నవ్వును నలుగురు నాలుగు విధములుగా అర్థము చేసికొనిరి. అట్లే, ఒక మాటను, ఒక చేతను, ఒక సన్నివేశమును చూచినపుడు, చూచినవారు తమ తమ సంస్కారమను పొరలనుండి చూతురు గనుక, ఒక్కొక్కరొక్కొక్క విషయమును గమనింతురు. ఉన్న విషయమును మరతురు. రాగము, ద్వేషము, కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము ఇవి యన్నియూ ఉన్నది ఉన్నట్లుగా చూడకపోవుట వలన కలుగు భావములు.

జీవితమంతయు యితరులను గూర్చిన అభిప్రాయములతోనే కడతేరును. తమకున్న అభిప్రాయముల ఆధారముగా ఇతరులతో ప్రవర్తింతురు. అభిప్రాయములు పొగమంచు వంటివి. పొగమంచు యుందు దృష్టి స్పష్టత యుండదు. సంసారజీవులు ఇట్టి వికల్పమను పొగమంచుయందు జీవించుచుందురు. యథార్థము వారు గమనింప

లేరు. యథార్థములగూర్చిన అభిప్రాయములపై ఆధారపడుదురు. ద్రౌపదీదేవిపై దుర్యోధనునికి కలిగిన అభిప్రాయమే మహాభారత సంగ్రామమునకు దారితీసినది. దురభిమానమునుండి వదినగారి నవ్వును చూచుటవలన సర్వనాశనమునకు ముఖద్వారము తెరచుకొనెను.

అర్జునుని చూచినపుడెల్ల కర్ణుడు అసూయాద్వారమున చూచుట వలన ద్వేషము పటిష్ఠమై నాశనమునకు తోడయ్యెను. అట్లే శకుని పగ, ధృతరాష్ట్రుని మమకారము. ఇట్లు సంస్కారవశులై సంసార జీవులు ఉన్నది ఉన్నట్లు చూడలేక సృష్టియందు ప్రతిసృష్టి గావించు కొందురు. ఇది మిథ్య. ప్రతి వ్యక్తియూ జగత్తును తన సంస్కారము నుండి చూచును కనుక, అతడు చూచు జగత్తు మిథ్య. జగత్తు మిథ్య యనుట సత్యము కాదు. తను చూచు జగత్తు మిథ్య అనునది సూక్తి (సత్యము). సృష్టి సత్య స్వరూపమే. దానిని గూర్చిన అభిప్రాయములు అసత్యము. ఇట్టి అసత్యమను భావన లేనిది శ్రీమాత.



# 177. 'నిరాబాధా'

**బా**ధారహితురాలు శ్రీమాత అని అర్థము.

సర్వబాధలకు భ్రాంతియే కారణము. భ్రాంతి లేనపుడు బాధ లేదు. సత్తుని చూచి వెండి అనుకొని భ్రాంతి. తాడుని చూచి పాము అనుకొని భ్రాంతి. చీకటిలో ఒక వస్తువు మరొక వస్తువువలె కనిపించును. అట్లే అజ్ఞానము ఆవరించినవారికి ఒకటి ఇంకొకటివలె గోచరించును. దానివలన బాధ, భయము, పొరపాటు కలుగును. జ్ఞానము గలవారికిది యుండదు. శ్రీమాత జ్ఞానస్వరూపిణి అగుట వలన, అట్టి పొరబాట్లు, వాని బాధలు ఆమెకు లేవు. పొరబాటు పడనివాడే జ్ఞాని అని గ్రంథములు తెలుపుచున్నవి.

విభీషణుడు యుద్ధమునకు ముందు రాముని శరణు వేడెను. అతని విషయమున సుగ్రీవుడు, జాంబవంతుడు, అంగదుడు, హనుమంతుడు వారి వారి అవగాహనను తెలిపిరి. కాని జ్ఞానియగు శ్రీరాముడు విభీషణుని ఆవేదనను సూటిగ గ్రహించెను. అట్లే బంగారు లేడి సన్నివేశమున, లక్ష్మణుడు సత్యమును సూటిగా చూడగలిగెను. అట్లు చూడలేక జానకీదేవి బాధకు గురి అయ్యెను. లేడియందు భ్రాంతియే ఆమెనట్లు చేసినది. సీతయందలి భ్రాంతియే రాముడికి కూడ బాధలను కలుగచేసెను.

అట్లు బాధలన్నియు భ్రాంతినుండియే కలుగును. సనకాది

బ్రహ్మమానస పుత్రులే, భ్రాంతినబడుట పురాణములు పేర్కొనినవి సృష్టియందు భ్రాంతి పడనివారెవరు? త్రిమూర్తులు సహితము భ్రాంతికి లోనయినవారే. ఇక సంసారజీవుల మాట చెప్పనక్కరలేదు. త్రిగుణములకు లోపలివారు భ్రాంతికి లోనైనవారే. త్రిగుణాతీత అయిన శ్రీమాత అట్టి భ్రాంతి కెన్నడూ లోను కాదు. భ్రాంతి ఆమె ఆయుధము. రజస్సు, తమస్సు గుణములకు లోబడిన అసురులు భ్రాంతియందే జీవింతురు. సత్యము నందున్న సాధుజనులు కూడ భ్రాంతికి లోనగుదురు. కేవలము గుణాతీత చైతన్యమున స్థిరపడినవారే భ్రాంతిన పడరు. గుణభ్రాంతి మహత్తరమగు భ్రాంతి. భ్రాంతివలన బాధ, బంధన ముండును. అట్టి బంధము లేనిది శ్రీమాత. ఆమెను ఆరాధిచుటవలన మాత్రమే ఆమె అనుగ్రహమున నిరాబాధ స్థితిని జీవులు కూడ పొందగలరు.



# 178. 'నిర్భేదా'

**శి**వుని కంటి భేదము కాదని, జ్ఞాన అజ్ఞాన భేదము లేదని, తెలియజేయు నామమిది.

ఉద్భవించిన తత్త్వమే శ్రీమాత. అవ్యక్తము యొక్క మొదటి వ్యక్త స్థితియే శ్రీమాత. దర్శన మిచ్చుట కామెయే అధిపతి. అనుభూతి నిచ్చునది కూడ శ్రీమాతయే. తత్త్వము అవ్యక్తమనియు, వాక్కున కందనిదనియు, తర్కింప వీలు కానిదనియు, దానిని గూర్చి తెలియుట అసాధ్యమనియు, అందు మునిగిన వారికి తానుండక అదియే యుండుననియూ, కావున తత్త్వమున ఉండుటయే కాని అనుభూతి లేదనియూ, అది శివమనియు పలుకుదురు. అది శివమైనపుడు ఆమె 'శివా'. శివుడే అగుపించిన, 'శివా' యగును. అతని ప్రథమ రూపమే ఆమె. ఆమెకును ఆయనకు భేదమే లేదు. యోగనిద్ర యందును, శివము మేల్కాంచినపుడూ అతడే యున్నాడు కదా! నిద్రయుందున్నవాడు వేరు, మేల్కాంచినవాడు వేరా? శివునికిని శ్రీమాతకును భేదమును చూచువారు తెలియనివారు. వారిది అభేద స్థితి. చూచువారిది భేదస్థితి. ఆమె శివునితో కూడియున్నది అనుట కూడ పూర్ణ సత్యము కాదు. ఆమె రూపమున నున్నది శివుడే. ఆమెగ గోచరించుచున్నాడు. అతడు మేల్కాంచినపుడు ఆమె యగుచున్నాడు. జీవులు కూడ నిద్రయందున్నపుడు శివస్థితియే. అది సత్య స్థితి. మేల్కాంచినపుడు "శివా" స్థితిని పొందుచున్నారు. అది చైతన్య స్థితి.

జీవునికి, శివునికి భేద మొక్కటియే. శివునిది యోగనిద్ర, జీవునిది మొద్దునిద్ర. శివుడు త్రిగుణాతీతుడు, జీవుడు త్రిగుణాత్మకుడు. శ్రీమాతకు జ్ఞానులు, అజ్ఞానులు అను భేదము కూడ లేదు. జీవులందరూ ఆమె బిడ్డలే. అందువలన అందరియందామెకు ప్రేమయే యుండును. అందరి ఉద్ధారణకూ తోడ్పడును. వారియందు భేదములను కూడ ఆమె నిర్మూలించును.

# 179. 'భేదనాశినీ'

స్వపర బేధములను నాశనము చేయునది శ్రీమాత అని అర్థము.

సర్వభేదములకు మూలము "నేను, ఇతరులు" అను భావన. ఈ భావము చేతనే భేదము పుట్టును. ఈ భావము లేనివారు తత్త్వ జ్ఞానులే. తత్త్వ మొక్కటియే. దానినే సత్య మందురు. "ఉన్నది సత్యము" అనునది సూక్తి. ఉండుట అను స్థితి అందరికినీ ఒకటియే. వ్యక్తముగ ఉన్ననూ, అవ్యక్తముగ ఉన్ననూ ఉండుట అనునది ఎప్పుడునూ ఉండును. అది శాశ్వతము. బండరాయి, వృక్షము, జంతువు, మనిషి, దేవతలు, రాక్షసులు, యక్షులు, గంధర్వులు అందరికినీ ఉండుట ఉన్నది. ఉండుట యందు భేదము లేదు. అది అందరియందొక్కటియే. అట్లే అన్నింటియందూ చైతన్య మున్నది. సత్యము, చైతన్యము ఆధార ముగ సమస్త సృష్టి, జీవులు, వస్తుజాలము ఏర్పడుచున్నవి. అన్నింటి యందును, సత్యమును, చైతన్యమును చూడవచ్చును. సత్యము, చైతన్యము త్రిగుణముల కతీతమైనవి. ఆ తరువాత త్రిగుణములు వానినుండి పుట్టవచ్చును. అపుడు భేదస్థితు లేర్పడును. భేదస్థితి "సత్ చిత్"లకు లేదు. దర్శించువారు ఆనందమయులై యుందురు. భేద జ్ఞానము లేకపోవుటవలన వారు "సచ్చిదానంద స్థితి యందున్నారు.

గుణములకు లోబడినవారు సత్ చిత్, తత్త్వము తెలియక

భేదమున పడుదురు. ఈ భేదబుద్ధి చేతనే తమను తాము బంధించు కొనుచుందురు.

తాముగ బంధించుకొనువారిని ఉద్ధరించువారెవరు? శ్రీమాతయే. ఆమె ఆరాధనమున భేదబుద్ధి తొలగి, బంధములనుండి బాధలనుండి జీవులు తరింతురు. ఆరాధనకు ఫలితమిదియని తెలిసి ఆరాధించుట ఉత్తమము. స్వప్రయోజనమునకై ఆరాధించుట మధ్యమము. ఇతరులను దమించుటకు, హింసించుటకు చేయు ఆరాధనము అధమము. అన్ని ఆరాధనములనుండి శ్రీమాత ఒకే ప్రయోజనము నిర్వర్తించును. అది జీవోద్ధారణము. ఎట్లైనను జీవులను ఉద్ధరించుటకు ఆమె చతుర్విధ ఉపాయములను వినియోగించును. అవసరమగుచో దండించును కూడ. దండన కూడ భేదనాశనమునకే. భేదబుద్ధి నశించువరకును ఆమె తల్లివలె కృషి సలుపుచునే యుండును.



# 180. 'నిర్నాశా'

**నా**శము లేనిది, అంతము లేనిది శ్రీమాత అని అర్థము.

అంతము, ఆరంభము సృష్టికేగాని, సృష్టికి ఆధారమైన సత్యమునకు, చైతన్యమునకు కాదు. సత్యము, చైతన్యము అంతము లేనిది, నాశనము లేనిది, ఎల్లప్పుడూ ఉండునది. చైతన్యము, సత్యము నాధారము చేసుకొని సృష్టి నిర్మాణము గావించుచుండును. ఆది, మధ్య, అంతములు సృష్టికి. సృష్టి మూలమునకు కాదు. అది శాశ్వతమైనది. వానినుండి సృష్టి వ్యక్తమగును. మరల వానిలోనికి లయమగును.

మనలో భావము లెట్లు పుట్టుచున్నవి? మనముండుట వలన, మేల్కొంచి ఉండుటవలన. మనముండుట అనునది సత్యము. మేల్కాంచుట అనునది ఉండుటనుండి మేల్కాంచిన చైతన్యము. మనము మేల్కాంచియున్నపుడు మననుండి ఆలోచనలు వ్యక్తమగును. వానితో మనదైన జీవితమును సృష్టి చేయుదుము. వానిని వృద్ధి చేయుటకు ప్రయత్నింతుము. మన ఆలోచనకు యొక కాలపరిమితి యున్నది. మనము చేసిన సృష్టికి కాలపరిమితి యున్నది. మనకు ఆలోచనలు రాకముందు కూడ మనము ఉన్నాము కదా! మననుంచి వచ్చిన ఆలోచనలు, ఆలోచనలనుండి పుట్టిన భాషణము పనిలేక పోయినను మన ముందుము. మనము శాశ్వతులము. మనకు కూడ

అంతము లేదు, మరణము లేదు. మరణింతుమన్న భావన మన మేర్పరచుకొన్నదే. మనమెల్లప్పుడునూ యుందుము. మననుండి పుట్టిన ఆలోచనలు నశింపవచ్చును. మనము అవతరింపజేసిన పనులు కూడా నశింపవచ్చును. మననుండి పుట్టిన దేహము కూడా నశింపవచ్చును. అన్నియూ నశించిననూ మనముందుము. మనము పరాప్రకృతి. పరమపురుషుల అంశ యగుటచే శాశ్వతులము. ప్రకృతి పురుషులు కూడా అట్లే శాశ్వతులు. "సత్యమ్, జ్ఞాన మనంతమ్ బ్రహ్మ ।" అనునది శ్రుతి. ఇది దేవునికి, జీవునికీ కూడ సత్యము.



# 181. 'మృత్యుమథనీ'

భక్తులయొక్క మృత్యువును నాశనము చేయునది శ్రీదేవి అని అర్థము.

మృత్యువును నాశనము చేయుట అనగా "నేను మరణింతును" అను అజ్ఞానపూరిత భావమును నశింపజేయును. దేహములు విడచుట మరణము కాదు. అది విరామమే. దుస్తులను మార్చుట వంటిది దేహములను విడచుట. నేను మరణింతును అన్న భావన జీవుని చిత్తవృత్తియందు పటిష్ఠమై యున్నది. అందువల్ల మరణానుభూతి కలుగును. మహాభక్తులూ, పరమభక్తులూ కూడ దేహమును వదలి నారు కదా! తెలిసినవానికీ, తెలియనివానికీ కూడ మరణము లేదు. తెలియనివాడు తన భావనచేత మరణము ననుభవించును. తెలిసిన వాడు మరణమును మార్పుగా గ్రహించును. మరణమనగా మార్పే అని సనత్సుజాతుడు ధృతరాష్ట్రునకు బోధించెను.

లేని మరణము ఉన్నదనుకొని జీవుడు భయభ్రాంతు డగు చున్నాడు. మానవుని జీవితమంతయూ లేనివి ఉన్నట్లుగా ఊహించు చునే సాగిపోవును. అట్లే మరణము కూడ. ఇట్టి అజ్ఞాన నిర్మూలనము జ్ఞానానుభూతిచే కలుగును. అట్టి జ్ఞానమును అందించునది శ్రీదేవి అని అర్థము. అంతియేకాని చివికి, చినిగిపోయి, కుళ్ళు కంపు కొట్టు చున్న దేహముననే ఉంచునని కాదు అర్థము. మృత్యుమథనీ అనగా "మృత్యువు" అను భావమును భక్తులయందు నశింపజేయును. రామ

కృష్ణాదులకైననూ దేహవిసర్జన తప్పలేదు. వారు జ్ఞానులు కనుక మరణము ననుభవింపలేదు. అట్లే యోగులు, భక్తులు, సిద్ధులు కూడ. మృత్యువు రాకూడదని ప్రార్థన చేయరాదు. మృత్యు అనుభూతి లేక జ్ఞానానుభూతియే యొసంగమని ప్రార్థించవలెను. "మృత్యోర్ముక్షీ" అనగా మృత్యుబంధమునుండి విడిపింపుమని అర్థము. బంధము లన్నియూ భావ బంధములే. మృత్యుభావ బంధమునుండి విడిపింపు మని మృత్యుంజయ మంత్రార్థము. 'మృత్యుమథనీ' అనిన కూడ అదే అర్థము.

మృత్యువు మూడు దశలలో ఉండునని తెలుపుదురు. ఒకటి భౌతికము. ఇది భౌతిక శరీరమును విడచుట. రెండవది సూక్ష్మము. ఇది సూక్ష్మదేహమును వదలునపుడు కలుగునది. అప్పుడు ఇంద్రియ లోకములకు సంబంధించిన బంధములు తెగును. మూడవది కారణము. ఈ మృత్యువు కారణ శరీరమును విడచునపుడు కలుగు నది. అట్టి వానికి భావబంధములు కూడ ఉండవు. భావ బంధములు విసర్జించుట, ఇంద్రియ బంధములు విసర్జించుట, భౌతిక బంధములు విసర్జించుట, ఎవనికి జరుగునో అతడు మూడు మృత్యువులు దాటినవాడై, ముక్తుడై జీవించును. అట్టివానికి శరీరము లున్నప్పటికీ అతడు ముక్తుడే. అది ఉన్ననూ లేకున్ననూ అతని కొకటియే.

మరియొక మాట. మృత్యువు దేహమునకు గాని జీవునకు కాదు. జీవాత్మ భావన పొందినవానికి, దేహాత్మ భావన సడలును. అపుడిక మృత్యువు లేదు. దేహమనగా కారణ, సూక్ష్మ, భౌతిక దేహములు కూడను.

# 182. 'నిష్క్రియా'

ఏ విధమగు క్రియలూ లేనిది శ్రీమాత అని అర్థము.

శుద్ధ చైతన్యముగ శ్రీమాత నిష్క్రియ. ఆమెకు నిర్వర్తించవలసిన కర్తవ్యములు లేవు. చేయవలసినవి లేవు. చేయకూడనివి లేవు. చేయ వలసినవి ఉన్నప్పుడే, చేయకూడనివి కూడ ఉండును. అవి ద్వంద్వ ములు. వీనినే విధి, నిషేధ క్రియలందురు. అనగా చేయవలసినవి, చేయకూడనివి. శ్రీమాతకు కారణమూ లేదు. కర్తృత్వమూ లేదు.

సృష్టి ఆమెనుండి ఏర్పడిన ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తుల ఆధారముగ ఏర్పడుచున్నది. ఆమెనుండి ఏర్పడిన వానినుండి కర్తృత్వము, కారణము లేర్పడుచున్నవి. అందువలన ఆమె నిష్క్రియ, నిష్కారణ. ఇది సున్నితమూ, సూక్ష్మమూ అయిన అవగాహన. ఉదాహరణలతో దీనినవగాహన చేసుకొనవచ్చును.

1. మంచి గంధము ఉన్నచోట సువాసన వ్యాపించుచుండును. గంధము వ్యాపింపజేయు కార్యముండుండదు. తానుండుటయే గాని, సువాసనలు వ్యాపింపజేయు కార్యము తనకు లేదు.

2. అయస్కాంతమున్నది. పరిసరమందలి ఇనుపముక్కలు దానివలన, దాని సాన్నిధ్యమున అయస్కాంతీకరణము చెందు చుండును. కానీ అయస్కాంతము, అయస్కాంతీకరణము

చేయవలెనని ప్రయత్నము చేయదు. అ కర్తృత్వము అయస్కాంతమునకు లేదు.

3. దీపపు కాంతిలో జీవలు కార్యక్రమములను నిర్వర్తింతురు. కొందరు సత్కార్యములను చేయుదురు. కొందరు దుష్కార్యము లను చేయుదురు. పైవిధములగు కార్యములకు దీపపుకాంతి కారణము కాదు. దీపమున్నచోట చేరి లలితా సహస్రనామ పారాయణ చేయవచ్చును. మద్యపానమూ చేయవచ్చును. ఈ వైవిధ్యములకు దీపము కారణము కాదు. దీపము ఉండుట తప్ప ఏమియూ చేయుట లేదు.

4. శ్రీమాత మనలో చైతన్యమువలె ఉన్నది. చైతన్యమాధారముగనే జీవులు తమ తమ కార్యక్రమములను నిర్వర్తించుకొను చున్నారు. కార్యముల వైవిధ్యముతో శ్రీమాతకు సంబంధము లేదు. ఉదయముననే మేల్కాంచిన జీవులు చైతన్యవంతులు అగుచున్నారు. అటుపైన వారి వారి స్వభావములనుండి వారి వారి క్రియలూ, కారణములూ ఏర్పడుచున్నవి. చైతన్యము లేనిదే స్వభావముల కాధారము లేదు. కార్యకారణములు స్వభావమునకు సంబంధించినవే గాని వారి యందలి చైతన్య మునకు సంబంధించినవి కావు.

సృష్టి నిర్మాణము ఎందులకు జరుగుచున్నది? జీవులు కోరు కొనుటవలన జరుగుచున్నది. జీవులు అసంపూర్ణులు. పరిపూర్ణతకై

ప్రయత్నించుచుందురు. జ్ఞానము, అజ్ఞానముతో కూడిన కార్యములు చేయుచు, అనుభవమును గడించుచు, పరిణామము చెందుచు నుందురు. వారి కోరిక మేరకు ప్రకృతి పురుషులు సృష్టి నిర్మాణమునకు తమ సాన్నిధ్యము నందించుచున్నారు. వారికి కర్తృత్వము లేదు. వారుండుట వలన సమస్త సృష్టి ఏర్పడి, వృద్ధి చెంది, అంతమగు చుండును.

ఇంతలో కొందరు జీవులు పరిపూర్ణు లగుదురు. మిగిలిన వారికొఱకు మరల సృష్టి ఏర్పాటు గావింపబడును. ఇట్లు అనంత కోట్ల జీవులు తరించుటకు అనంతముగ సృష్టి ఏర్పడుట, వృద్ధి చెందుట, లయమగుట జరుగచున్నది. ఈ మొత్తమునకు శ్రీమాత వెండితెర వంటిది.



# 183. 'నిష్పరిగ్రహా'

**ప**రిగ్రహమను గుణము లేనిది శ్రీమాత అని అర్థము.

పరిపూర్ణులకేమి కావలయును? కావున గ్రహించుట కేమియూ లేనిది శ్రీమాత. ఇచ్చుట, పుచ్చుకొనుట కర్మల రూపమున జీవులను నిర్విరామముగా ఆడించుచుండును. పరిపూర్ణుడు కానివాడు గ్రహించును. పుచ్చుకొనును. పుచ్చుకొనువాడున్నపుడు ఇచ్చువాడు ఉండును. ప్రతిజీవియందు ఇచ్చుట, పుచ్చుకొనుట జరుగుచు నుండును.

కుండ నిండుగ నీరున్నపుడు, ఆ కుండ ఇక నీరు పుచ్చుకొనదు. లోటు లేని చోట పుచ్చుకొనుట యుండదు. జీవులయందు అపరిపూర్ణత యుండుటచే, పుచ్చుకొను భావమేర్పడును. పుచ్చుకొనుటకు కోరిక కలుగును.

సృష్టి ధర్మములను పరిశీలించినచో, పుచ్చుకొనుట నేర్చినచో పరిపూర్ణత పొందలేమని, యిచ్చుట నేర్చినచో పరిపూర్ణత దిశగా సాగుదుమని తెలియును. ఇచ్చుచుండుట వలననే సూర్యుడు సూర్య మండలమునకు అధిపతియై యున్నాడు. అన్ని గ్రహములూ అతని చుట్టునూ తిరుగుచునున్నవి. పుచ్చుకొనుటవలన చంద్రుడు భూమి చుట్టూ తిరుగుచు నున్నాడు. చంద్రునివలె మానవ మనస్సులు కూడ పదార్థమయమైన విషయములను కోరుచూ, తిరుగాడుచుండును.

మనసు ప్రధానముగ కాక బుద్ధి ప్రధానముగ జీవించినచో, బుధునివలె సూర్యుని చుట్టును తిరుగ వచ్చును. దీనినే 'యజ్ఞార్థ జీవన'మందురు. అట్టి జీవనము గావించు యోగులు అపరిగ్రహమను దీక్షను పూనుదురు. ఈ దీక్ష నాచరించుటవలన శ్రీమాతవలె శాశ్వత పరిపూర్ణులై యుండగలరు.



# 184. 'నిస్తులా'

సాటిలేనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతతో సాటియైనవారెవరూ లేరు. ఆమె కామెయే సాటి. ఆమెతో సరితూగుట ఎవ్వరికినీ సాధ్యము కాదు. తూకమునకే తుల. మరియొకటేదియూ సృష్టిలో ఆమెతో తూకమునకు సరిపోదు. అందువలన ఆమె నిస్తుల.

పోల్చిచూడవలెనన్నచో చైతన్యము అవసరము. పోల్చి చూచుట ఎఱుక యున్నపుడు కదా! ఎఱుకగల ఇద్దరిని పోల్చవచ్చును. ఎవరి ఎఱుక ఎక్కువ, ఎవరి ఎఱుక తక్కువ తేల్చవచ్చును. కానీ ఎఱుకతో ఎవరిని పోల్చగలరు? ఇద్దరియందు ఎఱుక శ్రీమాతయే. అందరి యందూ ఆమెయే ఎఱుకగా యున్నది. ఆమె మొత్తము సృష్టికి ఎఱుక. సృష్టియందలి అన్నియూ ఆమె ఎఱుకతో నిండియున్నపుడు వాటిని ఆమెతో సరిపోల్చుట సాధ్యమగు విషయము కాదు. సముద్రమందలి అలలను ఒకదానితో మరియొకదానిని పోల్చవచ్చును. కానీ సముద్ర ముతో వాటిని పోల్చలేము. ఎంత పెద్ద అలయైననూ సముద్రముతో పోల్చుట అపహాస్యము. అట్లే శ్రీమాతతో ఎవరినైన పోల్చినచో అది పరిహాసమే. ఆమె జగత్ చైతన్య స్వరూపిణి. భక్త పరాధీన అగుటయే, తన భక్తుల నుద్ధరించుటకు లీలాప్రాయముగా పరమభక్తికీ, పరమ ప్రేమకూ  సరితూగుచుండును.

ఆమెయే శ్రీకృష్ణుని రూపమున అవతరించినది. కృష్ణ మూలము శ్రీలలితయే. అతడు జగత్ చైతన్యస్వరూపుడు. అతనిని, తనకున్న ఐశ్వర్యముతో సత్యభామ తూకము వేయపూనినది. సృష్టి ఐశ్వర్యమైన శ్రీకృష్ణుని, సృష్టియందు అల్పములైన ఐశ్వర్యములతో తూకము వేయపూనుటవలన సత్యభామాదేవి అపహాస్యమునకు గురియైనది. కానీ పరమభక్తికీ, పరమప్రేమకూ తాను లోబడుదునని తెలియజేయుటకు, రుక్మిణి ప్రార్థించి యుంచిన తులసీదళముతో అతడు సరితూగి అనుగ్రహించెను. సంకల్పించినచో శ్రీమాత అణువంత కూడ యుండును. స్వయమునకు మహత్తును మించి యుండును. అది ఆమె లీల.



# 185. 'నీలచికురా'

నీలమగు శిరోజములు కలది శ్రీమాత అని అర్థము.

శిరోజములు అనగా శిరస్సునుండి మొలుచు వెంట్రుకలు. శ్రీమాత శిరస్సుపైనుండి ఉద్భవించినవి. అవి సహజముగా నీలకాంతి కలిగినవి. నలుపు నీలమగుటచే నల్లగా గోచరించును. కృష్ణ అనగా నలుపునీలమే. కృష్ణ అనునది శ్రీలలిత నామములలో నొకటి. నలుపు నీలకాంతియే ఇతర రంగులన్నిటికీ ఆధారము. తెలుపు వర్ణము కూడ ఆ నీలమునుండియే పుట్టినది. తెలుపు నుండి మరల ఏడు కాంతులు పుట్టును. అజ్ఞానులకు ముదురు నీలము నలుపువలె గోచరించును. జ్ఞానులకు, నలుపువలె గోచరించునదంతయూ ముదురునీలముగా గోచరించును. ఇది యథార్థము. శ్రీకృష్ణుడు అజ్ఞానులకు నలుపుగను, జ్ఞానులకు ముదురు నీలకాంతిగనూ గోచరించును. ముదురు చీకటి కావల ఉన్నది వెలుగు (తమసః పరస్తాత్). అదియే సమస్తమునకూ ఆధారమైనది. అందుండియే దితి అను నలుపు, అదితి అను తెలుపు, వాని సమ్మిశ్రమములుగ యితరములగు వర్ణములు ఏర్పడును.

ఈ పై తెలిపిన ముదురు నీలకాంతి శ్రీమాత శిరోజములతో పోల్చబడినది. అందుండి అన్ని వర్ణములుగనూ ఆమెయే దిగి వచ్చును. సూర్యచంద్రాత్మకమగు కాంతి ఆమెనుండి దిగిరాగా అందుండి ఎఱుపు, నీలము, పసుపు కాంతులను అమ్మవారి ముఖము

లుగ వర్ణించు మరియొక సంప్రదాయ మున్నది. శ్రీమాతను గాయత్రిగా ధ్యానించునపుడు ఈ వర్ణములను పఠింతురు.

| | | | |
|---|---|---|---|
| ముక్త | = | చంద్ర కాంతి | (ముఖము) |
| విద్రుమ | = | ఎఱుపు కాంతి | (ముఖము) |
| హేమ | = | పసుపు కాంతి | (ముఖము) |
| నీల | = | ఆకాశనీల కాంతి | (ముఖము) |
| ధవళ | = | సూర్యకాంతి | (ముఖము) |
| ఛాయ | = | ముదురు నీలము – ఆధారమగు కాంతి – (Back ground) | |

శ్రీమాత శిరోజములు సర్వోత్కృష్టములు. అట్లే స్త్రీ శిరోజములు కూడను. వానిని పట్టి పీడించువారికి నాశము తప్పదు.



# 186. 'నిరపాయా'

**అ**పాయము లేనిది శ్రీదేవి అని అర్థము.

సర్వమును శ్రీమాత ఆధీనమున యుండుటవలన ఆమె ఎట్టి అపాయమును ఎరుగదు. అపాయము ఎవరికి యుండును? తన స్వాధీనము కానిది ఒకటి యున్నప్పుడే కదా! తనకు స్వాధీనము కానిది తనకు ఎదురు తిరుగవచ్చును. జ్ఞానము, అజ్ఞానమూ కూడ ఆమె స్వాధీనముననే యున్నవి. అట్టి శ్రీమాతకు అపాయ మెట్లుండును?

జ్ఞానులు అప్పుడప్పుడు అహంకరించుటచే, సృష్టియందు అపాయము వాటిల్లును. వానిని ఇంద్రుడు, త్రిమూర్తులు ఆదిగాగల దేవతలు నివారింతురు. వారి వశముకానిచో శ్రీమాత నివారించును. అట్లే అజ్ఞానులు అహంకరించి లోకములందు అనిశ్చిత నేర్పరచినపుడు కూడ శ్రీమాత అట్టి అపాయములను పరిష్కరించును. సృష్టియందు ఏ అపాయమునైననూ నిర్వర్తించు సమర్థురాలు శ్రీమాత.

అపాయములు రెండు విధములుగా కలుగవచ్చును. బయట నుండి, లోపలినుండి అపాయము లేర్పడుచుండును. బయట జనించి నను, లోపల జయించనివారు అపాయములకు గురి యగుదురు. అట్టివారే హిరణ్యాక్ష, హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు. వారు తమ లోపల జయించకపోవుటవలన అపాయమునకు గురి అయిరి.

అహంకారము, చిత్తము, ఇంద్రియానీకములను జయించిన యోగులు ఎట్టి అపాయమునకు గురికారు. అగస్త్యుడు, వశిష్ఠుడు, గౌతముడు, సనక సనందనాదులు, నారదుడు అట్టివారు. లోపల జయించిననూ బయటినుండి అపాయములు రావచ్చును. శ్రీరాముని జీవితము దానికి తార్కాణము. అట్లే యుధిష్ఠిరుని జీవితము కూడ. లోపల జయించుటచేత, వారు అపాయములకు గురియైననూ, ఆ అపాయములు పరిష్కరింపబడినవి.

భక్తులకు ఈ నామమిచ్చు సందేశ మొకటున్నది. అంతరంగ విజయము నిజమగు విజయమని, బహిరంగ విజయము నిజమగు విజయము కాదని, అంతరంగ విజయము ద్వారా నిరపాయ స్థితిని పొందవచ్చని, శ్రీమాత ఆరాధనము అంతరంగ విజయమునకే ఉద్దేశింపబడవలెనని సందేశము, "అంతర్ముఖ సమారాధ్యా" అని రాబోవు నామమున ఈ విషయము ప్రస్తావనకు రాగలదు.



# 187. 'నిరత్యయా'

**అ**తిక్రమించని తత్త్వము కలది శ్రీదేవి అని అర్థము.

అతిక్రమణ వలననే అపాయము కలుగును. తనకవసరమగు విషయమును గ్రహించుటకాక, అన్ని విషయములయందు వ్రేలు ఉంచుట, అసంబంధిత విషయములలో జొరబడుట, తమ కర్తవ్యము లను విస్మరించుట, ఇతరులకు ఇబ్బంది కలిగించుటవలన, దోషము సంక్రమించును. జీవిత మంతయూ కర్తవ్యనిర్వహణమునకే అని తెలిసి, దానిని నిర్వర్తించుకొనుట కొఱకే భావము, భాష, చేత అని తెలియవలెను. అపుడు మూడు లోకములయందును, అతిక్రమణము లేక జీవించుట వీలగును. వ్యర్థభావము, భాషణములు, వ్యర్థమగు చేష్టలకు దారితీయును. కర్తవ్య కర్మ నిర్వర్తించుట, ఇతర సమయము లలో మౌనమాచరించుట భక్తుల కర్తవ్యమై యున్నది. మౌనమనగా మూతి ముడుచుకొని యుండుట కాదు. మననము వలన ఏర్పడునది మౌనము. వారే మునులు. నిత్యమూ మనన ముండుచూ తనవంతు కర్తవ్యమును ఆచరించువాడు కృతకృత్యు డగును. మననము ప్రధానము. కర్తవ్యమునకు పూర్వము, అనంతరమూ, మననమే సాగించినచో క్రమముగా అతిక్రమణము లేని స్వభావము ఏర్పడును.

మననమందున్న ముని బుద్ధిలోకమున ఉండును. కావున కర్తవ్యాకర్తవ్యములు కూడ సులభముగా గ్రహించును. మననమట్లు

నిరతిక్రమణస్థితి యందుంచగలదు. అట్టి మననము లేనివాడు మనో లోకము నందుండుటచే కర్తవ్యము విషయమున పొరబడును. కేవలము మనస్సుతో నిర్ణయించువాడు తన స్వభావమునకు లోబడి యుండును కనుక, విచక్షతయందు స్పష్టత యుండదు. ఇట్టివారు తమ శక్తిపై ఆధారపడినవారు. మనోబలముకన్న దైవబలము గొప్పది. దైవస్మరణము వలన దైవబలము బుద్ధిని ప్రచోదనము గావింపగ, బుద్ధిబలము తోడైన మనస్సు సరియగు నిర్ణయములు చేయగలదు.

అవతారమూర్తియగు పరశురాముడు, మహత్తర శక్తి సంపన్ను లైన దుర్వాస, విశ్వామిత్రులు, వారినుండి అతిక్రమణము తొంగిచూచి నపుడెల్ల మరుక్షణము తపస్సు కేగుటకు కారణమిదియే. మననము వలనే నిరతిక్రమణ సాధ్యము.



# 188. 'దుర్లభా'

లభింప శక్యము కానిది శ్రీమాత అని అర్థము. శ్రీమాత లభించుట అనగా దర్శన, స్పర్శన, సంభాషణాదులు ఆమెతో జరుగుట, ఎవ్వరునూ సాధింపదగిన విషయము కాదు. ఎటువంటి సాధనలచేతకూడా ఆమె సాధ్యపడదు. అసాధ్యురాలు. ఆమెకై ఆమె అనుగ్రహింపవలెనుగాని, తానుగా ఎవ్వరూ ఆమెను పొందలేరు. శ్రీమాత లభ్యమగుటకు చేయు ప్రయత్నములన్నియూ అహంకార పూరితములే కదా! అహంకారమున్నపుడే ప్రయత్నముండును. అది తామసికముగాని, రాజసికముగాని, సాత్వికముగాని అయివుండును. సాత్విక అహంకారములకు కూడ ఆమె లభించుట అసాధ్యము. ఆలిచిప్పలో ముత్యపు చినుకు పడుట ఆలిచిప్ప వశమున లేదు. సూర్యోదయపు వేళ మబ్బులు అడ్డు రావచ్చును. వేచి యుండుటయే కమలము పని. సాత్వికమగు సాధనయే భక్తుల కర్తవ్యము. సిద్ధి వారి ఆధీనములో లేదు.

పైవిధముగనే సమస్త కార్యముల నిర్వర్తనమునకు, అవి సిద్ధించుటకు, నడుమ తెలియనిదొకటి యున్నది. పరీక్షలు వ్రాసినను, ఫలితములకై వేచి ఉండవలెను కదా! మృష్టాన్న భోజనము ఎదురుగా ఉన్ననూ భుజించుటకు వీలుపడని సన్నివేశములున్నవి కదా! సంపద లున్ననూ, సుఖపడవలెనను నియమమేమియూ లేదు. ఆరోగ్య

మున్ననూ ఆయుర్దాయము మనచేతిలో లేదు. ఇట్లన్ని విషయము లందు దుర్లభత్వము గోచరించుచుండును. దైనందిన జీవితమంతయూ ప్రాప్తాప్రాప్తములుగా నడచును. లభించుట, లభింపకపోవుట జీవుల అధీనములో లేదు. ఎంత స్వాధీనుల మనుకున్ననూ జీవులు పరాధీనులే.

శ్రీమాత అనుగ్రహమే ప్రాప్తమునకు కారణము. జీవునికి వలసినవి లభించినపుడెల్ల, ఇందువలన లభించినవి అనుకొనుట ఒక తెలివి. ఆ తెలివి సత్యము కాదు. ఇందువలన, అందువలన అని భావించువారికి, ఎందువలనో తెలియని సన్నివేశము లేర్పడును. తనకు లభించినవి దైవమిచ్చినవని భావించుచూ, సంతుష్టిపడుట నిజమగు భక్తుల లక్షణము. అట్టివారు కర్తవ్య నిర్వహణమున శ్రద్ధ వహింతురు. లభించుట, లభింపక పోవుట దైవమునకే వదలి వేయుదురు. లభించిననూ, లభింపక పోయిననూ దైవానుగ్రహముగ భావింతురు.

ఎవనికెప్పుడేమి లభించునో, ఏమి లభింపదో ఎవరికినీ తెలియదు. ఆ సమస్తమును శ్రీమాత ఆధీనమున నున్నది. ఆమె అనుగ్రహము తెలియుట దుర్లభము.



# 189. 'దుర్గమా'

**దా**ట శక్యము కానిది శ్రీమాత అని భావము.

దుర్గమనగా కోట. కోటను దుర్గము అనుటలో, ఛేదింపలేనిది, భేదింపలేనిది, దాటిపోలేనిది అని అర్థములు తెలియును. గమము అనగా సాగుట. దుర్గమము అనగా సాగిపోవుటకు వీలులేనిది.

శ్రీమాత సంకల్పము లేనిచో (అనుగ్రహము లేనిచో) సృష్టి యందు ఏ జీవియూ సాగిపోలేదు. అవరోధము లేర్పడును. జీవితమున అవరోధము లేర్పడుటకు కారణము దుర్గ అనుగ్రహము లేకపోవుటయే. ఇట్టివారికి అడుగడుగునా చిక్కులు పడుచుండును. ప్రతి చిన్న విషయమునందునూ అవరోధము, అంతరాయము లుండును. ఎప్పటికప్పుడు బంధములే కలుగుచుండును. కారణము దుర్గమత్వమే. "దుర్గాం దేవీగ్ం శరణ మహం ప్రపద్యే" అని ప్రార్థించుటయే పరిష్కారము. జీవిత గమనమున దుర్గమత్వము సహింపరాని వేదనను కలిగించును. అట్టివారికి దుర్గారాధనమే శరణ్యము. దానికే దుర్గా సప్తశతి. అదియే దుర్గా సప్తశ్లోకి.

శ్రీమాతను భక్తి ప్రపత్తులతో ఆరాధించువారికి దుర్గమ విషయములు కూడ సుగమము కాగలవు. కేవలము సుగమ మగుటయే కాదు, పయనము శోభాయమానమై, కీర్తివంతము కూడ యగును. శ్రీమాత దుర్గముడు అను రాక్షసుని వధించెను. అనగా

గమనమున దాటరాని అవరోధములు ఏర్పరచు రాక్షస ప్రజ్ఞ ఒకటి ఉన్నది. ఆ ప్రజ్ఞను హరించుటకు దుర్గారాధనమే ఉపాయమని అర్థము.

దుర్గాసూక్తము, దుర్గా సప్తశతి, దుర్గా సప్తశ్లోకి, లలితా సహస్ర నామ మందలి ఈ ఏబదియవ (50) శ్లోకము దుర్లభత్వమును, దుర్గమత్వమును నివారించగలవు.



# 190. 'దుర్గా'

దుర్గములు కలది అని అర్థము.

దుర్గ నవదుర్గయై యున్నది. అనగా తొమ్మిది కోటలు కలిగి యున్నది. అవియే నవావరణములు. అందుకే తొమ్మిది సంవత్సరముల వయసుకల కన్యలను దుర్గ అని పిలుతురు.

సృష్టికి నవావరణములు కలవు. తత్కారణముగనే సృష్టి గోచరించుచున్నది. మూలప్రకృతి, అష్టప్రకృతులు కలిపి తొమ్మిది ప్రకృతు లున్నవి. అష్టప్రకృతులు తొమ్మిదివది యగు మూలప్రకృతి నుండి దిగివచ్చినవే. దిగివచ్చినపుడు, సూక్ష్మమునుండి స్థూలమగుట జరుగును. ఆవిరి నీరగుట, నీరు మంచుగడ్డగుటగా ఎనిమిది లోకములు మూలప్రకృతినుండి ఏర్పడును. మూలప్రకృతి తత్త్వము నుండి ఉద్భవించును. ఈ మొత్తము తొమ్మిది ప్రకృతులు, తొమ్మిది చైతన్య స్థితులుగా, తొమ్మిది అవస్థలుగా తెలియనగును. ఈ తొమ్మిది అవస్థలూ మాయచే ఏర్పరచబడినవే. వీని నధిరోహించుటకు దుర్గ నారాధించుట సంప్రదాయము. "దుం దుర్గాయై నమః" అనునది ఈ సందర్భమున ఋషులందించిన మంత్రము. ఈ తొమ్మిది ఆవరణములలో, ఎనిమిది ఆవరణములు ఇంద్రాది దేవతలకు కూడ భయము కలిగించును. ఆవరణలకు మరియొక నామము వృత్రము. వృత్రాసురుడు అను రాక్షసుడు, ఇంద్రునకు అమితమైన భీతి

కలిగించెను. ఆ భీతినుండి తరించుటకు ఇంద్రుడు నారాయణుని ప్రార్థించెనట. నారాయణుడన్ననూ, నారాయణి యన్ననూ ఒక్కటియే. విష్ణువు యన్ననూ, వైష్ణవి యన్ననూ ఒక్కటియే. భయభీతులు కలవారికి దుర్గారాధనము అంజనము వంటిది. మానవునికి వెలుపల గల సృష్టియందు, అతని శరీరము లోపల యందూ ఈ తొమ్మిది ఆవరణలు ఉన్నవి. మానవుడు మూలప్రకృతిచేత, త్రిగుణములచేత, పంచభూతములచేత ఆవరింపబడియున్నాడు. అట్లే సృష్టియందు కూడ ఆవరింపబడియున్నాడు. ఈ ఆవరణములు దాటి 'తాను' ముక్తుడై యుండుటకు అన్ని ఆవరణములను శ్రీమాతగ దర్శించుట ప్రధానము. అట్లు దర్శించుటయే నిజమగు నవావరణ పూజ. ఎవరైనను అహంకరించినపుడు అది అంతయూ అమ్మ విలాసముగ చూడగలిగినపుడే నవావరణ పూజ జరిగినట్లు.

అజ్ఞానమునుండి పూర్ణజ్ఞానమునకు సోపానముగ తొమ్మిది మెట్లున్నవి. జీవులందు వారి పరిణామమును బట్టి ఈ తొమ్మిది స్థితులలో నుందురు. వారి ప్రవర్తనలందు మంచి చెడులను చూడక, వారున్న ఆవరణలను దర్శించుట సార్థక్యము కలిగించు సాధన. దీనినే వైష్ణవ సంప్రదాయమున 'వాసుదేవోపాసన' యందురు. విద్య అవిద్యలుగ శ్రీమాతయే జీవుల నావరించి యున్నపుడు, వానిని జీవుల చేష్టలుగ చూచుట ఒక ఎత్తు. శ్రీమాత మాయావరణగ చూచుట మరియొక ఎత్తు.

# 191. 'దుఃఖహంత్రీ'

**దుః**ఖములను అంతము చేయునది శ్రీమాత అని అర్థము.

సర్వదుఃఖములకు కారణము అజ్ఞానమే. జీవులు దురహంకారు లగుటచే వారు సత్వగుణము నాశ్రయించి గుణాతీత స్థితితో అను సంధానము చెందువరకూ దుఃఖములు తప్పవు. రజోగుణ దోషము వలన, ఇచ్ఛ పరిమితి దాటుటచే రజస్సు, తమస్సులు విజృంభించును. రజస్సునకు రావణుడు, తమస్సునకు కుంభకర్ణుడు ఉదాహరణములు. సత్వాధీనమున లేని రజస్సు, తమస్సులు, జీవులను అసుర (అజ్ఞాన) మార్గములందు చరింపజేయును. అట్టివారి చిత్తవృత్తులు వారి వశమున ఉండవు. అనియమిత చిత్తవృత్తి కారణముగ ఇంద్రియ ములు విజృంభించును. మనోభావములు చెలరేగి అతిక్రమించి ప్రవర్తించుట జరుగును. ఇట్టి అజ్ఞానమున పడిన జీవులు తమ జీవితమును దుఃఖమయము గావించుకొందురు. వీరికి పరిష్కార మేమి?

ఏ కొద్ది పుణ్యఫలముగనో శ్రీమాత ఆరాధనయందు రుచి కలిగినచో ఆమె దారి చూపును. క్రమముగ ప్రాథమిక విద్యల నందించును. వాని నాచరించుచుండగ జ్ఞానపర విషయములు తెలిసినవారు పరిచయమగుదురు. వారిద్వారా విద్యలను విశదీకరించు కొని ఆచరించుటలో సద్గురువు తారసిల్లును. ఆ మార్గమున

నడచుటలో క్రమముగ దుఃఖకారణములు ఉపశమించును. ఈ లోపున జీవుడు సత్వగుణము నాశ్రయించును. తత్కారణముగ పరహిత కార్యము లొనర్చుటకు ఉత్సహించును. దానములు చేయుటకు స్ఫూర్తి కలుగును. పరహిత యజ్ఞము, దానము అను గుణములు దైవధ్యానమునకు మార్గము చూపి యజ్ఞ దాన తపస్సులతో కూడిన జీవిత మేర్పడును. అపుడు ఇహ పరములయందు శాంతి లభించును. అట్టి జీవియందు దుఃఖకారణములు పరిపూర్ణముగ నశించును. ఈ విధముగ జీవులను శ్రీమాత దుఃఖములనుండి రక్షించును. తరింపునకు వలసిన తోడ్పాటు గావించును.



# 192. 'సుఖప్రదా'

**సు**ఖమును ప్రసాదించునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత తాత్కాలికముగ సుఖములే కాక శాశ్వత సుఖములు కూడ అందించును. తాత్కాలిక సుఖములు తాత్కాలికముగ ఆనందమును అందించును. సుఖము తాత్కాలికమైనపుడు మిగిలిన సమయములలో దుఃఖమే మిగులును. సుఖ దుఃఖములు ఎత్తు పల్లములుగా సామాన్యజీవుల జీవితము సాగుచుండును. సుఖమునకు కారణము జ్ఞానము. దుఃఖమునకు కారణము అజ్ఞానము. జీవుని యందు సురాసుర సంపత్తి సమన్వయింపకుండుట వలన, దేవతల ప్రజ్ఞ కారణముగ సుఖము, అసురప్రజ్ఞల కారణముగ దుఃఖము కలుగు చుండును. ద్వంద్వములను అనుభవించుచూ జీవుడు శాశ్వతమగు సుఖములకై పరితపించును. శాశ్వత సుఖము లభించవలెనన్నచో నిర్దిష్టమగు ఒక మార్గమును అనుసరించవలెను.

శ్రీమాత ఆరాధనము కారణముగ ప్రాథమికముగా భక్తి కుదిరిన జీవునకు, జ్ఞాన ఉపాసన కలుగును. భక్తి జ్ఞానముల సహాయమున నిత్య అనిత్య వివేకము కలిగి ముందుకు సాగును. శాశ్వత విలువలు గల విషయములయందు ఆసక్తి పెరుగుచు, అశాశ్వత విషయములందు ఆసక్తి తగ్గుచునుండును. అపుడు అనిత్యము, నశ్వరము అగు విషయములను క్రమముగా విసర్జించును.

అటుపైన శ్రీగురు కటాక్షమున యోగమున ప్రవేశించి ముక్తుడగును. ముక్తుడనగా ఎట్టి బంధములూ లేనివాడు. అతని జీవితమున బ్రహ్మానుభూతియే రసానుభూతిగా సాగును. అది శాశ్వతమగు సుఖానుభూతి. శ్రీమాత అట్టి సుఖమును ప్రసాదించు తల్లి.



# 193. 'దుష్టదూరా'

**దు**ష్టత్వమునకు, దుష్టత్వము కలవారికి దూరముగా నుండునదే శ్రీమాత అని అర్థము.

లోకహాని కలిగించు పనులు, అట్టి పనులను చేయువారు శ్రీమాత అనుగ్రహము పొందలేరు. శ్రీమాత శిష్టులనెట్లునూ అభివృద్ధి గావించుచుండును. దుష్ట చేష్టల నరికట్టుచుండును. ఆమెకు పక్షపాత బుద్ధి లేదు. దుష్టులను అరికట్టును. శిష్టులను రక్షించును. దుష్టు లింకనూ పతనము చెందకుండ కాచును.

తమ వృద్ధికై తాము పాటుపడువారు శ్రీమాత అనుగ్రహ పాత్రులు. తమ వృద్ధికి, ఇతరుల వృద్ధికీ పాటుపడువారు విశేష అనుగ్రహమును పొందుదురు. తమ వృద్ధికై ఇతరులను దోచుకొను వారు, హింసించువారు, దుఃఖములను కలుగజేయువారు శ్రీమాత అనుగ్రహమునకు పాత్రులు కాలేరు.

దుష్టులు వేరు. దుర్బలులు వేరు. దుర్బలురను శ్రీమాత బ్రోచును. వారిది బలహీనతయే కాని దుష్టత్వము కాదు. జీవులు తమ తమ బలహీనతలను అధిగమించుటకే దైవారాధన. శ్రీమాత అట్టివారిని అనుగ్రహించుచుండును. పరిమితత్వమే బలహీనత. అట్టి బలహీనత వలన ఏర్పడుచున్న దుఃఖములనుండి రక్షింపబడుటకు భక్తులు ఆరాధన చేయుదురు. వారికి చేయూత నిచ్చుట తన కర్తవ్యముగా శ్రీమాత భావించును.

మదించి అతిక్రమించుచూ, ఇతరులకు కష్టము, నష్టము, దుఃఖము కలిగించుట దుష్టత్వము. అట్టివారు కూడ శ్రీమాతను ఆరాధించుటకు ప్రయత్నింతురు. అట్టివారికి శ్రీమాత దూరముగ నుండును. అనగా వారియెడల సుప్తయై ఉండును. దుష్టులకైననూ బలము శక్తి స్వరూపిణియైన శ్రీమాతనుండి లభించును కదా! అట్టి శక్తితో వారు దుష్కార్యములు చేయుచున్నపుడు వారిని క్రమముగా శక్తిహీనులను చేయును. పదవియందున్నవారికి పదవీచ్యుతి కలుగును. ధనవంతులు దరిద్రులగుదురు. వారి శరీర ఆరోగ్యము నశించి తీరని రోగములకు గురియగుదురు. వారియందలి ఆమె శక్తి వారినుండి దూరము చేయుట ఈ నామమునకు అర్థము. మాట పడిపోవుట, కదల లేకుండుట, కళ్ళు పోవుట ఇత్యాదివన్నియూ వానికి తార్కాణము. అట్టి సమయమున జీవులు తక్షణమే శక్తిహీనులగుదురు. శ్రీమాత దూరమగుట సహింపరాని దురదృష్టము.



# 194. 'దురాచార శమనీ'

**త**న భక్తుల దురాచారములను శమింపజేయునది శ్రీమాత అని అర్థము.

సత్పురుషుడైనను కాలమునకు, దేశమునకు, కర్మమునకు లోబడుట జరుగుచుండును. అట్టి సమయమున వారినుండి దురాచార ములు జరుగవచ్చును. కాని వారు దేశభక్తులగుటచే, అసహజములైన వారి దురాచారములు, ఆమె త్వరితగతిని శమింపజేయును.

"జ్ఞానులు సైతము నా మాయకు లోబడియే యుందురు. నా మాయ నెవ్వరికినీ దాటుటకు శక్యము కాదు. నా అనుస్మరణము వలన మాయను దాటుటకు వీలగును" అని శ్రీకృష్ణ భగవానుడు తెలిపినాడు.

మాయ క్రమ్ముట ఎప్పుడు ఎవ్వరి కెక్కడైననూ జరుగవచ్చును. అజ్ఞానులు మాయయందే జీవింతురు. జ్ఞానులకు సైతము మాయ క్రమ్ముట అనేకానేక గాథలలో గమనింతుము. కైకేయి ఒక రాత్రికి మాయలో పడినది. జానకి దినములో కొంత సమయము మాయలో పడి లక్ష్మణుని దూషించినది. మాయ క్రమ్మినపుడు దురాచారము జరుగవచ్చును. వస్తుతః దైవీ స్వభావము కలవారు మాయలో పడి నపుడు దేవ్యారాధన బలమున మరల స్వస్థత పొందుదురు. కారణము దేవీ అనుగ్రహమే. తన భక్తుల దురాచారములను ఆమె శీఘ్రగతిని శమింపజేయును. దురాచారముల నన్నింటినీ శమింపజేసి, జీవుల నుత్తీర్ణులను చేయుటయే శ్రీమాత కారుణ్యము.

# 195. 'దోషవర్జితా'

శ్రీమాత దోషములు వర్జించినదని అర్థము.

సృష్టికార్యము ఒక అగ్నికార్యము. అట్టి కార్యమున కొన్ని మలినముల పుట్టుక తప్పదు. ఆ మలినములను ఆమె విసర్జించి అమలగా సృష్టియందు విస్తరించి యుండును. అట్టి మలినముల నుండియే దోషములు పుట్టును. మలిన దోషముల యందు ఆమె ఉండదు. అన్నము, అశుద్ధము అనునవి గమనించినపుడు, అన్నము నందామె యుండును. అశుద్ధమున యుండదు. అశుద్ధము విసర్జించ వలసినదే. అన్నము వండినపుడు పొగ, మసి ఏర్పడును. పొగను పీల్చరాదు. మసిని పూసుకొనరాదు. పొగ, మసి వచ్చునని అన్నము వండుట మానరాదు. అశుద్ధము లేర్పడునని అన్నము తినుట, నీరు త్రాగుట మానుట వివేకము కాదు. అన్నమును, నీటిని గొని, మల మూత్రములను విసర్జించుట ప్రాణికోటికి సహజము.

సృష్టి త్రిగుణాత్మకమగుటచే సత్వగుణమున కెంత ప్రాధాన్యత ఉన్నదో, రజోగుణమునకు, తమోగుణమునకు కూడా అంతే ప్రాధాన్యత ఉన్నది. మూడు గుణముల నుండి దోషములు పుట్టు చున్నవి. రజోగుణము లేనిదే ఎవ్వరునూ కార్యోన్ముఖులు కాలేరు. అట్లే తమోగుణము లేనిదే విశ్రాంతి, నిద్ర యుండవు. సత్వ గుణము లేనిచో స్థిమిత ముండదు. మూడు గుణములూ ఆవశ్యకమే.

మూడునూ దివ్యగుణములే. అవి శ్రీమాతనుండి ఉద్భవించినవి కదా! ఈ గుణములు నిర్వర్తింపబడుచున్నపుడు, అన్ని దోషములు కూడా ఏర్పడుచుండును. దోషములు ఎప్పటికప్పుడు నిర్మూలించుకొన వలెను. దోష విసర్జనము చేయనిచో దోషములు బలమై గుణములు మసకబారును. ప్రతినిత్యము శరీర మలినములు నిర్మూలించు కొననిచో శరీరము రోగగ్రస్తమగును కదా! అట్లే వాక్కు, ఇంద్రి యములు, మనస్సులను వినియోగించు చున్నపుడు కూడ దోషములు ఏర్పడవచ్చును. దోషములేని భాషణము, ఇంద్రియ పరితృప్తి, మనో భావన కలిగియున్నవాడు పూర్ణానందమును పొందగలడు. ఇట్లు మూడు లోకముల దోషములను నిత్యమూ విసర్జించుచూ జీవించు వాడు దేవీ ప్రకాశము కలిగి విరాజిల్లును.

అద్దమున్న చాలదు. దానిని నిత్యమూ పరిశుభ్రము చేసుకొను చుండవలెను. అప్పుడే ప్రతిబింబము స్పష్టముగా గోచరించును. జీవుడు దేవుని ప్రతిబింబమే. తనయందలి దైవము తనకు నిత్యమూ గోచరించవలెనన్నచో మనో ఇంద్రియ శరీరములందలి దోషములను నిత్యమూ విసర్జించుచుండవలెను. శ్రీమాత పరిపూర్ణ దోషవర్జిత. అందువలన ఆమెయందు శివతత్త్వము పరిపూర్ణముగ ప్రతిబింబించ వచ్చును. అందులకే ఆమె 'శివా' అయినది.

# 196. 'సర్వజ్ఞా'

సర్వమూ తెలిసినది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత, సృష్టి ఎఱుక. సృష్టియందలి సమస్త ప్రాణికోటి యందును ఆమె ఎఱుకయే పని చేయుచుండును. ప్రాణులు, ఎఱుక తమదనుకొందురు. జీవుల యందలి ఎఱుక శ్రీదేవియే. ఆ ఎఱుక ఆధారముగ జీవులు తమ తమ స్వభావములను బట్టి భావములను పొంది కార్యములను నిర్వర్తించుచుందురు. ఎఱుక లేనిదే భావన లేదు. సర్వభావములకూ మూలము ఎఱుకయే. భావములు లేని ఎఱుకను తెలిసినవాడు తనయందు చైతన్య స్వరూపిణిగా శ్రీమాత ఎట్లున్నదో తెలియగలడు. స్వభావమునం దిమిడిన జీవులకు వారి గుణ సముదాయములనుబట్టి భావము లేర్పడుచుండును. భావముల యేందే తిరుగాడువారు భావములకు మూలమైన ఎఱుకను గుర్తించ లేరు.

సినిమాతెరపై బొమ్మలు ఎల్లపుడూ పడుచుండగా, బొమ్మలు లేని వెండితెర నూహించుట కష్టము. భావములు ఎక్కడనుండి పుట్టుచున్నవో దానిని గమనించుట ధ్యానముగ శ్రీకృష్ణుడు భగవద్గీత యందు తెలిపినాడు. భావములు పుట్టుచున్న చోటును గమనించు మార్గమున క్రమముగ జీవుడు తనయందలి ఎఱుకను గుర్తించును. అట్లు తెలిసినవాడు ఆ ఎఱుకను అన్నిటియందు దర్శించుటకు

ప్రయత్నింపవలెను. ఆ ఎఱుకనుండియే సర్వమునూ పుట్టినవి. ఆ ఎఱుకయందే సకల జీవవ్యాపారములూ జరుగుచున్నవి.

శ్రీమాత అందరియందు తాను ఎఱుకగా యున్నది అని ఈ నామము తెలుపుచున్నది. అందువలన ఆమెకు సర్వమునూ తెలిసియే యుండును. ఆమెకు తెలియక సృష్టిలో జరుగునదేమియూ లేదు. ఆమెది సర్వజ్ఞత. శ్రీమాత తత్త్వము మనయందు యుండుటవలననే ప్రతిమానవుడు "నేనున్నాను" అని భావించుచున్నాడు. ఎఱుకయే లేనిచో ఈ భావనయే లేదు. తానున్నాను అను భావన ఆధారముగ ఇతర భావనలు అల్లుకొన్నవి. ఈ భావములకు అతీతముగ మనయందున్నది శ్రీమాత.



# 197. 'సాంద్రకరుణా'

**ఘ**నమైన కరుణ కలిగినది శ్రీమాత అని అర్థము.

ఘనమనగా ఘనీభవించినది, బరువైనది అని అర్థము. శ్రీమాత కరుణ సాంద్రత కలిగినది. ఆమె యందు కరుణ పటిష్ఠముగా యుండును. జీవులయందు కరుణకన్న కఠినత్వము ఎక్కువగా నుండును. కఠినము 'అపరిపక్వ' స్థితి. కరుణ 'పండిన' స్థితి. సాంద్ర కరుణ పరిపూర్ణముగ పండిన స్థితి. కరుణగలవాడే 'కలవాడు'. కరుణ లేనివాడు శ్రీమాత అనుగ్రహమునకు నోచుకొనలేడు. కరుణ హృద యమునకు సంబంధించిన గుణము. హృదయమున దైవసాన్నిధ్యము పెరుగుకొలది సహించుట, క్షమించుట, ప్రేమించుట, కరుణ చూపుట యుండును. ఈ గుణములు తోటివారిని అవగాహన చేసుకొనుటలో ఏర్పడునవి. అవగాహన లేమియే కఠినత్వమునకు దారితీయును. కఠినత్వమున్నచోట తోటివారి కష్టనష్టములను గుర్తించుట యుండదు. తప్పు ఒప్పులను గమనించుటయే యుండును.

తప్పు ఒప్పులను చూచునది మనస్సు. వాని నవగాహన చేసుకొనునది హృదయము. హృదయము కలవారే ఇతరులను అవగాహన చేసుకొనగలరు. వారి కష్ట నష్టములలో భాగము పంచు కొనగలరు. ఓర్పుతోను, సహనముతోను బాధ్యతలను స్వీకరింప గలరు. ప్రేమతో ఆదరింపగలరు. తక్కువ సంస్కారమున్నవారిపై కరుణను ప్రసరింపజేయుదురు. క్షమ కలిగి యుందురు.

సర్వదేవతారాధనలూ హృదయమునకే గావింపుడని వాఙ్మయము తెలుపుచున్నది. హృదయమున దివ్యత్వము అవతరించు చున్నకొలది భావము యందు, భాషణముల యందు, కర్మల యందు పరిపక్వత ఏర్పడును. జీవులలో చేదు పిందెల వంటివారు కొంద రుందురు. పెరిగి గట్టిపడి కాయలవలె ఉండువారు కొందరు, పండిన పండ్లవంటి వారు కొందరు. ఈ పరిణామము లన్నియూ హృదయమున జరుగును.

శ్రీమాత కరుణ వర్ణింప శక్యము కానిది. తెలిసిన వారియందు, తెలియనివారి యందు, శిష్యుల యందు, దుష్టులయందు ఆమె కరుణ ప్రసరింపజేయుచునే యుండును. అందరి అభివృద్ధియయే ఆమె కోరును.



# 198. 'సమానాధికవర్జితా'

శ్రీమాతయందు సమానత్వమే కాని ఆధిక్య భావముండదు అని అర్థము.

సమాన, అధిక వర్జితా అని ఈ నామమును ద్వంద్వ నామముగా తెలియవలెను. శ్రీమాత అందరియందును సమానముగనే యుండును. ఉపాధులనుబట్టి హెచ్చు తగ్గులున్నవి గాని, ఉపాధి యందున్నది ఎప్పుడునూ ఒక్కటియే. ఉగ్గుగిన్నె నుండి సముద్రము వరకూ నిండిన నీరుండును. ఉగ్గుగిన్నెలో తక్కువ నీరుండుటకు కారణము నీరు కాదు. గిన్నె పరిమాణము. సృష్టియందు శ్రీమాత శక్తులు సమానము గనే వ్యాప్తి చెందియున్నవి. అధికము, అల్పము అను వ్యత్యాసములు శ్రీమాతకు లేవు. అందుకొనువారినిబట్టి యుండును. సూర్యకిరణ ములు సమానముగనే ప్రసరించును. కానీ చీకటి గృహములలోనికి అవి రాలేవు. కారణము గృహనిర్మాణ విధానమే. గాలి, వెలుతురు ఇంటిలోనికి ప్రవేశింపకపోవుటకు సూర్యుడు, వాయుదేవుడు కారణము కాదు. అట్లే నీరు, వేడిమి కూడ. విద్యుత్తు కొన్ని దీపముల యందు ఎక్కువగ వెలుగుట, కొన్నిటియందు తక్కువగ వెలుగుటకు కారణము దీపముల పరిమాణమే కాని విద్యుత్తునకు సంబంధించినది కాదు.

ఉపాధులలో ఉన్న వ్యత్యాసము వలన అందు వసించునది

చిన్నదిగను, పెద్దదిగను గోచరించును. అదే విధముగ సృష్టియందున్న ఉపాధులలో శ్రీమాత నిండి యున్నది. ఉపాధి భేదము వలననే స్థావరములు, జంగమములు, మానవులు, దేవతలు, అసురులు ఒకరి కొకరు భిన్నమై గోచరింతురు. అన్నిటియందున్న శ్రీచైతన్యము దర్శించువారికి అధికులని, అధములని భావించుట యుండదు. తెలియని వారికే ఈ భావనలు. తెలిసినవారి కంతయూ చైతన్య విలాసముగనే గోచరించును. తెలియుటకే మూలమైన శ్రీమాత ఈ కారణముగ ఆధిక్యమును చూపదు. ఆమె ఆధిక్యమును, అసుర భావమును వర్జించినది. ఆమె దృష్టిలో తాను అధికమను భావము లేదు. కనుక ఇతరులను గూర్చి అల్పులు అన్న భావన కూడ యుండదు. అధికుల మనుకొన్నవారే కొందరిని అల్పులుగ చూతురు. దివ్యత్వమును అనుసరించువారు దానిని వర్జింతురు. అట్టివారిని సౌజన్య మూర్తులందురు. చక్రవర్తి కుమారుడు అయివుండి కూడ, శ్రీరాముడు గుహునియందు, శబరియందు, వానరులయందు, అసురులయందు సమానత్వమునే గరపెను. అట్లే పూర్ణపురుషుడైన శ్రీకృష్ణుడు కూడ గొల్ల పిల్లలతో చల్దులారగించెను. ఆధిక్యత అను భావమును వర్జించినవారు అందరి హృదయములందు వసించగలరు.



# 199. 'సర్వశక్తిమయీ'

శ్రీమాత యందే సర్వశక్తులూ యిమిడి ఉన్నవి అని అర్థము.

ఈ జగత్తు అంతయూ శక్తిచేతనే నడపబడుచున్నది. చీమ, దోమ మొదలు గ్రహముల వరకూ అన్నియూ శక్తిచేతనే కదలుచున్నవి. శక్తిలేని పదార్థము జడము. అట్టి జడమేర్పడుటకు కూడ శక్తి ఆధారము. సర్వమూ శక్తిమయమే. అచేతనములయందు, సచేతన ములయందు కూడ శక్తియే నిండి యున్నది. అణువు లోపల, అణువు బయట శక్తియే యున్నది. అన్నిటియందలి ఎఱుక, ప్రాణము, ఇచ్ఛ, జ్ఞానము, క్రియ, శక్తివలననే నిర్వర్తింపబడుచున్నవి. శక్తిలేనిచో సృష్టియే లేదు. సృష్టియందేమియూ ఏర్పడదు. అవరోహణ క్రమమున లోకము లేర్పడుటకు, ఆరోహణ క్రమమున మరల లయమగుటకు శక్తియే కారణము. లోకములకు వృద్ధికూడ శక్తి ఆధారముగనే కలుగును.

సృష్టియందు మార్పు సహజము. అట్టి మార్పును అను స్యూతముగా నిర్వర్తించునది శక్తి. సృష్టి యందలి సమస్త శక్తులూ శ్రీమాతనుండియే ఉద్భవించుచున్నవి. సమస్త దేవతా శక్తులు, అసుర శక్తులు, ఆయుధములుగ నున్నది శ్రీమాత శక్తియే. "నా శక్తులే దేవతల ఆయుధములు; నాశక్తి లేశములే దేవతల శరీరములు" అని శ్రీమాత పలికినట్లుగ "లక్ష్మీ తంత్రము"న కలదు. సృష్టియందలి స్థూల సూక్ష్మ శక్తులన్నియూ కలిపి పార్వతి అని తెలుపుదురు.

సృష్టి యందలి సమస్త శక్తులను మొహరించినచో అవి దుర్గగా అవతరించును. సృష్టిలో విపత్కరములగు పరిస్థితులు ఏర్పడినపుడు తన శక్తులుగా ఉన్న దేవతలు వానిని ఎదుర్కొన లేనపుడు, సర్వశక్తులతో కూడి, సృష్టి కవరోధము కలిగించు తనలోని భాగమైన అసుర శక్తిని నిర్మూలించును. సర్వశక్తిమయి అనగా సురాసుర శక్తి అని అర్థము చేసుకొనవలెను. దేవతల శక్తి మాత్రమే ఆమె అనుకొనినచో, అసుర శక్తి ఎక్కడనుండి పుట్టినది? సమస్తమునకు పుట్టినచోటు ఒక్కటియే. అదియే శ్రీమాత. సృష్టిపరిణామ కథయందు అతిక్రమించు శక్తులు సురులైనను, అసురులైనను దమింపబడుదురు. సురులయందు కూడ అప్పుడప్పుడు అసురభావము లేర్పడుట, అవి దండింపబడుట, పురాణములయందు పేర్కొనబడినవి. అట్లే అసురుల యందు సుర భావము కలవారు అనుగ్రహింపబడుట కూడ జరిగినది. సురులు అతిక్రమించినపుడు తానే స్వయముగ దండించును. ఆమె దండనము గానీ, అనుగ్రహము కానీ జీవులకు మంగళప్రదమే. కనుకనే తరువాతి నామము "సర్వమంగళా" అయి ఉన్నది.



# 200. 'సర్వ మంగళా'

సర్వ శుభ స్వరూపిణి శ్రీమాత అని అర్థము.

శ్రీమాత రూపమే మంగళ ప్రదము. శుభప్రదము. ఆమె గుణ విశేషములను భక్తితో హృదయమున కీర్తించువారికి సర్వ శుభములను కలుగజేయును. భక్తి శ్రద్ధలతో మంగళకరమగు ఆమె సహస్ర నామములను నిత్యము పఠించువారు, శ్రేష్ఠమైన సకల శుభములను, ఆమె అనుగ్రహమును పొందుదురు. పరమ పథమును కూడ పొందుదురు.

జీవితమును మంగళప్రదము గావించుకొనుటకు, శ్రీమాత సాన్నిధ్యమును అనుభవించుట కొఱకు ఈ క్రింది సూచనలు ఉపయోగకరములు.

1. శ్రీమాత ఆరాధనము.
2. తీరిక సమయములో అంతరంగమున నామస్మరణము.
3. సముచిత సంభాషణము. ఇతర సంభాషణములను విసర్జించుట. ఇతరులు అనుచిత సంభాషణ గావించునపుడు, మౌనము వహించి నామస్మరణము చేసికొనుట.
4. మంగళప్రదమగు రూప ధ్యానము హృదయమున గావించి కీర్తించుట.

5. అశుభ ప్రదేశములకు చనినపుడు, గృహమున చేరి స్నాన మాచరించుట.
6. అశుభ విషయములందు పాల్గొనకుండుట.
7. మంగళ ప్రదమగు వస్తువుల నెపుడూ దైనందినముగా వాడుచుండుట. అవి వరుసగా గంధము, పసుపు, కుంకుమ, అక్షతలు, కస్తూరి, కర్పూరము, సాంబ్రాణి, సువాసన లిచ్చు పుష్పములు యిత్యాదులు.
8. సుశబ్దములు, భాషణములతోపాటు, 'సు' వర్ణములనే వినియోగించుట. ఎఱుపు, సిందూరము, గులాబీ రంగు, పసుపు, తేనె వర్ణము, నీలము, లేత నీలము, లేతాకు పచ్చ, తెలుపు ఇవి 'సు' వర్ణములు. మట్టి రంగు, బూడిద రంగు, నలుపు నీలము, నలుపు రంగు వర్జనీయములు.
9. సూర్యకాంతి, చంద్రకాంతి దేహమునకు సోకునట్లు చూచుకొనుట.
10. ఉదయ, సాయం సంధ్యల యందు ఇంటియందు నూనె లేక నేతి దీపము లేర్పాటు చేసికొనుట. గృహము నందు చీకటి గదులుండరాదు. ఏ మూలను కీటకములు, బూజు, దుమ్ము చేరకుండా శుభ్రపరచుకొనుట.
11. దేహమునుందు ఏర్పడు మలినములను విసర్జించుటయందు శ్రద్ధ కలిగి యుండుట. నోటియందు, శరీరమందు దుర్వాసన

లేకుండునట్లు శుభ్రపరచుకొనుట. అవసర మగుచో పలుమార్లు దంతధావనము, స్నానము ఆచరించుట, కాలి చేతి వ్రేళ్ళ గోళ్ళ నెప్పటికప్పుడు నిర్మూలించుకొనుట, శిరోజములను సంస్కరించుకొనుట. ఎట్టి పరిస్థితియందు జుట్టు విరబోసుకొని తిరుగరాదు.

పైవిధముగ మన సంప్రదాయమున మంగళ ఆచారములు కోకొల్లలుగా నున్నవి. వీనియందు శ్రద్ధ ప్రాథమికముగా నున్నచో, అది దైవమునందు శ్రద్ధగా పరిణతి చెందును. ప్రాతః సమయమున లేచుట, స్నానమాచరించుట, ముగ్గులు పెట్టుకొనుట ఇత్యాదివి కూడ ఇందులో భాగములే. తామస అహంకారము కలవారు వీనిని నిర్లక్ష్యము చేయుదురు. జీవితము మంగళ ప్రదము కావలెనన్నచో, అన్నమయ, ప్రాణమయ, మనోమయ లోకములలోను, తమ పరిసరములలోను శుచి, శుభ్రత పాటింపవలెను. అపుడే మంగళ ప్రదమగు శ్రీమాత అనుగ్రహించును.



శ్రీరస్తు.

*శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః ।*

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రరత్నము

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

మహాశక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ ॥ 40

భవానీ భావనాగమ్యా భవారణ్య కుఠారికా ।
భద్రప్రియా భద్రమూర్తి ర్భక్తసౌభాగ్యదాయినీ ॥ 41

భక్తప్రియా భక్తిగమ్యా భక్తివశ్యా భయాపహా ।
శాంభవీ శారదారాధ్యా శర్వాణీ శర్మదాయినీ ॥ 42

శాంకరీ శ్రీకరీ సాధ్వీ శరచ్చంద్రనిభాననా ।
శాతోదరీ శాంతిమతీ నిరాధారా నిరంజనా ॥ 43

నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా ।
నిర్గుణా నిష్కళా శాంతా నిష్కామా నిరుపప్లవా ॥ 44

నిత్యముక్తా నిర్వికారా నిష్ప్రపంచా నిరాశ్రయా ।
నిత్యశుద్ధా నిత్యబుద్ధా నిరవద్యా నిరంతరా ॥ 45

నిష్కారణా నిష్కలంకా నిరుపాధి ర్నిరీశ్వరా ।
నీరాగా రాగమథనీ నిర్మదా మదనాశినీ ॥ 46

నిశ్చింతా నిరహంకారా నిర్మోహా మోహనాశినీ ।
నిర్మమా మమతాహంత్రీ నిష్పాపా పాపనాశినీ ॥ 47

నిష్క్రోధా క్రోధశమనీ నిర్లోభా లోభనాశినీ ।
నిస్సంశయా సంశయఘ్నీ నిర్భవా భవనాశినీ ॥ 48

నిర్వికల్పా నిరాబాధా నిర్భేదా భేదనాశినీ ।
నిర్నాశా మృత్యుమథనీ నిష్క్రియా నిష్పరిగ్రహా ॥ 49

నిస్తులా నీలచికురా నిరపాయా నిరత్యయా ।
దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖహంత్రీ సుఖప్రదా ॥ 50

దుష్టదూరా దురాచారశమనీ దోషవర్జితా ।
సర్వజ్ఞా సాంద్రకరుణా సమానాధికవర్జితా ॥ 51

సర్వశక్తిమయీ సర్వమంగళా సద్గతిప్రదా । 52



# OTHER BOOKS THROUGH
## MASTER K. PARVATHI KUMAR

*The following books are available in: English (E), German (G), Spanish (S), French (F), Hebrew (H), Telugu (T), Hindi (HI) and Kannada (K) languages.*

**BOOKS :**

| | | |
|---|---|---|
| 1. | MITHILA –A New Age Syllabus | E/G/S |
| 2. | THE AQUARIAN MASTER | E/G/S |
| 3. | SOUND –The Key & Its Application | E/G/S |
| 4. | ASHRAM LEAVES | E/G/S |
| 5. | SANKHYA –The Sacred Doctrine | E/G/S |
| 6. | VENUS –The Path to Immortality | E/G/S |
| 7. | THEOSOPHICAL MOVEMENT | E/G/S |
| 8. | SHIRDI SAI SAYINGS | E/G/S |
| 9. | SPIRITUALITY IN DAILY LIFE | S |
| 10. | THE MASTERS OF WISDOM | S |
| 11. | MEDITATION & GAYATRI | S |
| 12. | WISDOM TEACHINGS OF VIDURA | E/G/S |
| 13. | ON HEALING | E/G/S |
| 14. | SPIRITUAL FUSION OF EAST & WEST | E |
| 15. | SRI SASTRY GARU | E/G/S/F/T |
| 16. | THE AQUARIAN CROSS | E/G/S |
| 17. | HERCULES –The Man & the Symbol | E/G/S |
| 18. | MANTRAMS –Their Significance & Practice | E/G/S |

19. SRI DATTATREYA E/G/S/T/HI
20. SATURN –The Path to Systematised Growth E/S
21. JUPITER –The Path of Expansion E/S
22. MASTER E.K. –The New Age Teacher E/G/S
23. AMANASAKUDU T/K
24. VRUTRASURA RAHASYAM T
25. THE DOCTRINE OF ETHICS E
26. DHANAKAMUNI KATHA T
27. ANTARDARSANA DHYANAMULU T
28. THE SPLENDOR OF SEVEN HILLS E/T/Hi
29. DOCTRINE OF ETERNAL PRESENCE E
30. ASANGUDU T
31. SARASWATHI - THE WORD E
32. MANA MASTARU GARU T
33. GEETOPANISHAD (Sankhya Yogamu) T
34. GEETOPANISHAD (Karma Yogamu) T
35. GEETOPANISHAD (Jnana Yogamu) T
36. GEETOPANISHAD (Karmasanyasa Yogamu) T
37. ‘OM’KARAM T
38. JYOTIRLINGA YATRA T
39. SRI LALITHA T
40. KATHA DEEPIKA T
41. MASTER C.V.V. (Birthday Message) T
42. MAITREYA MAHARSHI BODHALU T

43. MARUVU MAHARSHI BODHALU T
44. DEVAPI MAHARSHI BODHALU T
45. HIMALAYA GURU PARAMPARA T
46. OCCULT MEDITATIONS E
47. RUDRA E
48. Master C.V.V. - The Initiator - Master E.K. The Inspirer E
49. SAI SUKTHULU T
50. SRI KRISHNA NAMAMRUTAM T
51. On LOVE E/G/S
52. On SILENCE E/G/S
53. On CHANGE E/G/S
54. Sri GURUPADUKASTAVAM T
55. Master C.V.V. NOOTANA YOGAMU T

**BOOKLETS :**

1. LORD MAITREYA -The World Teacher E/G/S/F
2. THE WHITE LOTUS E/G/S
3. WISDOM BUDS E/G/S
4. SPIRITUALISM, BUSINESS & MANAGEMENT E/G/S
5. THE PATH OF SYNTHESIS E
6. THE ETHERIC BODY E/G/S
7. MARIA MAGDALENA E/G/S
8. TIME, THE KEY E/G/S

| | | |
|---|---|---|
| 9. | LISTENING TO THE INVISIBLE MASTER | E/G/S/F/H |
| 10. | GOOD FRIDAY | E/G/S/F/H |
| 11. | BHRIKTA RAHITA TARAKA RAJAYOGAMU | T/K |
| 12. | MARRIAGE - A SACRAMENT | E |
| 13. | MASTER C.V.V. YOGAMU-KARMARAHITYAMU | T |
| 14. | POOJA VIDHANA PRASASTYAMU | T |
| 15. | GAYATRI MANTRA PRASASTYAMU | T |
| 16. | BHARATEEYA SAMPRADAYAMU | T |

**ధనిష్ఠ ఇతర ప్రచురణలు :**

1. శ్రీ వినాయక వ్రతకల్పము
2. శ్రీ శరన్నవరాత్ర పూజావిధానము
3. శ్రీ హనుమాన్ చాలీసా
4. శ్రీ సూర్య పూజావిధానము
5. శ్రీ శివ హృదయము
6. శ్రీ మహాలక్ష్మి పూజావిధానము
7. శ్రీ వేంకటేశ్వర పూజావిధానము
8. శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము
9. పురాణపురుషుని పూజా విధానము
10 శ్రీ దత్తాత్రేయ పూజా విధానము

# శ్రీలలిత

## తృతీయ భాగము

(201 నుండి 300 నామములకు వివరణము)

**3**

మాస్టర్ పార్వతీకుమార్



ధనిష్ఠ



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువలేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జన్మించినది.

**"ధనిష్ఠ"**, డా॥ కంభంపాటి పార్వతీకుమార్ గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపము లోను, పుస్తకముల రూపములోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును, సద్గోష్ఠికై వలసిన వాతావరణమును - "జగద్గురు మందిరము" గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

# సంకలనకర్త : మాస్టర్ కంభంపాటి పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయులకు వెలుగుదారి చూపించుచున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ కంభంపాటి పార్వతీకుమార్** గారు. వారి బోధనలు లెక్కకు మించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియ వచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసరణీయమై, ఆచరణయోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించుచున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళా రంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో - మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే, దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, "మానవ సేవయే మాధవసేవ" అను మాటకు సరియైన అర్థము యిదేనని శ్రీ కుమార్‌గారు తమ ప్రవర్తన ద్వారా తెలియపరచుచున్నారు.

శ్రీ పార్వతీకుమార్ బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక - మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, అనేక గ్రంథముల సంకలన కర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొను చుండుననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు శ్రీ కుమార్‌గారి దృఢవిశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

శ్రీ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశవిదేశములలో పరహితసేవ గావించుచున్నవి. "*పరహితము పరమధర్మ*" మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవద్ధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

"శ్రీలలిత" అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతి మాసము 'నావాణి' దర్శన మాస పత్రికయందు ప్రచురింపబడుచున్నవి. పాఠకుల కోరికపై మొదటి 108 నామములను 'ప్రథమ భాగము'గ, దాని తదుపరి 109వ నామము నుండి 200వ నామము వరకు 'ద్వితీయ భాగము'గ "ధనిష్ఠ" ప్రచురించినది. తదాపి 201వ నామము నుండి 300వ నామము వరకు 'తృతీయ భాగము'గ ప్రస్తుతము అందించుచున్నాము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీరమగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారినుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారి యందు, వారి భాషణయందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహపరములకు పరిష్కారమని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

**- ధనిష్ఠ**

# పరిచయము

**ల**లితాదేవి, శ్రీదేవి, దుర్గ, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమెయే మూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్త స్థితియందు సత్యముగను, వ్యక్త స్థితియందు మహాచైతన్యముగను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు, సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితి గొనుటకు వినియోగ పడును. అందులకే పారాయణము.

అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వ్యాఖ్యానము. సామాన్యులకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

- పార్వతీకుమార్

# విషయసూచిక

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

# శ్రీలలిత



ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

# 201. ‘సద్గతిప్రదా’

**స**ద్గతిని ప్రసాదించునది శ్రీదేవి అని అర్థము.

సత్యమునకు దారి చూపుట శ్రీదేవి ఆశయము. దానిని ప్రసాదించుట ఆమె అనుగ్రహము. సత్యమును చేరుటయే జీవుల గమ్యము. జన్మ పరంపర లన్నియూ జీవులను సత్యము వైపునకే నడిపించును. రకరకముల అనుభవములను పొందుచూ, సమగ్రత్వము చెందుచూ, జీవుడు పరిణామమున ముందుకు సాగుచు నుండును. నిరుపమానమైన ఓర్పుతో ప్రేమతో కరుణతో శ్రీదేవి జన్మ పరంపరల నొసగుచూ జీవులను సద్గతివైపు నడిపించు చుండును. “జీవులు దేనిని అభిలషించుచునైననూ చివరకు నన్నే చేరుచున్నారు. దేని నన్వేషించు వారైననూ నన్ను గూర్చియే అన్వేషించు చున్నారు. వారి ఆనందాన్వేషణము నన్ను చేరుటకే.” ఇట్లు చేరుటకు దేహము లావశ్యకములు. జన్మ పరంపర లావశ్యకము. ప్రకృతి రూపమున శ్రీదేవి ఇట్టి జన్మల ననుగ్రహించుచూ అనుభవమును, అనుభూతిని కలిగించుచూ జీవులను సత్యము వైపునకు నిరంతరము నడిపించుచునే యున్నది. అజ్ఞానవశులైన వారు కూడ సత్యపథముననే నడుచుచున్నారని తెలియుట సమగ్ర జ్ఞానము. అనుభవ లేమియే

అజ్ఞానము కాని అది దుష్టత్వము కాదు. అజ్ఞాని, జ్ఞాని కూడ వారి వారి అనుభవముల ననుసరించుచూ క్రమముగ దైవమును చేరుటయే సృష్టి కథ. మాతృభావము కలిగినవారే తెలిసిన వారిని, తెలియని వారిని కూడా ఒకే ప్రేమతో నడిపింతురు. అట్టి కరుణామయి శ్రీదేవి అని తెలియవలెను.



# 202. 'సర్వేశ్వరీ'

సకలమునకు ఈశ్వరి శ్రీదేవి అని అర్థము.

సృష్టి యందు సర్వమూ శ్రీదేవి అధీనముననే యున్నది.

సృష్టి చైతన్యము శ్రీదేవియే. అన్ని జీవరాశులయందు ఆమె చైతన్యమే విరాజిల్లుతూ నున్నది. త్రిగుణములుగాని పంచభూతములు గాని తమకు తాముగా ఏమియూ నిర్వర్తింపజాలవు. అట్లే జీవులు కూడ తమకు తాముగా ఏమియూ నిర్వర్తింపజాలరు. జీవులయందు ఇచ్ఛగాని, జ్ఞానముకాని, క్రియాశక్తిగాని పనిచేయుటకు వారి యందున్న చైతన్యమే ఆధారము. చేతన లేనప్పుడు జీవునికి తనకు తా నున్నాడని కూడ తెలియదు. అందరి యందు, అన్నిటి యందు తానుండి, ఆయా ధర్మములను నిర్వర్తించు శక్తిగా శ్రీదేవియే యున్నది. ఇది ఆమె ఈశ్వరత్వము. ఉప్పు ఉప్పుగా నుండుట, వేప చేదుగ నుండుట, నిమ్మ పులుపుగ నుండుట, తేనె తీపిగ నుండుట యందు కూడ శ్రీదేవి అస్థిత్వము దర్శింప వచ్చును. ఇట్లందరి జీవుల సమస్త చేష్టలకు ఆధారముగా నున్నది శ్రీదేవి.

సృష్టి యందు సమస్తమునకు ఆమె ఈశ్వరి. ఆమెకు ఈశ్వరు డాయన. ఆయన (ఈశ్వరుడు) కూడ కనుపింపవలె నన్నచో ఆమెయే ఆధారము. ఆమె లేని ఆయన జగత్తునకు లేడు. ఆయన లేక ఆమె ఏమియూ చేయలేదు. నిజమునకు ఆమె ఆయన ఒకటియే.

కనిపించునపు డామె యగును, సంకల్పించినపుడు ఆయన యగును. ఏమీ సంకల్పించని స్థితిలో కేవలము తానుగ నుండును, ఆ తాను ఆమె కాదు, ఆయన కాదు. రెండునూ ఏకము చెందిన స్థితి. ఆ ఏకత్వము నుండి తాను అస్థిత్వము (ఆయన)గను, చేతన (ఆమె)గను ఏర్పడుదురు. ఇవి రెండును అవిభాజకములు. అందు వలననే సర్వేశ్వరి, సర్వేశ్వరుడని సంబోధింతురు. సత్, చిత్‌లు లేనిచో ఏమియూ లేదు. కావున వారిదే ఈశ్వరత్వము. ఈశ్వరత్వ మనగా అన్నిటి యందునూ అస్థిత్వముగను, చైతన్యముగను వశించి స్వామిత్వమును నెరపుట.



# 203. 'సర్వమయీ'

సర్వమూ తానై యున్నది శ్రీదేవి అని అర్థము. పై నామమున తెలిపిన ఈశత్వము హద్దు లేనిదై సృష్టి యంతయూ వ్యాపించి యుండును. సృష్టి రూపము ఆమె రూపమే. అందలి కోటానుకోట్ల జీవుల రూపము కూడ ఆమెయే. అందు వర్తించు పంచభూతములు ఆమెనుండి పుట్టినవే. ఆయా జీవుల స్వభావము లన్నియూ వారి యందలి త్రిగుణములు సంమిశ్రమమై యుండగ అట్టి త్రిగుణము లామె నుండి పుట్టినవే. ఆ జీవుల అస్థిత్వము కూడ ఆమెయే. ఇట్లు అంతయూ ఆమెయే అయి వుండగ అట్టి అద్భుత దర్శనము కలిగి నపుడు సర్వమయీ అను నామము సత్యమై నిలచును.

ప్రత్తి ఆధారముగ అనేకానేక వస్త్రములు, దుస్తులు, ఇతర వస్తువులు ఏర్పడుచున్నవి. ఈ వివిధత్వము కలిగిన సమస్త వస్తువులకు ప్రత్తియే ఆధారము కదా! ప్రత్తియే లేనిచో దుస్తులేమియు లేవు. ప్రత్తియే ఇట్లు రూపాంతరము చెందినది. ఇది తెలియుట సులభము కాని సత్యలోకము నుండి భూలోకము వఱకూ చైతన్యమే త్రిగుణములుగను, జీవులుగను, జీవ రూపములుగను అల్లుకొని యున్నదని తెలియుటకు శ్రద్ధ కావలెను. దర్శన మగుటకు భక్తి కావలెను. భావన చేయుటకు ఓర్పు కావలెను. స్వభావము నిర్మలము కావలెను. అపుడే సర్వమయీ తత్త్వము తెలియనగును.

భువన మంతయూ రెండు వందల ఇరువది నాలుగు (224) లోకములుగ తంత్రము తెలుపుచున్నది. దీనిని 'భువనాధ్వము' అందురు. అట్లే శబ్దము 52 అక్షరములుగను, వర్ణములుగను తెలుపబడుచున్నది. దీనిని 'అక్షరాధ్వము' అందురు. మూలవిద్య నుండి పుట్టిన ఏడు కోట్ల మహా మంత్రములు శ్రీదేవి రక్తముగ తెలుపబడినది. దీనిని 'మంత్రాధ్వము' అందురు. ఈ మంత్రముల గుంపులను శ్రీదేవి మాంస రూపముగ తెలుపుదురు. దీనిని 'పదాధ్వము' అందురు. పంచభూతములు, పంచేంద్రియములు, పంచతన్మాత్రలు, పంచ ప్రాణములు, పంచాంగములు, జీవుడు, దేవతల ఉచ్చారణముగ శబ్దము నుండి ఏర్పడినవి. దీనిని 'తత్త్వాధ్వము' అందురు.

ఇట్లు పంచాధ్వములుగ శ్రీదేవియే వ్యాప్తి చెంది యుండుటచేత సర్వమునూ ఆమెయే అని తెలియనగును. సర్వమయీ అనగా ఐదు మార్గములుగ శివ స్వరూపమును తెలుపుట.



# 204. 'సర్వమంత్ర స్వరూపిణీ'

సర్వమంత్రముల రూపము శ్రీదేవియే అని అర్థము.

మంత్ర మనగా మననము చేయుకొలదీ రక్షించునది అని అర్థము. మంత్రము శబ్ద స్వరూపము. శబ్దము శ్రీదేవి స్వరూపమే. ఏ దేవతా రూపమైననూ శ్రీదేవి వలననే ఏర్పడినది. నామము శబ్దమునుండి ఏర్పడినదే. నామ రూపములతో కలది మంత్రదేవత. అట్టి దేవతకు ఆధారము శ్రీదేవియే. మన వాఙ్మయమున ఏడుకోట్ల మంత్రములు గలవని తెలుపబడినది. అన్ని మంత్రములూ శ్రీదేవి రూపములే అని తెలియవలెను. బంగారు ఆభరణములు ఎన్ని యున్ననూ వానికి మూలము బంగారమే కదా! అట్లే మంత్ర రూపములు, మంత్రములు ఎన్ని యున్ననూ అవి అన్నియూ శ్రీదేవి రూపములే.

ప్రకృతియైన శ్రీదేవి నుండి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, ఇంద్రాది అష్ట దిక్పాలకులు, నవగ్రహములు, ఆదిత్యులు, రుద్రులు, వసువులు, పంచభూతములు, జీవులు ఏర్పడినవి. వీనియందు దేని నారాధించిననూ దానికి మూలము శ్రీదేవియే. శ్రీదేవి ఆరాధనము ఈ విధముగ అన్ని ఆరాధనములకు మూలమై యున్నది.



# 205. 'సర్వ యంత్రాత్మికా'

**అ**న్ని యంత్రముల మూలము శ్రీదేవి అని అర్థము.

యంత్రములు సృష్టి వ్యూహములు. అవి వరుసగా బిందువు, వృత్తము, త్రిభుజము, చతుర్భుజము, పంచభుజము, షష్ఠభుజము, అష్టభుజము ఆదిగా ఏర్పడుచుండును. ఈ వ్యూహముల నుండియే శ్రీదేవి సమస్త సృష్టిగ ప్రకాశించును. యంత్రముల రూపములు కూడ పై తెలిపిన ఆకారములతో యుండును. ఈ యంత్ర వ్యూహము లన్నియూ కూడ శ్రీదేవి నుండియే దిగివచ్చినవి. మంత్రము లాధారముగ యంత్రము లేర్పడును. యంత్రము లాధారముగ మంత్రములు సిద్ధించును (అవతరించును). ఈ యంత్రములకు ఆత్మగ శ్రీదేవియే యున్నది. కావున ఆమె యంత్రాత్మికా. శబ్దముల ద్వారా యంత్రముల నుండి అవతరించి రూపు కట్టుకొనునది కూడ శ్రీదేవియే. అందువలన ఆమె మంత్ర స్వరూపిణి. మంత్రము రూపముగను, యంత్రము ఆత్మగను కూడ విరాజిల్లు చున్నది.



# 206. 'సర్వతంత్రరూపా'

సర్వ తంత్రముల స్వరూపము కూడ శ్రీదేవియే అని అర్థము.

తంత్రమనగా శాస్త్రీయ విధానము. శాస్త్రీయ మనగా శాస్త్ర విధాన జ్ఞానము. ఏది ఎట్లు చేయవలెనో, అట్లు చేసిననే అది సిద్ధించును. అట్లు చేయనిచో సిద్ధింపదు. దీనినే శాస్త్ర విధి యందురు. ఏ పనికైనను శాస్త్ర విధాన మున్నది. ఇది తెలియుట జ్ఞానము. తెలిసి చేసినచో కృతకృత్యులగుదురు. తెలియక చేసినచో వైఫల్య ముండును.

పై విధమగు శాస్త్ర విధి తంత్రము. తెలిసి చేయుట ఒక పద్ధతి. చేయుచూ తెలుసుకొనుట మరియొక పద్ధతి. మంత్రమును ఎట్లు మననము చేయవలెనో తెలియవలెను. యంత్రమును ఎట్లు పూజింపవలెనో తెలియవలెను. ఇట్లు తెలిసి ఆరాధించుటను తంత్ర మందురు. యంత్రములను శాస్త్ర విధిగ ఆరాధించినచో మంత్రము సిద్ధించి తద్దేవతా స్వరూపము ప్రత్యక్షమగును. తోచినట్లు చేయుట వలన సిద్ధి కలుగదు.

ఋషులు మంత్రములను, యంత్రములను గ్రహించి అనేకానేక దేవతా శక్తులను సిద్ధింప చేసుకొనినారు. సద్గురువు సాన్నిధ్యమున సకల దేవతలు కొలువై యుందురని తెలుపుటలోని రహస్య మిదియే. వారు విధి విధానముగ ఆరాధనము గావించి వివిధములగు దేవతలను సిద్ధింప జేసిరి. శ్రీ రామకృష్ణ పరమహంస సర్వమత వ్యవస్థాపకులను కూడ ఆయా మార్గముల ఆరాధించి

సిద్ధింప చేసుకొనెను. ఋషులు, సద్గురువులు మంత్ర యంత్ర స్వరూపములను కూలంకషముగ గ్రహించి తంత్రముల నందించి నారు. నిర్దిష్టమగు ఈ తంత్ర శాస్త్రము తెలిసినవారు వైజ్ఞానికముగ దేవతలను సిద్ధింపజేసికొను శక్తి కలవారై యుందురు. వారే పూర్వము మంత్ర యంత్రముల ద్వారా వర్షములను కురిపించుట, దేవతలను అవతరింపజేయుట గావించిరి. ఆకాశమున పయనించుట, కొండ లను మోయుట, నదీ గమనములను మార్చుట కూడ చేసిరి.

తంత్రమునకు నిష్ఠ, నియమము, ఏకాగ్రత, దీక్ష, మనోబలము, మనోనిర్మలము ఇత్యాది గుణములు ముఖ్యము.

సర్వ తంత్ర స్వరూపిణియైన శ్రీదేవి ఈ తంత్ర శాస్త్రముల కధిదేవత. ఆమె అధ్యక్షతనే మంత్రము, యంత్రము, తంత్రము యున్నవి. మంత్రమును యంత్రముపై తంత్ర పూర్వకముగ ప్రయోగించుట సిద్ధి నీయగలదు. ఈ తంత్ర జ్ఞాన మంతయూ శ్రీదేవి అనుగ్రహము కలవారికి శీఘ్రముగ సిద్ధించును. కాళిదాసు, తెనాలి రామకృష్ణుడు అట్టివారు. ఇటీవలి కాలమున శ్రీ రామకృష్ణ పరమ హంస అమ్మ అనుగ్రహమున సర్వతంత్రముల నెరిగెను. రామకృష్ణునికి తంత్రము నేర్పుటకై వచ్చిన తంత్రవేత్తలు అతడప్పటికే ఎరిగిన తంత్రమునకు దిగ్భ్రాంతి చెందిరి.

భక్తి పూర్వకముగ శ్రీదేవి నారాధించు వారికి సర్వమూ హస్తగత మగును. మంత్రము, తంత్రము, యంత్రము వారి కధీనమై యుండును.

కూడ అతని కన్నులలోనికి చూచి తన్మయత్వము చెందుచూ చేష్టలుడిగిన వారైరి.

అమ్మ కన్నులు సర్వశక్తి సంపన్నము. కన్నులతోనే ఆమె సమస్త సృష్టిని గావించి పోషించుచున్నది. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు ఆమె కనుసన్నలలో మెలగు భృత్యులు. ఆమె కన్నుల నుండి ప్రేమ, వాత్సల్యము, జ్ఞానము ప్రసరించు చుండును. అట్లే దుష్టుల నరికట్టుటకు రౌద్రము, అంత్య కాలమున కాలాగ్ని కూడ ప్రసరించును.

కన్నులు జీవ చైతన్యమునకు ముఖద్వారములు. జీవులు ఒకరి నొకరు కన్నులలోనికి చూచియే పలుకరించుకొను చుందురు. ఇరువురి జీవుల మధ్య ప్రధానముగ కన్నుల ద్వారముననే చైతన్యము పరస్పరము వ్యవహరించుట జరుగును. కన్నులే జీవ చైతన్యమునకు ముఖ ద్వారములు. సర్వప్రపంచమును కన్నులతోనే దర్శింతుము. దివ్య లోకముల దర్శనము కూడా దివ్యమగు కన్నుల ద్వారముననే కలుగును. విచ్చుకున్న కన్నులు సమస్తమును దర్శించగలవు. ఆ దర్శనమున పారదర్శకత్వ ముండును. అమ్మ కన్నులు పారదర్శకములు. పారమును చూడగలవు. పరమును చూచు కన్నులు గనుక పరతత్త్వమును ప్రసరింప జేయుచుండును. పరతత్త్వమును కోరిన జీవులకు ప్రసాదించుచుండును. అమ్మ కన్నులను వర్ణించుట కాళిదాసాది మహాకవులకు కూడ అసాధ్యమైనది.

రాజీవ మనగా చేప అని కూడ అర్థమున్నది. రాజీవలోచనములు

అనగా చేప ఆకారమున నుండు కన్నులు. అమ్మకు 'మీనాక్షి' అని మరియొక నామ మున్నది. అది తరువాతి నామములలో వివరింప బడును.

రాజీవ మనగా జింక అని అర్థ మున్నది. కావున జింక కన్నుల వంటి కన్నులు కలది అని కూడ అర్థము. జింక కన్నులలో చంచలత్వము, బెదరు కనిపించును. బెదరుచూపులు సౌమ్యతను, స్త్రీత్వమును ప్రకటించును. సౌమ్యత్వము సత్వగుణమును ప్రకటించును.



# 309. 'రంజనీ'

**భ**క్తులను రంజింపజేయునది శ్రీమాత అని అర్థము. శివుని రంజింపజేయునని కూడ అర్థము.

పరమశివునే రంజింపజేసిన శ్రీమాత సృష్టి జీవులను రంజింప జేయుటలో ఆశ్చర్యమేమున్నది? శివుని తన తపస్సుచే రంజింపజేసినది. శివుడు ఉగ్రుడై దక్షయజ్ఞమును పరిసమాప్తి గావించి దేవతల యందు, సృష్టియందు విరక్తి కలిగి, ఏకోన్ముఖుడై తపస్సు జేసి సత్యమై నిలచెను. మరల తిరిగి సృష్టిలోనికి రాని విధముగ సత్యమందు స్థిరపడెను. అట్టి శివుని మెప్పించుట, అతని మనస్సును రంజింపజేయుట ఎవ్వరి తరము కాలేదు. అతనిని సమీపించుటకే భయపడిరి. అతడు తపస్సు చేయు చుండగ అతని చుట్టునూ కాలాగ్ని ఆవరణ మేర్పడినది. సమీపించుటకు కూడ అవకాశములేని రుద్రుని సంతసింపచేయుట ఎట్లు? ఎవ్వరునూ సాహసింపనైరి. హిమవత్ పర్వతరాజ పుత్రికగ మరల జనించిన సతీదేవి శ్రీమాతయే. ఆమె కౌమారముననే సహజముగ శివుని వరించినది. శివుడు తప్ప ఇతరము కోరనిది. శివుని మెప్పించి అతనికి అర్ధాంగి కావలెనని సంకల్పించినది. వలదన్ననూ వినలేదు. వేల సంవత్సరములు దృఢ సంకల్పముతో తపస్సు గావించి శివుని మెప్పించి రంజింప జేసి వివాహమాడెను. అందువలన శ్రీమాత రంజని అయినది.

రంజనీ ప్రజ్ఞ హృదయమున నుండును. హృదయమే రంజన స్థానము కూడ. జీవుల హృదయమందు కూడ శ్రీమాత ఉపస్థితయై

యున్నది. తోటిజీవులను సుఖపెట్టుట, ఆనందింపజేయుట, ఉల్లాసముగ నుంచుట– స్వభావముగ గలవారి యందు శ్రీమాత రంజని లక్షణము మేల్కొనును. అట్టి సత్పురుషుల దర్శనము, స్పర్శనము, సంభాషణము, ఇతర జీవులు కోరుచు నుందురు. కారణము వారి హృదయములు అతడు కారణముగ రంజించుట. ఇతరులను రంజింపజేయు లక్షణముగ శ్రీమాతయే సత్పురుషుల హృదయమున నున్నది. అట్లే జీవుల యందలి రంజన లక్షణము దేవతలను, దైవమును కూడ మెప్పించుటకు ప్రాతి పదికయై యున్నది.

అటు దైవమును, ఇటు జీవులను రంజింపజేయు శక్తి శ్రీమాతయే. జీవులు దైవమును చేరుటకు చేయు ఆరాధనము లిందు తోడ్పాటు కూడ గావించును. ఆమెను రంజింపజేసిన భక్తులు, ఆమె సహాయ సహకారములతో శివుని ఉన్ముఖత్వము కూడ పొందగలరు. శివునిపై ఆమెకు అట్టి అధికారము ప్రేమపూర్వకముగ శివుడే ఒసగెను.

స్ఫటికము వద్ద వున్న ఎర్రనిపువ్వు కాంతి స్ఫటికమును ఎర్ర వర్ణము గల దానినిగ జేయును కదా! అట్లే శుద్ధ స్ఫటిక సంకాశుడగు శివుని వద్ద వున్న శ్రీమాత అతనియందు తనను ప్రతిబింబింప జేయును. తనయం దతనిని ప్రతిబింబింప చేయును. శ్రీమాత రంజనీ లక్షణము అద్భుతము. మన యందు శివుని ప్రతిబింబింప జేయగలదు. అపుడు మనకు శివునిపై రుచి కలుగును. శివుని యందు మనలను ప్రతిబింబింప జేయగలదు. అపుడు శివునికి మనపై అనుగ్రహము కలుగును. ఇట్లు జీవుల యందు భక్తి బీజములు మొలకెత్తించుటకును, జీవులయందు దేవునికి అనుగ్రహము కలుగునట్లు చేయుటకును శ్రీమాతయే ఆధారము. ఆమె నిజమగు మధ్యవర్తి.

# 310. 'రమణీ'

భక్తులను రమింపజేయునది శ్రీమాత అని అర్థము.

ధర్మము నాచరించు వారిని రమింపజేయుట శ్రీమాత లక్షణము. ధర్మమును అతి విస్తారముగ వివరించిన వేదవ్యాస మహర్షి అత్యంత క్లుప్తముగ కూడ నిర్వచించెను. "ఇతరులు తనకేమి ఒనర్చిన బాధ కలుగకుండునో అది ఇతరుల కొనర్చకుండుట ధర్మము" అని ఒక వాక్యములో ధర్మమును తెలియబరచినాడు. మన మితరులతో ప్రవర్తించు రీతిని ఇతరులు మనపై చూపిన మన కెట్లుండును? హింసించుట, దూషించుట, దుర్భాషలాడుట, భేదములు కలిగించుట, విరోధములను ప్రోత్సహించుట, ఈర్ష్యపడుట, కూటనీతి నాచరించుట, కించపరచుట, దొంగిలించుట, మాట త్రిప్పుట, మడతలు పెట్టుట, త్రికరణముల యందు శుద్ధి లేకపోవుట, ఇతరుల సంపదల కాశపడుట, ఇత్యాదివి ఇతరులు మనపై నిర్వర్తించినచో మనకు దుఃఖము కలుగుట సహజము. కావున ఇట్టి ప్రవర్తనము మన మితరుల యందు చూపరాదు.

పై విధమగు ధర్మము నాచరించిన వారికి జీవితము భార మగును. హృదయమునందు కల్మషములు నిండియుండుటచే రమించు గుణము కోల్పోవుదురు. వారికి సహజమగు ఆనందము అదృశ్యమగును. తీవ్ర మనస్కులై చింతించుచు నుందురు. ఇట్టి వారికి ఆటలయం దాసక్తి యుండదు. పాటలయం దాసక్తి యుండదు. ఎవరైనను ఆనంద

ముగ నున్నచో ఈర్ష్యపడి వారి ఆనందమును హరింప చూతురు. ఇట్లు జరుగుటకు కారణము వారియందు రమణి అను శ్రీదేవి కల్యాణ గుణము అదృశ్య మగుటయే. శ్రీమాతను ఆరాధన చేయువారు భక్తితో, ఆర్ద్రతతో ఆరాధన చేసినచో కోపతాపములు, ఈర్ష్య అసూయలు, లోభ మోహములు, అశుభ భావములు అదృశ్యమగును. ఇది సత్యము. శ్రీసూక్తమున ఈ సత్యమును ప్రతిపాదించుట జరిగినది. ఆరాధనా మార్గమున అశుభమతి పోయి శుభమతి యేర్పడుట తథ్యము. పై విధమగు అవగుణములు పోవలెనని భావించిననూ పోవు. భక్తి శ్రద్ధలతో అమ్మను ఆరాధించినచో క్రమముగ శుభమతి అగుట తథ్యము. ఇట్టి శుభమతులు ఆడుచు పాడుచు, ప్రకృతి యందు ఆనందించుచు జీవనము సాగించు చుందురు. జీవితమున అలుపు సొలుపు వుండదు. పొరపొచ్చెములు లేక కలిసి మెలిసి అందరితోను పనిచేయుదురు. ఇట్టి వారియందు 'రమణి' అను శ్రీమాత ప్రజ్ఞ సన్నిధి నిచ్చుచుండును. అందరూ కోరునది ప్రాథమికముగ ఈ దశయే. శ్రీమాత రమణి, దేవదేవుడు రమణుడు.



# 311. 'రస్యా'

ఆస్వాదించుట కనువైనది శ్రీమాత అని అర్థము.

*'రసోవైసః'* అనునది శ్రుతి వాక్యము. రసానుభూతియే జీవుడు కోరునది. అనగా దైవానుభూతియే ప్రతి విషయమునందు జీవుడు కోరుచున్నాడు. రస మనగా అమితమగు ఆనందమని అర్థము. ఏ పని చేసిననూ ప్రతి జీవుడు అనుభూతి కొరకే చేయుచున్నాడు. తేనె టీగ పూవునందలి తేనెను గ్రోలుట మొదలుగ, సింహము ఏనుగు కుంభస్థలము కోరుట వరకు చేయు ప్రయత్నము లన్నియూ రసాను భూతికే. జంతువులన్నియూ రసానుభూతికై కదలుచున్నవి. వృక్షము లన్నియూ రసానుభూతికే పెరుగుచున్నవి. మానవులందరూ రసాను భూతికే ఆరాటపడుచూ పుట్టుచు, చచ్చుచు నున్నారు. ఎవరు ఏ పని చేసిననూ ఆ పనికి మూల కారణము రసానుభూతికై ప్రాకులాడుటయే. దైవమును తెలియగోరు వారు కూడ రసానుభూతి కొరకే తపస్సులు, దానములు, యజ్ఞములు, వ్రతములు ఆచరించు చున్నారు.

సృష్టి యందు కోటాను కోట్ల జీవులు ఒకే ఒక ప్రయత్నమున నున్నారు. ప్రయత్నమునకు మూలము రసాస్వాదనము. అందులకై బహిరంగమున ప్రయత్నించువారు, అంతరంగమున ప్రయత్నించు వారు అను రెండు తెగలుగ మానవులున్నారు. రసాస్వాదనమునకు ద్వయస్థితి తప్పనిసరి. ఆస్వాదించబడు వస్తువు, ఆస్వాదించు జీవుడు.

అద్వైత స్థితియందు రెండునూ ఒకటి యగును. అనగా ఆస్వాదించు వాడు తన్మయత్వము చెంది తనను తాను మరచును. కాన రసస్వరూపు డగును. అనగా దైవముతో ఏకత్వము చెందును. తా నుండడు, దైవమే వుండును. మరల తానేర్పడును. దైవమునే కోరును. ఇతరము లేవియూ కోరడు. అన్నిటి యందు దైవమునే చూచును, దైవమునే వినును, దైవమునే రుచి చూచు చుండును. తనయందు, సమస్తమునందు దైవమునే దర్శించుచు విశిష్టమగు అద్వైతమున నుండును. దైవమునందే యుండును గాని తా నున్నాడను మెఱమెఱ కూడ నుండును. అది లేనిచో ఆస్వాదించుట యుండదు కదా! పాయసము తినుచున్నప్పుడు ఆనందముండును. పాయసమే తానైనచో ఆనంద ముండదు. సూది మొనంత తారతమ్యత నిలుపుకొని ఆనందించును.

దేవుడు జీవుడు మధ్య సూది మొనయంత అంతరముండి, పెద్ద అగాధ మగు అంతరము వరకు ఏర్పరచునది శ్రీమాత. రసస్వరూపు డైన దైవమునకు, దాని నాస్వాదింపగోరు జీవునకు సంధానము కలిగించునది శ్రీమాత. ఆమెయే రసమధ్య. ఆస్వాదించు ప్రక్రియ కూడ ఆమెయే. యోగ్యత కలిగించునది ఆమెయే. సకల అనుభూతులకు కారణ మామెయే. పరతత్త్వమునకు వుండుటయేగాని వేరొక అనుభూతి లేదు. రసానుభూతి నుండి దుఃఖానుభూతి వరకు పొందు అనుభూతులు శ్రీమాతయే.

# 312. 'రణత్కింకిణిమేఖలా'

**శ**బ్దము చేయుచున్న చిరుగంటలు గల మొలనూలు గలది శ్రీమాత అని అర్థము.

బంగారు మొలత్రాడు మొలకు గట్టుట భారతీయ సంప్రదాయము. పట్టుదారము నుండి బంగారు మొలత్రాడు వరకు శక్త్యానుసారము అందరునూ ధరించు చుందురు. ఈ సంప్రదాయమునకు ఒక ఉత్తమ మగు విలువ గలదు. కంఠము నుండి కటి ప్రదేశము వరకు మధ్య కూటమని, కటి ప్రదేశమునుండి దిగువ భాగము శక్తి కూటమని ముందు నామములలో వివరింపబడినది. కంఠము పై భాగము వాగ్భవకూట మని కూడ తెలుపబడినది. వస్త్రధారణము ద్వారా కంఠాభరణము, మొలత్రాడు మానవ శరీరము యొక్క మూడు భాగములను సూత్రప్రాయముగ విభజించుటగ తెలియవచ్చును. శిరస్సు వెలుగు లోకమును సూచించును. అదియే సువర్లోకము. కంఠము నుండి కటి వరకు గల ప్రదేశము భువర్ లోకములను, దిగువ భాగము భూలోకమును సూచించును. అట్లే మానవుని యందు దివ్యత్వము శిరస్సునందు, మానవత్వము మధ్యభాగమందు, పశుత్వము దిగువ భాగము నందును అమర్చబడి యున్నదని తెలియవచ్చును.

పంచదశి మంత్రమున కూడ మూడు భాగములుగ ఆరాధించుట, ధ్యానించుట 85, 86, 87 నామములలో తెలుప

బడినది. వాగ్భవ కూటమునకు క, ఏ, ఈ, ల, హ్రీం అని ఐదు అక్షరములు తెలుపబడినవి. మధ్యకూటమునకు హ, స, క, హ, ల, హ్రీం అను ఆరు అక్షరములు తెలుపబడినవి. శక్తి కూటమైన కటి దిగువ భాగము స, క, ల, హ్రీం అను నాలుగు అక్షరములుగ తెలుప బడినది.

సత్పురుషుల భూలోకశక్తి అంతయూ కటి దిగువ భాగమగు మూలాధారముననే యుండును. అట్టివారు క్రియాశక్తిపరులై సంకల్పించిన కార్యములను అవతరింపజేయుదురు. అట్టి శక్తికూటము నకు మకుటమై, అలంకారప్రాయమై వుండునది శ్రీదేవి మొలనూలు, క్రతుబద్ధమైన ఆనందకరమగు శబ్దములు శ్రీదేవి నడుచు చున్నప్పుడు మొలత్రాటియొక్క చిరుగంటల నుండి వెలువడుచుండును. అట్లే క్రతు బద్ధమగు కార్యములు దివ్యపురుషుల హృదయమునందు దర్శింపబడి కార్యరూపము దాల్చుచుండును.

సంసారబద్ధులగు జీవులు ఈ మూడవ భాగముననే శక్తి కూటమున బంధింపబడి యుందురు. సంసార క్షయ మొనర్చి ఆత్మ సాక్షాత్కారము కలిగించు శ్రీదేవి కటిభాగము నారాధించుట సంప్ర దాయము. కటిభాగ మందలి మొలత్రాడు చిరుగంటల సవ్వడి శ్రీదేవి భక్తులకు వినిపించు చుండును. బాల మంత్ర ఉపాసకులకు ఈ అనుభవము సహజము. శక్తికూట మంత్ర భాగమైన సకల హ్రీం గురుముఖముగ ఉపదేశము పొంది ధ్యానించినచో శక్తి బంధము

నుండి విడివడ వచ్చును. అనుగ్రహకారిణియైన శ్రీమాత తన నారాధించు వారిని కూడ ఈ విధముగ ఉద్ధరించును.

పై విధానమగు ఉద్ధారణము పొందినవారు క్షరత్వము నుండి అక్షరత్వము లోనికి ప్రవేశింతురు. బాహ్యమునుండి అంతరంగము చేరుదురు. మూలాధారము నుండి హృదయమును చేరుదురు. క్రియా శక్తి నుండి జ్ఞానశక్తిలోనికి వ్యాపింతురు. మానవ శరీర మందలి మూడు భాగములు ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులకు అనుగుణముగ అమర్చబడి యున్నవి. శ్రీమాత అనుగ్రహమున మూడింటి యందును మానవుడు పరిపూర్ణముగ వ్యాప్తిచెందుట, బంధములు లేక త్రికూటముల యందుండుట ప్రధానము. ప్రాథమికముగ క్రియకు జ్ఞానమును జోడించి కర్మ బంధమునుండి విముక్తులగుట ప్రధానము గనుక శ్రీమాత మొలనూలు ఈ సందేశము నందించుచున్నది. ఆమె సందేశమే చిరుగంటల మ్రోతలు.



# 313. 'రమా'

రమ అనగా శ్రీ- వాణి అని అర్థము.

లక్ష్మి సరస్వతి తత్త్వముల కలయికను రమ తత్త్వముగ సంహితలు తెలుపుచున్నవి. లక్ష్మి అనగా సృష్టి సంపద. సరస్వతి అనగా వాక్ సంపద లేక విద్యా సంపద.

ఎక్కడ విద్య వుండునో అక్కడ లక్ష్మి వుండుట అరుదు. ఎక్కడ లక్ష్మి యుండునో అక్కడ సరస్వతి యుండుట కూడ అరుదే. అందు వలన లక్ష్మి సరస్వతులను అత్తా కోడళ్ళుగ పురాణములు పేర్కొను చుండును. అమిత ధనవంతులలో విద్యావంతులు అరుదు. అమిత విద్యావంతులలో ధనవంతులు అరుదు. ఇది లోక విదితము. ధన సంపాదనకు విద్యతో సంబంధము లేదు. లోక జ్ఞానమున్న చాలును. లోక జ్ఞానము కలవారు ధనవంతులు కాగలరు. విద్య మేధస్సునకు సంబంధించినది. మేధాబలమునకు అధిష్ఠాన దేవత సరస్వతి. విద్య యందు రతిగొనువారికి సంపద యందు మోజు ఉండదు. సంపద యందు మోజు గలవారికి విద్యయందు ఆసక్తి యుండదు.

సంపద, విద్య ఒకచోట వుండుట వైభవము. ఈ వైభవము శ్రీదేవి అనుగ్రహము. యోగుల యందు కూడ భోగము గలవారు గలరు. శ్రీకృష్ణుడు "సానపట్టిన భోగి, రాజయోగి", అని అన్నమాచార్యుడు కీర్తించినాడు. యోగమునకు భోగము అడ్డురాదు. రాజయోగమున భోగ మనుమతింపబడినది. యోగము నివృత్తి మార్గము కాదు గనుక

సౌకర్యము లుండవచ్చునని మాస్టరు సి.వి.వి. గారు బోధించినారు. జనకాది రాజర్షులందరూ కూడ వారి జీవితమున దివ్యభోగము ననుభ వించిన వారే. తెనాలి రామకృష్ణుడు, శ్రీనాథ మహాకవి, శ్రీకృష్ణదేవ రాయలు ఇటీవలి కాలమున విద్యా సంపదలను పరిపూర్ణముగ అనుభవించి దివ్యపథమున నిలచినారు. ఇట్టి జీవితము లన్నియూ కూడ లక్ష్మీ సరస్వతుల సంయోగమే. (గృహము నందు అత్తాకోడలు అన్యోన్య భావము కలిగియున్నచో ఆ గృహము స్వర్గమే కదా!)

విద్యావంతులకు సంపదను గూర్చి హీనభావ ముండుట తగని పని. అట్లని సంపదల వెంటబడుట కూడ తగని పనియే. జీవుల హృదయములను రంజింపజేయుచు విద్య ఆధారముగ యోగముగ యోగమున నిలచిన వారికి సంపదలు కూడ దరి చేరును. యోగ శాస్త్రమున సత్సంపద చేరుటకు ఒక నుపాయము తెలుపబడినది. దొంగబుద్ధి, లేకితనము లేనివాని వద్దకు సంపదలు నడచి వచ్చునని పతంజలి మహర్షి నిర్ధారించినాడు.

రమ పథము ఆనందదాయకము. దైవ యోగముతోపాటు, ధనకీర్తి యోగ ముండుట అమ్మ వైభవమే.



# 314. 'రాకేందువదనా'

**పూ**ర్ణ చంద్రునివంటి ముఖము కలది శ్రీమాత అని అర్థము.

'ఇందు' అనగా చంద్రుడు. 'రాకా'పూర్ణిమ తిథి అంత్య భాగము. 'రాకేందువదనా' పున్నమి చంద్రుని వంటి ముఖము. పున్నమి చంద్రుడు ఆరోగ్యవంతులకు ఆహ్లాదము నిచ్చును. ప్రశాంతమైన మనస్సు గలవారికి పున్నమి చంద్రుడు దివ్యానుభూతులను కలిగించగలడు. పౌర్ణమి తిథి అంతమున చంద్రుడు సూర్యునికి పూర్ణముగ ఉన్ముఖుడై యుండును. అందువలన చంద్రుని యందు సూర్యుని కాంతి పరిపూర్ణముగ ప్రతిబింబించును. పున్నమి తిథియందు కూడ ఈ సమయము పూర్ణ చంద్రుని స్థితి. ఈ సమయమునకు ముందుగాని, వెనుకగాని చంద్రుని కాంతి మిక్కుటమై అతిశయించి వుండదు. పౌర్ణమి తిథి కాలమంతయు పౌర్ణమి చంద్రుడని పిలువబడుచున్ననూ నిజమగు పూర్ణస్థితి రాకా సమయమే.

'రాకా' కాలమును దర్శించుటకు పౌర్ణమి తిథి అంతము, బహుళ పాడ్యమి ప్రారంభము చంద్రుని చంద్రకాంతిని దర్శింపవలెను. చంద్రుడు ప్రతిబింబించు మనోప్రజ్ఞ. సూర్యుడు ఆత్మప్రజ్ఞ. మనస్సు నందు ఆత్మప్రజ్ఞ పరిపూర్ణముగ ప్రతిబింబించు శుభసమయమే రాకా సమయము. ఈ సమయమునందే సత్పురుషులకు దివ్యదర్శన ములు జరుగుచుండును. దివ్యపురుషులను దర్శించుటకు కూడ ఇది తగిన సమయము. 'రాకా' సమయమునకు ఆరు గంటల పూర్వము

నుండి ఆరుగంటల ఉత్తరభాగము వరకు సత్సాధకులు దివ్యపురుషుల దర్శనము చేయుటకు అవకాశమున్నది. అట్టి మహిమ కలది రాకా.

శ్రీమాత ముఖమునందు ఎప్పుడునూ రాకా స్థితియే యుండును. ఆమె ఎల్లప్పుడునూ కామేశ్వరుని దర్శించుచుండు కామేశ్వరి. పూర్ణ దర్శనము కలిగి యుండును. ఆమె 'కామేశ్వరీ ముఖాలోక'. ఆమె యందు అన్యచింతన యుండదు. అనన్య చింతనమే. ఆమె 'సతత యుక్త'. కామేశ్వరునితోనే కలిసి యుండును. ఆమె ముఖ దర్శనమున కామేశ్వరుని దర్శనము కూడ జరుగును. మరొక విధముగ కామేశ్వరుని దర్శించుట వలను కాదు. కామేశ్వరుని దర్శనము కామేశ్వరీ ముఖ ద్వారముననే జరుగును. అందులకే ముఖము నారాధించుట. వంగ దేశమున ఈ సంప్రదాయము హెచ్చు. వారు కేవలము శ్రీమాత ముఖమునే ఆరాధింతురు. ముఖమే ప్రధాన భాగము.

కామేశ్వరుని సాన్నిధ్యము వలన ఇనుమడించిన కాంతి, అందములతో కూడిన శ్రీమాత ముఖమును ఆరాధించినపుడు భక్తుడు పరవశించును. అనగా పరమునకు వశు డగును. తన్మయు డగును. అనగా తాను లేక తత్ మాత్రమే యుండును. (తత్ + మయము = తన్మయము) ఇదియే సమాధిస్థితి. తాను కరిగిన స్థితి. ఇట్టి సమాధి స్థితి కలిగించు అపూర్వమగు నామము 'రాకేందువదనా'.



# 315, 316. 'రతిరూపా రతిప్రియా'

**ఈ**శ్వర రతి వలన ఇనుమడించిన అందమైన రూపము కలది శ్రీమాత అని అర్థము. రతిప్రియత్వ మామె లక్షణము.

సతతము కామేశ్వరునియందే యుండునది శ్రీమాత. అవ్యక్తమున తత్త్వమై వుండుట వ్యక్తమున కలసియుండుట అగుట చేత ప్రధానమగు రతి లక్షణము ఆమెదే. విడివడుట యుండదు. రతీదేవి ఆమె అంశయే.

అవ్యక్తమునందు ఆమె, ఆయన అను స్థితులు లేవు. ఆ స్థితి యందు వున్న తత్త్వమును ఆమె అనలేము. ఆయన అని కూడ అనలేము. రెంటికిని మూలమగు తత్త్వమది. కాలము ననుసరించి ఈ తత్త్వము రెండుగ ఒకే మారు ఏర్పడును. అపుడు మూలపురుషుడు మూలప్రకృతిగ, ధన, ఋణ ప్రజ్ఞలుగ ఏర్పడును. ప్రకృతి ఎనిమిది ఆవరణలు ఏర్పరచుకొనినపుడు కూడ అందు అంతర్హితమై పురుషు డుండును. కనుక శాశ్వతముగ ప్రకృతి పురుషులు కలిసే యున్నవిగాని విడివడుట ఎన్నడూ జరుగదు. వ్యక్తమై అష్టప్రకృతులుగ మూలప్రకృతి తొమ్మిది ఆవరణములుగ వ్యాపించునపుడు అందు అంతర్యామియై పురుష తత్త్వము వుండుచు నుండును. ఆమె యేర్పరచిన ప్రకృతి స్థితుల లోనికి అతడు ప్రవేశించుట వలననే అతనిని పురుషు డనిరి. పురము లన్నియూ ఆకారములే. అందు వసించువాడు పురుషుడు. ఆకారము లేక పురుషుని దర్శించుట దుర్లభము. పురుషుడు లేక ఆకార మేర్పడుట దుస్సాధ్యము.

అతడు 'అ'కారము. ఆమె 'ఈ'కారము. సృష్టి అంతయూ ఈ రెండు అక్షరముల రసాయనమే. ఆమె యందు ఆయనను దర్శించుట పూర్ణదర్శనము. ఆయన యందు ఆమెను దర్శించుట కూడ పూర్ణ దర్శనమే. విడదీయరాని రెంటిని విడదీసి చూచుటకు చేయు ప్రయత్న మంతయూ వికారమే. చూచువానికి చూపు కలిగించునది శ్రీమాతయే. దివ్యదృష్టి కూడ శ్రీమాత శక్తియే. చూచువాడు తా నున్నాను అని భావించుటకు ప్రాతిపదికయే శ్రీమాత యైనపుడు ప్రకృతి రహితమగు దానినెట్లు చూడగలడు? చూచువానియందు ప్రకృతి పురుషు లున్నారు. చూడగోరిన తత్త్వమునందు కూడ వారిరువురును ఏకమై యున్నారు. అంతయూ ప్రకృతియే అని భావించువారు ఎంత అజ్ఞానులో, ప్రకృతి కతీతమగు తత్త్వమును చేరెదనను వాడు కూడ అంత అజ్ఞానియే. సంకల్పమే ప్రకృతి యైనపుడు తత్త్వము చేరెద నను సంకల్పము ప్రకృతి కాదా! అట్లనుకొనుట అందలి రహస్య మేమనగ పదార్థమయమగు ప్రకృతి నుండి పరమార్థ మయమగు మూల ప్రకృతిని చేరెద ననుటయే బహిరావరణముల నుండి ప్రకృతి యొక్క దివ్యము, అమృతము అగు అంతరావరణలోనికి ప్రవేశించి మూలప్రకృతియై పరమేశ్వరుని అంటి యుండవచ్చును. ఇట్లు తిరోధానమున ఆత్మ మూలమును చేరుటకు రతి ప్రధానము. భక్తి ప్రాథమికమగు రతియే. దైవమునం దనురక్తిగ భక్తి మారినపుడు దివ్యరతి కలుగును. అపుడు అహర్నిశలు కలసి యుండుటకే ప్రయత్నము జరుగును. నిజమునకు కలసియే యున్నాడు. కావున కలిసియే వున్నాడని తెలియును. రాధాకృష్ణ తత్త్వమిదియే. అర్ధనారీశ్వర రూప మిదియే.

# 317. 'రక్షాకరీ'

**ర**క్షణ కలిగించునది శ్రీదేవి అని అర్థము.

అజ్ఞాన మున్నంతకాలము రక్షణ యుండదు. పూర్ణ జ్ఞానియే భయము తొలగిన వాడగును. భయము కలిగిన వారికే రక్షణ అవసరము. వారి భయకారణ మజ్ఞానమే. భయము, భయకారణము తొలగుటకై ఆరాధన. దైవము నారాధించుట వలన భయము తగ్గు చుండును. దివ్యజ్ఞానము పొందుచుండుట వలన మరికొంత భయము తొలగును. పరిపూర్ణమగు భక్తి గలవారికి నిర్భయస్థితి యుండును. జీవులలో ప్రహ్లాదు డట్టివాడు. అతడి భక్తి పరిపూర్ణము. అతడు పూర్ణజ్ఞాని. పరమ యోగికూడ. ఎట్టి రాక్షస కృత్యములకు భయపడక శ్రీహరి యందు నిలచినవాడు.

మాయను దాటినవారే భయమును దాటినవారు. మాయను దాటుట జీవుని కసాధ్యము. అనుగ్రహ మున్నప్పుడు మాయ ప్రసరింపదు. అనుగ్రహమునకై ఆరాధనమే మార్గము. అనన్య చింతనమే మార్గము. మాయను పడరాదు అని భావించుట కన్న దైవస్మరణ చేయుట మంచిది. తెలియని భయములకు కారణము వెనుక చేసిన తప్పులే. చేసిన తప్పులు గుర్తుండవు. కాని తత్ఫలమగు భయ ముండును. దైవస్మరణతో భయమును దాటవచ్చును.

రక్షణ కలిగించుటలో దైవముకన్న మించినది లేదు. ఎంతటి

దురాచారుడైననూ దైవస్మరణ మార్గమున మృత్యు భయమును కూడ దాటగలడు. సంసార భయమును దాటగలడు. రక్షణ కల్పించుటలో తల్లికన్న ప్రధానమైన వారెవరూ లేరు. ఆమె రక్షక శక్తియే అవతార మూర్తులుగా దిగి వచ్చుచుండును. ఆ రక్షక శక్తియే యోగీశ్వరులు, మునీశ్వరులు వాహికగ రక్షణ కోరువారి కందును. అవతరించిన రక్షక శక్తులలో అత్యుత్తమము రామశక్తి. రాముడు రక్షకుడు. అతడు సర్వ జగద్రక్షకుడు. అతడు ఆపన్నులను రక్షించువాడు. రక్షక శక్తియే నిజమగు రాజశక్తి. శ్రీమాత రాజరాజేశ్వరి. అనగా రాజ రాజునకు కూడ ఈశ్వరి. చక్రవర్తులకు కూడ రక్షణ కల్పించునది. అట్టి శ్రీమాతను రక్షణ కోరుట ప్రధానము. ఇతరమగు రక్షణముల కన్న దైవీ రక్షణమే శ్రేష్ఠము.

రక్షణకోరి భయము కారణముగ దైవము నారాధించుట కలియుగ ధర్మము. భక్తి లేనిచోట భయమే కారణమై ఆరాధనలు సాగును. రక్షింపబడుటకు జీవుల కారాధనము శ్రేయస్కరము. ఆరాధ నమే సాధనముగ శ్రీమాత ఎట్టివారికైననూ రక్షణ మిచ్చును.



# 318. 'రాక్షసఘ్నీ'

**రా**క్షసులను చంపునది శ్రీమాత అని అర్థము.

రాక్షస శక్తులు సృష్టి స్థితులకు వ్యతిరేకముగ ప్రవర్తించు చుండును. చీకటి అను అజ్ఞానమును పెంపొందించు చుండును. సృష్టికి ఆటంకములు కలిగించు చుండును. వృద్ధికి కూడ ఆటంకములు కలిగించును. సృష్టికి పూర్వము నుండి గల చీకటి సృష్టిని అనుమ తింపదు. చీకటిగ నున్న చోటులో వెలుగునకు తావివ్వదు. ఇది రాక్షస శక్తి లక్షణము. ఈ శక్తి అధర్మము నాశ్రయించి బలముగ నుండును. సద్భావములు కలుగనివ్వదు. సద్భాషణము కూడ అనుమతింపదు. సత్కార్యములను భగ్నము చేయుచుండును. సృష్టికే వ్యతిరేకముగ నుండును గనుక సృష్టియందు పుట్టిన జీవులను అమితముగ బాధించును. భగవంతుని అవతారము లన్నియూ రాక్షసులను నిర్జించుటకే ఏర్పడినవి. నారాయణ స్మరణమున నిలచి సృష్టి నిర్మాణమునకై సంకల్పించిన బ్రహ్మదేవుని జ్ఞానము సోమకుడను రాక్షసుని హరించెను. అప్పుడు దైవము మత్స్యావతారము ధరించి చీకటి యను మహాసముద్రమున దాగియున్న రాక్షసుని సంహరించి వేదములను బ్రహ్మ కందించెను. అట్లు సృష్టి ఆరంభము నుండి నేటి వరకు రాక్షస శక్తులు తమవంతు అశాంతిని సృష్టించుచునే యున్నారు. వరహావతారమున హిరణ్యాక్షుని చంపుట, నరసింహావతారమున హిరణ్యకశిపుని చంపుట, వామనావ

తారమున బలిని దమించుట జరిగినది. పరశురామావతారమున రాజుల రూపమున నున్న రాక్షసుల నందరిని చంపుట జరిగినది. అయిననూ రాముని కాలమునకు మరల రాక్షసత్వము పుట్టుకొచ్చినది. శ్రీరాముడు లెక్కకు మిక్కుటముగ రాక్షసులను సంహరించినాడు. అయిననూ కృష్ణావతార సమయమునకు మరల రాక్షస శక్తి ఉద్భవించి నది. కల్కియై మరల రాక్షసులను సంహరించిననూ మరల రాక్షసులు పుట్టక మానరు. కావున రాక్షసులు శాశ్వత కథలో ఒక భాగము.

రాక్షసులను సంహరించుట, నిర్జించుట, పరాభవించుట వలన ప్రయోజనము లేదు. అవి శాశ్వత శక్తులు. ప్రతి జీవి యందును కూడ నిండియుండి అవకాశము కలిగినపుడెల్ల విజృంభింతురు. ఇట్టి వారిని చంపుకొనుచు వుండుట వలన పరిష్కారము లభించదు. దైవమును ఆరాధించుచు వారిని అధిగమించి జీవించుట యున్నది. సంహరింపక అధిగమించినచో రాక్షసుల మిత్రత్వము కూడ పొంద గలరు. యోగీశ్వరు లట్టివారు. వశిష్ఠుడు, అగస్త్యుడు, నారదుడు అట్టివారు. పై విధమగు ఉపాయమును యోగవిద్య ద్వారా అందించు నది కూడ శ్రీమాతయే. ఆమె యోగేశ్వరి.



# 319. 'రామా'

రమించు లక్షణము కలది రామా. రమించుట, రమింపబడుట శ్రీదేవి లక్షణము అని అర్థము.

ఈ లక్షణము ఆధారముగనే సమస్త సృష్టి, యోగము చెంది యున్నది. సూర్యమండలము నందలి సమస్త గోళములు పరస్పరము సమర్థించుకొనుచు చోటులో నిలచియుండుటకు ఈ శక్తియే ఆధారము. అట్లే గోళమునందు జీవులు వుండుటకు, జీవుల యందలి సమస్త అంగములు పరస్పరత్వము కలిగి పనిచేయుటకు రామా శక్తియే ప్రధానము. ఏకత్వమున వివిధత్వము, వివిధత్వమున ఏకత్వము రామా వైభవము.

ఒక వ్యక్తియందు గాని, వస్తువునందు గాని, పరిసరముల యందు గాని, సన్నివేశముల యందు గాని ఆసక్తి జనింపవలె నన్నచో ఈ శక్తియే కారణము. రామాశక్తి లేనివాడు దేనియందును రమించలేడు. భక్తులు భగవంతుని యందు రమించవలె నన్నచో యోగులు ధ్యానమున నిలువ వలెనన్నచో రామాశక్తి అవసరమై యున్నది. ఎవరు దేనియందు రమింతురో దానియందు ఆసక్తి కలిగి దానిని చేరుటకు ప్రయత్నింతురు. ఈ గుణము సృష్టియందు ప్రధానమగు లక్షణము. సృష్టించుట యందు ఆసక్తి కలిగినపుడు శ్రీమాత సృష్టి చేయును. అట్లే వృద్ధి చేయును. ఆమె ఆసక్తి అనాసక్తిగ మారినచో సమస్తము హరింపబడును. ఆమె ఆసక్తి తిరోధానము చెందినపుడు సృష్టి క్రమముగ లయమగు చుండును.

శివుని యందు అర్ధభాగమైన శ్రీదేవి జీవుల యందు ఆసక్తిగ యున్నప్పుడు క్రమముగ ఏడు లోకములు సృష్టించును. మరల ఆమె శివుని పర్యంకమున చేరదలచినచో లోకములన్నియు ఆమె యందు క్రమముగ అదృశ్యమగును. ఆమె శివుని యందు చేరి రమించును. శ్రీమాత గొప్పతన మేమనగ ఆమె సృష్టి నిర్మాణమున సృష్టియందు రమించుచునే యుండును. సృష్టి యందన్ని దశలయందు ఆనందించు చుండును. అట్లే శివునియందు కూడ రమించుచు శాశ్వతముగ నుండు నది శ్రీదేవి.

జీవులయందు ఈశ్వర స్థితి యగు సహస్రారము నుండి మూలా ధారము చేరుట వలన జీవులకు రూప మేర్పడుచున్నది. రూపస్థులైన జీవులు ప్రపంచమున వివిధమగు విషయములను ఆనందించు చున్నారు. వారికి ఈశ్వరుని యందు ఆసక్తి కూడ కల్పించునది శ్రీమాతయే. అపుడా జీవులను భక్తి మార్గమున నిలపి సహస్రారమును చేర్చుట కూడ శ్రీమాతయే నిర్వర్తించుచున్నది. అంతటిని ఆసక్తితో, ఆనందముతో, అమితానందముతో నిర్వర్తించు దేవి కనుక ఆమెయే రామా శబ్దమునకు తగినది. ఆమె తత్త్వమే రామకృష్ణాదులలో పదహారు కళలుగ దిగివచ్చుటచే శ్రీరాముడు, శ్రీకృష్ణుడు మునులకు, యోగులకు, స్త్రీలకు, సర్వజనులకు దర్శన మాత్రమున ఆనందము కలిగించినారు.



# 320. 'రమణలంపటా'

స్త్రీ స్వరూపిణి యగుటచే పురుషునితో క్రీడించుట యందు ఆసక్తి కలిగియున్నది అని అర్థము.

శ్రీమాత కామేశ్వరీ క్రీడాసక్తురాలు. ఆమె ఎల్లప్పుడును కామేశ్వరునితో క్రీడించుట, భోగించుటయందే ఆసక్తి కలిగియుండునది. రకరకములుగ లోకములను సృష్టిచేసి ఆ లోకముల యందు ఈశ్వరుని తోనే క్రీడించును. సృష్టి అవసరములను బట్టి సంభోగించును కూడ. ఆమెకు కామేశ్వరునితో రమించుటయందే ప్రధానముగ ఆసక్తి యుండును. తత్కారణముగ ఆమె రమణి. అతడు రమణుడు. రమించు టయేగాక, కామేశ్వరుని రమింపజేయును కూడ. రమింపచేయుట స్త్రీ గుణమే. పురుషుడు తానుగ రమించుట కుద్యమింపడు. పురుషుడు రమించుటకు ప్రేరణ స్త్రీ నుండి కలుగును. ఆమె రమింపజేసి రమించును. ఇది సృష్టి సత్యము.

తపస్సమాధి యందున్న ఈశ్వరుని కోరి రమించినది మాత పార్వతియే. ఆమె పరమేశ్వరుని మెప్పించుటకు భక్తియే ప్రధానమని భావించి, ప్రేమ భక్తిని ప్రదర్శించి శివుని మెప్పించి, శివునితో క్రీడించి నది. అనితర సాధ్యమైన కార్యము నిర్వహించినది. భక్తి, ప్రేమ ఒక దాని కొకటి అనురూపములని చాటి తెలిపినది.

యోగులు దైవముతో రమించుటకు శ్రీమాత రమణతత్త్వము

చాల ప్రధానము. భక్తి, ధ్యానము, జ్ఞానము భగవంతునితో చేరుటకు ఉపాయములైనను, భగవంతుని యందు ప్రేమ లేనిచో అతనిని చేర వలెనను ఆసక్తి, అమితాసక్తిగ నుండదు. అమితాసక్తి ప్రేమయొక్క పర్యవసానము. అట్టి ప్రేమ భగవంతుని యందు కలుగవలెనన్నచో, అది అనన్యమై నిలువ వలెనన్నచో శ్రీమాత వద్దగల రమణశక్తి ఆమెయే అనుగ్రహించవలెను. మాత అనుగ్రహము లేనిదే యోగులు, జ్ఞానులు, ఋషులు, భక్తులు పరమాత్మతో ఐక్యమును సాధించలేరు.

సామాన్య జీవులయందు కూడ రమణాసక్తియే వివిధ అంశము లపై మక్కువగ ప్రకటింపబడుచున్నది. కాని ఆ యా విషయముల వలన జీవులు లంపటమున పడుదురు. కాని శ్రీమాత అనుగ్రహ మున్నచో వారునూ ఆమెవలె రమణలంపటలు కాగలరు. అనగా రమణుని యందే లంపటములు కలిగి ఇతర లంపటములు లేక యుండుట.



# 321. 'కామ్యా'

**కా**మ్యా అనగా కోరబడునది అని అర్థము.

సృష్టికి మూలమే కోరిక. జీవుల కోరికపై, ప్రార్థనపై జీవుల కొరకు జగత్తంతయూ సృష్టింపబడినది. కోరుటకు కారణము జీవులలోని అసంపూర్ణతయే. సంపూర్ణము పరిపూర్ణము అగు వరకు జీవులకు కోరిక యుండును. కోరిక యున్నంతకాలము దానిని నిర్వర్తించుకొను బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, శరీరము ఆవశ్యకము లగును. కోటానుకోట్ల జీవుల అనేకానేక కోరికలను పరిపూర్తి గావించుటకే పరతత్త్వము నుండి శ్రీమాత సృష్టి సంకల్పముగ వ్యక్తమగును. ఆమె కరుణయే జీవులు పరిపూర్ణులగుటకు ఆధారము. ఆమె సంకల్పమే లేనిచో లోకసృష్టి లేదు. జీవులకు దేహ ఇంద్రియ మనో బుద్ధి సృష్టి లేదు. అహంకారము, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, శరీరము ఆధారముగ జీవులు ఇచ్ఛాపూర్ణము గావించుకొనుచు అనుభవమును, అనుభూతిని పొందుచు ముందుకు సాగుచుందురు. అనగా పరిణామము చెందుచు పరిపూర్ణత వైపునకు నడతురు.

ఏ విషయమున అసంపూర్ణత యున్నదో ఆ విషయములయందు జీవులకు కోరిక కలుగును. కోరబడిన విషయమును పొందుటకు తదనుగుణమైన జ్ఞానమును పొందును. అట్టి జ్ఞానమును క్రియా రూపమున నిర్వర్తించుచూ ఒక్కొక్క కోరికను పూరించుకొను చుండును.

ఇట్లు అన్నపానీయాదులతో మొదలిడి జీవుడు దేహపోషణమును పొందుట, ఇంద్రియార్థముల ద్వారా ఇంద్రియ పరిపూర్తి గావించు కొనుట, మనోభావముల ననుసరించి భావ పరితృప్తి గావించుకొనుట అట్లే బుద్ధి లోకములను లేక వెలుగు లోక విషయములను తెలియ గోరుట; అటుపైన యోగము, ధ్యానము, జ్ఞానము అనుచు తనను, దైవమును తెలియకోరుట క్రమముగ జరుగును. తన నిజస్థితి తనకి తెలిసినపుడు తాను పరిపూర్ణు డగును. నిజస్థితి తెలియుటగ అనగా తాను ఉండుట అనగా ఏమో తెలియుట. అట్లు తెలిసినవానికి ఇక వుండుటయే వుండును. అదియే సమాధి. అదియే పరమాత్మ స్థితి. ఇంత కార్యక్రమము నడిపించి జీవులను పరిపూర్ణము చేయుటకు శ్రీమాత సృష్టియందు కోరబడు రూపముగ నుండును.



# 322. 'కామ కలారూపా'

**శి**వ పార్వతుల కళయే కామకల. అట్టి రూపము అర్ధనారీశ్వర రూపము. కామకలా రూప మనగా శివపార్వతులు ఒకరి నొకరు చేరియున్న రూపము.

సృష్టి అంతయూ ప్రకృతి పురుషుల సమాగమమే. స్థూలము నుండి అత్యంత సూక్ష్మస్థితి వరకు కూడ వీరిరువురును కలిసియే యుందురు. వీరి కలయిక చేతనే రూపము కూడ ఏర్పడుచున్నది. ఆమె కామేశ్వరి, అతడు కామేశ్వరుడు. ఒకరియం దొకరికి అమిత ఆసక్తి సహజముగ నుండును. నిజమునకు ఒకే తత్త్వము ప్రకృతి పురుషులుగ ఏర్పడినది. గనుక వారి నడుమ అట్టి ఆకర్షణ శాశ్వతమై యున్నది. ఒక తత్త్వము సూర్యతత్త్వముగను, మరియొక తత్త్వము చంద్రతత్త్వముగను భూమిపై వీరు రకరకములైన కళలను అహో రాత్రములు పంచుచున్నారు. పదహారు కళలతో ప్రకృతి తత్త్వము చంద్రకాంతిగ భూమిని పోషించు చున్నది. ఆ కళలన్నియూ సూర్యుడు ఆధారముగ తానందించినవే. చంద్రుడే లేనిచో భూమిపై అంకుర శక్తియే లేదు. అట్లే మూల ప్రకృతి లేనిచో జనించుట అనునదియే లేదు. సృష్టియే లేదు. పరతత్త్వము నుండి సంకల్ప మాత్రమున వెలువడిన మూల ప్రకృతి ఆ తత్త్వమును ఆధారముగ గొని సమస్తమును జనింప చేయుచుండును. రూపముల నేర్పరచుచున్నవి. కామకల ఆధారముగనే సమస్త రూపములు యేర్పడుచున్నవి. శివ శక్తుల సమాగమ ప్రజ్ఞ

ప్రధానమగు కళ. ఈ కళను సృష్టి యందు అన్ని రూపముల మూలముగ గుర్తింపవచ్చును.

ముందు తెలిపిన నామములో శ్రీమాత కోరబడునది అగుటచే కామ్యా అని తెలుపబడినది. తరువాత నామములో రూపము నందు గల కామకలను దర్శించుట తెలుపబడినది. సమస్తము నందును పుట్టినచోటు గుర్తించుటయే కామకలా ఉపాసనము. చేతల పుట్టుక భావములయందు గోచరించును. భావముల పుట్టుక త్రిగుణముల యందు గోచరించును. త్రిగుణముల పుట్టుక చైతన్యమున గోచరించును. చైతన్యము సత్యము నుండి ఉద్భవించినది. సత్‌చిత్ విలాసమే సృష్టి అంతయును. దీనినే కామకలా విలాస మందురు. ఈ కామకలా విలాసము సృష్టి అంతటను గోచరించవచ్చును. కేవలము స్త్రీ పురుషుల కామమే (లైంగిక చర్య) కామకల అని భావింపరాదు.



# 323. 'కదంబ కుసుమప్రియా'

**క**దంబ పుష్పముల యందు ప్రీతి కలది శ్రీమాత అని అర్థము.

కదంబ మనగా సిందూర వర్ణము అని ఒక అర్థము కలదు. కదంబ పుష్పములు గోళాకారము, సిందూర వర్ణము కలిగి యుండును. సిందూర వర్ణము యందు పసుపు సిందూరము, ఎఱుపు సిందూరము కూడ గలవు. ఈ వర్ణము భావలోక పవిత్రతకు చిహ్నము. భావ లోకమునందు పరిపూర్ణమగు పవిత్రత శ్రీదేవి సాన్నిధ్యము. ఈ వర్ణ తరంగములను ధ్యానించిన భావమాలిన్యములు నిర్మూలింపబడును. అపుడు బుద్ధి లోకము అందుబాటులో నుండును.

పవిత్రమగు కదంబ పుష్పముల వంటి మనస్సు గల వారందరూ శ్రీమాత ప్రీతిపాత్రులే. పవిత్రమగు మనస్సులే కదంబ కుసుమములు. వానియందే శ్రీమాతకు ప్రీతి. శ్రీమాతను పూజించుటకు కూడ ఈ వర్ణము పూవులను మిక్కుటముగ వాడుట సంప్రదాయము. అట్టి వర్ణ పుష్పములు పవిత్రములు గనుక వానితో చేయు పూజ వలన శ్రీమాత ప్రీతి చెందగలదు.

కదంబ పుష్పము యొక్క మరియొక ప్రత్యేకత ఆ పుష్పము యొక్క రూపము. గోళాకారరూపము కలిగిన పుష్పము కదంబము. సృష్టి యంతయూ గోళములుగనే ఏర్పడినది. జీవులు కూడ సహజముగ గోళాకారులే. గోళాకారము ప్రథమ రూపము. అందుండి క్రమముగ

వివిధ రూపములతో కూడిన శరీర మేర్పడును. గర్భపిండము గోళా కారముగనే యుండును. పుష్పముల యందు గోళాకార పుష్పము లుండుట అరుదు. అవియునూ సిందూరము వర్ణములో నుండుట మరింత అరుదు. అంతియే గాక కదంబ పుష్పము పరిమళములను కూడ వెదజల్లును. పరిమళము, పవిత్రత, సంపూర్ణత అను మూడు శుభలక్షణములు కలిగినది కదంబ కుసుమము. అట్టి కుసుమముల యందు శ్రీమాతకు ప్రీతి హెచ్చు. అట్టి గుణములు కలవారి యందు కూడ శ్రీమాతకు ప్రీతి హెచ్చు.



# 324. 'కల్యాణీ'

**మం**గళకరమైన వాక్కులను పలుకునది శ్రీదేవి యని అర్థము.

'కల్య' అనగా శుభాత్మకమైన వాక్కు. 'అణతి' అనగా శబ్దించునది అని అర్థము. శుభాత్మకమైన వాక్కులను శబ్దించునది కళ్యాణి.

మానవుడొక్కడే మాటాడువాడు. వాక్కు అతనికి మాత్రమే అనుగ్రహింపబడినది. వాక్కు రూపమున శ్రీదేవియే యున్నది. ఆమెయే పలికినచో మంగళకరముగ నుండును. వారినే సరస్వతీ పుత్రులందురు. వారి నుండి సరస్వతి ప్రవహించుచు నుండును. మలినములగు భాషణ ములు వారినుండి వ్యక్తము కావు. పరుషమగు వాక్కులు కూడ వ్యక్తము గావు. వారి భాషణము ద్వారా ఇతరులకు ప్రీతియే కలుగును గాని మరి ఏ విధమగు సంచలనము కలిగించదు. వారు కేవలము ప్రీతికే పలుకరు. వారి వాక్కున సత్యము కూడ యుండును. జ్ఞానము సహజ ముగ నుండును. భాషణమున దివ్యత్వము ఆవిష్కరింపబడును. వాక్కును ఎంత కళ్యాణముగ మానవుడు తీర్చిదిద్దుకొనునో అంతమేరకు అతని జీవితము కల్యాణమయ మగును. లౌక్యము, అసత్యభాషణము, పనికి మాలిన తెలివి వాక్కుల ద్వారా ప్రకటించువారు పతనము చెందుచు నుందురు.

వాక్కు సంకల్ప రూపముగ పరతత్త్వము నుండి వ్యక్తమగును. చతుర్ముఖ బ్రహ్మయందు ఇచ్ఛగ ప్రకటింపబడి సృష్టి నిర్మాణము

చేయును. విష్ణువుయందు జ్ఞానముగ ప్రకటింపబడి సృష్టి, వృద్ధి, రక్షణ చేయును. రుద్రుల నుండి ప్రకటింపబడి హద్దులు పెట్టుచుండును. వాక్కే ఇచ్ఛా, జ్ఞాన క్రియా శక్తులుగ ప్రకటింపబడుచున్నది. జీవు లన్నియును సంకల్పానుసారమే నడచుచున్నవి. సంకల్పములు వ్యక్తి గతములు గాక దివ్యమై యున్నచో జీవితములు కళ్యాణమయ మగును. లేనిచో మిశ్రమ ఫలితములను, దుఃఖములను కలిగించును.

కళ్యాణీ నామము అత్యంత శుభప్రదమైనది. వాక్కు కల్యాణ ప్రదము అని తెలిసినవారు కొందరే.



# 325. 'జగతీకందా'

**లో**కములకు మూలము శ్రీమాత అని అర్థము.

'కంద' అనగా మూలము. 'జగతీకందా' అనగా జగత్తునకు మూలము. 'జగత్' అనగా కదలికలు కలది అని అర్థము. నిత్యము కదలునది జగత్తు. జగత్తు నందు మార్పు సహజము. అంతయూ మారుచునే యుండును కాని మారుచున్నట్లు కనిపించదు. అదియే గమ్మత్తు. భూమి తిరుగుచున్నట్లు అనిపించదు. వాతావరణమున మార్పులు ఋతువుల ద్వారా సున్నితముగ జరుగుచుండును. ఏ క్షణమున మార్పు జరిగినదో తెలియదు. బీజము అంకురించుట, వృద్ధి చెందుట, మహా వృక్షముగ పుష్టించుట, ఫలించుట కాలక్రమమున జరుగుచున్ననూ స్థూలముగ తెలియును గాని సూక్ష్మముగ తెలియదు. అట్లే జీవుడు గర్భస్థుడగుట, పుట్టుట, పెరుగుట, బాల్యము, యౌవనము నడిమి వయస్సు, వార్ధక్యము వంటి మార్పులు ఏ క్షణమున జరుగు చున్నవో స్థూలబుద్ధికి తెలియదు. పగలు రాత్రి అగుట, రాత్రి పగలు అగుట కూడ స్థూలముగనే గుర్తించుచున్నాము. ఇట్లు సమస్తము మార్పు చెందుచుండగ సృష్టి గమనము తెలియుటకు మేధావులు సహితము తలక్రిందు లగుచుందురు. కాలము మడతలలో నున్న మార్పులు తెలియుట సులభము కాదు. ప్రకృతి కాలము ననుసరించి సమస్త సృష్టి చేయును.

శుద్ధ చైతన్యము నుండి ప్రజ్ఞా లోకములు, శక్తి లోకములు, పదార్థమయ లోకములు కాలమును నూతగ గొని శ్రీమాతయే నిర్మించు చున్నది. నిర్మించి వాటిని పూరించు చున్నది. కేవలము నిర్మించుటయే గాక వాటిని పూరించుట కూడ జరుపుచున్నది. నిర్మించుట, పూరించు టను కంద అను పదము సంకేతించుచున్నది. మూలములలో కంద మూలము ప్రత్యేకత కలది. మూలము లన్నియూ క్రమముగ వృద్ధి చెంది భూమిపైకి పెరుగును. వాని వృద్ధి దృశ్య గోచరము. కంద మూలము నుండి కందము అదృశ్యముగ పెరుగును. దృశ్యమానమగు ఈ జగత్తునందు అదృశ్యముగ చైతన్య పూరణము నిత్యము జరుగుచునే యున్నది. జగత్తు నెప్పటికప్పుడు నిత్యనూతనముగ పూరించుట శ్రీమాత ప్రత్యేక లక్షణము. అందువలన సృష్టియం దేదియు అయిపోవుట వుండదు. అంతరించుట యుండదు. అది కేవలము మానవుని మనస్సు నందే యున్నది.



# 326. 'కరుణారససాగరా'

**క**రుణారసమునకు సముద్రము వంటిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత దయ అపరిమితము. ఆమె అనుగ్రహము కలిగినవారు అమిత తేజోవంతులై, పరాక్రమవంతులై క్రియాశీలురై వుండగలరు. ఆమె అనుగ్రహమునకు హద్దులు లేవు. దరిద్రుని కుబేరుని చేయ గలదు. బంటుని చక్రవర్తిగ చేయగలదు. మూర్ఖుని జ్ఞానిగ మలచ గలదు. అసమర్థుని సమర్థునిగ తీర్చిదిద్దగలదు. విశ్వాసము వుండ వలెనేగాని అమ్మ కృపకు పాత్రులైనవారు అన్ని రంగముల యందు రాణించగలరు.

సగరులను రక్షించుటకు ఊర్ధ్వలోకముల నుండి ప్రవహించి అధోలోకములను చేరి వారి నుద్ధరించినది శ్రీమాతయే. అది ఆమె గంగా స్వరూపము. గంగ యనగ కేవలము అధోలోకమునకు ఊర్ధ్వము నుండి గమనము చేసిన చైతన్యమే కాదు. సగరులను ఉద్ధరించి ఊర్ధ్వ లోకములకు కూడ చేర్చినది. ఆమె గమనము ద్విముఖము. అందు వలననే గంగ అయినది. 'గ' అక్షరము గమనమునకు సంకేతము. గంగ ఉద్ధరించునది కూడ.

గంగ యందలి స్నానము జీవులను పవిత్రులను చేయుననుట సత్యము. సమస్త పాపములను హరించి పవిత్రులను చేయుటకే దిగి వచ్చిన పుణ్యనది గంగానది. మానవుడు మూర్ఖుడై గంగను అపవిత్రము

చేసిననూ అందు మునిగిన మూర్ఖుని పవిత్రుని చేయును. అదియే ఆమె దయకు ఉదాహరణము. శ్రీమాత దయను గూర్చి వర్ణించుట కెవ్వరికిని శక్యము కాదు. ఆమె కరుణ తరంగములు తరంగములుగ కన్నుల నుండి ప్రవహించుచునే యుండును. అందువలన ఆమె 'కరుణాతరంగితాక్షి'. ఆ ప్రవాహము సముద్రము వలె అపరిమితము.



# 327. 'కళావతీ'

**అ**రువది నాలుగు కళలు గలది శ్రీమాత అని అర్థము.

అరువది నాలుగు కళలు గూడిననేగాని కళావతి అని పిలుచుటకు సాధ్యపడదు. సృష్టియందు శ్రీమాత, శ్రీకృష్ణుడు మాత్రమే అట్టివారు.

ఈ అరువది నాలుగు కళలను గూర్చి 'చతుష్షష్టి కళామయీ' అను నామమున వివరించుట జరిగినది. (రెండువందల ముప్పది ఆరవ నామము - 236)



# 328. 'కళారూపా'

**క**ళల రూపమున ప్రకటింపబడునది శ్రీదేవి అని అర్థము.

'ఆలాప' మనగా మధుర ధ్వని. 'కళ' లనగా విద్యలని కూడ భావము. మధురముగా విద్యలను ప్రకటించునది శ్రీమాత అని తెలియ వలెను. విద్యలన్నియూ వికాసము కొరకే. అట్టి వికాసము మధురముగ సాగినచో తదనుగుణమైన ఆనందముకూడ ప్రకటింపబడును. విద్యా లేక కళ ప్రకటింపబడుచున్నప్పుడు, ప్రకటించువానికి దర్శించువానికి కూడ ఆనందము కలుగవలెను. వికాసము కలుగవలెను. ఇట్లు ఆనంద వికాసములు కలాపములుగ విద్యలు సాగవలెను. తన్మూలమున జీవులు చైతన్య స్వరూపులై ఆనందించుచు నుండవలెను. ఇది అంతయూ శ్రీమాత ప్రణాళిక. జీవుల నుద్ధరించు ప్రణాళిక యందు కళాలాపము ప్రధానకార్యమై యుండును. ఏ విద్యయూ లేని మానవుడు పశువు గాని పశువు. అట్టి వానిని వింత పశువు అని పెద్దలు నిర్వచించిరి. శ్రీమాత అనుగ్రహము వలన నోటియందు లాలాజలము మారినట్లు విద్యలన్నియూ ఊరగలవు.

కళాలాప అను పదమును కళ ఆలాప అని ముందు వివరించ బడినది. ఆ పదమును కం, లాలాప అని కూడ వివరించవచ్చును. 'కం' అనగా సృష్టికర్త లేక చతుర్ముఖ బ్రహ్మ. లాలాప మనగా లాలా జలమువలె ఊరునది. నోటియందు లాలాజలము అప్రయత్నముగనే

ఊరుచుండును. చతుర్ముఖ బ్రహ్మకు ఈ విధముగ ఇచ్ఛాశక్తిగ శ్రీమాతయే నిరంతరమై ప్రవహించు చుండును. నిజమునకు శ్రీమాత సంకల్ప ప్రవాహమునకు చతుర్ముఖ బ్రహ్మ వాహికయే గాని కర్త కాదు. చతుర్ముఖ బ్రహ్మను సంకల్పశక్తి భరించువానిగ నియమించి ఇచ్ఛా స్వరూపిణియై శ్రీమాత వ్యక్త మగుచుండును. భరించువాడు గనుక చతుర్ముఖ బ్రహ్మ సరస్వతి (ఇచ్ఛాశక్తి)కి భర్త యని కీర్తింప బడినాడు. భర్త అనగా భరించువాడని అర్థముగాని, యజమాని యని అర్థము లేదు. భరించువాడే తరించువాడు కూడ. సరస్వతిని భరించి సృష్టి భర్తయై చతుర్ముఖ బ్రహ్మ శాశ్వతకీర్తి పొందెను.

సత్పురుషులు, అవతారమూర్తులు భరించుట నిర్వర్తించి చూపించిరి. ఈ ఒక్క కారణముగనే వారు పూజ్యులైరి. భరించుటను బట్టియే పూజార్హత. భరించుటను బట్టియే తరించుట కూడ నుండును. శ్రీమాత ప్రప్రథమముగ ఇచ్ఛాశక్తియై చతుర్ముఖ బ్రహ్మనుండి వ్యాప్తి చెంది సమస్త సృష్టి నిర్మాణమును గావించినది. 'కళారూపా' అను నామము మహత్తరమగు నామము అని తెలియవలెను.



# 329. 'కాంతా'

'**కాం**తా' అనగా స్త్రీ, అందమైన స్త్రీ అని అర్థము.

సృష్టి యందు సౌందర్య మంతయూ శ్రీమాత సౌందర్యమే. పరతత్త్వమునకు ఏ లక్షణమూ లేదు. అది రూపమునకు కూడ అతీతమే. సంకల్పము అతని ప్రథమ రూపము. సంకల్పమే అతని నుండి భాసించినపుడు వెలుగై నిలచును. అటుపిమ్మట ఆ వెలుగు నుండి అన్ని రూపములు స్థూలము వఱకు ఏర్పడుచున్నవి. ఈ సమస్త రూపము లలో కమనీయరూపములుగ శ్రీమాత అవతరించుచున్నది. అన్నియూ శ్రీమాత రూపములే అయిననూ అందు కమనీయమగు రూపముగ ఆమె అధికముగ అవతరించి యున్నది. రూపముయొక్క కమనీయత్వ మును బట్టియే జీవులు ఆకర్షింపబడు చుందురు.

శ్రీరాముడు, శ్రీకృష్ణుడు అట్టి రూపములు గలవారు. వారి రూప కమనీయత ఎందరినో ఆకర్షించి యుద్ధరించినది. వారియందు పరిపూర్ణముగ శ్రీమాత స్థితిగొనుట వలననే అట్టి నిరుపమానమగు ఆకర్షణము అన్ని జీవులకు కలిగినది. శ్రీమాతయే జగన్మోహిని. మోహనరూపము ఉద్ధారణమునకు, పతనమునకు కూడ శ్రీమాత వినియోగించు చుండును. రాముని మోహనరూపమును చూచి ఎందరో తరింపగ, రాక్షస ప్రవృత్తి గల శూర్పణఖ రాక్షస వినాశనమునకు కారణమైనది. అట్లే సీత రూపమును మోహించిన రావణుడు కూడ

పతనము చెందెను. మోహమును జీవుల అవరోహణమునకు, ఆరోహణమునకు కూడ శ్రీమాత లీలాప్రాయముగ వినియోగించును.

శ్రీమాత కాంతా రూపము. సత్పురుషులను, సదాచార సంపన్ను లగు స్త్రీలను ఆశ్రయించి కూడ వుండును. అట్లే కొన్ని పర్వతములను, కొన్ని వృక్షములను, కొన్ని పక్షులను, కొన్ని జంతువులను, కొన్ని వస్తువు లను ఆశ్రయించి దర్శనము యిచ్చుచుండును.

కః అంత, కాంతకు నిర్వచనము. 'కః' అనగా బ్రహ్మ. 'అంతః' అనగా అతని లోపల వసించునది. బ్రహ్మము లోపల నుండి వ్యక్తమై చతుర్ముఖ బ్రహ్మను, ఇతర సృష్టి జీవులను నడిపించునది శ్రీమాతయే.



# 330. 'కాదంబరీప్రియా'

**కా**దంబరి యందు ప్రీతి గలిగినది శ్రీమాత అని అర్థము.

'కాదంబరి' యనగా మరిగిన పాల మీద వేడి మీగడ. ఈ మీగడ అన్న శ్రీమాతకు ప్రీతి హెచ్చు.

కాదంబరి పుష్పమన్న కూడ శ్రీమాతకు ప్రీతి హెచ్చు. శరత్ ఋతువునందు ఈ పుష్పము పరిపూర్ణముగ కాదంబరి వృక్షమునందు వికసించగ ఆశ్వయుజమున ఏడు వర్షపు చినుకులు పుష్పములపైన, వృక్షముపైన, వృక్షము చుట్టూ పడినపుడు కాదంబరి వృక్షము పుష్పములు ఆహ్లాదకరమగు సువాసనలు వెదజల్లును. ఈ సుగంధము తన్మయస్థితి కలిగించ గలదు. ఈ సుగంధ మనిన శ్రీమాతకు ప్రీతి ఎక్కువ. చందనము కన్న అధికమగు ప్రీతి కాదంబరి పుష్పగంధ మివ్వగలదు.

కాదంబరి పుష్పమునందు నడిబొడ్డున ఏర్పడు మకరందము తేనె వలె మధురముగ నుండి శ్రీమాత భక్తులకు తన్మయత్వమిచ్చుటకు వినియోగపడును. ఈ తేనెను స్వీకరించుట శ్రీవిద్యా ఉపాసకులకు పరిపాటి. కారణము ఈ తేనె యందు శ్రీమాతకు మక్కువ ఎక్కువ.

కాదంబరి పుష్పములను కుదువపెట్టి వాని రసమును పిండి కొంతకాలము పవిత్రమగు పాత్రలలో నుంచినపుడు ఆ రసము పులియును. అట్టి రసము సురాపానమువలె సాధకుని నాడీ మండలమును శాంత పరచును.

కాదంబరి పుష్పములను శ్రీమాత పూజకు వినియోగించుట శ్రేష్ఠము అని తెలియవలెను.

# 331. 'వరదా'

వరముల నొసగునది శ్రీమాత అని అర్థము.

సృష్టి సమస్తమును పరిపాలించునది శ్రీమాతయే కదా! బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు కూడ ఆమె వరముల నిచ్చుచున్నది. విపత్కర పరిస్థితులలో బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సైతము ఆమెను ప్రార్థించి వరములు పొందిరి. నారద మహర్షి శ్రీమాత ఎట్టి వరప్రదాతయో అద్భుతముగ తెలిపినాడు. శ్రీమాత హస్తము ఎప్పుడునూ వరద ముద్ర లోనే వుండునని, అది ఆమె సహజమగు ముద్రయని కీర్తించినాడు.

రాక్షసులైననూ, దేవతలైననూ శ్రీమాతకు సమానమే. భక్తితో కోరిన వారికి వరదానము చేయుటయే అమ్మవంతు. వరములు కోరు జీవులందరి కోరికలను తీర్చు వాత్సల్యమూర్తి ఆమె.

తొమ్మిది రోజులు శ్రీమాతను భక్తి శ్రద్ధలతో పూజించిన వారికి శ్రీమాత వరము నొసగునని వరాహ పురాణము పేర్కొనుచున్నది. శ్రీమాత నుద్దేశించి తొమ్మిది దినములు సమాధిలోనుండు సిద్ధులకు శాశ్వతముగ తన సాన్నిధ్యము నిచ్చునని పురాణములు తెలుపుచున్నవి.



# 332. 'వామనయనా'

**సుం**దరమైన కన్నులు కలది శ్రీమాత అని అర్థము.

అందమైన కన్నులు లక్ష్మీప్రదము. ఇట్టి కన్నులు కలవారికి సహజముగ ప్రేమ యుండును. ఉన్నత ఆశయములు ఉండును. గంభీరమగు భావము లుండును. శ్రీమాత కన్నులను ఆరాధించు వారికి ఈ దివ్య లక్షణములు దరి చేరును.

'వామ' అనగా ఎడమ అని కూడ అర్థము కలదు. అర్ధనారీశ్వర తత్త్వమున కుడికన్ను శివునిది కాగ ఎడమ కన్ను శ్రీమాతది. అంతియే గాక శివుని ఎడమ భాగ మంతయూ శ్రీదేవియే. ప్రజ్ఞకు పదార్థ మెప్పుడునూ వ్యతిరేకముగనే యుండును. వామ యనగా వ్యతిరేక మని కూడ అర్థమున్నది. 'శివ' తత్త్వము తూర్పునకు ప్రతీక కాగా, 'శ్రీ' తత్త్వము పశ్చిమమునకు ప్రతీక. పశ్చిమము నుండి తూర్పును చూచుట శ్రీ తత్త్వము. తూర్పున నుండి పశ్చిమమును చూచుట శివ తత్త్వము లేక పురుష తత్త్వము. శ్రీ, పురుషుని చూచుచు నుండును. పురుషుడు శ్రీని చూచుచు నుండును. ఎదురు బదురుగ నున్నప్పుడే ఒకరినొకరు ఆలాపనము చేసుకొనుటకు వీలుపడును.

శ్రీమాత పరమశివుని నుండి ఎడమ భాగముగ వ్యక్తమై, శివునికి ఎదురుగ కూర్చుండును. శివుడు సూర్యాత్మక ప్రజ్ఞ అయినపుడు శ్రీమాత చంద్రాత్మక ప్రజ్ఞ. శివతత్త్వమే శ్రీమాత యందు ప్రతిబింబించి సృష్టి

వెలుగులో నిలచును. ఎదురుబదురుగ నుండి సహకరించుకొనుట ఉన్నతమగు సిద్ధి. వ్యతిరేకించుటగా అది కనిపించునుగాని వ్యతిరేక మున సహకారము కూడ కలదు. ఉత్తరమున సప్తఋషులందరూ వుండగ అగస్త్యుడు దక్షిణమునకేగుట, ఉత్తరమునకు మరల పోకుండుట సమతుల్యము కొఱకే. భూమి సమతుల్యమునకు అగస్త్యుడట్లు చేసెను. అట్లే సమస్త సృష్టి సమతుల్యమునకు శ్రీమాత అట్లు చేసినది. ఆమె పశ్చిమమున చేరి మూలాధారమున నుండగ శివతత్త్వము సహస్రార మున నుండును. ఆమె మూలాధార నిలయ. శ్రీమాత పశ్చిమమును తన చూపులతో రక్షించుచు నుండును. అందువలన వామనయన.



# 333. 'వారుణీ మదవిహ్వాలా'

'వారుణీ'- రసపానముచే కలుగు మదముచే తన్మయత్వము చెందినది శ్రీమాత అని అర్థము.

వరుణుడు పశ్చిమమునకు అధిపతి. మిత్రుడు తూర్పున కధిపతి. మిత్రా వరుణులు అశ్వినీ దేవతలు. సృష్టి కధిపతులు. అర్ధనారీశ్వర తత్త్వములోని నరతత్త్వము మిత్రుడు కాగా, నారీ తత్త్వము వరుణు డగుచున్నది. మిత్రా వరుణులు సృష్టి తూర్పు పడమరల కధిపతులు. ఒకరు ప్రజ్ఞ మరియొకరు పదార్థముగ క్రమముగ లోకము లన్నియూ ఏర్పరతురు. మిత్రుడు పురుషుడు, అనగా వసించువాడు. వరుణుడు ప్రకృతి, అనగా పురుషునికి ఉపాధి లేక నివాసము. ఇట్లు అన్నిటి యందును వసనము, వసనమున కాధారమగు వాహనము గోచ రించును. ప్రకృతి పురుషు లీ విధముగ జీవసృష్టిని కావించుదురు.

పై కార్యక్రమములో వరుణుని పాత్ర విశిష్టమైనది. ఏడు లోకముల పదార్థమును క్రమముగ ఏర్పరచుచు పురుషునికి ఆవాసములను కూర్చును. అందు పురుషుడు వసించును. కార్య మంతయు వరుణునిదే. వరుణుని యందు శక్తి ప్రవాహముగ వారుణి యున్నది. వారుణి శ్రీమాతయే. పిండము నుండి మానవ దేహ మంతయూ నిర్మాణము చేయునది వారుణియే. మన సహస్రారము నుండి మూలాధారము వరకు వారుణీ ప్రవాహ ముండుటచే మనము భౌతికము వరకు

కొనిరాబడినాము. జీవునిగా మనము మిశ్ర తత్త్వమునకు (పురుషునకు) సంబంధించిన వారమే. మనకు ఏడు పొరల దేహము ఏర్పరచునది వారుణీ.

వసించు వానికి సుఖము నివాసమును బట్టి ఉండును కదా! దేహము సుఖము నివ్వనిచో జీవుడు సుఖముగ నుండలేడు కదా!

'మదవిహ్వల' యనగా తాదాత్మ్యము చెందిననూ విహ్వలురాలు కాదని భావము. సామాన్యముగ స్వాత్మానందమున వున్నవారు బాహ్య కారణములను మరతురు. స్వాత్మానందమున తన్మయత్వము చెందుచునే ఏమరపాటు చెందక సర్వమును నిర్వహించుట సామాన్యము కాదు. అది కేవలము శ్రీమాతకే సాధ్యము. భూమిని భరించుటలో ఆదిశేషువు, సృష్టిని భరించుటలో శ్రీమాత విహ్వలురు కారని పురాణములు వీరిరువురిని పొగుడుచున్నవి. అమితానందము, అప్రమత్తత ఒకదాని కొకటి విరుద్ధమగు స్థితులు. రెంటినీ ఏకకాలమున నిర్వర్తించుట అసామాన్యమగు విషయమని తెలియవలెను.



# 334. 'విశ్వాధికా'

విశ్వము కంటే అధికురాలు శ్రీమాత అని అర్థము.

విశ్వము శ్రీమాత సంకల్పము నుండే ఆవిర్భవించినది. శివ-శక్తి విశ్వమునకు అధ్యక్షులు. అధికులు కూడ. శివు డాధారముగ శక్తి సమస్త విశ్వమును సృష్టించి వృద్ధి గావించి మరల తిరోధానము గావించు చున్నది. అంతటికిని ఆమె అధికురాలు గనుక సృష్టియం దామెను ఆరాధించుట ఉత్తమము. ఆమె నారాధించునపుడు శివుని కూడ ఆరాధించినట్లే. ఎందువల ననగా శివు డవ్యక్తుడు, నిరాకారుడు. శివుని ఆకారమే శ్రీమాత. శివుని వ్యక్తరూపమే శ్రీమాత. అందువలన ఆమె ఆరాధన శివరూపము నారాధించినట్లే. ఆ రూపము మహాచైతన్య రూపము. అపరిమితమగు వెలుగు రూపము. చీకటికి ఆవల వెలుగు రూపము. అత్యధికమగు రూపము. అన్ని వెలుగులకు అన్ని రూపములకు ఆధారమగు రూపము.



# 335. 'వేదవేద్యా'

వేదములచే తెలియదగినది శ్రీమాత అని అర్థము.

శ్రీదేవి చింతామణి గృహమునకు నాలుగు దిక్కుల యందు నాలుగు ద్వారము లున్నవి. ఏ ద్వారము నుండైనను శ్రీదేవి గృహము నందు ప్రవేశించి దేవిని దర్శింపవచ్చును. నాలుగు ద్వారములు నాలుగు వేదములుగ తెలియవలెను. శ్రీదేవి గృహమును ప్రవేశించుటకు నాలుగు వేదములలో ఒక్క వేదమైననూ తెలియవలెను.

వేదములు నాలుగు. అవి వరుసగ ఋగ్వేదము, యజుర్వేదము, అధర్వణ వేదము, సామవేదము. ఋగ్వేదము తూర్పు ద్వారము; యజుర్వేదము దక్షిణ ద్వారము; అధర్వణ వేదము పశ్చిమ ద్వారము; సామవేదము ఉత్తర ద్వారము.

మనయందు కలుగు సంకల్పములు పుట్టినచోటు నెరుగుట ఋగ్వేదము నెరుగుట. సంకల్పమే సరస్వతి. సరస్వతి పరావాక్కుగను, పశ్యంతి వాక్కుగను, మధ్యమ వాక్కుగను, వైఖరి వాక్కుగను నిత్యము వ్యక్తమగు చుండును. సరస్వతి శ్రీదేవితో నున్నప్పుడు పరావాక్కు. సంకల్పమై స్ఫురించినపుడు జీవునికి తెలియును. అది పశ్యంతి వాక్కు. అది వివరమై భావ – భాష రూపము దాల్చినపుడు మధ్యమ వాక్కు. కంఠము నుండి ఉచ్చరించినపుడు వైఖరి వాక్కు అగుచున్నది. ఇట్లు నిత్యము సరస్వతి జీవులయందు ప్రవహించుచునే యున్నది.

సంకల్పము పుట్టినచోటు శ్రీదేవి గృహమునకు తూర్పు ద్వారము. దానిని గూర్చి ధ్యానించుట ద్వారా తూర్పు ద్వారమునుండి శ్రీదేవి చింతామణి గృహమున ప్రవేశింప వచ్చును.

జీవుల యందు ప్రాణ స్పందన మున్నది. ఈ ప్రాణ స్పందనమే సామగానము. అది హంస గానమువలె హృదయమున స్థితిగొని యున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములే హంస రెక్కలు. వానికి మూలమైన స్పందనము హంస. ఈ హంస *'సోహం'* అను ద్వయాక్షరీ గానము చేయుచు నుండును. ఉచ్ఛ్వాస నిశ్వాసల ద్వారా హంసగానమును చేరి గానము ఆధారముగ యానము సాగించినచో హృదయ మందలి హంస మన యందలి ఉత్తర దిక్కునకు కొనిపోగలదు. మనయందలి శిఖే ఉత్తరదిక్కు. ఇట్లు హృదయము నుండి శిఖకు గాన మాధారముగ యానము చేయుట సామవేదము నుపాసించుట. ఇట్లుపాసించువారు ఉత్తర ద్వారమున శ్రీమాత గృహమును చేరి ఆమె దర్శనమును పొందగలరు.

యజుర్వేదము దక్షిణ దిక్కు. యజుర్వేదము యజ్ఞార్థ జీవనమును సూచించును. అనగా పరహిత జీవనమే జీవనమని తెలుపును. పరహిత మొనర్చుచు తనను తాను మైమరచువాడు ఈ మార్గమున దక్షిణ ద్వారమును చేరగలడు. ఇట్టివారు లోకహితులు. వీరికిని శ్రీమాత దర్శన మనుగ్రహింపబడును. ***"యజ్ఞార్థం కురు కర్మాణి"*** అని శ్రీకృష్ణుడు అర్జునున కుపదేశించెను. ఇతరుల శ్రేయస్సును మాత్రమే మనస్సున ధరించి కర్మల నొనర్చుట యజుర్వేద సూత్రము.

అధర్వణము అనగా యంత్ర, మంత్ర తంత్ర క్రతు విధానము. సృష్టి అంతయూ ఈ విధానముననే నిర్మాణము చేయబడినది. కావున క్రతు విధానమున సాధకులు పశ్చిమ ద్వారము నుండి చింతామణి గృహమును చేరవచ్చును. భరత భూమియందు ఉజ్జయిని పుణ్య క్షేత్రము నందు, దక్షిణమున నీలగిరుల యందు, ఉత్తరమున నేపాళము నందు పూర్వము ఈ వేదము బాగుగ రాణించినది. ఈ వేదము నుపాసించు వారికి జీవిత మంతయూ క్రతుబద్ధమే. నిద్ర లేచుట, దంత ధావనము, స్నానము, వస్త్ర ధారణము, ఆహార స్వీకరణము, ఎనిమిది జాముల విధి, ఆహార స్వీకరణము, చివరికి అల్పాచమనము కూడ క్రతుబద్ధమే. ఈ మార్గమున ప్రకృతి శక్తులను ఆరాధించుచు పరాశక్తిని చేరుట జరుగును.

ఇట్లు నాలుగు వేదములద్వారా నాలుగు దిక్కుల నుండి శ్రీమాతను తెలియవచ్చునని తెలుపుటకే 'వేదవేద్యా' అని స్తుతింప బడినది.



# 336. 'వింధ్యాచల నివాసినీ'

**విం**ధ్య పర్వతము నందు నివసించునది శ్రీదేవి అని అర్థము.

వింధ్య పర్వతమందున్న శ్రీదేవి నందాదేవిగా విలసిల్లుచున్నది. నందాదేవి యశోదా నందగోపులకు అష్టమ గర్భముగ జనించినది. నందునకు పుట్టుట వలన నందాదేవి అని పేరు గాంచినది. కృష్ణుని బదులుగ ఆమె మధుర యందలి కారాగృహమున నున్న దేవకీ వసుదేవుల వద్దకు వసుదేవుని ద్వారా చేరినది. కంసుడు ఆమెను సంహరింప పూనగ ఆకాశమున కెగిరి అటుపైన తన శక్తిని అష్టాదశ పీఠములుగ భరత భూమినందు యేర్పరచినది. నందాదేవిగ వింధ్యాచలము చేరినది.

మదమును హరించు దేవతగ నందాదేవి వింధ్యాచల మందు వసించి యున్నది. మదమును జయించినవారే ఆనందముగ నుండ గలరు. మదముగలవారు ఈర్ష్యాద్వేషములు, కామక్రోధములు, మత్సరములతో బాధ పడుచుందురు. మదము గలవారికి సుఖము లేదు. శాశ్వతమగు సుఖము, ఆనందము కలుగవలె నన్నచో మద మత్సరములు నశింపవలెను. ఆర్తితో, శ్రద్ధాభక్తులతో నందాదేవిని ఆరాధించువారికి శ్రీమాత ఆనందరూపిణిగ సాన్నిధ్యమిచ్చి శాశ్వత ఆనందమున నిలుపును. అపుడు వారు ఆనందమయ లోకమున వసింతురు. నందగోపుడు ఆనందమయలోక పాలకుడు. గోపకుడై జనించి శ్రీమాత ఆవిర్భావమునకు సహకరించెను.

మానవ ప్రజ్ఞ మణిపూరకమున నున్నప్పుడు మదము సహజ ముగ నుండును. ప్రజ్ఞ హృదయమును చేరినచో ఆనందము కలుగును. మణిపూరక పద్మములకు, హృదయ పద్మమునకు నడుమ గల ఉదర వితానమే వింధ్యాచలము. వింధ్యాచలమును అదుపున నుంచువారిలో శ్రీమాత, అగస్త్య మహర్షి ప్రధానమైనవారు. అగస్త్య మహర్షి కూడ శ్రీమాత ఆరాధకుడే.

నందాదేవి శుంభ నిశుంభు లను రాక్షసులను సంహరించినది. వారు వైవస్వత మనువు అనుగ్రహముచే వరములు పొంది మదించిన వారై దేవతలకు కూడ ఉపద్రవము గలిగించ నారంభించిరి. వారిని నందాదేవి సంహరించినది.

మానవుల యందు దైవీ భావములు, ఆసురీ భావములు కలుగు చునే యుండును. ఆసురీ భావములు విజృంభించినపుడు దేహమందలి దేవతా ప్రజ్ఞలకు ఉపద్రవము కలుగును. మానవ ప్రజ్ఞ అతలాకుతల మగును. జీవిత సన్నివేశము లన్నియూ ప్రతికూల మగును. మనశ్శాంతి కరవగును. ఆందోళన, భయము ఇత్యాది మలినము లుద్భవించును. ఇట్టివారు నందాదేవిని గాని, ఆమె ప్రతి రూపమైన శ్రీకృష్ణుని గాని నిత్యము ఆరాధనము చేసుకొనవలెను.



# 337. 'విధాత్రీ'

విశిష్టముగ ధరించునది శ్రీమాత అని అర్థము.

సృష్టిని నిర్మించి ధరించునది శ్రీమాత. తాను ఆధారముగనే సృష్టి అంతయూ వెలుగుచున్నది. త్రిగుణములు, పంచభూతములు కూడ తాను ఆధారముగనే ఏర్పడినవి. ఆదిత్యులు, రుద్రులు, వసువులు, త్రిమూర్తులు, అష్టదిక్పాలకులు, అంతరిక్ష దేవతలు, సూర్య మండల ములు, గ్రహములు, శ్రీదేవి చైతన్య మాధారముగనే వివిధ రూపము లను, స్వభావములను దాల్చియున్నవి. ఇవన్నియూ ఆమెయే భరించు చున్నది. కావున ఆమె విధాత్రి. చీమ కదలుటకును, దోమ ఎగురుట కును కూడ ఆమెయే ఆధారము. వాని యందలి చైతన్యము శ్రీమాతయే కదా! అసురుల యందు, సురల యందు, మానవుల యందు కూడ వారి వారి స్వభావముల వెనుక నున్నది శ్రీమాతయే.

చతుర్ముఖ బ్రహ్మను సృష్టించి అతనికి వేదము లందించి, సృష్టి నిర్మాణమునకు సంకల్పమిచ్చి, అతనిని సృష్టిని కూడ శ్రీమాతయే ధరించు చున్నది. చతుర్ముఖ బ్రహ్మకు భార్యగ కూడ నున్నది. అతడు ధాత. అతని భార్య ధాత్రి. ఆమె ధాత్రియే గాక విధాత్రి కూడ. అనగా అంతర్గతముగ, అంతర్హితముగ ధాత నుండి సమస్తమును నిర్వహించు చున్నది. అట్లే విష్ణువు నుండి స్థితిని అనుగ్రహించు చున్నది. రుద్రుని ద్వారా సంహారము చేయుచున్నది.

నిర్వహించుచున్నట్లు గోచరించువారి అందరి యందు క్రియా శక్తిగను, జ్ఞానశక్తిగను, ఇచ్ఛాశక్తిగను పనిచేయునది శ్రీమాత శక్తియే. సృష్టి యందలి సమస్త జీవులు ఆమెకు వాహికలే. కావున ఆమె 'విధాత్రి'.



# 338. 'వేదజననీ'

వేదములకు తల్లి శ్రీదేవి అని అర్థము.

వేద మనగా ఏది తెలిసినచో ఇక తెలియవలసిన దేమియు ఉండదో అది వేదము. అనగా పూర్ణజ్ఞానము. తెలియుటకు తెలివి వలయును. తెలివి చైతన్యము నుండి పుట్టినది. మేల్కాంచిన వెనుకనే తెలివి పనిచేయును. మేల్కాంచిన వెనుకనే నే నున్నానని తెలియును. ఇట్లు మేల్కాంచుటకు చైతన్య మాధారము. చైతన్యము తత్త్వము యొక్క వ్యక్తస్థితి. అట్టి వ్యక్తస్థితి నుండి జీవులు పుట్టుదురు. వారి యందును ఉండుట, చైతన్యవంతులగుట జరుగుచుండును. చైతన్యవంతమైనపుడే నే నున్నానని తెలియును. తా నున్నానని తెలిసినవాడే తన పరిసరము లను, సృష్టిని కూడా తెలియుటకు ప్రయత్నించును. తెలివి ఆధారము గనే తెలియుట జరుగును. తెలుసుకొనువాడు, తెలుసుకొను విషయము, తెలుసుకొనుట అను కార్యము– మూడును కలిపి జ్ఞానము. తెలుసుకొను వాడు తెలియుటయందు నిమగ్నమై తెలియబడు విషయమున కరగును. అపుడు జ్ఞానమే తానుగ నున్నాడని తెలియును. చైతన్యమే తానుగ నున్నాడని తెలియును. తా నొకడు ప్రత్యేకముగా నున్నాడను భావము తొలగును. ఉన్నదంతయూ సత్ చిత్‌లే అని తెలియును. ఇట్లు వేదము తెలియును. అది తెలియబడుటకు శుద్ధచైతన్యమగు శ్రీమాతయే ఆధారము. ఆమెయే తెలియువానికి, అతని యందలి తెలివికి, తెలియ వలె నను ఆసక్తికి, తెలియబడు విషయమునకు మూలము, పుట్టినిల్లు కనుక ఆమెయే వేదమాత. ఆమెయే 'వేదజనని'.

# 339. 'విష్ణుమాయా'

**మా**య శ్రీమాత ప్రధాన ఆయుధము. ఈ ఆయుధమును ఆమె విష్ణువు నందు నిక్షిప్తము చేసి యున్నది. మాయవలననే జీవులు తాము వేరుగా నున్నామని భావింతురు. ఏకము అనేకమైనపుడే కదా సృష్టి! ప్రతి ఒక్కరూ తాము ఇతరుల కన్న వేరన్న భావన మాయా వరణమే. త్రిమూర్తులు సహితము మాయకు లోబడియే ఉన్నారు. సృష్టి సృష్టించవలెనని బ్రహ్మకు అనిపించుట, రక్షించవలెనని విష్ణువున కనిపించుట, దుష్టులను సంహరించి శిష్టులను కాపాడవలెనని రుద్రుల కనిపించుట, మొత్తము సృష్టిని పాలించవలెనని ఇంద్రుని కనిపించుట, ఇవి అన్నియూ శ్రీమాత కల్పనే. ప్రథమ మాయావరణము అహంకా రము. అహంకారము వలన తా నున్నానను భావన కలుగును. నిజము నకు అందరిగను వున్నది ఒకటే తత్త్వము. అన్ని పాత్రల యందు ఒకే చోటు వుండగా వేరు వేరు పాత్రలుగ గోచరించును. ఇట్లు గోచరింప చేయుట శ్రీమాత మాయాశక్తి. ఆమె మాయకు త్రిమూర్తులు కూడ ముహూర్తకాలము భ్రమపడిన సందర్భము లున్నవి. ఇంక ఇతరుల గురించి చెప్పెడిదేమి?

ఆమె సంకల్పించిననే గాని మాయ హరింపబడదు. ఆమె మాయ ప్రసరించినచో జ్ఞానులు కూడ హింసింపబడుదురు. సాక్షాత్ భగవత్ స్వరూపులైన గౌతమ మహర్షి కూడ ఆమె మాయకు లోబడిన సందర్భము లున్నవి.

"నా మాయ నెవ్వరూ దాటలేరు" అని శ్రీకృష్ణుడు భగవద్గీత యందు 7వ అధ్యాయమున తెలిపినాడు. నీ మాయను దాటలేము అని మ్రొక్కుట ఒక్కటియే ఉపాయము. తెలిసి తెలిసి మాయలో పడిన వారెందరో కలరు. అనన్య చింతనము, నిత్య ఉపాసనము చేయుచు శ్రీమాతతో అభియుక్తులై ఉన్నవారు కూడ శ్రీమాత సంకల్పించినచో మాయలో పడుదురు. నారద మహర్షి పూర్వజన్మ వృత్తాంతము శ్రీమాత మాయాశక్తికి సంపూర్ణ నిదర్శనము.



# 340. 'విలాసినీ'

**వి**క్షేపశక్తి గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత విలాసిని శక్తి మహత్తర మహిమ కలది. విలాస మనగా రహస్య గమనము. శ్రీమాత గమనము అనూహ్యాము. జరిగిన వెనుకనే మహాత్ములైనా తెలియగలరు. జరిగిన పిదప ఇట్లు జరిగినదని సంభ్రమాశ్చర్యములతో వివరించుకొనుటయే గాని, ఇట్లు జరుగ గలదని ఎవ్వరునూ ఊహించలేరు. శ్రీమాత విలాసినీ శక్తి క్షణకాలమున జీవునికి ముక్తి నివ్వగలదు. ఆమె తలచినచో ఎట్టివారినైనా అద్భుతముగ ఉద్ధరించగలదు. కోట్లకొలది రుద్రుల శక్తి ఊహించగలిగినచో అది విలాసిని శక్తిగ పరిగణింపబడును.

శ్రీమాత విలాసిని శక్తి బ్రహ్మరంధ్రమున చరించుచు నుండును. ఆమె అనుగ్రహ విశేషముచే ఆమె విలాసముగ యోగులు ఊర్ధ్వ లోకముల నుండి అధోలోకములకు, అధోలోకముల నుండి ఊర్ధ్వ లోకములకు సంచరించుచు సృష్టికార్యమును చక్కబెట్టుచు నుందురు. నారదాదులు, సనక సనందనాదులు, సప్త ఋషులు అట్టివారు.



# 341. 'క్షేత్రస్వరూప'

**క్షే**త్ర రూపము శ్రీదేవియే అని అర్థము.

సృష్టి యందు జీవులను వసింప జేయుటకు సృష్టిక్షేత్ర మొకటి యేర్పడవలెను. ఏడులోకముల యందు జీవులు వసించుటకు వలసిన చోటు, జీవులు వసించుటకు వలసిన రూపములు కావలెను. ప్రదేశ మేర్పడవలెను. మరియు జీవులకు రూపము లేర్పడవలెను. అట్లు ఏర్పడిననేగాని సృష్టి కథ లేదు. జీవుల పరిణామ కథ కూడ లేదు. శ్రీమాతయే ఏడు లోకముల యందలి ప్రదేశముగ ఏర్పడును. ఆమె మూల ప్రకృతి. ఆమె నుండి అష్ట ప్రకృతులు యేర్పడి నవావరణము లతో కూడిన చోటు ఏర్పడును. మొత్తము సృష్టి కథ అంతయూ ఈ ఆవరణములలోనే జరుగును. మొత్తము చోటులో నవావరణముల మేఱకు చోటు వెలిగింపబడును. ఒక మహారణ్యమున కొంత చోటును చదను చేసి శుభ్రపరచి ఆశ్రమము నిర్మాణము చేసినట్లుగ అనంతమైన చోటులో కొంత చోటు ఒక సృష్టిగ ఏర్పడును. సమస్త జీవ వ్యాపారము లును ఈ వెలిగింపబడిన చోటులో జరుగు చుండును. ఇదియే కురు క్షేత్రము. కురుక్షేత్ర మందు జీవులు వారి వారి ధర్మము ననుసరించి ప్రవర్తింతురు. అందువలన ఆ క్షేత్రము ధర్మక్షేత్రము కూడ.

పై తెలిపిన క్షేత్రమున జీవులు స్థూల సూక్ష్మరూపులై వారి ఇచ్ఛ ననుసరించి జీవించుచూ, అనుభవమూ అనుభూతి గణించుచూ

పరిణతి చెందుచు నుందురు. ఇందు క్షేత్ర మనగా లోకముల యందు వెలిగింపబడిన చోటు, జీవుల కేర్పరచిన దేహములు. ఈ క్షేత్రము లన్నియూ శ్రీమాతయే.

దేహములను, రూపములను, ప్రకృతిని ఆధారముగ జేసుకొని జీవుడు అనేకానేక అనుభూతులను పొందుచున్నాడు. జీవులు పూర్ణత్వము చెందుటకు ఇట్లు క్షేత్రములు సాధనములై నిలచినవి. కావున దేహాది కములను, ప్రకృతిని నిరసించుట, అశ్రద్ధ చేయుట, తుచ్ఛములని భావించుట మెట్టవేదాంతమే అగును గాని సరియగు అవగాహన మాత్రము కాదు. క్షేత్రరూపమున శ్రీమాత యుండగ ఆమెను మన్నించి గౌరవించి తగు మాత్రముగ పోషించుచూ జీవుడు సాగవలెను. అట్లు కానిచో దేహములు, ప్రదేశములు బంధించి జీవుని దురవస్థ పాలు చేయును.



# 342. 'క్షేత్రేశీ'

క్షేత్రములకు ఈశ్వరి శ్రీమాత అని అర్థము.

సృష్టి క్షేత్రములకు, జీవుల క్షేత్రములకు ఈశ్వరి శ్రీమాతయే. పంచభూతాత్మక మగు సృష్టి క్షేత్రమును, జీవుల క్షేత్రములను త్రిగుణము లతో వర్తింపజేయుచు అష్ట ప్రకృతులను అధిష్ఠించి సమస్తమును నిర్వర్తించుచు నుండును. ఆమె నుండియే క్షేత్రము లన్నియూ యేర్పడినవి కనుక ఆమెయే వానికి ఈశ్వరి. జీవులు కూడ ఆమె ఈశ్వరీతత్త్వము నెరిగి ఆమెను ఆశ్రయించినచో క్రమముగ అష్టప్రకృతులు సహకరించ గలవు.

జీవులు స్వతహాగ ప్రకృతి అధీనులు. ప్రకృతిపై స్వామిత్వమునకు వారు ప్రయత్నించుట అహంకరించుటయే. ప్రకృతితో సహకరించి స్నేహ సంబంధ మేర్పరచుకొన్నచో ప్రకృతి అనుకూలింప గలదు. అజ్ఞాన అహంకారముతో విఱ్ఱవీగువారికి ప్రకృతి ప్రతికూలించును. అపుడు పరిసరములు, తమ తమ దేహములు కూడ తమకు ప్రతికూలమై నిలచును. ప్రకృతిని జీవులు ఎదురించి నిలువలేరు. ప్రకృతి సహకార ముతో ఈశ్వర జ్ఞానము నిలచి ఈశ్వర సాన్నిధ్యమున స్థిరపడగలరు.

మహాభారత యుద్ధమున పాండవులకు ప్రకృతి అనుకూలమై నిలచినది. దుర్యోధనాదులకు ప్రతికూలమై నిలచినది. భీముడు ప్రార్థించగ వాయుపుత్రుడైన హనుమంతుడు యుద్ధమున పాండవులకు

వాయు సహకారము నందించెను. దానితో పాండవసేనలు ప్రయోగించిన ఆయుధములకు బలము ఇనుమడింపగ ధార్తరాష్ట్రులు ప్రయోగించిన ఆయుధముల బలము వాయువుచే ప్రతిఘటింపబడి బలహీనములైనవి. అట్లే రామ రావణ యుద్ధము నందు కూడ రామునికి ప్రకృతి అనుకూలమై నిలచినది.

ఇట్లు ప్రకృతి అనుకూలమున సజ్జనులు పురోభివృద్ధి సాధించగ, దుర్జనులు నశింతురు. ప్రకృతి శ్రీమాత అధీనమున నుండును గనుక శ్రీమాత ఆరాధనమున అటు దైవము, ఇటు ప్రకృతికూడ అనుకూలించి భక్తులు వైభవముతో నుందురు. మహా వైభవముగల యోగులందరూ శ్రీమాత భక్తులే. యోధులలో కూడ చక్రవర్తులు శ్రీమాత భక్తులే.



# 343. 'క్షేత్రక్షేత్రజ్ఞ పాలినీ'

క్షేత్రమును, క్షేత్రము తెలిసినవారిని పాలించునది శ్రీదేవి అని అర్థము.

క్షేత్ర మనగా దేహము. క్షేత్రజ్ఞు డనగా అందు వసించుచు దాని స్వరూప స్వభావముల నెరిగి జీవించువాడు. అన్ని దేహములు క్షేత్రములే. అందలి జీవులు క్షేత్రజ్ఞులే. వారు తమ తమ క్షేత్ర స్వరూప స్వభావముల నెఱిగి అందు వసించినచో ఆనందము పొందగలరు. క్షేత్రమున వసించు జీవునకు క్షేత్ర వాసన చేత స్వభావము ఒకటి ఏర్పడును. త్రిగుణముల కలయికను బట్టి స్వభావ ముండును. వాటి సమ్మేళనమే రజస్సు, తమస్సు, సత్త్వములతో కూడిన స్వభావము. స్వభావము ననుసరించి ప్రవర్తించు చుండగ మనస్సు, ఇంద్రియములు, శరీరములకు అభ్యాసము లేర్పడును. స్వభావము సమపాలుగ వుండనపుడు అభ్యాసములు బంధించును. త్రిగుణములు సామ్యము చెందినపుడు బంధము లేక జీవుడు దేహమున జీవించును.

క్షేత్రము అష్ట ప్రకృతులతో కూడి యున్నది. అది మానవుని యందు అహంకారము, బుద్ధి, చిత్తము, పంచేంద్రియములుగ నున్నది. అహంకార స్వరూపుడైన జీవుడు బుద్ధి ననుసరించి జీవించినచో త్రిగుణ ములు సామ్యము చెంది జీవితము బంధములు లేక నడచును. బుద్ధి ననుసరించనపుడు త్రిగుణములు విజృంభించి బద్ధుని చేయును.

క్షేత్రమున వసించు క్షేత్రజ్ఞునకు క్షేత్రము తెలియవలెను కదా! గృహమున వసించువారికి గృహమును గూర్చి తెలియవలెను. అట్లే రాష్ట్రపాలకులు, దేశపాలకులు, లోకపాలకులు వారి క్షేత్రముల పొలిమేరల వర కంతయు తెలియవలెను. అపుడే క్షేత్రజ్ఞు డనబడును.

సృష్టి మొత్తమొక క్షేత్రమని చెప్పబడినది. కురుక్షేత్రముగ వివరింపబడినది. అది వాసుదేవుని శరీరముగ గూడ తెలుపబడినది. వాసుదేవు డనగా సృష్టి రూపమే తన శరీరముగ వసించియున్న శ్రీమాత వ్యాపినీ ప్రజ్ఞ. అంతయూ వ్యాపించి సృష్టి మొత్తము యేమరుపాటు లేక తెలిసి యుండును. విశ్వమయుడుగ వాసుదేవు డుండును. అతడే శ్రీమాత క్షేత్రజ్ఞ స్వరూపము. క్షేత్రము ఆమెయే. క్షేత్రజ్ఞు డగు వాసుదేవుని, క్షేత్ర మగు సృష్టిని రెంటినీ పలిపాలించునది శ్రీమాత.

అట్లే మన శరీరము క్షేత్రము. అందు వసించు మనము క్షేత్రజ్ఞులై యుండవలెను. అట్లుండక పోవటము వలన శరీర బంధము కలుగును. క్షేత్రజ్ఞానము సంపాదించుకొని ఆ జ్ఞానమున కనుగుణముగ వర్తించి నచో క్షేత్రజ్ఞుల మగుదుము. అట్టి జ్ఞానము కలుగవలె నన్నచో శ్రీమాత అనుగ్రహము ప్రధానము. ఆమె అనుగ్రహించిననే ఏ జ్ఞానమైననూ కలుగును. ఆమె అనుగ్రహముతో దేహమందలి సప్త ఋషి ప్రజ్ఞలను, ద్వాదశాదిత్యులను, ఏకాదశ రుద్రులను, అష్టవసువు లను, అశ్వినీదేవత లను, అష్ట దిక్పాలకులను, సమస్త దేవతా ప్రజ్ఞలను, అసుర ప్రజ్ఞలను, పశుప్రవృత్తిని దేహముననే దర్శించవచ్చును. మానవ శరీరము మొత్తము

సృష్టికి ప్రతీక. అందు మానవుడు జ్ఞానియై వ్యాప్తి చెంది శ్రీమాతను కూడ అనుగ్రహవశమున తెలియుటకు శ్రీమాత ఆరాధనము ముఖ్యము.

భగవద్గీత యందు పదిహేనవ అధ్యాయముగ పురుషోత్తమ ప్రాప్తి తెలుపబడినది. అందు క్షర పురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడు అనుచూ ఒకే యజ్ఞపురుషుని మూడు తత్త్వములు తెలిపిరి. అందు క్షర పురుషుడు క్షేత్రము. అది వచ్చుచు పోవుచు నుండును. శాశ్వతముగ ఒకే స్థితి యందుండదు. అందు వసించు క్షేత్రజ్ఞుడు అక్షర పురుషుడు. అతడు నశింపడు. శాశ్వతుడు. కాని క్షేత్రమున చిక్కుకొన గలడు. క్షేత్రమును, క్షేత్రజ్ఞుని లేక క్షర పురుషుని, అక్షర పురుషుని మూలమై యున్నవాడు పురుషోత్తముడు. ఆ పురుషోత్తముడే మిగిలిన రెండు తత్త్వములకు పాలకుడు. శ్రీవిద్య పరముగ ఆ పురుషోత్తమ తత్త్వమే శ్రీమాత. ఆమెయే క్షేత్రమును, క్షేత్రజ్ఞులను కూడ పాలించును. మనయందు పురుషోత్తమ తత్త్వము మూలమై యున్నది. దాని వ్యక్తరూపము మనమే. మన వ్యక్త రూపము మన శరీరము. మనకూ మన శరీరమునకు స్వామి దైవమే.



# 344. 'క్షయవృద్ధి వినిర్ముక్తా'

**క్ష**యము వృద్ధిల నుండి ముక్తి నిచ్చునది శ్రీదేవి అని అర్థము.

క్షేత్రము లన్నియూ వృద్ధి పొందుచుండును. క్షయమగు చుండును. అష్ట ప్రకృతులకు వృద్ధి క్షయములు కలవు. ఇవి అన్నియూ క్షర పురుష భావము. మానవుని యందు గల అహంకారాదులగు అష్ట ప్రకృతులు కూడ కాలానుసారము వృద్ధి క్షయము పొందు చుండును. కావున వీనితో సంగము మానవునికి కలిగిననాడు అతను కూడ క్షయ వృద్ధులను పొందినట్లు భావించును. అష్ట ప్రకృతులు సృష్టి చక్రమున తిరుగుచుండును. వానికి స్థూలమైన మూల ప్రకృతి యందు చేరిననే కాని ఈ హెచ్చు తగ్గుల నుండి బైటపడుటకు వీలు పడదు. మూల ప్రకృతియైన శ్రీమాత సాన్నిధ్యముననే జీవులు అక్షయ అనుభూతి పొందగలరు. జీవులు అక్షరులే అయిననూ క్షరమగు ప్రకృతితో సంగ మేర్పరచుకొనుట వలన సుఖ దుఃఖములను పొందుచున్నారు. తమ యందలి అష్ట ప్రకృతుల సంగమే సృష్టి యందలి అష్ట ప్రకృతులలో కూడ సంగ మేర్పరచు చున్నది.

మానవుడు సహజముగ ఆత్మ స్వరూపుడు. అతని యందు సత్యము, శుద్ధ చైతన్యము సహజముగ నుండును. అతడు అట్టి స్థితిలో మూల ప్రకృతి యందే యుండును. అప్పుడతనికి సత్ చిత్ ఆనందమే యుండును. త్రిగుణములందు ప్రవేశించినపుడు అహంకార మేర్పడును.

అపుడు తాను, ఇతరులు అనుభావము కలుగును. ఇతరులు కూడ తానే అను భావన మరచును. అపుడు తర తమ భేదములు పుట్టును. అచ్చటనుండి ఇక వరుసగ ఏడు ప్రకృతుల లోనికి సంసరణము చెందును. నేను, నాది అను భావముతో తనను తాను బిగించుకొనును. క్రమముగ నేనును కూడ మరచి, నాది నేనుగ మిగులును. అపుడతడు క్షర భావమున బందీయై యుండును. దీని నుండి విమోచన మెట్లు కలుగును? తన నిజస్వరూపమును తాను నిత్యము జ్ఞప్తి చేసుకొనుటయే. అట్టి జ్ఞప్తి కలుగుటకు, స్థిరపడుటకు శ్రీమాత అనుగ్రహము ప్రధానము. కనుక ఆమెయే క్షయ వృద్ధుల నుండి ముక్తి నిచ్చునది.



# 345. 'క్షేత్రపాల సమర్చితా'

**క్షే**త్ర పాలకులచే ఆరాధింపబడునది శ్రీమాత అని అర్థము.

పాలనము క్షాత్రధర్మము. పాలించుటకు పాలనాజ్ఞాన మవసరము. అట్టి జ్ఞానము కలుగవలెనన్నచో శ్రీమాతను ఆరాధించ వలెను.

మానవ శరీరముల నుండి దివ్య శరీరముల వరకు గల రూపము లన్నింటినీ పోషించుకొనుటకు, రక్షించుకొనుటకు ఆయా జీవులయందే పాలక ప్రజ్ఞగా శ్రీమాత వసించు చున్నది. ఆమె నారాధన చేసినవారికి ఆ ప్రజ్ఞ మేల్కాంచి రక్షణ పోషణాదులు జరుగుచుండును. పశు రూపములలో నున్న జీవులు కూడ తమను తామిట్లే పోషించుకొనుచు రక్షించుకొనుచున్నారు. ఆహారమునకై తిరుగాడు పీత సహితము అలికిడవగానే కన్నములో దూరును. అట్లే ఇతర జీవులును.

మానవులు జీవిత మంతయూ శరీర పోషణము, రక్షణము కొరకు పాటు పడుచుందురు. అది వారి కర్తవ్యమై నిలచినది. ఈ కర్తవ్య నిర్వహణము సరిగ జరుగవలెనన్నచో శ్రీమాత రక్షింపవలెను. అపుడు శ్రీమాత తదనుగుణమగు సంకల్పమును, జ్ఞానమును, క్రియా శక్తిని ప్రసాదించును. అట్టివారే వారి వారి శరీరములందు సుఖ పడుదురు.

తమ శరీరములనే కాక ఇతరులను కూడ రక్షించుట, పోషించుట, ఒక ప్రాంతమునకు రక్షణ పోషణముల నిచ్చుట, ఒక రాష్ట్రమునకు, ఒక దేశమునకు, ఒక లోకమునకు రక్షణ పోషణ కల్పించుట కూడ పాలక శక్తియే. ఇట్టి వారిలో శ్రేష్ఠులు దిక్పాలకులు, లోకపాలకులు. మొత్తము సృష్టి పాలనము చేయు ప్రజ్ఞ విష్ణు ప్రజ్ఞ. త్రిమూర్తులలో విష్ణువుతోకూడి లోకపాలకులు, దిక్పాలకులు, చక్రవర్తులు, ప్రభువులు, ఇతర చిల్లర అధికారులు శ్రీమాత నర్చించుచు వారి వారి కర్తవ్యములను చక్కబెట్టుట ఈ నామ రహస్యము. కొద్దియో గొప్పగనో విష్ణు ప్రజ్ఞ మేల్కొంచనిచో రక్షణ పోషణ లుండవు.

క్షేత్రపాలు డనగా శివుడని కూడ అర్థ మున్నది. శివుడు దారుకు డను అసురుని చంపుటకు శ్రీమాత కాళీ ప్రజ్ఞను వినియోగించెను. అపుడు శ్రీమాత కాళిగ శివునికి సహకరించి దారుకాసురుని సంహ రించెను. ఆ సంహార మతి భీకరము. ఆ సమయమున కాళి కోపాగ్ని అతితీవ్రమై సంహారానంతరము కూడ ఉపసంహరింపబడలేదు. ఆ కోపాగ్నికి లోకములు కల్లోలమగు చుండెను. అపుడు శివుడు ఒక అందమైన బాలుని రూపము దాల్చి ఏడ్చుచు కాళికి ఎదురేగెను. ఏడ్చుచున్న అపురూపమగు బాలుని చూచిన వెంటనే కాళి యందలి శ్రీమాత వాత్సల్య భావమును ధరించెను. అపుడు బాలుని చేరదీసి ఓదార్చుటకై తన స్తన్యమిచ్చెను. బాల శివుడు స్తన్యముల నుండి క్షీరములనే గాక కాళి కోపాగ్నిని కూడ పానము చేసెను. ఈ బాలునే క్షేత్రపాల శివుడందురు. ప్రసన్న అయిన శ్రీమాతను బాలశివుడు అర్చించెను. కావున శ్రీమాత 'క్షేత్రపాల సమర్చిత' అయినది.

# 346. 'విజయా'

విజయ స్వరూపము శ్రీమాత అని అర్థము.

సంధ్యాకాలము కొంచెము దాటిన పిదప నక్షత్రములు కొంచెము ప్రకాశించుకాలము విజయ అని పిలువబడును. ఈ కాలమున ప్రారంభించు కార్యములు విజయవంతమగును. అట్లే దినములో పదునొకండవ ముహూర్తమును విజయ అని వర్ణింతురు. విజయమును కోరువారందరూ పయనించుటకు అది ఉత్తమ కాలమని తెలుప బడినది. ఆ సమయమున కాలము విజయ రూపమై యుండునట.

ఆశ్వయుజ మాసమునందు శుక్లపక్ష దశమి తిథియందు నక్షత్రోదయ కాలము సర్వ కార్యార్థ సిద్ధి నొసగును. ఈ తిథి విజయ దశమి అని ప్రసిద్ధి గాంచినది.

విశేషమగు జయము కలిగించునది గనుక శ్రీమాత విజయగ వర్ణింపబడినది, కీర్తింపబడినది. దేవీ పురాణమందు 68 శివ తీర్థములు పేర్కొనబడినవి. వానిలో కాశ్మీరమున గల శివతీర్థమును విజయతీర్థ మని తెలిపిరి. ఆ శివ తీర్థములకు శ్రీమాతయే అధ్యక్షురాలు. విశ్వకర్మ శాస్త్రమందు తెలుపబడిన గృహ నిర్మాణములలో విజయ అనునది విశేష రూపము గల గృహముగ తెలుపబడినది.

పాండవులలో అర్జునుని విజయుడని కీర్తించినారు. అతని నెప్పుడునూ శ్రీమాత విజయ రూపము ఆవరించి యుండెడిదట.

విజయదశమినాడు విజయుడు ఒంటరిగ కురుసైన్యమును నిర్జించి విరటుని గోవులను కాపాడినాడు.

అంతః శత్రువులను, బాహ్యశత్రువులను జయించిన వారు విజయులు. యోగులు, సిద్ధులు అట్టివారు. వారియందు శ్రీమాత పరిపూర్ణ సాన్నిధ్య ముండును. విజయ నామము అత్యంత శుభప్రద మైనది.



# 347. 'విమలా'

మలములచే తాకబడనిది విమల అని అర్థము.

శ్రీమాత మలములచే తాకబడనిది. ఆకలిదప్పులు ప్రధాన మగు మలములు. దరిద్రము మలము. అష్ట దరిద్రములు గలవు. అవి అన్నియూ మలములే. కామక్రోధాది అరిషడ్వర్గములు మలములు. అతిక్రమించు కామము మలము. వికారమగు మనోభావములు మలములు. అధర్మము, అవినీతి మల భావములు. అధిక్రమించు రజస్సు, తమస్సులు (రజస్తమస్సులు) మలములు. మలముల మొత్తమును అవిద్య అందురు. కనుక అవిద్య మలము, మలములకు సమగ్ర నిర్వచనము. అజ్ఞానమే అవిద్య. అది కారణముగనే అహంకారము గట్టిపడును. అప్పుడు రజస్తమస్సులు సత్త్వము కన్న బలము కలవై వర్తించును. వానికి లోబడిన అహంకార పురుషుడు వికారమగు భావములు కలిగి అష్ట బంధములను సమకూర్చుకొనును. అష్ట కష్టములు పడును. అట్టి నరుడు త్రికరణశుద్ధిగ శ్రీమాతను ఆరాధింప ప్రారంభిం చినచో క్రమముగ అవిద్య తొలగును. విమలు డగును. త్రిగుణములకు లోనైన జీవు లందరూ కూడ అహంకార మను ఆవరణమున వసింతురు. అవిద్యకిది ప్రథమావరణము. త్రిగుణములకు ఆవల శుద్ధచైతన్య స్వరూపిణిగ శ్రీమాత యున్నది. ఈవల అహంకారులై జీవు లున్నారు. అహంకారావరణము దాటినచో జీవులు విమలత్వము చెందగలరు. అట్లు పొందుటకు శ్రీమాత అనుగ్రహమే ఉపాయము. అనుగ్రహమును పొందుటకు నిత్య చింతన, ఆరాధన జరుగవలెను. శ్రీమాత అనుగ్రహించి నచో ఎట్టి వారైననూ విమలత్వమును పొందగలరు.

# 348. 'వంద్యా'

నమస్కరింపదగినది శ్రీమాత అని అర్థము.

ఈ నామమునకు వ్యాఖ్యానము అవసరము లేదు. త్రిమూర్తులు సహితము శ్రీమాతకే నమస్కరింతురు. ఆమె నుండియే ప్రేరణ చెంది వారి వారి కార్యములను నిర్వర్తింతురు. ఇక ఇతరుల సంగతి చెప్పనేల? ఇచ్ఛా, జ్ఞాన, క్రియలు సరిగ నిర్వర్తింపబడుటకు శ్రీమాతకు నమస్కరించ వలసినదే. ఆమెకు నమస్కరించి ప్రేరణను పొంది ఆ ప్రేరణను నిర్వర్తించుటకు వలసిన జ్ఞానమును అమ్మనుండియే పొంది, ఆమె అందించు శక్తిచే నిర్వర్తించుట, అటుపైన అంతయూ ఆమెకే సమర్పించుట భక్తులు చేయు కార్యము. ఆమెను తిరస్కరించినవారికి సృష్టి యందు తిప్పలు తప్పవు.



# 349. 'వందారు జనవత్సలా'

**న**మస్కరించు జనుల యందు వాత్సల్యము కలది శ్రీమాత అని అర్థము.

ఎవరైననూ నమస్కరించినచో దానిని స్వీకరించువారు సహజముగ ప్రీతి చెందుదురు. ఇది యొక రహస్యము. ఎదుటి వ్యక్తి ప్రీతిని, వాత్సల్యమును పొందుటకు నమస్కరించుట భారతీయ సంప్రదాయము. నమస్కారము చేయువారు ఎదుటి వ్యక్తి యందలి దివ్యత్వమును గుర్తించి నమస్కరించినచో ఆ వ్యక్తిలోని దైవము ప్రీతి చెంది ఉన్ముఖు డగును. అందరి జీవుల హృదయము లందు దైవము ఉపస్థితి చెంది యుండుట చేత అట్టి దైవమునకు నమస్కరించు భావన కలిగినచో దైవము యొక్క ఆనుకూల్యము హెచ్చుగును.

నమస్కారము భక్తికి, వినయమునకు చిహ్నము. నమస్కారము నందుకొను జీవుడెట్టి వాడైననూ నమస్కరించువారు మాత్రము ఆ జీవుని యందలి దైవమునకే నమస్కారము చేయవలెను. అపుడు చేయు నమస్కారము కేశవు డను దైవమునకు చెంది జీవులు అనుగ్రహింపబడుదురు.

భక్తి మార్గమున జీవనయాత్ర సాగించువారు ఎవరికి నమస్కారము చేయుటకైననూ సంసిద్ధులై యుందురు. అందులకే భక్తుల విషయమున భగవత్‌తత్త్వము కూడ అమిత వాత్సల్యము కలిగి

యుండును. 'వసుదేవుడు గాడిద కాళ్ళు పట్టుకొనె' నని సామెత కలదు. వసుదేవుడు అనన్య భక్తియుతుడు. అతని కందరి యందు దైవమే గోచరించును. అత్యంత పవిత్రమూర్తి. సంస్కారవంతుడైన వసుదేవుడు దురహంకారియైన కంసుని, దేవకిని రక్షించుకొనుటకై గాడిద కాళ్ళు పట్టుకొనుటకు కూడ వెనుకాడలేదు. వసుదేవుని ఈ చర్యయే శ్రీకృష్ణ అవతారమునకు తెర తొలగించినది.

భక్త జను లనగా అంతర్యామియైన దైవమును అందరి యందు దర్శించుచూ దైవ సంకల్పమును నిర్లిప్తతతో నిర్వర్తించువారు. అట్టి వారియందు అమిత వాత్సల్యమును శ్రీమాత చూపును. శ్రీకృష్ణుడు అంతర్యామి దైవమే. అతడు అర్జునునితో ఇట్లు పలికెను.

"అర్జునా! నేను వైకుంఠమునందు అప్పసము (ఎల్లవేళలా) వుండను. యోగుల హృదయములందు కూడ నిరంతర ముండను. నన్ను సతతము స్మరించు భక్తులతో మాత్రమెప్పుడునూ ఉందును."



# 350. 'వాగ్వాదిని'

**వా**క్కులను పలుకునది శ్రీమాత అని అర్థము.

వాక్కు నాలుగు శ్రుతులలో నున్నది. పరా వాక్కుగ నుండు శ్రీదేవి నుండి వచ్చు సంకల్పము పశ్యంతి అగుచున్నది. అనగా ఏమి లేనట్టు వున్నట్టి స్థితి నుండి సంకల్ప స్థితికి వచ్చుట. సంకల్పము కలుగుటయే యుండును గాని ఎవ్వరునూ సంకల్పించలేరు. సంకల్పము కలిగినపుడు దానిని గ్రహింతురు. అనగా దర్శింతురు. ఇట్లు దర్శన స్థితిలోనికి వచ్చిన పరావాక్కే పశ్యంతి. అటుపైన భాష ననుసరించి మధ్యమ వాక్కుగ నేర్పడి కంఠము ద్వారా వైఖరిగా నాలుకమీదుగ వెలువడును.

సంకల్పము కలుగుట, దానిని దర్శించుట, దర్శించిన దానికి భాష నేర్పరచుట, ఆ భాషను పలుకుట ఇది నిత్య జీవితమున కలుగు విచిత్రము. అందరునూ ఈ విధముగనే పలుకుచున్నారు. కాని వారు పలుకుటకు ఆధారమైన సంకల్పము, భాష, వాక్పటిమ శ్రీదేవియే అని తెలియలేరు. ఇట్లు వాక్కు రూపమున అంతర్యామిత్వము చెంది శ్రీదేవి జీవుల కార్యములను చక్కబెట్టుచున్నది. ఆమెయే ఋగ్వేద దేవత. వాగ్దేవత. ***'వాగేవ ఋగ్వేదః'*** అని ఉపనిషత్తు తెలుపుచున్నది.



# 351. 'వామకేశీ'

**అం**దమైన కేశములు కలది శ్రీదేవి అని అర్థము.

వామకులు అనగా ఒక జాతి శివభక్తులు. వారికి శివుడే ఈశుడు అగుటచే అమ్మ వామకేశి అని పేరు పొందినది. వామ కేశుని పత్ని వామకేశి. అమ్మపేరున వామకేశి తంత్ర మొకటి కలదు. శివుడు అర్ధనారీశ్వర తత్త్వమున కుడి ఎడమలుగ శివ శక్తులుందురు. కుడి అనగా దక్షిణము. ఎడమ అనగా వామ. వామ భాగమంతయూ శ్రీదేవియే. దక్షిణ భాగమంతయూ దక్షిణామూర్తి యగు ఈశ్వరుడు. శిరస్సునందు కుడి భాగము శిరోజములు శివుడివి. ఎడమ భాగము శిరోజములు శ్రీమాతవి. శ్రీమాత శిరోజములు అనుపమాన సౌందర్యము కలవి. శివుని శిరోజములు జటాజూటములు.

అట్లే అమ్మ కన్ను వామాక్షి. ఆమె వామహస్త. వామ భాగ మదురుట స్త్రీలకు శుభము. దక్షిణ భాగ మదురుట పురుషులకు శుభము.

వామతత్త్వము దక్షిణ తత్త్వమునకు ఉన్ముఖమే కాక ప్రతికూలము కూడ. ప్రతికూలత లేనిదే సృష్టి లేదు. శ్రీమాత శివుని కున్ముఖమై, ప్రతికూలమై నిలచి ద్వంద్వములతో సృష్టి నిర్మాణము చేయును. సృష్టి యందు ద్వంద్వములు తప్పవు. అనుకూలము నుండి ప్రతికూలము పుట్టుచు నుండును. దీని కెన్నియో ఉదాహరణము లుండును. రాముని

యందు అమితమైన అనుకూలవతియైన కైకేయి ప్రతికూలమైనది కదా! మిత్రులు శత్రువు లగుట, అనుకూలురు ప్రతికూలు రగుట జరుగుచు నుండును.

మంచిని చెడు, శాంతిని అశాంతి, వెలుగును చీకటి, వృద్ధిని అంతము ఎప్పుడునూ ఎదుర్కొను చుండును. ఉత్తర దక్షిణ ధ్రువములు ఒక దానికొకటి ప్రతికూలముగ నుండుట చేతనే భూమి నిలచి యున్నది. పక్షి రెక్కల వలె కుడికి ఎడమ, ఎడమకి కుడి ఆధారము. ఎడమలేని కుడి, కుడిలేని ఎడమ పక్షికి ఉపయోగపడవు. ప్రజ్ఞ పదార్థముల కలయికయే సృష్టి. ప్రజ్ఞ పురుషుడు కాగ ప్రకృతి పదార్థమై అంతయూ యున్నట్లు గోచరించు చున్నది. ఇట్లన్ని విషయములందు అమ్మ వామతత్త్వమై నిలువగ వామదేవుడిగ శివుడు నిలచి యున్నాడు. అంద మంతయు వామ తత్త్వమునదే. గోచరించు సృష్టి అందమైనది. గోచరించని శివుడు అలక్షణుడు.



# 352. 'వహ్నిమండలవాసినీ'

**వ**హ్నిమండల మందు వసించునది శ్రీమాత అని అర్థము.

వహ్నిమండల మనగా సోమ, సూర్య, అగ్ని మండలములు. వహ్ని శబ్దము మూడను అంకెచే సంకేతించబడును. మూడు అగ్ని మండలములతోనే సృష్టి కార్యము నిర్వహింపబడుచున్నది. వీటిని త్రేతాగ్ను లని తెలుపుదురు. ఈ మూడగ్నులును ఆధారముగ త్రిలోకము లేర్పడుచున్నవి. ప్రజ్ఞామయ లోకము, శక్తిమయలోకము, పదార్థమయ లోకము అను మూడు లోకములనే సువర్లోకము, భువర్లోకము, భూలోకము అని అందురు. ఇవి మనయందు నేను అను ప్రజ్ఞగను, దైవాసుర శక్తులుగను, దేహముగను వర్తించు చుండును. పదార్థమందలి అగ్నిని పావకాగ్ని అందురు. జ్వాలవలె ప్రకాశించు అగ్నిని జ్వాలాగ్ని అందురు. ఆకాశమున ప్రకాశించు అగ్నిని విద్యుతాగ్ని అందురు. అవరోహణ మార్గమున ఈ అగ్నులే ఏడు లోకములను సృష్టించు చున్నవి. ఈ త్రేతాగ్నులను ఏడు అగ్నులుగను, 49 అగ్నులు గను కూడ పెద్దలు వివరింతురు.

20వ శతాబ్దమున పై తెలిపిన మూడగ్నులను పరమగురువు జ్వాలాకూలుడు సంపూర్ణముగ ఆంగ్లమున వివరించినాడు. 'Treatise on Cosmic Fire' అని నామకరణము చేసిన ఈ గ్రంథము నందు బ్రహ్మాండము నుండి పిండాండము వరకు అగ్ని ఏ విధముగ సృష్టి

కార్య మొనర్చినదో వివరించుట జరిగినది. ఈ వివరణము అత్యద్భుతముగ ఆస్తికులకు, శాస్త్రజ్ఞులకు ప్రేరణ ఇచ్చుచున్నది.

సృష్టి యొక అగ్నికార్యముగ శ్రీమాతయే నిర్వర్తించుచున్నది. అందు వర్తించునది కూడ ఆమెయే. మూలాధారము నందు మూడగ్నులు యున్నవి. సహస్రారమందు కూడ మూడగ్ను లున్నవి. శ్రీమాత స్వస్థానము సహస్రారము కాగ సృష్టి నిర్వహణమునకు అవరోహణ మార్గమున వ్యాప్తి చెంది మూలాధారమున వసించును. మరల ఆరోహణ మార్గమున ఆమె సహస్రారము చేరుటయే సృష్టి కథ. వ్యక్తిగతముగ ఇదియే జీవుని పరిణామ కథ కూడ. సోమాగ్ని విద్యుతాగ్నిగను, సూర్యాగ్ని జ్వాలాగ్నిగను భూమి యందలి వేడిమి పావకాగ్నిగను తెలియవలెను. అట్లే మన యందలి నేను అను ప్రజ్ఞ సోమాగ్ని వలన తెలియబడుచున్నది. అందుండి యేర్పడు శక్తి మన శక్తి సామర్థ్యములుగ గోచరించును. అట్లే మన శరీరమందలి వేడిమి పావకాగ్నిగ పేర్కొనబడినది. ఉపనిషత్తులలో ఈ మూడింటిని ప్రాజ్ఞుడు, తైజసుడు, వైశ్వానరుడు అని పిలుతురు. ఈ మూడగ్నుల ప్రభావము వలననే సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము యేర్పడు చున్నవి. ఇవి అన్నియూ శ్రీమాతపైనే ఆధారపడి యున్నవి. ఈ మూడు వహ్ని మండలములను సృష్టించి వానియందు వసించునది శ్రీదేవియే.



# 353. 'భక్తిమత్కల్పలతికా'

**భ**క్తజనులకు కల్పలతవలె ఇష్టమైన కోరికలను తీర్చునది శ్రీమాత అని అర్థము.

భక్తి మత్కల్పులు అనగా భక్తితో కూడినవారై కోరికలు తీరనివారు. వీని ప్రవర్తనమున భక్తియే గోచరించు చుండును. కాని జీవితమున కొన్ని అంశముల యందు సంపూర్ణత లేక కొంత అసంతృప్తులై యుందురు. ఇట్టి భక్తిమతులకు కల్పలతికవలె కోరికలను కూడ విస్తార ముగ పూరించి పరిపూర్ణ భక్తులను శ్రీమాత చేయుచున్నది. లతిక అనగా తీగవలె విస్తారముగ సాగునది. కస్తూరివలె సువాసన కలిగినది. కావున కల్పలతిక అనగా విస్తారముగ సువాసనలతో కూడినదై భక్తిమతుల కోర్కెలను శ్రీమాత పూరించు చుండును.

సంపద రెండు విధములుగ నుండును. ఆనందమును, వైభవమును ఇచ్చు సంపద. దుఃఖమును బంధమును కష్టములను కొనివచ్చు సంపద. రెండవ రకము సంపద దివ్య సంపద కాదు. మొదటి రకము సంపద సుగంధముతో కూడినదై యుండును. శ్రీమాత భక్తి కలవారి కోరికలు తీర్చి పూర్ణ భక్తులుగ తీర్చిదిద్దును.

భక్తియందు క్రమము, అక్రమము అను రెండు విధానము లున్నవి. క్రమము లేని ఆరాధన పూర్ణభక్తి కాజాలదు. మంత్రహీనత, క్రియాహీనత, భక్తిహీనతలతో ఆరాధించు భక్తులు కోకొల్లలు. వీరు

అసంపూర్ణముగనే జీవించు చుందురు. ఇట్టి వారికి శ్రీమాతయే సంకల్ప రూపమున క్రమమును నేర్పును. క్రమమును నేర్చిన భక్తులు క్రమముగ పూర్ణు లగుదురు. భగవద్గీత యందు కూడ ఈ విషయమే తెలుపబడినది. శాస్త్రము విధించిన విధానము ననుసరించి పూజించు వారికి సాన్నిధ్యము లభించునని, శాస్త్రము నుల్లంఘించు వారికి రజస్సు తమస్సు దోషము లంటి పూర్ణత్వము కలుగదని తెలుపబడినది. ఆరాధనకు సదాచారము, సంప్రదాయబద్ధత ప్రధానము. అవి అవసరము లేదనుట మెట్ట వేదాంతము. చిత్తశుద్ధి కలుగు వరకు విధానము ప్రధానము.



# 354. 'పశుపాశ విమోచనీ'

**ప**శుపాశముల నుండి విమోచనము కలిగించునది శ్రీమాత అని అర్థము.

తన మూలము తాను తెలియనివాడు పశువు. తాను అను ప్రత్యగాత్మకు మూలము పరమాత్మయే. పరమాత్మయే తానుగ నున్నాడు, ప్రత్యగాత్మగ నున్నాడు. ఈ అభేదస్థితి మరచుట మాయ. దీనినే అవిద్య అందురు. ఈ తెలియక పోవుటయే జీవులను పశువులుగ కోరికల వెంటపడి జీవించునట్లుగ చేయును. తాను వేరు, దైవము వేరు అనుకొనుచు ఉపాసించువారు పశువులని బృహదారణ్యక ఉపనిషత్తు చెప్పుచున్నది. దైవము లేక తాను లేదు. తాను లేకున్నను దైవ మున్నాడు. దైవము నుండి స్థితి భేదము చెందినవాడే జీవుడు. పిండి నుండి యేర్పడిన రొట్టెవంటి వాడు. పిండిలేని రొట్టె లేదు. కాని రొట్టె వేరు, పిండి వేరుగ గోచరించును. పిండిలో లేని గుణములు రొట్టెకు వచ్చును. అట్లే జీవుడు కూడ గుణములతో కూడినవాడై వేరుగ గోచరించును. ఇది స్థితి భేదమే గాని మూల మొక్కటియే. మూలము రకరకములుగ స్థితి భేదము చెందుచు నుండును. వివిధములగు గుణములను సంతరించుకొనుచుండును. అంత మాత్రమున మూలము కాకుండునా? వొట్టిపోయిననూ గోవు గోవే కదా! విరిగి పోయిననూ బంగారపు వస్తువు బంగారమే కదా! మూలమునకు ఎప్పుడునూ చేటు లేదు.

దైవమే తానుగ నున్నాడని తెలిసిననూ అది అను నిత్యమూ గుర్తుండుట వీలుపడని విషయమై యున్నది. దానికి కారణము శ్రీమాత మాయయే. ఆమె మహామాయ. మాయవలన జీవుడు తాను వేరుగ నున్నాడని భావించును. ఈ భావన ఆధారముగ జీవుడు ఆశ పడును. ఆశపడుట వలన పాశ మేర్పడును. పాశ మనగా పా, ఆశ్ ధాతువుల సమాహారము. ఆశ గలవా రగుటచేత జీవులు పాశాబద్ధు లగుచుందురు. ఆశాపాశము ఒకదాని నొకటి బలపరచుకొనుచు జీవుని పశువును బంధించునట్లు బంధించును. ఆకలి, దప్పిక, పూరింప లేని కోరికలు ఇత్యాదివి కలిగి బంధింపబడును.

ఇట్టి పాశములనుండి రక్షింప గలిగినది శ్రీమాతయే. కోరికలతో తిరుగాడు జీవునకు శివునిపై కోరిక కలిగించి పాశములనుండి విమోచనము కలిగించును. దైవమును చేరగోరు సంకల్పమే శివము.



# 355. 'సంహృతాశేషపాషండా'

**శే**షము లేకుండ పాషండులను నశింప జేయునది శ్రీమాత అని అర్థము.

పాషండత్వము కరడుగట్టిన అజ్ఞానము. ఇట్టి వారికి జ్ఞానము బోధించిననూ రుచింపదు. వీరు జ్ఞానమునం దరుచి, అజ్ఞానము నందు రుచి కలిగియుందురు. ధర్మము, శాస్త్రము, సదాచారము వంటి విషయములయందు ఏవగింపు కలిగి యుందురు. కేవలము ఆహార నిద్రా మైథునాదులలో మునిగి యుందురు. వాని విషయమున కూడ అశుచి మెండుగ నుండును. చేయకూడని పనులయందు ఆసక్తి మెండుగ నుండును. వితండ వాదములు చేయుచు పెద్దలను అవమానించుచు వికృతముగ ప్రవర్తించు చుందురు.

ప్రస్తుతము భరత ప్రజలను కలిధర్మము ఆక్రమించి యున్నది. రహదారులలోను, వాక్కుల యందు, విద్యాలయముల యందు కూడ యువతీ యువకులు స్వేచ్ఛ పేరున చాలా వికృతముగ ప్రవర్తించు చున్నారు. సిగ్గు, లజ్జ లేక సదాచారమును వర్జించి అడ్డగోలుగ ప్రవర్తించు చున్నారు. అట్లే సనాతనమగు ధర్మమును, ఆచారమును పాలకులు సహితము కించపరచు చున్నారు. పవిత్ర గ్రంథములను బహిరంగముగ ధ్వంసము చేయుచున్నారు. శ్రీరాముని విగ్రహ మూర్తులను కూడ చెప్పుల దండతో అలంకరించి ఊరేగించుట జరిగినది. ఇది అంతయూ

పాషండ తత్వమే. సజ్జనులు బలహీనులై చేయునది లేక మనస్థాపముతో వ్యథ చెందుచున్నారు. స్వేచ్ఛ స్వాతంత్ర్యము అను పదములకు నూతన నిర్వచనముల నేర్పరచి ఇంద్రియలోలురై దేహబద్ధులై దేహమే తా మనుకొనుచు జీవించు చున్నారు.

ఇట్టి పాషండత్వము తొలగించుట మానవ సాధ్యము కాదు. దైవమే దిగివచ్చి ఈ పాషండత్వమును సంహరింపవలెను. రామ కృష్ణాది అవతారముల యందు ఇట్టి సంస్కరణమే జరిగినది. ప్రస్తుత కాలమున సదాచార ప్రవర్తకులు దివ్యావతరణమునకే ప్రార్థనలు సలపవలెను. శ్రీమాత సంకల్పమే రూపము దాల్చిన దివ్యత్వము. పూర్వము సృష్టి యందు ఎందరినో పాషండులను సంహరించి ఆమె జీవుల నుద్ధరించినది. ప్రతి మానవుడు సదాచారమున రక్షింపబడినచో తన యందలి పాషండత్వమును నిర్మూలించుకొనవలెను. అందులకే ఈ నామము.



# 356. 'సదాచార ప్రవర్తికా'

వేదశాస్త్రమునందు తెలుపబడిన సదాచారమును వర్తింప చేయునది శ్రీమాత అని అర్థము.

యజ్ఞము, దానము, తపస్సు సదాచారముగ తెలుపబడినవి. యజ్ఞార్థ జీవనము ఒక్కటియే జీవులకు బంధ విమోచనము కలిగించును. జీవిత సన్నివేశముల యందు స్వార్థ చింతనము బంధ కారణమై నిలచును. పరార్థ చింతన పరమునకు దారి చూపును. లోకహిత జీవనమే యజ్ఞార్థ జీవనము. జీవితము యజ్ఞార్థము కాకున్నప్పుడు చిక్కుపడి జీవుని బద్ధుని జేయును. బద్ధుడైన జీవుడు బంధ మోచనమునకై ప్రయత్నించును. క్రమముగ యజ్ఞార్థ జీవనమే బంధ మోచనమునకు పరిష్కారమని తెలిసికొనును. స్వహితము కొఱకు గాక పరహితము కొఱకు జీవించుట ఆరంభించును. ఇట్టి క్రియా జ్ఞానము స్థిరపడు చుండగా తన యందలి ఇచ్ఛ పరహితేచ్ఛగా మారును.

ఇచ్ఛ, క్రియలు పరహితమునకే సమర్పింపబడగ జీవుడు సాత్త్విక అహంకారమున స్థిరపడినపుడు జ్ఞాన మనుగ్రహింపబడును. అట్టివాడు తనవద్ద జేరిన సమస్త విద్యలను, శక్తిని, ద్రవ్యమును పరహితమునకే సమర్పించుట దానమగును. యజ్ఞము దానము సహజ లక్షణము లైనవారికి మాత్రమే తపస్సు ఫలించును. తపస్సు ఆధారముగ దైవమే తానని, దేవుడే జీవుడుగ నున్నాడని తెలియును. ఇట్టి యజ్ఞ, దాన, తపస్సుల యందు జీవులను క్రమముగ ప్రవర్తింప జేయునది శ్రీమాత.

ప్రతి జీవుని కథ యందు స్వార్థ చింతనచే చిక్కుల యందు పడుట, ఆర్తుడు, అర్థార్థుడు అయి గతి లేక దైవమును ప్రార్థించుట, దైవప్రార్థనమున కొంత చిక్కులు సడలగ దైవమునందు ఆసక్తి కలుగుట, అట్టి ఆసక్తి కారణముగ దైవముచే అనుగ్రహింపబడుటకు సదాచార ముల నవలంబించుట జరుగుచున్నది. ఇట్లు జీవులందరిని సదాచారమునకు శ్రీమాతయే మళ్ళించు చున్నది. దుర్బలుర నందరిని సదాచార మార్గమున బలవంతులను చేయుట శ్రీమాతయే జరుపు చున్నది. దుష్టులను సంహరించుచు దుర్బలురను తీర్చిదిద్దుచు సృష్టి చక్రమును నిర్వర్తించునది శ్రీమాతయే. సదాచారమున ప్రవర్తింప చేయుట శ్రీమాత ముఖ్య కార్యములలో నొకటి.



# 357. 'తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా'

**తా**పత్రయము లనెడు అగ్నిచే తపించు జనులకు వారి తాపము లను పోగొట్టి ఆహ్లాదము కలిగించు వెన్నెల వంటిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత యందు సమర్పితమైన కర్మాచరణము తాప త్రయము లను పోగొట్టుటకు మందుగా పనిచేసి తాపత్రయము లుడుగుటచే వెన్నెలవలె మనసునకు ఆహ్లాదమును కలిగించును. ఆధిభౌతిక తాపము, ఆధిదైవిక తాపము, ఆధ్యాత్మిక తాపము అను మూడును తాపత్రయ ములు. తన దేహమునకు, తన బంధు మిత్రాదులకు తన వస్తువులకు సంబంధించిన తాపము ఆధి భౌతిక తాపము. సంచిత ప్రారబ్ధ కర్మల వలన కలుగు భయము కోపము, ద్వేషము, ఈర్ష్య, అసూయ, లోభ మోహాదులు ఆధి దైవిక తాపము. తనను గూర్చిన తాపము ఆధ్యాత్మిక తాపము. ఈ మూడును కలిసి తాపత్రయములు అనబడును.

సంసార జీవులకు తాపత్రయములు తప్పవు. సుఖమునకై యత్నించుచు వారు తాపత్రయాగ్నిలో ఉడికిపోవు చుందురు. చేసిన ప్రతి కర్మ, పలికిన ప్రతి మాట కొంత దోషముతో కూడిన దగుటచే ఫలితములను గూర్చిన కోరికలలో చిక్కుకొనుట జీవులకు తప్పదు. పనుల వలన కర్మలు బంధించుట, బంధము వలన ఉడుకుట జరుగు చుండును.

ఇట్టి తాపత్రయములకు పరిష్కారము దైవమునకు సమర్పితమైన జీవితమును స్వీకరించుటయే. జీవుని బుద్ధి, కర్మల ననుసరించి నడచును. కావున సతతము చిక్కుకొనుట జరుగుచునే యుండును. జీవితము చిక్కులు పడుచున్నకొద్ది తాపము పెరుగుచుండును. దేహ తాపము, భావతాపము, మరణించిన వెనుక తా నెటుపోవునో అన్న భయము పీడించు చుండగ జనన మరణముల ఊబిలో పడిపోవును. తనయందు కలుగు సంకల్పములు, తన చేతలు, తన మాటలు తన వశములో నుండనపుడు తరించుటకు ఉపాయము ఒక్కటియే యున్నది. అంతయూ భగవదర్పితము చేయుచు జీవించుట.

పై తెలిపిన సమర్పణ మార్గమును శరణాగతి మార్గ మందురు. "నాకు కలుగు భావములు, నేను పలికెడు పలుకులు, నా చేతలు, నేను, నావి అనుకొనుచున్నవి అన్నియూ నీకే సమర్పితము. నన్ను అనుగ్రహించి ఉద్ధరించుకొనుము." అని ప్రార్థించుట, తప్పు ఒప్పులతో సంబంధము లేక తన నుండి నిర్వర్తింపబడుచున్న సమస్తమును దైవము నకు సమర్పణ చేయుట ఇందలి ముఖ్య సూత్రము. అట్టి వానికి కష్ట నష్టములు కలుగుచున్ననూ దైవానుగ్రహముగనే స్వీకరించును.

శరణాగతి మార్గము చాల ధైర్య సాహసములతో కూడినది. తనను, తన వారిని, తన సమస్త సంపదను తన యందలి స్వభావమును అన్నింటినీ దైవమునకు సమర్పించుట ధీరులు చేయు పని. మహా భక్తు లిట్లే నిర్వర్తించి దైవ సమానులై వెలుగుచున్నారు. మార్గదర్శకులై నిలబడి యున్నారు. అట్టివారి మనస్సులు పూర్ణ చంద్రుని వలె వెన్నెలను, కాంతిని ప్రసరింప జేయుచుండును.

# 358. 'తరుణీ'

ఎల్లప్పుడునూ యౌవనవతియై యుండునది, గోచరించునది శ్రీమాత అని అర్థము.

పదహారు కళలతో కూడిన శ్రీమాత పదహారు సంవత్సరముల వయస్సుగల స్త్రీమూర్తి వలె దర్శన మిచ్చుచుండును. శ్రీరాముడు శ్రీకృష్ణుడు కూడ ఎల్లప్పుడునూ పదహారు వత్సరముల వయస్సుగల వారివలె గోచరించెడివారు. శతాధిక సంవత్సరములు జీవించిననూ వారు ఎప్పుడునూ పదహారు సంవత్సరముల యువకుల వలెనే గోచరించెడివారు. నేటికిని వారి దర్శన మట్లే యుండును. పూర్ణ కళలతో కూడిన దేహము పదహారు సంవత్సరముల కేర్పడును. అట్టి దేహము అతి సుకుమారముగ నుండును. పవిత్రముగ నుండును. అందముగా నుండును. ఈ రూపమునే తపస్వి జనులు ఆరాధింతురు.



# 359. 'తాపసారాధ్యా'

**తా**పసులచే ఆరాధింపబడునది శ్రీమాత అని అర్థము.

జన్మ తాపములనుండి తరించుటకు తపస్సు ఒక ఉపాయము. జన్మ తాపములు మూడుగ ముందు నామములలో తెలుపబడినవి. వాని నుండి విమోచనము చెందుటకు సతతము శ్రీమాత నారాధించుట ఉత్తమోత్తమ ఉపాయము. ఆరాధన మనగా సర్వకాల సర్వావస్థల యందును శ్రీమాత చైతన్యమునే అంతట అన్నిట దర్శించు ప్రయత్నము. పంచ భూతములుగను, జీవుల ఆకారములుగను, కనపడు వస్తువుల ఆకారములుగను, వాని వాని స్వభావములుగను శ్రీమాతయే యున్నదని భావించి దర్శించుటకు చేయు ప్రయత్నమే ఆరాధన. ఇట్టి ఆరాధనము నకు సకాలము అకాలము లేదు. అన్ని కాలముల యందు దర్శన చింతన యుండును. పుణ్య ప్రదేశములు, హీన ప్రదేశములు అని లేదు. అన్ని ప్రదేశముల యందు దర్శన చింతనయే యుండును. పాప రూపములు పుణ్య రూపములు లేవు. అన్ని రూపములందునూ శ్రీమాతనే దర్శించు ప్రయత్న ముండును. అట్లే అన్ని నామములు కూడ శ్రీమాతవే అను భావము వుండును. ఇట్లు భావించుట దర్శించుట నిజమగు తపస్సు. ఇట్టి తపస్సు చేయువారికి క్రమముగ అన్నిటియందు శ్రీమాత దర్శనము జరుగుట ఆరంభించును. విశ్వాత్మకమగు శుద్ధ చైతన్యము శ్రీమాతయే గనుక అది మాత్రము నిలచి ఇతరములు బాధింపని స్థితి ఏర్పడును. ఇట్టి అనన్యస్థితిలో తాపములు హరింపబడి తపస్సు చేయు జీవులు ఉద్ధరింపబడుదురు. ఈ ప్రయోజనమునకే శ్రీమాత ఆరాధనము.

# 360. 'తనుమధ్యా'

**స**న్నని నడుము కలది శ్రీదేవి అని అర్థము.

శరీరము మధ్యభాగము అని తెలుపునది ఈ నామము. నడుము మధ్యభాగ మగుటచేతను మధ్యా అందురు. సృష్టి భగవంతుని శరీరము. దానియందు కూడ మధ్యభాగమున నుండునది శ్రీదేవి. తనువును రథము అని కూడ అందురు. రథము మధ్య భాగమున నుండునది అని కూడా తెలుపుచూ శ్రీ సూక్తమున, శ్రీమాతను 'రథమధ్యా' అని కూడ అందురు.

అవ్యక్తమునకు వ్యక్తమునకు మధ్య నుండునది చైతన్యము, ఆమె శ్రీమాత. లోకమునకు లోకమునకు మధ్య నుండునది శ్రీమాత. లోపలకు వెలుపలకు మధ్యనుండునది శ్రీమాత. తాను శుద్ధ చైతన్యమే అయిననూ తన సృష్టి యందు ఆవరణలు ఏర్పరచుచూ లోకములకు నడుమ మరియు లోకములుగను నుండునది శ్రీమాత. అణువునకు అణువునకు మధ్య నుండి పరస్పరత నేర్పరచుచు నుండును. అందు వలన ఆమెను 'ఆర్ద్రాం' అని కూడ పిలుచుదురు.

ఇట్లు సమస్త వస్తువుల నడుమ, లోకముల నడుమ, దేవునికి జీవునికి నడుమ తానున్ననూ వున్నట్లు తెలియబడదు. సన్నని నడుము అనగా ఇదియే. జీవునికి దేవునికి నడుమ నుండుటచే ఆమెను దాటుట దుర్లభము. ఆమె అనుగ్రహముగనే జీవుడు దేవుని చేరగలడు. శ్రీమాత

మధ్యవర్తి. ఇరుజీవుల మధ్య కూడ ఆమెయే మధ్యవర్తి. ప్రేమతో కలియుటకుగాని, ద్వేషముతో విడిపోవుటకు గాని కారణము ఆమెయే. జీవుల యందు స్వభావమై నిలచి రాగద్వేషములను జీవుల సంస్కార మును బట్టి పెంపొందించు చుండును. స్వభావములను సంస్కరించును కూడ. సమస్తము నందూ తనను గుర్తించి ఆరాధించు వారికి పరస్ప రత్వమును అనుగ్రహించును. జీవులను కలుపుటయే గాక దైవముతో కూడ జీవులను కలుపును. అన్ని విషయములయందు ఈమెయే మధ్యస్థ అని తెలియవలెను.



# 361. 'తమోపహా'

అజ్ఞానమును హరించునది శ్రీదేవి అని అర్థము.

అజ్ఞానమే సమస్త ఘర్షణములకు కారణము. అజ్ఞానము లేనివారికి సృష్టి అంతయూ దివ్యమే. సృష్టికార్య మంతయూ దివ్య లీలయే. అజ్ఞానము వలననే అష్ట బంధములునూ. అజ్ఞానమున నున్న వానికి ఇచ్ఛా, జ్ఞాన, క్రియలు అవకతవకలతో కూడి యుండును. తమ యందు ఇచ్ఛ భాసించుట సక్రమముగ నుండదు. దేనిని కోరవలెను అనునది స్పష్టముగ తెలియక తికమక పడుచుందురు. అట్లే క్రియ యందు కూడ తికమక పడుచుందురు. త్రిగుణములు, పంచేంద్రియ ములు జీవుని దేహబద్ధుని చేయును. లోకబద్ధుని కూడ చేయును. అజ్ఞానమే సమస్త దుఃఖములకు కారణము.

ఏది జ్ఞానము? ఏది అజ్ఞానము? దైవమే తానుగ నున్నాడని తెలిసియుండుట జ్ఞానము. తా నున్నా నని మాత్రమే తెలిసియుండుట అజ్ఞానము. తా నున్నాడని మాత్రమే తెలిసినవానికి సహజముగనే తాను ఇతరులు అన్న భావము వుండును. అది కారణముగ తరతమ భేద ముండును. అది కారణముగ ద్వంద్వము లుండును. రాగ ద్వేషములు, కామక్రోధములు, లోభమోహములు, మద మాత్సర్యములు ద్వంద్వములు. వీని నుండి బైటపడుటకు ఒక్కటే ఉపాయ మున్నది. దైవమే తానని, దైవమే సమస్తమని, నిజమున కేదియూ దైవముకన్న

వేరు కాదని, వున్నది దైవమే యని తా నుండుట భ్రాంతియే యని తెలియుట. ఇట్లు తెలిసిననూ మరపు కలుగును. అట్లు మరుపు కలుగ కుండుటకు శ్రీమాత అనుగ్రహ ముండవలెను. తెలిసిననూ మరపు కలుగుట మాయ. శ్రీమాత 'మహామాయా' అని స్తుతింపబడు చుండును. జ్ఞానులకు కూడ మాయను కల్పింప గలదు. అపుడు వా రజ్ఞానమున పడుదురు. అజ్ఞానము కలిగించునది, తొలగించునది కూడ శ్రీమాతయే. ఆమె అనుగ్రహమే నిత్యము కోరవలసినది. అనుగ్రహ మున్నచోట అజ్ఞానము హరింపబడును.



# 362. 'చితిః'

'**చి**తిః' అనగా చైతన్యము అని అర్థము. అనగా శ్రీమాత సహజముగ చైతన్యము అని అర్థము.

స్వతంత్రమైనది, సిద్ధికి విశ్వసిద్ధికి కారణమైనది చిత్ అని నిర్వచింపబడినది. జీవుడు కూడ చైతన్య స్వరూపుడే. కాని అతడు ప్రకృతికి లోనై వుండుటచే అస్వతంత్రుడై యుండును. ప్రకృతికి లోబడని జీవుడు శుద్ధ చైతన్య స్వరూపుడు. అతడు గుణముల నాశ్రయించి అహంకార స్వరూపు డగును. బుద్ధి అను చైతన్య ప్రజ్ఞ అతనికి తోడుగ నుండును. అటుపైన మనస్సు నాశ్రయించి యింద్రియములను చేరును. అపుడు చిత్తమను ప్రజ్ఞ సహాయ పడుచుండును. ఇట్లు నాలుగు స్థితు లలో చైతన్యము మానవునియందు శుద్ధ చైతన్యముగను, అహంకారము గను, బుద్ధిగను, చిత్తముగను యుండును. ఇందు మొదటిది మనలోని దైవము. రెండవది మనము. మూడవది మనయందలి విచక్షణా జ్ఞానము. నాలుగవది మన యందలి స్వభావము ప్రవర్తింపజేయు ప్రజ్ఞ. దీనినే వరుసగ పరా పశ్యంతి మధ్యమ వైఖరి వాక్కులుగ తెలుపుదురు. అట్లే వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు అనిరుద్ధుడు అను నాలుగు స్థితులలో వసించు పురుషునిగ తెలుపుదురు. ఈ నాలుగు అంశముల ఆధారముగనే జీవుడు దేహమున వసించుట, వర్తించుట యున్నది.

కేవలము మనస్సున వసించుట ఒక పాదము వసించుటగనే తెలియవలెను. బుద్ధికి చేరినచో రెండు పాదముల నాక్రమించినట్లు. అహంకారమును దాటినచో నాలుగు పాదములు వసించును. అహంకారము దాటనిదే స్వతంత్రత లేదు. మనస్సు, బుద్ధి, అహంకారము దాటుట త్రివిక్రమత్వము. అట్టివాడు శుద్ధ చైతన్యుడై వెలుగొందును. అతడు అపుడు శ్రీదేవితో ఐక్యము చెంది యుండును. మానవుని యందు ఈ నాలుగు స్థితులు సామ్యము చెందినచో అతడు సిద్ధుడగును. సిద్ధుడే స్వతంత్రుడు కూడ. అట్టి సిద్ధి శ్రీమాత అనుగ్రహము.



# 363. 'స్తత్పదలక్ష్యార్థా'

'**తత్**' పథమును చేర్చుటయే లక్ష్యముగా గలది శ్రీమాత అని అర్థము.

'తత్' అనగా బ్రహ్మము. ఈ బ్రహ్మము అనిర్వచనీయము. చర్చనీయాంశము కానిది. తర్కమున కందనిది. ప్రజ్ఞకు మూలము. సృష్టి యున్నపుడు లేనపుడు కూడ నుండునది. సృష్టికి మూలమైనది. ప్రకృతి పురుషుల కాధారమైనది. స్త్రీ, పుంలింగములకు మూలమై స్త్రీయు పురుషుడు కాక యుండునది. పరబ్రహ్మము అని, శుద్ధ బ్రహ్మము అని దీనిపేర్లు. దీనిని చేరినవారు తాము లేక అది అయి వుందురు. అదియే మోక్ష స్థితి. దీనిని పరము అని కూడ అందురు. దీని చేరు మార్గము పరమపదము లేక తత్పథము.

జీవులను తత్పథము చేర్చుటకు శ్రీమాత నిత్యము కృషి సల్పుచు నుండును. జీవులు శ్రీమాత బిడ్డలు. వారందరూ పరిపూర్ణులు కావలెనని లక్ష్యముగాగొని సృష్టి నిర్మాణమును గావించును. జీవులకు దేహము నేర్పరచి సృష్టిలోకముల ప్రవేశింపజేసి శిక్షణ నిచ్చును. శిక్షణ ఇచ్చుటలో భాగముగ జ్ఞానమును అందించును. కార్యోన్ముఖులను చేయును. ఇచ్ఛా జ్ఞాన క్రియల ద్వారా పరిపూర్ణులను చేయును. అవసరమగుచో శిక్షించును. ఎప్పుడునూ హెచ్చరికగ సూచించును. సృష్టి ధర్మముల నవలంబింపజేసి జీవులను తత్పథమునకు నడుపును.

జీవులందరూ తమ వృద్ధికై తాము కృషి చేయుట శ్రీమాత సంకల్పమే. ఏ పని చేసిననూ జీవుడు తన వృద్ధి కొఱకే చేయును. అట్లు చేయుటలో ధర్మము లోపించినపుడు, వృద్ధి చెందుట కుంటు పడును. తప్పక ధర్మము నాచరించుచు శిక్షణను అందుకొనును. అట్లందించి ముందుకు నడుపుట శ్రీమాత కృషి. కోటానుకోట్ల జీవుల విషయమున ఒకే లక్ష్యమును నిర్వర్తించు శ్రీమాత కారుణ్యము నిర్వచించుట అసాధ్యము. అసామాన్యమైన కారుణ్యము. ఇట్టి మహత్తర లక్ష్యమును నిర్వర్తించు శ్రీమాతకు జీవు లెప్పుడునూ కృతజ్ఞులై వుండ వలెను కదా!



# 364. 'చిదేక రసరూపిణీ'

చైతన్యముతో కూడిన ఆనందరస రూపము శ్రీమాత అని అర్ధ వుం.

శ్రీమాత చైతన్యరూపిణి అనునది విదితమే. సృష్టి చైతన్యమే శ్రీమాత. చైతన్యము నుండియే సమస్తము భాసించును. ప్రజాపతులు, రుద్రులు, ఆదిత్యులు, సనకసనందనాది బ్రహ్మ మానస పుత్రులు, మానవులు, సప్తఋషులు, దేవతలు, లోకములు, లోకస్థులు, సమస్తము శ్రీదేవి మహాచైతన్యము నుండి ఏర్పడినవే. చైతన్యము నందు సహజముగ భాసించునవి యోగము, ధర్మము, ఆనందము. శ్రీమాత యోగిని, ఆమె సృష్టి కావల బ్రహ్మముతో యోగము చెంది యుండును. సృష్టి కీవల ఈశ్వరునితో యోగము చెంది యుండును. ఎట్లైనను, తాదాత్మ్యము చెందియే యుండును.

బ్రహ్మము నుండి వేరై బ్రహ్మముతో కూడియుండుట ఒక దివ్య మగు అనుభూతి. కూడియుండుట వలన ఆనందానుభవము వుండును. రసానుభూతి యుండును. ఏకమై యున్నచో యుండుటయే యుండును గాని అనుభూతి యుండదు. అనుభూతి పరాకాష్ఠకు చేరినపుడు రసానుభూతి యుండును. మనము మధురమగు పదార్థమును భుజించి నపుడు మధురానుభూతి యుండును. అది యోగము. మనమే మధురమైన పదార్థ మైపోయినచో అనుభూతి యుండదు. చక్కెర తనకు

తాను తీపి కాదు. జీవుల నాలుకకు తీపి. నాలుక తనకు తాను తీపి కాదు. నాలుకపై చక్కెర పడినపుడు తీపి అనుభూతి కలుగును.

ఇట్లు జీవుడు దేవుడే అయిననూ జీవుడిగా విడిపడి దేవునితో అనుసంధానము చెందినచో మధురానుభూతి చెందును. అది యొక తీపి అనుభవము. తాదాత్మ్యము చెందును. దేవునితో యోగమున పొందు అనుభూతి అనందానుభూతికి పరాకాష్ఠ. దానిని బ్రహ్మానంద మందురు. తాను బ్రహ్మమే అయిపోయినచో యిక అనుభూతి యుండదు.

శ్రీమాత ఈశ్వరునితో కూడియుండుట, బ్రహ్మముతో కూడి యుండుట చేయునని శాస్త్రములు తెలుపుచున్నవి. అట్లు కూడి యుండి ఆమె శాశ్వత రసానందమున నున్నది. బ్రహ్మమనగా అకర్తృత్వ ధర్మము కలవాడు. అది తత్త్వము. తత్త్వము వుండుటయే గాని చేయునదేమియు లేదు. బ్రహ్మము సృష్టికి ఆవల యుండును. పరమై యుండును. అందులకే పరబ్రహ్మ మందురు. ఈశ్వరుడు కూడ బ్రహ్మమే. అతడు సృష్టి యందు వుండును. సృష్టికి స్వామి యతడు. అతని అధ్యక్షతనే సృష్టి జరుగును. సృష్టి మొత్తమునకు అతడే ప్రభువు. అతనికి కర్తృత్వ ధర్మ మున్నది. ఇట్టి ఈశ్వరునితో ఎప్పుడునూ కూడి యుండునది శ్రీమాత. మహత్తు నుండి అణువు వరకు అన్నిటి యందు ఈశ్వరు డున్నాడు. ఆ ఈశ్వరునితో కూడియుండియే అంతయూ నిర్మాణము చేయుచు ఆనందముగ నుండునది శ్రీమాత. ఆమె ఆనందము ఈశ్వరునితో కూడియుండుట వలన కలుగు ఆనందము.

మనయందు మూలాధారమున ఈశ్వరునితో కూడి యున్నది. సహస్రారమున కూడ ఈశ్వరునితోనే కూడి యున్నది. ఇట్లు సతతము కూడి యుండుట వలన రసానుభూతిని పొందుచు రసరూపిణిగా నున్నది. జీవులకు ఆనందానుభూతి, ఈశ్వరానుభూతి కలుగజేయు నది శ్రీమాతయే. ఆమె అనుగ్రహము లేనిదే ఆనందము కలుగదు. యోగము జరుగదు. ఈశ్వరునితో రసలీల సాధ్యపడదు.

పై రసానుభూతిని జగదీశ్వరుడగు కృష్ణునితో కూడి పొందవలె నను తపన గల గోపికలు, కాత్యాయనీ దేవిని ప్రార్థించుట యందు గల రహస్య మిదియే. కృష్ణుని ప్రార్థించినచో రసానుభూతి నివ్వడు. కాత్యాయనీ దేవిని ప్రార్థించినపుడు ఆమె అనుగ్రహించుట చేత రసాను భూతిని గోపికలకు పరమాత్మ అందించినాడు. గోపిక లందరూ ఒకరి నొకరు కృష్ణునిగ చూచి పరమానంద భరితులై పరవశముతో రాసలీల గావించినారు.



# 365. 'స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః'

**త**న ఆనందమందు అనుభూతములైన త్రిమూర్త్యాదుల ఆనందముల సంతతి కలది శ్రీమాత అని అర్థము.

ఈశ్వరానందము లేక బ్రహ్మానందము సతతము అపరిమితముగ అనుభవించినది శ్రీమాత. అట్లు అనుభవించు చున్ననూ సృష్టికార్యము జరుపుచునే యుండును. కర్తృత్వము నిర్వహించుట, దైవము నందుండుట ఏక కాలమున జరుగుచున్నవి. ఇది శ్రీమాతకే సాధ్యము. కర్తృత్వ నిర్వహణమున నిలచి యున్నప్పుడు ఈశ్వరునితో కూడి యుండుట అంతగ వీలుపడదు. కర్తృత్వ మున్నప్పుడు అహంకార ముండును. అహంకారము లేక కర్తృత్వము లేదు. ఈశ్వరునితో కూడి తాదాత్మ్య ఆనందమున నున్నప్పుడు కర్తృత్వ ముండదు. దానికి కారణము అహంకారము కరగి యుండుటయే. అట్టి స్థితిలో బ్రహ్మా నందము పొందుచూ సృష్టి కార్యములు చక్కపెట్టుట ఎట్లు సాధ్యము? శ్రీమాత కిది సాధ్యమై నిలచినది. పరమ భక్తులకు కూడా ఇది సాధ్య పడినది. తాము దైవము నందు లీనమై యున్నప్పుడు పనులు తాము చేయుటగా గాక తమ నుండి జరుగుచుండును. అపుడవి దివ్యముగ కూడ జరుగు చుండును. ఈ స్థితికి పరాకాష్ఠ శ్రీమాత.

తాను దైవము నందుండిననూ సృష్టి జరుగుటకు సంతతిగ

లవీ భూతముల నేర్పరచునది శ్రీమాత. లవీ భూతము లనగా సృష్టి, స్థితి, లయము అను కార్యములు నిర్వహించు ప్రజ్ఞలు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు శ్రీమాత సంతతి. వారిచే సృష్టి కార్యములను నిర్వర్తింప చేయునది శ్రీమాత. వారునూ శ్రీమాత భక్తులే అగుటచే కర్తృత్వ అహంకారమున గాక ఈశ్వరునియందే అధిక చింతన కలిగినవారై యుందురు. కర్తృత్వము నిర్వర్తింపబడు చుండును. కాని వీరి ఆనందము శ్రీమాత ఆనందముతో పోల్చదగినది కాదు. శ్రీమాత సంతతి పొందు ఆనందము కన్న తాను పొందు ఆనందము మిక్కుటము. సంతతి కలుగుచుండగ వారికి కర్తృత్వ భావము పెరుగుచున్న కొలది బ్రహ్మానందము తగ్గుచుండును. త్రిమూర్తుల ఆనందముకన్న ఆదిత్యుల ఆనందము, రుద్రుల ఆనందము, వసువుల ఆనందము మరికొంత తక్కువగ నుండును. ఆదిత్యులలో పూషుడు, రుద్రులలో శంకరుడు, పూర్ణానందము కలిగి యుందురు. భగవద్గీత యందలి విభూతి యోగములో శ్రీకృష్ణుడు పేర్కొనిన వారందరునూ ఇతరులతో పోల్చినపుడు అధికులు. అనగా ఆనందమున అధికులు.

ఆనందము లవలేశము కూడ లేనివారి నుండి ఆనందము పరిపూర్ణమై యున్నవారి వరకు అందరునూ శ్రీమాత సంతతియే. అహంకార భావము హెచ్చుతగ్గులను బట్టి, ఆనందము హెచ్చుతగ్గులుగ నుండును. అహంకారము దాదాపుగ లేనటువంటి సనక సనంద నాదులు, సప్తఋషులు, మనువులు, నారదుడు, వశిష్ఠుడు, అగస్త్యుడు, గౌతముడు, పూర్ణానంద స్వరూపులుగ తెలుపబడుదురు.

# 366. 'పరా'

శ్రీమాత పరతత్త్వమే అని అర్థము.

సృష్టికి ఆవల యున్న తత్త్వమును 'పర' అందురు. దానిని గూర్చి వివరించుట శక్యము కాదు. ఆ తత్త్వ మెట్లున్నదో తెలుసుకొన గోరువాడు తెలుసుకొను ప్రయత్నమున దానిలో ఇమిడి పోవును గనుక తెలుసుకొన వీలుపడదు. ఈ తత్త్వము సృష్టి యున్ననూ లేకున్ననూ యుండును గనుక దీనిని 'సత్యము' అనిరి. ఎప్పుడునూ యుండునది గనుక వున్నది అని కూడ అందురు. మనము "వున్నాము" అని భావించుట కూడ దాని వలననే. అదియే అన్నిటికీ మూలము.

దీనినే మన వాఙ్మయమున 'పరబ్రహ్మము' అనిరి. అనగా బ్రహ్మమునకు కూడ పరమని అర్థము. అట్లే పరమశివుడు అనియు నారాయణు డనియు కూడా అందురు. సృష్టి సమస్తమునకు పరమైనటు వంటి తత్త్వమిది. ఈ తత్త్వము నుండి అనేకానేకములు పుట్టుచుండిననూ దానియందు మార్పు యుండదు. ఎట్టి మార్పునకు అది గురికాదు. ఈ తత్త్వము వున్నదనిగాని, లేదని గాని చెప్పుటకు వీలులేదు. మన ముండుట అది యుండుటయే గనుక వున్నది అని తెలుపుచుందురు. మాయతో సహా ఏ భూతములు పుట్టక ముందు వున్న స్థితి అగుటచే దీనిని తెలుపుట సాధ్యము కాదు. దానికి ఏ లక్షణములు లేవు. అన్ని లక్షణములు అందుండియే పుట్టును. అందే ప్రజ్ఞయూ లేదు. ప్రజ్ఞ

లన్నియూ అందుండియే దిగివచ్చినవి. దీనిని తెలిసిన వారు కొందరు శూన్య మనిరి. కొందరు పూర్ణ మనిరి. వేదములలో దీనిని "అది" అని పిలిచిరి. అనగా ఈ తత్త్వము స్త్రీ కాదు. పురుషుడు కాదు. నపుంసకము కాదు. దీనిని నిర్వచించుట దుర్లభము. పుట్టిన వాటికి నిర్వచనము లుండును గాని, పుట్టని దానికి నిర్వచన ముండదు. దీనికి పుట్టుక లేదు గనుక చావునూ లేదు. కాలము కూడ దీని నుండే పుట్టినది గనుక కాలమున కతీతము. దీని గూర్చి తెలుసుకొను వారికి ఆధార ముగ నుండును. కనుక తెలియబడదు.



# 367. 'ప్రత్యక్చితీ'

**అం**తర్ముఖముగ ఆత్మదర్శనము చేయుచు నుండునది శ్రీమాత అని అర్థము.

ప్రత్యక్చితినే ప్రతీచి యని కూడా అందురు. అవ్యక్తమగు పర తత్త్వము నుండి విడివడి ఎదురుగ నిలచి పరతత్త్వమునే దర్శనము చేయుట ప్రత్యక్చితి అందురు. పశ్చిమమున నుండి తూర్పును దర్శించుట వలన కూడ ప్రతీచి అని పిలువబడును. శుద్ధ చైతన్యముగ అవ్యక్తము నుండి ప్రత్యేకముగ విడువడినది గనుక ప్రత్యక్చితి అని పిలుతురు. ప్రళయము పిదప సృష్టి ప్రారంభమునకు మొదటి మేలుకొలుపై ఏర్పడు సంకల్పము అని తెలియదగును. నిద్ర నుండి అపుడపుడే యేర్పడుచున్న ప్రాగ్ అవస్థ అనికూడ తెలియవచ్చును. ఈ అవస్థను విచికీర్ష అని కూడ అనవచ్చును. ఇచ్ఛ కారణముగ నిద్ర నుండి మెలకువ వచ్చును. కావున ప్రథమమగు ఇచ్ఛయే విచికీర్ష అనవచ్చును. విచికీర్ష ఉద్భవించి ఈవలకు వచ్చి అభిముఖమై వున్నప్పుడు ప్రత్యక్చితి అందురు. అనగా చైతన్య రూపమున ప్రత్యేకమై ఎదురుగ నిలబడినది అని అర్థము. విడివడి ప్రత్యేకముగ నున్ననూ ఆత్మనే దర్శించు స్థితి, ఆత్మజ్ఞానము నందున్న స్థితిని ప్రత్యక్చితి అని నిర్వచింపవచ్చును. ఈ ప్రత్యక్చితి ఆధారముగనే త్రిగుణాత్మకమగు తత్త్వమున కాధారమైన అవ్యక్తము పుట్టుచున్నది. ఈ బిందువు నుండియే కార్యము, కారణము, నాదము పుట్టుచున్నవి.

మరల సృష్టి ప్రళయములోనికి పోవునపుడు కూడ చిట్టచివరగ నుండునది ప్రతీచియే లేక ప్రత్యక్చితియే. అవ్యక్తమైన బ్రహ్మరూపము కలిగి అంతర్గతమైన జ్ఞాన స్వరూపమై నిలచునది ప్రతీచియే. మనము నిద్రనుండి మెలకువ గాంచు స్థితి ఇది. నిద్ర యందు వున్నామని కూడ తెలియదు. నిద్ర నుండి మెలకువ కలుగుచున్నప్పుడు వున్నామని మెర మెర మాత్ర ముండును. నిద్ర కూడ యుండును. ఇతర భావము లేవియూ వుండవు. తన అస్తిత్వము తన కేర్పడుచుండును. ఇతరము లేవియూ లేవు గనుక అవ్యక్తము. అటుపైన ఏర్పడునవి కారణ, కార్యములు. దానికి మూలము ఇచ్ఛ. ఈ ప్రాగ్ అవస్థను (నిద్ర నుండి మేల్కొనుట) గూర్చి శ్రద్ధతో తదేక దీక్షతో పరిశీలించుట, ధ్యానించుట యోగుల లక్ష్యము. ప్రత్యక్చితి పరమ పదమున నిలిచి యున్న స్థితిగా భావించవచ్చును. అటుపైన వున్నది 'పరా'. ఏమీ లేనట్లుండును.



# 368. 'పశ్యంతీ'

సమస్తమును చూచునది శ్రీదేవి అని అర్థము.

ఇచ్చట చూచుట అనగా ఆత్మయందు దర్శించుట. శ్రీదేవి తన ఆత్మయందు సమస్తమును చూచుచు నుండును. అంతయు ఆమెయందే జరుగుచుండగా సాక్షీభూతమై చూచు చుండును. పరాస్థితి తరువాత స్థితి పశ్యంతి స్థితి. పశ్యంతి యందున్నప్పుడు కరణము, కారణము, కర్త ఇత్యాది వేవియు నుండవు. ఈ స్థితిలో పరమును గూర్చిన ధ్యానము సతతము యుండును. అట్లే సృష్టి దర్శనము కూడ నుండును. శ్రీమాత చైతన్య స్వరూప మగుట వలన తన యందలి పరమేశ్వరునితో అనుసంధానమై సమస్తమును దర్శించుచు నుండును. ఆమె నుండి వ్యక్తమైన ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు సమస్త కార్యములను చక్కబెట్టు చుండును. ఆత్మ దర్శనులకు ఇది అత్యుత్తమ స్థితి. ఈ స్థితినే అందరును కోరుదురు. ఈ స్థితిలో పరమపదము చేరువలో నుండగా తమ నుండి ఇచ్ఛా, జ్ఞాన, క్రియలు జరుగుచుండును. వానిని తాము గమనించుచునే యుందురు. వశిష్ఠాది బ్రహ్మ ఋషు లట్టివారు.



# 369. 'పరదేవతా'

శ్రీదేవి ఉత్కృష్టయైన దేవత అని అర్థము.

'పర' అనగా సృష్టికి ఆవలి అని అర్థము. సృష్టికి అతీత మని అర్థము. అన్నియూ నిండియుండి ఏమీ లేనట్లుగ నుండు స్థితి. దీనిని గూర్చి తెలియ వలనుపడదు. తెలియుటకు వలయు ప్రజ్ఞ కూడ అందులో ఇమిడి యుండుటచే తెలియుట యుండదు. ఉండుటయే యుండును. అదియే పరమ సత్యము. అందుండి, కాలము ననుస రించి ప్రకృతి ఉద్భవించును. అంతకు మునుపు ప్రకృతి లేదు. పురుషు డును లేడు. ఈ పరమును 'తత్' అని వేదములు సంబోధించును. సత్యమని కూడ సంబోధించును. ***"సత్యం పరం ధీమహి"*** అనునది మహావాక్యము. పరమే సత్యము. సర్వమునకు అతీతము. దానిని ధ్యానించు వారే నిజమగు ధ్యానులు. ఈ పరాస్థితి యందు కాలము లేదు, ప్రకృతి లేదు, పురుషుడు లేడు. ఏమీ లేనట్లుండును. కాని సమస్తము అందే యున్నది. అంతయూ ఇమిడి యున్న స్థితి.



# 370. 'మధ్యమా'

శ్రీదేవి మధ్యమా వాక్ స్వరూపిణి అని తెలుపు నామమిది.

మధ్యమ అనగా రెంటి నడుమ వుండునది. ఈ సందర్భమున శ్రీదేవి పశ్యంతి వాక్కునకు, వైఖరి వాక్కునకు నడుమ యుండు ప్రజ్ఞ యని తెలియవలెను. పశ్యంతి దర్శన జ్ఞానము, మధ్యమ దర్శనము గూర్చిన భావము. వైఖరి భాషా రూపము.

పరము ఆధారముగ పశ్యంతి యేర్పడు చుండును. పశ్యంతి ఆధారముగ భావ మేర్పడును. భావము ఆధారముగ భాష ననుసరించి మాటాడుట యుండును. ఇట్లు వాక్కు నాలుగు విధములుగ అవతరించు చుండును. ***"చత్వారి వాక్పరిమితా పదాని"*** అని ఋగ్వేదము వాక్కును ప్రశంసించును. వాక్ స్థితులు నాలుగు. అందు పర, జ్ఞానులకే పరిమితము. పశ్యంతి మధ్యమ వైఖరి అందరికి అందుబాటులో నుండును. పశ్యంతి అనగా దర్శించుట గ్రహించుట తెలియుట. ఈ తెలిసిన దానికి భావము ఒక తొడుగు. ఎవరు గ్రహించిన విషయమును వారు, వారి భావముగ ప్రకటింతురు.

ఒకే విషయమును పలువురు చూచినపుడు, వినునపుడు ఎవరి భావము వారికి కలుగును. గ్రహించుట యందలి వ్యత్యాసమే దీనికి కారణము. విషయమునందు వ్యత్యాసము లేనప్పటికిని, చూచువారిని బట్టి వ్యత్యాస మేర్పడు చుండును. తత్కారణముగ భావ వైవిధ్యము

సామాన్యము. ఇతరులు రంగుటద్దములలో చూచునట్లుగ చూతురు. కావున వారికి వివిధములై గోచరించును. అపార్థము లన్నియూ అట్లే యేర్పడుచుండును. రామ పట్టాభిషేక సమయమున హనుమంతుని నవ్వు అట్లే అపార్థము కలిగించినది. అట్లే రాజసూయమున మయసభలో ద్రౌపది నవ్వు అపార్థము కలిగించినది. సామాన్యుల జీవితములందు అపార్థములు కోకొల్లలు. వాని ననుసరించి మాట లుండును. మాటలు బట్టి ఘర్షణ యుండును.

పరమును స్పృశించిన వారియందే పశ్యంతి సత్యదర్శన మిచ్చును. అట్టి వారియందే భావములు సత్యమం దుండును. ఇట్లు సత్య స్వరూపిణిగ నుండు భావము మధ్యమ అని కొనియాడబడుచున్నది. అట్టి వారి భాషణము కూడ సత్యమునే ప్రకటించును.



# 371. 'వైఖరీ'

**వై**ఖరీ వాక్ స్వరూపిణి శ్రీదేవి అని అర్థము.

వైఖరీ అనగా వినబడు వాక్కు. కంఠము నుండి వ్యక్తమై ముఖము నుండి పలుకబడును. లోకులు ఈ వాక్కు ఆధారముగనే తమ తమ కార్యములను చక్కబెట్టుకొను చున్నారు. శబ్దార్థములతో కూడిన వైఖరియే మానవునికి అతి విశిష్టము, ప్రధానము అగు శక్తియై నిలచినది. వాక్కు ద్వారా సమస్తమును జయించ వచ్చును. మృదుమధుర మగు భాషణము నుండి దుర్భాషణముల వరకు వాక్కు జీవుని తరింప జేయుటయో, నశింపజేయుటయో చేయుచున్నది. వైఖరీ వాక్కు మహా శక్తివంతమైనది. మానవుడు తన్ను తాను ఉద్ధరించుకొనుటకు గాని, పతనము గావించుకొనుటకు గాని వైఖరీ వాక్కే సాధన మగుచున్నది.

వైఖరీ వాక్కును సరిదిద్దుకొనినచో స్వభావము సరిదిద్దబడ గలదు. తోచిన దెల్ల మాట్లాడుట లోక సహజము. అట్టి మాట మాట్లాడుటగా కాక వదరుటగా తెలుపుదురు. అట్టివారిని వదరుబోతు లందురు. మాటాడుటకు ఎన్నియో నియమములు కలవు. ప్రస్తుతమున అవి ఏవియూ పాటింపబడుట లేదు. మానవుల పతనములకు కారణము లలో వైఖరీ దుర్వినియోగ మొకటి. పదములను ఏరికోరి ఆచి తూచి మాట్లాడువారు కద్దు. ప్రియ భాషణము కూడ కద్దే. ***"సజ్జనుండు పలుకు చల్లగాను"*** అనునది జాతి మరచినది. ఆధునికము, నాగరికము అయిన జనులు అశ్లీలమగు పదములు ప్రయోగించుటకు జంకుట

లేదు. విమర్శ కుటిలత్వము, మోసము, డంభము, రాగ ద్వేషములు, క్రోధము వైఖరి ద్వారా ప్రదర్శింపబడు చున్నది.

వైఖరీ వాక్కులకు ప్రధాన సాధనము భాష. భాషా వినియోగము క్రమముగ పతనము చెందుచున్నదే గాని ఉత్తమ భాషణము గోచరించుట లేదు. అక్షరములు కూడ సరిగ పలుకలేని స్థితిలో మానవు లున్నారు. భాషణమును సంస్కరించుకొనినచో మానవుడు తనకు తాను చాలమటుకు సంస్కారి కాగలడు. వైఖరి మారినచో దాని ప్రభావము క్రమముగ మధ్యమ పశ్యంతిపై కూడ ప్రసరించి సత్యగ్రహణము అవగాహనము పొందుటకు వీలగును.

"వాక్కు మూడు భాగములు గుహలో నుండగ, నాలుగవది యగు వైఖరి ప్రకటింపబడు చున్నది" అని ఋగ్వేదము పలుకుచున్నది. మనిషి మాటను బట్టి భావములు తెలియనగును. భావమును బట్టి అతని అవగాహనము తెలియనగును. అతని అవగాహనను బట్టి అతని స్థితి తెలియనగును. ఇట్లు వాక్కు ద్వారా జీవుని తెలియుట తెలిసినవారికి మాత్రమే సాధ్యపడును. వాక్కే సర్వస్వము. దానిని ఋగ్వేదమని కీర్తించినది.

అట్టి వాక్కు పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరీ అను నాలుగు స్థితులను పొందుచున్నది. పరా వాక్కునకు, పశ్యంతి వాక్కునకు నడుమ ప్రత్యక్చితీ రూపమున కూడ వాగ్దేవిని దర్శించ వచ్చును. ఇట్లు ఈ సహస్ర నామమునందు వాక్కు పంచముఖిగ పేర్కొనబడినది.

# 372. 'భక్తమానస హంసికా'

**భ**క్తుల చిత్తమందు హంసవలె నుండునది శ్రీదేవి అని అర్థము.

భక్తు లనగా నిర్మల చిత్తము కలవారు. నిర్మల చిత్త మనగా ఎట్టి మలములు లేనిది. దీనిని మానస సరోవరమని కూడ అందురు. అచట ప్రశాంతతత ప్రధానముగ నుండును. చల్లదనము, నిశ్శబ్దము సతత ముండును. ఇట్టి చిత్తము లందు హంసవలె శ్రీదేవి వసించి యుండును. హృదయ మందలి స్పందనాత్మక చైతన్యముగ తేలియాడు చుండును. 'సోऽహం' అను శబ్దము నిరంతరము నిర్మల చిత్తమున దర్శించవచ్చును. ఇట్లు దర్శించువారు హంసదర్శను లగుదురు. క్రమముగ హంస లగుదురు. ఇట్టి హంసలైన భక్తులు ప్రపంచ ప్రభావమునకు లొంగరు. వారు చరమగు ప్రపంచము నుండి విడివడి ఆ ప్రపంచమున తేలియాడు చుందురు. వారు ముముక్షువులు. చిత్తమున హంసలై నిలచిన వారి ప్రజ్ఞలు సూక్ష్మస్పందనమును గూర్చిన ధ్యానములో నిమగ్నమై యుండును. వీరు సహజముగ అంతర్ముఖులు. కర్తవ్యములను బట్టి బహిర్ముఖు లగుచుందురు. కర్తవ్యము లేనిచో వారి ఇంద్రియములు గాని, కర్మేంద్రియములుగాని కదలవు. ఊరకే తిరుగుట, కదలుట, మాటాడుట యుండవు. అట్టి నిశ్చలులు, నిర్మలురు అగు చిత్తము గలవారి యందు శ్రీమాత వసించి అంతరంగానుభూతిని కలిగించు చుండును.

నిర్మల చిత్తము కోరువారు శారీరకము, వాఙ్మయము, మనోమయము అగు తపస్సు నాచరించవలెను. అనగా మనస్సు, ఇంద్రియములు, శరీరము యజ్ఞార్థమై వినియోగించవలెను. లోకహిత కార్యములే యజ్ఞములు. వాని యందు నిమగ్నమగు వానికి క్రమముగ చిత్తము నిర్మలమగుట తథ్యము.

భక్తి సాధనమున గాని, యోగ సాధనమున గాని నిర్మల చిత్తమును పొందుట ప్రధానమగు కార్యముగ నిలచి యున్నది. నిర్మల చిత్తము లేనివారు ఎన్ని దైవకార్యములు చేసిననూ ఫలితము శూన్యమే. అహింస, సత్యము, బ్రహ్మచర్యము, దొంగబుద్ధి లేకుండుట, ఇతరుల సొమ్మున కాశపడకుండుట, బహిరంతర శుచి, సంతోషము, స్వాధ్యాయము, మనస్సును ఈశ్వరునికి సమర్పణము చేసి జీవించుట నిర్మలత్వమున కుపాయములుగ తెలుపబడినవి.



# 373. 'కామేశ్వరప్రాణనాడీ'

**కా**మేశ్వరుని యొక్క ప్రాణనాడియే శ్రీమాత అని అర్థము.

ప్రజ్ఞ పురుషుడు కాగా అందుండి యేర్పడునది ప్రాణము. ప్రాణమునకు ప్రజ్ఞ ఆధారము. ప్రజ్ఞకు ప్రాణమాధారము. సృష్టియం దిరువురును ప్రముఖులే. వారి యందు హెచ్చుతగ్గులు లేవు. ఒకే తత్త్వము నుండి దిగి వచ్చినవారు. ప్రాణ మున్ననే ప్రజ్ఞ ఉపాధి యందు స్థితిగొని యుండును. ప్రాణము నిష్క్రమించినచో ప్రజ్ఞ నిష్క్రమించును. ప్రాణ మవతరించినచో ప్రజ్ఞ అవతరించును. అమ్మ లేక సృష్టియందు ప్రాణము లేదు. ఆమెయే ప్రాణేశ్వరి. ఆమెయే ప్రాణదాత్రి. ఆమెయే ప్రాణము. సృష్టియందు, జీవులయందు ప్రాణ నాడిగ వర్తించును. స్పందనాత్మకమై నిలచును.

కామేశ్వరుని యందు కూడ ప్రాణనాడి శ్రీమాతయే. కనుకనే పరమశివుడు సాగర మథన సమయమున పరమేశ్వరి అనుజ్ఞగొని హాలాహలమును స్వీకరించెను. శ్రీమాత ప్రాణనాడి యగుట చేత శివుడు మహాక్రూరమైన కాలకూట విషమును త్రాగిననూ శ్రీమాత మహిమచే కాలవశుడు కాలేదు. అమ్మ అనుగ్రహ మున్నవారికి ప్రాణ భయము లేదు. మన యందలి ప్రాణనాడి ఆమెయే.

శరీరము నుండి ప్రాణము నిష్క్రమించినచో ప్రజ్ఞ కూడ నిష్క్ర మించును. ఒకానొకప్పుడు ప్రజ్ఞ నిష్క్రమించిననూ ప్రాణము దేహము

నంటిపెట్టుకొని యుండును. ఆధునిక కాలమున ప్రాణముండి ప్రజ్ఞ కోల్పోవు వారిని ఆసుపత్రులలో చూడవచ్చును. నెలల తరబడి సంవత్సర ముల తరబడి ప్రజ్ఞ కోల్పోయినవారు ప్రాణముతో నుండుట, అటుపైన మరల ప్రజ్ఞ తిరిగి వచ్చి దేహమున మేల్కొనుట కూడ చూచు చున్నాము. ఇటీవలి కాలమున ఈ అంశమునకు నిజమైన ఉదాహరణగ నిలచిన వారు విజయనగరపు రాజగు శ్రీ పి.వి.జి. రాజుగారు.

యోగులు ప్రాణమునకు శరీరము నప్పగించి ప్రజ్ఞతో విహారము చేయుదురు. యజ్ఞార్థమై లోకహితము చేయు యోగులు దివ్య ప్రాణమును, దివ్య దేహమును ధరించి నిద్రా సమయమున కర్తవ్యమును నిర్వర్తించి మరల తిరిగి వత్తురు.

ప్రాణము దేహము నందున్నప్పుడు ప్రజ్ఞ తిరిగి వచ్చుట కవకాశ మున్నది. ప్రాణము దేహమును విడిచినచో ప్రజ్ఞ దేహమున వుండలేదు. సావిత్రీ ఉపాఖ్యానమున కూడ దీనిని దర్శింప వచ్చును. శ్రీమాత శివుని ప్రాణనాడి యెట్లో అట్లే సావిత్రీదేవి సత్యవంతునికి ప్రాణనాడియై నిలచినది. అది ఆమె ఆరాధనా బలము. కనుకనే సత్యవంతుని మరల కొనివచ్చినది. పతివ్రతా స్త్రీల యందు ఇట్టి శక్తి శ్రీమాతయే. వారి ఆరాధనము కారణముగ వారి భర్తలు క్షేమముగ నుందురు. స్త్రీ మాంగల్యము గట్టిదైనచో ఆమె బ్రతికి యుండగ భర్త మరణింపడు. భార్య మాంగల్యము బలమై యుండవలె ననినచో శ్రీమాతను భక్తి శ్రద్ధలతో ఆరాధించుట సంప్రదాయము.

# 374. 'కృతజ్ఞా'

**కృ**త జ్ఞానము కలది శ్రీదేవి అని అర్థము.

'కృత జ్ఞాన' మనగా క్రియా జ్ఞానము. క్రియాశక్తి వలననే సమస్తము అవతరించును. చేయుటకు జ్ఞానము కావలెను. ఏమి చేయవలెనో తెలియవలెను. క్రియా జ్ఞానము నందు ఇచ్ఛా జ్ఞానము లిమిడి యుండును. పరహితము చేయవలెను అనునది ఇచ్ఛ. ఎట్లు చేయవలెనో తెలియక చేసినచో పరహిత ఇచ్ఛ ఫలించదు. ఎట్లు చేయవలెనో తెలిసిననూ కూడ చేయుట జరగనిచో ఫలించదు. ఏమి చేయవలెనో తెలియుట చాలదు. ఎట్లు చేయవలెనో తెలిసిననూ చాలదు. చేయవలెను కదా! కేవలము చేయుట తెలిసి, ఎట్లు చేయ వలెనో తెలియనిచో ఫలము లేదు. ఏమి చేయవలెనో తెలియనిచో కూడ ఫలము లేదు. ఇట్లు ఇచ్ఛా జ్ఞానములను తెలిసి చేయుటయే జ్ఞానము. అట్టి జ్ఞానము యొక్క స్వరూపమే శ్రీదేవి. కనుకనే ఆమె సృష్టి నిర్వహణమును నైపుణ్యముతో నిర్వర్తించు చుండును.

పరమశివుడు జ్ఞాన స్వరూపుడు. అతడెప్పుడునూ తపస్సునందే యుండును. క్రియయం దాసక్తి తక్కువ. అత్యవసరమైనచో గాని క్రియలోనికి దిగిరాడు. అట్టి శివునితో శ్రీమాత క్రీడాప్రాయముగ జూదమాడునట. శ్రీమాత క్రియా జ్ఞానము కలది గనుక సర్వదా శివుని జయించు చుండెడిదట. శివుడు కూడ శ్రీమాత గెలుపును

గమనించి సంతసించెడి వాడట. ఇది శ్రీమాత క్రియా జ్ఞానమునకు తార్కాణము. శ్రీమాత కూడ శివుని ఇచ్ఛ వలనే తాను గెలుచు చున్నట్లు తెలిసి సంతసించెడిదట. శివుడి ఆజ్ఞ లేనిదే శ్రీమాత ఎట్లు గెలువగలదు? ఇట్లు శ్రీమాత కృతజ్ఞా భావమును కవులు ప్రశంసించు చుందురు.

'కృతజ్ఞ' అనగా జరిగిన మేలు మరువకుండుట అని కూడ అర్థము కలదు. మేలు జరిగినపుడు మేలు చేసినవారిని కృతజ్ఞా భావముతో హృదయమున ప్రశంసించినచో శ్రీమాత అనుగ్రహించును. శ్రీరాము డట్టివాడు. చిన్న ఉపకారము తనకెవ్వరైన చేసినచో దానిని మిక్కిలి ప్రశంసించెడివాడు. అట్లు ప్రశంసించుట రాముని కల్యాణ గుణములలో ప్రథమమైనది. గుహుడు, జటాయువు, శబరి, విభీషణుడు, సుగ్రీవుడు మొదలగు వారందరి యెడల రాముని కృతజ్ఞతా భావము నిరుపమానము. సాటిలేనిది. ఇట్టి కృతజ్ఞతాభావ రూపమున శ్రీమాతయే రాముని నుండి వారందరికి చల్లని స్పర్శ నిచ్చెడిది.

'కృతజ్ఞ' అనగా కృత యుగమందలి జ్ఞానమని కూడ అర్థ మున్నది. కృతయుగ మందు జ్ఞానము పరిపూర్ణముగ యుండెడిది. ధర్మము నాలుగు పాదముల నడిచెడిది. పరిపూర్ణ జ్ఞాను లగుటచే జీవులు పూర్వ జన్మములను కూడ ఎఱిగి యుండెడివారు. కృత యుగమున శ్రీమాత జ్ఞాన స్వరూపిణిగ పరిపూర్ణముగ దర్శనమిచ్చు చుండెడిది. అటు తరువాత యుగములలో జ్ఞానము అజ్ఞానముచే కప్పబడుటచే దైవమున్నాడన్న భావము కూడ ప్రస్తుతము మృగ్యమై

యున్నది. అజ్ఞానము వలన అహంకారమునబడిన జీవులు శ్రీమాత ఆరాధనము ద్వారా మరల క్రమముగ జ్ఞానమును పొందగలరు.

శ్రీమాత జీవులందరిని సూర్యుడు, చంద్రుడు, యముడు, కాలము, పంచ మహాభూతముల రూపమున గమనించు చుండునట. పై తెలిపిన తొమ్మిది మందిని లోక సాక్షులుగ పేర్కొందురు. ఈ లోక సాక్షుల ద్వారా జీవులు చేయుచున్న పాప పుణ్యములను గమనించుచు తదనుగుణమైన ఫలముల నిచ్చుచుండును. ఉపకారము చేయువారికి ఉపకారము చేయును. అపకారము చేయువారికి అపకారము చేయును. అపకారము చేసిననూ, ఉపకారము చేయువారిని అనుగ్రహించును. అనగా విశేషముగ ఉపకారము చేయును.

ఇట్లు 'కృతజ్ఞ' అను శ్రీమాత నామమునకు వివిధములగు భాష్యము లున్నవి.



# 375. 'కామపూజితా'

మన్మథునిచే పూజింపబడునది శ్రీదేవి అని అర్థము.

మన్మథుడు లక్ష్మీదేవి పుత్రుడు. అతి మనోహరమైన రూపము గలవాడు. సృష్టి కామమునకు అతడు అధిదేవత. స్త్రీ పురుష కామమునకు ప్రతిరూపము. కామప్రేరణ ద్వారా మనస్సులయందు మథనము చేయు వాడు. సతీదేవి దక్ష యజ్ఞమున ఆహుతి చెంది పార్వతిగ మరల పుట్టి శివుని గూర్చి ఘోర తపస్సు కావించినపుడు ఆమెకు తోడ్పడవలెనన్న అభిలాషతో ఈశ్వరునికై తన శక్తిని ప్రయోగింపగ ఈశ్వరుడు కన్ను తెరచి చూసుసరికి అతడు భస్మరాశి అయ్యెను. అటుపైన పార్వతీదేవి తపస్సుద్వారా ఈశ్వరుని మెప్పించి అతనిని పరిణయమాడినది. పిదప భస్మరాశిగ మిగిలియున్న కాముని అనుగ్రహించి సజీవుని చేసెను. 'కామ సంజీవ నౌషధిః' అను నామమున ఇది పేర్కొనుట జరిగినది. శ్రీమాతచే సజీవుడైన మన్మథుడు అటుపైన శ్రీదేవి నుండి పంచదశాక్షరి మంత్రమును ఉపదేశముగ పొందినాడు. ఆ మంత్రమును ఉపా సించుచు జీవుల లింగ శరీరముల నధిష్ఠించి సృష్టి కార్యమును నిర్వర్తించు చున్నాడు. కామునిచే నిత్యము శ్రీమాత పూజింపబడుచున్నది. కావున 'కామ పూజిత' అయినది.



# 376. 'శృంగారరస సంపూర్ణా'

**శృం**గార మనెడు రసముచే లెస్సగా నిండినది శ్రీమాత అని అర్థము.

'శృంగ' అనగా రెండు అని అర్థము. 'అర' అనగా దళము అని అర్థము. 'రస' అను పదమునకు ఆరు అని అర్థము. ఇట్లు గ్రహించినచో ఆరు జతల దళముల పేర్పు అని తెలియవచ్చును. అనగా పండ్రెండు దళముల పద్మము. అదియే హృదయ పద్మము. అనాహత పద్మ మని కూడ అందురు. హృదయము వ్యక్త, అవ్యక్తముల యొక్క కూటమి. అచట అనాహతము, ఆహతము కలియును. సూక్ష్మము, స్థూలము కలియును. ప్రకృతి, పురుషుడు కలియును. నిత్యము, అనిత్యము కలియును.

అన్ని లోకములు ప్రకృతి పురుషుల కలయికచే యేర్పడు చున్ననూ హృదయ పద్మము యొక్క ప్రత్యేకత యేమనగా అచ్చట యిరువురును సమపాళ్ళుగ నుందురు. అందువలన ఆనందము సమ్యక్ పూర్ణమై నిలచును. ప్రకృతి, పురుషుడు అను శృంగములు రెండునూ సమమై వర్తించినపుడు పొందదగిన ఆనందము యితర స్థితులలో వీలుపడదు. సంపూర్ణమగు ఆనందమును ప్రేమ అందురు. అట్టి ప్రేమ యందు ఆధిక్యత, న్యూనత లేవు. ఎక్కువ తక్కువలు లేవు. సమత్వమే గోచరించును. లక్ష్మీనారాయణు లని, భవానీ శంకరు లని, వాణీ

హిరణ్యగర్భు లని, శచీ పురందరు లని, అరుంధతీ వశిష్ఠు లని, సీతారాము లని కొనియాడబడు ఈ ఆరు జంటలు ఈ నామమునకు ఉదాహరణము.

హృదయము సహస్రారమునకును, మూలాధారమునకును నడుమ గల క్షేత్రము. పరమశివుడు హృదయము వరకు వచ్చి, మూలాధారమునుండి హృదయమును చేరిన పార్వతి నందుకొనును. మూడులోకములు దాటి నాలుగవ లోకమునకు చేరిన జీవునిపై మూడు లోకముల నుండి దిగివచ్చి దేవు డందుకొనును. రాముని కొరకై వేచియున్న సీతను రాముడే మిథిలకు వచ్చి పెండ్లియాడుట, కృష్ణుని కొరకై వేచియున్న రుక్మిణీదేవిని కృష్ణుడే వచ్చి పెండ్లియాడుట, దేవుని కొరకు వేచియున్న జీవునికి, దేవుడే సాన్నిధ్య మిచ్చుట జరుగును. దైవమును గూర్చి వేచియుండుటకు హృదయమే నిజమగు స్థానము. పార్వతి, సీత, రుక్మిణి భక్తులు. దైవమును గూర్చి హృదయముననే వేచియుండి సాన్నిధ్యము పొంది ఏకత్వము చెందిరి.

పై తెలిపిన సమాగమమున ఆనందము పరాకాష్ఠను చేరును. అట్టి స్థితిలో శ్రీమాత సంపూర్ణమగు ఆనంద స్వరూపిణిగ భాసించును.



# 377. 'జయా'

**జ**యము శ్రీమాత రూపము అని అర్థము.

జయము ఎవరికి కలిగిననూ అది శ్రీమాత అనుగ్రహమే. శ్రీమాత తన భక్తులకు జయము కలిగించుటకై ఎల్లప్పుడునూ సంసిద్ధురాలై యుండును. తన భక్తులకు జయము కలుగుటకు శ్రీమాత తానే స్వయముగ విఘ్నము లన్నిటినీ తొలగించును. ఆపదలను నివారించును. సంపదలు ప్రసాదించును. తన భక్తుల జయము తన జయముగ సంతసించును. భక్తులు ఆనందించు చుండుగ చూచి తానునూ ఆనందమును పొందును. అవసరమగుచో పర్వత మంత కర్మలను కూడ వరాహ స్వరూపిణియై పెళ్ళగించి ఆనందము ప్రసాదించును. శ్రీమాత ఆరాధనము భక్తి శ్రద్ధలతో గావించువారు అనంతమగు సంసార సముద్రమును ఆనంద మను పడవనెక్కి సాగుదురు. శ్రీమాత భక్తులకు అపజయమే లేదు.



# 378. 'జాలంధరస్థితా'

**జా**లంధర మను పీఠము నందు ఉండునది శ్రీమాత అని అర్థము.

శ్రీదేవి జలంధర మను పీఠమును విష్ణుముఖి అను పేరుతో పూజింపబడు చున్నట్లుగా పద్మ పురాణమున పేర్కొనబడినది. జాలంధర మనగా ఇంద్రజాల మహేంద్రజాలములతో కూడిన మంద్రజాలము. మంద్రజాల మనగా చైతన్యమునుండి ఏర్పడిన లోకాలోకముల వల లేక శ్రీదేవి మాయావరణములు. సృష్టి యందు విష్ణువు మాయావి అని ప్రసిద్ధి గాంచెను. శ్రీమాతయే శ్రీమహావిష్ణువు. అందువలన ఆమె 'విష్ణుముఖి' అని పిలువబడుచున్నది. దుష్టులకు మాయ కలిగించుట, శిష్టులకు మాయ తొలగించుట శ్రీమాత జాలము. అట్టి జాలమును ధరించి యుండును గనుక 'జాలంధరి' అని ప్రసిద్ధి గాంచినది. లీలాప్రాయముగ తన జాలమును ప్రయోగించుట, మరల తొలగించుట చేయుచు నుండును. త్రిమూర్తులు సహితము ఆమె సృష్టి జాలమును అవగాహన చేసికొనలేరు. కేవలము పరతత్త్వమునకే అవగాహన యగును.

శ్రీదేవి మాయాజాలముతో గూడిన అసురు డొక డుండె నని, అతని పేరు జలంధరు డని, ఆ జలంధరుడు ఇంద్రుని, విష్ణువుని కూడ తన జాలముతో జయించి బంధించె నని, అటుపైన పరమశివుడు

అతనిని జయించి విష్ణుని, ఇంద్రుని రక్షించె నని పద్మపురాణము పేర్కొనుచున్నది. ఇందలి రహస్య మేమనగా జలంధరుడు శ్రీమాత జాలము. ఆ జాలము నెఱిగినవాడు ఆమె గాక పరమ శివుడొక్కడే అని అర్థము.

శ్రీమాత ఈ జాలము వలననే జీవులు మాయకు లోనై తాము ఇతరులు అన్న భావముతో పరస్పరత్వమున అనేకానేక అనుభూతు లను చెందుచున్నారు. మనయందు జలపీఠమైన మణిపూరకమును అధిష్ఠించి శ్రీమాత యున్నది. ముందు నామమున హృదయ పీఠము తెలుపబడినది. ఈ నామమున మణిపూరక పీఠము నందున్న 'జాలంధరీదేవి'గా శ్రీమాత వర్ణింపబడినది. నీరు కారణముగ వున్నది వక్రస్థితి చెందుట, కదలనిది కదలుచున్నట్లుగ కనబడుట ఇత్యాదివి జరుగును కదా! మనస్సు యందు కలుగు భ్రమలకు, భ్రాంతులకు, అపోహలకు కారణము జాలంధర పీఠమున ప్రజ్ఞ నిలచి యుండుటయే. చంచల మనస్కు లందరూ ఇందే బంధింపబడి యుందురు. జాలంధరీ దేవిని తెలిసి పూజించినవారు ఈ అవస్థితిని శ్రీమాత అనుగ్రహముచే దాటుదురు.



# 379. 'ఓడ్యాణపీఠనిలయా'

**ఓ**డ్యాణ పీఠము నివాస స్థానముగా గలది శ్రీమాత అని అర్థము.

హృదయ పీఠము, జాలంధర పీఠము తర్వాతి పీఠముగా ఓడ్యాణ పీఠము తెలుపబడినది. ఈ ఓడ్యాణమే తెనుగున వడ్డాణము అని పిలువబడుచున్నది. స్త్రీలు వడ్డాణమును, పురుషులు కటి బంధమును ధరించుట సనాతనమగు ఆచారము. కటిబంధము యొక్క బలమే శరీర బలముగ తెలియవలెను. కటిబంధము సడలినపుడు శరీరము అదుపు తప్పును. రోగగ్రస్త మగును. శరీరము యొక్క అధోభాగము బలముగ నుండవలె నన్నచో నడుము సన్నదిగను, బలముగను ఉండవలయును. యోగమున ఆసనములన్నియూ కటిభాగము స్థిమితముగను, బలముగను స్థిరపరచుటకే. ఈ భాగము విస్తరించినచో యోగమునకు అర్హత కోల్పోవుట జరుగును.

ఓడ్యాణ బంధము నడ్డి పదునుగను, నిటారుగను వుండుటకు, పొత్తికడుపు పెరుగకుండటకు వినియోగ పడును. సిద్ధాసనమున గాని, పద్మాసనమున గాని కూర్చుండి యోగము చేయువారు పొత్తి కడుపును తమలపాకువలె నుంచుకొని యుందురు. అటులున్నచో మూలాధార మందలి ప్రజ్ఞ ఊర్ధ్వగతి చెందుటకు స్వాధిష్ఠానమున మార్గము సుగమ మగును. స్వాధిష్ఠానము ద్వారా ప్రజ్ఞ ఊర్ధ్వగతి చెందినపుడే బ్రహ్మగ్రంథి

విడును. అది రుద్ర గ్రంథి అని కొందరి అభిమతము. అట్లు వీడినచో జీవునకు దేహబంధ ముండక స్వేచ్ఛగ దేహము నందుండుట అనగ యేమో తెలియును.

శ్రీమాత కటి ప్రదేశము వున్నదో లేదో యన్నట్లుండును. ముప్పది ఐదవ నామమున శ్రీమాత మధ్య ప్రదేశమును నూగారు తీగతో పోల్చుట జరిగినది. అవిద్య యందు వసించు సర్వ జీవరాశికి దేహమే ఆధారము. అట్టి దేహము నుండి దేహాతీతములగు లోకములకు ప్రవేసించు మార్గము శ్రీమాతచే అధిష్ఠింపబడి యున్నది. అట్టి అధిష్ఠాన దేవతను 'ఓడ్యాణపీఠ నిలయా' అని కీర్తింతురు.

యోగాభ్యాసము చేయువారు ఓడ్యాణ పీఠమును సరిచూసు కొనుట, శ్రీమాతను ఆరాధించుట ప్రధానమని తెలియవలెను.



# 380. 'బిందుమండలవాసినీ'

బ్రహ్మరంధ్రమున నివసించునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మరంధ్రమును 'బిందు మండల' మందురు. ఆత్మబిందువు వసించు స్థానము బ్రహ్మరంధ్రము. అందువలన 'బిందు మండల వాసిని' అని శ్రీమాతను సంబోధింతురు. ఈ నివాసము సర్వానంద మయము. ఋషులు అంతర్ముఖముగ తపస్సు సాగించి బ్రహ్మరంధ్రము నందు బిందు స్థానమును చేరి తన్మయులై పరవశింతురు. శరీర మొక పద్మకోశము. అనేకానేక పొరలతో ఏర్పడి యున్నది. అన్ని పొరలకు మూలమైన ఆత్మ ప్రజ్ఞ సూర్యప్రభలతో వెలుగుచుండు బిందువువలె యుండును. మంత్రపుష్పమున ఈ బిందువునే ఆరాధించుట జరుగును. ఈ బిందువును బియ్యపు గింజ తలయందలి కొనతో పోల్చి చెప్పుదురు. అందుండియే స్వరాట్, త్రిమూర్తులు మొదలగు ప్రజ్ఞలన్నీ పుట్టినట్లుగ కూడ మంత్రపుష్పము కీర్తించును. బ్రహ్మము వసించు నాళము గనుక బ్రహ్మనాళ మని బ్రహ్మరంధ్ర మని అందురు. ఈ నాళము నుండి వికసించిన పద్మమునందే సృష్టికర్తయగు చతుర్ముఖ బ్రహ్మ ఉద్భవించినాడు.

సృష్టికర్త కూర్చుండియున్న పద్మము సృష్టి కర్తకన్న ముందే యేర్పడినది. ఆ పద్మము నాళము అంతకన్న ముందున్నది. ఆ నాళము పుట్టు స్థానము తెలియుట అసాధ్యము. అవ్యక్తమగు పరమాత్మ తత్త్వము

నాళము ద్వారా ప్రసరించి పద్మము నేర్పరచి సృష్టికర్తను పుట్టించెను. జీవుని కూడ అట్లే ప్రతి ఉదయము మేల్కొంచును. మేల్కొంచుటకు ముందు జీవు డెటనుండి వచ్చుచున్నాడో తెలియుటకు ప్రయత్నించుట నాళమున చేరి వెదకుటగా తెలియదగును.

సృష్టికి కర్త చతుర్ముఖ బ్రహ్మ. మన జీవన సృష్టికి కర్త మనమే. బ్రహ్మవలె మనము కూడ సృష్టి జరుపుదుము. బ్రహ్మ సృష్టి బ్రహ్మము ఆజ్ఞానుసారము జరుగుట వలన బ్రహ్మదేవుడు సృష్టి కధిపతియై యున్నాడు. అతడు దైవేచ్ఛ నెఱిగి సృష్టి కర్తృత్వము నిర్వహించు చున్నాడు. అతని కర్తృత్వము నిరహంకార పూరితము. జీవుడు కూడ దైవేచ్ఛకు సమర్పణము చెంది దివ్యసంకల్పమునే నిర్వర్తించు చుండినచో బ్రహ్మానందమున ఉండవచ్చును. ఇట్టి బ్రహ్మానందము పొందుటకే సర్వసాధనలును. నవవిధ భక్తుల ద్వారా దైవసాన్నిధ్యము సిద్ధించిన వారు కేవలము దైవేచ్ఛయే తమ ఇచ్ఛగా జీవింతురు. దివ్య ప్రణాళిక నిర్వర్తించుచు శాశ్వతులై సృష్టియందుందురు.

ఇట్టి బ్రహ్మానంద స్థితి తమ లోపలి బ్రహ్మనాళమును (బ్రహ్మ రంధ్రము) చేరినచో కలుగును. దానికి చేయు ప్రయత్నమే తపస్సు. జీవితము యజ్ఞార్థము కానిచో తపస్సు వలను పడదు. అంతరాంత రాళమున జీవప్రజ్ఞ చేరవలె నన్నచో ఇతరములు గోచరింపక సమస్తము శ్రీమాత దివ్యరూపముగనే దర్శించుట ప్రధానము. అపుడు శ్రీమాత భావన నిత్యమగును. అనన్యమగును.

బిందు మండల మనగా తెల్లని కాంతితో కూడిన మండలము. ఆ కాంతికి కేంద్రమే బిందువు. ఈ బిందువు గాని, దాని కాంతి గాని, పదార్థమును ఆవరించి యుండును గాని ఆశ్రయించి యుండదు. బిందువు రూపము పూర్ణమగుట వలన దీనిని పూర్ణ మనిరి. తేజోవంత మగుట వలన చీకటికి ఆవలి వెలుగు అనిరి. దీనిని స్మరించుటకే భ్రూమధ్యమున స్త్రీలు, పురుషులు తిలక ధారణము గాని భస్మ ధారణము గాని చేయుట. మాధవు డుండు స్థానము అయి వుండుటచే ఈ భ్రూమధ్య స్థానమును బిందు మాధవు డని, బిందు మాధవి అని పలుకుదురు. భ్రూమధ్యము నుండి బ్రహ్మనాళమున చరించుట బ్రహ్మానంద దాయకము. హృదయ మందు విశాలమై పరమ పవిత్రమైన ప్రజ్ఞగ ప్రవహించు చుండును గనుక బిందు హ్రదము (సరస్సు) అని కూడ పలుకుదురు. బిందు స్థానమున చేరిన వారిని బిందు శర్మ అని పిలుతురు. నాళమున ఈ బిందువు అన్ని లోకముల యందు పయనించు త్రోవను బిందురేఖ అనిరి.

బిందు జ్ఞానమే సర్వజ్ఞానము, సర్వానందమయము.



# 381. 'రహోయాగ క్రమారాధ్యా'

రహస్యముగ చేయబడు యాగము ద్వారా క్రమముగ ఆరాధింప బడునది శ్రీమాత అని అర్థము.

'రహోయాగ' మనగా రహస్యముగ చేయబడు యాగము. మరియు రహస్యము నందు చేయబడు యాగము. రహస్యమనగా సహస్రార పద్మము అని అర్థము కూడ కలదు. యజ్ఞార్థము జీవించుచు జ్ఞానముచే కర్మములను దగ్ధము గావించుచు భక్తులు ఆరాధనమును చేయుచుండగ కుండలినీ స్వరూపిణి అయిన శ్రీమాత, మూలాధారము నుండి క్రమముగ ఊర్ధ్వగతి చెంది సహస్రార పద్మమును చేరును. ఈ కార్యమంతయూ రహోయాగ మని కొనియాడబడు చున్నది. ఈ సమస్త సాధన, ఆడంబరమునకు పోక అత్యంత భక్తితో ఇరుగు పొరుగు వారికి తెలియనీయకుండ రహస్యముగ చేయు యాగము రహో యాగము. వ్యాకరణ మందు, శాస్త్రము లందు ప్రావీణ్యమును ప్రదర్శిం చుట, తమ గొప్పదనము నలుగురికి తెలియునట్లు చాటుకొనుట, లోకుల మనస్సును ఎరుగుటకు ప్రయత్నించుట, భక్తులవలె చలామణి అగుటకు ప్రయత్నించుట రహోయాగము చేయ సంకల్పించువారికి నిషిద్ధ విషయము. ఏకాంత భక్తి సాధన, ధృఢవ్రతము కలిగి లోక సంబంధములను వదలి సతతము ఆత్మయందు యోగము చెందుటకై ప్రయత్నించుచూ యమ నియమములను పాటించుచూ యుండుట ఈ యాగమునకు ప్రధానము.

కేవలము పాపములు దగ్ధమగుటచే మోక్ష స్థితి కలుగదు. పుణ్యములు కూడ దగ్ధము కావలెను. పుణ్య మాసించక పరహిత కార్యములు చేసినచో పుణ్యము కూడ పరిసమాప్తి యగును. పాపపుణ్యములు పరిసమాప్తి అయిన వారికే మోక్షము.

రహోయాగము మహత్తరమగు యాగము. ఈ యాగదీక్ష ఫలమే ముందు నామమున 'బిందుమండలవాసిని' అని తెలుపబడినది. దేహము యొక్క పొరల లోపల వాని కాధారముగ నిలచియున్న వెన్నుపూసలో దారముకన్న సన్నముగా నున్న ప్రకాశవంతమైన సుషుమ్న నాడి, దాని లోపల యున్న చిత్రిణీ నాడిలో చల్లగ గమనము చేయుచు నుండు కుండలిని యందు శ్రద్ధ నిలువవలె నన్నచో ఏకాగ్రత, ధృడ వ్రతము, అనన్య చింతనము ప్రధానము. ఇతరములు అప్రధానములు.

సహస్రార పద్మమును క్రమముగచేరి రహస్యముగ భర్తతో విహరించునది శ్రీమాత అని శ్రీ శంకర భగవత్పాదులు ఈ యాగ క్రమమును వివరించిరి. ఈ యాగమును సమయాచారమువారు, వామాచారము వారు కూడ అనుసరించు చుందురు.



# 381. 'రహస్తర్పణ తర్పితా'

ఏకాంతముగ పరమాత్మ తత్త్వము నెరింగి అంతరంగమున ప్రవేశించి రహస్యమున తనను తా నర్పించుకొని తన్మయము చెందు నది శ్రీదేవి అని అర్థము.

తర్పణము అర్పణమే. అర్పణ తలమానికమగు గుణము. జీవితము తనదిగా కాక దైవమునది అని ఎఱిగి దైవమున కర్పించి జీవించుట నిజమగు సాధన. అది అత్యంత సాహసవంతము. దైవము కొరకే జీవించుట, దైవమునే ఆశ్రయించి యుండుట, దైవార్పితముగ జీవితము గడుపుట, సమస్తమునకు దైవమే ఉపాయమని భావించుట, ఆరాధించుట, దైవము దరిచేరుట, సంపూర్ణముగ తన మాన ప్రాణము లతో సహా దైవమున కర్పణ చేయుట అర్పణ మార్గము. సమర్పణ మనగ నిదియే. ఇట్టి సమర్పణ అత్యంత రహస్యముగ నిర్వర్తించుకొనుట రహస్యార్పణ మగును. 'రహస్తర్పణ' మగును. అట్లు అర్పించుకొన్నవారి జీవితము నిరహంకారమై, దైవమున కత్యంత చేరువై, దైవానుగ్రహము నకు పాత్రమై నిలచును. అప్పుడు దైవ మందించు సాన్నిధ్యము పరిపూర్ణానందమును కలిగించి పరితృప్తి కలిగించును. శ్రీమాత పరతత్త్వ మున కర్పితయై పరమానంద భరితయై యుండును.

జీవులు శ్రీమాత అనుగ్రహమును పొందుటకు గాని, దైవ సాన్నిధ్యము చేరుటకు గాని, దైవానుగ్రహము పొందుటకు గాని,

దైవమే తాముగ వైభవోపేతమైన జీవితమును జీవించుటకు గాని, సర్వోత్తమమైన మార్గము సమర్పణ మార్గము. ఈ మార్గ మత్యంత సాహసముతో కూడినది. దైవము నందు పరిపూర్ణ భక్తి విశ్వాసములు గలవారు మాత్రమే నిర్వర్తింపగలరు. అట్టి విశ్వాసము కూర్చువాడు కూడ దైవమే.

కలియుగమున ఏసుక్రీస్తు ఇట్టి సమర్పణ మార్గము ననుసరించి అనుగ్రహము పొంది, భూమిపై దైవమే తానుగ శాశ్వతముగ నిలచి జీవుల నుద్ధరించు చున్నాడు. ఇట్టి మహాత్ములు ఎందరో హిమాలయము లను కేంద్రముగ నేర్పరచుకొని జీవుల వృద్ధిని గూర్చి, సంవృద్ధిని గూర్చి కృషి సల్పుచున్నారు. మైత్రేయుడు, ఉద్ధవుడు, విదురుడు, సూర్య వంశపు క్షత్రియుడగు మరువు, చంద్ర వంశపు క్షత్రియుడగు దేవాపి మొదలుగ ఎందరో మహాత్ములు ఈ సమర్పణ మార్గమున దైవప్రతినిధులై భూమిపై దివ్యదేహములు దాల్చి చరించు చున్నారు.

ఇటీవలి కాలమున రహస్తర్పణ తర్పిత మార్గమును అవలంబించిన వారిలో శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీ రమణ మహర్షి, శ్రీ అరవింద మహర్షి, షిరిడీ సాయిబాబా, మాస్టర్ సి.వి.వి., శ్రీ సత్యసాయి బాబా, మాస్టర్ ఇ.కె. ముఖ్యులు.

జీవులు దైవమునకు తమను తాము సమర్పించుకొనుటలో చాల వ్యత్యాస ముండును. బహుకొద్దిగ తమను తాము సమర్పణ చేయువారుందరు. తమకున్నవి సమర్పణ చేయుట నుండి తమను

తాము సమర్పణ చేసుకొనుట వరకు మార్గ మున్నది. తమకున్న దానిలో కొద్దో గొప్పో ఇతరుల శ్రేయస్సు కొరకై సమర్పణ చేయుట చాలమంది చేయుదురు. తమకున్న దానిని అంతయూ సమర్పణ చేయువారు హరిశ్చంద్రాదుల వంటివారు. తమనే సమర్పణ చేసుకొనువారు అరుదు. ప్రహ్లాదుడు, నారదుడు, అంబరీషుడు, శిబి, బలి, తమను తాము అర్పణము చేసుకొన్న మహాత్ములు. అట్టివారు శాశ్వతులై భాగవత దేహములతో జీవులకు స్ఫూర్తి నిచ్చుచున్నారు. అట్టి వారందరికిని శ్రీమాతయే మార్గదర్శి.



# 383. 'సద్యః ప్రసాదినీ'

రహెూయాగము, రహస్తర్పణము జరుపువారిని అప్పటి కప్పుడు అనుగ్రహించునది శ్రీమాత.

'ప్రసాద' మనగా దేవి అనుగ్రహము. 'సద్యో' యనగా అప్పటి కప్పుడు అని అర్థము. 'సద్యః ప్రసాదిని' అనగా వెంటనే అనుగ్రహించు నది. రహెూయాగము, రహస్తర్పణము అనునవి ముందు నామము లలో తెలుపబడినది. వాటిని నిర్వర్తించుకొనువారు శ్రీమాత అనుగ్రహము నకు పాత్రు లగుదురు. అట్టివారి యందు శ్రీమాత మిక్కిలి ప్రసన్నురాలై యుండును. ఎప్పటి కప్పుడు వారిని రక్షించుకొను చుండును. వారి యందు తన సాన్నిధ్యమును శాశ్వతముగ నిలుపును. తన వైభవము వారి వైభవముగ లోకములందు విస్తరింప చేయును. అమ్మ అనుగ్రహము ఇట్టిది అని తెలుపుట సాధ్యపడు విషయము కాదు. ఊహ కందని అనుగ్రహమును తన భక్తుల యెడల అప్రమత్తమై ప్రసరింపజేయును.

తనకు సమర్పణ చెందినవారికి తన సాన్నిధ్య మిచ్చి, పరిపూర్ణ మగు దివ్యవైభవమును ప్రసాదించును. ప్రసాద మనగా దైవమునకు సమర్పణ చేయబడి దైవముచే అనుగ్రహింపబడి దైవ ప్రతీకగా నిలచి యుండుట. అమ్మ భక్తులు, కృష్ణ భక్తులు అట్టివారు.



# 384. ‘విశ్వసాక్షిణీ’

**వి**శ్వమునకు సాక్షీభూతురాలు. చూచువానికి వ్యవధానము లేకయే ఆత్మజ్ఞానము కలిగించునది.

శ్రీమాత సమస్తమును చూచుచుండును. ఆమెయే లోకసాక్షి. కోటానుకోట్ల జీవులయొక్క ప్రవర్తనమును, పరివర్తనమును అహర్నిశలు వారిలో నుండియే గమనించు చుండును. జీవుల యందలి ఆత్మసాక్షి ఆమెయే. ఆమెకు తెలియకుండగ జరుగు కార్య మేమియు ఉండదు. దొంగబుద్ధి కలవారికి, అధర్మ ప్రవర్తనులకు, అసత్య భాషణము చేయు వారికి ఈ సత్యము తెలియదు. వారిలో నుండియే చైతన్య స్వరూపిణి యైన శ్రీమాత వారిని గమనించుచున్నట్లు తెలియక వికృతమగు భాషణములు, ప్రవర్తనములు చూపుదురు. వారి వారి ప్రవర్తనలను బట్టియే వారిని శ్రీమాత లోనుండి అనుగ్రహించు చుండును. మితిమీరిన ప్రవర్తన చూపినపుడు ఆగ్రహించును, శిక్షించును కూడ. త్రిమూర్తులు సహితము ఆమె కనుసన్నలలో మెలగుచుందురు. విశ్వమంతటిని మరియు అందలి ప్రతి అణువు యందును తానే నిండియున్నది గనుక ఆమె గమనికను దాటి ఏదియూ యుండదు. ఇది ఆమె విశ్వ సాక్షిత్వము.

సతతము బహిరంతరముల యందు తననే చూచుట నేర్చు భక్తులకు లోనుండి, వెలుపలినుండి కూడ తన సాక్షాత్కారము నిచ్చును. తన లోపల, వెలుపల చైతన్యమై నిలచి వివిధ రూపములతో, భావము

లతో, చేష్టలతో వర్తించు చున్నది శ్రీదేవియే అని తెలిసి చూచుట నిజమగు చూచుట. ఇతర చూపు లన్నియూ గ్రుడ్డివారి చూపులే. చైతన్యమయి అయిన శ్రీమాతయే విశ్వరూపి. అందలి రూపము లన్నియూ ఆమెవే. వాని యందలి చేతన ఆమెయే. ఇట్లు తెలిసి దర్శించుచు ఆరాధించువారికి లోపల సాక్షాత్కార మిచ్చును. అటుపైన వెలుపల కూడ సాక్షాత్కారమిచ్చును. అట్టి వారికే అఖండమైన జ్ఞానము కలుగును.



# 385. 'సాక్షివర్జితా'

శ్రీమాతకు వేరొక సాక్ష్యము లేదు. కనుక ఆమె 'సాక్షివర్జిత' అయినది.

శ్రీమాతకు ముందున్నది తత్త్వమే. తత్త్వము నుండియే శివ శక్తు లుద్భవించినవి. అందువలన వారే లోకసాక్షులు. వారి నుండి దిగివచ్చినవారు వారిచే గమనింపబడు చుందురు. దిగివచ్చినవారి నుండి తర తరములుగ దిగివచ్చినవారిని పరికించవచ్చును. సర్వ జీవులను సూర్యుడు, చంద్రుడు, యముడు, కాలము, పంచ భూత ములు గమనించు చుండునని 374వ నామమున తెలుపబడినది. వారిని లోకసాక్షు లందురు. వారికన్న క్రిందుగల లోకములను వారు సాక్షులై చూతురు. కాని వారిని కూడ గమనించునది, పరికించునది శ్రీమాత. క్రింది లోకములవారిని పై లోకములవారు దర్శించ గలరు. చీమ, దోమ, పురుగు మొదలగు జీవులు మనల నంతగ దర్శించవు. మనము వాటిని దర్శింతుము. అట్లే మనము దేవతల నంతగ దర్శింపము. కాని దేవతలు మనలను గమనించుచునే యున్నారు. వారు మనకన్న ఉన్నత లోకముల నున్నవారు. వారిలో కూడ శ్రేణులు గలవు. దేవతల నందరిని గమనించువాడు ఇంద్రుడు. అతడు దేవత లను పాలించువాడు కూడ. అతడిని కూడ గమనించువారు సప్త ఋషులు, కుమారులు, నారదుడు, త్రిమూర్తులు. వారిని కూడ

గమనించునది శ్రీమాత. శ్రీమాత నెవ్వరునూ గమనించలేరు. ఆమె వ్యూహము ఎవ్వరికినీ తెలియదు. ఆమె సంకల్పించిన వెనుక బ్రహ్మర్షులకు, బ్రహ్మాదులకు తెలియును. ఇక ఆమె గమనమును, వ్యూహమును తెలియుట ఎట్లు? తెలియబడదు. కావున ఆమెను ఎవ్వరునూ సాక్షీభూతులై చూడలేరు. చూచుట, తెలియుట వంటి ప్రజ్ఞలు కూడ ఆమె నుండి ఏర్పడినవే. కనుక అంతుబట్టని తత్త్వము శ్రీమాత. ఆమెను చేరవచ్చును గాని ఆమె సర్వత్వమును, ఈశ్వరత్వమును గమనించలేరు. ఆమె కన్న పై స్థితిలో గలవారికే అది సాధ్యము. అట్టి వారెవ్వరునూ సృష్టిలో లేరు. శ్రీకృష్ణ తత్త్వము కూడ ఇట్టిదే. శ్రీకృష్ణుని చర్యలను గాని, ఊహలను గాని తెలిసినవారు అప్పటికినీ ఇప్పటికినీ లేరు. శ్రీకృష్ణుని మూలము శ్రీ లలితయే. శ్రీ లలితయైననూ, శ్రీకృష్ణుడైననూ ఒక్కటియే. దేవర్షి యగు నారదుడు కూడ వారి లీలలను తెలిసినపుడు ఆనందభరితుడై ధ్యానము చేయుచు నర్తించును.



# 386. 'షడంగ దేవతాయుక్తా'

**ష**డంగ దేవతలతో కూడి యున్నది శ్రీదేవి అని అర్థము.

షడంగ దేవత లనగా ఆరు అంగముల దేవతలు. ఆరు అంగములు వరుసగా యిట్లున్నవి. 1. హృదయము, 2. శిరస్సు, 3. శిఖ, 4. నేత్రము, 5. కవచము, 6. అస్త్రములు (అనగా శక్తులు).

షడంగ దేవతలకు దేవత శివుడు. అతడు పై ఆరు దేవతలపై ఈశ్వరత్వము వహించి జీవుల హృదయమున ఈశ్వరుడై వర్ధిల్లును. అట్లు ఈశ్వరుడై హృదయమున నుండి ఆరు అంగములను ఆరు దేవతలచే నిర్వర్తింపచేయును. శ్రీమాత శివుని దేవతలను, అంగములను నిర్వర్తింపచేయు చైతన్య స్వరూపము. ఆమెయే షడంగ దేవతలతో కలసి శివునితో కూడి సమస్తమును నిర్వర్తించును.

షడంగము లనగా వేదార్థమున తెలుపు ఆరు వేదాంగములని కూడ అర్థ మున్నది. అవి వరుసగా 1. శిక్ష, 2. కల్పము, 3. జ్యోతిష్యము, 4. నిరుక్తము, 5. ఛందస్సు, 6. వ్యాకరణము. ఈ ఆరు శాస్త్రములు శ్రీమాత అధీనమున ఉన్నవి. ఆమె ఆరాధనమున నున్న వేదాంగములు ఆరింటిని అనుగ్రహ పూర్వకముగ తెలియనగును. అట్టివారే మహాకవులగు కాళిదాసు, తెనాలి రామకృష్ణ కవి ఇత్యాదులు.

ముందు తెలిపిన ఆరు అంగములను స్పృశించి మంత్రోపాసనము, స్తోత్ర పారాయణము చేయుట సదాచారము.

దేహ మందలి ఆరు అంగములను అధిష్ఠించు దేవతలు యిట్లు పేర్కొనబడిరి. 1. సర్వజ్ఞత, 2. తృప్తి, 3. అనాది బోధ, 4. స్వతంత్రత, 5. అలుప్త శక్తి, 6. అనంతత.

ఈ ఆరుగురు దేవతలు, ఆరు అంగములు, వారి నధిష్ఠించి యున్న శివ శక్తులను నిత్యము స్మరించుట శ్రేయోదాయకము.



# 387. 'షాడ్గుణ్య పరిపూరిత'

**ఆ**రు గుణములతో నిండినది శ్రీదేవి అని అర్థము.

ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, శ్రీ, ధ్యానము, వైరాగ్యము అనునవి షడ్గుణములు. ఈ గుణములు గలవారు శ్రీమంతులు. కేవలము ధనము గలవారు శ్రీమంతులు గారు. శ్రీమాత పై గుణములను పరిపూర్ణముగ కలిగియున్నది. ఆమెను ఆరాధించువారు పై గుణములను పొందుదురు. సద్భక్తి యున్నచోట పై గుణములు తప్పక యుండును.

ధర్మ మాచరించు వారికి క్రమముగ మిగిలిన ఐదు గుణములు అబ్బగలవు. పాండవులలో ధర్మరాజు, రఘువంశము నందు శ్రీరాముడు ఈ ఆరు గుణములకు పూర్ణమగు ఉదాహరణములు. హరిశ్చంద్రుడు, నలుడు కూడ అట్టివారే. దైవము, ధర్మము అనునవి నాణెమునకు బొమ్మ, బొరుసు వంటివి. ధర్మ మాచరించు వారికి దైవము చేరువ అగును. దైవము నారాధించు వారిని ధర్మ మాశ్రయించును. ధర్మముతో కూడని దైవారాధన డాంబికమై యుండును. ధర్మమాధారముగ మిగిలిన ఐదు గుణములు పొందవచ్చును.



# 388. 'నిత్యక్లిన్నా'

నిత్యము దయతో నుండునది శ్రీదేవి అని అర్థము.

దయ, కరుణ, ప్రేమ, ఆత్మీయత, జాలి, క్షమ ఇత్యాది హృద్య మగు గుణములు కలిగినది శ్రీమాత. నిజమునకు శ్రీమాత స్థానము హృదయమే. ఆమె హృదయముతోనే సర్వమును పాలించును. హృదయ ములో గెలువ గలిగిననాడు జీవుడు రాజును మించిన వాడగును. రారాజు హృదయ మెరిగినవాడే. హృదయముతో జయించ గలిగినది, శక్తితో జయించలేము. శక్తిని కూడ హృదయముతో జయించ వచ్చును. ఋషులలో బ్రహ్మర్షి అయిన వశిష్ఠు డట్టివాడు. వశిష్ఠ మహర్షి హృదయ తత్త్వముతో నిండి సర్వమును జయించెను. హృదయమునకున్న స్వామిత్వము మరి ఏ కేంద్రమునకును లేదు. "ఓ అర్జునా! నేను జీవుల హృదయము నందుండి వారిపై ఈశ్వరత్వము నిలుపుచున్నాను." అని శ్రీకృష్ణుడు పలికెను.

సత్త్వమునకు, సత్యమునకు హృదయమే కేంద్రము. శ్రీమాత నిత్యము హృదయ మందుండి భక్తులకు భుక్తి, ముక్తి నిచ్చుచు ప్రేమతో పరిరక్షించుచు నుండును. కనుకనే ఆమె 'నిత్యక్లిన్న'.



# 389. 'నిరుపమ'

సాటిలేనిది శ్రీమాత అని అర్థము.

సృష్టియందు ఎవ్వరినీ శ్రీమాతతో సరిపోల్చలేరు. త్రిమూర్తులు గాని, త్రిశక్తులు గాని, ఆదిత్యులు గాని, రుద్రులు గాని, వసువులు గాని, ప్రజాపతులు, సప్త ఋషులు, కుమారులు గాని, మనువులు, మానవులు గాని ఇందెవ్వరునూ శ్రీమాతతో సరిపోలరు. వీరందరూ ఆమె నుండి దిగివచ్చిన వారే. ఆమెలోని భాగములు. వారికుండు శక్తి గాని, జ్ఞానము గాని, వ్యాపనము గాని మితమైనవే. శ్రీమాత అపరిమిత. ఆమెనుండియే వీరందరునూ దిగివచ్చిరి. మొత్తము సృష్టికూడ ఆమెలో ఒక భాగమే.

ఈమెకు సాటిలేదు అని శ్రుతియందు చెప్పబడెను. ఉపమానము లేనిది. సర్వవ్యాపకమైన చైతన్యముతో సరిపోల్చగలిగినది మరియొకటి ఎట్లుండును?



# 390. 'నిర్వాణ సుఖదాయిని'

అశరీర సుఖము నిచ్చునది శ్రీమాత అని అర్థము.

శరీరమందు వసించు జీవునకు సుఖ మంతంత మాత్రమే. ప్రజ్ఞను పరిమితము చేయునది శరీరము. పరిమితత్త్వము పూర్ణ సుఖము నీయదు. వాయువు వలె స్వేచ్ఛగ జీవించుటకు వలను పడదు. ఆకాశమువలె వ్యాపించుటకు వీలుపడదు. రూపమెట్టిదైనను ప్రజ్ఞను పరిమితము చేయును. అపరిమితమే పూర్ణము. అపరిమితులై నిలచి పరిమిత రూపము ద్వారా పనిచేయవచ్చును. యోగీశ్వరులైన మహర్షు లట్లుందురు. వారికి రూపము వాహనమే గాని బంధించునది కాదు. ఎంత పెద్ద రూపమైననూ పరిమితి కలిగి యుండును. కావున సుఖము కూడ అపరిమితమై యుండదు. అశరీరస్థితియే నిజమగు సుఖము.

రూపము లన్నియూ క్షరములు. అనగా నశించునవి. జీవు లక్షరులు. అక్షరులైన జీవులు క్షరమైన దేహమునందు బంధింపబడుట వలన సుఖ ముండదు. శరీరములోనికి ప్రవేశించి పనిచేయుట, శరీరము వెలుపల నుండుట (అశరీరులై యుండుట), సిద్ధులు, ఋషులు, యోగులు చేయు పని. అవసర మగుచో శరీరమున ప్రవేశించి కర్తవ్యములను నిర్వర్తించి మరల అశరీర స్థితిలో నుండుట నిజమగు సుఖము. అవసరమైనచో వాహన మెక్కి కదలుట, అవసరము లేనపుడు వాహనము విసర్జించి స్వేచ్ఛగ నుండుట మానవులు చేయుచునే వున్నారు కదా! ఇట్లు శరీరము కేవలము వాహన మని తెలిసి దాని నధిష్ఠించి జీవించుట సుఖప్రదము. అట్టి సుఖము నిచ్చునది శ్రీమాత.

సంస్కృతమున వ, బ శబ్దములకు భేదము లేదు. నిర్వాణ మనగ, నిర్బాణము. నిర్బాణ మనగా శరీరము లేకుండుట. బాణ మనగ శరీరము. శరీరమున బంధింపబడ్డ వారందరును బాణాసురునిచే బంధింపబడ్డ అనిరుద్ధునివంటి వారు. శ్రీకృష్ణుడు బాణాసురుని చెర నుండి అనిరుద్ధుని విడిపించెను. అనగా శరీర బంధము నుండి విడిపించి మోక్షస్థితి కలిగించెను.

శ్రీకృష్ణుడు శరీరము నతిక్రమించి యుండి శరీరమును వాహికగ ధర్మ సంస్థాపనము చేసిన యోగేశ్వరుడు. అనగా యోగీశ్వరులకు కూడ ఈశ్వరుడు. అతనికి శరీరము ఉపాధానము (పనిముట్టు) మాత్రమే. అతడు చతుర్భుజుడై శంఖ చక్ర గదా పద్మధారి యైన శ్రీ మహావిష్ణువు. భూనభోంతరాళముల వ్యాపించిన యజ్ఞపురుషుడు. అతడికి శరీర మొక ఉపాధి. అతడు శరీరము నందు ఉండుట, లేకుండుట ఏక కాలమున నిర్వర్తించినవాడు. కృష్ణ తత్త్వ మనగా శ్రీమాత తత్త్వమే అని పలుమార్లు వివరింపబడినది. శ్రీమాత కూడ సమస్తము వ్యాపించి ఉపాధిద్వారా ఉపాసకులకు దర్శన మిచ్చు చుండును. శ్రీమాత తన భక్తుడైన హిమవంతుని ఉద్దేశించి యిట్లు పలికెను : “నీవు నన్ను విడచి నిర్మలమైన నిర్వాణ పదమును పొంద జాలవు. కావున నన్నే శరణు పొందుము. నేను ఏక కాలమున రూపిగ, అరూపిగ కూడ నుందును. ఇందేది తిరస్కరించిననూ నీకు పరిష్కారము లేదు.”

ఈ నామము ఒక అద్భుతమగు రహస్యము. ఇది తెలిసిన వారే పూర్ణ సుఖమును పొందగలరు.

# 391. 'నిత్యా షోడశికారూపా'

**ప**దునారు దేవతల రూపమున భాసించెడిది శ్రీమాత అని అర్థము. కామేశ్వరి మొదలు త్రిపురసుందరి వరకు గల పదహారు దేవతలు నిత్యాదేవత లని పిలువబడుదురు. పదిహేను అంగములుగ పదిహేను దేవతలును, వాటికి మూలముగ శ్రీమాత పదహారవదిగా వెలుగొందు చుండును. నిత్యము అట్లే వెలుగొందు చుండును. 'నిత్య' అనగా శాశ్వతమైనది. వికల్పము లేనిది. ఈ పదహారు దేవతలును, పదహారు కళలుగ చంద్రుని నుండి తిథులద్వారా మనలను అనుగ్రహించు చుందురు. అమావాస్య నుండి పౌర్ణమి అంతము వరకు గల తిథులు పదహారు. పదహారు తిథుల యందు వ్యక్తావక్త స్వరూపిణి యగు శ్రీమాత పూర్ణమే అయిననూ చూచువారిని బట్టి వెలుగు నీడలు ఉన్నట్లు గోచరించును. చంద్రుడు వెలుగు భాగము వ్యక్త స్వరూపము. వెలగని భాగము అవ్యక్త స్వరూపము. అమావాస్య చూపరులకు శూన్య స్థితి. పూర్ణిమ పూర్ణస్థితి. కనుపింపక పోయిననూ చంద్రబింబము పూర్ణముగనే యున్నది. కనిపించుట, కనిపించకపోవుట లోకుల దృష్టి యందు. జ్ఞానదృష్టికి లేనిదంటూ లేదు. యోగులకు, జ్ఞానులకు అమావాస్య పర్వదినము. అంతర్లోక దర్శనములు, దివ్యలోక దర్శన ములు అంతర్ముఖముగ పొందుటకు అమావాస్యయే ప్రధానము. యోగు లకు అమావాస్య నిజమగు పౌర్ణమి. వారికి రాత్రులు పగలే.

ఎప్పుడునూ వున్నటువంటి, నిత్యమైనటువంటి శ్రీమాత పదిహేను కళలతో క్రమముగ అవతరించు చుండును. మరల పదిహేను కళలతో క్రమముగ తిరోధానము చెందుచుండును. ఇట్లు సృష్టి అవరోహణము, ఆరోహణము గావించు చుండును. షోడశీ మంత్రము ద్వారా శ్రీమాత నారాధించు వారికి సంతోషముతో దర్శన మిచ్చును. అభీష్టముల నొసగును. శ్రీమాత షోడశాక్షరీ మంత్రము, కోటి వాజపేయములు, షోడశి యాగముల కంటే గొప్పది యని శ్రీవిద్యా ఉపాసకులు భావింతురు.



# 392. 'శ్రీకంఠార్ధశరీరిణీ'

**శి**వుడు అర్ధ శరీరముగా గలది శ్రీమాత అని అర్థము.

'శ్రీ' అనగా విషము. శ్రీకంఠుడు అనగా కంఠము నందు విషము ధరించినవాడు శివుడు. శివుని అర్ధాంగి శ్రీమాత. ప్రకృతి పురుషులు సృష్టియందు అవినాభావ సంబంధము కలిగి యుందురు. "మొదట ఆత్మయే యున్నది. పిదప ఆ ఆత్మయే రెండైనది. ఆ రెండే ప్రకృతి పురుషులు." వారినే భార్యా భర్తలు అని కూడా అందురు. శంకరుని అర్ధశరీరము పొందిన శ్రీదేవి శివునియొక్క వామభాగముగ యుండును. శివుడు తెలుపు, ఆమె నలుపు. అట్లే శివుడు నలుపై నప్పుడు ఆమె తెలుపు. ఇట్లు అష్టమి తిథిగ కృష్ణపక్షము నందు, శుక్ల పక్షము నందు కూడ దర్శనమగు చుండును. ఆమె కనపడినపుడు అతడు మరు గగును. అతడు కనపడినపుడు ఆమె మరు గగును. దుర్గాష్టమి నాడు ఆమె కనపడును. కృష్ణాష్టమినాడు అత డగుపడును. ఇట్లు ప్రకృతి పురుషుడుగా నున్నది శ్రీదేవియే. అపుడామె 'పరా'.



# 393. 'ప్రభావతీ'

**కాం**తి కలది శ్రీమాత అని అర్థము.

కాంతి శ్రీమాత సహజ గుణము. ఆమెయే సృష్టి వెలుగు. ఆ వెలుగు ఆధారముగనే సృష్టి వైభవ మంతయూ యేర్పడు చున్నది. ఆ వెలుగు యందు వేడిమి యున్నది. అది ఆమె తేజస్సు. అందు అందము కూడ యున్నది. వెలుగుల అందము సామాన్యులను కూడ ఆకర్షితులను చేయును. శ్రీమాత వెలుగు మిట్ట మధ్యాహ్నపు వెలుగు వలె నుండును. ఉభయ సంధ్యల యందలి వెలుగు కూడ శ్రీమాతయే. సూర్యుని యందు వెలుగు, చంద్రుని యందలి వెలుగు, అగ్ని యందలి తేజస్సు శ్రీమాతయే. సమస్తమును వెలిగించునది ఆమెయే. సృష్టి యజ్ఞమునకు ఆమెయే వెండితెర. వెండితెర ఆధారముగనే సృష్టి చిత్రము ప్రదర్శింపబడు చున్నది. చూచువారి చూపు యందలి వెలుగు కూడ ఆమెయే. కరణముల యందలి ప్రకాశము కూడ ఆమెయే. ఎక్కడ ప్రకాశ మున్నదో అక్కడ శ్రీమాత యున్నది. ఆమె ప్రకాశ గుణము ద్రవ్యమయము కాదు. ద్రవ్యముపై ఆమె గుణము ప్రసరించినపుడు ఆయా ద్రవ్యములు వెలుగు చుండును.



# 394. 'ప్రభారూపా'

**కాం**తిరూపము కలిగినది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత గుణమే కాదు; రూపము కూడ కాంతివంతమే. కాంతివంత మగు గుణ మున్ననూ, కాంతివంత మగు రూపము ఉండనక్కర లేదు. కాని శ్రీమాత విషయమున రూపము కూడ కాంతి వంతమే. కాంతి రూపముల యందలి కాంతి శ్రీమాతయే అని తెలియ వలెను. కన్నులలోని కాంతి ఆమెయే. శరీరమందలి మెఱపు ఆమెయే. కాంతికి ఆకర్షణ సహజ గుణము. ఆకర్షణము ఎచ్చట నున్నదో అచ్చట శ్రీమాత యున్నదని తెలియవలెను. కాంతి రూపముతోనే అందరిని ఆకర్షించును. దుష్టులను మాయ చేయును. శిష్టులను అనుగ్రహించును. నిజముగ కాంతి మాయా రూపమే. సత్యమును మరుగు పరచగల కాంతి ఆమె. ఆమె కాంతి ఆవరణము నందే శివుడు సత్యమై యున్నాడు. సత్యమునకు ఆమె ప్రథమావరణ మగుటచే సత్యమును కూడ మరుగు పరచగల కాంతి రూపము శ్రీమాతది. ఆమె కాంతి ఆధారముగనే ఇచ్ఛా, జ్ఞాన, క్రియలు జీవుల కేర్పడి సృష్టి కార్యము నడచుచున్నది.



# 395. 'ప్రసిద్ధా'

**'నే**ను' అని తెలియబడునది శ్రీదేవి.

మనకు మన మున్నామని తెలియజేయునది శ్రీమాత. నిద్రలో మన మున్నప్పుడు వున్నామను జ్ఞప్తి యుండదు. ఉండుట యుండును గాని ఎరుక వుండదు. మన యందలి ఎరుకగ వుండి నిద్ర నుండి లేపినపుడు ప్రతి ఒక్కరును "నేను వున్నాను" అనుకొందురు. ఈ నేనుగ నున్నది శ్రీదేవియే. మన మున్నట్లు మనకు తెలియ చేయునది శ్రీదేవి. మన అందరి యందును 'నేను'గ మేల్కొంచునది. ప్రతి ఒక్కరునూ నేను, నేను అందురు. ఎవరా నేను? ఈ నేను మన నామము కాదు. మన రూపము కాదు. కులము, మతము, జాతీయత, లింగ భేదములతో సంబంధము లేక అందరునూ నేను అందురు. పసివారి నుండి వృద్ధుల వరకు తమను గూర్చి సంబోధించినపుడు నేను అందురు. ఈ నేను అనునది మన యందలి చైతన్యమే. ఇట్లందరి యందు ప్రసిద్ధి గాంచినది శ్రీమాత. ఇంత ప్రసిద్ధిగ శ్రీమాతయే అందరియందు నేనుగ ఉన్ననూ, దానిని గమనింప లేకపోవుట ఆశ్చర్యమే. శ్రీమాత సుప్రసిద్ధ. మన యందలి నేను అను ఎఱుకకు ఆమె మూలము.



# 396. 'పరమేశ్వరి'

**ప**రాత్పరురాలైన ఈశ్వరి అని అర్థము.

ఈశ్వరి అనగా స్వామిని అని అర్థము. యజమానురాలు అని అర్థము. సమస్తము ఆమె అధీనముననే యున్నది గనుక ఈశ్వరి. సృష్టి సమస్తము ఆమె యధీనముననే యున్నది. సృష్టి కతీతమై యుండి సృష్టిని నిర్వర్తించు చుండును. కావున ఆమె పరమేశ్వరి అయినది. పరము అనగా సృష్టికి పరము అని అర్థము. శివుని నుండి (సత్యము నుండి) వ్యక్తమై సమస్తమును నిర్వర్తించు చుండును. అతడు పరమేశ్వరుడు. ఆమె పరమేశ్వరి. అతడు సత్యము. ఆమె చైతన్యము. అతడు స్థితి. ఆమె దాని అనుభవము. అతడు లేని ఆమె లేదు. ఆమె లేని సృష్టి లేదు. సృష్టియందు వారిరువురు సమానులు. సృష్టి కావల వారిరువురునూ ఒక్కటియే. ఒకటి యం దామె, ఆయన ఇరువురునూ. పరమాత్మగ కలిసి యుందురు. సృష్టి కొరకై ఇరువురుగ యేర్పడుదురు.



# 397. 'మూలప్రకృతి'

**అ**ష్ట ప్రకృతులకు మూలమైనది శ్రీమాత అని అర్థము.

మూల ప్రకృతి నుండియే గుణములు, పంచ మహాభూతములు పుట్టుచున్నవి. మూల ప్రకృతి అవ్యక్తము నుండి వ్యక్తమై పురుషునితో కలిసి మహత్తుగ మారును. ఈ మహదహంకారము నుండి రాజసిక అహంకారము, తామసిక అహంకారము, సాత్త్విక అహంకారము యేర్పడును. ఈ మూడు గుణము లాధారముగ జీవు లేర్పడుదురు. జీవులు త్రిగుణములు, పంచ భూతములు, అష్ట ప్రకృతుల యందుందురు. శ్రీమాత వాటికి మూలమైన ప్రకృతియై యుండును. మూల ప్రకృతి మంత్రము అ, హ, ల రూపము గలదని విద్వాంసులు తెలుపుదురు. ఈ ప్రకృతి వికారము లేనిది. దాని నుండి యేర్పడు ప్రకృతులు వికారముతో కూడి యుండును. అనగ మార్పునకు గురి అగుచుండును. ఈ ప్రకృతి మాయ కావల యుండును. సమస్తమునకు ఈ ప్రకృతియే మూలము. దానికి మూలము లేదు. ఈ ప్రకృతిని తొమ్మిదవ అంకెతో పోల్చుదురు. తొమ్మిదవ అంకెను నవ అందురు. అనగా నిత్య నూతనమై ఏ వికారము లేక యుండునదని తెలియవలెను.



# 398. 'అవ్యక్తా'

గ్రహింపబడనిది, వర్ణింపలేనిది, తపస్సుచే గాని, కర్మచే గాని పొందరానిది శ్రీమాత అని అర్థము.

మూల ప్రకృతి నుండి మొదటి ఆవరణగా వెలువడునది అవ్యక్తము. మాయ యొక్క ప్రకాశ రూపము గలది. ఈ అవ్యక్తము సృష్టి ధర్మము కలిగి యుండును. సూక్ష్మతమమై యుండును. చక్రము లేనిదై యుండును. దీనికి ఆది గాని, అంతము గాని, చేతన గాని లేదు. విశ్వవ్యాప్తమై నిలచి యుండును. మహత్తున కవ్వలిదై యుండును. మూడు గుణముల సమష్టి రూపముగ యుండును. మూల ప్రకృతి నుండి యేర్పడును. ఈ అవ్యక్త మాధారముగనే వ్యక్తమగు మహతత్త్వము పుట్టును. అవ్యక్తమే వ్యక్త మగుటచేత తర్వాత నామమున 'వ్యక్తా అవ్యక్త స్వరూపిణి' అని కీర్తింపబడినది.



# 399. 'వ్యక్తావ్యక్త స్వరూపిణి'

**అ**వ్యక్తమైన శ్రీమాత అవరోహణ క్రమమున వ్యక్త మగును అని అర్థము.

శ్రీమాత వ్యక్తముగను, అవ్యక్తముగను కూడ ఏక కాలమున నున్నది. కనబడువానిలో కనబడని ప్రజ్ఞ, శక్తి రూపములతో నున్నది. ప్రజ్ఞ కతీతముగ కూడ నున్నది. కనబడునది చూచి, అది ఆధారముగ కనబడని మూడు స్థితులను గ్రహించువారు తెలిసినవారు. వారినే మనుషులని, బ్రాహ్మణులని వేదము తెలుపుచున్నది.

*"చత్వారి వాక్పరిమితా పదాని*
*తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః ।*
*గృహా త్రీణి నిహితా నేంగయంతి*
*తురీయం వాచో మనుష్యా వదంతి ॥"*

నాలుగు స్థితులలో పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరిలుగ నున్న వాక్కును మనీషులైన బ్రాహ్మణు లెరుగుదురు. ఇతరులు నాలుగవది అయిన వైఖరీ వాక్కునే ఎరుగుదురు. మూడు వంతులు దివ్యము, అమృతము అయి ఉండి ఒక వంతు మాత్రమే గోచరించు విశ్వముగను, భూతములుగను శ్రీమాత యున్నది. కేవలము కనబడునదే అంతయూ అనుకొనుట అవివేకము. కనబడుచున్న వస్తువునందు నిక్షిప్తమై యున్న మూడు స్థితులు కూడ కలిపి చూడగలిగినచో ఒక వస్తువు యొక్క

సమగ్రరూపము తెలియును. ప్రతి వస్తువు నందు వ్యక్తము, అవ్యక్తము రూపములతో శ్రీమాతయే యున్నది అని తెలియవలెను. శ్రీమాత ఒక పాదమే వ్యక్త మగును, మూడు పాదములు అవ్యక్తముగనే యుండును. అవ్యక్తము మూలప్రకృతితో కూడియుండును. మూలప్రకృతి బ్రహ్మముతో కూడియుండును. ఇట్లు పరమపద సోపాన మంతయు శ్రీమాత రూపము వ్యాపించి యున్నది. తరువాత నామము 'వ్యాపిని'యే.



# 400. 'వ్యాపినీ'

సమస్త జగత్తు నందునూ వ్యాపించినది శ్రీమాత అని అర్థము.

పరము నుండి మూల ప్రకృతిగను, అటుపైన అవ్యక్తగను, ఆపైన వ్యక్తా వ్యక్త స్వరూపిణిగను పరిణమించు శ్రీమాత ఇచ్ఛా జ్ఞాన క్రియ లను మూడు విధములైన అహంకారములను దాల్చి ప్రకృతి సర్గములుగ (లోకములుగ) పరిణమించును. ఇట్లు జగత్తంతయూ వ్యాపించును. ఇట్లు వ్యాప్తిచెంది విశ్వరూపమై నిలచును. శ్రీమాత వ్యాపక శక్తి అణువునుండి బ్రహ్మాండము వరకు పనిచేయు చుండును. ఆమె లేని జగత్తు లేదు. తాను వ్యాప్తిచెందిన జగత్తును కూడ అతిక్రమించి వసించును.

అటుపైన వివిధ ఆకారములు ధరించును. 'వివిధాకార' అను నామముతో పంచమ శతకము ప్రారంభమగును. ఈ నాలుగవ శతకము వ్యాపిని నామముతో పరిసమాప్త మగుచున్నది.

శ్రీమాత అనుగ్రహముగల భక్తులు దివ్యేచ్ఛ, దివ్యజ్ఞానము లను శ్రీమాత అనుగ్రహము పొంది దివ్యకార్యములను నిర్వర్తించుచు సృష్టి యందు వ్యాప్తి చెందుచునే యున్నారు. శ్రీమాత నారాధించు వారికి యిట్టి వ్యాప్తి శ్రీమాత అనుగ్రహించవలెనని ప్రార్థన చేయుచు ఈ చతుర్థ శతకమును శ్రీమాత పాదముల చెంత సమర్పించుచు పరిసమాప్తము చేయబడు చున్నది. పంచమ శతకమున కిది పునాదియై నిలువవలెనని ప్రార్థన.

శ్రీరస్తు.

శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః ।

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రరత్నము

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

హ్రీంకారీ హ్రీమతీ హృద్యా హేయోపాదేయవర్జితా ॥ 70

రాజరాజార్చితా రాజ్ఞీ రమ్యా రాజీవలోచనా ।
రంజనీ రమణీ రస్యా రణత్కింకిణిమేఖలా ॥ 71

రమా రాకేందువదనా రతిరూపా రతిప్రియా ।
రక్షాకరీ రాక్షసఘ్నీ రామా రమణలంపటా ॥ 72

కామ్యా కామకలారూపా కదంబ కుసుమప్రియా ।
కల్యాణీ జగతీకందా కరుణారససాగరా ॥ 73

కళావతీ కళాలాపా కాంతా కాదంబరీప్రియా ।
వరదా వామనయనా వారుణీ మదవిహ్వలా ॥ 74

విశ్వాధికా వేదవేద్యా వింధ్యాచల నివాసినీ ।
విధాత్రీ వేదజననీ విష్ణుమాయా విలాసినీ ॥ 75

క్షేత్రస్వరూపా క్షేత్రేశీ క్షేత్రక్షేత్రజ్ఞ పాలినీ ।
క్షయవృద్ధి వినిర్ముక్తా క్షేత్రపాల సమర్చితా ॥ 76

విజయా విమలా వంద్యా వందారు జనవత్సలా ।
వాగ్వాదినీ వామకేశీ వహ్నిమండలవాసినీ ॥ 77

భక్తిమత్కల్పలతికా పశుపాశ విమోచనీ ।
సంహృతాశేషపాషండా సదాచార ప్రవర్తికా ॥ 78

తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదన చంద్రికా ।
తరుణీ తాపసారాధ్యా తనుమధ్యా తమోఽపహా ॥ 79

చితిస్తత్పదలక్ష్యార్థా చిదేక రసరూపిణీ ।
స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః ॥ 80

పరా ప్రత్యక్చితీరూపా పశ్యంతీ పరదేవతా ।
మధ్యమా వైఖరీరూపా భక్తమానస హంసికా ॥ 81

కామేశ్వరప్రాణనాడీ కృతజ్ఞా కామపూజితా ।
శృంగారరస సంపూర్ణా జయా జాలంధరస్థితా ॥ 82

ఓడ్యాణపీఠనిలయా బిందుమండలవాసినీ ।
రహోయాగ క్రమారాధ్యా రహస్తర్పణ తర్పితా ॥ 83

సద్యః ప్రసాదినీ విశ్వసాక్షిణీ సాక్షివర్జితా ।
షడంగ దేవతాయుక్తా షాడ్గుణ్య పరిపూరితా ॥ 84

నిత్యక్లిన్నా నిరుపమా నిర్వాణ సుఖదాయినీ ।
నిత్యా షోడశికారూపా శ్రీకంఠార్ధశరీరిణీ ॥ 85

ప్రభావతీ ప్రభారూపా ప్రసిద్ధా పరమేశ్వరీ ।
మూలప్రకృతి రవ్యక్తా వ్యక్తావ్యక్త స్వరూపిణీ ॥ 86

వ్యాపినీ వివిధాకారా విద్యాఽవిద్యా స్వరూపిణీ ।

# OTHER BOOKS THROUGH MASTER K. PARVATHI KUMAR

*The following books are available in: English (E), German (G), Spanish (S), French (F), Hebrew (H), Telugu (T), Hindi (HI) and Kannada (K) languages.*

| | | |
|---|---|---|
| 1. | Agni (E/G/S) | 60-00 |
| 2. | Amanaskudu (T/K) | 18-00 |
| 3. | Antardarsana Dhyanamulu (T) | 100-00 |
| 4. | Anveshakudu (T) | 60-00 |
| 5. | Asangudu (T) | 15-00 |
| 6. | Ashram Leaves (E/G/S) | 100-00 |
| 7. | Ayurvedic Principles (E) | |
| 8. | Bharateeya Sampradayamu (T/Hi) | 10-00 |
| 9. | Cow (‘Govu’ Mahatyam Vivarana) (E/T/K) | 20-00 |
| 10. | Devapi Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 11. | Dhanakamuni Katha (T) | 25-00 |
| 12. | Doctorine of Eternal Presence (E) | 10-00 |
| 13. | Gayatri Mantra - Avagahana (T) | 10-00 |
| 14. | Geetopanishad - Gnana Yogamu (T) | 25-00 |
| 15. | Geetopanishad - Karma Yogamu (T) | 20-00 |
| 16. | Geetopanishad - Sankhya Yogamu (T) | 25-00 |
| 17. | Geetopanishad - Karmasanyasa Yogamu (T) | 20-00 |
| 18. | Good Friday (E/G/S/F/H) | 10-00 |
| 19. | Health & Harmony (E) | 120-00 |
| 20. | Hercules-The Man and the Symbol (E/G/S/F) | 100-00 |
| 21. | Himalaya Guru Parampara (T/Hi) | 12-00 |

| | | |
|---|---|---|
| 22. | Jupiter-The Path of Expansion (E/G/S) | 40-00 |
| 23. | Jyotirlinga Yatra (T) | 20-00 |
| 24. | Katha Deepika (T) | 40-00 |
| 25. | Listening to Invisible Master (E/G/S/F/H) | 20-00 |
| 26. | Lord Maitreya-The World Teacher (E/G/S/F/H) | |
| 27. | Maitreya Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 28. | Mana Mastaru Garu (T) | 60-00 |
| 29. | Mantrams-Their Significance and Practice (E/G/S) | 35-00 |
| 30. | Maria Magdalena (E/S/G/F) | |
| 31. | Marriage-A Sacrament (E) | |
| 32. | Maruvu Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 33. | Master C.V.V. (Birthday Message) (T) | 30-00 |
| 34. | Master C.V.V. Noothana Yogamu (T) | 20-00 |
| 35. | Master C.V.V. Yogamu (T) | 20-00 |
| 36. | Master C.V.V. Yogamu-Karma Rahityamu (T) | 10-00 |
| 37. | Master C.V.V. - May Call !(E/G/S) | 100-00 |
| 38. | Master C.V.V. - May Call ! II (E) | 100-00 |
| 39. | Master C.V.V. The Initiator - Master E.K. The Inspiror (E) | 15-00 |
| 40. | Master C.V.V. - Saturn Regulations | 125-00 |
| 41. | Master E.K. - The New Age Teacher (E/G/S) | 70-00 |
| 42. | Mithila-A New Age Syllabus (E/G/S) | 100-00 |
| 43. | Occult Meditations (E/G/S) | 100-00 |
| 44. | Omkaram (T) | 30-00 |
| 45. | On Change (E/G/S) | 50-00 |
| 46. | On Healing (E/G/S) | 100-00 |

| | | |
|---|---|---|
| 47. | On Love (E/G/S) | 50-00 |
| 48. | On Service (E/G/S) | 50-00 |
| 49. | On Silence (E/G/S) | 50-00 |
| 50. | Pranayamam (T) | 10-00 |
| 51. | Prayers (E/G/S) | 100-00 |
| 52. | Rudra (E/G/S) | 30-00 |
| 53. | Sankhya - The Sacred Doctrine (E/G/S) | 75-00 |
| 54. | Saraswathi - The Word (E/G/S) | 60-00 |
| 55. | Saturn-The Path of Systematised Growth (E/G/S) | 40-00 |
| 56. | Shodasopachara Pooja - Avagahana (T) | 10-00 |
| 57. | Sound-The Key and its Application (E/G/S) | 40-00 |
| 58. | Spiritualism - Business and Management (E/G/S) | 25-00 |
| 59. | Sri Dattatreya (E/G/S/T/Hi) | 33-00 |
| 60. | Sri Gurupaduka Sthavam (T) | 30-00 |
| 61. | Sri Krishna Namamrutham (T) | 25-00 |
| 62. | Sri Lalitha-1 (T) | 40-00 |
| 63. | Sri Lalitha-2 (T) | 40-00 |
| 64. | Sri Lalitha-3 (T) | 40-00 |
| 65. | Sri Sastri Garu (E/G/S/F/T/H) | 40-00 |
| 66. | Sri Shiridi Sai Sayings (E/G/S/T/Hi) | 80-00 |
| 67. | Steps on Silence (E) | 75-00 |
| 68. | The Aquarian Cross (E/G/S) | 100-00 |
| 69. | The Aquarian Master (E/G/S) | 75-00 |
| 70. | The Doctorine of Ethics (E) | 35-00 |
| 71. | The Etheric Body (E/G/S) | |
| 72. | The Path of Synthesis (E) | 40-00 |

| | | |
|---|---|---|
| 73. | The Splendor of Seven Hills (E/T/Hi) | 15-00 |
| 74. | The Teachigs of Lord Sanatkumara | 150-00 |
| 75. | The Theosophical Movement (E/G/S) | 60-00 |
| 76. | The White Lotus (E/G/S) | 20-00 |
| 77. | Time - The Key (E/G/S) | |
| 78. | Uranus - The Alchemist of the Age | 150-00 |
| 79. | Venus - The Path of Immortality (E/G/S) | 80-00 |
| 80. | Violet Flame Invocation (E/G) | 60-00 |
| 81. | Vrutrasura Rahasyam (T) | 35-00 |
| 82. | Wisdom Buds (E/S) | 20-00 |
| 83. | Wisdom Teachings of Vidura (E/G/S) | 80-00 |
| 84. | Moon & Spiritual Astrology (S) | |
| 85. | The Death & Reincarnation (S) | |
| 86. | Commentary on Om Namonarayanaya (S) | |
| 87. | Master Jesus, Life and Teachings (S) | |
| 88. | The Science of Ayurveda & Homoeopathy (S) | |
| 89. | The Teachings of Master D.K. (S) | |
| 90. | The Human Constitution (S) | |
| 91. | The Masters of Wisdom (S) | |
| 92. | The Path of Meditation (S) | |
| 93. | Stories for Disciples (S) | |
| 94. | Spirituality in Daily Life (S) | |
| 95. | Special Practices for Disciples (S) | |
| 96. | Fundamentals of Health & Healing (S) | |
| 97. | Ganesha, The Cosmic Lord of Groupings (S) | |
| 98. | Astrology and Healing (S) | |

## DHANISHTA OTHER PUBLICATIONS

| No. | Title | Price |
|---|---|---|
| 1. | Puranapurushuni Pooja Vidhanam (T) | 10-00 |
| 2. | Sarannavaratra Pooja Vidhanamu (T) | 30-00 |
| 3. | Sri Dattatreya Pooja Vidhanamu (T) | 10-00 |
| 4. | Sri Hanuman Chalisa (T) | 15-00 |
| 5. | Sri Mahalakshmi Pooja Vidhanamu (T) | 12-00 |
| 6. | Sri Rama Pooja Vidhanamu (T) | 10-00 |
| 7. | Sri Siva Hridayamu (T) | 5-00 |
| 8. | Sri Siva Pooja (T) | 15-00 |
| 9. | Sri Soukumarya Satakam (T) | 10-00 |
| 10. | Sri Surya Pooja Vidhanamu (T) | 7-00 |
| 11. | Sri Venkateswara Pooja Vidhanamu (T) | 8-00 |
| 12. | Vinayaka Vratakalpamu (T) | 25-00 |
| 13. | Vishnu Sahasranamam (T) | 12-00 |



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువ లేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జన్మించినది.

**"ధనిష్ఠ"** మాస్టర్ పార్వతీకుమార్‌గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపములోను, పుస్తకముల రూపము లోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును సద్గోష్ఠికై వలసిన వాతావరణమును - "జగద్గురు మందిరము"గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

## సంకలనకర్త : మాస్టర్ పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయులకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ పార్వతీకుమార్**గారు. వారి బోధనలు లెక్కకుమించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియవచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసరణీయమై, ఆచరణ యోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించు చున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళారంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో – మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, *"మానవ సేవయే మాధవ సేవ"*అను మాటకు

సరియైన అర్థము యిదేనని మాస్టరుగారు తమ ప్రవర్తన ద్వారా తెలియ పరచుచున్నారు. మాస్టర్ పార్వతీకుమార్‌గారు బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక – మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, శతాధిక గ్రంథముల సంకలన కర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొనుచుండు ననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు మాస్టరుగారి దృఢ విశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశ విదేశములలో పరహితసేవ గావించుచున్నవి. “పరహితము పరమధర్మ” మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవద్ధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

**"శ్రీ**లలిత" అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతిమాసము 'నావాణి' దర్శన మాస పత్రికయందు ప్రచురింపబడుచున్నవి. పాఠకుల కోరికపై అమ్మవారి "సహస్ర" నామములను "శత" నామములు ఒక భాగముగ ప్రచురించుటకు సంకల్పించితిమి. ఇప్పటికి 400 నామము లను 4 భాగములుగ ధనిష్ఠ ప్రచురించినది. ప్రస్తుతము 401 నుండి 494 వరకు 5వ భాగముగ అందించుచున్నాము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీర మగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారినుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారి యందు, వారి భాషణయందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహపరములకు పరిష్కార మని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

**– ధనిష్ఠ**

# పరిచయము

**ల**లితాదేవి, శ్రీదేవి, దుర్గ, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమెయే మూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్త స్థితియందు సత్యముగను, వ్యక్త స్థితియందు మహాచైతన్యముగను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు, సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితి గొనుటకు వినియోగ పడును. అందులకే పారాయణము.

అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వ్యాఖ్యానము. సామాన్యు లకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

- పార్వతీకుమార్

# విషయసూచిక

# శ్రీ లలిత



ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

# 401. 'వివిధాకారా'

ప్రాకృత సర్గము, వైకృత సర్గము, కౌమార సర్గము అను వివిధ ఆకారములు కలది శ్రీమాత అని అర్థము.

మహదహంకారము నుండి సాత్త్విక, రాజస, తామస అహంకారము లేర్పడుచున్నవి. వానినుండి తైజస, వైకారిక, భూతాది ప్రకృతి ప్రకాశించును. తైజసము నుండి మనస్సు, వైకారికము నుండి ఇంద్రియములు, భూతాది నుండి తన్మాత్రలు పుట్టినవి. ఈ మొత్తము ఆరు సర్గలు మహత్తు నుండి జరిగినవి. వీటిని ప్రాకృత సర్గము లందురు. వీనినుండి వృక్షములు, పశువులు, ఇతర భూతములు పుట్టినవి. వీటిని వైకృత సర్గము లందురు. ప్రాకృతము, వైకృతాకృతము అయిన ఒక సృష్టిని కౌమార సర్గము అని చెప్పిరి. ఇందు మొదటి సర్గము మహత్తు, రెండవది అహంకారము, మూడవది భూతము.

మహత్తు నుండి గుణములు, అహంకారము నుండి ద్రవ్యజ్ఞాన క్రియలు, భూత సర్గము నుండి ద్రవ్యశక్తి పుట్టినవి. వీని వివరములు భాగవతము రెండవ అధ్యాయమున బ్రహ్మదేవుడు నారదునకు తెలిపిన ఉపదేశమున చూడవచ్చును.

# 402. 'విద్యా అవిద్యా స్వరూపిణీ'

శ్రీమాత విద్యా స్వరూపిణియే గాక, అవిద్యా స్వరూపిణి యని కూడ అర్థము.

విద్యను, అవిద్యను రెండింటిని ఎఱుంగువాడు మృత్యువును దాటి అమృతత్త్వము ననుభవించు చుండును. సృష్టి యందలి ద్రవ్య మంతయూ నశించు చుండును. ఇంద్రియ ప్రవృత్తులునూ అట్లే తాత్కాలికములు. గుణములు కూడ ప్రాకృత సంబంధములే. గుణములు, ఇంద్రియములు, రూపములు మూడును ప్రకృతి సంబంధితములు. అనుభూతికి ఈ మొత్తము వేదిక. జీవుడు పరమాత్మ నుండి వ్యక్తమైన అంశ. ప్రకృతి కూడ పరమాత్మ నుండి వ్యక్తమైనదే. మూలప్రకృతి అష్టప్రకృతిగ మారి జీవుని అనుభూతికి వేదిక యగు చున్నది. వేదిక శాశ్వతము కాదు. అది అవిద్యా స్వరూపము. జీవుడు శాశ్వతుడు. మూలప్రకృతి, దాని కాధారమైన పరతత్త్వము శాశ్వతము. మూల ప్రకృతి, పరతత్త్వములతో అనుసంధానము చెందు ఆత్మ విద్యా స్వరూపమై యుండును. అష్టప్రకృతులలో బంధింపబడినపుడు అవిద్య ఆవరించును.

విద్య అవిద్యలను తెలిసి జీవించువాడు అమృత స్వరూపుడు. విద్య భేద జ్ఞానము నిచ్చును. అవిద్య అభేద జ్ఞానము నిచ్చును. అదియే ఆత్మ జ్ఞానము, పరమాత్మ జ్ఞానము. జీవుడు తాను ఆత్మ యని యెఱిగి భేద జ్ఞానముతో సృష్టియందు, పరమాత్మ జ్ఞానముతో

పరమాత్మ యందు ఉభయతారకముగ జీవించవలెనన్నచో విద్య అవిద్యలను తెలిసి యుండవలెను. అట్టివాని జీవితమే సమగ్రము, పరిపూర్ణము.

అవిద్యా స్వరూపము తెలియనివాడు సృష్టియందు సుఖించలేడు. విద్యాస్వరూపము తెలియనివాడు కూడ సృష్టియందు సుఖించలేడు. ఏకత్వము తెలిసిననూ లేక భిన్నత్వము తెలిసిననూ పూర్ణసుఖ ముండదు. సంపూర్ణ ఆనందము కలుగవలె నన్నచో భిన్నత్వ మందలి ఏకత్వము తెలియవలెను. ఏక కాలమున రెండునూ తెలిసినప్పుడే జీవుడు పరిపూర్ణ ఆనందమును పొందగలడు.

పూర్ణయోగి ఇహపరములందు సమవర్తనము కలిగి యుండును. ఇహమును నిరసించుట, పరమును గొప్పదని భావించుట సమ వర్తనమునకు దారి చూపదు. పూర్ణయోగి ఇహమునందు పరమును దర్శించగల దిట్ట. అట్టి యోగులు స్మశానమున కావలివాడుగ నుండు టకు గాని, చెప్పులు కుట్టువాడుగ నుండుటకు గాని, మాంసము అమ్ముకొనువాడుగ నుండుటకు గాని, గోవులు, గొఱ్ఱెలకాపరిగ నుండుటకు గాని, రాజకీయముల యందుండుటకు గాని, యుద్ధము లందు పాల్గొనుటకు గాని, వ్యాపారాదులు చేయుటకు గాని సందేహింపరు. కేవలము పాండిత్యమును ఒలకపోయుచు శాస్త్ర పురాణాదులను మాత్రమే వివరించుకొనుచు జీవించవలెనను నియమ ముండదు. ప్రకృతి తనకేది లభింపజేసిన దానియందే వర్తించును. *"యదృచ్ఛాలాభ సంతుష్టో"* అని గీతలో భగవానుడు పలికినాడు.

ధర్మవ్యాధుడు, హరిశ్చంద్రుడు, శ్రీకృష్ణుడు అట్టివారు. వీరికి అవిద్య యందు నీరస భావము లేదు. విద్యా అవిద్యల యందు సమమగు రస భావము కలవారు. ఇట్టి వారు శ్రీమాత స్వరూపులే.

*"సమత్వం యోగ ఉచ్యతే", "పండితాః సమదర్శినః"* అని యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు ఈ పూర్ణతత్త్వమునే బోధించినాడు; ఆచరించి చూపించినాడు కూడ. శ్రీరాముని జీవితమందు కూడ ఇట్టి సమ వర్తనము గోచరించును. శత్రువునైననూ ప్రేమించగల తత్త్వము వారిరువురిది.

భేదముగ కనిపించుచున్న ప్రకృతి యందు అభేదముగ నున్న తత్త్వమును కూడ చూడవలెను. అభేదమగు తత్త్వమును చూచుచు భేద జ్ఞానము మరవకుండుట కూడ అవసరము.

ఆదిశంకరులు తమ శిష్యులకు భేద అభేద జ్ఞానములను ఆచరణ మార్గమున బోధించిరి. అద్వైతమును బోధించిన శంకరులు శిష్య బృందముతో అడవిలో పయనించు చున్నప్పుడు పులిని చూచి చెట్టు నెక్కుట భేద జ్ఞానమును బోధించుటకే.



# 403. 'మహాకామేశ నయనా కుముదాహ్లాద కౌముదీ'

**మ**హాకామేశ్వరుని అర్ధ నిమీలిత నేత్రములకు ఆహ్లాదము కలిగించు వెన్నెల వంటిది శ్రీమాత అని అర్థము.

మహాకామేశుడు నిర్లిప్త భావమునకు అధిపతి. అతడు సతత సంతుష్టి. నిత్య తపస్వి. సృష్టికార్యములకై అతనిని ఉన్ముఖము గావించ గలిగిన ఆహ్లాద స్వరూపిణి శ్రీమాతయే. పరముతో ఏకత్వము చెంది యుండు ఈశ్వరుని కామేశునిగా చేయుట సాధ్యమా! పరమునందు ఆసక్తి గలవానిని ఇచ్ఛకు ఉన్ముఖుని చేయుట ఎవరి వశము కాదు. అట్టి పరమేశ్వరుని మెప్పించి కామేశ్వరునిగ సృష్టి కార్యమునకు ఉన్ముఖము గావించిన శ్రీదేవి ఎంతటి వెన్నెల! అతడు అగ్ని స్వరూపుడు. ఆమె వెన్నెల స్వరూపిణి. ఆ వెన్నెల ఎట్టిది? ఎఱ్ఱని కమలములను కూడ వికసింపచేయగల వెన్నెల. చల్లని వెన్నెల.

కార్తీక పౌర్ణమినాటి వెన్నెల ఆహ్లాదమగు శీతలమును కలిగించు వెన్నెల. ఆ వెన్నెలకు ఎఱ్ఱని కమలములు కూడ విచ్చుకొనును.

శివునికి లోహితాక్షుడు అను నామము కలదు. అతను తపః స్వరూపుడు. అగ్ని స్వరూపుడు. అందువలన అతని కన్నులు ఎఱ్ఱ జీరతో నుండును. ఎఱ్ఱని కమలములు ఆయన కన్నులతో పోల్చ బడినవి. ఎఱని ఆయన నయన కమలములకు తెలని చలని వెన్నెలను

అందించునది శ్రీమాత. దానివలన శ్రీ శివునకు ఆహ్లాదము కలుగును. శివుడు తపస్వి అగుటచే అతనికి చల్లదనమును సమకూర్చుట తన ధర్మమని శ్రీమాత భావించునని కవి భావము. స్త్రీ ఆహ్లాదమును కూర్చున దైనపుడు మాత్రమే పురుషుడు పరిపూర్ణ ఆనందమును పొందగలడు. చక్రవర్తి కైననూ ఆహ్లాదము కలిగించు పట్టపురాణి అవసర మెంతయో యున్నది. చిఱ్ఱుబుఱ్ఱులాడు స్త్రీలు గృహశాంతిని, సంపదను హరించు చుందురు. స్త్రీలోకమునకు శ్రీమాత ఈ సందేశము ద్వారా పతివ్రతా ధర్మము నొకటి ఆవిష్కరించు చున్నది. ఈ కారణము గనే సీత, సావిత్రి, అనసూయ, ద్రౌపది, తార, మండోదరి ఈ ధర్మమును పాటించిరి గనుక పతివ్రతలైరి. కార్తీక మాసము శివ తత్త్వమునకు ప్రతీక. అందలి వెన్నెల శ్రీమాతకు ప్రతీక.

మహాకామేశ్వరుడు తపస్సిద్ధుడు అగుటచే అతడు సహజముగ ఆనందమయుడు. ఆనందము అతనిని ఆశ్రయించి యుండును. అతడు అర్ధనిమీలిత నేత్రుడు. తపస్వి ఎప్పుడునూ కన్నులు మూసుకునే యుండును. అంతర్ముఖముగ విశ్వవిలాసమును గమనించుచు వికసితము, ప్రశాంతము అయిన ముఖము కలిగి యుండును. అతడు కన్నులు సగము తెరచుటకు కారణము విశ్వవిలాసము శ్రీమాత రూపముగ ఎదురుగ నుండుటయే. అతడు అంతర్ముఖముగను, బహిర్ ముఖముగను సృష్టి విలాసము దర్శించుటకు శ్రీమాతయే కారణము. ఆమె విలాసము అతనికి అతిశయించిన సుఖమును కలిగించును.

మహాకామేశ నయన అను పదముల సముదాయమునకు మరియొక అర్థము కూడ యున్నది. 'నయన' అనగా చేర్చుట అను

అర్థము కూడ యున్నది. ఉపనయన మనగా దగ్గరకు చేర్చుట. బ్రహ్మము దగ్గరకు చేర్చుటకే ఉపనయన క్రతువు. అట్లే మహా కామేశుని దగ్గరకు జీవులను చేర్చుటకు కృషి చేయునది శ్రీమాత. పిల్లలను పెంచి తండ్రికి అప్పచెప్పుట తల్లుల కర్తవ్యమై యున్నది. అందువలన శ్రీమాత కృషి అంతయూ జీవులను దేవుని వద్దకు చేర్చుటయే. వెన్నెల వెలుగు మార్గము ద్వారా జీవులను దేవుని వద్దకు చేర్చును. కౌముది అనగా వెన్నెల అని తెలుపబడినది. వెన్నెల జీవుల స్థూల శరీరముపై ప్రభావము చూపును. ఆ సమయమున ప్రార్థనలు, ధ్యానము చేయువారికి సూక్ష్మశరీర నిర్మాణము జరుగును. ఆ శరీరము దివ్యకాంతితో కూడినదియై దైవమును చేరుటకు ఉపకరించును. ఇట్లు శ్రీమాత దయతో భక్తులను భగవంతుని వద్దకు చేర్చు కృషి సలుపు చున్నదని ఈ నామమున సూక్ష్మముగ తెలుపబడినది.

'కుముద' అను పదమునకు కూడ మరియొక అర్థ మున్నది. 'ముద' అనగా మోదము. కుముద అనగా హరింపబడిన మోదము. దుఃఖము కారణముగ మోదము హరింపబడును. దుఃఖితులైన భక్తులు కుముదములవంటి వారు. వారికి ఆహ్లాదము కలిగించి మహా కామేశుని వద్దకు దివ్యకాంతుల మార్గమున శ్రీమాత గొనిపోవునని ఈ నామార్థము. సంసారబద్ధులైన భక్తులకు ఈ అర్థము సమంజసమై యున్నది. భక్తుల దుఃఖములను పోగొట్టి ఆహ్లాదమును కూర్చి దివ్య మార్గమున గొనిపోయి పరమశివుని చెంతకు చేర్చు శ్రీమాతను ఎంత శ్లాఘించిననూ అల్పమే.

# 404. 'భక్తహార్ద తమోభేద భానుమత్ భానుసంతతిః'

**భ**క్తుల హృదయములందుండు తమస్సును భేదించుటలో సూర్యుని వలెనూ, సూర్యకిరణముల పరంపరవలెనూ నుండునది శ్రీమాత అని అర్థము.

సత్త్వ రజస్తమో గుణములలో తమస్సు నీచమైనది. అనగా అథమ గుణము. తమస్సు అనగా అజ్ఞానమను చీకటి. అది జీవులలో బద్ధకముగను, మొద్దు నిద్రగను, మరుపుగను, అశ్రద్ధగను, నిర్లక్ష్యముగను, తిండిపోతు తనముగను గోచరించును. ఈ అలవాట్లకు లొంగినవారు అజ్ఞానమను చీకటి యందు పెనగులాడు చుందురు. కుంభకర్ణుడు దీనికి ఉదాహరణము. తమోగుణము ప్రధానముగ నున్నప్పుడు దివ్య విషయముల యందు అనాసక్తియే కాక నిరాదరణ కూడ యుండును. హేళన భావ ముండును. ఇట్టివారు వెలుగును కూడ నిరాకరింతురు. వీరికి సూర్యుని వెలుగు సరిపడదు. సూర్య కాంతిలో తిరుగాడునప్పుడు త్వరితముగ అలసిపోవుదురు. ఉదయించు సూర్యునికాంతికి వీరెన్నడునూ ఉన్ముఖులు కాలేరు. ఆ సమయమున వీరిని నిద్రాదేవి ఆవరించి యుండును.

ప్రాతః సమయముననే మేల్కాంచుట ప్రస్తుతము జాతిలో కొరవడి యున్నది. ఇక జీవన పరిష్కార మేముండగలదు. సుఖదుఃఖాదుల

చక్రములో విషయ ప్రవృష్టులై పుట్టుచు చచ్చుచూ నుందురు. ఇట్టివారికి పరిష్కారము శ్రీమాతయే. అమ్మ సంకల్పించినచో జీవుల హృదయ మందు ఆరాధించవలెనను స్ఫూర్తి కలుగును. స్ఫూర్తివంతముగ ఆరాధన సాగును. క్రమముగ హృదయ మందలి తమస్సు హరింపబడుచుండుగ సదాచారము చోటుచేసుకొనును. అపుడు జీవుడు ఉద్ధరింపబడుట ఆరంభమగును. శ్రీమాత సంకల్ప రూపమున హృదయమున సూర్యకిరణములవలె చొరపడి హృదయమును కాంతివంతము గావించి జీవుడు సూర్యుని వలె ప్రకాశించునట్లు తీర్చిదిద్దును. మాత వాత్సల్యము వర్ణింప నలవిగానిది.



# 405. 'శివదూతీ'

**శి**వుని దూతగా పంపునది శ్రీదేవి అని అర్థము.

శివుడనగా శుభము. శ్రీమాత దర్శన మిచ్చుటకు ముందుగా శుభములు కలిగించును. శుభములను కూర్చి అటుపై దర్శనమిచ్చుట శ్రీమాత లక్షణము. శుభములు కలిగించుటకు ముందు కూడా శుభ శకునములను పంపును. శుభ శకునములన్నియూ రాబోవు శుభములను తెలియజేయు సంకేతములే. పురుషులకు కుడి కన్ను అదురుట, కుడి భుజము అదురుట, స్త్రీలకు ఎడమ కన్ను అదురుట, ఎడమ భుజము అదురుట శుభ సంకేతములే. అట్లే పుణ్య స్త్రీ ఎదురుగా వచ్చుట, ఆహారముగొనుచున్న జంతువు గోచరించుట, జంతువులుగాని పక్షులు గాని ఎడమ నుండి కుడికి దారిన సాగుట, పండ్లు పాలు మంగళకర ద్రవ్యములు కన్పట్టుట– ఇత్యాది శకునము లన్నియూ శ్రీమాత పంపు శుభ శకునములు. శకునములను గూర్చి ప్రత్యేకముగ ఒక శాస్త్రమున్నది. ఈ శాస్త్రము ద్వారా రాబోవు శుభములు తెలియవచ్చును. ప్రకృతి యందీ విధముగ దూతల ద్వారా శ్రీమాత సందేశములను పంపు చుండును. అట్లే తన దర్శన స్పర్శన సందేశములను కూడ పంపును.



# 406. 'శివారాధ్యా'

**శి**వునిచే ఆరాధింపబడునది శ్రీమాత అని అర్థము.

శివుడు కూడ ధ్యానమార్గమున దేవిని ఆరాధించి సర్వసిద్ధులను పొంది సృష్టి యందు ప్రభువయ్యెను. సిద్ధులు అన్నియూ శ్రీమాతవే. శ్రీమాత అనుగ్రహము లేనిదే ఎవ్వరునూ ఎట్టి సిద్ధులను పొందలేరు. సిద్ధులు పొందుటకు కూడ ఆరాధనయే ఉపాయము.

ఆరాధన మూడు విధములుగ నున్నది. తామసికము, రాజసికము, సత్త్వము. ఇందు మొదటి రెండునూ సిద్ధులను కోరి ఆరాధించుట. మూడవది అగు సాత్విక ఆరాధన అమ్మ అనుగ్రహము కొరకు, సాన్నిధ్యము కొరకు మాత్రమే ప్రార్థించుట. తామసిక, రాజసిక ఆరాధకులు అహంకారము వలన పతనము చెందుదురు. సాత్త్విక ఆరాధకులు అమ్మ సాన్నిధ్యమున నుండుటచే పతనము చెందరు. తామసిక, రాజసిక ఆరాధకులు సిద్ధులను ప్రదర్శించుట, గొప్పతనము చాటుకొనుట, ఇతరులను వశపరచుకొనుట, ఇత్యాది కృత్యములలో పాల్గొని క్రమముగ నశింతురు. సాత్త్వికులు సిద్ధులను వినియోగింపరు. కాలమును దేశమును బట్టి, అవసరమును బట్టి వారి నుండి సిద్ధులు వ్యక్తమగును. సాత్త్వికులు శ్రీమాత హృదయమందే వసించుటచే శ్రీమాత సంకల్పమే వారి నుండి వ్యక్తమగును కాని, వారు ప్రత్యేకముగ చేయునది ఏదియు యుండదు. దేశకాలములందు అమ్మ సంకల్పము

నకు ప్రతీకలుగ సృష్టియందు జీవుల కొరకు ప్రశాంతముగ చరించు చుందురు. సత్త్వగుణోపేతమైన ఆరాధనమే శుభమగు ఆరాధనము. అదియే శివారాధనము. ఆమె శివారాధ్య. అట్టి వారికే ఆమె లభ్య మగును. లీలాప్రాయముగ తానుగ వారికి వశమై వారి నుండి సిద్ధులను నిర్వహించును.

అసుర ఆరాధన లన్నియూ వారికి వినియోగ పడకపోవుట, భక్తుల ఆరాధన లన్నియూ వారికి సమయమునకు తోడ్పాటు అగుట యందలి రహస్య మిదియే. అసురులు వశము చేసుకొను ప్రయత్నమున విఫలు లగుదురు. భక్తులు శ్రీమాతకు వశమగు ప్రయత్నము తమను తాము సమర్పించుకొని నిరహంకారు లగుదురు. అట్టి వారి కామె సులభ.



# 407. 'శివమూర్తి'

**శి**వుడే స్వరూపముగ కలది శ్రీమాత అని అర్థము.

శివ శక్తులకు భేదము లేదు గనుక శివుని నుండి శక్తి రూపము వచ్చిన దనిననూ, శక్తి నుండి శివరూపము వచ్చిన దనిననూ విప్రతిపత్తి ఏమియునూ లేదు. వారు యిరువురిగ పేర్కొనబడిననూ నిజమునకు ఒక్కటియే. వారు విడదీయరాని వారు. ఒకే తత్త్వమును స్త్రీ పరముగ పురుష పరముగ తెలుపు రెండు సంప్రదాయము లుండుటచే ఇట్టి భావములు, నామములు సత్యమే.

శివుని మూర్తి ఆమె. ఆమె మూర్తి శివుడు. నిజమునకు ఒకటియే రెండుగ నున్నది. ఇట్లు ఒకదానితో నొకటి పెనవేసుకొని సమస్త లోకము లేర్పడినవి. దీని భావ మేమనగా ప్రకృతి పురుషులు ఒకరికొకరు ఆధారము. ఒకరు లేక ఇంకొకరు లేరు. ఒకరిని పూజించినచో ఇరువురినీ పూజించినట్లే. ఆమె యందు శివుడు, శివుడియం దామె యుండుటచే ఉపాధి, అందు వసించు తత్త్వము రెండునూ కలిపి పూర్ణ సత్యమగును.

'శివమూర్తి' అనగా మంగళకరమగు మూర్తి అని అర్థము. మంగళకరమగు రూపములన్నియూ శ్రీమాత రూపములే. వానియం దామె సాన్నిధ్యము మిక్కుటముగ నుండును. ఈ కారణముగనే మన సంప్రదాయమున సర్వమూ మంగళప్రదముగ ఏర్పరచుకొనుట జరుగు చున్నది. గృహమున మామిడి తోరణములు, ముఖ ద్వారము వద్ద

ముగ్గులు, గడపలకు పసుపు కుంకుమలు, ఇంటియందు సుగంధ ద్రవ్యములు, దీపములు, గంధము, పసుపు, కుంకుమ– ఇత్యాది వస్తువుల వాడకము, ప్రభాతమున మంగళ వాయిద్యములు, ఇంటి యందు దూడతో కూడిన ఆవు, ముత్తైదువ, పువ్వులు పండ్లు– ఇట్లు ఎన్నియో మన సంప్రదాయమున పెద్దలు మంగళకరమగు వస్తువులను మరియు ఆచారములను చేర్చిరి. ఇవి అన్నియూ శివప్రదములు, శివమూర్తులు.



# 408. 'శివంకరీ'

**శు**భములను, మంగళములను చేకూర్చునది మరియు భక్తుని శివునిగ చేయునది శ్రీమాత అని అర్థము.

శుభములు గూర్చుట, తద్వారా జీవులను సంతుష్టులను చేసి క్రమముగ వారికి ఆరాధనా మార్గమున ఉన్నతి కలిగించుట, శివుని జేర్చుట, తద్వారా జీవుడు శివుడగుట– ఇట్టి సమస్త కార్యములను నిర్వర్తించునది శ్రీమాతయే. సంకల్పము శ్రీమాతయే గనుక జీవులకు శుభ సంకల్పములు కల్పించి తగు ప్రేరణ యిచ్చి, శక్తి బలముల నిచ్చి శివుని జేర్చువరకూ తోడ్పడును. తల్లి బిడ్డను కని పోషించి పెంచి తండ్రి కప్పగించుట సంప్రదాయము. తండ్రి కుమారుని తన కార్యమున వినియోగించి స్థిరపరచును. ఇట్లు శ్రీమాత తానే సర్వస్వమునూ నిర్వర్తించును. ఇట్టి బాధ్యతా నిర్వహణము స్త్రీ రూపమున నిర్వర్తింపబడు చున్నది గాన మన సంప్రదాయమున స్త్రీ అత్యంత పూజనీయురాలైనది. స్త్రీ గౌరవింపబడనిచోట శుభము లుండవు. స్త్రీని అవమానించినచో పతనము తప్పదు. మంగళమూర్తి అయిన శ్రీమాతను శుభంకరమగు రూపములందు దర్శించుచూ ఆరాధించుట జీవులు నేర్వవలెను. ఆమెయే మాయ అగుట వలన మాయ తొలగి శివదర్శనము కావలె నన్నచో శ్రీమాత అనుగ్రహము ముఖ్యము. శ్రీమాత అనుగ్రహము పొందుటకు స్త్రీలను పూజించుట, గౌరవించుట, ఆదరించుట ప్రధానము. ఇట్టివారు సృష్టియందు మాయావరణములను దాటుదురు. కారణము శ్రీమాత మాయ పొరలను తొలగించుటయే.

# 409. 'శివప్రియా'

**శి**వునకు ప్రియురాలు శ్రీమాత అని అర్థము. శివుడు ప్రియుడుగా నుండునది శ్రీమాత అని అర్థము.

శివునికి శ్రీమాత ప్రియురాలు. శ్రీమాతకు శివుడు ప్రియుడు. ఒకరి యందు ఒకరికి ప్రియత్వము సమానముగ నున్న స్థితి ఇది. ఇట్టి సమానత్వము అరుదు. దంపతియం దిట్టి ప్రియత్వము సామాన్య ముగ కానరాదు. సమాన ప్రియత్వమునకు శివపార్వతులే ప్రమాణము. వారితో పోల్చదగిన వారు సీతారాములు. వీరినే ఆదర్శ దంపతులని మన సంప్రదాయము కొనియాడుచున్నది. దంపతి యందు ప్రియత్వ మున హెచ్చుతగ్గులు సామాన్యము. కొన్ని సమయములందు పురుషుడు ఆధిక్యము చూపుట, అట్లే మరికొన్ని సమయములందు స్త్రీలు ఆధిక్యము చూపుట కనబడును. ప్రేమ యున్నచోట ఆధిక్యముండదు. ప్రేమ సమానత్వమునకు నిదర్శనము. ఆధిక్యము హెచ్చుతగ్గులకు నిదర్శనము. పురుషులు తాము అధికు లనుకొందురు. అట్టి పురుషులు తెలియని వారు. అట్లే స్త్రీలు కూడ తాము అధికులమని ఋజువు చేయుటకు ప్రయత్నింతురు. ఇరువురు సమానులే గాని ఎవరునూ ఒకరి కన్న ఇంకొకరు అధికులు కారు. ఆధిక్య భావము అజ్ఞానము, సమభావము జ్ఞానము. సమదర్శనులే తెలిసినవారని శ్రీకృష్ణుడు గీతయందు తెలిపెను. సమదర్శనము లేనిచోట దివ్యసాన్నిధ్య ముండదు. శివప్రియా అను నామము ఇట్టి సమభావమును ప్రకటించుచున్నది.

# 410. 'శివపరా'

**శి**వుని కంటే పరమైనది శ్రీదేవి అని అర్థము. లేక శివుడు పరుడుగా కలది, లేక భక్తులను శివపరము చేయునది, లేక సతతము శివుని గూర్చి బోధించునది అని అర్థము.

శివునికి ఆమె పరము, ఆమెకు శివుడు పరము. దీనిని తెలియ వలెను. వారు ఒకే తత్త్వము నుండి దిగివచ్చిన వారు గనుక ఇరువురిలో ఎవ్వరునూ అధికము కాదు అని తెలిపెడి నామమిది. ఆమెను పూజించిన అతని కడకు చేర్చును. అతనిని పూజించిన ఆమె కడకు చేర్చును. అనగా ఎవరిని పూజించిననూ చేర్చునది పరమునకే. వారిరువురునూ ఒకరిని గూర్చి ఒకరు బోధింతురు. ఇది అభేద స్థితికి చిహ్నము. ప్రకృతి పురుషులలో ఇట్టి అవినాభావ అభేద స్థితి సతత ముండును. ఇట్లు ఒకరి నొకరు మన్నించుకొనుట సృష్టియందు వీరిరువురి నుండియే ప్రారంభమైనది.

భక్తుడు, భగవంతుడి నడుమ కూడ ఇట్టి అభేద స్థితి యున్నది. గురుశిష్యుల సంబంధముకూడ అట్టిదే. గోచరించుటకు ఒకటి కన్న ఎక్కువగ వున్ననూ ఇరువురి నుండి వ్యక్తమగు తత్త్వ మొక్కటియే.

రామనామము చేయువానిని హనుమంతుడు అనుగ్రహించును. హనుమంతుని ఆరాధించువానిని రాము డనుగ్రహించును. నందీశ్వరుని గౌరవించినచో శివు డనుగ్రహించును. శివుని ప్రార్థించినచో

నందీశ్వరుడు సహకరించును. అనుచరుల రూపమున తానే వున్నానని సనక సనందనాదులకు నారాయణుడు బోధించెను. అనుచరులనగా సర్వకాల సర్వావస్థల యందు తనతో కూడియుండి చరించువారు. నారాయణు నకు సనక సనందనాదు లెట్టివారో జయవిజయులు కూడ అట్టివారే. ఇట్టి రమ్యము, చిత్రము, రహస్యము అగు అభేద స్థితి తెలిసినవాడే తెలిసినవాడు.

శ్రీదేవి శివుని పరము. శివుడు శ్రీదేవి పరము. వారిని భేద భావములతో చూచువారు పరమును చేరకపోగా ఇహమున కూడ ఇక్కట్ల పాలగుచుందురు.



# 411. 'శిష్టేష్టా'

**శి**ష్టుల యందు ప్రియత్వము కలది శ్రీమాత అని అర్థము.

ధర్మబుద్ధి గలవారు శిష్టులు. ధర్మము నాచరించుట శిష్టాచారము. ఆచారము నుండే ధర్మము వ్యక్తమగు చుండును. సదాచారము ధర్మమును పుట్టించును. ధర్మము సదాచారమును కాపాడుచుండును. అట్టి ధర్మమును బోధించువాడు గురువు, పాలించు వాడు ప్రభువు. విష్ణువు ప్రభువు. శివుడు గురువు. ఒకరు ధర్మమును బోధింపగ మరియొకరు ధర్మమును పాలింతురు. ధర్మ స్వరూపము ఆత్మసాక్షిగ ప్రతి వ్యక్తియందు వుండును. ఆత్మావలోకనము, ఆత్మ పరిశీలనము ప్రతినిత్యము చేసుకొనువారికి లోనుండియే తప్పొప్పులు తెలియబడును. అట్టివారు కర్మాచరణమున ధర్మము నందు చపలత్వము లేక ప్రవర్తింతురు. ధర్మమునందే యుండుటకు ప్రయత్నింతురు, ప్రార్థింతురు.

"ఆచారమున ధర్మము లేనప్పుడు ఆరాధన లెన్ని చేసిననూ దైవమునకు ప్రియులు కాలేరు." 'శిష్ట' అనగా ధర్మాచార పరాయణులు. వీరికి చపలత్వముండదు.

చపలత్వ మున్నవారిని గుర్తించుట సులభము. వారి కన్నులు సూటిగ, నిశ్చలముగ చూడలేవు. అటునిటు కదలుచుండును. హస్తములు కూడ పని లేకున్నను కదలుచుండును. పాదములు కూడ

కదుపుచుందురు. వాక్కునందు దేనినో దాచుచున్నట్లు భాషణ వ్యక్త మగును. భావములందు స్థిరత్వము, స్పష్టత్వము, అనుస్యూతమగు చేతన యుండదు. పనులయందు ఏమరుపాటు, మితిమీరిన మరపు, ఆలస్యము, అలసత్వము, అపరిపూర్ణత యుండును. ఇట్టి చపలత్వము కలవారు ముందుగ ఆచారమును సరిచేసుకొనవలెను. అందులకు ప్రార్థనలు చేయవచ్చును. కేవలము ప్రార్థనలే చేయుచు ఆచారమున మెరుగునకై ప్రయత్నింపనివారు కేవలము డంబాచారులై యుందురు. డంబాచారము అనాచారము కన్న హీనము. సదాచారులను రక్షించుట శ్రీమాత పని. వారామెకు ప్రియులు. వారి పూజలను ఆమె స్వీకరించును. వారికి శ్రియములే కాక ప్రియములు కూడ కలిగించును. అనగా మిక్కుటమగు వైభవమును కలిగించును. శివుని సాన్నిధ్యమును కూడ కల్పించును.

# 412. 'శిష్టపూజితా'

**శి**ష్టులచే పూజింపబడునది శ్రీమాత అని అర్థము.

సదాచార సంపన్నులైన శిష్టులచే పూజింపబడి శ్రీమాత వారి ననుగ్రహించుచూ నుండును. శిష్టాచారులు చేయు పూజలు శ్రీమాతకు చాల ప్రియము. ఆచారము లేక చేయు పూజలు దంబము గనుక శ్రీమాత సదాచారమునకు ప్రేరణ కలిగించునేగాని అంతకు మించి అనుగ్రహించుట యుండదు. అనాచారులను, డంబాచారులను చిత్రమైన రీతిలో శ్రీమాత ఉద్ధరించుచుండును. అందరూ తన సంతతియే గనుక శిష్టులకు రక్షణ, ఇతరులకు శిక్షణ యిచ్చుచుండును. అనాచారము మితిమీరినపుడు దండించును. అనాచారమున స్థిరపడినవారిని కష్ట నష్టముల ద్వారా మెత్తబరిచి ఆచారము నవలంబింప చేయును. సదాచారుల పూజలు మన్నించి అనుగ్రహించును. కొందరిని అనుగ్రహించుట, కొందరిని అనుగ్రహింపకుండుటకు కారణము ధర్మాచరణ యందుగల వ్యత్యాసమే అని తెలియవలెను. ధర్మమును నమ్మి తనను పూజించు వారిని ఎల్లప్పుడూ రక్షించుచుండును.



# 413. 'అప్రమేయా'

**కొ**లతలకు అందనిది శ్రీమాత అని అర్థము.

ఆకాశమును కొలుచుటకు సాధ్యపడదు. అట్లే శుద్ధ చైతన్యమగు శ్రీమాత మొత్తము తెలియుట సాధ్యము కాదు. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సైతము శ్రీమాత పారము తెలిసినవారు కారు. అపరిమితమై వ్యాపించిన వెలుగు నందు ఏర్పడిన అణువులవంటి వారు జీవులు. ఆమె కొలతలు సృష్టిని అతిక్రమించి యుండును. సృష్టిలోనివారు ఇక ఎట్లు కొలువగలరు? సృష్టికి పరము ఆమెయే. ఆమెకు పరము లేదు కనుక ఆమె మొత్తముగా తెలియుట ఎవ్వరికినీ సాధ్యము కాదు.



# 414. 'స్వప్రకాశా'

**స్వ**యముగ ప్రకాశము కలది శ్రీమాత అని అర్థము.

ప్రకాశము శ్రీమాత సహజ లక్షణము. ఆమెయే మూల ప్రకృతి. ఆమె నుండి దిగివచ్చిన జీవాత్మలు కూడ స్వయంప్రకాశము కలవారు. ప్రకాశము ఎక్కడ గోచరించిననూ అది శ్రీమాతయే అని తెలియవలెను. మణుల యందు ప్రకాశము ఎక్కువగ నుండును. అందువలన అవి పూజనీయములు. అట్లే వెండి, బంగారము, రాగి, ఇత్తడి, కంచు మొదలగునవి. ప్రకాశము తీవ్రముగ నున్నది, ఆకర్షణీయముగ నున్నది, శక్తివంతముగ గోచరించునది అగు వస్తువేదైననూ శ్రీమాత అస్థిత్వము. వృక్షములయందు, జంతువులయందు, మానవులయందు, దేవతల యందు ప్రకాశమును బట్టే వ్యత్యాసములు. పూర్ణ ప్రకాశము ఎచ్చట నుండునో అచ్చట శ్రీమాత పదహారు కళలతో నిండియున్నట్లు తెలియవలెను.

ఇనుము, సత్తు వంటి లోహములు; గాడిద, వూరకుక్క వంటి జంతువులు; తుమ్మ, తాడి వంటి వృక్షములు; తమోగుణ ప్రధానులైన మానవులు; తమస్సుతో కూడిన అసురులు; తక్కువ ప్రకాశము గల వారగుటచే అంతగ పూజనీయులు కారు. అమ్మ అస్థిత్వమును బట్టే ఎవ్వరికైనను పూజార్హత. ఆమె ఎవరియందు ఎక్కువ భాసించునో వారిని ఇతరులు పూజింతురు. పూజలన్నియూ చేరునది శ్రీమాతనే. పూజ లందుకొనువారు కూడ అమ్మకు అందించ వలసినదే. తమను

పూజించు చున్నారని భ్రమపడినచో పతనము చెందుదురు. ***"సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"*** అనునది సత్యము. ఈ సత్యమును మరచినవారు పూజనీయులు కారు.



# 415 'మనోవాచామగోచరా'

**మ**నస్సునకు, వాక్కునకు గోచరము కానిది శ్రీమాత అని అర్థము.

మనస్సుచేత పూర్ణముగ ఊహింపబడునది, వాక్కుచేత సంపూర్ణ ముగ ప్రకటింపబడునది శ్రీమాత. మనస్సుతో గాని, కన్నుతోగాని, చెవితోగాని, స్పర్శతోగాని, సుగంధ స్పర్శతోగాని, రుచితోగాని శ్రీమాతను లేశమాత్రము అనుభూతి చెందవచ్చును. మనస్సు, ఇంద్రియములు ఇత్యాదివి పరిమితములు. అట్టి వానిద్వారా అపరిమితమగు తత్త్వము ఎట్లు తెలియగలము. కాని తెలియు ప్రయత్నము చేయుచున్నచో మనస్సు, ఇంద్రియములు అపరిమిత తత్త్వమునకు ఉన్ముఖమై క్రమముగ అనుభూతి వృద్ధి యగుచుండును. అవగాహన పెరుగుచుండును. ఆనందము హెచ్చగు చుండును. మనో యింద్రియములు పరిశుద్ధత చెందుచు యుండును. అపుడు కూడ మొత్తము తెలియుట వీలుపడదు. తెలియ చెప్పుటకు అసలే వీలుపడదు. కాని ఈ మార్గమున మనో యింద్రియములందు స్థితిగొన్న మానవ ప్రజ్ఞ క్రమముగ వికాసము చెందుచు దివ్య ప్రజ్ఞలోనికి ప్రవేశించును. అపుడు కూడ అంతయూ తెలియదు. తాను, నేను అను ప్రజ్ఞ కలిగినపుడు తా నుండక పర ముండును. అట్టివారు మరల తానుగ, నేనుగ మేల్కాంచినపుడు పరి శుద్ధులగుటచే శ్రీమాతను గూర్చి తెలుపగలిగిన వారగుదురు. అపుడు కూడ ఆ తెలుపుట పరిమితమే. అట్టివారు శ్రీమాత స్పర్శకు వాహికలై యుందురు.

# 416. 'చిచ్ఛక్తి'

చైతన్యశక్తి శ్రీమాత అని అర్థము.

చైతన్యశక్తియే సమస్త సృష్టికి ఆధారము. ఎందు చైతన్యము లేదో అందు కదలిక యుండదు. చైతన్యశక్తి లేని రూపములు అచేతనములై యుండును. నిజమునకు అందుకూడ చైతన్యమున్నది. కాని నిద్రాణమై యున్నది. ఒక వస్తువునందు చైతన్యమెంత మేల్కాంచిన అంత ప్రకాశము కలుగుచున్నది. అట్టి ప్రకాశము వలన తెలియుట వుండును. అట్టి ప్రకాశము లేనప్పుడు తెలియకపోవుట వుండును. తెలియుట విద్య, తెలియకపోవుట అవిద్య. సృష్టి అంతయూ విద్య, అవిద్యల స్వరూపము. అవిద్య యందున్న జీవులను విద్యయందు ప్రవేశింపచేయుట, విద్యావంతులను చేయుట, ప్రకాశింపచేయుట, ఆనందమున స్థిరపరచుట– ఇట్టి కార్యము లన్నియూ శ్రీమాత తన చైతన్యముతో నిర్వర్తించును. ఉద్ధారణకు ఈ శక్తియే శ్రీమాత వినియోగించును.

విద్యను అవిద్యను పరిపాలించు శ్రీమాత విద్య ద్వారా అమృతత్వమును, అవిద్య ద్వారా నశింపును పాలించును. అవిద్యను విద్య ద్వారా తొలగించగల శక్తి చిత్ శక్తి.

అన్ని భూతముల యందు కూడ చిచ్ఛక్తి స్వరూపిణియై శ్రీమాత యున్నది. ఆమె సంకల్పించినపుడే విద్యలు ప్రకాశించును. అవిద్యలు

తొలగును. శ్రీమాత చిత్‌శక్తి నెరిగిన జ్ఞానేశ్వరుడు ప్రతిష్ఠానపురమున పండితులగు సభికుల నడుమ గోముఖము నుండి వేదములను పలికించెను. జ్ఞానేశ్వరుడు రూపు కట్టుకొని వచ్చిన జ్ఞానము. అతడు ఈశ్వరుడు అగుటచేత గోవు నందలి చిత్ శక్తికి ప్రేరణ కలిగించి వేదములను ఉచ్చరింపజేసెను. జంతువుల యందుకూడ చిత్‌శక్తి యుండునని తెలుపు తార్కాణమిది. అట్లే వృక్షములు మాటలాడుట, శిలలు సందేశమిచ్చుట, పక్షులు పలుకుట– ఇత్యాది వన్నియూ సంభవములే. అసంభవ మనునది అమ్మ చిత్ శక్తికి లేదు.



# 417. 'చేతనా రూపా'

**చై**తన్య స్వరూపిణి శ్రీదేవి అని అర్థము.

నిర్మలమైన చైతన్యమే రూపముగా గలది శ్రీమాత అని అర్థము. అదియే పరిపూర్ణమగు పరమేశ్వరుని శక్తి. ఇందుండియే త్రిశక్తులు ఉద్భవించును. త్రిశక్తులుగా ఉద్భవించినపుడు అందు మరల సాత్త్విక శక్తిగా ఉద్భవించును. జీవులలో బుద్ధి రూపమున యుండును. ఇట్లు శ్రీమాత అవతరణము పరాశక్తి నుండి చైతన్య శక్తిగను, చైతన్యశక్తి నుండి సాత్త్విక శక్తిగను, సాత్త్విక శక్తి నుండి ధీశక్తిగను అవతరించును. ధీశక్తియే బుద్ధి. సాత్త్విక శక్తికి కుడి ఎడమలుగ, హెచ్చు తగ్గులుగ, రాజసిక తామసిక శక్తు లుద్భవించును. అట్లే ధీశక్తియగు బుద్ధికి అటు నిటుగ అహంకారము, చిత్తము ఏర్పడును.

అన్ని స్థితుల యందు సమతూకముగ నుండునది చిత్‌శక్తి. ఏడు లోకములందును చైతన్యశక్తికి స్థానము కలదు. సమతూకముగ ఎక్కడ గోచరించునో ఆ రూపములన్నియు చైతన్యరూపములే. చైతన్య రూపము సృష్టియందు శ్రీమాత శాశ్వత రూపము. ఇతర రూపములు కార్యార్థమును బట్టి శ్రీమాత యేర్పరచుకొనును.



# 418. 'జడశక్తిః'

**జ**డమును సృష్టించునటువంటి శక్తి శ్రీమాత. జడశక్తి మూలమున ఉపాధుల నేర్పరచుచు అందు జీవులను వసింపచేయుట సృష్టియందొక మహత్తర కార్యము. నివాసముల నేర్పరచి జీవులను ప్రవేశపెట్టవలెను. గృహములను కట్టి అందు వసించుటకు మానవులు కృషి సలుపుదురు కదా! జీవుడుండుటకు ఉపాధి వలయును. నీరు వలయునన్నచో పాత్ర కావలయును. కప్పులేనిదే కాఫీ, టీలు త్రాగలేరు. కనీసము దోసిలి లేనిదే నీరు త్రాగలేము కదా! త్రాగుటకు నోరు, గొంతు కూడ వుండవలెను. జీవులకు దేహమే ఉపాధి.

జీవులకు దేహములే ఉపాధి. దేహములే లేనిచో జీవునికి అనుభవము, అనుభూతి, ఆనందము వుండుట కవకాశము లేదు. చైతన్య శక్తిని క్రమముగ ఉపసంహరించుచూ ఎనిమిది రకములుగ ప్రకృతి ఎనిమిది పొరల పదార్థము నేర్పరచును. అహంకారము నుండి భౌతిక దేహము వరకూ క్రమముగ పదార్థము జడమగు చుండును. త్రిగుణములు, పంచభూతములతో కూడిన దేహ మేర్పడి అందు జీవుడు వసించుటకు వీలుపడును. జీవుడు చైతన్య స్వరూపుడు. అతనిని ఆవరించియున్న అష్ట ప్రకృతులు క్రమముగ జడములగును. ఇందు ఒక్కొక్క ఆవరణ యందు మరల ఏడు పొరలున్నవి. భౌతిక దేహమున కూడ శుక్రము నుండి ఎముకల వరకు ఏడు ధాతువుల శరీరమున్నది. మానవ శరీరమున ఎముకలే అత్యంత ఘనమగు పదార్థము. ఈ

ఆవరణ లన్నియూ వాని వాని శక్తులు కలిగి యున్నవి. ఇవన్నియూ జడముచే ఆవరింపబడిన శక్తులే. ఇట్లు చిత్ శక్తి, జడశక్తి రెండు శక్తులను వినియోగించుచు శ్రీమాత ఏడు లోకముల నేర్పరచును. వీరే శ్రీ భూ దేవతలు.

చిత్ శక్తి ఎంత అవసరమో, సృష్టికార్యమున జడశక్తి కూడ అంతయే అవసరము. నిజమునకు శ్రీమాతయే రెండుగ భాసించు చున్నది. ఆవిరి, నీరు, మంచుగడ్డవలె అవరోహణ క్రమమును మరల మంచుగడ్డ నీరు ఆవిరి వలె ఆరోహణ క్రమము నేర్పరచును. ఇందు జీవులు వారి వారి చైతన్య స్థితిని బట్టి ఏడు లోకములందు వసించు చుందురు.



# 419. 'జడాత్మికా'

**జ**డ పదార్థములకు మూలముగ నున్నది శ్రీమాత అని అర్థము.

దివ్యమందు మాత్రమే కాక జడమందు కూడ యుండునది శ్రీమాత. దివ్య వస్తువుల యందు దైవత్వము చూచుట ఒక యెత్తు. జడ పదార్థములయందు చూచుట కూడ మరియొక ఎత్తు. దివ్య విషయముల యందు ఆసక్తి, వాని దర్శన స్పర్శన భాషణముల వలన వికాసము ఆనందము కలుగుట సాధారణము. జడమగు విషయముల యందు కూడ శ్రీమాత యున్నదని తెలిసి అనాదరణ లేక యుండుట అసాధారణము. ఇది సమదర్శనులకే సాధ్యము. గుఱ్ఱమును ఆదరించి నట్లే గాడిదను, పండితుని ఆదరించినట్లే పతితుని, కుల స్త్రీని ఆదరించి నట్లే వేశ్యను, ధనికుని ఆదరించినట్లే పేదను ఆదరించుట సామాన్యము కాదు. చెప్పునంత సులభము కాదు. ఈశ్వరుడు అన్ని భూతముల యందు వున్నాడు అనుచూ సంస్కృత శ్లోకములను వల్లించువారు కూడ పేదబుద్ధి కలిగి యుందురు.

*"ఈశ్వరః సర్వభూతానాం, హృద్దేశే తిష్ఠతి", "ఈశావాస్య మిదం జగత్", "వాసుదేవ సర్వమితి"* అను సూక్తులు సతతము ఆస్తిక జనులు వినుచునే యుందురు. పండితులు చెప్పుచునే యుందురు. కాని ఎవ్వరునూ ఆచరించరు. అట్టి ఆచరణ గలవారు కోటి కొక్కరుందురేమో! కేవలము యోగీశ్వరులే అట్లుండగలరు. వారే సమదర్శనులు. వారు

జడమును అనాదరణ చేయరు. అందు కూడ దైవమున్నాడన్న ఎఱుక కలిగి యుందురు. ఇటీవలి కాలమున రామకృష్ణ పరమహంస, సాయిబాబా, మాస్టర్ ఇ.కె. అట్టి సమదర్శనమును ప్రదర్శించిరి. మరెందరో కూడా అట్లు యుండి యుండవచ్చును.

శ్రీమద్భగవద్గీత, భాగవతము అందించు సారాంశమిదియే. నామరూపాత్మకమైన జగత్తును నిరసింపక సమస్తమును దైవముగా చూచుట జడశక్తిః, జడాత్మికా అను నామముల నుండి గ్రహింప వచ్చును.



# 420. 'గాయత్రీ'

**గా**నము చేయువారిని రక్షించునది శ్రీమాత అని అర్థము.

సమస్త లోకములకు ఆధారమైన వెలుగును గానము చేయుట అనాదిగ నున్న ఆచారము. ఆ వెలుగే ఛందోబద్ధముగ అష్ట ప్రకృతులను నిర్వర్తించును. కావున గాయత్రి ఛందస్సు అని కూడ పిలువబడు చున్నది. ఎనిమిది అక్షరముల ఛందస్సుతో భూ భువః, సువర్లోకములను ఆవరించి యున్నది. 3 × 8 = 24 అక్షరములతో కూడి యున్నది. సంవత్సర రూపమై పండ్రెండు పూర్ణిమలు, పండ్రెండు అమావాస్యలుగ కాలమై వర్తించుచున్నది. ఒక్కొక్క పాదమున ఎనిమిది అక్షరములతో సంవత్సరమందలి మూడు పాదములను దర్శింప వచ్చును. నాలుగు మాసములు ఒక పాదము. అందు నాలుగు అమావాస్యలు, నాలుగు పౌర్ణిమలు యుండును. అట్టివి మూడు పాదములతో సంవత్సర చక్రమగును. ఇట్టి కాలవిభజన నుండి 12 మాసముల యందు వెలు వడుచున్న సూర్య చంద్రాత్మకమైన వెలుగును అవగాహనతో కూడి ఆరాధించు విధానమును ఋషులు అందించినారు.

ఈ వెలుగును భక్తిశ్రద్ధలతో ఆరాధించువారు ఛందో రూప మైనటువంటి సృష్టిని తెలియగలరు. నేడు వాడుకలో నున్న గాయత్రి మంత్రమును దర్శించి జాతికి అందించిన విశ్వామిత్ర మహర్షిని ఆరాధించి, గాయత్రి మాతను గానము చేయుట వలన మంత్రసిద్ధి

కలుగ గలదు. ఎంతగానము చేసిన అంత రక్షణ నిచ్చునది గాయత్రి. వేదమాత యగుటచే గానము, ధ్యానము చేసిన వారికి జ్ఞాన వికాసము కలిగించునది గాయత్రి. అట్లే జీవితమును గమ్యము వైపునకు నడిపించు టకు వలసిన బుద్ధి ప్రచోదనము కలిగించునది గాయత్రి.

గాయత్రి వేదమాత. ఆమెయే సృష్టి సంకల్పము. ఆమె చతుర్ముఖు డగు బ్రహ్మ యందు భాసించినపుడు, చతుర్ముఖునికి సృష్టి జ్ఞానము కలుగును. ఈ సంకల్పమే లేనపుడు సృష్టియే లేదు. సంకల్పమే లేనపుడు సృష్టికర్త కూడ లేడు. ప్రకృతి పురుషులు కూడ లేరు. తత్త్వమే యుండును. అందుండి పుట్టు మొట్టమొదటి సృష్టి స్ఫురణ సృష్టికి కారణభూతము. సంకల్పమే లేనపుడు క్రియ కూడ లేదు. ఇచ్ఛా, జ్ఞాన క్రియలు లేవు. తత్త్వము యొక్క ప్రథమ వ్యక్తరూపము గాయత్రి అని తెలియవలెను. ఆమె సంకల్పములకు తల్లి, పుట్టుచోటు. ఎవ్వరికైనను సంకల్పము కలిగిన పిదపనే అందుండి ఇచ్ఛా జ్ఞాన క్రియలు పుట్టును. సంకల్పమే కలుగనిచో స్థబ్దుగ నుందురు. స్థబ్దత రెండు రకములు. ఒకటి సమాధి, రెండు జడము. ఇందు మొదటివారు సంకల్పమును దాటి తత్త్వమున నిలచినవారు. రెండవ వారు అతి మంద్రస్థాయిలో మాత్రమే సంకల్పము పనిచేయు స్థబ్దులు. సమాధి యందుండు యోగేశ్వరులు మొదలుగ స్థబ్దుల వరకు అందరిని, అన్నింటిని నడిపించునది సంకల్పమే. కోటాను కోట్ల జీవులు కోటానుకోట్ల విధములుగ లేచినది మొదలు నిద్రపోవు వరకు తీరుబడి లేక తిరుగాడు చుందురు. వారియందు సంకల్పము

లట్లు పుట్టుచునే యుండును. సంకల్పము పుట్టిన వెనుక దాని ననుసరించి పరుగిడుటయే యుండును గాని సంకల్పములు పుట్టు చోటును గమనించువారు బహు కొద్ది. అట్లు గమనించు ప్రయత్నమే గాయత్రి మాతను దర్శించు ప్రయత్నము. ఆ ప్రయత్నమున ధీశక్తి పెరుగును. తత్కారణముగనే గాయత్రి గానము, ధ్యానము, జపము ధీశక్తిని పెంచునని పెద్దలు తెలుపుదురు.

సృష్టికర్తకు నాలుగు వేదముల సారముగ సృష్టి జ్ఞానము కలిగించినది గాయత్రి. ఆమెయే వేదమాత.

(గాయత్రి మాతను గూర్చిన వ్యాఖ్యానములు అనేకానేకములు గలవు. ఆమె రూప వర్ణము కూడ తత్త్వమే. విశేష వివరణములకు "గాయత్రి మంత్రము – అవగాహన" వ్యాఖ్యానము పరిశీలించుకొన వచ్చును.)



# 421. 'వ్యాహృతి'

ఉచ్చారణమున పుట్టునది శ్రీమాత అని అర్థము.

సంకల్పము పరము నుండి కలిగినపుడు పశ్యంతి అగుచున్నది. భాష రూపమును దాల్చినపుడు మధ్యమ అగుచున్నది. ముఖము నుండి ఉచ్చరింపబడినపుడు వైఖరి యగుచున్నది. పరాస్థితి నుండి మూడు దశలలో వాక్కు ఉచ్చరింపబడు చున్నది. ఈ మూడు స్థితులను కలిపి ఉచ్చారణ అందురు. అట్లు పరావాక్కు గుహా ముఖము నుండి ఉచ్చరింపబడి వెలుగై నిలచును. గుహా ముఖ మనగా రహస్యమగు మార్గమునకు ద్వారము. ముఖద్వారమే గుహాముఖము. అవ్యక్తము నుండి వ్యక్తము లోనికిట్లు నిత్యము పరావాక్కు నిశ్వాస మార్గమున ఉచ్చరింపబడుచునే యున్నది. సృష్టి జరుగుచునే యున్నది. ఉచ్ఛ్వాస మార్గమున మరల ఉపసంహరింపబడుచునే యున్నది. ఈ నడుమ సృష్టి యున్నది.

వ్యాహృతి మార్గమున శ్రీమాత నిత్యము జీవులను చేరును. నిత్యము అవతరించుచున్న గాయత్రిని వ్యాహృతి అని కూడ అందురు. విశేషముగ గాయత్రి మంత్రము నారాధించువారు గాయత్రి మంత్రము నకు పూర్వ భాగమున వ్యాహృతులను చేర్చి మంత్రోచ్చారణ చేయుదురు. అపుడు గాయత్రి మంత్రము నాలుగు పాదములను సంతరించుకొనును. ***"ఓం తత్సవితుర్వరేణ్యం"*** అనుచు గాయత్రి మంత్రము ప్రారంభమగును.

దానికి పూర్వమున ***"ఓం భూర్భువస్సువః"*** అని చేర్చుట వలన మంత్రోచ్చారణము విశేష రూపమును దాల్చును. అట్లు ఉచ్చరించినపుడు ఉచ్చరించువాని రూపమున గాయత్రి నిలచును. అపుడుతడు గాయత్రీ స్వరూపుడు కాగలడు. అట్టి వానినే "గాయత్ర్యాత్మకుడు" అని పిలుతురు. వారు బుద్ధి ప్రచోదకులు కాగలరు. సద్గురువు లట్టివారు.



# 422. 'సంధ్యా'

**ప**గలు రాత్రి కానిది, రెంటినీ సంధి జేయునది సంధ్య. ఆమె శ్రీమాతయే.

దైవ ధ్యానమునకు గాని, దైవ జ్ఞానమునకు గాని, దైవమును చేరుటకు గాని ఉత్తమోత్తమ కాలము సంధ్య. రాత్రింబవళ్ళను సంధించును. ఇహపరములను సంధించును. జ్ఞానా జ్ఞానములను సంధించును. విరుద్ధమగు విషయములను సంధించి సమన్వయించుట విశేషమగు యోగశక్తి. జీవాత్మ పరమాత్మలను కూడ అట్లే సంధించి సమన్వయ పరచును. లోకముల నడుమ, కాలముల నడుమ, ఆద్యంత ముల నడుమ– అన్నింటికినీ నడుమ నుండునది.

పగలు–రాత్రి నడుమ సంధ్య యున్నది. రాత్రి–పగలు నడుమ సంధ్య యున్నది. శుక్ల పక్షము–కృష్ణ పక్షము నడుమ, మరియు కృష్ణ పక్షము–శుక్ల పక్షము నడుమ కూడ యున్నది. రాశుల నడుమ యున్నది. అయనముల నడుమ నున్నది. శ్వాసకు శ్వాసకు నడుమ, భావమునకు భావమునకు మధ్య కూడ సంధ్య యున్నది. ఇట్టి సంధ్యలను గమ నించుచూ వానిని ధ్యానించినపుడు జీవుడు యోగస్థితి చెందగలడు.

సంధ్యాకాలమున ఆరాధనములు అత్యున్నత స్థితిని కలిగించ గలవు. ఆ కారణముగనే వేదఋషులు సంధ్యావందనము నేర్పరచి నారు. ఉదయ సంధ్య, సాయం సంధ్య సమయములలో శుచియై ఆరాధించు వారిని సంధ్యాదేవి యగు శ్రీమాత విశేషముగ సాన్నిధ్య

మిచ్చి అనుగ్రహించ గలదు. ద్రౌపతి స్వయంవరమునకు పూర్వ ఘట్టమున పాండవులు ఏకచక్రపురము నుండి పాంచాల రాజధాని కేగుచుండగ సాయంసంధ్య సమీపించినది. పాంచాలము చేరవలెనను ఆతురతలో వారు సాయం సంధ్యాదికములను గావింపక సాగుచుండిరి. అపుడు గంధర్వుడొకడు విల్లును ధరించి అర్జునుని యుద్ధమునకై రెట్టించెను. అర్జునుడు అనుపమానమగు ధనుర్విద్యా పారంగతుడైననూ యుద్ధమున ఓడిపోయెను. అతడు అవమానముతో క్రుంగెను. అపుడు గంధర్వుడు అర్జునుని సమీపించి యిట్లనెను. "నీవు నిజమునకు అజేయుడవు. విజయుడవు. నీవు యుద్ధమున ఓడుటకు కారణము సాయం సంధ్యయందు ఆరాధన గావించక పోవటమే. అందువలన బలహీనుడవైతివి. సంధ్యను ఎన్నడునూ మరువకుడు. ఇప్పుడు కూడ సంధ్యావందనమును గావించి పాంచాలమునకు సాగుడు. మీకు స్వయంవరము శుభప్రదమగుగాక!" అని ఆశీర్వదించెను.

భారతమున ఈ యుదంతమును పేర్కొని వేదవ్యాస మహర్షి సాయం సంధ్య ప్రాశస్త్యము తెలిపినాడు. సాయం సంధ్య కూడ ప్రాధాన్యము వహించి యున్నదని, కేవలము ప్రాతః సంధ్య మాత్రమే పాటించుట పరిపుష్టి నియ్యదని తెలిపినాడు. ఉభయ సంధ్యల యందు సంధ్యకు, సావిత్రికి, గాయత్రికి శుచియై అర్ఘ్యము నిచ్చుట ఉత్తమ సంస్కారము. కాలవైపరీత్యము వలన సంప్రదాయ కుటుంబముల యందు కూడ ఇది మరచుట జరుగుచున్నది. శ్రేష్ఠమగు జీవితములు సాగవలెనన్నచో ఉభయ సంధ్యలయందు ఆరాధనమును పాటించ వలెను.

# 423. 'ద్విజబృంద నిషేవితా'

ద్విజుల బృందములచే విశేషముగ సేవింపబడునది శ్రీమాత అని అర్థము.

ద్విజులు అనగా మరల పుట్టినవారు. రెండవ మారు పుట్టిన వారు. మానవులందరూ రక్త మాంసాదులతో కూడిన దేహమందు పుట్టుదురు. ఇట్టి వారిలో కొందరు తమ జీవితములను పరహితము, దానము, దైవ ధ్యానములకు సమర్పించి చైతన్యవంతులగుచు జడమగు దేహ పదార్థము నుండి విడివడి చైతన్యవంతమగు వెలుగు శరీరమున స్థిరపడుదురు. వారు చేయుచున్న కార్యక్రమముల నిస్వార్థతను బట్టి, దాన ధర్మములను బట్టి ధ్యానమునందు వారికి చిత్ శక్తి ఆవరించును. ఆ వెలుగు శరీరమై నిలచును. వారందు స్థిరపడి జడమయమగు దేహముయొక్క బంధములేక జీవింతురు. అట్టివారు ద్విజులు.

ఆరాధన మార్గమున వెలుగునందు స్థిరపడిననూ వారా వెలుగులకు మూలమైన శ్రీమాతను ఆరాధించుచునే యుందురు. అట్టి వారి ఆరాధన విశేషమగు ఆరాధన. అట్టి ద్విజులు సామూహికముగ శ్రీమాతను ఆరాధనము చేసినపుడు ఆమె సాన్నిధ్యము అచ్చట నిశ్చయ ముగ నుండును. కారణము శ్రీమాతకు వారియందు గల అశేష ప్రీతి. అజ్ఞానులు ఆరాధించిననూ శ్రీమాత ప్రీతి చెందును. జ్ఞానులు, సిద్ధులు, యోగులు ఆరాధించినపుడు విశేషముగ ప్రీతి చెందును. ఇట్టివారు బృందములుగ నేర్పడి ఆరాధించుట అత్యంత విశేషమైన కార్యము. శ్రీమాత అట్టి పూజలయందు విశేషముగ అవతరించు చుండును.

# 424. 'తత్త్వాసనా'

**త**త్త్వమే ఆసనముగా గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత శివునితో గూడి తత్త్వము నధిష్ఠించి యుండును. ఆమె అర్ధనారి. అతడు అర్ధనారీశ్వరుడు. ప్రకృతి పురుషుడు నిరువురునూ కలసి సృష్టియందు ఈశ్వరత్వము వహింతురు. సృష్టిని అధిష్ఠించి యుందురు. వారు సహజముగ నుండు స్థితి తత్. అదియే వారి ఆసనము. అక్కడనుండియే వారు సర్వలోకములకు వ్యాపింతురు. సర్వము నందు నిండి యుందురు. ఉత్కృష్టమగు యోగులకు సహస్రారమున ఈ అనుభూతి యుండును.



# 425. 'తత్త్వమయీ'

**త**త్త్వమే తానుగా నున్నది శ్రీమాత అని అర్థము.

'తత్త్వ మనగా తత్ అనెడి పురుష, ప్రకృతుల సమాగమ ప్రజ్ఞ. అదే శాశ్వత సత్యము. అది అనిర్వచనీయమైనది. అనన్య మగుటచే దానిని గూర్చి తెలుపుట అసాధ్యము. మరొకరు లేని స్థితి యందు అది ఎట్లు వున్నదో తెలుపుట ఎట్లు సాధ్యము? శ్రీమాత అట్టి తత్త్వము. ఆ తత్త్వముతో అనుసంధానము చెందుట ధ్యానము యొక్క పరమావధి. అనుసంధానము జరుగుచున్న సందర్భమున ధ్యానము చేయువాడు ఆ తత్త్వము లోనికి ఆకర్షింపబడి తా నుండక తత్త్వమే యుండును. అట్టి స్థితిని చేరుటకే శ్రీమాత ఆరాధనము. ఆమె మహిమలను, విభూతులను అనేకానేక నామమలతో వర్ణించుచు, కీర్తించుచూ ఆరాధన చేయు సమయమున ఆరాధకుడు తన్మయము చెందును. తన్మయము చెందినపుడు తా నుండడు. మరల సముద్రము నుండి అలవలె తాను తనకు జ్ఞప్తికి రాగా, తన్మయ స్థితి యొక్క మాధుర్యమును కించిన్మాత్రము రుచి తెలియుట వలన దానినే కోరుచు జీవించును. అట్టివా డెట్టి కార్యముల యందున్ననూ అందు తత్త్వమునే దర్శించును. దానితో అనుసంధానము చెందుచూ జీవితమును రసోపేతముగ నిర్వర్తించుకొను చుండును.

శ్రీమాత తత్త్వమయీ, ఆమె తత్ స్థితిలోనే యుండును. శివునితో

విడిపడనిది, విడదీయ రానిది. శివుడనగా శుభమగు నిత్యసత్యము. దానితో కూడియుండియే సమస్త సృష్టి కార్యములను శ్రీమాత నిర్వర్తించు చుండును. శివునితోకూడి త్రిగుణముల నుద్భవింపజేసి వానిచే సమస్త లోకములను, జీవులను సృష్టిచేసి పాలించు చుండును. ఆమెయే శివుడు అనినను, శివుడు ఆమెయే అనినను విప్రతిపత్తి లేదు. ఇట్టి సహజ సమాధి స్థితికి శ్రీమాతయే పరాకాష్ఠ. తత్త్వమయిగా ఆమె దేనికినీ కారణము కాదు. కాని, అన్ని కారణములకు కారణము. ఇదియొక అపూర్వ స్థితి. శ్రీకృష్ణుడీ స్థితినే నిర్వర్తించి చూపినాడు. అతడేమియూ చేయనివాడు మరియూ అన్నియు చేసినవాడు.



# 426. 'పంచకోశాంతర స్థితా'

**పం**చకోశముల యందు వసించునది శ్రీమాత అని అర్థము.

అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనంద మయ కోశములుగ పంచకోశము లున్నవి. ఈ పంచకోశములును పంచభూతములతో నిర్మించబడినవి. ఇందు పంచతత్త్వములతో శ్రీమాత వసించి యున్నది. ఆకాశ గుణము, వాయు గుణము, అగ్ని తేజము, నీటి గుణము, పృథివీ గుణములు శ్రీమాత అస్థిత్వ కారణముగనే యేర్పడు చున్నవి. పృథివికి గంధము, నీటికి రుచి, అగ్నికి తేజస్సు, వాయువునకు స్పర్శ, ఆకాశమునకు శబ్దము అను గుణములు యున్నవి. వీనియందు శ్రీమాతను దర్శించుట వలన పంచభూతములు, పంచ కోశముల ద్వారా ఆనందము కలిగించగలవు. ఈ కోశములు అపరి శుద్ధముగ నున్నచో ఆనందముండదు. పరిశుద్ధముగ నున్నప్పుడు ఒక దానిని మించి మరియొకటి ఆనందమిచ్చును.

పంచభూతముల సృష్టి భౌతిక సృష్టిగ పేర్కొందురు. అందు కూడ ఆనందము పొందుటకు వీలుకలదు. దానికి ప్రాతిపదిక పరి శుద్ధత. పంచకోశములను పరిశుద్ధముగా నుంచుకొనుట ఆరాధకునకు ప్రథమ కర్తవ్యము. అపుడే ఆనందము యుండును. శబ్దము వినుట పలుకుట యందు, స్పర్శయందు, రుచియందు, గంధమునందు పరి శుద్ధతను పాటింపవలెను. అట్లే చూచు విషయముల యందు పరి

శుద్ధత పాటింపవలెను. అపుడే ఆనందమయుడగు బ్రహ్మయొక్క స్పర్శ, రుచి కలుగును. అపరిశుద్ధులకు యే అనుభూతి యుండదు. భ్రమ భ్రాంతులే యుండును.

పంచకోశములు, పంచభూతములు బ్రహ్మము యొక్క రుచిని మాత్రమే కలిగించగలవు. నిజమగు ఆనందము చిత్‌శక్తిని కూడినపుడే కలుగును. అది త్రిగుణములకు ఆవల యున్నది. కోశ శుద్ధి గావించు కొనుచు, సత్త్వగుణమును ఆశ్రయించి నిత్య జీవితమును దివ్యారాధనగ సాగించు వారికి చిత్ శక్తి స్వరూపము సాన్నిధ్య మిచ్చును. జీవుడు చిత్ శక్తి స్వరూపుడే. అట్టి జీవుడు పరాశక్తిని ధ్యానించుటలో బ్రహ్మే నందము పొందగలడు.

శ్రీ చక్ర ఆరాధన గావించువారు జ్ఞానావరణమందు, ఐదుగురు దేవతలను ఐదు కోశములకు సంబంధించి పూజింతురు. ఈ ఐదు గురు దేవతలు వరుసగ శ్రీవిద్య, పరంజ్యోతి, పరా, నిష్కళా, శాంభవి అని పేర్కొనబడిరి. ఇందు శ్రీవిద్య మధ్యబిందువు. మిగిలిన నలుగురు దేవతలు నాలుగు స్థానముల యందు చుట్టునూ యుందురు. నలుగురునూ సృష్ట్యాది కార్యములలో పాల్గొందురు. శ్రీవిద్య బిందువు నందుండును. ఈ బిందువు శబ్దోత్పత్తి స్థానము.



# 427. 'నిస్సీమ మహిమ'

**హ**ద్దులు లేని మహిమ కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత మహిమకు హద్దులు లేవు. అన్నిటికినీ హద్దులు ఏర్పరచునది శ్రీమాత. ఆమెకు హద్దులు లేవు. అనంతము అపరిమితము అగు తత్త్వము హద్దుల నేర్పరచి అందుండుటయే గాక వాని నతిక్రమించి కూడ యుండును. సృష్టికి ఈవల ఆవల నిండియుండు ప్రజ్ఞ సృష్టి యందిమిడి యున్నట్లుగ గోచరించును. నిజమునకు ఆ ప్రజ్ఞయందే సృష్టి ఇమిడి యున్నది. అలయందు సముద్రమున్ననూ అలను మించి సముద్ర మున్నది గదా! అద్దమందు కొండ యున్నట్లుగ యుండును. కాని కొండ పరిమాణమందు అద్దమెంత? అద్దమందలి కొండవలెనే పదునాలుగు భువనముల సృష్టియందు శ్రీమాత ఇమిడి యున్నట్లు గోచరించును. సృష్టి పరిమాణమును కాలము రూపమున కొలతలు వేయవచ్చును. కాని శ్రీమాత మహిమను, శ్రీమాతను కొలతలు వేయుట సాధ్యము కాదు. శ్రీమాత మహిమను కొలతలు వేయుటకు పూనుకొనిన త్రిమూర్తులు ఆమె మహిమను తెలియుటలో భయమును చెందిరి. తమ తమ స్థానములకు పరిమితులై కర్తవ్యోన్ముఖులైరి.

జీవులు శ్రీమాత స్వరూపులే గనుక వారు కూడ వారి దేహ పరిమాణమునకు లొంగి యుండవలసిన అవసరము లేదు. జీవుని దేహము సృష్టివంటిది. అందు జీవుడు దైవాంశ. అతడు కూడ నిజము

నకు దేహపరిమితులను దాటి యుండవచ్చును. అతడి మహిమ కూడ దూర తీరములకు వ్యాపించ వచ్చును. శ్రీమాత భక్తులగు మహాత్ములట్లే యుందురు. బ్రహ్మర్షులు, మహర్షులు, రాజర్షులు వారి యోగ తపో బలములచే తీరముల నతిక్రమించి మహిమ చూపుచుండుట తెలిసిన విషయమే. ఇట్లు జీవులందరును కూడ నిజమునకు పరిమితులు లేనివారే. ఉన్నదని భావించుటచే అట్లు ఇమిడి యుందురు. వారియందు జ్ఞానము వికసించు చుండగా వ్యాప్తి చెందుచు నుందురు.



# 428. 'నిత్య యౌవనా'

**ము**దుసలితనము లేనిది శ్రీమాత అని అర్థము.

త్రికాలములకు లోనగు వారికి బాల్యము, యౌవనము, వార్ధక్యము వుండును. కాలము ప్రభావము చూపని వారికి వారు నిత్యమొకే మాదిరిగ నుందురు. కాలము దైవముపై మాత్రమే ప్రభావము చూపలేదు. సృష్టింపబడు సర్వజీవరాసులు కాలబద్ధులే. సృష్టికర్తయగు బ్రహ్మకు కూడ వార్ధక్య మున్నది. ప్రస్తుతము మన సృష్టికి కర్తయైన 'పద్మభూః' అను బ్రహ్మదేవుడు ద్వితీయ పరార్థమున ప్రవేశించెనని నిత్యము సంకల్పమున చెప్పుకొనుచున్నాము కదా! బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కూడ కాలమునకు లోబడు వారే. వారికినీ వార్ధక్య ముండును. కాలము వారిని కూడ హరించును. కాలమున కతీతమగు ఈశ్వర తత్త్వము మాత్ర మెప్పుడునూ నిత్యనూతనముగ నుండును. దానినే నిత్యయౌవన మందురు. అట్టి నిత్య యౌవన తత్త్వము రూపు గట్టుగొని దిగివచ్చినచో ఎట్లుండును? అదియే లలితమగు శ్రీకృష్ణ రూపము. అది అపురూపము.



# 429. 'మదశాలినీ'

**ఆ**నందముచే ప్రకాశించునది శ్రీమాత అని అర్థము. 'శాలిని' అనగా ప్రకాశించునది అని అర్థము.

'మద'మనగా ఆనందమని అర్థము. అతిశయించిన ఆనందమే మదము. తెనుగున మదమను పదము గర్వమునకు పర్యాయపదముగ వాడుదురు. నిజమునకు మద మనగా ముదమే, ఆనందమే. భక్తి పారవశ్యమున ఆనందము కలిగినపుడు భక్తుడు అట్లతిశయించిన ఆనందమున యిక దేనిని లెక్కచేయడు. *"తక్కువేమి మనకు, రాముండొక్కడుండు వరకూ"* అనుచు భక్తుడు కీర్తించునపుడు అతడు విషమును కూడ లెక్కచేయడు. రామదాసు రామభక్తిలో ఆనంద పర వశుడై తానీషా శిక్షను లెక్కచేయలేదు. కృష్ణభక్తి పారవశ్యములో పరమ భక్తురాలైన మీరాబాయి రాచరికపు హద్దులను లెక్కచేయలేదు. విషమును కూడ లెక్కచేయలేదు. బలి చక్రవర్తి అతిశయించిన భక్తి పారవశ్యమున తన గురువగు శుక్రాచార్యుని కూడ లెక్కచేయలేదు. ఇక ప్రహ్లాదుని విషయము చెప్పనక్కర లేదు కదా! ***"అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృతపాన విశేషమత్త చిత్త మే రీతి నితరంబుఁ జేరనేర్చు"*** అట్లు మత్తెక్కిన భక్తి చిత్తము దైవారాధనమున భక్తులకే చిక్కినప్పుడు దాని మూలమైన శ్రీమాత ఎట్లుండును? ఆనందముచే ప్రకాశించుచు నుండునని భావము. ఆమె సతతము ఈశ్వరునితోనే కూడియుండి ఈశ్వరియై ప్రకాశించుచుండును. కావున ముదశాలిని మఱియు మదశాలిని.

# 430. 'మదఘూర్ణిత రక్తాక్షీ'

**మ**దముచే కదలుచున్న ఎఱ్ఱని కన్నులు కలది శ్రీదేవి అని అర్థము.

'మదము' అనగా అతిశయించిన ఆనందము అని తెలుపబడినది. బాహ్య విషయములందు నిర్లిప్తత, అంతరంగమందు శివుని యందు ఆసక్తత సతతము కలిగి యుండుటచే శివుని తేజో మహిమ కన్నుల యందు నిండగ శ్రీమాత కన్నులు ఎఱ్ఱని జీరతో యుండును. ఈ ఎఱ్ఱని జీర కల కన్నులు శుభలక్షణములు గలవిగ తెలుపబడినవి. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ఎఱ్ఱని జీరతో గూడిన కన్నులు గలవారే అని పురాణేతిహాసములు కీర్తించును. మహాశివుడు హృదయమున మహా విష్ణువు నారాధించునని అట్లే మహా విష్ణువు హృదయమున మహేశ్వరు నారాధించునని, పై గ్రంథములు తెలుపును. శ్రీమాత వైష్ణవియే. అంతరంగమందు అగ్ని స్వరూపుడు లోహితాక్షుడు అయిన ఈశ్వరుని ప్రార్థించుట వలన అతని అనుగ్రహము, ఆమె కన్నుల నుండి వ్యక్తమగుచున్నది. తత్ఫలితముగ కన్నుల యందు ఎఱ్ఱ జీర యుండును. లోక విషయములను నిర్వర్తించుచున్ననూ శివునియందే యుండుటచే కన్నుల యందు ఎఱ్ఱ జీర వ్యక్తమగు చుండును. అంతేగాక ఆ ఎఱ్ఱదనము చెక్కిళ్ళయందు గూడ గోచరించును. ఈ విషయమే తరువాతి నామమున ప్రతిపాదింపబడినది.

# 431. 'మదపాటల గండభూ'

**మ**దముచే ఎఱుపు, తెలుపు రంగుగల చెక్కిళ్ళు గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత చెక్కిళ్ళు పద్మరాగ శిలలవలె మెఱయు చుండునని 23వ నామమున* తెలుపబడినది. పద్మరాగ శిలలు ఎఱుపు నుండి లేత గులాబి రంగులో సున్నితము, సుకుమారము, సౌందర్యము కూడగట్టుకొని యుండును.అట్లే పాటలీ పుష్పములు గూడ అదే వర్ణము, సౌందర్యము, కాంతి కలిగియుండును. అమ్మ కాంతివంతమైన చెక్కిళ్ళకు అంతరంగము నుండి శివుని స్పర్శ తగులగా చెక్కిళ్ళు తెలుపు ఎఱుపు కాంతులతో అతిశయించిన అందము కలిగి యుండును. కామేశ్వరుని గ్రహించుటచేత అమ్మ యందు ఈ ఎఱ్ఱని కాంతి కన్నుల యందు, చెక్కిళ్ళ యందు, పెదవుల యందు ప్రకాశించు చుండును. శ్రీమాత సహజముగ దర్పణము వంటిది. ఆమె యందు శివుని ప్రతిబింబమే ప్రకాశించుట వలన ఈ విధమగు సౌందర్యము ఆమె ప్రత్యేకత.

---

* శ్రీలలిత 1వ భాగము పరిశీలింపుడు.



# 432. 'చందనద్రవ దిగ్ధాంగీ'

**మం**చి గంధము యొక్క సారముచే అలంకరింపబడిన అంగములు గలది శ్రీమాత అని అర్థము.

మంచి గంధము చల్లదన మిచ్చును. సువాసనలను కలిగించును. సత్సంకల్పములను కలిగింపచేయును. మాలిన్యములను నెట్టివేయును. శ్రీమాత సాన్నిధ్యము భక్తులకు లభించు సమయమున చల్లదనము, గంధపు వాసన ప్రాథమికముగ కలుగును. ఆమె అంగముల గంధపు సువాసన శ్రీమాత భక్తులకు నిత్య పుష్టి నియ్యగలదు. మలిన భావము లను నెట్టివేయగలదు. సత్సంకల్పములను స్థిరపరచగలదు. పూజా సమయమున శ్రీమాతకు చేయు ఉపచారములలో గంధము మిక్కుట ముగ వాడుట అమ్మకు ప్రీతి కలిగించ గలదు. అంగములను గంధముతో అలంకరించుట పూజయందు ప్రధానమగు విధులలో నొకటి.

ముందు తెలిపిన నామముల యందలి భావమే ఈ నామ మందు కూడ ప్రతిపాదింపబడినది. శివుని ఆరాధనమున కన్నులు, చెక్కిళ్ళు, పెదవులు ఎరుపెక్కుటయే గాక దేహమంతయూ శివతేజస్సు వ్యాపింపగ, ఆ తేజస్సు యొక్క వేడిమిని ఉపశమింప జేయుటకు చల్లని గంధపు పూత శ్రీమాతకు ఆవశ్యకమైనదని ఋషుల అభిప్రాయము. నరసింహుని శాంతింపజేయుటకు కూడ గుట్టలు గుట్టలుగ గంధపు లేపనమే వాడిరని ప్రతీతి. పుణ్యక్షేత్రమగు సింహాచలమున వరాహ

నృసింహుని సంవత్సర మంతయూ గంధపు పూతతోనే నింపియుంతురు. కారణము ఏమనగా హిరణ్యాక్ష హిరణ్యకశిపులను సంహరించుటకు శ్రీ మహా విష్ణువు శివతేజస్సు నావాహనముచేసి ప్రళయకాల రుద్రునివలె చెలరేగి వరాహ నృసింహుల రూపమున సంహరించెను. శివుని తేజము గల నృశింహుని శాంతింప జేయుటకు గంధమే శరణ్యమైనది. అట్లే సతతము శివుని ఆరాధించు శ్రీమాత అంగములకు గంధ మావశ్యకమై నిలచినది అని భావము.



# 433. 'చాంపేయ కుసుమప్రియా'

**చం**పక పుష్పము ప్రియముగా గలది శ్రీమాత అని అర్థము.

చాంపేయ కుసుమ మనగా పద్మరాజము. పద్మరాజములు ఇతర పద్మముల కన్న శ్రేష్ఠమైనవి. అవి బంగారు కాంతితో కూడిన శ్వేత పద్మములు. దళముల మొదలు నడిమి భాగములు బంగారు కాంతి కలిగి దళముల కొసభాగము క్రమముగ స్వచ్ఛమగు తెల్లని కాంతి కలిగి యుండును. లోపలి భాగ మిట్లుండును. పై భాగము యెక్కువ తెలుపుదనముతో ప్రకాశించును. దళములన్నియూ పుష్టిగ సమానముగ పెరిగి విచ్చుకొని కొసలు వంగి యుండును. పుష్పము చాల పెద్దదిగ నుండును. పుప్పొడి కాడ ప్రస్ఫుటముగ గోచరించుచు రాబోవు తరముల పుష్పములకు వాగ్దానమై నిలచి యుండును. ఇట్టి పుష్పములన్న శ్రీమాతకు చాల ప్రియము. పుష్ప సుగంధము పరిసరముల యందు వ్యాప్తి చెందియుండును.

భక్తులు పుష్పములతో పూజించునపుడు శ్రేష్ఠమగు పుష్పముల నెంచుకొని పూజింపవలెను. వాడినవి, కళావిహీనమైనవి, రెక్కలు విరిగినవి, మురికితో కూడినవి వినియోగింపరాదు. శ్రీమాత కుసుమ ప్రియ యగుటచే శ్రేష్ఠమైన కుసుమములను మాత్రమే వినియోగింప వలెను. పూజ ఫలించుట కిదియొక ఉపాయము.

# 434. 'కుశలా'

'**కు**శలా' అనగా సృష్టి నిర్మాణము నందు నేర్పు గలది శ్రీమాత అని అర్థము.

కుశలముగ నుండుట శ్రీమాత అనుగ్రహమే. ఏడు లోకము లందు కుశలముగ నుండుట పరిపూర్ణ ఆనందము నిచ్చును. అట్టివారు పూర్ణయోగులు. జీవుల గమ్యము ఇట్టి పూర్ణత్వము కొఱకే. మానవ దేహ నిర్మాణము సృష్టి నిర్మాణము చేయుటలో శ్రీమాత కౌశలము గమనింప వచ్చును. బ్రహ్మాండము నందున్నది పిండాండము నందు కూడ ఏర్పరుచుట శ్రీమాతకే సాధ్యము. సృష్టి యందున్న సమస్త దేవతలు, రాక్షసులు కూడ మానవ దేహమునం దున్నారు. మానవుడు తన ప్రవర్తనను బట్టి దైవము కాగలడు. అసురుడు కూడ కాగలడు. దైవాసురులకు మిత్రుడు కూడ కాగలడు. మానవ నిర్మాణము శ్రీమాత అత్యంత కౌశలముగ చేసినది. ప్రతి మానవుడు తనంత వాడుగ అగుటకు వలసిన ఏర్పాట్లన్నియూ మానవ నిర్మాణమున చేసినది. ఇంతకన్న కౌశల మెక్కడ యుండును? శివునితో కూడి చేసిన కూర్పు గనుక సృష్టి యందు కుశలత్వ మున్నది. మానవుడు కూడ శివశక్తులకు అధీనుడై పురోగమించినచో కుశలముగ నుండును.

కేవలము యోగస్థితియే కుశలము నిచ్చునుగాని, ఇతర స్థితుల వలన కుశలము పొందుట సులభము కాదు. సమదృష్టి గలవారికే

కుశలము సహజముగ నుండును. అట్టివారి కార్యములు కూడ కౌశలముతో కూడియుండును. సమదృష్టి ప్రసాదింపబడుటకు శివ శక్తుల ఆరాధన తప్పనిసరి. ఇందు ఎవరిని విస్మరించిననూ యోగస్థితి కలుగదు. దూషణ భూషణ తిరస్కారముల యందు జీవించువారికి కుశలము వుండకపోవుటకు కారణ మిదియే. తెలివి గల వారమని, జ్ఞానుల మని, ఉత్తమ కుల సంజాతులమని, ధనవంతుల మని, కీర్తి వంతుల మని, ఉన్నతుల మని భావించుచూ ఇతరులయందు తిరస్కార భావము కలవారై కుశలముగ నెట్లుందురు? సర్వజీవరాసుల యందు శివశక్తుల అస్థిత్వ మెరిగి తగు విధముగ మన్నించువారు మాత్రమే కుశలముగ నుండగలరు. అట్టి వారికే శ్రీమాత కౌశలత్వము తెలియ గలదు.



# 435. 'కోమలాకారా'

**కో**మల మగు ఆకారము కలది శ్రీమాత అని అర్థము.

ఆకారము కోమలమైనపుడు ఆకర్షణ యుండును. అట్టి ఆకర్షణకు కారణము శ్రీమాత అస్థిత్వమే. వెతికిననూ ఎచ్చటనూ మలినము కానరాని ఆకారము కోమలమై యుండును. అట్టి ఆకారము నందు పారదర్శకత్వ మున్నది. పాదర్శక మున్నచోట ప్రకాశము హెచ్చుగ నుండును. ఈ ప్రకాశమే ఆకర్షణకు కారణము. పదార్థము సుకుమార మైనప్పుడు, మరణము లేనపుడు ప్రకాశము హెచ్చుగ నుండును. ఈ కారణముగనే పుష్పముల యందు, లేత చిగుళ్ళ యందు, పసిబిడ్డల యందు ఆకర్షణ ఎక్కువగ గోచరించును. పదార్థము ముదిరినకొలది ప్రకాశము మరుగున పడును. అట్టి సమయమున ఆకర్షణగ లేకపోగా వికారము హెచ్చై యుండును.

కోమలమగు రూపము కనబడినపుడు ఆ రూపమును శ్రీమాత అస్థిత్వముగ భావించుట అభ్యసించవలెను. అట్టి రూపమందలి గుణము కూడ నిర్మలమైనచో అది యుత్తమ మగు స్థితి. గుణ రూపముల యందలి సౌకుమార్యము శ్రీమాత వైభవమని తెలియవలెను. రూప సౌందర్యము కలవారు కొందరు, గుణ సౌందర్యము కలవారు కొందరు, గుణ రూప సౌందర్య మున్నచోట వైభవ ముండును. రామకృష్ణాదు లట్టివారు.

# 436. 'కురుకుళ్ళా'

**చి**త్తము, అహంకారముల యందు వసించియుండు శ్రీమాత అని అర్థము.

జీవుడు చతుర్వ్యూహములలో వసించుచుండును. అవి వరుసగా వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములుగ చెప్పవచ్చును. లేక

1) జీవుని యందలి దైవము (ఈశ్వరుడు)

2) జీవుడు (దైవ మందలి జీవుడు)

3) బుద్ధి (విచక్షణ జ్ఞానము)

4) చిత్తము (స్వభావముతో కూడియున్న జీవుడు)

ఇందు మొదటి వ్యూహమును నారాయణు డనియు, రెండవ వ్యూహమును నరు డనియూ కూడ పిలుతురు. జీవుడు ఈశ్వరునితో కూడియున్నప్పుడు బుద్ధి ప్రకాశించి ధర్మాధర్మ విచక్షణతో జీవించును. అట్లు కూడియుండ నపుడు అహంకారియై వర్తించును. అహంకారియై నిలచినపుడు విచక్షణను కోల్పోవును. అపుడతని స్వభావము ప్రకోపించి ఇచ్చ వచ్చి నట్లు ప్రవర్తించును.

ప్రత్యగాత్మగ జీవుడుంటుట వలననే అనుభూతి, విభూతి కలుగు చున్నవి. కాని ప్రత్యగాత్మగ ఏర్పడినపుడు తనను గూర్చిన ప్రత్యేక

భావములు ఛాయా రూపములై బంధించు అవకాశమున్నది. ఇట్లు బంధము లేక జీవించుట కొఱకే యోగవిద్య. తానుగ యున్ననూ, దైవమే తానుగ నున్నాడన్న భావము యున్నచో విచక్షణతోడై చిత్త మాధారముగ జీవుడు పాంచభౌతిక సృష్టియందు రసానుభూతి చెంది నది. దైవమే తానుగ నున్నాడని మరచినపుడు అహంకారము, చిత్తము ప్రకోపించి జీవునికి బంధము కలిగించును. రసానుభూతి కలిగించు ఉపాధులే దైవమును మరచినపుడు బంధించుట జరుగుచున్నది. ఈ ఉపాధులు లేనపుడు కథయే లేదు. అనుభూతియే లేదు. ఇట్లు రసానుభూతి కలిగించు వ్యూహములుగ యున్న శ్రీమాతను 'కురుకుళ్ళా' అందురు. దైవమును మరచినపుడు కురుకుళ్ళాదేవి జీవుని బంధించును.

సంపద యున్నచోటనే ఆపద యున్నది. ఆనంద మున్నచోటనే దుఃఖము కూడ యున్నది. వెలుగున్న చోటనే చీకటి కూడ యున్నది. ఎత్తు వున్నచోట పల్ల మున్నది. శిఖర మున్నచోట లోయ యున్నది. అవకాశ మున్నచోట జయాపజయము లున్నవి. ఇందొకటి అనుభూతి కలిగించగ రెండవది తద్భిన్నమైన స్థితి. ఇట్టి సృష్టియందు అప్రమత్తతను సూచించునదే కురుకుళ్ళా.



# 437. 'కుళేశ్వరీ'

సజాతీయ సమూహమున కీశ్వరి శ్రీమాత అని అర్థము.

సజాతులు, విజాతులు యేర్పడుటకు కారణము త్రిగుణముల సమ్మేళము నందుగల వ్యత్యాసమే. గుణ సామ్యమును బట్టి కులము లేర్పడుచున్నవి. సత్త్వ, రజస్తమో గుణములు రకరకములుగ సమ్మేళనము చెందును. దాని వలన వివిధములగు స్వభావము లేర్పడు చుండును. సారూప్యముగల స్వభావము ఒకచోట చేరుచుండును. ఇట్టి కారణము గనే పండితులుగను, అధికారులుగను, వ్యాపారులుగను, సమూహము లేర్పడు చుండును. గుణమునుబట్టి కులము లేర్పడును అనునది సత్యము. ఇట్లు త్రిగుణము లాధారముగ గుంపులు గుంపులుగ శ్రీమాత జీవులను యేర్పరచుచు నుండును. ఏనుగులొక గుంపుగ నుండును. అవి సింహములతో కలియవు. అట్లే సింహములు తామొక గుంపుగ నుండును. అట్లే పక్షులు, అట్లే మానవులు గూడ. పక్షుల యందు గూడ రాబందులు, రామచిలుకలు కలిసియుండవు. కాకులు, పిచ్చుకలు కలువవు. ఉడుతలు, ఎలుకలు కలువవు. గుణభేదము వలన వైవిధ్యము గల గుంపులు కలువవు. మానవులు గూడ అట్లే గుణ సారూప్యమును బట్టి కలిసియుందురు. గుణ వైవిధ్యమును బట్టి విడి విడిగ నుందురు.

జీవులుగ ఒకరియం దొకరికి సారూప్యమున్ననూ గుణాత్మకులుగ వైవిధ్యము కలుగును. గుణముల అధీనమునందు జీవులు వర్తించు

చున్నప్పుడు కులములు, గుంపులు తప్పవు. గుణాధీనమైన వారికి కులము సదుపాయము. గుణముల యందు మార్పు సంభవించినపుడు, కులమార్పులు కూడ సంభవించును. ఇట్లు గుణమును బట్టి కులముల నేర్పరచుచు సృష్టిని నిర్వర్తించుచున్న శ్రీమాత కుళేశ్వరి అని పిలువబడు చున్నది.



# 438. 'కుళ కుండాలయా'

**కు**ళ కుండమందు వసించునది శ్రీమాత అని అర్థము.

సుషుమ్న మూలమగు మూలాధార చక్రమందు వసించునది శ్రీమాత. తామర పువ్వు కాడయందలి సూక్ష్మమగు దారము వలె సుషుమ్న నాడి సహస్రారము నుండి మూలాధారము వరకును వ్యాపించి యుండును. కనుకనే జీవచైతన్యము ఏడు లోకములు వ్యాపించి యుండును. పరమ పథము నుండి భూలోకము వరకు వ్యాపించి భూలోకము నందలి దక్షిణ ధృవమున గల కుండమందు ఈ చైతన్య స్రవంతి స్థిరపడును. ఈ చైతన్యము వలననే భూమి స్థిరముగ నుండును. మూలాధారమున శ్రీమాత స్థిరముగ నుండునంత కాలము భౌతిక శరీరము జీవునకు స్థిరవాసమై యుండును. భౌతిక లోకముల స్థిరత్వము లకు శ్రీమాత అస్థిత్వమే కారణము. సుషుమ్న మార్గమును కుండలినీ మార్గ మందురు. సుషుమ్న వలయాకారమున దిగివచ్చును గనుక దానిని సర్పమార్గ మందురు. కుండలినీ చైతన్యము సర్ప చైతన్యమని సంకేతింతురు. ఆరోహణ, అవరోహణములకు యోగు లనుసరించు మార్గము సుషుమ్న మార్గమే. ఈ మార్గముయొక్క అంతమున మూలాధార కుండ మున్నది. అందు సర్పాకార చైతన్యము చేరి వసించును. పుట్టలో సర్పమున్నట్లు ఈ కుండమున సర్పమువలె చైతన్య ముండును. భక్తి తత్పరతతో వసించువారి యందు ఈ చైతన్యము మేల్కొని యుండును. ఇతరులయందు నిద్రావస్థ యందుండును. ఇట్లు

మూలాధార కుండమున నివాస మేర్పరచుకొని శ్రీమాత విశ్రాంతి గొనుచున్నదని ఈ నామమున కీర్తింపబడుచున్నది. జాగ్రదవస్థయందు మూడు చుట్టలు విప్పుకొని పడగ విప్పినట్లుండునని, సమాధి స్థితి యందు ఏడు చుట్టలనూ విప్పుకొని పడగను విప్పి తోకపై నిలచి యుండునని పెద్దలు తెలుపుదురు. సృష్టియందు విశ్రాంతి స్థానము మాత్రము మూలాధార కుండలిని. అదియే కులకుండము. అందు వసించునది గనుక శ్రీమాత కుళ కుండాలయా.



# 439. 'కౌళమార్గ తత్పర సేవితా'

**వం**శక్రమాగతమైన పూజా పద్ధతులచే భక్తితో సేవింపబడు చున్నది శ్రీమాత అని అర్థము.

వంశ పరంపరగా దైవారాధన జరుగుచుండుట భారతీయ సంప్రదాయము. ప్రతి వంశము నందు కులదేవత యుండును. కుల మనగా వంశమని కూడ అర్థము. కులదేవత, ఇలదేవత నిత్యము పూజింపబడుట సదాచారము. దేవతారాధన లన్నియూ కూడ శ్రీమాతనే చేరును. ఎవరెవరు ఏయే కుల మార్గమున పూజించిననూ వారి వారికి సమర్పణ భావమును బట్టి శ్రీమాత అనుగ్రహించు చుండును. ధూప దీప నైవేద్యాదులు అర్పించుచూ, ఆరాధన చేయుచు వంశానుక్రమముగ ఆరాధనము నిర్వర్తించు పద్ధతి సమ్మతమైన పద్ధతియే. ఈ పద్ధతిని కౌళ మతము లేక కౌళ మార్గమందురు. అట్లుగాక వేద విధులతో కూడిన ఆరాధన మున్నది. దానిని సమయ మతమని, సమయ మార్గమని అందురు. ఈ రెండును కలుపు మిశ్రమ మార్గము కూడ కలదు. ఈ మూడును గాక తంత్ర మార్గము కలదు.

ఆరాధకులు వారి వారి అర్హతలను, ఆసక్తిని బట్టి ఇందే మార్గము నైనను అనుసరింపవచ్చును. మార్గమేదైననూ భక్తి శ్రద్ధలు ప్రధానము. తమను తాము శ్రీమాతకు అర్పణ చేసుకొనుట ప్రధానము. భక్తితో అర్పణ చేసుకొనునపుడు తత్పరత కలుగును. అపు డారాధనము

హెచ్చుగు ఆనందము నిచ్చును. కావున విధానము కన్న భక్తి తత్పరతలు ప్రధానము. విధానము కూడ అనుసరించినచో హెచ్చుగు వైభవము కలుగ గలదు. భక్తిలేని విధానము తత్పరతను కలిగింపకపోగా దంభమును, డంబాచారమును కలుగచేయును.



# 440. 'కుమార గణనాథాంబా'

**కు**మారునికి, గణపతికి తల్లి అని అర్థము.

కుమారుడు శ్రీమాత ప్రేరణ వలన శివుని వీర్యము నుండి అగ్నిస్వరూపుడై ఉద్భవించెను. అతడు మహాశక్తి సంపన్నుడు. శక్తి అతని ఆయుధము. అతనిని మించిన శక్తివంతుడు సృష్టిలో లేడు. అతనిని మించిన అందగాడును లేడు. గణపతి శ్రీమాత సంకల్పము నుండి ఉద్భవించినవాడు. అతను మహాశక్తి సంపన్నుడే గాక బ్రహ్మవిద్యా స్వరూపుడు. అతనియందు శివశక్తులు పూర్ణానుగ్రహము కలిగి యుందురు. సిద్ధి బుద్ధుల కతడే దైవము. బ్రహ్మవిద్యకు కుమారునికి గురువై నిలచినవాడు. కుమారుడు గణపతి వద్దనే బ్రహ్మవిద్యను ఉపదేశముగా పొంది ఉపాసించి సుబ్రహ్మణ్యుడైనాడు. వీరిరువురును శ్రీమాత బిడ్డలే. ఇట్టి బిడ్డలుగల తల్లి సృష్టిని పరిపాలించుట అతి సులభము. సృష్టి కార్యములను వీరిరువురే చక్కబెట్టగలరు. సంతానము విషయమున శ్రీమాతతో సాటియైన వారెవరు? ఆమె పెనిమిటి అంతర్యామియగు శివుడు. పుత్రులు బ్రహ్మవిద్యతో కూడి సర్వవిద్యా పారంగతులు. సత్సంతానము కోరువారు ఈ నామముతో శ్రీమాతను ఆరాధించినచో సంతానము ద్వారా సౌఖ్యమును పొందగలరు. కీర్తి యశస్సులను కూడ పొందగలరు.

కుమార గణమనగా అహంకారముల గుంపు. మారుడనగా

మన్మథుడు. కుమారుడనగా మన్మథ వికారము. కుమార గణముల కధిపతులైన ప్రజ్ఞలను అంబ బంధించును. వారి వికారమును తొల గించును. అంబ బంధించునది, తొలగించునది కూడ. అభి బంధనము అంబ పదమునకు నిర్వచనము. మరల అకారము నుపదేశించి బంధము తొలగించును. అకారము అనగా శివుడే. అహంకారులగు కుమార గణనాథులను అమ్మ బంధించి శివోపదేశమున వారికి ముక్తిమార్గము చూపును. అహంకారులను లోకశ్రేయస్సునకై మలచుటకు శ్రీమాత యిట్టి లీలలను చూపును.



# 441. 'తుష్టిః'

సకల ప్రాణులకు తుష్టి నిచ్చునది శ్రీమాత అని అర్థము.

కోరికలు తీరినపుడు ప్రాణులకు తృప్తి కలుగును. సంతోషము కలుగును. తృప్తి, సంతోషము కలిగియున్న జీవుడు నిండుదనముతో ప్రకాశించును. అదియే తుష్టి. దప్పిక గొన్నవారికి నీరు, ఆకలి గొన్న వారికి అన్నము యేర్పరచుచు ప్రాణులను తృప్తి పరచి తుష్టి కలిగించుట, శ్రీమాత కార్యములలో నొకటి. కోరికలను తీర్చునది తల్లియే కదా! శ్రీమాత కొన్ని కోరికలను తీర్చి తృప్తి పరచును. కొన్ని కోర్కెలను తీర్చక శిక్షణ నిచ్చి ఆ కోరికల నుండి ఉత్తీర్ణులను చేయును. ఎట్లైనను తుష్టులను చేయుట ఆమె కార్యము. పురాణములలో తుష్టి మొదలుకొని పోషణము, జ్ఞానము, ధైర్యము, శమము, కల్యాణము, కమనీయత, కీర్తి, ధృతి, లక్ష్మి, శక్తి, శ్రద్ధ, మతి, స్మృతి ఇత్యాది సిద్ధులను శ్రీమాత అనుగ్రహించు నని తెలుపబడినది. కావున సర్వ ప్రయోజనములకు శ్రీమాత ఆరాధనమే జీవులకు ఉపాయమని తెలియనగును.

రాబోవు 8 నామములు మరికొన్ని సిద్ధులను తెలుపుచున్నవి.



# 442. 'పుష్టి'

**పు**ష్టి గూర్చునది శ్రీమాత అని అర్థము.

'పుష్టి' అనగా పరిపూర్ణత. విద్యయే పరిపూర్ణతను కలిగించును. అన్ని విద్యలకు మూలము బ్రహ్మమే. అట్టి బ్రహ్మవిద్యను కూడ శ్రీమాత అనుగ్రహమున పొందవచ్చును. అట్టివారే బ్రహ్మర్షులు. వారిది తరుగని పుష్టి. వారు సతత సంతుష్టులు. వారియందు ప్రకృతి పురుషుల సాన్నిధ్యము పరిపూర్ణముగ నుండును.

వశిష్ఠుడు, అగస్త్యుడు, గౌతముడు అట్టి బ్రహ్మర్షులు. సనక సనంద నాది కుమారులు, నారదుడు, సప్త ఋషులు, మనువులు అట్టివారే. గణపతి, కపిలుడు, దత్తాత్రేయుడు, హనుమంతుడు దేవతలలో అట్టివారు అని తెలియవలెను.

ఆకారములలో కుంభము, రంగులలో నీలము, అక్షరములలో ఓంకారము, అంకెలలో పదియవ అంకె– ఇట్టి పూర్ణత్వమును, పుష్టిని సూచించును. వృక్షములలో దేవదారు వృక్షము, జంతువులలో ఏనుగు, లోహములలో బంగారము, పక్షులలో గరుత్మంతుడు, పర్వతములలో కైలాస పర్వతము, జలములలో గంగాజలము యిట్టివి.



# 443. 'మతిః'

మతి స్వరూపము శ్రీమాతయే అని అర్థము.

మతి లేనిదే యే అనుభూతియు లేదు. మతి ఒక వైభవము. అది మానవులకే సంపూర్ణముగ నీయబడినది. మతి ఆధారముగనే మానవు డాలోచన చేయుచున్నాడు. తెలుసుకొను చున్నాడు. సృష్టిని విభజించుకొనుచు గుణములను బట్టి సృష్టితో సంబంధముల నేర్పరచు కొనుచున్నాడు. ఇది నిప్పు అని, ఇది నీరు అని, ఇది శుద్ధమని, ఇది అశుద్ధమని తెలియుచున్నాడు. ఇట్లు తెలియుటకు మతియే ప్రధానము. ఆచరణము ద్వారా మతి సుమతియో, కుమతియో కాగలదు. కుమతులు కష్టములకు లోనై ఆచరింప కూడనివి నేర్చుచున్నారు. సుమతులు సత్కర్మాచరణమున శ్రీమాత సిద్ధులను పొందుచున్నారు. కుమతులకు శిక్షణము, సుమతులకు రక్షణము కలుగుట చూచు చున్నారు. ఇట్లు అసంఖ్యాకములైన విషయములను నేర్చుట కాధారము మతియే. అట్టి మతి స్వరూపము శ్రీమాతయే.



# 444. 'ధృతిః'

స్థిరమగు ప్రజ్ఞ కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత ప్రజ్ఞ అచంచలము, అనిర్వచనీయమైన స్థిరము కలది. స్థిర ప్రజ్ఞ కలవారికే విజయము, ఆనందము, కీర్తి, తుష్టి, పుష్టి, శాంతి కలుగును. చంచల స్వభావులకు సృష్టి యందెట్టి అనుభూతి యుండదు. పడుచూ, లేచుచూ, ఏడ్చుచూ, నవ్వుచూ, దిగులు చెందుచూ జీవింతురు. ప్రజ్ఞ చంచలమైనపుడు కామము, క్రోధము వంటి షడ్వర్గములు దరిచేరును. భయ మావేశించును. మరపు కలుగును. దుర్బలత్వము లేర్పడును. జీవితము క్షుద్ర మగును.

స్థిరబుద్ధిని పొందుటకే ప్రాచీన ఋషులు విద్యాభ్యాసమును ప్రవేశ పెట్టిరి. చంచలమగు ప్రజ్ఞకు స్థిర మేర్పరచుటకే ప్రాథమిక విద్య. స్థిరబుద్ధి యైనవాడు విద్యలను సులభముగ ఉపాసించగలడు. చంచలమగు ప్రజ్ఞ గాలిలో దీపము వంటిది. నీటిపై వ్రాత వంటిది. ప్రజ్ఞ మనస్సు నుండి బుద్ధిలోనికి ప్రవేశించినపుడు స్థిరమగును. పాదరసము వంటి మనస్సు బుద్ధిలోకమున ఘనీభవించి స్థిరమై యుండును. అందులకే రసలింగములకు పూజలు చేయు సంప్రదాయ మేర్పడినది. నూనె, నెయ్యి దీపములు గాలికి తల్లడిల్లును. విద్యుత్ దీపమట్లుగాదు. విద్యుత్ దీపము బుద్ధి వంటిది. విద్యుత్ ఆత్మవంటిది. నూనె, నెయ్యి దీపములు మనస్సు వంటివి. అవి పదార్థ మాధారముగ వెలుగును. విద్యుత్ దీపము సూక్ష్మ పదార్థ మాధారముగ వెలుగును.

శ్రీమాత ఆరాధనము ద్వారా మానవు డచంచలమగు మతి నుండి దివ్యమగు మతిలోనికి చేరును. పదార్థమయ మగు మనస్సు నూనె దీపము వంటిది. అట్టి మనస్సును దివ్య విషయములపై ప్రసరింప జేసినపుడు, దివ్యత్వమును పొంది స్థిరపడును. స్థితప్రజ్ఞ కలుగును. స్థిరమగు మతియే ధృతి. ధృతి కలవాడు యిహపరముల సుఖించును. అతడే నిజమగు విజయుడు. ధృతి హీనత్వము కలిగినపుడు అమ్మ ప్రార్థనము అమితముగ గావించవలెను. ధృతి గలవానిని ప్రకృతి కూడ మన్నించును. కాలము కూడ మన్నించును. ధృతి గలవానిని మరణము కూడ తాకదు. పదార్థమయ శరీరమునకే మరణము గాని ప్రజ్ఞకు మరణము లేదు గనుక ధృతి అమృతత్త్వమును కలిగించును. ధృతి పవిత్రమగు నామము.

# 445. 'శాంతిః'

**శాం**తము కలిగించునది శ్రీమాత అని అర్థము.

శమమే గమ్యముగా కలది శాంతి. 'శం' అనగా శమము. శమము గమ్యముగా నుండుట ఒక సిద్ధి. సంకల్పమున, కార్యమున, కర్మమున శాంతముండుట అద్భుతమగు సిద్ధి. తొట్రుపాటు యున్నచోట శాంత ముండదు. శాంత మనస్కులకు సంకల్పములు కూడ శాంతి కలిగించునవే కలుగును. వాని నిర్వహణమున కూడ శాంతి యుండును. ఫలముల యందు కూడ శాంతియే వికసించును. ఇట్లు సమస్తము శాంతిమయముగ నుండుట అసామాన్యము. తుష్టి, పుష్టి, మతి, ధృతి కలవారికి మాత్రమే యిట్టి శాంతి లభ్యము కాగలదు. కోరిక యున్నచోట శాంతి లేదు. కర్తవ్యమున ప్రియము కలవారు, కర్తవ్యోన్ముఖులై మాత్రమే జీవించినచో వారిని శాంతి వరించును. నిష్కామ కర్మము, యజ్ఞార్థ జీవనము, దానము, తపస్సు ఇత్యాది విషయముల యందు నిమగ్నులై యున్నవారికి శాంతి లభించును గాని, త్రిగుణముల యందు పంచభూతముల యందు వసించు వారికి శాంతి యెట్లు కలుగును?

అష్టప్రకృతుల కావల శాంతి యున్నది. దానిని పొందినవారు అష్ట ప్రకృతులలో కూడ శాంతియుతముగ వసింతురు. అష్టప్రకృతుల కావలయున్నది శ్రీమాతయే. ఆమె అనుగ్రహము పొందుటకు

అనుస్మరణమే మార్గము. అనుస్మరణమే నిజమగు ఆరాధనము. అనుస్మరణమున శ్రీమాత సాన్నిధ్యమున వసించు వారికి సృష్టియం దెచ్చట నైననూ శాంతి లభింపగలదు. అట్టి శాంతి నిచ్చునది శ్రీమాత.

అక్షరములలో చివరి ఎనిమిది అక్షరములను శాంతము లందురు. అవి వరుసగ య, ర, ల, వ, శ, ష, స, హ. ఈ ఎనిమిది అక్షరములు బీజాక్షరము లగుటచే శాంతి వర్ణములు. యం, రం, లం, వం, శం, షం, సం, హం. వీనిని రకరకములుగ 'ఈం' కారముతో చేర్చి ఋషులు మంత్రముల నేర్పరచిరి.



# 446. 'స్వస్తిమతిః'

క్షేమము కలది శ్రీమాత అని అర్థము.

స్వస్తి అను పదము సు అస్తి నుండి ఏర్పడినది. అస్తి అనగా వుండుట. సు అస్తి అనగా బాగుగా వుండుట. హాయిగా వుండుట. క్షేమముగా నుండుట. సుఖముగా నుండుట. ఏ జీవుడైననూ కోరునది ఈ స్థితియే. ఏ కోరికా లేని స్థితి ఇది. కోరికలన్నీ తీరిన స్థితి. పూర్ణమగు స్థితి.

ఈ స్థితిని పొందుటకే స్వస్తి చిహ్నమగు (卐) స్వస్తికమును ఆరాధించు సంప్రదాయ మేర్పడినది. భౌతిక దేహము నుండి అన్ని దేహ పొరల యందు లేక కోశముల యందు, లేక లోకముల యందు సుఖముగ నుండుట జీవన్ముక్తి. అనగా ఏదియూ బంధింపని స్థితి. యోగులు, సిద్ధులు, తపస్విజనులు సత్సాధన ద్వారా ఈ స్థితిని పొందుటకు ప్రయత్నింతురు.

'స్వస్తి' అనగా తనయందు తానుండుట. తానుగా యుండుట. తా నెవరో తనకి తెలిసినపుడు స్వస్థత చేకూరును. అట్లు తెలియుట వలన తన చుట్టును కాలరూపమున ప్రకృతి నిర్మించు జీవితము తెలియబడుచు నుండును. తానుగ నుండుటచే తన యందు, తన పరిసరముల యందు జరుగుచున్న మార్పును సాక్షీభూతుడుగ గమనించు చుండును. అట్టి వానికి కాలము, ప్రకృతి చేయు విన్యాసము ఒక

ప్రదర్శనగ గోచరించును. తనయందు పరిసరముల యందు ఈ ప్రదర్శనమునే దర్శించుచు, ఆనందించుచు యుండును. అట్టివారు స్వస్తిమతులు.

ఉదాహరణకు బ్రహ్మర్షి యగు వశిష్ఠుడు అట్టి స్వస్తిమతి. విశ్వామిత్రుడు చేయు విన్యాసములను అతడు చిరునవ్వుతో దర్శించెను గాని ప్రతిస్పందించ లేదు. అట్లే పట్టాభిషేక సమయమున రాముడు వనవాసముల కేగుచున్నప్పుడు కూడా అడ్డుపడలేదు. విపత్కర పరిస్థితులలో కూడ అతడు చలించలేదు. తన నూరుగురు కుమారులను విశ్వామిత్రుడు సంహరించినపుడు చలింపక స్థిరమతియై యుండెను.

స్వస్తికి శ్రీమాతయే మూలము. ఆమెయే గురువు. ఆమె చైతన్యమే బ్రహ్మర్షుల యందు మరియు క్రూర మృగముల యందు కూడ యున్నది. ఎందున్నను తాను తానుగనే యుండును. కాలము దేశము రూపము తనపై ప్రభావము చూపవు.



# 447. 'కాంతిః'

సహజముగ కాంతి గలది శ్రీమాత అని అర్థము.

ఏమియూ లేనట్లున్న స్థితి నుండి తనకు తానుగ వ్యక్తమగునది శ్రీమాత. అవ్యక్తము నుండి వ్యక్తమగుట వలన వెలుగు అందురు. వెలుపలకు వచ్చిన శక్తి గనుక వెలుగు. వెలుగనగా కంటికి కనిపించు వెలుగు మాత్రమే కాదు. కనిపించుట, వినిపించుట, యిత్యాదివి చిల్లర వెలుగులు. అనిపించుట కూడ వెలుగే. ప్రతి ఒక్కరికి నేనున్నానని అనిపించును. ఈ అనిపించుట ప్రప్రథమమగు వెలుగు. ఇతరము లన్నియూ ఇది ఆధారముగ అనిపించును. నిద్ర యందు కూడ జీవు డున్నాడు. కాని వున్నాను అని తెలియదు. ఇట్లు తెలియుట ఆది వెలుగు. అదియే కాంతి. అదియే ప్రకటింపబడిన ప్రజ్ఞ. తా నెట్లున్నాడో తనకే తెలియదు. ఎందుల కున్నాడో కూడ తెలియదు. తా నున్నాడని మాత్రము తెలియును. తా నుండుట యెట్లు సంభవించినది? అని ప్రశ్నించుకొని నపుడు బ్రహ్మదేవునికికూడ తెలియలేదుట. తా నేమి చేయవలయును? అని ప్రశ్నించినపుడు కర్తవ్యము తెలిసినదట. కర్తవ్య నిర్వహణమున తా నెవరో తెలిసెనట. ఇట్లు తెలియుట శ్రీమాత అస్థిత్వమే. ఆకలి నుండి బ్రహ్మము వరకు అన్నిటినీ తెలియజేయునది, అనగా వ్యక్తము చేయునది శ్రీమాతయే. ఆమె కాంతి యందు అన్నియును తెలియ బడును. తెలియవలెనన్న ఇచ్ఛ, తెలియుటకు వలసిన జ్ఞానము, నిర్వర్తించుటకు వలసిన క్రియ శ్రీమాతయే. ఆమె కాంతి సమూహమే త్రిశక్తులును.

# 448. 'నందినీ'

**ఆ**నందింపజేయునది శ్రీమాత అని అర్థము.

ఎప్పుడు, ఎచ్చట, ఎవరికి ఆనందము కలిగిననూ అది శ్రీమాత అవతరణమే. ఆనందమునకు బాహ్యమగు ఉపాధులు చాల మందికి అవసరము. నిమిత్తములు లేకయే ఆనందముగ నుండుట అంతరంగ మున శ్రీమాత సాన్నిధ్యమునకు తార్కాణము. బాహ్యము నుండి పొందు ఆనందము మనస్సు, ఇంద్రియ శరీరములకు కలుగు ఆనందము ఇవి తాత్కాలికములు. వచ్చి పోవుచుండును. బుద్ధిలోకమున పొందు ఆనందము కొంత శాశ్వతము. ఆత్మలోకమున పొందు ఆనందము స్థిరము, శాశ్వతము. అచ్చట మార్పు లేని ఆనందముండును. కాలము కూడ ఈ ఆనందమును త్రోసిపుచ్చలేదు. ఇట్లు వివిధ లోకములలో వివిధ దశలలో తాత్కాలిక ఆనందము నుండి శాశ్వతమగు ఆనందము వరకు నందినీ రూపమున శ్రీమాతయే యున్నది.

ఆనంద మెచ్చట యున్ననూ చూచి ఆనందించుట కూడ అదృష్టమే. ఎదుటివారి ఆనందమును చూచి ఓర్వలేక పోవుట దురదృష్టము. ఇట్టి వారికి ఆనందము దూరమగు చుండును. ఎచ్చట ఆనందమున్నదో అచ్చట ఆనందించుట దేవి అనుగ్రహమునకు పాత్రత కలిగించును. అటుపైన ఇతరుల ఆనందము కొరకు కృషి చేయుట ఆనందము పొందుట కుపాయ మగును. ఎదుటివారి ఆనందమే

తమ ఆనందముగ భావించుట ప్రేమ యగును. ప్రేమ గలవారికి ఆనంద మెప్పుడునూ యుండును.

ఆనందము నందరూ కోరుదురు గాని ఆనందముగ నుండుటకు వలసిన ఉపాయములను గ్రహింపక పోవుటయే ఆనందము అందని ఫలమైనది. యజ్ఞము, దానము, తపస్సులు చేసి కూడ ఆనందము పొందని వారున్నారు. జీవులకు మేలు కలిగించి అప్రయత్నముగ ఆనందమున నిలచిన యోగులున్నారు. పరహితమే ఆనందమునకు పరమోపాయము. అట్టి వారికి నందినీదేవి నిరంతర సాన్నిధ్య మిచ్చును.



# 449. 'విఘ్ననాశిని'

విఘ్నములను నాశనము చేయునది శ్రీమాత అని అర్థము.

భక్తులకు కలుగు విఘ్నములను శ్రీమాత నాశనము చేయుచుండును. భక్తులకు శ్రేయోదాయకమైన మార్గమునే యేర్పరచి ఇతరములగు మార్గములు స్పృశించకుండా రక్షించుకొనును. బాహ్యాంతరముల నుండి భక్తుల శ్రేయస్సునకు విరుద్ధమగు సంకల్పములను సంహరించుచు భక్తులను రక్షించుకొనుట శ్రీమాత తన పనిగా పెట్టుకొనినది. భక్తులకు కలగు సంకల్పములను, కోరికలను గమనించుచు అందు శ్రేయోదాయకమగు వానిని మాత్రమే అనుమతించుచూ ఇతర సంకల్పములను సంహరించును. సంకల్పించిన పనులు భక్తులకు జరుగుట, జరుగక పోవుట సామాన్యముగ కనబడుచుండును. నిజమైన భక్తులు పనులు జరుగుట, జరుగకపోవుట యందు శ్రీమాత ఆశీర్వాదము గమనించుచుందురు. అంతయూ మన మేలునకే అని భావించుచూ జీవింతురు. విఘ్నములు కలిగించుట, తొలగించుట కూడ శ్రీమాత సంకల్పమే అని తెలియవలెను.



# 450. 'తేజోవతి'

**తే**జస్సు గలది శ్రీమాత అని అర్థము.

ఎచ్చట తేజస్సు గోచరించిననూ అది శ్రీమాతయే అని తెలియ వలెను. సూర్యుని యందు వెలుగు, చంద్రుని యందు వెన్నెల, అగ్ని యందలి తేజస్సు, కన్నుల యందలి కాంతి ఇత్యాది వన్నియూ శ్రీమాత దర్శనమే. ఆమె సహజమగు వెలుగు. రాళ్ళయందు రత్నమునకు విలువ కాంతిని బట్టియే. అట్లే లోహములందు వెండి, బంగారము. వృక్షముల యందు దేవదారు, రావి. పుష్పముల యందు మల్లెలు, కమలములు. అట్లే జంతువుల యందు తెల్లని ఏనుగు, గుఱ్ఱము, పావురము, హంస, కుక్క, నాగుపాము. అదే విధముగ మానవుల యందు విద్యావంతులు, సాత్త్వికులు. ఇట్లు కాంతి దర్శనము లన్నియూ శ్రీమాత దర్శనములే అని భావింపవలెను.

పంచభూతములలో ఆకాశము, రంగులలో తెలుపు, అక్షరము లలో 'అ', అంకెలలో పది ఇత్యాదివి పూర్ణ ప్రకాశములు. ఇట్లు తెల్లని స్వచ్ఛమైన కాంతిని గుర్తించుచూ శ్రీమాత భావమున నిలచుట ఆరాధనలో భాగము.



# 451. 'త్రినయనా'

**మూ**డు కన్నులు గలది శ్రీమాత అని అర్థము.

సోమ, సూర్య, అగ్ని నేత్రములు శ్రీమాత నేత్రములు. ప్రజ్ఞ, పదార్థము, శక్తి ఈ మూడునూ తన మూడు నేత్రముల నుండి సృష్టించి పోషించి తనలోనికి లయము చేసుకొనును. సత్త్వ, రజస్, తమో గుణములను ఉద్భవింపజేసి అందుండి లోకముల నేర్పరచి జీవులను ప్రవేశింపజేసి జగన్నాటకమును త్రినేత్రములతో శ్రీమాత నిర్వర్తించు చుండును. సృష్టి అంతటినీ త్రిగుణాత్మకముగ త్రినేత్రములతో నిర్మించును. త్రిమూర్తులు, త్రిశక్తులు, త్రికాలములు, త్రివర్ణములు, త్రిలోకములు- ఇట్లంతయూ త్ర్యంబకమై నిర్వర్తింపబడు చున్నది. త్రిమూర్తుల నుండి మూడు కోట్ల దేవతల నేర్పరచుట కూడ యిట్టిదే. త్రిభుజము శ్రీమాత కత్యంత ప్రియమగు చిహ్నము.

శ్రీమాతను చేరుటకు కూడ త్రిమార్గము లున్నవి. అవియే భక్తి, జ్ఞాన, వైరాగ్య మార్గములు. మొత్తము శ్రీమాత వ్యూహమంతయూ వివిధ త్రయీమయమగు నామములుగ ముందు కూడ చెప్పబడును.



# 452. 'లోలాక్షీ'

**కా**మదృష్టి గలది శ్రీమాత అని అర్థము.

కామము లేనిదే సృష్టి లేదు. శ్రీమాత జీవులయందలి కారుణ్యము కారణముగా సృష్టి నేర్పరచి జీవులను ప్రవేశపెట్టును. జీవులు ప్రళయ మున మరల సృష్టింపబడుటకు తహ తహ లాడుచుందురు. అట్టి తహ తహకు కారణము వివిధ దశలలో నున్న జీవుల అపరిపూర్ణత. అపరిపూర్ణులైన జీవులు పరిపూర్ణత కొరకు తపించు చుందురు. వారి తపనను గమనించిన శ్రీమాత కారుణ్య భావమున సృష్టి నేర్పరచును. జీవులకు వారి వారి పరిణామము ననుసరించి అనుగుణమైన దేహముల నేర్పరచును. ఇట్లు ఏడు లోకములందు జీవు లేర్పడుదురు. వారి పోషణమునకు కూడ శ్రీమాత సృష్టి యందు అన్ని సౌకర్యము లేర్పరచును.

జీవులను సృష్టించుట, వారికి పోషణా సౌకర్యముల నేర్పరచుట, మనో ఇంద్రియాదులతో బాటు బుద్ధి నొసగుట, ఇట్టి బుద్ధిని వికాసము గావించుటకు విద్యా బోధకుల నేర్పరచుట- ఇట్టి సమస్త కార్యములు కారుణ్యమే కామముగ కన్నుల నుండే సృష్టించును. జీవులకు కూడ వృద్ధి చెందుటకు వలసిన కామము నేర్పరచును. ఇట్లు జీవుల కొరకే సర్వమును నిర్వర్తించును.

ఈ నిర్వహణ మంతయూ కన్నుల నుండి ప్రసరించు కాంతితో

నిర్వర్తించును కనుక ఆమె లోలాక్షీ అని కీర్తింపబడుచున్నది. 'లోల' మనగా పూర్ణ కామము. ఇంద్రియలోలురు ఇంద్రియముల ద్వారా ఇంద్రియార్థముల యందు పరవశము చెందినట్లు దైవలోలురు దైవము నందట్లే తన్మయము చెందుదురు. లోలత్వము దివ్యగుణము. దేనిపై లోలత్వము కలిగిన అది సిద్ధించును. అట్లే ఆత్మకాములు ఆత్మ మూలము నందు లోలత్వము కలిగి యుండుటయే ధ్యానము. అట్టి ధ్యానమున వారు పరమును పొందుచున్నారు. ఇట్లు దేహము నుండి దైవము వరకు గల సమస్త లోకములందు జీవులు వారి ఆసక్తి కోరికలను బట్టి తిరుగుచు నున్నారు. వసించు చున్నారు. ఇట్లు సృష్టి లోలత్వము నుండి పరలోకము వరకు అన్ని శ్రేణులయందు జీవులు వసించుచు, వున్న శ్రేణి నుండి పై శ్రేణికి కృషి సలుపుచుందురు. లోలాక్షము ద్వారా అట్టి గమ్యములను చేరుచుందురు. జీవులు వారి దృష్టి ననుసరించి పురోగమించుటయో, తిరోగమించుటయో చేయుదురు. స్వభావమును బట్టి దృష్టి యుండును. స్వభావమును సంస్కరించుకొనుచు ఉత్తమమగు దృష్టి సారించి ఊర్ధ్వలోకములను చేరుట మానవుల కర్తవ్యము. ఇట్లు క్రమముగ లోకానుభవమును పొందుచు పరమునకు సాగుటలో క్రమముక్తి, పూర్ణానుభవము యేర్పడును. ఇట్లు లోలాక్షి జీవుల ఉద్ధారణకు జీవుల వెలుపల, లోపల కూడ కృషి సలుపుచున్నది.



# 453. 'కామరూపిణీ'

**మ**న్మథుని రూపమున వున్నది శ్రీమాత అని అర్థము.

మన్మథునికి కాముడని పేరు కూడ కలదు. మన్మథ తత్త్వమే లేనిచో సృష్టియందు భోగము యోగము లేదు. అనుభూతి లేదు. అనుభూతి లేనపుడు ఆనందమునూ లేదు. అనుభూతి, ఆనందము, వైభవము, వైభోగము, యోగము, దివ్యానందము ఇత్యాది అంశము లన్నియూ మన్మథత్వము వలన కలుగుచున్నవి. కోరిక వలన కలుగు చున్నవి. ఇట్టి కోరిక రూపమున శ్రీమాతయే అవతరించి యుండును.

కోరిక లుండరాదనుట అజ్ఞానము. కోరికే లేనిచో దివ్య కార్యములు జరుగవు. సృష్టికార్యము జరుగదు. రక్షణ పోషణ జరుగదు. కోరిక లేనిచో జ్ఞాన మెట్లు కలుగును? జ్ఞానము నందు కోరిక వున్నప్పుడే జ్ఞానము నార్జించుట జరుగును. ఇచ్ఛ కారణముగనే జ్ఞానము, క్రియ జరుగుచున్నవి. ఇచ్ఛ కారణముగనే జీవుడు ఇహమును పరమును అనుభూతి చెందుచున్నాడు. కేవలము అచేతనమే ఇచ్ఛ లేనిదియై యుండును. ఇచ్ఛా లేమి నిర్బీజ నిర్వికల్ప సమాధి వంటిది. అది ప్రజ్ఞ స్థితియందు ఇమిడిపోయిన స్థితి. రాయి రప్ప అట్లుండును. శివుడు కూడ అట్లే యుండును. ఈ నడుమ జరుగు నాటకమంతయు కామ స్వరూపమే.

కామము దివ్య కామమై వుండవచ్చును. ఆసురమై యుండ

వచ్చును. సత్యకామమై యుండవచ్చును. కామమే సృష్టిని, జీవులను నడిపించు చున్నది. కోటానుకోట్ల జీవులు నిత్యము కదులుటకు కారణము కామమే. కామము లేనిదే చలనము లేదు. చలనము లేనిదే సృష్టి లేదు. ఇట్టి తత్త్వమునకు అధిదేవత శ్రీమాత అని తెలియ వలెను.

కామశక్తిని ఎట్లు వినియోగించిన ఫలితము లట్లుండును. సుఖ-దుఃఖములకు, లాభ - నష్టములకు, ఉన్నతి - పతనములకు కామమే కారణము. జీవుడు సృష్టియందు ఆరోహణము చెందుటకు, అవరోహ ణము చెందుటకు కామమే కారణము. శివుని చేరుటకు కూడ కామమే సాధనము. శ్రీమాత శివకామినియై శివుని చేరినది. సృష్టికామినియై సృష్టిని నిర్మించినది. కామమును మించిన సాధనము లేదు.



# 454. 'మాలినీ'

**మా**లారూపము గలది శ్రీమాత అని అర్థము.

మాల అనగా పుష్పముల దండ. పుష్పములన్నియూ సూత్రముచే దండగా యేర్పడి యుండును. దండయందలి సూత్రము (దారము) గోచరింపదు. దండయే గోచరించును. అట్లే సృష్టి యందలి అల్లిక జరుగుచున్నది. ఏడు లోకముల సృష్టి ఒక దండవలె ఏర్పడుటకు అందనుస్యూతముగ, అదృశ్యముగ ప్రవహించుచున్న శ్రీమాత చైతన్యమే ఆధారమై యున్నది. జీవుల యందు సప్త ప్రజ్ఞా కేంద్రములు దండవలె ఏర్పడుటకు కారణము చైతన్య స్రవంతియే. దారము లేనపుడు పుష్పము లెట్లు విడిపోవునో అట్లే సృష్ట అల్లిక కూడ శ్రీచైతన్యమే ఆధారముగ నిలచి యున్నది. సూర్యమండలమందు గ్రహములు కూడ అట్లే కట్టుగ నున్నవి. వృక్షమునందు వ్రేళ్ళు మొదలుకొని ఆకుల వరకు అన్నియూ కట్టుగ నుండుటకు కారణము మాలినీ చైతన్యమే.

'అ' నుండి 'క్ష' వరకు గల అక్షరము లన్నియు నొక అక్షర మాలికగ ఒకే శబ్దము వివిధత్వము చెందియున్నది. దానిని 'అక్షర మాల' అని, 'వర్ణమాల' అని అందురు. అట్లే అన్ని వర్ణములు (రంగులు) సూర్యుని వెలుగు ఆధారముగనే నిలచియున్నవి.

***'సూత్రే మణిగణా ఇవ'*** అని భగవద్గీత మాలినీ తత్త్వమును ఆవిష్కరించుచున్నది. నేను మణిమాల యందు సూత్రమువంటి వాడను

అని శ్రీకృష్ణుడు తెలిపినాడు. జీవుని యందుకూడ దైవము నుండి భౌతిక పదార్థము వరకు దశ స్థితులు కూడి యుండుటకు మాలినీ శక్తియే ఆధారము. మాలిని లోపించినచో కూడిక యుండదు, కూర్పు యుండదు.

ఆధ్యు డున్నచోట అందరునూ ఘనులే. ఆధ్యు డదృశ్యమైనచో ఎవ్వరునూ గుర్తింపబడరు. శ్రీమాత మాలినీ చైతన్యముగ సంపూర్ణముగ నున్నప్పుడే దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము, త్రిగుణములు, జీవుడు, దేవుడు చక్కని కూర్పు కలిగియుందురు. ఇంటి యందు యజమాని వున్నప్పుడే ఇంటివారు ఒక మాటపై నడతురు. సద్గురువు వున్నచోటనే అనుయాయులు అన్యోన్యముగ నుందురు. ఇట్టి సామరస్యము మాలినీ చైతన్యము కారణముగ యేర్పడును.

కుటుంబములు విడిపోవుటకు, దాంపత్య జీవితములు చెడి పోవుటకు, రాష్ట్రములు ముక్కలు, చెక్కలుగ విభజింపబడుటకు, దేశము లందు ఒకరియం దొకరికి సామరస్యము లేకుండుటకు, కులభేదము లకు, మత భేదములకు, జాతి భేదములకు కారణము శ్రీమాత మాలినీ తత్త్వము నామమాత్రముగ నుండుటయే. మాలిని యున్నచోట కూడిక, కూర్పు, సామరస్యము, ఆనందము, అనుభూతి, వైభవము యుండును. మాలినీ దర్శనమైన సత్పురుషులు కూర్పు చేయుదురు. సామరస్యము నందింతురు. ఆనందమును ప్రసరింతురు. అనుభూతి, వైభవము కలిగింతురు. అట్టి వారి వలనే జీవులు సుఖ పడుదురు.

# 455. 'హంసినీ'

**అ**జపా మంత్రమగు హంస స్వరూపము శ్రీమాత అని అర్థము.

అజపా మంత్ర మనగా జపింపకయే జరుగు మంత్రము. మనయందు హృదయ స్పందనముగ అను నిత్యము అజపా మంత్రము అనుస్యూతముగ జరుగుచున్నది. ఈ హృదయ స్పందన హంస అని కీర్తింపబడుచున్నది. స్పందనముగ యున్నది శ్రీమాతయే గనుక హంసినీ అని పిలువబడుచున్నది. హంసినీ కారణముగ స్పందనము జరుగు చున్నది. స్పందనము కారణముగ శ్వాస జరుగుచున్నది. ఈ రెండునూ కారణముగ శరీరమున ప్రాణము నిలచియున్నది. శ్వాస, స్పందనము, ప్రాణము, ప్రణవము ఒక ఆరోహణ క్రమముగ గమనింపవచ్చును. మనస్సు శ్వాసపై లగ్నము చేసి స్పందనము చేరినచో స్పందనము నుండి ప్రణవమును చేరవచ్చును.

శ్వాస యందలి ఉచ్ఛ్వాసను ఏకాగ్రతతో గమనించినచో 'సో' అను శబ్దము వినిపించును. అట్లే నిశ్వాసను గమనించినచో 'హం' అను శబ్దమును గమనించవచ్చును. మనస్సును ఉచ్ఛ్వాస నిశ్వాసలపై పూర్ణముగ దీర్ఘకాలము లగ్నము కావించినపుడు శ్వాస మూలమైన స్పందనమునకు మనస్సు చేరును. ఇట్లు చేరుటను అంతర్ముఖ మగుట అందురు. మనస్సు ఇట్లు అంతర్ముఖమైనపుడు స్పందనము కూడ ద్వయాక్షర మంత్రమగు 'సోఽహం' అను మంత్రమును శబ్దించు

చున్నట్లుగ కనిపించును. శ్వాస శబ్దము, స్పందన శబ్దము సోఽహం. 'సో' అనినపుడు వ్యాకోచము చెందుట, 'హం' అనునపుడు సంకోచము చెందుట గమనింపవచ్చును. ఇచ్చుట అనుట అనగా జరుగుటయే. స్పందనము సంకోచ వ్యాకోచ ప్రజ్ఞ. దాని ననుసరించియే శ్వాస కూడ సంకోచ వ్యాకోచమై జరుగుచున్నది. స్పందన మందలి ఈ సంకోచ వ్యాకోచములను, హంస రెక్కలుగ వర్ణింతురు. సంకోచ వ్యాకోచములతో కూడిన 'హంస' శబ్దము సోఽహం. దీనిని నిర్వర్తించు ప్రజ్ఞ హంస అని కీర్తించిరి. హంసయే హంసిని. హంసిని ప్రణవము కాగ దాని రెక్కలు సోఽహం అను శబ్దము చేయును. ఇట్లు ప్రతి జీవుడును ఒక హంస స్వరూపుడే.

హంస స్వరూపుడుగా జీవుడు ప్రణవము. అతడాడించు రెక్కలు సోఽహం అను శబ్దమును చేయును. ఇది ప్రతి జీవుని యందు జరుగుచున్నది గాని జీవుడు చేయుచున్నది కాదు. ఇట్లు జరుగుటకు శ్రీమాత అస్థిత్వమే కారణము. కనుక ఆమెయే హంసిని. ఈ హంసినీ స్వరూపము తెలిసినవారు అందు స్థిరపడినపుడు పరమహంసయై యుందురు.

హంస, సోఽహం, సింహ, హింస అన్నవి ఒకే తత్త్వము యొక్క రూపాంతరములు. దీని వివరములు అంతర్దర్శన ధ్యానము నందు లభింపగలవు.

# 456. 'మాతా'

సర్వమునకు తల్లి అని అర్థము.

అనంతమైన తత్త్వమునకు ఆవరణ లేర్పరచుచు ఏకత్వమున అనేకత్వము నేర్పరచునది శ్రీమాత. ఒకే మట్టి నుండి పెద్ద పెద్ద విగ్రహములు, అంతకన్న చిన్నవి, అంతకన్న చిన్నవి ఏర్పరచినట్లుగ, ఏడు లోకములను అందు జీవులను ఏర్పాటు చేయును. మహత్తు నుండి అణువు వరకు కోటానుకోట్ల రూపములను తయారుచేయును. ఇవన్నియు తత్త్వ మాధారముగనే నిర్మించును.

ఒక చోటులో ఒక పెద్ద ఇల్లు ఏర్పాటు చేసి అందులో ఏడు గదులు పెద్దవి, చిన్నవి ఏర్పరచినపుడు అవి ఏడు చోటులుగా అని పించును. పెద్దగది, చిన్నగది అని పిలుతుము. చోటుకు పెద్ద చిన్న లేదు. గది ఆవరణను బట్టి పెద్ద చిన్న ఏర్పడును. ఇట్లే లోకములు, జీవులు రూప పరిమాణమును బట్టి పెద్దవి, చిన్నవి, గొప్పవి, తక్కువవి యేర్పడును. తత్త్వము అన్ని జీవుల యందు ఒక్కటియే. శక్తి మాత్రము వేర్వేరుగ నుండును. ఇట్లు చీమ నుండి దోమ వరకు కోటానుకోట్ల జీవులు శ్రీమాత నుండి యేర్పడుచున్నవి. ఇట్లు వివిధమైన కొలతలతో వివిధమగు లోకములను, జీవులను యేర్పరచుట వలన మాత అని పిలువబడుచున్నది. కొలమానమును ధరించునది గనుక మాత. ఎలుక యందు, ఏనుగు నందు తత్త్వ మొక్కటియే. శక్తి మాత్రము వేరై యుండును. తత్త్వపరముగ అంతయూ సమానమని తెలియుట,

శక్తిపరముగ వైవిధ్యమున్నదని తెలియుట పూర్ణజ్ఞానము. జీవులు ఒకరినొకరు గుర్తించుటకు వైవిధ్య మవసరము. ఆ వైవిధ్యము శక్తి, రూపముల పరముగ నుండును.

అందరూ సమానమే అను వాక్యము తత్త్వపరముగ సత్యమేగాని, శక్తి సామర్థ్యముల పరముగ సత్యము కాదు. సృష్టి యందు ఏకత్వము భిన్నత్వము ఏకకాలమున దర్శించుట సరియగు జ్ఞానము. అట్టి జ్ఞానము లేనివారు పొరపాటు పడుదురు.



# 457. 'మలయాచల వాసినీ'

**మ**లయాచలమందు వసించునది శ్రీమాత అని అర్థము.

'మలయాచల' మనగా గంధపు చెట్లతోకూడిన పర్వతము. గంధపు చెక్క అన్న శ్రీమాత కత్యంత ప్రియము. శ్రీమాత గంధప్రియ అని ముందు నామములో తెలుపబడినది. కనుక గంధపుచెట్లు ఏ ప్రాంతమున నుండునో అచ్చట విశేషముగ సాన్నిధ్య మిచ్చుచుండును. గంధ ధారణము, గంధపు చెక్కను వద్ద నుంచుకొనుట, గంధముతో పూజించుట యిత్యాదివి అనుగ్రహ కారణములు. గంధవనమే యేర్పరచినచో శ్రీమాత విశేషముగ ఆనందించును. మరి గంధపు చెట్ల పర్వతమే యున్నచో ఎట్లుండును? వివరింప నలవిగాని ఆనందము శ్రీమాతకు కలుగును.

భారతదేశమున మలయ పర్వతములు నైఋతి దిశయందున్నవి. ఈ కారణముగనే ఆ ప్రాంతము మలయాలయము అని ప్రసిద్ధి గాంచినది. మలయాలయమే కాలక్రమమున మళయాళ దేశమైనది. అందలి పర్వత శ్రేణులలో శ్రీమాత ముఖాంబికగా వెలసియున్నది. ఆమెను మూకాంబిక అని పిలుతురు. ఆమె ముఖ దర్శనము అత్యంత రమణీయముగ నుండును.

భరతభూమి యందు గల శక్తి పీఠములలో ముఖాంబికా పీఠము అత్యంత శక్తివంతమైనది. శ్రీమాత ముఖతత్త్వము ఈ పర్వతశ్రేణులలో

యుండుట విశేషము. ఆదిశంకరుల జన్మస్థానము కూడ ఈ ప్రాంతముననే యున్నది. శంకరుడు ముఖాంబిక అనుగ్రహముననే భరత భూమియందు ఆర్ష సంప్రదాయమును కలియుగమున సుస్థిరము గావించినారు.



# 458. 'సుముఖీ'

**మం**చి ముఖము కలది శ్రీమాత అని అర్థము.

మంచి ముఖమనగా నేమి? జ్ఞానముచే ప్రకాశించు ముఖమే సుముఖము. ఆ ముఖము సర్వశుభములకు కారణమై యున్నది. అదే శోభనమగు ముఖము. జ్ఞానము కలవారి ముఖము ప్రకాశవంతమై యుండును. ఆ ప్రకాశము ఆకర్షణీయముగ నుండును. వారి కన్నులు, నవ్వు అత్యంత ఆకర్షణీయముగ వుండును. ఆ ముఖమును చూడగనే చూపరులకు ప్రకోపములన్నియూ ఉపశమించును. ప్రశాంతత కలుగును. ప్రసన్నమగు ముఖమై యుండుటచే ధ్యానమున కుపక రించును. ఇచ్చట జ్ఞానముఖ మనగా ఇచ్ఛా జ్ఞాన క్రియల సమ్మేళనము కలిగిన ముఖమని తెలియవలెను. ఇట్టి ముఖారాధన జీవుల ఉద్ధారణకు ఎంతయో ఉపకరించును.

శ్రీమాత ముఖము సృష్టి యందలి సమస్త జ్ఞానమునకు, శోభనమునకు (ఆనందముతో కూడిన వైభవము), అందమునకు, ఆకర్షణకు ప్రతీక. శ్రీమాత ముఖ దర్శనము దర్శనములలోకెల్ల పరాకాష్ఠ. మళయాళ దేశమున గల ముఖాంబిక (మూకాంబిక) ఇట్టి సుముఖియే అని తెలియవలెను.

శ్రీమాత ముఖము పై తెలిపిన అందముతో పాటు ఈ క్రింది విశేషములు కూడ కలిగి యుండును.

1) ముఖమున మహారాణి దర్పముండును.

2) ఎఱుపు, పసుపుతో కూడిన ప్రకాశముతో ముఖము మెరయుచుండును.

3) ఉదయించుచున్న సూర్య బింబమువలె యుండును.

4) దేవతలను, ధర్మమును, సత్పురుషులను అనుగ్రహించుచున్నట్లుగ గోచరించును.

5) అసురులకు జ్వాలారూపమై గోచరించును.

6) భక్తుల కోర్కెలను తీర్చుచున్నట్లుగ, భయమును పోగొట్టుచున్నట్లుగ ఆమె కన్నులు గోచరించును.

7) ముంగురులు సువాసనలు వెదజల్లుచు నుండును.

8) ఫాలము విశాలమై యుండును. కస్తూరి తిలకము దిద్దబడి యుండును.

9) కనుబొమలు అందముగ నమర్చిన తోరణములవలె యుండును.

10) కన్నులు విశాలము, కాంతివంతము అగు మీనములవలె యుండును.

11) నాసిక సంపెంగ మొగ్గవలె యుండును.

12) పెదవులు దొండపండ్లవలె ఎఱుపుదనమును, పగడముల వలె కాంతిని కలిగి యుండును.

13) చెవులు విశాలమై, చెవి తమ్మి స్పష్టముగ వ్రేలాడుచు నుండును.

14) దంతముల వరుస తీరువుగ నుండి కాంతివంతమై నామ మాత్రముగ (చిరునవ్వు కారణముగ) గోచరించుచుండును.

15) చిరునవ్వు ఆకర్షణీయముగ నుండును.

16) గడ్డము, అద్దమువలె ప్రకాశించు ముఖమునకు తొడిమ వలె యుండును.

ధ్యానమున యిట్టి ముఖమును దర్శించుటకు ప్రయత్నించవలెను. దీని కనుగుణమగు చిత్రపటమును పూజయందేర్పరచుకొన వచ్చును.



# 459. 'నళినీ'

శ్రీమాత పద్మ రూపము కలదని అర్థము.

శ్రీమాత పాదములను పాదపద్మము లందురు. హస్తములను హస్త పద్మము లందురు (పద్మహస్త). శ్రీమాత ముఖమును పద్మముతో పోల్చుచూ పద్మముఖి అందురు. కన్నులను పద్మములతో పోల్చుచూ పద్మాక్షీ అందురు. చేతుల యందు పద్మమును ధరించి యుండుట చేతను, అరచేతులు పద్మము వలె కోమలముగ నుండుట వలననూ పద్మ హస్త అందురు. ఆమె పద్మము నుండియే ఉద్భవించినది గనుక పద్మజ అందురు. పద్మమునందే కూర్చుని యుండును గనుక పద్మాసనా అందురు. ఆమెకు పద్మములయందు ప్రియత్వ మెక్కువ కనుక పద్మప్రియ అందురు. ఆమె యుండు ప్రదేశము కూడ పద్మముల నిలయము. అందువలన పద్మాలయా అందురు. ఇన్ని రకములుగ పద్మముతో శ్రీమాతను పోల్చి చెప్పుదురు. అందువలన ఏకముగ పద్మినీ అందురు. నళినీ అనిననూ అదే అర్థము. నాళముతో కూడిన పుష్పమైనది గనుక 'నళినీ' అందురు.

వేదములందు పద్మము నొక విశిష్టమగు చిహ్నముగ పేర్కొందురు. సృష్టిని కూడ ఒక పద్మముగ కీర్తింతురు. సృష్టి కూడ పద్మమువలె గోళము నుండి విచ్చుకొనును. మొగ్గ విచ్చుకొనినట్లు సృష్టి కూడను విచ్చుకొనును. నవావరణములతో విచ్చుకొన్న అద్భుత

మగు పద్మముల సృష్టిని ఋషులు దర్శించు చుందురు. సృష్టి కూడ పద్మమువలె కాంతివంతమై యున్నది. నవావరణములు నవ విధమగు వర్ణములు కలిగి యుండును. పద్మనాళమువలె సృష్టినాళము నుండి పద్మ ముద్భవించినది. ఈ నాళము పరతత్త్వము నుండి కలిగిన ప్రేరణ. అవ్యక్తము నుండి వ్యక్తమునకు గల మార్గము లేక బిలము. ఈ నాళము శ్రీమాతయే. దీనిని నిర్గుణ మందురు. పరబ్రహ్మమునకు, సగుణ బ్రహ్మమునకు నడుమ నిర్గుణ బ్రహ్మమున్నదని పెద్దలు పలుకుదురు. ఇందు పదు నాలుగు స్థితులున్నట్లుగ పరమ గురువు మాస్టర్ సి.వి.వి. వివరించినారు. తల్లి నుండి బిడ్డకు యేర్పడు సంబంధమిది. అన్నింటినీ అనుసంధాన మొనర్చు తత్త్వము. ఇట్టి సృష్టి నాళము శ్రీమాత గనుక నళినీ అని పిలుతురు.

నల మహారాజుచే ఆరాధింపబడిన దేవి అగుటచే శ్రీమాతను నళిని అనుట కూడ కద్దు. నలుడు యుధిష్ఠిరుని వలె ధర్మమూర్తి. అతడు శ్రీమాత భక్తుడు. శ్రీమాత ఆరాధనమున నిలచి కష్టనష్టములను ఓర్పుతో భరించి, కృతకృత్యుడై శాశ్వతమగు యశోకీర్తులను పొందెను. శాశ్వత దివ్యమూర్తియై నిలచెను.



# 460. 'సుభ్రూ'

**మం**గళకరమైన కన్నులు కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత కనుబొమలు మంగళతోరణములై గోచరించును. తోరణముల నడుమ 'శ్రీ' బిందువుగ నుండును. కుడి ఎడమ తోరణములు సరిసమానముగ ఏర్పడి యున్నప్పుడు భ్రూమధ్యము వికసించబోవు పద్మము మొగ్గవలె యుండును. కుడి, ఎడమ తోరణములు ఇడ, పింగళ నాడులను సంకేతించును. కనుబొమల ఉత్తర భాగమునందు ఫాలమున ఇడ, పింగళ కేంద్రము లున్నవి. ఇవి ప్రజ్ఞ పదార్థములకు ఉత్పత్తి కేంద్రములు, ఈ రెండునూ సమప్రభతో నున్నప్పుడు భ్రూమధ్యము వెలుగు మొగ్గయై గోచరించును. ఆ వెలుగు చీకటులను పారద్రోలును. అజ్ఞానమును దరి చేరనీయదు. అత్యంత శక్తివంతముగను, ఆకర్షణీయముగను వుండును. మంగళప్రదమై యుండును. సర్వశుభములకు కారణమై యుండును.

భ్రూమధ్యమును, కనుబొమలను తీరువుగ నుంచుకొనుట భక్తులకు కర్తవ్యమై యున్నది. కుంకుమ, గంధము, విభూతి అలంకరించుకొనుట విధియై యున్నది. భ్రూమధ్యముయొక్క తేజమును బట్టియే జీవునికి తనపైనను, పరిసరముల పైనను గల స్వామిత్వము తెలియ గలదు. దైవధ్యానమునకు భ్రూమధ్యము ఉత్తమ స్థానము. భ్రూమధ్యమున మనస్సు లగ్నము చేయుట వలన దివ్య దర్శనములకు

అవకాశము మెండుగ నుండును. రెండు కనుబొమలు రెండు కొండలుగ నడుమ నుండి వచ్చు సూర్య చంద్రాత్మకమగు కాంతిగ భక్తులు దర్శించి ఆనందమును పొందుదురు. ఇట్టి కాంతి దర్శనము మంగళప్రదము. నిత్యమూ ఇట్టి కాంతిని దర్శించుటకే గాయత్ర్యాది జప ధ్యానములు. తనయం దుదయించుచున్న ఈ కాంతిని నిత్యమూ దర్శించువారు తేజోవంతులై, యశోవంతులై, కీర్తివంతులై జీవింతురు. రెండు కొండల నడిమి లోయలోని ఆకాశముగ తదేక దృష్టితో దర్శించినపుడు యిట్టి కాంతి దర్శనము జరుగుటకు అవకాశమున్నది. ఆరాధనా మార్గమున జీవతత్త్వమును కూడిక చేసుకొని మనసును పూర్ణముగ యిచ్చట నిలిపి తేజోవంతమగు శ్రీమాత దర్శనమునకు అచటనే వేచి యుండుట నిత్యమూ భక్తులు నిర్వహించవలసిన కార్యము. భక్తి పూర్వకమగు ఆరాధనము జరిగిన వెనుక కన్నులు మూసుకొని భ్రూమధ్యమున లేచియుండుట నేర్వవలెను. త్రికరణశుద్ధిగ యిట్లు నిర్వర్తించు వారికి దర్శన స్పర్శన భాషణాదులు అనుగ్రహముగ లభింపగలవు. వేణు గానము వినిపింప గలదు. అది ప్రణవనాదమై జీవుని అంతరాళము లోనికి గొనిపోగలదు.

తోరణములు ప్రవేశ ద్వారము వద్ద కట్టుట ఆచారము. దీని రహస్యము తెలియుట ప్రధానము. కనుబొమలు తోరణములుగ సంకేతింపబడినపుడు భ్రూమధ్యము ఒక ప్రవేశ ద్వారమని తెలియ వలెను. ప్రవేశ ద్వారమందలి కాంతితో ఆనందము పొందిన భక్తుడు ఆ కాంతి ద్వారమున లోన కేగినచో తారకాది వ్యూహములతో కూడిన

అనంతము, సత్యము దర్శనమగును. ***"హిరణ్మయేనపాత్రేణ"*** అనుచు భ్రూమధ్యపు కాంతిని సూర్యబింబముతో పోల్చుచూ, బింబము దాని వెనుక గలిగిన సత్యమును కప్పి యుంచినదని గ్రహించి ఆ కప్పు (మూత) తీయుటకు, పరమును చేరుటకు యోగులు, భక్తులు ప్రయత్నింతురు. ఇచట ప్రయత్న మనగా ఆరాధనమే. ఇట్టి ఆరాధనము ద్వారా సత్యకాములకు సత్యదర్శన మగుచుండును. అపుడు బ్రహ్మమే తానుగ నున్నాడని తెలియును. పరితృప్తి చెందును.

శ్రీమాత మంగళకరమగు 'సుభ్రూ' నామము లోతులు తెలియ లేనివి. ఇందు మునిగి తేలినవారు సుబ్రహ్మణ్యులు.



# 461. 'శోభనా'

**శో**భనము కలిగించునది శ్రీమాత అని అర్థము.

సత్సంపద, సదానందము, సుఖము, సౌకర్యము, దివ్యానుభూతి ఎచ్చట కూడియుండునో అచ్చట శోభ యుండును. శోభనము దివ్య సంపద. అట్టి సంపద వలన దుఃఖము కలుగదు. ధర్మాచరణపరులగు విద్యావంతులు, శ్రీమంతులు కూడ యైయున్నప్పుడు అట్టివారి జీవితము శోభనామయముగ నుండును. రాజర్షులందరు యిట్టి శోభతో వెలుగొందు చుందురు. అట్టి వారిలో ప్రప్రథముడు అంబరీషుడు. జనకుడు, పరీక్షిత్తు అట్టివారు. వారి వైభవము దివ్య వైభవము. వారు దివ్య జ్ఞానమున జీవించి తరించిరి. దైవము యొక్క శక్తి సామర్థ్యములు వారి నుండి భాసించుటయేగాక దివ్యవైభవము కూడ వారి నావరించి యుండెడిది. ఇటీవలి కాలమున గౌతమీపుత్ర శాతకర్ణి, కృష్ణదేవరాయలు అట్టి వైభవముతో జీవించిరి. కవులలో కాళిదాసు మహాకవి అట్టివాడు. వీరందరునూ రాజర్షులే.

ధర్మాచరణము, జ్ఞానము, దక్షత, ధీరత్వము ఇవి అన్నియూ దివ్య సంపదతో కూడియున్నప్పుడు జీవిత మన్ని రంగముల యందును పరితుష్టితో సాగును. జ్యోతిషమున గురుడు, శుక్రుడు, చంద్రుడు, ఇంద్రుడు జాతకుని శుభదృష్టితో చూచునపుడు ఇట్టి వైభవము కలుగునని తెలుపుదురు. విద్యాబలము నిచ్చువాడు గురుడు. సత్సంపదకు కూడ

గురుడే అధిపతి. సుఖమునకు శుక్రుడు అధిపతి. వైభవమునకు ఇంద్రుడు అధిపతి. సాధుశీలమునకు చంద్రుడు అధిపతి. ఇట్లు సాధుత్వముతో కూడిన విద్యావంతులు పై గ్రహముల దృష్టి బలమున వైభవముతో జీవింతురు.

పై తెలిపిన కవులు, యోగులు, రాజర్షులు అందరునూ శ్రీమాత భక్తులే. శ్రీమాత నారాధించువారు సాధుజీవనము సాగించుచు ధర్మాచరణమునకు కట్టుపడి కర్తవ్యమున దీక్షాపరులై నిలచినపుడు శ్రీమాత లక్ష్మి, సరస్వతీ తత్త్వములను వారియందు అనుగ్రహించును. లక్ష్మీ సరస్వతి కూడియుండుట వలన యిట్టి వైభవము కలుగును. సామాన్యముగ సంపద యున్నచోట విద్య యుండదు. విద్య యున్న చోట సంపద యుండదు. సుఖముతో కూడి పై రెండునూ వున్నప్పుడు జీవితము శోభనము అగును.



# 462. 'సురనాయికా'

శ్రీమాత దేవతలకు నాయకురాలు అని అర్థము.

'సుర' లనగా దేవతా ప్రజ్ఞలు, వెలుగుతో కూడిన ప్రజ్ఞలు. ఈ ప్రజ్ఞలు కారణముగనే జీవుడు సుఖపడగలడు. సుఖము, ఆనందము, వికాసము, జ్ఞానము, వైభవము, ప్రశాంతత, దివ్యనుభూతి, దివ్య జ్ఞానము, దివ్యశక్తి, దివ్యశరీరము- యిట్టి శుభ గుణములన్నియూ వెలుగు రూపములైన దేవతల అధీనమున శ్రీమాత యుంచినది. శ్రీదేవి కార్యమే దేవతా కార్యము. వారు యజ్ఞస్వరూపులు. వారి జీవనము యజ్ఞార్థ జీవనము. వారు సహజముగ సాత్త్వికులు. ఇట్టి వారిని నడిపించునది శ్రీమాతయే. వారికి నాయకత్వము వహించి నడిపించు చుండును.

శ్రీమాత నారాధించు భక్తులయందు, సత్త్వగుణోపేతమైన దేవతలు మేల్కొంచి వారిని నడిపింతురు. వారికి శ్రేయస్సు, రక్షణ కలిగింతురు. సత్సంకల్పములను స్ఫురింపచేయుదురు. సదాచారమునకు ప్రేరణ నిత్తురు. వికాసము కలిగించుచూ జ్ఞాన మార్గమున నడిపింతురు. శ్రీమాత ఆరాధనము సకల దేవతా ఆరాధనమని తెలియవలెను.

సుర ప్రజ్ఞలన్నియూ సూక్ష్మమగు ప్రజ్ఞలు. సహజమైన వెలుగుతో కూడిన ప్రజ్ఞలు. సత్త్వగుణము ప్రధానముగా గల ప్రజ్ఞలు. అసుర ప్రజ్ఞలు స్థూల ప్రజ్ఞలు. రజస్తమో గుణములు ప్రధానముగా గల ప్రజ్ఞలు. రజస్తమో గుణముల యందు ఆక్రమణ గుణములు సహజ ముగా నుండును. పదార్థమయమగు ఈ ప్రజ్ఞలు నిత్యమూ సూక్ష్మము,

సాధు వర్తనము గల సుర ప్రజ్ఞలను ఆక్రమించుట, హింసించుట, చేయుచు నుండును. దేహము అసుర ప్రజ్ఞలతోను, అందు పనిచేయు ప్రజ్ఞలు సురప్రజ్ఞలతోను నిండియుండును. దేహాత్మ భావనగల జీవుని యందు సహజముగ అసుర ప్రజ్ఞలే ఎక్కువగ వర్తించు చుండును. వారి యందలి సుర ప్రజ్ఞలు మేల్కాంచి జీవునికి వికాసము కలిగించవలె నన్నచో శ్రీమాత నారాధించుట నిజమగు ఉపాయము. దైవమును ఆరాధన చేయని వారియందు స్థూల ప్రజ్ఞలే మెండుగ బలము కలిగి యుండును. పురాణములందు తెలుపబడిన దేవాసుర యుద్ధము లన్నియూ జీవునియందు నిత్యమూ సాగుచునే యున్నవి. జ్ఞానము, అజ్ఞానముల ఘర్షణముల నుండి జీవుడు ఉత్తీర్ణుడగుటకు దేవతారా ధనము ప్రధానము. అంతర్యామి యగు దైవము నిత్యమారాధించు వారియందు దేవతా ప్రజ్ఞలు క్రమముగ మేల్కాంచి అసుర ప్రజ్ఞలను హద్దులలో నుంచును. అసుర ప్రజ్ఞలు హద్దు మీరక యుండుటకు కూడ ఆరాధనము ప్రాథమికముగ ఉపకరించును. ఆరాధనము లోతుగ అనునిత్యము సాగునపుడు దేవతా సహకారము లభించును. అపుడు జీవుడు దేహమున దివ్య వైభవముతో జీవించ గలడు. అట్లుకాక దేహబద్ధుడైనపుడు అనేకానేక దుఃఖములకు గురి యగును. కావున సురనాయిక అగు శ్రీమాత నారాధించుట వలన అసుర ప్రజ్ఞలు హద్దులలో నుండును. సుర ప్రజ్ఞలు స్ఫూర్తి నిచ్చి జీవునికి సహక రించుచూ దివ్య లోకానుభవము కలిగించును.

అసురులు, సురలు కూడ శ్రీమాత సంతానమే. ఆమెకు ఇరువురునూ సమానమే. కాని అసురులు హద్దులు మీరకుండుట కొఱకై సురలకు నాయికగ నిలచును. అందులకే ఆమె సురనాయిక.

# 463. 'కాలకంఠి'

**కా**లకంఠుడైన శివుని భార్య శ్రీమాత అని అర్థము.

లోకశ్రేయస్సునకై సకలదేవతా సంఘములు, ఋషి సంఘములు చూచుచుండగ శివుడు అతి ఘోరమైన కాలకూట విషమును త్రాగి దానిని కంఠమున నిబద్ధము చేసెను. తన కుక్షిలోనికి జారకుండ నిలిపి యుంచెను. ఇదియొక అద్భుత కార్యము. శివునికే సాధ్యమగు విషయము. అట్టి శివుని భార్య గనుక శ్రీమాత కాలకంఠి అయినది. కాలము గ్రక్కు విషమునకు హరింపబడకుండుటకు జీవులు కాలకంఠి నామమును జపించుట క్షేమము. జీవుల ఆపదలను గమనించు తల్లి ప్రార్థనను త్వరితముగ గ్రహించి అనుగ్రహించును. కలికాలమున సాధుజనులకు ఆపదలు తరచుగ కలుగుచునే యుండును కదా! వారిపై కాలము ద్వేషము, ద్రోహము అను విషమును క్రక్కకుండుటకు కాలకంఠీ దేవి ఆరాధనము ఉపాయముగ చెప్పబడినది. గడ్డుకాలమునందు భక్తులకీ నామము సంపూర్ణమగు రక్షణ నిచ్చును.

దారుకాసురుని చంపుటకు శివుడు కాళి, కాలకంఠి, కపర్ది అను మూడు శక్తి రూపములను సృష్టించెను. ఆ ముగ్గురునూ కలసి దారుకాసురుని సంహరించిరి. ఇట్లు కాలకంఠి అవతారము శ్రీమాత దాల్చిన సందర్భము కలదు.

నల్లని కంఠమును కూడ కాలకంఠ మందురు. అట్లే మంజులమైన

ధ్వనిని కలిగించు కంఠమును కలకంఠి, కాలకంఠి అందురు. శ్రీమాత స్వరము కంఠము నుండి మంజులమై వినిపించునని మరియొక అర్థ మున్నది. మృదు భాషణము మంజులము. సత్యముతో కూడిన మృదు భాషణము చేయువారు శ్రీమాత అనుగ్రహము గలవారే. వారి భాషణము శ్రోతలకు ఆనందమును, వికాసమును కలిగించును. సత్పురుషుల కంఠమున శ్రీమాత కలకంఠిగ అవతరించి యుండును. అట్లే మధుర గాయకుల కంఠమున కూడ వసించి యుండును.



# 464. 'కాంతిమతి'

**కాం**తియే మతిగా కలది శ్రీమాత అని అర్థము.

మతి అంత కాంతితో నిండుట పూర్ణ దివ్యత్వమునకు సంకేతము. మతి కాంతివంతముగను, కాంతివిహీనముగ కూడ నుండుట కవకాశ కలదు. 'మతి' అనగా మనస్సు. మనస్సు కళాకళలుగ నుండును. అమావాస్య నుండి పౌర్ణమి వరకు అనేక కళలతో మనస్సు చంచలముగ నుండుట సహజము. చంద్రుడే మన మనస్సు అని వేదములు తెలియ జేయుచున్నవి. *"చంద్రమా మనసో జాతః"* అన్నది సూక్తము. చంద్రునికే కళలు వున్నప్పుడు మనస్సునకు కూడ కళలుండును. చంద్రునికే గ్రహణ మున్నప్పుడు మనస్సునకు మాత్రము గ్రహణము పట్టదా?

మనస్సు ప్రధానముగ జీవించువారు మానవులు. మనోకాంతి హెచ్చుతగ్గులతో జీవునికి స్పృహ, నిస్పృహ కలుగుచుండును. ఒక దినమున వున్నట్లు మనస్సు ఇంకొక దినమున నుండదు. అమితోత్సాహము కలిగిన వెనుక అమిత దుఃఖానుభవము కలుగ వచ్చును. ఇట్లు జీవులకు సుఖదుఃఖముల ననుభవింపజేయునది మనస్సే.

దివ్యమున కున్ముఖముకాని మనస్సు ఈ విధముగ సతమత మగుచుండును. నిజముగ చంద్రునికి కళలున్నవా? భూమి జీవుల కట్లు కనిపించును. భూమిపై నున్న మానవులకు చంద్రుని హెచ్చు తగ్గులు, గ్రహణములు గోచరించును. అది భూమికి, చంద్రునికి,

సూర్యునికి గల కోణముపై ఆధారపడి యున్నది. చంద్రు డెప్పుడునూ పూర్ణచంద్రుడే. ఇది తెలియవలెనన్నచో భూమి కక్ష్యను దాటవలెను. భూమి కక్ష్యను దాటిన మానవులకు చంద్రుడు అన్ని దినముల యందు పూర్ణమగు కాంతితోనే గోచరించును. అట్లే పదార్థమయమగు విషయములం దాసక్తి కలిగిన మనస్సునకు కళాకళ లుండును. దివ్యమున కున్ముఖము చెందిన మనస్సునకు పూర్ణకళ యుండును. మనస్సు అద్దము వంటిది. దానిని భూమికి ఉన్ముఖము చేసిన పదార్థమయ రూపము గోచరించును. చెట్టు, పుట్ట, కొండ, కోతి కనిపించును. ఆకాశమునకు అద్దము నున్ముఖము చేసినచో వెలుగే ప్రతిబింబించును. ఆకాశమున విహరించు జీవులు కూడ గోచరించెదరు. ఇట్లు మనసు ఉన్ముఖత్వమును బట్టి కాంతివంతమగుట, కాంతిహీన మగుట జరుగును. యోగీశ్వరులు, పరమహంసలు, సిద్ధులు, దివ్య పురుషులు కాంతిమతులు. ఇక శ్రీమాత కాంతిమతి అనుట యందు ఎట్టి విశేషము లేదు. ఆమె సతతము శివుని యందే యున్నది. ఆమె శాశ్వత కాంతిమతి. ఇతర జీవులు ఆమె అనుగ్రహమున కాంతిమతు లగుచున్నారు.



# 465. 'క్షోభిణీ'

**సం**క్షోభము కలిగించునది శ్రీమాత అని అర్థము.

పరమేశ్వరుని సహితము క్షోభింపజేయునది శ్రీమాత. ఇక జీవుల మాట చెప్పనేల? బ్రహ్మాదులనైననూ క్షోభింపజేయగలదు. ఆమె అనుగ్రహము లేనిచో జీవులకు క్షోభ తప్పదు. తప్పించుకొన వీలు పడదు.

దీర్ఘము, గంభీరము అగు సమాధి యందున్న పరమేశ్వరుని సృష్టికి ఉన్ముఖమగునట్లు శ్రీమాత కలత పరచును. ఇది ఆమె క్షోభిణీ తత్త్వము.

బ్రహ్మర్షి అయిన వశిష్ఠుని, విశ్వామిత్రుని ఆగ్రహము రూపమున క్షోభింప చేసినది. అతని నూరుగురు కుమారులను విశ్వామిత్రుడు సంహరింపగ వశిష్ఠుడు క్షోభ చెంది మరల తపస్సున కుపక్రమించెను. తపస్సు చేయుచున్న విశ్వామిత్ర మహర్షిని మేనక రూపమున క్షోభ కలిగించెను. అట్లే సీత రూపమున రావణుని, రావణుని రూపమున రాముని, కైక రూపమున దశరథుని క్షోభింప చేసినది. ఇట్లు ఎన్ని ఉదాహరణలైన చెప్పవచ్చును. జీవులకు జీవుల రూపముననే క్షోభ కలిగించును. కర్మానుభవము కలిగించుటకు శ్రీమాత క్షోభిణి రూపమున తీరుబడి లేక పనిచేయుచున్న దనిపించును. పీఠ నుండి జగత్పిత వరకందరిని కార్యోన్ముఖులను చేయుచు మత్తు గలవారిని శిక్షించుచు,

ప్రమత్తులైన వారిని మేల్కొలుపుచు, అప్రమత్తులైన వారిని ప్రోత్సహించుచు సృష్టికార్యము జీవుల కొరకు నిర్వర్తించుచుండును.

శ్రీమాత కలత పెట్టుటలోను, కలవర పరచుటలోను, క్షోభ కలిగించుటలోను జీవహితమై యున్నదని తెలియవలెను. ఆమె అందించు శిక్షకూడ శిక్షణ కొఱకే. తల్లి విధించు దండన బిడ్డ బాగు కొఱకే కదా! బిడ్డలకు అప్పుడప్పుడు తల్లి క్షోభ కలిగించినట్లు కనిపించును గాని, నిజమునకు క్షోభ కలిగించదు. అట్లే శ్రీమాత క్షోభ కూడను. ఆమె క్షోభకు ఎవ్వరునూ అతీతులు కారు.



# 466. 'సూక్ష్మరూపిణి'

**సూ**క్ష్మ రూపము గలది శ్రీమాత అని అర్థము. 'సూక్ష్మ'మనగా చిన్నది అని ఒక అర్థము. కన్నులకు కనపడనిది, జ్ఞానము కలవారికే కనబడునది అని మరియొక అర్థము. అజ్ఞానులకు తెలియుటకు వీలు కాని రూపము కలది అని కూడ అర్థము.

సూక్ష్మము కంటే సూక్ష్మమైనటువంటిది శ్రీమాత అణువులోని పరమాణువని కూడ చెప్పబడును. శ్రీమాత విశ్వరూపధారిణి అయిననూ అణురూపమున కూడ యుండునని, అణువులలో అణువై పరమాణువై కూడ యుండునని, అతిచిన్నదైన రూపముకూడ ఆమెదే అని శ్రీమాత భక్తులు గ్రహించవలెను. చీమ, దోమ, ఈగ, పురుగు ఇత్యాది రూపములు కూడ శ్రీమాత రూపములే. అట్లే కనబడు రూపములు, కనపడని రూపములుకూడ శ్రీమాత రూపములే. ఆమె విశ్వరూపిణి, సూక్ష్మరూపిణి.

రూపములు మందముగను, సున్నితముగను గోచరించును. సున్నితమగు రూపములలో మరీ సున్నితమగు రూపము లుండును. అందు పదార్థము తక్కువ, వెలుగెక్కువగ నుండును. ఇట్టి రూపములు కన్నులకు గోచరింపవు. ఋషుల రూపములు, దేవతా రూపములు ఇట్టి రూపములై యున్నవి. ఉదాహరణకు పంచభూతములతో చేయ బడిన రూపములలో పదార్థముతో చేయబడు రూపముకన్న, నీటితో చేయబడిన రూపము సున్నితము. అగ్నిరూపము మరింత సున్నితము. వాయురూపము గోచరింపనంత సున్నితము. ఆకాశరూపము అన్నింటి

కన్న సూక్ష్మముగ నుండును. ఇట్లు రూపములు స్థూలము, సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మతమముగా యుండును.

అవ్యక్తము నుండి వ్యక్తమునకు సృష్టి కొనిరాబడు చున్నప్పుడు ప్రకృతి అష్ట ప్రకృతులుగ సూక్ష్మము నుండి స్థూలమునకు యేర్పడును. ఇది అవరోహణ క్రమము. ఆరోహణ క్రమమున మరల స్థూలము నుండి సూక్ష్మమునకు పరిణామము చెందుచుండును. ఆవిరి నీరు అగుట, నీరు మంచుగడ్డ అగుట, మరల మంచుగడ్డ నీరగుట, నీరు ఆవిరి యగుటగా ప్రకృతి సూక్ష్మము నుండి స్థూలమునకు, స్థూలము నుండి సూక్ష్మమునకు మార్పు చెందుచుండును.

జీవులు దేహధారణము చేయుటకు ముందు సూక్ష్మరూపులే. దేహధారణమున స్థూల రూపులగుదురు. మరల స్థూల దేహములనుండి సూక్ష్మమునకు చనుచుందురు. జీవునకు స్థూలదేహము విడచుటయే యుండును గాని మరణించుట యుండదు. అట్లే నిజమునకు జన్మించుట కూడ యుండును. ఇట్టి జీవ రూపములు కూడ శ్రీమాతయే. శ్రీమాత చేయు ఏడు లోకముల సృష్టిని స్థూలముగను, స్థూల సృష్టిగను, సూక్ష్మ సృష్టిగను, కారణ సృష్టిగను, తదతీతమైన స్థితిగను జ్ఞానులు దర్శింతురు.

సూక్ష్మము, స్థూలమున కాధారము. ఒక పాదము స్థూలమై యుండగ మూడు పాదములు దివ్యమై అమృతమై యున్నవని పురుష సూక్తము కీర్తించును.

# 467. 'వజ్రేశ్వరీ'

**వ**జ్రములతో కూడిన నగలు గలది శ్రీమాత అని అర్థము.

వజ్రము తెల్లని కాంతి. అది సూర్యకాంతి. సూర్యకిరణము లన్నియూ వజ్రములే. అట్టి కాంతితో నున్న దేహము నూహించినచో వజ్రశరీర మనగ యెట్లుండునో తెలియును. అట్టి వజ్ర శరీరము కలిగినదిగ శ్రీమాత మణిమయ ప్రాకారమున గోచరించును. (పాఠకులు 'మణిద్వీప వర్ణనము'ను వివరముగ పఠించినచో కంచు ప్రాకారము నుండి చింతామణి గృహము వరకు గల ప్రాకారము లన్నియూ తెలియును. అందు ఉత్తమ శ్రేణి ప్రాకారములలో వజ్రమణి మయ ప్రాకారము వివరింపబడినది. దీనిని పాఠ్యముగ తెలియవలెను.) ఆమె వజ్ర శరీరమే వజ్రేశ్వరి. అనగా వజ్ర శరీరమును ధరించిన ఈశ్వరి. ఈ శరీరము అభేద్యము. శ్రీ పురమున వజ్రమయ ప్రాకారము కూడ అభేద్యమే. వజ్ర శరీరధారులు అజేయులు. సూర్యోపాసకుడైన ఆంజనేయుడు వజ్ర శరీరధారియై యున్నాడని తెలుపుదురు. వజ్రాంగములతో కూడిన శరీరము కలవాడని, వజ్రాంగుడని అందురు. సూర్యోదయ, సూర్యాస్తమయ కాలమున కాంచనదేహుడుగను, మిగిలిన పగటి కాలము వజ్రదేహుడుగను, రాత్రియందు సూక్ష్మదేహుడుగను హనుమంతుడు గోచరించును. అతడు అష్ట సిద్ధులతో కూడిన యోగీశ్వరుడు.

ఆకాశ శరీరులందరిని కూడ వజ్ర శరీరు లందురు. వీరు

కారణ లోకములను దాటి లోకశ్రేయస్సునకై జీవించి యుందురు. వీరిని శ్వేత ద్వీప వాసులని కూడ అందురు. శ్వేత ద్వీపము వజ్ర ద్వీపమే. ఈ ద్వీపమున పరమహంసలగు ఋషుల గుంపులు వసించి యుందురు. ఇట్టివా రందరికిని ఈశ్వరి శ్రీమాత అని కూడ అర్థ మున్నది.

ఆజ్ఞా కేంద్రము చేరిన మానవునికి ఇట్టి వజ్రశరీరము సిద్ధించు నని యోగము తెలుపును. వీరు తెల్లని సూర్యకాంతివంతమైన శరీరము లతో ఆకాశ గమనము చేయుచు, శిష్టులను రక్షించుచు నుందురు. ఇట్టి వారికి భూః, భువః లోకములందు పూర్ణస్వామిత్వ ముండును. వారు వజ్ర శరీర మాధారముగ అద్భుతమగు కార్యములను నిర్వర్తించు చుందురు. వీరందరునూ వజ్రేశ్వరీదేవికి ప్రీతిపాత్రులు.



# 468. 'వామదేవీ'

**శి**వుని వామ భాగముగా నుండు దేవి అని అర్థము.

ప్రకృతి పురుషు లిరువురునూ శాశ్వతముగ కూడియే యుందురు. సృష్టి యందు, సృష్టికావల కూడ అట్లే యుందురు. వారిరువురూ కలసిన తత్త్వమే దైవము. వారు శివశక్తులని, రాధాకృష్ణులని వర్ణింతురు. వారు కుడి, ఎడమలుగ ఒకే రూపమున వసింతురు. ఎడమ భాగమును సంస్కృతమున వామ భాగమందురు. వామ భాగము ప్రకృతి భాగము. కుడి భాగము పురుష భాగము. ఎడమ భాగమందు వుండు ప్రకృతిని వామదేవి అందురు.

వామదేవి సృష్టి కార్యము నిర్వర్తించును. జీవులకు కర్మానుభవము, కర్మఫలము ఇచ్చునది వామదేవియే. కర్మానుభవము లేనిచో జీవులకు పరిణామము లేదు. పరిణామము లేనిచో పరిపూర్ణత లేదు. జీవులు పరిపూర్ణులైననే గాని పరితృప్తులు కాలేరు. అందులకే వారికి కర్మానుభవము అవసరము. కర్మానుభవమున కర్మఫలముల ననుభ వించుచు క్రమముగ జీవులు నిష్కామ కర్మమునకు ఉద్యుక్తు లగుదురు. అపుడు వారి జీవితములు యజ్ఞార్థము లగును. యజ్ఞార్థ జీవమున పరిపూర్ణులై పరితృప్తు లగుదురు. ఈ సమస్త కార్యమును నిర్వర్తించునది వామదేవి.



# 469. 'వయోవస్థా వివర్జితా'

**వ**యసుతో కూడిన అవస్థలు లేనిది శ్రీమాత అని అర్థము.

శైశవము, బాల్యము, యౌవనము, వార్ధక్యము అను అవస్థలు లేనిది శ్రీమాత అని అర్థము.

ఆకాశమునకు అవస్థలు లేవు. అట్లే శ్రీమాత కూడ. ఆమె శుద్ధ చైతన్యరూపిణి అగుటచే ఇట్టి అవస్థలు వుండవు. పదార్థమునకు కాలపరిమితి యున్నది. ప్రజ్ఞ కట్టి పరిమితి లేదు. తత్త్వమున కసలే లేదు. ప్రజ్ఞావంతులగు ఋషులు, యోగులు, మహర్షులు, దివ్య పురుషులు వయసుతో కూడిన అవస్థలను దాటియుందురు. అవస్థ లన్నియూ దేహమునకే. దేహముతో ముడిపడిన జీవులకే. ముక్త జీవులకు వయో అవస్థ లుండవు.

మానవదేహము స్థూల దేహముగను, సూక్ష్మ దేహముగను, కారణ దేహముగను, తదతీతమగు జీవ చైతన్యముగను యున్నది. ఇందొొకదానికన్న యొకటి అధికమగు వయోపరిమితి కలది. అయిననూ వానికి వయోపరిమితి యున్నది. మానవులకన్న దేవతలు, దేవతలకన్న బ్రహ్మదేవుడు ఎక్కువ ఆయుర్దాయము కలవారు. బ్రహ్మదేవుని ఆయుర్దాయము నూరు దివ్య సంవత్సరములుగ తెలుపుదురు. ప్రస్తుతము ఈ సృష్టికి బ్రహ్మయగు 'పద్మభూ' నకు 51వ సంవత్సరము నడచు చున్నదని, ద్వితీయ పరార్థము నడచు చున్నదని పెద్దలు తెలుపుదురు.

బ్రహ్మదేవుడికే వయోపరిమితి యున్నట్లు దీని వలన తెలియును. అనగా ఇతరులందరికి కూడ వయోపరిమితి యున్నట్లే. శ్రీమాతకు మాత్రము యిట్టి వయోపరిమితి లేదు.

ముందు తెలిపినట్లు ఋషులు, యోగులు, దివ్యపురుషులు వయోపరిమితి యున్ననూ, అందలి అవస్థలకు గురికారు. వారు ఆత్మ జ్ఞానముతో యుండుటవలన వయో అవస్థలు వుండవు. వయో పరిమితి యుండును. సామాన్యులకు వయోపరిమితి మరియు అవస్థలు కూడ యుండును. శ్రీమాతకు ఈ రెండునూ లేవు. ఈ విశిష్టతను తెలియ వలెనని ఈ నామము యొక్క ఉద్దేశ్యము.



# 470. 'సిద్ధేశ్వరి'

సిద్ధుల కీశ్వరి శ్రీమాత అని అర్థము.

సృష్టి యందలి సమస్త సిద్ధులు శ్రీమాత అధీనముననే యుండును. అష్టప్రకృతులు, అష్టసిద్ధులు, అష్టైశ్వర్యములు, అష్టదరిద్ర ములు, అష్టకష్టములు అన్నింటికీ పుట్టిల్లు శ్రీమాతయే. శ్రీమాత ధర్మము ననుసరించువారికి ఆనందము కలుగుట, అధర్మము ననుసరించువారికి దుఃఖము కలుగుట అను విధానము సృష్టితో పాటే యేర్పాటు చేసినది. ధర్మానుష్ఠాన పరాయణులకు క్రమముగ అన్ని సిద్ధులూ కలుగును. అధర్మపరులకు కష్టనష్టములు కలుగును.

సత్పురుషులు జీవితమున పురోగతి చెందుచుండగ వారు చేయు యజ్ఞార్థ కార్యమునకు చేదోడుగ సిద్ధు లందింపబడును. అట్టివారు దివ్యకార్యములను నిర్విఘ్నముగ నిర్వర్తింతురు. స్వార్థపరులకు సిద్ధులు లభింపవు. తీవ్రమైన రజోగుణముతో తపస్సు చేసి సిద్ధులను వశము చేసుకొనువారు కలరు. వారికి సిద్ధులు సమయమునకు పనికి రావు. రావణునికి, కర్ణునికి సమయమునకు సిద్ధులు సహకరించలేదు. రామునికి, అర్జునునికి, హనుమంతునకు సిద్ధులు సహకరించుటయే గాక, అంటిపెట్టుకొని యున్నవి.

సిద్ధులు శ్రీమాత వశమున నుండునుగాని, యితరుల వశమున నుండవు. ఇతరులు ధర్మము పాటించినపుడు వశమై, అధర్మము పాటించు

నపుడు అదృశ్యమగును. రాక్షస ప్రవృత్తితో వశము చేసుకొను వారికి ఆపన్న సమయమున అవసర పడవు. ఈ సత్యము తెలిసినవారు సిద్ధుల వెంటపడరు. సిద్ధులకై ఆరాధన చేయరు. దైవారాధనము, ధర్మాచరణము అనుసరింతురు. అమ్మ అనుగ్రహమున సిద్ధులు కలుగును. అట్టి అనుగ్రహము కలిగినవారు నిజమగు సిద్ధపురుషులు.



# 471. 'సిద్ధవిద్యా'

సిద్ధ విద్యారూపిణి శ్రీమాత అని అర్థము.

శ్రీమాతను పంచదశీ మంత్రమున ఉపాసించినచో ఆమె అనుగ్రహము సిద్ధించును. అదియే సిద్ధవిద్య. శ్రీమాత అనుగ్రహము సిద్ధించుటయే సిద్ధవిద్యగాని, ఇక యే యితర శోధనలు, సాధనలు నిజమునకు సిద్ధుల నీయలేవు. ఇతర విద్యలు సిద్ధులు కలిగినట్లు భ్రమ గొలుపునుగాని సిద్ధించవు. శ్రీమాత ఆరాధకులకు అనుగ్రహము లభించినపుడు సిద్ధులన్నియూ ఆరాధకుని వరించును. అనుగ్రహ మున్నంత వరకే సిద్ధులు పనిచేయును.

శ్రీకృష్ణుని నిర్యాణానంతరము అర్జునుని సిద్ధులన్నియూ అదృశ్య మైనవి. అపుడు అర్జునునికి సిద్ధులు తనవి కావని, తనను ఆవరించి యున్నవని తెలిసినది. శ్రీరాముడు సిద్ధులు ఆవరించినపుడు వాటిని పూజ్య భావముతో భావించినాడేగాని సిద్ధులు తనవని భావింపలేదు. శ్రీకృష్ణుడు సిద్ధేశ్వరుడు. సాక్షాత్తు శ్రీమాతయే. కనుక సిద్ధవిద్యా స్వరూపుడు.

సిద్ధులను గూర్చి ఆశపడక దైవ సాన్నిధ్యమును గూర్చి తపన చెందుట మేలు. సాన్నిధ్య మున్నచోట సిద్ధులు వుండును. అనన్య చింతన, పర్యుపాసన, నిత్య అభియుక్తత, అనుస్మరణ నిజమగు సిద్ధవిద్య.

జ్యోతిషము ఇత్యాది వేదాంగములద్వారా జ్ఞానము పొందుచు, సిద్ధులను పొందుట, కాలజ్ఞానము పొందుట అనునవి భ్రాంతులే. అంతర్యామియగు దైవమును సమస్తమునందు దర్శించుచూ, ఉపాసించుట. అట్టి దైవమును పంచాక్షరీతోగాని, అష్టాక్షరీతోగాని, ద్వాదశాక్షరీతోగాని, పంచదశాక్షరీతోగాని ఆరాధించుట సరియగు మార్గము. ఈ మంత్రములు పరామంత్రములు. అనన్యత్వము కలిగించును. సిద్ధ విద్యకిదియే ఉపాయము.



# 472. 'సిద్ధమాతా'

**సి**ద్ధులకు మాత అని అర్థము.

శ్రీమాత సిద్ధులను రక్షించును గాన సిద్ధమాతా అని బిరుదు కలిగియున్నది. ఈ నామమునకు ప్రత్యేకముగ విశేషించి వివరింపదగిన వేమియు లేవు. సిద్ధేశ్వరీ, సిద్ధవిద్యా, సిద్ధమాతా అనుటలో శ్రీమాత కేవలము సిద్ధులకు తల్లియే గాక సిద్ధులను పొందు విద్యా మరియు సిద్ధులకీశ్వరి కూడ ఆమెయే అని తెలుపుచున్నారు. తల్లులకు ఈశత్వము వహించి యుండుట అరుదు. విద్యా రూపముగ కూడ తామే యుండుట మరింత అరుదు. ఇట్లు అష్ట సిద్ధులకు మాతృత్వము, విద్యారూపము, స్వామిత్వము కలిగియుండుట ఆమె ప్రత్యేకత.



# 473. 'యశస్విని'

**కీ**ర్తి కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత అనుగ్రహము కలవారికే యశస్సు కలుగును. కీర్తి కలుగును. ఎన్ని అర్హతలున్ననూ కీర్తి దక్కనివారు మిక్కుటముగ నుందురు. అర్హతలతో సంబంధము లేక కేవలము అనుగ్రహము చేతనే కీర్తి కలుగ గలదు. శ్రీమాత తలచుకొన్నచో కేవలము మూర్ఖుడై ననూ, జ్ఞానియై ప్రకాశింపగలడు. కాళిదాసు మహాకవి అమ్మ అనుగ్రహ మున జగద్విఖ్యాతుడైనాడు. సకల శుభములు, జయములు అమ్మ కనుసన్నలలో యుండును.

శ్రీమాత సృష్టి యందు గో రూపముననను, స్త్రీ రూపముననను, గురు రూపముననను, సద్గ్రంథ రూపముననూ, సాధువర్తనము గల సకల జీవులయందు మిక్కుటముగ నుండును. ఇట్టి వారిని మన్నించుట, గౌరవించుట, పూజించుట, సేవలు చేయుట ద్వారా శ్రీమంతులు, కీర్తిమంతులు అగుదురు. కేవలము సమర్థత ద్వారా యశస్సు పొందుట సాధ్యపడదు. ఇట్టి వారిని కూడ శ్రీమాత అనుగ్రహించినపుడే యశస్సు కలుగును. జీవుల యశస్సు శ్రీమాత అధీనమున యుండును.



## 474. 'విశుద్ధిచక్ర నిలయా'

**వి**శుద్ధి చక్రము నందుండునది శ్రీమాత.

## 475. 'రక్తవర్ణా'

**ఎ**ఱ్ఱని రంగు గలది శ్రీమాత అని అర్థము.

## 476. 'త్రిలోచనా'

**మూ**డు కన్నులు కలది శ్రీమాత అని అర్థము.

## 477. 'ఖట్వాంగాది ప్రహరణా'

**ఖ**ట్వాంగము మొదలగు నాలుగు ఆయుధములు గలది శ్రీమాత అని అర్థము.

## 478. 'వదనైక'

**ఏ**క వదనము కలది శ్రీమాత అని అర్థము.

## 479. 'సమన్వితా'

**స**మన్వితము చెందినది శ్రీమాత అని అర్థము.

## 480. 'పాయసాన్న ప్రియా'

**ప**రమాన్నము ప్రియముగా గలది శ్రీమాత అని అర్థము.

## 481. 'త్వక్స్థా'

**చ**ర్మధాతువు నందున్న శ్రీమాత అని అర్థము.

## 482. 'పశులోక భయంకరీ'

**ప**శులోకములకు భయము కలిగించునది శ్రీమాత అని అర్థము.

## 483. 'అమృతాది మహాశక్తి సంవృత'

**అ**మృత మాదిగా గల మహా శక్తులతో కూడి యున్నది శ్రీమాత అని అర్థము.

# 484. 'డాకినీశ్వరీ'

**డా**కినీ అను పేరు గల ఈశ్వరి శ్రీమాత అని అర్థము.

నాలుగు వందల డెబ్బై నాలుగవ నామము నుండి నాలుగు వందల ఎనభై నామము వరకు గల పదకొండు నామములు విశుద్ధి చక్రమందు వసించు డాకినీ రూపముగల శ్రీమాత వర్ణనము.

మానవ దేహమందలి సప్త చక్రములను అధిష్ఠించి, సప్త మాతలుగ, సప్తయోగినీ దేవతలుగ శ్రీమాత యున్నది. అందు విశుద్ధి చక్రము మొదలుకొని మూలాధారము వరకు గల పంచభూతాత్మకమైన ఐదు చక్రములను మొదటగ వర్ణించి అటుపైన ఆత్మప్రజ్ఞకు మూలస్థాన మగు ఆజ్ఞా చక్రమును వర్ణించి తుదకు సప్తమ మగు సహస్రారమును శ్రీమాత శాశ్వత నిలయముగ వర్ణించుట జరిగినది. పరమాత్మ, జీవాత్మ, పంచభూతములు అను సప్తమ కేంద్రములను శ్రీమాతయే తన యోగ శక్తిచే నిర్మాణము గావించి ఆయా లోకముల నేర్పరచి, ఆయా ప్రకృతి ధర్మములను ప్రవేశింపజేసి, ఆయా లోకశక్తుల నేర్పరచి, ఆయా రూపములను ధరించి శ్రీమాత వసించుచున్నది. ఇందలి ప్రజ్ఞా కేంద్ర వర్ణనము యోగమున న్యాసము చేయుట సంప్రదాయము. ప్రతి ప్రజ్ఞా కేంద్రమందు ఆ కేంద్రీకమలమును, అందు ఆశీనురాలైన శ్రీమాతను, ఆమె రూపమును, ఆమె ధరించియున్న శక్తులను, ఆమె పొందియున్న కాంతిని, ఆమె నామమును న్యాసము చేసి యోగించుట కొరకు ఈ

న్యాసము ఈయబడినది. ఇందు విశుద్ధి చక్రము ఆకాశ తత్త్వమునకు సంబంధించినది. అందు శబ్దము ప్రధానమగు గుణము.

విశుద్ధి చక్రమందున్న శ్రీమాతను డాకినీ దేవి అని పిలుతురు. ఈ డాకినీ దేవి పదునాలుగు దళముల గల పద్మము యొక్క కర్ణిక యందు పాటలీపుష్పముతో సమానమైన రంగు కలిగి యుండును. ఈ పుష్పము కేంద్రమున తెల్లని రంగు చుట్టునూ ఎఱుపు రంగుతో కూడి సుకుమారముగ నుండును. డాకినీ దేవి మూడు కన్నులు కలదియై యుండును. ఖట్వాంగమను ఆయుధమును ధరించును. ఖట్వాంగ మనగా వెన్నెముకకు తగిలించిన పుఱ్ఱెవలె గోచరించు ఆయుధము. మిగిలిన మూడు హస్తముల యందు పాశము, అంకుశము, వరముద్ర ధరించి యుండును. ఇక్కడ మాత ఏక వదన. ఆకాశము ప్రధాన మగు భూతము. అందుండియే మిగిలిన నాలుగు భూతములు జన్మించును. అందువలన ఏక వదన. ఈమెకు పాయసాన్నము ప్రియము. పాయసాన్నము భుజించు వారికి విశుద్ధి కేంద్రము పుష్టిగ నుండు అవకాశము కలదు. సప్త ధాతువులలో చర్మమును అధివసించి డాకినీదేవి యుండును. ఈ మాత పశులోక భయంకరి. పశులోక మనగా తాను, యితరము అను భేదము గల జీవులు వసించు లోకము. ఇట్టి వారందరును డాకినీ దేవి వశమున నుందురు.

తాను, యితరులు అను భేద భావము పోవుటకు శ్రీమాతను కంఠము నందు న్యాసము చేయవలెను. న్యాస విద్యద్వారా తాను

శ్రీమాతతో కంఠమున ఐక్యము కావలెను. తాను వేరు, దేవత వేరు అని పూజించువారు కూడ పశుతుల్యులే. దేవతయే తానుగా నున్నదని తెలియుట నిజముగ తెలియుట. కంఠనాదము చేయునపుడు నాదమే తానని భావించవలెను. నాదమే శబ్దార్థముల నేర్పరచు చున్నదని తెలియవలెను. ఈ నాదమే అందరి కంఠముల నుండి వ్యక్తమగు చున్నది. నాదము, శబ్దము ఒక్కటియే అయిననూ వేరు వేరు కంఠముల నుండి వ్యక్తమగు చున్నది. శబ్దము నుండి అర్థమునకు ప్రయాణము చేయక నాదమునకు ప్రయాణము చేసినచో ఏకత్వము సిద్ధించుటకు అవకాశ మేర్పడును. నాదము విననేర్చిన వారికి శబ్దార్థముల యందు గల సత్యము, అసత్యము సులభముగ తెలియగలదు. వాక్కు యందలి సత్యము వారు సులభముగ గ్రహింతురు. వాక్కునందు సత్యముగనే శ్రీమాత యుండును. ***"వాచః సత్యమశీమహి"*** అని శ్రీ సూక్తము కీర్తించు చున్నది.

కంఠ కూపమున యుండు శ్రీమాతను లలితా సహస్ర నామమున డాకినీ దేవి అని కొనియాడిరి. తంత్ర శాస్త్రమున 'సాకినీ దేవి' అని కొనియాడుదురు. ఈ భేదము ఉపాసనాపరులకే తెలియగలదు.

అమృతాది మహా శక్తులు ఈ మాతను ఆవరించి యుండును. ఈ శక్తులు పదహారు. ఈ పదహారు శక్తులు పదహారు దళముల యందుండును. ఈ పదహారు శక్తులును సంస్కృత భాషయందలి పదహారు అచ్చులుగ తెలియబడుచున్నవి. అవి 'అ' నుండి 'అః' వరకు

పదహారు అక్షరములు. అచ్చులు అమృతమయములు. వాని వలననే హల్లులు ఆధారపడి యుండును. అచ్చులు లేని హల్లులు పలుకుటకు వీలుపడదు. ఉదాహరణకు 'హ' అనినపుడు 'హ్ + అ' అయి వున్నది. అట్లే 'రి' అనినపుడు 'ర్ + ఇ' అయి వున్నది అట్లు హరి యందు హ్, అ, ర్, ఇ వున్నవి. అట్లు అచ్చులు లేని హల్లులు పలుక ప్రయత్నించుటకు వీలుపడదు. హరి అందు అ, ఇలు పురుష ప్రకృతులే. ఇట్లు పదహారు దళముల యందు పదహారు అచ్చుల శబ్దము లున్నవి. అవి అమృత మయములు. అవియే అమృతాది మహాశక్తులు. ఈ పదహారును చంద్రుని పదహారు కళలు. ఈ మహాశక్తులను వరుసగా అమృత ఆకర్షిణి, ఇంద్రాణి ఇత్యాది నామములతో పేర్కొందురు.

ఒక్కొక్క పద్మమును గూర్చి వివరించుట మొదలిడినచో ఈ వివరణము విస్తారమగును గనుక 'షట్చక్ర నిరూపణము' అను గ్రంథమును ఆసక్తి గలవారు పఠించుకొనవచ్చును.



## 485. 'అనాహతాబ్జ నిలయా'

**అ**నాహత పద్మము నందుండునది శ్రీమాత అని అర్థము.

## 486. 'శ్యామాభా'

**శ్యా**మల వర్ణము కలది శ్రీమాత అని అర్థము.

## 487. 'వదనద్వయా'

**రెం**డు ముఖములు కలది శ్రీమాత అని అర్థము.

## 488. 'దంష్ట్రోజ్వలా'

**దం**తములతో ప్రకాశించునది శ్రీమాత అని అర్థము.

## 489. 'అక్షమాలాధిధరా'

**అ**క్షమాల మొదలగు ఆయుధములు ధరించునది శ్రీమాత అని అర్థము.

## 490. 'రుధిర సంస్థితా'

రక్త మందుండునది శ్రీమాత అని అర్థము.

## 491. 'కాళారాత్ర్యాది శక్త్యౌఘవృతా'

కాళరాత్రి అను శక్తి ఆదిగా గల పండ్రెండు శక్తులతో నుండునది శ్రీమాత అని అర్థము.

## 492. 'స్నిగ్ధౌదన ప్రియా'

నేతి అన్నము ప్రియముగా గలది శ్రీమాత అని అర్థము.

## 493. 'మహా వీరేంద్ర వరదా'

మహావీరులగు పరమ భక్తులను అనుగ్రహించునది శ్రీమాత అని అర్థము.

## 494. 'రాకిణ్యంబా స్వరూపిణీ'

'రాకిణి' అను పేరుగల అంబాస్వరూపిణి శ్రీమాత అని అర్థము.

## (485 నుండి 494వ నామము వరకు వివరణము)

హృదయమందు పంౘ్రెండు దళములతో అనాహత పద్మము యున్నది. అందుండు శ్రీమాతను 'రాకినీదేవి' అందురు. "షట్చక్ర నిరూపణము" న యిచ్చటి మాతను 'కాకిని' అని పిలుతురు. ఈమె నలుపు నీల వర్ణము (కృష్ణ వర్ణము) గలది. అందువలన 'శ్యామా' అని పిలువబడుచున్నది. ఈ శ్యామలాదేవి పదహారు సంవత్సరముల వయస్సుగల స్త్రీ వలె గోచరించును. శ్రీకృష్ణుడు, శ్రీమాత పదహారేండ్ల వయస్సు గల వారిగ, నిత్య యౌవనులుగ కీర్తింపబడుటకు, అతనిని 'శ్యాం' అని పిలుచుటకు, ఆమెను 'శ్యామల' అని పిలుచుటకు అంతరార్థము తెలియనగును. వారెల్లప్పుడు హృదయము నందు వసించి యుండుటయే కారణము.

ఇచ్చటగల దేవి రెండు ముఖములు గలది. రెండు ముఖము లనగా పంచభూతములలోని ఆకాశము, వాయు తత్త్వములు కలిగినది అని తెలియవలెను. విశుద్ధి ఆకాశ తత్త్వమునకు, అనాహతము ఆకాశ వాయుతత్త్వములకు నిలయము. అట్లే అవరోహణ క్రమమున మూలా ధారము వరకు చేరినపుడు పంచతత్త్వములు అవతరించి యుండును. ఆకాశమున మిగిలిన నాలుగు తత్త్వములు ఇమిడి యున్నవి. అట్లే అనాహత మందలి వాయు తత్త్వమున పదార్థము, నీరు, అగ్ని ఇమిడి యున్నవి. ఆకాశమొక ముఖముగాను, వాయువు ఒక ముఖముగాను, రెండు ముఖములతో శ్రీమాత అనాహతమున యున్నదని తెలియ వలెను. పంౘ్రెండు దళముల పద్మము నిజమునకు ఆరు జంటల పద్మమే. ఆరు జంటలు కూడ నిజమునకు మూడు చతుర్భుజములే.

లేక నాలుగు త్రిభుజములే. పండ్రెండు దళములకు పండ్రెండు రాశు లకు సంబంధ మున్నది. పండ్రెండు రాశులు నిజమునకు ఆరు జంట రాశులే. రాశులు కూడ నాలుగు త్రిభుజములు. అనాహతము మహత్తరమగు కేంద్రము. సృష్టి యందలి పరిపూర్ణ కేంద్రము. సృష్టి కావల దైవము సృష్టియందు పరిపూర్ణముగ యుండుటకు హృదయమే నివాసముగ నుండును.

ఇచ్చటి పండ్రెండు దళముల యందు 'క' నుండి 'ఠ' వరకు పండ్రెండు అక్షరము లున్నవని యోగశాస్త్రము తెలుపును. ఈ పద్మము యొక్క రహస్యమును వివరించునదే కఠయోగము. అదియే 'కఠోపనిషత్తు'. ఈ పద్మమును చేరిన ప్రజ్ఞ వాయుతత్త్వమును చేరును. అమృతత్త్వమును పొందును. ఇందు వసించు వారందరూ అమృతులు. వీరినే మహా వీరేంద్రులని కీర్తింతురు.

ద్వాదశాక్షరీ మంత్రము కూడ ఈ పద్మమునకు సంబంధించి నదే. నారదునిచే ఉపదేశము పొంది ధృవుడు, ప్రహ్లాదుడు తురీయ స్థితిని చేరిరి. లోపల వెలుపల వ్యాపించిన దైవమును తెలిసిరి. ఇట్టి మహత్తర జ్ఞానము ఈ పద్మము ప్రసాదించును. ఇచ్చట వసించు శ్రీమాత అభయ ముద్రను, వరద ముద్రను ధరించి యుండును. మిగిలిన రెండు చేతులలో అక్షమాలను, కపాలమును ధరించి యుండును. అక్షమాల యనగా అక్షములతో కూడిన చక్రము అని కూడ అర్థము. కేంద్రము నుండి పరిధికి, స్థూలము నుండి సూక్ష్మమునకు, లోపలి నుండి వెలుపలకు ప్రజ్ఞా ప్రసారము చేయునది చక్రము. అట్లే వెలుపల నుండి లోపలకు, స్థూలము నుండి సూక్ష్మమునకు, పరిధి నుండి

కేంద్రమునకు ఆకర్షించు తత్త్వమీ చక్రమున కున్నది. ఇట్లు పురో గమనము, తిరోధానము చక్ర వ్యూహముగ శ్రీమాత నిర్వహించు చుండును. శ్రీమాత ధరించు చక్రమునకు ఆకర్షణ, వికర్షణము లున్నవి. జీవులను వెలుపలకు లోపలకు ప్రవేశింపజేసి లోపల వెలుపల అను భేదమును నశింపజేసి జీవుల నుద్ధరించుట నిర్వర్తించును.

హృదయ కేంద్రమున నున్న శ్రీమాత ప్రాణశక్తిగా రక్తమందు వశించును. అందువలన ఆమె రుధిర సంస్థిత. ప్రాణమునకు హృదయమే కేంద్రము. హృదయమే రక్త ప్రసారము గావించు చుండును. చెడు రక్తమును హరించుచు, మంచి రక్తమును ప్రసరించుచు, ఏక కాలమున రక్తమును నిర్వహించుచూ నుండును. రక్త ప్రసారము చేయుట, రక్తమును శుద్ధి చేయుట రెండు కోరలుగ దర్శించిన శ్రీమాత భక్తులు ఆమెను ఎట్టిని దంతములతో ప్రకాశించు మాత (దంష్ట్రోజ్వలా) అని ప్రశంసించిరి. ఇడ, పింగళ నాడులను కూడ రెండు దంతములుగా తెలుపుదురు. ఇవియు కాంతివంతమగు ప్రజ్ఞా ప్రవాహములే. ఉజ్జ్వల మగు దంతము లతో ఇట్లు శ్రీమాత ప్రకాశించుచుండును.

కాళరాత్రి ఆదిగా గల శక్తులు పండ్రెండు సమూహములుగ నుండును. ఈ శక్తులు 'క'కారము మొదలుకొని 'ఠ' కారము వరకు 12 సమూహములుగ నుండును. అవి వరుసగ

క ఖ గ ఘ ఙ;

చ ఛ జ ఝ ఞ;

ట ఠ అక్షరములు, ఈ ప్రతి అక్షరమునకు సమూహము లున్నవి. అవియే గుణింతములు, అక్షరము లన్నియూ శక్తులే.

విశుద్ధి చక్రమున పదహారు అచ్చులు పదహారు దళముల శక్తులుగా పేర్కొనబడినవి. విశుద్ధి యందు మొదటి పండ్రెండు హల్లులు పేర్కొనబడినవి. ఈ వరుస ననుసరించియే సంస్కృతమున ఇతర అక్షరములను పేర్కొనిరి. తత్కారణముగ సంస్కృత భాష దేవ భాష అయినది. 'క' ఆదిగ గల పండ్రెండు శక్తులతో కూడిన మాత కావున 'కాకినీ' మాత అని కూడ అనాహత మందలి మాతని పిలతురు. షట్చక్ర నిరూపణమున ఈమెను కాకినీ శక్తి అని పిలుచుటలో అంతరార్థ మిదియే.

అనాహత మందలి శ్రీమాతకు నేతి అన్నము ఎక్కువ ప్రీతి కలిగించును. ఆర్ష సంప్రదాయము ననుసరించు వారు తప్పక నేతి అన్నము భుజింతురు. నేయి తినకూడదన్న నేటి వైద్యుల వాదనము వారు మౌనముగ తోసిపుచ్చుదురు. మొదటి వేడి అన్నము ముద్దలో నేయి వేసుకొని తినుట సంప్రదాయము. దీని వలన హృదయమునకు మేలే కలుగును కాని కీడు కలుగదు.

మహా వీరులకు వరముల నిచ్చునది శ్రీమాత అగుటచే 'మహా వీరేంద్ర వరదా' అని కీర్తింపబడుచున్నది. లోపల వెలుపల అను భేదము దాటినవారే నిజమగు వీరులు. తాను యితరులు అను భేదము దాటినవారు వీరులు. వీరు మెలకువ, స్వప్నము, నిద్ర అను మూడు స్థితులే గాక, నాలుగవ స్థితి యగు తురీయ స్థితిని తెలిసినవారు. ఇట్టి వారిచే శ్రీమాత సృష్టి నిర్వహణము చేయుచు నుండును. వారికి వరములొసగి శక్తివంతులను జేసి కృతకృత్యులను చేయును. దివ్యాకర్షణ గల వాచక శక్తి గలవారిని కూడ వీరులందురు. వారు చేయు

దివ్యబోధన ద్వారా జీవులుద్ధరింప బడుచుందురు. వారు బ్రహ్మ రసామృతమును పానము చేయుచు యితరులకు పంచి పెట్టుకొందురు. ఇట్టి వారిని కూడ శ్రీమాత అనుగ్రహించు చుండును.

అనాహత మందలి శ్రీమాతను వివరించుటకు భాష చాలదు. అనుభూతిపరముగ తెలియవలసినదే. ఈమె అనురాగ స్వరూపిణి గనుక 'రాగిణీ' అని లలితా సహస్రనామ మందు కీర్తించుట జరిగినది. రాగిణి సరళ శబ్దము. రాకినీ పరుష శబ్దము. రాకిని రాగిణియే. శ్రీమాత అనురాగ స్వరూపిణియే కదా! అందువలననే రాగిణి.

*ఇటుపై నామములు ఉదర వితానమునకు దిగువ నున్న ప్రజ్ఞాకేంద్రముల వివరణ మగుట వలన మరియొక సంపుటమున వివరింపబడుచున్నవి.*



శ్రీరస్తు.

శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః ।

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రరత్నము

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

వ్యాపినీ వివిధాకారా విద్యాఽవిద్యా స్వరూపిణీ ।
మహాకామేశనయన కుముదాహ్లాదకౌముదీ ॥ 87

భక్తహార్ద తమోభేద భానుమద్భాను సంతతిః ।
శివదూతీ శివారాధ్యా శివమూర్తి శ్శివంకరీ ॥ 88

శివప్రియా శివపరా శిష్టేష్టా శిష్టపూజితా ।
అప్రమేయా స్వప్రకాశా మనోవాచామగోచరా ॥ 89

చిచ్ఛక్తి శ్చేతనారూపా జడశక్తి ర్జడాత్మికా ।
గాయత్రీ వ్యాహృతి స్సంధ్యా ద్విజబృంద నిషేవితా ॥ 90

తత్త్వాసనా తత్త్వమయీ పంచకోశాంతరస్థితా ।
నిస్సీమ మహిమా నిత్యయౌవనా మదశాలినీ ॥ 91

మదఘూర్ణిత రక్తాక్షీ మదపాటల గండభూః ।
చందనద్రవ దిగ్ధాంగీ చాంపేయ కుసుమప్రియా ॥ 92

కుశలా కోమలాకారా కురుకుళ్ళా కుళేశ్వరీ ।
కుళకుండాలయా కౌళమార్గ తత్పరసేవితా ॥ 93

కుమారగణనాథాంబా తుష్టిః పుష్టి ర్మతి ర్ధృతిః ।
శాంతి స్స్వస్తిమతీ కాంతి ర్నందినీ విఘ్ననాశినీ ॥ 94

తేజోవతీ త్రిణయనా లోలాక్షీ కామరూపిణీ ।
మాలినీ హంసినీ మాతా మలయాచలవాసినీ ॥ 95

సుముఖీ నళినీ సుభ్రూ శ్శోభనా సురనాయికా ।
కాలకంఠీ కాంతిమతీ క్షోభిణీ సూక్ష్మరూపిణీ ॥ 96

వజ్రేశ్వరీ వామదేవీ వయోఽవస్థావివర్జితా ।
సిద్ధేశ్వరీ సిద్ధవిద్యా సిద్ధమాతా యశస్వినీ ॥ 97

విశుద్ధిచక్రనిలయా రక్తవర్ణా త్రిలోచనా ।
ఖట్వాంగాది ప్రహరణా వదనైక సమన్వితా ॥ 98

పాయసాన్నప్రియా త్వక్స్థా పశులోక భయంకరీ ।
అమృతాది మహాశక్తి సంవృతా డాకినీశ్వరీ ॥ 99

అనాహతాబ్జనిలయా శ్యామాభా వదనద్వయా ।
దంష్ట్రోజ్జ్వలాఽక్షమాలాదిధరా రుధిరసంస్థితా ॥ 100

కాళరాత్ర్యాది శక్త్యౌఘవృతా స్నిగ్ధౌదనప్రియా ।
మహావీరేంద్రవరదా రాకిన్యంబా స్వరూపిణీ ॥ 101

# OTHER BOOKS THROUGH MASTER K. PARVATHI KUMAR

*The following books are available in: English (E), German (G), Spanish (S), French (F), Hebrew (H), Telugu (T), Hindi (HI) and Kannada (K) languages.*

| No. | Title | Price |
|---|---|---|
| 1. | Agni (E/G/S) | 60-00 |
| 2. | Amanaskudu (T/K) | 18-00 |
| 3. | Antardarsana Dhyanamulu (T) | 100-00 |
| 4. | Anveshakudu (T) | 60-00 |
| 5. | Asangudu (T) | 15-00 |
| 6. | Ashram Leaves (E/G/S) | 100-00 |
| 7. | Ayurvedic Principles (E) | |
| 8. | Bharateeya Sampradayamu (T/Hi) | 10-00 |
| 9. | Cow ('Govu' Mahatyam Vivarana) (E/T/K) | 20-00 |
| 10. | Devapi Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 11. | Dhanakamuni Katha (T) | 25-00 |
| 12. | Doctorine of Eternal Presence (E) | 10-00 |
| 13. | Gayatri Mantra - Avagahana (T) | 10-00 |
| 14. | Geetopanishad - Gnana Yogamu (T) | 25-00 |
| 15. | Geetopanishad - Karma Yogamu (T) | 20-00 |
| 16. | Geetopanishad - Sankhya Yogamu (T) | 25-00 |
| 17. | Geetopanishad - Karmasanyasa Yogamu (T) | 20-00 |
| 18. | Good Friday (E/G/S/F/H) | 10-00 |

| | | |
|---|---|---|
| 19 | Gurupaduka Sthavam (E) | |
| 20. | Health & Harmony (E) | 120-00 |
| 21. | Hercules-The Man and the Symbol (E/G/S/F) | 100-00 |
| 22. | Himalaya Guru Parampara (T/Hi) | 12-00 |
| 23. | Jupiter-The Path of Expansion (E/G/S) | 40-00 |
| 24. | Jyotirlinga Yatra (T) | 20-00 |
| 25. | Katha Deepika (T) | 40-00 |
| 26. | Listening to Invisible Master (E/G/S/F/H) | 20-00 |
| 27. | Lord Maitreya-The World Teacher (E/G/S/F/H) | |
| 28. | Maitreya Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 29. | Mana Mastaru Garu (T) | 60-00 |
| 30. | Mantrams-Their Significance and Practice (E/G/S) | 35-00 |
| 31. | Maria Magdalena (E/S/G/F) | |
| 32. | Marriage-A Sacrament (E) | |
| 33. | Maruvu Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 34. | Master C.V.V. (Birthday Message) (T) | 30-00 |
| 35. | Master C.V.V. Noothana Yogamu (T) | 20-00 |
| 36. | Master C.V.V. Yogamu (T) | 20-00 |
| 37. | Master C.V.V. Yogamu-Karma Rahityamu (T) | 10-00 |
| 38. | Master C.V.V. - May Call !(E/G/S) | 100-00 |
| 39. | Master C.V.V. - May Call ! II (E) | 100-00 |

| | | |
|---|---|---|
| 40. | Master C.V.V. The Initiator - Master E.K. The Inspiror (E) | 15-00 |
| 41. | Master C.V.V. - Saturn Regulations | 125-00 |
| 42. | Master E.K. - The New Age Teacher (E/G/S) | 70-00 |
| 43. | Mithila-A New Age Syllabus (E/G/S) | 100-00 |
| 44. | Occult Meditations (E/G/S) | 100-00 |
| 45. | Omkaram (T) | 30-00 |
| 46. | On Change (E/G/S) | 50-00 |
| 47. | On Healing (E/G/S) | 100-00 |
| 48. | On Love (E/G/S) | 50-00 |
| 49. | On Service (E/G/S) | 50-00 |
| 50. | On Silence (E/G/S) | 50-00 |
| 51. | Pranayamam (T) | 10-00 |
| 52. | Prayers (E/G/S) | 100-00 |
| 53. | Rudra (E/G/S) | 30-00 |
| 54. | Sankhya - The Sacred Doctrine (E/G/S) | 75-00 |
| 55. | Saraswathi - The Word (E/G/S) | 60-00 |
| 56. | Saturn-The Path of Systematised Growth (E/G/S) | 40-00 |
| 57. | Shodasopachara Pooja - Avagahana (T) | 10-00 |
| 58. | Sound-The Key and its Application (E/G/S) | 40-00 |
| 59. | Spiritualism - Business and Management (E/G/S) | 25-00 |
| 60. | Sri Dattatreya (E/G/S/T/Hi) | 33-00 |
| 61. | Sri Gurupaduka Sthavam (T) | 30-00 |

| | | |
|---|---|---|
| 62. | Sri Krishna Namamrutham (T) | 25-00 |
| 63. | Sri Lalitha-1 (T) | 40-00 |
| 64. | Sri Lalitha-2 (T) | 40-00 |
| 65. | Sri Lalitha-3 (T) | 40-00 |
| 66. | Sri Lalitha-4 (T) | 40-00 |
| 67. | Sri Sastri Garu (E/G/S/F/T/H) | 40-00 |
| 68. | Sri Shiridi Sai Sayings (E/G/S/T/Hi) | 80-00 |
| 69. | Steps on Silence (E) | 75-00 |
| 70. | Suvarna Sopanamulu | |
| 71. | The Aquarian Cross (E/G/S) | 100-00 |
| 72. | The Aquarian Master (E/G/S) | 75-00 |
| 73. | The Doctorine of Ethics (E) | 35-00 |
| 74. | The Etheric Body (E/G/S) | |
| 75. | The Path of Synthesis (E) | 40-00 |
| 76. | The Splendor of Seven Hills (E/T/Hi) | 15-00 |
| 77. | The Teachigs of Lord Sanatkumara | 150-00 |
| 78. | The Theosophical Movement (E/G/S) | 60-00 |
| 79. | The White Lotus (E/G/S) | 20-00 |
| 80. | Time - The Key (E/G/S) | |
| 81. | Uranus - The Alchemist of the Age | 150-00 |
| 82. | Venus - The Path of Immortality (E/G/S) | 80-00 |
| 83. | Violet Flame Invocation (E/G) | 60-00 |
| 84. | Vrutrasura Rahasyam (T) | 35-00 |

85. Varunagraha Prabhavamu (T) 22-00
86. Wisdom Buds (E/S) 20-00
87. Wisdom Teachings of Vidura (E/G/S) 80-00
88. Moon & Spiritual Astrology (S)
89. The Death & Reincarnation (S)
90. Commentary on Om Namonarayanaya (S)
91. Master Jesus, Life and Teachings (S)
92. The Science of Ayurveda & Homoeopathy (S)
93. The Teachings of Master D.K. (S)
94. The Human Constitution (S)
95. The Masters of Wisdom (S)
96. The Path of Meditation (S)
97. Stories for Disciples (S)
98. Spirituality in Daily Life (S)
99. Special Practices for Disciples (S)
100. Fundamentals of Health & Healing (S)
101. Ganesha, The Cosmic Lord of Groupings (S)
102. Astrology and Healing (S)

## DHANISHTA OTHER PUBLICATIONS

| | | |
|---|---|---|
| 1. | Puranapurushuni Pooja Vidhanam (T) | 10-00 |
| 2. | Sarannavaratra Pooja Vidhanamu (T) | 30-00 |
| 3. | Sri Dattatreya Pooja Vidhanamu (T) | 10-00 |
| 4. | Sri Hanuman Chalisa (T) | 15-00 |
| 5. | Sri Mahalakshmi Pooja Vidhanamu (T) | 12-00 |
| 6. | Sri Rama Pooja Vidhanamu (T) | 10-00 |
| 7. | Sri Siva Hridayamu (T) | 5-00 |
| 8. | Sri Siva Pooja (T) | 15-00 |
| 9. | Sri Soukumarya Satakam (T) | 10-00 |
| 10. | Sri Surya Pooja Vidhanamu (T) | 7-00 |
| 11. | Sri Venkateswara Pooja Vidhanamu (T) | 8-00 |
| 12. | Vinayaka Vratakalpamu (T) | 25-00 |
| 13. | Vishnu Sahasranamam (T) | 12-00 |
| 14. | Sri Rama Charitramu (T) | |
| 15. | Sri Subrahmanya Pooja Vidhanamu (T) | |

# శ్రీలలిత

## షష్ఠ భాగము

(495 నుండి 600 వరకు నామములకు వివరణము)

**6**

**మాస్టర్ పార్వతీకుమార్**



ధనిష్ఠ

ప్రథమ ముద్రణ : 2010

శ్రీ వికృతి - శరన్నవరాత్రులు

ప్రతులు : 1,000

వెల : రూ॥ **40-00**

*ప్రాప్తిస్థానము :*

**జగద్గురు మందిరము**
(ది వరల్డ్ టీచర్ టెంపుల్)
'రాధామాధవమ్'
14-38-2, ముప్పిడి కోలనీ,
విశాఖపట్నం - 530 002.
ఫోన్ : 0891-2701531
e-mail : dhanishta@rediffmail.com

*ముద్రణ :*

ఎక్సేలియన్ ప్రింటింగ్ స్కూల్
విశాఖపట్నం – 530 016.
☏ 0891-2747320, 9848075132.



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువ లేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జన్మించినది.

**"ధనిష్ఠ"** మాస్టర్ పార్వతీకుమార్‌గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపములోను, పుస్తకముల రూపము లోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును సద్గోష్ఠికై వలసిన వాతావరణమును – "జగద్గురు మందిరము"గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

## సంకలనకర్త : మాస్టర్ పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయి లకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ పార్వతీకుమార్**గారు. వారి బోధనలు లెక్కకుమించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియవచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసరణీయమై, ఆచరణ యోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించు చున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళారంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో – మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, *"మానవ సేవయే మాధవ సేవ"*అను మాటకు

సరియైన అర్థము యిదేనని మాస్టరుగారు తమ ప్రవర్తన ద్వారా తెలియ పరచుచున్నారు. మాస్టర్ పార్వతీకుమార్‌గారు బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక – మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, శతాధిక గ్రంథముల సంకలన కర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొనుచుండు ననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు మాస్టరుగారి దృఢ విశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశ విదేశములలో పరహితసేవ గావించుచున్నవి. “పరహితము పరమధర్మ” మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవద్ధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

"శ్రీలలిత" అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతిమాసము 'నావాణి' దర్శన మాస పత్రికయందు ప్రచురింపబడుచున్నవి. పాఠకుల కోరికపై అమ్మవారి "సహస్ర" నామములను "శత" నామములు ఒక భాగముగ ప్రచురించుటకు సంకల్పించితిమి. ఇప్పటికి 495 నామము లను 5 భాగములుగ ధనిష్ఠ ప్రచురించినది. ప్రస్తుతము 495 నుండి 600 వరకు 6వ భాగముగ అందించుచున్నాము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీర మగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారినుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారి యందు, వారి భాషణయందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహపరములకు పరిష్కార మని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

– ధనిష్ఠ

# పరిచయము

**ల**లితాదేవి, శ్రీదేవి, దుర్గ, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమెయే మూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్త స్థితియందు సత్యముగను, వ్యక్త స్థితియందు మహాచైతన్యముగను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు, సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితి గొనుటకు వినియోగ పడును. అందులకే పారాయణము.

అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వ్యాఖ్యానము. సామాన్యులకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

- పార్వతీకుమార్

# విషయసూచిక

# శ్రీ లలిత



ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

# 495. 'మణిపూరాబ్జ నిలయా'

**మ**ణిపూర మను పదిరేకుల పద్మమునందు వసించునది శ్రీమాత అని అర్థము.

మణిపూర పద్మము నాభి యందుండును. పది రేకులతో కూడి యుండును. అందు ఐదు రేకులు (దళములు) అధోముఖముగను ఐదు రేకులు ఊర్ధ్వముఖముగను యుండును. అధోముఖపు దళములు బహిర్ మనస్సుగను, ఊర్ధ్వముఖపు దళములు అంతర్ మనస్సుగను పనిచేయును. మణిపూరక పద్మము కారణముగ లోపల, బైట అంత రంగము, బహిరంగము అను భేదము శ్రీమాత సృష్టించును. బహిరంత రంగముల దృష్టి కలవారు ఋషులు, యోగులు. కేవలము బాహ్యదృష్టి కలవారు సామాన్య జీవులు. వీరిని పశువులందురు. పశువులు, పశ్యకు లని పేర్కొందురు. పశ్యకులనగా బైటికి చూచువారు. లోపలకు బైటకు కూడ చూడగలిగిన వారిని కశ్యపులు అందురు. యోగులు, ఋషులు, తపస్విజనులు కశ్యపులు. ఇతరులు పశ్యకులు.

పశ్యకులు పశుప్రాయుల వలె కేవలము ఇంద్రియముల ద్వారా ఇంద్రియార్థములను కోరుచు బాహ్యమున జీవమును నశింపజేసి కొనుచు మరణింతురు. వీరికే మరణము, జననము కలవు. అంత రంగమున చూచుట, వర్తించుట నేర్చినవారు మరణము దాటిన వారగుదురు. ఈ కారణముగ మణిపూరకము అత్యంత ప్రాముఖ్యముతో కూడిన పద్మముగ పెద్దలు వర్ణించిరి. బాహ్యమునందు ఇష్టా పూరణము

కొఱకై తాపత్రయపడు జీవులు చిల్లుకుండను నింపుతున్నట్లు జన్మల తరబడి విఫల యత్నము చేయుదురు. కొన్ని వేల జన్మలిట్లు గడువగ బాహ్యమున పూర్ణ ఆనందము పొందుట మిథ్య యని శ్రీమాత అనుగ్రహముగ తెలిసి అంతర్ మనస్సు ఆధారముగ అంతరంగమగు అనాహతమును చేరు ప్రయత్నము చేయుదురు. అంతరంగమున ఆనందము క్రమముగ పూరింపబడును. ఇట్లు ఆనంద పూరణమునకు ఉపాయముగల పద్మముగ మణిపూర పద్మమును తెలియవలెను.

బహిరంగ జీవనము క్షరము. అది నశించునది. అంతరంగ జీవనము అక్షరము. అది నశింపనిది. జీవుడు తానక్షరుడుగ నిలచి దైవారాధన చేయుచున్నప్పుడు దైవసాన్నిధ్యము తనయందు పూర్ణముగ నిండును. చిల్లులేని కుండ నిండునట్లు పూర్ణముగ నుండును. అటుపైన సాన్నిధ్యము పెంపొందుచుండగ పరిపూర్ణమగుచు పొంగి పొరలును. అపుడు బహిర్ ఆనందము కూడ కలుగును.

మానవునికి అక్షరాభ్యాస క్రతువు ఐదవ సంవత్సరముననే నిర్వర్తింతురు. ఈ సంస్కారము పొందిన మానవుడు క్షర విద్యతోపాటు అక్షర విద్యను కూడ అభ్యసింపవలెను. అక్షరాభ్యాసమనగా అక్షరత్వమును అభ్యసించుట. అందులకే తన జన్మము. కేవలము వ్రాత నేర్చుటకు కాదు. తెలియని తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు అనాలోచితముగ పిల్లలను చిన్నతనము నుండియే అవిద్యా మార్గముల ప్రవేశింప జేయుదురు. కలియుగము కదా! ఇచ్చట వసించియుండు శ్రీమాత ఇహపర సౌఖ్యముల నీయగలదు. కనుకనే ఈ పద్మమున వసించి యుండు శ్రీమాత నారాధించుట ప్రసిద్ధి గాంచినది.

# 496. 'వదనత్రయ సంయుతః'

**మూ**డు ముఖములతో నుండునది యని అర్థము.

శ్రీమాత మూడు గుణములు మూడు ముఖములుగ, మూడు శక్తులుగ మణిపూర పద్మమున ఆరాధించుట వలన సమన్వయము కలుగును. గుణ సమన్వయమున బహిరంత రంగములందు వర్తించుటకు సాధ్యమగును. బహిరంగము నుండి అంతరంగము చేరుటకు, అంతరంగము నుండి బహిరంగము చేరుటకు వలసిన ద్వారము తెరువబడును. శ్రీమాత త్రిముఖి ఆరాధనము ఆరాధకుని స్వభావమందుగల సత్త్వ, రజస్, తమస్సులు సమన్వయింపబడుటకే అని తెలియవలెను.



# 497. 'వజ్రాదికాయుధోపేత'

**వ**జ్రము మొదలగు ఆయుధములతో కూడినది శ్రీమాత అని అర్థము.

వజ్రము, దండము, శక్తి, అభయము దాల్చిన చతుర్భుజిగా భావన చేయవలెను.



# 498. 'డామర్యాదిభిరావృతా'

**డ**మరుకము ఆదిగా గల భీకర శబ్దములతో పరివేష్టించి యుండునది శ్రీమాత అని అర్థము.

పశుజనులకు భయభీతులు కలిగించుటకు శ్రీమాత డమరుక మొకటి చాలును. ఆ శబ్దమున దుష్టుల గుండెలు పగుల గలవు. శిష్టులకు అభయము కలిగించుచు దుష్టులకు భయము కలిగించునది యిచ్చటి శ్రీమాత. డామరి మొదలగునవి పది శక్తులుగ వివరింప బడినవి. ఇవి భీకర శబ్ద కారకములు.



# 499. 'రక్తవర్ణా'

ఎఱ్ఱని రంగు గలది శ్రీమాత అని అర్థము.

అనాహత మందలి శ్రీమాత రక్తవర్ణమున ఉండును. అట్టి రక్తమునకు ఎఱ్ఱని రంగు మణిపూరక మందలి రాకినీ మాత వలన యేర్పడును. రక్తమునకు గల ఎఱ్ఱదనము ఈ పద్మము నందలి శ్రీమాత ద్వారా యేర్పడు చుండును. రక్త మందలి బలమునకు ఎఱ్ఱదనము చిహ్నము. శరీరమున ప్రవహించు రక్తమునకు మణిపూరక మందలి శ్రీమాత బలము నిచ్చును.



# 500. 'మాంసనిష్ఠా'

**మాం**సమునందు అభిమానముతో వసించునది శ్రీమాత అని అర్థము.

దేహమున పుష్టికరమగు కండరములు యేర్పడుటకు కూడ మణిపూరమునందు నిలచిన శ్రీమాతయే కారణము. ఇచ్చటి శ్రీమాత నారాధించుట వలన రక్తపుష్టి, మాంసపుష్టి కలిగి దేహము పటిష్ఠముగ జీవునికి సాధనమై యుండును.



# 501. 'గుడాన్నప్రీత మానసా'

**బె**ల్లముతో గూడిన అన్నముచే ప్రీతిచెందు మనస్సు గలది శ్రీమాత అని అర్థము.

ఆహారమునందు బెల్లమునకొక ప్రత్యేక స్థానమున్నది. గణపతి పూజకు కూడ బెల్లము ప్రసాదముగ వాడుట ఆచారము. బెల్లము మనస్సునకు ప్రీతి కలిగించును. రస సిద్ధికి తోడ్పడును. చెఱకురసము ఘనస్థితి చెందినపుడు బెల్లమేర్పడును. శ్రీమాత చెఱకుగడను హస్తమున పూనినట్లు ప్రార్థన చేయుట కూడ సత్సంప్రదాయము. మూలాధారము నుండి సహస్రారమువరకు గల సుషుమ్న నాడి యందలి రసానుభూతికి చెఱకుగడ ప్రతీతి. అందలి కణుపులే లోకాలోకముల నేర్పరచు విభాగములు.

కేవలము పులుపు, ఉప్పు, కారము, వగరు, చేదు ఆహారమున గొనువారికి మనస్సున చికాకులు, కోపము భయము నేర్పడు అవకాశ మున్నది. తగుమాత్రము తీపినిగూడ గొననివారు రకరకములగు మనో క్లేశములకు గురి అగుచుందురు. షడ్రుచులు లేని భోజనము సమగ్రము కాదు. మనోప్రీతికి, మనోల్లాసమునకు సమగ్రముగ ఆహారము గొనుట ఎంతయూ ఆవశ్యకము. విష్ణు పురాణమున పరాశర మహర్షి మైత్రేయుని కందించు బోధనలయందు ఈ విషయము గోచరమగును. ప్రప్రథమముగ ఆహారము గొనవలసిన పదార్థము తీయని పదార్థమై

యుండవలెనని పరాశరులు సూచించినారు. తీపిలేని భోజనము రససిద్ధి నీయదు. ఆయుర్వేదమునందు కూడ బెల్లమునకే ప్రాధాన్యత యున్నది. ప్రస్తుత కాలమున ఆధునికముగ తయారు చేయబడిన తెల్లని చక్కెర యందు బెల్లమందలి గుణములు లేవు. ఈ చక్కెర పదార్థములు తినుట శరీరమునకు హానికరము. బెల్లమును గొనుట ఆరోగ్యకరము. బెల్లము చక్కెర కూడ దొరకును. దానిని నిత్య వాడకమునందు వినియోగించుట ఆరోగ్య సూత్రములలో ఒకటి.

ప్రత్యేకించి తెలుగువారు పులుపు, కారము, ఉప్పు, గుణము లేని చక్కెర ఎక్కువగా గొనుచుండుట వలన ఉదరము, జీర్ణకోశము అనారోగ్యమునకు గురియై రకరకములగు బాధలను గొనితెచ్చు చున్నవి. ఆహారపు విలువలు తెలిసినవారు పులుపునకు విరుగుడుగ బెల్లము వాడుదురు. పులుసునందు, ఆవకాయ యందు, రసము యిత్యాది పదార్థముల యందు బెల్లమును వాడుట ఆరోగ్యకరము. బెల్లమును గాని, తేనెను గాని వాడని ఆహారమున ఆమ్లములు తీవ్రమై క్షారములు నీరసించి శరీరము కృశించును. అనారోగ్యమునకు గురి యగును. అన్నమందు, కూరగాయల యందు కూడ ఆమ్ల మున్నది గనుక ఆహారము సమతుల్య మగుటకు బెల్లము వాడి తీరవలెను.

కేవలము ఆరోగ్యమునకేగాక మనస్సు ప్రీతిగ నుండుటకు శరీర ధర్మముల సహకార మెంతయూ అవసరము. అట్లున్నప్పుడే రస సిద్ధికి అవకాశముండును. లేనిచో ఆవేశ కావేశములతో, రోషము పట్టుదల లతో శ్రీమాత పూజలు చేసిననూ ఫలించవు.

అంతియేగాక సుదీర్ఘమగు పూజలు చేయువారు ఉపవాసము లను కూడ ఆచరించుటచేత ఆమ్లములు మెండుగ చేరును. అట్టి ఆమ్లములకు విరుగుడే గుడాన్నము, పాయసాన్నము. ఆహారమున పై తెలిపిన శ్రద్ధను చూపువారు మనో ప్రీతితో పూజలు చేయగలరు.



# 502. 'సమస్తభక్త సుఖదా'

సమస్త భక్తులకు సుఖము నిచ్చునది శ్రీమాత అని అర్థము.

సుఖమను పదము సుస్థ అను పదమూలము నుండి పుట్టినది. సుస్థ అనగా సుస్థిరత్వము. ప్రజ్ఞ హృదయమందున్నప్పుడు సుఖముగను సౌకర్యముగను వుండును. మానవ ప్రజ్ఞ ఆనందముకొఱకై వెదకుచూ అనేకానేక అవస్థితులను చెందుచుండును. సుఖదుఃఖములు, రాగద్వేషములు, జయాపజయములు యిత్యాది ద్వంద్వములందు తిరుగు చుండును. అపుడు సుఖముండదు. ఆనంద ముండదు. దుఃఖము, దిగులు కలుగుచుండును. మనో నిబ్బరము కోల్పోవుటచే నిర్మలత్వము తగ్గును. ఇవన్నియూ అవస్థితులే. సుస్థితులు కావు. సుస్థితి కలుగ వలెనన్నచో సద్గుణముల నాశ్రయించి సత్త్వమున చేరి 'స్వ'స్థత పొంద వలెను. ఇది అంతయూ భక్తులకు క్రమముగ అమ్మ ఆరాధన ద్వారా లభ్యమగును. ఆమె సుఖప్రదాత! భక్తులకు సుఖము నిచ్చున దామెయే. గుణములు, ఇంద్రియములు ఆమె వశమై యుండును గనుక ఆమె ఆరాధకులకు అవి వశమై సుఖము కలిగించును.

'ఖ' అను పదమునకు ఆకాశము అను అర్థము కలదు. సుఖ అనగా నిర్మలమగు ఆకాశమని కూడ వివరించుకొన వచ్చును. హృదయాకాశమే నిర్మలాకాశము. ఈ నిర్మలాకాశమును అమ్మ అనుగ్రహమున చేరుట సులభము. శ్రద్ధా భక్తులతో శ్రీమాత నారాధించు వారికిది విదితము. చక్రభ్రమణ మను జీవితము నుంచి వికాసము కలిగించి సుఖము నిచ్చునది శ్రీమాత.

# 503. 'లాకిన్యంబా స్వరూపిణి'

**లా**కిణీ స్వరూపముగల శ్రీమాత అని అర్థము.

మూడు ముఖములు కలది, వజ్రము మొదలగు నాలుగు ఆయుధములు కలది, పది శక్తులచే ఆవరింపబడినది, రక్తము వంటి ఎఱ్ఱని రంగు గలది, మాంసమందు అభిమానము కలది, బెల్లమన్నము యిష్టమైనది అగు శ్రీమాతను లాకిణి అని పిలుతురు.

మణిపూరక చక్రము జీవప్రజ్ఞకు బహిద్వారము. అనాహతము అంతరంగ ద్వారము. మణిపూరకమును చేరిన ప్రజ్ఞను పాలించు మాత లాకిణి. ఈమె కారణముగ జీవప్రజ్ఞకు దేహప్రజ్ఞకు సంబంధ మేర్పడును. రక్త మాంసమయమైన శరీరమున జీవుడుండుట కిష్టపడును. అట్టి శరీరమునకు సుఖముండునట్లుగ ఆకలి జీవుని ఆకర్షించి యుంచును. అన్నపానీయాదులు, శరీర సుఖము అలవడిన జీవుడు అందే యుండుట కిష్టపడుచూ శరీరమును వదలుటకు దుఃఖ పడు చుండును. అంతకు మునుపు రక్తమాంసాదులతో కూడిన పిండములో ప్రవేశించుటకు దుఃఖపడును. శ్రీమాత మాయ ప్రాతిపదికగ దుఃఖకర మైనది సుఖముగను, సుఖకరమైనది దుఃఖముగను జీవుడు అనుభ వించుచు నుండును. జీవుల సంస్కారమును బట్టి సుఖ దుఃఖములు మారుచు నుండును. లాకిణీ మాత అనుగ్రహ మున్నచో అవస్థితి, ఉత్తమ స్థితి అను భేదము నశించును.

బురద యందు జీవించుటకు సాధారణముగ మనిషి అంగీకరింపడు. కాని బురద యందు వానపాములు వసించు చున్నవి. మహాత్ములకు దేహమున వసించుట బురదలో వసించుట వంటిది. వారందుండుటకు సందేహింపరు. కారణము వారికి లాకిణి అనుగ్రహ ముండుటయే. దైవభక్తులు ఎచ్చట నున్ననూ దైవము యందే యుందురు గనుక, వారికి దేహాభిమాన ముండదు గనుక దేహ సౌఖ్యమునకై ప్రాకులాడరు. సిద్ధులు, అవధూతలు మట్టిలో అన్నము వడ్డించిననూ భుజింతురు. శ్రీ రామ కృష్ణులు మురుగునీటిని అవపోసన పట్టుట, తాను వూరకుక్క కలిసి రొట్టెలు తినుటకు అమ్మ అనుగ్రహమే కారణము. అట్టి కోవలోని వారందరూ మాయను దాటినవారు. “లం” అను శబ్దము పృధివీ తత్త్వమును సంకేతించును.



# 504. 'స్వాధిష్ఠానాంబుజ గతా'

**స్వా**ధిష్ఠాన మను అంబుజమున (పద్మమున) గల యోగిని శ్రీమాత అని అర్థము.

స్వాధిష్ఠానము ఆరు దళముల పద్మము. ఈ పద్మము నందలి ఆరు రేకులపై బ భ మ య ర ల అను ఆరు అక్షరములు, ఆరు మాతృకలుగ యుండును. "వ" అను అక్షరము బీజము నందుండును. ఈ ఆరు దళముల పద్మము లేత గులాబి రంగులో యుండును.

గులాబి రంగు సున్నితత్త్వమునకు, కౌమారత్వమునకు, నిర్మలత్వమునకు ప్రతీక. స్వచ్ఛమగు ప్రేమకు ప్రతీక. అరిషడ్వర్గముల ప్రభావము లేశమాత్రము కూడ మానవుని యందు లేనప్పుడు గులాబి కాంతితో ఈ పద్మము ప్రకాశించుచుండును. ఇందలి దళములు కుమారుని షణ్ముఖములకు ప్రతీకలై యుండును. ఈ పద్మమున ఆసీనుడగు జీవుడు స్వాధీనముననే యుండునుగాని, ఎన్నటికి పరాధీనుడు కాడు.



# 505. 'చతుర్వక్త్ర మనోహరా'

**నా**లుగు ముఖములతో మనోజ్ఞముగ నుండునది శ్రీమాత అని అర్థము.

నాలుగు ముఖములనగా నాలుగు భూతములు అస్థిత్వముగా కలది అని అర్థము. అవి వరుసగా 1. ఆకాశము (విశుద్ధి), 2. వాయువు (అనాహతము), 3. అగ్ని (మణిపూరకము), 4. జలము (స్వాధిష్ఠానము).

పంచభూతాత్మకమగు సృష్టిలో స్వాధిష్ఠానము చేరుసరికి నాలుగు భూతముల సృష్టి ఏర్పడును. ఐదవది అయిన పృథివి మూలాధారమున ఏర్పడును. అందువలన మూలాధార దేవత పంచవక్త్ర. స్వాధిష్ఠాన దేవత చతుర్వక్త్ర. మణిపూరక దేవత త్రివక్త్ర. అనాహత దేవత ద్వివక్త్ర (వదనద్వయ). విశుద్ధి దేవత ఏకవక్త్ర (ఏకవదన). ఇట్లు తెలియ నగును. ఆకాశమునందు నాలుగు భూతములు యిమిడి యున్నవి. వాయువు నందు మిగిలిన మూడును. అట్లే యితర భూతములను అవగాహన చేసుకొనవలెను.

స్వాధిష్ఠానము విశుద్ధి నుండి నాలుగవ చక్రము. అనగా యిందు ఆకాశము, వాయువు, అగ్ని, జలము వ్యక్తమై పృథివి అవ్యక్తముగ యుండును. కనుక నాలుగు ముఖములు. నాలుగు ముఖముల తల్లి మనోజ్ఞముగ నుండుటకు కారణము ఘనీభవింపక యుండుట చేతనే. రూపము కరుడు గట్టిన తరువాత అందము కోల్పోవును. లేతగా యున్నప్పుడు అందముండును. పృథివీ తత్త్వము లేశమాత్రమే యున్నప్పుడు అంద మెక్కువగ గోచరించును. లేతదనమునకు ముదురుతనమునకు గల తేడా సులభముగనే యుండును కదా!

# 506. 'శూలాద్యాయుధ సంపన్నా'

స్వాధిష్ఠాన దేవతగ శ్రీమాత త్రిశూలము, పాశము, కపాలమును, అభయ ముద్రలను కలిగి యుండునని అర్థము.

పై తెలిపినవి ఆమె ఆయుధములు. త్రిశూలముతో రాక్షస ప్రవృత్తిని సంహరించును. పాశముతో అజ్ఞాన ప్రవృత్తిని బంధించును. కపాలముతో శాశ్వతత్త్వము గోచరించును. అభయముద్రతో శిష్టుల కభయమిచ్చును.



# 507. 'పీతవర్ణా'

**ప**సుపు రంగు గలది శ్రీమాత అని అర్థము.

స్వాధిష్ఠాన పద్మము లేత గులాబి రంగులో యుండగ, అందలి యోగినీ దేవత పసుపు రంగులో యుండును అని తెలియవలెను. పసుపు శుభప్రదము, ఆయుఃప్రదము, ఆరోగ్యప్రదము. కలుగబోవు భౌతిక శరీరమునకు ఈ మూడింటిని అందించు శ్రీమాత ఈ పద్మమున యుండును.



# 508. 'అతిగర్వితా'

**సౌం**దర్యాదుల వలన, ఆనందానుభూతి వలన గర్వించి యున్నట్లుగ స్వాధిష్ఠాన మందలి శ్రీమాత గోచరించును. ఆమె చైతన్య ప్రీతయై మేధస్సున నుండి శివతత్త్వముతో అనుసంధానము చెంది యుండుట వలన యినుమడించిన అందము గలదై గర్వముగ నుండును. ఈ స్థితియందు గర్వమనగా పరితృప్తి. పరితృప్తి కలిగిన వారి చూపులయందు, హావభావముల యందు ఆ తృప్తి ప్రకటము కాగ చూచువారికి గర్వముగ నున్నది అనిపించును. తృప్తి వలన యేర్పడు చూపులకు మాటలకు, గర్వము వలన యేర్పడు చూపులకు మాటలకు సున్నితమగు వ్యత్యాస మున్నది. పరితృప్తులు అసూయ గలవారికి గర్వముగ గోచరింతురు. కారణము వారి అసూయ యేగాని ఎదుటివారి గర్వము కాదు. గర్వము లేనివారే గర్వము లేనివారిని గమనింప గలరు.



# 509. 'మేదోనిష్ఠా'

మేదస్సు నందు యుండునది శ్రీమాత అని అర్థము.

శరీర ధాతువులలో మేదస్సు ప్రధానమైనటువంటిది. శుక్ర మందు జీవుడుండును. మేదస్సు నందు అతని ప్రజ్ఞ యుండును. రస, రక్తముల ద్వారా జీవుని తెలివి, ప్రాణము, దేహమునందంతను వ్యాప్తి చెందును. ఎముకలు, మాంసము, చర్మము, జీవునికి రూపమిచ్చు చున్నవి. ఇట్లు ఏడు ధాతువులలో మేదస్సు శ్రీమాత తెలివిగ జీవుని యందు గోచరించును. మేదస్సు పెరిగినకొలది అవగాహన పెరుగు చుండును. అట్టి మేదస్సు పెంపొందుటకు శ్రీమాత ఆరాధన ఒక చక్కని ఉపాయము.



# 510. 'మధుప్రీతా'

మధువునందు ప్రీతి గలది శ్రీమాత అని అర్థము.

మధువనగా మేదస్సు నందు జీవు డనుభవించు ఆనందము. అనగా చైతన్యానందము. శ్రీమాత చైతన్య స్వరూపిణి. ఆమె ఆనందము నకు కారణము, శివునితో తాదాత్మ్యత చెందుట వలననే. శ్రీకృష్ణుడు కూడా మధురానాథుడుగ వర్ణింపబడినాడు. మధుర యందలి కృష్ణ భక్తులు అంతరంగమున కృష్ణుని భావించుచు అమితమగు చైతన్యా నందమును పొందిరి. బాహ్యముతో సంబంధము లేక అంతరంగమున కృష్ణానుభూతితో పరవశులై ఆడిపాడిరి. వీరందరును మధురావాసులే. స్వాధిష్ఠానమున గల శ్రీమాత యిట్టి అనుభూతితో జీవుల యందుండి జీవులకు కూడ మధురానుభూతిని పంచుటకు సంసిద్ధమై యున్నది. ఆమె మధుప్రీత. ఆమెను ఆరాధించువారు కూడ అట్టి అనుభూతిని పొందగలరు. మధువు అంతరంగ రసానుభూతియేగాని, మద్యపానము చేయువారికి కలుగు అనుభూతి గాదు. కొందరు శ్రీవిద్య ఉపాసకులు తగు మాత్రము మద్యము గ్రోలి ఆరాధనచేయు ఆచార మొకటి నేటికిని వాడుకలో వున్నది. మద్యము వలన చైతన్యమునకు మైకము కలుగును గాని అది ఆనందము కాజాలదు. రసానుభూతి వేరు, మద్యపానాను భూతి వేరు. రెంటికిని చాల వ్యత్యాసమున్నది. భక్తి పరిపక్వత చెందు చుండగ, అట్టి భక్తి శ్రీమాత యందనురక్తిగ మారుచుండగ, మేదస్సు

నుండి రస ముద్భవించును. తన్మయత్వము కలుగును. ఇది అంతరంగ రసాయనము. బాహ్య సాధనములగు మద్యము, కల్లు యిత్యాదివి జీవుని చైతన్యరహితునిగ చేయును గాని రసభరతుని చేయలేవు.



# 511. 'బందిన్యాది సమన్వితా'

**బం**దిని మొదలగు ఆరుగురు దేవతలతో నుండునది శ్రీమాత అని అర్థము.

పాశము, త్రిశూలము యిత్యాది ఆరు ఆయుధములతో శ్రీమాత యిచట సుప్రతిష్ఠయై యున్నదని 504వ నామమున వివరించుట జరిగినది. స్వాధిష్ఠానమున ఆరు దళములు శిష్టులకు సుమేదస్సును కలిగించి ఆనందము నీయగ, శిష్టులు కాని వారికి అరిషడ్వర్గములను పుట్టించును. అసూయ, గర్వము, కామము, కోపము, రాగము, ద్వేషము యిత్యాదివి కలుగును. వాటితో జీవుడు దేహమున బందీ అగును. బంధమునకు ప్రథమ కారణము అసూయ, మిగిలిన వన్నియూ అసూయతో పుట్టు వికారములు. ఈ వికారముల కారణముగ జీవుడు బంధములకు గురి యగును. అప్పుడు బందిని ఆదిగా గల దేవతలు దేహమున బంధించి రోగపీడితునిగ చేసి దుఃఖ పరంపరలో ముంచెత్తును. అసూయ లేనివారే నిజమగు అదృష్టవంతులు. అసూయ దాటుట ప్రధానమగు పురుషకారము.



# 512. 'దధ్యన్నాసక్త హృదయా'

పెరుగుతో కూడిన అన్నమునందు ఆసక్తిగలది శ్రీమాత అని అర్థము.

పెరుగుతో కూడిన అన్నము స్వాధిష్ఠాన కేంద్రమందలి దేహ ధాతువుల అభివృద్ధికి తోడ్పడును. ఆరోగ్యకరము. ఉప్పు, పులుపు, తీపి, కారము యిత్యాది ఆహారముల యందలి హెచ్చుతగ్గులను పెరుగన్నము సరిదిద్ది సమన్వయ పరచును. పెరుగన్నము తినని వారికి కడుపున ప్రకోపము లెక్కువగ నుండును. రకరకముల ఆమ్లములు, క్షారములు సమన్వయపడక జీర్ణకోశమంతయూ అస్తవ్యస్తమై నీరసము, విసుగు, చిరాకు, కోపము యిత్యాదివి యేర్పడి దేహమునకు అస్వస్థతను కలిగించును. స్వాధిష్ఠానము సమవర్తనము కోల్పోయినచో ఆరోగ్యము అస్తవ్యస్థ మగును. పెరుగన్నము తుది అంశముగ భోజనము ముగించుట ఆరోగ్యకరము. ఇతర అంశములను బాగుగ భుజించి పెరుగన్నము క్లుప్తము చేయుదురు. ఇది సరికాదు. రెండు వంతులు యితర భోజనము గావించి ఒక వంతు పెరుగన్నమునకు యేర్పరచుకొనవలెను. పులిసిన పెరుగు, మజ్జిగ వర్జనీయము. దైవోపాసకులు ఈ విషయమును గ్రహింపవలెను. దేహమునందు ప్రాణము అస్తవ్యస్తమై యుండగ పూజయందు మనసు నిలబడదు. దేహము తగుమాత్రము ఆరోగ్యముగ వుండుట ప్రధానము.

ఈ పద్మమందుగల యోగినీ మాతకు దధ్యన్నము నైవేద్యము పెట్టుట వలన తృప్తి చెందునని చెప్పుటలో పై విషయమును గ్రహింప గలరు.

# 513. 'కాకినీరూప ధారిణీ'

స్వాధిష్ఠాన మండలి అమ్మవారిని కాకినీదేవి అని లలితా సహస్రమున చెప్పబడి యున్నది. కాకిని అనగా కకార భావము కలిగి యుండునది. కకారము కామబీజము. కామము దివ్యము, అమృతమయము. దానిని భూమిపై సవ్యముగ నిర్వర్తించగల శక్తి సిద్ధులకు ఉండును. ఇతరులు అట్టి శక్తిని పొందునంతవరకు భూమిపై అనుభవము చెందుచూ, జనన మరణముల చక్రమందు తిరుగు చుందురు. యోగ శాస్త్రమున హృదయమునకు కాకినీమాత నిర్వచింప బడినది. యోగ శాస్త్రమున ఈ కేంద్రమునకు స్వాధిష్ఠాన పద్మమున రాకినీమాత తెలుపబడగ, యిచ్చట కాకినీ అని తెలుపబడినది. స్వాధ్యాయమున తెలియవలసిన కొన్ని విషయములు ఈ విధముగ వ్యత్యాసముతో గోచరించుట కద్దు. షట్చక్ర నిరూపణము నందుగల వివరములకు, లలితా సహస్రము నందు గల వివరములకు వ్యత్యాస మున్నట్లు గోచరించును. నిజమున కట్టి వ్యత్యాసము లన్నియూ అంతర్గత ధ్యానమున పరిష్కారము కాగలవు.

యాకినీ, హాకినీ, సాకినీ, కాకినీ, లాకినీ, రాకినీ, డాకినీ యిట్లు ఏడు నామములు అటు యిటుగా ఏడు కేంద్రములలో చెప్పబడెను. నిజమునకు ఈ దేవత లందరునూ బీజాక్షర సంకేతములు. యం, హం, సం, కం, లం, రం, ఢం– ఇవి అన్నియూ బీజాక్షరములే. వీనికి గల ఆరోహణ అవరోహణ క్రమములు అంతర్దృష్టికి సమముగ గోచరింపగలవు. స్వాధిష్ఠానమున వరుణ బీజముగ 'వం' కూడ తెలుపబడి యుండును. వీటి పరిష్కారములు గురు శిష్య అనుగతముగ తెలియును.

## 514. 'మూలాధారాంబుజారూఢా'

**మూ**లాధారము నందు నాలుగు దళముల పద్మమునందు నివసించు శ్రీమాత అని అర్థము.

## 515. 'పంచవక్త్ర'

**ఐ**దు ముఖములు కలది శ్రీమాత అని అర్థము.

## 516. 'అస్థి సంస్థితా'

**ఎ**ముకల నందుండునది శ్రీమాత అని అర్థము.

## 517. 'అంకుశాది ప్రహరణా'

**అం**కుశము మొదలగు ఆయుధములను బాహువునందు ధరించునది శ్రీమాత అని అర్థము.

## 518. 'వరదాది నిషేవితా'

**వ**రద మొదలగు దేవతలచే పూజింపబడునది శ్రీమాత అని అర్థము.

## 519. 'ముద్గౌదనాసక్తచిత్తా'

**మి**నుప పప్పుతో కలిపిన అన్నమునందు ఆసక్తి కలది శ్రీమాత అని అర్థము.

# 520 'సాకిన్యంబా స్వరూపిణీ'

సాకినీ అను పేరుగల మాతగ మూలాధార పద్మమునందున్నది.

514 నుండి 520వ నామము వరకు మూలాధార దేవత స్థితి యున్నది. మూలాధార పద్మము నాలుగు దళములతో నుండును. అందు శం, సం, షం, హం అను నాలుగు బీజాక్షరము లుండును. కేంద్రమున 'లం' అను బీజాక్షర ముండును. ఈ పద్మము ఎర్రని రంగులో నుండునని తెలుపుదురు. ఇందలి శ్రీమాత పంచముఖి. అనగా ఐదు భూతములు వ్యక్తమైన స్థితి. ఈ స్థితియందు సృష్టి, జీవ రూపముల సృష్టి భౌతికమునకు చేరును. జీవులయందు అత్యధిక భౌతిక స్థితి అస్థికలకు (ఎముకల) ఉండును. దేహ ధాతువులలో ఎముక ఏడవది. ఎముకలు ఆధారముగనే మిగిలిన ఆరు ధాతువులకు రూప మేర్పడును. మూలాధార ప్రజ్ఞ ఆరోగ్యముగ నున్నచో ఎముకలు పటిష్ఠములై, పుష్టములై భౌతిక రూపము చాలా కాలము చెడకుండ నిలచును.

సహస్రారము నుండి మూలాధారమునకు శ్రీమాత అవతరణమే సృష్టి అవతరణము. సృష్టి మూలాధారము చేరుసరికి పరిపూర్ణత చెందును. అట్టి సృష్టిలో జీవులందరూ ఏడు లోకములను నిండి నివసింతురు. మరల ఆరోహణ క్రమమున సహస్రారమును చేరుటకే దివ్యవిద్య లన్నియూ. సహస్రారమునందెట్టి ప్రజ్ఞ యున్నదో మూలా ధారము నందు కూడ అట్టి ప్రజ్ఞయే యున్నది. సహస్రారము నంతయూ

అవ్యక్తము. మూలాధారమున అంతయూ పూర్ణ వ్యక్తము. ఒకటి అమావాస్య వంటిది కాగ రెండవది పూర్ణిమ వంటిది. ఏమియూ లేనట్టుగా వున్న స్థితి నుండి అన్నియూ వున్నట్లుగా గోచరమగుట అంతయూ శ్రీమాత మహిమ.

మూలాధారము నందు బీజమునగల అక్షరము కారణముగ అందలి యోగినీ మాతను 'లాకినీ' అందురు. మరికొందరు 'డాకినీ' అందురు. లలితా సహస్రములో 'సాకినీ' అని తెలుపబడినది. ఇందు గల నాలుగు దళములయందు వరదా, అభయ, దాక్షాయణి, సరస్వతి యిత్యాది దేవతలను పూజించు సంప్రదాయ మున్నది. డాకినీ అన్నను దాక్షాయణి అన్ననూ ఒకటియే అని కొందరి మతము. నిరుక్తమాధార ముగ ఈ సమన్వయము తెలుపుదురు. దాక్షిణ్యా, దక్షిణా, దక్కనూ, డాకినీ- యివి అన్నియూ దాక్షాయని పదమునుండి పుట్టినట్లు నిరుక్త శాస్త్రజ్ఞులు తెలుపుదురు.

ఇందలి శ్రీమాత చతుర్బాహువులందు కమలము, పుస్తకము, జ్ఞానముద్ర, అంకుశము ధరించి యుండును. ఇచ్చటి శ్రీమాత భస్మ ధారిణియై యుండును. సహస్రారమున పరమశివుడు భస్మధారి. మూలాధారమున శ్రీమాత భస్మధారి. భస్మము నుండి పుట్టిన సృష్టి గమ్యము మరల భస్మమే అని తెలుపుటకు భస్మ మలంకరించుకొని శ్రీమాత యుండును. భస్మము పరమ పవిత్రము. కనుకనే దానిని ముఖమున అలంకరించుకొనుట సంప్రదాయమైనది.

ఈ పద్మమందలి శ్రీమాత మినుప పప్పుతో వండిన అన్నమును ఆహారముగ స్వీకరించును. దేహ దారుఢ్యమునకు మినుపపప్పు చాల ప్రధానమైనటువంటిది. మాంసకృత్తులు మెండుగ నుండుటచే బలము కూర్చును. మాంసముకన్న మినుమే బలమైనదని ఋషులు తేల్చి చెప్పి నారు. మినుము ఇనుమే అను నానుడి కలదు. ప్రతినిత్యము రెండు మినుప యిడ్లీలు ఉదయముననే స్వీకరించుట దక్షిణ భారతమున ఆచారము. అట్లు నిత్యమూ భుజించువారికి దేహము దృఢమై యుండును. మాస్టర్ సి.వి.వి. అను పరమగురువు యోగ సాధకుల కందరికినీ సాధనకు మునుపే రెండు మినుప ఇడ్లీలు భుజింపుడని శాసించినారు. భారతదేశమున ఆహార సంప్రదాయము లన్నియూ కేవల ఆరోగ్యమునకే సంబంధించినవి కాక యోగమునకు కూడ ఉపకారములుగ యేర్పరచినారు. బియ్యము, మినుము సమపాళ్ళలో రుబ్బుకొని ఆవిరి కుడుములుగ నేర్పరచుకొని వాటిపై తగు మాత్రము ఆవు నెయ్యిని వేసుకొని ప్రథమ ఆహారముగ భుజించుట ఉత్తమము.

మూలాధారము నుండియే నిద్రాణమైన శ్రీమాత చైతన్యము ఉద్భవించి జీవులను చైతన్య మార్గమున ఊర్ధ్వగతికి చేర్చును. దీనినే కుండలినీ ప్రచోదనమని అందురు.



## 521. 'ఆజ్ఞాచక్రాబ్జ నిలయా'

**క**నుబొమల మధ్య రెండు దళములుగల పద్మము నందు వుండు శ్రీమాత అని అర్థము.

## 522. 'శుక్లవర్ణా'

**తె**ల్లని వజ్రపు కాంతి కలది శ్రీమాత అని అర్థము.

## 523. 'షడాననా'

**ఆ**రు ముఖములు కలది శ్రీమాత అని అర్థము.

## 524. 'మజ్జాసంస్థా'

**మ**జ్జయందుండునది శ్రీమాత అని అర్థము.

## 525. 'హంసవతీ'

**హం**సవలె స్వచ్ఛమై, విహంగ గమనము కలది శ్రీమాత అని అర్థము.

# 526. 'ముఖ్యశక్తి సమన్వితా'

ప్రధానమగు తన శక్తులతో కూడి యున్నటువంటిది శ్రీమాత అని అర్థము.

# 527. 'హరిద్రాన్నైక రసికా'

హరిద్రాన్నము నందు ఆసక్తి కలది శ్రీమాత అని అర్థము.

# 528. 'హాకినీ రూపధారిణీ'

హాకినీ అనే రూపమును, నామమును ధరించియున్నది శ్రీమాత అని అర్థము.

**(521 నుండి 528 వరకు వివరణము)**

అత్యంత ప్రధానము, మహిమాన్వితము, సౌందర్యమగు ఆజ్ఞా పద్మమందలి శ్రీమాత వర్ణింపబడుచున్నది. ఆజ్ఞా పద్మము రెండు దళములు గలదియై యున్నది. ఇడ పింగళ ప్రజ్ఞలు రెండు దళములుగ వికసింపగ దాని మధ్యమున అమితమగు తెల్లని ప్రకాశముతో శ్రీమాత యుండును. వజ్ర సమానమైన ప్రకాశమది. సూర్యుని కాధారమై సూర్యుని నుండి దిగివచ్చు వెలుగు. అమిత కాంతివంతము, అత్యాకర్షణ

వంతము- ఇచ్ఛటి శ్రీమాత రూపము. మిగిలిన ఐదు పద్మములకు ఆధార మీ పద్మము. జీవులకు మూలము అగు సత్య స్వరూపము ఇచ్ఛటి శ్రీమాత. ఈమె నుండియే పంచ భూతాత్మకమగు సృష్టి, సృష్టి జీవుల రూపములు ఏర్పడును. హంసవలె శాశ్వత జలముల యందు తేలియాడు చుండును. సృష్టి నిర్వహించుచున్ననూ సృష్టికి సుదూరముగ స్వచ్ఛమై వెలుగొందుచుండును. హంసవతీ అనుటలో హంస లక్షణము లన్నియూ ఈ పద్మమునందుగల ప్రజ్ఞకు వున్నవని తెలియనగును. శివునితో కూడియుండి సృష్టి నిర్మాణమునకు సంధానకర్తయై యున్ననూ, సృష్టి ప్రభావము తనపై ఏ మాత్రము ప్రసరింపదు. శివ తత్త్వముతోనే చిరుహాసముతో సృష్టినంతయూ నిర్వహించును. ఇచ్ఛటి శ్రీమాతకు ఆరు ముఖములు వర్ణింపబడినవి. ఆమె 'షడాననా'. గాయత్రి మాతను కూడ షడాననగా తెలుపుదురు. ఇచ్ఛటి శ్రీమాత గాయత్రియే యని తెలియవలెను. షడానన యగు శ్రీమాతను ఘనరూపిణి యందురు. ఘనమునకు కూడ ఆరు ముఖములు కలవు. ఆరు ముఖములు సంవత్సర మందలి ఆరు ఋతువులతో పెద్దలు సమన్వయింతురు. తత్కారణముగ సంవత్సర చక్రమును గాయత్రి స్వరూపముగ దర్శించు సంప్రదాయ మేర్పడినది. ఆరు ఋతువుల యందు పన్నెండు పూర్ణిమలు, పన్నెండు అమావాస్యలు కలవు. ఈ ఇరువది నాలుగు పర్వదినములు గాయత్రి మాత ఇరువది నాలుగు తత్త్వములుగ సంవత్సరమున దర్శించి కీర్తించుట ఋషుల సంప్రదాయము. గోళము వ్యక్తరూపమే ఘన మనియూ, ఘనము సృష్టి సమగ్ర రూపమనియూ, అట్టి ఘనము

శ్రీమాత చైతన్యమనియూ తెలియవలెను. ఘనమందలి 24 లంబ కోణములు, 24 తత్త్వములను, వర్ణములను (అనగా శబ్దములు, రంగులు, అక్షరములు) వాని అర్థములుగను, దానినే సంవత్సర కాల చక్రముగను, మానవ సృష్టిగనూ తెలుపుదురు. తెలియవలసినది ఏమనగా సృష్టికి ఆధారమగు ముఖ్య శక్తి, ఆజ్ఞా కేంద్రమందలి ప్రజ్ఞయే యని.

ఆరు ముఖములకు, ముఖమునకు మూడు చొప్పున పదునెనిమిది కనులు గలవు. '18' అను సంఖ్య సృష్టి రహస్యములను బోధించు సంఖ్య. ఈ సంఖ్యను జయ మనియు, యజ మనియు సంకేతింతురు. ఆజ్ఞా చక్రమందలి శ్రీమాతను దర్శించిన వారికి యజ్ఞార్థ జీవనము, సర్వతోముఖ జయము సిద్ధించును. పదునెనిమిది పర్వములతో కూడిన మహా భారతము వేదవ్యాస మహర్షి 'జయము' అని పేర్కొనినాడు. యజము నిర్వర్తించిన వారికే జయము అని రహస్యార్థమును తెలిపి నాడు. అట్లే భగవదుపదేశమును కూడ పదునెనిమిది అధ్యాయములలో యేర్పరచినాడు. సృష్టి యందు పదునెనిమిది తత్త్వములు దివ్యములని, అమృతములని, అవ్యక్తములని, ఆరు తత్త్వములు వ్యక్తములని పురుష సూక్తమున ప్రతిపాదింపబడినది. ఇట్టి వ్యక్తా అవ్యక్త సృష్టికి శ్రీమాతయే ఆధారము. అట్టి శ్రీమాతను భ్రూమధ్యమున ద్విదళ పద్మమున ఆరాధించి దర్శించుట ఉత్తమోత్తమ మని ఋషుల అభిప్రాయము. ఇట్టి మాత చైతన్యమే అంతటా అన్నిటా, వ్యాపించి యుండును. సృష్టిదారులు అన్నిటియందు ఆమె వ్యాపించి యున్నది. అన్ని నాళములు, అన్ని నరములు శ్రీమాత చైతన్యముతోనే నిండియున్నది. ఆజ్ఞ నుండి

మూలధారము వరకు గల నాళమునందు, ఈ నాళమునందు వికసించిన వివిధ పద్మములందు, ఆ పద్మముల నుండి వ్యాప్తిచెందు నరముల యందు, నాళములందు శ్రీమాత స్థితికొని యుండుట వలన 'మజ్జా సంస్థా' అని కీర్తింపబడుచున్నది. సృష్టి యందంతయూ ఈమెయే యింకి యున్నదని తెలియనగును. స్వర్గము, నరకము, పాతాళము అన్నిటి యందు వ్యాప్తిచెంది వాటికి ఆధారమై నిలచు సర్వవ్యాపిని తత్త్వమును 'మజ్జాసంస్థా' అను నామముతో యిచ్చట కీర్తించుట జరిగినది.

ఆరు శక్తులు కూడిన శక్తిని ముఖ్య శక్తి అందురు. ఈ ముఖ్య శక్తినే కుమారు డందురు. కుమారుడు శ్రీమాతను అనుసరించి యుండును, అంటి పెట్టుకొని యుండును. అందువలననే కుమారుడు షణ్ముఖుడుగా కీర్తింపబడుచున్నాడు. కుమార శక్తియే శ్రీమాత శూలముగా ప్రకాశించుచుండును. దీనిని మించిన శక్తి లేదు. ఈ శక్తి ఎప్పుడునూ శ్రీమాతను అంటిపెట్టుకునే యుండును గనుక ముఖ్యశక్తి సమన్వితా అని కీర్తించుట జరిగినది.

హంస స్వరూపిణి యని ముందు తెలుపబడినది కదా! శిష్టులకు ఈమె హంస స్వరూపిణి, దుష్టులకు ఈమె హింసా స్వరూపిణి. దుష్టులను సింహమువలె హింసించగలదు. అందువలన సింహవాహిని అయినది. శిష్టులకు హంసవలె గోచరించి ఉత్తమోత్తమ మగు దివ్యానుభూతి, రస సిద్ధి కలిగించు చుండును.

శ్రీమాత ఆరాధకులు అనుగ్రహము పొందుటకు, పసుపుతో కూడిన అన్నమును ఈమెకు నైవేద్య మొసగి తాము భుజింతురు. శ్రీమాతకు పసుపు అన్నము అనినచో యిష్టము. ఆమె 'హరిద్రాన్నైకరసికా'. వారమున కొకమారైననూ పసుపు అన్నము భుజించుట వలన శరీరమందలి రుగ్మతలు నశించునని ఆయుర్వేదము తెలుపుచున్నది.

ఈ ఆజ్ఞా పద్మమందలి శ్రీమాతను 'హం' అను శబ్దముతో ఆరాధించుట సంప్రదాయము. 'హం' అనునది మూల ప్రకృతికి సంబంధించిన శబ్దముగను, 'సం' అను శబ్దము మూల పురుషునికి సంబంధించిన శబ్దముగను ఋషులు గుర్తించి కీర్తించిరి. పురుష సూక్తము 'స' అను శబ్దముతో ప్రారంభమగును. శ్రీ సూక్తము 'హ + ఇ' శబ్దముతో ప్రారంభమగును. ఈ రెండు శబ్దములు ప్రకృతి పురుషులు. వీని రసాయనమే సృష్టి. సహ, హంస, హసౌం, సోహం, హంస, సింహ, హింస యివి అన్నియూ ప్రకృతి పురుషుల వివిధ రసాయనము. ఇందు ప్రధానముగ 'హం' అను శబ్దమును ధ్యానించి ధరించుట ఆజ్ఞా పద్మ దర్శనమున కెంతయూ ప్రయోజనకరము. 'హ్రీం' అను శబ్దమునకు కూడ మూలమిదియే. ఈ శబ్దమే శ్రీమాత రూపముగ యిచ్చుట వర్ణింపబడినది. శ్రీమాతది హాకినీ రూపమని తెలుపుచూ, 'హాకినీ రూపధారిణీ' అని కీర్తించిరి.



## 529. 'సహస్రదళ పద్మస్థా'

వేయి దళముల పద్మమునందు వసించియుండు శ్రీమాత.

## 530. 'సర్వవర్ణ ఉపశోభితా'

అన్ని వర్ణములతో ప్రకాశించునది శ్రీమాత.

## 531. 'సర్వాయుధ ధరా'

సమస్త ఆయుధములను ధరించి యుండునది.

## 532. 'శుక్ల సంస్థితా'

వీర్యము నందుండునది శ్రీమాత అని అర్థము.

## 533. 'సర్వతోముఖీ'

అన్ని దిక్కుల యందు ముఖము కలది శ్రీమాత అని అర్థము.

## 534. 'సర్వౌదనప్రీత చిత్తా'

పాయసాన్నము మొదలుగ హరిద్రాన్నము వరకు గల అన్ని రకముల అన్నాహారములయందు ప్రీతి కలది శ్రీమాత అని అర్థము.

# 535. 'యాకిన్యంబా స్వరూపిణీ'

**యా**కినీ దేవి అని పిలువబడునది శ్రీమాత అని అర్థము.

**(529 నుండి 535 వరకు వివరణము)**

సహస్రదళ పద్మము శివశక్తుల సమాగమ స్థానము. వేయి దళములు వేయి సూర్యులతో సమానమగు ప్రకాశము కలిగి యుండును. సహస్ర అను శబ్దమే సర్వశక్తియుతము, సర్వతేజోమయము. ప్రకృతి పురుషుల సమాగమ ప్రజ్ఞ పరిపూర్ణముగ వికాసము చెందు స్థానము. 'సహ' అను శబ్దమునకు పురుష ప్రకృతులని ముందు తెలుపబడినది. వాని సమాగమ స్థితియే సహస్రము. సమస్తమగు శబ్దము లిచ్చట నుండియే పుట్టును. సమస్తమగు రంగులకు కూడ యిదియే మూల స్థానము. అక్షరములకు మూలస్థానము కూడ నిదియే. కావున సర్వ వర్ణములతో శోభించు పద్మము అందురు. వర్ణములనగా శబ్దములని, రంగులని, అక్షరములని తెలుపబడినది. అకారాది క్షకారాంతములైన అక్షరములకు ఉత్పత్తి స్థానమిది. అమృతము మొదలు క్షమాగుణము వరకు గల సర్వశక్తులు, ఆయుధములు, ఈ పద్మము నుండే పుట్టి ప్రకాశించును. అందువలన ఈ పద్మమందలి శ్రీమాతను 'సర్వాయుధ ధరా' అని కీర్తింతురు.

సహస్రమను సంఖ్యను 10 × 10 × 10గ గుర్తించవచ్చును. పదిమార్లు ఆరోహణము చేసినపుడు ఒక పూర్ణమగు స్థితి లభించును.

అట్టిది నూరుమార్లు పూర్ణ స్థితిగ ఊహించినచో వేయి సంఖ్య అనగా ఎంతటి పరిపూర్ణమో తెలియును.

వేయి దళములు, వేయి శబ్దములు, వేయి రంగులు, వేయి అక్షరములు, వేయి ఆయుధములు యిట్లు ఊహించినపుడు, ఊహించు వాడు కరగిపోవుటయే జరుగును. ఇచ్చట పది దిక్కుల యందును, ఉన్ముఖముగ నున్న శ్రీమాత ముఖములు వర్ణింపబడినవి. అనగా విశ్వమునంతనూ ఒక్కమారుగ దర్శనము చేయు శక్తి అని తెలియవలెను. అన్ని దిక్కులను ఏక కాలమున అనుగ్రహించు మాత అని తెలియ వలెను. సర్వదిక్కులను శాసించుచు, పోషించుచు, దర్శించుచు, అనుగ్రహించుచూ వుండు మాత, ఈ పద్మమున ఆసీనురాలై యున్నదని తెలియనగును.

పై తెలిపినట్టి పరిపూర్ణము అగు శ్రీ శివ శక్తి జీవుల వీర్యముగ దిగి వచ్చుచుండును. అట్టి వీర్యము ఎంత మహత్తరమైనది. దానిని జీవుడు ఉపయోగించు తీరు అతని సంస్కారమును తెలియజేయును. ఆ వీర్యశక్తిని బ్రహ్మమునకే సమర్పణ జేసి జీవించుట బ్రహ్మచర్య మనబడును. గృహస్థాశ్రమ ధర్మమునకే వినియోగించుట ఉపయుక్తము. అట్లు కానిచో జీవుడు పతనము చెందును. శ్రీమాత శుక్ల సంస్థిత. శుక్లమును అత్యంత పవిత్రముగను, అమూల్యముగను భావించువారు శ్రీమాత ఆరాధనమున ఆమె అనుగ్రహ వశముచే సహస్రదళ పద్మమును చేరగలరు. కాముకులు పతనము చెందగలరు.

ఇచ్చట శ్రీమాతను శ్రీ లలిత అని పేర్కొనవచ్చును. యాకినీ

దేవి అని కూడ పిలుతురు. 'యం' అనునది ఈ పద్మమున ఆరాధింపబడు బీజాక్షరము.

షట్ పద్మములను వర్ణించినపుడు వివిధ అన్నాహారములు తెలుపబడినవి. నేతి అన్నము, గుడాన్నము, పాయసాన్నము, దధ్యన్నము, పప్పు అన్నము, చిత్రాన్నము. ఈ అన్నము లన్నిటియందు ప్రీతిగలది ఈ పద్మమందలి శ్రీమాత. అందులకే అన్నమందు అన్ని కూరగాయలు, అన్ని పప్పులు, బెల్లము, నెయ్యి వేసి సర్వోదనమును తయారుచేసి నైవేద్యము పెట్టుట ఆచారముగ వచ్చినది. దీని రూపాంతరమే ప్రస్తుతము వెజిటబుల్ ఫ్రైడ్ రైస్ అనుచూ భుజించుచున్నారు. ఇది సమగ్రము కాదు.

ఏదెట్లున్ననూ ఆహారము నందు ప్రీతి యుండుట ఆరోగ్యమునకు సంకేతము. పరిపూర్ణ ఆరోగ్యము లేనివారు ఆహారమునందు కొన్ని మాత్రమే భుజించు చుందురు. కొన్నింటిని వర్జింతురు. నిజమునకు ఆహారమునం దాసక్తి, రుచి కలిగి సమగ్రముగ భుజించువారు దేహ పుష్టి కలిగి యుందురు. సృష్టి రూపము శ్రీమాత దేహము. ఆమె తన దేహమును పుష్టికరమగు ఆహారముచే పోషించు చుండును. ఆహారము బ్రహ్మ స్వరూపము అని తెలిసి భక్తి శ్రద్ధలతో భుజించుట సదాచారము. అన్న బ్రహ్మమును బ్రహ్మమునకు సమర్పణగ భుజించవలెనని భగవద్గీత యందు కూడ సూచింపబడినది. అట్లు భుజించు వారియందు బ్రహ్మమే అగ్ని స్వరూపుడై సమస్తమును భక్షించి పుష్టికరమగు దేహమును అనుగ్రహించును.

# 536. ‘స్వాహా స్వధా’

అగ్ని తత్త్వము పరమశివుడు కాగా అగ్నిరూపము ధరించునది శ్రీమాత. అట్టి శ్రీమాతను స్వాహా మరియు స్వధా అని పిలుతురు. కావున ఈ రెండు నామములు ఒకే తత్త్వమును సూచించు శ్రీమాత నామములని తెలియవలెను.

స్వాహా శబ్దమునకు అనేక అర్థము లున్నవి. దేవతలకు తుష్టిని పుష్టిని ఇచ్చునది స్వాహాదేవి. తానే రక రకములగు హోమ ద్రవ్యములై అగ్ని స్వరూపిణిగ వానిని భక్షించుచు వివిధ దేవతలకు తుష్టిని పుష్టిని కలిగించునది అని అర్థము. అట్లే తర్పణముల ద్వారా పితృదేవతలకు తుష్టిని పుష్టిని యిచ్చునటువంటి దేవి కనుక స్వధా అందురు.

‘స్వ’ అనగా స్వర్గము. ‘స్వ’ అనగా ఆత్మ. ‘ఆహా’ అనగా గతి పొందుట. కావున స్వాహా అనగా స్వర్గానుభూతి అనియు, ఆత్మాను భూతి అనియు అర్థము.

‘స్వ’ అనగా ఆత్మ. ‘హా’ అనగా ఉచ్చారణము.

ఆత్మ నుండి సంకల్ప రూపముగ దిగివచ్చునది స్వాహాదేవి అని మరియొక అర్థము.

అగ్నితత్త్వమైన శివునకు అగ్ని రూపమగు దేవి స్వధా అని లింగ పురాణమందు, స్వాహా అని అగ్ని పురాణమందు తెలిపియున్నారు.

కావున స్వాహా అన్నను స్వధా అన్ననూ ఒకే శ్రీమాత తత్త్వమునకు గల రెండు నామములుగ తెలియవలెను. వీరి కుమారుడే షణ్ముఖుడగు స్కంధుడు.

పద్మ పురాణమందు, మహేశ్వర పురమునకు అధిష్టాత్రి అగు శ్రీమాత స్వాహాదేవి అని తెలుపబడెను. ఈమెనే మహేశ్వరి అని అందురు.

స్వధా అనగా బాగుగా ధరించునది అని అర్థము. సృష్టిని బాగుగా ధరించి పోషించునది గనుక స్వధా అని శ్రీమాతను ప్రశంసింతురు. స్వధా అనగా తనను తాను ధరించుట అని అర్థము. అనగా ఆత్మయే ఆధారముగ జీవించుట అని అర్థము. సాధు అన్న పదము స్వధా పదము నుండియే ఉత్పన్న మయ్యేను. తనకు తానే ఆధారమై సమస్తమునకు తాను పోషకుడై నిలచినపుడు స్వధానమున చేరినట్లు భావించవలెను.



# 537. 'అమతి'

**మ**తి లేనిది శ్రీమాత అని అర్థము.

మతికి అతీతమైనది శ్రీమాత అని విశేష అర్థము. శ్రీమాత నుండియే మతి పుట్టును. సృష్టి యందు మతి పుట్టుటకు ముందు చాల సృష్టి కథ జరిగినది. ఎన్నియో ధర్మములు, తత్త్వములు, శబ్దములు, రంగులు, అంకెలు మతికన్న ముందు పుట్టినవి. కాలము, ఛందస్సు యివి అన్నియూ కూడ మతికి ముందున్నవే. ఇవి అన్నియూ శ్రీమాత నుండి ఉద్భవించినవి. వీటి అల్లిక నుండి అహంకారము, బుద్ధి, మనస్సు యిత్యాదివి పుట్టినవి. కావున శ్రీమాత ప్రాథమికముగ అమతియే!

మనస్సునకు ఆవలి తత్త్వమంతయూ శ్రీమాతచే పరిపాలింప బడుచున్నది. బుద్ధి, ప్రాణ స్పందనము, అహంకారము, త్రిగుణములు యివి అన్నియూ మతికి ఆవలయున్న స్థితులు. మతిగ కూడ నుండునది శ్రీమాతయే అయినప్పటికినీ ఆమె మతికి అతీతమని తెలియవలెను. మతి కలిగినప్పుడే అమితముగ అనుమతి కలుగును. రస స్వరూపిణి యైన శ్రీమాత మతికి అందునది కాదు. తత్త్వానుభూతి జీవునకు సంబంధించినది కాని మనస్సంబంధితము కాదు.

మతి లేకుండుట అన్నది అతీత స్థితియే గాక అవిద్యాస్థితి యని కూడ తెలియవలెను. రాయి, రప్ప, చెట్లు, పుట్ట, జంతువు యిత్యాది

వాటికి కూడ మతి లేదు. అట్లే మతి లేని మానవులున్నారు. వీరందరునూ అవిద్యా స్థితికి గురియైనటువంటివారు. యిట్లు సృష్టి యందు మతికతీతులు, మతిహీనులు రెండు వర్గములుగ నున్నవి. మతిగల మానవులు ఈ రెంటినీ సంధించగలరు. కావుననే మానవ సృష్టితో శ్రీమాత సృష్టికార్యము పరిపూర్ణమైనదని ఋషులు కీర్తించు చున్నారు.

అమతి, సుమతి, కుమతి, దుర్మతి అని నాలుగు స్థితులు మతికి గలవు. అమతులను అమనస్కులగు దేవతా ప్రజ్ఞలుగ గుర్తింపవలెను. సజ్జనులగు మానవులను సుమతులుగ గుర్తింపవలెను. జ్ఞానము లేని మానవులను కుమతులుగ గుర్తింపవలెను. దుష్టకార్యములు చేయు వారిని దుర్మతులుగ గుర్తింపవలెను. రసా స్వాదమున మునిగినవారు మధుమతులు.



# 538. 'మేధా'

సకల శాస్త్రసారమైన శ్రీమాత అని అర్థము.

సర్వ భూతములందు మేధా రూపము ధరించునది శ్రీమాత. వారి యందలి ధీశక్తియే మేధా. ఆకాశమున ప్రకాశముగను, వాయువు నందు బలముగను, అగ్నియందు తేజస్సుగను, జలమునందు తుష్టి గను, పదార్థములయందు పుష్టిగను వుండునది శ్రీమాత. ఉప్పు ఉప్పగ నుండుటకు కారణము శ్రీమాతయే. అట్లే పంచదార యందు తీపిగ యుండును. ఇట్లు ప్రతి వస్తువు నందును దాని గుణముచే ప్రకాశించునది శ్రీమాత. అన్నిటి సారము శ్రీమాత. త్రిగుణములందలి త్రిశక్తి కూడ ఆమెయే. ఎవరియందామె పరిపూర్ణముగ వసించునో వారు మేధావంతులు కాగలరు. వేదవ్యాస మహర్షి, కాళిదాస కవి, తెనాలి రామలింగడు యిత్యాది మేధావంతుల యందలి మేధస్సు ఆమెయే. మన యందలి మేధస్సు వృద్ధిగావలె నన్నచో శ్రీమాతను ఆరాధించుట ప్రధానమని తెలియవలెను. అమ్మ అనుగ్రహమున్నచో పామరుడు పండితుడగును. అమ్మ అనుగ్రహము లేని పాండిత్యము అడవిగాచిన వెన్నెల వంటిది. ఎడారిలోని పుష్పముల వంటివి. శ్రీమాత అనుగ్రహముకొద్దీ మేధస్సు సుఫలమై జగత్కల్యాణమునకు వినియోగ పడును.

# 539. 'శ్రుతిః'

వేదరూపిణి శ్రీమాత అని అర్థము.

వేద మనగా తెలియదగినది. ఏది తెలిసిన మరి తెలియవలసిన దేదియు వుండదో దానిని వేద మందరు. అట్టి వేదమును ఒక రూపముగ నూహించినచో వేదమాత అనగా నేమో తెలియును. వేదరూపిణి అనగా నేమో తెలియును. తెలియకోరువాడు, తెలియవలసినది, తెలుసుకొను కార్యము మూడునూ దేనినుండి దిగివచ్చుచున్నవో అది వేదము. కర్త కర్మ క్రియలకు మూలము వేదము. మూల ప్రకృతికి, కాలమునకు కూడ మూలము వేదము. సమస్తము పుట్టుకకు మూలము వేదము. దానినే తత్ అనిరి. బ్రహ్మము అనిరి. వేదము అనిరి.

దానినుండియే ప్రథమ సంకల్పము ఏర్పడును. కాలము ఏర్పడును. ప్రకృతి పురుషులు ఏర్పడుదురు. మహదహంకారము, త్రిగుణములు యేర్పడును. త్రిగుణముల నుండి సృష్టిజీవులు, లోకములు యేర్పడును. పంచభూతాత్మక సృష్టి యేర్పడును. ఇట్లు అన్నిటికి మూల మేదియో తెలియుట వేదములు తెలియుట, బ్రహ్మమును తెలియుట, తత్త్వమును తెలియుట.

ఈ తత్త్వము ఏమియూ లేనట్లుగ యుండును. చోటువలె యుండును. అందుండి క్రమముగ అన్నియూ యేర్పడును. ఏర్పడిన వాటి కన్నిటికినీ కాలపరిమితి యుండును. కాని ఆ తత్త్వము మాత్రము కాలమునకు కూడ మూలమై యుండును. అది యెట్లుండునో తెలియ గోరువారు దానిని గూర్చి తపస్సు చేసి, తపస్సు ద్వారా దాని లోనికి కరగిపోవుదురు. తిరిగి తాముగ నేర్పడినపుడు దానిని వివరించలేరు.

తాము దానియందు కరగిపోయినపు డది యెట్లుండునో తమకునూ తెలియదు. యిట్లుండునని యెవరును వర్ణింపలేరు.

అట్టి వేదమును నిర్వచించుట దుర్లభము. అది అనిర్వచనీయము. దానికి నామము లేదు. రూపము లేదు. లింగము లేదు. అనగా చిహ్నము లేదు. అది స్త్రీ కాదు. పురుషుడు కాడు. నపుంసకుడునూ కాడు. సృష్టిలో తెలియబడు ఏ వస్తువుతోనైననూ దానిని పోల్చలేము. దానిని వివరించలేమని, దానిని గూర్చి తర్కించలేమని, దాని నుండి దిగివచ్చిన వారిని గూర్చి తెలియుట, వివరించుట నుండునని పెద్దలు పలుకుదురు. దానియందు యిమిడి యుండుట సాధ్యమని అంతకు మించి ఏదియూ సాధ్యము కాదని కూడ తెలుపుదురు. అట్టి అనిర్వచ నీయము, అవిజ్ఞేయము, అప్రతర్క్యము, అనామకము, అరూపకము, అయిన తత్త్వమునకు రూప మిచ్చునది శ్రీమాత. అనగా ఆ తత్త్వమే తన రూపముగా గలది శ్రీమాత అని తెలియవలెను. సృష్టి యందు దైవము ఆమెయే. సృష్టికావలి దైవము వెలుగై రూపము ధరించినపుడు శ్రీమాతగ దర్శన మిచ్చును. విశ్వవ్యాప్తమై కోటానుకోట్లు సూర్యకాంతిగ వర్ణింపలేని అందముతో, శోభలతో, శక్తులతో నుండు శ్రీమాత రూపమే తుది దర్శనము. అటుపై దర్శనము లేవు.

అట్టి శ్రీ తత్త్వము సంకల్పముగను, ప్రాణ స్పందనముగను, క్రియా రూపముగను అవతరించు చుండును. వీనినే ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి అందురు. ఆమె సంకల్ప వివరమే ఋగ్వేదము. ఆమె స్పందనాత్మక గానమే ప్రాణము. అదియే సామవేదము. ఆమె క్రియా చాతుర్యమే యజుర్వేదము. ఇచ్ఛా, జ్ఞాన, క్రియల ఫలమే అధర్వణ వేదము.

జీవుల యందు కూడ సంకల్పము లేర్పడును. అది ఋగ్వేద ఫలము. ప్రాణ స్పందనముగ సామగానము సాగుచుండును. అది జీవుల యందలి సామవేదము. జీవులు క్రియాధీనులై కార్యములు చేయుచుందురు. ఇది వారొనర్చు యజుర్వేదము. ఇట్లు మూడు వేదములు నిత్యము నిర్వర్తింపబడుతున్నవి. ఈ మూడింటి నిర్మలత్వమును బట్టి అధర్వ వేదముగ వారి జీవితము లేర్పడుచుండును. మూడునూ నిష్కల్మషము లైనపుడు, జీవితము దివ్యవైభవముతో కూడియుండును. కల్మషముల హెచ్చుతగ్గులను బట్టి వైవిధ్యము లేర్పడు చుండును. ఇట్లు నాలుగు వేదములు సృష్టి యందు, జీవుల యందు నిర్వహింప బడుచున్నవి. దీనిని తెలియుట వేదములను తెలియుట. ఇవి ఎచ్చటి నుండి పుట్టుచున్నవో తెలియుట వేదము తెలియుట. ఈ వేదమునే శ్రుతి యందురు. ఈ మాత శ్రుతిరూపిణి.

ఈ వేదములను వివరించుటకే వేదాంగములు, ఉపనిషత్తులు యేర్పడినవి. వేదాంగములు ఆరు. అవి వరుసగా 1) ఛందస్సు, 2) కల్పము. 3) శిక్ష, 4) వ్యాకరణము, 5) నిరుక్తము, 6) జ్యోతిషము.

వీని వలన సృష్టి స్వరూప స్వభావములు కొంత తెలియవచ్చును. ఉపనిషత్తులు బ్రహ్మమును చేరుటకు తెలుపబడిన మార్గములు.

వేద వేదాంగములను, ఉపనిషత్తులను వివరించునవే పురాణ ములు, ఇతిహాసములు. పదునెనిమిది పురాణములు, రెండు ఇతిహాస ములు కలవు. ఈ మొత్తమును వేద వాఙ్మయ మందురు. ఇదియే శ్రుతి. ఇది ప్రమాణమగు వాఙ్మయము. ఈ శ్రుతియే వేద ప్రమాణము. ఈ మొత్తము శ్రుతిని గురుముఖముగ విని నేర్చుకొనుట శ్రుతి విద్య అనబడుచున్నది.

# 540. 'స్మృతి'

శ్రవణము, స్మరణము వలన యేర్పడు జ్ఞానము శ్రీమాత అని అర్థము.

ముందు నామములో తెలిపిన వాఙ్మయమును వినుట వలన, మరల మరల స్మరించుట వలన జీవులయందు మేధోవికాసము కలుగును. ఇట్లు వికాసము కలిగించు జ్ఞాన రూపమున శ్రీమాత యున్నది.

ఉపనిషత్తులు, రామాయణ మహాభారతాది గాథలు, వేదాంగ ములు వినుచూ, స్మరించుచూ నేర్చుకొనుట స్మృతి విద్య. శ్రుతిని స్మృతి ద్వారా నేర్చుకొనుట సదాచారము. నేర్చిన వానివద్ద నేర్చుట విదితమగు విషయమే కదా! నేటికినీ వేదములు మంత్రములు, స్తోత్రములు నేర్చినవారు పలుకుచుండగా విని నేర్చుకొనుట సదాచారముగ జరుగుచున్నది. స్వంతముగ నేర్చుకొనుట సదాచారము కాదు. అది స్వతంత్ర బుద్ధికి చిహ్నము. అట్టి వారియందు విద్య రాణించుట కష్టము. అహంకారము కారణముగ విద్యలు రాణింపవు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు వంటి అవతారమూర్తులు కూడ సద్గురువుల నాశ్రయించిరి. శుశ్రూషలు చేసిరి. వినయము గలవారికే విద్య అని తెలియవలెను. సంపదలలో వినయ సంపద చాల గొప్పది.

శ్రీమాతయే స్మృతి, శ్రుతి రూపము గనుక ఆమెను భక్తి శ్రద్ధలతో ఆరాధన చేయువారు సర్వవిద్యల సారమును పొందగలరు. భక్తులీ

మార్గమునసే సర్వవిద్యలను నేర్చిరి. శ్రీమాత సర్వవిద్యా స్వరూపిణి కదా! ఆమెను గూర్చిన శ్రవణము, స్మరణము వలన కూడ జీవులు పూర్ణ వికాసము చెందుదురు. ఇదియునూ సదాచారమే. శ్రుతి స్మృతులు జీవుల మేధస్సును క్రమముగ వృద్ధి పరచుచూ తరింపజేయును. తరువాత నామము దీనినే ప్రతిపాదించును.



# 541. 'అనుత్తమ'

**సా**టిలేని ఉత్తమ చైతన్యమనియూ, కొలుచువారికి ఎడతెగని ఉత్తమ స్థితిని కల్పించునదనియూ అర్థము.

శ్రీదేవి కంటే ఉత్తమమైనది లేదు. మహా చైతన్యముతో సమాన మైన దేమియూ లేదు. అధికమైనదీ ఏమియూ లేదు. ఆమెయే సకల సృష్టికినీ సహజమగు ఐశ్వర్యము మరియు బలము. సకల దేవతల యందును, ఋషుల యందును ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులుగా శ్రీమాతయే యున్నది. ఆమె అనుగ్రహములేనివా రెవ్వరైననూ శక్తిహీనులే. కావున ఆమెతో సాటి సృష్టియందు ఏమియును లేదు. శ్రీమాత నారాధించు వారికి క్రమముగ ఉత్తమత్వము ఏర్పడుచునే యుండును. 'అను' అను విశేషము ఉత్తమత్వమునకు చేర్చుటచే ఉత్తమత్వము పెరుగుచునే యుండునని తెలియవలెను. అనూరాధ, అనుశ్రుతము, అనునయ నము, అనుస్మరణము యిత్యాది పదములు నిరంతరత్వమును నొక్కి చెప్పును. అంతరాయములేని స్మరణ, అనుసరణ, వృద్ధి, ఉత్తమత్వము అని ఈ పదముల అవగాహన.

*'మామనుస్మరా'* అని శ్రీకృష్ణుడు పలుకును. అనగా ఎడతెగక నన్ను స్మరింపుము అని తెలిపెను. సాధన నిరంతరము గానపుడు సిద్ధి యుండదు. అనుచింతన, పర్యుపాసన కూడ తెలుపబడినది. కావున ఆరాధన యందు అంతరాయము లుండరాదు. ఫెళ, ఫెళ, ఫెళమని

పది రోజులు ఆడంబరముగ ఆరాధన జేసి పదకొండవ రోజు నుండి ఆరాధన కొనసాగనిచో వృద్ధి కలుగదు. ఏ కార్యమునందైననూ సిద్ధి కలుగవలెనన్నచో నిరంతరత్వము తప్పనిసరి. ఉత్తమత్వమునకు నిరంతరత్వము విడదీయరాని అనుబంధ గుణము.

భూమి క్షణకాలము కూడను తిరుగుట మానదు. అట్లే గ్రహములు. మొక్క పెరుగుటలో విరామము లుండవు. ఉన్న స్థితి నుండి ఉత్తమ స్థితికి చేరుటకు నిరంతర శ్రీమాత ఆరాధన యిచ్చుట చెప్పబడుచున్నది.



# 542. 'పుణ్యకీర్తి'

శ్రీమాత పుణ్యకీర్తి కలది అని ఒక అర్థము. ఆరాధించువారికి పుణ్యము నిచ్చుచూ కీర్తి కలిగించునని మరియొక అర్థము.

శ్రీమాతను అనునిత్యము ఆరాధన చేయువారు క్రమముగ పుణ్య భావములను పొందుచుందురు. ఆ భావములు ఆచరణ రూపము దాల్చినపుడు లోకహితము కలుగును. చేయు కార్యముల వలన లోక హితము కలుగుచున్నప్పుడు చేయువానికి పుణ్య మబ్బుచుండును. లోకమున కీర్తియు కలుగుచుండును. ఇట్లు పుణ్య సుఖమును కలిగించుట, కీర్తి సుఖమును కలిగించుట శ్రీమాత చేయు కార్యమే.

పుణ్యకార్యములు చేయువారు శ్రీమాతకు సమర్పణగ చేయ వలెను. అహంకారముతో చేసినచో సుఖ ముండదు. కీర్తియు యుండదు. అట్లే పుణ్యకార్యము చేయువారు పోటీలు పడరాదు. ప్రక్కవాని కన్న ఎక్కువ చేయవలెను, బాగుగా చేయవలెను అను పోటీ భావము కలుషితము. పుణ్యము చేయువారిని చూసి ఈర్ష్య పడరాదు. విమర్శించ రాదు. చేయుటలో అశ్రద్ధ, అలసత్వము కూడదు. శ్రద్ధా భక్తులతో నిర్వర్తించవలెను. అపుడు మాత్రమే చేయు కార్యముల వలన పుణ్యము లభించును. సుఖము లభించును. అప్రయత్నముగ కీర్తి వరించును. ఈ హెచ్చరిక తగు మాత్రము అవసరము.

పుణ్య కార్యములు చేయుచూ దుఃఖపడువారు కలరు. "ఇన్ని

మంచి కార్యములు చేసితిని, ఏమి ఫలము, ఎవ్వరునూ గుర్తించుట లేదు. ఈ కార్యముల వలన ఎట్టి సుఖమూ లేదు.” అని వ్యష్టపడు వా రెందరో గలరు. ఆరాధకులు దైవమునకు సమర్పణబుద్ధితో సత్కార్యముల నాచరించవలెను గాని ఫలమునందాశ కలిగి ఆచరింపరాదు. గొప్ప తనమునకై మంచిపని చేయువారికిట్టి దుఃఖములు తప్పవు. కేవలము యితరుల హితముకోరి అదియును దైవ సమర్పణముగ చేయువారికి పుణ్యము, కీర్తి శ్రీమాత అనుగ్రహముగ లభించును.



# 543. 'పుణ్యలభ్య'

**పు**ణ్యముల వలన లభ్యమగునది శ్రీమాత అని అర్థము.

పుణ్యకార్యములను శ్రద్ధా భక్తులతో దీర్ఘకాలము నిర్వర్తించు వారిని శ్రీమాత క్రమముగ అనుగ్రహించు చుండును. సాన్నిధ్యము క్రమముగ నిచ్చును. సాలోక్యము కలిగించును. అనగా అడపా దడపా దర్శనము లిచ్చుచుండును. ప్రోత్సహించు చుండును. దాని వలన ఆరాధనల యందు, పుణ్యకార్యముల యందు, ఇనుమడించిన స్ఫూర్తితో భక్తులు నిమగ్ను లగుదురు. అందువలన మరింత సాన్నిధ్య, సాలోక్య ములు పెరిగి సామీప్యమును చేరుదురు. క్రమముగ సాయుజ్య మేర్పడును. చివరకు సారూప్య మేర్పడును. సారూప్య మేర్పడుటయే లభ్యమగుట. తన రూపమున శ్రీమాతయే యున్నదని తెలిసి ఆనంద పరవశుడై కీర్తించుచు, దర్శించుచు, సేవించుచూ తాదాత్మ్యము చెందును. ఇది పరాకాష్ఠ. ఈ విధముగ పుణ్యము వలన శ్రీమాత లభించును. కనుక ఆమె పుణ్యలభ్య.

ముందు తెలిపిన మూడు నామములు, ఈ నామము ఒక పూర్ణమగు సాధనక్రమము.



# 544. 'పుణ్యశ్రవణ కీర్తనా'

పుణ్య విషయములను వినుట, ప్రశంసించుట గలది శ్రీమాత.

పుణ్యమగు కథలను వినుట పుణ్య శ్రవణము. శ్రీమద్రామాయణము, శ్రీమద్భాగవతము, శ్రీమహాభారతము కథలను ప్రవచించునపుడు అచట శ్రీమాత కూడ చేరి వినును. అట్లే తన కథలను భక్తులు ప్రవచించుకొనునపుడు శ్రీమాత వినును. శాశ్వత కీర్తివంతులగు మహాత్ముల కథలను వినునపుడు కూడ ఆమె ఉత్సాహముతో వినును. హరి కథలు, శివ కథలు, దేవతా విజయములు యిత్యాది ఉపాఖ్యానములను వినినపుడు కూడ ఉత్సాహముతో వినును. అనురక్తితో శ్రవణము చేయును. పుణ్య కథలను వినుటయందు శ్రీమాతయే ఉత్సాహపడినపుడు వాటియం దాసక్తి లేనివారు ఎంతటి దురదృష్టవంతులు. దేవుని కథలయం దాసక్తి లేనివారు అదృష్టహీనులు. వానిని సతతము వినుట, కీర్తించుట, మరల మరల స్మరించుట పుణ్యకార్యము. శౌనకాది మునులు కూడ నిత్యము సూతమహర్షి ప్రవచనములు వినుచుందురని ప్రతీతి.

ఎచ్చట దివ్యకథల శ్రవణము జరుగుచుండునో అచట శ్రీమాత సాన్నిధ్య ముండునని తెలియవలెను. అట్టి తెలివితో ప్రవచించుట, శ్రవణము చేయుట యుండవలెను. వినిన కథలను ప్రశంసించుకొనుచుండవలెను. పుణ్యకథల విమర్శ, విచికిత్స అహంకార హేతువు. భక్తి శ్రద్ధలతో వినుట, కీర్తించుట శ్రీమాత అనుగ్రహమునకు ఒక చక్కని ఉపాయము.

కీర్తనము సుప్రసిద్ధమగు దేవతా ప్రశంస. దైవ ప్రశంసకు భజన, కీర్తన భారతీయ సంప్రదాయమున ప్రసిద్ధి గాంచినవి. కీర్తన ద్వారా భగవత్ స్మరణము రుచికరముగ సాగును. కీర్తన చేయుకొలది రుచి పెరుగుచు నుండును. తన్మయత్వము సిద్ధించును. భక్తి పారవశ్యమున కీర్తనము చేయుచుండగ శ్రీమాత సంతసమున దరి చేరును. సాన్నిధ్య మిచ్చును. శ్రవణము, కీర్తనము దైవమును చేరుటకు గల నవ విధ ఉపాయములలో ప్రధానమైనవి. అందరికిని అందు బాటులో నుండునవి. కలి యుగమందు నామ సంకీర్తనయే ప్రధానమని భాగవతము తెలుపుచున్నది. హరినామ సంకీర్తనము కలికల్మష నాశనమని, మరియొక గతి లేదని చైతన్య మహాప్రభువు ఘంటా పథముగ తెలిపినాడు. హరి యనగా దిగివచ్చు దివ్యత్వము అని అర్థము.

*'యత్ర యత్ర రఘునాథ కీర్తనం'* అను శ్లోక మందరికినీ తెలియును. రామాయణ శ్రవణ సమయమున హనుమంతుని సాన్నిధ్య ముండును. భాగవత శ్రవణమున నారదాది మహర్షుల సాన్నిధ్య ముండును. దేవతా కథలు, మహాత్ముల కథలు అప్రయత్నముగ సాన్నిధ్య మందించును. ఈ రహస్యము తెలిసిన పెద్దలు ఏకాహములని, సప్తాహములని, సత్రయాగములని యేర్పరచుకొని దివ్య సాన్నిధ్యమును గ్రోలుదురు. కావున పుణ్య శ్రవణము, కీర్తనము ప్రధానము.



# 545. 'పులోమజార్చితా'

**పు**లోమజచే అర్చింపబడినది శ్రీమాత.

పులోమజ అనగా పులోమకు పుట్టినది. పులోమాదేవికి పుట్టిన కుమార్తె శచీదేవి. ఆమె యింద్రాణి. శచీదేవి నిత్యమూ శ్రీమాతను అర్చించు చుండును. శ్రీమాత కరుణవలెననే ఇంద్రునికి స్వర్గాధిపత్యము నిలచును. యింద్రాణీదేవి చేయు పూజలు, ఇంద్రునికట్లు సహకరిం చును. పతివ్రత లందరునూ కూడ శ్రీమాతను భక్తి శ్రద్ధలతో ఆరాధించి, తమ భర్తల ఔన్నత్యమునకు భంగము కలుగకుండ కాపాడుకొనిరి. రాక్షస పత్నులు కూడ దైవము చేతిలో తమ పతులు సంహరింప కుండునట్లు శ్రీమాత ప్రార్థనలు సలిపిరి. సావిత్రీదేవి శ్రీమాతను పూజించి తన భర్తను మరణము నుండి కాపాడుకొనినది. ద్రౌపతీదేవి కూడ అట్లే యొనర్చినది. ఇట్లెన్నియో యుదంతములు కలవు.

సంఘమునందు స్త్రీకి గౌరవము భర్తను బట్టియే. భర్తకు ఔన్నత్యము కలుగుటకు, ఆయురారోగ్యములు కలుగుటకు, ఐశ్వర్యము కలుగుటకు శ్రీమాతను పూజించు స్త్రీలు పుణ్యసతులు. వారిదే ఐశ్వర్యము.



# 546. 'బంధమోచనీ'

**బం**ధము నుండి విడిపించునది శ్రీమాత అని అర్థము.

అవిద్యయే బంధము. తానొకడు ప్రత్యేకముగా నున్నానను కొనుట వలన అవిద్య యేర్పడును. ప్రతివ్యక్తి తన ప్రత్యేకతను పోషించు చుండును. ప్రత్యేక భావము, వేర్పాటుధోరణి యేర్పడుచుండును. అపుడు తన కొరకు జీవించుట యుండును. తత్కారణముగ స్వార్థచింతన పెరుగును. తన ప్రత్యేకతను పోషించుకొనుటలో భాగముగ ఇతరుల యందు హీనభావము కలిగియుండును. తా ననగా తన పేరు, తన రూపము అనుకొనుచు నిర్వచించుకొనును. అటుపైన తనది, తనవారు అనెడి భావములు ప్రోగు అగును. ఇట్లు మొత్తము చైతన్యముతో, ప్రాణముతో విడిపడి ఒంటరియై జీవిత పోరాటమును సాగించు చుండును. ఇట్టివాని జీవితము నిత్యపోరాటమై నిలచును. ఒంటరి తనమున బలహీనత, బంధము కలుగును. పంచేంద్రియముల చేతను, త్రిగుణముల చేతను శరీరమున బంధింపబడి అనేకానేక బాధలను చెందును.

ఇట్టి వానికి తరణోపాయము కలుగవలె నన్నచో శ్రీమాతయే శరణ్యము. సర్వ సంకల్పములు ఆమె నుండియే జనించును. తాను ప్రత్యేకముగ నున్నానను సంకల్పము తన కెచ్చటి నుండి కలిగినది? తనలోని చైతన్యము నుండి కలిగినది. అట్టి వానికి తాను చైతన్యమే.

చైతన్యమే తానుగ నున్నాడు. అట్లే సర్వజీవరాశులును అని తెలిపినపుడు అవిద్య తొలగును. ఈ భావము కూడ చైతన్యము నుండి కలుగవలసినదే కదా! అట్టి భావము కలుగుటకు శ్రీమాత అనుగ్రహము కావలెను. అట్టి అనుగ్రహము కొఱకే ఆరాధన.

అవిద్యయను చీకటి గదిలో చీకటిని పారద్రోలు దీపము శ్రీమాత. అంతర్ముఖముగ నుండు అజ్ఞానపూరితమైన జీవుని స్వభావము నందు చీకటిని పారద్రోలు దీపము వంటిది శ్రీమాత. *"అవిద్యానాం అంత స్థిమిర మిహిర ద్వీప నగరీ"* అని ఆది శంకరులు శ్రీమాతను ప్రస్తుతి గావించినారు. కరుడు గట్టిన అజ్ఞానాంధకారమును పటాపంచలు చేయుట శ్రీమాతకే సాధ్యము. అజ్ఞాన తిమిరమునకు ఆమెయే మిహిర. ఆమె అనుగ్రహము వలననే అవిద్యా బంధము వీడును.



# 547. 'బర్బరాలకా'

**అ**లలవలె వెలువడు శిరోజములు కలది శ్రీమాత అని అర్థము.

ఈ నామమును 'బంధురాలకా' అని కూడ వాడుదురు. శ్రీమాత శిరోజములు కెరటములవలె, అలలవలె అనంతముగ యేర్పడును. గిరజాలతో కూడియుండు శిరోజము లామెవి. ఉంగరములు, ఉంగరములుగా నేర్పడుట జరుగగా గిరజములు యేర్పడును. సృష్టి అంతయూ ఆమె నుండి యిట్లే యేర్పడుచుండును. చుట్టలు చుట్టలుగా సృష్టి యేర్పడగా అవి చిక్కుపడుట సహజమే. ఉంగరముల జుట్టు కలవారు నిత్యమూ జుట్టును సంస్కరించుకొననిచో చిక్కుపడి గూడు కట్టుట, అట్టలు కట్టుట కూడ జరుగును. అడవి వలె యేర్పడును. అపవిత్రత యేర్పడుచుండును.

సృష్టి పవిత్రమే అయినను నిత్యమూ దానిని సంస్కరించుట జరిగినచో చిక్కుపడునని తెలియవలెను. సంస్కారవంతులు ఆపాద మస్తకము నిత్యమూ సంస్కరించుకొందురు. బహిరంతరములను కూడ అట్లే సంస్కరించుకొనుచుందురు. తమ పరిసరములను, దేహమును, యింద్రియములను, మనస్సును నిత్యమూ సంస్కరించుకొననిచో అపవిత్రత పేర్కొనుట తథ్యము. మనస్సు అద్దము వంటిది. అద్దముపై పడిన దుమ్ము తుడుచుకొననిచో ప్రతిబింబము స్పష్టముగ నుండదు. నిత్యమూ శుచి, శౌచమునకు సంబంధించిన కార్యములు నిర్వర్తింపని వారు జీవితమున చిక్కులు పడుదురు.

సంస్కారములను క్రతుబద్ధముగ నిర్వర్తించుకొనుట ఆర్య ధర్మము. అట్లు నిర్వర్తించుకొనని వారిని బర్బరులు అందురు. బర్బరులనగా సంస్కారహీనులని అర్థము. నిత్య సంస్కారములు లేనివారియందు క్రమముగ మలినములు చేరును. కాలక్రమమున మలిన జీవనమును ప్రోత్సహించు బుద్ధి కూడ కలుగును. వీరినే మ్లేచ్ఛులు అందురు. మ్లేచ్ఛు లనగా మలినములందు యిచ్ఛ గలవారు. ఆధునిక యుగమున ఈ సంస్కారహీనతను స్పష్టముగ దర్శించ వచ్చును.

శ్రీమద్రామాయణమున ఆదికవి వాల్మీకి మహర్షి అయోధ్య వాసులను, లంకావాసులను సరిపోల్చినాడు. అయోధ్యవాసులు సంస్కరింపబడిన శిరోజములు కలవారని, నిత్యమూ స్నానపానాదులను దైవారాధననూ గావించు ప్రశాంతచిత్తులుగా వర్ణించినాడు. లంకావాసులు విరబోసికొనిన శిరోజములు కలవారని, రజస్తమోగుణ మాలిన్యముతో జీవించువారని తెలిపినాడు. సత్వగుణము మిన్నగ నున్నచో చిత్తము ప్రశాంతమై యుండును. రజస్తమస్సులు అశాంతిని కలిగించును. స్వభావమున సత్వ మేర్పడవలె నన్నచో సంస్కారవంతమైన జీవితము ప్రధానము. అట్టివారి జీవితమునకు అపజయ ముండదు. అపజయమున కతీతమైనదే అయోధ్య. అయోధ్య అనగా అవధ్యయే. వధ్యము కానిది అయోధ్య. జీవుడు అయోధ్యవాసి అయినచో మరణము కూడ అతనిని జయింపగలేదు. అట్లు గాక శిరోజములను విరబోసికొని తిరుగుచూ నాగరికులమని గర్వపడు వారందరూ వ్యర్థులే. శ్రీమాత శిరోజములీ సందేశము నందించును.

# 548. 'విమర్శరూపిణీ'

విమర్శరూపిణి శ్రీమాత అని అర్థము.

విమర్శ ప్రధాన లక్షణము వికాసము కలిగించుట. శ్రీమాత అగ్రాహ్యమైన తత్త్వమును ప్రకాశింపజేయును గనుక ఆమెను విమర్శ రూపిణి అందురు. విమర్శ అనగా దూషణ భూషణములుగావు. విప్పి జెప్పునది విమర్శ. వికాసము కలిగించునది విమర్శ. గుహ్యమగు విషయ మును ప్రకటింపజేయునది విమర్శ. పరతత్త్వము లేక బ్రహ్మము పెరుగు టకు సాధ్యపడనిది. అట్టి తత్త్వమునకు ప్రతినిధియై, ప్రధానమై శ్రీమాత ప్రకాశించును. ఆమె ప్రకాశమే మనయందు ఎరుకవలె పనిచేయును. ఎరుక వలననే యెరుగుట కలుగుచున్నది. ఇట్లు ఎరుకకు మూలమై శ్రీమాత ప్రకాశించును గనుక ఆమెను ఎరుగుట పరోక్షముగ తత్త్వము నెరుగుటయే. ఉదాహరణకు విద్యుత్తును చూడలేము. అది ప్రకాశించి నపుడు విద్యుత్తు నెరుగుచున్నాము కదా! అట్లే ఆకాశమును తెలియలేము కాని అందుండి పుట్టు వాయువును తెలియుచున్నాము కదా! వాయువును, శ్రీమాతను ప్రత్యక్ష బ్రహ్మలందురు. వీని వలన పరోక్షమగు విషయము తెలియుచున్నది. శ్రీమాత వలననే బ్రహ్మము తెలియనగును. మరియొక మార్గము లేదు, మరియొక ఉపాయము లేదు.

మనయందలి విమర్శనాశక్తి శ్రీమాతయే. విమర్శ వలన కలిగిన ప్రకాశముతో కర్తవ్యము నెరిగి ప్రవర్తింపవచ్చును. ఆత్మ విమర్శ స్వయం

విమర్శ లేనివారు గ్రుడ్డివారై చతికిల పడుచుండుట ప్రపంచమున చూచుచున్నాము కదా! విమర్శరూపిణిగ మనలో వుండి మనకు సదసద్వివేకము గావించునది శ్రీమాతయే. సత్యము–అసత్యము, శాశ్వతము–అశాశ్వతము, ధర్మము–అధర్మము ఇత్యాది విచక్షణ, వివేకము స్వయం విమర్శ వలననే తెలియును. స్వయం విమర్శ కలవాడు దారి మళ్ళక జీవితమున పయనించి జీవన గమ్యమును చేరును. ఇట్లు విమర్శ రూపిణిగా శ్రీమాత జీవులలో నుండియే జీవులను సంరక్షించుకొనుచుండును.

ఆత్మజ్ఞానము కూడ ఆత్మవిచారముచే జరుగును. ఆత్మవిచారమునకు ఊహ అవసరము. ఊహ విమర్శ యందలి భాగమే. ఊహ లేనివారు ఉన్నతి చెందుట దుస్సాధ్యము.



# 549. 'విద్యా'

**జ్ఞా**న స్వరూపమైనది శ్రీమాత అని అర్థము.

విద్య అనగా తెలియవలసినది మరియు తెలియదగినది. ఏది తెలిసిన అన్నియును తెలియునో అదియే విద్య. అదియే వేదము. శ్రీమాతను వేదస్వరూపిణి, వేదమాత అని కూడ ప్రశంసింతురు. నిరాకారము అనిర్వచనీయము అగు బ్రహ్మము ఆమెగా ప్రకాశించును. ఆమెను తెలిసినపుడే బ్రహ్మమును తెలియుట జరుగును. తెలియుట అనగా శ్రీమాతమే. ఆమె వలననే ఆమెను తెలియుట కూడ జరుగును. కనుక ఆమె ఆరాధనము తప్ప అన్య మార్గము లేదు. శ్రీమాత అనుగ్రహమున్నచో అన్ని విద్యలు తెలియవచ్చును. కాళిదాసు ఆదిగా గల కవులు అట్లే తెలిసికొనిరి. ఆమె అనుగ్రహము లేనిదే విద్యల యందు రాణించుట దుర్లభము. ఆమె అనుగ్రహమున మాత్రమే మాయను దాట వచ్చును.

ఏ విద్య నేర్చువారైననూ ప్రప్రథమముగ శ్రీమాతను ఆరాధించుట నిజమగు ఉపాయము. కనుకనే భారతీయ సంప్రదాయమున విద్యార్జనము చేయువారు సరస్వతీ రూపమున శ్రీమాతను ఆరాధింతురు.



# 550. 'వియదాది జగత్ప్రసూ'

ఆకాశము ఆదిగా గల జగత్తును ప్రసవించునది అని అర్థము.

ఆకాశము అనగా అంతటా వ్యాపించిన వెలుగు. అంతులేని వెలుగు. అది కేవలము కంటికి కనిపించు వెలుగు మాత్రమే కాదు. వెలుగు చీకటుల కావలి వెలుగు. ఈ వెలుగును అదితి అందురు. ప్రధానము అందురు. సృష్టికి మూలమని మూలప్రకృతి అందురు. ఈ వెలుగు నుండియే జగత్తులన్నియు పుట్టినవి. దీని ప్రధాన లక్షణము ఎరుక. ఇదియే ఈశ్వర లేక ఈశ్వరీ తత్త్వము. దీని నుండి ప్రకృతి పురుషులు పుట్టును. అటుపైన మహదహంకారము పుట్టును. వాని నుండి త్రిగుణములు పుట్టును. త్రిగుణముల నుండియే దేవాసురులు, మానవులు, సకల జీవరాసులు పుట్టును. త్రిగుణముల ఆధారముగనే పంచభూతములు, మనస్సు పుట్టును. జీవులకు పంచభూతములు దేహములుగ యేర్పడును. పంచభూతములే లేనిచో జీవులకు దేహము లుండవు. కేవలము స్పందనాత్మక చైతన్యములుగ నుందురు. అట్టి జీవ చైతన్యములకు పంచభూతములతో కూడిన శరీర మేర్పరచి, శరీరమును వినియోగించుటకు బుద్ధి, మనస్సు, ఇంద్రియముల నేర్పరచి, వారు వసించుటకు గ్రహగోళముల నేర్పరచును. ఇట్లు తన వెలుగు నుండి సమస్త జగత్తును ప్రసరించునది శ్రీమాత. జగన్మాత అని కూడ పిలుతుము గదా!

పై విధమగు ఆరోహణ క్రమములో శ్రీమాతను ఊహించు కొనవలెను. ఊహించుచూ ఆరాధించవలెను. కేవలము మన మేర్పరచు కొను చిత్రపటములకు, విగ్రహములకు, యంత్రములకు ఊహను పరిమితము చేయుట పరిపూర్ణ ఆనందమునకు అవరోహణము అని తెలియవలెను.



# 551. 'సర్వవ్యాధి ప్రశమనీ'

సర్వ బాధలను నివారించునది శ్రీమాత అని అర్థము.

వ్యథలు కారణముగ వ్యాధి యేర్పడును. చపలచిత్తము, కలత, ఆందోళన, అశాంతి, దుఃఖము, నిరాశ, నిస్పృహ, భయము, కోపము, ఈర్ష్య, అసూయ, ద్వేషము, మోహము, ఆత్రుత ఇత్యాది వన్నియూ వ్యథలే. ఈ వ్యథల నుండి ప్రాణము సమతుల్యమును కోల్పోవును. అపుడు వ్యాధులు కలుగును. నిర్మలమగు తటాకమున ఒక చిన్న బెడ్డను విసిరినచో ఎన్నియో తరంగము లేర్పడును. అట్లు వికృతమగు భావములనుండి ప్రాణమున కవరోధము కలిగించు అనేకానేక తరంగము లేర్పడును. ఈ తరంగముల కారణముగ శరీరమున వ్యథలు, వ్యాధులు యేర్పడును.

మనస్సు నిర్మలమైనచో వ్యాధులు శమించును. మనసు నిర్మల మగుటకు కూడ శ్రీమాత ఆరాధనము విశేషముగ ఉపకరించును. నిత్యమూ శ్రద్ధా భక్తులతో శ్రీసూక్త పారాయణ చేయువారికి శ్రీమాతయే వ్యాధి శమనము గావించ గలదు. ఆమె ప్రశమని, అనగా ప్రశస్తమైన శమమును ప్రసాదింప గలదు. మనస్సున, దేహమున వ్యాధులు ప్రబలి దీనుడైన జీవునకు శ్రీమాత ఆరాధనము దివ్యౌషధము. ఆర్తులను బ్రోచుటలో తల్లికన్న దయకలవా రెవ్వరు? కేవలము ఒక్క పిలుపుతో శ్రీమాత పిలుచువాని హృదయము నుండి స్పందించి శమనము

కలిగింపగలదు. అందరి హృదయములలో నుండునది ఆమెయే. సమస్త జగత్తు ఆమె హృదయము నుండియే యేర్పడినది. కావున ఒక్క పిలుపుతో పలుకు శ్రీమాత వ్యధల నుండి జీవులకు పరిష్కార మీయగలదు.

ప్రకృతి సహజమగు భావము, భాషణము, ఆచరణము గల వారికి వ్యాధులంతగ సోకవు. కాలము, దేశము, సంఘములను బట్టి ఒక వేళ వ్యాధులు సోకిననూ అట్టి వారిని ఆ వ్యాధులు కృశింపజేయవు. వికృత భావములు, భాషణములు, చేష్టలు కలవారిని వ్యాధులు లొంగ దీసుకొని కృశింపజేయును. ఇది సత్యము. ధర్మపరులకు ప్రకృతిగను, అధర్మపరులకు వికృతిగను శ్రీమాత వారి స్వభావము నుండి వర్తించును. ఇది ఆమె శిష్ట రక్షణము, దుష్ట శిక్షణము కార్యములలో నొకటి. అవసరమగుచో తల్లి బిడ్డకు శిక్షణ నిచ్చుట కద్దుయే కదా! ఆమె సర్వభూతహిత రతి కలిగినది. ఎట్లైననూ జీవులను రక్షించును. శిక్షించుట ఆమె రక్షణలోని అంతర్భాగమే.



# 552. 'సర్వమృత్యు నివారిణీ'

అపమృత్యువును, అకాల మృత్యువును మాత్రమే కాక మరణాను భవము కూడ నివారించునది శ్రీమాత అని అర్థము.

అపమృత్యు వనగా అర్ధాంతర మృత్యువు. పూర్ణ జీవితము జీవించక, తన వంతు కర్తవ్యమును నిర్వర్తింపక జీవితము సగభాగముననే మరణించుట అపమృత్యువు. బాల్యము, కౌమారము, యౌవనము, వార్ధక్యము, వానప్రస్థము, ఇత్యాది మజిలీలు అన్నియూ అనుభవించి సంఘపరము, కుటుంబపరమునగు కర్తవ్యములను పూర్ణముగ నిర్వర్తించి పితృఋణము, దేవ ఋణము కూడ తృప్తికరముగ నిర్వహించి జీవునిగ పండి, దేహము విడచుట సవ్యమగు మృత్యువు. ఇట్టి కర్తవ్యములను నిర్వర్తించుటకు సామాన్యముగ అరువది సంవత్సరములు పట్టును. డెబ్బది రెండు సంవత్సరములు కూడ పట్టవచ్చును. బాల్యము, విద్యాభ్యాసము, సంఘమునందు బాధ్యత, గృహస్థ ధర్మము పరిపూర్ణముగ నిర్వర్తించుటకు పెద్దలు ఈ సమయమును నిర్ణయించిరి. ఇట్టి బాధ్యతలను పూర్తిగ నిర్వర్తింపకయే మరణించుట అపమృత్యువు అనబడును.

అట్లే అకాల మృత్యువు కూడ తెలియవచ్చును. బాధ్యతా నిర్వహణము పూర్ణము గాక అరువది సంవత్సరముల లోపలనే మరణించుట అకాల మృత్యువు. అంతియే గాక దుర్ఘటనల యందు, ప్రమాదముల యందు మరణించుట కూడ అకాల మృత్యువే. అంతియే

గాక మరణమునకు పుణ్య తిథులు, పాప తిథులు కూడ యున్నవి. సరియగు తిథి వార నక్షత్రములలో దేహము విడువనిచో అదియును అకాల మృత్యువే. ఉత్తరాయణ దక్షిణాయనములు, కృష్ణ శుక్ల పక్షములు, తిథులు, నక్షత్రములు వీని ననుసరించి కూడ అకాల మృత్యువును నిర్ధారణ చేయుదురు. అశుభ సమయములలో దేహము విడిచినపుడు, ఆ దేహియు మరియు ఆ కుటుంబము వారు చాల కష్టనష్టములకు గురి అగుదురు.

పై తెలిపిన రెండునూ గాక మృత్యువు అనునది అజ్ఞాన కారణము. మృత్యువు స్వరూప స్వభావముల నెఱిగి స్వచ్ఛందముగా దేహమును విడచుట వేరు, దేహమున బంధింపబడి భయముతో, బాధతో, వేదనలతో అపస్మారక స్థితిలో మరణించుట వేరు. ఇందు రెండవ సంఘటనను మరణించుట లేక చచ్చుట అందురు. మొదటి విధానమును దేహమును త్యజించుట, పరిత్యజించుట, విడచుట అందురు. స్వచ్ఛందముగ దేహమును విడచుటకును, దేహమునందు వేదనలతో చచ్చుటకును అనుభవమున చాల వ్యత్యాస మున్నది.

జ్ఞానము వలన దేహమును విడచుట తెలియును. అజ్ఞానము వలన దేహమున చచ్చుట తెలియును. నిజమునకు జీవుడు దేహధారియే గాని దేహము కాదు. దేహము ధరించి కర్తవ్యములను నిర్వర్తించి అటుపైన దేహమును విడచుట పెద్దలు చెప్పిన మార్గము. తాను దేహి యని, దేహము కాదని, దేహము తన వాహనము మాత్రమే అని

అనుభవ పూర్వకముగా తెలియుటకు ఉపాయము లున్నవి. అందు శ్రీమాత ఆరాధనము అత్యుత్తమము. అట్లే ధ్యానోపాసనము, యోగ విద్యాభ్యాసము యిత్యాదివి కూడ ఉపాయములే. మార్గమేదైననూ మృత్యువను అజ్ఞానపు తెరను తొలగింప వలసినది శ్రీమాతయే కదా!

దేహికిని, దేహమునకు అనుసంధానము కూర్చునది ప్రాణము. దేహికి దేహముతో ప్రాణము వలన ముడిపడును. ప్రాణము ముడిని యోగము ద్వారా, జ్ఞానము ద్వారా విడదీసుకొని అందు వసించుట నిజమగు స్వేచ్ఛా జీవనము. అప్పుడు దేహమును ఒక నివాసముగ వినియోగించుకొన వచ్చును. ఈ ఉపాయమును నేర్వనివారు స్వేచ్ఛలేక దేహమను కారాగారమున యుందురు. ఇట్టి కారాగారము నుండి బయలు వెడలుటకే తారణవిద్య లన్నియునూ. తారణవిద్య నెఱిగినవాడు దేహములను ధరించుచు, కర్తవ్యములను నిర్వర్తించుచు, దేహములను త్యజించుచూ ఆరోహణ క్రమమున సాగుచు నుండును. ఇట్టి వారినే మృత్యుంజయులని, చిరంజీవులని పేర్కొందురు.

ఆర్య సంప్రదాయమున ఋషుల గ్రంథములు మృత్యువును దాటమని మానవులను నిర్దేశించును. మృత్యువును గూర్చిన జ్ఞానము ప్రధానముగ నేర్చి పిమ్మట ఎన్ని విద్యలు నేర్చిననూ అవి సార్థకములు. లేనిచో ఎంత నేర్చిననూ అది నిరర్ధకమే. భగవద్గీత, భాగవతము, కఠోపనిషత్తు, సావిత్రీ ఉపాఖ్యానము, మార్కండేయోపాఖ్యానము రామాయణ మందలి సుందర కాండము, మహాయోగుల జీవితములు,

సనత్సుజాతీయము మృత్యువు స్వరూప స్వభావములను వివరించుచూ మృత్యువును దాటు ఉపాయములను అందించినవి.

శ్రీమాత సర్వమృత్యు నివారిణి గనుక ఆమె ఆరాధనమున ఉపాసకులు ఆమె వెలుగున ప్రవేశింతురు. ఆమె వెలుగు ఆవరణలో ప్రవేశించుట నేర్చినవారికి దేహము విడచుటయే యుండును గాని దేహమున మరణించుట యుండదు. అట్లే అకాల మృత్యువు, అపమృత్యువు కూడ నుండదు. శ్రీదేవి ఆరాధనమున ఆమె దివ్యకాంతిని తమయందు దర్శించుచూ ఆ కాంతి ఆవరణలో ప్రవేశించుట జరుగ వలెను. ఆమె హిరణ్య ప్రాకారమున చేరువారి కిక మృత్యువు లేదు.



# 553. 'అగ్రగణ్యా'

మొదటగా లెక్కింపదగినది శ్రీదేవి అని అర్థము.

అవ్యక్తము వ్యక్తమైనపుడు సృష్టికథ ప్రారంభమగును. ప్రప్రథమముగ అవ్యక్తమునుండి వెలువడునది సంకల్పము. ఆ సంకల్పమే వెలుగై ఆ వెలుగు నుండే సమస్తము పుట్టును.

ఉదాహరణకు నిద్రయందున్న మనము లేచిన వెనుక ఎరుక కలుగును. నిద్ర లేపిన దెవరు? నిద్రలో మనమున్నామని కూడ మనకి తెలియదు. లేనట్లుగ వుందుము. లేనట్లుండిన స్థితి నుండి మనకు తెలియని సంకల్పమేదో మనలను మేల్కొలిపిన వెనుక మన మున్నామని ఎరుక కలుగును. ఇట్లు లేనట్లుగ వున్న స్థితి నుండి వున్నట్లుగ వుండు స్థితికి సృష్టిని, జీవులను కొనివచ్చునది శ్రీమాతయే. ఆమెయే ప్రధాన కారణము. ఆమెను ప్రధానము అని కూడ అందురు. శ్రీమాతతోనే కథ ప్రారంభము, శ్రీమాతతోనే కథ అంతము అగును. సృష్టి కథకు మొదలు చివర కూడ ఆమెయే. ఓంకారము ఆదిత్య వర్ణము. అంకెలలో పూర్ణము. కాలము, ప్రకృతి యిత్యాది వన్నియూ ఆమె సంకల్పము నుండి దిగివచ్చినవే. కావుననే ఆమెను కాల స్వరూపిణి యని, ప్రకృతి స్వరూపిణి యని, ఓంకార రూపిణి యని, పూర్ణయని, అదితి యని ప్రశంసింతుము. ముందుగా గుర్తింపదగినది గనుక 'అగ్రగణ్యా' అని ఈ నామమున శ్రీమాతను ప్రశంసించుట జరిగినది.

# 554. 'అచింత్యరూపా'

**చిం**తించుటకు శక్యము కాని రూపము గలది శ్రీమాత అని అర్థము.

వేయి నామములతో కీర్తించిననూ శ్రీమాతను పరిపూర్ణముగ ప్రశంసింపలేము. నిర్వచింపలేము. భావింపలేము. చింతించువాని చింతన కూడ ఆమెలోనే జరుగుచున్నది. చింతించువాడు సహితము ఆమెలో అణుమాత్రము చేయడు. అట్టి స్థితిలో ఆమె స్వరూపమును గూర్చి ఎంత చింతన చేయకలడు. సముద్రమున పుట్టిన బిందువు సముద్రమును అవగాహన చేసుకొనగలదా? లీనము కాగలదు. తన్మయత్వమును పొందగలదు. జీవుని పరిస్థితి కూడ నదియే. ఆరాధన మార్గమున శ్రీమాత యను విశ్వ చైతన్యమునందు లీనమగుటయే యుండును గాని పూర్ణమగు అవగాహన ఎవ్వరికినీ కలుగదు. త్రిమూర్తులు సహితము శ్రీమాతను అవగాహన చేసుకొనలేదు. వారు కూడ ఆమె అంశావతారములే. అంశము మొత్తమును ఎరుగలేదు.

(Part cannot comprehend the whole.)



# 555. 'కలికల్మష నాశినీ'

**క**లి కల్మషమును నాశనము చేయునది శ్రీమాత అని అర్థము.

కల్మష మనగా మలినము, పాపము, అజ్ఞానము, అహంకారము ఇత్యాదివి. సృష్టి ఒక మహత్తరమగు అగ్నికార్యము. కనుక అందు మలినము లేర్పడుచుండును. మలినములు తొలగించుకొననిచో క్రమముగ అజ్ఞాన మేర్పడును. అజ్ఞానము జ్ఞానమును ఎప్పటికప్పుడు ఆవరించు చుండును. ఆవరించు అజ్ఞాన మలినమును జ్ఞానముతో పరిహరింపవలెను.

అజ్ఞాన మావరించినపుడు అహంకారము బలపడును. తాను, యితరులు అను భావము కలుగును. దాని నుండి భేదబుద్ధి పుట్టును. స్వార్థము కలుగును. దీనిని అను నిత్యము నిర్మూలించుకొనవలెను. అహంకారమను కల్మషము మమకారమునకు దారితీయును. నేను, యితరులు అను భావము నుండి నాది, యితరులది అను భావన పుట్టును. మమకారము వలన మోహము పుట్టును. మోహము చేత నేను, నావారు, నాది అనెడి భావములు బలపడును. అటుపైన లోభము పుట్టును. యిట్లు ఒక సోపాన క్రమమున అజ్ఞాన మలినములు పేరు కొనుచుండును. అందు జీవుడు మునిగిపోవును.

నిత్యమూ ఈ మలినములను జ్ఞానముతో హరించవలెను. నేనను అహంకారమే వీనికి మూలము గనుక తన మూలమును గూర్చి భావన చేయవలెను. నేనున్నాను అనుకొనుట భ్రమ. దైవమే తానుగ

నున్నాడు. అతడే యిన్ని రూపముల యందున్నాడు. రూపములుగ కూడ నతనే యున్నాడు. సముద్రమే అలగ యున్నది. అన్ని అలలూ సముద్రమే. సముద్రము లేక అల లేదు. అట్లే దైవము లేక తాను లేదు. ఇట్టి భావన మరల మరల జ్ఞప్తికి తెచ్చుకొనుట వలన అహంకారము కొంచెమై యుండును. అపుడు మమకార మోహాది మలినములు సోకవు.

ఎంతటి జ్ఞానికైననూ అజ్ఞాన మలినము సోకవచ్చును. కనుకనే నిత్య అనుష్ఠానము అందరికినీ తప్పని సరి. అనుష్ఠానమున కూడ అహంకారము కలుగుట ముఖ్యము. నిత్యము అనుష్ఠానము గావించు చున్నాను అను అహంకారము కూడ పుట్టవచ్చును. అజ్ఞానపు పోకడలు ఎవరికి అంతు పట్టగలవు? *"మమ మాయా దురత్యయా"* అని కృష్ణుడు చిరునవ్వుతో పలికినాడు. నా మాయ నెవ్వరునూ దాట లేరు అనుచూ నవ్వెడి శ్రీకృష్ణుని ముఖమునుండే మాయ ప్రసరించును. అట్లే శ్రీలలిత చిరునవ్వు కూడను. ఆమె అనుగ్రహము వలననే ఆ మాయను దాట వచ్చును. కనుక నామెను ప్రార్థించుట జీవుల కవసరమై నిలచినది.

కలి యుగమందు అజ్ఞానము మహత్తరమగు బలము కలిగి యుండును. తత్కారణముగ కల్మషము లధికములై యుండును. కాలము, దేశము కల్మషములతో నిండియుండగ అట్టి దుర్దశ నుండి బయల్పడు టకు అవకాశము చాల తక్కువగ నుండును. ఆధునిక కాలమున కల్మషములు బాగుగా పెరుగుచున్నట్లు గమనింపవచ్చును. ఆహారము నందు, నీటియందు, పాలయందు, ఫలములందు, తినెడి పదార్థము లందు, పీల్చు గాలియందు, వసించు ప్రదేశములందు అంతటనూ

కల్మషములే పెరుగుచున్నవి. తదనుగుణముగ మానవుల చేష్టలయందు, భాషయందు, భావములందు కూడ కల్మషమే పెరుగుచున్నది. అన్ని విధముల అపరిశుద్ధము తీవ్రముగ పెరుగుచుండుట గమనింప వచ్చును. విద్వేషములు, కలహములు, యుద్ధములు, మారణకాండ దినచర్యగ మానవజీవితము సాగుచున్నది. ఒకరినొకరు చంపుకొనుట, హింసించుకొనుట పరిపాటియైనది. అనారోగ్యములు విజృంభించి వికృతముగ తాండవము చేయుచున్నవి. స్వార్థము పెచ్చుపెరిగి కాంక్షలు వికారమై గోచరించు చున్నవి. ఇది యంతయూ కలి కల్మషముగ పెద్దలు దర్శింతురు. ఇట్టి కల్మషములను హరించు శక్తి ఏ ఒక్కరికినీ లేదు. కావున కలి కల్మష నాశిని యగు శ్రీమాతయే శరణ్యము. భగవన్నామ సంకీర్తన మొక్కటియే ఈ కల్మషములను పారద్రోల కలదు. ఎలుగెత్తి నామ సంకీర్తన కూడ చేయని దుస్థితి యందు జీవులు పడి యున్నారు. దైవనామ సంకీర్తనము వలన కల్మషము లన్నింటినీ బహిష్క రింపవచ్చును. సంకీర్తనలు, స్తోత్రములు, సూక్తములు రుచింపని మనుష్యులు రక్షింపబడలేరు. జీవులపై కారుణ్యముతో ఋషులెన్నియో సూక్తములను, స్తోత్రములను, కీర్తనలను, భజనలను అందించినారు. వీనిని దినచర్యలో భాగముగ నిర్వర్తించుకొనని జీవులు దుఃఖములకు, కష్టనష్టములకు గురియగు చున్నారు. కలి కల్మషము కాలకూట విషము వంటిది. విషధరుని గాని, విషహరుని కాని, విషనాశినిని గాని స్మరించని దినము జీవుని హరించును.

# 556. 'కాత్యాయనీ'

సర్వ దేవ తేజ సమూహాత్మిక శ్రీమాత అని అర్థము.

శ్రీమాత తేజమే త్రిమూర్తులుగను, ఆదిత్యులుగను, రుద్రులుగను, వసువులుగను, ఇంద్రాది దికాల్పక దేవతలుగను, గ్రహ గోళాదులు గను, సనక సనందనాది సద్గురు పరంపరగను, సప్తఋషులుగను యేర్పడి సృష్టికి తోట్పాటు చేయుచుండును. సమస్త జీవసృష్టి యందలి ఆమె తేజమే సృష్టి యేర్పడుటకు, కదలికకు కారణము.

'కం' అనగా బ్రహ్మము. దానిని ధరించునది కావున 'కాత్యా' అనియు, 'కాత్యాయని' అనియూ ప్రశంసింప బడుచున్నది. శ్రీమాత చైతన్యమే సృష్టికి మూలము. సర్వము నందలి కదలిక, వెలుగు. ఆమెయే అనేకానేక రూపములు ధరించి అనేకానేక శక్తులుగ వ్యాపించును. సృష్టి అంతయూ ఆమె చైతన్యజాలమే. శక్తి జాలమే.

కటి ప్రదేశమున అత్యంత కోమలముగ, సున్నితముగ వుండు టకు ఇచ్చగించునది శ్రీమాత. కటి ప్రదేశమున ఓడ్యాణ పీఠమందు కాత్యాయనిగా శ్రీమాత ప్రసిద్ధి చెందినది. కటి ప్రదేశమును సున్నిత ముగ నుంచుకొనుట యోగమునందు ప్రధానముగ తెలుపబడినది. దేహబంధము నుండి కాత్యాయనీ దేవి విమోచనము కలిగించగల శక్తి స్వరూపిణి. దేహేంద్రియములయం దాసక్తి కలవారు దేహమున బద్ధులై కటి ప్రదేశము పట్టును కోల్పోవుదురు. మితిమీరిన కోరికల

వలన ఇంద్రియార్థముల యందు మానవ ప్రజ్ఞ బంధింపబడి బలమును కోల్పోవును. దేహమందు బంధింపబడును. సన్నని సౌకుమార్యమగు నడుము గల కాత్యాయనీ దేవిని నిత్యమారాధించుట వలన దేహము కొంత వశమగు అవకాశమున్నది. భూమి యందు శ్రీమాత తేజస్సు కాత్యాయనియే. భూమి బంధము నుండి విడిపించునది కూడ ఆమెయే. కాత్యాయనీ దేవి ఓడ్యాణపీఠమందు మిక్కిలి అభిమానము కలిగి యుండునని తెలియవలెను.



# 557. 'కాలహంత్రీ'

**కా**లుని చంపునది శ్రీమాత అని అర్థము.

కాలు డనగా మృత్యువు. మృత్యువునకే మృత్యువు శ్రీమాత. మృత్యువునకు మృత్యువు కల్పించుట సాధ్యమా? సాధ్యమే అని ఈ నామము తెలుపుచున్నది. కాలమును గణనము చేయుట గమనించుట కన్న ముందుండునది శ్రీమాత. ఆమె తరువాతయే కాలము పుట్టినది. కావున కాలమామె వశమందే యుండును. అంతేకాదు. కాలరూపమున నున్నది కూడ శ్రీమాతయే కదా! అందువలననే ఆమెను కాల స్వరూపిణి అని కీర్తింతురు. కావున కాలము పుట్టుకకు, స్థితికి, తిరోగమనమునకు ఆమెయే అధ్యక్షురాలు.

శ్రీమాత ఆరాధనమున భక్తులు, యోగులు, జ్ఞానులు సమాధి యందు తన్మయత్వము నందుండగా వారికిని కాలముండదు. దివ్య చైతన్యముతో అనుసంధానము చెంది అనన్య స్థితిలో నున్నవారికి కాలము తెలియదు. సంవత్సరముల తరబడి, యుగముల తరబడి అట్లున్నవారి కథలు మనము పురాణములందు చూచుచున్నాము. అమ్మ అనుగ్రహ మున కాలమును దాటవచ్చును. మృత్యువును కూడ దాట వచ్చును.

కాత్యాయనీ నామము వెనువెంటనే 'కాలహంత్రీ' నామము పేర్కొనబడినది. దేహమునందు మృత్యువు కలుగకుండా కాత్యాయనీ దేవి రక్షింపగలదు. కటి భాగము సడలినపుడు మృత్యువున కవకాశము మిక్కుటముగ యేర్పడును. కటి భాగమున కధిష్ఠాన దేవతగా నున్న కాత్యాయనీ దేవిని స్మరించుట వలన దేహమునందు మృత్యువు కలుగక జీవు డుద్ధరింపబడును.

# 558. 'కమలాక్ష నిషేవితా'

**క**మలాక్షునిచే నిత్యమూ సేవింపబడునది శ్రీమాత అని అర్థము.

కమలాక్షు డనగా విష్ణువు. త్రిమూర్తులలో ఒకడైన విష్ణువు నిత్యమూ శ్రీమాత నర్చించి, ఆమెతో సారూప్యము పొందెను. శ్రీమాత ఇంద్రనీలమయమైన తత్త్వము. ఆమె నారాధించుచూ విష్ణువుకూడ యింద్రనీల ఛాయను పొందెను. ఆమెతో సారూప్యము చెందెను. అందువలననే శ్రీమాతతో సరిపోలు సౌందర్యము, ఆకర్షణము, శక్తి సంపన్నత, సౌకుమార్యము కలిగెను. తనకును శ్రీమాతకును అభేద స్థితిని పొందెను. అందువలన విష్ణుపూజ శ్రీమాతకే చెందును. శ్రీమాత నారాధించుట వలన కలుగు సర్వశుభములు విష్ణువు ఆరాధనయందు కూడ లభ్యమగును. విష్ణువు మూలము శ్రీలలితయే కదా!

మరియొక రహస్య మేమనగా త్రిమూర్తులలో విష్ణువు ఒక్కడే విశ్వమయుడు కాగలిగెను. శ్రీమాత చైతన్యమే విశ్వమయము, సర్వ వ్యాపకము. ఆమె ఆరాధనమున శ్రీ మహావిష్ణువు కూడ సర్వవ్యాపకుడై నిలచెను.

*ఆ.* *విశ్వమయత లేమి వినియు నూరక యుండి*
*రంబుజాసనాదు లడ్డపడక*
*విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు*
*భక్తియుతున కడ్డపడఁ దలంచె.*

ఈ కమనీయమగు పద్యము భాగవతమున నున్నది. గజేంద్రుడు సృష్టి మూలము, ఆత్మమూలమునగు తత్త్వము నారాధించెను. ఆ తత్త్వమున కధిదేవత అర్ధనారీ స్వరూపము. అందు శివుడు స్థాణువు. స్థిరముగ నుండవాడు. శ్రీమాత అతని విశ్వచేతన. ఆమె కతడు ఆధారము. ఆమె సృష్టి కాధారము. ఆమె సర్వాత్మిక కూడ. అదే స్థితి యందున్న శ్రీ మహా విష్ణువునకు ఆమె కలిగించిన ప్రేరణ వలన శ్రీ మహా విష్ణువు అకస్మాత్తుగ హుటాహుటిని బయలుదేరి గజేంద్రుని రక్షించెను. శ్రీమాతయే శ్రీ మహా విష్ణువునందు గల సంకల్పశక్తి. ఆమె ప్రేరణ మూలమున తన పరివారమునకు గాని, తన భార్యకు గాని తెలుపకయే హుటాహుటిని గజేంద్ర రక్షణమునకు పూనుకొనెను.



# 559. 'తాంబూలపూరిత ముఖీ'

**తాం**బూలముతో తృప్తి చెందినది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత పెదవులు ఎఱ్ఱగ నుండును. దానికి కారణము ఆమె స్వీకరించు తాంబూలమే. తాంబూల స్వీకరణము ఆరోగ్య కారణము. జిహ్వా జాడ్యమును తాంబూలము హరించగలదు. జీర్ణకోశము, జీర్ణావయవము లందలి సమస్త జాడ్యములు నాలుకపై ప్రకటింప బడును. నాలుకను శుభ్రపరచుకొనుట ఆరోగ్యమునకు ప్రధానమగు అంశము. జీర్ణావయవముల అస్వస్థతను నాలుక వ్యక్తపరచు చుండగ నోటి నుండి దుర్గంధము వెలువడుచుండును. నోటి దుర్గంధము అస్వస్థతకు సంకేతము. అట్టి దుర్గంధము నెప్పటికప్పుడు నిర్మూలించు కొనుట సదాచారము. తాంబూల చర్వణము దుర్గంధమును పారద్రోలు టయే గాక జిహ్వా జాడ్యములను కూడ నిర్మూలించును. దేహము ఆరోగ్యముగ నుండును. నోరు కూడ సుగంధ మగు వాసనను కలిగి యుండును. భోజనానంతరము తీరికగ తాంబూలమును గొనుట వలన స్వీకరించిన భోజనము సులభముగ జీర్ణమగును. శ్రీమాత దాడిమీ పూరిత ముఖము సాధకులకు ఈ సందేశ మిచ్చును.

అంతేకాక శ్రీమాత రతిప్రియ గనుక, సతతము శివునితో కూడి యుండును గనుక ఆమె నోటి సుగంధము శివుని ఆకర్షించి తన కున్ముఖము చేయును. స్త్రీలు కూడా పురుషుల నాకర్షించుటకు తాంబూల

మును ఒక సాధనముగ వాడుదురు. సామాన్య రతి నుండి శివానుభూతి వరకు కూడ తాంబూలమునకు ప్రాముఖ్యత గలదు. తాంబూలమునకు ప్రధానమగు వస్తువులు తమలపాకు, సున్నము, వక్క, యాలకులు, లవంగములు, పచ్చ కర్పూరము యిత్యాదులు. కొనుగోలు చేయు మిఠాయి కిళ్లీలు తాంబూలము కాజాలదు. తాంబూలమును ఆహార స్వీకరణమునకు తదుపరియే గైకొనవలెను గాని తోచినప్పుడెల్ల తినరాదు. అట్లు జేసినచో జీర్ణావయవముల యందు పుండ్లు పడు అవకాశ ముండును.

తాంబూలము గూర్చి తర్కించుటకన్న శ్రీమాతకు ప్రియము గనుక తాంబూలము గైకొనుట భక్తులు చేయవలసిన పని.



# 560. 'దాడిమీకుసుమ ప్రభా'

**దా**డిమీ పుష్పము వంటి కాంతి కలది శ్రీమాత అని అర్థము.

దాడిమీ కుసుమము లేత ఎఱుపు రంగులో నుండును. గులాబీ రంగుగా దీనిని గుర్తింపవచ్చును. శ్రీమాత మేనిఛాయ గులాబీ రంగు కాంతితో ప్రకాశించు చుండును. ముఖము కూడ అట్టి కాంతియే కలిగి ఆకర్షణీయముగ నుండును. పచ్చని పసుపు గాక, ఎఱ్ఱని ఎఱుపు కాక కోమలమగు వర్ణముగ దాడిమీ కుసుమ ముండును. ఆ పుష్పముతో సరిపోల్చి శ్రీమాత కాంతిని హయగ్రీవుడు ప్రస్తుతి చేయుచున్నాడు. ఈ కాంతి సర్వ బాధలను శమింప జేయును. బాధలలో నున్నవారికి ఈ కాంతి పుష్పము నిచ్చుట సంప్రదాయము.

దాడిమీ వృక్షమనగా దానిమ్మ చెట్టు అని కొందరి మతము. దానిమ్మ వృక్షములందు కూడ పువ్వులు మాత్రమే పూచు వృక్షము కలదు. అట్టి వృక్షపు పువ్వు కాంతి కలది శ్రీమాత.

ఎట్లైననూ ఆకర్షణీయమగు దేహకాంతి కలది శ్రీమాత అని అవగాహన చేసుకొనవలెను.



# 561. 'మృగాక్షీ'

**జిం**క కన్నుల వంటి కన్నులు కలది శ్రీమాత అని అర్థము.

జింక సాధుజంతువు. జింక చూపులు బిత్తరగ నుండును. అటు నిటు కదులుచు నుండును. అమాయకముగ నుండును. అవి నిత్య చంచలములు. శ్రీమాత కన్నులు కూడ ఈ గుణములు కలిగి యున్నట్లుగ వర్ణింపబడినవి. మాయకు ఆవల యుండును గనుక శ్రీమాత అమాయక. జగన్మాత గావున గోవు వలె సాధువు. చైతన్య స్వరూపుడు గనుక నిత్యమూ కదలిక గలిగి యుండును. శివుడు స్థాణువు, అచంచలుడు. శ్రీమాత చంచల. కదలిక. సృష్టి అంతయూ ఆమె కదలికయే. కదలిక లేనిచో సృష్టియే లేదు. శ్రీ సూక్తమున *'అనపగామినీం'* అని వర్ణించిరి. అనగా నిత్యమూ కదలుచున్ననూ, కదలుచున్నట్లు గోచరించదు. భూమి తిరుగుచున్నట్లు గోచరించు చున్నదా? కాని మహా వేగముతో తిరుగుచున్నది. మొక్క పెరుగుచున్నట్లు గోచరించు చున్నదా? కాని పెరుగుచునే యుండును. కాలము జరుగుచున్నట్లు గోచరించు చున్నదా? గాని కదలుచునే యుండును. ఆమె నాగిని. నిత్యమూ కదలుచూ, కదలనట్లుండును. ఇట్లు శ్రీమాత కన్నులు జింక కన్నులవలె సరిపోల్చుటలో గంభీరమగు భావము గోచరించును.

మృగము అనగా కదలునది అని అర్థము కలదు. సమస్తమునూ కదలించుచు, దానిని వీక్షించుచు, పర్యవేక్షించుచు, రక్షించుచూ నుండుట శ్రీమాత కన్నుల విశేషము. కన్నులతోనే సమస్త సృష్టి గావించి పోషించు చుండును. కదలిక యందును, కదలికకు ఆవలను కూడ యుండునది శ్రీమాత.

# 562. 'మోహినీ'

**మో**హింప జేయునది కావున మోహిని అని అర్థము.

మోహము లేనిదే సృష్టి లేదు. మోహము వలన జీవుడు తనను తాను మరచును. ఇట్లు జీవులను మరపింపజేసి, సృష్టియందు ప్రవేశింప జేసి వారికి అనుభవము, అనుభూతిని కలిగింపజేసి, వారందరిని పరిపూర్ణులుగను, సిద్ధులుగను తీర్చిదిద్దును. ఏ మోహము లేనివాడు ఏమియూ చేయడు. మోహ మాధారముగనే జీవులు తీరుబడి లేక పరుగిడుచున్నారు. అనేకానేక కార్యములను సాధించుచూ, సాధించితిమి అని భ్రమ పడుచున్నారు. స్వప్నమునకు లోనైనట్లుగ చరించుచున్నారు.

మోహము కలుగుట, మోహము వీడుట శ్రీమాత సంకల్పముగ జరుగును. మాయా మోహములనుండి ఎవ్వరునూ తప్పించుకొనలేరు. కావుననే మహాత్ములు సైతము శ్రీమాత శరణు కోరుదురు. మోహ మత్యంత బలమైనది. అది జీవుని బలవత్తరముగ పశువును తాటితో లాగినట్లు లాగును. త్రిమూర్తులు కూడ మోహమునకు లోబడి సృష్టించు చున్నామని, రక్షించు చున్నామని, తిరోధానము కలిగించు చున్నామని భ్రమ పడుదురు. ఇక సామాన్యుల మాట ఏల?

దేహముపై మోహము, తనపై తనకు మోహము, తనది, తన వారు అను మోహము, తిరోగతి మోహము, పదవీ మోహము, కీర్తి మోహము, ధనమోహము, స్త్రీ మోహము, జాతి కుల మత మోహము–

ఇట్లు అంతులేని మోహములతో జీవుడు స్వాధీనము లేక పరాధీనుడై దీనుడై జీవించు చుండును. ఇట్టి వారికి రక్ష శ్రీమాతయే.

మోహమునకు త్రిగుణములు ప్రధానమగు పనిముట్లుగ పని చేయును. గుణాత్మకుడుగ జీవుడు పుట్టగనే తా నున్నాడనుకొనును. అప్పటి నుండి మోహ మారంభమగును.

భస్మాసురుని నుండి శివుని బ్రోచుటకు, అసురుల నుండి అమృత మును కాపాడుటకు శ్రీమాత మోహినీ రూపము దాల్చినది. మోహమున కాకర్షింపబడి వారు ప్రమత్తులై కర్తవ్యము మరచిరి.



# 563. 'ముఖ్యా'

**అ**త్యంత ప్రధానమైనది అని అర్థము.

ముఖ్య మనగా ముఖ్యమే. ముందుగా తెలియవలసినది, గుర్తింపవలసినది, ఆదరింపవలసినది, దర్శింపవలసినది.

శ్రీమాత తెలియనిచో ఏమియూ తెలియనట్లే. శ్రీమాతను గుర్తింపనివారు ఏమియూ గుర్తింపలేరు. జగన్మాతను ఆదరింపని వాడు ఏ అనుగ్రహమును పొందలేడు. దర్శనములలో కెల్ల ముఖ్యమగు దర్శనము శ్రీమాత దర్శనమే. ఆమెను దర్శించినచో సర్వమూ దర్శించి నట్లే. కనుక శ్రీమాత పూజ ముఖ్యము. శ్రీమాత ఆరాధన ముఖ్యము. శ్రీకారము చుట్టియే ఏ పనులైననూ ప్రారంభించవలెను. నిదుర నుండి లేచిన వెంటనే శ్రీమాతను స్మరించి అరచేతి యందు శ్రీంకారమును లిఖించుట సదాచారము. తల్లికి నమస్కరించియే ఏ పనియైననూ చేయవలెను. ఇట్లు శ్రీమాత అత్యంత ముఖ్యమైనదిగా భావించవలెను.

ముఖము శరీరమున కెట్లో సృష్టికి శ్రీమాత అట్లే.



# 564. 'మృడానీ'

**సు**ఖము నొసగు శివుని భార్య శ్రీమాత అని అర్థము.

మృడు డనగా శివుడు. మృడానీ అనగా శివుని భార్య. శుభముల నిచ్చువాడు గనుక శివుడని సంబోధించిరి. అతడు పరమ కరుణామయుడు. కరుణకు అతను పెట్టినది పేరు. శీఘ్రముగనే అనుగ్రహించుట, వరములిచ్చుట, క్షమించుట, దయచూపుట ఇట్టి గుణములు మృడ అను శబ్దమున కర్థము. ఇవి అన్నియూ అతని గుణములనగా శ్రీమాతయే. గుణ రహితుడగు శివుని శ్రీమాత యిట్లు ఆవరించి యుండును.

పై గుణములను శ్రీమాత ఆరాధనమున పొందినవారు సర్వ శుభములనూ పొందుదురు. కరుణ, దయ, క్షమించు గుణము, అనుగ్రహము కలిగియుండుట, ఆశీర్వదించుట, యితరులకు శుభము కలుగవలెనని నిత్యమూ కోరుట యిత్యాది వన్నియూ భక్తులు కోరి నేర్వవలెను. ఇతరుల సుఖము, శుభము కోరువారికి శ్రీమాత సర్వ సుఖములు, శుభములు కలిగించును. జనులకు తానేమి పంచునో, శ్రీమాత తన కవియే పంచును అని తెలియవలెను.



# 565. 'మిత్రరూపిణీ'

స్నేహ రూపము గలది శ్రీమాత అని అర్థము.

స్నేహము ప్రేమ వలె అత్యంత బలమును కూర్చును. నిజమునకు ప్రేమ అన్నను, స్నేహమన్ననూ ఒక్కటియే. ఆత్మీయతకు సంబంధించిన అనుబంధమే స్నేహము లేక ప్రేమ. ఆత్మీయుల రూపములలో శ్రీమాతయే హితము చేకూర్చుచుండును. ఆత్మీయుల వలననే జీవుడు సుఖము పొందును. తుష్టిని, పుష్టిని పొందును. తన కెవ్వరునూ ఆత్మీయులు లేరని భావించుట అవగాహన లోపమే. పంచభూతములు తనకాత్మీయులే. అట్లే భూమి, గ్రహ గోళాదులు. అటుపైన సూర్యుని కన్న మించిన ఆత్మబంధువు లెవరు? దర్శించవలెనే గాని వృక్షములు, జంతువులు, పంచభూతములు, సూర్య చంద్రాదులు- యిట్టి ప్రజ్ఞ లన్నియూ నిజమగు మిత్రులే. నిత్యమూ సహాయపడుచూ తమ ఉనికిని గూడ గుర్తు చేయరు. వీరందరి రూపమున శ్రీమాతయే యున్నది.

సద్గురువు రూపమున శ్రీమాత దరిచేరి వికాసము కలిగించి వృద్ధి సిద్ధుల నిచ్చును. అట్లే తల్లిదండ్రులునూ. ఇట్లెందరో స్నేహితుల రూపమున తన వృద్ధికి తోడ్పడు చుండగా తనకు మిత్రులెవ్వరూ లేరని, అందరూ శత్రువులే అని భావించువారి దౌర్భాగ్య మేమని చెప్పగలము.

ఇట్లు బహురూపముల శ్రీమాత తోడునీడయై మిత్రరూపము దాల్చి సహకరించు చుండును. దీనిని గమనింపని వారికి మిత్ర లాభ ముండదు.

# 566. 'నిత్యతృప్తా'

నిత్యమూ తృప్తిగ నుండునది శ్రీమాత అనియు, నిత్యమైన స్థితి యందుండుటచే తృప్తిగ నుండుననియు అర్థము.

తృప్తి కలిగియుండుట వలన సుఖ ముండును. కోరిక కలిగి నపుడెల్ల అది తీరు వరకు ఆందోళన కలుగుచుండును. కోరిక తృప్తి అను స్థానము నుండి జీవుని వైదొలగించును. సత్త్వము నుండి రజస్సు లోనికి నెట్టును. రజస్సు అధికమైనకొలది తృప్తికి దూరమై పోవు చుండును. ఎంత సంపద అయిననూ అంగబలము, కీర్తిబలము వున్ననూ రజస్సున నున్నచో సుఖ ముండదు. మిక్కుటముగ సంపద, అంగబలము, కీర్తిబలము లేకున్ననూ తృప్తి కలిగియున్నచో సుఖ ముండును. సత్త్వమున వుండువానికి కోరికలు ఊరుట యుండదు. అతడు సంతుష్టుడై సంతోషముతో నుండును. అట్టి వానికి శుభములు కూడ కలుగును. నిజమగు యోగులు సతత సంతుష్టులై యుందురు. కారణము వారు బలముగ సత్త్వమునందు స్థితి గొనుటయే.

శ్రీమాత కేవలము తృప్తి కలది అని తెలుపక నిత్యతృప్తి నందుండు నది అని కీర్తించు చున్నారు. నిత్య సత్త్వము వలన నిత్య తృప్తి యుండును. నిత్య సత్త్వమందు రజస్తమో గుణములు సంపూర్ణముగ వశమై యుండును. సత్త్వము కన్న నిత్య సత్త్వము మహత్తరమైనది. సత్త్వమునకు రజస్తమస్సుల ఆటుపోటు లుండును. నిత్య సత్త్వమును రజస్తమస్సులు

అంతరాయము కలిగింప లేవు. శ్రీకృష్ణుడు, శ్రీలలిత నిత్య సత్వమునకు పరిపూర్ణమగు ఉదాహరణలు. వారెప్పుడునూ తృప్తిగనే యుందురు. రజస్తమస్సులతో కూడిన ఆసురీ శక్తులు వారి నేమియు చేయజాలవు. అందువలననే యుద్ధమందు కూడ వారి చిరునవ్వు చెరగదు. భయంకర మగు యుద్ధమును కూడ మందస్మితముతోనే నిర్వర్తించుట వారి ప్రత్యేకత.

సత్త్వము అను పదము నందు సత్ యున్నది. సత్‌తో కూడిన వారికే సత్త్వముండును. తమ ఉనికి రహస్యము నెఱిగినవారే సత్త్వమున నుండగలరు. "సర్వము నందు తానే యున్నాను." అని తెలిసియున్న శ్రీమాత శాశ్వతమగు తృప్తి యందుండును. తాను సత్యమే అని తెలిసినవాడు తాను శాశ్వతుడని కూడ తెలియును. సర్వమునందు తానై యున్నాడని కూడ తెలియును. ఇట్టి పరమోత్కృష్టమైన స్థితి యందుండువారు నిత్యతృప్తులు. వశిష్ఠాది బ్రహ్మర్షు లట్టివారు. తృప్తిగ నుండుట నుండి నిత్యతృప్తికి సాగుట ఈ నామము తెలుపు సాధన. తృప్తిగ నుండుటకు త్రిగుణములను సమన్వయించుకొని సత్త్వమున నిలువ వలయును. సత్త్వమున నిలచి సత్యశోధనమున నిమగ్నము కావలయును. అపుడు తానుండక సత్వము సిద్ధించును. అపుడు నిత్య తృప్తి యందుండ వచ్చును.



# 567. 'భక్తనిధి'

**భ**క్తులకు నిధి వంటిది శ్రీమాత అని అర్థము.

భక్తుల అవసరములను తీర్చునది శ్రీమాత. తల్లివలె ప్రేమతో సర్వావసరములను శ్రీమాత తీర్చగలదు. జీవితమున అన్ని రంగముల యందు భక్తులకు లోటు లేకుండ పోషించుచుండును. ఐహికము, ఆముష్మికము అగు కోరికలను కూడ పూరించును. తన భక్తుడు పూర్ణ జ్ఞానియై పరిపూర్ణ వికాసవంతు డగువరకు కూడ సమస్తమగు ఆవశ్యకతలు తీర్చును. కల్పవృక్షము, కామధేనువు వలె భక్తుల కండగ నిలచియుండును.

కోరిన వారి కోరికలు వారి వృద్ధికి తోడ్పడునవి అగుచో వానిని పూరించుట, అట్లు కానిచో స్మృతి పథము నుండి తప్పించుట, లేక అట్లు కోరు విషయముల యందు వికర్షణ కలిగించుట చేయుచుండును. భక్తుల కోరికలు తీర్చు విషయమున శ్రీమాత నేర్పు అనుపమానము. భక్తుల వృద్ధిని దృష్టి యందుంచుకొని ఆమె వారిని పరితృప్తులను చేయుచుండును. ఆమె అనిర్వచనీయమైన నిధి వంటిది. అందుండి పొందలేని విషయము సృష్టిలో లేదు.



# 568. 'నియంత్రీ'

నియంత్రించునది శ్రీమాత అని అర్థము.

సృష్టి సర్వమునూ నియంత్రణ చేయునది శ్రీమాతయే. లోకములకు, లోకపాలురకు, లోకులకు హద్దులు పెట్టుచూ సృష్టిని పాలించును. ఎవరి హద్దులలో వారు ప్రవర్తించునట్లుగ శాసనము చేయును. హద్దులు మీరిన వారిని తగు విధముగ శిక్షణము చేయును. సర్వజీవులకు శిక్షణ నిచ్చుచూ వారి పరిణామ కథను పర్యవేక్షించు చుండును. హద్దు మీరక ప్రవర్తించునట్లు ఏర్పాట్లు చేయును. ఎలుకకు పిల్లి హద్దు. పిల్లికి కుక్క హద్దు. జంతువులకు మృగరాజగు సింహము హద్దు. అట్లే మానవులకు, దేవతలకు కూడ హద్దు లేర్పరచును. అందరునూ మితి కలిగి జీవించ వలెనేగాని అతిగ ప్రవర్తించుటకు అవకాశములేని పరిపాలనా దక్షత సృష్టియందు చూడవచ్చును. దేవతలకు కూడ అసురుల రూపమున హద్దు పెట్టును. అసురులకు త్రిమూర్తుల రూపమున, ఋషుల రూపమున హద్దులు పెట్టును. అందరికినీ హద్దులు పెట్టుచూ, పరిపాలించుచూ అందరి వృద్ధి కొఱకై నిత్యమూ పాలించును. శ్రీమాత భక్తులు స్వయం నియంత్రణ కలిగి వృద్ధి చెందుచు నుందురు.



# 569. 'నిఖిలేశ్వరీ'

సర్వ లోకములకు ఈశ్వరి అని అర్థము.

ఈశ్వరత్వము సర్వవ్యాపకమైన తత్త్వమునకే సాధ్యము. అనితర సాధ్యము. లోకములకు, లోకపాలకులకు, లోకులకు కూడ శ్రీమాతయే రాజ్ఞి. అందరిని సృష్టించి అందరి హృదయములలో ప్రవేశించి అందు వసించి వారిని పరిపాలించుట శ్రీమాత మహేశ్వరీ తత్త్వము. తమను తాము పరిపాలించుకొనువారు ఈశ్వరులు. ఇతరులను పరిపాలించు వారు ప్రభువులు. తమను తాము పరిపాలించుకొనుచూ యితరులను స్వయం పాలకులుగ తీర్చిదిద్దువారు గురువులు. అందరి యందు తానే నిండియుండి వారిపై ఈశ్వరత్వము నెఱపుట సర్వవ్యాపకమగు చైతన్యమునకే సాధ్యము. శ్రీమాత ఇట్టి చైతన్య స్వరూపిణి అని తెలియ వలెను. మనలో నుండియే మనలను పరిపాలించును. మన కోరికల నెఱిగి తీర్చును. లోతృప్తి కలిగించును. ఈశ్వరత్వము వహించి తీర్చిదిద్ది తనంత వారినిగా చేయును. ఇట్టి తల్లిని ఎంత ప్రశంసించిననూ అది అల్పమే అగును కదా!



# 570. 'మైత్ర్యాది వాసనాలభ్యా'

మైత్రి, కరుణ, వందిత, ఉపేక్ష అను నాలుగు వాసనల ద్వారా లభ్యమగునది శ్రీమాత అని అర్థము.

తమతో సమానమగు వారి యెడల మైత్రి, తమకన్న తక్కువ స్థితిగతులు కలవారి యెడల కరుణ, తమకన్నా ప్రతిభాపాటవములు కలవారిని చూచి సంతోషించుట, కుసంస్కారుల యెడల ఉపేక్ష అను ఈ నాలుగు గుణములను అభ్యసించువారు, పాటించువారు శ్రీమాత అనుగ్రహమునకు అర్హులు.

సాధారణముగ లోకమున తమ సాటివారితో వైరముండును. తమకన్న తక్కువ వారిపై కరుణ చూపక, కాఠిన్యము వహించుట యుండును. నిర్లక్ష్య భావ ముండును. తమకన్న ఎక్కువ ప్రజ్ఞా పాట వములు కలవారిని చూచి హర్షించుట కన్న ఈర్ష్యపడుట యుండును. కుసంస్కారులను చూచినపుడు ఉపేక్ష వహించక వాగ్వాదముల లోనికి దిగుచు నుందురు. ఇది పరిపాటి. శ్రీమాత అనుగ్రహము లభ్యము కావలెనన్నచో పై నాలుగు గుణములను అభ్యసించుట తప్పనిసరి.

శ్రీరాముడు తన జీవితమున వివిధ సన్నివేశములలో ముందు తెలిపిన విధముగ నాలుగు వాసనలను ప్రదర్శించెను. ఋషులను చూచి హర్షించెను. విభీషణునిపై కరుణ చూపెను. సుగ్రీవునితో మైత్రి గావించెను. శూర్పణఖను ఉపేక్షించెను. అట్లే కృష్ణుని జీవితమున

కూడ దర్శింపవచ్చును. మహాత్ముల నెరుగుటకు ఈ నాలుగు గుణములు ప్రమాణముగ ఆర్యులు స్వీకరించిరి.

ప్రసిద్ధమైన ఈ నాలుగు వాసనలు చిత్తమును శోధించును. భాగవతమున ఈ నాలుగింటిని క్రింది విధముగ నిర్వచించిరి. సఖుల యందు మైత్రి, దుఃఖితులందు కరుణ, పుణ్యులందు ముదిత, పాపులందు ఉపేక్ష.



# 571. 'మహాప్రళయ సాక్షిణీ'

మహాప్రళయమునకు సాక్షిగా నుండునది శ్రీమాత అని అర్థము.

మహా ప్రళయమందు శ్రీమాతయే మిగులును. తన నుండి యేర్పడిన సృష్టి తనలోనికే లయ మగును. అపుడు మిగులునది ఆమెయే. త్రిమూర్తులు సహితము తన లోనికి లయ మగుదురు. తాను కాలముతో కలిసి, పరములోనికి ప్రవేశించును.

ప్రతి రాత్రి మనము మన చేతన నుండి మనలోనికి లయము చెంది, మరల ఉదయమున మనలో నుండి చేతనగ వ్యక్తమై అటుపైన ఇచ్ఛ, జ్ఞాన, క్రియలలోనికి దిగివత్తుము. ప్రళయమునకు చివర, సృష్టికి ముందు మన చేతన, దైనందినముగ యున్నట్లు సృష్టి ప్రళయము నకు చిట్టచివర, సృష్టి ఆరంభమునకు మొట్టమొదట శ్రీమాతయే యుండును. లయము నుండి సృష్టి వరకు గల కాలమున ఆమె పరమై యుండును. అపుడామెను పరాదేవి అందురు. పరాశక్తి అందురు. ఆ స్థితి సమస్తమునకు పరము అయినది.

నిద్రకు ముందు, నిద్రకు తరువాత మనము ఎట్లుందుమో గమనించుట, నిద్రలోనికి ఎట్లు ప్రవేశించు చున్నామో, నిద్ర నుండి ఎట్లు మేల్కాంచు చున్నామో గమనించుట విశేషమైన సాధనగ ఋషులు తెలుపుదురు. ఈ సాధన వలన జనన మరణ రహస్యములు కూడ తెలియగలవు.

శ్రీమాత అగ్రగణ్యా మరియు ప్రళయ సాక్షిణి.

# 572. 'పరాశక్తిః'

ప్రళయమునకు ఆవల పరముగా నుండు శక్తి స్వరూపిణి శ్రీమాత అని అర్థము.

సృష్టి యందు శ్రీమాత నవశక్తులుగ, నవదుర్గలుగ నవావర్ణము లను నడిపించుచూ ఈశ్వరిగా పనిచేయు చుండును. సృష్టికావల పరమైన శక్తిగా నుండును. అనగా శివునితో ఐక్యముచెంది యుండును. శివుడు లేక శివమునకు అంకె పది. అది సత్యము, సుందరము, శాశ్వతము, మార్పున కతీతము అయిన స్థితి. అది అవ్యయము, అవ్యక్తము, మరి యొకటి లేని అనన్య స్థితి. అందు శ్రీమాత "పరా" అయి వున్నది. పరదేవత అని కూడ పిలుతురు. 'పరావాక్కు' అందురు. 'పరమ ఈశ్వరీ' అందురు. సృష్టి యందామెయే దేవత. అనగా వెలుగు రూపము. అట్టి దేవతకు పరమైనది గనుక పరదేవత. సృష్టి యందామెయే సంకల్పమై వర్తించును. సృష్టి అంతయూ ఆమె ఉచ్చారణమే. సంకల్పము గాను, భావముగాను, భాషగాను, భాషణముగాను ఆమెయే వ్యక్తమగు చుండును. ఇట్టి వ్యక్తమగు తత్త్వమును ఋగ్వేదమందు వాక్కు అనిరి. అట్టి వాక్కునకు కూడ పరమై శ్రీమాత యున్నది. అందువలన పరావాక్కు. అట్లే శక్తికి పరమై యున్నది. అనగా నవశక్తులకు పరమై యుండునది. సృష్టియందామె ఈశ్వరి, అనగా యజమాని. సృష్టికి పరమైన తత్త్వము నందు వసించును గనుక ఈశ్వరీ తత్త్వమునకు కూడ పరమైనది. ఇట్లు తెలిసిన దానికెల్ల పరమైనదిగా 'పరమ పథము' వున్నది. 'పరా'

శబ్దము అతీతమును, అవ్యక్తమును, అప్రజ్ఞాతమును, అవిజ్ఞేయమును, అప్రతర్క్యమును, అనిర్వచనీయమును సూచించును.

సృష్టి యందు మూల ప్రకృతిగను, త్రిగుణములుగను, పంచ భూతములుగను వున్న శ్రీమాత సృష్టికావల పదియవదిగ పరాశక్తి అయి వున్నది. మన దేహమందు కూడ పదియవ ధాతువు పరాశక్తి అని చెప్పుబడుచున్నది. జీవునియందు సప్త ధాతువులతో పాటు ప్రాణము, జీవుడు కలిపి నవధాతువులు యేర్పడుటకు కారణము పదియవ ధాతువు. ఈ ధాతువును మన యందలి పరాశక్తి అందురు.

దేహమందు ఐదు ధాతువులు శక్తి మూలకములు. అవి ఆరోహణ క్రమమున ఎముకలు, చర్మము, రక్తము, మాంసము, మెదడు. నాలుగు ధాతువులు శివ మూలకములు. అవి వరుసగా మజ్జ, శుక్లము, ప్రాణము, జీవుడు. శక్తి మూలకము లనగా ప్రధానముగ శక్తి కలిగి యుండునవి. శివ మూలకము లనగా ప్రధానముగ శివుడుండు స్థానములు. నిజమున కన్నియునూ శివశక్తి సమ్మేళన స్థితులే. శివ మూలకములగు ధాతువులు సూక్ష్మముగ నుండును. శక్తి మూలకములగు ధాతువులు ముందు వాటికన్న స్థూలమై యుండును. అన్నింటినీ శక్తియే నిర్మాణము చేయును. శివ మూలకములు నాలుగు, శక్తి మూలకములు ఐదుగా నవధాతువుల నిర్మాణమై మానవదేహ మున్నది. అందు వసించునది కూడ శివశక్తులే. ఈ రహస్యము తెలుపుటకే శ్రీచక్ర రాజము ఋషులు అందించినారు. శ్రీ చక్రమందు ఐదు త్రిభుజములు అధో ముఖములు, నాలుగు

త్రిభుజములు ఊర్ధ్వ ముఖములు అయి ఒక దానిపై నొకటి పేర్చబడి యుండును. మేరువు నందు శివశక్తులు వసించి యుందురు.

దేహమందలి శిఖరమే శ్రీచక్ర మేరువు. అచ్చట సహస్రార చక్రము కలదు. అందు శివశక్తులు పరమై యుందురు. అచ్చట నుండి శ్రీమాత మూలాధారము వరకు అవరోహణ క్రమమున నవావర్ణ దేహమును నిర్మించును. అట్లు నిర్మించి మూలాధారమున కుండలినిగ వసించును. ఆరోహణ క్రమమున మొదటి ఐదు ఆవరణములు శక్త్యాను భూతిని, తరువాత నాలుగు ఆవరణలు శివశక్త్యానుభూతిని కలిగించ గలవు. అటుపైన మేరువు నందు జీవుడు ఐక్యము చెందును. పరాశక్తిని చేరుట యనగా తానుండక శివశక్తి స్వరూపముగ మిగులుట. పరాశక్తి ధ్యానము చేయువారు ఈ మార్గము నంతనూ ఎరిగినవారై యుందురు.



# 573. 'పరానిష్ఠా'

**ప**రము నందే నిష్ఠ గలది శ్రీమాత అని అర్థము.

పరమే శివము, సత్యము అని మరల మరల చెప్పవలసి యున్నది. పరమే శ్రీమాత స్వస్థానము. ఆమె పరమును వీడి యుండజాలదు, వుండుట కిచ్చపడదు. శివునితో అవినాభావ సమ్యక్ బంధము కలది. అట్టి శ్రీమాత కేవలము జీవకోట్ల కోసము, వారిపై తనకు గల అపార ప్రేమ కారణముగ నవావరణ సృష్టి గావించును. సృష్టి నిర్మాణము, పాలనము, ఇత్యాదివి గావించుట మహత్తరమగు ఇచ్ఛా, జ్ఞాన, క్రియా కలాపము. ఇట్టి కలాప మందున్ననూ శివుని వీడక యుండును. శివునితో నుండియే సర్వమునూ నిర్వహించును. ఇది అనుపమానము. అనన్య సాధ్యము. శివుని యందుండి సృష్టిగా వ్యాప్తిచెంది అందు జీవులను ప్రవేశింపజేసి వారి పరిణామ కథను నిర్వర్తించుచూ కాలాను సారము ప్రళయములను గావించుచూ అత్యద్భుతమగు విన్యాసమును శ్రీమాత నేర్పుచు నుండును. క్రియ యందున్నపుడు జ్ఞాన మందుండ కుండుట జీవుల కెంత సహజమో, శ్రీమాతకు శివ జ్ఞానము నందుండుట అంత సహజము.

శివజ్ఞానము నందు తిష్ఠవేసి ఆ నిష్ఠతో ఇచ్ఛా జ్ఞాన శక్తులను తన నుండి వ్యక్తము గావించి, మహదహంకారము నేర్పరచి, పంచ భూతముల నేర్పరచి ఈ మొత్తమునందు జీవులను ప్రవేశింపజేసి,

సూర్యాది మండలములను నిర్వహించుచూ కూడ ఎల్లప్పుడును శివునితోనే కూడియుండును. ఇట్టి నిష్ఠ అనన్య సాధ్యము. ఆమె నిష్ఠకు కూడ పరమే.

దీక్షలు, నిష్ఠలు స్వీకరించువారు శ్రీమాత ఆరాధనముననే వాని యందు నిలచి కృతకృత్యులు కావలెను. శ్రీమాత అనుగ్రహము లేనిచో దీక్షలు, నిష్ఠలు భంగమగు చుండును.



# 574. 'ప్రజ్ఞాన ఘనరూపిణీ'

**ఘ**నీభవించిన ప్రజ్ఞానరూపిణి శ్రీమాత అని అర్థము.

ఘనము పరిపూర్ణరూపము. గోళము మరియొక పరిపూర్ణ రూపము. శ్రీమాత ఘనరూపిణి అనగా అవతరణము చెంది ఘనమై నిలచిన ప్రజ్ఞ అని అర్థము. చతురస్రము అవతరణమునకు, వృత్తము తిరోగమనమునకు సంకేతములు. దేవతల నారాధించినపుడు వారి నాహ్వానించుటకు, వారి అవతరణకు చతురస్రములగు పీఠముల నేర్పరచ వలెను. ఊర్ధ్వలోకములకు ఆరోహణము చేయువారు వృత్తాకారమును వినియోగింతురు. సృష్టి నేర్పరచు శ్రీమాత ఘనరూపము వహించును. సృష్టి మొదట గోళముగ వ్యక్తమైననూ అటుపైన ఘన రూపము దాల్చును. తిరోధానమందు మరల ఘనము గోళమై, గోళము అవ్యక్త మును చేరును.

శ్రీమాత ప్రకటింపబడిన జ్ఞానరూపిణి. లవలేశమైననూ అజ్ఞాన ముచే తాక బడనది. లోపల వెలుపల ఒకే విధమగు ప్రజ్ఞతో కూడి యుండునది. ఈ కారణము చేత కూడ ఆమెను 'ప్రజ్ఞాన ఘనరూపిణి' అని కీర్తింతురు.

శ్రీమాత ఘనరూపము దాల్చును అనుటలో విశేషార్థ మున్నది. ఘనమునకు ఆరు ముఖము లుండును. ఒక్కొక్క ముఖము ఒక్కొక్క చతురస్రముగ నేర్పడును. ఒక చతురస్రమున నాలుగు లంబకోణము

లుండును. ఆరు చతురస్రములందు ఇరువది నాలుగు లంబకోణము లుండును. మొత్తము ఇరువది నాలుగు (24) లంబకోణములుగ ఘనము వున్నది. ఈ ఇరువది నాలుగు తత్త్వములుగనే సృష్టి ఏర్పడును. ఇట్లు తాను ఘనరూపమై తత్త్వార్థ వర్ణాత్మికయై సృష్టిగ యేర్పడును. సృష్టియందు ఇరువది నాలుగు తత్త్వములు, ఇరువది నాలుగు అర్థములు, వర్ణములు (అనగా అక్షరములు, శబ్దములు, రంగులు) గుర్తించిన ఋషులు శ్రీమాతను గాయత్రిగ, తత్త్వార్థ వర్ణాత్మికగ కీర్తించిరి. *"చతుర్ వింశతి అక్షర, త్రిపథ, షట్కుక్షిః"* అని కూడ ప్రశంసించిరి. శ్రీమాతయే చతుర్ వింశతి (24) అక్షరములుగ యేర్పడి నది. త్రిపథగ ప్రవహించును. అవియే మూడు శక్తులు, మూడు గుణములు. ఆమె షట్కుక్షి అనగా ఆరు. ఆరు కేంద్రముల నేర్పరచి, ఉత్పత్తి గావించును.

ఘనమును గూర్చి విశిష్టమగు జ్ఞానమును ఋషులు దర్శించి అందించిరి. కాలమును కూడ ఘనముతో పోల్చి చెప్పిరి. 24 గంటల కాలము, ఇరువది నాలుగు పక్షములతో కూడిన సంవత్సర కాలము. ఇట్లు ఇరువది నాలుగు సంఖ్యతో సృష్టి నెఱుగు విధానమును ఋషులు యేర్పరచిరి. ఇరువది నాలుగు సంఖ్య యందు రెండు ద్వాదశము లున్నవి. నాలుగు షట్కము లున్నవి. ఆరు చతురస్రము లున్నవి. ఎనిమిది త్రిభుజము లున్నవి. మూడు అష్ట భుజు లున్నవి. వీని రహస్యముల నెఱుగు గుప్తవిద్య యున్నది.

ఘనము నందలి రహస్యముల నెఱుగుట ఘనవిద్య యగును. ఈ విద్యకు కూడ శ్రీమాత అనుగ్రహము ప్రధానము. ఇటీవలి కాలమున ఈ ఘనవిద్య నావిష్కరించిన సిద్ధురాలు రష్యాదేశపు వనితయైన హెలీనా పెట్రోవా బ్లావెట్స్కీ. ఆమె అందించిన గుప్తవిద్య యందు సృష్టి విజ్ఞాన మంతయూ యిమిడి యున్నది. మన్వంతర రహస్యము లన్నియూ విడమరచినది. శ్రీమాత విజ్ఞాన ఘన రూపత్వము విశదముగ వివరించి ఆధునిక యుగమున ప్రాక్ – పశ్చిమ దేశములలో జ్ఞానమాతగ కీర్తింపబడు చున్నది. ఘనమగు రహస్యములతో కూడినది ఘనవిద్య. శ్రీమాత ఘనవిద్యా స్వరూపిణి కూడను.



# 575, 576. 'మాధ్వీపానాలసా మత్తా'

**మ**ధుపానము గ్రోలి మత్తెక్కినట్లు గోచరించు శ్రీమాత అని అర్థము.

మధు వనగా మద్యము కాదు మధువు మేలుజాతి పుష్పములం దేర్పడు అత్యంత మధురమైన రసము. ఆ రసమును గ్రోలి మత్తుగా నున్న కన్నులతో తన్మయత్వమున నుండునది శ్రీమాత. మధువు గ్రోలుట బాలకృష్ణుడు వెన్న దొంగిలించుట వంటిది.

భక్తులు భగవదారాధనమున కరగి తన్మయులై యుండగా వారి హృదయ పద్మముల నుండి భక్తిరస ముద్భవించును. అట్టి భక్తిని మధురభక్తి అందురు. అట్టి భక్తియందు కలుగు రసము మధురసము. దానిని భగవంతుడు స్వీకరించినపుడు భక్తులకు మహదానందము కలుగును. అట్లు భక్తుల హృదయమందు జనించు మధువును భ్రమరమువలె శ్రీమాత గ్రోలును గనుక ఆమెను భ్రమరాంబిక అని కీర్తింతురు.

ఏయే పుష్పముల యందు మధువు యేర్పడు చున్నదో పర్య వేక్షించుచూ తేనెటీగ మధువు స్రవించు పుష్పములపై వ్రాలి ఆ మధువును గ్రోలును. అట్లే శ్రీమాత కూడ భక్తుల హృదయములందు జనించు భక్తిరసమును గ్రోలును. అట్టి మాధ్వీపానమందు అనురక్తి కలిగియున్నది శ్రీదేవి.

మానవ హృదయములు కఠినములై కల్మషములతో కూడి యున్నప్పుడు వానిని పుష్పములతో పోల్చలేము. తమ కల్మషములను

హరించి, కఠినత్వమును దమించి కారుణ్య హృదయులుగ తీర్చిదిద్దమని శ్రీమాతను ప్రార్థింప వలయును. క్రోధము, మాత్సర్యము, లోభము, మోహము, అశుభ భావనలు పారద్రోలు మని వేడుకొనవలెను. నిర్మల హృదయులను గావింపుమని సదా ప్రార్థింప వలయును. అట్టి ప్రార్థనలు ఫలించినపుడు చెట్టు కొమ్మయొక్క రెమ్మనుండి పుష్పము వికసించినట్లు అనాహత చక్రము అనాహత పద్మముగ మారును. అనాహత చక్రముగ నున్నంత కాలము హృదయము వికాసము పొంద జాలదు. జనన మరణములను చక్రము నందు జీవుడు తిరుగాడుచునే యుండును. చక్రములు పద్మములు కావలయును (మార్పు చెంద వలెను). లేనిచో జీవితము అంధకార బంధురమే. అట్టి మార్పు కలుగుటకు దైవీ తత్త్వము నందు భక్తి, ప్రేమ ప్రధానము. పరహిత జీవనము భక్తి వికసించుటకు అనుపానమై నిలచును. స్వాధ్యాయము గతి తప్పకుండ కాపాడును. ఈ మూడు ఉపాయములు జీవుని మధుర మగు భక్తియందు చేర్చగలవు. దైవీతత్త్వము నందుగల రుచి క్రమముగ వృద్ధి చెందుచు భక్తి అనురక్తిగ మారును. అట్టి అనురక్తియే దైవము నందలి ప్రేమ కారణముగ అనన్య భక్తి యేర్పడును. అపు డన్యభావము లేర్పడవు. గోపిక లట్టివారు. వారి ప్రార్థన లన్నియూ భ్రమర గీతికలే. అట్టి ఆత్మసమర్పణ బుద్ధితో హృదయముల నర్పించు విశేష భక్తుల హృదయముల నుండి పుట్టు భక్తిరసమును గ్రోలుటయందు శ్రీమాత అమితాసక్తితో యుండును. అట్టి మధువును గ్రోలి గ్రోలి మత్తెక్కి సోలిన కన్నులు గలదిగా గోచరించును. ఇట్టి మత్తు ఇతర పానీయముల నుండి లభింపదు.

# 577. 'మాతృకా వర్ణరూపిణీ'

**వ**ర్ణాక్షరముల రూపమున నుండనది శ్రీమాత అని అర్థము.

మాతృక లనగా అక్షరములు. అనగా క్షరము గానివి. నాశనము లేనివి. అవి శబ్దములు. ఆ శబ్దములకు శ్రీమాత రూప మేర్పరచును. అ, ఇ, ఉ అను శబ్దములకు అక్షర రూపము లున్నవి కదా! అపుడే వానిని వ్రాయగలము. అక్షరములు వేరు, అక్షర రూపములు వేరు. అక్షరములకు శబ్దము, రంగు, రూపము యిచ్చునది శ్రీమాత. అంతియే కాదు, వానికి అర్థమును కూడ నిచ్చును. ఉదాహరణకు 'అ' అను శబ్దమున్నది. దాని అర్థము పరతత్త్వము. (అక్షరములలో 'అ' నేను అని శ్రీకృష్ణుడు పలికినాడు.) దాని వర్ణము (రంగు) నీలము వలె గోచరించును. లోతు తెలియలేని తత్త్వము గనుక నలుపు నీలమందురు. దానికి రూపము ఒక్కొక్క భాషయందు ఒక్కొక్క విధముగ నున్నది. తెలుగున 'అ', సంస్కృతమున 'అ', తమిళమున 'అ', పాశ్చాత్య భాషల యందు 'అ' వేరు వేరు రూపములు ధరించిననూ శబ్ద మొక్కటియే, అర్థ మొక్కటియే, రంగు ఒక్కటియే. ఆకారములు వేరు. ఇట్లు వివిధాకార ములతో శ్రీమాత సృష్టి గావించుచున్నది. కాని లో అర్థము వర్ణము, శబ్దము, అక్షరత్వము వైపునకు నడిపించును. పైకి వైవిధ్యముగ కనిపించిననూ, లోన ఏకత్వము గోచరించును. శబ్దము, అర్థము, రంగు, రూపము అను నాలుగింటిలో మొదటి మూడు దివ్యమని, నాలుగవది మార్పు చెందునదని పురుష సూక్తము సూచించుచున్నది.

*(త్రిపాదస్య అమృతందివి)* రూపమునకు మరణ మున్నది. శబ్దము, అర్థము, రంగు మరణించవు. ఇట్లు సృష్టి అంతయూ అక్షర స్వరూపమే. మాతృకావర్ణ రూపమే అని తెలియవలెను.

సప్త మాతృకలు అనగా సప్త లోకముల నేర్పరచు శబ్దము. వానిని బీజాక్షరములు అని కూడ పిలుతురు. సహస్రారము నుండి మూలాధారము వరకు యం, హం, సం, కం, లం, రం, డం శబ్దములు కలవు. ఈ శబ్దము లత్యంత కాంతివంతములు. వజ్రకాంతి నుండి భూకాంతి (మట్టిరంగు) వరకు వివిధమగు కాంతులలో సప్తలోకములు ప్రకాశించు చుండును. శబ్దోచ్చారణమును నుండి రంగులు పుట్టును. అవి కాంతి వంతములు. మెఱపు వంటి అ కార, క్ష కార శబ్దము లున్నవి. బంగారు కాంతి గల ల, శ, ష, స శబ్దము లున్నవి. అట్లే అరుణ వర్ణము లున్నవి. గౌర వర్ణము లున్నవి. ధూమ్రము, సిందూర వర్ణములు కూడ నున్నవి. ఆయా లోకములలో ఆ యా శబ్దముల ప్రభావము వలన ఆయా కాంతులు పుట్టుచుండును. తత్కారణముగనే శ్రీమాత వివిధ కాంతులతో శోభిల్లుచుండును. భక్తుల పరిపక్వతను బట్టి సాధారణ కాంతుల నుండి కన్నులు మిరుమిట్లు గొలుపు మెఱపు కాంతుల వరకు దర్శనములు జరుగుచుండును. నాదములు వినపడు చుండును. రహస్యార్థములు తెలియుచుండును. ఇట్లు తెలియుచుండగా ఆరాధకులు పరవశము చెంది నిర్ఘాంతబోవుచు ఆమె దివ్య రూపమును చూచుటకే అశ్రాంతము కోరుచుందురు.

అక్షరములు అనగా అక్ష + రములు అని కూడ పెద్దలు

తెలుపుదురు. అనగా మూలమును అక్షముగ గొనువచ్చు శక్తి అని అర్థము. 'అ' అను పరతత్త్వమును మూలము లేక కేంద్రము లేక పరము నుండి అక్షముగ శ్రీమాత గొనివచ్చును. క్షరము కాని పరతత్త్వ మును, అక్షముగా గొనివచ్చుచూ సృష్టి నిర్మాణము చేయును. ఆమె అక్షరి. ఇట్లు గొనివచ్చి ఏడు లోకముల సృష్టిని చేయును. కేంద్రము నుండి పరిధి వరకు లేక పరము నుండి పదార్థము వరకు సృష్టిని యేర్పరచు శ్రీమాతకు శబ్దములు, వర్ణములు, అర్థములు ఉపకరణ ములు. వానికి రూపము లేర్పరచునది కూడ ఆమెయే.

మాతృకా వర్ణములు ఆమె నుండియే పుట్టును. నాదముగ జనించి శబ్దములుగ వ్యాప్తిచేయును. శబ్దముల నుండి వెలుగులు వ్యాప్తి యగును. అటుపైన రూపములుగ యేర్పడును. ఇట్లు శబ్దము, రంగు, రూపముగ సృష్టి నేర్పరచును. తత్సంబంధిత శక్తులు, సామర్థ్య ములు కూడ పుట్టుచుండును.

అక్షరములు అనగా 'అ' నుండి 'క్ష' వరకు కొనిరాబడినవి అని మరియొక అర్థము. దేవ భాషయైన సంస్కృతము నందు 'అ' మొదటి అక్షరము. 'క్ష' చివరి అక్షరము. అట్లు 'అ' నుండి 'క్ష' వరకు సృష్టి నిర్మాణము చేయు శ్రీమాత ఆ మొత్తము రూపముగ తానే యుండును. ఆమెయే అక్షరమాల.

స్కందుని పుట్టించుటచే ఆమె మాతృక అయినది. శివ తత్త్వమును అవతరింప జేయుటతో శ్రీమాత మాతృక అయినదని తెలుపుదురు. అంతేకాక ఈ మాతృకా వర్ణముల సమూహామే శ్రీమాత శ్రీచక్ర

రూపమని కూడ తెలుపుదురు. శ్రీ చక్ర మందలి బీజాక్షరములు, ఇతర అక్షరములు సృష్టి ప్రజ్ఞలుగ శ్రీమాత యేర్పడి యున్నది. సంస్కృతమున గల యాబది యొక్క అక్షరములు సృష్టి నిర్మాణ ప్రజ్ఞలు. నలుబది తొమ్మిది అక్షరములతో సప్తసప్తిగా లోక నిర్మాణము చేసి అందుపై శివశక్తులు అధిష్ఠించి యుందురు. అందువలన యాబది యొక్క అక్షరముల దేవ భాషగ సంస్కృతము యేర్పడినది.

పరదేవతగ శ్రీమాత మాతృకలను, వాని వర్ణములను కూడ దాటి యున్నది గనుక ఆమెను మాతృక అవర్ణ రూపిణి అని కూడ తెలియవలెను. తాను వస్తుతః మాతృకలు కాదు. ఆమెకు వర్ణములు లేవు. రూపములు లేవు. అన్నియూ తానై వర్తించును.



# 578. 'మహాకైలాస నిలయా'

**మ**హాకైలాసము నందుండునది శ్రీమాత అని అర్థము.

కైలాసము ఉత్తరము నందుండెడి శిఖరము. ఆర్యావర్తమునకు ఉత్తరమున, బ్రహ్మ మానస సరోవరమునకు కూడ ఉత్తరమున కైలాస శిఖర మున్నది. "శ్రీ చక్ర మేరువు" వలె లేక 'పిరమిడ్' వలే యేర్పడు శిఖరమును కైలాస మందురు. అచ్చట తత్త్వమొక్కటే యుండును. ఆ తత్త్వము యొక్క లాస్యముగ ఉత్తరము నుండి దిగువకు క్రమ పద్ధతిలో రూప మేర్పడును. ఇట్లు ఒకే తత్త్వము నుండి అనేకత్త్వ మేర్పడుటకు సూచనగ శ్రీచక్ర మేరువు నుండి శ్రీ చక్ర మేర్పడును. శిఖరము నుండి పర్వత మేర్పడును. సూక్ష్మము నుండి స్థూలమునకు సృష్టి యేర్పడును. శిశు జననము కూడ శిరస్సు, శిఖ కేంద్రముగ రూపమై వ్యాప్తము చెందును. సర్వమునకు ఉత్పత్తి స్థానము కైలాసమని తెలియవలెను. అట్టి కైలాస శిఖరము నందు వసించునది శ్రీమాత అని తెలియవలెను. మన శరీరమున శిఖను కైలాసముతో పోల్చెదరు. శ్రీచక్ర మేరువుతో పోల్చెదరు. అచ్చట కేవలము శివశక్తి తత్త్వమే యుండును. వారు నిత్యమూ నృత్యము సలుపుచు నుందురు. లాస్యము నందుందురు. శివ శక్తుల లాస్యస్థానమే కైలాసము.

ప్రతి జీవునియందు కైలాస స్థాన మున్నది. అట్లే భూమికిని కైలాస స్థానము కలదు. అది ఉత్తర ధృవమునకు పైన యున్నది.

అట్లే సూర్యునికి కూడ నున్నది. మొత్తము సృష్టికి కూడ కైలాస స్థాన మున్నది. దానినే మహా కైలాస మందురు. అట్టి మహా కైలాసమున వసించునది శ్రీమాత అని అర్థము. ఉత్తరమునగల కైలాసమును కుబేర స్థానమని కూడ పలుకుదురు.



# 579. 'మృణాళ మృదుదోర్లతా'

**తా**మర తూడువంటి మెత్తనైన భుజములు కలది శ్రీమాత అని అర్థము.

తామరతూడు మెత్తనైన దారములతో సున్నితముగ నుండును. ముట్టుకుంటే కందిపోవు నట్లుండును. మృదువైన భుజములు స్త్రీకి సౌందర్య కారకములు. బలమైన భుజములు పురుషునికి సౌందర్య కారకములు. భుజ బలము శౌర్యమునకు చిహ్నము. సుకుమారమగు భుజములు సౌందర్యమునకు చిహ్నములు. శ్రీమాత ఎంత శక్తివంతు రాలో అంత సౌందర్యరూపిణి కూడను. సౌందర్యము, శౌర్యము రెంటి యందును అత్యధికురాలైన శ్రీమాత రూపము మాత్రము సౌమ్యముగనే యుండును. లలితముగనే యుండును.

భుజములు సుకుమారమైనంత మాత్రమున బలహీన అనుకొన రాదు. మహత్తరమగు బలము కలిగియు తామరతూడువంటి మృదువైన భుజములు కలిగియుండుట అద్భుతమైన విషయము. త్రిమూర్తులు కూడ గెలువలేని భండాసుర, మహిషాసురాది అసురులను తన భుజ శక్తితోనే సంహరించినది కదా! అమిత శక్తివంతమైననూ సుకుమారముగ నుండుట వైభవమునకు చిహ్నము. కావుననే ప్రత్యేకించి హయగ్రీవుడు శ్రీమాత భుజములను కీర్తించుచూ ఈ నామము తెలిపినాడు. శ్రీమాత రూప సౌందర్య సందర్భమున గాక ఆమె మాహాత్మ్యమును తెలుపు సందర్భముగ తెలిపినాడు. మహాకైలాసమందు శివునితో నృత్యము చేయు శ్రీమాత భుజములను, మాహాత్మ్యమును వర్ణించుచున్నాడు. కావుననే తరువాతి నామము 'మహనీయా' అని పేర్కొనినాడు.

# 580. 'మహనీయా'

మహనీయమైనది శ్రీమాత అని అర్థము.

అత్యంత వైభవోపేతము, అత్యంత ప్రశంసనీయము, అత్యంత కాంతివంతము, అత్యంత కీర్తివంతము, అత్యంత బలోపేతము, శక్తి వంతము, పుష్కలము, ఆనందదాయకము, స్ఫూర్తిమంతము, త్యాగ నీయము అగుటచే సమస్త లోకముల నుండి పూజలందుకొను దేవి కావున 'మహనీయా' అని శ్రీమాతను హయగ్రీవుడు కీర్తించుచున్నాడు. మహనీయులను పదమును సామాన్యముగ నుచ్చరించరాదు. పొగడ్త లకు "మహనీయులు" అని వాడుట ఆచారమైనది. శ్రీమాతయే 'మహనీయా'. ఆమె భక్తులగు ఋషులు, సనక సనందనాదులు మహనీయులు. అట్లే శ్రీమాతకు సర్వ సమర్పణము చేసి శ్రీమాత మహనీయత్వమునకు దర్పణముగ నిలచినవారే మహనీయులు. అరకొర శక్తి, యుక్తి, జ్ఞానము కలవారిని మహనీయులని పొగడుట అసత్యమే అగును. అసత్య భాషణము వర్జనీయము.



# 581. 'దయామూర్తి'

**మూ**ర్తీభవించిన దయారూపము శ్రీమాత అని అర్థము.

భక్తుల యందు శ్రీమాతకు దయ మెండు. ఆర్తితో ఆరాధించు భక్తుల యెడల దయ కలిగియుండును. ఆర్తులను, బలహీనులను రక్షించును. అహంకారుల యందు ఉపేక్ష భావము చూపిననూ వారు నిరహంకారులై ప్రార్థించిన వెంటనే ప్రసన్న మగును. శ్రీమాతను మరచిన వారిని శ్రీమాత కూడ ఉపేక్షించును. స్మరించిన వారిపై దృష్టి సారించును. కష్టములందు దయ చూపును. ఆపదల యందు ఆదు కొనును. తల్లిప్రేమ, తల్లిదయ, అనుగ్రహము పొందినవారు నిజమగు అదృష్టవంతులు. పిలిచినంతనే పలుకు శ్రీమాతను పిలువకుండుట దురదృష్టము. పూజ, అర్చనలు చేయుట వలన సులభముగా ప్రసన్నత కలిగి బ్రోచును. శ్రీమాత అనుగ్రహము లేనిదే శివానుగ్రహము కలుగదు. తత్త్వదర్శనాభిలాషులు కూడ శ్రీమాత అనుగ్రహము చేతనే శివాను గ్రహమును పొందగలరు. శ్రీమాత దయను గూర్చి భక్తుల కెల్లరకునూ విదితమే.



# 582. 'మహా సామ్రాజ్యదాయిని'

**మ**హా సామ్రాజ్యమును అనుగ్రహించునది శ్రీమాత అని అర్థము.

మహా సామ్రాజ్యమగు సృష్టి నిర్మాణముచేసి పాలించు శ్రీమాత తన అనుగ్రహమున వారికి అట్టి సామ్రాజ్యముపై అధికారము నీయగలదు. పరిపాలనా వైభవమును కలిగించగలదు. మహా సామ్రాజ్య పాలకులగు సామ్రాట్ లందరూ శ్రీమాత అనుగ్రహముననే అంతటి సామ్రాజ్యముల నేర్పరచి పరిపాలించిరి. పరిపాలనమున అహంకరించి శ్రీమాతను మరచినపుడు పతనము చెందిరి. ఎవ్వరికైననూ వారి అంగ బలము, ధనబలము, యశోబలము పెరుగుట వారియందలి నిగూఢమై యున్న శ్రీమాత శక్తి సామర్థ్యములే. తన నుండి వ్యాప్తి చెందుచున్న రాజ్యము, బలము, వైభవము శ్రీమాత అనుగ్రహమే అని భావింపవలెను గాని తనదిగా భావింపరాదు. చిన్న బీజము మహా వృక్షమై శాఖోప శాఖలతో విస్తరించుట బీజము గొప్పతనము గాదు. బీజమున అంతర్హిత ముగ నున్న అంకుర శక్తి. అది అనంతశక్తి.

బీజము వాహికగ అంకుర శక్తి వ్యాప్తిచెందుచూ మహా వృక్షమై నిలచినది. అట్లే ఎవరి నుండి ఎట్టి మహా కార్యములు జరిగిననూ వారు బీజప్రాయులే. అందుండి వికాసము చెందునది శ్రీమాత యొక్క ఇచ్ఛా జ్ఞాన శక్తులే. ఎవ్వరి కేమి కలిగిననూ, అవి అన్నియూ ఆమె

సమకూర్చినవే. ఆమెయే 'దాయిని', అనగా ఇచ్చునది. రాజ్యదాయిని కూడ ఆమెయే. సామ్రాజ్యదాయిని కూడ ఆమెయే. ఆమె దయ లేక ఎవ్వరునూ ఏమియూ పొందలేరు. ఆమె దాయిత్వమూర్తి. దానము లిచ్చు చేయి మాత్రమే కాదు, ఆమె మూర్తి మొత్తము అట్టి దాయిత్వ గుణముతో ప్రకాశించును.



# 583. 'ఆత్మవిద్యా'

**ఆ**త్మజ్ఞాన రూపము గలది శ్రీమాత అని అర్థము.

తా నెవరు? తా నుండుట అనగా ఏమి? తా నుండు టెట్లు సంభవించినది? యిత్యాది జ్ఞానము ఆత్మ జ్ఞానమని పలుకుదురు. ఈ జ్ఞానము పొందు విధానము, శాస్త్రము ఆత్మవిద్యగా భాసించును. శ్రీమాత విశ్వాత్మ. ఆమె నుండి పుట్టిన త్రిగుణముల నుండి జీవులు జనింతురు. జీవులు తాము ప్రత్యేకముగా వున్నామని భావించుట వలన అహంకారము ఆవహించును. అటుపైన జీవునకు తనదైన స్వభావ మేర్పడును. స్వభావము ననుసరించి పంచభూతాత్మకమైన శరీర మేర్పడును.

జీవుడు తన నిజ స్వరూపము తెలియక తన శరీరమే తా ననుకొనును. అటుపైన తన కోరికల సముదాయమే తానుగా జీవించును. ఆ తరువాత తన భావ సముదాయమే తానుగా నుండును. అటుపైన తానెరిగిన విద్యలే తానుగా నుండును. ఎన్ని నేర్చిననూ, ఆ విద్య లన్నియూ తన నిజస్థితిని ఆవిష్కరింపవు. తనను గూర్చి, తన నిజస్థితిని గూర్చి అవలోకనము చేయుట తనను తా నభ్యసించుట. తన శరీరము, తన కోరికలు, తన భావములు, తన విద్యలు కాక, తా నెట్లున్నాడు? తా నున్నాడని తనకెట్లు తెలిసినది? తాను నిత్యమెట్లు స్పందించుచున్నాడు- యిత్యాది విషయముల యందు శోధన చేయుట ఆత్మవిద్య ఉపాసించుట యగును. తనయందు జరుగు స్పందనము, ప్రతి నిత్యము కలుగు ఎఱుక- ఈ రెంటి మూలమేమి? అని భావించుట ప్రారంభ

మగును. తాను మూలముగ తన యందు, తన ద్వారా చాల వ్యాపారము (activity) జరుగుచుండును. తనకు మూలమేమి? తా నెచ్చట నుండి మేల్కాంచు చున్నాడు? ఏమి ఆధారముగ ప్రాణస్పందన జరుగు చున్నది?

తన స్పందనలో స్పందించు తత్త్వమేమి? తన ఎఱుకలోని ఎఱుక యేది? ఇట్టి శోధనలో లోపలికి జీవుని గొనిపోవును. తన మూలమునకు తనను చేర్చును. అప్పుడు తా నెఱుగునది అపరిమితమగు వెలుగు. అది కన్నులకు గోచరింపని వెలుగు. వెలుగు చీకట్లకు కూడ వెలుగు. అట్టి వెలుగు అపరిమితము. అట్టి అపరిమితము, అప్రమేయము వెలుగు నందు తాను బిందువై (నామ మాత్రమై) గోచరించును. ఆ అపరిమిత మగు చైతన్యమే శ్రీమాత. ఆమె యందలి ఒక బిందువే తానని తెలియును.

ఈ మొత్తమును తెలియబరచుటకు తెలివి యుండవలెను గదా! అట్టి తెలివిగ శ్రీమాతయే యున్నది. తెలివికి మూలముగ కూడ ఆమెయే యున్నది. ఆమె నెఱిగినవాడు ఆత్మవంతుడు. ఆమె నెఱుగు ప్రయత్నము ఆత్మవిద్య. శ్రీమాతయే విద్యగ జీవులను తమ మూలమునకు చేర్చును. ఈ కారణముగ శ్రీమాత 'ఆత్మవిద్య' అని ప్రశంసింపబడినది.



# 584. 'మహావిద్యా'

మహావిద్యా స్వరూపిణి శ్రీమాత అని అర్థము.

ఆత్మవిద్యను ఎఱిగినవారే మహావిద్యను ఎఱుగ గలరు. తమను తాము ఆత్మగా నెఱిగినవారు మహావిద్య నెఱుగుటకు అర్హులు. మహా విద్య అనగా సృష్టి విజ్ఞానము. సృష్టి నవావరణములతో ఏర్పడినది. ఈ నవావరణ విద్యను నవదుర్గా విద్య అని కూడ పిలుతురు. పరతత్త్వ మాధారముగ శ్రీమాత త్రిగుణములతోను, పంచభూతములతోను ఎనిమిది ఆవరణలు సృష్టి చేయును. తొమ్మిదవదిగ తానే యుండును. తాను పదవది యగు పరతత్త్వమునకు వ్యక్తరూపమే. ఈ విధముగ పరతత్త్వమునకు తొమ్మిది ఆవరణలు యేర్పడును. నవావరణములతో సృష్టి నిర్మాణము జరుగును. ఈ నిర్మాణ వివరణ మంతయూ తెలియుట మహావిద్య. ఈ విద్యలో భాగముగ వేదాంగము లన్నియూ తెలియ బడును. మన్వంతర రహస్యములు, గోళాంతర రహస్యములు కూడ తెలియగలవు. మహత్ ఆధారముగ శ్రీమాత సృష్టి నిర్మాణము గావించును. ఆ మాహాత్మ్య మంతయునూ గ్రహించుట మహావిద్య.

ఆత్మ విద్యావంతులకే మహావిద్య తెలియుట కవకాశము ఎక్కువ. ఈశ్వరత్వము, ప్రకృతి పురుషులు, మహదహంకారము, త్రివిధ అహంకారములు, పంచభూతములు– ఇత్యాది వన్నియూ వివరముగ తెలియును. ప్రజాపతుల కథలు తెలియగలవు. సప్త మరుత్తులు,

సప్తాగ్నులు, రుద్రులు, వసువులు, విశ్వకర్మ యిత్యాది మహత్తరమగు విషయములు కూడ తెలియగలవు. ఇట్టి విస్తారమగు విద్య తెలియు చున్నకొలది శ్రీమాత మాహాత్మ్యము తెలియుచూ జీవుడు తన్మయత్వమున మునుగును. మహావిద్య మహత్తుగల విద్యయే. అట్టి విద్యయందు మునిగియుండు వారే మహంతులు.



# 585. 'శ్రీవిద్యా'

శ్రీవిద్యా స్వరూపిణి శ్రీమాత అని అర్థము.

పంచదశి స్వరూపము గలది శ్రీవిద్య. ముఖము, కంఠము నుండి కటి, కటి అధమ భాగము అను మూడు కూటములుగ పంచదశి స్వరూపమై శ్రీమాత యున్నది. ఈ మూడు కూటములందు పదిహేను బీజాక్షరములతో వ్యాపిచెంది శ్రీమాత యున్నది. ఇది శ్రీమాత సూక్ష్మ రూపము. ఈ సూక్ష్మ రూపము కూడ మూడు శ్రేణులలో నుండును. అవి వరుసగా సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మతమము. నడుము నుండి మూలాధారము వరకు గల రూపము సూక్ష్మము. నడుము నుండి కంఠము వరకు గల రూపము సూక్ష్మతరము. కంఠము నుండి పై భాగమంతయూ సూక్ష్మతమము. ముఖ భాగము ప్రజ్ఞావంతముగను, మధ్య భాగము శక్తివంతముగను, అధోభాగము సూక్ష్మపదార్థముగను శ్రీమాత వెలుగొందుచుండును. ఈ త్రికూట రూపము ఆధారముగనే జీవుల రూపము లన్నియూ యేర్పడు చున్నవి. చతుర్విధ పురుషార్థము లను ఈ మూడింటి ఆధారముగనే జీవులు నిర్వర్తించుకొనుచున్నారు. ధర్మము, అర్థము, కామము, మోక్షము అను నాలుగునూ పురుషార్థ ములు. ధర్మముతో కూడియుండి అర్థకామముల ననుభవించుట మోక్షప్రదము. ధర్మము వీడి అర్థమును కూడబెట్టుట, కోరికలు తీర్చుకొనుట నిర్వర్తించినచో జీవులు బంధమున పడుదురు. బంధము నకు, మోక్షమునకు కారణము ధర్మా ధర్మములే. సృష్టి ఆకర్షలకులోనై

ధర్మము మరచినపుడు సృష్టి వైభవము నీయక బంధము కలిగించును. ధర్మానుసారము సృష్టియందు కామపూరణము గావించుకొను వారికి సంతృప్తి కలుగును. తుష్టి పుష్టి కలిగి యుండును. అర్ధకామములు ధర్మము ననుసరించి యుండవలెను అనునది సనాతన ధర్మము. ధర్మము ననుసరించుచూ క్రమముగా శ్రీమాత మూడు శ్రేణుల రూపమును దర్శించ వచ్చును. అపుడు సృష్టి అంతయూ శ్రీమాతగనే గోచరించి అమితానందము నిచ్చును. ఆమె ప్రజ్ఞారూపము, శక్తిరూపము, సూక్ష్మ రూపము అనుభూతి చెందుటకే శ్రీ విద్య.

త్రికూట అయిన శ్రీమాతను అనుభూతి చెందుటకు కర్మము నందు ధర్మము తప్పనిసరి. ధర్మాచరణము లేని శ్రీవిద్యోపాసనము పతనమునకు దారితీయును. తనను ధర్మమున స్థిరముగ నిలుపమని కూడ శ్రీమాతనే ప్రార్థించవలెను. తాను ధర్మమున నిలువగలనని భావించుట అహంకారము. అహంకార మున్నచోట అజ్ఞానము తప్పదు. అజ్ఞాన మున్నచోట పతనము తప్పదు.

ధర్మమున నిలచి మంత్రోపాసనము చేయుచు కనపడుచున్నది, వినపడుచున్నది అంతయు శ్రీమాతగ భావించుచూ నుండుట శ్రీ విద్యో పాసన మగును. అపుడు శ్రీవిద్య క్రమముగ ఫలించుట ఆరంభించును. ప్రథమమున శక్తికూటమి యగు స, క, ల, హ్రీం అను కూటమి నుండి విడుదల లభించును. అపుడు స్థూలము నుండి సూక్ష్మమునకు సాధకుడు వ్యాప్తి చెందును. అప్పుడతడు శక్తివంతు డగును. అటుపైన కామముపై ధర్మాచరణము కారణముగ స్వామిత్వము కలుగును. అపుడు

మధ్యకూటమగు అ, స, క, హ, ల, హ్రీం అను బీజాక్షరముల తత్త్వ మవగాహన యగును. అట్లగుటచే మధ్య కూటమును దాటును. సూక్ష్మతరమైన శ్రీమాత తత్త్వ మవగాహన యగును. అపుడు మహత్తు సహకరించును. తత్కారణముగ లోక కల్యాణార్థమై మహత్కార్యములు ఉపాసకుని నుండి జరుగును. అటుపైన సూక్ష్మతమమైన వాగ్భవ కూటము వ్యాప్తి చెందును. అపుడు శ్రీమాత ప్రజ్ఞా స్వరూపము ఆవిష్క రింపబడి పరమానందము పొందును. ఇట్లు ప్రజ్ఞ శక్తి, సూక్ష్మ పదార్థముగ తన స్వరూపము వ్యాప్తి చెందుచూ, శ్రీమాత అద్భుత దర్శనమును పొంది అమితానందముతో సాయుజ్యమును పొందును. శ్రీమాత వాగ్భవకూటమే పంచాక్షరి. క, ఎ, ఐ, ల, హ్రీం. ఇట్లు పంచాక్షరి, షడాక్షరి, చతురాక్షరిగా వ్యాప్తి చెందిన తత్త్వము అనుభూతి యగును. తత్త్వ స్వరూపిణిగా ఆమె ఈ మూడు కూటములను మించి యుండును. అట్టి తత్త్వమే మూడు కూటములుగ దిగివచ్చును. శ్రీమాత స్వతః పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరిగా అవతరించు చుండును. ఈ నాలుగు స్థితులను శ్రీ మహా విష్ణువు నాలుగు వ్యూహములుగ కూడ తెలుపుదురు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహము లందురు. ఈ నాలుగు స్థితులను నిర్దేశించుటకే నాలుగు కాలములు, నాలుగు వర్ణములు, నాలుగు ఆశ్రమములు వాఙ్మయమున వివరింప బడినవి. శ్రీ విద్యా ఉపాసనమున శ్రీమాత సమగ్ర సృష్టి స్వరూపమును అనుభూతి చెందు మార్గము ఒక క్రమముతో కూడి విస్తారమై యున్నది.

# 586. 'కామసేవితా'

**కా**మునిచే సేవింపబడునది శ్రీమాత.

కాముడనగా మన్మథుడు. మన్మథుడు అనంగుడు. అనగా శరీరము లేనివాడు. శరీరమే లేనపుడు యింద్రియములు, మనస్సు యుండవు. జీవునికి కేవలము అంతఃకరణములే యుండును. మన్మథుడు శివునిచే శపింపబడెనని పురాణ గాథ. నిజమునకు శివుడు మహత్తర మగు వరము మన్మథునికి ప్రసాదించెను. అతనికి శరీరము లేకుండగ వరమిచ్చుటచే మనస్సు కూడ లేకుండ పోయెను. మనసేంద్రియ శరీరములు లేనపుడు శ్రీమాతను పూజించు టెట్లు? మ్రొక్కుటెట్లు? స్తుతించుట ఎట్లు? చూచు టెట్లు? నిజమునకు మనస్సు, యింద్రియ ములు, శరీరము బాహ్యమును చూచుటకేగాని అంతరంగమున దివ్యత్వము చూచుటకు వినియోగపడవు. అంతరంగమును చూచుటకు చిత్తము, బుద్ధి, అహంకారము ప్రధానముగ పనిచేయవలెను. బాహ్యము చూడలేనపుడు అంతరంగమును చూచుటయే మిగులును. అంతరంగ మున చూచుట ఆరంభించునపుడు గోచరించునది శ్రీమాత సూక్ష్మ రూపము. అది కాంతులతో కూడియుండును. దానిని ఆరాధించుట సూక్ష్మతరము, సూక్ష్మతమము అగు శ్రీమాత రూపము కూడ కాముడు దర్శింప గలుగును. తత్కారణముగ శ్రీమాత భక్తుడై జగత్కార్యమున ముఖ్యమగు స్థానము నలంకరించెను. ఇట్లు శివుడు శాపము రూపమున కామునికి వరమిచ్చెను. కాముడు శ్రీమాత నారాధించుటకు సదుపాయ మేర్పరచెను. కాముడు శ్రీమాత నారాధించి శాశ్వతత్త్వమును పొందెను.

కాముడు కోరిక కలిగించు ప్రజ్ఞగ మన యందుండును. కోరిక లేనివాడు పరమును కూడ కోరలేడు కదా! ఇహమునకు గాని పరమునకు గాని కోరికయే ప్రధానమై యున్నది. కోరిక లేనివాడు ఇహమునగాని పరమునగాని వృద్ధి పొందలేడు. శక్తివంతుడు, ఆత్మ వంతుడు కాలేడు. కోరిక ననుసరించియే జ్ఞానము, క్రియ కూడ యుండును. కాముడు అనంగు డగుట వలన తరించెను. ఉపాసకులు కూడ దేహేంద్రియములతో పూజించుటగా కాక చిత్తమును చేరి చిత్తముతో పూజలు గావింపవలెను. యతచిత్తుల పూజలే ఫలించును. చిత్తము స్థిరముగ నుండి బుద్ధిలోకము నందు అందుబాటులో నుండెడి దివ్యత్వమును ప్రార్థింపవలెను.

చిత్తము మనస్సున నున్నచో బాహ్యమునకు ప్రసరించును. ఇంద్రియములలో ప్రవేశించి, ఇంద్రియార్థముల వెంటబడును. మనస్సు దేహ సంబంధమైన రక్షణ, పోషణాది కార్యక్రమములతోపాటు భోగ జీవనమున కూడ ఆసక్తి కలిగి యుండును. అందువలన చిత్తము మనస్సు నందు గాక బుద్ధియందు ప్రవేశింపజేయవలెను. స్థిరమగు మనస్సే చిత్తము. గాలి తగలని దీపము వంటిది చిత్తము. గాలికి రెప రెప లాడు నటువంటిది మనస్సు. అట్టి మనస్సు నుండి బైట పడుటయే ప్రధానమగు సాధన. అవి శివుని వరముగ మన్మథునకు లభ్యమగుటచే అతడు స్థిరచిత్తముతో శ్రీమాతను ఆరాధనము గావించి, ఆమె అనుగ్రహము పొంది, ఆమె సేవకుడై సృష్టికార్యము లొనర్చు చున్నాడు. కాముని వలననే ఇహపర సిద్ధులు కలుగును. అట్టి కాముడిచే నిత్యము పూజ లందుకొనునది శ్రీమాత.

# 587. 'శ్రీ షోడశాక్షరీ విద్యా'

పదహారు అక్షరముల విద్యగా నుండునది శ్రీమాత అని అర్థము.

ముందు శ్లోకములలో శ్రీమాత పంచదశిగా పేర్కొనబడినది. పదిహేను అక్షరములతో కూడిన విద్యగా పేర్కొనబడినది. ఈ పదిహేను అక్షరములకు ముందు శ్రీ అను అక్షరము చేర్చినపుడు పంచదశి షోడశి అగుచున్నది. శ్రీమాత పూర్ణకళలు పదహారు. అమావాస్య నుండి చతుర్దశి వరకు పదిహేను తిథులలో పదిహేను కళ లేర్పడును. ఏమీ లేనట్లున్న స్థితి నుండి పౌర్ణమి ప్రారంభము వరకు పదిహేను తిథులుగా ఆమె వ్యాప్తి చెందును. పదహారవ కళగా పౌర్ణమి తిథి వుండును. పౌర్ణమి తిథి అంతము వరకు అమావాస్య ప్రారంభము నుండి లెక్కించినచో శూన్యము నుండి పూర్ణము వరకు శ్రీమాత కళలు గోచరించును. అజ్ఞానము నుండి జ్ఞానమునకు ఈ విధమగు క్రమ పరిణామము జీవులకు కలిగించునది శ్రీమాత. పూర్ణ కళలతో వెలుగొందు అమ్మ వారిని 'శ్రీ' అని పిలుతురు. శ్రీ అనగా పూర్ణ చైతన్యము. ఆమె నుండియే ఇచ్ఛా జ్ఞాన క్రియలు సరస్వతి, లక్ష్మి, పార్వతిగా ఉద్భవించును. వారిని కూడ శ్రీ అనియే పిలుతురు. శ్రీ అను అక్షరము పంచదశకి చేర్చుటలో శ్రీమాత సర్వాంతర్యామిత్వము సూచింపబడుచున్నది. అజ్ఞానుల యందు, జ్ఞానుల యందు, పుణ్యుల యందు, పాపుల యందు, సురలందు, అసురుల యందు, వెలుగునందు, చీకటి యందు అంతటా వ్యాపించి

అందరికిని పరిణామము కలిగించుచూ పూర్ణత్వమును ప్రసాదించు మాతగా దర్శించినపుడు అట్టి దర్శనము షోడశి దర్శన మగును. అట్లు తెలియుటయే షోడశీ విద్య. సృష్టి యందు శ్రీ లలిత, శ్రీకృష్ణుడు షోడశీ విద్యను ప్రదర్శించిన వారు. శ్రీకృష్ణుడు శ్రీలలితయే యని పలుమార్లు ఈ వ్యాఖ్యానమున తెలుపబడినది.



# 588. 'త్రికూటా'

**మూ**డు కూటములుగ నుండునది శ్రీమాత అని అర్థము.

వాగ్భవ కూటము, మధ్య కూటము, శక్తి కూటములుగా తాను వ్యాప్తి చెందును. ప్రజ్ఞ, శక్తి, పదార్థముగ వ్యాప్తి చెందును. మహేశ్వరుడు, విష్ణువు, బ్రహ్మగ వ్యాప్తి చెందును. పార్వతి, లక్ష్మి, సరస్వతిగ వ్యాప్తి చెందును. సువర్లోకము, భువర్లోకము, భూలోకము, ఆదిత్యులుగను, సవితృలుగను, సూర్యులుగను యేర్పడునది. ఇచ్ఛా, జ్ఞాన, క్రియలుగ యేర్పడునది. సృష్టి యంతయూ ఈ విధముగ మూడు కూటములుగ యేర్పడుచున్నది. అణువు నందు కూడ ధన సంజ్ఞ ఋణ సంజ్ఞగ, తటస్థ సంజ్ఞగా యుండును. అంతయును మూడుగ తెలియుట త్రయీ విద్య. దేవుడు, జీవుడు, దేహము, కర్త, కర్మ, క్రియ, భూతము, వర్త మానము, భవిష్యత్తు. ఇట్లేమి చూచిననూ అందు మూడు దర్శించ వచ్చును. ఒక వస్తువు నందు మూడు అంశములుగ నున్నవి, మూడుగ గోచరించునవి ఒక్కటియే. శ్రీమాతను త్రిపుర అనియు, త్రిపురసుందరి అనియూ కూడ తెలుపుదురు. శ్రీమాత త్రికూట వైభవమును వర్ణించు టకు అలవి కాదు. ఈ తత్త్వమును వ్యాస మహర్షి ఇట్లని కీర్తించినాడు.

*త్రయస్త్రింశత్సహస్రాణి త్రయస్త్రింశత్శతానిచ ।*
*త్రయస్త్రింశచ్చదేవానాం సృష్టిస్సంక్షేప లక్షణా ॥*

అంతయూ మూడే ఒక తత్త్వమే మూడగు చున్నవి. మూడునూ ఆ

తత్త్వము నందే యిమిడి యున్నవి. మూడుగ యేర్పరచి మూడిటి యందు ప్రవేశించి వసించి నిర్గమించునది నాలుగవది. మూడింటిని తెలియవచ్చును. నాలుగవది తెలియుట యుండదు. అందు కలియుట యుండును.

మన యందు మన దేహముగను, మనముగను, మన యందలి దైవముగను శ్రీమాతే యున్నది. అన్నిటి యందును ప్రజ్ఞగను, శక్తిగను, పదార్థముగను యున్నది. ఇట్లు మూడుగ నున్ననూ మూడింటిని అతిక్రమించి కూడ యుండును. వాని యందు తానున్ననూ నిజమునకు తనయందే అవి యున్నవి. రహస్య మేమనగా తానే యున్నది. అవిగా నుండుట ఆమె మాయ. ఇదియే రాజ విద్యయని, రాజ గుహ్యమని శ్రీకృష్ణుడు పలికినాడు.



# 589. 'కామకోటికా'

**కా**మకోటి పీఠము నలంకరించి యున్నది శ్రీమాత అని అర్థము.

కోటి యనగా అత్యంత ప్రశస్తమైనది అని అర్థము. కామకోటి యనగా కోరికలలో అత్యుత్తమమైన, ప్రశస్తమైన కోరిక. శివ కామమును మించిన కామ మనగా తత్త్వమును గూర్చిన కామమే. తత్త్వ కామము ఇతర కామము లన్నియూ తీరిన వెనుకగాని కలుగని కామము. శ్రీమాత శివకామిని. శివుని తప్ప ఏమియూ కోరనిది. పార్వతిగ జనించిననూ సృష్టి వైభవమును కోరక శివునే కోరి శివుని చేరినది. శివునికై ఘోర తపస్సు చేసినది. ఇతరాకర్షణను గూర్చి కాముడు ప్రయత్నించిననూ ఆమె కాముని ఉపేక్షించి శివుని ప్రార్థించినది. పార్వతి తపస్సు అనన్య సామాన్యము. శివుని పొందుటకు శివానుగ్రహమే ఉపాయమని శివ ప్రార్థన గావించి శివుని చేరినది. శివుడు కోట్లాది కామ భావముల కతీతుడు. అతడు కోటేశ్వరుడు. కోటేశ్వరుని ఆరాధనమున శివపీఠమును జేరి, శివుడు అనుగ్రహింపగ శివ పర్యంకమున చేరి, అటుపైన శివునిలో అర్థ భాగమై నిలచినది. ఇట్లు కామకోటికా పీఠము శివునితో కూడి అధిష్ఠించినది. అతడు కోటేశ్వరుడు. ఆమె కోటిక. శివైక్యమున శివ శక్తియై సామరస్యమైన పరబ్రహ్మముగ వెలుగొందుచున్నది. కామకోటికా దేవి స్వయముగ శివానుగ్రహమును ప్రసాదింపగల ప్రసన్న శివ స్వరూపిణి.

 

సతతము శివసాన్నిధ్యము ననుభవించుచూ ఎడతెగని సంయోగము చెందియుండియు సమస్త సృష్టిని నిర్వహించు శ్రీమాత మాహాత్మ్య మేమని వర్ణింపగలము? ఏక కాలమున శివునితోను, సృష్టి నిర్మాణ, నిర్వహణ కార్య కలాపములను నిర్వహించుట ఆమె ప్రత్యేకత.



# 590. 'కటాక్షకింకరీభూత కమలా కోటిసేవితా'

**కో**ట్ల లక్ష్మీదేవులు శ్రీమాత కటాక్షమునకై కింకరుల వలె సేవల నందించుదురు అని భావము.

శ్రీ తత్త్వము నుండి అనేకములగు సృష్టులు యేర్పడుచుండును. ప్రతి సృష్టియందు, ముగురమ్మలలో నొకరుగ లక్ష్మి యుండును. ఆమెయే అష్టలక్ష్మిగ వ్యాప్తి చెందును. ఇట్లెందరో లక్ష్ము లుందురు. అందరునూ శ్రీమాత సేవికలే. శ్రీమాతయే వారి రూపములలో అనేకానేక లోకములలో సుఖానుభూతి నిచ్చుచుండును. వారందరికిని పుట్టుక స్థానము శ్రీమాతయే గనుక లక్ష్మ లందరును శ్రీమాతను సేవించి ఆమె కటాక్షము పొందుచుందురని ఈ నామార్థము. సేవించు సేవికలు లక్ష్ములు. సేవింపబడునది మహాలక్ష్మి. మహాలక్ష్మి ఆరాధనము సర్వలోకములకు శుభప్రదము. లోకులకు సుఖప్రదము. లక్ష్మి ఆరాధన మున జీవుడు సత్త్వమున స్థిరపడగలడు. వైభవమున జీవించగలడు. అట్టి లక్ష్ముల మూలము నారాధించుట శ్రేయస్కరమని తెలియవలెను.



# 591. 'శిరస్థ్సితా'

**శి**రస్సున బ్రహ్మరంధ్రమున వున్నది శ్రీమాత అని అర్థము.

శిరస్సున శివునితో కూడియుండు శ్రీమాత శివానుగ్రహము నందించు గురు రూపిణిగ యున్నది. బ్రహ్మరంధ్రమునందు శిరస్సు ఊర్ధ్వమున శివునితో నుండుట ఆమె సహజ స్థితి. అటు నుండి క్రమముగ తాను సంకల్పమై దిగివచ్చుచు సృష్టి నిర్మాణము, జీవ నిర్మాణము గావించును. అవరోహణ క్రమమున శ్రీమాత దిగివచ్చుటయే గంగావ తరణమని పేర్కొందురు. శ్రీచక్ర మేరువు మన శిరస్సునందలి శిఖ ప్రాంతమున యున్నది. అచ్చుట శివునితో కూడియున్న మాత శిరస్థ్సితగా యున్నది. ఆమె శివుని నుండి వ్యక్తమై సంకల్ప రూపము ధరించి జ్ఞానమై ప్రకాశించుచు క్రియాశక్తిగ సృష్టిని నిర్మాణము చేయుచున్ననూ శివ స్థానమును, శిరోస్థానమును వీడదు. ఇట్లు పరతత్త్వము నుండి స్థూల లోకము వరకు వ్యాప్తిచెందునే గాని అవరోహణమున శివుని వీడుట యుండదు. సూర్యకిరణము సూర్యుని నుండి భూమి వరకు వ్యాప్తిచెంది సూర్యుని వద్దనూ, భూమిపైననూ, ఈ రెంటి నడుమ గల చోటు యందునూ గూడ యున్నది కదా!

శ్రీమాత గమనమున వ్యాపన ముండును గాని స్థల మార్పు యుండదు. కావున ఆమె శిరస్థ్సిత. ఇట్లు అన్ని లోకములలోనికి, అందరి జీవుల లోనికి తానే వ్యాప్తిచెంది యుండుట చేత ఆమె వెలుగు

మార్గమును అనుసరించువారు ఆరోహణ క్రమమున శివ సాన్నిధ్యము చేరవచ్చును. ఇట్లు శివుని చేరుటకు ఆమె గురువై వెలుగుదారులు చూపును.

మనయందు సహస్రారము నుండి మూలాధారము వరకు సుషుమ్న యందు ప్రవహించునది శ్రీమాత చైతన్యమే. కుడి ఎడమలుగ పింగళ ఇడ నాడులు ప్రవహించు చుండును. ఇట్లు అవరోహణ క్రమమున ప్రవహించుచూ మూలాధారము చేరగ, మానవ శరీరము ఏడు మాసములలో తల్లి గర్భమునందు యేర్పడును. అప్పటి నుండి కుండలినీ శక్తిగ మూలాధారము నందు వసించి దేహమునకు తుష్టి, పుష్టి కలిగించుచూ ముప్పది ఐదు సంవత్సరముల పాటు దేహవృద్ధిని గావించును. శిశువుగ జన్మించిన జీవుడు ఇట్లు పెరుగుటకు కారణము శ్రీమాతయే.

ఇట్లు మూలాధారమున వసించి యున్ననూ సహస్రారమున కూడ యుండును. సహస్రారము నుండి మూలాధారము వరకు వ్యాప్తి చెంది తన ననుసరించు జీవులకు సర్వలోకానుభూతి కలిగించుటకు, శివుని జేర్చుటకు, సంసిద్ధమై యుండును. ఆమె పూర్ణ రూపము శిరస్సు నందు యున్నది. పూర్ణ రూపమగుటచే గురు రూపమని కూడ సంబో ధింతురు. గురుమూర్తి అను నామమున శ్రీమాత గురుతత్త్వము మరల చెప్పబడును.

# 592. 'చంద్రనిభా'

**చం**ద్రకాంతిగ భాసించునది శ్రీమాత అని అర్థము.

చంద్రకాంతి ఆహ్లాదము కలిగించును. ఆ కాంతి స్పర్శ తాపము కలిగింపదు. హాయిని గొలుపును. జీవుడు పరిపూర్ణముగ పరితృప్తుడైనపుడట్టి హాయిని పొందును. దానిని వర్ణించుటకు భాష చాలదు.

ఇచ్చట చెప్పబడుచున్న చంద్రుడు సోముడు అని తెలియవలెను. ఉమతో కూడిన శివుని సోముడు అందురు. శివునితో కూడిన ఉమను సోమిని అందురు. వారు సోమమునకు అధిపతులు. సోమపానమనగా సోమిని యొక్క స్పర్శయే. ఈ స్పర్శను పొందినవారు శాశ్వత బ్రహ్మలోక వాసులై యుందురు. వారు తన్మయ స్థితిలో పరమానందమున మునిగి యుందురు. శివుని ప్రధానమగు వ్యక్తస్థితిగ ముడిపడినపుడు అదియొక అనిర్వచనీయమగు చల్లని కాంతిగ యుండును. నిద్రనుండి ప్రథమ ఎఱుక కలిగినపుడెట్లుండును. బాగుగా నిద్రించినవారికి ఆ ఎఱుక అత్యంత ప్రశాంతముగ నుండును. తెలతెలవారుచుండగ తూర్పున ఆకాశ మెట్లుండును? దానిని దర్శించువారికి అమితమగు ఆహ్లాదము కలుగును. హాయిని గొలుపు చల్లదన మనగా నేమో అపుడే తెలియును. ఆ కాంతి స్పర్శను చంద్రనిభగ తెలియవలెను. శ్రీమాత ఆరాధకులు ఈ చంద్రనిభా కాంతియందు వుండియూ లేనట్లుందురు. తామున్నాము అను భ్రాంతిని వీడి నామ మాత్రముగ తమ అస్థిత్వ మనుభవించుచూ

ఆ కాంతియందు మునిగి తేలుచునుందురు. ఇట్టి వారిని సోమపానము గ్రహించిన వారుగ పేర్కొందురు.

ఏమియూ లేనట్లుండును. అవ్యక్త తత్త్వము నుండి యేర్పడు మొదటి కదలికను, ఆ కదలిక కారణముగ పుట్టిన వెలుగును చంద్రనిభ అని తెలియవలెను. అది ఆధారముగనే తదుపరి సృష్టి జరుగును. ఇది శిరోకేంద్రము చుట్టునూ వ్యాపించియుండు కాంతి వంటిది. ఈ కాంతియే అటుపైన అగ్నిస్వరూపమై సూర్య చంద్రకాంతుల కాధార మగును. తరువాత నామము అగ్నికాంతి గూర్చియే.



# 593. 'ఫాలస్థా'

ఫాలభాగమున వుండు శ్రీమాత అని అర్థము.

శిరస్థిత నుండి అవరోహణ క్రమమును హయగ్రీవుడు వివరించుచున్నాడు. శిరస్సు నుండి చంద్రనిభగా వ్యక్తమై కాలము నందు చేరుట జరుగును. కాలమునందు అగ్ని స్వరూపిణియై యుండును. కుడి, ఎడమ కన్నుల యందు సూర్య చంద్ర కాంతులుగ యేర్పడును. ఫాలభాగము చేరిన చైతన్యము సృష్టిని నిర్వహించు మహారాజ్ఞి. ఈమెను హ్రీంకార రూపిణి అని కూడ ఆరాధింతురు. శ్రీమాత సృష్టి సంకల్ప శక్తిగ దాని నిర్వహణ భారము వహించు రాణిగ ఆజ్ఞా కేంద్రము నందలి మూడవ కన్నుగ సృష్టి యందు, మన యందు ప్రకాశించును. ఎదురులేని పదార్థముతో కూడిన శ్రీమాత ఫాలమునందు వసించి యుండును.

శ్రీమాతను ఆరాధించు భక్తులు ఫాల భాగమును ఉంగరపు వ్రేలితో కుంకుమను ఫాలభాగమన అలంకరించుకొనుచు అమ్మ సంకల్పమే తమ సంకల్పముగ వర్తింపవలెనని ఆరాధింతురు. స్వంత సంకల్పములను విసర్జింతురు. ఫాలమున కుంకుమను ధరించు ఆచారము నందు యిట్టి క్రతువు ఒకటి ఇమిడి యున్నది. ఫాలము నందు కుంకుమను గాని, గంధమునుగాని, విభూతినిగాని ధరించుచూ దివ్య సంకల్పమే తన సంకల్పముగ సాగవలెనని ఆరాధించుట యోగులు, భక్తులు, జ్ఞానులు అనుసరించు విధానము.

ఆజ్ఞను స్పృశించి, దైవమును స్మరించుట వలన దివ్య సంకల్పము భాసించు అవకాశ ముండును. కావుననే భారతీయులు ఫాలభాగమును సుగంధ ద్రవ్యములతో అలంకరించుకొందురు. ఉభయ సంధ్యలయందు స్నానానంతర మిట్లు చేయుట సదాచారమై యున్నది.



# 594. 'ఇంద్రధనుః ప్రభా'

**ఇం**ద్ర ధనుస్సు వలె ఫాల భాగమున ప్రకాశించునది.

ఇంద్ర ధనుస్సు శ్రీమాత యొక్క సప్త వర్ణముల సౌందర్య రూపము. ఫాలమున గల విద్యుత్ కాంతి ఆధారముగ ఏడు వర్ణముల కాంతి ప్రకాశించును. ఏడు లోకములకు మూలమై ప్రకాశించు ఫాల భాగము ఏడు వర్ణములతో కూడియుండును. క్రమముగ ఈ కాంతులే అవరోహణ క్రమమున దేహ నిర్మాణము, సృష్టి నిర్మాణము కూడ చేయును. ఫాలభాగము నందలి ఆజ్ఞా కేంద్రము ఉపరితలమున ధనుస్సుగా విప్పారి మనోహరమై శ్రీమాత విద్యుత్ కాంతులు గోచ రించును. శిరస్సునందలి చంద్రకాంతి, ఫాలభాగ మందలి ఇంద్ర ధనుస్సు కాంతి, యిత్యాది కాంతులను ధ్యానమున ఉపాసకులు ఊహించినచో క్రమముగ ప్రజ్ఞా వికాసము కలుగ గలదు. చంద్రనిభగా శ్రీమాత భర్గోదేవ మండలమును పాలించు చుండును. ఇంద్ర ధనుర్ ప్రభగ సవితృ మండలమును పాలించు చుండును. తరువాత నామములో సూర్య మండలము గూర్చి, భూమండలము గూర్చి తెలుపబడును.



# 595. 'హృదయస్థా'

**హృ**దయమున నివసించు శ్రీమాత అని అర్థము.

శ్రీమాత శిరస్సునందు, ఫాలభాగమందు, హృదయమందు వ్యాపించి యుండునని, ఈ కేంద్రములలో ఆమె దర్శన స్పర్శన భాషణాది అనుభూతులు పొందవచ్చునని తెలియనగును. హృదయము బంగారు కాంతులతోను, ఫాలము వజ్రకాంతులతోను, శిరస్సు ముదురు నీలపు కాంతులతోను ప్రకాశించు చుండును. ఉపాసకులు ప్రధానముగ మనస్సునందు జీవించు మానవులు గనుక ప్రథమముగ వారు హృదయ మున శ్రీమాత ధర్మనమును పొందగలరు. హృదయమందలి బంగారు కాంతులను ఊహించుచు ఆరాధన చేయుటద్వారా హృదయమను గృహమందు ప్రవేశింప వీలగును. హృదయ ప్రవేశము చేసినగాని సత్యమగు దర్శనములు లభ్యము కావు. హృదయమందు శ్రీమాత బాలసూర్య ప్రభలతో ప్రకాశించుచుండును. ఎరుపు బంగారము, పసుపు బంగారము వలె కాంతులీను చుండును. పసుపు కుంకుమలతో పూజలు గావించుచూ పచ్చని బంగారపు కాంతిగల శ్రీమాత ముఖమును ధారణ చేసి ఆరాధన సాగించవలెను. ఇట్లు దీర్ఘకాలము ఆరాధన చేయగ చిత్తము ఏకోన్ముఖమై ధారణము చేయుటకు సహకరించును. శ్రీమాత రూపమునట్లు ధారణచేసి ఆమె సమీపమునకు తాను చేరువగుచున్నట్లు కూడ భావన చేయవలెను. అట్టి సమయమున సాధకుని ప్రజ్ఞ క్రమముగ బుద్ధి ప్రవేశము చేయును. బుద్ధిలోకము నందు హిరణ్మయమైన కాంతుల

నడుమ తానున్నట్లు గమనించును. క్రమముగ తన మేనికాంతి కూడ మార్పుచెంది హిరణ్మయ కాంతులతో గోచరించును. అట్టి ఉపాసకుడు హృదయ మందు వసించియున్న శ్రీమాత సాన్నిధ్యమును చేరును. అటుపైన ముందు తెలుపబడియున్న ఫాలకాంతులను, శిరోకాంతులను చేరుటకు వలసిన మార్గము, అనుగుణమైన అంతఃకరణ శరీరము లభ్యమగును.



# 596. 'రవిప్రఖ్యా'

సూర్యకాంతులవలె ప్రకాశించునది.

హృదయము సూర్యమండల కాంతులతో ప్రకాశించును. ఫాలము సవితృ మండల కాంతులతో ప్రకాశించును. శిరస్సు భర్గోదేవ మండల కాంతులతో ప్రకాశించును. మూలాధారము భూమండల కాంతులతో ప్రకాశించును. ఇవి వరుసగా మేషము, సింహము, ధనుస్సు రాశుల కాంతులుగ జ్యోతిర్విద్య తెలుపును. శిరస్సు, ఫాలము మేషరాశి కాంతులు, అవి విద్యుత్ కాంతులు. హృదయము సింహరాశి కాంతులు. అవి సూర్యకాంతులు. మూలాధారము ధనుర్ కాంతులతో నిండును. అవి పదార్థము నందుండు అగ్నికాంతులు. లలితా సహస్రమున నాలుగు స్థితులలో ఈ కాంతుల అవరోహణము తెలుపబడుచున్నది. ఇవి ప్రధానముగ త్రేతాగ్నులు. శిరస్సునందు, ఉరస్సు నందు, ఉదర మందు త్రేతాగ్నులుగా శ్రీమాతయే ప్రకాశించు చున్నదని తెలియవలెను. మనమెరిగిన సూర్యుడు మన హృదయమందు గోచరింప గలడు. మనము భూమి జీవులము గనుక మూలాధారమున స్థితిగొని యుందుము. భూమికి సూర్యుడు ఆధారము. మనకునూ హృదయమే ఆధారము. సూర్యునికి సవితృమూర్తి ఆధారము. అతడు ఫాలభాగమున యుండును. సవితృమూర్తికి భర్గోదేవు డాధారము. ఇచ్చట భర్గోదేవి అనగా చంద్రనిభ. సావిత్రి అనగా ఇంద్రధనుః ప్రభా సూర్యకాంతి రవిప్రఖ్యా. నాలుగవ స్థితిలో మనమున్నాము. మనకు వరుసగా హృదయము తండ్రి స్థానము, కాలము తాత స్థానము, శిరస్సు ముత్తాత

స్థానములై యున్నవి. ఇట్లు నాలుగు వ్యూహములుగ శ్రీమాత యేర్పడు చున్నది. నాలుగవ వ్యూహమున మన మున్నాము. మనకు పూర్వము మూడు వ్యూహములున్నవి. ఈ నాలుగు వ్యూహములనే నలుగురు కుమారులు (సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు)గా వర్ణింతురు. ఈ మహా విష్ణువు నాలుగు వ్యూహములని (వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములు) కూడ వర్ణింతురు. పరమాత్మ, జీవాత్మ, బుద్ధి, మనస్సుగ కూడ ఈ నాలుగు వ్యూహములనే పేర్కొందురు. మనస్సునందుండు మనము బుద్ధి ప్రవేశముచేసి ఆత్మదర్శనము గావించి పరమాత్మయందు లీనమగుట మార్గమని తెలియవలెను.

దీనినే శ్రీకృష్ణ పరమాత్మ "నేను సూర్యునికీ విషయము తెలిపితిని. సూర్యుడు తన కుమారుడగు మనువుకు తెలిపెను. మనువు తన కుమారుడగు ఇక్ష్వాకునకు తెలిపెను" అని సంకేతపరముగ పలికినాడు. ఇచ్చట 'నేను' అనునది అంతర్యామి ప్రజ్ఞ లేక విశ్వాత్మ. సూర్యుడు అనుటలో జీవాత్మను సంకేతించుచున్నాడు. మను వనుటలో బుద్ధిని సంకేతించు చున్నాడు. ఇక్ష్వాకు అనుటలో భూమి జీవుని సంకేతించు చున్నాడు.

శ్రీమాత నామములను వరుసగా శిరస్థిత నుండి పరిశీలించినచో ఈ క్రమమే గోచరించును. హృదయమందలి శ్రీమాత బుద్ధిలోకము లకు అధిష్ఠాన దేవతగా భావించవలెను.



# 597. 'త్రికోణాంతర దీపికా'

త్రికోణము మధ్యన వెలుగొందు కాంతి శ్రీమాత అని అర్థము.

మూలాధార పద్మము మధ్యగల కర్ణిక త్రికోణ రూపమున నుండును. అచ్చట త్రికోణ పీఠమునందు దీపము వలె ప్రకాశించునది శ్రీమాత. దీపమువలె అనగా జ్వాలవలె అని తెలియవలెను. ఇచ్చట జ్వాల కేవలము బిందువువలె కాంతివంతమై యుండు కుండలినీ శక్తి. పదార్థమునందు వెలుగొందునవి, భూమినందు వెలుగొందునవి, భూమికయై, భూమికాధారమై యుండును. మన శరీరమున కిదియే ఆధారము. స్థూల శరీరము నందు జీవుడు వసించి యున్నప్పుడు మూలాధారమున త్రికూటమందు బంధింపబడి యుండును. పదార్థము నందు జీవుడు అమితాసక్తిని గొనినపుడు పదార్థమయుడై స్థూల శరీరమున బంధింపబడును. ఆరాధనా మార్గమున తపన చెందు చుండగా పదార్థమున వేడి పుట్టి, ఆ వేడిమి ప్రాణాగ్నిచే రగుల్కొలుపబడి త్రికోణాంతరమున నున్న దీపికను జ్వాలగ రగుల్కొల్పును. అపుడు కుండలిని అగ్ని ప్రచోదనము చెందగ జీవుడు స్థూల శరీర బంధము నుండి బయల్పడి అందు వసించును. అట్లు శరీరము కారాగారముగ కాక గృహముగా మార్పు చెందును. ఆరాధనము పెరుగుచుండగ దేహమను కారాగారము గృహమై, అటుపై దేవాలయమై కాంతులీను చుండును. ఇట్టి మార్పులన్నియూ శరీరమున ఆరాధకులు గమనింప వచ్చును. క్రమముగ పదార్థమయ శరీరమునందే కాంతులతో కూడిన

మరియొక శరీరము యేర్పడుచుండును. అందు ప్రవేశించి ఆరాధనము గావించు చుండగా త్రికోణాంతర దీపికా కేంద్రము నుండి హృదయస్థ మైన రవిప్రఖ్యా కాంతులలోనికి ప్రవేశించును. భక్తి వలన గాని, యోగము వలన గాని ఈ విధమగు ఉద్ధారణము సాధకులకు కలుగగలదు.



# 598. 'దాక్షాయణీ'

# 599. 'దైత్యహంత్రీ'

# 600. 'దక్షయజ్ఞ వినాశినీ'

దక్షునకు పుత్రికగా పుట్టునది దాక్షాయణి.

అసుర భావనలు సంహరించునది కనుక దైత్యహంత్రి.

దక్ష యజ్ఞమును నాశనము చేసినది కనుక దక్షయజ్ఞ వినాశిని.

దక్ష ప్రజాపతి కుమార్తెగా శ్రీమాత జన్మించినది. సతీదేవి అను నామమున పెరిగి యౌవనవతియై శివుని పెండ్లాడెను. ఈ విధముగ శివాని దాక్షాయణిగా జన్మించినది. దక్ష ప్రజాపతి మహదహంకారము వంటివాడు. అందుండియే సమస్త సృష్టి ప్రజ్ఞలు పుట్టినవి. వాటి అన్నింటినీ సమర్ధవంతముగ నిర్వర్తించువాడు కూడ అతడే. ఇరువది ఏడు నక్షత్ర తత్త్వములకు కూడ తండ్రి అతడే. నక్షత్ర మండలము ఆధారముగ సూర్య మండలములు, గ్రహ మండలములు, భూమండలములు పుట్టినవి. వీటన్నింటినీ నిర్వహించువాడు దక్షుడే.

దక్షుడనగా సమర్థుడని అర్థము. సమర్థుడగుటచే దక్షు డహంకరించెను. అహంకారము వలన అజ్ఞానమున పడెను. సమర్థుడు సహజ

ముగ అహంకారము కలిగి యుండును. అహంకారము కారణముగ పతనము చెందుచుండును. హిరణ్యకశిపుడు, రావణుడు అత్యంత సమర్థవంతమైన జీవప్రజ్ఞలు. వారిని అహంకారము ఆవరించినపుడు పతనము చెందిరి. సమర్థులకు పతనకారణము అహంకారమే. అహంకారము కారణముగ అజ్ఞానపూరిత భావనలు కలుగును. తాను ఆచరించుచున్నది అధర్మమైననూ ధర్మమే అని నిర్ధారణ చేయును. వాదించును. సమర్థుడు గనుక యితరులను దమించును.

ఇట్లు దక్షులగు వారు దైత్య భావములను పోషించుచు నుందురు. దైత్య భావమనగా చీకటి భావములు, అజ్ఞాన భావములు. దైత్య భావములు పెంచుకొనుచు అహంకారులై పెరుగుచు తమ పతనమునకు తామే కారణ మగుదురు. అసురుల కథ యిదియే.

దక్షునికి దాక్షాయణిగా శ్రీమాత కనిష్ఠ పుత్రికగ జన్మించినది. అనగా అహంకార పురుషుని యందు బుద్ధి వలె శ్రీమాత యుండును. బుద్ధి అహంకారుని యందు దైవము నిక్షిప్తము చేసిన వెలుగు. ప్రతి జీవుని యందు బుద్ధి కూడ నిక్షిప్తము చేయబడి యున్నది. ఆ బుద్ధిని ఆధారము చేసుకొని ప్రతి జీవుడు రక్షణ పోషణములను, వృద్ధిని పొందును. చీమ యందు బుద్ధి తీపి పదార్థము లెక్కడున్నవో తెలియజేయును. ఎలుక యందు బుద్ధి పిల్లికి, మనుష్యులకు దొరకకుండ ఆహారమును భుజించు యుక్తిగ పనిచేయు చుండును. అట్లే పిల్లి, కుక్క, పులి, సింహము కూడను. అదే విధముగ మానవులు కూడ

తమ రక్షణ పోషణాదులను బుద్ధి ఆధారముగ నిర్వర్తించుకొను చుందురు.

బుద్ధి దైవముయొక్క వెలుగు గనుక అది సహజముగ దైవము తోనే అనుసంధానము చెంది తనను వృద్ధిపరచుకొను చుండును. అహంకార పురుషుని యందు పుట్టిననూ, అహంకారము పుట్టుక స్థానముతో అనుసంధానము కలిగియుండును. అహంకారము పుట్టునది దైవమునుండి. దైవము తండ్రికాగా, అహంకారము పుత్రుడు కాగా బుద్ధి మనుమడగును. చిత్తము మునిమనుమ డగును. అహంకారము పెరిగినపుడు బుద్ధి సన్నగిల్లును. అపుడు అహంకార పురుషుడు ధర్మాధర్మ వివేకము నశింపగ, చిత్తమునకు నచ్చినట్లు ప్రవర్తించును. దైవము, బుద్ధి తాతా మనుమడు కాగా అహంకారము, చిత్తము తాతా మను మళ్ళు అగుదురు. చిత్త అహంకారములు విజృంభించి పనిచేయు చుండగ బుద్ధి దైవమును జేరి మౌనము వహించి కాలము రూపమున వేచియుండును. కాలక్రమమున దైవ సంకల్పముగ అహంకారమునకు పతనము కలుగును. ఇది శాశ్వత కథ.

దక్ష ప్రజాపతి మితిమీరిన అహంకారము కలవాడై తాను చేయు యజ్ఞమునందు శివునకు భాగము కల్పింపలేదు. శివునికి ఆహ్వానము పంపలేదు. అనగా శివుని యజ్ఞమునకు ఆవాహనము చేయలేదు. దాక్షాయణి యజ్ఞమునందున్ననూ శివునికి ఆవాహనము లేనిచోట తానుండుట కిచ్చగింపక శివుని చేరెను. దక్షుని రక్షించుటకే

శివుడు యజ్ఞమును ధ్వంసము చేసెను. అహంకారమును ధ్వంసము చేసి దక్షుని కాపాడెను.

జీవులను అహంకారము నుండి కాపాడుట శ్రీమాత చేయు కార్యక్రమములలో విశిష్టమగు కార్యక్రమము. అహంకారమును నశింపజేసి జీవుని దైవము వద్దకు జేర్చుట శ్రీమాత చేయుపని. దైవముచే జీవు డనుగ్రహింపబడుటకు అనేకానేక విధముల కృషి సలుపుచుండును.

అహంకారము దైత్య రక్షణము. జీవుడు ఆదిత్యాంశ. దితి చీకటి. అదితి వెలుగు. వెలుగును చీకటి ఎప్పుడునూ క్రమ్ముచునే యుండును. వెలుగు చీకటి నుండి బయల్పడుచునే యుండును. ఇది యొక శాశ్వత గాథ. జీవుని పుట్టుకతోనే అహంకారము కూడ పుట్టును. తానొకడు వున్నాననుకొనియే కదా! కార్యములు చేయుట. అట్లు చేయుచున్నప్పుడు కార్యములు ఫలించినపుడెల్ల అహంకారము బలపడుచుండును. సమర్థు లకు ఈ అపాయము ఎక్కువగ యుండును. అహంకారము మితిమీరి నపుడు మనమేమి చేసిననూ అది ఘనకార్యము అనిపించును. మంచి చెడ్డలు, ఉచ్చ నీచములు కూడ మరచి పనిచేయుటగ నుండును. ఇట్టి అపాయము కలుగకుండుటకే బుద్ధి నాశ్రయించి దైవమును ప్రార్థించ వలెను. నిత్యము అట్లు దైవ ప్రార్థనలు జరుగనపుడు వశము తప్పుట జరుగును.

అహర్నిశలు సూర్యుని చుట్టు తిరుగుచున్ననూ భూమికి వెలుగు చీకట్ల బెడద తప్పలేదు. వెలుగునకై సూర్యుని చుట్టూ తిరుగుచున్ననూ

సగభాగ మెప్పుడును చీకటిగనే యుండును. వెలుగుకు నీడ తప్పదు. జీవునికి అహంకారపు నీడ తప్పదు.

నీడ అనివార్యమైననూ దానిని తగుమాత్రముగ అదుపునందుంచ వచ్చును. మిట్ట మధ్యాహ్న సమయమున నీడ తక్కువగ నుండును. దానికి కారణము నడినెత్తి యందు గల వెలుగు. నడినెత్తి యందు వెలుగు చేరినపుడు నీడకు గల స్థానము పాదముల క్రింద మాత్రమే. నిజమునకు మిట్ట మధ్యాహ్నమున కూడ మనిషి నీడ అటునిటుగా పడుచుండును. కేవలము విషువత్పుణ్య దినములలో (మార్చి 21, సెప్టెంబరు 22 తేదీలలో) భూమధ్య రేఖపైన మిట్టమధ్యాహ్న సమయ మున మన నీడ మన పాదముల క్రిందుగ నుండును. ఆ పుణ్య దినములలో సాధకులు సుషుమ్న యందు మిట్ట మధ్యాహ్న ప్రార్థనలు చేసినచో నీడ లేని వెలుగు అనుభూతి పొందుదురు. సుషుమ్న విషువత్పుణ్య దినములలో సూర్యకిరణములు భూమి సుషుమ్న అయిన భూమధ్యరేఖ మీదుగ ప్రసరించును. ఆ సమయమున ధ్యానము చేయుట అత్యుత్తమముగ ఋషులు దర్శించి యిచ్చిరి. యోగపరముగ, ఆరాధనా పరముగ ఇంతకన్న పవిత్ర దినములు లేవు. ఈ సందర్భముననే భారతీయ సంప్రదాయమున వసంత నవరాత్రి, శరన్నవరాత్రి ఉత్సవములను ఏర్పాటు గావించిరి. అవి నిజముగ ఉత్సవములే. సహస్రారమున శివశక్తుల సమాగమ అనుభూతియే జీవులకు పరమ ప్రాప్తి, పరమపదము కూడ. సహస్రారము నందు పరిపూర్ణమగు

వెలుగు యేర్పడునంత వరకు సాధకులు విశ్రమింపరాదు. అనగా శివశక్తుల సాన్నిధ్యమున చేరువరకు అహంకారము అపాయమును కలిగించ గలదు. ఏ పూట కాపూట కలుపును ఏరినట్లు, అహంకారమును దివ్య ప్రార్థనతో నిర్మూలించుకొనుచు వుండవలెను. లేనిచో పతనము తప్పదు.

దాక్షాయణి ప్రార్థనము అహంకారమను వ్యాధికి దివ్యౌషధము వంటిది. ఆమె దైత్యహంత్రి అగుటచే అహంకారాది దైత్య శక్తులను సంహరించును. దక్షుని బ్రోచినట్లు భక్తులను అహంకారము నుండి కాపాడును.

శ్రీ లలితా సహస్రనామ మందలి

ఆరవ సంపుటము

సంపూర్ణము

శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః ।

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రము

## ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

మణిపూరాబ్జనిలయా వదనత్రయసంయుతా ।
వజ్రాదికాయుధోపేతా డామర్యాదిభిరావృతా ॥ 102

రక్తవర్ణా మాంసనిష్ఠా గుడాన్నప్రీతమానసా ।
సమస్తభక్తసుఖదా లాకిన్యంబా స్వరూపిణీ ॥ 103

స్వాధిష్ఠానంబుజగతా చతుర్వక్త్ర మనోహరా ।
శూలాద్యాయుధసంపన్నా పీతవర్ణాఽతిగర్వితా ॥ 104

మేదోనిష్ఠా మధుప్రీతా బందిన్యాది సమన్వితా ।
దధ్యన్నాసక్త హృదయా కాకినీరూపధారిణీ ॥ 105

మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాఽస్థి సంస్థితా ।
అంకుశాది ప్రహరణా వరదాది నిషేవితా ॥ 106

ముద్గౌదనాసక్తచిత్తా సాకిన్యంబా స్వరూపిణీ ।
ఆజ్ఞాచక్రాబ్జనిలయా శుక్లవర్ణా షడాననా ॥ 107

మజ్జాసంస్థా హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా ।
హరిద్రాన్నైకరసికా హాకినీ రూపధారిణీ ॥ 108

సహస్రదళపద్మస్థా సర్వవర్ణోపశోభితా ।
సర్వాయుధధరా శుక్లసంస్థితా సర్వతోముఖీ ॥ 109

సర్వౌదనప్రీతచిత్తా యాకిన్యంబా స్వరూపిణీ ।
స్వాహా స్వధా మతి ర్మేధా శ్రుతిః స్మృతి రనుత్తమా ॥ 110

పుణ్యకీర్తిః పుణ్యలభ్యా పుణ్యశ్రవణకీర్తనా ।
పులోమజాఽర్చితా బంధమోచనీ బంధురాలకా ॥ 111

విమర్శరూపిణీ విద్యా వియదాది జగత్ప్రసూః ।
సర్వవ్యాధి ప్రశమనీ సర్వమృత్యు నివారిణీ ॥ 112

అగ్రగణ్యాఽచింత్యరూపా కలికల్మషనాశినీ ।
కాత్యాయనీ కాలహంత్రీ కమలాక్ష నిషేవితా ॥ 113

తాంబూలపూరితముఖీ దాడిమీకుసుమప్రభా ।
మృగాక్షీ మోహినీ ముఖ్యా మృడానీ మిత్రరూపిణీ ॥ 114

నిత్యతృప్తా భక్తనిధి ర్నియంత్రీ నిఖిలేశ్వరీ ।
మైత్ర్యాదివాసనాలభ్యా మహాప్రళయ సాక్షిణీ ॥ 115

పరాశక్తిః పరానిష్ఠా ప్రజ్ఞానఘనరూపిణీ ।
మాధ్వీపానాలసా మత్తా మాతృకా వర్ణరూపిణీ ॥ 116

మహాకైలాసనిలయా మృణాళ మృదుదోర్లతా ।
మహనీయా దయామూర్తి ర్మహాసామ్రాజ్యశాలినీ ॥ 117

ఆత్మవిద్యా మహావిద్యా శ్రీవిద్యా కామసేవితా ।
శ్రీ షోడశాక్షరీవిద్యా త్రికూటా కామకోటికా ॥ 118

కటాక్షకింకరీభూత కమలా కోటిసేవితా ।
శిరఃస్థితా చంద్రనిభా ఫాలస్థేంద్రధనుః ప్రభా ॥ 119

హృదయస్థా రవిప్రఖ్యా త్రికోణాంతర దీపికా ।
దాక్షాయణీ దైత్యహంత్రీ దక్షయజ్ఞ వినాశినీ ॥ 120

# OTHER BOOKS THROUGH MASTER K. PARVATHI KUMAR

*The following books are available in: English (E), German (G), Spanish (S), French (F), Hebrew (H), Telugu (T), Hindi (HI) and Kannada (K) languages.*

| | | |
|---|---|---|
| 1. | Agni (E/G/S) | 60-00 |
| 2. | Amanaskudu (T/K) | 18-00 |
| 3. | Antardarsana Dhyanamulu (T) | 100-00 |
| 4. | Anveshakudu (T) | 60-00 |
| 5. | Asangudu (T) | 15-00 |
| 6. | Ashram Leaves (E/G/S) | 100-00 |
| 7. | Ayurvedic Principles (E) | |
| 8. | Bharateeya Sampradayamu (T/Hi) | 10-00 |
| 9. | Cow ('Govu' Mahatyam Vivarana) (E/T/K) | 20-00 |
| 10. | Devapi Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 11. | Dhanakamuni Katha (T) | 25-00 |
| 12. | Doctorine of Eternal Presence (E) | 10-00 |
| 13. | Gayatri Mantra - Avagahana (T) | 10-00 |
| 14. | Geetopanishad - Gnana Yogamu (T) | 25-00 |
| 15. | Geetopanishad - Karma Yogamu (T) | 20-00 |
| 16. | Geetopanishad - Sankhya Yogamu (T) | 25-00 |
| 17. | Geetopanishad - Karmasanyasa Yogamu (T) | 20-00 |
| 18. | Good Friday (E/G/S/F/H) | 10-00 |

| | | |
|---|---|---|
| 19 | Gurupaduka Sthavam (E) | |
| 20. | Health & Harmony (E) | 120-00 |
| 21. | Hercules-The Man and the Symbol (E/G/S/F) | 100-00 |
| 22. | Himalaya Guru Parampara (T/Hi) | 12-00 |
| 23. | Jupiter-The Path of Expansion (E/G/S) | 40-00 |
| 24. | Jyotirlinga Yatra (T) | 20-00 |
| 25. | Katha Deepika (T) | 40-00 |
| 26. | Listening to Invisible Master (E/G/S/F/H) | 20-00 |
| 27. | Lord Maitreya-The World Teacher (E/G/S/F/H) | |
| 28. | Maitreya Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 29. | Mana Mastaru Garu (T) | 60-00 |
| 30. | Mantrams-Their Significance and Practice (E/G/S) | 35-00 |
| 31. | Maria Magdalena (E/S/G/F) | |
| 32. | Marriage-A Sacrament (E) | |
| 33. | Maruvu Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 34. | Master C.V.V. (Birthday Message) (T) | 30-00 |
| 35. | Master C.V.V. Noothana Yogamu (T) | 20-00 |
| 36. | Master C.V.V. Yogamu (T) | 20-00 |
| 37. | Master C.V.V. Yogamu-Karma Rahityamu (T) | 10-00 |
| 38. | Master C.V.V. - May Call !(E/G/S) | 100-00 |
| 39. | Master C.V.V. - May Call ! II (E) | 100-00 |

| | | |
|---|---|---|
| 40. | Master C.V.V. The Initiator - Master E.K. The Inspiror (E) | 15-00 |
| 41. | Master C.V.V. - Saturn Regulations | 125-00 |
| 42. | Master E.K. - The New Age Teacher (E/G/S) | 70-00 |
| 43. | Mithila-A New Age Syllabus (E/G/S) | 100-00 |
| 44. | Occult Meditations (E/G/S) | 100-00 |
| 45. | Omkaram (T) | 30-00 |
| 46. | On Change (E/G/S) | 50-00 |
| 47. | On Healing (E/G/S) | 100-00 |
| 48. | On Love (E/G/S) | 50-00 |
| 49. | On Service (E/G/S) | 50-00 |
| 50. | On Silence (E/G/S) | 50-00 |
| 51. | Pranayamam (T) | 10-00 |
| 52. | Prayers (E/G/S) | 100-00 |
| 53. | Rudra (E/G/S) | 30-00 |
| 54. | Sankhya - The Sacred Doctrine (E/G/S) | 75-00 |
| 55. | Saraswathi - The Word (E/G/S) | 60-00 |
| 56. | Saturn-The Path of Systematised Growth (E/G/S) | 40-00 |
| 57. | Shodasopachara Pooja - Avagahana (T) | 10-00 |
| 58. | Sound-The Key and its Application (E/G/S) | 40-00 |
| 59. | Spiritualism - Business and Management (E/G/S) | 25-00 |
| 60. | Sri Dattatreya (E/G/S/T/Hi) | 33-00 |
| 61. | Sri Gurupaduka Sthavam (T) | 30-00 |

| | | |
|---|---|---|
| 62. | Sri Krishna Namamrutham (T) | 25-00 |
| 63. | Sri Lalitha-1 (T) | 40-00 |
| 64. | Sri Lalitha-2 (T) | 40-00 |
| 65. | Sri Lalitha-3 (T) | 40-00 |
| 66. | Sri Lalitha-4 (T) | 40-00 |
| 67. | Sri Lalitha-5 (T) | 40-00 |
| 68. | Sri Sastri Garu (E/G/S/F/T/H) | 40-00 |
| 69. | Sri Shiridi Sai Sayings (E/G/S/T/Hi) | 80-00 |
| 70. | Steps on Silence (E) | 75-00 |
| 71. | Suvarna Sopanamulu | |
| 72. | The Aquarian Cross (E/G/S) | 100-00 |
| 73. | The Aquarian Master (E/G/S) | 75-00 |
| 74. | The Doctorine of Ethics (E) | 35-00 |
| 75. | The Etheric Body (E/G/S) | |
| 76. | The Path of Synthesis (E) | 40-00 |
| 77. | The Splendor of Seven Hills (E/T/Hi) | 15-00 |
| 78. | The Teachigs of Lord Sanatkumara | 150-00 |
| 79. | The Theosophical Movement (E/G/S) | 60-00 |
| 80. | The White Lotus (E/G/S) | 20-00 |
| 81. | Time - The Key (E/G/S) | |
| 82. | Uranus - The Alchemist of the Age | 150-00 |
| 83. | Venus - The Path of Immortality (E/G/S) | 80-00 |
| 84. | Violet Flame Invocation (E/G) | 60-00 |

| | | |
|---|---|---|
| 85. | Vrutrasura Rahasyam (T) | 35-00 |
| 86. | Varunagraha Prabhavamu (T) | 22-00 |
| 87. | Wisdom Buds (E/S) | 20-00 |
| 88. | Wisdom Teachings of Vidura (E/G/S) | 80-00 |
| 89. | Moon & Spiritual Astrology (S) | |
| 90. | The Death & Reincarnation (S) | |
| 91. | Commentary on Om Namonarayanaya (S) | |
| 92. | Master Jesus, Life and Teachings (S) | |
| 93. | The Science of Ayurveda & Homoeopathy (S) | |
| 94. | The Teachings of Master D.K. (S) | |
| 95. | The Human Constitution (S) | |
| 96. | The Masters of Wisdom (S) | |
| 97. | The Path of Meditation (S) | |
| 98. | Stories for Disciples (S) | |
| 99. | Spirituality in Daily Life (S) | |
| 100. | Special Practices for Disciples (S) | |
| 101. | Fundamentals of Health & Healing (S) | |
| 102. | Ganesha, The Cosmic Lord of Groupings (S) | |
| 103. | Astrology and Healing (S) | |

## DHANISHTA OTHER PUBLICATIONS

| | | |
|---|---|---|
| 1. | Puranapurushuni Pooja Vidhanam (T) | 10-00 |
| 2. | Sarannavaratra Pooja Vidhanamu (T) | 30-00 |
| 3. | Sri Dattatreya Pooja Vidhanamu (T) | 10-00 |
| 4. | Sri Hanuman Chalisa (T) | 15-00 |
| 5. | Sri Mahalakshmi Pooja Vidhanamu (T) | 12-00 |
| 6. | Sri Rama Pooja Vidhanamu (T) | 10-00 |
| 7. | Sri Siva Hridayamu (T) | 5-00 |
| 8. | Sri Siva Pooja (T) | 15-00 |
| 9. | Sri Soukumarya Satakam (T) | 10-00 |
| 10. | Sri Surya Pooja Vidhanamu (T) | 7-00 |
| 11. | Sri Venkateswara Pooja Vidhanamu (T) | 8-00 |
| 12. | Vinayaka Vratakalpamu (T) | 25-00 |
| 13. | Vishnu Sahasranamam (T) | 12-00 |
| 14. | Sri Rama Charitramu (T) | |
| 15. | Sri Subrahmanya Pooja Vidhanamu (T) | 10-00 |
| 16. | Sri Yoga Ganapathi Pooja Vidhanamu (T) | 12-00 |

# స్మృత్యంజలి





## శ్రీమతి గూటాల వేంకట సత్యవతిగారు

**3-7-1930 — 2-10-2010**

(శ్రీమతి కంభంపాటి కృష్ణకుమారి గారి మాతృమూర్తి)

హరితస గోత్రోద్భవి, పుణ్యశీలి, భక్తి సేవా పరాయణురాలు, శ్రీ గూటాల సోమేశ్వరరావుగారి ధర్మపత్ని **శ్రీమతి వేంకట సత్యవతి** గారికి *"లలితా సహస్రనామ వివరణమందలి ఆరవ భాగము"* సవినయముగ, భక్తిపూర్వకముగ, శ్రద్ధతో సమర్పింపబడుచున్నది.

నిరంతర భగవన్నామ స్మరణము, సాయి సంఘ సేవా కార్యక్రమములలో జీవితము సమర్పణ గావించుకొనుచు తేది 2-10-2010 న పుణ్యలోకములకు పయనమైన పుణ్య స్త్రీ, మాతృ మూర్తి అగు శ్రీమతి సత్యవతిగారి ఆశీర్వచన ప్రాప్తికై ఈ సమర్పణము.

పరమపదించిన ఈ పుణ్యమూర్తికి *"శ్రీ లలిత"* స్వర్లోక ప్రాప్తి నొసగుగాక !

14-10-2010

**- ధనిష్ఠ**

విశాఖపట్నం

# శ్రీలలిత

## సప్తమ భాగము

(601 నుండి 700 వరకు నామములకు వివరణము)

7

మాస్టర్ పార్వతీకుమార్



ధనిష్ఠ

ప్రథమ ముద్రణ : 2010

ప్రతులు : 1,000

వెల : రూ॥ **40-00**

*ప్రాప్తిస్థానము :*

**జగద్గురు మందిరము**

(ది వరల్డ్ టీచర్ టెంపుల్)

'రాధామాధవమ్'

14-38-2, ముప్పిడి కోలనీ,

విశాఖపట్నం - 530 002.

ఫోన్ : 0891-2701531

e-mail : dhanishta@rediffmail.com

*ముద్రణ :*

ఎక్సెలియన్ ప్రింటింగ్ స్కూల్

విశాఖపట్నం – 530 016.

☏ 0891-2747320, 9848075132.



# సమర్పణము

శ్రీలలితా సహస్రనామ వివరణా యజ్ఞమున లిఖింపబడిన **'శ్రీలలిత - సప్తమ భాగము'**, శాండిల్యస గోత్రవతి,

స్వర్గీయ **కంభంపాటి వేంకటప్పయ్యశాస్త్రిగారి** ధర్మపత్ని

**శ్రీమతి రామలక్ష్మి**గారి

*పాద పద్మములకు సమర్పింపబడినది.*

వికృతినామ సంవత్సర కార్తీక పౌర్ణమి శుభ ఘడియలలో, మహాపర్వ దినమున శ్రీమతి రామలక్ష్మిగారు శివ సాయుజ్యము పొందిన పుణ్యమూర్తి.

శ్రీమతి రామలక్ష్మిగారు సప్త సంతానమును పొందిన మాతృ మూర్తి. వారు దర్శించని పుణ్యక్షేత్రము లేదు. చేయని తీర్థ యాత్రయు లేదు. బాల్యము నుండి దైవారాధన, గురు సుశ్రూషలను గావించుచు సాటి స్త్రీలలో అత్యంత గౌరవమును పొందిన ధర్మశీలి. చిన్నతనము నుండి జీవితమంతయు సత్సంపదలతో, సత్సంతానముతో పూర్ణ జీవితము గడిపిన భరత స్త్రీ. మునిమనుమనికై వేచి యుండి అతనిని దర్శించిన పిదప దేహత్యాగము గావించిన సిద్ధ సంకల్ప. అట్టి పుణ్య మూర్తి పాదపద్మములకు ఈ సప్తమ భాగము భక్తితో సమర్పితము.

**- పార్వతీకుమార్**



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువ లేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జన్మించినది.

**"ధనిష్ఠ"** మాస్టర్ పార్వతీకుమార్‌గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపములోను, పుస్తకముల రూపము లోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును సద్గోష్ఠికై వలసిన వాతావరణమును – "జగద్గురు మందిరము"గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

## సంకలనకర్త : మాస్టర్ పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయి లకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ పార్వతీకుమార్**గారు. వారి బోధనలు లెక్కకుమించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియవచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసరణీయమై, ఆచరణ యోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించు చున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళారంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో – మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, *"మానవ సేవయే మాధవ సేవ"*అను మాటకు

సరియైన అర్థము యిదేనని మాస్టరుగారు తమ ప్రవర్తన ద్వారా తెలియ పరచుచున్నారు. మాస్టర్ పార్వతీకుమార్‌గారు బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక – మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, శతాధిక గ్రంథముల సంకలన కర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొనుచుండు ననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు మాస్టరుగారి దృఢ విశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశ విదేశములలో పరహితసేవ గావించుచున్నవి. “పరహితము పరమధర్మ” మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవద్ధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

"శ్రీలలిత" అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతిమాసము 'నావాణి' దర్శన మాస పత్రికయందు ప్రచురింపబడుచున్నవి. పాఠకుల కోరికపై అమ్మవారి "సహస్ర" నామములను "శత" నామములు ఒక భాగముగ ప్రచురించుటకు సంకల్పించితిమి. ఇప్పటికి 600 నామములను 6 భాగములుగ ధనిష్ఠ ప్రచురించినది. ప్రస్తుతము 601 నుండి 700 వరకు 7వ భాగముగ అందించుచున్నాము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీరమగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారినుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారి యందు, వారి భాషణయందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహపరములకు పరిష్కారమని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

**– ధనిష్ఠ**

# పరిచయము

**ల**లితాదేవి, శ్రీదేవి, దుర్గ, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమెయే మూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్త స్థితియందు సత్యముగను, వ్యక్త స్థితియందు మహాచైతన్యముగను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు, సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితి గొనుటకు వినియోగ పడును. అందులకే పారాయణము.

అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వ్యాఖ్యానము. సామాన్యులకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

- పార్వతీకుమార్

# విషయసూచిక

# శ్రీ లలిత



ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

# 601. 'దరాందోళిత దీర్ఘాక్షీ'

**త**గు మాత్రము చంచలమై దీర్ఘమై వ్యాపించిన కన్నుల కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత కన్నులు అప్రమత్తమై సర్వమునూ వీక్షించుచూ, కొద్దిగా నటు, నిటు గమనించుచు నుండును. లేడి కన్నులవలె చంచలము లని చెప్పవచ్చును. లేడి చూపులు అటు నిటు చుఱుకుగ చూచుచు నుండును. అపాయములను గుర్తించుటకు అట్టి చూపును కలిగి యుండును. చుఱుకుదనము కలవారి కన్నులు కూడ నట్లే సున్నితముగ కదలుచూ పరిసరముల నన్నింటినీ తృటికాలములో గమనించుట, పరిస్థితులను గ్రహించుట చేయుచు నుండును. ఇచ్చట కన్నుల కదలిక చుఱుకు దనమునకు సంకేతమని తెలియవలెను. ఇట్లు చుఱుకైన కన్నుల ద్వారా శ్రీమాత ఆందోళనా కారకములైన అంశములను గమనించుచు తగు చర్యలు చేపట్టును. తదాందోళనములను వెంటనే పరిహరించును. సృష్టి సమస్తము నిర్వహణము చేయు శ్రీమాత కిట్టి కన్నులు సహజమే.

కన్నుల గమనముతో సమస్తమును గమనించునది శ్రీమాత. ఈ కన్నుల చుఱుకుదనము చిరు ఆందోళనముగ ప్రశంసింప బడుచున్నది. కార్యములందు ప్రధాన కార్యకర్తలు ఇట్టి చుఱుకు దనమును కలిగి అటు నిటు చూచుచు అప్రమత్తులై యుందురు. అట్టి చూపులు లేనిచో అపాయములను గుర్తింపలేరు. వర్తమానమున యున్న

అపాయములను చూడలేకపోవుట తమస్సు. భవిష్యత్తున రాబోవు అపాయములను కూడ గుర్తించుట శ్రేష్టమగు మేధస్సు పని. చురుకుగ పనిచేయు మెదడు కన్నుల నుండి త్వరితగతిని సమస్తమునూ పరికించుచూ తదనుగుణముగ చురుకుగ కదలుచూ కార్యములను చక్కబెట్టు. విశ్వామిత్రుని యజ్ఞమును కాపాడిన రామ లక్ష్మణులు, ఆలమందలో చేరిన అసురుని పసిగట్టిన శ్రీకృష్ణుని చూపు చురుకు కన్నులకు ఉదాహరణము.

శ్రీమాత కన్నులట్టి చురుకుదనముతో పాటు దీర్ఘముగను విశాలముగను కూడ యున్నవి. అందము, చురుకుదనముగల శ్రీమాత కన్నులను ఈ నామము కీర్తించుచున్నది.



# 602. 'దరహాసోజ్జ్వలన్ముఖీ'

**చి**రునవ్వుతో ప్రకాశించు ముఖము కలది శ్రీమాత.

చిరునవ్వు దివ్యకళ. కొందరికది సహజముగ నుండును. తుష్టి పుష్టి గలవారికి చిరునవ్వు సహజము. లోటుపాటుల కెప్పుడునూ గురియగువారికి ఎదుటివారి చిరునవ్వు ప్రశాంతతను కూర్చును. ప్రశాంత చిత్తము, తుష్టి, పుష్టి యున్నప్పుడే కదా! కలిగి యుండుట. తుష్టికిని పుష్టికిని అంతరానందము ఆధారము. అంతర ఆనందము ఉపాధి రహితము. అనగా ఆనందముగ నుండుటకు బాహ్యకారణ మేమియు అవసరము లేదు. అట్టి ఆనందము నిష్కారణము. అనగా కార్యకారణలోకములకు అతీతము. అంతరానందముతో కార్యములను నిర్వర్తించుటయే యుండునుగాని, ఆనందము కొరకు కార్యములను నిర్వర్తించుట, ఆనందము కోసము పనులు చేయుట, జీవించుట, లోకుల లక్షణము. ఆనందముతో కార్యములను చేయుట, ఆనందముగ జీవించుట పూర్ణజ్ఞానుల లక్షణము. పూర్ణజ్ఞాని ఆనంద స్వరూపుడై యుండును. అందువలన సర్వకార్యములందు రస సిద్ధిని పొందు చుండును. శ్రీమాత సృష్టి అధికారిణి. సృష్టి నిర్వహణ బాధ్యతా భారము కలిగియున్ననూ, మొగము నందు చిరునవ్వు ఎప్పుడునూ ప్రకాశించు చుండును. అధికారులకు సాధారణముగ చిరునవ్వు వుండదు. అధికారము కారణముగ దర్పము కలిగి యున్నప్పుడు చిరునవ్వు ఎట్లుండ గలదు? బాధ్యతా నిర్వహణ భారము కూడ యున్నప్పుడు

ముఖమున తీవ్రతయే యుండునుగాని హాసముండుటకు అవకాశము లేదు. వారి ముఖములలో వికర్షణయే గాని, ఆకర్షణ అణుమాత్రము కూడ నుండదు. కాని శ్రీమాత అనుపమానమైన కార్యదక్షత చూపుచూ చిరునవ్వుతో ప్రకాశించుచూ నుండును. కార్యభారము వలన మనో తీవ్రత కలవారందరునూ మందహాస వదనములను ఆరాధించుట వలన పరిష్కారములను పొందుదురు. చెదరని చిరునవ్వు మాత అనుగ్రహమే. అది ఉత్తమ జీవచైతన్య స్థితి.



# 603. 'గురుమూర్తి'

**గు**రురూపమున సాక్షాత్కరించునది శ్రీమాత అని అర్థము.

సద్గురువు లందరునూ కూడ శ్రీమాత భక్తులే. వారి రూపమున శ్రీమాత జీవులను కటాక్షించు చుండును. యోగక్షేమములను కలిగించును. గురువు సచ్చిదానంద స్వరూపుడు. అతడు బ్రహ్మము నెఱిగి శ్రీమాత నిర్వర్తించు దివ్యప్రణాళిక నెఱిగి, ఆనంద స్వరూపుడుగ నిలచి, జీవులకు దైవమునకు మధ్య వారధియై వర్తించును. అజ్ఞానము తొలగించి జీవులకు నిజస్వరూపము నావిష్కరించును. **'గు'** కారము కటిక చీకటియని, **'రు'**కారము ఆ చీకటిని తొలగించు శక్తియని, గురు వనగా అజ్ఞానపు చీకటులను తొలగించి వెలుగుదారుల యందు జీవులను పయనింపజేయు పుణ్యమూర్తి యని తెలుపుదురు.

సద్గురువు నిత్యానిత్య వస్తు వివేకము కలిగించి నిష్కామ కర్మము విలువలను బోధించి జీవులు యజ్ఞార్థము జీవించుటకే ప్రోత్సహించును. అటుపైన దానధర్మాది కార్యములను నిర్వర్తింపజేయును. సమభావము ప్రదర్శించి సాన్నిధ్యమిచ్చి జీవులను ద్వంద్వములనుండి తరింపజేయును. స్థిర చిత్తులగు వారికి మార్గము చూపి వారి అనుయాయియై వర్తించి దైవమును చేరు వరకు తోడ్పడును. ఇట్టి సద్గురువు శ్రీమాత ప్రతినిధియే; శ్రీమాత మూర్తియే. సద్గురువు యెల్లప్పుడునూ సచ్చిదానంద రూపిణి యైన శ్రీమాత యందే వసించును. ఆమె ఇచ్ఛానుసారము కార్యములను నిర్వర్తించును. నిజమునకు దేవి ఇచ్ఛా రూపమే గురువు. అందువలన

గురుమూర్తి ఆరాధనము శ్రీదేవి ఆరాధనమే అగును. అట్లే శ్రీదేవి ఆరాధనము కూడ గురుమూర్తి ఆరాధనమే అగును. ఆమె అనుగ్రహము వలననే జీవునకు బ్రహ్మైక్యము కలుగును. కనుక కడపటి గురువు ఆమెయే. బ్రహ్మైక్యము కలిగించు గురుమూర్తి శ్రీమాత. బ్రహ్మ జ్ఞానమును అనుగ్రహించునది శ్రీమాత. **'గు'** కారమునకు బ్రహ్మము అని అర్థమున్నది. **'రు'** కారము నకు జ్ఞానము అని కూడ అర్థమున్నది. గురువనగా బ్రహ్మ జ్ఞానమే. ఘనీభవించిన బ్రహ్మజ్ఞానమే గురుమూర్తి. అట్టి గురుమూర్తి శ్రీమాత అని తెలియవలెను.



# 604. 'గుణనిధి'

గుణములకు నిధి శ్రీమాత అని అర్థము.

గుణములు ప్రధానముగ మూడు. అవి సత్వ, రజస్, తమస్సులు. ఈ గుణములను దారములతో శ్రీమాత సృష్టి అల్లిక చేయును. మూడు గుణములు ఆధారముగ ఏడులోకములను నిర్మించును. దారముల అల్లికవలె సృష్టిని యేర్పరచును. మూడుగుణములు అనేక రకములుగ గుణింపబడుచుండును. అవి కోటానుకోట్లుగ వృద్ధి చెందును. అట్టి గుణములు ఆధారముగ జీవులు వైవిధ్యముతో కూడిన స్వభావములతో సృష్టింపబడుదురు. ఈ జీవుల యందు ఈ గుణ వైవిధ్యమును చూడ వచ్చును. జీవులు, గుణములచే బంధింపబడి ఎవరికి వారుగ జీవించు చుందురు. వారి వారి స్వభావములతో గూడి జీవించుదురు. సృష్టియందు జీవుల బంధనము గుణముల వలననే. గుణములను దారములు లేనిచో జీవులే ఏర్పడరు. ఇట్లు గుణములను త్రాళ్ళచే జీవులను అష్ట బంధములకు గురిచేసి శ్రీమాత సప్త లోకానుభూతికి అవకాశ మేర్పరుచును. అహంకార పురుషుడు, బుద్ధి, చిత్తము పంచభూతములు అనెడి ఏడు వ్యూహములలో తగుల్కొని తదనుభూతిని పొందుచు నున్నాడు. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి అను లోకములలో అనుభూతి చెందుచున్నాడు కదా! అట్లు అనుభూతి చెందుటకు, ఆయా లోకములతో సంబంధ మేర్పరచ వలెను. లోక సంబంధము గుణ బంధము వలననే యేర్పడును. ఇట్లు జీవులకు లోక సంబంధ మేర్పరచి తదనుభూతిని యిచ్చునది శ్రీమాత.

శ్రీమాత యేర్పరచినది సంబంధమే అయిననూ అజ్ఞాన కారణమున సంబంధములన్నియూ బంధములుగ వికారము చెందును. ఇట్లు బంధింపబడిన జీవులకు గురుమూర్తియై జ్ఞాన మొసగును. మరల జీవులు సమ్యక్ బంధమును కలిగి పూర్ణానందమును పొందుదురు. ఏడు లోకములకు ఆవల ఎనిమిదవ లోకమున జీవుడు వున్నాడు. ఆ జీవుడు తొమ్మిదవ లోకమున నున్న శ్రీమాత నుండి దిగివచ్చు గుణముల నుండి యేర్పడినాడు. సృష్టియందు తొమ్మిదవ లోకమున వసించు శ్రీమాత పదవలోకమున బ్రహ్మమై యున్నది.

శ్రీమాత గుణ వ్యూహములు తొమ్మిదిగ సౌందర్యలహరి తెలుపుచున్నది. అవి వరుసగా 1. కాల వ్యూహము, 2. కుల వ్యూహము, 3. నామ వ్యూహము, 4. జ్ఞాన వ్యూహము, 5. చిత్త వ్యూహము, 6. నాద వ్యూహము, 7. బిందు వ్యూహము, 8. కల్ప వ్యూహము, 9. జీవ వ్యూహము. వీని వివరములకు సౌందర్యలహరి యందు గల 34వ శ్లోకమును పరిశీలింపవచ్చును.

గుణనిధి యగు శ్రీమాత నవ వ్యూహముల గుణములు కలది అని తెలియుట ముఖ్యము. తాను బ్రహ్మమే అయిననూ సృష్టి నిర్వహణమునకు నవ వ్యూహములను గుణములతో అల్లి దాని నధిష్ఠించి గురుమూర్తియై ప్రకాశించు చున్నది.



# 605. 'గోమాతా'

గోవులకు తల్లి శ్రీమాత అని అర్థము.

గోవు లనగా ఆవులు, వృషభములు, సూర్య, చంద్ర కిరణములు. గోవు లనగా జలములు. గోవు అనగా భూమి. గోవు అనగా వాక్కు.

ఇట్లు గోవు పదమునకు అనేక అర్థము లున్నవి. స్రవించునవి, ప్రవహించునవి, ప్రసరించునవి, ప్రకటింపబడునవి గోవులుగా కీర్తింప బడినవి. అన్నిటికిని వుత్పత్తి స్థానమును గోవు అందురు. శ్రీమాత నుండియే సమస్తమును వుత్పన్నమగుచున్నవి. మనయందు వాక్కు ఎట్లు సంకల్పముగా వుత్పన్నమగుచున్నది? మన కన్నుల నుండి కాంతి ఎట్లు ప్రసరించుచున్నది? గొంతు నుండి శబ్ద మెట్లు పుట్టుచున్నది? రక్తము ఎట్లు నిత్యమూ ప్రవహించుచున్నది? మనయందలి సద్గ్రంథులు ఎట్లు స్రవించు చున్నవి? ఆనందముతో హృదయము ఎట్లు పొంగు చున్నది? ఇట్టి అంశములను పరిశీలించి తెలిసికొనినచో వీటి పుట్టుక స్థానము లన్నియూ మన యందు గల గోవులని తెలియును. అట్లు పుట్టుక స్థానములను పుట్టించునది శ్రీమాత. ఆమెయే గోమాత.

గోవును పూజించి నపుడు కూడ గోరూపమున నున్న శ్రీమాతను పూజించు చున్నట్లు తెలియవలెను. మన శరీర మందే అనేక గోవులు కలవు. వానిని పూజ్య భావముతో పోషించనిచో అవి స్రవింపవు, ప్రవహింపవు, ప్రసరింపవు. అపుడు ఆనందము మృగ్య మగును. ఆవు మాత్రమే గోమాత కాదు; వాక్కు కూడ గోమాతయే. చూపు గోమాత.

వినికిడి గోమాత. దేహమందలి అంతర్ బహిర్ స్రావములు గోమాత. ఆనందానుభూతి, స్వర్గానుభూతి గోమాత. సూర్యకాంతి, వెన్నెల కాంతి గోమాత. వీటన్నిటి యందును పూజ్య భావ ముండవలెను. వీటన్నిటికిని వుత్పత్తి స్థానము శ్రీమాత. ఆమె పుట్టుక నిచ్చి పోషించును. వీటిని పాలించువాడు గోపాలుడు. గోమాత, గోపాలుడు పరస్పరత్వము వహించి జీవుల పుట్టుక, పోషణ, పాలన పరిణామము నిర్వర్తించు చున్నారు.

గోపూజ పేరున కేవలము ఆవుతోకను పూజించినచో చాలదు. మనయందలి గోవులన్నిటియందు అట్టి శ్రద్ధా భక్తులను చూపవలెను. అపుడు శ్రీమాత సంతసించును.



# 606. 'గుహజన్మభూః'

**జీ**వుల జన్మస్థానము శ్రీమాత అని అర్థము.

గుహు లనగా అవిద్యతో గూడినవారు. అవిద్యతో పుట్టినవారు. అవిద్య అను చీకటిలో పుట్టినవారు.

ఎవరికిని తమ పుట్టుక తమకు తాముగ తెలియదు. తాము ఈ దినమున పుట్టితిమని, ఈ స్థలమున పుట్టితిమని, ఈ తల్లి దండ్రులకు పుట్టితిమని పుట్టినపు డెవరికిని తెలియదు. ఇంతకన్న విచిత్రమేమి? పై తెలిపిన వివరములు తనకు తెలిసినవి కావు. అయిననూ నమ్మి చరింతురు. జీవుల పుట్టుక స్థానము జీవులు పుట్టుచున్నప్పుడు తెలిసినచో అట్టివారే జన్మతః విద్యావంతులు. అట్లు కానపు డందరునూ అవిద్యలో పుట్టినట్లే. చీకటిలో పుట్టినట్లే. కనుక జీవులందరునూ గుహులే. వీరందరి పుట్టుక స్థానము శ్రీమాత.

ఇట్టి చీకటిని పారద్రోలుటకు గురుమూర్తివలె శ్రీమాత మరల వర్తించును. చీకటిలో పుట్టిన జీవులను మరల వెలుగులో పుట్టుటకు వలసిన మార్గము నందించును. ఇట్లు మరల పుట్టిన వారు ద్విజులు.

ఈ శ్లోకపాద ఆరంభమున గురుమూర్తి యున్నది. ఆమెయే గుణనిధియై లోకాలోకముల యందు జీవులను ప్రవేశపెట్టి సంబంధము యేర్పరచును. అట్టి జీవుల రక్షణ పోషణాది కార్యక్రమములను గోమాత నిర్వర్తించును. అటుపైన గురుమూర్తియై వారి అవిద్యలు తొలగించి

ఉద్ధరించును. గురుమూర్తి, గుణనిధి, గోమాత, గుహజన్మభూః అనునది ఒక గొలుసుకట్టు కార్యము.

గుహు డనగా సుబ్రహ్మణ్యుడు, స్కందుడు అని మరియొక అర్థము. కుమారుని తల్లి అగుట వలన కూడ గుహజన్మభూః అని చెప్పవచ్చును. శివుని వీర్యమునుండి జన్మించి గంగాముఖమున షష్ఠ మాతృకలను చేరి దర్భలపై జన్మించిన కుమారుడు, శ్రీమాత కారణముగ జన్మించినవాడే. శివుని యందు వీర్యము స్రవించుటకు గోమాత యగు శ్రీమాత సాన్నిధ్యమే కారణము.



# 607. 'దేవేశీ'

దేవతలకు ఈశ్వరి అని అర్థము.

దేవత లందరూ దివ్య శరీరధారులు. అనగా వెలుగు శరీరములు కలవారు. ఇంద్ర ధనస్సులోని రంగులవలె అనేకానేక కాంతులతో వివిధ శ్రేణుల దేవతలు యేర్పడి యున్నారు. వీరందరూ శ్రీమాత వెలుగులోనుండి వచ్చినవారే. శ్రీమాత అనంతమైన ఆకాశము వంటి వెలుగు. ఆకాశమునందు ఉదయము నుండి మరల ఉదయము లోపల యెన్నియో రంగులు దర్శించవచ్చును. వివిధ కాలములలో వివిధ రంగులు యేర్పడినట్లు కాలక్రమమున సృష్టి నిర్మాణమునందు అనేకానేక దేవతాశ్రేణులు యేర్పడెదరు. ఆదిత్యులు, రుద్రులు, వసువులు, పితరులు యిత్యాది దేవతలు అనేకానేకములుగ యేర్పడెదరు. వీరు సృష్టి నిర్వహణమునకు తోడ్పాటు గావింతురు. ఉప్పు ఉప్పగ నుండుటకు, పంచదార తీపిగ నుండుటకు, మిరపకాయ కారముగ నుండుటకు కూడ దేవతా ప్రజ్ఞల ప్రభావమే కారణము. వీరు ప్రధానముగ ముగ్గురని, వివరమున ముప్పది మూడు కోట్లు అని తెలుపుదురు. ముగ్గురుగ నున్నపుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లందురు. వీరు సహితము శ్రీమాత నుండి వుద్భవించినవారే. కావున సమస్త దేవతలకు శ్రీమాత పుట్టుక స్థానమేగాక వారిపై ఈశ్వరీత్వము వహించి యున్నది.

పిండి నుండి అనేకములగు రొట్టెలు, యితర పిండి వంటకములు వివిధ మగు రుచులతో, లక్షణములతో, ఆకారములతో యేర్పరచినట్లు శ్రీమాత నుండి వీరందరూ వివిధమగు ప్రజ్ఞలతో, శక్తులతో, కాంతు

లతో, ఆకారములతో యేర్పడుచుందురు. అన్ని పిండి పదార్థములకు పిండి ఎట్లు మూలమో, అన్ని దేవతా ప్రజ్ఞలకు శ్రీమాతయే మూలము. ఆమెయే ఈశ్వరి. ఈశ్వరి యనగా తన నుండి పుట్టినవారి యందు వ్యాపించి వసించి వారిని వర్తింపచేయునది. మనయందు పుట్టిన సంతానమునందు మన లక్షణములు కొన్ని యుండవచ్చును. వారి యందు వ్యాపించుట, వసించుట. నిర్వహించుట జరుగనపుడు వారికి మనము ఈశ్వరులము కాదు. మన వునికికి ఎవరు ఈశ్వరియో ఆమెయే అందరి వునికికిని ఈశ్వరి.

మననుండి మనదేహము యేర్పడినది. అట్లేర్పడు ధర్మముగా శ్రీమాతయే యున్నది. తండ్రి నుండి వీర్యము ఆధారముగ దిగివచ్చిన మనము తల్లియందు నీటిబుడగ వలె యేర్పడుదుము. బుడగ క్రమముగ స్థూలమై పిండమువలె యేర్పడును. ఆ పిండము నుండి క్రమముగ కన్నులు, చెవులు, ముక్కు, నోరు రంధ్రములుగ యేర్పడును. అటుపైన పిండము నుండి ఒక తోకగ వెన్ను దిగిరాగ, పిండము శిరస్సుగను, తోక ఆధారముగ దేహ భాగములు క్రమముగ తొమ్మిది నెలలలో యేర్పడును. ఇట్లు యేర్పరచునది కూడ శ్రీమాతయే. ప్రకృతి ధర్మములుగ దేవతలు పనిచేయగ వివిధ అంగము లేర్పడి ఆయా అంగములకు అధిపతులై దేవత లుందురు. ఇట్లు తానే వివిధ దేవతలుగ యేర్పడి వారి ద్వారా దేహ నిర్మాణము గావించి మన ముండుటకు నివాసము యేర్పరచును. కనుక మనకును మన దేహమునకును కూడ శ్రీమాతయే ఈశ్వరి. దేహము మనదనుకొనరాదు. అది దైవ దత్తము లేక దేవీ తత్త్వము. దేహము నందుకూడ శ్రద్ధా భక్తు లుండుట పరిపూర్ణానుభూతికి ఆవశ్యకము.

# 608. 'దండనీతిస్థా'

**దం**డనీతిగ సృష్టియందుండునది శ్రీమాత అని అర్థము.

సృష్టి అంతయూ ధర్మములచే నిర్మింపబడినది. సృష్టి ధర్మములను పాలించువారు సృష్టి యందు సుఖముగ జీవించగలరు. తదను భూతిని పొందగలరు. సృష్టి ధర్మక్షేత్రము. ధర్మమును పాటించుట అందరికిని తప్పనిసరి. నిజమునకు సృష్టి యందు దైవమనగా ధర్మమే. ధర్మమును పాలించు బుద్ధి యున్నవారు శిష్టులని, అట్లు పాటింపక యున్నవారు దుష్టులని నిర్వచింతురు. వీరిరువురును కాక పాటించ వలెనని భావించుచు పాటింపలేని బలహీను లుందురు. ఈ మూడు తెగల వారిని శ్రీమాత పాలించును. శిష్టులకు ఆనందమును, వృద్ధిని కలిగించును. బలహీనులకు ప్రోత్సాహమిచ్చి, బలమునిచ్చి వృద్ధి కలిగించును. బలముచేత దురహంకారులై ఇతరుల శ్రేయస్సును భంగ పరచు వారిని శిక్షించును. శిక్షించి రక్షించును.

సద్గురువు రూపమున, ఋషుల రూపమున ధర్మమును వివరించును. గ్రంథస్థము చేయించును. చదువరులకు ఈ గ్రంథము వినియోగ పడును.

ధర్మమును పాటింపచేయుటకు సంస్కారవంతుల ద్వారా సహకారము నందించును. అన్నము, వస్త్రము విద్య, ఉపాధి, వైద్యము యిట్టి సౌకర్యములను సంస్కారవంతులు యితరులకు ఉదారముగ నేర్పరతురు. సహకారము నందుకొనిన వారు కృతజ్ఞతా భావముతో

సంస్కారుల ననుసరింతురు. బోధన సామమార్గము. సహకారము దాన మార్గము. సహకారము నందుకొనుచూ వృద్ధి చెందని వారికి కష్ట నష్టములు యేర్పడును. కష్టమున నున్నవారు, నష్టమున వున్నవారు ధర్మము ననుసరించుటకు మ్రొగ్గు చూపుదురు. కష్ట నష్టములనుండి బయల్పడుటకు దైవారాధనము, ధర్మాచరణము తోడ్పడునని వానిని ఆశ్రయింతురు. ఇది భేదోపాయము. పై మూడు వుపాయముల ద్వారా ధర్మము పాటింపని జీవులను, దండించి మార్గమున నిలుపును. ఇట్లు సామదాన భేద దండోపాయములతో శ్రీమాత సృష్టి నిర్వహణము గావించుచు నుండును. అధర్మము జరిగినపుడెల్ల తగురీతిని దండనము కాలక్రమమున జరుగును. దండ నీతిగ శ్రీమాత సృష్టియందు వసించి యున్నది.



# 609. 'దహరాకాశరూపిణీ'

**హృ**దయమందు ఆకాశరూపమున స్వచ్ఛమై యుండునది శ్రీమాత అని అర్థము.

యోగశాస్త్రమున రెండు హృదయ కేంద్రములు ఆదిశంకరులచే వివరింపబడినవి. అందు మొదటిది ద్వాదశదళపద్మ కేంద్రము. రెండవది అష్టదళపద్మ కేంద్రము. సాధారణముగ యోగ గ్రంథముల యందుగాని, యోగాచార్యుల బోధల యందుగాని ద్వాదశదళపద్మమే వివరింపబడెను. అష్టదళ పద్మము యోగేశ్వరులే తెలిపిరి.

అష్టదళ పద్మము నారాయణ కేంద్రము. దానిని బ్రహ్మపురము అని కూడా అందురు. అది బ్రహ్మ ముందు చోటు. ఆ చోటు నుండి నారాయణ సంకల్పమున చతుర్ముఖు డుద్భవించును. చతుర్ముఖ బ్రహ్మ పుట్టినచోటు, అతడు పుట్టుటకు ముందుగా గల నారాయణ సంకల్పము, పుట్టిన చోటు దహరమున ఆకాశముగ యోగీశ్వరులు గుర్తించిరి. ఈ హృదయ పద్మము మన యందు సాధారణముగ తెలుపబడు హృదయ కేంద్రమునకును, కంఠ కేంద్రమునకును (అనగా అనాహతమునకును, విశుద్ధికిని) నడుమ యున్నది అని ఆదిశంకరులు వివరించిరి. ఈ పద్మము నడుమగల నీలాకాశము నారాయణ స్థానము. నారాయణుడు అన్నను, నారాయణి యన్నను ఒక్కటియే. ఈ ఆకాశమును దర్శించుట బ్రహ్మ జిజ్ఞాసువులు కోరుదురు. ఈ ఆకాశరూపమున యున్న శ్రీమాత నారాయణి. అచ్చట స్వచ్ఛము, నీలము, నిర్మలము, నిశ్చలము యగు

అనంతత్వమై యుండును. చోటుగ గోచరించును. అందు కాలము సంకల్పము, మాయ, స్పందనము ఇత్యాది వన్నియూ లీనమై యుండును. అటునుండి క్రమముగ, కాలక్రమమున సృష్టి సంకల్పము యొక ప్రేరణగ యేర్పడును. అపుడు ఆ సంకల్పమే మాయగా వర్తిం చును. అందుండి కాలము, ప్రకృతి, శక్తి అగ్ని యేర్పడును. అటుపైన స్పందన మేర్పడును. ఆపైన చతుర్ముఖ బ్రహ్మ వుద్భవించును. ఇట్లు ఒకదాని వెనుక ఒకటి మొగ్గ నుండి పూవు వలె కోశములతో కూడిన పద్మముగ సృష్టి వికసించును. కావుననే సృష్టిని పద్మ కోశ మందురు. ఇట్టి సృష్టికి మూలమగు చోటుగ శ్రీమాత యున్నది. ఆ చోటును దహరాకాశ మందురు. శ్రీమాతను దహరాకాశ రూపిణి అందురు.

ఈ దహరాకాశమునే నారాయణ సూక్తమున కూడ వర్ణించిరి. మంత్ర పుష్పమున ఆ భాగమున చేర్చి "పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం అని చెప్పబడినది. చ అపి అధోముఖం...," ఈ దహరాకాశము మనయందు మన పరిసరముల యందు చోటుగ దర్శించవచ్చును. చోటును చూచుట ఒక అద్భుతమగు విద్య. ఎదురుగ ఒక వస్తువు యున్నప్పుడు ఆ వస్తువును చోటు ద్వారా చూచుదురు. కాని చోటును చూడము. చోటును అందరమూ చూడలేము. కొందరే చూడగలరు. చోటును చూచు ప్రయత్నము, బ్రహ్మమును చూచు ప్రయత్నము వంటిది. ఋషులు మాత్రమే చోటును చూడగలరు. చోటు సూక్ష్మాతి సూక్ష్మము. సూక్ష్మాతి సూక్ష్మమగు దృష్టి కలవారే ఋషులు. వారు చోటును చూచుచు నుందురు. సమస్త వస్తువులందుగల చోటును కూడ చూచుదురు. సమస్తమును చోటులోనే తేలుచున్నట్లు చూచుదురు. వస్తువు లోపల,

వస్తువు బైట కూడ చోటే యున్నది. జీవులలోపల, జీవులబైట జీవులు గను చోటే యున్నది. మరియొకటి లేదు. ఇట్టి చోటు దైవమని, నారాయణ మని దహరాకాశ మని ఋషులు తెలిపినారు.

దేవతారాధన చేయునపుడు దేవత కటు నిటు రెండు దీపము లేర్పరతురు. రెండు దీపముల నడుమ దేవత యున్నది. దేవతా ప్రతిమ లేకుండగ రెండు దీపము లేర్పరచి వాటి నడుమ దేవతను వూహించి దర్శించుట ఒక ధ్యాన ప్రక్రియ. కొందరు ఒకే దీపమును వెలిగించిననూ అందు రెండు వత్తులను వెలిగింతురు. రెండు వత్తుల నడుమ గల చోటు నందు అదృశ్యముగ నున్న దైవమును చూచుటకు ప్రయత్నింప వలెను. రెండు దీపముల కాంతి పరిధుల నడుమ చూచుట సనాతన మగు సంప్రదాయము. ఇప్పటికిని యూదు సంప్రదాయమున శుక్ర వారము సాయంత్రము రెండు దీపములను వెలిగించి వాని నడుమ దైవమును చూచు పవిత్ర క్రతువు యున్నది. దానినే 'సబ్బాత్' అందురు. అట్లు సాయం సమయమున చోటులోని దైవ దర్శనమును కాంక్షించి ఆ రాత్రికి ఉపవసించి పరుండుదురు. దక్షిణ భారతమున దేవాలయము లలో కూడ గర్భగుడిలో అటునిటు రెండు దీపముల నేర్పరచుదురు. వాని నడుమ దృశ్యాదృశ్యముగ దైవము నుండును. దానిని దర్శించు ప్రయత్నము సూదూరము నుండి చేయునట్లు ఏర్పాటు యుండును. ఏకాగ్రతతో దర్శించుట కేర్పాటు చేయబడును. ఇట్టి యేర్పాట్లు అన్నియూ దహర దర్శనమునకే.

# 610. 'ప్రతిపన్ముఖ్య రాకాంత తిథిమండలపూజితా'

పాడ్యమి నుండి పౌర్ణమి అంతము వరకు గల పదహారు తిథులచే పూజింపబడునది శ్రీమాత అని అర్థము.

పౌర్ణమి నుండి రాకాంతము వరకు పదహారు తిథులుగ గణనము చేయుట సంప్రదాయము. పౌర్ణమి తిథి అంతమున సూర్యునికి చంద్రుడు పరిపూర్ణముగ ఉన్ముఖు డగును. పౌర్ణమి తిథి మొదలు నుండి అంతము చేరుసరికి ఈ ఉన్ముఖత్వము క్రమముగ నిశిత మగును. అందువలన పౌర్ణమి తరువాతి తిథి కూడా పౌర్ణమితో సమానముగ పూజింపబడు చుండును. పౌర్ణమి తిథి ప్రారంభము 'సినీవాలి' యని, 'కూహు' పూర్ణస్థితి యని, 'రాకాంత' ఉత్తర స్థితి యని దర్శనము. ఇట్టి సంప్రదాయ మున పదహారు కళలు గోచరించును. శ్రీమాత 'షోడశీ' కళలన్నియూ ఈ విధముగ మాసప్రారంభమున చంద్రోదయము నుండి రాకాంతము వరకు వృద్ధి చెందుచుండును. అటుపైన క్రమముగ కళలు తిరోధానము చెందుచు అమావాస్యను చేరును.

అమావాస్య, పౌర్ణమి, పదునాలుగు తిథులు కూడి పదహారు కళలుగ కూడ తెలుపుదురు. ఇది మరియొక సంప్రదాయము. వరాహ పురాణమున పదునాలుగు తిథులను, పదునైదవ తిథిగ అమావాస్యను, పదహారవ తిథిగ పౌర్ణమిని గణించిరి. మరియొక సంప్రదాయమున పదిహేనవ తిథిగ పౌర్ణిమను గ్రహించిరి.

ఎట్లైననూ చంద్రుడు లేని అమావాస్య రాత్రి నుండి చంద్రుడు పూర్ణముగ గల పౌర్ణమి తిథి వరకు పదహారు కళలను దర్శనము చేయుచు తదనగుణముగ శ్రీమాత కళను తమ యందు వృద్ధి పరచు కొనుట 'తిథి మండల పూజ' యగును. ఆమె యందలి వెలుగును (చైతన్యమును) చంద్రకళతో పోల్చి తిథి ప్రకారము ఆరాధనమును పెంచుకొనుచు పదహారు రోజలు చేయు పూజ తిథి మండల పూజ యగును. పదహారు రాత్రులు ఉపవసించుట, చంద్ర దర్శనము చేయుట ఈ వ్రత మందలి భాగములు.

ఆరాధన చేయువారు తమ యందు కళ పెరుగుటను ఊహిం చుట, దర్శించుట ప్రధానము. క్రమముగ కళలు తిథుల మార్గమున పెరుగుచుండుగ శుక్ల పక్ష దశమి నుండి రాకాంతము వరకు గల తిథులలో దివ్య పురుషుల దర్శనమునకు అవకాశ మేర్పడును. పౌర్ణమికి పూర్ణ కళలతో కూడిన శ్రీమాత దర్శనము కూడ సాధ్యమగును. ఆరాధకుల భక్తి, శ్రద్ధలు శ్రీమాత అనుగ్రహము కూడి దర్శనాదులు కలుగును.

ఆశ్వయుజ మాసమున దేవీ పూజను ఈ సంప్రదాయము ననుసరించి పదహారు రోజులు చేయుట యున్నది. వారిది కేవలము నవరాత్రి పూజ కాక షోడస రాత్రి పూజగ సాగును. షోడశోపచారము లతో షోడశ కళానిధి యగు శ్రీమాతను ఆరాధించు భక్తులు కలరు.

అమావాస్య ప్రళయ సమయము. అది శ్రీమాత అవ్యక్త స్థితి. పౌర్ణమి పూర్ణ వ్యక్త స్థితి. ఈ నడుమ పదునాలుగు తిథులు కలవు.

అవి పదునాలుగు కళలుగ వృద్ధి, క్షయములను కలిగి యున్నవి. ఈ పదునాలుగు తిథులను సృష్టికాలమందు, పదునాలుగు మన్వంతరము లుగ యేర్పడును. పదునలుగురు మనువులలో మొదటి యేడుగురు మనువుల కాలమున సృష్టి క్రమముగ వృద్ధి యగును. ఇపుడు ఏడవ మన్వంతరముగ వైవస్వత మన్వంతరము నడుచుచున్నది. అనగా స్వాయంభువ, స్వారోచిష, తామస, ఉత్తమ, రేవత, చాక్షుస, మనువుల కాలము జరిగిపోయినది. వైవస్వత మనువు కాలమున మన మున్నాము. ఇటు పైన వచ్చు మన్వంతరము లన్నియూ సావర్ణి మన్వంతరములు. అనగా కాంతులతో కూడి యుండు మన్వంతరములు.

అష్టమి తిథి నుండి పౌర్ణమి వరకు చంద్రుని వెలుగు హెచ్చుచు నుండును. క్రమముగ పౌర్ణమి నుండి కృష్ణ పక్ష అష్టమికి వెలుగు తగ్గుచు నున్ననూ సగము కన్న పైనే వెలుగు యుండును. అందువలన శుక్లాష్టమి నుండి కృష్ణాష్టమి వరక గల రాత్రులందు వెలుగు చీకటి కన్న హెచ్చై వుండును. ఈ తిథులు వెలుగులోక ప్రవేశమునకు సదవ కాశము నందించును.

శుక్ల చతుర్దశి కాంతితో సమానమైన కాంతి కృష్ణ ప్రతిపత్తున కుండును. శుక్ల త్రయోదశి కాంతి కృష్ణ విదియ కుండును. ఇట్లే ఇతర తిథులను కూడ సమన్వయించుకొన వచ్చును. ఇట్లు దర్శించి నపుడు ఒక మాసము నందు పౌర్ణమికి ముందు ఏడు తిథులు, పౌర్ణమికి తరువాత ఏడు తిథులు హెచ్చుకాంతితో నుండును. ఇట్లే మాసమున అమావాస్యకు పూర్వోత్తరములందు గల ఏడు తిథులు అనగా పదునాలుగు తిథులు తక్కువ కాంతితో నుండును. ఇట్లు మాస

ప్రారంభము నందలి ఏడు రోజులు, మాసాంతమునకు పూర్వము ఏడు రోజులు సమానములు. శుక్లాష్టమి నుండి పౌర్ణమికి గల ఏడు రోజులు పౌర్ణమి నుండి కృష్ణాష్టమికి గల ఏడు రోజులు సమానము. నాలుగు వారములుగల మాసమునందు ఒక సృష్టి జననము, వృద్ధి, ప్రళయము దర్శింపవచ్చును. ఈ దర్శనము లన్నియూ తిథి మండల పూజ నుండి పొందునవే. సృష్టి రహస్యము లన్నియూ శ్రీమాత నుద్దేశించి చేయు తిథి మండల పూజతో లభ్యమగును.



# 611. 'కళాత్మికా'

**క**ళల రూపము గలది శ్రీదేవి అని అర్థము.

కళలు, కాంతులు శ్రీమాత రూపమే. జీవుల స్వభావము కాంతి, తదనుగుణమైన కళ. కళలకు ఆకర్షింపబడని జీవు డుండడు. కళలు తన లోపల, తన వెలుపల దర్శించిన కొలది ఆనందము కలుగును. జీవులు శ్రీమాత నుండి దిగివచ్చిన వారు గనుక వారునూ కళాత్మకులే. ఆమె కళాత్మిక. ఆమె కళతో సరి సమానమగు కళ మరి ఎవ్వరికినీ యుండదు.

మన వాఙ్మయము నందు సృష్టి కళలను అనేకానేకముగ వివరించిరి. అగ్ని కళలు ప్రధానముగ ఏడు. వివరముగ నలుబది తొమ్మిది. ప్రజాపతుల కళలు పది. అదితి కళలు పన్నెండు. రుద్రుల కళలు పదుకొండు. చంద్రుని కళలు పదహారు. నక్షత్రముల కళలు ఇరువది ఏడు. అందున వివరముగ చూచినచో నక్షత్రమునకు నాలుగు పాదముల చొప్పున 108 కళలు గోచరించును. ఇట్లు చూచువారికి చూచిన కొలది సృష్టియందు అనేకానేక ప్రభలతో, కళలతో, కాంతులతో శ్రీమాత గోచరించును.

జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయ స్థితులను కూడ నాలుగు కళలుగ తెలుపుదురు. ఇందొక్కొక్క కళ యందు మరల నాలుగు కళలు కలవు. మరణము, మరపు, మూర్ఛ, బద్ధకము‒ నిద్ర యందలి నాలుగు కళలు. అభిలాష, భ్రమ, చింత, విషయముల యందు పునఃస్మృతి

అను ఈ నాలుగు కళలు స్వప్నావస్థలు. వైరాగ్యము, ముముక్షత్వము, సమాధి నిర్మలమైన మనస్సు తురీయావస్థలు.

ఇందు నిద్రావస్థలు శివ కళలు, స్వప్నావస్థలు శివశక్తి కళలు. తురీయావస్థలు యోగినీ కళలు. జాగృతి యందు కల నాలుగు కళలు వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అవస్థలు.

ప్రజ్ఞా వికాసమును బట్టి కళాత్మిక యగు శ్రీమాతను ఎన్ని కళలుగ అయిననూ చూడవచ్చును.



# 612. 'కళానాథా'

కళలకు స్వామిని శ్రీమాత అని అర్థము.

ఎచ్చట కళ గోచరించిననూ శ్రీమాత జ్ఞప్తికి వచ్చుట సాధకులకు జరుగవలెను. కళావిహీనమైన విషయముల యందాసక్తి వర్జనీయము. సృష్టి రూపముల యందు కళల హెచ్చు తగ్గులను బట్టి ఆయా రూపములకు పూజ్యాపూజ్య స్థానము లేర్పడును. తెల్లని పావురము, హంస, గుఱ్ఱము, ఏనుగు, జాగిలము, పర్వతము, పుష్పము యిత్యాది వన్నియూ పూజనీయములు. ఇతర వర్ణములలో మట్టిరంగు, నలుపు, మబ్బురంగు కళను మరుగున పరచును. ఈ రంగుల కంత పూజనీయ స్థానము లేదు. ఎఱుపు, నీలము, పసుపు ప్రధానమగు త్రివర్ణములు. ఇవి త్రిమూర్తి స్థానములు. సూర్యుని వెలుగు, చంద్రుని వెలుగు ఇంతకన్న పూజనీయ స్థానములు. కనుకనే వజ్రమునకు, ముత్యమునకు, పగడమునకు, కెంపునకు, నీలమునకు, పచ్చకు పూజ్యస్థానములు. బంగారమునకు, వెండికి, రాగికి, ఇత్తడికి కూడ ఇట్టి పూజ్యస్థానము లేర్పడినవి.

శ్రీమాత కళలను ఉపాసించువారు తమ పరిసరముల యందు గల వస్తువులను శుభ్రముగ నుంచుకొనవలెను. కళ వ్యక్త మగునట్లు గృహమును గాని, గృహపరికరములను గాని నిత్యము శుభ్ర పరచుకొనుచుండవలెను. అంతరంగమును కూడ నిట్లే కళాత్మకమైన భావములతో నింపుకొనుచుండవలెను. ఇతర భావములను చేరనీయరాదు. ఈ కారణముగనే అంతశ్శుచి, బహిశ్శుచి ప్రధానముగ శాస్త్రములు,

శాస్త్రజ్ఞులు బోధింతురు. శుచి పెరిగిన కొలది స్థితి స్థిరమగును. స్థితిత్వమే సత్యము. ఇట్టి స్థితిత్వము శాశ్వతముకాగ కళాత్మిక యగు శ్రీమాత యందు వసించుటకు, చరించుటకు, వుండుటకు వీలగును. అదియే సిద్ధి.

శ్రీమాతను పూజించునపుడు విరివిగ పూవులు, దీపములు, ధూపములు, గంధము, ఆభరణములు వినియోగించుట కళ నుద్దేశించియే. పూజావేదిక యందేర్పడు కళలను బట్టి శ్రీమాత సాన్నిధ్యమును తెలియవచ్చును. జీవులు జీవుల కన్నులలోనికి చూచి నప్పుడు గోచరించు శ్రీమాతను నిత్యము దర్శించుట దైనందిన కళాత్మికా ఉపాసనమని తెలియవలెను.



# 613. 'కావ్యాలాప వినోదిని'

**కా**వ్యము ఆలాపన వలన వినోదము పొందునది శ్రీమాత అని అర్థము.

మహాకవులచే రచింపబడిన కావ్యములను భక్తులు ఆలాపనము చేయునపుడు శ్రీమాత అమితముగ వినోదము చెందును. మహాకవులనగా సృష్టి ధర్మము లెరిగినవారు. సృష్టి నిర్మాణ విధానము నెఱిగిన వారు. వారందరునూ చైతన్య స్వరూపులు. జన్మతః శ్రీమాత భక్తులు. చైతన్యము పోకడలను తెలిసినవారు. వారియందు కార్య రూపమున శ్రీమాతయే సరస్వతిగ ప్రవహించును. ఆ కావ్యములు ఆలాపించినపుడు శ్రీమాత ఆలాపించు వారియందు, శ్రద్ధతో వినువారి యందు గల అసుర శక్తులను సంపూర్ణముగ పార్వతివలె నశింపజేయును. అటుపైన లక్ష్మివలె వైభవమును, ఆనందానుభూతిని భక్తులకు కలిగించి వినోదించును. భక్తుల ఆనందము ఆమెకు వినోదము. కావ్యగానము, పఠనము, వివరణము, శ్రవణము భక్తుల యందు అజ్ఞాన మలినములను నిర్మూలించును. సత్సంకల్ప శక్తి అంకురింపజేయును. ఆ శక్తి సత్కర్మాచరణ మును ప్రోత్సహించును. అటుపైన కలుగునది వైభవమే.

బృందగానము శ్రీమాతకు మిక్కిలి వినోదము కలిగించును. మన కావ్యముల యందలి సుందరాకాండము, పురుషోత్తమ ప్రాప్తి యోగము, గజేంద్ర మోక్షణము వంటి ఘట్టములు గానమునకు ప్రసిద్ధి గాంచినవి. కావ్యములను పూర్ణముగ ఆలాపన చేయుట వలన సకాల వర్షములు కురిసి, పాడి పంట అభివృద్ధి చెందును. మహాభారత

మందలి శాంతి పర్వము పారాయణ చేసినపుడు సకాల వర్షములు కురియు ననియు, కరువు కాటకము లుండవనియు తెలుపబడినది. రామాయణము నందు, భాగవతము నందు, భగవద్గీత యందు మహా భారతము నందు, విష్ణు పురాణము నందు కేవలము పారాయణము వలన కలుగు శుభ ఫలితములు కోకొల్లలుగ నున్నవి. ఈ కావ్యాలాపన మును భారతీయులు అశ్రద్ధ చేయుట వలననే కుటుంబముల యందు కలికల్మషములు విపరీతముగ ప్రవేశించు చున్నవి. ఎచ్చట మహాకవుల కావ్యములు ఆలాపింపబడునో అచ్చట కలి సోకుట కవకాశ ముండదు. "కలికాలము, కలికాలము" అని ఆక్రోశించుటకన్న గ్రంథ చేయుచు, పారాయణము కలి తాకని మార్గమున జీవించుట ఉపాయము.



# 614. 'సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా'

**ల**క్ష్మీ సరస్వతులు కుడి ఎడమల నిలచి చామరములచే వీచుచూ సేవింతురని భావము.

శ్రీమాత త్రిగుణాంబిక. తాను శ్రీలలితగ పూజ లందు చున్నప్పుడు తన కుడి ఎడమల లక్ష్మీ సరస్వతులు నిలచి సేవింతురు. శ్రీమాత క్రియాశక్తిగ, లక్ష్మీ సరస్వతులు ఇచ్ఛా, జ్ఞానములుగ కుడి ఎడమల యందుండుదురు. శ్రీమాత క్రియాశీల సృష్టి క్రియ యందుండును. కుడి భుజముగ లక్ష్మి, ఎడమ భుజముగ సరస్వతి, శ్రీమాతతో త్రిభుజ ముగ ఏర్పడగ సృష్టి కార్యము జరుగును. ఇచ్ఛా జ్ఞానములచే సేవింప బడుచుండగ క్రియ సాగును. నిజమునకు శ్రీమాతయే ముఫ్వురుగ యేర్పడుట జరుగుచున్నది. ముగ్గురుగ గోచరించునది ఆమె యొకతియే. ఒకటి మూడుగ నేర్పడినపుడు మూడునూ సమానమే. ఇచ్ఛా జ్ఞాన క్రియల యందు ఆధిక్య ముండదు. త్రిభుజమున మూడు కోణములు సమ మైనపుడు అందుండి యేర్పడు సృష్టి సవ్యమై యుండును. సంకల్పము (ఇచ్ఛ) దానిని నిర్వర్తించు జ్ఞానము, నిర్వర్తించు శక్తి, క్రియ, మూడును సమపాళ్ళుగ నుండవలెను. లేనిచో సృష్టియందు వక్రత లేర్పడును. వ్యక్తిగతముగ మానవులు సృష్టి చేయునపుడు ఈ మూడు శక్తులును సమముగ పనిచేయవలెను. అపుడు అతని నుండి అవతరణము చెందు కార్యములు సమన్వయాత్మకములై యుండును. అనగా అతని నుండి ఆనందకరమగు సృష్టి జరుగును. ఇచ్ఛా జ్ఞాన క్రియలలో ఒకదాని

యందు మరియొక దానికి పొంతన లేనపుడు కావ్యములు సవ్యముగ జరుగవు. కనుకనే జీవులు చేయు సృష్టికిని, భక్తులు, జ్ఞానులు యోగులు చేయు సృష్టికిని, శ్రీమాత చేయు సృష్టికిని వ్యత్యాస ముండును.

కార్యములు చేయువారు ఇచ్ఛా, జ్ఞాన క్రియలను సమన్వయించు కొనుట సందేశముగ ఈ నామము తెలుపబడినది. కార్యములకు సత్సంకల్పము, దానిని నిర్వర్తించు జ్ఞానము కూడ ప్రధానము. అట్లు జరుగుటకు ఈ నామమును స్మరణ చేయుట, తనయందు త్రిమాతలను దర్శించుట ఎంతయూ సముచితము.



# 615 'ఆదిశక్తి'

**మొ**ట్టమొదటి శక్తి శ్రీమాత అని అర్థము.

ప్రప్రథమముగ తత్త్వస్థితి నుండి ప్రేరణగ వెలువడిన శక్తి అని అర్థము. అటుపైనే యితర శక్తులన్నియూ వుద్భవించును. అట్టి ప్రధానమైన శక్తి ఆదిశక్తి. పరము నుండి మొట్టమొదటగా వెలువడినది కనుక 'ఆది పరాశక్తి' అని కీర్తింతురు. తత్త్వస్థితి యందు శివశక్తుల భేదము లేదు. ప్రేరణ కలిగిన వెనువెంటనే తత్త్వము శివ శక్తులుగ రెండగును. అపుడు ఒకటి శివుడు; రెండు శక్తి. శివు డాధారముగ శక్తి ప్రబలమై తన్ను తాను గుణించుకొనుచు సృష్టి శక్తులన్నింటిని ఏర్పాటు చేయును. అందామెతోపాటుగ శివుడు కూడ వసించును. వసించుటయే శివతత్త్వము. లోకములను, లోకపాలకులను, లోకులను శక్తి ఏర్పరచు చున్నప్పుడు వాని యన్నిటి యందు వసించును. ఆమె పురములను, శక్తులను నిర్మించు చుండగా అందెల్ల వ్యాపించి వసించుట జరుగు చుండును.

శివతత్త్వమునకు ఇచ్ఛా జ్ఞాన క్రియలు లేవు. అది పరత తత్త్వము. దానిని ఆధారముగ దానినుండి మేల్కాంచిన ఆదిశక్తియే సమస్త జగత్తునకు కారణభూతమైన శక్తి.

ప్రళయమున పరతత్త్వ మొక్కటియే యుండును. శివశక్తులు ఒకరి యందొకరు యిమిడి యుందురు. కాలక్రమమున ప్రేరణ కలుగును. ప్రేరణ ఎవరు కలిగించిరి? శివతత్త్వము కలిగించదు.

శివశక్తి శివునితో యుండుటకే యిష్టపడును. అట్టి స్థితిలో ప్రేరణకు కారణము ఎవ్వరు? అనునది ప్రశ్న. శివుని ఎడబాటు శక్తికి సుతరాము యిష్టము లేని పని. కనుక శివశక్తి తానుగ సృష్టి ప్రారంభించెనని అనలేము. ఇచ్ఛకు, సంకల్పమునకు, అతీతమైన తత్త్వమునకు యిట్టి ప్రేరణ ఎట్లు కలిగినది? కాలము కల్పించినదా? అపుడు అచ్చట కాల ముండదు.

ఈ చర్చకు ఋషుల సమాధానము పరిష్కారము. అట్టి కారణము అభ్యాసమని వారు నిశ్చయించి తెలిపినారు. ప్రళయమున జీవు లందరును పూర్ణాపూర్ణ స్థితులలో పరమును చేరుదురు. అసంపూర్ణముగ ప్రళయమున జేరిన జీవులు పూర్ణత్వమునకై ఆరాటపడుదురు. వారి ఆరాటమునకు ప్రతిస్పందనయే సృష్టిప్రేరణ. పరమునందుగల కారుణ్య మట్లు సృష్టికి ప్రేరణ మిచ్చును. నిద్రలోకేగిన జీవుడు మేల్కొనుటకు కూడ ప్రజ్ఞా పూరణము కొరకే.



# 616. 'అమేయా'

**కొ**లతల కందనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత కొలతల కందనిది. కొలతల నేర్పరచునది కూడ ఆమెయే. ఆమెనుండి కొలతలు దిగివచ్చును. ఆమెనుండి అవతరించిన కొలతలు ఆమెను కొలువలేవు. సృష్టికి కొలత లున్నవి. అనగా పరిమితు లున్నవి. సృష్టికి కాలపరిమితి యున్నది. కావున ఆయుర్దాయ మున్నది. సృష్టి యందలి సర్వజీవులకు పరిమితు లున్నవి. సృష్టి యందలి పదార్థమునకు, శక్తికి, ప్రజ్ఞకు కూడ పరిమితి యున్నది. సృష్టియే పరిమితమైనపుడు అందలి సమస్తమునకు పరిమితు లున్నవి.

త్రిమూర్తు లొకమారు శ్రీమాత ఆద్యంతములు తెలియవలెనని కుతూహలపడిరి. మువ్వురునూ వాహనములపై పయనము గావించిరి. వారికి కొంత సమయమునకు మరియొక సృష్టి గోచరించెను. మరియొక త్రిమూర్తుల జట్టు గోచరించెను. మరికొంత దూరమేగగ మరియొక సృష్టి, మరియొక జట్టు కనిపించెను. ఇట్లు ఐదారు మారులు వివిధ మగు సృష్టులు, త్రిమూర్తులు దర్శనము కాగ కలవరపడిరి. తిరుగుదారి మరతుమేమో అని భయపడిరి. ఎన్ని సృష్టి లున్నవో తెలియలేదు. అందు దారి తప్పుట కవకాశ మున్నది. కనుక వెనువెంటనే తిరుగు దారిన తమ సృష్టిని జేరి వారి వారి స్థానముల నలంకరించిరి. శ్రీమాత నుండేర్పడిన త్రిమూర్తులే శ్రీమాత కొలతలు తెలియలేరైరి. ఇంక ఇతరుల కెట్లు సాధ్యము? ప్రార్థించుట, ధ్యానించుట వలన ఆమె యందు తాము

కరిగిన స్థితియే కలుగును. కాని ఆమె మొత్తము తెలియదు. సముద్రము నుండేర్పడిన అల మరల సముద్రమును చేరుట సాధ్యము కాని, సముద్రమును పూర్తిగ తెలియుట సాధ్యము కాదు. సముద్రమున కలియుట వలన తానను ప్రత్యేకముగ తెలివి కూడ యుండదు. తెలియువాడు లేనపుడు తెలుసుకొనుటయూ యుండదు. పరమును చేరుట యుండును గాని, పరమును తెలియుట యుండదు. బ్రహ్మర్షులు కూడ తదనుభూతితో అనుసంధానమున జీవింతురే గాని తమకు మొత్తము తెలియునని భావింపరు; తెలుపరు. ఇది శ్రీమాత అమేయత్వము.



# 617. 'ఆత్మా'

**ఆ**త్మ యనగా పొందునది, గ్రహించునది, విషయముల ననుభవించునది, సర్వకాలముల యందుండునది అని అర్థము.

పరము నుండి యేర్పడిన ఆత్మ పై తెలిపిన లక్షణములు కలిగి యుండును. శ్రీమాత విశ్వాత్మ. ఆమె యందు చైతన్యము పొందుట, గ్రహించుట, అనుభవించుట లక్షణములుగ నున్నవి. ఈ లక్షణములే జీవాత్మ యందు కూడ యేర్పడును. సముద్రపు రుచియే అలకు కూడ నుండును కదా! విశ్వాత్మ అయిన శ్రీమాత లక్షణములే జీవులకు కూడ యుండును. వారునూ పొందుటకు, గ్రహించుటకు అనుభూతి చెందుటకు సతతము ప్రయత్నింతురు. వారిది ప్రయత్నము. శ్రీమాత కది సిద్ధి. ఆమెకు ప్రయత్నము అవసరము లేదు. ఇవి అన్నియూ 'వుండుట' అను సత్యము ఆధారముగ చైతన్యము వలన యేర్పడు లక్షణములు. శ్రీమాత శుద్ధ చైతన్య మూర్తిగ ఈ లక్షణములతో సృష్టి అంతయూ వ్యాపించి యుండును. జీవులు ఈ లక్షణముల సిద్ధి కొరకై ప్రయత్నించుచూ సృష్టి యందుందురు. ఉండుట అను సత్యస్థితి యిరువురికినీ యొకటియే. అదియే పరము.



# 618. 'పరమా'

సమస్తమునకు పరమైనది శ్రీమాత అని అర్థము.

ఎవ్వరికేమి తెలిసిననూ ఆ తెలిసిన దానికి కూడ అతీతమై యుండునది పరతత్త్వము. తెలిసినదని తెలిసినవాడు పలుకగా అట్టి తెలిసినవాని యొక్క తెలివిగా తానుండి తెలుపును. తనయందు తెలివిగ నుండి తనకు తెలుపును గనుక తెలిసినది తెలియగలము గాని తెలపనిది తెలియలేము. తెలివి ఆధారముగ అన్నియూ తెలియును. తెలివిని తెలియుట దుర్లభము. కావున అన్నిటికన్న ఉత్కృష్టమైనది పరము.

వ్యక్తము, అవ్యక్తము, పురుషుడు, కాలము అను నాలుగింటికిని పరమైనది శ్రీమాత.

పర మనగా బ్రహ్మము. బ్రహ్మము మూల ధనముగ వివిధ మగు కొలతలతో సృష్టి నేర్పరచునది గనుక పర-మా అని కూడా అర్థము. పిండిని బట్టి ఎన్ని రొట్టెలు చేయవలెనో నిర్ణయించి తదను గుణముగ గృహిణి పిండి ముద్దలను చేయునుగదా! అట్లే బ్రహ్మ పదార్థమును వివిధ కొలతలతో ముద్దలు చేసి లోకములను, లోకులను ఏర్పరచును. 'మా' అను శబ్దమునకు కొలతలు వేయునది అను అర్థ ముండుటచే 'పరమా' అని తెలుపబడుచున్నది. కొలతల కందని శ్రీమాత కొలతలతో సృష్టి నిర్మాణము చేయును.

'పర' అనగా శివుడు. 'పరా' అనిన శ్రీమాత. 'పరమా' అనగా కూడ శ్రీమాతయే.

పర మనగా శాశ్వతమగు అస్థిత్వము. అనగా 'వుండుట'. అదియే సత్యము, శివము, సుందరము. ఇది శ్రీమాత సహజ స్థితి. అటునుండి ఆత్మగా యేర్పడును. గ్రహించుట, పొందుట, అనుభ వించుట అను లక్షణములను గైకొనును. అటుపైన జీవసృష్టి గావించును. సృష్టి యందు ఆదిశక్తియై యుండును. అట్టి ఆదిశక్తిని లక్ష్మీ సరస్వతులు సేవింతురు. ఇట్లు 618వ నామము నుండి వెనుకకు 614 వ నామము వరకు గల నామములలో అవరోహణ క్రమమున శ్రీమాతను వర్ణిం చుట జరిగినది.



# 619. 'పావనాకృతి'

పవిత్రమైన ఆకృతి గలది అని అర్థము.

శ్రీమాత చరితము పవిత్రము. ఆకృతి పవిత్రము. నఖ, శిఖ పర్యంత మంతయూ పరమ పవిత్రము. ఆమె సతతము పరజ్ఞానము, పరధ్యానము కలిగి సృష్టికర్మను నిర్వర్తించును. కనుక సర్వమునూ పవిత్రము. ఈశ్వర జ్ఞానముచే మాత్రమే పరిపూర్ణ పవిత్రత కలుగును. ఈశ్వర జ్ఞానము లేనివారు పవిత్రులు కారు. సతతము ఈశ్వర జ్ఞానముతో ముడిపడిన వారికి అహంకారము సోకదు. అహంకారము అజ్ఞానా వరణము. ఈశ్వరుని మరచిన క్షణమున అజ్ఞాన మేర్పడును. ఈ మరుపే మృత్యువు, అజ్ఞానము. ఇట్టి మరుపు కలుగకుండుటకు ఋషులు బుద్ధిలోకమున నిలచి దీర్ఘ కాలము తపస్సులు చేయుదురు. వశిష్టాది బ్రహ్మర్షులిట్లు పవిత్రులైరి. సనక, సనందనాది కుమారులు దేవర్షి నారదులు కూడ యిట్లే పవిత్రులైరి. శ్రీమాత సహజ స్థితియే ఈశ్వర జ్ఞానము. మహోత్కృష్టమగు సృష్టి కార్యము నిర్వర్తించుచుకూడ ఈశ్వర జ్ఞానము నుండి వేరు పడదు. సతతము ఈశ్వరుని యందే యుండును. ఈశ్వరుడే మూలధనముగ సృష్టి నిర్మాణముచేయును. ఈశ్వరునితో కూడియే లోకములను యేర్పరచి అందీశ్వరునితోనే వసించును. రాయి, రప్పగ నున్నను కూడ అందీశ్వరునితోనే యుండును. ప్రకృతి పురుషులుగ సృష్టి యున్నది కాని, ఇందే ఒక్కరును లేక సృష్టి లేదు. 'పరము'న కూడ వారిరువురే కూడి యుందురు. వారిది ఇహ, పరముల కూడిక. ఆది

దంపతు లనగా వారే. ప్రకృతిని నిరాకరించి పురుషుని వద్ద జేరుట దుర్లభము. సృష్టిని నిరాకరించువారు పరమును చేరలేరు. పరముగ నేది యున్నదో సృష్టిగకూడ అదియే వున్నది. శ్రీమాత సృష్టి రూపము; బ్రహ్మము వ్యక్తమై వ్యాప్తి చెందిన రూపము. అది పావనము కనుక శ్రీమాత 'పావనాకృతి' అని కీర్తింపబడు చున్నది.



# 620. 'అనేక కోటి బ్రహ్మాండ జననీ'

**అ**నంతమైన కోట్ల బ్రహ్మాండములకు జనన మిచ్చునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మాండము లెన్ని యున్నవో ఎవ్వరికినీ తెలియవు. ఆకాశమున కనిపించు తారకల నెట్లు లెక్కించలేమో బ్రహ్మాండములను కూడ అట్లే లెక్కించలేము. ఒక బ్రహ్మాండము తెలియుటయే బ్రహ్మపథము చేరిన వారికి వీలగును. దాని వలన బ్రహ్మానందముతో శాశ్వతులై జీవింతురు. ఇతర బ్రహ్మాండములు కూడా యిట్లే యుండునని భావింతురు. ఒక ముద్ద అన్నము నేతితో తిన్నప్పుడు మొత్తము స్నిగ్ధాన్నము తిననవసరము లేదు కదా! అదియునూ యిట్లే యున్నదని భావింప వచ్చును. సముద్రపు నీరు గ్రుక్కెడు తాగినచో మొత్తము సముద్రము రుచి తెలిసినట్లు ఒక బ్రహ్మాండము తెలిసినవానికి బ్రహ్మము రుచి తెలియును. అట్టి బ్రహ్మము నుండి ఎన్ని సృష్టులైననూ జనించునని కూడ తెలియును.

శ్రీమాత భావనగనే సృష్టి యేర్పడును. మనకును భావనలు కలుగుచున్నవి కదా! ఇప్పటి వరకెన్ని భావనలు కలిగినవి? అవి లెక్క కందవు. ఇటుపైన కూడ భావనలు కలుగును కదా! అవి ఎన్ని కలుగగలవు? ఇట్టి లెక్క లెవ్వరునూ జీవుల విషయముననే తేల్చలేనపుడు శ్రీమాత యందు గలుగు భావములను లెక్కింపగల వారెవ్వరు? కనుక లెక్కకందని సృష్టులను జనింపజేయు తత్త్వముగ శ్రీమాత కీర్తింప బడుచున్నది.

# 621. 'దివ్య విగ్రహా'

దివ్యమైన విగ్రహము కలది శ్రీమాత అని అర్థము.

భూమి నుండి గాక అంతరిక్షము నుండి పుట్టునది దివ్యము. శ్రీమాత దివ్యమే కదా! ఆమె బ్రహ్మము నుండి పుట్టినది. నిజమునకు శ్రీమాత పుట్టలేదు. జనన మరణములకు ఆమె అతీతము. పరము నందున్న శ్రీమాత తనకు తానుగా చోటు నుండి వ్యక్తమైనది. అట్లు తాను వ్యక్తమైనది గనుక ఆమె దివ్యము. ఆత్మలు కూడ ఆమె నుండి దిగివచ్చినవి గనుక దివ్యమే. చావు పుట్టుకలు పదార్థమయమగు శరీరమునకే గాని అందుండు ఆత్మలకు కాదు. నిజమునకు పదార్థము నకు కూడ చావు లేదు. అదియును అవ్యక్తము నుండి సూక్ష్మమునకు, సూక్ష్మము నుండి స్థూలమునకు వ్యక్తమై మరల స్థూలము నుండి సూక్ష్మమునకు, సూక్ష్మము నుండి అవ్యక్తమునకు తిరోధానము చెందును. వ్యక్తా వ్యక్త స్థితులను తెలియనివారు వ్యక్తమైనపుడు పుట్టిన దనియు, అవ్యక్తముగ నున్నప్పుడు చనిపోయిన దనియూ భావింతురు. జగత్తు అంతయూ దృశ్యాదృశ్యముగ నున్నది. నిజమునకు దృశ్యమగు నది ఒకపాలే. మూడు పాళ్ళు అదృశ్యముగనే యున్నవి.

ఇట్టి దృశ్యాదృశ్య జగత్తుగా దివ్యమై శ్రీమాత యున్నది. విగ్రహా అని ఈ నామమున ఉత్తరార్థమున చేర్చుట వలన విస్తారమైన దివ్యతత్త్వ మని తెలియవలెను. విగ్రహ మనగా అత్యంత విస్తారమగు భాగము. చోటు నుండి ఒక సృష్టి ఆవిర్భావము దివ్యమై విస్తారమై సాగును.

అట్టి సృష్టులు అనేక కోట్లు కలవని కదా ముందు నామమున చెప్పబడినది! కావున శ్రీమాత విస్తారము, అనూహ్యమై యున్నది. అమేయమై యున్నది. అనేక కోట్ల సృష్టులలో మనము వసించు సృష్టి యొకటి. మన సృష్టి యందుగల అనేక సూర్య మండలములలో మన దొక సూర్యమండలము. అట్టి మన సూర్యమండలమున కనిష్టమగు గ్రహము మన భూమి. అట్టి భూమిపై గల కోటానుకోట్ల జీవులలో ఒక్కొక్కడుగ జీవి యున్నాడు. అతడి విగ్రహమెంత? అతడి విస్తారమే మాత్రము? శ్రీమాతతో పోల్చి చూచినపుడు అది అణుమాత్రము కూడ కాదు. అయిననూ జీవుడు “తాను, తనది” అను అహంకార భావములో మునిగి యున్నాడు. ఇట్టి అజ్ఞాన తిమిరము నుండి బయల్పడవలె నన్నచో శ్రీమాత దివ్య విగ్రహమును ఊహింపవలెను. ధ్యానింప వలెను. ఈ నామము ధారణ చేయు భక్తునకు తాను కరిగిన స్థితి యేర్పడును. తన్మయత్వము కలుగును. శ్రీమాత దివ్య విగ్రహమును ఆరాధన చేయుట యనగా యిట్టి భావమున నిండి యుండుటే.



# 622. 'క్లీంకారీ'

**'క్లీం'** అను బీజమును యేర్పరచునది శ్రీమాత అని అర్థము.

'క్లీం' అనునది కామబీజము. శ్రీమాత కారణముగ కామ మేర్పడును. పరతత్త్వము శివశక్తులు కాగ శక్తి కారణముగ శివునకు శక్తిని కోరు కామ ముద్భవించినది. శక్తియే లేనపుడు కామ ముద్భవించు అవకాశము లేదు. తత్త్వ పరమగ నొక్కటియే యున్నప్పుడు, ఆ ఒక్కటి రెండుగ విడివడినపుడు, విడిపడిన రెండిటి నడుమ అవినాభావ సంబంధముచే మరల కలియవలెనని సహజముగ అని అనిపించును. అనంతకాల మొక్కటిగ యున్న తత్త్వము, రెండుగ మారినపుడు రెంటినడుమ యేర్పడిన వ్యత్యాసము కామబీజమై ఒకరి నొకరు కోరుటగా రూపొందును. కనుకనే శివుడు కామేశ్వరుడైనాడు; శ్రీమాత కామేశ్వరి అయినది. వారు ఒకరి నొకరు వీడి యుండుట అసహజము. ఒకరితో నొకరు కలిసి యుండుట సహజము. విడి వడినపుడు మరల కలియవలెనను కోరిక కూడను సహజము.

ఇట్లు సహజమగు కామమునకు కారణము సృష్టి సంకల్పమే. సృష్టి కొరకు, సృష్టి జీవులకొరకు పరతత్త్వము శివ శక్తులైరి. అట్లుకానిచో సర్గమే (సృష్టి) లేదు. జీవులకు ఆనందమే కలుగదు. వారి ఆనందము కొరకు శివశక్తులు విడియగుదురు. జీవులయందు కూడ నిట్లే శివ శక్తులు, కామము వుండును. వారు సహజముగ శివశక్తి స్వరూపులే. వారి యందలి కామము వారి సంపూర్ణత కొరకు, పరిపూర్ణత కొరకు

శ్రమింపజేయును. కోటానుకోట్ల జీవులు అనేకానేక కార్యములలో అహర్నిశలు నిమ్నగమగుట ఆనందము పొందుటకే. ఆనందము పొందవలెనన్నది కామము. ఇట్లు ఆనందకాములై పరిశ్రమ చేయుచు పరిపూర్ణు లగుదురు. "ఎవరు ఏ అంశమును గూర్చి కామించుచున్నారో వారందరునూ పరోక్షముగ నన్నే కాంక్షించు చున్నారు." అని శ్రీకృష్ణ పరమాత్మ పలికెను. (భగవంతుడు పలికెను.)

కామి యగు జీవుడు కామము కారణముగ విషయములను పొందుచు అందలి అశాశ్వతత్వమును గుర్తించుచూ శాశ్వతానందము వైపునకు క్రమముగ మరలును. కామము నుండి దివ్యకామమునకు మరలును. దివ్యకామము నుండి సత్యకామమునకు మరలును. క్రమముగ సత్యమును చేరి పూర్ణకాము డగును. ఇట్టి కామమును కలిగించు శ్రీమాత ఎంతటి కారుణ్యమూర్తి? ఆమె 'క్లీంకారీ'.



# 623. 'కేవలా'

ఏకాంతముగ నుండునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత ఏకాంతము మహాద్భుతము. అది ఆమె అనన్యస్థితి. పరముగ తానే యున్నది. సృష్టిగ తానే యున్నది. కోటాను కోట్ల జీవులుగ కూడ తానే యున్నది. తాను కానిది సృష్టి యందు లేదు. త్రిగుణములు, పంచభూతములు తానే. లోకాలోకములు తానే. లోకపాలకులు, త్రిమూర్తులు కూడ తానే. ఆదిత్యులు, రుద్రులు, వసువులు, అష్ట దిక్కులు, నవగ్రహములు తానే. తానే బహుపాత్రాభి నయము గావించుచున్నది. ఆమెకు రెండవది లేదు. ఆమె అద్వైత, ద్వైత వర్జితా. శంకరులు వివరించిన అద్వైత ఆమెయే. లేదా శివుడన్ననూ, మహావిష్ణువు అన్ననూ, బ్రహ్మము అన్ననూ విప్రతిపత్తి లేదు. ఒక్కటియే ఇన్నిగ యేర్పడినవని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి.

పై విధముగ కేవలము శ్రీమాతయే యున్నది. కావున ఆమె కేవల. ఈ స్థితియే కైవల్యము. కేవలత్వ మనగా ఏకాంతము. అనగ ఒక్కటిగ నుండుట. అది ఒంటరితనము కాదు. అందరి యందొక్కరిగ వుండుట.



# 624. 'గుహ్యా'

రహస్యముగ నుండునది శ్రీమాత అని అర్థము.

గుహ్యా మనగా రహస్యము. శ్రీమాత రహస్యముగ నుండును. లోకుల రహస్యములకు శ్రీమాత రహస్యమునకు చాలా వ్యత్యాస మున్నది. ప్రతి వారి యందు కొన్ని విషయములు గుట్టుగ నుండును. నిర్మలత్వము లేనిచోట గుట్టు ఎక్కువ వుండును. ఇతరుల గుట్టులను తెలుసుకొనుట, తమ గుట్టులను కాపాడుకొనుటగ జీవితమును సాగించువారు గోచరించుచునే యుందురు. ఒకరు దాచిన విషయము మరియొకరు తెలుసుకొనవలెనని ప్రయత్నించెదరు. రాజులు రాజనీతి యందు గుట్టు కలిగి యుందురు. వ్యాపారులు లాభ నష్టములయందు గుట్టు కలిగి యుందురు. బ్రాహ్మణులు బ్రహ్మ జ్ఞానమును గుట్టుగ నుంచుటకు ప్రయత్నించుదురు. బ్రహ్మోపదేశమును కూడ గుట్టుగ నొకరి చెవిలో నొకరు గొణుగుదురు. ఇంక యితరుల విషయము చెప్పనేల? అందరికిని గుట్టేల? అవిద్య పెరుగుచుండగ గుట్టు పెరుగు చుండును. పారదర్శకత్వము (transparency) తగ్గును.

దీనికి భిన్నముగ శ్రీమాత గుట్టుగ నున్నది. బట్టబయలుగ నున్ననూ గుట్టుగనే యుండుట శ్రీమాత విశిష్టత. **"గుహ్యాం గుహ్యతమం"** అని శ్రీకృష్ణుడు శ్లాఘించిన రహస్యమే శ్రీమాత. కేవలమై అంతట, అన్నిట శ్రీమాతయే నిండి యుండగ, చూచువానిగ చూడగలుగు వస్తువుగ, చూచుటగ శ్రీమాతే యున్ననూ చూచువానికి శ్రీమాత జ్ఞప్తికి

రాదు. సమస్తమూ శ్రీమాతయే యని తెలిసిననూ, తెలిసికొనిననూ కూడా జ్ఞప్తికి రాదు. స్త్రీయని, పురుషుడని, బాలుడని, యువకుడని, కాకి యని, కుక్కయని చెట్టుయని, పుట్టయని, శత్రువని, మిత్రుడని స్వామియని, సేవకుడని యిట్లెన్నో వస్తువులను దైనందినముగ చూతుము గాని, లేచిన మొదలు పరుండు వరకు శ్రీమాతనే చూచుచున్ననూ శ్రీమాతయని జ్ఞప్తికి రాకపోవుట నిజమగు రహస్యస్థితి. అందువలననే శ్రీకృష్ణుడు ఈ విచిత్రములను రాజగుహ్య మనెను. రాజగుహ్య మనగా గుహ్యములలో అత్యంత విశిష్టమగు గుహ్య రాజ మని అర్థము. అంతేగాని రాజులు దాచిపెట్టు గుట్టులు కాదు. శ్రీమాత నిత్యమూ కనపడుచునే యుండును. ఆమె నిత్యము వినపడుచునే యుండును. అయిననూ శ్రీమాత దర్శనమునకై వేచివుండువారుగ అనేకానేక భక్తులుందురు. వీరందరూ వెట్టి భక్తులని శ్రీమాత నవ్వుకొనుచుండును. కనిపించు చున్ననూ చూడలేనివారికి, వినిపించు చున్ననూ వినలేని వారికి దర్శన మిచ్చుటెట్లు? సంభాషించు లెట్లు? కనబడు సామాన్యమగు వస్తువుల యందు, మనుష్యుల యందు శ్రీమాతను దర్శించు ప్రయత్నము శ్రద్ధాభక్తులను కలిగించును. అట్టి శ్రద్ధాభక్తులు గలవారికి క్రమముగ దర్శనములు జరుగుచుండును.

శ్రీమాత గుహ్యత్వమునకు కారణము జీవుల అజ్ఞానమే కాని మరియొకటి కాదు. *"నన్ను చూచుచున్ననూ చూడరు. నన్ను విను చున్ననూ వినరు"* అని సరస్వతీ సూక్తము తెలుపుచున్నది. ఇది విచిత్రమగు రహస్యము కదా! కనపడుచున్ననూ, వినపడుచున్ననూ రహస్యముగనే యున్నది. కనుక ఆమె 'గుహ్య'.

# 625. 'కైవల్య పదదాయిని'

**కై**వల్య పదము నిచ్చునది శ్రీమాత అని అర్థము.

ఏకత్వ స్థితి కేవలస్థితిగ 623వ నామమున వివరింపబడినది. అన్నిట "అంతట తానే యున్నాను" అనునది కేవలస్థితి. ఇట్టి స్థితి యందు ఇతరములు లేవు. తాను కానిదేదియూ లేదు. ఈ స్థితి యందున్న శ్రీమాత, అట్టి స్థితిని తన భక్తుల కనుగ్రహించును. కైవల్య పదము నిచ్చునది గనుక కైవల్య పదదాయిని అని కీర్తింపబడుచున్నది.

ముందు నామమున గుహ్యాముగ నున్న శ్రీమాతను దర్శించుట ఆరంభించినపుడు అంతర్ దర్శన మారంభ మగును. అంతర్ దర్శనముల ఆకర్షణతో బాహ్య బంధములు క్రమముగ వీడును. లోదృష్టి యేర్పడు చుండగ పైపైన తేలియాడు విషయముల యందాసక్తి తగ్గును. కదలు చున్న అలలను చూచువారు క్రమముగ అలల యందలి సముద్రమును చూచుట ప్రారంభించినట్లు, చంచలములు తాత్కాలికములు అగు విషయములకు ఆధారమైన లోవిషయములలో ప్రవేశించుట జరుగును. గుహలోని కేగినట్లుండును. లోనుండి మరింత లోపలికి దర్శించుట, వినుట, ప్రయత్నించు చుండగ లోలోపల నిశ్చలత్వము, నిశ్శబ్దము అనుభూతి యగును. ఇట్లు తన మూలములోనికి తాను ఏగుచుండగా భిన్నత్వము నుండి ఏకత్వము లోనికి క్రమముగా ప్రవేశించుట జరుగును. అపుడు తను మూలమును ధ్యానము చేయగా క్రమముగ లోపల, బయట చిత్ శక్తి రూపమే గోచరించుట ఆరంభించును. ధ్యానమున

తాను చిత్ శక్తికి మరింత సామీప్య మగుచుండగ, బహిర్ అంతరము లందుగల శ్రీచైతన్యము దగ్గరగుచూ సాయుజ్యము నిచ్చును. అటుపైన రెండునూ ఒకటియైన స్థితిలో సారూప్యము అనుభవమునకు వచ్చును. దైవమే తానుగ నుండుట అనుభూతమై ఆనందమున అట్టి స్థితిలో శాశ్వతముగ స్థిరపడిపోవును.

యోగమున పై కైవల్యమును పొందుటకు పంచాంగములు తెలుపబడినవి. అవి వరుసగా ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యాన, సమాధులు. ఇట్టి సమాధి స్థితి పొందినపుడు నిత్యము, నిరతి శయము, బంధ రహితము అగు ఆనందము లభించును.



# 626. 'త్రిపురా'

ప్రజ్ఞ, శక్తి, పదార్థము అను మూడులోకములను వ్యాపించి యుండునది శ్రీమాత అని అర్థము.

మూడు లోకములను మూడు పురము లందురు. ఈ మూడు పురములను ఒకదాని యందొకటి ఇమిడి యుండును. పదార్థమునకు శక్తి ఆధారము. శక్తి పదార్థము నందిమిడి యుండును. శక్తికి ప్రజ్ఞ ఆధారము. అది శక్తి యందిమిడి యున్నది. ప్రజ్ఞ నుండి శక్తి, శక్తి నుండి పదార్థము యేర్పడుచుండును. ఇందొకదానికన్న యొకటి సూక్ష్మమై యుండును. పదార్థము కంటె శక్తి సూక్ష్మము. శక్తి కన్న ప్రజ్ఞ సూక్ష్మము. ఈ మూడింటికిని పుట్టుక స్థానము శ్రీమాత. ఆమె మూడు లోకములను తన నుండి ప్రకటించి వానియందు వసించును. ఈ మూడు పురములకును ముందున కూడ ఆమె యున్నది గనుక త్రిపుర అని పిలుతురు. మూడింటికిని పూర్వమున యున్నది కనుక త్రిపుర అని కూడ నిర్వచింతురు. మూడు లోకముల నేర్పరచు తత్త్వము మూడింటికిని ముందు యుండుట సహజమే కదా!

సృష్టి అంతయూ శ్రీమాత త్రిపుటిగ నిర్మాణము చేసెను. అణువు నుండి బ్రహ్మాండము వరకు అన్నిటి యందు మూడుగ నుండును. త్రిమూర్తులుగను, త్రిశక్తులుగను, త్రిగుణములుగను, మనోబుద్ధి అహంకారములుగను, ఇడ పింగళ సుషుమ్నలుగను, త్రేతాగ్నులుగను, యేర్పడి యుండునది శ్రీమాతయే. అట్లే త్రివర్ణములగు ఎఱుపు, తెలుపు,

పసుపు కూడ ఆమెయే. తెలుపే లోతులలో నీలమై ప్రకాశించును. అట్లే త్ర్యక్షరములగు అ, ఇ, ఉలు గ భాసించును. ఐం, హ్రీం, శ్రీం, అను బీజ శక్తులుగ కూడ భాసించును. శిరస్సు, ఉఱస్సు, ఉదరములుగ దేహముల నేర్పరచును. అట్లే త్రినేత్రములు కూడ. ఇట్లు సృష్టిని పరిశీలించి చూచినచో సమస్తము త్రిగుణాత్మకముగ గోచరించును. అట్టి త్రిగుణాత్మక సృష్టికి మూలముగ నున్నది శ్రీమాతయే. జీవులకు జాగ్రత్, స్వప్న, సుషుప్తి అవస్థలను యేర్పరచుచూ తురీయముగ తానే యుండును.



# 627. 'త్రిజగద్వంద్య'

**మూ**డు లోకములచే నమస్కరింపబడునది శ్రీమాత అని అర్థము.

ప్రజ్ఞ శక్తి పదార్థములతో కూడిన లోకము లందలి సమస్త జీవ రాశికి ఆధారభూతమై యున్నది కావున వారందరిచే శ్రీమాత పూజింపబడుచున్నది. అన్నిటికినీ ఆధారము ఆమెయే గనుక ఆమె పూజ్యులరాలైనది. త్రిమూర్తులు కూడ శ్రీమాతను సేవించుచుందురు. వారి అస్తిత్వము శ్రీమాతయే గదా! వారి ప్రజ్ఞా శక్తులు కూడ శ్రీమాతయే. జీవులు కృతజ్ఞతా భావముతో శ్రీమాతకు నమస్కరించుచూ సంస్కార వంతు లగుచున్నారు. త్రిమూర్తులు, సనకసనందనాదులు, సప్త ఋషులు, ప్రజాపతులు, రుద్రులు, ఆదిత్యులు, మనువులు, అశ్వినీ దేవతలు, యిత్యాది దేవ ఋషి గణము లన్నియూ శ్రీమాతకు నిత్యమూ నమస్కరించుచూ లోకులకు మార్గదర్శకులై నిలచి యున్నారు. ఇట్టి కృతజ్ఞతా భావము లేనివారు సంస్కార హీనులై తమను తామే నశింపజేసి కొను చున్నారు.



# 628. 'త్రిమూర్తి'

**మూ**డు సంవత్సరముల వయస్సు గల కన్య అని అర్థము.

శ్రీమాత త్ర్యక్షరీ. త్రిగుణాంబికా, త్రివర్ణా, త్రికోణా, త్రిభుజా, త్రినేత్రా, త్రిసామ. ఆమె సృష్టి యందు ప్రధానముగ మూడుగ నుండును. కార్యము, కారణము, కర్మ ఆమెయే. ఓంకార మందలి మూడక్షరములు ఆమెయే. సోమ సూర్య అగ్నులు ఆమెయే. త్రేతాగ్నులుగా ఆమెయే సృష్టి నిర్మాణము చేయును. ఇచ్ఛా, జ్ఞాన క్రియా శక్తులుగ కూడ ఆమెయే నున్నది. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల స్వరూపమామెయే. త్రివర్ణములగు ఎఱుపు, నీలము, పసుపు ఆమెయే. ఆమె త్రికోణ స్వరూపిణి. సమస్తమును మూడుగ నేర్పరచును. భూర్భువ స్సువర్లోకము లుగ ఏర్పడు చుండును. ప్రజ్ఞశక్తి, పదార్థములుగ ఏర్పడును. శ్రీమాత యోని స్వరూపముగ నుండును. అదియునూ త్రిగుణాకారమే. దేవుడు, జీవుడు దేహముగ యున్నది కూడ శ్రీమాతయే. త్రయీవిద్య అంతయూ శ్రీమాత విద్యకు. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులుగ కూడ ఆమెయే యున్నది. శ్రీమాత ఒకతె అయినను, ప్రయోజన వశముచే మూడు విధము లగును. ఈ త్రిమూర్తిత్వమును బ్రాహ్మీ, వైష్ణవీ, రౌద్రీ మూర్తులుగ ఆరాధింతురు. వీరినే సరస్వతి, లక్ష్మి, పార్వతి అందురు. త్రిమూర్తిను లుగ యేర్పడి శ్వేత, మందర, నీల పర్వతములలో యుండునని పురాణ ములు వర్ణించును. శ్యామ, విద్య, శాంభవి అన్ననూ వీరే. ఇట్లు అనేక అనేక నామములతో త్రిమూర్తి అయిన శ్రీమాతను ఆరాధింతురు. సమస్తమును త్రయీమయముగ దర్శించుట శ్రీవిద్య. సహస్రనామములో అమ్మ త్రిమూర్త్యత్వము అనేక నామములలో వర్ణింపబడినది.

# 629. 'త్రిదశేశ్వరి'

**మూ**డు దశలకును ఈశ్వరి అని అర్థము.

మూడులోకములు మూడు దశలలో యేర్పడును. వానికీశ్వరి శ్రీమాతయే గనుక ఆమె త్రిదశేశ్వరి అయినది. అన్నిటి యందునూ ప్రజ్ఞ, శక్తి, పదార్థములు గోచరింపగలవు. ఇట్టి మూడు దశలలో సమస్త జీవు లున్నారు. చీమ నుండి బ్రహ్మవరకూ అందరికినీ రూపము లున్నవి. అవి పదార్థ మయములు (పదార్థములు స్థూలము నుండి సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మ తమముగా నేర్పడును. బ్రహ్మ రూపము సూక్ష్మ తమము. దేవతల రూపములు సూక్ష్మములు. భూమి జీవుల రూపములు స్థూలములు. అన్ని రూపములు పదార్థమయములే) అట్లే ఎవరి శక్తి వారికి యున్నది. చీమ శక్తి చీమది, బ్రహ్మశక్తి బ్రహ్మది. వారి వారి ప్రజ్ఞలను బట్టి వారి వారి శక్తు లున్నవి. కాని అందరి యందును ప్రజ్ఞగను శక్తిగను పదార్థముగను యుండునది శ్రీమాతయే. ప్రజ్ఞా శ్రేణులను బట్టి దశలు యేర్పడుచున్నవి. అన్నిటికినీ ఈశ్వరి మాత్రమామెయే.



# 630. 'త్ర్యక్షరీ'

**మూ**డు అక్షరములతో కూడినది శ్రీమాత అని అర్థము.

అకార, ఉకార, మకారములు త్ర్యక్షరములు. అందువలన శ్రీమాత ఓంకార రూపిణి. ప్రజ్ఞ, శక్తి, పదార్థములే– అ, ఉ, మ లు. ఇవి ఆమె శరీరమై యున్నవి. అట్లే ఐం, హ్రీం, శ్రీం అను శక్తి బీజాక్షరములను కూడ శ్రీమాత త్ర్యక్షరములుగ కూడ తెలుపుదురు. మూడక్షరములతో సృష్టి నిర్మాణము గావించునది శ్రీమాత. ప్రజ్ఞ శక్తి పదార్థములు అక్షరములు. అనగా నశింపనివి. అవి కాలానుగుణముగ వ్యక్తమగుచూ మరల అవ్యక్తములోనికి ప్రవేశించును. అవ్యక్తమై యున్నప్పుడు నశించినవి అనుకొనుట అజ్ఞానము. పగలు నక్షత్రములు కన్పింపవు. అంతమాత్రము చేత నక్షత్రములు లేవనలేము. లేనివి మరల కనిపింపవు కదా! పాలయందు వెన్న అవ్యక్తమై యుండును. చిలికి నపుడు వ్యక్త మగును. కనపడుట, కనపడక పోవుట యుండును గాని లేకుండుట యుండదు. "ఓ అర్జునా! ఈ సృష్టి యందు లేనిది లేనే లేదు. వున్నది పోదు. కనిపించుట, కనిపించక పోవుట నీ ప్రజ్ఞా స్థితిని బట్టి యుండును. ఈ యుద్ధమున మరణించిన వారందరునూ సూక్ష్మమున కేగుదురు. మరల స్థూలమున కవతరింతురు. ఎవ్వరునూ నశింపరు. ఏదియునూ నశించదు. అంతయూ అక్షరమే. క్షరమను భావము అజ్ఞానము." అని శ్రీకృష్ణుడు గీతలో పలికినాడు.

ఉన్నది పోదు, లేనిది రాదు. పోయినట్లనిపించును. ఉండుట, లేకుండుట అనుస్థితుల కాధారమై తత్త్వమున్నది. అది అక్షర మగుట

వలన అందుండి వ్యక్తావ్యక్తములుగ అంతయూ వచ్చి పోవుచుండును. తత్త్వజ్ఞులకే ఈ సత్యము తెలిసి యుండును. వారికి మాత్రమే సమస్తము వచ్చి పోవుచుండుట గోచరించును. దీనినే శ్రీకృష్ణుడు *“ఆగమాపాయనః”* అని తెలిపినాడు. కాల ప్రవాహమున త్ర్యక్షరము లగు ప్రజ్ఞ శక్తి పదార్థములు క్రమమున వచ్చి పోవుచుండును. అవి శాశ్వతములు. కావున శ్రీమాత త్ర్యక్షరి.



# 631. 'దివ్యగంధాఢ్య'

దివ్యగంధ పరిమళములతో కూడి యుండునది శ్రీమాత అని అర్థము.

గంధ మనగా సువాసన, పరిమళము. గ్రహింపగనే వికాసము కలిగించునది. సువాసనలు, సుగంధములు ముక్కును సోకినపుడు చైతన్యము అప్రయత్నముగనే వికాసము చెందును. అందున గంధము యొక్క సువాసన మిక్కిలి శ్రేష్ఠము. గంధ ధారణము, భస్మధారణము, తిలక ధారణము, ఆర్ష్య సంప్రదాయము. అట్టి ధారణము వలన చైతన్యము వికాస మగుటయే గాక పరిసరములను కూడ పవిత్రీ కరించుచు ప్రభావితము చేయును. సుగంధ మున్నచోట శ్రీమాత యుండును. శ్రీమాత యున్నచోట సుగంధ ముండును. ఇది ఆరాధకు లెరిగిన సత్యము. ఆరాధనమున శ్రీమాత సాన్నిధ్యము లేశమాత్రము లభించిననూ సువాసనలు ఆరాధకుని ఆవరించును. స్పృశించును, గంధము వాసన, మల్లెపువ్వుల వాసన, సన్నజాజుల వాసన శుక్రవార ఆరాధనమున శ్రీమాత భక్తులు అపు డపు డనుభవింతురు.

పరిమళ ద్రవ్యములలో గంధ మత్యంత శ్రేష్ఠము. భూమి నిర్మాణము జరుగుచున్నప్పుడు భూదేవి నిర్మాణ దేవతలను తనకానంద దాయకముగ నుండు కొన్ని అంశములను అర్థించినదని అందు గంధ మొకటియని పరమగురువులు తెలిపెదరు. గంధము శ్రీమాత శక్తి చిహ్నము. అజ్ఞాన పూరితులైన జీవులను భూగోళముపై భరించుట

భూదేవి కర్తవ్యమై యున్నది. క్షమకు భూదేవియే తార్కాణము. క్షమతో జీవులను భరించు భూదేవి తనకాహ్లాదము కలిగించు అంశములను కూడ కొన్నింటిని భూమిపై నేర్పరచుకొనెను. (దేవతా సహకారముతో) అందు ఎతైన పర్వతములు, ఎత్తైన చెట్లు, జీవనదులు, ఋషి సమూహ ములు కలవు. పై కారణముగ గంధము ప్రధాన అంశముగ దివ్యమైన వస్తువుగ భావింపవలెను. సంప్రదాయముగల ఇండ్లలో కస్తూరి, గంధము, కర్పూరము యిత్యాది సుగంధ ద్రవ్యము లెప్పుడునూ యుండును. అట్లే పసుపు. కుంకుమ, కూడ ఈ వస్తువు లన్నింటినీ ఆవరించి శ్రీమాత యుండును గనుక అవి దివ్యములు.

జీవుడు సంస్కారవంతు డగుచున్న కొలదీ సహజముగ గంధమున కాకర్షింపబడును. అట్లే సింధూరమునకు కూడ. కేవలము ఆచార పరముగ వీనిని ధరించుట యొక యెత్తు; సంస్కార పరముగ ధరించుట యొక యెత్తు. శ్రీకృష్ణ పరమాత్మ సహితము కస్తూరి చందనములను, తులసి మాలలను ధరించినాడు. దివ్యత్వమునకు జీవుడు యానము చేయుచునప్పుడు సహజముగ గంధ ధారణము. తిలక ధారణము సత్సాధకులకు జరుగును. చైతన్య వికాసమునకు నిత్యము కృషి సలుపు వారే సత్సాధకులు. వారు యిహలోక సంబంధమైన పదార్థములతో చుట్టుబడి యున్ననూ పరలోక సంబంధమునకై గంధాదుల నాశ్ర యింతురు. అది సహజ పరిణామమే.

యోగమున సంయమనముచే సర్వేంద్రియములు దివ్యాను భూతికి అనుగుణము లగును. అపుడు వారు పొందు అనుభూతు

లన్నియూ దివ్యగంధములవలె వికాసము కలిగించును. దివ్య శ్రవణము, దివ్య దర్శనము, దివ్య రుచి, దివ్యస్పర్శ, దివ్య గంధము, అనుభూతి చెందు చుందురు. 'దివ్య గంధాఢ్యా' అనగా దివ్య గంధానుభూతి మొదలగు అనుభూతులని కూడ తెలియవలెను.

దివియందు పుట్టినవారు దివ్యులు. వారు వెలుగునందు పుట్టుదురు. సామాన్యులవలె రక్తమాంసాదులలో పుట్టరు. అట్టివారిచే ఎల్లప్పుడునూ పరివేష్టింపబడి శ్రీమాత యుండును. ఋషులు,యోగులు, సిద్ధులూ దేవతలు మొదలగు వారిచే పరివేష్టింపబడి యుండును గనుక 'దివ్య గంధాఢ్య' అని మరియొక అర్థము.



# 632. 'సిందూర తిలకాంచితా'

**సిం**దూరము బొట్టుతో అలంకరింపబడి యుండునది శ్రీమాత అని అర్థము.

సిందూర మనగా ఎఱ్ఱని చూర్ణము. ఈ చూర్ణమును ఫాల భాగమున అలంకరించుకొనునది శ్రీమాత అని అర్థము. 'సింధుర మనగా ఆడ ఏనుగని కూడ అర్థ మున్నది. ఆడ ఏనుగు వలె ఒయ్యార ముగ నడుచునది శ్రీమాత అని మరియొక అర్థ మున్నది.

సిందూరమును భ్రూమధ్యమున గాని, ఫాలమధ్యమున గాని, అలంకరించుకొనుట వలన శుభ సంకల్పములు కలుగుట, అశుభ ములు దరిచేర కుండుట జరుగును. శ్రీమాతను స్మరించుచూ భ్రూమధ్య మున గాని, ఆజ్ఞా కేంద్రమున గాని, అనామికతో (ఉంగరపు వేలు) సిందూరమును ధరించుట ఆచారము. గంధ ధారణము గాని, తిలక ధారణము గాని కాకతాళీయముగ చేసినచో వాని ప్రభావము అంతంత మాత్రమే. భావ సహితముగ భక్తితో నిర్వర్తించినచో తదనుగుణమైన ఆశీర్వచన ముండును.

ఆర్య సంప్రదాయమున స్నానము చేయుచున్నప్పుడు అభిషేక మంత్రములు పఠించుట, వస్త్రధారణమప్పుడు దేవతా పరిరక్షణము జరుగుచున్నట్లు భావించుట- ఇట్లు నిత్య కృత్యములను క్రతువులుగ నిర్వర్తించుకొనుట యున్నది. ఇట్టి క్రతుపరమగు ఆచారము వలన జీవ సంస్కారము క్రమముగా వృద్ధి చెందును. కేవలము యోగసాధన,

భక్తి సాధనలతో సంస్కారమును పొందుట గాక సంప్రదాయము వలన గూడ కొంతమేర సంస్కారము పొందవచ్చును. గనుక భక్తులు, యోగ సాధకులు ఇట్టి నిత్య కృత్యముల యందు కూడ భక్తి శ్రద్ధలను చూప వలెను.

తిలకధారణము వలన రెండు ప్రయోజనములు స్పష్టముగ కలుగును. అందు మొదటిది సంకల్పమునకు బలము కూడుట. రెండవది పరిసరముల మలిన ప్రభావములు మనలను చేరకుండుట. శ్రీమాత ధరించు సిందూర తిలకము అసురులకు భయము కలిగించును. సురలకు స్ఫూర్తి నిచ్చును.



# 633. 'ఉమా'

**'ఉ'**కార, 'మ'కార, 'అ'కార సమష్టి రూపమే శ్రీమాత అని అర్థము.

'అ'కారము శివతత్త్వము. 'ఉ'కారము విష్ణు తత్త్వము, 'మ' కారము బ్రహ్మ తత్త్వము. ఈ మూడు శబ్దములు కలిసినపుడు 'ఓం' అను ప్రణవముగా పరిణమించును. ఓంకారము త్రిమూర్త్యాత్మకము. అట్టి త్రిమూర్తి స్వరూపిణి శ్రీమాత.

అకారము శివుడు కాగా, ఉకార మకారములుగ శివుని ఆశ్రయించి యుండునది శ్రీమాత. కనుకనే 'ఉమ'. ఉమా అని దీర్ఘముగ పలికినపుడు శివతత్త్వముతో కూడి యున్నదని అర్థము. "అకార, ఉకార మకారములు నా ప్రణవము నందున్నవి. ఉకార, మకార, అకారములు నీ ప్రణవమని తెలుసుకొనుము." అని పరమశివుడు ఉమను చేకొనినపుడు తెలిపినాడు. అట్లు ప్రణవమైనను, ఉమా శబ్దమై ననూ ఒక్కటియే అని తెలుపబడినది.

ఉమ అను శ్రీమాత కళ హృదయము నందుండి ప్రేరణ నిచ్చునని యోగవాశిష్టమున తెలుపబడినది. ముల్లోకములందు నిద్రించు వారి యొక్కయు, మేల్కొనువారి యొక్కయు హృదయములను ప్రేరే పించును. అనాహత శబ్దముగ హృదయ కమలమందు ఉండునది 'ఉమ'. ప్రణవోచ్చారణముచే శబ్ద బ్రహ్మయై చిదాకాశమును చేర్చ గలదు. దహరాకాశమున వసించుచు ప్రణవము ఉచ్చారణ చేయగనే

ఆదహరాకాశము అగు శివుని చేర్చును. అదహరాకాశము శివ స్థాన మగు సహస్రార పద్మము. అందు బిందువుగ నుండు శ్రీమాత సృష్టి నిర్మాణము చేయుచు దహరాకాశముగ హృదయ పద్మము నందుండును. ప్రణవోచ్చారణము చేయు జీవుని హృదయము నుండి సహస్రారమునకు చేర్చును.

నిద్ర స్వప్న, మెలకువలలో తిరుగాడుచుండు జీవుని తురీయా వస్థకు గొనిపోవుటకు ఉమ తోడ్పడునని పురాణములు పలుకుచున్నవి. తురీయ మనన్యస్థితి. హృదయము అనేక స్థితి. అనేక స్థితి నుండి ఏకస్థితికి గొనుపోవు శ్రీమాత ప్రజ్ఞను ఉమ అని తెలియవలెను. ఏమి లేనట్లు కనిపించు తత్త్వము నుండి అన్ని వున్నట్లు గోచరింపజేయు మహత్తునకు అధిష్ఠాన దేవతగ ఉమను ప్రార్థించ వలెనని భాగవతము సూచించు చున్నది. మహత్తు కారణముగనే ఏక మనేక మగుచున్నది. మహత్తు మాఘ ప్రజ్ఞ. ఈ ప్రజ్ఞయే శ్రీమాత ఇచ్ఛాశక్తి. ఉమా రూపమును ధ్యానించి మహర్షులు మహత్తును తెలిసి మహిమాన్వితులైనారు. మహర్షుల ఇచ్ఛాశక్తి రూపమున ఉమయే వసించి యున్నదని పద్మ పురాణము తెలుపుచున్నది. ఉత్తమమైన చిత్తవృత్తి గలవారికి ఉమా రూపిణియై శ్రీమాత సంసార తాపమును నశింపజేసి లోక వైభవము, అలోకానుభూతి అనుగ్రహించును.

పర్వత రాజునకు జన్మించి, శివునికై తపస్సు ప్రారంభించినపుడు పార్వతి నుద్దేశించి మైనాదేవి వలదు వలదని వారించినది. ఉమ, ఉ మ అనినది. మరల తపస్సు నందు కఠోర ఉపవాసములు చేయు

చున్నప్పుడు వలదని మరల మరల ఉచ్ఛరించినది. ఉ, అనగా నీవు 'దు', అనగా వద్దు. నీవీపని చేయవద్దు అనుటకు సంస్కృతమున ఉమ అందురు. పార్వతీదేవి తల్లి అయిన మైనాదేవి పలికిన పలుకులు ముల్లోకముల వినపడెను. శివుని మెప్పించుట అసాధ్యమని, కావున అతనిని గూర్చి తపస్సు చేయుట, ఉపవాసములు చేయుట అవివేకమని మూడు లోకములు భావించినవి. లోకమంతయూ ఉమ అను శబ్ద తరంగములతో నిండినది. పార్వతి హిమవత్ పర్వత రాజునకు పుట్టిన కన్య. పర్వత మెంత నిశ్చలమో, పార్వతి సంకల్ప మంత నిశ్చలమైనది. అచంచలమైన విశ్వాసముతో లోకములు వారించుచున్ననూ తన తపస్సుతో శివుని మెప్పించి అతనిని పెండ్లాడిన మహోత్కృష్ట మగు ఇచ్ఛాశక్తి ఆమె. వలదన్నను నిర్వర్తించి సాధించినది గనుక ఉమగా ప్రసిద్ధి చెందినది.

జీవుల యందు కాంతి రూపముగను కీర్తి రూపముగను ప్రకాశించునది గనుక ఉమ అని మరియొక అర్థము.



# 634. 'శైలేంద్రతనయా'

పర్వతరాజ పుత్రిక శ్రీమాత అని అర్థము.

దక్ష యజ్ఞమున పరాభవము సహింపలేక సతీదేవి అగ్ని ప్రజ్వలనము గావించి, తనను తాను ఆహుతి గావించుకొనెను. పతి యగు శివుడు వలదన్ననూ దక్ష యజ్ఞమునకు చనుట, అచట అయిన వారిచే నిరాకరింపబడి పరాభవము చెందుట ఆత్మాహుతికి దారి తీసెను. మరల శివుని చేరవలెనను ఆకాంక్ష యుండుటచే కాంక్షతో మరల పర్వతరాజు హిమవంతునికి జన్మించెను. హిమవంతుడు భూమిపై గల పర్వతముల కన్నిటికిని రాజు. హిమవంతుని బలము, వైశాల్యము ఇతర పర్వతములకు లేవు. పర్వతము లన్నియూ నదులవలె మహత్తర మగు దివ్య ప్రజ్ఞలు. అట్టి పర్వతములలో హిమవంతుడు ఇంద్రుడు అనగా శ్రేష్ఠుడు. పర్వతము దృఢత్వమునకు, నిశ్చలత్వమునకు పూర్ణ ప్రతీక. నిశ్చలశ్రేష్ఠుడగు హిమవంతునకు సతీదేవి మరల జన్మించినది. పర్వతరాజునకు పుట్టినది గనుక పార్వతి అని, శైలజ అని ప్రసిద్ధి గాంచినది. అచంచల విశ్వాసముతో తపస్సు చేసి మరల శివుని చేరి నది. ఆమె శైలజ. శైలేంద్ర తనయ.



# 635. 'గౌరీ'

గౌర వర్ణము గలది శ్రీమాత అని అర్థము.

గౌర మనగా లేతరంగు. లేతరంగు సున్నితత్త్వమునకు చిహ్నము. తెలుపు, లేతపసుపు, లేతనీలము, లేత ఎఱుపు. వీనిని గౌరవర్ణము లందురు. చంద్రుని యందీ లేతరంగులు గోచరించు చుండును. చంద్రకాంతివలె సున్నితముగ నుండి ఆహ్లాదము కలిగించు వర్ణము గౌరవర్ణము. శ్రీమాతను ఎక్కువగ పసుపుతో నలంకరింతురు. పచ్చని కాంతి శుభ ప్రదము, మంగళకరము. గంగా, గౌరీ, గోవింద, గీత, గాయత్రి అను నామము లన్నియూ అత్యంత మంగళ కరమగు నామములని తెలుపబడినది.

మంగళగౌరి అత్యంత కాంతివంతమైన దేవత. శివుని భార్య అని ప్రతీతి. శివుడనగా మంగళ ప్రధుడని అర్థము. అట్టి మంగళ కారిణి గౌరీదేవి.

శుద్ధ చైతన్యమునే గౌరి అని పిలుతురు. గౌరీ కల్పము, గౌరీ గాయత్రి సుప్రసిద్ధములు. గౌరీ ప్రసన్నత చేతనే ఎవ్వరైననూ గురువు కాగలరు. గౌరి హృదయమున జన్మించినపుడు మనిషి గురువై ప్రకాశించును. అపుడే అతనికి లోకమున పూజ్య స్థానము కలుగును.



# 636. 'గంధర్వసేవిత'

గంధర్వులచే సేవింపబడునది శ్రీమాత.

గంధర్వులు సృష్టి కతీతమైన ప్రజ్ఞలు. నాదము, గానము, నృత్యము, ప్రకాశము ఈ ప్రజ్ఞల వైభవము. వీరి స్పర్శ వల్లనే సృష్టి యందు కళ లుద్భవించినవి. గంధర్వ స్పర్శ గలవారు లోక ప్రసిద్ధమగు కళాకారు లగుదురు. నారద మహర్షి గంధర్వ స్పర్శ నీయగలిగిన దేవ గురువు. నారద తుంబురుల గానము గంధర్వ స్పర్శ నిచ్చి తన్మ యత్వమును కలిగించును. సంగీతము, నృత్యము ఇతర కళా ప్రదర్శన లలో తన్మయత్వ సిద్ధి నిచ్చువారు గంధర్వులు. వారు రస స్వరూపులు. పరమ భక్తుడు, జ్ఞాని, యోగి యగు ఆంజనేయుడు గంధర్వ గానమున యెల్లప్పుడునూ పరవశించి యుండును. ఇట్టి పరవశమును కలిగించు రస స్వరూపులైన గంధర్వులు నిత్యమూ శ్రీమాతను సేవించుచూ యుందురు. వారి సేవనమున శ్రీమాత పరితృప్తి చెందుచు నుండును. గానము, సంకీర్తనము, భజనము ద్వారా గంధర్వులు మానవులకు దేవతలకు దివ్య స్పర్శను అందించు ప్రజ్ఞలు. వారు శ్రీమాతను పరివేష్టించి యుందురు.



# 637. 'విశ్వగర్భా'

**వి**శ్వమును గర్భమునందు ధరించునది శ్రీమాత అని అర్థము.

పరతత్త్వమగు శ్రీమాత సృష్టి సంకల్ప రూపిణియై కాలక్రమమున సృష్టిని గర్భముగ ధరించును. ఆమె గర్భము నుండియే స్వర్ణ గర్భమువలె మహత్తత్త్వము పుట్టును. అందుండి అష్ట ప్రకృతులును పుట్టును. అహంకార త్రికూటము, పంచాత్మకములు, సృష్టి ఆమె అష్ట ప్రకృతులు. అష్ట ప్రకృతులు ఒకదాని నుండి ఒకటిగా పుట్టుకొని వచ్చును. ఇట్లు తొమ్మిది ఆవరణలతో శ్రీమాత సృష్టి జరుగును. విశ్వమంతయు ఆమె సంకల్పమునుండి యేర్పడినదే.

సృష్టియందేర్పడిన వస్తువుల సమస్తమందునూ కూడ శ్రీమాత వసించి యుండును. ఆమె విశ్వమును గర్భమునందు ధరించుటయే గాక విశ్వమందలి వస్తువుల (జీవుల) కేంద్రముగ కూడ యున్నది. బ్రహ్మ నుండి పిపీలికము వరకు గల సమస్త జీవుల కేంద్రముగ ఆమె యుండును. బ్రహ్మాండ పిండాండములకు కూడ కేంద్రమైనది శ్రీమాత.



# 638. 'స్వర్ణగర్భా'

**సు**వర్ణగర్భమూర్తి శ్రీమాత.

సువర్ణగర్భ మనగా హిరణ్యాండము లేక కాంతివంతమగు గ్రుడ్డు. శ్రీమాత నుండి ఏర్పడు హిరణ్యాండము సమస్త సృష్టికిని ఆధారము. సువర్ణ మనగా చక్కని కాంతులు, శబ్దములు, అక్షరములు. ఇవి అనియు ప్రజ్ఞలు. ఇట్టి ప్రజ్ఞలతో కూడి యుండునది హిరణ్యాండము. సృష్టికి మూలమైన ఈ ప్రజ్ఞలు అండము నుండి వెలువడి అష్ట ప్రకృతులతో కూడిన సృష్టిని యేర్పరచును. త్రిగుణములు, పంచభూత ములు, సమస్త జీవులకు ఆవరణలు. అట్టి జీవులకు నిలయము హిరణ్యాండము. వారందరును శ్రీమాత నుండి వ్యక్తమైనవారే. జీవాత్మ లన్నిటికిని నవావరణము లున్నవి. వీరు శబ్దము కాంతి రూపములతో శోభింతురు. వీరికి ఆవరణలతో కూడిన దేహ మిచ్చునది శ్రీమాత.

ఇట్లు శ్రీమాత తన నుండి ప్రకాశవంతమగు సృష్టి నేర్పరచి దానికి పదార్థమయమగు రూపము నేర్పరచును. ఆమె స్వర్ణగర్భ మరియు విశ్వగర్భ.



# 639. 'అవరదా'

**కాం**తిగల దంతములు కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత దంతములను గూర్చి ఇరువది ఐదవ నామమున వివరింపబడినది. శ్రీమాత దంతమున ప్రకాశమును శుద్ధ విద్యగా ఋషులు గ్రహించిరి. శుద్ధ విద్యయందు సమస్తమూ శ్రీమాతగనే భాసించును. నేను, నాది అను భేద ముండదు. పురుషుడు, ప్రకృతి అను భేద ముండదు. జీవుడు దేవుడు అను భేద ముండదు. సమస్తమూ శ్రీమాతయే. శ్రీమాత చిరునవ్వు నందు ఆమె దంతముల కాంతి అభేద స్థితిని కలిగించును.

దంతములకు అంకుర సామ్యమున్నది. దంత అంకురముల నుండి దంతము లేర్పడును. దంతముల అంకురములు విద్యాంకుర ములు. విద్యలు వైఖరి వాక్కుగ ప్రకాశించుటకు దంతాకురములగు మొలకలు ప్రధానమై యున్నవి. ఈ మొలకల ఆధారముగ దంతము లేర్పడును. విద్యలు ఈ మొలకల యందు నిక్షిప్తమై యుండును. విద్యలు గలవారి దంతములు ప్రకాశవంతమై యుండును. ప్రకాశవంతమగు దంతములుగ శ్రీమాతయే విలసిల్లును. ఇట్టి వారి మందస్మితము ఇతరులకు ప్రకాశము కలిగించును.



# 640. 'వాగధీశ్వరీ'

**వా**క్కులకు అధీశ్వరి శ్రీమాత అని అర్థము.

వాక్కు శ్రీమాత అధీనమున నుండును. వాక్కుతో లోకములను జయింపవచ్చును. వాక్కుతో సంపదలను పొందవచ్చును. వాక్కుతో ఉపద్రవములను నివారింపవచ్చును. చక్కని వాక్కు యుద్ధములను నివారించి సంధిని కూడ కూర్చును. వాక్కునకు సాధ్యము కానిదేదియూ లేదు. సర్వమంత్రములు వాక్కునందే యున్నవి. వాక్కును తెలిసిన వాడే తెలిసినవాడు.

శ్రీమాత అనుగ్రహ మున్నచో వాక్కు రమణీయముగ భాసింప గలదు. వాక్కు మనిషి సంస్కారమునకు చిహ్నము. వాక్కును దుర్వినియోగము చేయువారు నశింతురు. సద్వినియోగము చేయువారు వృద్ధ రింపబడుదురు. వాగ్దేవి మహాత్మ్యము తెలిసినవారు ఆమెనే మిక్కుటముగ ఆరాధింతురు. సంపద లిచ్చు లక్ష్మికన్న శక్తుల నిచ్చు పార్వతి కన్న వాక్కు ననుగ్రహించు వాగ్దేవి మిన్నదైనదని బుద్ధిమంతులు తెలిసి యుందురు. సంపద శక్తులతో వాక్కును ఆర్జించలేము. కాని వాక్కుతో సమస్తమును ఆర్జించవచ్చును. వాగీశ్వరీ ప్రార్థనను అత్యున్నతముగ భావించి సరస్వతీ నదీతీరము చేరి సారస్వతులైన వారెందరో గలరు. శ్రీమాత వాగీశ్వరీ రూపమును ఆరాధించుటలో గల విశేషము వర్ణింప వలవి కానిది.

# 641. 'ధ్యానగమ్యా'

**ధ్యా**నముచే చేరువగునది శ్రీమాత అని అర్థము.

ధ్యానము అష్టాంగ యోగమున సప్తమ సోపానము. ధ్యాన సిద్ధి సమాధియే. శ్రీమాత ఆరాధన కూడా ధ్యానమున పరాకాష్ఠ చేరును. తీవ్రమగు ధ్యాన సమాధిలో ధ్యాని ఆత్మ సంయోగము చెందును. అపుడు తాను శ్రీమాత స్వరూపుడనని తెలియును. శ్రీమాత తనవలెనే యున్నదని తెలియును. ధ్యానము శ్రీమాతను చేరు తుది మెట్టు.



# 642. 'అపరిచ్ఛేద్యా'

ఎల్లలు లేనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత దేశముచే గాని, కాలముచే గాని, గుణముచే గాని పరిచ్ఛేద్యురాలు కాదు. పరిచ్ఛేద్య మనగా నిర్వచింప దగినది. శ్రీమాత యిట్టిది అని తెలియ చెప్పుటకు వీలుపడనిది. ఎవరు ఎంతగ భావింతురో వారి కామె అంతగ భాసించును. ఆమె సర్వమునకు అతీతమైనది. కాలమునకు అతీతమైనది. రూపమునకు అతీతమైనది. దేశమున కతీతమైనది. జాతి కతీతమైనది. అట్టి శ్రీమాత తత్త్వము నెవ్వరెంతగ కొలుతురో వారి కంతగ భాసించును.



# 643. 'జ్ఞానదా'

**జ్ఞా**నము నిచ్చునది శ్రీమాత అని అర్థము.

కైవల్యమే జ్ఞానము. ఉత్తమ జ్ఞాని కైవల్య స్థితి యందుండును. దానిని చేరుటకు వలసిన జ్ఞానమంతయూ క్రమముగ అందించునది శ్రీమాత. ఆదిభౌతిక, ఆధిదైవిక ఆధ్యాత్మిక మార్గమున నడిపించి పూర్ణానుభూతిని కలిగించి పునరావృత్తి లేని మార్గమున వుద్ధరించునది శ్రీమాత. జీవుని సర్వ సంపూర్ణుని చేయును. అన్ని సుఖములను రుచి చూపించి ఆత్మ సుఖము నలవడ జేయును. ఆత్మ సుఖము పొందినవాడు ఇతర సుఖములకై ఆరాటపడడు. జ్ఞానము అవిద్యా విద్యా స్వరూపము. అవిద్యను విద్యను కూడ శ్రీమాత ఎఱుక పరచును.

ఎవరి నుండి మనకి జ్ఞానము అబ్బుచుండునో వారిద్వారా పరోక్షముగ శ్రీమాతయే జ్ఞానము నందించు చున్నదని తెలియవలెను. బాహ్య మందలి విషయముల యందాసక్తి కలిగించు జ్ఞానము బంధము కలిగించును. దీనికి కారణము ఐతరేయ భావమే. తనకన్న ఇతరము అన్నభావము బాహ్య విషయములను చూచినపుడు కలుగుట సహజము. అదితానే అని తెలియుట జ్ఞానము. బాహ్యము నందు అంతరము నందు తానే యున్నాడని తెలియుట శ్రీమాత అనుగ్రహమున కలుగ వలెనే గాని కేవలము తెలిసికొనిన మాత్రము ఆచరణ యందా జ్ఞానము మిగులదు. తనకన్న యితరములేదను జ్ఞానము ఎన్నిమార్లు పఠించిననూ మనసుతో చూచినపుడు ఆ జ్ఞానము మరుగై యితరులు, యితరము

గోచరించును. భేదములు పుట్టును. ఆకర్షణలు వికర్షణలు కలుగును. బంధములు కలుగును. ఇట్టి బంధముల నుండి విడివడుటకు అనన్య జ్ఞానము అవసరము. అట్టి అనన్య జ్ఞానము అనుగ్రహపరముగ లభింప వలసినదే. అట్టి జ్ఞానము ననుగ్రహించునది శ్రీమాత.



# 644. 'జ్ఞాన విగ్రహా'

**జ్ఞా**నమే శరీరముగా గలది శ్రీమాత అని అర్థము.

జ్ఞానము విద్యా అవిద్యాస్వరూపము. సృష్టి అంతయూ కూడా విద్యా అవిద్యా స్వరూపములే. అజ్ఞానముచే కప్పబడి జ్ఞానమున్నది. అట్లే శ్రీమాత దివ్య ప్రకృతిని కప్పివైచుచూ వికృతి కూడ యుండును. వికృతి యందునూ ప్రకృతి యందునూ శ్రీమాతయే దర్శన మిచ్చు చుండును. దీనిని తెలుపుటకే మహాలక్ష్మి అష్టోత్తరమున "ఓం ప్రకృతిం, వికృతిం, విద్యాం సర్వభూత హితప్రదాం....." అని శ్రీమాతను కీర్తించిరి. శ్రీమాత విద్యా అవిద్యల యందు కూడ వ్యాపించి యున్నది. వికృతమగు అవిద్యను చూచినపుడు ఏహ్య పడక శ్రీమాతను దర్శించుట వుత్తమ జ్ఞానము.

ఆది శంకరుల కిట్టి ఉత్తమ జ్ఞానమును శివుడే చందాలుని రూపమును ధరించి అందించెను. మైత్రేయ మహర్షికి కూడా ఇట్టి జ్ఞానమును పరాశరు డందించెను. పరాశరుడు మైత్రేయునితో యిట్లు పలికెను. "ఓ మైత్రేయా! జ్ఞానమే విద్య అవిద్య అని ఎఱుగుము. ఈ సృష్టి మొత్తమూ జ్ఞానాత్మకమే. దీనిని తెలిసి విశేష జ్ఞాని వగుము.

ఈశావాస్య ఉపనిషత్తు నందు జ్ఞానము యొక్క సమగ్ర రూపమును వివరించుచూ విద్యా అవిద్యలను సమదృష్టితో దర్శించు వుపాయమును తెలిపిరి. విద్యారూపముల యందు అవిద్యారూపముల యందు కూడా ఈశ్వరుడే యున్నాడు గనుక సమగ్ర జ్ఞానముతో అన్నిట అంతట

ఈశ్వర దర్శనమే చేయవలెనని తెలుపబడినది. అట్లే లలితా సహస్రమున శ్రీమాతను "జ్ఞాన విగ్రహ" అనుచూ కీర్తించినారు. శ్రీమాత విద్యా అవిద్యా రూపముల యందు వసించి యుండును. తన్ను సేవించువారికి ఈ విస్తార జ్ఞానము నొసగును. అట్టి విశేష జ్ఞానులు శ్రీమాత పూర్ణ విగ్రహములు. ఇటీవలి కాలమున షిరిడీ సాయి, రామకృష్ణ పరమ హంస అట్టివారు. వారు పాపులయందు పుణ్యులయందు కూడ దైవమునే దర్శించిన పూర్ణజ్ఞానులు. ఏసుక్రీస్తు జీవితము కూడ అట్టి పూర్ణ జ్ఞానమును ప్రకటించినది.



# 645. 'సర్వవేదాంత సంవేద్య'

**స**ర్వవేదాంతముల గుంపుచే ఎఱుగదగినది శ్రీదేవి అని అర్థము.

సర్వవేదాంతములు శ్రీమాతనే ఎఱుక పరచును. ఏమి తెలిపిననూ అది అంతయూ చైతన్య విలాసమే. చైతన్యమునకు ఆధారమైన సత్యము అనిర్వచనీయము. అది తెలియనిది అని తెలుపుదురు. అందు నుండి వ్యక్తమైన చైతన్య స్వరూపమునే తెలుపుట యుండును. అందు వలన వేదాంత వాఙ్మయ మంతయూ శ్రీమాత గూర్చియే తెలుపుచున్నది. తెలుపుటకు వలసిన చైతన్యము కూడ శ్రీమాతయే కదా! తెలియ జేయుటకు ఆధారముగాను, తెలియబడునది గాను, తెలియుటగాను శ్రీమాతయే యున్నది.

పై సత్యమును మరచి వేదములను, ఉపనిషత్తులను, బ్రహ్మ సూత్రములను పఠించువారు సమగ్ర జ్ఞానమును పొందలేరు. సమస్తము శ్రీమాతయే అను భావము విడువక నేర్చినచో జ్ఞానమబ్బ గలదు. ఆమె 'జ్ఞానగా, జ్ఞాన విగ్రహా, సర్వవేదాంత సంవేద్య' అని తెలుపుటలో ఈ రహస్యము తెలియవలెను.

శ్రీకృష్ణ భగవానుడు కూడ భగవద్గీత యందు ఈ విషయమునే వివరించినాడు. నన్ను మరచి శాస్త్రములు చదువువారు శాస్త్రముల నెరగలేరు. నన్నెట్లునూ ఎఱగలేరు. అట్టి వారు కేవలము అహంకారులై హుంకరించుచుందురు. అంతర్యామి యగు తనను మరువక చదివినచో

శాస్త్రము లందు తన దర్శనము కూడ జరుగును. సృష్టి నిట్లు చదువువారు జ్ఞానులు. తమ జీవితము నట్లు చదువువారు పరమ భక్తులు.

దైవమును చేరుట ప్రధాన ఆశయముగ వేద వేదాంగములను చదువుట ఫలవంతము. అట్లుగాక కేవలము పాండిత్య ప్రకర్షకై వేదములను, శాస్త్రములను పఠించువారు తెలిసియు తెలియని వారు. అంతర్యామియైన శ్రీమాతను తెలిసినవారు సర్వ వేదాంత సంవేద్యులు. శ్రీమాత పరమభక్తులు అట్టివారు. రామకృష్ణ పరమహంస మాత యందలి పరమ భక్తిచే సర్వమునూ గ్రహించెను. వేదాంతులు అతనిని వేద్యుడని పొగడిరి.



# 646. 'సత్యానంద స్వరూపిణీ'

సత్యము, ఆనందము తన రూపముగా గలది శ్రీమాత అని అర్థము. శ్రీమాత అవ్యక్తము, అనిర్వచనీయము. అవిజ్ఞేయము, అప్రతర్క్యము, అలక్షణము అగు సత్యమునకు వ్యక్తరూపము. ఆమె యొక్క సహజ లక్షణము ఆనందము. బ్రహ్మయే తానని తెలిసినది గనుక బ్రహ్మానంద రూపిణియై యుండును. సత్యమన్ననూ బ్రహ్మ మన్ననూ ఒక్కటియే. సృష్టించు నపుడునూ అందు వసించి యున్నప్పు డునూ తిరోధానమును కలిగించు నపుడునూ సృష్టి యందలి అసురులను అదుపున నుంచు చున్నప్పుడునూ– సృష్టిలేనప్పుడునూ ఇట్లు అన్ని స్థితుల యందునూ శ్రీమాత ఆనందముగనే యుండును. దానికి కారణము తాను సత్యముతో కూడి యుండుట. ఎట్టి స్థితుల యందు కూడ బ్రహ్మమును వీడని తత్త్వము తాను గనుక శాశ్వత ఆనంద స్వరూపిణి అని తెలియవలెను.



# 647. 'లోపాముద్రార్చితా'

**లో**పాముద్రా దేవిచే అర్చింపబడునది శ్రీమాత అని అర్థము.

లోపాముద్రాదేవి అగస్త్య మహర్షి ధర్మపత్ని. విదర్భరాజు కుమార్తె. విదర్భరాజు సంతతికై తపస్సు చేయుచుండగా అగస్త్యుడది గమనించి జీవకోటిసారము నంతను ప్రజ్ఞగ నిలపి ఆ ప్రజ్ఞకు స్త్రీ శిశువు రూపము నేర్పరచి విదర్భ రాజున కిచ్చెను. ఆ స్త్రీ శిశువు కౌస్తుభమణితో సరిసమాన మగు ప్రకాశము, ఆకర్షణ కలిగి యున్నది. విదర్భ రాజునకు శిశువు నందించి "ఈ స్త్రీ శిశువు నీ కుమార్తె. ఈమెను నీవు పోషించి, పెద్ద చేసి తరించుము" అని తెలిపెను. ఆమెకు లోపాముద్ర అను నామము కూడ అగస్త్యుడే ప్రకటించెను. శ్రీమాతకు ప్రతి రూపముగ లోపాముద్ర అలరారు చుండెను. యుక్త వయస్సు వచ్చిన పిదప రాజు ఆమెకు వివాహము సంకల్పింపగ అగస్త్యుడే వచ్చి ఆమెను స్వీకరించెను. లోపా ముద్రాదేవి అగస్త్యుని కొరకై అగస్త్యుని భావము నుండి దిగివచ్చిన శ్రీమాత దివ్య అంశయే. అగస్త్యుడు సాక్షాత్తు శివస్వరూపుడు. అతనిని పెండ్లి యాడుటకు లోకమున ఏ స్త్రీకిని అర్హత లేదు. కాని పితృదేవతల వుద్ధరణమునకై అగస్త్యుడు. పెండ్లి యాడవలసి వచ్చెను. అందుల కాయన తన ప్రకృతినే ఒక స్త్రీ మూర్తిగ యేర్పరచెను. అతడు శివ స్వరూపుడు. కాన శివశక్తియే మరల అవతరించెను. అతనిని పెండ్లి యాడెను. పుత్రుని గని అగస్త్యుని వంశము నుద్ధరించెను. ఆమె నిత్యమూ శ్రీమాత నర్చించుచు నుండును.

లోపాముద్ర నర్చించుట వలన శ్రీమాత నర్చించిన ఫలము కలుగును. అట్టి లోపాముద్ర శ్రీమాత నర్చించుట విశేషము. శ్రీమాతకు ఆ అర్చన అత్యంత ప్రీతికరము. కీర్తి దాయకము కూడ.

లలితా సహస్రము అగస్త్యునికి హయగ్రీవునిచే అందింపబడినది. అగస్త్యుడు లలితా సహస్రమును లోకవ్యాప్తి గావించిన మహర్షి. అతని నుండి శ్రీమాత లోకసారముగ దిగివచ్చి అతనిని వివాహమాడెను. శ్రీమాత లీలా విలాసమును, అగస్త్యమహర్షి మహాత్మ్యమును, లోపాముద్రాదేవి విశిష్టతను ఈ నామము వెల్లడించును.



# 648. 'లీలాక్లప్త బ్రహ్మాండమండలా'

బ్రహ్మాండ మండలములను లీలాప్రాయముగ ఏర్పరచునది శ్రీమాత అని అర్థము.

అనాయాసముగ స్వేచ్ఛతో బ్రహ్మాండములను సృష్టి చేయు సమర్థురాలు శ్రీమాత. సృష్టి స్థితి లయములు క్రీడాప్రాయముగ నిర్వర్తించును. బ్రహ్మము నుండి తాను మేల్కాంచి సర్వమూ తన సంకల్పము నుండియే హాసముతో నిర్వర్తించును.



# 649. 'అదృశ్యా'

**క**నిపింపనిది శ్రీమాత అని అర్థము.

కనిపింపనిది అనగా కన్నులకు కనిపింపదని అర్థము. దివ్యత్వము ఇంద్రియ గోచరము కాదు. ఇంద్రియము లేవియు తమ యజమానిని చూపించ జాలవు. కన్ను చూచువారిని చూపలేదు. చెవి వినువారిని విన లేదు. రుచి చూచు నాలుక, రుచి చూచువారిని రుచి చూపలేదు. అట్లే స్పర్శ యితరములు స్పర్శించుటకు వినియోగపడును గాని స్పృశించు వారిని స్పర్శించలేదు. ఇట్లు ఐతరేయ అనుభవమునకే ఇంద్రియములు వినియోగపడును. వీనిని వినియోగించువానిని మాత్రము చూపింపలేవు. అందువలన బాహ్యేంద్రియ చేతనతో దైవమును చూచుట అసాధ్య మగును. మనస్సు బాహ్యేంద్రియ ప్రవృత్తి నుండి అంతఃకరణములలోనికి ప్రవేశించినపుడు అంతరేంద్రియములు మేలుకొనును. బాహ్యేంద్రియములు వస్తువులనే చూడగలవు. అంత రేంద్రియములు అంతరీక్షణము కలిగినవి. వానికి అంతరీక్ష మందలి అనాహత శబ్దములను వినుట, సూక్ష్మము, దివ్యము అగు రూపములను చూచుట, దివ్య స్పర్శనము నెరుగుట, దివ్య రుచి తెలియుట యిత్యాదు లుండును. బాహ్య దృష్టి మాత్రమే యింద్రియముల కలవాటు చేయుట వలన, బాహ్య విషయములనే మనసు గ్రహించుట కలవాటు పడుట వలన అంతరీక్షణమును శిక్షణగా నేర్పకుండుట వలన మానవుడు చాల విషయములు గ్రహింపలేకున్నాడు. కనపడునది, వినపడునది

ఒకవంతుగ నుండగ మూడువంతులు సూక్ష్మము, దివ్యము అయి వున్నది. దానిని నేర్చుటకు కూడ శిక్షణ చిన్నతనము నుండి అలవాటు చేయవలెను.

ఆహత శబ్దములే గాక, అనాహత శబ్దములను వినుటకు నిశ్శబ్దమున వసించవలెను. ఏకాంతమున నిశ్శబ్దమును వినవచ్చును. అట్లే కన్నులు మూసుకొని వెలుగును చూచుటకు ప్రయత్నించవచ్చును. దివ్యక్షేత్రములను, దివ్యరూపములను దర్శించుట అభ్యసింపవచ్చును. అట్లే సుగంధములు వాసన చూచుట, గంధముల ఆధారము లేకయే చేయవచ్చును. అదే విధముగ శుచికరము, రుచికరము అగు ఆహారము వాసన కూడ చూడవచ్చును. చివరకు సూక్ష్మము, దివ్యము అయిన స్పర్శను కూడ తెలియవచ్చును. బాహ్య విషయములను చిన్నతనము నుండి అభ్యసించినట్లే సూక్షములనుకూడ నట్లే అభ్యసించుట ప్రారంభించ వలెను. అట్టి వారికే క్రమముగ, దివ్య దృష్టి, దివ్య శ్రవణము మరియు దివ్య జ్ఞానము లభించును.

శ్రీమాత 'అదృశ్యా' అని తెలుపబడినది. శ్రీమాతను దర్శించు అభిలాష ఆరాటముగ మారినచో కనులు మూసుకొని దివ్యమంగళ రూపమగు శ్రీమాత తేజోరూపమొక దానిని తదేకముగ భావించుట ఆరంభింపవలెను. అట్టి తదేక ధ్యానమున శ్రీమాత వెలుగుల రూపము దర్శన మగును. రూపము తానూహించునదే. వెలుగు మాత్రము సత్యము. ఆ వెలుగు కంటితో చూచు వెలుగుకన్న భిన్నముగ యుండును. సూర్యకాంతియు కాదు, చంద్రకాంతియూ కాదు, అగ్ని కాంతియూ

కాదు. ఇట్టి కాంతులు పుట్టుచోటుగ అనంతమై ఆహ్లాదకరమై గోచరింప గలదు. ఇట్లు ఆమె అదృశ్యమై గోచరించును. అక్షరములలో 'అ' నేను అని భగవంతుడు పలికినాడు. అ–దృశ్య అనగా నేనను వెలుగుగా అనంతమై గోచరించును. అందు కంటికి గోచరించు వెలుగు లేశమాత్రమై యుండును.

ఈ నామము రహస్యమే మనగా శ్రీమాత నేనను వెలుగుగా గోచరించును. అ–దృశ్యగా గోచరించును. నేను నేననుచు పలుకుచున్న జీవుని వెలుగుగా ఆమెయే యున్నది. దానిని దర్శించుట 'అ' ను దర్శించుట. ఆమె అదృశ్య.



# 650. 'దృశ్యరహిత'

దృశ్యమును రహితము చేయునది శ్రీమాత అని అర్థము.

అదృశ్యము సిద్ధించినపుడు సాధారణ కనులకు గోచరించు దృశ్యము నిహిత మగును. రహితము కూడ నగును. నేనను వెలుగును దర్శించినవారికి యితరము లుండవు. అంతయూ తానుగనే యుండును. చెట్టు చెట్టుగ గోచరించదు. వెలుగుగ గోచరించును. నడచుచున్న ఆవు, ఆవుగ గోచరించదు. వెలుగుగనే గోచరించును. ప్రయత్నము మీద చెట్టని, ఆవని తెలియును. యోగుల దృష్టి అట్లుండును. వారికి అంతరము నందు, బహిరంగము నందునూ వెలుగే గోచరించు చుండును. వారు బుద్ధిమయ జీవులు. మనోమయ కక్ష్యలోనికి దిగినపుడు నామరూపాత్మక మైన జగత్తు యుండునుగాని, ఆనందమయ బుద్ధిమయ కక్షలలో విహరించు చున్నప్పుడు సాధారణ జీవులకు గల దృశ్యములు వారి కుండవు. సాధారణులకు కనపడు లోపభూయిష్టమైన సృష్టి వారి కుండదు. వారి కున్న దృష్టి, అవగాహన లోకుల కుండదు. "లోకులకు ఏది పగలో, యోగులకది రాత్రి. యోగులకు యేది పగలో లోకులకది రాత్రి." అని కృష్ణుడు చమత్కారముగ అదృశ్యా దృశ్యా రహిత అను స్థితులను పేర్కొనినాడు. యోగులు దివ్యము అమృతమయమగు లోకములు దర్శించు చుందురు. నామరూపము లందులో లేశ మాత్రముగ తేలియుండును. లోకులు నామ రూపములను వాని స్వభావ ములను మాత్రమే చూతురు. వాని కాధారమైన వెలుగును చూడరు.

శ్రీమాత ఆరాధకులకు దివ్యలోక సందర్శనము. తదనుగుణ మగు భావము, చేష్ట సున్నితముగ యుండును. వారందరిలో చరించుచు, అన్ని పనులు సాధారణులవలె చేయుచున్ననూ వారి దృష్టి సున్నితముగ అంతర్యామి దైవము పైననే యుండును. కార్యములు వారికి యాంత్రిక ములు. వారు అదృశ్యులు. దృశ్యరహితులు.

అట్టి యోగుల కీశ్వరి శ్రీమాత. ఆమె దృశ్యాదృశ్య స్థితుల యందు లీలాప్రాయముగ నుండును.



# 651. 'విజ్ఞాత్రీ'

సకలము తెలిసినది శ్రీమాత అని అర్థము.

సకలము తెలియుట యనగా తనకు పరమైనది, తన నుండి యేర్పడినది సంపూర్ణముగ తెలియుట. పూర్వాపరములు తెలియుట. జీవులకు పూర్వాపరములు తెలియవు. తామెచ్చటి నుండి వచ్చిరో తెలియదు. ఎందుకు వచ్చిరో తెలియదు. తమ నుండి వచ్చినవి కూడ తమకు తెలియదు. శ్రీమాత తాను పరదేవతయని, తానే సంకల్పముగ కొంత భాగము మార్పు చెందెనని, సృష్టి నిర్మాణము, వృద్ధి లయములకు తాను అధ్యక్షురాలని తన నుండి సకల జీవరాశులు దిగి వత్తురని కాలానుసారము సృష్టి స్థితి లయములను చెందునని తెలిసి యున్నది. అంతేకాక తననుండి దిగివచ్చినవారి పూర్వాపరములు కూడ తెలిసి యుండును. దిగివచ్చు జీవుల కర్మ పరిపాకములు కూడ తెలిసి యుండును. తదనుగుణమైన దేహములు, దేశములు ఏర్పాటు చేయును.

ఎంత తెలిసిన వానికైననూ తాను బ్రహ్మమే అని తెలిసి యుండుట తన పూర్వ జన్మలు తెలిసి యుండుట కూడ యుండవచ్చు. తన భవిష్యత్ కథను గూర్చి గూడా కొంత ఊహ కలిగి యుండవచ్చును. కాని సర్వ జీవుల కథ తెలియుట అలవికాని పని. సర్వలోకములు, అందలి జీవులు, వారి పూర్వాపరములు ఇవి అన్నియూ ఎవరికి తెలియగలవు? మన నుండి పుట్టిన సంతాన మెట్లుండునో మనకి తెలియదు. వారి భవిష్యత్తునూ తెలియదు. వారి పూర్వ కర్మలు తెలియవు. "పిల్లలను కనుటయేగాని, వారి కర్మలు కనలేము" అను సామెత అక్షర సత్యము.

అన్నీ తెలిసిన జ్ఞానులకు కూడ తెలియనివి, తెలియలేనివి యుండును. జరిగిన తరువాతే తెలియుట అంతంత మాత్రము. జరుగక ముందు తెలియుట అసాధ్యము. శ్రీ లలిత స్వరూపమే శ్రీకృష్ణు డని పలుమార్లు ఈ వ్యాఖ్యానములో తెలిపితిమి. తెలిసియూ తెలియని వానివలే జీవించుట ఎవ్వరి తరమూ కాదు. తెలియకపోయిననూ తెలిసినట్లు ప్రవర్తించుట చాలా మంది చేయుదురు. తమ ఆధిక్యత ఇతరులకు తెలియవలెనని అహంకారులు తెలియక పోయిననూ తెలిసినట్లు మాట్లాడుదురు. ఇది లోకమునందు పరిపాటి. తెలిసి యూరకుండుట కష్టము. దీనిని గూర్చి ఎవ్వరునూ ఆలోచింపరు. తెలిసియూ తెలియనట్లుండుట, తెలియదని పలువురనిననూ మాట్లాడ కుండుట కృష్ణునికే సాధ్యము.

అభిమన్యుని దుర్మరణ సమయమున అర్జునుడు, కృష్ణునికి తెలుసునా? తెలియదా? అని నిలదీసెను. అతని చిరునవ్వును సమాధాన ముగ అంగీకరింపలేదు. అంతేగాక అర్జునుడు సహింపలేదు కూడ. సమాధానము చెప్పుట కృష్ణునికి తప్పనిసరి అయినది. అడిగినది అర్జునుడు గనుక తన కత్యంత ప్రియుడు గనుక సమాధానము చెప్పినాడు. "ద్రోణుడు పద్మ వ్యూహము పన్నునని, అభిమన్యుడు మరణించునని తెలియును. మానవ ప్రయత్నముగ నీవు ధర్మజుని వదలి యుద్ధమున దూరముగ చనవలదని హెచ్చరించితిని. నీవు వినలేదు. అహంభావమున దూరముగ చనితివి. కనుక నీ ప్రశ్న కీ సమాధానము చాలును. గాని అభిమన్యు డనిన నాకు నీ కన్న ప్రీతి పాత్రుడు. అతని మరణము తెలిసి యూరకుండుట ఎంతటి దుస్సహమో

ఆలోచించితివా? నీవు పడు బాధ కేవలము తండ్రిగ పడితివి. కాని నీకు బాధ్యత తెలియదు. బాధ పడుటయే తెలియును. అభిమన్యుడు ఋషుల తపస్సునకు మెచ్చి సోమలోకము నుండి శివునిచే అనుగ్రహింప బడిన ఉత్తమోత్తమ మగు శివ తేజస్సు. కేవలము శివు డాజ్ఞాపింపగా నీ పుత్రునిగ దిగి వచ్చెనే గాని, స్వచ్ఛందముగ వచ్చిన వాడు కాదు. అతడు శివుని వేడుకొనగ అల్పాయుర్దాయమును అనుగ్రహించెను. పదహారు సంవత్సరములే భూమిపై యుందు వని ధర్మయుద్ధమున తనవంతు కర్తవ్యమును నిర్వర్తించి రమ్మని ఆశీర్వదించి పంపెను. అది కారణముగ అభిమన్యుడు మరణింపక తప్పలేదు. అతడే లేకుండిన ఈ దినము ద్రోణుని యుద్ధ కౌశలముచే ధర్మజుడు బంధింపబడి యుండెడివాడు. అతడు తన ప్రాణమును అర్పించి ధర్మజుని కాపాడి నాడు. నీకు పుట్టినందులకు పితృ ఋణమును కూడ తీర్చినాడు. శివసాన్నిధ్యమున పరితుష్టుడై ఆసీనుడైనాడు. ఇట్లు అన్నియూ తెలిసిననూ మానవ ప్రయత్నము చేసితిని. సర్వమూ తెలిసిననూ జరుగు చున్నది చూచుటయే నాకు మిగిలినది. నా మాటను నీవు లెక్కపెట్ట కుండుట ఆలోచించినచో నీకు కూడ ఆశ్చర్యము కలిగింప గలదు. సృష్టి యందలి కార్యకారణములు జీవులకు తెలియవు. తెలిసినవారు కూడ జీవుల పరిణామములను, పూర్వాపరములను నెరిగి తమవంతు కర్తవ్యమును ఉదాసీనులై నిర్వర్తింతురు.

శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు. శ్రీలలితకు ప్రతిరూపము. శ్రీమాత సర్వజ్ఞతకు మచ్చుతునకగ ఈ ఉదంతము తెలుపబడినది.

# 652. 'వేద్య వర్జిత'

**తె**లుసుకొనుట యను ప్రయత్నము లేనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతకు తెలుసుకొనవలెనను ప్రయత్నము లేదు. తెలియని వారికి తెలుసుకొనుట యుండును. తెలిసినవారికి యింకనూ తెలుసు కొనుట యని యుండును. సర్వమూ తెలిసిన వారికేమి తెలియవలెను? ఏమియూ తెలియవలసిన అవసరము లేదు. అట్టి వారు తెలుసు కొనుటను వర్జింతురు. కనుక శ్రీమాత వేద్యవర్జిత. సర్వమూ తెలియుట చేత తెలుసుకొనుట అను క్రియను వర్జించినది.

శ్రీ రామకృష్ణ పరమహంస జీవితము ఈ నామమున కొక చక్కని తార్కాణము. అమ్మ భక్తుడు గనుక అన్నియూ తెలిసిన వాడయ్యెను. అతనికి నేర్పెద మని తాంత్రికులు, బ్రహ్మజ్ఞానులు దరిచేరి నపుడు కాదనలేదు. నేర్పుటకై వచ్చినవారు నేర్చుకొనుట జరిగినది. అతడునూ వేద్యవర్జుడే.



# 653. 'యోగినీ'

ఐక్యతా భావము కలది శ్రీమాత అని అర్థము.

యోగినీ- యోగియొక్క స్త్రీలింగ శబ్దము. యోగస్థితి కలవారు యోగులు. యోగమను శబ్దము యుజ్ అను శబ్దము నుండి పుట్టినది. యుజ్ అనగా కలుపు తత్వము అని అర్థము. వైవిధ్యము గలవానిని కలిపి యుంచు శక్తి యోగము. సృష్టి జరిగినపుడు ప్రధానముగ ఇరువది యేడు అంశములు శ్రీమాత నుండి బయల్పడినవి. అవి ఏవియునూ ఒకదానితో యొకటి పొంతన లేక మహత్తున తేలియాడు చుండును. ఈ ఇరువది ఏడు అంశములలో ఏ ఒక్కటికినీ ఇతర అంశములతో కూడి యుండుటకు, కూడి సృష్టి రసాయనము చేయుటకు వలసిన సామర్థ్యము లేకుండెను. అపుడందలి దేవతలు శ్రీమాతను ప్రార్థించగా అన్నిటి యందు యున్న ఆమె ఒక్కటి అయ్యెను. అపుడు విరాట్ రూప మేర్పడెను. ఇట్లు గ్రహగోళములను, లోకములను సమస్త జీవులను శ్రీమాత ఐక్య భావమున నిలిపి యుంచును. అపుడు అంశము లన్నియూ సమన్వయము చెంది ఒకదానితో యొకటి సహకరించును. ఇది శ్రీమాత యోగశక్తి.

మానవుని దేహమున అనేకానేక ప్రజ్ఞ లున్నవి. అన్ని లోకముల ప్రజ్ఞ లున్నవి. సురాసుర ప్రజ్ఞ లున్నవి. వాని వాని స్వభావము లున్నవి. ఇవి అన్నియూ తనయందు సమన్వయ పడినపుడు మానవుడు యోగి యగును. అట్టి యోగి అగుటకు వలసిన జీవన విధానమే యోగవిద్య.

యోగవిద్య నేర్చిన వానికి అంతఃకరణలు, బహిఃకరణలు సమన్వయము చెందును. మనసు బుద్ధితో సమన్వయము చెందును. బుద్ధి దైవముతో యోగము చెంది యుండును. అపుడు జీవుడు యోగియై దివ్య జీవనమున నిలచును. ఇట్టి యోగ విద్య ప్రసాదించునది కనుక శ్రీమాతను యోగినీ, యోగదా అని పిలతురు. తరువాత నామము 'యోగదా'.



# 654. 'యోగదా'

**యో**గము నిచ్చునది శ్రీమాత అని అర్థము.

సృష్టి యందు యోగమనగా శ్రీమాత ప్రేమతత్వమే. ఆమెయే యోగమను గ్రహించు తల్లి. సద్గురువు లందరునూ ఆమె భక్తులే. ఆమె సంకల్పమే వారి నుండి వర్తించును. వారందరునూ శ్రీమాత వాహికలు. జీవులకు శిక్షణ యిచ్చు తల్లి సృష్టియందు సద్గురువులను యోగోపాధ్యాయులుగ తీర్చి దిద్దెను. సనక సనందనాదులు, సప్త ఋషులు, నారద మహర్షి, శుక, వ్యాస, పరాశరాది గురు పరంపర, వ్యాస అనుయాయి లగు హిమాలయ పరంపర, వారి అనుయాయి లగు భౌగోళిక గురు పరంపర శ్రీమాత యేర్పరచిన యోగ విశ్వ విద్యాలయ మందలి సద్గురు పరంపర. వీరిద్వారా శ్రీమాత సంకల్పమే యోగ విద్యాపరముగ నిర్వర్తింపబడుచున్నది.

యోగము నందాసక్తి ప్రతి జీవునకు ఒకానొక సమయమున పరిణామ క్రమమున కలిగి తీరును. యోగ విద్య తారణ విద్య. స్థూల సూక్ష్మ కారణ లోకముల నుండి తరించుటకు వలసిన వుపాయము లన్నియూ యోగ విద్య యందున్నవి. విద్యలన్నిటిలోనికి వుత్తమ విద్యయగు యోగవిద్యను నేర్వవలెను. సంకల్పమును జీవులకు కల్పించునది శ్రీమాతయే. ఆమె జీవుని వుద్దేశించి సంకల్పించినపుడు జీవుని యందు కూడ యోగవిద్య నేర్చు ఆసక్తి బలీయముగ నేర్పడును.

అప్పటి నుండి అతడు తరింపు మార్గమున కొన్ని జన్మలలో శ్రీమాతను జేరును.

ఇట్లు యోగ విద్య నందించి, యోగ శిక్షకుల నేర్పరచి, యోగ శిక్షితులను కూడ యేర్పరచి, యోగ మందించి, జీవుల నుద్దరించు తల్లియే గదా!



# 655. 'యోగ్యా'

**శు**ద్ధ సత్వాత్మకమైన చిదీశ్వరి శ్రీమాత అని అర్థము.

దైవముతో యోగము చెందు యోగ్యత జీవుని యందలి సత్వ గుణమునకే యున్నది. దైవము జీవుని కలయు చోటు కూడ శుద్ధ సత్వ స్థితి. దైవ మనగా సత్యము, బ్రహ్మము. అట్టి బ్రహ్మము జీవుని సత్వమున ప్రకాశించును. అట్లు జీవతత్త్వము నందు సత్యము ప్రకాశించు నపుడు, జీవుడు చిదీశ్వరియై యుండును.

భగవద్గీత నందలి పదునాలుగవ అధ్యాయమున జీవుల యందలి త్రిగుణములు, వాని స్వరూప స్వభావములు తెలుపబడి యున్నవి. అందు సత్వము, రజస్సు, తమస్సుల కతీతము, నిర్మలము, నిశ్చలము, పారదర్శకము. ఆకర్షణీయము, ప్రకాశ వంతమై యున్నది. యోగమున కిదియే యోగ్యస్థితి. ఈ స్థితి యందున్న వారిని యోగ్యు లందురు. రజస్తమస్సుల ఆటు పోటులలో మునిగి తేలుచు నుండు జీవులు యోగ్యులు కారు. వారి యందు నిర్మలత్వము, నిశ్చలత్వము లోపించును. కలుషితములు చేరును. పారదర్శకత లేకుండుటచే అనాకర్షణీయమై యుండును. ప్రకాశము అంతంత మాత్రముగ నుండును.

శుద్ధ సత్వమున నిలచిన జీవుడు ఆత్మ స్వరూపమును తెలిసి యుండుట పరమాత్మతో యోగము చెంది యుండుట కలిగి యుండును. బ్రహ్మముతో ముడిపడిన వారే యోగ్యులు. శ్రీమాత అనునిత్యము

బ్రహ్మముతోనే సృష్టి యందు, ప్రళయము నందు కూడి యుండును. ఆమెయే నిజమగు 'యోగ్య'. ఆమె నిత్యయోగ్య. సహజ యోగ్య. కనుకనే ఆమె నుండి యోగ విద్య ఎప్పుడునూ ప్రసారమగు చుండును. పరమ భక్తు లందరునూ యిట్టి యోగ్యులే. వారికి పరముతో విడదీయ రాని సంబంధ ముండును. భక్తి యన్ననూ, యోగ మన్ననూ ప్రేమ యన్ననూ విడదీయరాని ఆత్మ పరమాత్మల కలయికయే.



# 656. 'యోగానందా'

**శి**వునితో యోగమున నుండి ఆనందించునది శ్రీమాత అని అర్థము.

శివు డనగా బ్రహ్మము, పరము సత్యము. అతనితో కూడి యుండియే శ్రీమాత సమస్త సృష్టిని నిర్వహించు చుండును. శివునితో కూడి యున్నప్పుడే ఎవ్వరికైననూ నిష్కారణమగు ఆనంద ముండును. శివానందమే బ్రహ్మానందము. అదియే సత్యానందము. అదియే సచ్చిదానందము.

శుద్ధ చైతన్య స్థితిలోనే శివ సాన్నిధ్యము లభించును. శుద్ధ చైతన్య స్థితి యందుండవలెనన్నచో జీవుడు నిత్య సత్వమున నుండ వలెను. సత్వగుణమున ఎల్లప్పుడూ వసించి యుండుట నిత్య సత్వ మగును. నిత్య సత్వమునకే శుద్ధ చైతన్యము అందుబాటులో నుండును. శుద్ధ సత్వమునకు శివసాన్నిధ్యము లేక బ్రహ్మ సాన్నిధ్య ముండును. గుణములలో సత్వము దివ్యగుణము. అది జీవుని సహజ ప్రకాశస్థితి. స్వచ్ఛమైన ప్రకాశము కలది సత్వము. రజస్తమస్సులు అంతటి స్వచ్ఛ ప్రకాశకములు కావు.

ఆనందము అన్ని స్థితుల యందు అంతంత మాత్రముగ యుండును. అన్నిటికన్నా మిక్కుటమైన ఆనందము నిష్కారణ మగు ఆనందము, యోగానందము. తమోగుణముతో కూడిన శరీరము కొంత ఆనందము నీయగలదు. అట్లే ఇంద్రియములు తాత్కాలిక ఆనందము నీయగలవు. మనసుద్వారా మరికొంత ఆనందము పొంద వచ్చును. కాని మనస్సున క్రోధము, మాత్సర్యము, లోభము, మోహము,

ఈర్ష్య, అసూయ యిత్యాదు లన్నియూ రజస్తమస్సుల కారణముగ చోటు చేసుకొన్నప్పుడు ఆనందము మృగ్య మగును. మనసున కానందము లేనపుడు యింద్రియములు, శరీరము ద్వారా కూడ ఆనందించుట జరుగదు. విలపించుచూ మిఠాయి తినినచో ఆనందము కలుగదు కదా! అంతియే గాక మనసు యింద్రియములద్వారా, శరీరము ద్వారా అనుభవించు చుండును. మానవ ప్రజ్ఞ మనసునందెక్కువ యుండుటచే ఆనందమునకై బాహ్యముగ కారణములను వెతుకు కొనుట యుండును. కారణము లేక ఆనందించుట మనసునకు చేతకాదు.

మనోలోకములకన్న బుద్ధి లోకములలో ఆనంద మెక్కువగ నుండును. బుద్ధి లోకములలో ఆనందము కూడ బుద్ధ్యైక విషయము లను బట్టి యుండును. రామాయణ భారత, భాగవతాది గ్రంథములు, దైవలీలలు, దివ్యజ్ఞానము ఆధారముగ ఈ ఆనంద ముండును. అనగా బుద్ధి లోకము నందు కూడ ఆనందమునకు కారణ మున్నది. ఆ యా విషయములు లేనపు డానంద ముండదు.

మానవ ప్రజ్ఞ బుద్ధి లోకములను కూడ దాటి ఆనందమయ లోకములను చేరినపుడే కారణములేని ఆనందము లభించును. అచ్చట ఆనందము నిష్కారణము. ఆనందమయ లోకమున ప్రజ్ఞ చేరవలె నన్నచో జీవుడు నిత్య సత్త్వమున నిలువవలెను. నిత్య సత్త్వము స్వభావమైనపుడు శివశక్తి సామరస్యము కలుగును. సత్ చిత్ సామ రస్యము కలుగును. అదియే యోగానందము.

నృసింహ రూపమునకు యోగానందమని అర్థము. అందులకే యోగ విద్య నేర్చువారు నృసింహ రూపములను ప్రధానముగ ధ్యానింతురు.

# 657. 'యుగంధరా'

**యో**గముచేత సమస్తమును ధరించునది శ్రీమాత అని అర్థము.

శివయోగమున నిలచి బ్రహ్మాండములను ధరించునది శ్రీమాత. శివయోగ ఆనంద బలముననే అనితర సాధ్యమగు కార్యభారము శ్రీమాత వహించి యున్నది. దీని నుండి ఒక రహస్యము తెలియవలెను. సహజానంద మున్నచోట బృహత్ పథకములను సృష్టించుట, ధరించుట, భరించుట జరుగును. మిక్కిలి ఆనందము కలవారే ఎక్కువ పనులను చేయగలరు. ఆనంద బలమున కార్యములు జరుగును కాని శ్రమపడి చేయుట వారి కుండదు. వారానందమున నిలచి యుండగా వారి నుండి కార్యములు జరుగుచుండును. చేయుచున్నామను భ్రమకూడ వారి కుండదు. ఆనందమే యుండును. కార్యములు లీలా ప్రాయముగ సాగును. విశ్వామిత్ర యజ్ఞ రక్షణము నుండి రావణ సంహారము వరకు శ్రీరాముడు చేసిన ధర్మ సంస్థాపనము అనుపమానము. రాముని యుద్ధము ఆనందహేల. ఆతడు వింటికి అల్లెత్రాడెక్కించుట, బాణములను సంధించి వదలుట త్రుటిలో జరిగెడిది. శ్రమ ఎరుగనివాడు శ్రీరాముడు. శ్రమ పడినట్లు మన కనిపించును కాని శ్రమపడిన చిహ్నములు రామాయణమున ఎక్కడనూ గోచరించవు. మహత్తర మగు యుద్ధములను లీలగ నిర్వర్తించిన ధర్మమూర్తి, అత డెపుడునూ హృదయమున శివానందముతో నుండెడి వాడట. అతడు నిజమగు శివయోగి. హనుమంతుడు నిజమగు రామయోగి.

అంతరంగమున దైవముతో కూడి యున్నప్పుడు దేశకాలముల పరిమితులు లేక దివ్యకార్యములను నిర్వర్తించుట యుండును. యుగముల తరబడి కార్యములను నిర్వర్తించుట యుండును. సనక సనందనాదులు, నారదులు, సప్త ఋషులు అట్టివారు. వీరందరూ శ్రీమాత అనుగ్రహపాత్రులు. ఆమె యుగంధర తత్త్వము వారి యందు స్థితయై యుండును. ఆమె నాయికీ.



# 658. 'ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి, క్రియాశక్తి స్వరూపిణి'

**ఇ**చ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులుగా రూపొందునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మమే శివము, సత్యము. అది శాశ్వత స్థితి. సృష్టి యందు, సృష్టికి పరముగను వుండునది. పరతత్త్వమున బ్రహ్మమై యున్న శ్రీమాత నుండి కలుగు మొదటి ప్రేరణ లేక స్పందన ఇచ్ఛ అనబడును. జీవుల యందలి కారుణ్యము చేత, శివునితో ఐక్యమై యున్న శ్రీమాతకు ప్రేరణ కలుగును. స్పందన కలుగును. జీవుల హితార్థమై జీవసృష్టి ఇచ్ఛగా లేక కోరికగ యేర్పడును. ఇచ్ఛను అనుసరించి తదనుగుణమైన జ్ఞానము కూడ శ్రీమాత నుండి వుద్భవించును. ఇచ్ఛా జ్ఞానములాధార ముగ క్రియ జరుగును. అపుడు విశ్వోత్పత్తి కలుగును.

ఇచ్ఛలేని జ్ఞానము సచ్చిదానందమై యుండును. అట్టి స్థితిని స్వస్తి అందురు. స్వస్తి అనగా తనయందు తానుండుట. స్వస్తికమును ధ్యానించుట– స్వస్తి యందుండుటకే. కోరికలు తీరుటకు స్వస్తికము లను వాడుట కలి ధర్మము. అలలు లేని స్థితిలో తటాకము నిర్మలమై, నిశ్చలమై యెట్లుండునో అట్లే తన యందు తానుండు యోగికి భావ చలనములు, సంచలనములు వుండవు. చలనము లేని నిర్మల మగు నీరు తానుండక తన మూలమును ప్రకటింపజేయును. అట్లు స్వస్థత యందు యుండు యోగి నుండి అతని మూలమైన బ్రహ్మమే

ప్రకాశించును. శ్రీమాత స్థితి అట్టిది. అట్టి పరమానందమయమగు స్థితి నుండి ఇచ్ఛను పొందుట లోకుల కొఱకే. అట్టి యిచ్ఛకు జ్ఞానము తోడ్పాటు గావించును. ఇచ్ఛా జ్ఞానములు క్రియకు తోడ్పాటు గావించును.

సామాన్యముగ జీవులకు ఇచ్ఛా క్రియ లుండునుగాని జ్ఞాన ముండదు. క్రియకు శరీర మున్నది. ఇచ్ఛకు ప్రజ్ఞ యున్నది. కాని జ్ఞానము లేనివారగుట వలన ఏమి ఇచ్ఛగించవలెనో ఎట్లు నిర్వర్తించ వలెనో తెలియదు. వారి ఇచ్ఛలు జ్ఞానమును బట్టి యుండవు. ఇచ్ఛా పూరణము గావించుకొను జ్ఞానము వుండదు. ఏమి చేయవలెనో, ఎట్లు చేయవలెనో తెలియక చేయు చుండుట యుండును. అట్లు చేయుట వలన వారు కర్మబద్ధు లగుదురు. ప్రధానముగ తానేమి చేయవలెనో తనకు తెలియవలెను. దానికి జ్ఞాన మావశ్యకము. ఎప్పుడు చేయవలెను? ఎక్కడ చేయవలెను? అనునవి కూడ తెలియవలెను. అందువలన జ్ఞానము లేని యిచ్ఛ నిరుపయోగము. జ్ఞానముతో కూడిన యిచ్ఛకు కూడ పరిపూర్తి లేదు. క్రియా రూపముననే యిచ్ఛకు పరిపూర్తి లభించును. కావున క్రియయే ఇచ్ఛా జ్ఞానములకు ఫలసిద్ధి.

శ్రీమాత క్రియా స్వరూపిణి. ఇచ్ఛా జ్ఞానములు ఆమె కిరు పార్శ్వములు. ఇట్లు శ్రీమాత నెరిగిన యోగులు యిచ్ఛా జ్ఞానములతో కూడి సతతము యజ్ఞార్థ క్రియ యందుందురు.

*"యజ్ఞార్థం కురు కర్మాణి"* అని కృష్ణుడు అర్జునుని నిర్దేశించెను. "యజ్ఞార్థ మనగా లోకహితార్థము, స్వహితము కొరకు గాక, లోక

హితమునకై యుద్ధము చేయుము” అని తెలిపెను. కనుక ఇచ్ఛ లోకహితమైన యిచ్ఛ అయినప్పుడు అది జ్ఞానముతో కూడి నిర్వర్తింపబడి నపుడు జీవుడు పరిపూర్ణ డగుచు యుండును. స్వహితము కొరకు పని చేయువాడు బంధింపబడును. శ్రీమాత సర్వభూతహితప్రద అగుటచే సృష్టి కార్యమును వన్నె తరుగని జ్ఞానముతో క్రియారూపిణియై నిర్వర్తించును.



# 659. 'సర్వాధారా'

సమస్తమైన జగత్తుకు ఆధారముగా వుండునది శ్రీమాత అని అర్థము.

ఆధార మనగనే మూలములు మనసున స్ఫురించును. మూలము లనగనే భవనములకు పునాదులు, వృక్షములకు వేళ్ళు, మానవులకు మూలాధారము. జ్ఞప్తికి వచ్చును. కాని మూలధారము నకు మూల మేది? సృష్టి మూలమే మూలాధారమునకు మూలము. సృష్టి మూలము లేక సృష్టియోని గుణత్రయమే. గుణత్రయమునకు మూలము- ఇచ్ఛా, జ్ఞాన, క్రియా స్వరూపిణియైన శ్రీమాత. ముందు నామమున ఇచ్ఛాశక్తి, జ్ఞాన శక్తి, క్రియాశక్తి స్వరూపిణి అని శ్రీమాతను కీర్తించుట జరిగినది. ఆ శక్తి త్రికూటమే సృష్టికి ఆధారము. సృష్టికి ఆధారము సూక్ష్మము నందున్నది కాని స్థూలము నందు కాదు. మానవునకు కూడా ఆధారము మానవుని యందలి ఈ మూడు శక్తులే. ఈ మూడు శక్తులు మానవునివి కావు. శ్రీమాత శక్తులే మానవుని యందు నిక్షిప్తము చేయబడి వున్నవి. శుద్ధచైతన్య మగు శ్రీమాత త్రిశక్తియై త్రిగుణాత్మకయై సూక్ష్మమున సృష్టి పునాది వేయును. ఈ మూడు కేంద్రముల నుండి సుషుమ్న, ఇడ, పింగళలుగా ఆమె చైతన్య ప్రవాహము సత్వరజస్తమో గుణములుగ స్థూలమునకు ప్రవహించును. ఈ ప్రవాహము సూక్ష్మము నుండి స్థూలమునకు అధోగతిగా ప్రవహించు చుండగా సప్తలోకములు యేర్పడును. మానవునికి శిరస్సునుండి ఈ

చైతన్య ప్రవాహములు అధోముఖముగా మూలాధారము వరకు ప్రవహించును. మూలాధారమునకు ఆధారము శిరస్సు నందున్నది. గర్భస్త శిశువుకు మూలాధారము నుండి శిరస్సు ఏర్పడుట లేదు కదా! శిరస్సు నుండి మూలాధారము వరకు ఏర్పడుచున్నది. ఇట్లు మానవుని కాధారము సహస్రారము. అట్లే సృష్టి కాధారము శ్రీచక్రమే. సృష్టి మూలము శ్రీచక్ర మేరు యందున్నది. అచట శ్రీమాత యున్నది. ఆమె 'సర్వాధార'.

శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీత యందు ఈ విషయమే ప్రస్తావించి నాడు. సృష్టి వృక్షము మూలములు ఊర్ధ్వమున వున్న వని, శాఖలు, ఉపశాఖలు అధోముఖముగ నున్నవని తెలుపుటలో గల రహస్య మిదియే.

సృష్టి మూలము శ్రీమాత. ఆమె నుండి మూడు ఖండములుగ త్రయీ మార్గములో సత్వ, రజస్తమస్సులతో కూడిన సృష్టి మొదట యేర్పడును. మూడునూ జమిలిగా అల్లుకొని యుండును. అందుండి శాఖలు తలక్రిందులుగ ఊర్ధ్వము నుండి అధస్సున కేర్పడును. అందుండి ఉపశాఖలు యేర్పడును. ఉపశాఖలకు రెమ్మలు, ఆకులు యేర్పడును. శ్రీమాత మూలముగ నుండగా, త్రికాండముగ త్రిగుణము లుండగా పంచభూతాత్మకమైన సృష్టి శాఖోపశాఖలుగ అధస్సునకు విచ్చుకొనును. ఈ మొత్తము జమిలిగ గోచరించిననూ అందు ఛందస్సున్నది. కాలక్రమ మున్నది. సృష్టి ప్రణాలిక యున్నది. పరిణామ మున్నది. అన్ని వేదము లున్నవి. ఇట్టి వృక్షమున కాధారము శ్రీమాత కనుక ఆమె సర్వాధార.

ప్రాచీన కాలమున దేవాలయములనుకూడా ఊర్ధ్వలోకము నుండి అథస్సునకు నిర్మించెడివారు. పునాదులు పైన యుండెడివి. భూమిలో పునాదులు తరువాతి కాలమున యేర్పడినవి. ఊర్ధ్వమున గల విమాన బలముతో కట్టడము నిలబడి యుండెడిది. పెనుగాలి గాని, వర్షము గాని వానిని చలింపజేయ లేకుండెడివి. ప్రస్తుతమున యిట్టి కట్టడములు ఆంగ్లదేశ మందలి లండను మహా నగర సమీపమున గల స్టోన్ హెంజ్ అను ప్రదేశమున చూడవచ్చును. భారత దేశమున యిట్టి కట్టడము లెన్నియో గలవు. దేవాలయ స్థంభములు నేలకు ఆనక పై కప్పు ఆధారముగ దేవాలయమున నిలబడి యుండును.

భూమి నాధారము చేసుకొని జీవించువారు మర్త్యులు. శ్రీ తత్త్వము నాధారము చేసుకొని జీవించువారు అమర్త్యులు. భూతత్త్వము కూడ శ్రీ తత్త్వము నుండి వెలువడినదే. కనుక శ్రీతత్త్వము నాధారముగ జీవించినచో భూతత్త్వము బంధింపక సహకరించును. స్థూలముతో పోరాడక సూక్ష్మము నాధారముగ చేసుకొని జీవించుట విజ్ఞులు చేయు పని. మంచు గడ్డలపై ఆధారపడక మంచినీటిపై ఆధారపడుట వంటిది యిది. శ్రీమాత భక్తులు సర్వమునకు శ్రీమాతయే వుపాయమని భావింప వలెను. ఇతర భావములపై ఆధారపడుట అవివేకము.



# 660. 'సుప్రతిష్ఠా'

**చ**క్కగా ప్రతిష్ఠించునది శ్రీమాత అని అర్థము.

చక్కగా అనగా బలముగ, అందముగ, వైభవముగ, ఆనంద దాయకముగ, వికాసవంతముగ, ఆకర్షణీయముగ సమస్త సృష్టిని ప్రతిష్ఠించును. అనగా ఏర్పరచును. కీర్తిదాయకమై యుండును. శ్రీమాత భక్తులు చేయు కార్యములు కూడ శ్రీమాత చేయుచున్నట్లే జరుగును. అందువలన వారి కార్యముల యందు కూడ పై లక్షణములు గోచరించును.

ఆమె సృష్టియందు సూక్ష్మము నుండి స్థూలము వరకూ సమస్తమూ క్రమబద్ధమై యుండును. క్రతుబద్ధమై యుండును. అద్భుత మైన కొలతలు గోచరించును. యేర్పడిన లోకము లన్నియూ ఛందో బద్ధమై యుండును. సృష్టి రహస్యములు తెలుసుకొన గోరినవారికి అనేక జన్మల తరబడి గోచరింపదగిన విశేషములు గోచరించును. తదానందము, అనుభూతిలో వారు తన్మయత చెందుట యుండును.

ఆమె సృష్టి సుప్రతిష్ఠ. ఆమె నారాధించు భక్తుల జీవితములు కూడ సుప్రతిష్ఠములు.



# 661. 'సదసద్రూపిణీ'

**శ్రీ**మాత సత్ మరియు అసత్ రూపము కలిగి యున్నది అని అర్థము.

సత్ రూపము అనగా బ్రహ్మ తత్త్వము. సత్ అన్ననూ బ్రహ్మము అన్ననూ, శివము అన్ననూ, నారాయణము అన్ననూ ఒక్కటియే. అది తత్త్వము. అది నిర్వచించుటకు వీలుకానిది. నిర్వచించుటకు ప్రయత్నించువాడు కూడ దాని మూలమున నేర్పడినవారే అతడు యేర్పడుటకు ముందు అది యెట్లున్నది అను విషయమును అతనికి చెప్పనలవి కాదు. అదియే తానుగ నున్నదని మాత్రము తెలియనగును. తానుగ నుండుట తాత్కాలికమే. తానున్నను, లేకున్ననూ అది యున్నది. తానుగ కూడ నదియే యున్నది. ఇట్టి తత్త్వము శ్రీమాత శాశ్వత స్థితి. అట ఉండి జరుగు సృష్టి సంకల్పము, కాలము సంకల్పము కలసి సృష్టి నేర్పరచుట, సృష్టి జీవుల నేర్పరచుట– ఇన్నింటిగానూ తానే యుండుట ఆమె అసత్ రూపము. ఈ రూపము జగద్రూపము. జగద్రూపమునకు పుట్టుట, పెరుగుట, నశించుట యున్నది. తానెప్పుడూ యుండును. కనుక ఆమె సద్రూపి. జగత్ ఆమె అసత్ రూపము

సాధకులగు మానవులు కూడా అట్లే భావించవలెను. సాధకుడగు తాను శాశ్వతుడు. తన సంకల్పములు, భాషణలు, చేష్టలు, రూపము యిత్యాది వన్నియూ వచ్చిపోవు చుండును. సాధనలు కూడ నంతియే. తన నిజ స్వరూప మెరుగుటకే సాధనగాని, సాధనకు వేరు ప్రయోజనము

లేదు. సాధనే సర్వస్వము కాదు. సిద్ధి యనగా తాను సద్రూపుడ నని, తన సంకల్పాదులు అసద్రూప మని, తన నామ రూపములు కూడ అసద్రూపములే నని తెలిసి యుండవలెను.

శ్రీమాత సదసద్రూపిణి. జీవుడును సదసద్రూపుడే. తన యందలి శాశ్వత తత్త్వము తన చుట్టునూ యేర్పడిన అశాశ్వత జీవిత మును జ్ఞప్తి యందుంచుకొనువాడు నిజమగు భక్తుడు.



# 662. 'అష్టమూర్తి'

శ్రీమాత ఎనిమిది రూపములు కలది అని అర్థము.

పంచభూతములు, సూర్యచంద్రులు, తేజోమయమగు స్వర్గము, శ్రీమాత అష్టరూపములుగ తెలియబడుచున్నవి. యోగశాస్త్రమందు గుణవిభేదములచే ఆత్మ ఎనిమిది విధములని, ఈ ఎనిమిది, ఆత్మ మూర్తులని, శ్రీమాతమూర్తులని తెలుపబడినవి. అవి వరుసగా 1) జీవాత్మ, 2) అంతరాత్మ, 3) పరమాత్మ, 4) నిర్మలాత్మ, 5) శుద్ధాత్మ, 6) జ్ఞాన రూపాత్మ, 7) మహాత్మ, 8) భూతాత్మ.

ఇట్లు శ్రీమాత అష్ట ఆత్మ మూర్తులుగ వెలసి యున్నది. మత్స్య పురాణ మందు శ్రీమాత ఎనిమిది తనువు లిట్లు పేర్కొనబడినవి. 1) లక్ష్మి, 2) మేధ, 3) ధర, 4) పుష్టి, 5) గౌరి, 6) తుష్టి, 7) ప్రభ, 8) ధృతి. ఈ ఎనిమిది శరీరములచే శ్రీమాత సృష్టి పానము చేయునని మత్స్యపురాణము తెలుపుచున్నది.

లింగ పురాణ మందు, భగవద్గీత యందు, అష్టప్రకృతు లగు భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అష్టమూర్తులగ వర్ణింపబడినవి. అహంకార రూపుడుగ మానవుడు శ్రీమాత ఎనిమిదవ మూర్తి. బుద్ధి స్వరూపుడుగ ఏడవ మూర్తి, మనో రూపుడుగ ఆరవ మూర్తి. వీని నుండి పనిచేయు చైతన్యమే తొమ్మిదవ మూర్తి లేక మూల ప్రకృతి. ఆమెయే శ్రీమాత. పదవది అయిన పరమాత్మ నుండి అరూపిగ శ్రీమాత ప్రకాశించుచు ఎనిమిది మూర్తులుగ అహంకారాది లోకములనుండి పృథివీ లోకము వరకు ఆమె రూపము లేర్పడుచుండును.

# 663. 'అజాజైత్రి'

**అ**జను జయించిన శ్రీమాత అని అర్థము.

అజ అవిద్యా స్వరూపిణి. ఆసురీ తత్వము. ఆ తత్వమును జయించునది శ్రీమాత.

సృష్టికి పూర్వము అనంతమగు చీకటి వ్యాపించి యుండెను. అందు సంకల్పమాత్రమున శ్రీదేవి వుద్భవించినపుడు ఆమె ఆవిర్భావ మును సమ్మతింపక కబళించుటకు అనంత మగు చీకటి ప్రయత్నించెను. చీకటి అనంతముగ నున్ననూ దానిని నిర్జించి సృష్టికి చోటు ఏర్పరచి ఆ చోటునంతనూ వెలుగతో శ్రీమాత నింపినది. అనంతమగు చీకటిని పుట్టుకతోనే నిర్జించ గలుగుట అనన్య సామాన్యమైన విషయము. సృష్టించుట కేర్పరచిన చోటు వెలుగుతో నింపగ దాని అంచులలో నెపుడునూ చీకటి పొంచి యుండును. చీకటి ఎప్పటి కప్పుడు వెలుగును కబళించుటకు ప్రయత్నించు చుండును. దానిని సతతము నిర్జించుచు నుండవలెను. అనునిత్యము సృష్టిని కబళించు చీకటిని జయించిన దగుటచే శ్రీమాతను 'అజాజైత్రి' అని దేవతలు కీర్తించిరి.

సృష్టి యజ్ఞార్థము నిర్వహింపబడుచున్నది. జీవుల కొరకు నిర్వహింపబడుచున్నది. నిర్వహించు వారందరూ శ్రీమాత నుండి దిగివచ్చు దేవతలు. వారు యజ్ఞనిర్వహణము చేయుచుండగ ఆసురీ రూపమగు అజ ఆ యజ్ఞమునకు భగ్నము కాకుండగ శ్రీమాత అప్రమత్తమై యుండును.

అజ అనగా పుట్టుకలేనిది అని అర్థము. సృష్టి ముందు నుండి యున్న చీకటి సృష్టి సమయమున నిర్జింపబడును. ప్రళయమున విజృంభించి లయ మొనర్చును. ఇట్టి చీకట్లు చోటు యందు అనంత ముగ యున్నవి. వానికి పుట్టుక లేదు. చావు లేదు. కాని వానిని నిర్జింప వచ్చును. నిర్జించుటకు వెలుగే పరిష్కారము. ఆ వెలుగే శ్రీమాత.

చీకట్లను శ్రీమాత పుట్టించదు. పుట్టించునది దేవతలనే. దేవతలు కూడ చీకట్లను కోరి పుట్టించరు. కాని వారప్రమత్తులై యున్నప్పుడు చీకట్లు చొరబడును.

చతుర్ముఖ బ్రహ్మ సృష్టిని ప్రారంభించు సమయమున, సోమకుడు అను అసురుడు వేదజ్ఞానము నపహరించెను. ఇంకను సృష్టి కాకుండగనే అసుర లెట్లుండగలరు? దీని రహస్య మే మనగా సృష్టికి పూర్వము వున్నది చీకట్లే. పల్లెలు, గ్రామములు యేర్పరచుటకు కొంతమేర అడవు లను నరికెదరు. అంతకు ముందు పల్లెలు లేవు; నగరములు లేవు. అడవియే యుండును. పల్లెలను, నగరములను యేర్పరచినపుడు పొలిమేరలలో అడవు లుండును. అడవులలోని క్రూర మృగములు అపుడపుడు పల్లెలలో ప్రవేశించి జీవుల ప్రాణము లపహరించు చుండును. అట్లే చీకట్లు సృష్టి యందు ప్రవేశించుటకు ప్రయత్నములు జరుగుచుండును. పాలకులు, నగరములను, పల్లెలను రక్షించినట్లు జగత్పాలికయగు శ్రీమాత పుట్టని, చావని చీకట్లను నిర్జించు చుండును. వాటిపై జయము సాగించును.

మరియొక విశేష మున్నది. సృష్టి యందు కూడ చీకట్లు చొరపడుట జరుగుచుండును. దితీదేవి కశ్యపుని అసుర సమయమున

సంతతి కోరినది. వలదని వారించిననూ వినలేదు. జ్ఞానమును నిర్లక్ష్యము చేయుట వలన దితి నుండి అజ్ఞానపు చీకట్లు దైత్యులుగ ప్రవేశించిరి. జీవులు అప్రమత్తతతో జ్ఞానము ననుసరించి యుండనపుడు అవిద్య ప్రవేశించుట కవకాశ మెక్కువగ నుండును. అందువలన నిత్యమూ జ్ఞాన దీపమును తమ యందు వెలిగించుకొనుట జీవుల కర్తవ్యమై నిలచెను. జ్ఞానము వలన అజ్ఞానము నిర్జింపబడునుగాని మరియొక మార్గము లేదు. *"నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే।"* అని భగవానుడు గీతలో పలికినది శాశ్వత సత్యము. చీకటి యందు దీపము వంటిది శ్రీమాత. ఆమె స్మరణ యున్నచోట అవిద్య నిర్జింపబడును.

మరియొక మాట. అజ అనగా గొఱ్ఱెపోతు అని మరియొక అర్థ మున్నది. గొఱ్ఱెపోతు ఎప్పుడునూ పోటీపడుచు ఢీ కొనుటకు సిద్ధముగ నుండును. అది అహంకారమునకు చిహ్నము. మితిమీరిన అహంకారము కలిగినపుడు సులభముగ అవిద్య ఆవహించును. అహంకారము నశించుటకు వలసిన సన్నివేశములను అహంకారి, అహంకారము ద్వారా సృష్టించుకొనును. దక్షు డట్లే గావించుకొని శ్రీమాత కారణముగ నిరహంకారి అయ్యెను. శ్రీమాత భక్తుల అహంకారమును శ్రీమాతయే ఎప్పటికప్పుడు నిర్జించును. అందువలన ఆమె 'అజాజైత్రి'.



# 664. 'లోకయాత్రా విధాయినీ'

**ప**దునాలుగు లోకములు యాత్ర చేయునది శ్రీమాత అని అర్థము.

పదునాలుగు లోకములు సంరక్షించుటకు పదునాలుగు లోకముల యందు వెలుగుల రూపమున యాత్ర చేయుచు శ్రీమాత యుండును. అచేతనముల యందు, సచేతనముల యందు నిండి యుండి అన్ని లోకములను, జీవులను లోపల నుండి, బయట నుండి పర్యవేక్షించు చున్నది. శ్రీమాత. అన్నిట అంతట నిండి యుండునది గాన ఆమె విశ్వమయి. లోకములలో ఎచ్చట ఏమి జరుగుచున్ననూ ఆమె కంటపడక తప్పదు. ఆమె కన్ను గప్పి ఎవ్వరునూ ప్రవర్తింపలేరు. జీవుల ప్రవర్తనములనుబట్టి రక్షణ, శిక్షణ, పోషణము మొదలగు విధులను నిర్వర్తించుచు నుండును.



# 665. 'ఏకాకినీ'

రెండవది లేనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత తానొక్కత్తియే యున్నది. ఆమె శివశక్తి. జగత్తంతయూ శివశక్తి స్వరూపమే. తానుగాక మరియొకతె లేదు. తాను కాని దేమియూ లేదు. ఒకతెయే వెలువడును. ఒకతెగనే సృష్టి చేయును. ఆమె ఒకతెయే పోషించును. రక్షించును. పాలించును. ఒకతెయే లయము చేయును కూడ.

అంతయూ చైతన్య విలాసమే అని ముందు నామములలో పలుమార్లు వివరింపబడినది. చైతన్యమే సృష్టి కాధారము. తత్త్వమే చైతన్యమై సృష్టిగ యేర్పడునపు డన్యము లేదు. ఆమెది అనన్యస్థితి. అద్వైత స్థితి. ద్వైత స్థితి అనుభూతి కొఱకే. కాని అనుభూతి యున్నంత కాలము అద్వైతము లేదు. అనుభూతి ద్వైత స్థితి. అనుభూతి జీవులకే కాని దైవమునకు కాదు. దివ్యానుభూతులు దైవమున కుండవు దైవమును చేరిన వారికుండవు. ఆదిశంకరులు అద్వైత స్థితిని పొంది అనుభూతి కొరకు ద్వైతములోనికి దిగి వచ్చి వేలాది స్తోత్రాదికములు చేయుచు తాననుభూతి చెంది యితరులకు అనుభూతి చెందుటకు వుపాయము లేర్పరచినారు.

రామానుజులు అద్వైతమునే విశిష్టాద్వైతముగ మలచి దివ్యవైభవ మును ఒక మార్గముగ స్థిరపరచినారు. ఈ ఇరువురి మార్గములు దైవము ఏకాకి తత్త్వమును నిర్ధారణ చేయుచుండును.

ఏకాకిని అయిన శ్రీమాత బ్రహ్మ స్వరూపిణియే. సమస్తము బ్రహ్మమే అని తెలుపు ఉపనిషత్తులు ఈ నామ సంబంధితములే.

# 666. 'భూమరూపా'

బ్రహ్మరూపిణి శ్రీమాత అని అర్థము.

భూమ అనగా బ్రహ్మము. బ్రహ్మ మనగా సర్వవ్యాపనము చెంది యున్న తత్వము. అన్నిటా అంతటా నిండి యున్న తత్వము. స్థితి నిచ్చుతత్వము స్థితి అనగా యుండుట. సుఖముగ నుండుట. రాయిగ వుండుట, రాజుగ వుండుట, రాముడుగ వుండుట, భేదము లేక అన్నిటా వుండుట అనునది బ్రహ్మతత్త్వము. సృష్టి యందెన్ని రూపము లేర్పడిననూ అట్లేర్పడుట కాధారము బ్రహ్మమే. అనేక వర్ణములుగను, అనేక శబ్దములుగను, అనేక రూపములుగను, అనేక శక్తులుగను, యుక్తులుగను, సంకల్పములుగను, కోరికలుగను వున్న దొక్కటియే. ఒక్కటియేయైన బ్రహ్మము అనేకముగ నున్నప్పుడు 'భూమ' అందురు.

ఆమె ఏకాకిని మరియూ 'భూమరూప' అని చెప్పుటలో పరస్పర విరుద్ధమగు రెండు విషయములు తెలిపిననూ అందలి ఏకత్వ మును ప్రతిపాదించుట కన్పట్టుచున్నది. ఆమె ఏకాకిని అయిననూ భూమరూప కూడ అని ప్రసంశింపబడుచున్నది.



# 667. 'నిర్ద్వైతా'

**రెం**డవది అను భావము లేక యుండునది శ్రీమాత అని అర్థము.

అంతయూ తానే. సజ్జనులు తానే, ఈ దుర్జనులు తానే, జ్ఞానులు తానే, అజ్ఞానులు తానే. తాను కానిది మరి ఏమియూ లేని స్థితి. ఏమి గోచరించిననూ అది తానే అని తెలిసి యుండు స్థితి. ఆమె అనన్య, ఏకాకిని, భూమరూపా అయి వుండుటచేత తానుకాక మరి ఎవరూ లేరు అని తెలిసి యున్న స్థితి. జీవులకు ద్వైత ముండును గాని శ్రీమాత కుండదు.

తాను యితరము అను భావమే ద్వైతము. ఇతర మేమియూ లేదు. అంతయూ తానే అని తెలిసిన స్థితి నిర్ద్వైతము. నిర్ద్వైత మన్ననూ, అద్వైత మన్ననూ ఒకటియే. జీవులు ద్వైతము నుండి నిర్ద్వైతమును చేరుదురు. శ్రీమాతకు నిర్ద్వైతము సహజస్థితి. ద్వైత మామెను చేరలేదు.



# 668. 'ద్వైతవర్జితా'

ద్వైతములను వర్జించునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతకు ద్వైత భావమే లేదు. ఒకప్పుడు ద్వైత భావ ముండి అటుపైన తొలగించుకొనినది అని భావింపరాదు. ఆమె ఏకాకిని భూమరూపా, నిర్ద్వైతా, ద్వైత మామెని చేర లేదని అర్థము గాని, ఆమె తొలగించుకొనినది అను అర్థము సమంజసము కాదు. జీవుల యందు ద్వైత భావ ముండును. భేద భావ ముండును. భేదము అజ్ఞానము వలన ఏర్పడును. గాని అది వాస్తవికము కాదు. సార్వకాలికము కాదు. శ్రీమాతకు భేద బుద్ధి లేదు అని చెప్పుటకు ఈ నామ మీయబడినది. ఆమెకు పక్షపాత బుద్ధి యున్నదని జీవుల కనిపించ వచ్చును. జీవుల యందు పక్షపాత ముండును గనుక అది శ్రీమాతకు కూడ ఆరోపింతురు. సృష్టి నిర్వహణమునకు ఆమె చూపు లీలలు అవగాహన కానపుడు దేవాసురులు కూడ ఆమెకు భేద భావ మున్నట్లు అప్పుడప్పుడు భ్రమ పడుదురు. జీవుల జ్ఞానము నుండి భేదభావము లేర్పడుచున్నవి. దైవమున కవి లేవు అని తెలియవలెను.



# 669. 'అన్నదా'

**అ**న్నము నిచ్చునది శ్రీమాత అని అర్థము.

అన్నము కేవలము మనము భుజించువారి అన్నము మాత్రమే కాదు. భుజింపబడునది అంతయూ అన్నమే. బ్రహ్మమే అన్నము. *"అన్నం బ్రహ్మేతి వ్యజానాత్ ।"* అనునది ఉపనిషద్వాక్యము. అన్నము బ్రహ్మమే అని తెలియవలెను. బ్రహ్మమును అన్నముగ వండి శ్రీమాత జీవులుగ నేర్పరచు చున్నది.

*"దేవా యజ్ఞం తన్వానా అబధ్నన్ పురుషం పశుం ।"* అనునది వేదసూక్తము.

అన్నిటా వసించు బ్రహ్మమును పశువువలె బంధించి దేవతలు యజ్ఞ మాచరించి సృష్టిని నిర్మాణము చేసినారు. ఈ కార్యము శ్రీమాత అధ్యక్షతనే జరిగినది. బ్రహ్మము వలననే జీవులు పుట్టినారు. వివిధ శ్రేణులలో జీవు లేర్పడినారు. వీరందరూ ఒకరికొకరు అన్నము.

ఖనిజములు వృక్షముల కన్నము. వృక్షములు పశువులకు మానవులకు అన్నము. పశువులు మానవుల కన్నము. మానవులు తమ యందలి దేవాసురుల కన్నము. అన్నియూ సూర్యుని కన్నము. సూర్యుడు సవితృనకు అన్నము. ఇట్లు క్రిందిశ్రేణి జీవులు, పై శ్రేణి జీవులకు అన్నమై యున్నారు. అన్ని భూతములు అన్నముపైనే ఆధారపడి యున్నవి. పృథివిని జలములు మ్రింగును. జలములను అగ్ని మ్రింగును. అగ్ని వాయువును మ్రింగ గలదు. అన్నింటినీ ఆకాశము మ్రింగును.

ఇట్లు ఒకదాని కొకటి అన్నమై సృష్టి యందు జీవులు పరస్పరముగ అన్నమై, భోక్తయై యుందురు. తాము భుజించునవి కొన్ని, తమను భుజించునవి కొన్ని. అన్నింటినీ భుజించు వాడు కాలుడు. కాలమును కూడ భుజించునది బ్రహ్మము. ఇట్లు బ్రహ్మమే అన్నము. బ్రహ్మమే భోక్త. సమస్తము బ్రహ్మ యజ్ఞమే. బ్రహ్మమే భోక్త. బ్రహ్మమే హవిస్సు. బ్రహ్మమునకే అంతయూ సమర్పణ మగుచున్నదని భగవద్గీతలో తెలుపబడి యున్నది.

ఇట్టి అన్నమును సృష్టించునది శ్రీమాత కనుక ఆమె 'అన్నదా' అని ప్రసంశింపబడుచున్నది. అన్నము పెట్టునది అమ్మ. అన్నము బ్రహ్మము. భుజించువాడు బ్రహ్మము. భుజింపబడుట వలన అన్నము బ్రహ్మమును చేరును. ఇట్లు బ్రహ్మము నుండి పుట్టిన సమస్తము బ్రహ్మమును చేరును. ఈ యజ్ఞము నిర్వర్తించునది శ్రీమాత.



# 670. 'వసుదా'

**అ**ష్టైశ్వర్యములు ఇచ్చునది అని అర్థము.

జీవులకు కేవలము అన్నమున్న చాలదు కదా! వారికానందము కలుగుటకు సంపదలు కూర్చవలెను. ఈ సంపదలనే సంస్కృతమున ధన మందురు. ధనము వలన సుఖము కలుగును. ధన మనగా మానవు లేర్పరచుకొన్న డబ్బులు కావు. ప్రకృతి ధనము. ప్రకృతి ధనము వలననే జీవులు సుఖముగ వసింతురు. డబ్బు వున్నంత మాత్రమున సుఖముగ వుందురని చెప్పలేము కదా! శరీరమున జీవులు సుఖముగ నుండవలె నన్నచో వలసినది ప్రకృతి ధనము. వశించుటకు శరీరమొక సౌకర్యము. గృహమొక సౌకర్యము. శరీరము కాని గృహముగాని నరకమైనచో వసించలేము కదా! గృహ మెంత విశాల మైననూ సుఖ మిచ్చుట వసించువారి చేతిలో యున్నది. అమరికను బట్టి గృహమున సుఖ ముండును. అమరిక లేకున్నచో గృహము నరకము కాగలదు. తగు మాత్రము సూర్యరశ్మి, నిర్మల వాయువులు చొరని గృహములు వాసయోగ్యములే కావు. ఇంటిలోని అమరిక వసించువారికి సుఖమీయ నపుడు ఎంత డబ్బు వున్న ఏమి లాభము? డబ్బు వున్ననూ సుఖము లేదు. అనగా ధనము లేదు.

గేహము వంటిదే దేహము కూడ. దేహము అనారోగ్యముతో పీడింపబడుచుండగా బాహ్య సంపద లెన్ని వున్ననూ జీవులకు సుఖము లేదు. తగు మాత్రము వేడిమి, ప్రాణవాయువులు లేని దేహము రోగ

గ్రస్తమగు చుండును. ఆలోచనల యందు భేద భావ మున్నప్పుడు సుఖ ముండదు. కోరికలు ధర్మ సమ్మతము కానపుడు సుఖ ముండదు. భాషణమున అసత్యము, అప్రియము చోటు చేసుకొన్నచో సుఖ ముండదు. సంఘమున సత్ప్రవర్తన లేనిచో సుఖ ముండదు. సంఘమున సరియగు ప్రవర్తన ముండనిచో సుఖ ముండదు.

వేదమున అగ్ని ధన మని, వాయువు ధన మని, సూర్యచంద్రులు ధన మని, నిర్వహణ శక్తి యగు ఇంద్రుడు ధన మని, ధర్మానుష్ఠాన బుద్ధి యగు బృహస్పతి ధన మని, ధర్మబలమగు వరుణుడు ధనమని తెలుపబడినది. తగుమాత్రము గాలి పీల్చుట. తగు మాత్రము వేడిమిని సహించుట, ఆత్మ ప్రజ్ఞ యగు సూర్యుని స్మరించుట. అట్లే చైతన్యాత్మక కళయగు చంద్రుని స్మరించుట. కార్యనిర్వహణ శక్తిని పెంచుకొనుట, ధర్మము ననుసరించి నడచు బుద్ధి నలవరచుకొనుట యిత్యాది వన్నియు నిజమగు ధనార్జనము. దీనిని పొందుటకు చేయు ప్రయత్నమున జీవునకు కలుగునది సుఖము. వీనిని విసర్జించి యితర విషయములకై ప్రాకులాడుట దరిద్రము. దీనినే మ్లేచ్ఛ ప్రవృత్తి అందురు. పై తెలిపిన ధనార్జన విద్యను చిన్నతనము నుండి అభ్యసించవలెను. అభ్యసించుచూ శ్రీమాత నారాధించినచో శ్రీమాత వసుధ తత్త్వము కూడ తెలియ గలదు. ఆమె కేవలము అన్నమిచ్చునదే కాదు. సుఖమిచ్చునది కూడ.

సుఖము పొందవలెనని జీవుడు సహజముగ అభిలషించును కాని సుఖమును పొందుటకు వలసిన విద్యను తెలియక దుఃఖములు పొందుచుండును.

# 671. 'వృద్ధా'

**లో**కములను వృద్ధి పరచునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత ప్రధాన గుణము జీవులను వృద్ధి చేయుట. తల్లివలె జీవులు వృద్ధి చెందవలెనని సర్వవిధముల ప్రయత్నించు చుండును. అందరికినీ వృద్ధినే కోరును. జనులు, సుజనులు కావలెనని సుజనులు జ్ఞానులు కావలెనని, జ్ఞానులు తరింపవలెనని ఎప్పుడునూ అభిలషించుచూ నుండును. ఆమె దుష్టులను శిక్షించుటలో వారిని సంస్కరించుటయే ప్రయోజనముగ శిక్షించును. అందరూ తన బిడ్డలే యగుట వలన శిక్షించుచూ, రక్షించుచూ, పోషించుచూ, అనుభవము నేర్పరచుచూ, జీవుల వికాసమునకు అహర్నిశలు తోడ్పడును.

జీవిత సన్నివేశముల యందు కాలము ప్రకృతి రూపమున ఇబ్బందుల నెదుర్కొను జీవులు నేర్వవలసినది ఒకటి యున్నది. తమకు కలుగుచున్న యిబ్బందులు తమ స్వభావము కారణముగనే ఏర్పడుచున్న వని తెలియవలెను. ప్రతి ఒక్కరునూ వారివారి స్వభావమును వారే కాలక్రమమున ఏర్పరచుకొందురు. కొంత తెలిసి యుండుట కొంత తెలియక యుండుట వుండును. తెలియకుండుట వలన పరిమితు లేర్పడును. స్వార్థ చింతన యుండును. ఆత్మస్తుతి, పరనిందగ జీవితము సాగుచుండును. వారి వారి దృష్టిని బట్టి తప్పొప్పులు కనబడుచుండును. గమనించువాని స్వభాములను బట్టి విషయములు తెలియుచుండును. అందు సత్యము అంతంత మాత్రమే. ఇతరులను, యితరములను

గమనించుటతోపాటు తమను తాము కూడ గమనించుకొను చుండవలెను.

తమయందు ఈర్ష్య, అసూయ రాగ ద్వేషములు, కామ క్రోధములు, లోభ మోహములు, మద మాత్సర్యములు, భేద బుద్ధి యిత్యాది వే మాత్ర మున్నవో గమనించుకొని వానిని నిర్మూలించుకొను ప్రయత్నము చేయుచు దాన ధర్మాదులు గావించుచూ శ్రీమాతను ఆరాధించుచూ సాగినచో జీవితమున సంస్కార పరమగు వృద్ధి కలుగు చుండును. ఇట్టి వృద్ధిని కోరువారికి వృద్ధి నందించుటకు శ్రీమాత కాలము రూపమున సంసిద్ధయై యున్నది. కోరనివారికి, తగుమాత్రము అనుభవములు కలిగించుచూ పై తెలిపిన వృద్ధి కోరునంత వరకు వేచి యుండును. తమ వృద్ధికై ఇతరుల వృద్ధికి ఆటంకము ఏర్పరచువారిని కష్ట నష్టములకు గురిచేయు చుండును. ఇట్లు వైవిధ్యమగు రీతిలో అందరి వృద్ధిని కోరునది శ్రీమాత.



# 672. 'బ్రహ్మాత్మైక్యస్వరూపిణీ'

**శి**వ, జీవుల, ఐక్యస్వరూపిణి శ్రీమాత అని అర్థము.

జీవాత్మ, లేక జీవుడు, పరమాత్మ లేక శివుడు, నడుమ సంధాన కర్త చైతన్య స్వరూపిణి యగు శ్రీమాతయే. తాను పరమేశ్వరుడే. అతడే తాను. అట్టి పరాస్థితి నుండి సంకల్ప రూపముగ ప్రకటించుకొని గుణముల నేర్పరచి అటుపై శివాంశలుగ జీవులను ఏర్పరచును. జీవాత్మలు 'అహం' అను భావనలో నుందురు. అనగా నేను అను భావన కలిగి యుందురు. బ్రహ్మము కూడ నేను అను భావముతో ఉండును. నిజమునకు బ్రహ్మమే జీవము. శివుడే జీవుడు. ఇరువురి నామ మొక్కటియే. ఆ నేను నుండియే ఈ నేను ఏర్పడినది. శివ బ్రహ్మము గుణాతీతము. జీవబ్రహ్మము గుణాత్మకము. ఇరువురిని అనుసంధానము చేయునది శ్రీమాత. బ్రహ్మమే తానని జీవునికి తెలియ జేయుటకు జీవుని యందు 'సోహం' శబ్దరూపమున తాను ప్రతిష్ఠింపబడి యుండును. శ్రీమాతయే హంస మంత్రార్థ రూపిణి. సోహం అను మంత్రము రూపమున హృదయమున నిలచి జీవునికి అనునిత్యము బ్రహ్మమే తానని తెలియజేయుచు నుండును. వారిరువురు కలిసి యుండవలెనని అపుడే వైభవమని తెలిసిన శ్రీమాత వారి ఐక్యతకు కృషి చేయుచు నుండును.

స్త్రీకి భర్త ఎంత ముఖ్యమో, కొడుకునూ అంతే ముఖ్యము. తండ్రీ కొడుకులు కలసి యున్నప్పుడు ఆమె పరితృప్తి చెందును. తండ్రి

మాటను కొడుకు లక్ష్యపెట్టనపుడు కొడుకు ననుయించి తండ్రి మాట వినుటకు అత డుద్యుక్తు డగుటకు పాటుపడును. భర్త సముఖమున కొడుకును సమర్థించు చుండును. కొడుకు ననునయించు చుండును. ఇరువురిని కలుపుటకు పడరాని పాట్లు పడుచుండును. తాను భర్తకు దూరము కాలేదు. తననుండి పుట్టిన కొడుకును విడలేదు. వారిరువురు వియోగము చెందినపుడు మిక్కుటముగ బాధపడునది స్త్రీయే. మౌనముగ బాధను భరించుచూ వారిరువురి ఐక్యతకూ కృషి చేయును. సంస్కారవతి యగు స్త్రీ లక్షణ మిది. జగజ్జనని లక్షణమే స్త్రీ యందున్నది. ఆత్మలన్నీ బ్రహ్మములో ఐక్యము చెందవలెనని సృష్టి పరంపరల నేర్పరచుచు అనంతకాలములో తన కృషిని సాగించుచు నుండును. కనుక ఆమె 'బ్రహ్మైక్య స్వరూపిణి.'



# 673. 'బృహతీ'

**బ**హు విస్తారమైనది, గొప్పది శ్రీమాత అని అర్థము.

బృహత్ అనగా చాల విస్తారమైనది. అంతకన్న విస్తారమైనది లేనటువంటి విస్తారము. శ్రీమాత చైతన్య విస్తారమే సృష్టి ఆవరణ. అదియే కురుక్షేత్రము. అందే సమస్త లోకములు ఏర్పడును. అందు లోకపాలకులు, లోకులు ప్రవేశింతురు. సృష్టి యందామెను మించగల వారుండరు. కనుక ఆమె బృహత్.

భగవద్గీతలో భగవంతుడు తాను వేదములలో సామవేదము నని, సామలలో బృహత్ సామ నని వెల్లడించినాడు. సృష్టి కాధారమైన భగవత్ తత్త్వము సృష్టి పరిధిని ఆవరించి యుండును. అంతకన్న మరి ఏదియూ విస్తారము కాదు.

ఛందస్సులలో అతి పెద్దదియైన ఛందస్సును బృహతీ ఛందస్సు అందురు. ఇది ముప్పదియారు అక్షరముల ఛందస్సు. గాయత్రీ ఛందస్సు కన్న కూడ విస్తారమైనది కనుక బృహతీ ఛందస్సు అనిరి. బృహత్తర మగు ఆమె చైతన్య మందు వసించు జీవుల యందు కూడ ఆమెయే నిండి యున్నది. ఆమె లేనిది సృష్టిలో ఏమియు లేదు.



# 674. 'బ్రాహ్మణి'

**ఛాం**దోగ్య ఉపనిషత్తున శివుని ఉద్దేశించి పలుకుచు నీవు దేవతలలో బ్రాహ్మణుడవు అని పేర్కొనిరి. అట్లే భాగవతము నందు కూడ శివుని బ్రాహ్మణునిగ ప్రశంసించిరి. అందువలన దేవి బ్రాహ్మణి అయినది.

శ్రీమాత స్వయముగ బ్రహ్మతత్త్వమై యున్నందున ఆమెయే బ్రాహ్మణి. పతివ్రత లందరూ ఆమెనే ప్రార్థింతురు. ఋషిపత్నులు కూడ బ్రహ్మత్వమునకై ఆమెనే ప్రార్థింతురు. పతుల క్షేమమునకు కూడ సతులు శ్రీమాతను ప్రార్థించు చుందురు.

బ్రాహ్మణి అనగా దివ్యజ్ఞానము. అనగా బ్రహ్మజ్ఞానము. బ్రహ్మ జ్ఞానము కోరువారు తెల్లని పుష్పములతో శ్రీమాత నారాధింతురు. ధరించుట బ్రహ్మోపాసనముచేయు దీక్ష గలవారు తెల్లని వస్త్రములను ధరింతురు. కాషాయము వైరాగ్యమునకు చిహ్నము. శ్వేత వస్త్రధారణ అనగా తెల్లని కాంతివంతమైన శరీరము. దీనిని వజ్ర శరీర మందురు. హనుమంతుడు వజ్ర శరీరధారి. అతడు బ్రహ్మముతో సమానమైన వాడు. నిజమగు బ్రాహ్మణుడు. బ్రాహ్మణులము అనుకొనువారు అందరునూ కూడ పై తెలిపిన శ్వేత కాంతులతో కూడిన శరీరమును పొందవలెను. అది వారి జీవనప్రయోజనమై యుండునది.

ప్రతి మానవునకు మూడు దేహములు ఏకకాలమున ఉండుటకు అవకాశము కలదు. అందరికినీ రక్తమాంసాదులతో కూడిన శరీర మున్నది. అందుండి దివ్యసాధనా కార్యక్రమము ననుసరించి బంగారు

శరీరము పొందవచ్చును. బంగారు కాంతులతో కూడిన శరీరమును కాంచన దేహ మందురు. హనుమంతుడు కాంచన దేహుడు కూడ. బుద్ధిమయ లోకములలో స్థిర నివాస మేర్పరచుకొనినవారి కీ దేహ మేర్పడును. మానవులు సామాన్యముగ మనోమయ లోకములలో నుందురు. మనసుద్వారా ప్రపంచమున పనిచేయునపుడు మనసు కాలుష్యము పొందుచుండును. దాని ననునిత్యము నిర్మూలించుకొను చుండవలెను. అపుడే మనసు నిర్మలముగ నుండగలదు. నిర్మలమైన మనస్సు శుభ్రమైన కాషాయ వస్త్రము వంటిది. అట్టి నిర్మలమైన మనస్సుతో చేయు దైవప్రార్థనవలన బుద్ధిలోక ప్రవేశమున కవకాశ మేర్పడును. మానవప్రజ్ఞ బుద్ధిలోకమున స్థిరనివాస మేర్పరచుకొను నపుడు, మానవప్రజ్ఞకు దేహబంధములు వీడును. పాలనుండి వెన్న తయారైనట్లు, రక్తమాంసాదుల శరీరాదులనుండి బంగారుకాంతి శరీర మేర్పడును. గిన్నెడు పాలలో తేలుచున్న పిడికెడు వెన్నవలె ఆరడుగుల శరీరములో అంగుష్ఠ మాత్రమున బంగారు శరీరము బంధములేక నిలచి యుండును. క్రమముగ పాలనుండి బయటకు తీసిన వెన్నవలె ఈ శరీరముతో జీవుడు వెలుపలకు వచ్చుట, లోపలికి పోవుట చేయ గలుగును. ఈ శరీరము పొందినవారిని చిరంజీవు లందురు.

ఇట్టివారు దేహముననే యుండి బుద్ధిమయ లోకములో వసించుచు దివ్యారాధనలు చేయుచు దివ్యకార్యములు చేయుచు చిర కాలము సాగగా కాంచన శరీరమందు వజ్రకాంతులతో కూడిన మరియొక శరీర మేర్పడును. ఇట్టి శరీరము పొందినవారు వజ్రాంగ బలులు. వజ్రదేహులు. వీరే అనునిత్యము బ్రహ్మమునకు సంధానము చేయు ఉన్నతస్థితి యందుందురు. అట్టివారి గమ్యమే 'బ్రాహ్మణి'..

# 675. 'బ్రాహ్మీ'

**అ**విద్యను మించిన జ్ఞానరూపము కలది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మమునుండి వెలువడునది శ్రీమాత అగుటచే బ్రాహ్మీ అని పిలువబడుచున్నది. శ్రీమాత బ్రహ్మము నుండి సంకల్పముగ నిలబడి చతుర్ముఖ బ్రహ్మను నియమించి, అతనిద్వారా తన సృష్టి సంకల్పమును నిర్వర్తింపజేయును. చతుర్ముఖ బ్రహ్మనుండి తానే వాగ్ రూపమున ప్రవహించును. ఆమె వాగాత్మికయై జ్ఞానరూపమున ప్రవహించు చుండగా సృష్టి యేర్పడు చుండును. ఆమె వాగ్రూపిణి. బ్రహ్మము నందున్నప్పుడు 'పరా'గా యుండును. వెలువడినప్పుడు పశ్యంతి యగును. చతుర్ముఖ బ్రహ్మ నుండి ప్రవహించు నపుడు వాగ్రూపిణి యగును. అటుపైన సృష్టి యేర్పడగా వైఖరిగా నుండును. బ్రాహ్మీ అను శ్రీమాత బ్రహ్మనుండి వెలువడు సృష్టి సంకల్ప ప్రవాహము. బ్రహ్మముతో కూడి యున్నప్పుడు బ్రాహ్మిణిగ యుండును. సంకల్పముగ వెలువడినపుడు బ్రాహ్మీ యగును. బ్రాహ్మీగ ఆమె బ్రహ్మమునకు అతి చేరువలో యుండును. తెల్లవారుజామున మూడు గంటల సమయమును బ్రాహ్మీ ముహూర్త మందురు. బ్రహ్మమునకు చేరువగుటకు అభిలషించు వారు ఈ సమయములో బ్రహ్మోపాసనము చేయుదురు. ఇతరుల కీ సమయ మున గాఢమైన నిద్ర యుండును. బ్రహ్మోపాసన చేయువారికి బ్రాహ్మీ దేవి సహకరించి బ్రహ్మైక్యత కలిగించును.

# 676. 'బ్రహ్మానందా'

నిత్యము బ్రహ్మానందము నందుండునది శ్రీమాత.

శ్రీమాత స్వయముగ తాను బ్రహ్మమే. సృష్టి సంకల్పమున ప్రవేశించి, సృష్టికార్యమును నిర్వర్తించు చున్ననూ, బ్రహ్మమును వీడక యుండును. సృష్టిని బ్రహ్మ కర్మగ నిర్వర్తించును. సృష్టికర్మ నిజమగు బ్రహ్మ కర్మ. సృష్టికర్మ జీవుల హితముకోరి నిర్వర్తింపబడు కర్మ. జీవుల హితము కోరి నిర్వర్తింపబడు ఏ కర్మయైననూ సృష్టికర్మయే. శ్రీకృష్ణుడు దీనినే యజ్ఞార్థ కర్మ అనెను. యజ్ఞార్థ కర్మ యనగా యితరుల హితము కోరి నిర్వర్తించునది.

హితకర్మ యన్ననూ, సృష్టికర్మ యన్ననూ, యజ్ఞార్థకర్మ యన్ననూ బ్రహ్మకర్మ యన్ననూ ఒక్కటియే. హితమును కోరి నిర్వర్తించుట మమ కారపడి నిర్వర్తించుట వంటిది కాదు. ఎచ్చట మమకార ముండునో అచ్చట వికారము కూడ యుండును. రాగ మున్నచోట ద్వేషము తప్పదు. రాగద్వేషములు లేక జీవులకు హితమొనర్చువారు బ్రహ్మ పథమునకు చేరువగుదురు. బ్రహ్మానందమును పొందుదురు.



# 677. 'బలిప్రియా'

**బ**లియందు ప్రియత్వము కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత బలియందాసక్తి కలది. బలినిచ్చినవారిని ఆమె గ్రహించును. బలిని కోరుచుండును కూడ!

బలి యనగా సమర్పణ కార్యము. పశుబలి వేదమున పేర్కొన బడినది. కాని పశువను పదమునకు అర్థము తెలియక జంతువులను బలి యిచ్చు అనాచార మేర్పడినది. బ్రహ్మమే తనను తాను సమర్పణ చేసుకొనుట వలన సృష్టి అవతరించినది. దేవత లతనిని బంధించి అతని తత్త్వము పెట్టుబడిగా యజ్ఞము చేసి సృష్టి నిర్మాణము గావించి నాడు. *"దేవా యత్ యజ్ఞం తన్వానాః, అబధ్నన్ పశుమ్ ।"* అనునది వేద వాక్యము. ఇతరుల హితము కొరకు తమకున్నది, తమను సమర్పణ చేయువారు మరల బ్రహ్మమును పొందగలరు. బ్రహ్మము సృష్టి జీవుల కొరకు తనను సమర్పణ గావించుకొనెను. సృష్టిజీవులు కూడ తమను సమర్పణ గావించుకొనినపుడు బ్రహ్మమును చేరగలరు.

బలిచక్రవర్తి తనకున్నది దానము చేసెను. తద్వారా స్వర్గమును కూడా ఆక్రమించెను. అటుపైన తనను కూడా దానము చేసుకొనెను. బలి దానము సంపూర్ణమైనది. భగవంతుని సాన్నిధ్యమున శాశ్వతమై నిలచినాడు. బలి అను గుణమునకు సృష్టియం దతడే చక్రవర్తి. అతని నామము బలి కాదు. అతని నామము వైరోచనుడు. లోకప్రసిద్ధమైన మరియు అనుపమానమైన సమర్పణను ప్రదర్శించినాడు గనుక బలి యని బిరుదును పొందెను. అసురభావము గలవాడైనను సమర్పణ

మార్గమున అన్నిటినీ అధిగమించి బ్రహ్మమున చేరి శాశ్వత బ్రహ్మానంద పథమున నిలచినాడు.

జీవులు స్వహితమునకై పాటుపడుచూ జనన మరణ చక్రమున తీరుబడిలేక కల్పముల తరబడి జన్మముల నెత్తుచుందురు. పరహితము నందే స్వహిత మున్నదని తెలియక భ్రమ యందు జీవింతురు. ఇతరుల హితము కోరి జీవించుటకు మార్గము చూపుటకే శ్రీమాత 'బలిప్రియ'గ నున్నది.

జీవులు తయ యందలి పశుస్వభావమును శ్రీమాతకు బలి ఈయవలెను. కామక్రోధాది అరిషడ్వర్గములను మమకార అహంకా రాది భావములను బలి ఈయవలెను. తమకు కలిగినదానిలో దాన మిచ్చుట నేర్వవలెను. దానివలన ధర్మాచరణ బుద్ధి కలుగును. క్రమముగా స్వహితమునుండి పరహితమునకు మనసు మరలును. పరహితము స్వభావమున వృద్ధి చెందుచుండగా, తనకున్నది సర్వమును దానముచేయు బుద్ధి పుట్టును. అశ్వమేధము అనగా తనయందలి ప్రాణ ప్రజ్ఞలను యితరుల హితమునకు సమర్పణ చేయుట. సర్వజిత్ యజ్ఞమనగా సర్వమునూ దానము చేయుట. పురుషమేధ మనగా తనను కూడ దానము చేసికొనుట. ఋషులలో ధధీచి, అసురులలో బలి, మానవులలో హరిశ్చంద్రుడు, ఈ యుగమున ఏసుక్రీస్తు, ద్వాపర మున పరాశర మహర్షి, పురుషమేధ యజ్ఞమును గావించి బ్రహ్మానంద పదవి పొందిరి. సమర్పణ మార్గమున ధీమంతులు సులభముగ బ్రహ్మమును చేరుదురు. దానినే బలి యందురు. అట్టి బలిమార్గము శ్రీమాత కత్యంత ప్రియకరము. కావున 'బలిప్రియ.'

# 678. 'భాషారూపా'

శ్రీమాత భాషల రూపమున నుండునని అర్థము.

భాషణములకు భాష ఆధారము. భాష మానవులకే పరిమితము. దేవతలు భావనతో పనిచేయుదురు. అది మధ్యమావాక్కు. ఋషులు పశ్యంతీవాక్కుతోనే పనిచేయుదురు. వారి వైఖరితోనే సమస్త కార్యములు సాధించుకొనుచుందురు.

భాషలలో అత్యంత ప్రధానమైనది సంస్కృతభాష. దానిని శ్రద్ధగా పఠించువారు, భాషించువారు, భాషణమునకు వినియోగించువారు సంస్కరింపబడుట జరుగును. సంస్కృత మనగా సంస్కరింపబడిన భాష. ఉచ్చారణద్వారా, తమను తాము సంస్కరించుకొనుట ప్రాచీన కాలము నుండి ఒక మార్గముగ వెలసి యున్నది. వేదాంగములలో శిక్ష యను అంగము ఉచ్చారణయందు శిక్షణ యిచ్చును. శబ్దోచ్చారణ తదనుగుణమైన రససిద్ధిని కలిగించుకొను చుండును. ఆ రసాయనము కారణముగ స్వభావములో చక్కని మార్పులు పొందవచ్చును. శబ్దమును బీజాక్షరములుగను, మంత్రములుగను, సూక్తములుగను, స్తోత్రములు గను ఋషులు ఏర్పరచిరి. వీనిని అనునిత్యము శ్రద్ధాభక్తులతో కనీసము ఒక గంటసేపు ఉచ్చరించినచో విశుద్ధి యందలి ప్రజ్ఞా స్వభావమును శుద్ధి చేయగలదు. దేహధాతువులను కూడా శుద్ధి చేయగలదు. విశుద్ధి యనగా విశిష్టమైన శుద్ధి నందించునది. అట్టి శుద్ధి ఉచ్చారణము ద్వారా కలుగును. మలినోచ్చారణము ద్వారా స్వభావము, దేహము

మలినమగు చుండును. పరనింద పరమ మలినాత్మకము. ఆత్మస్తుతి కూడ అట్టిదే. ఆత్మస్తుతి వలన గర్వము పెరుగును. పరనిందవలన ఈర్ష్య, అసూయ, ద్వేషము యిత్యాదులు బలపడును. దేవతా సూక్తము లను, స్తోత్రములను ఆలాపించుట ద్వారా మలినములను నిర్మూలించు కొనవచ్చును. సూక్తములు, స్తోత్రములు శుద్ధిచేయు ప్రభావము గలవి. అవి ఋషిప్రోక్తములు. ఇతర భాషలలో చేయు ప్రార్థనలకు భాషా ప్రాధాన్యత సంస్కృతముతో పోల్చినపుడు తక్కువగ నుండును. భావ ప్రాధాన్యత వానికి ఉండవచ్చును.

సత్యభాషణము, ప్రియభాషణము, సత్యభాషణము జీవ తత్త్వమును యోగస్థితి యందుంచును. యోగస్థితి యనగా స్వస్థతతో యుండుట. స్వస్థత యనగా తనయందు తానుండుట. అట్టి స్వస్థత భాషావినియోగము సరిగ లేనపుడు చెదరుచుండును. స్వస్థతనుండి ప్రజ్ఞ పలుమారులు చెదరినచో అస్వస్థత కలుగును. అపుడు మనసు, యింద్రియములు, శరీరము కల్లోలితము లగును. భాషణము ద్వారా సామ్రాజ్యములు చక్కబెట్టిన వారున్నారు. అట్లే భాషణము ద్వారా ఘోర యుద్ధములు జరిగినవి. భాషాజ్ఞానము కలవాడు, ఆయుధధారి కన్న గొప్పవాడు. భాష యందంతటి శక్తి యున్నది. దీనిని సాధారణ ముగ ఎవ్వరునూ గుర్తింపరు. భాషారూపముగ నున్న శ్రీమాతను, శ్రీమాత భక్తులు జ్ఞప్తి యందుంచుకొనవలెను, భాషణము విషయమున బాధ్యత పడియుండవలెను.

సంస్కృత భాష నుండియే అన్ని మానవ భాషలు పుట్టినవి. అన్నిభాషల యందు కూడ పై తెలిపిన నియమములను పాటింపవచ్చును.

కాని ఉచ్ఛారణ ద్వారా తమను తాము సంస్కరించ పూనుకొనువారు, సంస్కృత మందలి సూక్తములను, స్తోత్రములను ఆశ్రయించుట తప్పదు. ఉదాహరణకు ఈ వివరింపబడుచున్న లలితా సహస్రనామ స్తోత్రమును నిత్యము శ్రద్ధాభక్తులతో పఠించువారిని సంస్కరించి, ఉద్ధరించి, బ్రహ్మమును చేర్చును. ఇది సత్యము.

భాషారూపిణియైన శ్రీమాత మనయందు జిహ్వాగ్రమున యుండును. కంఠమునుండి జిహ్వాగ్రము వరకు ఉన్న శరీర భాగమును పరిశుభ్రముగ నుంచుకొనుట, పరిశుద్ధముగ వినియోగించుట సాధకుల కర్తవ్యము. అట్టి సాధన జరుగుచున్నవారినుండి అశ్లీల మగు భాషణ ములు వెలువడవు. వాతావరణమును, తమను మలినము గావించు భాషణములు వెలువడవు. వారి జిహ్వాగ్రమున భాషారూపిణి యగు శ్రీమాత నివాస స్థానము యేర్పరచుకొనును.



# 679. 'బృహత్సేనా'

**బృ**హత్తర మగు భాషాసేనలు గలది శ్రీమాత అని అర్థము.

భాషణము, భావమును ప్రకటించు ప్రక్రియ, దానికొరకై భాష లేర్పడినవి. ప్రపంచమున ఎన్ని భాష లున్నవో ఎవ్వరికినీ తెలియదు. తామర తంపరగ భాషలు ఒకదానినుండి ఒకటి ఉద్భవించినవి. విస్తారమై యున్నది. బ్రహ్మమువలె భాషలు కూడా విస్తారముగ అవత రించినవి. విస్తారమైన సేనలుగ రూపొందినవి. ఇవియే బృహత్సేనలు. భాషారూపిణి యొక్క బృహత్సేనలు.

ఒక భావమును ప్రకటించుటకు అనేకానేక భాషా పదము లున్నవి. ఇట్లు సేనలు, సేనలుగ భాషారూపిణి యగు సరస్వతి విస్తార ముగ వ్యాప్తి చెందినది. సరస్వతీదేవికి ఇట్టి అనూహ్యమగు సైన్య మున్నదని సామాన్యముగ గ్రహింపునకు రాదు. ఈ సైన్యముద్వారా మానవజాతి తమ తమ కార్యములను సిద్ధించుకొనుచున్నది.



# 680. 'భావాభావవివర్జితా'

**భా**వములను అభావములను మించినది శ్రీమాత అని అర్థము.

సృష్టియందు జీవులకు భావములు, అభావములు కలుగు చుండును. త్రిగుణములు కారణముగ భావాభావము లుండును. సత్వ గుణము అధిష్టించి యుండగా యేర్పడు భావములు జీవునికి మార్గ దర్శకము వహించి వృద్ధి కలిగించును. రజోగుణము తమోగుణము అధిష్టించి యుండగా కలుగునవి అభావములు. అభావముల కారణ ముగ లేనిది ఉన్నట్లు తోచును. ఉన్నది లేనట్లు తోచును. ఉన్న సత్యము కాక తమ అభిప్రాయములే తమకు దర్శన మిచ్చును. అభావములు కారణముగానే అపోహ కలుగుట, పొరపాటు పడుట, ఈర్ష్యపడుట, కోపించుట, ద్వేషించుట, తొందరపడుట యిత్యాదివి జరుగును. రావణ కుంభకర్ణాదులు, దుర్యోధనాది చతుష్టయము చేసిన కార్యము లన్నియూ అభావములపై ఆధారపడినవే. వాలి దుందుభితో బిలమున యుద్ధము చేయుచుండగా సుగ్రీవునికి భయము కలిగి వాలి మరణించెనని అపోహ పడి రాజ్యాభిషిక్తు డయ్యెను. కష్టములు కొనితెచ్చుకొనెను. విశ్వామిత్రుడు రాముని తన యాగరక్షణార్థము పిలువగ దశరథుడు, మమకారమున యిచ్చిన మాటను ఉపసంహరించ బూనెను. విభీషణుడు ధర్మ విషయ మును స్పష్టముగ తెలుపగా రజోగుణము వలన రావణు డంగీకరించ లేదు. రాముని బలమును గూర్చి మారీచుడు తెలిపినమా రావణు డంగీకరింపలేదు. రాముని ఔన్నత్యము తెలియక కైకేయి భరతునికి రాజ్యము కోరినది. ఇట్లు ఎన్ని ఉదంతము లైనను చెప్పవచ్చును.

రజస్తమస్సులు కారణముగ అహంకార మమకారాదులలో జీవులు చిక్కుకొని వాస్తవము కాని భావములలో తిరుగాడు చుందురు. ఉన్నది గోచరించదు, లేనిది ఉన్నట్లుగ గోచరించును. ఇట్టి అభావముల పరంపరలో అజ్ఞానమున జీవు డుండగ దానికి జ్ఞాన సముపార్జనము పరిష్కార మగును. చీకటిలో త్రాడును చూచి పాము అని భ్రమపడుట, ఋణబాధితుని యింటి తలుపు తట్టినపుడు ఋణదాత యేమో అని భయపడుట, పోలీసును చూచి తన కొరకే వచ్చుచున్నాడని దొంగ భయపడుట యిత్యాది వన్నియు అభావములే. దీపము వెలిగించినపుడు పాము కాదు త్రాడే అని తెలిసినట్లు, జ్ఞానము కలిగినపుడే దురభి ప్రాయములు తొలగును. అభావములు వదలిపెట్టును. అజ్ఞానులకు అభావములు ఎట్లో జ్ఞానులకు భావము లట్లు కలుగుచుండును. భావములు తమయందలి శక్తి ఆధారముగా కర్మాచరణమునకు జ్ఞానులను నడిపించును. అట్లు ఆత్మశక్తి కర్మల యందు నిమగ్నమై యుండును. ఇది అంతయూ భావస్థితి. భావములే కలుగని స్థితి యున్నది. ఆ స్థితిలో ఆత్మ పరమాత్మతో కూడి యుండును. ఆత్మ పరమాత్మతో కూడి యున్నపుడు సంకల్పము లేని యోగస్థితి లభ్య మగును. ఆత్మ సంకల్పశక్తితో కూడి యున్నప్పుడు భావపరంపరలు కలిగి కర్మాచరణమునకు వుసి గొలుపును.

అజ్ఞానులు జ్ఞానులు కూడ సంకల్ప శక్తికి లోనై ఉండువారే. శ్రీమాత సంకల్పములకు పుట్టుక స్థానము కనుక ఆమె సంకల్పించునే గాని సంకల్పమునకు ఆమె కన్న పైచేయి ఉండదు. "సంకల్పములు

సన్యసించినవాడే యోగి” యని శ్రీకృష్ణుడు భగవద్గీతలో పలికినాడు. ఆ నిజమగు యోగులు భావవర్జితులు. వారికి శ్రీమాత ఆదర్శము.

అభావము నుండి భావమునకు, భావము నుండి భావాతీతస్థితికి గల సోపాన క్రమమును యోగ సాధన ద్వారా గాని, భక్తిమార్గమున గాని క్రమపద్ధతిలో పొందవచ్చును. అట్లు పొందుటకు శ్రీమాత అనుగ్రహము ప్రధానము. శ్రీమాత భక్తులు యోగులు. సతతము పరముతో యోగము చెంది యుందురు. శ్రీమాత సంకల్పముగ దివ్య కార్యముల నొనర్చుటకు భావములలోనికి దిగి వచ్చిననూ కార్యముల నొనర్చుట భావములలోనికి దిగివచ్చిననూ కార్యము ముగిసిన పిదప మరల యోగస్థితి యందు స్థిరపడుదురు. పరమాత్మతో కూడి యుండుట వారి సహజస్థితి. శ్రీమాత సంకల్పము అట్టివారిచే దివ్యకార్యములను నిర్వర్తింపజేయుచు నుండును.

అభిప్రాయములలో జీవించువారు యితరుల మంచిచెడ్డలను గూర్చి భావించుచూ అభావమున పడి యున్నారు. అట్టివారు కర్తవ్య నిమగ్నులు కావలెను. సతతతము చేయవలసిన పనియందు నిమగ్నమై పడియుండవలెను. అపుడు అభిప్రాయములు దరిచేరవు. ఇతరుల గూర్చిన విషయాసక్తి తగ్గును. జ్ఞానము నుసాసించుట కిచ్ఛ కలుగును. అటుపైన భావములోనుండి మోక్షము కూడ కలుగును.



# 681. 'సుఖారాధ్యా'

సుఖముగ ఆరాధింపతగినది శ్రీమాత అని అర్థము.

ముందు నామమున అభావములను, భావములను దాటిన స్థితి తెలుపబడినది. ఇట్టి స్థితి యందున్నవారుచేయు ఆరాధనము సుఖారాధనము. వారికి భగవదారాధనము అమితానందకరముగ నుండును. అదియే సర్వస్వ మనిపించును. ఇతరులను గూర్చిన అభిప్రాయములను గాని, యితర విషయములందు గాని ఆసక్తి లేకపోవుట, దైవముపైననే ఆసక్తి ఉండుట కారణముగ వారు అత్యంత సుఖముతో ఆరాధన చేయుదురు. సుఖము కొరకు ఆరాధన చేయుట వేరు. సుఖముగా ఆరాధన చేయుట వేరు. సుఖముగా ఆరాధన చేయువారు అన్యచింతనలు లేక ఉందురు. వారి కంతట, అన్నిట అనన్యత్వమే గోచరించును. సతత దైవచింతన యుండును. నిత్యము దైవముతో అభియుక్తులై యుందురు. ఇట్టివారు అరుదు. మీరాబాయి, సూరదాసు, కబీరు, రామదాసు ఈ కోవలోనివారు. హనుమంతుడు, నారదుడు, తుంబురుడు, ఉత్తమశ్రేణి సుఖారాధ్యులు.

సామాన్య జీవులు కూడ శ్రీమాతను సుఖముగ ఆరాధించుట నేర్వవలెను. భక్తి ప్రధానముగ క్లుప్తముగ ఆరాధన నిత్యము గావించు చున్నచో సుఖముగ నుండును. పరులను చూచి రజోగుణదోషముచే విస్తారముగ ఆరాధించుట తగనిపని. శ్రమ పెరిగిన భక్తి తగ్గగలదు. భక్తి పెరిగిన శ్రమ అనిపించదు. పొరుగింటివారు నవావరణ పూజలు

చేయుచున్నారని, కలశముపెట్టి చేయుచున్నారని, నిత్యము సహస్రనామ కుంకుమార్చన చేయుచున్నారని అట్లే మనము కూడ చేయవలెనని భావించుట రజోగుణ ప్రవృత్తి. తమకున్న పరిస్థితికి భక్తిలోపము లేకుండా సుఖముగ నిత్యము ఆరాధించుట ప్రధానము. సుఖము నిచ్చు శ్రీమాతను ఆరాధించుటలో సుఖమును కోల్పోవరాదు. సరాసరి అవ్యక్త ఆరాధన చేయవలెనని భావించుట యంత్ర తంత్ర మంత్రాదులతో చేయవలెనని భావించుట వర్జనీయము. అట్లే శ్రీమాత ఉగ్ర రూపమును కూడ ఆరాధించరాదు. ప్రశాంతమగు మూర్తినే ఆరాధింపవలెను. శరీరము సహకరించని పరిస్థితులలో అంతరంగమున నిత్యమూ మానసపూజ గావించుకొనవచ్చును. వృద్ధాప్యమున మానసపూజయే సుఖము నీయగలదు.



# 682. 'శుభకరీ'

భక్తులకు శుభమును కలిగించునది శ్రీమాత అని అర్థము.

తన నారాధన చేయు భక్తుల యందు శుభసంకల్పములు కలిగించి వారిచే శుభకార్యములు చేయించి తద్వారా శుభవాసనలను భక్తులయందు స్థిరపరచి సుఖము నిచ్చునది శ్రీమాత. ఆరాధన చేయు భక్తులకు పూజాసమయమునగాని, యితర సమయములలోగాని, సత్కార్యములను గూర్చిన సంకల్పములు తప్పక కలుగును. దానధర్మాది భావములు, సహాయ సహకారాది భావములు కలుగుచుండును. వానిని ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించుట ఆరాధకుల కర్తవ్యము. సత్సంకల్పములను అప్రమత్తతో గుర్తించుట, జ్ఞప్తియం దుంచుకొనుట, వ్రాసుకొనుట చేయవలెను. అందులకే డైరీలు. వీలున్నంత త్వరితగతిని వాటిని అమలు చేయుటకు ప్రయత్నింపవలెను. అట్లు కానిచో కలిగిన సత్సంకల్పములు మరచుట జరుగును. సత్సంకల్పములను వెంటనే అమలు చేయవలెనుగాని వాయిదా వేయరాదు. వాయిదా వేసినచో సత్యన్నారాయణ వ్రతకల్పములోని వైశ్యుని జీవితమువలె ఒడుదుడుకు లకు లోనగుట జరుగును. శుభసంకల్పము పై తెలిపిన దానధర్మాది విషయములలో మరియు సహాయ సహకారాది విషయములలో అప్రమత్తతతో నిర్వర్తించుట ఆరాధకునికి శుభము కలిగించును. నిజము నకు ఆరాధకులకు శుభము కలిగించవలెననెడి ఆరాటముతో శ్రీమాత యిట్టి సంకల్ప తరంగములను చోటులో వ్యాప్తి చేయుచు నుండును.

అందుకొని ఆచరించినవారికి అశుభములు తొలగుట, శుభములు కలుగుట తథ్యము.

రావణుడు బ్రాహ్మణుడు, సదాచార సంపన్నుడు. శివభక్తులలో ఉత్తమశ్రేణికి చెందినవాడు. అతనికి స్త్రీ వ్యామోహము ఒక దుర్బలత్వమై నిలచినది. వలదని హితులు తెలిపిననూ పెడచెవినపెట్టి సీతమ్మను లంకకు కొనివచ్చెను. ఒకానొక శుభఘడియలలో లంకకు చేటు తెచ్చు కొనుటకన్న సీతమ్మను వదలుటయే మంచిదని భావించెను. కాని బలహీనతవల్ల దానిని నిర్వర్తింపలేకపోయెను. మరణసమయమున రాముని ఆజ్ఞమేరకు లక్ష్మణుడు రావణుని వద్ద కేతెంచి అనేక పాలనా ధర్మములను నేర్చెను. అన్నిటికన్న ఉత్తమోత్తమ ధర్మ మేదని లక్ష్మణు డడుగగా "శుభసంకల్పములను వెనువెంటనే ఆచరింపవలెను. ఆలస్యము చేయరాదు. అశుభ సంకల్పములను స్వభావ మెంత ప్రోత్సహించు చున్నప్పటికిని వాయిదా వేయుచు నుండవలెను. ఈ విషయమున అప్రమత్తుడవై యుండుము" అని పలికెను.

సాధకుల యందు శుభాశుభ సంకల్పములు జమిలిగ యుండును. అందు శుభసంకల్పములకే దీక్షతో కార్యాచరణ పథకమును యేర్పరచుకొని నిర్వర్తింపవలెను. ఇందుల కారాధన బలము కూర్చును. అట్లు నిర్వర్తించుట ద్వారా సర్వశుభములను పొందవచ్చును. భక్తులచే విశేష మగు పుణ్యకార్యములను చేయించుచూ శ్రీమాత శుభపరంపరలు కలిగించు చుండును. ఇది ఆమె చేయు ప్రధాన కార్యములలో నొకటి.

# 683. 'శోభనాసులభాగతిః'

**మో**క్షము పొందుటకు శ్రీమాత సులభమైన మార్గమని అర్థము.

అమ్మద్వారా తండ్రిని మెప్పించుట, తండ్రి అనుగ్రహమును పొందుట సులభము. నాన్నకు తెలుపలేనివి, అమ్మదరిచేరి తెలుపుకొనుట, అమ్మ మద్దతుతో నాన్నను సుముఖము చేసుకొనుట పిల్లల పని.

జీవు లందరూ శ్రీమాత సంతతియే. ఆమె కారుణ్యమూర్తి. ప్రేమమూర్తి అగుట వలన జీవుల కష్టనష్టములను గుర్తించి లోటు పాటులను సర్ది అవసరమగుచో జగత్పితవద్ద జీవులను సమర్థించును. సమర్థించుట తల్లి నిపుణత. అట్లు ఆరాధకులను శ్రీమాత తానుగ చక్కదిద్ది తండ్రివద్దకు గొనిపోయి అనుగ్రహించవలసినదిగా సమర్థించును. శ్రీమాత సమర్థన ఆధారముగ శివు డనుగ్రహింపగలడు.

శివుని మెప్పించుట సులభము కాదు. అట్టి మహత్తరమగు కార్యము శ్రీమాతకే చెల్లును. బాలగణపతిని సమర్థించి శివుని ఆగ్రహము ననుగ్రహముగ మార్చిన తల్లికి జీవులను సమర్థించి శివానుగ్రహ మేర్పరచు టెంత పని? శివుని పొందుటకు అనేకానేక కష్టనష్టములు జీవులు పడుచుందురు. కఠినమైన దీక్షలను చేపట్టుదురు. దేహమును శుష్కించుకొనుచు తపస్సులు చేయుదురు. నిరాహారులై పంచ భూతములను, పంచేంద్రియములను, ప్రాణములను కూడ లెక్కచేయక శివుని కొరకు తపస్సులు చేసిన వారున్నారు. అందు సిద్ధిని పొందివారు కొందరే. వారి మార్గము సులభము కాదు. శోభనము

కాదు. చక్కని క్షేమకరము, శుభంకరము, శోభనకరము, వైభవోపేతము అగు మార్గ ముండగా, దానిని కాదని అహంకారులు, మూఢులు క్రొత్త పుంతలు త్రొక్కుచు నుందురు. శుభమగు మార్గమును వదలి అరణ్య మార్గమును పట్టుదురు. ఇట్టివారిని పాషండు లందురు. పాషండ మార్గమున కూడ భగవంతుని చేరవచ్చును కాని మార్గమంతయు అపాయములతో కూడి యుండును. శ్రమపడి గమ్యము చేరుటగ యుండును. కాని శ్రీమాత నారాధించు వారికి మార్గము సులభము మరియు శోభనము కూడ.

రామకృష్ణాది అవతారములలో దైవము సులభము, శుభకరము, శోభనము అగు మార్గమును అందించినాడు. సదాచారమును, సరళ ఆచారమును తెలిపినాడు. గృహస్థ ధర్మము మోక్షమున కడ్డు రాదని ఆచరించి చూపినాడు. సంఘమున వృత్తి వ్యాపారములు కూడ మోక్షమున కంతరాయము కావని తెలిపినాడు. మహర్షు లందరునూ వివాహితులే. గృహస్థ ధర్మమును స్వీకరించినవారే. స్వధర్మమున నిలచి, సంఘసేవ చేసినవారే. సంతానమును బడసినవారే. అన్నిట అంతర్యామి దైవమును దర్శించుచూ పూజించుచూ అంతర్యామిని చేరినవారు మహర్షులు. వారిది నిరాకరణ మార్గము కాదు. వారిది శ్రీమాత మార్గము. అన్నిటా, అంతటా ప్రకృతి పురుషుల వైభవమును దర్శించుచూ వారిని ఆరాధించుచూ జీవించినవారు. ఇట్లు శ్రీమాత అందించు మార్గము సులభము, శోభనము, వైభవోపేతము కూడ.

# 684. 'రాజరాజేశ్వరీ'

దేవతలకు రాజులకు త్రిమూర్తులకు కూడ ఈశ్వరి అని అర్థము.

ఈ నామమున కంతగ వివరణము అవసరము లేదు. శ్రీమాత సర్వేశ్వరి. సర్వమునకు ఈశ్వరి గనుక ఇక వివరింపవలసని దేమియు ఉండదు. తనపైన, తన సృష్టిపైన స్వామిత్వము కలిగి యున్నది శ్రీమాత. తానీశ్వరి, శివుడు ఈశ్వరుడు. ఇక యితరము లన్నియూ వారినుండి ఏర్పడినవే. ఏర్పడిన వాటి అన్నిటియందు వారిరువురే నిండి యున్నారు. ఇక రాజుల గూర్చి వేరుగ చెప్పుట కేమున్నది? త్రిమూర్తులే ఆమె వలన ఏర్పడినారు. విశ్వేదేవతలు అంతరిక్ష దేవతలు, దిక్పాలకులు, వీరు, వారు అననేల? అన్నిరూపముల యందు వారే నిండి యున్నారు. అన్నిటిగ వారే యున్నారు. నిజమునకు పరమేశ్వరి, పరమేశ్వరుడు అని యిరువురు లేరు. ఉన్నది ఒక్కటియే. ఒక్కటియే యిన్ని అయినది. ఇన్నిటిగను ఒక్కటియే యున్నది. చీమలో బ్రహ్మలో మాత్రమే గాక చీమగా బ్రహ్మగా కూడ ఆ తత్త్వమే ఉన్నది. అదియే ఈశ్వర తత్త్వము. ఈశ్వరత్వము చెందినవారికి కూడ ఈశ్వరియై యున్నది.



# 685. 'రాజ్యదాయినీ'

**రా**జ్యము నిచ్చునది శ్రీదేవి అని అర్థము.

దేహము, కుటుంబము, సంఘము, రాష్ట్రము, దేశము, భూగోళము, సూర్య మండలము, సవితృ మండలము, భర్గోదేవ మండలము, ఇవి అన్నియూ పరిపాలింపబడు క్షేత్రములు. వాటిపై ఆధిపత్యము జీవుల కిచ్చునది శ్రీమాత. శ్రీమాత అనుగ్రహము లేనిదే ఎవ్వరికినీ దేనిపైననూ ఆధిపత్యము లభింపదు. ఆమె అనుగ్రహ మున్నచో స్వర్గాధిపత్యము కూడ లభింపగలదు. బ్రహ్మ, విష్ణు, రుద్రులు శ్రీమాత అనుగ్రహము వలననే సత్యలోకము, వైకుంఠము, కైలాసము లకు అధిపతులై నిలచినారు. అమ్మ అనుగ్రహము లేనిచో ఎట్టి ఆధిపత్య ముండదు.

దేహముపై స్వామిత్వము గలవా రరుదు. స్వభావముపై ఆధిపత్యము కలవారింకనూ అరుదు. అహంకారముపై ఆధిపత్యము కోటిమందిలో ఒకరి కుండు నేమో! అన్నింటిపైన ఆధిపత్యము కలది శ్రీమాత. ఆమె అనుగ్రహ మున్నచో ఆమె ప్రసాదముగ జీవునికి అన్ని క్షేత్రములపై క్రమముగ ఆధిపత్యము లభించును. ఆమె సర్వరాజ్య దాయిని.



# 686. 'రాజ్యవల్లభా'

రాజ్యములు ప్రియముగా గలది శ్రీమాత అని అర్థము.

విశ్వము నుండి, చీమ దోమ దేహముల వరకు, అన్ని క్షేత్రములను (రాజ్యములను) ఎంతో ప్రీతితో శ్రీమాత ఏర్పరచును. అందు జీవులను ప్రవేశపెట్టును. మహత్తరమైన విషయములనుండి క్రిమి కీటకాదులవరకు క్షేత్రముల నేర్పరచిన తీరు అత్యాశ్చర్యకరముగ నుండును. ప్రీతిలేనిచో ఎవ్వరునూ తీరుగ పనిచేయరు. శ్రీమాతకు రూపములు సృష్టిచేయుటలో గల ప్రీతిని సంపూర్ణముగ ఎవ్వరునూ ప్రశంసింపలేరు. ఉదాహరణకు ఒక నెమలిని చూచిననూ, అడవిలో పూచిన పువ్వులను చూచిననూ వాటి రూపము, వర్ణము, అందులోని వివరములు అమితాశ్చర్యము కలిగింపక మానవు. శరీర జీవులకు శరీరములు, గ్రహదేవతలకు గోళములు, ఆదిత్యులకు సూర్య మండలములు యేర్పరచుటలో శ్రీమాత ప్రీతి వర్ణింపనలవికానిది. వర్ణింపనలవికాని సృష్టిలో అతి చిన్న రూపమునుండి విశ్వరూపము వరకు నిర్మాణము చేయబడు రూపములలో ఆమెకు గల దివ్యకాంక్ష చెప్పుటకు మాటలు చాలవు.



# 687. 'రాజత్కృపా'

దయతో ప్రకాశించునది శ్రీమాత అని అర్థము.

రాజత్కృప అనగా శోభాయమానముగా కృపతో ప్రకాశించుట. ఇన్ని జీవులయందు శ్రీమాత చైతన్యమే కృపతో ప్రకాశించును. ఆమె కృప యున్నచోట ప్రకాశము యొక్క హెచ్చుతగ్గులు గోచరించు చుండును. లోకహితమునకై జీవించువారి యందు అమితముగ ప్రకాశించును. ఇతరుల యందు అంతంత మాత్రముగ ప్రకాశించును. కాళిదాసు యందు కృపతో ప్రకాశించుటచే అతడు అనుపమానమగు కవి అయ్యెను. జ్ఞాని అయ్యెను. వేదవ్యాసునితో సరిసమానమగు కీర్తిని పొందెను.

శ్రీమాత ఎవరియందు కృప కలిగి యుండునో వారు తమ శక్తి సామర్థ్యములకన్న ఎక్కువగ ప్రకాశింతురు. పామరుడు పండితుడు కాగలడు. అసమర్థుడు సమర్థుడు కాగలడు. మూగవాడు మాటాడ గలడు. గొడ్రాలు బిడ్డలను కనగలదు. శ్రీమాత కృప అట్లు జీవుల నుండి ప్రకాశించుటచే ఆ యా జీవులు విశేషమగు కార్యములు చేయగలరు. ఆమె విద్యాశక్తి, జ్ఞానశక్తి అగుటచే యే రూపమున ప్రవేశించిన ఆ రూపము శోభాయమానముగ ప్రకాశించును. శ్రీమాత నారాధించువాడు ఆమెను తనలోనికి ఆహ్వానించుట ఆర్ద్రతతో నిర్వర్తించ వలెను. ఆవాహనము చేసి తన యందెల్లడల నిండి యున్నట్లు భావించి స్థాపించుకొనవలెను. అట్లు స్థాపించి పూజించుకొనవలెను. అపుడు ఆరాధకుని చూపుల నుండి, మాటల నుండి, చేతల నుండి, హాసము నుండి, స్పర్శ నుండి ఆమెయే యితరులను స్పృశించును. అట్లు జరిగి నపుడే శ్రీమాత కృప తననుండి విరజల్లుకొనుచున్నట్లు తెలియును. అట్టి ఆరాధకునికి అమితానందస్థితి కలుగును.

# 688. 'రాజపీఠ నివేశిత నిజాశ్రితా'

**త**న ఆశ్రితులను రాజపీఠమున కూర్చుండబెట్టునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత అనుగ్రహము కలిగినవారే రాజముద్ర అధికారము కలిగి యుందురు. రాజముద్రాధికారము శ్రీమాత అనుగ్రహమని తెలియవలెను. ముద్ర బిళ్ళ ధరించిన బంట్రోతునుండి ప్రధానమంత్రి వరకు గల రాజాధికారము భారతీయులకు విదితమే. బిళ్ళబంట్రోతును చూచిన వెంటనే సామాన్యులు రాజును చూచినంత అప్రమత్తు లగుదురు. రాజపీఠముల నన్నింటినీ శ్రీమాత ఆవరించి యుండును. ఆ పీఠము లన్నియూ పాలనాధికారముతో విరాజిల్లు చుండును. వాటి యందు కూర్చొనుట కందరూ తహతహ లాడుచుందురు. కాని కొందరే స్థిరముగ, స్థిమితముగ దీర్ఘకాలము ఆసీనులు కాగలరు. రాజపీఠము నెక్కుట యనగా పులివీపున కూర్చుండుట. పీఠము నాశ్రయించి మహత్తరమగు శక్తు లుండును. అవి రకరకముల ఆకర్షణలుగ పీఠము నెక్కినవానిని ఆకర్షించును. ఆకర్షణకు లోనైపుడెల్ల పీఠమునుండి బహిష్కరింపబడు చుండును. తాత్కాలికముగ వెలిగి ఆరిపోయిన దీపములవలె ఎందరో అధికార పీఠములనెక్కి భ్రమలకు లోనై పతనము చెందిరి. కొందరే రాణించిరి.

భోజరాజు సింహాసనమును అధిరోహించు విక్రమాదిత్యుని సాల భంజికలు అనేకానేక పరీక్షలకు గురిచేసిరి. విక్రమాదిత్యుడు కాళీ

భక్తుడు. గనుక భోజరాజు సింహాసనము నధిష్ఠింపగలిగెను. అమ్మ భక్తులే రాజపీఠమున ప్రకాశింపగలరు. ఇతరులు కించిత్ పూర్వ పుణ్య కారణమున అధిష్ఠించిననూ ప్రలోభములకు దాసులై పతనము చెందుట, మరణము పొందుట కూడ జరుగును. రాజయోగులగువారు మాత్రమే రాజపీఠము నలంకరించి శాశ్వతకీర్తి ప్రతిష్ఠలను పొందగలరు. ప్రజలలో వారే చిరస్మరణీయు లగుదురు.

యోగులు, సద్గురువులు శుద్ధచైతన్యముతో శాశ్వత సన్నిహిత సంబంధము కలవారై యుండుటవలన వారు జీవుల హృదయపీఠముల యందు, చిరకాలము తిష్ఠవైచి శ్రీమాత అనుచరులై జీవుల నుద్ధరింతురు. వారు నిజమైన శ్రీమాత ఆశ్రితులు. వారు అలంకరించు పీఠములు రాజపీఠములే.



# 689. 'రాజ్యలక్ష్మి'

**రా**జ్యముల నాశ్రయించి లక్ష్మి యున్నది. అట్టి లక్ష్మి శ్రీమాతయే అని అర్థము.

రాజ్యము లనగా క్షేత్రము లని ముందు నామములలో వివరించుట జరిగినది. ప్రతి జీవి దేహమున లక్ష్మి యున్నది. అనగా కాంతి వైభవము ఉన్నది. దానిని మరుగు పరచుచూ అలక్ష్మి యుండును. అలక్ష్మి ఆకలి, దప్పిక కోరికల రూపమున లక్ష్మి నావరించి యుండును. ఈ అలక్ష్మిని తొలగించుకొనినచో లక్ష్మి బయల్పడును. కోరికలు మలినములను కలిగించును. ఆ మలినము కారణముగ ఆకలి, దప్పిక, నిద్ర అనునవి అధిక మగు చుండును. అప్పుడు లక్ష్మి మరుగున పడును.

కోరికలు గుచ్ఛములుగ సాగు ప్రయాణమును కర్తవ్యముల వైపునకు మరల్చవలెను. కోరికల కొరకు జీవించుటకాక కర్తవ్య నిర్వహణము కొరకు జీవించుట ఆరంభించవలెను. కర్తవ్య నిర్వహణ మున నిత్యావసరము లన్నియూ అప్రయత్నముగ సిద్ధించును. కర్తవ్యము లను మరచి కోరికల వెంటపడినచో రెంటికి చెడ్డ రేవడి యగును. కర్తవ్య నిర్వహణమున సంకల్పబలము పెరుగును. కోరికలు బలహీన పడును.

తాను కోరినవే తన కర్తవ్యములు అని భావించుట అజ్ఞానము. కర్తవ్యము తప్పనిసరి యగు కర్మ. దానికి లాభనష్టములతో గాని,

జయాపజయములతో గాని, సౌకర్యాసౌకర్యములతో గాని సంబంధము లేదు. అట్టి కర్తవ్యమును నిర్వచించువాని యందలి అలక్ష్మి తొలగి లక్ష్మి ప్రకాశించును. అపుడు సమస్త సంపదల వైభవము అతనిని చేరును.

రాజ్యలక్ష్మి వరించవలెనన్నచో కోరికల మార్గమును వదలి కర్తవ్య మార్గము నాశ్రయించుట ఒక్కటే ఉపాయము. అది సిద్ధించుట, శ్రీమాతను ప్రార్థించుట జరుగవలెను.



# 690. 'కోశనాథా'

ధనాగారములకు స్వామిని అని అర్థము.

కోశము లనగా పంచకోశములు. అవి వరుసగా అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. ఈ పంచకోశములే నిజమగు కోశాగారము. దేహమందలి పంచ భూతముల సామ్యమువలన దేహస్వస్థత యుండును. పంచభూతము లలో ఏ భూతము అస్వస్థతకు గురియైనను దాని కారణముగ పంచ కోశముల సామ్యము చెడును. అపుడు అనారోగ్యము కలుగును. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భౌతిక పదార్థము, పంచకోశము లను పోషించు చుండును. వాని సామ్యము చెడని దినచర్య ఉండవలెను. పంచభూతాత్మకమగు ప్రకృతిని జీవులు అశ్రద్ధ చేయరాదు. ప్రకృతి సహజమగు జీవనమునుండి దూరము కారాదు. తగినంత సూర్యశక్తి దేహమునకు సోకుచుండవలెను. పవిత్రమగు వాయువులను శ్వాస ద్వారా సంపూర్ణముగ అందుకొనుచుండవలెను. దీర్ఘమగు శ్వాసలు ప్రతిదినము పదిహేను నిమిషములపాటు ఉభయ సంధ్యలలో నిర్వర్తించినచో తగినంత అగ్ని, ప్రాణవాయువులతో నిండియుండును. అట్లే స్వచ్ఛమగు జలములను రోజున కైదు మారులు తగినంతగ పుచ్చుకొన వలెను. ఈ పై తెలిపిన నాలుగును ఆహారములే. ఇది కాక తగు మాత్రము పదార్థమయమగు ఆహారమును పుచ్చుకొనవచ్చును.

ఇట్లు పంచ కోశములను పంచ భూతములతో ప్రతి నిత్యమూ శుద్ధి చేయుట, పోషణ చేయుట శ్రీమాత కోశనాథ భావమును

మన్నించుటగా భావింపవచ్చును. దేహమందు అగ్ని, వాయువు, జలములు సమతూకము కోల్పోవుట వలన ప్రస్తుతము వ్యాధులు పెరుగుచున్నవి. అట్టివారు శ్రీమాతను కోశనాథగా స్మరించుచూ తదను గుణమైన దినచర్యను ఏర్పరచుకొనవలెను.

పంచభూతాత్మకమైన సృష్టి స్వస్థత కూడ– అందలి పంచభూత ముల పవిత్రతను బట్టి, సామరస్యమును బట్టి యుండును. భూమిని, నీటిని వాయువును కలుషితము చేయుచున్న మానవజాతి అజ్ఞాన తిమి రాంధకమున పడి యున్నది. ధనాసక్తితో శ్రీమాతను సహితము తాము సృష్టించుకొనిన ధనమునకు స్వామినిగా భావించి పూజించు చున్నారు. ఇది పూర్ణ అజ్ఞానము.



# 691. 'చతురంగ బలేశ్వరీ'

నాలుగు విధములైన బలములతో కూడిన సైన్యములకు ఈశ్వరి అని అర్థము.

చతురంగబలములు శ్రీమాత రూపమే, ఆమె వ్యూహమే. ఆమెది నాలుగు వ్యూహముల సృష్టి. నాలుగు వ్యూహములకును వాని వాని ప్రత్యేక బలము లున్నవి. వాని నీ విధముగ పేర్కొనవచ్చును.

I 1. ఆత్మబలము. 2. బుద్ధిబలము.
3. మనోబలము. 4. శారీరక బలము.

II 1. నారాయణ వ్యూహము. 2. వాసుదేవ వ్యూహము.
3. సంకర్షణ వ్యూహము. 4. విష్ణు వ్యూహము.

III 1. బ్రహ్మ తేజస్సు. 2. క్షత్రియ తేజస్సు
3. వైశ్య తేజస్సు. 4. శూద్ర తేజస్సు.

IV 1. సనకుడు. 2. సనందనుడు.
3. సనత్కుమారుడు. 4. సనత్సుజాతుడు.

V 1. కృత యుగము. 2. త్రేతా యుగము.
3. ద్వాపర యుగము. 4. కలి యుగము.
– ఇది శ్రీమాత కాలవ్యూహము.

VI 1. పరాశక్తి. 2. ఇచ్ఛాశక్తి.
3. జ్ఞానశక్తి. 4. క్రియాశక్తి – ఇవి శక్తి వ్యూహములు.

VII 1. తత్వము. 2. ప్రజ్ఞ. 3. శక్తి. 4. పదార్థము.

VIII 1. దైవము. 2. కర్మము. 3. ఆత్మ. 4. శక్తి.

IX 1. పరావాక్కు. 2. పశ్యంతీ వాక్కు.
3. మధ్యమావాక్కు. 4. వైఖరీ వాక్కు.
–ఇవి వాగ్వ్యూహములు.

X 1. రథ. 2. గజ. 3. తురగ. 4. పదాతులు.
– ఇవి సైన్య బలములు.

XI 1. క్షర పురుషుడు. 2. అక్షర పురుషుడు.
3. పరమ పురుషుడు. 4. నాలుగు తత్త్వము. (బ్రహ్మము)

XII 1. పరమాత్మ. 2. ఆత్మ. 3. బుద్ధి. 4. మనస్సు.

గ్రహించు జ్ఞాన ముండవలెనే గాని సృష్టిని చతుర్వర్గములుగ చూచినచో అన్నిట గోచరించును.

వేదములు కూడ నాలుగే. శబ్దములు నాలుగు ప్రధానముగ. రంగులు నాలుగు. మన స్థితులు కూడ నాలుగే. జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయములు. బుద్ధిమంతు లింకను చతురంగములను విస్తారముగ చూడవచ్చును. భగవంతుడు చతుర్మూర్తి యని, చతుర్బాహువు అని చతుర్ముఖు డని, చతురాత్మ యని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఇవియే చతురంగబలములు కూడ. వాని బలము శ్రీమాతయే.

# 692. 'సామ్రాజ్యదాయిని'

సామ్రాజ్యము నిచ్చునది శ్రీమాత. 685 వ నామమున రాజ్య దాయిని నామము వివరింపబడినది. రాజ్యమనగా ఏమియో తెలుప బడినది. అట్టి రాజ్యముల గుంపును సామ్రాజ్య మందురు. కొన్ని రాజ్యములు కలిపి ఏలువానిని సామ్రాట్టు అని అందురు. చక్రవర్తి అని కూడ సంబోధింతురు. రాజులకు రాజు సామ్రాట్టు. అట్లే సద్గురువు కూడ సామ్రాట్టే. రాజు అధికార పూర్వకమగు సామ్రాట్టు. సద్గురువు ప్రేమ పూర్వక మగు సామ్రాట్టు. సామ్రాట్టును ఎదిరించుటకు సామంత రాజులు ఎల్లప్పుడునూ ప్రయత్నములు చేయు చుందురు. పన్నాగములు పన్నుచుందురు. కారణము అధికార తృష్ణ. అది రజోగుణ సంపత్తికి చెందినది. సద్గురువు ప్రేమ సామ్రాట్టు. సద్గురువునకు అతని అనుయాయులు స్వచ్ఛందముగ లోబడి యుందురు. కారణ మేమనగా ప్రేమతత్వము సత్వగుణ సంబంధితము. రాజులు లోబరచుకొందురు. సద్గురువు లోబరచుకొనడు. అనుయాయులు స్వచ్ఛందముగ లోబడుదురు. గనుక శ్రీమాత ప్రేమసామ్రాట్టు అని తెలియవలెను. తన భక్తులకు ప్రేమ సామ్రాజ్యమును తన వరముగ నిచ్చును.



# 693. 'సత్యసంధా'

**స**త్యము నెల్లప్పుడు సంధించి యుండునది శ్రీమాత అని అర్థము.

సత్యమే శివము. శివమే బ్రహ్మము. దాని ప్రకటితరూపమే శ్రీమాత. విద్యుత్ లేక దీపము లేదు. దీపము లేక వెలుగులేదు. ఇందేదియూ ఒకటి లేక ఒకటి యుండదు. చోటంతయూ నిండి యున్నది విద్యుత్తు. దాని ప్రకాశరూపము దీపముగ నున్నప్పుడే విద్యుత్తును గుర్తింతుము. అట్లే సత్యము, శివము చోటువలె అన్నిట అంతట యున్ననూ గుర్తించుట కెవ్వరునూ ఉండరు. అట్టి సత్యము ప్రకటితమైనపుడు శ్రీమాతగ తెలియబడును. ప్రకాశము ఆమె సహజ గుణము. ప్రకటిత సత్యము శ్రీమాత. అప్రకటిత సత్యము బ్రహ్మము లేక సత్యము. బ్రహ్మము నుండి ప్రకటితమై బ్రహ్మమును సంధించి సృష్టి నిర్మాణము గావించును. బ్రహ్మము లేక తాను లేదు. తాను లేక సృష్టి లేదు. బ్రహ్మమునే సృష్టిగా సంధించు శ్రీమాత బ్రహ్మ ప్రకటిత రూపమే. ఆమె 'సత్యసంధ' అనుటలో బ్రహ్మము నెప్పుడూ నిరాక రించనిది అని తెలియవలెను.



# 694. 'సాగరమేఖలా'

సాగరమే మొలనూలుగా గలది శ్రీమాత అని అర్థము.

మొలనూలు ఆవరణకు సంకేతము. శ్రీమాత చుట్టునూ నవా వరణము లున్నవి. తదనుగుణమైన సాగరములు ఉన్నవి. క్షారసాగరము (ఉప్పు సముద్రము), క్షీరసాగరము ఆదిగా ఆవరణము లున్నవి. తొమ్మిది ఆవరణములు, తొమ్మిది లోకములను వేర్పరచి యుండును. ఇట్లు శుద్ధ చైతన్యము ఎనిమిది స్థితులను పొందును. లోకమునకు, లోకమునకు నడుమ సాగర ముండును. భూలోకము చుట్టునూ ఉప్పునీరు యున్నది గదా! అట్లే ఇతర సాగరములు కూడ ఉన్నవి. సూక్ష్మదర్శనము కలవారి కిది అవగతము. ఇతరులకు ఇది పుక్కిటి పురాణము. పంచభూతములు, త్రిగుణముల, మహదహంకారము శ్రీమాత ఆవరణలు. మహదహంకారము చోటువంటిది. అందు రాబోవు సృష్టి అంతయూ ఒక నమూనాగా యిమిడి యుండును. రాబోవు ఎనిమిది ప్రకృతులు, అందు ప్రవేశింబోవు జీవులు అందరునూ బీజప్రాయముగ ఉందురు. వీరందరినీ సూక్ష్మముగ ధరించి యున్న చోటు కనుక దానిని సముద్ర మందురు. సముద్ర మనగా ముద్రలతో కూడి యున్నది అని అర్థము. (స + ముద్ర). అవి అన్నీ క్రమముగ సాత్విక అహంకారము నుండి, రాజసిక అహంకారము నుండి, తామస అహంకారము నుండి పంచభూతములతో కూడిన సృష్టిగ వెలువడును.

మహదహంకారమే అసలైన సాగరము. ఆ సాగరమునకు శ్రీమాత ఆవరణము. బ్రహ్మము నుండి ఉత్పన్నమై కాలమును తోడు చేసుకొని మహదహంకారము నేర్పరచి, అందుండి అష్ట ప్రకృతులతో కూడిన సృష్టి నేర్పాటు చేయు శ్రీమాత 'సాగరమేఖలా' అని కీర్తింపబడు చున్నది. మహదహంకారమే లేనిచో సృష్టి జరగదు. మహదహంకార మేర్పడుటకు మూలము శ్రీమాత.



# 695. 'దీక్షితా'

సృష్టి దీక్ష వహించునది శ్రీమాత అని అర్థము.

శివుడు దీక్షితుడు. శ్రీమాత దీక్షిత. దీక్ష దివ్య గుణము. దీక్ష వలన దక్షత యేర్పడును. దీక్ష గలవాడు సాధింపలేనిదేమియూ లేదు. దీక్షాయుతముగాని జీవితములు వ్యర్థములు. దీక్షవలన సంకల్ప బలము పెరుగును. దీక్ష ఆజన్మాంత ముండవలెను. దినచర్యలో దీక్ష, భాగమైనపుడు జీవుడు దీక్షితుడు కాగలడు.

శ్రీమాత సృష్టి నిర్మాణము, పోషణము, సంహారము అమిత దీక్షతో నిర్వర్తించును. దీక్ష యందు క్రమ ముండును. క్రమము వలన శుద్ధ చైతన్యము వికసించును. అవరోధములు తగ్గును. జ్ఞానము హెచ్చుగును. మలినములు చేరవు. అశ్రద్ధ ఆమడ దూరములో నుండును. మరపు కలుగదు. సావధానత కలుగును.

సద్గురువులు తమ శిష్యులకు ఉపదేశమిచ్చి తగుమాత్రము దీక్షను కూడ తెలిపెదరు. దీక్షను పాటించుచు ఉపదేశములను నిర్వర్తించు కొనినచో ఉపాసన సిద్ధించును. ఉపాసన అనగా ప్రజ్ఞాపరముగ దైవము నకు, గురువునకు చేరువుగ నుండుట. శ్రీమాత సద్గురువుల రూపమున ఉపదేశమును దీక్షను అందించి జీవులను తనవద్దకు చేర్చుకొనును. ఇది శ్రీమాత దీక్షితా లక్షణము. దీక్షను అందుకొనినవారు అందుకొనిన దీక్ష, ఉపాసన, ప్రధానమై జీవించుట వారి కర్తవ్యము. అట్లు కానిచో రెంటికి చెడ్డ రేవడు లగుదురు. వారికి ఇహము నచ్చదు. పరము

లభింపదు. దీక్ష బాధ్యత యని తెలిసి అందుకొనవలెనేగాని గొప్పతనము నకు దీక్షలు పుచ్చుకొనరాదు.

ప్రస్తుతమున దేవీ దీక్షలు, అయ్యప్ప దీక్షలు, శక్తి దీక్షలు మొదలుగా అనేకమగు దీక్షలు జనబాహుళ్యమున ప్రాచుర్యము పొందినవి. కేవలము తొమ్మిది రోజులు, 27 రోజులు, 40 రోజులు దీక్షగ నుండి అటుపైన చిల్లరగ ప్రవర్తించుట దీక్ష నవమానించుట యగును.

దీక్ష దినచర్య అయినపుడు శ్రీమాత అనుగ్రహముగ సిద్ధి కలుగును.



# 696. 'దైత్యశమనీ'

దైత్యులను శమింపచేయునది శ్రీమాత అని అర్థము.

దీక్షాయుత జీవితములు నడుపువారి యందలి అసుర ప్రవృత్తి అంతయూ ఉపశమన మగును. శాంతించును. నియమింపబడి యుండును. జీవులు త్రిగుణాత్మకు లగుటచే వారియందు సాత్విక అహంకారము, రాజసిక అహంకారము, తామసిక అహంకారము యుండును. రాజసిక, తామసిక అహంకారములు- దైత్యాహం కారములు. ఈ అహంకార ప్రవృత్తి ఉపశమింపవలె నన్నచో లలితమగు దైవము నారాధింపవలెను. అరాధనములు కూడ లలితముగను, సరళముగను ఉండవలెను. ఆరాధకుల స్వభావమును బట్టి లలిత మగు సత్వగుణ దీక్ష లున్నవి. దైత్యప్రవృత్తి గలవారు ఉగ్రదీక్షల నాశ్ర యింతురు. ఉగ్రదీక్షలతో ఆరాధనము చేసినపుడు దైత్య ప్రవృత్తి పెరుగునే గాని తరగదు. అసురులగు రావణ హిరణ్య కశిపులు ఉగ్రదీక్షల నవలంబించి దైత్యులై నశించిరి. వశిష్ఠ, గౌతమ, అగస్త్యాది మహర్షుల వంటివారు సత్వగుణ దీక్షల నవలంబించిరి. బ్రహ్మర్షులైరి. విశ్వామిత్ర మహర్షి మొదలు రజోగుణప్రేరిత తపస్సులనుచేసి వాని నిష్ప్రయోజ కత్వము తెలిసి అటుపైన సాత్విక తపస్సుతో బ్రహ్మర్షి అయ్యెను. దీనివలన తెలియవలసిన ఒక ప్రధాన సూత్రము, దీక్షలు సాత్వికము గను, సరళముగను ఉండవలెనని, ఉపాస్యదైవము కూడా అట్లే ఉండ వలెనని తెలియవలెను.

మానవులలో అసుర ప్రవృత్తి గలవారు, మానవ ప్రవృత్తి గలవారు, దైవీ ప్రవృత్తి గలవారు ఉన్నారు. ఇందు మొదటి రెండు తెగలవారు తమ యందలి దైత్యులు శమింపబడుటకు సాత్విక సరళ దీక్షలతో ఆరాధన చేయవలెను.

దీక్షలు తమోగుణ ప్రధానమై యున్నప్పుడు ఆరాధన యందు అశ్రద్ధ, నిర్లక్ష్యము, అలసత్వము, మరపు యుండును. రజోగుణ దోషము గలవారి దీక్షలలో ఉద్రేకము, వేగము, తొందరపాటు, తప్పులు చేయుట ఉండును. జీవప్రజ్ఞ క్రమోన్మీలన మగుటకు లలితముగ నిత్యము ఆరాధన చేయుట ఎక్కువ ఉపయోగకరము.

మరియొక విశేష మే మనగా బ్రాహ్మణులైననూ ఉగ్రపూజలు చేసి రావణాదులు అసురులైనారు. అసుర కులమున పుట్టిననూ ప్రహ్లాదాదులు సాత్విక సాధనల ద్వారా శాశ్వత భక్తులైనారు. బలిచక్రవర్తి ప్రాథమిక రజోగుణ ప్రేరితుడై ఆరాధన చేసిననూ దానగుణము వలన సాత్వికత పెరిగి సర్వాంతర్యామి సాధనను సరళముగ గావించి శాశ్వత విష్ణు భక్తుడై సుతల లోకపాలకు డైనాడు. కావున దైత్య శమనము జరుగుటకు దీక్షలు సరళమై యుండవలెను.



# 697. 'సర్వలోకవశంకరీ'

సర్వలోకములను వశము చేయునది శ్రీమాత అని అర్థము.

ముందు తెలిసిన రెండు నామములతో ముడిపడిన నామమే యిది. సాత్విక దీక్షల ద్వారా ఆరాధనము చేయుచు సత్వగుణమును క్రమముగ స్థిరపరచుకొనినవారి చైతన్యము వికాసము చెందుట ఆరంభించును. సత్వగుణము పెరుగుచున్న కొలది సత్యప్రవర్తన, ధర్మ ప్రవర్తన పెరుగుచుండును. సత్వగుణమున స్థిరపడినవారి యందు దయ, శాంతి, ధర్మము, ప్రేమ, అహింస స్థిరపడును. వారు సత్యమునకు చేరువగు చుందురు. సత్యము బ్రహ్మము గనుక బ్రహ్మము సమస్తమున వ్యాపించి యున్న తత్త్వము గనుక జీవుడు క్రమముగ సర్వలోకములను ఆక్రమించును. ఇట్టివారిని సత్యపరాక్రము లందురు. సనక సనందనాది మానస పుత్రులు, నారదులు, వశిష్ఠాది బ్రహ్మర్షులు యిట్టివారు. సత్యమే నిజమగు పరాక్రమము. సత్య మనగా నిజము పలుకుట మాత్రమే కాదు. సత్యమనగ బ్రహ్మము, శివము, సుందరము. అది తత్త్వము. అట్టి తత్త్వమును శ్రీమాత అనుగ్రహముగ పొందవచ్చును. దానికి వలసినది సాత్త్విక, నిత్య దీర్ఘకాల ఆరాధన. ఆరాధన అట్లు సలుపు చుండగా క్రమముగ ఆరాధకు డావరణ లన్నిటినీ దాటును. నవావరణలు దాటి బ్రహ్మమును చేరుటకు శ్రీమాత తల్లివలె దోహద పడును. సర్వలోకములు ఆమె సృష్టియే. అవి అన్నియూ ఆమె వశముననే యున్నవి. ఆమె సాన్నిధ్యమును కోరుట కన్న ఏ కోరిక లేని వారికిది

సులభ మగును. కోరిక లేని ఆరాధన సత్వగుణ ఆరాధన యగును. ఆమె సాన్నిధ్యము కోరుట వలన సర్వమూ సిద్ధించును. ఇతరములగు కోరికలు లేక ఆమె నారాధించుటకు ఆమెపై ప్రేమ యుండవలెను. అట్టి నిష్కారణమగు ప్రేమద్వారా ఆమె అనుగ్రహము సులభముగ లభించును. భక్తు లనగా కోరికలు లేక దైవ సాన్నిధ్యము కొరకే నవ విధములుగ ఆరాధించువారు. భక్తి యనగా నిజముగ దైవముపై ప్రేమయే. ఇట్టివారు ఉత్తమశ్రేణి భక్తులుగా వాఙ్మయములు ప్రశంసించు చున్నవి.



# 698. 'సర్వార్థదాత్రి'

సకల పురుషార్థములను యిచ్చునది శ్రీమాత అని అర్థము.

ధర్మ, అర్థ, కామ, మోక్షములు పురుషార్థములు. ధర్మముతో కూడిన కామము, అర్థానుభూతి నేర్పినవారు మోక్షస్థితి పొందుదురు. ధర్మము నేర్పి, అర్థ కామములద్వారా జీవులను పరితృప్తుల గావించి మోక్షస్థితి యందు నిలబెట్టునది శ్రీమాత. ధర్మము తప్పినవారికి మోక్ష స్థితి లేదు. అర్థకామము లున్ననూ అవి చిక్కులు పెట్టుచు నుండును. కలియుగమున ధర్మము లేశమాత్రమే గోచరించును. ధర్మ మాచరింపక అర్థకామముల వెంట జీవులు పడుచున్నారు. తమకుగల సమస్త సమస్యలు తెలివితో పరిష్కరించుకొనవలెనని భావించుచున్నారే కాని ధర్మము ననుసరించవలెనన్న భావము పొందుటలేదు.

ధర్మము తెలియవలె నన్నచో సత్పురుషుల జీవితము నుండి గ్రహించవచ్చును. రాముని కథ ధర్మమునకు ప్రతీక. భాగవత మందు పేర్కొనిన భక్తుల కథలు ధర్మమునకు ప్రతీకలు. అట్లే భారత మందలి కథలు. ధర్మమునందు రుచి లేకపోవటము వలన రామాయణ, భారత, భాగవతాది గ్రంథములను చదివిననూ, ధర్మమును గ్రహింపలేకున్నారు. సత్పురుషులు తమ నడుమ జీవించి ధర్మ మార్గమును చూపుచున్ననూ రుచి చెందుట లేదు. కేవలము అర్థకామములే ప్రధానముగ జీవించు చున్నారు. ధర్మమే దైవము. దైవమే ధర్మము.

*"ధర్మంచర ।"* అనునది వేదశాసనము. ఇట్టి ధర్మము నందు బుద్ధి ఎట్లు కలుగగలదు? శాస్త్రములు చదివిననూ కలుగదు. మహా పురుషుల సాంగత్యమున నున్ననూ కలుగదు. తీర్థయాత్రలు చేయు చున్ననూ అర్థకామముల దృష్టితోనే నిర్వర్తించు చున్నారు గాని ధర్మ బుద్ధి లేదు. వెంకటేశ్వరుని ధర్మదర్శనమున చూచు వారెందరు? దొడ్డి దారినే దైవమును చూచుట అనుబుద్ధి కలవారికి ధర్మాచరణ మెట్లు వీలగును?

ధర్మము నాచరింపవలెనను సంకల్పము కలుగవలెను. తానుగ కల్పించుకొనలేడు. అట్లు కల్పించుకొనిననూ నిలువదు. శ్రీమాత అనుగ్రహముగ అట్టి సంకల్పము కలిగినచో అప్పటినుండి జీవునికి పరిష్కార ముండును. అట్లు ధర్మము నేర్పి అర్థముల నేర్పరచి జీవులను కడతేర్చునది శ్రీమాత. ఆమె 'సర్వార్థదాత్రి'.



# 699. 'సావిత్రి'

**త**న తేజోస్రావముచే సృష్టి నిర్మాణము చేసినది గాన శ్రీమాత సావిత్రి అని పిలువబడుచున్నది.

శ్రీమాత తేజస్సే సృష్టి నిర్మాణమునకు జీవుల నిర్మాణమునకు మూలము. ఆమె తేజస్సే సవితృమూర్తి. ఆమె తేజస్సే సూర్యచంద్రుల తేజస్సు. తేజోస్రావము వలన సృష్టి జరుగుటచే ఆమెయే సమస్తమునకు తల్లి. సమస్తమును ప్రసవించినది గనుక ప్రసవిత్రి, సావిత్రి అని పిలుతురు. ప్రసవించి రక్షణ, పోషణాదులు గావించును. సమస్తము ఆమె తేజమే. అది సత్యతేజము, ధర్మతేజము. శ్రీమాతను సావిత్రిగను, గాయత్రిగను ఆరాధించుట భారతీయులకు ఋషులు నేర్పిన విద్య. ఆమె అనుగ్రహము వలన జీవులు సత్యతేజులు, ధర్మతేజులు కాగలరు.

శుద్ధమగు భావములను ఎల్లప్పుడూ కలిగి యుండువారికి సావిత్రీదేవి అనుగ్రహము దక్కుట సులభము. భావశుద్ధి కలిగించునది, తద్వారా సాన్నిధ్యమిచ్చునది సావిత్రీదేవి. ఆమె భావశుద్ధ స్వరూపిణి. ఎచ్చట భావములు పరిశుద్ధమై యుండునో అచ్చటినుండి సంకల్ప రూపమున వ్యక్తమై అవతరించును.

భావశుద్ధి కలవారు నిత్యమూ సావిత్రిమాత నారాధించి దివ్య సంకల్పములకు వాహికలై దివ్యకార్యముల నిర్వర్తించుచూ తరించు చున్నారు. ఇట్టివారిని సంకల్పసిద్ధులుగా లోకము ప్రశంసించుచున్నది.

భారతీయులు సంకల్పశుద్ధికి, సంకల్పసిద్ధికి అనాదిగ శ్రీమాతను సావిత్రిగను, సరస్వతిగను, గాయత్రిగను, ఆరాధించు చుందురు. శుద్ధి లేనిదే సిద్ధి లేదు. కనుక భావశుద్ధి కొరకై మొదటగ ప్రయత్నము సాగవలెను. శుద్ధ మనస్కులారాధన సిద్ధి నిచ్చును. అనేకానేక దేవతల నారాధించుటలో గల రహస్యము శుద్ధి, సిద్ధులను పొందుటకే. ప్రస్తుత కాలమున శుద్ధి యందెవ్వరికిని ఆసక్తి లేదు. సిద్ధియందు మాత్రము ఆశ యున్నది. అందరూ రొట్టెకై ఆశపడెడువారే గాని, అందు కాధారమైన పిండి నేర్పరచుకొనువారు లేరు. శుద్ధి, సిద్ధులకు ఋషులు సావిత్రి నారాధించిరి. శాశ్వతులై నిలచిరి.



# 700. 'సచ్చిదానందరూపిణి'

**స**త్యము, చైతన్యము, ఆనందము తన రూపముగా గలది శ్రీమాత అని అర్థము.

సృష్టి కావల శ్రీమాత సత్యస్వరూపిణి. సృష్టియందు కూడ సత్యముగనే యుండును. సృష్టికొరకు తానే చైతన్యముగ ప్రకాశించును. సృష్టి నిర్మాణముచేసి సృష్టిని నిర్వహించును. నిర్మాణము, నిర్వహణము, ఆమె చైతన్య విలాసమే. తానే ఇచ్ఛా, జ్ఞాన, క్రియ శక్తులుగ విస్ఫారి, సృష్టి నిర్మాణ నిర్వహణ కార్యమును గావించును. నిర్మాణ మందు నిర్వహణ మందు త్రిమూర్తులు కూడ ఆమెకు సాటిగాదు. వారునూ ఆమె నుండి యేర్పడినవారే. అనితర సాధ్యమగు సృష్టి కార్యమును చైతన్యస్వరూపిణియై నిర్వర్తించును. అట్టి నిర్వహణమున సత్యమును వీడుట యుండదు. మరచుట యుండదు. సత్యముతో కూడిన చైతన్య మామె. తాను శివా, తానే శివశక్తియును. శివునితో కూడి యుండి సర్వకార్యములను నిర్వర్తించుటవలన ఎల్లప్పుడునూ ఆనందముగనే యుండును. శివు డనగా సత్యమే. సత్యముతో కూడిన చైతన్య మగుటచే శాశ్వతానందమున యుండుట సహజము.

జీవులు శ్రీమాతతో కూడినచో ఆమె సత్యముతో కూడి యుండుటచే ఒకరిని చేరిన ఒకే కాలమున ఇద్దరినీ చేరుట జరుగును. శ్రీమాతను చేరినపుడు తాముండక శ్రీమాత యుండును. కుండలోని నీరు నదిలో చేరినపుడు యిక కుండనీరు అని వేరుగ యుండదు. అది

నదీ స్వరూపమున లయ మగును. అట్లే జీవాత్మ పరమాత్మగ అను సంధానమున పరమాత్మయే యుండును. జీవాత్మ కరగిపోవును. అట్టి స్థితి యందుండునది ఆనందమే.

'సచ్చిదానంద రూపిణి' *అను ఈ నామముతో ఏడు శతకముల నామములు శ్రీమాత అనుగ్రహముగ పరిపూర్ణమైనవి. సహస్రనామ వివరణ మందు ఏడవ శతకము పరిపూర్ణమైనది.*



శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః ।

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రము

## ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

దరాందోళితదీర్ఘాక్షీ దరహాసోజ్జ్వలన్ముఖీ ।
గురుమూర్తి ర్గుణనిధి ర్గోమాతా గుహజన్మభూః ॥ 121

దేవేశీ దండనీతిస్థా దహరాకాశరూపిణీ ।
ప్రతిపన్ముఖ్య రాకాంత తిథిమండలపూజితా ॥ 122

కళాత్మికా కళానాథా కావ్యాలాప వినోదినీ ।
సచామర రమావాణీ సవ్యదక్షిణ సేవితా ॥ 123

ఆదిశక్తి రమేయాత్మా పరమా పావనాకృతిః ।
అనేకకోటి బ్రహ్మాండజననీ దివ్యవిగ్రహా ॥ 124

క్లీంకారీ కేవలా గుహ్యా కైవల్యపదదాయినీ ।
త్రిపురా త్రిజగద్వంద్యా త్రిమూర్తి స్త్రిదశేశ్వరీ ॥ 125

త్ర్యక్షరీ దివ్యగంధాఢ్యా సిందూర తిలకాంచితా ।
ఉమా శైలేంద్రతనయా గౌరీ గంధర్వసేవితా ॥ 126

విశ్వగర్భా స్వర్ణగర్భా వరదా వాగధీశ్వరీ ।
ధ్యానగమ్యా ఉ పరిచ్ఛేద్యా జ్ఞానదా జ్ఞానవిగ్రహా ॥ 127

సర్వవేదాంత సంవేద్యా సత్యానంద స్వరూపిణీ ।
లోపాముద్రార్చితా లీలాక్లృప్త బ్రహ్మాండ మండలా ॥ 128

అదృశ్యా దృశ్యరహితా విజ్ఞాత్రీ వేద్యవర్జితా ।
యోగినీ యోగదాయోగ్యా యోగానందా యుగంధరా ॥ 129

ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ ।
సర్వాధారా సుప్రతిష్ఠా సదసద్రూప ధారిణీ ॥ 130

అష్టమూర్తి రజాజైత్రీ లోకయాత్రా విధాయినీ ।
ఏకాకినీ భూమరూపా నిర్ద్వైతా ద్వైతవర్జితా ॥ 131

అన్నదా వసుదా వృద్ధా బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ ।
బృహతీ బ్రాహ్మణీ బ్రాహ్మీ బ్రహ్మానందా బలిప్రియా ॥ 132

భాషారూపా బృహత్సేనా భావాభావవివర్జితా ।
సుఖారాధ్యా శుభకరీ శోభనా సులభాగతిః ॥ 133

రాజరాజేశ్వరీ రాజ్యదాయినీ రాజ్యవల్లభా ।
రాజత్కృపా రాజపీఠనివేశిత నిజాశ్రితా ॥ 134

రాజ్యలక్ష్మీః కోశనాథా చతురంగ బలేశ్వరీ ।
సామ్రాజ్యదాయినీ సత్యసంధా సాగరమేఖలా ॥ 135

దీక్షితా దైత్యశమనీ సర్వలోకవశంకరీ ।
సర్వార్థదాత్రీ సావిత్రీ సచ్చిదానందరూపిణీ ॥ 136

# OTHER BOOKS THROUGH MASTER K. PARVATHI KUMAR

*The following books are available in: English (E), German (G), Spanish (S), French (F), Hebrew (H), Telugu (T), Hindi (HI) and Kannada (K) languages.*

| | | |
|---|---|---|
| 1. | Agni (E/G/S) | 60-00 |
| 2. | Amanaskudu (T/K) | 18-00 |
| 3. | Antardarsana Dhyanamulu (T) | 100-00 |
| 4. | Anveshakudu (T) | 60-00 |
| 5. | Asangudu (T) | 15-00 |
| 6. | Ashram Leaves (E/G/S) | 100-00 |
| 7. | Ayurvedic Principles (E) | |
| 8. | Bharateeya Sampradayamu (T/Hi) | 10-00 |
| 9. | Cow ('Govu' Mahatyam Vivarana) (E/T/K) | 20-00 |
| 10. | Devapi Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 11. | Dhanakamuni Katha (T) | 25-00 |
| 12. | Doctorine of Eternal Presence (E) | 10-00 |
| 13. | Gayatri Mantra - Avagahana (T) | 10-00 |
| 14. | Geetopanishad - Gnana Yogamu (T) | 25-00 |
| 15. | Geetopanishad - Karma Yogamu (T) | 20-00 |
| 16. | Geetopanishad - Sankhya Yogamu (T) | 25-00 |
| 17. | Geetopanishad - Karmasanyasa Yogamu (T) | 20-00 |
| 18. | Geetopanishad - Dhyana Yogamu (T) | 40-00 |
| 19. | Good Friday (E/G/S/F/H) | 10-00 |
| 20. | Gurupaduka Sthavam (E) | |
| 21. | Health & Harmony (E) | 120-00 |
| 22. | Hercules-The Man and the Symbol (E/G/S/F) | 100-00 |

| | | |
|---|---|---|
| 23. | Himalaya Guru Parampara (T/Hi) | 12-00 |
| 24. | Jupiter-The Path of Expansion (E/G/S) | 40-00 |
| 25. | Jyotirlinga Yatra (T) | 20-00 |
| 26. | Katha Deepika (T) | 40-00 |
| 27. | Listening to Invisible Master (E/G/S/F/H) | 20-00 |
| 28. | Lord Maitreya-The World Teacher (E/G/S/F/H) | |
| 29. | Maitreya Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 30. | Mana Mastaru Garu (T) | 60-00 |
| 31. | Mantrams-Their Significance and Practice (E/G/S) | 35-00 |
| 32. | Maria Magdalena (E/S/G/F) | |
| 33. | Marriage-A Sacrament (E) | |
| 34. | Maruvu Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 35. | Master C.V.V. (Birthday Message) (T) | 30-00 |
| 36. | Master C.V.V. Noothana Yogamu (T) | 20-00 |
| 37. | Master C.V.V. Yogamu (T) | 20-00 |
| 38. | Master C.V.V. Yogamu-Karma Rahityamu (T) | 10-00 |
| 39. | Master C.V.V. - May Call !(E/G/S) | 100-00 |
| 40. | Master C.V.V. - May Call ! II (E) | 100-00 |
| 41. | Master C.V.V. The Initiator - Master E.K. The Inspiror (E) | 15-00 |
| 42. | Master C.V.V. - Saturn Regulations | 125-00 |
| 43. | Master E.K. - The New Age Teacher (E/G/S) | 70-00 |
| 44. | Mithila-A New Age Syllabus (E/G/S) | 100-00 |
| 45. | Occult Meditations (E/G/S) | 100-00 |
| 46. | Omkaram (T) | 30-00 |
| 47. | On Change (E/G/S) | 50-00 |
| 48. | On Healing (E/G/S) | 100-00 |

| | | |
|---|---|---|
| 49. | On Love (E/G/S) | 50-00 |
| 50. | On Service (E/G/S) | 50-00 |
| 51. | On Silence (E/G/S) | 50-00 |
| 52. | Pranayamam (T) | 10-00 |
| 53. | Prayers (E/G/S) | 100-00 |
| 54. | Rudra (E/G/S) | 30-00 |
| 55. | Sankhya - The Sacred Doctrine (E/G/S) | 75-00 |
| 56. | Saraswathi - The Word (E/G/S) | 60-00 |
| 57. | Saturn-The Path of Systematised Growth (E/G/S) | 40-00 |
| 58. | Shodasopachara Pooja - Avagahana (T) | 10-00 |
| 59. | Sound-The Key and its Application (E/G/S) | 40-00 |
| 60. | Spiritualism - Business and Management (E/G/S) | 25-00 |
| 61. | Sri Dattatreya (E/G/S/T/Hi) | 33-00 |
| 62. | Sri Gurupaduka Sthavam (T) | 30-00 |
| 63. | Sri Krishna Namamrutham (T) | 25-00 |
| 64. | Sri Lalitha-1 (T) | 40-00 |
| 65. | Sri Lalitha-2 (T) | 40-00 |
| 66. | Sri Lalitha-3 (T) | 40-00 |
| 67. | Sri Lalitha-4 (T) | 40-00 |
| 68. | Sri Lalitha-5 (T) | 40-00 |
| 69. | Sri Lalitha-6 (T) | 40-00 |
| 70. | Sri Sastri Garu (E/G/S/F/T/H) | 40-00 |
| 71. | Sri Shiridi Sai Sayings (E/G/S/T/Hi) | 80-00 |
| 72. | Steps on Silence (E) | 75-00 |
| 73. | Suvarna Sopanamulu | |
| 74. | The Aquarian Cross (E/G/S) | 100-00 |
| 75. | The Aquarian Master (E/G/S) | 75-00 |
| 76. | The Doctorine of Ethics (E) | 35-00 |

| | | |
|---|---|---|
| 77. | The Etheric Body (E/G/S) | |
| 78. | The Path of Synthesis (E) | 40-00 |
| 79. | The Splendor of Seven Hills (E/T/Hi) | 15-00 |
| 80. | The Teachigs of Lord Sanatkumara | 150-00 |
| 81. | The Theosophical Movement (E/G/S) | 60-00 |
| 82. | The White Lotus (E/G/S) | 20-00 |
| 83. | Time - The Key (E/G/S) | |
| 84. | Uranus - The Alchemist of the Age | 150-00 |
| 85. | Venus - The Path of Immortality (E/G/S) | 80-00 |
| 86. | Violet Flame Invocation (E/G) | 60-00 |
| 87. | Vrutrasura Rahasyam (T) | 35-00 |
| 88. | Varunagraha Prabhavamu (T) | 22-00 |
| 89. | Wisdom Buds (E/S) | 20-00 |
| 90. | Wisdom Teachings of Vidura (E/G/S) | 80-00 |
| 91. | Moon & Spiritual Astrology (S) | |
| 92. | The Death & Reincarnation (S) | |
| 93. | Commentary on Om Namonarayanaya (S) | |
| 94. | Master Jesus, Life and Teachings (S) | |
| 95. | The Science of Ayurveda & Homoeopathy (S) | |
| 96. | The Teachings of Master D.K. (S) | |
| 97. | The Human Constitution (S) | |
| 98. | The Masters of Wisdom (S) | |
| 99. | The Path of Meditation (S) | |
| 100. | Stories for Disciples (S) | |
| 101. | Spirituality in Daily Life (S) | |
| 102. | Special Practices for Disciples (S) | |
| 103. | Fundamentals of Health & Healing (S) | |
| 104. | Ganesha, The Cosmic Lord of Groupings (S) | |
| 105. | Astrology and Healing (S) | |

## DHANISHTA OTHER PUBLICATIONS

| No. | Title | Price |
|---|---|---|
| 1. | Puranapurushuni Pooja Vidhanam (T) | 10-00 |
| 2. | Sarannavaratra Pooja Vidhanamu (T) | 30-00 |
| 3. | Sri Dattatreya Pooja Vidhanamu (T) | 10-00 |
| 4. | Sri Hanuman Chalisa (T) | 15-00 |
| 5. | Sri Mahalakshmi Pooja Vidhanamu (T) | 12-00 |
| 6. | Sri Rama Pooja Vidhanamu (T) | 10-00 |
| 7. | Sri Siva Hridayamu (T) | 5-00 |
| 8. | Sri Siva Pooja (T) | 15-00 |
| 9. | Sri Soukumarya Satakam (T) | 10-00 |
| 10. | Sri Surya Pooja Vidhanamu (T) | 7-00 |
| 11. | Sri Venkateswara Pooja Vidhanamu (T) | 8-00 |
| 12. | Vinayaka Vratakalpamu (T) | 25-00 |
| 13. | Vishnu Sahasranamam (T) | 12-00 |
| 14. | Sri Rama Charitramu (T) | |
| 15. | Sri Subrahmanya Pooja Vidhanamu (T) | 10-00 |
| 16. | Sri Yoga Ganapathi Pooja Vidhanamu (T) | 12-00 |

# శ్రీలలిత

## అష్టమ భాగము

(701 నుండి 800 వరకు నామములకు వివరణము)

**8**

మాస్టర్ పార్వతీకుమార్



ధనిష్ఠ



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువ లేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జన్మించినది.

**"ధనిష్ఠ"** మాస్టర్ పార్వతీకుమార్‌గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపములోను, పుస్తకముల రూపము లోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును సద్గోష్ఠికై వలసిన వాతావరణమును – "జగద్గురు మందిరము"గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

## సంకలనకర్త : మాస్టర్ పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయి లకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ పార్వతీకుమార్**గారు. వారి బోధనలు లెక్కకుమించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియవచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసరణీయమై, ఆచరణ యోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించు చున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళారంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో – మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, *"మానవ సేవయే మాధవ సేవ"*అను మాటకు

సరియైన అర్థము యిదేనని మాస్టరుగారు తమ ప్రవర్తన ద్వారా తెలియ పరచుచున్నారు. మాస్టర్ పార్వతీకుమార్‌గారు బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక – మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, శతాధిక గ్రంథముల సంకలన కర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొనుచుండు ననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు మాస్టరుగారి దృఢ విశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశ విదేశములలో పరహితసేవ గావించుచున్నవి. “పరహితము పరమధర్మ” మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవద్ధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

"శ్రీలలిత" అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతిమాసము 'నావాణి' దర్శన మాస పత్రికయందు ప్రచురింపబడుచున్నవి. పాఠకుల కోరికపై అమ్మవారి "సహస్ర" నామములను "శత" నామములు ఒక భాగముగ ప్రచురించుటకు సంకల్పించితిమి. ఇప్పటికి 700ల నామము లను 7 భాగములుగ ధనిష్ఠ ప్రచురించినది. ప్రస్తుతము 701 నుండి 800 వరకు 8వ భాగముగ అందించుచున్నాము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీర మగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారినుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారియందు, వారి భాషణయందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహపరములకు పరిష్కార మని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

– ధనిష్ఠ

# పరిచయము

**ల**లితాదేవి, శ్రీదేవి, దుర్గ, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమెయే మూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్త స్థితియందు సత్యముగను, వ్యక్త స్థితియందు మహాచైతన్యముగను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు, సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితి గొనుటకు వినియోగ పడును. అందులకే పారాయణము.

అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వ్యాఖ్యానము. సామాన్యులకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

- పార్వతీకుమార్

# విషయసూచిక

# శ్రీ లలిత



ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

# 701. 'దేశకాలాపరిచ్ఛిన్నా'

దేశముచేతగాని, కాలముచేతగాని పరిచ్ఛిన్నము కానిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత తత్త్వమును కొలతలు వేయుటకుగాని, హద్దులు పెట్టుటకు కాని వీలు పడదు. ఆమె అపరిచ్ఛిన్నమగు తత్త్వము. పరిచ్ఛిన్నము కాదు. కాలము ఆయుర్దాయము నిర్ణయించును. అట్టి కాలము తత్త్వము నుండి పుట్టినదే. అట్లే దేశము కూడా. దేశమనగా క్షేత్రము. అనగా సృష్టి జరుగు చోటు. కాలము, చోటు పరిమితములు గలవి. సృష్టి ఆరంభమున శ్రీమాత సంకల్ప మేర్పడినపుడు ప్రకృతి పుట్టును. ప్రకృతితో పాటు కాలము పుట్టును. కాలము, ప్రకృతి మూలమున చోటు యేర్పడును. ఆ చోటులో తత్త్వము నిండగ మహత్తు యేర్పడును. మహత్తు నుండి మహదహంకార మేర్పడును. అందుండి సాత్త్వికము, రాజసికము, తామసికము అను అహంకారము లేర్పడును. అటుపైన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, తన్మాత్రలు, పంచభూతములు పుట్టును. ఇవి అన్నియూ కాలము, ప్రకృతితో కూడి ఇరువది ఏడు తత్త్వములై నిలచును. ఈ తత్త్వము లన్నియూ కూడి బ్రహ్మాండ మగును. ఈ అండము నుండి విరాట్పురుషుడు పుట్టును. అతని అంగములుగ అగ్ని వాయువు ఆదిగా గల విశ్వేదేవతలు పుట్టుదురు. ఇట్లు సృష్టియందు పుట్టినవాటి కన్నింటికిని ఆయుర్దాయ మున్నది. ఇవి అన్నియూ చోటుచే

పరిమితమై యున్నవి. కాలము ప్రకృతితో సహా దిగివచ్చిన సమస్త తత్త్వములకు దేశ కాల పరిమితి యున్నది.

పై తత్త్వములన్నియూ ఎందుండి పుట్టినవో ఆ తత్త్వమునకు పరిమితి లేదు. అట్టి తత్త్వము నుండి దిగివచ్చిన కాలము ఆ తత్త్వమును కొలతలు వేయలేదు. అట్లే ఆ తత్త్వము నుండి దిగివచ్చిన ప్రకృతి తత్త్వమునకు హద్దులు పెట్టలేదు. అట్టి తత్త్వమును శ్రీమాతగ ఋషు లారాధించినారు. దేని నుండి సమస్తము దిగివచ్చినదో దానిని కొలతలు వేయుటకును, హద్దులు పెట్టుటకును వీలుపడదు. ఆ తత్త్వము సృష్టికి పూర్వమున కూడ నుండును. సృష్టి యందు అంతర్యామియై యుండును. సృష్టి లయమైనపుడు కూడ అదియే యుండును. అది నిత్యమగు తత్త్వము. దానినే సత్య మందురు. అట్టి సత్యమే శూన్యత.



# 702. 'సర్వగా'

సర్వమును వ్యాపించి యుండునది శ్రీదేవి అని అర్థము.

శ్రీదేవి చైతన్య స్వరూపిణి. కదలిక గలది. కదలనిది. నవా వర్ణ సృష్టి నేర్పరచుచూ అందు వ్యాపించి యుండునది. నిత్యమూ పుట్టుక, వృద్ధి, క్షయము కలిగించుచూ, మార్పులు చేయుచూ నిత్య నూతనమై వెలుగొందు చుండును. పదార్థమును శక్తితో కదలించుచూ, వ్యాప్తి చెందుచూ నుండును. బీజము మొలకెత్తుట, మ్రొక్క యగుట, అటుపై వృక్షమగుట, అటుపైన శాఖోపశాఖలుగ విస్తరించుట, అందుండి పుష్పములను, ఫలములను వికసింపజేయుట, ఇట్లు అను నిత్యమూ వ్యాపించుచూ గమనము కలిగి యుండును. అన్నిటియందు వ్యాపించును. అంతటా వ్యాపించును. ఆమెలేని వస్తువు లేదు. ఆమె లేని చోటు లేదు. అణువు నుండి బ్రహ్మాండము వరకూ అంతటా వ్యాపించియుండు శ్రీదేవిని చూడలేకపోవుట అజ్ఞానము. కదిలికలను గమనించు చున్నప్పుడు శ్రీమాత గమనమును గమనించుట విజ్ఞానము. కదలిక లేని అణువు లేదు. కదలిక లేని జీవి లేదు. కదలనట్లు తోచు వస్తువుల యందు కూడ కదలిక యున్నది. సృష్టి అంతయూ గమనము కలిగి యున్నది. కనుకనే దానిని జగత్తు అందురు. కదలిక శ్రీమాత వ్యాపనము వలననే కలుగును.

శ్రీమాత కదలిక యందు విశేష మేమనగా కదలుచూ వ్యాపనము చెందును. కదలినంత మాత్రమున పూర్వదేశమున లేకుండుట

యుండదు. జీవులు కదులునపుడు ముందు చోటున యుండరు. ఇంటి నుండి బజారునకు వెళ్ళినపుడు ఇంటిలో వుండరు. ఇంటిలో కూడ ఒక గదిలో నున్నప్పుడు మరియొక గదిలో నుండరు. కదలిక వలన జీవులు ఒక చోటులో నుండుట, ఇతర చోటులలో నుండకపోవుట యుండును. కాని శ్రీమాత అట్లుకాదు. అన్నిచోట్ల నుండును. అంతటా యుండును. ఆమె గమనమున వ్యాపన మున్నది. కదలుచూ వ్యాప్తి చెందుచుండుట వలన ఆమెను 'సర్వగా' అని ప్రశంసింతురు.

సర్వము నందు వ్యాప్తిచెందుచు నుండు శ్రీమాత భూత భవిష్యత్ కాలములందు కూడ నుండును. పూర్వము లేదని ఇప్పుడు వున్నదని చెప్పుటకు వీలు లేదు. పూర్వము ప్రస్తుతము భవిష్యత్తు నుందు కూడ యుండునది శ్రీమాత. సర్వకాలముల యందు, సర్వలోకముల యందు వ్యాప్తిచెంది సమస్తమునకు కదలిక కలిగించు శ్రీమాత తత్త్వము 'సర్వగా' అని తెలియవలెను.



# 703. 'సర్వమోహిని'

సమస్త మోహములను కలిగించునది శ్రీమాత అని అర్థము.

లేనిది వున్నట్లుగ గోచరింపచేసి మోహము కలిగించునది శ్రీమాత. ఉన్నది ఒక్కటియే. అది సత్యము నిత్యము. దానిని బ్రహ్మమని కూడ అందురు. అందుండి యేర్పడిన సంకల్పము క్రమముగ మార్పులు చెందుచు అనేకానేక వస్తువులుగ గోచరించును. ఒకే సత్యము స్థూలముగ నవ విధమగు మార్పులు చెందుచుండును. మార్పు చెందినపుడెల్ల మూలవస్తువు అగోచర మగును. మూలవస్తువు మరుగున పడును. గుర్తునకు రాదు. మార్పు చెందినది స్థిరపడు చుండును. అసత్యము సత్యమువలె గోచరించును. సత్యము గోచరింపదు. సత్యమును తెలిపి ననూ నమ్మబుద్ధి కాదు. అసత్యమే నమ్మబుద్ధి అగును. ఇంతకన్న మోహ మేమున్నది. సృష్టి యందు సర్వమును మోహము చేతనే నడుపబడు చున్నది. మోహమే లేనిచో సృష్టి కథయే లేదు. తెలిసినవారు కూడ మోహమున పడుదురు. త్రిమూర్త్యాదులకే మోహము తప్పలేదు. జ్ఞానుల కును మోహము తప్పలేదు. నారదాది దేవర్షులు కూడ మోహమును తప్పించుకొన లేకపోయిరి. మినహాయింపు లేక సృష్టిలో నందరిని మోహపరచునది శ్రీమాత.

వెండితెరపై జరుగు కథ ఎంత సత్యమో జగత్కథ కూడ అంతే సత్యము. కాని జగత్తున నందరూ ఎవరికి తోచినది వారికి సత్యమని

భావించుచూ, తీరుబడి లేక జీవించు చుందురు. సృష్టించుచున్నానని బ్రహ్మ, స్థితికారకుడనని విష్ణువు, సంహారకుడనని రుద్రుడు, పరిపాలకుడ నని ఇంద్రుడు, దిక్పాలకులమని అష్టదిక్పాలకులు, గ్రహదేవతలమని నవగ్రహ దేవతలు పూర్ణముగ నమ్మి వారి వారి కార్యములను తీరుబడి లేక నిర్వర్తించుచున్నారు.

అట్లే ఆదిత్యులు, రుద్రులు, పితరులు, వసువులు, పంచ భూతములు, వారి వారి కార్యములను నిర్వర్తించుచున్నారు. తాము మానవుల మని మనుష్యులు భావించుచున్నారు. అందున పురుషుల మని, స్త్రీలమని, వృద్ధుల మని, బాలురమని భావించుచూ జీవించు చున్నారు. అనేకానేక సంబంధములను కూడ సత్యములని నమ్మి జీవించుచున్నారు. భార్యయని, భర్తయని, సంతానమని, బంధుమిత్రుల మని, స్వదేశీయులమని, విదేశీయులమని అనేకానేక భావములను నమ్మి జీవించుచున్నారు.

ఇవి అన్నియు తాత్కాలిక సత్యములే అయిననూ నిత్యమని భావించి, అసత్యమును సత్యమని నమ్మి, సత్యమును మరచి జీవించుట అద్భుతమైన గమ్మత్తు. శ్రీమాత మోహినీ తత్త్వమును ఎవ్వరునూ జయింపలేరు. కామేశ్వరుడగు శివుడు కూడ మోహమున పడిన కథ యున్నది. సృష్టి నిర్వహణమునకు శ్రీమాత వినియోగించు మోహినీ శక్తి ప్రప్రధానమైనది.

త్రిమూర్తుల నుండి కీటకముల వరకు అందరునూ జీవులే. అందరికినీ అనుభవము గూర్చి అనుభూతిని కలిగించుచూ, జ్ఞానము

కలిగించుచూ కాలక్రమమున పరిణతి నిచ్చునది శ్రీమాత. పరిణామము క్రమమున పెరుగుచూ తుదకు సత్యము నెరుగుట జీవుని కథ. సత్యము నెరిగిననూ మోహమును దాటలేమని తెలియుట పూర్ణ సత్యము. అట్లు తెలిసినవారే సనక సనందనాదులు, వశిష్ఠాది బ్రహ్మర్షులు మరియు సప్త ఋషులు. సమస్తము శ్రీమాత లీలావిలాస మనియు జీవుల నుద్ధరించుటయే ఆమె ప్రధాన కార్యమనియు తెలిసి ఆమె కార్యమునకు యితోధికముగ సహకరించు చుందురు. మోహినీ దేవి యందు విధేయత కలిగి యుందురు.



# 704. 'సరస్వతీ'

ప్రవహించు చైతన్య స్వరూపిణి శ్రీమాత అని అర్థము.

బ్రహ్మము నుండి పాతాళ లోకముల వరకు ప్రవాహమువలె చైతన్య స్వరూపిణి యగు శ్రీమాత ప్రవహించుచూ నుండును. ఈ ప్రవాహముననే లోకము లేర్పడుట, ఆయా లోకములందు ఆయా జీవులేర్పడుట జరుగుచుండును. చైతన్య ప్రవాహమును సరస్వతి అని పిలుతురు.

బ్రహ్మము నుండి మేల్కొని చతుర్ముఖ బ్రహ్మ నుండి వ్యక్తమై శ్రీమాత నిత్యమూ ప్రవహించుచూ సృష్టి స్థితి లయ కార్యములను నిర్వర్తించుచుండును. చైతన్యము సూక్ష్మము నుండి స్థూలమునకు ప్రవహించు చుండగ పదునాలుగు లోకము లేర్పడును. పురాణము లందు ప్రసిద్ధి గాంచిన గంగావతరణము కథ శ్రీమాత సరస్వతీ తత్త్వమునకు ప్రతీక. ఆకాశము నుండి శివుని శిరస్సు చేరుట, శివ జటాజూటము నుండి హిమాలయము చేరుట, ఉత్తమ పర్వతశ్రేణుల నుండి భూమిని చేరుట, భూమి నుండి పాతాళమును చేరుట గంగా ప్రవాహము కథగ తెలుపుదురు. శ్రీమాత శుద్ధ చైతన్యము ప్రవ హించుచూ స్థితి భేదములు చెందుచు నుండును. అవరోహణ క్రమమున సూక్ష్మము నుండి స్థూలము చేరును. ఆరోహణ క్రమమున స్థూలము నుండి సూక్ష్మమున చేరును. ఇట్లు అధో ఊర్ధ్వగతుల గమనము గల

ప్రవాహము గనుక శ్రీమాతను 'గంగ' అని కీర్తింతురు. 'గం' అనగా గమనము, మరల 'గ' అను శబ్దము ఊర్ధ్వ గమనమునకు సంకేతము. 'గంగ' అను శబ్దము మొత్తము సృష్టి గమనమునకే సంకేతము. అందువలన ఆ శబ్దము అతి పవిత్రము. గంగ, గీత, గోవింద, గౌరి, గోవు- ఈ పంచశబ్దములు అత్యంత పవిత్ర శబ్దములు. ఉచ్ఛారణ మాత్రమున పవిత్రీకరింప గలవు.

ప్రవాహము గమనమునకు ఉత్తమ స్థితి. శ్రీమాత చైతన్యము అట్టి ప్రవాహముగ నిర్వర్తింపబడు చుండును. ఉత్తర దక్షిణాయనములుగ ప్రవాహము నిత్యము నిర్వర్తింపబడుచునే యుండును. ఉత్తర ప్రవాహ మున చేరువారు ఊర్ధ్వగతి పొందుదురు. దక్షిణ ప్రవాహమున చేరువారు స్థూలగతులను పొందుదురు. జీవులు తమయందలి చైతన్య వినియోగ మును బట్టి స్థూల సూక్ష్మములలో తిరుగ గలరు. ఉత్తమ భావములు, ఉత్తమ భాషణములు, ఉత్తమ ప్రవర్తనలు నిర్వర్తించుకొనువారు ఉత్తర వాహినియందు ప్రవేశింతురు. అట్లే అధమ భావము, భాషణ, ప్రవర్తన గలవారు అధస్సునకు ప్రవహింతురు. ఇట్లు సరస్వతీ రూపమున శ్రీమాత ఉత్తరాయణ, దక్షిణాయనములుగ సృష్టి నిర్వహణము చేయుచు నుండును. ఇది ఆమె సరస్వతీ రూపము.

మానవుల జిహ్వాగ్రమున శ్రీమాత సరస్వతియై నిలచి యుండును. జిహ్వను సంస్కరించుకొనుచు సంస్కృతిని పొందువారు, క్రమముగ జ్ఞానమును పొంది చక్రభ్రమణములకు లోనుగాక అన్ని లోకముల

యందు విహరించ గలరు. వీరినే యోగులని, సద్గురువులని తెలుపుదురు. వీరి గమనము ఉత్తరాయణ, దక్షిణాయన ప్రవాహమున గాక రెంటికినీ మధ్యస్థముగ సాగుచు నుండును. సుషుమ్న మార్గమున సాగుచు నుండును. ఇట్లు మూడు ప్రవాహములతో కూడి శ్రీమాత యున్నది గనుక ఆమెను 'త్రిపథగామిని' అని కూడ అందురు. శ్రీమాత సరస్వతీ స్వరూపము నెరుగుట శ్రీమాత అనుగ్రహముననే జరుగ గలదు.



# 705. 'శాస్త్రమయీ'

**శా**స్త్రరూపము శ్రీమాతయే అని అర్థము.

శ్రీమాత అక్షర రూపిణి. అకార హకారములతో కూడిన అన్ని అక్షరములు ఆమె అంగములు. శరీర అవయవములు. ఆమెయే వాగ్రూపిణి, వర్ణరూపిణి, అక్షర రూపిణి. వేదములు, శాస్త్రములు, పురాణములు, వేదాంగములు, ఉపనిషత్తులు, కావ్యములు, కథలు అన్నిటి యందు ఆమెయే నిండియున్నది. శాస్త్రములందు ఆమెను దర్శించుట వలన శాస్త్రజ్ఞత్వము కలుగును. అనగా శాస్త్రములు తెలియును. ఆమెను దర్శింపక కేవలము శాస్త్రములు నేర్చినచో వికారములు కలుగును. అంతర్యామియై అన్ని శాస్త్రములందు శ్రీమాతయే వ్యాపించి యున్నది. శాస్త్రము లన్నిటికినీ శ్రీమాతయే సూత్రము. వివిధ శాస్త్రములు, పురాణములు, వేద వేదాంగములు, ఉపనిషత్తులు, యితిహాసములు, కావ్యములు మణుల వంటివి. ఈ మణులన్నియు శ్రీమాత అను సూత్రమునకు ఎక్కింపబడిన పూసల వంటివి. సూత్రము లేనిచో మణి మాల లేదు. వాఙ్మయమంతయు అగమ్యగోచరమై వైరుధ్యముగ గోచరించును. అన్నింటిని అమ్మ అంతర్యామి తత్త్వమున దర్శించుట నేర్చినచో శ్రీమాత బ్రహ్మమయి అని తెలియును. సర్వమూ బ్రహ్మమే అని తెలియును. అమ్మ ఆరాధన ద్వారా ఆమెను ప్రసన్నము చేసుకొనని వారికి విద్యలు భ్రమ కొలుపునే కాని దర్శన మీయవు. ఆమె సర్వ

విద్యా స్వరూపిణి గనుక అమ్మ ఆరాధన ప్రధానముగ విద్యలు నేర్వవలెను. ఈ కారణముననే విద్యారంభమున సరస్వతి నారాధించుట ఆర్యమగు ఆచారమైనది. సదాచారము లన్నియు ప్రయత్నముచే నిలుపు కొనుట ప్రస్తుత మత్యవసరము. కలిధర్మము కాలము రూపమున ప్రబలు చుండును గనుక ఆచారములను ప్రయత్నమున నిలుపుకొనవలెను. విద్యార్థులకు, విద్యాభ్యాసము చేయువారికి, శాస్త్రజ్ఞులకు శ్రీమాత ఆరాధనము అత్యవసరము. ఆరాధన లేని శాస్త్రజ్ఞానము కలిధర్మము కారణముగ వినాశనము కలిగించును. అసురులందరూ అట్టివారే.



# 706. 'గుహాంబాః'

గుహయందుండు తల్లి శ్రీమాత అని అర్థము.

గుహ యందుండుట యనగా దాగియుండుట, మరుగున నుండుట, రహస్యముగ నుండుట, లోతులలో నుండుట. లోతైన మనసు గల వారికి గ్రహింపు బాగుగ నుండును. లోతులేని మనసు గలవారు ఎండుటాకు వలె గాలివాటు జీవితములు కలిగి యుందురు. ఆత్మావ లోకనము, ఆత్మపరిశీలనము లేనివారు ఆలోచనాపరులు కాని వారు బాహ్య విషయములయం దాసక్తి చెంది తృణప్రాయమగు జీవితమును జీవించు చుందురు. వీరు లౌకికమే ప్రధానముగ మడత నాలుకలతో జీవితము గడుపుచుందురు. ఇట్టివారి జీవనము లౌక్యమే ప్రధానముగ నడచుచుందురు. త్రికరణశుద్ధి యుండదు. ఇట్టివారు కష్టనష్టములు కలిగినపుడు అవలోకనమునకు శ్రీకారము చుట్టుదురు.

శ్రీమాత హృదయమను గుహలో నుండునది. జీవుల సుకృత ఫలములను పానము చేయుచు తదనుగుణమగు ప్రసాదమును అందించు చుండును. సుకృతముల నొనర్చువారి చీకటులను క్రమముగ పార ద్రోలుచు నుండును. సుకృత కార్యముల వలననే జీవులలో లోతులు పెరుగును. చీకటులు క్రమముగ తొలగును. వెలుగుల రుచి కలుగును. శ్రీమాతను హృదయమున భావించుట, ప్రార్థించుట, ధ్యానించుట జరుగును. క్రమముగ ఆమె వెలుగులయందు రుచి కలిగి బుద్ధి

ప్రచోదనము యేర్పడును. నిత్య అనిత్య వివేకము కలుగును. మోహము తొలగును. శ్రీమాత బాహ్యమున ధరించిన జ్యేష్ఠారూపము అదృశ్య మగుచు లక్ష్మీరూపము దర్శనమగుట ఆరంభించును. జ్యేష్ఠాదేవి అలక్ష్మి చిహ్నము. దారిద్ర్య చిహ్నము. ఆకలిదప్పులు, కోరికలు, విషయాసక్తి, పరనింద యిత్యాది వన్నియు దారిద్ర్య లక్షణములు. వీటి నన్నిటిని మలములతో పోల్చుదురు. మలములం దాసక్తి వున్నంతకాలము అమ్మ మరుగునయే యుండును. అదృశ్యముగనే యుండును. శుచి శుభ్రత శుద్ధత్వము నందు కోరి ఆసక్తి పెంచుకొనవలెను. ప్రయత్నముచే మలినములను విసర్జించుకొనవలెను. అట్టి ప్రయత్నమున అలసత్వ ముండరాదు.

సామాన్యముగ జీవులయందు దారిద్ర్యమీ క్రింది విధముగ నుండును.

1. తినకూడనిది తినుట; 2. అనకూడనిది అనుట; 3. వినకూడనిది వినుట; 4. చూడ దగనిది చూచుట; 5. స్పృశింప రానిది స్పృశించుట; 6. కోరకూడనిది కోరుట; 7. అశ్లీలము, అపరిశుద్ధము అగు భావములను భావించుట; 8. తిరుగ కూడని ప్రదేశముల యందు తిరుగుట.

ఈ ఎనిమిది అంశముల యందు అప్రమత్తులై దరిచేరనీయని వారికి అలక్ష్మి బాధ యుండదు. దృష్టిని వాఙ్మయ, ప్రాణమయ, మనోమయ తపస్సునందు నిలుపుట వలన మనసు స్థిరపడి హృదయ

గుహయందు ప్రవేశించుటకు వీలుపడును. అచట లక్ష్మీపథమగు శ్రీమాత స్పర్శ లభింపగలదు. ఈ స్పర్శ లభించినవారు ఆ రుచి వలన పురోగతి చెందుచూ సర్వతోముఖమగు అభివృద్ధిని పొందుదురు.

'గుహాంబా' యనగా గుహునకు తల్లియని కూడ అర్థమున్నది. గుహుడనగా సుబ్రహ్మణ్యస్వామి. అతని స్మరణే చీకట్లను పారద్రోల గలదు. అట్టి మహిమాన్వితుడగు సుబ్రహ్మణ్యుని తల్లి శ్రీమాత.



# 707. 'గుహ్యారూపిణీ'

గుహ్యామగు రూపము గలది శ్రీమాత అని అర్థము.

నవావరణములతో, అష్టప్రకృతులతో మూలప్రకృతిగ ప్రకాశించు శ్రీమాత నిజరూపము గుహ్యాతిగుహ్యాము. ఉల్లిపొరలవలె సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మతమము అగు ప్రకృతులతో శోభిల్లుచుండును. ఆకాశమువలె ప్రకాశించుచుండును. ఈ వర్ణమని, ఈ రూపమని నిశ్చయముగ తెలుపుట కష్టము. అన్నిటికి మూలమగు తత్త్వమెట్లుండునో తెలియుట సాధ్యపడదు. ఆత్మను తెలియుటయే సాధ్యపడని విషయముగ నున్నప్పుడు ఆత్మ మూలమును తెలియుట యెట్లు? త్రిమూర్తులకు కూడ శ్రీమాత రూపము అంతు పట్టదు. ఇక యితరులేమి తెలియగలరు? అట్టి శ్రీమాత ఏ రూపముననైనను దర్శన మీయగలదు. బాలగను, కుమారిగను, షోడశిమూర్తిగను, దుర్గ, లక్ష్మి, సరస్వతీ దేవతలుగను, గాయత్రిగను దర్శన మీయగలదు. కాని ఆమె నిజరూపమును ఎవ్వరును దర్శింపలేరని తెలియవలెను.



# 708. 'సర్వోపాధి వినిర్ముక్తా'

ఏ ఉపాధియు ఆధారముగ లేక యుండునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతకు శబ్దముగాని, రంగుగాని, చిహ్నముగాని, అక్షరము గాని, వేదముగాని ఆధారము కాదు. గుణములు ఆధారము కాదు. మహత్తు ఆధారము కాదు. వెలుగునీడలు కూడ ఆధారము కావు. ధర్మము ఆధారము కాదు. ఆమె అద్వైత రూపిణి. పరబ్రహ్మము. తర్కమున కందదు. శాస్త్రమున కందదు. పై తెలిపిన వాటికన్నిటికిని ఆమె ఆధారము. ఆమె ఆధారపడు వస్తువు ఏమియు లేదు. ఆమె వసించి యుండు ఉపాధి ఏమియు లేదు. ఆమెయే సర్వమునకు, సర్వ ఉపాధులకు ఆధారము. దేహమునకు జీవుడెట్లో, జీవులకు, జీవదేహము లకు ఆమె యట్లు. ఆమె వలన జీవులు, లోకములు, సృష్టి యేర్పడి యున్నవి. ఆమె దేనివలననూ ఏర్పడి లేదు. స్థూల సూక్ష్మ కారణ శరీరములు లేక యుండునది. ఆమె అశరీర.



# 709. 'సదాశివ పతివ్రతా'

సదాశివత్వము ఆమె లక్షణము. 'శివ' మనగా శుభమని, మంగళమని, శుభంకరమని అర్థము.

ఉపాధిలేని శ్రీమాత ఈ లక్షణములతో మాత్రము కూడి యెట్లుండును? అని భావము కలుగ వచ్చును. బ్రహ్మమే శుభము, శివము, మంగళము. బ్రహ్మమే సత్యము, శివము, సుందరము. అట్టి బ్రహ్మత్వమే శ్రీమాత తత్త్వము. సృష్టి యేర్పరచినపుడు కూడ బ్రహ్మత్వము వీడనిది యగుటచే పతివ్రత అని ప్రశంసింపబడుచున్నది. బ్రహ్మము శివము. బ్రహ్మమే పతి. అట్టి బ్రహ్మత్వమును వీడక లోకములుగను లోకులుగను మార్పు చెందుట అనితర సాధ్యమగు కార్యము. బ్రహ్మత్వ మును వీడక సృష్టి గావించుచు నిర్వహించుచు శాసించుచూ యుండు తత్త్వము కలది కాన బ్రహ్మ పతివ్రత యని, శివ పతివ్రత యని, సదాశివ పతివ్రత యని కొనియాడబడుచున్నది.



# 710. 'సంప్రదాయేశ్వరీ'

సంప్రదాయమునకు ఈశ్వరి శ్రీమాత అని అర్థము.

వ్యక్తమగుచున్న ధర్మమే సంప్రదాయము. సంప్రదాయ మనగా సంయక్ ప్రదాయము. వ్యక్తమగుచున్నప్పుడు అందరికిని శాంతిని, ఆనందమును కూర్చునది సంప్రదాయము. ధర్మాచరణము వ్యక్తుల నుండి ప్రకటింపబడుచున్నప్పుడు ప్రశాంతత స్థాపింపబడుచుండును. తృప్తిని, ఆనందమును కలిగించుచుండును. సృష్టి (సృష్ట్యాది) ఆది నుండి ధర్మము ప్రకటింపబడుచునే యున్నది. దాని నాచరించి చూపించు పెద్దలు కూడ సృష్ట్యాది నుండి వ్యక్తమగుచు యున్నారు. ఆచరించు వారి రూపముననే ధర్మము విదిత మగుచుండును. ఆచరించని వారు గోచరించనపుడు ధర్మము తెలియుట సులభము కాదు. పెద్దలు ధర్మము నాచరించు చుండగ స్ఫూర్తి చెంది పిన్నలు కూడ ధర్మము నాచరింతురు. దీనినే సంప్రదాయ మందురు.

ఇంటిలో పెద్దలనుబట్టి పిల్లలు ధర్మము నేర్చుట కవకాశ మున్నది. సంఘములో పెద్దవారినిబట్టి చిన్నవారునూ ధర్మమును నేర్వ గలరు. పాలకులు ధర్మము ననుసరించిన ప్రజలును ధర్మము నేర్తురు. మొత్తము సంఘమునకు ధర్మమును నేర్పు ఆచార్యులుండుట అదృష్టము. ఆచార్యులనగా తాము ధర్మము నాచరించుచూ ఇతరులకు నేర్పువారు.

పై విధముగ సంప్రదాయము పెద్దల నుండి పిన్నలకు, పాలకుల నుండి ప్రజలకు, గురువుల నుండి శిష్యులకు అందింపబడుచుండును. ధర్మవిరుద్ధమగు ఆచారములు సంప్రదాయములు కానేరవు.

మూఢత్వము, చాదస్తముతో కూడిన అలవాట్లు సదాచారము కానేరదు. ధర్మాచరణమే సదాచారము. అట్టి ధర్మము గుహ్యముగ నుండును. ఆచరణము ద్వారా అది ప్రకటింపబడుచుండును. అందువలన ధర్మమే ధర్మమునకు ఆలంబనము.

శ్రీరాముడు మానవ ధర్మము లన్నింటినీ ఆచరించి చూపిన ధర్మ స్వరూపము. అతని ననుసరించుటయే మానవ ధర్మము. రామ కథ తెలియనివారు మానవ ధర్మము తెలియలేరు. మహా భారతమున ధర్మము లన్నియు వివరింపబడినవి. వేదవ్యాస మహర్షి ధర్మమును తుదకు ఈ విధముగ నిర్వచించినాడు. "యితరులు తన కేమొనర్చిన తనకు సహింపదో తా నితరుల కట్టి వొనరింపరాదు." ఇట్టి ధర్మము ఆచరించిన మహాత్ముల జీవితములు ధర్మమునకు ఆలవాలమై యుండును.

మొత్తము సృష్టి యందలి ధర్మము లన్నింటికినీ శ్రీమాత ఈశ్వరి. త్రిమూర్తులకు, ఆదిత్యులకు, రుద్రులకు, వసువులకు, ప్రజాపతులకు, మనువులకు, దిక్పాలకులకు, గ్రహములకు ధర్మము నేర్పరచి సృష్టి నిర్వహణము గావించుచున్నది. సంప్రదాయమును ఎప్పటికప్పుడు స్థాపనము చేయుచు నున్నది. సంప్రదాయ విరుద్ధమగు భావములకు, భాషణములకు, కార్యములకు అంతము కలిగించు చున్నది.

సంప్రదాయ పరముగ ధర్మాచరణమున నిలచిన జీవులకు వృద్ధిని కలిగించు చున్నది. సర్వ విద్యలను గురు ముఖమున సంప్రదాయ పరముగ నెరుగవలెను. అనుసరించుచూ బోధించువాడే నిజమగు గురువు. అట్టి వాని రూపమున శ్రీమాతయే విద్యలను నేర్పును. సంప్ర దాయమున స్థిరపరచును.

# 711. 'సాధు'

**యు**క్తమైనది శ్రీమాత అని అర్థము.

యుక్తమైనది యనగా తగినది అని అర్థము. కలుపునది అని మరియొక అర్థము. శ్రీమాత సంయుక్త అని కీర్తింపబడుచుండును. అనగా అన్నిటినీ కలిపి యుంచును. లోకములన్నియు గొలుసుకట్టుగ కలిసియే యున్నవి. జీవులందరునూ కూడ విడివిడిగ యున్నట్లు గోచరించు చున్ననూ అందరును కలిసియే యుందురు. అదియే తగినది. అదియే సరియైన విధము. అన్నిటియందు సత్ చిత్ రూపముగ శ్రీమాతయే వ్యాపించి యున్నది. అట్లు తగిన విధముగ సృష్టి నేర్పాటు గావించి జీవుల పరిణామమునకు తోడ్పాటు గావించును. పరస్పర మైత్రి, పరస్పర వైవిధ్యము, పరస్పర విరోధము కూడ తగిన విధముగ నేర్పరచు చుండును. ఒకరి నుండి ఒకరు నేర్చుకొనవలసిన విషయము లను నేర్పుటకు వైరుధ్యము కూడ ఒక విధానమే. పాములకు నేర్పుటకు గరుత్మంతు డుండును. గరుత్మంతునికి నేర్పుటకు హనుమంతు డుండును. హనుమంతునికి నేర్పుటకు సూర్యుడుండును. కంసునికి నేర్పుటకు కృష్ణుడుండును. సత్యభామకు నేర్పుటకు రుక్మిణి యుండును. కైకేయికి నేర్పుటకు భరతుడుండును. రావణునకు నేర్పుటకు రాముడుండును. ఇట్లు ప్రతి జీవికిని మరియొక జీవి మిత్రత్వమున గాని, శత్రుత్వమున గాని నేర్పుచునుండును. కామము వలన గాని, భయము వలన గాని,

ప్రేమ వలన గాని, మిత్రత్వము వలన గాని, భక్తి వలన గాని, క్రోధము, ద్వేషము వలన గాని జీవులు క్రమముగ నేర్చుచునే యుందురు. అనుభవ జ్ఞానమును పొందుచునే యుందురు. అనుభవ జ్ఞానము ద్వారా ఆత్మజ్ఞానము కూడ పొందుదురు. ఇట్లు యేర్పరచుట శ్రీమాతకే సాధ్యము. సురులకు అసురులచే హద్దులు పెట్టుచుండును. రవి చంద్రులకు రాహు కేతువులచే హద్దులు పెట్టు చుండును. అహంకారమునకు అమిత వినయముచే హద్దులు పెట్టును. ఇట్లన్నిటినీ సమపాళ్ళలో యేర్పరచి నిర్వహించు చుండును. సృష్టి అమరిక అతి చిత్రము. అవగాహన చేసుకొనుచున్న కొలది అంతయూ సరిగనే యున్నదని తెలియును. అవగాహన లేని వారికి లోపభూయిష్టముగ కనిపించును. తమలో లోపములు నిర్మూలింపబడినపుడు సృష్టియం దేలోపము గోచరింపదు. జీవులు పూర్ణ జ్ఞానము పొందుటకు తగినట్లుగ లోకాలోకముల సృష్టి నేర్పరచి శ్రీమాత సాధు శబ్దమునకు తగినది.



# 712. 'ఈ'

అనుసంధాయిని శ్రీమాత అని అర్థము.

అకారము బ్రహ్మము. ఈ కారము బ్రహ్మము నుండి ఉత్పన్న మగు సంకల్పము. సంకల్పమే బ్రహ్మము నుండి సృష్టిని వ్యాప్తి చేయును. సృష్టికిని బ్రహ్మమునకును అనుసంధాయియై నిలచును. ఈ సంకల్పము కామబీజము. కామము వలననే బ్రహ్మము నుండి సృష్టి వ్యాప్తి జరుగును. కామము వలననే జీవులు కదలుచున్నారు. నిద్ర లేచుట, కదలుట, పనులు చేయుట, తిరుగుట, భావించుట, భాషించుట యిత్యాది కార్య కలాపమంతయూ కామ మాధారముగనే జరుగును. సంకల్పమే లేనిచో కదలికయే లేదు. ఇట్టి సంకల్పశక్తిని ఈంకార మందురు.

చూచువాడు, చూడబడు వస్తువు ఒకదానితో నొకటి అనుసంధా నము చెందుటకు సంకల్పమే పునాది. సంకల్పమే లేనిచో చూచుట యుండదు. వినుట యుండదు. తినుట యుండదు. చూచుట, వినుట, తినుట అను కార్యమున బ్రహ్మము సంకల్పరూపమున వ్యాప్తి చెంది ఆనందము పొందును. అట్లే సంకల్పము లేనిచో అనుభూతియూ లేదు. అనుభూతికిని ఆనందమునకును ఈంకారమే ఆధారము.

సృష్టి యందు 'అ'కారము పురుషుడు. 'ఈ'కారము స్త్రీ. జీవు లందరును 'అ'కార 'ఈ'కారములతో కూడియుందురు.'అ'కారము తండ్రి. 'ఈ'కారము తల్లి. సృష్టి జీవులు సృష్టి సంతానము. స్త్రీ లేనిదే

సంతానము, సృష్టి లేవు. సృష్టిని, సంతానమును తండ్రితో అనుసంధా నము చేయునది కూడ తల్లియే కదా! ఈంకార రూపిణియగు శ్రీమాత కరవుగ నున్నచోట, జీవులు పొడి మెతుకుల వలె జీవించు చుందురు. ప్రేమ అనురాగము లుండవు. ఆదరణ ఆప్యాయతలు యుండవు. వైభవ ముండదు. కళా కాంతు లుండవు. ఒకరికొకరు గాక ఎవరికి వారుగ జీవితములు గడుచుచున్నచోట శ్రీమాత అస్థిత్వము అంతంత మాత్రముగ నుండును. ఎడారివలె జీవితములు సాగుచుండును. ఈం కార రూపిణియగు శ్రీమాత యున్నచో పరస్పరము జీవుల మధ్య ఆర్ద్రత యుండును. పుష్టి యుండును. ప్రదేశ మంతయు పుష్కరమై శోభిల్లును. 'ఈం'కారమే సృష్టి యందు కల్పవృక్షము. 'ఈం'కారమే కామధేనువు. అ, ఇ, ఉ అను మూడు అచ్చులలో ఈంకారము మధ్యస్థ. ఈంకారము లేని అకారమునకు శోభలేదు. గృహిణి లేని యింటికి శోభ లేదు. గృహిణి సౌశీల్యమే యింటికి శోభ. శ్రీమాతయే సృష్టికి శోభ.



# 713. 'గురుమండలరూపిణీ'

గురుమండల రూపమున నుండునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతను సంపూర్ణముగ ఎవ్వరెరుగ గలరు? కేవలము పరమ శివుడే ఎఱుగ గలడు. అతడు ఆది గురువు. అతని నుండి తమ తమ గురువుల వరకు గల గురుపరంపరయే గురుమండలము. ఈ మొత్తము గురుమండలము రూపమున శ్రీమాత యున్నది. శ్రీమాత రూప రహస్యము, తత్త్వ రహస్యము గురు ముఖముననే తెలియగలదు. సద్గురువుల ముఖము నుండియే "ఈం" యొక్క స్వరూప స్వభావములను నిశ్చయముగ తెలుసుకొనవచ్చును. మాయా స్వరూపిణి యగు శ్రీమాత గుహ్యాతి గుహ్యమగు రహస్యము. బ్రహ్మవేత్తలే ఈ రహస్యమును తెలుపగలరు. అందువలన గురు శుశ్రూష చేయుచు గురువనుగ్రహము పొంది గురూపదేశముగ శ్రీవిద్య నభ్యసింపవలసినదే గాని మరొక మార్గమున తెలియదు. కేవలము పుస్తక జ్ఞానము వలన శ్రీమాత లభింపదు. తెలిసినవారి ముఖము నుండి తెలియగోరు జిజ్ఞాసువులకు తెలుపబడుచు నుండునది శ్రీమాత.

భగవద్గీత యందు శ్రీకృష్ణుడీ విషయమునే తెలిపినాడు.

"నే నీ యోగమును సూర్యుని కిచ్చితిని. సూర్యుడు తన పుత్రుడైన మనువున కందించెను. మనువు తన పుత్రుడగు ఇక్ష్వాకున కందించెను. ఇట్లు ఈ యోగము పరంపరాగతముగ భూమిని చేరెను."

తండ్రి నుండి కుమారునకు, గురువు నుండి శిష్యునకు చేరునది నిజమగు విద్య. అదియే గాయత్రి. యోగినీ హృదయము అను గ్రంథ మందు కూడ ఈ విషయమే నిశ్చయముగ తెలుపబడినది. "భూమండల మున ఒకరి నుండి యొకరికి శ్రీవిద్య వినికిడి వలన అందింపబడినది." శృతి, స్మృతి విద్యకు మూలము. ఉపదేశములు విని మననము చేయుచూ, ఉపదేశింపబడిన విద్యను స్మృతి యందు ధరించవలెను. ధరింపబడిన ఉపదేశము, దేశికుని ఉత్తీర్ణుని చేయును. ఉపదేశములను కాగితములపై వ్రాసుకొనుట సంప్రదాయము కాదు. విని మననము చేయుచు ధరించి యుండుట సంప్రదాయము. ఈ మార్గమునే శృతి, స్మృతి మార్గ మందురు. వేద మంతయూ యిట్లే తెలుపబడినది.



# 714. 'కులోత్తీర్ణా'

**అ**తీంద్రియ స్వరూపిణి శ్రీమాత అని అర్థము.

కుల మనగా యింద్రియముల గుంపు. ఉత్తీర్ణ యనగా పై నుండునది అని అర్థము. ఇంద్రియముల గుంపునకు పైన మాత్రమే శ్రీమాత లభ్యమగును. ఇంద్రియములందు వశించువానికి లభ్యము కాదు. ఇంద్రియములు బాహ్య ప్రపంచమును గోచరింపజేయును. బాహ్యమున తిరుగాడు ప్రజ్ఞ విషయాసక్తితో నుండును. ఆసక్తి వలన బాహ్య విషయముల యందు మునిగి యుండును. ప్రజ్ఞ పంచేంద్రియ ముల ద్వారమున, వాగ్రూపమున చీలికలై ప్రవహించి క్షీణించును. ఇట్టి ప్రజ్ఞకు అనుభూతి, ఆనందము అంతంత మాత్రమే. ఆరు గుఱ్ఱముల రథము ఆరు దిశలుగ లాగబడుచున్నప్పుడు రథము నశించును. ఇట్లు చీలికలై బాహ్యమునకు ప్రవహించుచున్న ప్రజ్ఞను అంతరంగము చేర్చినపుడు ఒకటిగ నిలచును. అట్టి ప్రజ్ఞ బలముగను, స్థిరముగను యుండును. బలము, స్థిరము కలిగిన ప్రజ్ఞకే సుఖ ముండును. ఈ మూడు గుణములు గల ప్రజ్ఞ శ్రీమాత ఆరాధనకు అర్హత పొందును. కులముల గుంపులో యిమిడిపోయిన ప్రజ్ఞకు శ్రీమాత లభ్యము కాదు గనుక ఆమెను 'కులోత్తీర్ణా' అని ప్రశంసించు చున్నారు.

ఇంద్రియ జయము లేనివారికి దివ్యానుభూతి లేదు. బాహ్య విషయాసక్తితో మరణించుటయే యుండును. అంతరంగము చేరనిదే

నిజమగు విద్యాభ్యాసము లేదు. సమస్త సాధనలు అంతరంగమందే సాగవలెను. అంతరంగమే నిజమగు విద్యాలయము. అంతరంగమందు నేర్చిన విద్యకు బహిరంగముగ ప్రయోగశాల. సత్సాధకులు బహిరంగ మందలి ఆసక్తిని నియమించుకొని అంతరంగము చేరి సాధన చేయ వలెను. అందులకే శ్రీకృష్ణుడు యుక్తాహార విహారములను నిర్దేశించి నాడు. బాహ్య జీవనమును మితముగ నుంచుకొని అంతరంగమున చేరి ఆరాధనములను చేయవలెను. అంతరంగమందు చేరిన ప్రజ్ఞ బుద్ధియందు నిలచును. దివ్యత్వము బుద్ధి గ్రాహ్యమేగాని యింద్రియ గ్రాహ్యము కాదు అని కూడ శ్రీకృష్ణుడు తెలిపినాడు.

మితభాషణము, మితభోజనము, శుచి, శుభ్రత, అహింసాది నియమములు పాటించినచో ప్రజ్ఞ బాహ్యాసక్తిని విడును. దానధర్మములు గావించినచో కర్మము సులువిచ్చును. యమనియమములు గలవారికే అంతరంగ ప్రవేశము సులభమగును.



# 715 'భగారాధ్యా'

**భ**గమండలమున ఆరాధింపదగినది శ్రీమాత అని అర్థము.

భగమండల మనగా సూర్యమండలము, సవితృమండలము, భర్గోదేవ మండలము లేక సూర్య సవిత ఆదిత్య లోకములు. మనయందు ఈ లోకములు అనాహతము, ఆజ్ఞ, సహస్రారములందు భాసించును. ఈ లోకములను చేరి ఆరాధించుట మార్గముగ ఈ నామము తెలుపు చున్నది.

ఇంద్రియముల నుండి మనస్సు తిరోగమించి అంతరంగమున చేరి హృదయమందు గల హిరణ్మయ కాంతులను ఆరాధన చేయుట ప్రాథమికము. ఈ హిరణ్మయ కాంతులు బాలభానుని కాంతులవలె జీవప్రజ్ఞను స్పృశించు చుండును. అనాహత మందు ఈ కాంతి దర్శనము జరుగుచుండును. ఈ దర్శనము స్థిరపడవలెను. అపుడు జీవప్రజ్ఞ చిత్తము నుండి బుద్ధిని చేరును. బాహ్యాము నుండి అంతరంగమును చేరిన చిత్తము ఇపుడు బుద్ధిని చేరును. ప్రజ్ఞ బుద్ధి యందున్నప్పుడు సమస్తము హిరణ్మయ కాంతులుగ గోచరించును. పదార్థమయ రూపములు అంతంత మాత్రముగనే గోచరించుచు వాని లోపలి కాంతి రూపములు గోచరించును. పదార్థమునకు వెనుక నున్నది కాంతియే. సప్త కాంతులతో పదార్థమయ రూపములు గోచరించును.

హిరణ్మయ లోకములలో బుద్ధిగ స్థిరపడిన జీవప్రజ్ఞ అనాహతమున స్థిరముగను, సుఖముగను యుండును. అట్టి ప్రజ్ఞ బుద్ధిమయ

కాంతులకు మూలమైన ఆత్మపై ఆరాధనను సాగించవలెను. అది ఆజ్ఞా కేంద్రమందు వజ్రకాంతులతో ప్రకాశించుచు నుండును. మన యందలి సవితృ కేంద్రము ఆజ్ఞాకేంద్రమే. బుద్ధియందు నిలచి ఆత్మధ్యానము చేయుట రెండవ మెట్టు. ఇంతకు పూర్వము సాధకుడు చిత్తమున నిలచి బుద్ధిలోకముల ధ్యానము చేయుట మొదటి మెట్టు. అంతకు పూర్వము బాహ్యము నుండి అంతరంగము చేరుట ప్రాథమికము.

బాహ్యాంతర మందలి చిత్తము బుద్ధిని చేరి ఆత్మను ధ్యానించుట సవితృమూర్తి ఆరాధనగ తెలియవలెను. సవితృ మండలము వజ్ర కాంతులతో విరాజిల్లు చుండును. మధ్యాహ్న సూర్యునివలె వెలుగొందు చుండును. ఆ కాంతుల నారాధించుచు ఆజ్ఞాకేంద్రమున ధ్యానించుట స్థిరపడినపుడు క్రమముగ జీవప్రజ్ఞ ఆజ్ఞాకేంద్రమును చేరును. అపుడు వజ్రమయ కాంతులతో కూడిన లోకమును ప్రవేశించును. అదియే సవితృ లోకము.

సవితృ లోకమున చేరిన ప్రజ్ఞ వజ్రపు వెలుగులకు మూలమైన భర్గోదేవతను ధ్యానింపవలెను. ఆ కేంద్రము సహస్రారమున నున్నది. అదియే శ్రీచక్ర మేరు. శ్రీమాత నిజస్థాన మదియే. అదియే గాయత్రి, సావిత్రి, సరస్వతి, చందర్షి, అదితి ఇత్యాది నామములతో కొనియాడ బడు వెలుగుల మూలస్థానము. ఇది శ్యామల వర్ణముతోకూడి అపరి మితమై భాసించుచు నుండును. కేవలము తపస్సు ద్వారానే ఈ లోకము చేరుట సాధ్యము. ఈ లోకము చేరిన తపస్విజనులు సత్యలోక ప్రాప్తికై అనగా బ్రహ్మలోక ప్రాప్తికై తపస్సు చేయుచు వేచియుందురు.

ఇట్లు శ్రీమాత ఆరాధన భూమండలము నుండి సూర్య మండలము చేరుటకు, అట నుండి వరుసగా సవితృ లోకము, ఆదిత్య లోకము, సత్యలోకములకు చేరుటకు నిర్వర్తించవలెనని ఈ నామము బోధించు చున్నది. సోపానక్రమమున వెలుగులను ఆరాధన చేయుచు అంతర్యామియైన శ్రీమాతను చేరుట ప్రధానము. జీవుడు ఆమె నుండి జనించినవాడే గనుక ఆమెను చేరుట పరమావధి. చేరు మార్గము వెలుగుల మార్గమే. ఆ మార్గము మానవులయందు సుషుమ్న మార్గమున యేర్పడి యున్నది. అంతరంగమును చేరి సుషుమ్న మార్గమున పయ నించుట కర్తవ్యము.



# 716. 'మాయా'

సత్యమును మరుగు పరచునది, అసత్యమును సత్యముగ ప్రకటించునది మాయా అని అర్థము.

బ్రహ్మము గోచరింపదు. కాని యున్నది. శాశ్వతముగ నున్నది. అది తెలియుటకు సాధ్యపడదు. బ్రహ్మమును చేరినవాడు బ్రహ్మమే యగును గనుక తెలియువాడుండడు. తెలియుట యుండవలెనన్నచో తెలుసుకొనువాడు, తెలియబడు వస్తువు, తెలియుట అనునవి యుండ వలెను. తెలుసుకొనువాడు తెలియబడు విషయమున లీనమైనపుడు తెలియుట యుండదు. అందువలన తెలియబడు బ్రహ్మము తెలియుట యుండదు. తెలియుట యుండవలెనన్నచో తెలియువాడు విడిగ నుండ వలెను. బ్రహ్మము నుండి విడిపడి బ్రహ్మము చూచుట, ఆనందించుట అనుభూతి. బ్రహ్మమే యగుట జరిగినపుడు అనుభూతి యుండదు. ఉండుటయే యుండును. అనుభూతి ఆనంద కారకము. అట్లు ఆనందము కొఱకే ఒకటి రెండగును. నిజమున కది ఒకటియే. రెండుగా యేర్పడి మొదటి దానిని అనుభవించుచు నుండును. శివశక్తులు ఒకటియే. శివుడుగను, శక్తిగను యేర్పడి నృత్యము చేయుట ఆనందము. జంటగ ఆడుకొనుటలో ఆనంద మెక్కువ. ఒకటి రెండగుట మాయ వలననే. ఒకటి సత్యము, రెండు మొదటిదాని మాయా స్వరూపము. మొదటి వస్తువు సత్యము. రెండవది ప్రతిబింబము. బింబము లేకున్ననూ వస్తువు వుండును. వస్తువులేక బింబముండదు. ఎన్ని అద్దములున్న

అన్ని బింబము లుండును. ఇట్లేర్పరచు శక్తి మాయ. నిజమునకు అనేకానేకములుగ గోచరించు వస్తువులు లేవు. ఒకటియే ఇన్ని అయినవి. ఇన్నిగ నున్నప్పుడు మొదటి వస్తువు గోచరింపదు. దాని ప్రతిబింబములే గోచరించును. ప్రతిబింబములే సత్యమనిపించును. చెట్టు–పుట్ట, జంతువు – మనిషి, పురుగు – పుట్ర– యిత్యాది వెన్నియో గోచరించి భ్రమ గొలుపును. దీనితో సంబంధముల నేర్పరచుకొని జీవులు భ్రాంతిలో పడుదురు. అన్య మున్నదనుకొనుట భ్రమ. దానితో పెట్టుకొను సంబంధము భ్రాంతి. మరియొక జీవిని స్త్రీగను, పురుషుడు గను చూచుట భ్రమ. భార్యగను, భర్తగను సంబంధపరముగ చూచుట భ్రాంతి. తన భార్య, తన భర్త అనుకొనునపుడు భార్య అను పదార్థము గాని, భర్త అను పదార్థముగాని ప్రత్యేకముగ ఏమియునూ లేదు. కేవలము భావనయే, భ్రాంతియే. ఎదుటి వ్యక్తి స్త్రీ అనుకొనుట, పురుషుడు అనుకొనుట కూడ భ్రమయే. ఇట్లు భ్రమ, భ్రాంతులను గొలుపుచూ రసోపేతముగ సృష్టిని అల్లిక చేసినది శ్రీమాత మాయాశక్తియే.

మాయ వలన మార్పు గలుగుచుండును. మార్పు గలుగు చున్నప్పుడు మూలవస్తువు గ్రహింపునకు రాదు. మంచుగడ్డ నిజమునకు నీరే. ఆవిరియే నీరైనది. గాలిలో తేమయే ఆవిరిగ మారి నీరై మంచుగడ్డ అగుచున్నది. గాలిలో తేమ వేడిమితో హరింపబడినపుడు కేవలము గాలిగనే యుండును. గాలి ఆకాశము యొక్క కదలికయే. ఆకాశము కదలిక అయినప్పుడు గాలి అగుచున్నది. గాలిలో వేడిమి, చలి సూర్యుని కాంతివలన యేర్పడుచున్నది. నిజమున కంతయు ఆకాశమే. ఆకాశమే

పంచభూతములుగ యెప్పుడునూ మార్పు చెందుచు నుండును. అంతా ఆకాశమే అనునది సత్యము. కాని మార్పు వలన పంచభూతములతో కూడిన అనేకానేక ఆకారములు కనబడుచున్నవి. ఇది మాయా తత్త్వము.

జీవుడే బాలుడుగను, యువకుడుగను, మధ్యవయస్కుడుగను, వృద్ధుడుగను మార్పు చెందుచు నుండును. జీవుడే స్త్రీగను, పురుషుడు గను, మనిషిగను, జంతువుగను రూపములు ధరించు చున్నాడు. జీవులను గుర్తింపక రూపములను, వాని స్వభావములను గుర్తించుట మాయ. ఇట్లు మాయ వలన, జగత్తు జీవులుగ బ్రహ్మము గోచరించుచు నున్నాడు. మాయను తెలిసినవారు కూడ మాయలో పడుచుందురు. మాయను దాటుట జీవుల కసాధ్యము. బ్రహ్మమును ప్రకటించు మాయ మాత్రమే బ్రహ్మము నెరిగి యుండును. మాయచే అనుగ్రహింపబడిన వారు కూడ బ్రహ్మమును దర్శించగలరు. బ్రహ్మమును చేరగలరు. అందువలన శ్రీ మాయను ఆరాధించుట ఉపాయమై నిలచినది. మాయ వలననే వెలుగు పుట్టును. ప్రకృతి, కాలము కూడ మాయాధారముగనే సమస్తమును నిర్వర్తించు చుండును. మాయను దాటింపమని మాతను పూజించుట తప్పనిసరి. అట్టి మాయనే దుర్గ యని కూడ అందురు. దుర్గ అనగా దాటలేనిది అని అర్థము. దాటలేని మాయను దాటించ మని దుర్గను ప్రార్థించు ఆచారమును ఋషులేర్పరచినారు. మాయను శరణుగోరుట ప్రపత్తి మార్గము.

# 717. 'మధుమతీ'

పరమానందముతో కూడిన మతి కలది శ్రీమాత అని అర్థము.

మాధుర్య భావముతో నిండిన మనస్సును మధుమతీ అని పిలుతురు. మాధుర్యము ఏడు లోకములందును వ్యాపించి యున్నది. అందు అత్యుత్తమమగు మాధుర్యము ఏడవ లోకమున వుండును. ఏడవ లోకమున జీవుడు బ్రహ్మముతో కూడియుండు స్థితి యుండును. ఈ స్థితియే పరమానందము. బ్రహ్మముతో ఐక్యము చెందినచో బ్రహ్మమే అయి వుండును. అట్లుగాక కూడియున్నచో సమస్తమునందు బ్రహ్మమును ఆస్వాదించుచు ఆనందించుచూ నుండవచ్చును. ఇదియే తారక స్థితి. అనగా అత్యుత్తమ మగు తరింపు. ఈ స్థితియందు సమస్తము నందు బ్రహ్మముతోనే యున్నట్లుండును. **"పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్, భాషించుచున్ హాస నిద్రాదులు చేయుచున్..."** ఇట్లు అన్ని అవస్థల యందును ప్రహ్లాదుడు పరమానందమునే పొందెను. ప్రహ్లాదుడనగా అమితమగు ఆహ్లాదము కలవాడని అర్థము. స్వప్న జాగ్రత్ సుషుప్తి తుర్యావస్థలలో అన్నిట అతనికి దైవానుభూతియే కలిగినది. మధుమతీ నామమునకు ప్రహ్లాదుడు, అంబరీషుడు సరియగు ఉదాహరణములు.

పరమ భక్తులకే మధుమతీ స్థితి యుండును. అన్ని కాలముల యందు, అన్ని దేశముల యందు, అన్ని అవస్థల యందు దైవముతోనే

కూడి ఆనందించుట మధుమతీ తత్త్వము. మధుమతీ తత్త్వమునే రాధామాధవముగ కవులు కీర్తించిరి, గానము చేసిరి. గోపికలు శ్రీకృష్ణునితో శరదృతువు నందు రాత్రి వేళల పొందిన దివ్య రసానుభూతి కూడ మధుమతీ భావమే. అటుపైన గోపిక లందరికిని గోకులము నందు సమస్తము కృష్ణునిగనే గోచరించినది. గోవులు, దూడలు, పతులు, కుటుంబ సభ్యులు, గ్రామస్థులు, వృక్షములు, జంతువులు, పక్షులు యిత్యాది వన్నియూ కూడ కృష్ణునిగనే గోచరించినవి. సమస్తమునందు మాధవునే దర్శించుచూ మధుమతీ భావమున జీవితమును గడిపిరి. దేవర్షి యగు నారదునికి కూడ ఆశ్చర్యము కలిగించు రీతిలో వారి భక్తిభావము ప్రకటింపబడినది.

మధుమతి ననుగ్రహించుటలో శ్రీకృష్ణుని మించిన దైవము లేడు. శ్రీకృష్ణుడనగ శ్రీలలితయే. కృష్ణ మూలము శ్రీ లలిత. కృష్ణ భావము ప్రేమ భావమై నిలచినచో లభించునది మాధుర్యము. దివ్య ప్రేమకు మారు పేరు కృష్ణప్రేమ. కృష్ణప్రేమను రుచి చూచిన సక్కుబాయి, నామదేవుడు, పుండరీకుడు, తుకారాం పొందిన దివ్య అనుభూతి భక్తికి పరాకాష్ఠ. పాండురంగని భక్తులందరునూ కృష్ణ ప్రేమయందు తరించిన కథలు మధుమతీ భావమును ఆవిష్కరించును.



# 718. 'మహీ'

మహత్తుగ వ్యాపించినది శ్రీమాత అని అర్థము.

సృష్టి తత్త్వములలో మహత్తు అత్యంత ప్రాధాన్యము కలిగిన తత్త్వము. మహత్తు నుండియే సమస్తము పుట్టును. పుట్టిన సమస్తము నందునూ మహత్తు నిండి యుండును. మహత్తనగా చోటు. అందు భూతము, వర్తమానము, భవిష్యత్తు కాలము లుండును. జీవులు కూడ అందే యిమిడి యుందురు. ప్రకృతి కాలముల సమాగమ ప్రజ్ఞయే మహత్తుగ యేర్పడును. మహత్తు నుండి మహదహంకారము పుట్టును. అందుండి త్రివిధములగు అహంకారములు పుట్టును. అందుండి జీవులు పుట్టుదురు. జీవుల యందు సత్త్వము, రాజసికము, తామసికము అగు అహంకారము లుండును. పంచేంద్రియములు, పంచభూతములు, కర్మేంద్రియములు, తన్మాత్రలు కూడి జీవులకు దేహము లేర్పడును. ఈ మొత్తము ఇట్లేర్పడుట, వృద్ధి చెందుట, మరల లయమగుట మహత్తు నందే జరుగును.

మన చుట్టునూ గల చోటువలె మహత్తు యున్నది. మన లోపల గూడ చోటు యున్నది. ఇట్లు లోపల వెలుపల వ్యాపించియున్న సర్వ శక్తిమంతమగు చోటును మహత్తని పిలుతురు. రెండు వస్తువుల నడుమ నున్నది చోటే. రెండు వస్తువుల లోపల నున్నది కూడ చోటే. ఈ చోటునే మహిమ అని, మహత్తని, మహీ అని పిలుతురు. మాఘ మాస మనగా మహీ తత్త్వముతో కూడిన మాసము. మహాత్ములు

యనగా మహత్తును తెలిసినవారని అర్థము. వీరిని మహీకులు అని కూడ యందురు. మహీకనులు, మెక్సికన్‌లు అని మహీక నామము రూపాంతరము చెందినది. నక్షత్రములలో మఘ నక్షత్రము మహత్తు, ప్రభావము అధికముగ కలిగిన నక్షత్రము. మహా అను శబ్దమే 'మఖ' అను శబ్దముగ రూపాంతరము చెందినది. ఆంగ్లమున ఈ శబ్దము 'మాగస్' అయినది. మాజిక్ అనగా మహత్తే కదా!

శ్రీమాత మహత్తే మహి. మహాతత్త్వము ఆధారముగనే సృష్టి స్థితి లయములు యేర్పడుచున్నవి. అన్నియు చోటులో పుట్టి, చోటులో పెరిగి, చోటు లోనికే లయమగును. పూర్వము లేనట్లున్నవి వున్నట్లుగ గోచరించును. ఉన్నట్లున్నవి మరల లేనట్లగును. ఉండుట, లేకుండుట, అవతరించుట, అదృశ్యమగుట ఇవి అన్నియు మహత్తు లక్షణములు. ఈ సృష్టి అంతయూ దైవము యొక్క మహిమయే యని తెలుపుటకు **"ఏతావానస్య మహిమాన్"** అని వేదము కీర్తించుచున్నది.



# 719. 'గణాంబా'

గుణములకు తల్లి శ్రీమాత అని అర్థము.

గణములనగా గుంపులు. గుణము లాధారముగ తత్త్వములను విభజన చేసి గణములు నేర్పరుచుట సృష్టి నిర్వహణమున ప్రధానమగు కార్యము. అనంతము, అనుస్యూతము, శాశ్వతము అయిన నాద బ్రహ్మమును శబ్దములుగ నేర్పరుచుట, శబ్దములకు రూపముల నిచ్చుట, అనేకానేక విధమగు కలయికలతో పదముల నేర్పరచుట. అదే విధముగ ఆదిత్యమైన వెలుగును కూడ అనేకానేకమగు రంగులుగ నేర్పరచుట, శబ్దములు, రంగులు మేళవింపుగ రూపముల నేర్పరుచుట, లోకముల నేర్పరుచుట, లోకములందు గుంపులు గుంపులుగ జీవుల నేర్పరుచుట. ఇట్లు బృహత్తరమగు గణ విభజనా కార్యము శ్రీమాత నిర్వర్తించు చుండును. ఇది అంతయూ ఆమె సంసారము.

ఆదిత్యులుగను, రుద్రులుగను, వసువులుగను, ప్రజాపతులుగను గణవిభజన చేయును. సురలుగను, అసురులుగను, మనుష్యులుగను, జంతువులుగను, వృక్షములుగను, ఖనిజములుగను గణవిభజన చేయును. అట్లే సప్త మరుత్తులుగను, సప్త అగ్నులుగను, సప్త సముద్ర ములుగను, సప్త ధాతువులుగను, సప్త ఆకాశములుగను విభజన చేయును. ఈ గణవిభజన సృష్టి యందు తామరతంపరగ సాగు చుండును. త్రిగుణములు, పంచభూతములుగ తానే అష్ట ప్రకృతులై గణవిభజనా కార్యమును కొనసాగించు చుండును.

గణవిభజనలు గావించి గణపతుల నేర్పరచును. గణపతులందరికి నాయకుడుగ తానే ఒక గణపతిని సృష్టించెను. అనేకానేకములగు స్వభావముల రూపమున గుంపులు గుంపులుగ జీవులందరూ ఇన్ని లోకములందు యేర్పడి యున్నారు. ఎన్ని కన్నులున్న అన్ని విధములుగ సృష్టిని విభజించుకొనుచు అవగాహన చేసుకొనవచ్చును. శ్రీమాత గణాంబ స్వరూపమును వర్ణించ నలవి కాదు.



# 720. 'గుహ్యకారాధ్యా'

గుహ్యకులచే ఆరాధింపబడినది శ్రీమాత అని అర్థము.

గుహ్యమనగా రహస్యము. గుహ్యకులనగా రహస్యముగ కార్య నిర్వహణము చేయువారు. దివ్యమగు గూఢచారులు. దేవతలలో గుహ్యకులను వారు ఒక విభాగము. వీరు సూక్ష్మమగు సృష్టియందు శ్రీమాత నిర్దేశము ననుసరించి సృష్టికార్యము చేయుచు నుందురు. సూక్ష్మలోకములలో జరుగు కార్యముల ఫలితమే స్థూల లోకములందు అవతరించును. సూక్ష్మ లోకములకు కుబేరుడు అధిష్ఠాన దేవత. స్థూల లోకములకు నిఋతి అధిష్ఠాన దేవత. సృష్టి యందు యక్షస్సులు, రక్షస్సులు అను రెండు రకములగు ప్రజ్ఞ లున్నవి. యక్షస్సులు సూక్ష్మలోక ప్రజ్ఞలు. వారు సూక్ష్మ లోకములను నిర్వహించుట, పరిపాలించుట చేయుచుందురు. రక్షస్సులు స్థూలలోకములు నిర్వహించుట, పరిపాలించుట చేయుదురు. సూక్ష్మలోకము లన్నియు కోమలములు, దివ్యములు, సుందరములు. సంఖ్య శబ్దము వర్ణము ఆధారముగ సూక్ష్మముగ వెలుగులతో కూడిన రూపములతో నుండును. వీని ఆధారముననే స్థూల రూపము లేర్పడుచుండును. స్వభావములను బట్టి రూపము లుండును. స్వభావము దివ్యమైనచో స్థూల రూపములు కూడ అందముగ నుండగలవు. వికృతమగు స్వభావములుండు వారికి వికృతమగు రూపము లేర్పడుచుండును. దేవతల రూపములు ఎంత కోమలమో అసురుల రూపములు అంత వికృతములై యుండును.

దేవతలలో కూడ గుహ్యకుల రూపములు అతి సుందరములై యుండును. గుహ్యకులు శ్రీమాత ఆరాధనలో దిట్టలు.

దేవతారాధన చేయువారి రూపములు క్రమముగ సున్నితము లగును. స్వభావములో దివ్యత్వ మేర్పడుచున్నకొలది రూపములలో మార్పులుండును. స్వభావము వికృతరూపము దాల్చినకొలది రూపములు కూడ తదనుగుణమగు మార్పు చెందుచు నుండును. హంస స్వభావము గలవారికి హంసలవలె సున్నితములగు రూపము లేర్పడుచుండును. అట్లే యితరములగు రూపములు కూడ అవగాహన చేసుకొనవచ్చును. జీవుల స్వభావమును బట్టి కుక్క, పంది మొదలుకొని దివ్యమగు రూపముల వరకు రూప సంపదను జీవులు పొందుదురు. ఇట్టి ఈ కార్యమంతయూ సున్నితముగ జరుగుచుండును.

గుహ్యకులు శ్రీమాత ఆరాధనను గావించుచూ, సృష్టి యందు సున్నితముగ కార్యములను చక్కబెట్టుచుందురు. మనస్సును సూక్ష్మ లోకములలోనికి ప్రవేశింప జేసినచో గుహ్యకులను దర్శింప వచ్చును. హృదయమను గుహయందు గుహ్యకుల సాన్నిధ్యము లభించును. శ్రీమాత 'గుహాంబా', 'గుహ్యరూపిణి' అని ముందు నామములలో వర్ణింపబడినది. గుహ్యకులచే ఆరాధింపబడుచుండునని ఈ నామము తెలుపుచున్నది. ప్రజ్ఞ బాహ్యమున తిరుగాడుటను నియమింపజేసి అంతరంగమున ప్రవేశబెట్టి సుదీర్ఘముగ అంతరంగ ఆరాధన గావించి నచో గుహ్యకుల లోకమును చేరవచ్చును. గుహ్యకుల సాన్నిధ్యమున ఆరాధన సులభముగ సాగును. అట్టి ఆరాధనమున స్వభావమున

మార్పు కలుగు అవకాశ మేర్పడును. గుహ్యకుల నాయకుడగు సుబ్రహ్మణ్యుని ఆశీర్వచనమున మార్పులు సులభముగ సాగ గలవు. ఆరాధకులు తమ తమ స్వభావములను తీర్చిదిద్దుకొనుటకు గుహ్యకులు కావలెను. గుహ్యమగు ఆరాధనము చేయుచు నుండవలెను. నిజమగు ఆరాధనము గుహ్యమే. బాహ్యమగు ఆరాధన అంతయూ పటాటోపమే. రాముని గూర్చి భరతుని ఆరాధన గుహ్యము. కనుకనే రామునికి భరతుడు ప్రియుడు.

యుధిష్ఠిరుని కృష్ణ ఆరాధన గుహ్యము. అర్జునుని ఆరాధన కన్న గుహ్యము. ద్రౌపతీదేవి ఆరాధన కన్న కూడ గుహ్యము. గుహ్యముగ సతతము ఆరాధించుట చేతనే యుధిష్ఠిరుడు కృతకృత్యుడై స్వర్గారోహణము గావించ గలిగినాడు. ఆరాధన మెంత గుహ్యమైనచో శ్రీమాతకు అంత ప్రీతి కలిగించును. ఇట్టి ఆరాధకులలో గుహ్యకులు ప్రథమ శ్రేణికి చెందినవారు. ప్రమథగణము లట్టి గుహ్యకారాధ్యులు. ప్రమథ గణములు ఆరాధన చేయుచున్నట్లు గోచరింపదు. బాహ్యముగ తెలివి తక్కువ పనులు చేయుచున్నట్లుగ గోచరించుదురు. ప్రార్థనలను ఏ మాత్రము చేయనట్లు కనిపింతురు. కాని అంతరంగమున అనన్య చింతన చేయుచు నుందురు. వారి బాహ్య వేషధారణము, భాషణము, ప్రవర్తనము వికటముగ గోచరించినను అవి అన్నియూ జగత్కల్యాణ కారకములే. ఆరాధకులకు గుహ్యకులే మార్గదర్శకులు.

# 721. 'కోమలాంగి'

**కో**మలమైన అంగములు కలది శ్రీమాత అని అర్థము.

అత్యంత సుకుమార రూపము గలది శ్రీమాత. నఖ శిఖ పర్యంతము అమితమగు అందము సుకుమారత్వముతో కూడియున్నట్లుగ శ్రీమాతను ఋషులు దర్శించిరి. సహస్రనామము ఆరంభముననే శిరోజముల నుండి పాదముల వేలిగోరు వరకు శ్రీమాత రూపవర్ణన ముండును. ఈ రూపమును అంతరంగమున ఆరాధించుట ఉపాసన మార్గమున ఆనందము కలిగించును. ఆరాధకుని చిత్తము అత్యంత సుకుమారము, సౌందర్యము అగు శ్రీమాత రూపముపై ధారణ చేసి నపుడు ప్రాథమికముగ చిత్తవృత్తులన్నియూ కరగిపోవును. శ్రీమాత రూప సౌందర్యములకు చిత్తము ఆకర్షింపబడును. అపురూపమగు అందమును చూచినపుడు చిత్తము అందమున కాకర్షింపబడి స్థిరమై నిలచుట సహజము. అందమైన వస్తువును దేనిని చూచినను సర్వ సామాన్యముగ చిత్త మాకర్షింపబడును. అందముపై దృష్టి నిలచును. ఇది సహజము. కనుకనే సనాతన ధర్మ మార్గమున ఆరాధనమునకు అత్యంత సుకుమారము, సుందరము అగు రూపములను ఋషు లందించిరి.

శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శ్రీమహావిష్ణువు, లక్ష్మి, సరస్వతి, పార్వతి, సుబ్రహ్మణ్యుడు, సూర్యదేవత ఇత్యాది రూపములన్నియు

అందమగు రూపములుగ అభివర్ణించినారు. గజాననుడు, హను మంతుడు రూపములను కూడ అందము, ఆకర్షణముతో కూడిన రూపములుగ తీర్చిదిద్దిరి. చిరునవ్వుతో కూడి అందముగ నుండు ముఖము మన మారాధించు అందరి దేవతలకును గలదు. ఇట్టి సౌందర్యమూర్తులను ఆరాధించునపుడు చిత్తము స్థిరమగును. సుఖమును పొందును. రూపము నావరించియున్న అందము దివ్యాకర్షణము కలిగి యుండుటచే చిత్తమా రూపముపై ధారణ చేయుట సులభమగును.

అంతరంగమున కోమల రూపము దర్శించుచు, ఆరాధించు చుండగా చిత్త మందలి ప్రజ్ఞ రూపమును దర్శించుచు దరి చేరును. వెలుగులతో కూడిన రూపమై యుండుట చేత వెలుగు దరి చేరును. ఈ విధముగ సాలోక్య సామీప్యములు సిద్ధించును. సమీపమున చేరుచుండగా ఆరాధకుని యందు ఆరాధనా రుచి పెరుగును. రుచి పెరిగినకొలది ధ్యానింపబడు రూప సమీపమున చేరుచుండుట జరుగును. తాను, తానారాధించు దివ్యరూపము తప్ప మరియొకటి లేని స్థితి కలుగును. అటుపైన సామీప్యము, సాయుజ్యమును కలిగించును. అటుపై సారూప్యము చెందును. ఇట్లు ఉపాసనా మార్గమున ఉపాసకుడు తానారాధించు వస్తువుగ మారును. క్రమముగ ఆ వస్తువు దివ్య లక్షణములు తనయందేర్పడు చుండును. దివ్య స్వభావ మేర్పడుచుండగా పూర్వ స్వభావము అంతరించును. అపు డారాధకుడు ద్విజుడై నిలచును. అనగా కొత్త స్వభావమున పుట్టిన వాడగును. పాత తెలివి పోయి కొత్త తెలివి అవతరించును.

కోమలమగు రూపారాధనమున సులభముగ ఆరాధకులు ద్విజులగుటకు సాధ్యపడును. చిత్త ప్రవృత్తులన్నియు నిరోధింపబడి చిత్తము బుద్ధితో అనుసంధానము చెంది బుద్ధియే చిత్తముగ ప్రకాశించును. కోమలాంగి యగు శ్రీమాతను ఆరాధించుట ద్వారా సిద్ధి కలుగ గలదు.

ఆరాధకులు కోమలము, అందమగు రూపమును దర్శించినపుడు వారియందు శ్రీమాత అస్థిత్వమును గుర్తించుటకు నిత్య జీవనమందు ప్రయత్నము చేయవలెను. సృష్టియందట్టి రూపములన్నియు యున్నవి. ఇట్లు దర్శించుచూ శ్రీమాతను భావించు చుండగ బాహ్యమున కూడ శ్రీమాతను గుర్తించ గలుగుదురు.



# 722. 'గురుప్రియా'

గురువునందు ప్రీతి కలది అనియు, మరియు గురువునకు ప్రీతియైనది అనియూ అర్థము.

శివుడే గురువు. అతడే ఆదిగురువు. బ్రహ్మము. శ్రీమాతకు శివుడన్న ప్రీతి. శివునకు శ్రీమాతయన్న ప్రీతి. పరస్పరము వారి కొకరి కొకరు అత్యంత ప్రీతిపాత్రులు. శ్రీమాత శివుని వీడదు. సృష్టి నిర్వహణ మును కూడ శివునితో కూడియే చేయును. శివుడు శ్రీమాతను వీడడు. సృష్టి యున్నప్పుడు కాని, లేనప్పుడుగాని ఇరువురును కూడియే యుందురు. సృష్టి లేనప్పుడు శివుని యందు శ్రీమాత యిమిడి యుండును. సృష్టి యున్నప్పుడు శ్రీమాత యందు శివుడు యిమిడి యుండును. అతనిలో ఆమె యుండును. ఆమెలో అతడుండును.

లోకము లేర్పరచునపుడు, బ్రహ్మము నుండి క్రమముగ వ్యక్త మగుచు సూక్ష్మమునుండి స్థూలములకు లోకముల నేర్పరచును. బాలగ వ్యక్తమై క్రమముగ వృద్ధి చెందుచు స్థూలము చేరుసరికి కాళిగ తాండ వించును. పురుష ప్రకృతుల మేళవింపుగ యేడు లోకము లేర్పడునపుడు సూక్ష్మలోకముల యందు పురుషుని ఆధిక్యత యుండును. స్థూల లోకముల యందు ప్రకృతి ఆధిక్యత యెక్కువుగ నుండును. స్థూల లోకములందు ప్రకృతి ఘనమై, బలమై యుండును. సూక్ష్మలోకముల యందు సున్నితమై, కోమలమై యుండును. పురుషుని నుండి పసికందు

వలె జన్మించి బాలయై, కుమారియై, యువతియై, స్త్రీగ నేర్పడి తల్లి యగును. బాలగను, కుమారిగను తండ్రి అధీనమున యుండును. యువతిగ మారి స్త్రీ అయినపుడు పురుషుని అర్ధాంగి యగును. తల్లిగ కుమారుని కనినపుడు పురుషునిపై ఆధిక్యము కలిగి యుండును. ఈ స్థితులన్నియు స్త్రీల జీవితమున చూడవచ్చును. ప్రాథమికముగ పురుషుని ఆధిక్యత నుండగ తుదకు స్త్రీ ఆధిక్య మేర్పడుట సృష్టి ధర్మము. ఇరువురి కిని సమత్వము అర్ధాంగి స్థితియందు సగము పురుషుడు, సగము స్త్రీ అనునది మధ్య స్థితి. సమస్థితి. ఈ స్థితిని అష్టమి తిథిగ దర్శింతురు.

తిథులలో అష్టమి నిజమగు యోగ స్థితి. సగము కనపడి సగము కనబడక యుండుట శివశక్తుల అర్ధనారీశ్వరత్వమును ప్రతిపాదిం చును. ఇది యోగస్థితి. యోగులీ స్థితి యందుందురు. వారి యందు ప్రకృతి పురుషులు సమన్వయింపబడి యుందురు. యోగులకు ప్రకృతి పురుష లిరువురును అనుకూలురే. ఇరువురికిని వారు ప్రీతిపాత్రులే. అట్టివారి వలన సృష్టియందు సమభావము ప్రకటింప బడును. సహ జీవనము వీలగును. సామ్యవాదము వ్యాప్తి చెందును. యోగులు ప్రకృతిని నిరాదరింపరు. ఇహపరములు రెంటినీ సమతూకముగ అనుభవించుచూ అట్టి సమతుల్యము సమగ్రము యగు జీవన మితరుల కందింతురు. వీరే నిజమగు గురువులు. ఇట్టి గురువులన్న శ్రీమాతకు ప్రీతి యెక్కువ. కావున ఆమె గురుప్రియ.

సద్గురువులు శ్రీమాతకు ప్రీతిపాత్రులైన కుమారులు. శివుడన్న యెంత ప్రీతియో సద్గురువు లన్నకూడ అంతియే ప్రీతి. సంస్కారవతియైన

స్త్రీకి తన పురుషుని యందు, తన కుమారుని యందు సమానమగు ప్రీతి యుండును. శ్రీమాత తత్త్వమే స్త్రీల యందు కూడ భాసించును. శివుని యందు, సద్గురువుల యందు అమితమగు ప్రీతిగల శ్రీమాతను గురుప్రియగ తెలియవలెను.



# 723. 'స్వతంత్రా'

**త**నదైన తంత్రము కలది శ్రీమాత అని అర్థము.

తంత్ర మనగా విధానము. సృష్టికి విధానము గూర్చునది శ్రీమాతయే. కాని ఆమె ఏ తంత్రమునకు పట్టుపడదు. త్రిమూర్తులు సైతము శ్రీమాత యేర్పరచిన తంత్రము ననుసరించియే సృష్టియందు వర్తింతురు. సమస్త దేవతలు తంత్రమున కధీనులే. కాని పరతత్త్వము అగు శివశక్తులు తంత్రమున కతీతులు. వాని తంత్రములచే గాని, మంత్రములచే గాని వశీభూతులు కారు. తంత్రముల ద్వారా, మంత్ర ముల ద్వారా, యంత్రముల ద్వారా శ్రీమాతను పూజింపవచ్చును. అట్లే దేవతలను పూజింపవచ్చును. అట్టి పూజనము ద్వారా అనుగ్రహము పొందవచ్చును. ఆశీర్వాదము పొందవచ్చును. ఇతర దేవతల నందరిని తంత్ర విధానమున వశము కూడ చేసికొనవచ్చును. కాని శ్రీమాతను అట్లు వశము చేసికొనుట వీలుపడదు. ఆమె తంత్రమున కతీతురాలు.

సర్వ తంత్రముల నేర్పరచుచూ సృష్టిని నడుపు శ్రీమాత ఏ తంత్రమునకు పట్టుపడదు. మంత్ర తంత్రాదులతో దేవతా అనుగ్రహము పొందుట సాత్త్వికమగు మార్గము. వశము చేసుకొన చూచుట రాజసిక మగు మార్గము. అట్టివారు కాలక్రమమున పతనము చెందుదురు. దేవతానుగ్రహము పొందుటకు అనేకానేక ఉపాసనా విధానము లున్నవి. విధి విధానముగ ఉపాసన చేయుట వలన దేవతానుగ్రహము లభించును. విధానము ననుసరింపక ఉపాసన చేసినచో అట్టి ఉపాసన

తమోగుణ ప్రధానమై దుష్ఫలితముల నిచ్చును. ఉపాసనకు భక్తిశ్రద్ధలు ముఖ్యము. భక్తిశ్రద్ధ లున్నచోట శాస్త్ర విధానము ననుసరించు బుద్ధి కూడ యుండును. శాస్త్రము నుల్లంఘించి చేయు ఉపాసనలు రజస్తమో గుణముల ప్రభావమునకు లోనై ఉపాసకునికి కష్టనష్టములు కొని తెచ్చును. ఈ విషయము శ్రీకృష్ణుడు భగవద్గీత యందు స్పష్టముగ తెలిపినాడు. దేవతలు మానవులకన్న జ్యేష్ఠులు. మానవులకన్న శ్రేష్ఠులు కూడ. కావున వారి అనుగ్రహము, అనుకూల్యత శీఘ్రముగ పొందు టకు తంత్రము లున్నవి. శ్రద్ధాభక్తులతో విధి విధానముగ తంత్రము లను నిర్వర్తించుకొనుచు దేవతా దర్శనము, స్పర్శనము, భాషణము, అనుగ్రహము, ఆశీర్వచనము, అభయము, వరము పొందవచ్చును. కాని శ్రీమాత విషయమట్లు కాదు. ఆమె స్వతంత్ర అగుటచే ఆమె అనుగ్రహము పొందుటకు కేవలము మంత్ర తంత్రాదులు ఉపాయము కానేరవు. ఆమె నెవరిని అనుగ్రహించ దలచిన వారి ననుగ్రహించును. ఆమె అనుగ్రహమునకు కార్యకారణ సంబంధము లేదు. ఆమె స్వతంత్ర గనుక తా నెవరిని అనుగ్రహించ దలచినచో వారి ననుగ్రహింపగలదు. ఆమె స్వేచ్ఛగ, యథేచ్ఛగ సృష్టియందు విహరించు చుండును. కావున శ్రీమాత పూజనము చేయుచు ఆమె అనుగ్రహమునకై వేచియుండుట మాత్రమే భక్తులు చేయదగిన పని. మరియొక మార్గము లేదు.

సారాంశ మేమనగా

1. మంత్ర తంత్ర సాధనల వలన శ్రీమాతను వశము చేసుకొనుట దుర్లభము.

2. శ్రీమాత అనుగ్రహమునకు శ్రద్ధ, భక్తి, సమర్పణము, వేచి యుండుట లక్షణములు.

3. ఇతర దేవతలు మంత్ర తంత్రములచే వశమగుదురు. కాని దేవతలను వశము చేసుకొనుట పతనమునకు దారితీయును.

4. మంత్ర తంత్రములు విధి విధానముగనే నిర్వర్తింపవలెను. లేనిచో దుష్ఫలితము లుండును.

5. దేవతలను, శ్రీమాతను మంత్ర తంత్రములతో పూజించుట ఆశీర్వచనము కొఱకే.



# 724. 'సర్వతంత్రేశీ'

సర్వ తంత్రములకును ఈశ్వరి శ్రీమాత అని అర్థము.

మన సంప్రదాయమున అరువది నాలుగు తంత్రములు కలవు. తంత్రములు నియమ నిష్ఠలతో, శ్రద్ధాభక్తులతో నిర్వర్తించుకొను వారికి శీఘ్ర ఫలము లభించును. ఇట్టి ఫలము నిచ్చునది శ్రీమాతయే. తంత్ర మార్గము వైజ్ఞానిక మార్గము. శాస్త్రీయముగ చేయు నే కార్యమునైననూ శీఘ్రముగ ఫలము నిచ్చును. శాస్త్ర నిర్వహణమునకు జ్ఞానము ప్రధానము. తెలిసి చేయుటయందు చిత్త ఏకాగ్రత సాధ్యపడును. తెలియక చేయు నపుడు చిత్తమునకు స్ఫూర్తి యుండదు. స్ఫూర్తి లేని చిత్తము పరిపరి విధముల పరువెత్తు చుండును. తెలిసి చేయుటలో శ్రద్ధ యేర్పడును. భక్తి పెరుగును. జీవులు దివ్యలోకానుభూతి పొందుటకు తంత్రము లేర్పడినవి. మంత్రము లేర్పడినవి.

మంత్రములను, తంత్రములను యేర్పరచినది కూడ శ్రీమాతయే. సృష్టి శక్తుల నన్నిటిని మంత్ర తంత్ర విధానమున సృష్టియందు శ్రీమాత నియమించినది. రుద్రుల పని రుద్రులు చేయుదురు. ఆదిత్యుల పని ఆదిత్యులు, ప్రజాపతుల పని ప్రజాపతులు– ఇట్లు ఎవరెవరు ఏ పనులు చేయవలెనో నిర్వచించి, శక్తి నొసగి నియమించినది శ్రీమాత. గ్రహ మండలములు, సూర్యమండలములు, తారకా మండలములు, సమస్త దేవతలు, త్రిగుణములు, పంచభూతములు యిత్యాది వన్నియూ వారి

వారి పనులు వారు నిర్వర్తించుటకు యేర్పాటు చేసినది శ్రీమాత. సర్వ సృష్టి శ్రీమాత యేర్పరచిన తంత్రము వలననే నిర్విఘ్నముగ సాగుచున్నది. అందరికినీ వారి వారి కర్తవ్యము లున్నవి. ధర్మము లున్నవి. ఇట్లు సమస్తమును తంత్ర రూపమున శ్రీమాత యేర్పరచి నిర్వర్తించుచున్నది.

మానవులకు కూడ ధర్మము లున్నవి. ఎవరి ధర్మము వా రనుస రించినపుడు మానవ లోకము సుఖపడును. మానవులు తమ తమ ధర్మములను నిర్వర్తింపనపుడు మానవ లోకములలో అలజడి కలుగును. ఒక గృహమునందు యజమాని, భార్య, సంతానము, పనివాండ్రు, యెవరి ధర్మములను వారు నిర్వర్తించినపుడే కదా! గృహమొక స్వర్గ మగును. అట్లే మానవులు కూడ సృష్టి తంత్రమందు తమవంతు ధర్మము నిర్వర్తించి నపుడే వారికి సుఖము కలుగును. మరియొక మార్గము లేదు.

సృష్టి యంత్రమునకు మూలము సృష్టి తంత్రము. సృష్టి తంత్ర మును, యంత్రమును ఎఱిగి తదనుగుణముగ జీవితమును మలచు కొనుట మంత్రమై యున్నది. ఎవరి కర్తవ్యమును వారెరిగి నిర్వర్తించుట నిజమగు తంత్రము. కర్తవ్యము నెఱుగుట, నిర్వర్తించుట తంత్రము ననుసరించుటయే. పురుషులకును, స్త్రీలకును వివిధమగు కర్తవ్యము లున్నవి. అట్లే యువకులకు, యువతులకు, గృహస్థులకు, వృద్ధులకు వారి వారి కర్తవ్యము లున్నవి. ప్రతి మానవులకును తనదగు కర్తవ్య మున్నది. దాని నెరిగి నిర్వర్తించుట జీవన తంత్రము. దీనిని తెలుపుటకే

దైవము మానుష రూపమున శ్రీరాముడై మార్గదర్శనము గావించెను. కర్తవ్య కర్మను నిర్వర్తించుటయే తంత్రమని గీతయందు కృష్ణుడు బోధించి నాడు.

కర్తవ్య విముఖుడు మంత్ర తంత్ర మార్గమున సఫలీకృతుడు కాలేడు. కర్తవ్య తంత్రమున నిలచి మంత్ర తంత్రములను నిర్వర్తించుట ప్రధానము. అపుడే శ్రీమాత అనుగ్రహము లభింపగలదు.



# 725. 'దక్షిణామూర్తి రూపిణి'

దక్షిణామూర్తి రూపము గలది శ్రీమాత అని అర్థము.

దక్షిణ దిక్కుకు అభిముఖముగ నుండు శివుని దక్షిణామూర్తి అందురు. శివునకు రూపము లేదు. అతని రూపము శ్రీమాతయే. రూపము ధరించిన శివుడు ఉత్తరమున కూర్చుండి దక్షిణ ముఖుడై దాక్షిణ్యమును ప్రసరించుచుండును. భరత భూమికి ఉత్తరమున కైలాస పర్వత మున్నది. ఆ పర్వతము దక్షిణ ముఖమును దర్శించి పూజించు ఆచారము సనాతనముగ నున్నది. బ్రహ్మ మానస సరోవరము, బదరి కాశ్రమము యిత్యాది వన్నియు పర్వతమునకు దక్షిణముగ యున్నవి. మొత్తము భరతభూమి అంతయు దక్షిణముగనే యున్నది. శివుని దాక్షిణ్య మును భరతభూమి అనుభవించుచున్నది. అతని దాక్షిణ్యము చేతనే ఈ భూమి రక్షింపబడుచున్నది. దాక్షిణ్యముతో కూడిన శివుడు బ్రహ్మ విష్ణువులకు తంత్రములన్నియు తెలిపెనని పురాణములు పేర్కొను చున్నవి. మౌనముగ తంత్రమంతయు దక్షిణామూర్తియగు శివుడు తెలుపగా బ్రహ్మ, విష్ణువు, దేవతలు, ఋషులు జ్ఞానమును బడసిరి. సృష్టి మొత్తమునకు శివుడే గురువు. విష్ణువు ప్రభువు. బ్రహ్మ కుటుంబి (సృష్టికర్త). ఆది గురువగు శివుడు చిరుదరహాసముతో, ప్రసన్నవదన ముతో జ్ఞానబోధ చేయుచునుండును. శివుడెరుగని ధర్మముగాని, జ్ఞానము గాని, తంత్రము గాని, మంత్రము గాని లేదు. శివుని ఉత్తర

దిక్కుగ, దక్షిణ అభిముఖునిగ యేర్పరచుకొని పూజించుట సంప్రదాయము. విష్ణువుని తూర్పు దిక్కున పడమరకు అభిముఖునిగ యేర్పరచుకొని పూజించుట కూడ సంప్రదాయము. ఉత్తర దిక్కు కుబేర స్థానము. కుబేరుడు శివప్రియుడు. శివునికి కుబేరుడు మిత్రుడు. అందువలన ఉత్తర దిక్కు అన్న శివునికి ప్రీతి. శివప్రీతి కలుగవలె నన్నచో ఉత్తర దిక్కును చూచుచు శివుని ప్రార్థించుట, ధ్యానించుట చేయవలెను. దాక్షిణ్యము గల శివరూపము అత్యంత సౌమ్యము, సుందరము కూడ.

శ్రీమాత తాను దక్షిణమున ఆసనము గైకొని ఉత్తరమున గల శివునికి అభిముఖియై శివుని ప్రార్థించి సాలోక్య, సామీప్య, సాయుజ్య, సారూప్యములను పొందినది. అందువలన ఆమె దక్షిణామూర్తి రూపిణి అయినది.



# 726. 'సనకాది సమారాధ్యా'

**స**నకాదులచే సమ్యకారాధన చేయబడునది శ్రీమాత అని అర్థము.

సనక, సనందన, సనత్కుమార, సనత్సుజాతులు బ్రహ్మమానస పుత్రులు. అనగా చతుర్ముఖ బ్రహ్మ నుండి వెలువడినవారు. బ్రహ్మ సంకల్పముచే సృష్టింపబడిన వారు కాదు. పరబ్రహ్మమునుండి సృష్టి ఆరంభమున పరబ్రహ్మ సంకల్పముగ చతుర్ముఖ బ్రహ్మ నుండి వెలువడిన వారు. బ్రహ్మకన్న పూర్వులు. సనాతనులు, పరబ్రహ్మ స్వరూపులు. సృష్టియందు తమ కర్తవ్యమేమో తాముగ తెలిసినవారు, అట్లు తెలిసి వెలువడినవారు. చతుర్ముఖ బ్రహ్మ పరబ్రహ్మము నుండియే వెలువడి నప్పటికిని తానెందుకు పుట్టెనో తెలియుటకు తపస్సు చేసెను. తపస్సు చేసి తన పుట్టుక కారణమును తెలుసుకొనెను. సృష్టి కార్యమును తన కర్తవ్యముగా నెఱిగి నిర్వర్తించుట ప్రారంభించెను. అతని నుండి దిగి వచ్చిన సనక సనందనాదులు తెలిసి దిగి వచ్చినవారు. వారిని ప్రజా సంసర్గము చేయుడని బ్రహ్మ ఆజ్ఞాపింపగ వారు నలుగురును చిరు నవ్వుతో మౌనము వహించిరి. కారణ మేమనగా తామేమి చేయవలెనో తమకు తెలియును. తెలియని బ్రహ్మ తెలిసిన కుమారులకు తెలియ చెప్పుటలో పొరపడెను. తన కుమారులని భావించెను. తన ద్వారా వ్యక్తమైనప్పటికిని తనకన్న తెలిసినవారు అని తెలియదు. తెలిసినవారికి

తెలియని పెద్దలు ఆదేశము లిచ్చినప్పుడు తెలిసిన పిన్నలు మౌనము వహింతురే గాని పెద్దలను హేళన చేయరు.

అట్టి పరిపూర్ణ జ్ఞానసంపన్నులగు కుమారులు సహితము శ్రీమాతను ఆరాధింతురు. బ్రహ్మ స్వరూపులైనను శ్రీమాత నారాధించు టలో శ్రీమాత ఆధిక్యము కానవచ్చు చున్నది. శంకరాచార్యుల వారు సాక్షాత్ ఆదిశంకరులే. అంతకు మించిన బ్రహ్మవేత్తలు ఈ కలికాలమున లేరు. అట్టి శంకరులే శ్రీమాతను ఆరాధించుచూ శక్తి పీఠముల నేర్పరచిరి. బ్రహ్మవేత్త మైతిమని, మేము ఆరాధనలు చేయవలసిన పని లేదని విఱ్ఱవీగు కలియుగ బ్రహ్మజ్ఞానులు నేతి బీరకాయ వంటి వారు. బ్రహ్మజ్ఞానము పొందుట శ్రీమాత అనుగ్రహముననే జరుగును. అట్టి మాతను మరచుట అజ్ఞానమే. బ్రహ్మజ్ఞాని అయిననూ, సమస్తము నందు బ్రహ్మమును సమభావముతో దర్శించుచూ ఆరాధించుట సమ మైన మార్గము. సనక సనందనాదులు అట్టి సమారాధనము చేయుచు నుందురు. అంతట అన్నిట నిండియున్న తత్త్వమును దర్శించుచు ఆరాధింతురు.



# 727. 'శివజ్ఞానప్రదాయిని'

**శి**వజ్ఞానమును ప్రసాదించునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత శివజ్ఞానమును ప్రసాదించు అనుగ్రహమూర్తి. ఆమె గురు రూపిణి. గురువుల నుండి బ్రహ్మజ్ఞానమును, శివజ్ఞానమును అర్హులకు ప్రసాదించు చుండును. శివుని ఎఱుగుట ననగా నేమి? దేవుని ఎఱుగుట యెట్లు? అతడంతటా, అన్నిటా నిండియున్నప్పటికిని తెలియుట యెట్లు? వాయువు కదలినపుడు అందలి కలయిక స్పర్శ శివుడు. అగ్ని యందు ఉష్ణము శివుడు. నీటి యందలి దప్పిక శివుడు. కంటి యందలి వెలుగు శివుడు. మాట యందలి ధ్వని శివుడు. వృక్షము నందలి ఎదుగుదల శివుడు. పుష్పము నందలి సుగంధము శివుడు. పశువునందలి బలము శివుడు. సృష్టియందలి స్థితి శివుడు. సృష్టి కతీతమగు స్థితి శివుడు. అన్నిటా యుండియు లేనట్లుగ నుండును. దేనిని చూచినను శివుని చూడవచ్చును. అంతటా అంతర్యామియై స్థితి గొన్నవాడు, తాను కదలక ఇతరములను కదలించువాడు శివుడు. ఇట్టి శివదర్శనమే సమదర్శనము. జ్ఞానులందు, అజ్ఞానులందు, శిష్టు లందు, దుష్టులందు, ఉపాయములందు, అపాయములందు కూడ శివుడున్నాడు. శివుడు లేని స్థావరము లేదు. వస్తువు లేదు. జీవుడు లేడు. చూచువారికి చూచినంత కనపడును.

శ్రీమాత చిత్ర విచిత్రములుగ సృష్టి నల్లిక చేసినను దాని కాధారమై నిలుచువాడు శివుడు. శివదర్శనము కేవలము శివలింగమునకే

పరిమితము చేయుట సంకుచిత మార్గము. సృష్టి అంతయు శివాలయమే. సమస్త వస్తుజాలము శివలింగములే. లింగ మనగా చిహ్నము. అన్ని వస్తువులు చిహ్నములే కనుక లింగములే. ఆలయమున నున్న శివుడు స్మశానమున కూడ నున్నాడని తెలియజెప్పుటకే స్మశాన మును శివభూమి అందురు. స్మశానముననే శివు డున్నాడనుకొనుట కేవలము భ్రమ. అతడు స్థాణువు. అనగా అన్నిటి యందుండువాడు. అతడున్నప్పుడే వస్తువున్నట్లు గోచరించును. అతడి ఆధారముగనే శ్రీమాత నవావరణ సృష్టి చేయును. ఇట్టి నిస్సీమ మగు శివజ్ఞానము నిచ్చువాడే గురువు. అట్టి గురురూపమున నున్నది శ్రీమాతే.



# 728. 'చిత్కళా'

మనస్సు నందుండు చైతన్యకళ అని అర్థము.

బ్రహ్మము యొక్క కళయే చైతన్యము. ఈ కళ అంతఃకళ మార్గమున మనస్సును చేరును. ఈ కళ ఆధారముగనే మనస్సు వర్తించును. బ్రహ్మము నుండి వ్యక్తమైన చైతన్యము సర్వవ్యాపకమై యుండును. మహదాకాశముగ వెలుగొందు చుండును. అందుండి వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధ వ్యూహములుగ అవతరించును. ఈ నాలుగు వ్యూహములందు చైతన్యము వ్యాప్తిచెంది వెలుగొందును. ఈ నాలుగు వ్యూహములను పరా పశ్యంతి మధ్యమ వైఖరి అని, నాలుగు వేదములని, నాలుగు కాలములని, నాలుగు వర్ణములని బ్రహ్మ యొక్క నాలుగు ముఖములని, దైవము యొక్క నాలుగు బాహువులని తెలుపు చుందురు. మానవుల యందు నిరహంకారముగను, అహంకారము గను, బుద్ధిగను, చిత్తముగను నాలుగు స్థితులలో ఈ చైతన్యము అంతఃకరణముగ నున్నది. అందు నాలుగవది అయిన చిత్తము మనస్సు నిండి యుండును. తత్కారణముగనే మనస్సు, దశేంద్రియములు పని చేయుచుండును. బహిఃకరణములకు మనసాధారము. మనస్సునకు చిత్తమాధారము. చిత్తము బుద్ధి యొక్క ప్రతిబింబము. బుద్ధి అహం కారమునకు ప్రతిబింబము. అహంకారమునకు దైవము ప్రతిబింబము. దైవ మనగా బ్రహ్మము యొక్క వెలుగు లేక కళ. బ్రహ్మము యొక్క

వెలుగు చిత్తము వరకు వ్యాప్తిచెంది వెలుగొందును. అది చైతన్యము యొక్క కళ లేక చిత్కళ. బ్రహ్మమునకు చైతన్యము ఉపాధి. అట్టి చైతన్యమున కహంకారము ఉపాధి. అహంకారమునకు బుద్ధి ఉపాధి. బుద్ధికి చిత్తము ఉపాధి. చిత్తమునకు మనస్సు ఉపాధి. మనోకళ బాహ్యమునకు విస్తరించును. ఈ మొత్తము చైతన్యము యొక్క నాలుగు విధములగు కళలు.



# 729. 'ఆనందకలికా'

**ఆ**నందమునకు మొగ్గవంటిది శ్రీమాత అని అర్థము.

నిరామయమగు బ్రహ్మము నుండి మొగ్గవలె వికసించునది శ్రీమాత. అపుడు ఒకటి రెండగును. రెండుగ నుండుట వలన పరస్పరత్వ ముండును. పరస్పరత్వము వలన ఆనందముండును. శ్రీమాతయే ఉద్భవింపనపుడు పరస్పరత్వమున కవకాశమే లేదు. పరస్పరత్వమే లేనపు డానందమే లేదు. తనయందు తాను ఆనందించుటకైనను తాను తన చైతన్యముగ తా నేర్పడవలెను కదా! తన చైతన్యము తనయందిమిడి యున్నప్పుడు తా నుండుట యుండునుగాని ఆనందించుచు యుండుట యుండదు. సత్ చిత్‌లు రెండును యున్నప్పుడే ఆనందము. అదియే సచ్చిదానందము. కనుక ఆనందమునకు ఉపాధి చైతన్యమే. అట్టి చైతన్యము బ్రహ్మము నుండి పుట్టినపుడే ఆనందమునకు తెరతీయబడును. శ్రీ అను కళ బ్రహ్మము నుండి వ్యక్తమై ఆనందము కలిగించును గనుక మాతయే ఆనందకారకము. ఆనందమునకు మూలము.

శివుడు సహజముగ తపస్వి. తేజస్వి. తనయందు తానుండువాడు అదృశ్యరూపుడు. అట్టి శివుడు శివానందుడగుటకు కారణము శ్రీమాతయే.



# 730. 'ప్రేమరూపా'

ప్రేమ స్వరూపము శ్రీమాత అని అర్థము.

ఆనందము, ప్రేమ పరస్పర గుణములు. ప్రేమ యున్నచోట ఆనంద ముండును. ఆనంద మున్నచోట ప్రేమ యుండును. ఈ రెండునూ కలిసియే యుండును. భక్తికి పరాకాష్ఠ ప్రేమ. భక్తి అనన్యమైనచో ప్రేమ యగును. పరమునందు ప్రేమ భక్తి యగును. ప్రేమ స్నేహము గను, భక్తిగను, ఆనందముగను, కాంతివంతముగను విరాజిల్లు చుండును. ఒకరి యందు ఒకరికి ప్రేమ యున్నప్పుడు ఒకరిపై నొకరికి శ్రద్ధ యుండును. భక్తి యుండును. స్నేహముండును. ఒకరిని గూర్చిన తలపు యింకొకరికి ఆనందము కలిగించు చుండును. భక్తి, ప్రేమ, స్నేహము, ఆనందము చైతన్య కళ యొక్క చిహ్నములు. ఈ దివ్య గుణములు అనుభవింప దగినవే గాని నిర్వచనమున కందవు. అనిర్వచనీయమైన ఈ గుణములకు మూలము శ్రీమాతయే.



# 731. 'ప్రియంకరి'

ప్రియము కలిగించునది శ్రీమాత అని అర్థము.

జీవులకు నిత్యము ప్రీతి కలిగించుటయే తన కార్యముగ శ్రీమాత యున్నది. వికారములేని ప్రీతి కలిగించుటకు జీవులయందు శ్రీమాత కృషి సల్పును. ప్రీతి కలిగించున వన్నియు శ్రేయస్సును కలిగించునవి కాకపోవచ్చును. శ్రేయస్సు కలిగించు విషయముల యందు ప్రీతి కలుగునట్లుగ జీవులకు శిక్షణ నిచ్చును. దీని వలన జీవులు శాశ్వత ప్రీతి నొందుదురు. చేటు కలిగించు ప్రీతిని విసర్జింపచేసి వృద్ధిని కలి గింపచేయు విషయములందు ప్రీతి కలుగునట్లు చేయుట తల్లికే సాధ్యము. ఎప్పుడును పంచదార కోరు పిల్లవానికి అప్పుడప్పుడు పంచదార నొసగుచు శ్రేయోదాయకమగు ఆహారమును నేర్పు తల్లి నిజమగు తల్లి. ఇష్టమగు విషయములను అప్పుడప్పు డేర్పరచుచూ ఉత్సాహ పరచుచూ, శిక్షణ నిచ్చుచూ అయిష్టములను కూడ నేర్పుచూ, ఇష్టా యిష్టములను దాటించు తల్లి నిజమగు ప్రియంకరి. ఇట్లు ఓర్పుతో నేర్పుతో జీవులను బ్రహ్మము వైపునకు మళ్ళించు శ్రీమాత ప్రియంకరి అనుటలో విశేష మేమున్నది.



# 732. 'నామపారాయణప్రీతా'

**నా**మ పారాయణముచేత ప్రీతి చెందునది శ్రీమాత అని అర్థము.

అకారము నుండి క్ష కారము వరకు గల అక్షరములన్నియు శ్రీమాత నామములే. ఈ అక్షరములతో అనేకానేక మంత్రములను, మంత్రరూపములను, దేవతలను, తంత్రములను శ్రీమాత యేర్పరచి నది. వాఙ్మయమంతయు ఈ అక్షరముల శబ్దములే. వీనిని పారాయ ణము చేయుట వలన శ్రీమాత ప్రీతి చెందును. శ్రీమాత నామము లన్నియు పారాయణము చేయుట సాధ్యము కాదు. ఆమె అనంత నామములతో యున్నది. నామ పారాయణమునకు శ్రీ లలితా సహస్ర నామ స్తోత్రము మిక్కిలి ప్రసిద్ధము. ఈ సహస్ర నామము స్తోత్ర రాజము. నిత్యమూ ఈ స్తోత్రమును పారాయణము గావించువారు సర్వార్థ సంపన్నులగుదురు. సకలార్థములనగా చతుర్విధ పురుషార్థ ఫలములు. అర్థము, కామము, ధర్మము, ముక్తి– ఈ నాలుగింటిని పరిపూర్ణముగ పొందుదురు.

**"నన్ను అర్చించినను లేకున్ననూ, జపించినను లేకున్ననూ, ధ్యానించినను లేకున్ననూ, నా యీ నామ సహస్రమును కీర్తించువాడు నా కెల్లప్పుడును ప్రీతిపాత్రుడే"** అని శ్రీమాతయే స్వయముగ దేవీ భాగవతము నందు తృతీయ స్కంధమున తెలిపినది. కనుక సహస్రనామ పారాయణము శ్రీమాతకు అత్యంత ప్రీతికరమని తెలియవలెను.

మంత్రములు, తంత్రములు, శ్రీమాతను గూర్చిన విద్యలు, హోమాది క్రతువులు అత్యంత వైజ్ఞానికములు. శాస్త్రవిధిని నిర్వర్తించిననే గాని అవి సత్ఫలముల నీయవు. విధానము ననుసరింపనిచో దుష్ఫలము లను కూడ నీయవచ్చును. విద్యుత్ పరికరములను విద్యుత్ తీగలతో సరిగ నమర్చుకొననిచో విద్యుత్ ప్రమాదములు కలుగునట్లు విధి విధానము ననుసరించని మంత్ర తంత్రములు అపాయ కారకములు. కనుక మంత్ర తంత్రములు పండితులకే పరిమితము. అందున శాస్త్ర గర్వముచే శ్రద్ధాభక్తుల లోపము యేర్పడినచో సత్ఫలము లందవు.

అట్లుగాక నామ పారాయణము, అక్షర జ్ఞానము గలవా రందరికిని సులభమే. అక్షరమును విని పలుక గలుగుట అక్షర జ్ఞానము. స్పష్టముగ అక్షరములను పలుకుచు, శ్రద్ధాభక్తులతో శుచిగ పారాయ ణము చేయువారికి శ్రీమాత అనుగ్రహము శీఘ్రముగను, సులభము గను లభించును. కలియుగమందు నామపారాయణమే చేయదగినది. దైవనామ కీర్తనమే కలియుగమందు ప్రశస్తము. **"కలౌ నాశ్త్యైవ, నాశ్త్యైవ గతి రన్యథా । హరేర్నామ హరేర్నామ ఏవ కేవలమ్ ॥"** అని చైతన్య మహాప్రభువు ఘోషించినాడు. నామ స్మరణము, నామ పారాయణమే కలియుగమందు ప్రధాన మని ఋషులు తెలిపిరి. నామ పారాయణము, నామ సంకీర్తనము, భజనము భక్తితో చేయునపుడు పారవశ్యము, తన్మయత్వము కలుగుట సులభము. భక్తి యున్నచోట శ్రద్ధ యుండును. శ్రద్ధాభక్తులు యున్నచోట నామ సంకీర్తనము రసవత్తరమై భక్తులను పవిత్రీకరించును. మనస్సు కరగును. చిత్తము దివ్య భావములో

మునుగును. రామకృష్ణ పరమహంస ఈ మార్గముననే పరమహంస అయ్యెను. ఇంతకన్న మంద్రమగు మార్గము లేదు. ఇతర మార్గములలో అహంభావము పెరుగునే గాని మనసు కరగుట యుండదు. మనసు కరగని వానికి, హృదయము ద్రవించని వానికి ఎట్టి అనుగ్రహము లభింపదు. నామ పారాయణల యందు శ్రీమాత ప్రీతి అధికము అని తెలియవలెను.



# 733. 'నందివిద్యా'

**నం**దీశ్వరునిచే ఉపాసించబడు విద్యారూపిణి శ్రీమాత అని అర్థము.

నందీశ్వరుడు నందీశ్వరుడే! ఆనందరూపమే నంది. ఈశ్వరుని ఆనందమునకు రూపము నూహించినచో అది నందీశ్వర మగును. నంది యనగా శివానందరూపము. ఘనమగు ఆనంద రూపము. శివుని రుద్రరూపము భక్తులకవసరమే లేదు. వారికి వలసినది ఆనంద రూపమే. ఆనందముగ నున్నప్పుడు శివుని కన్న సౌందర్యవంతుడు లేడు. శివ సౌందర్యమే సౌందర్యము. ఆ సౌందర్యము పొందుటకే పార్వతీదేవి అనితర సాధ్యమగు తపస్సు గావించినది. తాను విష్ణురూప, వైష్ణవి. విష్ణువే మహారూప సంపన్నుడు. అట్టి రూప సంపన్నత కలిగిన వైష్ణవి శివుని సౌందర్యమునకై, పొందుకై తపస్సు చేసినదనినచో శివుని ఆనంద రూపము ఎంతటి సౌందర్యవంతమో వూహింపనగును. శివుడు ఎంత రౌద్ర మూర్తియో అంత శాంత స్వరూపుడు కూడ. అతడు శంకరుడు– శమము కలిగించువాడు. మయస్కరుడు– శమముతోపాటు తీయని, కమ్మని చల్లదనమును అందించగలవాడు. మంచు పర్వతము నకు కూడ చల్లదన మీయగలడు. శివరూపము మహిమాన్వితము, ఆనందమయము.

అట్టి శివుని ఎల్లప్పుడునూ అంటిపెట్టుకొని యుండువాడు నందీశ్వరుడు. నంది యున్నచోట శివుడుండును. అనగా ఆనంద

మున్నచోట శివత్వముండును. అట్లే శివుడున్న చోట నంది యుండును. వారిది అనుపమానమగు మైత్రి. ఇట్టి మైత్రి శివునితో సాధించుటకు నందీశ్వరు డేవిద్య నేర్చెనో? ఆ విద్యారూపమే శ్రీమాత. నందీశ్వరుడు నిజమునకు శ్రీమాత భక్తుడు. శ్రీమాత నుపాసించి శ్రీమాత వలన శివునితో శాశ్వత అనుబంధమును పొందు విద్య నేర్చెను. శ్రీమాత శివుని అర్ధాంగి. శివునిలో సగమై యున్నది. ఆమె దరిచేరి శుశ్రూష చేసి శివ రహస్యము నెఱిగి శివా శివ సాన్నిధ్యమున శాశ్వత స్థితి గొనెను. శ్రీమాత అనుగ్రహము వలన పొందిన శివోపాసనా రహస్యమే నందీశ్వరుడు పొందిన విద్య. ఈ విద్య వలన శాశ్వత శివానంద స్థితిని చేరెను.

శివుడు తండ్రి, శ్రీమాత తల్లి, నందీశ్వరుడు వారి ప్రథమ కుమారుడు. అనగా ప్రప్రథమముగ శివాశివ సాన్నిధ్యమును పొందిన వాడు. శివ భక్తులలో ప్రథముడు. ప్రమథ గణములలో మొదటివాడు. అతని ఉనికిని గుర్తింపని వారికి శివాశివ అనుగ్రహము లేదు.



# 734. 'నటేశ్వరీ'

నటేశ్వరుని భార్య శ్రీమాత అని అర్థము.

శివుడు నటరాజు. శ్రీమాత అతని రాణి. అతడీశ్వరుడు, ఆమె ఈశ్వరి. నిజమునకు శివుడు తపస్వి. నాట్యము చేయువాడు కాదు. నాట్యమంతయూ శ్రీమాతదే. నటన కూడ ఆమెదే. ఆమెయే జగన్నాయకి. నాట్యమాడినను నటన చేసిననూ ఆమెకే తగును. అర్ధాంగి యగుటచే అతడు సహకరించును. సగభాగము నాట్యము నందుండగా మిగిలిన సగ భాగము స్థిరముగ నెట్లుండ గలదు?

సృష్టి అంతయు శ్రీమాత విలాసమే, నాట్యమే. తన వెలుగు నుండి యేర్పడిన లోకములందు తన వెలుగునుండే జన్మించిన జీవులను ప్రవేశింపజేసి జగన్నాటకమును ఛందోబద్ధముగ తాళ లయ బద్ధముగ నిర్వర్తించు చుండును. ఆమె చేయు నృత్యమే లోకముల గమనము. భూమండలము నుండి ఆదిత్య మండలము వరకు అన్నిటికినీ గమనము కలదు. ఆ గమనము కూడ తాళ లయాత్మకమై యుండును. గడియార మందలి గంటల ముల్లు, నిమిషముల ముల్లు, సెకనుల ముల్లు వలె మూడు లోకములు వాని వాని కాలమానము ప్రకారము తిరుగాడు చుండును. కాలబద్ధముగ, క్రతుబద్ధముగ, ఛందోబద్ధముగ అంతయు పుట్టుచు పెరుగుచు పోవుచూ నుండును. చివరకు మిగులునది ఆమెయే. ఆమె నుండే సమస్తమూ పుట్టి పెరిగి ఆమెలోనికే అంతయు లయ

మగును. ఆమె అతనిలోనికే అదృశ్యమగును. దృశ్యా దృశ్యములు ఆమెకే తగును. నర్తన మామెకే తగును. కోటానుకోట్ల జీవుల రూపమున ఆమెయే నర్తించు చుండును. వర్తించు చుండును. ఆమెకు పూర్ణ సహకారము పెనిమిటి అందించు చుండును. కనుక ఆమె నిజమగు నటేశ్వరి. ఆమె నాట్యమునే దేవతలు, ఋషులు అశేషముగ కీర్తించు చుందురు. ఆమె ఎప్పుడు ఎట్లు నర్తించునో ఎవ్వరికినీ తెలియదు. నర్తించిన వెనుక ఇట్లు నర్తించినదని కీర్తించుచుందురు. అట్టి ఆమె నాట్యము వర్ణనాతీతము.



# 735. 'మిథ్యా జగధిష్ఠానా'

**మి**థ్యా జగత్తునకు ఆధారమైనది శ్రీమాత అని అర్థము.

జగత్ అనగా ఎల్లప్పుడు మారుచు నుండునది. వచ్చి పోవుచు నుండునది. స్థిరము కానిది. మారుచున్నను మారుచున్నట్లు స్థూల దృష్టికి కనపడదు. వచ్చిపోవుచున్నను వున్నట్లే యుండును. కదులుచూ కదలనట్లుండును. అస్థిరమైననూ స్థిర మనిపించును. కనుకనే జగత్తు ఒక గమ్మత్తు. దర్శించు వారికి సంభ్రమాశ్చర్యములు కలిగించును. జగత్తుని మించిన అద్భుతము లేదు.

నదీ జలములు ప్రవహించుచునే యున్నను, నది వున్నట్లు గోచరించును. ఒక మారు స్పృశించి మరల స్పృశించునంతలో జలములు మారును. కాని అదే నదిని స్పృశించిన ట్లనిపించును. నదీజలములు నిత్యమూ ప్రవహించుచున్ననూ ఎట్లు నది వున్నదని గోచరించునో అట్లే సృష్టి యందలి రూపములన్నియునూ! ఒక రూపము నందు సూక్ష్మము నుండి స్థూలమునకు అణువు లేర్పడుచుండగ అదే వేగమున స్థూలము నుండి సూక్ష్మమునకు అణువు లదృశ్యమగు చుండును. ఒక వైపున అణువులు సృష్టింపబడుచుండగా మరియొక వైపున అణువు లదృశ్య మగుచుండును. సృష్టింపబడుట, హరింపబడుట ఒకే వేగమున జరుగుచుండుటచే రూపము స్థిరముగ నున్నట్లు గోచరించును. సృష్టి అంతయూ ఈ విధముగ వెండితెరపై బొమ్మవలె వున్నట్లుండును. ఇది శ్రీమాత చైతన్య ప్రభావము యొక్క విశేషగుణము. సృష్టిలయముల

నడుమ స్థితి గోచరించునే గాని నిజమునకు గోచరించు చున్న రూపము శాశ్వతము కాదు. కనుక మిథ్యారూపము.

బ్రహ్మమే శాశ్వతము. బ్రహ్మము నుండి ఉద్భవించు చైతన్యము నుండి పుట్టిన త్రిగుణములు పై విధమగు మిథ్యాసృష్టి నిర్మాణము చేయు చుండును. చైతన్యమొక ప్రవాహము. ఆ ప్రవాహమున గుణముల మూలమున రూపము లేర్పడుచుండును. ఏడు లోకములు ఆ లోకము లందలి జీవుల రూపములు వరుసగా సూక్ష్మము నుండి స్థూలమునకు కాలక్రమమున యేర్పడుచూ వృద్ధి చెంది మరల తిరోధానము చెందును. నక్షత్ర మండలములు, సూర్య మండలములు, గ్రహమండలములు ఇట్లేర్పడి వృద్ధి చెంది మరల తిరోధానము చెందును.

ఉదాహరణమునకు ఒక దినము ప్రారంభము, వృద్ధి, అంతము గమనించినచో ఈ విషయము బోధపడును. అట్లే ఒక చాంద్రమాసము (అమావాస్య నుండి అమావాస్య వరకు), అట్లే ఒక సౌర సంవత్సరము గమనింపవచ్చును. అట్లే ఒక జీవితమును కూడ గుర్తింపవచ్చును. అట్లే ఒక బీజము మొలకెత్తి మొక్కయై, వృక్షమై, మహా వృక్షమై ఫలము లను పొంది మరల బీజమై సూక్ష్మమగును. ఇట్లు బీజము నుండి వృక్షమునకు వృక్షము నుండి బీజమునకు అన్నియూ మొలకెత్తుచూ వృద్ధి చెంది మరల సూక్ష్మ మగుచుండును.

సామాన్యులు స్థూలమునే చూడగలరు. అసామాన్యులగు ఋషులు అతి సూక్ష్మమును కూడ చూడగలరు. శ్రీమాత అన్నిటికన్న సూక్ష్మము.

అట్టి శ్రీమాతను కూడ దర్శించవచ్చును. కాని ఆమె బ్రహ్మమై యున్నప్పుడు ఆమెను చూచుట కెవరునూ వుండరు. ఆమెయే సమస్తమున కంకుర శక్తి. ఆ శక్తి కూడ బ్రహ్మమై యున్నప్పుడు బ్రహ్మమునం దిమిడిపోయి వుండును. అట్టి బ్రహ్మమై నటువంటి శ్రీమాత సమస్తము నకు ఆధారము. ఆమె నుండి పుట్టినదంతయు వచ్చి పోవునదే కనుక, మార్పు చెందునవే గనుక అట్టి సమస్తమునూ మిథ్యయని పెద్దలు పలికినారు.

కనపడుచున్న ఈ సృష్టి అంతయు ఒక్కటియే. ఏకమే అనేకమై గోచరించును. కనుకనే శ్రీమాత **"ఇది అంతయూ నేనే, నా కన్న వేరుగ నేమియు లేదు. కనుక అన్నిటా అంతటా నన్నే దర్శింపుడు. అపుడు సృష్టి వైభవ మానందము కలిగించును. మిథ్యయే అయిననూ ఆనంద కారకము. మీ ఆనందము కొరకే ఇట్టి వైవిధ్యముతో యేర్పడి వెలు గొందుచున్నాను. నా వైభవమును భావించినచో ఆనందము కలుగును. కేవలము మిథ్య అని భావించినచో నా రస స్వరూపమును ఆనందింపని దౌర్భాగ్యము కలుగును. మిథ్యావాదమున పడి దౌర్భాగ్యవశము కాకుడు. నవరసభరితమగు నాటక రంగ మీ సృష్టి, రసానుభూతికే యేర్పడినది. జగన్మిథ్య అను వాదము అనర్థకము, నా మహిమ అను భావము వైభవ కారకము."**

# 736. 'ముక్తిదా'

**ము**క్తి నిచ్చునది శ్రీమాత అని అర్థము.

పై తెలిపిన నామము నందు మిథ్యా వైభవము వివరింపబడి నది. అంతయూ వచ్చి పోవుచునే యుండును గనుక దానిని దర్శించ గలుగుట ముక్తి హేతువగును. వచ్చి పోవుచు నున్న వాటితో నున్న సంబంధము శాశ్వతమని భావించినపుడు దుఃఖము కలుగును. సంబంధ మనగా సమ్యక్ బంధము. ఉన్నంతకాలము అనుబంధము కలిగి యుండవచ్చును. కాని అనుబంధము బంధము కారాదు. తెలియని వారు సంబంధములను బంధములుగ మార్చుకొందురు. అనుబంధము దూముడి వంటిది. బంధము పీటముడి వంటిది. జీవుడు అన్నిటి యందును అనుబంధము కలిగి యుండవచ్చును. అట్టి అనుబంధము వలన జీవిత మానందదాయక మగును. ఉన్నప్పుడు ఆనందించుట లేనప్పుడు దుఃఖ పడకుండుట ముక్త స్థితి. ఉన్నప్పుడు నిర్లక్ష్యము, శ్రద్ధ చూపు వారికి ఆనందముండదు. లేనప్పుడు పోయినవాటి గూర్చి దుఃఖపడుట, వున్నప్పుడు గుర్తింపకుండుట జరుగుచుండును. ఉన్నవి అనుభవింపక లేని వస్తువు గురించి చింతించుటకూడ దుఃఖ కారణమే.

తల్లిదండ్రు లున్నప్పుడు వారిని లక్ష్యపెట్టక వారు లేనప్పుడు దుఃఖింతురు. అట్లే భార్యా భర్తల యెడల, సోదరుల యెడల, స్నేహితుల యెడల కూడ ప్రవర్తింతురు. ఉన్నవారితో ఆనందము చెందక లేని

వారిని గూర్చి చింతింతురు. అట్లే వస్తువులతో కూడ. ఉన్నప్పుడు అనుభవింపక దాచుకొనువారు మూర్ఖులు. వీరు వుండియు లేనివారే. బ్యాంకులలో దాచుకొనుటకు నగలు కొనువారు తెలియనివారు. వీరు వుండియూ లేనివారు. జీవులు బంధముల నేర్పరచుకొనుటలో ప్రావీణ్యము సంపాదించుచూ బంధితులై దుఃఖించు చున్నారు. అనుబంధమును తెలియలేకున్నారు. తమ వద్దకు చేరిన జీవులు వస్తువుల విలువ తెలియలేరు.

శరీరము సహితము వున్నప్పుడు సద్వినియోగము చేయక రోగముల పడుచు బంధము పెంచుకొందురు. అన్ని బంధములకన్న దేహబంధము అత్యంత బాధాకరము. అది మరణ సమయముననే తెలియగలదు. మరణావస్థ అతి భయంకరము. దేహబంధము కాని ఇతర బంధములు గాని వీడుటకు జ్ఞాన మావశ్యకము. తనది అనుకొన్న దంతయు శాశ్వతము కాదనియు తన చుట్టునూ దైవ మేర్పరచిన మహిమ అనియు ఎఱిగి వానితో అనుబంధమున ఆనందము పొందుచు అవి తనను విడినపుడుగాని, తాను వాటిని విడినపుడుగాని, సహజమని తెలిసియుండుట జ్ఞానము. తాను, తన నుండి పుట్టిన తన దేహము కూడ పోవును. తన చుట్టూ చేరిన వన్నియు పోవచ్చును లేక తానే పోవచ్చును. ఇట్టి జ్ఞానముండుట వలన సక్రమ వర్తన ముండును. అదియే ముక్త స్థితి. అట్టి ముక్త స్థితి నిచ్చునది శ్రీమాత. ఆమెయే సత్యమని, ఆమె మహిమ తాత్కాలిక మని తెలిసి జీవించుట ముక్త స్థితి. అందులకే ఆరాధనము.

# 737. 'ముక్తిరూపిణీ'

**ము**క్తిరూపము శ్రీమాత అని అర్థము.

మోక్షమే రూపముగా గలది. ఎట్టి బంధములేని స్థితియే మోక్షము. పంచభూతములు మూడు గుణములు కలిగి ఎనిమిది స్థితులలో నుండు జీవులు అష్ట బంధములచే సతమత మగుచుందురు. తానుగ అహంకార భావము కలిగినపుడు రజస్తమస్సులు బంధించును. మొత్తమే తానుగ కూడ యున్నదని యున్నప్పుడు అహంభావముండదు. అహంభావము లేనపుడు అష్ట ప్రకృతుల యందున్ననూ బంధముండదు. "సోహం" (సహ+అహం) అనగా "అతడే నేను". అతడనగా పరమాత్మ, పరమేశ్వరి. పరమేశ్వర తత్త్వమే తానుగ రూపము చెందియున్నదని, తాను ప్రత్యేకముగ లేడని తెలిసి, ఆ స్థితియందు స్థిరపడి యుండుట మోక్ష స్థితి. ఇట్టి భావనతో కూడి అష్ట ప్రకృతుల యందు విహరించు వారు సిద్ధులు, మహాయోగులు.

నేనను భావము ప్రత్యేకమై నిలచినపుడు గుణ సంబంధము బంధమగు అవకాశము మెండుగ నుండును. అతడే నేను, అదియే నేను అను భావము నిత్యము స్మృతి యందున్నప్పుడు సంబంధమే గాని బంధముండదు. శ్రీమాత సహజముగ శాశ్వతముగ ఈ స్థితి యందుండును. యోగులు, సిద్ధులు, ఋషులలో, పై తెలిపిన స్మరణ వారియందు స్థిరపడి యుండుటచే వారు కూడ ముక్తిరూపులై వెలుగు

చుందురు. శ్రీమాత చైతన్యమే తాముగ యున్నామని సర్వకాల సర్వావస్థల యందు తెలిసియున్న వారగుటచే జీవన్ముక్తులై, జీవులకు మార్గ దర్శకులై వీరు నిలచియున్నారు. గురు పరంపరాగతముగ ఈ మార్గమును అందరికిని అందుబాటులో యుంచినది. ఇట్టి సద్గురు పరంపర జీవులకు మార్గముగ నిలచియున్నది. ఈ మార్గమున తమ నిజస్వరూపము నెఱిగి శ్రద్ధాభక్తులతో జీవించు భక్తు లేర్పడుచున్నారు. జీవులు తరించుట కిట్లు ముక్తిరూపిణి అయిన శ్రీమాత ముక్తి మార్గమును, పరంపరను కూడ ఏర్పరచి యున్నది. భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగము ఈ మార్గమున జీవులకు లభించును. ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు పరిణామక్రమమున ఈ మార్గముననే ముక్తి రూపిణి అయిన శ్రీమాతను దర్శించి ముక్త స్థితిని పొందుచున్నారు.

ముక్తిరూపిణి యగు శ్రీమాత భూమిపై శైలపుత్రిగ హిమాలయములలో స్థితిగొని యున్నది. ఆమె దరిచేర్చు గురు పరంపర హిమాలయములు కేంద్రముగ భౌగోళికముగ ముక్తి మార్గమును సంతర్పణ చేయుచున్నారు.



# 738, 739. 'లాస్యప్రియా, లయకరీ'

నర్తనము నందు ప్రీతిగల మాత లాస్యప్రియా. లయమును సిద్ధింపజేయు శ్రీమాత లయకరీ అని అర్థము.

సంగీతము, నాట్యము, చిత్రలేఖనము ప్రదర్శనము కొరకు గాదు. ఈ కళలు శ్రీమాతలో లయము చెందుటకు మార్గములు. ముక్తి హేతువులు. నాట్యము చేయుచు పరవశించి లయము చెందవచ్చును. తన్మయత్వము చెందవచ్చును. అట్లే గానము చేయుచు తన్మయత్వము చెందవచ్చును. దివ్య విద్యలన్నియు దివ్యత్వమునందు లయము చెందు టకే. ఈ కళల ద్వారా లయము చెందుట సులభము. చిత్తము నృత్య గీతముల ద్వారా సులభముగ కఱగుట జరుగును. అట్లు కఱిగి బుద్ధిలో ప్రవేశించి దివ్యానుభూతులను సాధకుడు పొందును. బుద్ధి కూడ క్రమముగ కరిగి ఆత్మ సంయమము చెంది తన్మయత్వమున నిలచును. ధ్యానము ద్వారా తన్మయస్థితి చెందుటకన్న గీత నృత్యముల ద్వారా తన్మయ స్థితి పొందుట పదిరెట్లు సులభము. పదిరెట్లు అధికము కూడ. ఎందరో కళాకారులు దివ్యానుభూతి పొందుచు తాదాప్యము చెందుచుందురు. భరతభూమి యిట్టి మార్గమునకు పుట్టినిల్లు.

భరతనాట్యము, కూచిపూడి ఆదిగా గల నృత్యములు, కర్ణాటక, హిందుస్థానీ మొదలగు సంగీత శాస్త్రములు అందించిన వారందరూ కూడ సిద్ధులే. ముక్తి హేతుకములుగ ఈ మార్గమును సిద్ధ లందించి

నారు. ముక్తి విద్యలుగ వీనిని ఉపాసించువారు కూడ కలదు. ప్రత్యేకించి శ్రీమాతకీ మార్గము ప్రియకరము. సంగీత నృత్యములతో శ్రీమాత సులభముగ ప్రీతి చెందును. భక్తితో కూడిన సంగీత నాట్యములు సులభముగ దివ్యానుభూతిని, దివ్యానుగ్రహమును కలిగించగలవు. శ్రీమాతలో లయము చెందుటకు లాస్యవిద్యకన్న మించిన విద్యలేదు. నిజమునకు లయమునకు వలసినవి సంగీతము తాళము నృత్యము. వీని కూడికయే లాస్యవిద్య.

దివ్య విద్యలను దైవమునకే సమర్పణ గావించుచూ నిర్వర్తించు కొనుట బుద్ధిమంతులు చేయు పని. అట్లు నిర్వర్తించునపుడు వానిని దర్శించువారు వినువారు కూడ కరగుట, తన్మయత్వము చెందుట జరుగును. ధ్యానము పేరిట జీవుడు పడు శ్రమకన్న సంగీత సాధనమున ధ్యానసిద్ధి సులభమగును. సంగీత జ్ఞానము కలవానికి ధ్యానము సులభము. హనుమంతుడు, నారదుడు, తుంబురుడు ఈ మార్గమునకు పరమగురువులు.



# 740. 'లజ్జా'

సర్వభూతములందు లజ్జా రూపముతో నుండు దేవి కనుక లజ్జ అని పిలువబడుచున్నది. లజ్జ అనగా వినయము అని అర్థము.

వినయశీలత దివ్య లక్షణములలో యొకటి. వినయ మున్నచోట అమ్మ అనుగ్రహముండును. వినయము గలవారు దృష్టిని నేలపై నుంచి నడుతురు. దృష్టి నేలపై నున్ననూ అంతర్భావన దివ్య భావనయై యుండును. బ్రహ్మ భావముతో దృష్టిని నేలపై నిలిపి నడుచువాడు భక్తుడు. రామబ్రహ్మము భూమిపై అట్లు సంచరించెను. నేలను చూచుచు నడచువారు పడరు. పొరపడరు. కాలితో తన్నుట గాని తన్నుకొనుట గాని యుండదు. నేలపై చూపు వినయమును అభ్యసింపజేయును. క్షమను నేర్పును. తనకన్న చిన్నవారియందు వాత్సల్యము కలిగియుండుట నేర్పును. అధోక్షజుడగు విర్పాటురుషుడు కూడ తన దృష్టిని అధోలోకముల యందు ప్రసరింపజేయుచు నుండును. గౌతముడు బుద్ధుడైనపుడు తోటి జీవులపై కరుణ కలిగి వాత్సల్యముతో వారి నుద్ధరించుటకు అవలోకితేశ్వరుడై భూమి కక్ష్యలో నిలచిపోయెను. అవలోకితేశుడనగా క్రింది లోకములపై చూపు కలవాడని అర్థము. రాముని చరితమంతయు భూమి జీవుల నుద్ధరించుటకే జరిగినది. బ్రహ్మ భావమునందు నిరంతరము నుండు రాముడు అవలోకితేశ్వరుడై సంచరించెను. కనుకనే జడమై పడివున్న అహల్యను స్పృశించెనేగాని తన్నలేదు. భూమిని

స్పృశించుచు నడచుట, యథాలాపముగ నడచుటలో సంస్కార భేద మున్నది. క్షమా రూపిణియైన భూమిపై మహాత్ములు తేలికపాటుగ నడతురు. స్పృశింతురే కాని పాదములు మోపుచు నడవరు. రాక్షస పాదమే భూమిపై ధ్వని కలిగించును. భూమికి నొప్పిని కూడ కలిగించును. దివ్యపాదము స్పృశించునే గాని బరువును మోపదు. మహాత్ములట్లు నడతురు. ఇది లజ్జా లక్షణము.

లజ్జా లక్షణము గలవారు అమ్మ అనుగ్రహమును పొందుట సులభము. తోటి వారియందు హితభావము, దాక్షిణ్య భావము లజ్జా లక్షణము. లజ్జ గలవారి అవయవముల కదలికగాని, కన్నుల కదలిక గాని సున్నితముగ నుండును. వారి హాసము కూడ చిరు హాసముగా నుండునేగాని అట్టహాసముగ నుండదు. వారి ఆచార వ్యవహార మంతయు వినయపూర్వకమై యుండును. వేషము, భాష కూడ అట్లే యుండును. వస్త్రధారణము వికృతమై యుండదు. అంగ ప్రదర్శన యుండదు. భాషణము నందు మృదుపదములే యుండును. వాక్కున కాఠిన్యముండదు.

'లజ్జా' అను పదము స్త్రీ వాచకము. 'లజ్' అను పదము పురుష వాచకము. 'లజ్' అనగా ఊర్ధ్వభాగము. 'లజ్జా' అనగా అధోభాగము. పరమ 'శివుడు' ఊర్ధ్వముఖ త్రికోణము కాగా 'శివాని' అధోముఖ త్రికోణము. ఆమె అధోముఖియై నవావరణ సృష్టి చేయును. అతడు ఊర్ధ్వముఖుడై సహకరించును. పరమశివుడు 'లజ్' రూపము, 'శివాని' లజ్జా రూపము.

విద్యా సంస్కారములు అలవడుచున్నకొలది జీవులయందు వినయము పెరుగుచు నుండును. వారు క్రమముగ లజ్జా స్వరూపు లగుదురు. వారి ప్రవర్తనము సర్వవిధముల సంస్కరింపబడి అతిక్రమణము లేక యుండును. ఆహార విహారాదుల యందుగాని, వేష భాషల యందుగాని, హాస నిద్రాదుల యందుగాని, కర్తవ్య నిర్వహణము యందుగాని క్రమ ముండును. అతిక్రమణ ముండదు. క్రమముగ వారియందు సత్త్వము పెరుగుచూ రజస్తమస్సులు హరింప బడును. స్వభావమున మృదుత్వ మేర్పడును. శ్రీమాత విద్యోపాసన ఇట్టి హృద్యమగు మార్పు ఆరాధకులయందు కొనిరాగలదు. శ్రీమాత లజ్జా గుణము అత్యంత వాంఛనీయము. కనుక అత్యంత ఆరాధ్య నీయము.



# 741. 'రంభాదివందితా'

**రం**భ, ఊర్వశి, మేనక మొదలగు అప్సరసలచే పూజింప బడునది శ్రీమాత అని అర్థము.

అప్సరసలు అనగానే సామాన్యముగ దివ్య లోకమందలి వేశ్యాంగనలని భావించుట పాపకరము. అప్సరసలు శ్రీమాత తన్మయ రూపిణులు. సృష్టి యందలి రాగరూపిణులు. సృష్టి అంతయు సంగీత నృత్య ధ్వనియే. చైతన్యము హృద్యమగు ధ్వనిగను, దాని కాంతి వయ్యార మగు కదలికగను ఊహించినచో అప్సరస అననేమో తెలియును. ధ్వని యందు రాగము, నృత్యముగ వెలుగొందు చైతన్య రూపము అప్సరస. సప్త కాంతులు రకరకముల రాగములతో, శబ్దములతో రస స్వరూపముగ సృష్టి నిర్మాణము గావించుచున్నది. స్వరములు, కాంతులు చేయు నృత్యమే సప్తలోక నిర్మాణమునకు మూలమగు చున్నది. వీనియందు ఛందస్సు, తాళము సహజముగ నుండును. ఇన్ని విశేషములతో కూడిన కాంతి రూపముల కదలిక దర్శించినచో విశేషమగు అనుభవము, ఆనందము కలుగును. దర్శించు వారియందు రససిద్ధి కలుగును. అప్సరాంగనల నృత్యము రససిద్ధి కలిగించుటకే కాని అందు యితర ప్రయోజనము లేమియు లేవు. స్వర్గాది దేవతలు కూడ అప్సరల నృత్య దర్శనము కోరుట అతీతమగు రస సిద్ధికే.

శ్రీకృష్ణుని వేణుగానము, నృత్యము, చూపరులకెట్లు రససిద్ధి కలిగించినదో భాగవతము మనకు తెలుపుచున్నది. అప్సరసలు రససిద్ధి

కారకులు. వారి సాన్నిధ్యము మాత్రముచే అట్టి సిద్ధిని యివ్వగలరు. వారు శ్రీమాత రూపములే కాని మరియొకటి కాదు. శ్రీమాత తేజో కిరణములే తాళలయాత్మకముగ నర్తించుట ఊహించినచో అప్సరసలన నేమో తెలియును. వీరి అనుగ్రహము వలననే వశిష్ఠ అగస్త్యుల వంటి వారు బ్రహ్మర్షులైరి. వీరి సాంగత్యముననే విశ్వామిత్ర మహర్షి సప్త ఋషులలో ఒకడై విరాజిల్లు చున్నాడు.

అట్టి అప్సరసలు నిత్యము శ్రీమాతను పూజించుచు నుందురు. గంధర్వ కాంతలగుటచే వారి సాన్నిధ్యము సద్యోముక్తి నీయగలదు. వారి దివ్యాకర్షణ వలన జీవులు తమనుతాము మరచి మోక్షస్థితి యందు నిలతురు. ఆకర్షణమునకు వీరే ప్రతి రూపములు.



# 742. 'భవదా వసుధా వృష్టిః'

**భ**వమును, వస్తు సంపదను, ధన సంపదను వర్షింప చేయునది శ్రీమాత అని అర్థము.

జీవులకు అనుగ్రహ పూర్వకముగ జన్మ పరంపర నిచ్చు వాత్సల్య మూర్తి శ్రీమాత. జన్మలేనిచో జీవునకు అనుభవము గణించు అవకాశమే లేదు. అనుభవము లేనిచో అనుభూతియే లేదు. అనుభూతి లేనిచో ఆనందమే లేదు. జీవుడు సహజముగ ఆనందాన్వేషి. అతడు పూర్ణానందు డగు వరకు ఆనందము కొరకు అన్వేషించు చుండును. అందు వైవిధ్యము నకై పరితపించుచు నుండును. వైవిధ్యమగు అనుభవములకు వైవిధ్య మగు దేహము నొసగునది శ్రీమాత. క్రిమికీటకాది దేహముల నుండి దివ్య దేహముల వరకును, అనేకానేక దేహముల యందు జన్మను అనుగ్రహించునది శ్రీమాత. కనుకనే ఆమె 'భవదా'. భవ మనగా జన్మము. జన్మమునిచ్చు తల్లి శ్రీమాత. కోటానుకోట్ల జన్మలనెత్తుచు, అనేకానేక అనుభవములను పొందుచు, అనుభూతి చెందుచు, తదా నందమును పొందుచు, జీవుడు పరిణామము చెందుచు నుండును.

ఈ మార్గమున సుఖ దుఃఖముల అనుభూతిని పొందును. వస్తు కనకాది ధనములను పొందును. ఆమె వసుధ అయి వుండుటచే భూమిపై గల వివిధ ధన భోగములను జీవు డనుభవించును. జీవునికి భోగము వర్జనీయము కాదు. భోగము ఆనందకారక మగుటచే ధర్మ

యుతమగు భోగము నిజమగు ధనభోగమై యున్నది. 'భవద'గా జన్మ నిచ్చి 'వసుధ'గ పోషణ నిచ్చును. తదనుగుణమగు అనుభూతి ఆనందముల నిచ్చును. భోగము ధర్మ సహితమయినపుడు పరితృప్తి కలుగును. అట్లు కానపుడు రోగమై అనుభూతి నిచ్చును. రోగము శ్రీమాత యిచ్చు శిక్షణము. శిక్షణము వలన అనుభవము కలుగును. అపుడు ధర్మము ఆవశ్యకత తెలిసి ధర్మరహిత భోగమునుండి ధర్మ సహిత భోగమునకు జీవుడు మరలును. భోగము పరిమిత ఆనందమే యిచ్చును. అపుడు జీవుడు అపరిమితానందము కొరకై యోగమునకు మరలును. యోగము అపరిమితానందమునకు మార్గము. పరిమితత్త్వము నుండి జీవుడు అపరిమితత్త్వము లోనికి ప్రవేశించుటయే యోగవిద్య ఆశయము. జీవుడు పరిమితుడుగాదు. అతడు సహజముగ అపరిమితాంశయే. కనుక పరతత్త్వము చేరువరకు పరితృప్తి చెందదు. యోగము నాశ్ర యించి చీకటి నుండి వెలుగులోనికి, అసత్యము నుండి సత్యములోనికి, మృతత్త్వము నుండి అమృతత్త్వములోనికి ప్రవేశించుటకు యత్నించును. ఇట్టి సమయమున జీవునికి శ్రీమాత అమృతవర్షిణియై గురురూపమున దరిచేరును.

ఇట్లు 'భవద'గా జన్మనిచ్చి, 'వసుధ'గా భోగముల ననుభవింప జేసి అమృత 'వృష్టి'యై తనయందు జీవులను చేర్చుకొనును. ఈ మూడు కార్యములను ఈ నామము కీర్తించుచున్నది.

# 743. 'పాపారణ్య దవానలా'

పాపములనెడి అరణ్యములకు దావాగ్ని వంటిది శ్రీమాత.

అరణ్యములు వేసవియందు అగ్ని రగుల్కొని తగులబడు చుండును. ఎవ్వరునూ అగ్నినంటించ పనిలేదు. అవియే అంటుకొనును. ఎట్లంటు కొనును? అనలుడు, అనిలుడు తోడై అంటుకొనును. వేసవిలో అగ్ని తీవ్రమై యుండును. అతడు అనలుడు. అనిలుడగు వాయువు వీచగా దట్టముగ నున్న అడివి యందు వృక్షముల రాపిడి వలన, వేసవి వేడి వలన తమంతటతామే రాపిడిచే అగ్నిని సృష్టించుకొనును. అపుడు ప్రభంజనమగు వాయువు వలన అగ్ని దావాగ్ని యగును. ఎంతటి అరణ్యమునైననూ కాల్చివేయును. నీటితో దానిని చల్లార్చుట అసాధ్యము. ఆధునిక పరికరములతో కూడ దావాగ్నిని చల్లార్చలేని ఉదంతములు గమనింపవచ్చును.

అట్లే సృష్టియందు పాపము పెరిగినపుడు అది అరణ్యమై చీకటి మయమగును. అజ్ఞానపు చీకటియే పాపపు చీకటి. చీకటిలో తన్నుకొనుట, కొట్టుకొనుట సహజము. జీవుల నడుమ ఘర్షణ పెరుగును. అది వృక్షముల రాపిడి వంటిది. చిరిగి చిరిగి గాలివానయైనట్లు ఘర్షణము పెరిగి కలహములకు, యుద్ధములకు, మహాయుద్ధములకు దారితీయును. అధర్మము నశించు వరకు యుద్ధములు జరుగుచు నుండును. ఒకరి నొకరు చంపుకొనుచుండగా శిక్షణము కలిగి శాంతి యేర్పడు చుండును.

శిక్షణము పూర్తి కానపుడు శాంతి తాత్కాలికముగ నుండును. మరల మరల యుద్ధములు జరుగుచుండును. ఇట్లు తీరుబడి లేక జీవులు చచ్చుచు జన్మ నెత్తుచు నుందురు. అదియును యొక అనుభవమే. ప్రాచీనముగ ఇట్టి అనుభవమును పొందిన భారతీయులు యిప్పటికి శాంతికాముకులైనారు. ఇతర దేశీయులు ఇంకను నేర్చుచు నున్నారు. ధర్మమునకు హాని కలిగినపుడెల్ల పాపము పెరుగుచుండును. పాపము పెరుగుచున్నప్పుడెల్ల యుద్ధము వచ్చును. అగ్ని ప్రమాదములు, జల ప్రమాదములు వచ్చుటగాని జరుగుచు నుండును. సమతుల్యమునకై ఇట్లు ప్రకృతి నిర్వర్తించు జీవులు శాంతిని వాంఛింతురు గనుక శాంతి పొందుటకు ధర్మమావశ్యకమని గ్రహింతురు.

వ్యక్తిగతముగ గాని, సమిష్టిగగాని ధర్మ మున్నచోట శాంతి యుండును. అధర్మ మున్నచోట భయము, సందేహము, విద్వేషము లుండును. ధర్మభూయిష్టమైన వ్యక్తులను, సమాజమును తీర్చిదిద్దుటకై శ్రీమాత అగ్నిస్వరూపిణియై ప్రజ్వరిల్లును.



# 744. 'దౌర్భాగ్య తూలవాతూలా'

దౌర్భాగ్యమనెడి గడ్డిని విసరివేయు గాలి వంటిది శ్రీమాత అని అర్థము.

దౌర్భాగ్యము దుఃఖహేతువు. పూర్వపుణ్య లేమిచే దౌర్భాగ్యము కలుగును. పుణ్యము చేయకపోవుట వలన లేమి కలుగును. ధర్మము కొద్దీ సంపద, దానము కొద్దీ సంతతి యేర్పడుచుండును. ఏ ధర్మము చేయనివాని దరి సంపద చేరదు. దానము చేయనివారి దరి సంతతి చేరదు. దాన ధర్మకార్యములను పుణ్యమందురు. పూర్వపుణ్యమే ప్రస్తుతమున సంపద సంతతియై నిలచును. దానము చేయుటకుగాని, ధర్మము చేయుటకు గాని బుద్ధి పుట్టవలెను కదా! బుద్ధి పుట్టించుకొనుటకు వీలుపడునా? పడదు. బుద్ధిని పుట్టించగల వారెవరు? ధర్మబుద్ధి పుట్టవలెనన్నచో దైవ ప్రార్థనమే మార్గము. లేశమాత్రమైననూ దైవప్రార్థన చేయబుద్ధి గాని వానికి దాన ధర్మములయం దాసక్తి యుండదు. దైవము నారాధించు బుద్ధి కూడ పుట్టనివారికి, దానిని పుట్టించు వారెవ్వరు? వాత్సల్యమూర్తియైన తల్లియే అట్లు చేయగలదు. ఆమె అనుగ్రహముననే ఆరాధనా బుద్ధి పుట్టును. ఆరాధన వలన దాన ధర్మ బుద్ధి పుట్టును. దాన ధర్మము వలన పుణ్యము పుట్టును. పుణ్యము వలన దౌర్భాగ్యము సౌభాగ్యముగ మారును.

మన భూమిపై చింతామణి కలదు. అది శంబళ గ్రామమున నిక్షిప్తమై యున్నది. చింతామణి కోరిన సంపదల నీయగల దివ్యమణి.

అట్టి దివ్యమణిని దివ్య పురుషులే సందర్శింపగలరు. అనితర సాధ్యమగు చింతామణి శ్రీమాత మణిరూపమే. ఆమె చింతామణి రూపమును స్మరించినంత మాత్రముననే దౌర్భాగ్యమంతయూ పారిపోవును. దరిద్రునకు, దౌర్భాగ్యునకు చింతామణి వంటిది శ్రీమాత. మణిమయ కాంతులతో కూడిన శ్రీమాత రూపమును నిత్యస్మరణ చేయువారి దరి సర్వసౌభాగ్యములు చేరును. దౌర్భాగ్యములు దూరమగును. సద్భావన కలిగించి, సత్కార్యములను నిర్వర్తింప జేసి, జీవుల దౌర్భాగ్యములను పోగొట్టుచుండుట, శ్రీమాత నిర్వర్తించు నిత్యక్రియలలో ఒకటి.

దౌర్భాగ్యము నిజముగ గడ్డిపోచ వంటిది. అది గాలి కెగిరి పోవును. కాని దౌర్భాగ్యవశమున గడ్డిపోచకూడ కొండచిలువంత బరువుగ తోచును. సముద్రమంతటి దౌర్భాగ్యమును కూడ పిల్ల కాలువ వలె దాటింపగల శక్తి శ్రీమాత స్మరణమున నున్నది. పసివాడు కూడ తన బాల పాదముతో దాటగలుగునంత చిన్నదిగ సముద్రమంత దౌర్భాగ్యమును దాటవచ్చును. దివ్య స్మరణయే దీని కుపాయము.



# 745. 'జరాధ్వాంత రవిప్రభా'

**ము**సలితనమును, చీకటిని ధ్వంసము చేయు సూర్యకాంతి వంటి శ్రీమాత.

జీవుడు శాశ్వతుడు. అతడు నిత్య యౌవనవంతుడు. షోడశాత్మకుడు. అతడు పసివాడు కాడు. ముసలివాడు కాడు. పసితనము, ముసలితనము దేహమునకే గాని జీవునికి కాదు. వృద్ధులన జ్ఞానవృద్ధులేగాని, వయోవృద్ధులు కారు. దేహాత్మ భావము మిక్కుటముగ నున్నవారు వయస్సు పైబడినదనియు, ముసలివారి వైతిమనియు భ్రాంతి పడుచుందురు. దేహ ధర్మములు దేహమున కుండగ జీవ ధర్మములు జీవున కున్నవి. దేహమునకు ముసలితనము సహజము. జీవునకు ముసలితనము లేదు. దేహము శీర్యము (మెరిక) కాగలదు. చివికి పోగలదు. శీర్యమగును కనుకనే శరీరమనిరి. చివుకుట, చిరుగుట వస్త్రమునకే గాని వస్త్రధారికి కాదు. దేహమొక పంచరంగుల వస్త్రము వంటిది– దానికి ప్రకృతి ధర్మములు వర్తించును. జీవుడు స్వయం ప్రకాశకుడు. ఇచ్ఛ జ్ఞాన క్రియా శక్తులు అతని నుండి ప్రకాశించును. అతడాత్మ స్వరూపుడు. పరమాత్మయే జీవాత్మగ, ప్రత్యగాత్మగ యేర్పడుచు నున్నాడు. ఆత్మకు వయోధర్మములు లేవు.

తాను జీవుడనని, ఆత్మస్వరూపుడనని, పరమాత్మ అంశనని, స్వయంప్రకాశకుడనని తెలిసియుండువాడు, జీవాత్మ భావనయందు స్థిరముగొని యుండును. అతడు దేహమును ధరించిననూ తనను

తాను మరువడు. దేహభావ మున్ననూ అందు చిక్కుకొనడు. దేహము నందున్ననూ ప్రకాశము కోల్పోడు. తన ప్రకాశ ప్రభావమున దేహమును కూడ కాంతివంతము చేయును. దేహమున ప్రకాశించుచున్న సూర్యుని వలె యుండును. దేహపు పొరలలో నుండి సూర్యకాంతి ప్రకాశించు చుండగా చూపరుల కతడు కాంతివంతముగను, ఆకర్షణీయముగను, అపురూపముగను గోచరించు చుండును. మహాత్ము లిట్లు దేహమునందు కూడ ప్రకాశించుచూ వసించి యుందురు. వారిని దేహాత్మ భావము నియమింపలేదు. దేహము నధిష్ఠించి వారు జీవింతురు. వారు బంధ మోచనులు. దేహభావ మందున్నవారు దేహము నందు బంధింపబడి దేహమే తామను భ్రాంతియందు పడి నశించు చున్నారు. లావైతిమని, సన్నబడితిమని, రోగగ్రస్తులమని, ముసలివారిమని, నల్లబడితిమని, పెరిగితిమని, తరిగితిమని అనేకానేక అవస్థలను అనుభవించు వారికి శ్రీమాత రవిప్రభ వంటిది. సూర్యు డుదయించగనే పొగమంచు పొర విడివడినట్లు శ్రీమాత ఆరాధనమున సాలోక్యము కలిగి అవిద్య నశించును. తాను జీవుడనని, జీవుడుగ శాశ్వతుడనని, సనాతనుడనని, స్వయంప్రకాశకుడనని తెలిసియుండుట విద్య. అది మరచుట అవిద్య. అవిద్య బంధహేతువు. విద్య మోక్షహేతువు. అవిద్యా బంధమున పడినవారికి చీకటిలో దీపము వంటిది శ్రీమాత. **"అవిద్యానాం అంత స్థిమిర మిహిర ద్వీపనగరీ .."**

శ్రీమాత సూర్యునికే మాత. సూర్యుడు సవితృమూర్తి నుండి ఉద్భవించినవాడు. సవితృమూర్తి కూడ ఆదిత్యలోకము నుండి యేర్పడిన వాడే. ఆదిత్యులకు కూడ పుట్టినిల్లు శ్రీమాత. ఆమె అదితి. ఆమె

కాంతి వలననే ఆదిత్యులు, సవితృలు, సూర్యులు మహత్తరమగు వెలుగులై విరాజిల్లు చున్నారు. ఆమె వెలుగే వారినుండి ప్రకాశించు చున్నది. జీవులు కూడ ఆమె కిరణములే. ఆమె ఆరాధకులకు అవిద్య యుండు అవకాశమే లేదు. అవిద్య యున్నప్పుడు ఆమె ఆరాధకుల మని భావించుట భ్రమయే. శ్రీమాత ముసలితనమను భావమునకు మృత్యువు వంటిది.

తాను ముసలితనము పొందదు అని తెలియుట యెంత జ్ఞానమో, తన శరీరమునకు ముసలితనము కలిగినదని తెలియుట కూడా అంతే జ్ఞానము. దేహధర్మము గౌరవించుచూ జీవధర్మముతో జీవించుట పూర్ణజ్ఞానము. దేహమునకు పుట్టుట, పెరుగుట, రోగగ్రస్తమగుట, వార్ధక్యము వచ్చుట తప్పనిసరి. మరణము కూడ తప్పనిసరి. తాను జ్ఞానిని కనుక తన దేహము మరణింప దనుకొనరాదు.

కాని దేహమునకు ముసలితనము కలిగినంత మాత్రమున ప్రజ్ఞకు ముసలితనము కలుగదు. ముసలితనము వచ్చినను మరపు వుండదు. ప్రజ్ఞకు మరపు లేదు. మరపే మృత్యువు. మరపు వచ్చు వానికి మృత్యువు వచ్చును. ఎఱుక లేమియే మరపు. ఎఱుకయే జ్ఞానము. కనుక జ్ఞానవంతుడు మరపును సహించడు. దరి చేరనీయడు. ఎట్టివారికైనను మరపు కలిగించగలిగినది శ్రీమాత. శ్రీమాత మాయకు లోబడియే సమస్త జ్ఞాన ముండును. ఆమె తలచినచో జ్ఞానవంతులను కూడ హింసింపగలదు. కనుక శ్రీమాత ఆరాధనము జ్ఞానవంతులకు కూడ వర్జనీయము కాదు. ఆమె కాంతియే భ్రమ భ్రాంతులనుండి సదా రక్షించును.

# 746. 'భాగ్యాబ్ధిచంద్రికా'

**భా**గ్య మనెడి సముద్రమునకు వెన్నెలవంటిది శ్రీమాత అని అర్థము.

సముద్రమున పూర్ణచంద్రకాంతి ప్రతిబింబించినపుడు సముద్ర మంతయూ వెండిమయముగ గోచరించును. ఆ వెండి సముద్రమునది కాదు. చంద్రుని ద్వారా ప్రసరించు వెలుగు. చంద్రుని వెలుగు చంద్రునిది కాదు. అది సూర్యుని వెలుగు. సూర్యుని వెలుగునూ సూర్యునిది కాదు. అమ్మ వెలుగే. ఇట్లు అమ్మ వెలుగు ఎవరిపై ప్రసరించిన వారికి భాగ్య మబ్బును. భాగ్యమునకు తెలివితేటలతో సంబంధము లేదు. తెలివిగల వారందరూ భాగ్యవంతులు కారు. భాగ్యవంతు లందరునూ కూడ తెలివైనవారు కారు. సరస్వతి యున్న లక్ష్మి నుండ నవసరము లేదు. లక్ష్మి యున్నచోట సరస్వతి యుండ నవసరము లేదు. రెండునూ ఉండుట అమ్మ మహిమ. అది అరుదుగ ఉండును. అత్తా కోడలు కలిసియుండుట వంటిది రెండునూ కూడి యుండుట.

భాగ్యవంతుల భాగ్యము అమ్మ అనుగ్రహమని తెలియవలెను. భాగ్యము తమ దనుకొనరాదు. సముద్రముపై ప్రకాశించు వెన్నెలను సముద్రము పట్టి యుంచలేదు. అట్లే భాగ్యవంతుడును భాగ్యమును పట్టి యుంచలేడు. అమ్మ అనుగ్రహమని భావించి ఆమె మెచ్చు పనులు, ఆమెకు నచ్చు పనులు చేయవలెను. లేనిచో ఏనుగు మ్రింగిన వెలగ

పండువలె హరింపబడును. సిరిని నమ్ముటకన్న శ్రీమాతను నమ్ముట మిన్న. సిరి అనపగామిని. లక్ష్మి చంచల. ఎవరి ననుగ్రహించునో, ఎప్పు డనుగ్రహించునో, ఎందుల కదృశ్యమగునో, ఎవ్వరునూ తర్కింప లేరు. ఓడలు బండ్లగుట, బండ్లు ఓడ లగుట కుటుంబము యందు జరుగుచునే యుండును.

'భాగ్యాబ్ధిచంద్రికా' యను నామము తెలిపిన దేమనగా, చంద్ర కాంతి వలన సముద్రము భాగ్యసముద్రమైనదని, చంద్రకాంతియే లేనిచో సముద్రము ఉప్పు సముద్రమే కదా! ఎవరి భాగ్యమైనను యింతియే. సిరి వచ్చుట, సిరి పోవుట సిరిచేతిలో యున్నదిగాని, జీవుని చేతిలో లేదు అను రహస్యమును ఈ నామము చమత్కారముగ తెలుపుచున్నది.



# 747. 'భక్తచిత్త కేకిఘనాఘనా'

**భ**క్తుల చిత్తము లనెడి నెమళ్ళకు దట్టమైన మేఘము వంటిది శ్రీమాత అని అర్థము.

నెమళ్ళకు దట్టమైన నల్లని మేఘములు, వాని చల్లదనము కలుగగనే చిత్తము ఉప్పొంగి పింఛములు విచ్చుకొనును. అమితానందముతో అత్యద్భుతముగ పింఛములు విప్పి నాట్యము చేయును. నెమలి పరవశించి నాట్యము చేయుట చూపరులకు కూడ ఆనందము కలిగించును. నెమలి నాట్యము అతి సుందరమై యుండును. నెమలి పురివిప్పిననే ఆనందము కలుగును. నాట్యము చేసినచో అమితానందము కలుగును. నృత్యములలో నెమలి నృత్యము అతి క్లిష్టము. అమితమైన చురుకు, కదలిక దేహము నందు, కంఠభాగము నందు, కన్నుల యందు చూపిననే గాని నృత్యము రక్తి కట్టదు. నెమలి చూపులో కదలిక, చురుకుదనము ఒక ప్రత్యేకము. నెమలి అటునిటు మెడ త్రిప్పుటలో అనేకానేకమగు కాంతులు దృశ్యా దృశ్యముగ గోచరించును. నృత్యము చేయునపుడు నెమలి కన్నులలో కూడ అమితమగు కాంతి ప్రదర్శనములు జరుగును.నెమలి కన్ను ఒక్కటి పొందిననే చాల తృప్తిగ నుండును. నెమలి పురియందు వందకు మించి కన్నులు ఉండును. నెమలి కంఠము, నెమలి కన్నులు, దేహభాగము, నృత్యము చేయుచున్నప్పుడు అది సప్తకాంతుల నృత్యమువలె గోచరించును. కాంతిపుంజముల నృత్యము అత్యంత రమణీయము.

కేకి యనగా నెమలి. 'భక్తచిత్తకేకి' యనగా పవిత్రత చెందిన భక్తుల కాంతివంతమగు చిత్తము. అటువంటి భక్తుల చిత్తము శ్రీమాత స్మరణ, దర్శన, స్పర్శన, సంభాషణములతో పరవశము చెంది పరవళ్ళు త్రొక్కును. మేఘస్పర్శను పొందిన నెమలివలె భక్తుల చిత్తము పరవశించి తన్మయముతో ఆడుట, పాడుట, కొనియాడుట చేయును. మేఘము నెమలి కెట్లో శ్రీమాతను గూర్చిన భావము భక్తుల కట్లుండును. రసానుభూతి కలిగించు శ్రీమాత భావమే భక్తునికి అత్యంత రసవత్తరము. భక్తు డెప్పుడునూ మాతృదర్శనమునకై పరితపించును. అది లేశమాత్రము లభించిననూ పరవశించును. అపు డతని కన్నులు అశ్రుపూరితము లగును. కంఠము గద్గద మగును. శరీర మంతయు పులకించి, రోమములు నిక్కబొడుచుకొనును. చైతన్య మంతయు పెల్లుబుకును. హృదయము పొంగును. కన్నులు మూత పడును. పరిసరము లన్నియు అదృశ్యమై శ్రీమాత కాంతి గోచరించును. భక్తుల కీ అనుభూతి పరమ ప్రీతికరము. అందులకే సతతము శ్రవణ, స్మరణ, కీర్తనాదులయందు నిమగ్నమై యుండుట.



# 748. 'రోగపర్వత దంభోళీ'

**రో**గము లను పర్వతములకు వజ్రాయుధము వంటిది శ్రీమాత అని అర్థము.

'దంభోళి' యనగా వజ్రాయుధము. కొండంత రోగమున్ననూ శ్రీమాతను భక్తిశ్రద్ధలతో పూజించినపుడు వజ్రాయుధము ధాటికి పర్వతము నుగ్గు నుగ్గు అయినట్లు రోగము నశించును. కనుక శ్రీమాత భక్తులు రోగమునకు భయపడరు. రోగములు శరీరముపైబడినపుడు **"రోగపర్వత దంభోళియై నమః"** అను నామమును మంత్రముగ పఠింప వచ్చును. **ఓం, ఐం, హ్రీం, శ్రీం** అను బీజాక్షరములను పూర్వ పీఠికగ చేర్చవచ్చును. ఈ నామము అష్టాక్షరియై ఉన్నది. అష్టాక్షరి యగు ఈ మంత్రము వజ్రమువలె పనిచేయును. రోగములను తప్పక నశింప చేయును. రోగనివారణ మార్గమును చూపును. సరియైన వైద్యము జరుగును. సరియగు వైద్యుడునూ దొరుకును. వైద్యము, వైద్యుడు సరి యగునవి దొరకనపుడు రోగము నశింపకపోగా, రోగిని హరించును. సమయమునకు వైద్యము దొరకుట, వైద్యుడు దొరకుట శ్రీమాత అధీనములో నున్నది. ఆలస్యమగుచో ఫలము విపరీతము కావచ్చును. రోగికికాని, రోగి ఆత్మీయులకుకాని సరియగు సంకల్పము కలుగుట, సరియగు సౌకర్యము వైద్యమున కేర్పడుట, సరియగు వైద్యుడు, వైద్యము దొరకుట, ఔషధములు సమయమునకు దొరకుట, వలసిన సహాయము

అందివచ్చుట యిత్యాది వన్నియూ సక్రమముగ జరుగవలె నన్నచో శ్రీమాత అనుగ్రహము ఆవశ్యకము. కనుక ఈ నామము రోగము వలన ఆపద కలిగినపుడెల్ల రోగికాని, అతని కుటుంబ సభ్యులు కాని మంత్రముగ మననము చేయవచ్చును. తీరని జబ్బులు కూడ శ్రీమాత అనుగ్రహమున తీరగలవు. అసాధ్యము సాధ్యము కాగలదు.

రోగము కలిగినపుడు భయ మావరించుట జరుగును. భయ మావరించినచో ప్రాణము బలహీనపడును. ప్రాణము బలహీన మైనపుడు రోగనిరోధక శక్తి తగ్గును. అపుడు రోగము బలపడి, ప్రాణమును హరించును. అందువలన రోగగ్రస్తుడు దైవస్మరణ చేయుచు నుండుట సముచితము. అట్టి స్మరణమునకు ఈ నామము సముచితము.



# 749. 'మృత్యుదారు కుఠారికా'

**మృ**త్యు వను కట్టెను తెగనరకుటకు గండ్రగొడ్డలి వంటిది శ్రీమాత అని అర్థము.

మృత్యువు అనేక విధముల కలుగవచ్చును. శాస్త్రము నందు ఇరువది ఎనిమిది (28) విధములుగ మృత్యువు సూచింపబడినది. మృత్యు వెట్లైననూ రాగలదు. మృత్యువు దారి ఎవ్వరికినీ తెలియదు. మృత్యువు నాపగలవారెవరు? తానుగ జీవుడు మృత్యువు నాపలేడు. దైవబలము తోడైనపుడే మృత్యువు నిలచును. దైవ మన్నచో మృత్యువునకు అమితమగు భక్తి, గౌరవము లున్నవి. దైవమున్నచోట మృత్యువుండదు. దైవము అనుమతి లేనిచో మృత్యువు ఉపక్రమించి జీవుల ప్రాణముల నపహరింపదు. దైవము ప్రీతిగొన్న జీవుని మృత్యువేమియును చేయదు. దైవసాన్నిధ్యమున భక్తునికి మృత్యుభీతి లేదు.

భక్తులు మృత్యువును దాటుదురే గాని మృత్యువుచే హరింప బడరు. వారు దేహమును త్యజింతురేగాని దేహమున మరణింపరు. దేహము స్వచ్ఛందముగ వదలుట చచ్చుట కాదు. భక్తులు, యోగులు, సిద్ధులు అట్లు స్వచ్ఛందముగ దేహము వదలుదురు. అట్టివారిని మృత్యువు తాకుటకు ప్రయత్నించినచో శ్రీమాత యొక్క గండ్రగొడ్డలి ఘాతమునకు మృత్యువు గురియగును.

భక్తిమార్గమున, యోగమార్గమున, జ్ఞానమార్గమున, వైరాగ్య మార్గమున జీవుడు మనోలోకమును దాటి, బుద్ధిలోకమున ప్రవేశించి

నచో దేహబంధ ముండదు. బంధము లేక దేహము నందు ఉండుట సంభవించును. అట్టివారికి మృత్యు వుండదు. దేహమునకే మృత్యు వుండును. నిజమునకు మృత్యువు దేహమునకే గాని జీవునకు గాదు. జీవుడు మనో కామ లోకములలోనే సంచరించునపుడు, దేహమున బంధింపబడి మృత్యుబాధ ననుభవించును. మృత్యుబాధ భీకరము. అందువలన మానవ దేహమునందు వశించు జీవుడు మరణ యాతనను అనుభవింపకుండుటకు బుద్ధిలోకము చేరి, బుద్ధిలోకమున వసించుట నేర్వవలెను. జీవప్రజ్ఞ మనోభావములకు, ఇంద్రియభావములకు, దేహ భావములకు అతీతమై యుండుటకు పై తెలిపిన భక్తి జ్ఞాన వైరాగ్య యోగ మార్గములు అందింపబడినవి. అందు ప్రవేశించిన వారికి మరణయాతనే వుండదు. పై తెలిపిన చతుర్విధ మార్గములు సత్యముగ సాధన చేసినచో రక్త మాంసాదులతో కూడిన ఈ శరీరము నుండి కాంతివంతమగు మరియొక దేహ మేర్పడును. ఈ కాంతి దేహమునకు మరణము లేదు. ఈ దేహమునే సూక్ష్మ దేహమని, కారణ దేహమని తెలుపుదురు. క్షీరము నుండి వెన్న యేర్పడినట్లు ఈ దేహ మేర్పడును. క్షీరమునకు ఆయుర్దాయము తక్కువ. వెన్నకు ఆయుర్దాయ మెక్కువ. అట్లే వెన్న నుండి నెయ్యి యేర్పడును. వెన్న కన్న నెయ్యి ఆయుర్దాయ మెక్కువ. ఇట్లు కాంతి శరీరములందు మృత్యుభయము లేక చిరకాలము జీవించ వచ్చును. హనుమంతుడాదిగా గల చిరంజీవులు భూమిపై ఎందరో యున్నారు. పై తెలిపిన మార్గమున సిద్ధిని పొంది చిరకాలము చిరంజీవులై జీవించవచ్చును. ఇట్టి వారు మరల మరల దేహములను ధరించినను, విసర్జించిననూ చావు పుట్టుకల యాతన యుండదు.

ఎందరో యోగులు శరీరమునకు విశ్రాంతి నిచ్చి దివ్య శరీరములతో దివ్యకార్యముల కొరకై విహరించుచూ మరల మరల దేహ ప్రవేశము చేయుచుందురు.

ఇట్టి విద్యలన్నియూ శ్రీమాత అరచేతియందు యిమిడి యున్నవి. ఆమె ఆరాధనమున నిమగ్నమైనవారు మృత్యువాత పడక చిరకాలము దివ్యశరీరధారులై జీవుల నుద్ధరించుచు భూమిపై యున్నారు. సద్గురువు లందరునూ అట్టివారే. మైత్రేయాది మహర్షులు కలియుగాంతము వరకు జీవుల నుద్ధరించుటకు దివ్యదేహములలో శ్రీమాత ఆజ్ఞానుసారము దివ్య ప్రణాళికను నిర్వర్తించు చున్నారు. మైత్రేయుడు, మరువు, దేవాపి మహర్షులు కలియుగాంతము వరకు దివ్యశరీరధారులై జీవుల నుద్ధ రించుచు భూమిపై నుందురని భాగవత పురాణము, భవిష్యత్ పురాణము, కల్కి పురాణము ఘోషించుచున్నవి. మైత్రేయ మహర్షి జగద్గురువుగ పరమగురువుల పరంపర యొకటి భూమి నలుచెఱగుల దివ్య శరీర ధారులై, దివ్యకార్యములను నిర్వర్తించు చున్నారు. మృత్యువును దాటు టయే ప్రధానాంశముగ వీరి బోధనలు సాగుచున్నవి.

భగవద్గీత యందు అర్జునునికి కృష్ణుడు మృత్యుంజయ రహస్య మును తెలిపినాడు. భాగవతమున పరీక్షిత్తునకు కూడ శుక మహర్షి ఈ రహస్యమునే అందించినాడు. మన వాఙ్మయ మందలి సమస్త బోధలు మృత్యువును దాటమని ఘోషించుచున్నవి. ఈ విద్యకు శ్రీమాతయే అధిష్ఠాన దైవము. సమస్త ఋషి పరంపర, గురుపరంపర ఆమె శిష్య పరివారమే. ఆమె నారాధించుచు బుద్ధిలోకముల ప్రవేశించుట మానవ జన్మకు ప్రధాన ప్రయోజనము.

# 750. 'మహేశ్వరి'

**మ**హత్తునకు ఈశ్వరి శ్రీమాత అని అర్థము.

సమస్త సృష్టికిని మహత్తే ఆధారము. మహత్తునకు బ్రహ్మము, సంకల్పము, కాలము, మాయ ఆధారము. అనిర్వచనీయమగు తత్త్వము బ్రహ్మము. అందంతయూ యిమిడి యుండును. సృష్టియందేర్పడు సమస్తమూ బ్రహ్మతత్త్వమున సూక్ష్మముగ నిక్షిప్తమై యున్నది. ప్రళయ కాలమున బ్రహ్మమై యుండును. ప్రళయమునకు పూర్వము గల జీవు లందరును వివిధమగు అపరిపూర్ణ ప్రజ్ఞా స్థితులలో యుండి పరిపూర్ణతకై ప్రయత్నమున నుండగా ప్రళయ మాసన్నమగును. వారు పునః సృష్టికై కోరుచూ బ్రహ్మమున లయ మగుదురు. ఇట్టి జీవులు అన్ని లోకముల యందు యుందురు. జీవుల అసంపూర్ణ స్థితి సంపూర్ణత్వము కోరుచు ప్రళయ కాలమున లయము చెందగా ఆ జీవుల సమిష్టి కోరికయే మరల బ్రహ్మము నుండి సంకల్పముగ మొలకెత్తును. ఆ సంకల్పశక్తియే శ్రీమాత. ఆమె నుండి కాలము, ప్రకృతి, మాయ యేర్పడును. నిజము నకు బ్రహ్మమే సంకల్పమై, కాలము ప్రకృతియై, మాయయై విలసిల్లును. ఇవి యన్నియు కూడి మహత్తు అని పిలతురు.

మహత్తున బీజప్రాయముగ సర్వజీవకోటి యుండును. భూత, భవిష్యత్, వర్తమాన కాలములుండును. అష్ట ప్రకృతు లుండును. ఇట్టి మహత్తు చోటువలె ప్రకాశించు చుండును. సమస్త సృష్టి, కాలము,

బీజప్రాయమున యుండును. ఇట్టి మహత్తును అధిష్ఠించి శ్రీమాత మహదహంకారమును, అందుండి సాత్త్విక, రాజసిక, తామసిక అహం కారములను, వాని నుండి పంచేంద్రియములను, పంచభూతములను, పంచతన్మాత్రలను, బుద్ధిని, మనస్సును యేర్పరచును.

బ్రహ్మము నుండి సంకల్పముగ దిగివచ్చిన శ్రీమాత తానే యిట్లు సర్వమును యీశ్వరియై నిర్వర్తించుచుండును. ఈశ్వరి యనగా యజమాని. ఈశ్వరత్వము యజమానత్వము కన్న గొప్పది. ఈశ్వరి తన నుండి పుట్టిన వాటిపై కేవల మధికారమే సాధించుట కాక తన నుండి పుట్టినవాటి యన్నిటి యందును తానే నిండి యుండును. యజమాని నుండి పుట్టినవాటి యన్నిటి యందు యజమాని వ్యాప్తి చెందలేడు. సంతానము, ఆస్తిపాస్తులు తన నుండే యేర్పడినను వాని యందు తానుగ యుండలేడు కదా! ఉదాహరణకు తన మేధస్సు నుండి పుట్టిన ప్రతిభతో ఆస్తులు యేర్పరచుకొనినపుడు వానిపై తన కధికారమున్నదని యజమాని భ్రమపడుచూ వాని చుట్టును తానే తిరుగును. ఊరిబైట పొలముకొని, ప్రతినిత్యమూ పొలమునకు పోవుచూ దానిని పరిరక్షించుకొనువాడు పొలమునకు కాపలాదారే కాని యజమాని కాడు. తాను యజమానియైనచో పొలము తన వద్దకు రావలయును కదా! పనివాండ్ర చుట్టూ తిరుగు యజమాని, యజమాని కాడు. తమ నుండి యేర్పడిన వన్నియూ తమపై ఆధారపడి యుండుట, సంకల్ప మాత్రమున అవి అన్నియూ తనలోనికి తిరోధానము చెందుట ఈశ్వ

రత్వము. పొలము చుట్టూ, ఆస్తుల చుట్టూ తిరుగుచు వానికి దాసులై జీవించుచూ యజమానులనుకొనువారు, నిజమునకు మూర్ఖులే.

చతుర్దశ భువనముల నేర్పరచిన శ్రీమాత సంకల్ప మాత్రముచే సమస్తమును తనలోనికి ఆకర్షింప గలదు. పురోగమనము, వృద్ధి, తిరోగమనము తెలిసినవారే ఈశ్వరులు. యోగులట్టివారు. కనుక వారిని యోగీశ్వరులందరు. అట్టి యోగీశ్వరులకు కూడ ఈశ్వరి శ్రీమాత. ఆమె యోగేశ్వరి. మహేశ్వరి. మహత్తును కూడ తనలోనికి యిముడ్చు కొనగలదు. కాలము, ప్రకృతి, శక్తి ఆమె వశమున యుండును. మాయ ఆమె కనుసన్నలలో మెలగును.



# 751. 'మహాకాళీ'

మహాకాళేశ్వర పత్ని అని అర్థము.

మహాకాళుడు శివుడు. కాలమున కతీతమైనవాడు మహా కాళుడు. కాలము, ప్రకృతి బ్రహ్మ సంకల్పముతో పాటు దిగివచ్చును. బ్రహ్మము నుండి మొట్టమొదట దిగివచ్చు త్రిభుజముగ సంకల్పము, కాలము, ప్రకృతి తెలుపుదురు. బ్రహ్మము నుండి సంకల్పము యేర్పడగ కాల మారంభమగును. సంకల్పము నుండి ప్రకృతిశక్తి యేర్పడును. పరబ్రహ్మరూపిణిగ శ్రీమాత, శివుడు అభేద స్థితియందుందురు. ఆ స్థితిలో శ్రీమాత కాలాతీత సంకల్పముగ దిగివచ్చినప్పుడు కాలమునకు సహోదరి. ఆమెను మహాకాళి అని పిలుచుటలో కాలమున కతీతముగ వున్న శ్రీమాత అని తెలియవలెను. సంకల్పముగ నున్నప్పుడు కాలముతో కూడి పనిచేయును. కాలానుసారముగ మన్వంతరములు, యుగములు, సృష్టి వృద్ధి చెంది స్థితియందుండి మరల లయమగును.

కాలము, శ్రీమాత కూడి పనిచేయుట ఒక సత్యము కాగా, కాలమును శాసించునది కూడ శ్రీమాతయే యని మరియొక సత్య మున్నది. తల్లి, కుమారుడు కలిసి పనిచేయుట, అవసర మగుచో తల్లి కుమారుని శాసించుట మరియొక సత్యము. కాలుడనగా యముడు. యముని శాసించు శక్తి శ్రీమాత కున్నది.

కాళియనగా మహిమ గలది అని మరియొక అర్థము. ముందు నామమున మహేశ్వరి తత్త్వము తెలుపబడినది. ఆమె మహత్తున

కీశ్వరి. మహత్తు మహిమెన్నజాలము. అట్టి మహత్తునకే మహత్తు శ్రీమాత అని అర్థము. మహత్తుల కతీతమైన శ్రీమాతను ఆరాధన చేయుట ప్రధానము. మహత్తు శ్రీమాత మాయా తత్త్వమునకు సంబంధించినది. మహత్తు మాయకు అందరును లోబడుదురు. కాని సత్యము మహత్తునకు కూడ అతీతమైనటువంటిది. మహిమలు అష్టసిద్ధులు గలవారికి దక్కును. అంత మాత్రము చేత వారు శ్రీమాత సాయుజ్యమును చేరినట్లు కాదు. లోక కల్యాణార్థమై మహర్షులు మహత్తులను ప్రదర్శింతురు. ఇతరులపై ఆధిక్యము కోసము మహత్తులను ప్రదర్శించువారు శ్రీమాత భక్తులు కారు. నిస్వార్థముగ సిద్ధులను ప్రదర్శించువారు పూజ్యులు. యుద్ధరంగ మున స్వార్థమున్నప్పుడు సిద్ధులు క్రమముగ వశము తప్పును. అట్టివారు కష్ట నష్టములకు లోనగుదురు. పతనము కూడ చెందుదురు. మహాకాళిని పూజించువారు మహిమలకు లోనుగాక సత్యదర్శన మగువరకు ఆరాధ నము సాగించవలెను.

కాళీపూజ గావించువారి వద్ద మహిమలు చేరును. కాళి అనిన మహిమయే కదా! కనుక మహిమలు చేయును. మహిమలు వరించి నపుడు అహంకారము దరిచేరుట సర్వసామాన్యము. తాంత్రికులు, మాంత్రికులు మహిమ దరిచేరినప్పుడు తట్టుకొనలేక వానిని దుర్విని యోగము చేయుదురు. ఫలితము పతనమే. కనుక కాళీ పూజలలో ఉగ్రకాళికన్న భద్రకాళిని పూజించుట ఆచారమైనది. ఇటీవలి కాలములో కాళీపూజలను గావించి, సిద్ధుల నధిగమించి కాళిప్రేమను, అనుగ్రహ మును చూరగొన్నవారు శ్రీ రామకృష్ణ పరమహంసయే.

కలను జయించునది కాళి అని మరియొక అర్థము. కల–క్షేపేకాళి అని వివరణము. సృష్టి అంతయు ఒక కల, మిథ్యారూపము. ఉన్నది ఒక్కటియే. మరియొకటి లేదు. మరియొకటి వున్నట్లు గోచరించును. అనేకానేకము లున్నట్లు గోచరించును. మృత్యువు కూడ కలయే. పుట్టుట చచ్చుట యిత్యాదులు లేవు. స్థితి భేదములు లేవు. ఎన్ని చూచిన సృష్టియందన్ని కనపడును. చూచువానిని బట్టి సృష్టి ఉన్నది తానే. ఇట్టి జ్ఞానమిచ్చునది గనుక మహాకాళి.



# 752, 753. 'మహాగ్రాసా; మహాశనా'

**అ**పరిమితమైన కబళము గలది శ్రీమాత, అపరిమితమగు ఆహారము స్వీకరించునది శ్రీమాత అని అర్థము.

లయ స్వరూపిణిగా శ్రీమాత సమస్తమునూ భక్షించును. కాల స్వరూపిణిగా సర్వమునూ భక్షించును. జరా వ్యాధి రూపముగ దేహము లను భక్షించును. పరము నుండి పుట్టినదంతయూ పరమునే చేరును గదా! లోకము నుండి లోకము పుట్టినపుడు మరల పిల్లలోకము తల్లి లోకము లోనికి లయమగును. స్థూలము, సూక్ష్మమును చేరును. సూక్ష్మము, సూక్ష్మతరమును చేరును. సూక్ష్మతరము, సూక్ష్మతమమును చేరును. ఇట్లు క్రింది లోకములు పై లోకమునకు ఆహారమై యుండును. పై లోకముల నుండి క్రింది లోకము లేర్పడుచుండును. అనగా అన్న మేర్పడుచుండును. గ్రాస మేర్పడుచుండును. ఇట్లు మహాగ్రాస మేర్పడు చుండును. సృష్టి యేర్పడుట, అన్న మేర్పడుట, స్థితిగొనుట, అన్న వృద్ధి, సృష్టి లయమగుట, ఆహార స్వీకారము.

బ్రహ్మమే అన్నము. బ్రహ్మము నుండి లోకములు పుట్టును. అనగా అన్న బ్రహ్మము నుండి అన్నము పుట్టును. ఈ కార్యమంతయు అన్నపూర్ణగ శ్రీమాత నిర్వర్తించును. సృష్టి అంతయూ ఆమె వంటయే. ఇట్లు లోకాలోకములుగ అన్న మేర్పడుచుండగా అందు లోకులను పోషించుటకు కూడ బ్రహ్మము నుండి పదార్థ రూపముగ ప్రకృతి

పుట్టును. ఇట్లు తామరతంపరగ సృష్టి యేర్పడుట అన్న మేర్పడుటయే. ఇట్లు మహా(గ్రాస మేర్పడు చున్నది. ఒకదాని నొకటి తినుచు నున్నది. పదార్థములను వృక్షములు, జంతువులు, మనుష్యులు అన్నముగ స్వీకరింతురు. వృక్షములను జంతువులు, మనుష్యులు అన్నముగా స్వీకరింతురు. జంతువులను జంతువులు, మనుష్యులు అన్నముగ స్వీకరింతురు. మానవులను రాక్షసులు భుజింతురు. దేవతలు కూడ భుజింతురు. అగ్ని, వాయువు, వరుణుడు రూపముల దేవతలు భుజింతురు. దేవతలను కూడ కాలము భుజించును. కాలము సర్వమునూ భుజించును. ఈ మొత్తము కార్యము అన్నమేర్పడుట, భుజించుటగా చూడబడుచున్నది.

బ్రహ్మమే అన్నముగ యేర్పడుచున్నది. బ్రహ్మమే జీవుల రూపమున అన్నమును తినుచున్నది. బ్రహ్మమే జీవులను కూడ హరించు చున్నాడు కనుక సృష్టి అంతయూ బ్రహ్మ యజ్ఞమే అని శ్రీకృష్ణుడు గీతలో తెలిపినాడు. **"బ్రహ్మార్పణం, బ్రహ్మహవిర్ ..."** ఈ వైచిత్ర్యమును జీవులు గమనించరు. తినుచున్నవాడు బ్రహ్మము, తినుచున్నది బ్రహ్మము. తినుట అను కార్యము బ్రహ్మకర్మ. అన్నము తినుట బ్రహ్మకర్మగా తెలుపబడుచున్నది. తాను బ్రహ్మమని, తాను తినుచున్నది బ్రహ్మమని, తినుట బ్రహ్మకార్యమని భావింపవలెను.

మహా(గ్రాసగా శ్రీమాత ఏర్పడి, మహా అశనగా తానే తిను చున్నది. సృష్టిని యేర్పరచి, సృష్టిని తినుచున్నదని కవి హృదయము.

ఇట్లు ఋషులు చిత్రవిచిత్రముగా శ్రీమాత తత్త్వమును వివరించు చున్నారు.

ఇన్ని రకములుగ చెప్పుట ఎందుకు? ఉన్నది ఒక్కటియే కదా! అని ప్రశ్నము పుట్టును. ఇన్ని రకముల వంట లెందుకు? కడుపు నింపుటకు అని ఒక్కటియే తినుచున్నామా? రకరకములు వండుకొని తినుచున్నాము కదా! అట్లే ఋషులు రకరకములుగ ఒకే విషయమును తెలుపుదురు. ఒకే బ్రహ్మమును వేల రకములుగ తెలిపినారు. రసోపేత ముగ తెలిపినారు. రుచి లేనివాడు విందు భోజనమున కేగినపుడు విసుగు, కోపము చెందును. అంతయూ వ్యర్థ మని భావించును. అట్లే దివ్యరుచి లేనివారికి వేదాంతమే మిగులును., ఆరోగ్యవంతులకు విందు భోజనమెట్లో, భక్తులకు శ్రీమాత అట్లు రసస్వరూప.



# 754. 'అపర్ణా'

**ప**తనము లేనిది శ్రీమాత. మరియు తినుటకు ఆకులు కూడ లేనిది శ్రీమాత అని అర్థము.

శివుని వీడుటయే పతనము. బ్రహ్మ నిరాకరణమే పతనము. బ్రహ్మమును నిరాకరింపకుము అని వేదములు శాసించును. బ్రహ్మమును నిరాకరింపకుందుము గాక! అని వేదములు ఆశంసనము చేయును. బ్రహ్మమును నిరాకరించినపుడు అహంకార మావేశించి పతనము కలుగును. ఇది సత్యము. బ్రహ్మము నాశ్రయించి యున్నప్పుడు ఇతరము లేవియు గోచరింపవు. సర్వమూ బ్రహ్మమయముగనే తోచును. బ్రహ్మమును నిరాకరించినపుడు నేను, యితరము అని గోచరించును. నిజమునకు యితరముగ గోచరించునది కూడ తానే, బ్రహ్మమే. కాని మాయ వలన ఇతర మున్నదని భావించుట జరుగును. అపుడు యితరము కూడ తానే యని స్మరించు చుండవలెను. అన్య మున్నదనుకొనుట వలననే సృష్టి క్రీడ యున్నది. అట్టి అన్యముతో విభేదము యేర్పడ కుండుటకు, మిత్రత్వమే కలిగియుండుటకు అన్యము కూడ తానే అని భావించుట ఉత్తమ మార్గము. అపుడే యితరముగ గోచరించు వస్తువు నందు ప్రేమ యుండును. మిత్రభావ ముండును. క్రీడ ఆనందముగ నుండును. ఆనందమే సృష్టి పరమావధి.

అన్య మేమియు లేదు అనుకొనినచో క్రీడ లేదు. మరియొకటి యున్నప్పుడే కదా క్రీడ! క్రీడకు అన్యము అవసరము. కాని అన్య మేర్పడినపుడు భేదము కూడ యేర్పడవచ్చును. భేద మేర్పడినచో పతన

ముండును. క్రీడ ఆనందముగాక దుఃఖము కలిగించును. కనుకనే క్రీడ, తదానందము, పతనము లేని స్థితి మూడును లభించుటకు శ్రీమాత అపర్ణగ యుండును. పర్ణ మనగా శాఖ లేక అంశ. తాను బ్రహ్మము నుండి వేరై సృష్టి కార్యము నిర్వర్తించు చున్ననూ బ్రహ్మమును వీడదు. బ్రహ్మమును కూడియే యుండును. అట్లు కూడియుండుట వలన పతన ముండదు. క్రీడా ఆనందము యుండును.

జీవుడు బ్రహ్మమే తానుగ నున్నాడని మరియు దృశ్య గోచరమగు సమస్తమూ కూడ బ్రహ్మమే అని గుర్తించి వర్తించినచో జీవనము ఆనందమయముగ ఉండును. ఇది అపర్ణస్థితి. బ్రహ్మమును మరచినచో పతన ముండును. బ్రహ్మము అయిపోయినచో క్రీడ యుండదు. క్రీడయు బ్రహ్మము రెండునూ పొందుటకు, తత్ఫలితముగ బ్రహ్మానందమున యుండుటకు మధ్యేమార్గముగ విశిష్టాద్వైత మున్నది. అన్యము లేకుండుట అద్వైతము. అన్యమున్ననూ అది బ్రహ్మమే అని గుర్తించి క్రీడించుట విశిష్టాద్వైతము. శ్రీమాత బ్రహ్మము నుండి ఉద్భవించి బ్రహ్మమునే పెట్టుబడిగా సృష్టి నిర్మాణము చేసిననూ, అంతటా, అన్నిటా బ్రహ్మమునే దర్శించుచూ బ్రహ్మముగనే యుండును. ఇది ఆమె విలక్షణ స్థితి.

పార్వతీదేవి శివుని గూర్చి అనన్యసాధ్యమగు తపస్సు గావించెను. ఆకులు, అలములు భుజించుచూ తపస్సు చేసెను. అట్టి సమయమున పరిసరముల యందలి ఆకులు అన్నియూ భుజించి వేసెను. తినుటకు ఒక్క ఆకుకూడ మిగుల లేదట! తత్కారణముగ వృక్షము లన్నియూ ఆకులు లేనివై పోయినవట! అపర్ణము లైనవట! ఆ కారణముగ శ్రీమాతకు 'అపర్ణా' అను నామ మేర్పడినది.

# 755. 'చండికా'

ప్రచండమగు కోపము కలది శ్రీమాత అని అర్థము. ఏడు సంవత్సరముల బాలిక అని మరియొక అర్థము.

దుష్టుల యెడ శ్రీమాత ప్రచండమగు కోపమును ప్రదర్శించును. బాలురను, బలహీనులను, స్త్రీలను, సాధువులను, ధర్మపరులగు భక్తులను హింసించు వారియెడల శ్రీమాతకు ప్రచండమగు కోపము కలుగును. చడి కోపే ఛండికా అని వ్యుత్పత్తి అర్థము. చడి కోపము వచ్చినపుడు చండాడుట జరుగును. సృష్టికిని ధర్మమునకు వ్యతిరేకముగ పనిచేయు వారియందు శ్రీమాత కిట్టి కోపము కలుగును. పై తెలిపిన వర్గములను నిష్కారణముగ హింసించువారి యందు శ్రీమాతకు చాల కోపము కలుగును. ఆమె కోపము అపరిమితమై హింసించువారిని హింసించును. దండించును. మహిషాసురాది దైత్యులను శ్రీమాత హింసించి చంపినపుడు త్రిమూర్తులు సహితము వణకిరట! ఆమె హింసారూపమే సింహము. సింహవాహినియై శ్రీమాత సృష్టి నిర్వహణమున ఎందరో అసురులను ప్రచండ రూపిణియై సంహరించినది. దేవీ సప్తశతి యందు ఆమె అసుర సంహారము వివరముగ ఈయబడినది. తమ యందలి అసురులు సంహరింపబడుటకు భక్తులు సప్తశతి పారాయణము గావించు చుందురు.



# 756. 'చండముండాసుర నిషూదిని'

**చం**డుడు, ముండుడు అను రాక్షసులను చంపినది గాన ఈ నామము కలిగినది.

శ్రీమాతను చండి అని పిలుతురు. చండికా అని పిలుతురు. చండు డను రాక్షసుని శ్రీమాత భయంకరముగ చంపినది. త్రిశూలముతో శిరమును ఖండించి ఆ శిరస్సును శ్రీమాత తనతో గొనిపోయెను. అట్లే అతని చర్మమును వలిచినది. ఒక జీవుని చర్మమును ఒలుచుట ఆ జీవుని హింసించుటలో పరాకాష్ఠ. చర్మము ఒలిచి అటుపై తల ఖండించు టలో శ్రీమాత కోపోద్రేకమును దేవతలు గమనించి భయభ్రాంతులైరి. అసురులను చెండాడుటలో శ్రీమాతను మించినవారు లేరు. ఆమె చెండాడునపుడు శివకేశవులు కూడ విస్మయముతో చూతురట! దేవత లందరునూ భయపడుదురట! శివకేశవులకు కూడ వశముకాని అసురు లను శ్రీమాత అత్యంత కోపముతో సంహరించును. ఆమె చెండాడుటలో అత్యంత సమర్థురాలు కనుకనే చండి యని, చండికా యని ప్రశంసింతురు. రాక్షసుల శిరస్సులను ఛేదించి వాటిని మాలగా ధరించు కాళీ రూపము అమిత భయంకరము. శ్రీమాత ఎంత ప్రేమమూర్తియో, అసురుల కంత భయంకరమగు మూర్తి.



# 757. 'క్షరాక్షరాత్మికా'

**క్ష**రము అక్షరముగ వ్యాపించునది శ్రీమాత అని అర్థము.

క్షర మనగా తాత్కాలికము. అక్షర మనగా శాశ్వతము. సృష్టి అంతయూ క్షరాక్షరముగ యేర్పడి యున్నది. అక్షర మాధారముగ క్షర మగు గుణములు, రూపములు యేర్పడును. గుణములు, రూపములు యెప్పుడునూ మార్పు చెందుచు నుండును. అట్లు మార్పు చెందు వానికి మార్పు చెందని ఆత్మగా తానుండును.

నేనుగ జీవు డక్షరుడు. అతని గుణములు, రూపము మార్పు చెందుచు నుండును. రూపములు మార్పు చెందును. మరణించును. గుణములు కూడ మార్పు చెందును. రూపముల మార్పు కన్న గుణముల మార్పు నెమ్మదిగ జరుగును. రూపములు జన్మ జన్మకు మారును. ఒక జన్మయందు కూడ బాల్యము, యౌవనము, వార్ధక్యము రూపము లేర్పడును. గుణములు అనుభవమునుబట్టి నెమ్మదిగ మార్పు చెందును. అవియునూ క్రమముగ మారుచుండును. ఆత్మ తత్త్వము తప్ప యితరము లన్నియూ మార్పు చెందును. ఇట్టి జీవ సమూహములకు సృష్టి స్థితి లయములను కలిగించు శ్రీమాత ఆత్మలకు పరమాత్మ. ఆమెయే క్షరా క్షరములకు మూలము.



# 758. 'సర్వలోకేశీ'

సర్వ లోకములకు ఈశ్వరి శ్రీమాత అని అర్థము.

ఈశ్వరి, ఈశ్వరుడు అను పదము చాల విశిష్టమగు పదము. ఈశ్వరత్వము అసామాన్యము. యజమాను లందరూ ఈశ్వరులు కారు. ఈశ్వరులే నిజమగు యజమానులు. తమనుండి పుట్టినవానిపై తమకు కేవల మధికారమే యుండుట యాజమాన్యము. యజమానులకు తమ యాజమాన్యమున ఉన్నవారిపై అధికార ముండును. కాని ఈశ్వరత్వము అంతకన్న గొప్పది. తమనుండి పుట్టినవాటి యందు తామే వ్యాప్తిచెంది యుందురు. వానియందు కూడ తమ అస్తిత్వము వ్యాప్తిచెంది యుండును. తా మాధారముగనే అవి యుండును. తాము లేనిచో అవి లేవు. సముద్రము లేని అల యుండదు. జీవి లేని శరీర ముండదు. ఈశ్వరు నకు సమస్తము నందు వ్యాప్తిచెందు లక్షణము, వ్యాప్తి చెందినవి తమ లోనికి ఉపసంహారము చేసుకొను లక్షణము యుండును. యజమానుల కట్లుండదు. యజమాని మరణించిన మరియొక యజమాని యేర్పడును. యజమానులు, అధికారులు ఈశ్వరులు కారు. జీవుడులేనిచో శరీర ముండునా? ఉండదు. ఏది లేనిచో మరియొకటి ఉండదో అదియే ఈశ్వరత్వము. నీరులేనిచో మంచుగడ్డ యుండదు. నిప్పులేనిచో పొగ యుండదు. గాలిలేనిచో స్పర్శ యుండదు. ప్రకాశము లేనిచో ఆకాశ ముండదు. ప్రకృతి లేనిచో పంచభూతము లుండవు. మూల ప్రకృతియే

లేనిచో ప్రాణమే లేదు. సచేతనములు, అచేతనములు లేవు. లోకములు లేవు. లోకేశ్వరు లుండరు. ఇట్లెవరి వలన అన్నియూ యున్నవో ఆమెయే లోకేశ్వరి. ఆమె బ్రహ్మమునుండి వ్యక్తము గానపుడు ఏమియూ యుండదు.

ఉదాహరణకు సీతమ్మకు శ్రీరాముడు ప్రాణేశ్వరుడు. అనగా రాముడులేని సీత యుండదు. ఇట్టి సంబంధము శ్రీమాతకు, లోకము లకు యున్నది.



# 759. 'విశ్వధారిణీ'

విశ్వమును ధరించునది శ్రీమాత అని అర్థము.

సమస్త విశ్వము శ్రీమాత స్వరూపము. జీవునికి జీవరూపము వలె శ్రీమాతకు సృష్టిరూపము. జీవుడు తన రూపమును ధరించినట్లు శ్రీమాత విశ్వమే రూపముగ ధరించినది. ఆమె సూక్ష్మరూపిణి మరియు విశ్వరూపిణి. తానే అష్టప్రకృతియై నిలచినది. అష్టప్రకృతులకు తాను మూలము కనుక ఆమె ప్రకృతి. వస్తుతః బ్రహ్మము. మూలప్రకృతియై అష్టప్రకృతుల నేర్పరచును. బ్రహ్మ మాధారముగ యిట్లు నవావరణ సృష్టి చేయును. నవదుర్గముల నేర్పరచును. నవదుర్గయై నిలచును. నవదుర్గములను ధరించును, పాలించును. నవదుర్గములను సృష్టించుట, పోషించుట, ధరించుట, భరించుట ఆమె వంతు. ఇట్టి నిర్వహణము మహాద్భుతము. నవలోకములందు జీవు లేర్పడుట, పోషింపబడుట, పరిణామము చెందుట సృష్టికాల మంతయూ సాగును. ఒక్కమారు శ్వాసను గొని వదలినట్లు ఉచ్ఛ్వాసమున సృష్టి నేర్పరచి, నిశ్వాసమున సృష్టిని తనలోనికి గొనును. మరల ఎగబీల్చినచో సృష్టి అంతయూ ఆమెలోనికి లయ మగును. ఇట్లు సృష్టిని గావించి, ధరించి, లయము గావించు చుండును. ఆమె 'విశ్వధారిణి.'



# 760. 'త్రివర్గదాత్రి'

త్రివర్గముల నిచ్చునది శ్రీమాత అని అర్థము.

త్రివర్గము లనగా ధర్మము, అర్థము, కామము. ఈ వరుసలో కామ పూరణము గావించుకొనువారికి జీవనము పురోగమించుచూ పరిణామము శుభప్రదమై యుండును. ధర్మము ప్రధానముగ అర్థ సముపార్జనము, కామపూరణము జరుగుచూ ఉండవలెను. అర్థము కొరకై గాని, కామము కొరకై గాని ధర్మము విసర్జింపబడినపుడు జీవనము చిక్కుపడును. ధర్మము నాశ్రయించి జీవించువారు కాల క్రమమున తప్పక సుఖశాంతులను పొందుదురు. సర్వార్థములను పొందుదురు. పురాణము లన్నియు వివిధ కథల రూపమున ఈ సత్యమునే బోధించినవి.

కృతయుగమున జీవులు ధర్మము నాశ్రయించియే జీవించిరి. త్రేతాయుగమున, ద్వాపర యుగమున ధర్మము ఆశ్రయింపబడక జీవులు కష్టనష్టములను కొనితెచ్చుకొనిరి. ప్రస్తుత మీ కలియుగమున ధర్మము కరువగుటచే మానవు లనేకానేక కష్ట నష్టములకు గురి యగుచున్నారు. ఇట్టి సమయమున ధర్మమును నేర్పుటకు సద్గురువు లనేక విధముల బోధనలను సలుపుచు తామాచరించి చూపుటకు యత్నించు చున్నారు.

ధర్మ మెచ్చట యుండునో నిజమగు సుఖ మచ్చట యుండును. ధర్మమును బట్టి జయ ముండును. ధర్మమును వీడి దైవము నాశ్ర

యించుట వివేకమగు పని కాదు. దైవానుగ్రహమునకు ధర్మమే ప్రధానము. తాత్కాలికమగు జయము కొరకు గాని, సుఖము కొరకు గాని ధర్మమును వీడువారు పతనము చెందుదురు. ఎన్ని కష్టములు వచ్చినను, నష్టములు వచ్చిననూ ధర్మమును వీడరాదని బోధించుటకే రామాయణ, మహాభారతము లీయబడినవి. ధర్మము నాచరించువారికి మాత్రమే ధర్మము బలము తెలియును. ఇతరులకు తెలియదు.



# 761. 'సుభగా'

సకల సౌభాగ్యములు తన రూపముగా గలది శ్రీమాత అని అర్థము.

"భగ" పదమునకు ఈ క్రింది అర్థము లున్నవి. 1. శ్రీ 2. కోరిక 3. మాహాత్మ్యము 4. యోని 5. వీర్యము 6. వెలుగు 7. కీర్తి 8. ఐశ్వర్యము 9. జ్ఞానము 10. ప్రయత్నము 11. ధర్మము 12. సూర్య కాంతి.

సూర్య మండల మందు అంతర్గతమై యున్న వెలుగును భర్గో దేవ మందురు. గాయత్రి రూపమున దీనిని ఆరాధించు చుందురు. ఆదిత్య, సవిత, సూర్యమండల కాంతులుగ ఈ కాంతి విరాజిల్లు చుండును. ఈ కాంతి ఎవరిని ఆవరించునో వారు సర్వ సౌభాగ్యము లను పొందుదురు. కనుకనే ఋషులు గాయత్రి మహామంత్ర రూపమున ఈ కాంతి నారాధించుటకు ప్రోత్సహింతురు. ఇట్టి కాంతిరూపము గలది శ్రీమాత.



# 762. 'త్ర్యంబకా'

**మూ**డు నేత్రములు కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత మూడు నేత్రములు సూర్య, చంద్ర, అగ్ని కాంతులకు ప్రతిరూపములు. బహిర్ దృష్టి, అంతర్ దృష్టి, విశ్వదృష్టి ఈ మూడు కన్నులు కలిగి యుండును. మూడు కన్నులతో సర్వమునూ వీక్షించు చుండును. సామాన్యులకు బహిర్ దృష్టి యుండును. మహాత్ములకు అంతర్ దృష్టి కూడ యుండును. విశ్వరూపి యగు శ్రీమాతకు విశ్వదృష్టి కూడ యుండును. ఏకకాలమున సమస్తమునూ చూడగలుగుట శ్రీమాతకే సాధ్యము. శివునికి, విష్ణువునకు కూడ అట్టి దృష్టి యున్నదని పురాణ ములు తెలుపుచుండును.

ఇట్టి దృష్టి కలిగియుండుటచే భూత భవిష్యత్ వర్తమానములు కూడ తెలిసియుండును. ఇది శ్రీమాత మాహాత్మ్యము. మహత్తుకే ఈశ్వరి యైన శ్రీమాత కిట్టి దృష్టి యుండుటలో ఆశ్చర్య మేమియు లేదు.

మూడు కన్నులు కలిగియుండుటచేతనే కొబ్బరికాయకు పవిత్రత చేకూరినది. మూడు దళముల బిల్వపత్రము కూడ అట్లే పవిత్రమై నిలచినది. మూడు తలల దత్తాత్రేయుడు సృష్టికే యోగాచార్యు డైనాడు. మూడు కన్నుల శివుడు శ్రీమాతకు ప్రీతిపాత్రుడైనాడు.



# 763. 'త్రిగుణాత్మికా'

సత్వము, రజస్సు, తమో గుణములుగా సృష్టియందు వెలుగొందునది శ్రీమాత అని అర్థము.

సత్వమునుండి ప్రజ్ఞలను, రజస్సు నుండి శక్తులను, తమస్సు నుండి పదార్థములను యేర్పరచి సమస్త సృష్టిని శ్రీమాత నిర్మాణము చేసినది. సృష్టి అంతయూ ప్రజ్ఞా శక్తి పదార్థముల సమ్మేళనమే. ఇందు పదార్థము పాలు మిక్కుట మైనచో తమోగుణ జీవు లేర్పడుదురు. శక్తి పాలు ఎక్కువైనచో రజోమయ జీవు లేర్పడుదురు. ప్రజ్ఞ పాలు ఆధిక్యముగ నున్నచో దివ్య జీవు లగుదురు. మూడును సమతూకముగ నున్నచో యోగులై యుందురు. సృష్టి అంతయూ ఈ మూడు గుణముల నిర్మాణమే. సూక్ష్మ స్థూల లోకములు కూడ వీని సమ్మేళనమే.

ప్రజ్ఞ అధిష్ఠించి యుండగా, శక్తి పదార్థమును నడిపించినచో జీవనము సుఖమయ మగును. పదార్థము శక్తికిని, శక్తి ప్రజ్ఞలకును లోబడి యుండుట జయము. ఇట్టివారు సృష్టియందు శ్రేష్ఠులై యుందురు. ఈ మూడు గుణముల స్వరూప స్వభావములను భగవద్గీత యందలి 14, 16, 17 అధ్యాయములలో తెలియనగును.



# 764. 'స్వర్గాపవర్గదా'

స్వర్గమును, అపవర్గమును యిచ్చునది శ్రీమాత అని అర్థము.

స్వర్గ మనగా సుఖము, సంపద, వైభవము యుండు లోకము. అర్థ కామములను ధర్మయుక్తముగ నిర్వర్తించుకొనువారు స్వర్గమును పొందుదురు. స్వర్గలోకప్రాప్తికి ధర్మాచరణమే ఆధారము. ధర్మము నాచరింపనివారు స్వర్గమును చేరలేరు. స్వర్గానుభూతి జీవు లందరునూ కోరుదురు. ఈ కోరిక నెరవేరుటకు ధర్మ మొక్కటియే ఆధారము. ధర్మమును పరిపూర్ణముగ అనుసరించిన యుధిష్ఠిరుడు పూర్ణస్మృతితో స్వర్గమును చేరెను. అట్లే హరిశ్చంద్రుడు, నలుడు మొదలుగా గల ధర్మమూర్తులు. భీమార్జున నకుల సహదేవులు రాగద్వేషాది కారణముగ ముహూర్త కాలము నరక మనుభవించి స్వర్గమును చేరిరి. దుర్యోధ నాదులు ముహూర్తకాలము స్వర్గ సుఖ మనుభవించి నరకమున పడిరి. ధర్మా చరణము ప్రాథమికముగ చేదుగ యున్ననూ తదుపరి మధురమై యుండును. చేదుమందువలె రోగమును నయము చేయును. జీవులకు సుఖ దుఃఖములు ధర్మాధర్మములను బట్టియే యుండును. శ్రీమాత సృష్టియందు ధర్మము నేర్పరచి స్వర్గమును కూడ యేర్పరచును.

స్వర్గసుఖము నిత్యము కాదు. ఆచరించిన ధర్మమునుబట్టి సుఖ ముండును. స్వర్గసుఖము ననుభవించు చుండగా ధర్మము క్షయ మగును. అపుడు మరల స్వర్గలోకవాసి మనుష్యలోకము చేరును. అనగా మనుష్య

లోకము చేరును. ఇట్లు మనుష్యలోకము చేరి మరల సుఖదుఃఖములను ఓర్చుకొనుచు ధర్మాచరణము గావింపవలెను. ఇట్లు శుక్లపక్షము, కృష్ణ పక్షముగ జీవితము చక్రభ్రమణమున పడును.

శ్రీమాత స్వర్గపదమునే గాక శాశ్వత పదమగు పరమపదమును కూడ అనుగ్రహింపగలదు. దీనినే మోక్ష మందురు. ధర్మము నాచ రించుచూ జీవితమును యజ్ఞార్థమై నిర్వర్తించుకొనినచో మోక్షపదము లభించును. ధర్మము నాచరించువారు ధర్మఫలముల నాశ్రయింపక ధర్మము కొరకే ధర్మము నాచరించుటగా జీవితములను మలచుకొన వలెను. ధర్మము కొరకే ధర్మము నాచరించుట, జయము కొరకు ధర్మము నాచరించుటకన్న ఉత్తమము. సుఖము కొరకు, సంపద కొరకు, జయము కొరకు ధర్మము నాచరించుట మధ్యమము. అట్లు ఆచరించువారు ఆ ఫలములను పొంది అనుభవించగనే ధర్మము క్షీణించును. భోగజీవన మున ధర్మము క్షీణించును. ధర్మసంపద ఏర్పడినపుడు భోగించుట అవివేకము. భోగములయందు పడక యజ్ఞార్థమున పుట్టిన ఫలములను దానము చేయవలెను. ఇట్లు యజ్ఞము దానమునకు మార్గము చూప వలెను. ధర్మపరాయణులు పురోగమించవలె నన్నచో భోగములపై దృష్టి యుండరాదు. దృష్టి దానము దిశగ మరల్చవలెను. యజ్ఞ దానము లను శ్రద్ధాభక్తులతో నిర్వర్తించుకొనువారు మాత్రమే ధ్యానమునకు, తపస్సునకు అర్హత పొందుదురు.

ధర్మాచరణము, దానము ప్రవృత్తిగా లేనివారు ధ్యానములు

చేయలేరు. ధ్యానమునకు ఆశ పడుటకు ముందు ప్రవృత్తి యందు ధర్మబుద్ధి, దానబుద్ధి యేర్పడవలెను. ధ్యానమున పురోగమించుచుండగా అది తపస్సునకు దారితీయును. తపస్సు మోక్షమును దారి చూపును. యజ్ఞము, దానము, తపస్సు మోక్షమునకు సోపానమార్గముగ శ్రీకృష్ణుడు గీతోపదేశము చేసినాడు. త్రికరణశుద్ధితో యజ్ఞము చేయువారికి దానస్ఫూర్తి, దానము చేయువారికి ధ్యాన స్ఫూర్తి, తపోస్ఫూర్తి కలిగించు నది శ్రీమాతయే. ఇట్లు ఆమె అపవర్గము నిచ్చును.

స్వర్గము నిచ్చునది శ్రీమాతయే. అపవర్గము నిచ్చునది శ్రీమాతయే.



# 765. 'శుద్ధా'

పరిశుద్ధమైనది శ్రీమాత అని అర్థము.

మలినములు లేశమాత్రము కూడ లేకుండుటయే శుద్ధత్వము. మలిన మున్నచోట అవిద్య, అజ్ఞానముండును. మలినము లేకుండు టయే మడి. పరిసరములు పరిశుద్ధముగ నుంచుకొనుట, పరికరములు పరిశుద్ధముగ నుంచుకొనుట, దేహమును బహిఃకరణములను అంతః కరణములను పరిశుద్ధముగ నుంచుకొనుట నిత్యము ప్రయత్నింప వలెను. బహిః కరణములనగా యింద్రియములు, మనస్సు. అంతః కరణము లనగా అహంకారము, బుద్ధి, చిత్తము, అంతర్ మనస్సు. ఈ మొత్తమును పవిత్రీకరించుకొనుట, ప్రవర్తనమున పవిత్రముగ నుంచుకొనుట సాధనగ సాగవలెను. అంతఃకరణము లందుగాని, బహిఃకరణముల యందుగాని, తాను వినియోగించు పరికరము లందు గాని, తన పరిసరములందు గాని మలినము చేరినచో జ్ఞానమను ఘటనమునకు రంధ్రము పడినట్లగును.

నిత్యమూ మలినములను నిర్మూలించుకొను చున్ననూ అవి మరల మరల యేర్పడుచుండును. నేడు అద్దమును తుడిచిననూ రేపటికి మరల దుమ్ముపడును. అద్దము శుభ్రముగ నుండుటకు ప్రతినిత్యమూ శుభ్రముగ తుడుచుకొనుచుండవలెను. అట్లే నిత్య జీవితమున కూడా బహిరంతరములను పరిశుభ్రముగ వుంచుకొను చుండవలెను. మలినము

చేరినపుడు జ్ఞానము మబ్బుకమ్మిన సూర్యునివలె యుండును. అపుడు జీవుడు పొరపడవచ్చును.

నలమహారాజు ధర్మమూర్తి. పరిపూర్ణ జ్ఞానమూర్తి. బహిరంగము నుండి గృహమున కేతెంచిన సందర్భములో పాదములు కడుగుకొను చుండగా పాదముల వెనుక భాగము పరిశుభ్ర పడలేదు. అపరి శుభ్రత నుండి ద్వాపరుడు ప్రవేశించి అతని నాక్రమించి జయించెను. అట్లే పరీక్షిత్తు మహారాజు అంతఃకరణమున అసహనము ప్రవేశించి కలికి చోటు యిచ్చెను. అంతఃబహిఃకరణముల పవిత్రత లేనపుడు శుద్ధత లోపించి అజ్ఞానము ప్రవేశించును. పొరపాట్లు జరుగును. అవి పతనమునకు దారితీయును. అట్లు జరుగకుండా కాపాడబడుటకు శ్రీమాతను నిత్యమూ ఆరాధించుట శ్రేయస్కరము.



# 766. 'జపాపుష్ప నిభాకృతిః'

**జ**పాపుష్పము వంటి ఆకారము కలది శ్రీమాత అని అర్థము.

ముందు నామమున శుద్ధ అని తెలిపి ఈ నామమున జపాపుష్ప మని తెలుపుటలో శ్రీమాత ఆకృతి ఎంత నిర్మలమైనదో తెలుపబడు చున్నది. శ్రీమాత శివునికై జపము చేయుటలో పరిశుద్ధయై పరి పూర్ణయైనది. ఆమె పరిశుద్ధత్వము నిర్మలమగు దాసాని పువ్వులతో పోల్చబడినది. జపము నిర్వర్తించుకొనువారు శ్రద్ధ, భక్తి, నిరంతర నిత్య స్మరణము సాధించినపుడు వారి ఆకృతుల యందలి వికారము, వికృతి నశించును. క్రమముగ వికృతత్వము, వికారత్వము నశించి తేజోవంతమగును. ఆకర్షణీయముగ నుండును. అందము సంత కరించుకొనుచుండును. శ్రీమాత ఆరాధనమున శివునియందు ఆమెకు గల ప్రేమ, భక్తి, శ్రద్ధ, శివుని చేరవలెనను తపన, యితర విషయము లందు అనాసక్తి కారణముగ ఆమె ఆకృతి జపమునందు యినుమడించిన అందమును పొందినది. జపము చేయువారు ఉపవశించిననూ శుష్కింపరు. మంత్రజపము తుష్టిని పుష్టిని నిచ్చునుగాని కృశింపచేయదు. భయము, దుఃఖము, ఆందోళనలతో మంత్రము జపించుట, పూజించుట జరిగినపుడు నీరసించుట, శుష్కించుట, జబ్బుపడుట యుండును. పరిపూర్ణుడగు శివుని జపము చేయుచున్న శ్రీమాత యినుమడించిన అందమును పొందినది. పర్వతుని పుత్రికగా తాను జన్మతః అందము

కలదే అయిననూ ఆ అందమును శివతేజము స్పృశించు చుండగా మరింత తేజోవంతము, కాంతివంతమైనది. శ్రీమాత ఆకులనే భుజించుచూ శివుని జపించినట్లుగా అపర్ణ అను నామమున తెలుప బడినది. రాలిన ఆకులు భుజించిననూ కృశింపక, నశింపక, తేజో విహీనము గాక తుష్టి పుష్టి తేజస్సు ఆకర్షణ అందము యేర్పడుట జపమందలి ఆమె నిష్ఠను తెలుపును.

దైవ మంత్రములను జపించువారు కాంతివంతులగు చుండ వలెను. వారియందేర్పడు కాంతి వారి జపనిష్ఠకు కొలబద్ద. జపము వలన సర్వమును సాధింపవచ్చును. జపము వలన దరిచేరు దైవీ లక్షణములు దేహము యొక్క ఆకృతిని కూడ తీర్చిదిద్ద గలదు. దీర్ఘ కాలము శివుని గూర్చి జప మాచరించిన శ్రీమాత సన్నజాజి పూవువలె శుద్ధమై కోమలమై ప్రకాశించి దేవతలను కూడ ఆశ్చర్యచకితులను గావించినది. జపాపుష్ప నిభాకృతి అను నామము ఆరాధకులకు అత్యంత స్ఫూర్తివంతమై నిలచుగాక!



# 767. 'ఓజోవతీ'

**ఓ**జస్సు రూపము ధరించినది శ్రీమాత అని అర్థము.

దేహము సప్త ధాతువులతో నిర్మాణము చేయబడినది. ఈ సప్త ధాతువులు పుట్టుచోటు ఓజస్సు. దానిని అష్టమ ధాతువు అని కూడ అందురు. ఈ అష్టమ ధాతువు నుండియే సప్తధాతువులు యేర్పడు చుండును. రసము, రక్తము, మాంసము, శుక్లము, ఎముక, చర్మము, మేధస్సు, సప్తధాతువులుగ పేర్కొనబడును. వీనికి మూలము ఓజస్సు. దైవ ధ్యానము సరిగ జరిగినచో ఈ అష్టమ ధాతువు నుండి సప్తధాతువు లకు పుష్టి కలుగుచుండును. గాయత్రి మంత్ర జపమున **'ఓజోసి తేజోసి బలమసి భ్రాజోసి దేవానాంధామ నామాసి'** అను ఉచ్చారణ మున్నది. ఓజస్సు, తేజస్సు, బలము, కాంతి యిత్యాదివి శ్రీమాత రూపములే. ఆరాధన చేయువారికి ఓజస్సు పెరిగి తేజస్సు, బలము కాంతి యేర్పడుచుండును. కనుకనే వారు శ్రమము లేక శమముతో పనిచేయుచుందురు. చూచుటకు వారి దేహములు సున్నితమే అయిననూ గురుతర కార్యములు శ్రమము లేక నిర్వర్తింతురు. వారికివి కార్య నిర్వహణమునకు దేహము లడ్డు పడవు. బద్ధకించవు. దేహాత్మ భావము దాటి చేతనాత్మకులై ఓజో బలమున దివ్యకార్యములను నిర్వర్తించు చుందురు. ఇట్టి బలము ఆరాధనము వలన, జపము వలన కలుగును.

శ్రీమాత శివుని జపించుచున్న సందర్భమున దేహభావమును వీడి ఓజోవతియై నిలచెను. అనగా సప్త ధాతుమయమైన దేహము

నుండి విడిపడి ఆ దేహము నధిగమించి ఓజస్సున నిలచి శివుని జపించెను. దేహాత్మ భావనతో చేయు ఆరాధనలు దైవమును చేరుట సులభము కాదు. చిన్న జ్వాలతో పాకము జరుగుటెట్లు సంభవము కాదో అట్లే దేహ భావముతో చేయు ఆరాధన పక్వము చెందదు. అందువలన అత్యంత స్ఫూర్తివంతముగ ఆరాధనలు సాగించవలెను. స్ఫూర్తి క్రమముగ అమితమగుచున్నప్పుడు జీవ చైతన్యము దేహ ధాతువుల నధిగమించును. అట్టి అమితమగు స్ఫూర్తితో ఆరాధనము సలిపినపుడు పరిసరములు స్ఫురణ నుండి జారును. క్రమముగ దేహ భావము కూడ జారును. ఆరాధకుడు స్ఫూర్తి ఆధారముగనే ఆరాధన మున నిలచును. అప్పుడు దేహము ఆరాధకునిపై ప్రభావము చూపును. ఇట్లు సప్త ధాతుమయమగు దేహము నధిగమించి అష్టమ ధాతువున నిలచి శ్రీమాత ఆరాధన గావించినది. అపుడామెకు తేజోరూపము కలిగినది. తేజోవతి అయినది. ఆరాధకులు కూడ యిట్లు తేజోరూపము ధరించుట ప్రధానము. ఈ తేజోరూపమే స్థిరమైనపుడు సూక్ష్మరూప నిర్మాణము జరిగి దేహబంధములేని స్థితి కలుగను. ఇట్లు యోగ మార్గమున నిర్మాణమగు సూక్ష్మదేహము ఆరాధనా మార్గమున కూడ నిర్మాణము కాగలదు.



# 768. 'ద్యుతిధరా'

**వె**లుగును ధరించునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత కాంతిరూపము ధరించి దర్శనమిచ్చుచు నుండును. దేవతలందరును కాంతిరూపులే. వారి అందరికినీ ఆ కాంతి శ్రీమాత ప్రసాదమే. మానవుల యందు పరమ భక్తులు, మహాత్ములు, సిద్ధులు, యోగులు కూడ కాంతిరూపమును దైవీ సాధన ద్వారా పొందుచు నుందురు. ఆరాధకులు ఆరాధనా బలమున కాంతిలోనికి ప్రవేశించి క్రమముగ కాంతిరూపు లగుదురు. యోగులు, తపస్విజనులు కూడ కాంతిరూపు లగుదురు. కాంతిరూపమును ధరించుటకు వలసిన ఆరాధనా మార్గమును కూడ శ్రీమాతయే అందించినది.

శుద్ధ, జపాపుష్ప నిభాకృతి, ఓజోవతీ, అటు పిమ్మట ద్యుతి ధరా అనునవి ఆరాధనా క్రమమున ఆరోహణమునకు వలసిన సువర్ణ సోపానములు. ఈ సోపానము ముందు నామములలో కూడా "మేరు నిలయా" వరకు కొనసాగును. ఇవి మొత్తము పది మెట్లుగ గోచరించును. ఇందు మొదటిది శుద్ధత్వము. మనో వాక్కాయ కర్మల యందు శుద్ధి లేనివారు దివ్యకార్యములను దీర్ఘకాలము చేయజాలరు. శుద్ధ మనస్కులు మాత్రమే జపమునందు ఆసక్తి గొందురు. పరిశుద్ధమగు మనసుతో జరుగు జపము వలన దేహము పుష్పమువలె కోమల మగును. అటుపైన జపము ఏకాగ్రతతో సాగగా దేహమందలి సప్త

ధాతువులు తుష్టిని పుష్టిని చెంది దేహమందలి జీవప్రజ్ఞ సమీకరణము చెంది కాంతివంతమై ఓజస్సును చేరును. అపుడు ఆరాధకులు ఓజోవంతు లగుదురు. ఓజోవంతులగు ఆరాధకులు ఆరాధనము కొనసాగింపగ క్రమముగ కాంతివంతు లగుదురు. కాంతివంతులగు ఆరాధకులను ద్యుతిధరు లందురు. ఇట్లు ద్యుతిధరత్వము ఆరాధన యందు నాలుగవ మెట్టు.

శ్రీమాత పార్వతిగ జనించి శివుని ఆరాధన చేయునపుడు క్రమముగ పది స్థితులను పొంది శివుని అర్ధాంగి అయినది. ఆ ఆరాధన క్రమములో నాలుగవ సోపానమున ఓజోవతి అయినది. సృష్టియందు తపస్సునకు ప్రథమ మార్గదర్శి శంకరుడే. అతని ననుసరించి అతనిని చేరిన ప్రప్రథమ భక్తురాలు శ్రీమాత. ఆరాధకుల కామెయే మార్గదర్శి. ఆరాధనమున క్రమముగ కాంతిదేహము ధరించుట ఒక సిద్ధి. దీనినే ద్విజత్వమందురు. అనగా రెండవమారు పుట్టిన వారు. రక్త మాంసాదు లతో కూడిన సప్త ధాతువుల దేహములో పుట్టిన జీవుడు ఆరాధనా క్రమమున అష్టమ ధాతువగు ఓజస్సును చేరి అటుపైన కాంతివంతు లగుదురు. అష్టాంగయోగము, యోగవిద్య యగు భగవద్గీత కూడ ఈ మార్గమునే సూచించును. ఇట్లు కాంతి యందు జనించినవారు మరణమును దాటినవారగుదురు. వారు సప్తధాతు దేహమున మరణించుట జరుగక మరణ సమయమున దేహమును త్యజించుట యుండును. మరణము దేహమునకే గాని కాంతివంతమగు రూపము నకు కాదు.

# 769. 'యజ్ఞరూపా'

శ్రీమాత యజ్ఞరూపము అని అర్థము.

**"యజ్ఞోవై విష్ణుః"** అనునది శృతి వాక్యము. విష్ణువన్నను, శ్రీదేవి యన్ననూ ఒక్కటియే. శ్రీదేవి, శ్రీమహా విష్ణువు శివుని మోహనమూర్తులు. శివుడు వారి తేజోమూర్తి. శివుడాధారముగ శ్రీమాత యజ్ఞార్థమై సృష్టిరూపమును ధరించును. సృష్టి జీవులకొరకే. దేవుని కొరకు కాదు. జీవులు పరిపూర్ణ అనుభవము నార్జించుచూ అనుభూతి పొందుచూ పరిపూర్ణుడగుటకు శ్రీమాత శివుడాధారముగ సృష్టిరూపము ధరించును. విశ్వము విష్ణురూపమే అని విష్ణు సహస్రనామము తెలుపును. విశ్వ రూపము, విశ్వమందలి రూపములు, విష్ణురూపములు లేక శ్రీమాత రూపములే. ఆమెయే యజ్ఞరూపము. యజ్ఞమున కధిపతి. యజ్ఞము కూడ ఆమెయే.

స్వార్థము కొరకుకాక పరార్థము కొరకు నిర్వహింపబడునది యజ్ఞము. పరుల హితమును గోరి, శ్రేయస్సును గోరి చేయు కార్యములు నిజమగు యజ్ఞమని శ్రీకృష్ణుడు భగవద్గీతయందు బోధించినాడు. పరహితమే మూల సంకల్పముగ చేయు కార్యములన్నియూ యజ్ఞములు. అట్టి యజ్ఞరూపము శ్రీమాత.

ముందు నామములలో తెలుపబడిన క్రమము ననుసరించుచూ ఆరాధనము, జపము చేయువారు ఓజోవంతులై, ద్యుతిధరులై, కాంతి

శరీరము పొందినవారై, చిరంజీవులై యజ్ఞార్థమై జీవింతురు. యజ్ఞార్థ జీవనమే వారికి ఏకైక ప్రయోజనమై నిలచును. జపతపాదులు చేయుచు, ఆరాధనలు చేయుచూ పరహితమే పరమ ప్రయోజనముగ జీవింతురు.

జీవుల శ్రేయస్సే ప్రధాన ప్రయోజనముగ జీవించు చిరంజీవులు భూమిపై గలరు. వీరందరిని భౌగోళికముగ నడిపించు గురుపరంపర కూడ యొకటి భూమిపై యున్నది. దేశమును, కాలమును బట్టి వివిధ ప్రాంతములలో దేహములు ధరించుచూ జీవులకు తరింపు మార్గము నందించుచున్న పరమగురువుల పరంపర యొకటి హిమాలయములు కేంద్రముగ యేర్పడి యున్నది. హిమాలయములకు ఉత్తర ప్రాంతమైన భూభాగములలో శంబళ, శ్రావస్థి, కలాప మొదలగు దివ్యాశ్రమములు కేంద్రముగ ఈ పరంపర కలియుగారంభము నుండి సత్యయోగము నందించుచున్నారు. శ్రీమాత దివ్య ఆదేశమున దివ్య ప్రణాళికను నిర్వర్తించు ఈ గురు పరంపరను నడిపించుచున్న జగద్గురువు మైత్రేయ మహర్షి యని భాగవత పురాణము సూచించు చున్నది. అతని అనుయాయులుగ సూర్యవంశి అయిన మరువు మహర్షి, చంద్రవంశి అయిన దేవాపి మహర్షి చేరి కలియుగాంతము వరకును జీవులు తరింపు మార్గము నందింతురని భాగవతము నవమస్కంధము నందు, ద్వాదశ స్కంధమునందు పేర్కొనబడినది. భవిష్యపురాణమునందు, కల్కి పురాణమునందు కూడ పేర్కొనబడినది. శ్రీమాత దివ్య ప్రణాళిక ననుసరించియే సనక సనందనాది కుమారులు, నారదాది దేవర్షులు, వశిష్ఠ కుంభోద్భవ గౌతమాది బ్రహ్మర్షులు, మైత్రేయాది మహర్షులు

యజ్ఞరూపులై కాంతిదేహములతో భూమిపై సంచరించుచూ పర హితార్థము జీవించు ఆరాధకులకు మార్గదర్శకము వహించి యున్నారు.

శ్రీమాత పార్వతీదేవిగ భూమిపై దేహము ధరించి శివుని ఆరాధించుటలో శుద్ధరూపిణియై, ఓజోవతియై కాంతిరూపమును సాధించి తన జప ప్రయోజనమును యజ్ఞార్థముగ మలచుకొనినది. తనకొరకు గాక లోకహితార్థమై జపమును కొనసాగించినది. కనుకనే శివారాధనమున పురోగమనము సిద్ధించినది. ఇందొక రహస్యమున్నది. సాధారణముగ ఆరాధకుడు ప్రాథమిక దశలో స్వహితమును గూర్చి ఆరాధన చేయుచున్ననూ ఆరాధనయందు పురోగమించవలె నన్నచో పరహితము చోటుచేసుకొనవలెను. పరహితార్థము చేయు ఆరాధన ములు దైవమున కెక్కువ ప్రీతి. స్వహితార్థము చేయు ఆరాధనలు కూడ దైవమునకు ప్రీతియేగాని, పరహితార్థమునకై చేయు ఆరాధనలతో అవి సరిపోలవు. చతుర్ముఖ బ్రహ్మ తననుగూర్చి నారాయణుని ఆరాధించినపుడు నారాయణుని దర్శనము క్లిష్టమయ్యెను. సృష్టిని గూర్చి ధ్యానించినపుడు నారాయణ దర్శన మయ్యెను. ఆరాధకులు ఆర్తులుగను, అర్థార్థులుగను ఆరాధన సలిపినపుడు దివ్యప్రీతి అంతంత మాత్రముగనే కలుగును. జిజ్ఞాసువులై ఆరాధన చేయునపుడు ప్రీతి మెండగును. యజ్ఞార్థమై చేసినపుడు పురోగతి తప్పనిసరియై యుండును. యజ్ఞ రూపము ధరించిన శ్రీమాత జపము మరియొక శుభంకరమగు మలుపుగ తెలియవలెను. పరిణామమున ఆరాధకులకు కూడ ఈ మలుపు కలుగవలెను.

# 770. 'ప్రియవ్రతా'

**జ**పవ్రతమే ప్రియముగా గలది శ్రీమాత అని అర్థము.

మంత్ర జపమందు ప్రీతి కలుగుట అనేక జన్మల సాధనా ఫలము. ప్రీతితో జపించుటయే ప్రియవ్రతము. ఇది కోరికతో జపించుట వంటిది కాదు. ప్రీతి కొరకు జపించుటము కాదు. జపించుటయే ప్రీతి. అట్టి ప్రీతికి కారణముండదు. ప్రీతి వలన జపము, జపము వలన ప్రీతి జనించుచూ ఒకదానినొకటి పెంచుకొనుచూ అనిర్వచనీయ మగు ఆనందానుభూతి కలుగుచు నుండును. ఇది జప సిద్ధి. ఈ స్థితి ధీరత నిచ్చును. స్థైర్యము, ధైర్యముల నిచ్చును. "శివుడు ప్రీతి చెందినను ప్రీతి చెందకున్ననూ శివునే జపింతును. అనుగ్రహించినను, ఆగ్రహించి ననూ శివ జపము మానను. కష్టమైనను, సుఖమైనను, దుఃఖమైననూ నన్నంటవు. ఆకలిదప్పులతో సంబంధము నాకు లేదు. నాకంతయూ శివమయమే." ఇట్టి భావనలు భక్తి పరాకాష్ఠ చేరినపుడు కలుగు చుండును. ఇట్టి ప్రీతిపూర్వకమగు జపము, తపము దైవమును కట్టి వేయును. హనుమంతుడి భక్తి అట్టిది. గోపికల భక్తి కూడ అట్టిదే. భాగవత మూర్తులగు ప్రహ్లాదాదుల భక్తి కూడ ఇట్టి భక్తియే. వీరందరూ ప్రియవ్రతులు. వారికి దైవమునందు ప్రేమ నిష్కారణము. కనుకనే వారికి దైవము కట్టుబడి యుండును. ఇట్టివారి గానమునకు, జపము నకు, ధ్యానమునకు దైవము ప్రీతి వలన కట్టుబడును. నిష్కారణముగ ఆరాధన చేయుట అమిత సుకృతము. ఇట్టివారు ధీరులు, నిరపేక్షులు. జపమున పార్వతీదేవి కిట్టి సిద్ధి కలిగినది. ఆమెకిపుడు శివప్రీతి

పరిపూర్ణమైనది. ఇక ఎవ్వరునూ ఆమెను నిరుత్సాహ పరచలేరు. శివుడే మారువేషమున ఆమెను జపము నుండి మరల్చుటకు ప్రయత్నించెను. అయిననూ ఆమె చెదరలేదు. ఇట్టి స్థితిలో భక్తులకున్న తన్మయత్వము కారణముగ ఎవ్వరునూ ప్రయత్నభంగము గావింపలేరు. ఇట్టి నిశ్చల స్థితి కలిగినపుడు గుణములుగాని, పంచభూతములుగాని అంతరాయ మును కలిగింపలేవు. వ్రతములన్నిటికన్న ప్రియవ్రతము మిక్కిలి శ్రేష్ఠమైనది. ప్రియమగుట వలన వ్రతము చెడదు. ఆరాధింపబడుచున్న శివుడు ప్రియుడై నిలచును. దానివలన అవినాభావ మేర్పడును. అవినా భావము కలిగినపుడు వేరు చేయుట కష్టము. క్షీర నీర న్యాయముగ కలసి పోయినపుడు వేరు చేయుట సాధ్యపడదు. మంచుగడ్డలోనికి యింకిన రంగువలె యిమిడిపోవుట జరుగును. ఆరాధనయందిట్టి స్థితి చేరుట దైవమునందు ప్రీతి గలిగినపుడే యేర్పడును. దైవమునందు భక్తి దైవమునందు ప్రేమగ మారినపుడు యిక అవస్థితి యుండదు. అది మధురభక్తియై జీవేశ్వరుల నైక్యము చేయును. కృష్ణభక్తుల స్థితి యిదియే. కృష్ణ భక్తియందుగల మాధుర్యమట్టిది. ఇది తెచ్చిపెట్టుకొనుటకు వీలుపడదు. సహజముగ తమ యందు కలుగు క్రమబద్ధమైన శుభం కరమగు మార్పులివి. 765వ నామము నుండి వివరింపబడుచున్న మార్పులు. ఇట్టి మార్పులు చెందక ప్రదర్శనము కొరకై చేయు చేష్టలు వికారముగ నుండును. చూపరులకు ఏవగింపుగ నుండును. ప్రియవ్రత స్థితి ఆరాధన యందు ఆరవ స్థితి. వాతలు పెట్టుకొన్నంత మాత్రమున పిల్లి పులి కాదు కదా!

# 771. 'దురారాధ్యా'

ఆరాధించుటకు శక్యము కానిది అని అర్థము.

శ్రీమాతవలె ఆరాధించుట ఎవ్వరికినీ శక్యము కాదు. శరీరము, యింద్రియములు, మనస్సు, విద్య, విజ్ఞానములకు లోబడు వారికి శివ సాయుజ్యమబ్బుట దుర్లభము. శివసాయుజ్యమే లక్ష్యముగ శ్రీమాత ఆరాధన సలిపినది. శరీరము ఆమెకు ఎట్టి అంతరాయము కాలేదు. ఆరాధకులు శరీరమునకే లోబడి పోవుదురు. నిద్ర ఆహారము దప్పిక కోరు శరీరముతో ఆరాధన సలపలేరు.అట్లే ఇంద్రియ సుఖములకు లోబడి కామవశులైనవారు కూడ ఆరాధన సలుపలేరు. మనోవికార ములు మానవుల కధికము, తత్కారణముగ నిశ్చలభావము కుదరదు. దైవము మీద సహజమగు ప్రియత్వ మేర్పడదు. విద్య, విజ్ఞానము కలుగుచున్నకొలది దైవమును గూర్చిన ఆరాధన యందు విముఖత కలుగుట, విద్యా విజ్ఞాన ప్రదర్శనయం దాసక్తి పెరుగుట యిత్యాది వికారము లెన్నియో కలుగును. ధృతి నిలువదు. యజ్ఞార్థ జీవనము కన్న యితర విషయములపై ఆసక్తి పెరుగును. ఓజస్సున నిలచుట కాంతి లోకములయందు స్థిరపడుట, పరహిత కార్యముల యందు నిమగ్నమగుట వంటి విషయముల యందు అనాసక్తత, విద్యల యందు విజ్ఞానమందు విహరించుచూ తమను తాము ఆదరించుకొనుట, యితరుల ఆదరణకొరకు ఆరాటపడుట పెరుగుచు నుండును. దైవముపై ప్రేమ కన్న తమయందు తాము ప్రేమ పెంచుకొనుచు నుందురు.

సదారాధన యందు తమను తాము మరచుట ప్రధానము. అట్లుగాక తమను గూర్చిన భావన హెచ్చుగ యేర్పడి ఆరాధన యందు ప్రీతి తగ్గును. ఇట్టివారి ఆరాధనలకు వారి మనో బుద్ధి అహంకారములే అంతరాయములు కలిగించుచు ఆరాధన శక్యము కాదు. ఆరాధన యందు విముఖత కలిగినవారు తమకు తామే బంధమై నిలతురు. ఇట్లు ఆరాధనకు నోచుకొనని ఒక విచిత్రము వికారమగు జీవితములు జీవించుచూ ప్రపంచమున పండితులమని ప్రకటించుకొనుచు తిరుగు చుందురు.

ఆరాధనకు తాను, తా ననుసరించుచున్న దైవమే ప్రధానము. ఆరాధనమున దైవము ప్రధానమై తాను క్రమముగ అప్రధానము కావలెను. ఆరాధనా సమయమున తనకు తాను మరుపై, మరుగై ఆరాధనము దైవమై యుండవలెను. ఆరాధన కూడ కరగి దైవమే మిగులవలెను. ఇట్లు ఆరాధించు విధానమును శ్రీమాత నిర్వర్తించి చూపినది. ఆమె వలె ఆరాధించుట యితరులకు శక్యము కాదు. శ్రీమాత నారాధించువారు శ్రీమాత శివుని ఆరాధించిన విధానమునే అనుసరించ వలెను. లేనిచో ఆరాధనము నిష్ఫలమగును.



# 772. 'దురాధర్షా'

స్వాధీనపరచుకొన శక్యము కానిది శ్రీమాత అని అర్థము.

ఆరాధన దైవమునకు ఆరాధకుడు స్వాధీనపడుటకే కాని దైవమును స్వాధీనపరచుకొనుటకు కాదు. ఈ రెండవ మార్గము దానవ మార్గము. దైవమును వశపరచుకొన చూచుట పూర్ణమగు అహంకారము. ఎదుటివారిని వశము చేసికొనుట పాశవిక ప్రవృత్తి. ఒక జంతువును గాని, మనిషినిగాని, దేవతనుగాని వశపరచుకొను యత్నము దానవ యత్నము. ఆరాధన సాత్త్వికమై యుండవలెను. దానవ ప్రవృత్తి రాజసికము, తామసికము.

ప్రేమ వలన సమస్తము వశమున యుండును. ప్రేమయందు వశపరచుకొనుట యుండదు. వశపరచుకొను ప్రేమ యుండదు. ఏ జీవియు మరియొక జీవి వశమున యుండుటకు ప్రేమయే మార్గము. బలమున గాని, అధికార బలమున గాని, ఆర్థిక బలమునగాని వశము కాబడిన జీవి తప్పించుకొను ప్రయత్నము చేయును. కాని ప్రేమ వలన వశపడినచో అందు నిర్బంధము యుండదు గనుక స్వచ్ఛందమై యుండును.

బలవంతులగు రాజులు రాజ్యములు వశపరచుకొనిననూ అవి వశ పడక స్వతంత్రించినవి. పెరిగిన సామ్రాజ్యములు తరిగినవి. తరగక పెరుగునవి దివ్య సామ్రాజ్యములే, ప్రేమ సామ్రాజ్యములే.

జీవులను ప్రేమించువారి వశమున, జీవులుండుట కిచ్ఛపడుదురు. స్వచ్ఛందముగ వశమగుదురు. ప్రేమలేక వశము చేసుకొన జూచువారు విఫలు లగుదురు. ప్రేమించువారు వశము చేసుకొను ప్రయత్నము చేయరు. వారి ప్రేమ హితకార్యముల రూపమున నుండును. హితకార్యమే ప్రేమకు నిదర్శనము. హితమును చేయుచు పరమును కూడ వశము చేసుకొనిన బ్రహ్మర్షులు కలరు. హితము చేయక వశము చేసుకొనచూచిన దానవులు కూడ కలరు. హిరణ్యకశిపుడు, రావణుడు బలముతో దేవతలను, దిక్పాలకులను, గ్రహములను వశము చేసుకొనిరి. కాని వారందరును అవసర సమయమున వశమున లేకపోయిరి. మాంత్రికులు, తాంత్రికులు దేవతలను ఉపాసించి వశపరచుకొను ప్రయత్నించి చివరకు పతనము చెందిరి. మంత్ర తంత్ర శక్తులతో శ్రీమాతను వశము చేసుకొన చూచుట అవివేకము. ఈ మార్గమున లవలేశము కూడ శ్రీమాత వశపడదు.

శ్రీమాత శివుని ఆరాధించునపుడు శివుని వశపఱచుకొన ప్రయత్నము చేయలేదు. ఆమె యజ్ఞరూపిణియై పరహితార్థము ప్రీతితో శివుని ప్రార్థించినది. శివునికి వశమగుటకు సర్వవిధముల ప్రయత్నించి నదేగాని శివుని వశపరచుకొను ప్రయత్నము చేయలేదు. తానే శివునికి వశమైనది. ప్రీతితో వశమైనది. శివుడు మెచ్చి తాను స్వచ్ఛందముగ శ్రీమాతకు వశమైనాడు. ఇదియే ఆరాధనా మార్గమునకు మూల సూత్రము. ఆరాధకుడు ఆరాధనా మార్గమున తనను తాను దైవమునకు సమర్పించుకొను చుండవలెను. తనకున్నది సమర్పించుటయే గాక

తనను కూడ దైవమునకు సమర్పించుకొనవలెను. తనను తాను సంపూర్ణ ముగ సమర్పించుకొనినపుడు దైవ మనుగ్రహించును. దైవమునకు సమర్పణ చెందుటకే ఆరాధనగాని, తన కొరకు దైవమును వేడుకొనుట కాదు. “తన కొరకు దైవము” అను భావము నుండి “దైవము కొరకు తాను” అను మార్పు కలుగవలెను. అపుడే దైవము అనుగ్రహించును. తాను దైవమునకు వశము కాగా దైవము లీలార్థము తనకు వశమైనట్లు గోచరించును. ఈ సత్యమెఱిగి దైవవశులై జీవించుట మేలు.



# 773. 'పాటలీ కుసుమప్రియా'

పాటలీ కుసుమ మనిన ప్రీతి కలది శ్రీమాత అని అర్థము.

పాటలీ కుసుమము వంగ రంగులో నుండు సున్నితమైన పుష్పము. భౌతిక లోకమునకు ఆధారమైన దివ్యమగు లోకము వంగరంగులో నుండును. వంగరంగు ఒక ప్రత్యేకమగు రంగు. నీలివర్ణములో అవరోహణ క్రమమున భూమి కత్యంత సమీపమున నుండునదీ రంగు. సూర్యకిరణములలో ఏడవ వ్యక్తమగు రంగు వంగరంగు. ఈ ఏడవ రంగు కిరణమును స్వరాజ్యమని పిలుతురు. మొదటి కిరణమును సుషుమ్న యని, రెండవ కిరణమును హరికేశమని, మూడవ కిరణమును విశ్వకర్మయని, ఇట్లు ఏడు వర్ణములుగల సూర్యకిరణములలో ఏడవ రంగు వంగరంగు. సూర్యుని ఏడు కిరణములు ఏడు లోకములకు సంకేతములు. అట్లే మానవుని యందలి సప్త కేంద్రములలో ఏడవది యగు మూలాధారము ఈ రంగునకు సంబంధించి యున్నది. శ్రీమాత ఈ వర్ణములో అతి మనోహరముగ నుండును. మూలాధార పద్మము సహస్రార పద్మమువలె పరిపూర్ణమైన పద్మము. ఇహమున పరానుభూతి పొందుటకు మూలాధారమే కేంద్రము. భూమి యందు స్థితిగొని సప్తలోకములను పరిపూర్ణముగ అనుభవించుట సంపూర్ణ జీవనము. అట్లు జీవించుటయే సమగ్ర యోగమని యోగులు బోధింతురు. ఇటీవలి కాలమున అగస్త్యాంశ సంభూతులగు మాస్టర్ సి.వి.వి. గారు ఈ

యోగమును ప్రస్ఫుటముగ ప్రకటించినారు. జనకుడు, శ్రీకృష్ణుడు వంటి మహాయోగులు ఇహమున యుండి పరము వరకు గల సమస్త లోకానుభూతులను పొందు జీవన విధానమును ఆచరించి చూపినారు. ఇట్టి యోగమునకు, యోగ జీవనమునకు పాటలీ కుసుమము ప్రతీక.

స్వరాజ్యమను సప్తమ కిరణ తత్త్వము స్వతంత్రతను ప్రతి పాదించును. స్వతంత్రత యనగా తనను తాను పరిపాలించుకొనుట. ఇతరులను పరిపాలించకుండుట. ఇతరులను పరిపాలించుట సత్పురుషు లిచ్ఛగించరు. ఇతరులు తమను పరిపాలించుట కూడ యిచ్ఛగించరు. ఇతరులు తమను పరిపాలించు అవసరము లేకుండునట్లుగా తమ జీవితమును మలచుకొందురు. తాము కూడ ఎవ్వరిపై అధికారము చూపరు. ఇట్టివారు జీవన్ముక్తులు. సహజమగు సమాధి యందుందురు. వీరిది సహజ మోక్షస్థితి. తమను తాము పరిపాలించుకొనుచు, యితరు లను ప్రేమించుచు జీవించుచుందురు. శ్రీకృష్ణుని తండ్రియగు వసుదేవు డిట్లు జీవించినాడు. తాను యాదవులకు రాజుగ నుండుట కిచ్ఛగించ లేదు. రాజ్యమును త్యజించి తోటివారితో కలిసి జీవించి బృందావన ముల నేర్పరచెను. స్వయంప్రతిపత్తిపై జీవించు సంఘముల నేర్పరచెను. సమదర్శనము, సమవర్తనము, సహజీవనము నేర్పెను. రాజైనప్పటికి అధికారము చూపక తోటివారితో కలిసిమెలసి జీవించెను. ఇట్టి స్వేచ్ఛ, స్వతంత్రత, సహజీవనము నిజమగు సామ్యవాదము. ఇది ఏడవ కిరణమగు స్వరాజ్య లక్షణము.

ఇట్టి ఉత్తమమగు ఆశయములతో భారత దేశమున పాటలీ పుష్ప నామాంకితముగ పాటలీ పుత్రమను విశ్వవిద్యాలయము క్రీస్తు పూర్వమే యేర్పడి ప్రపంచ ఖ్యాతి నార్జించుకున్నది. మగధరాజ్యము పరిపాలనా విధానములో యిట్టి సామ్యవాద ముండెడిది. పాటలీపుత్ర వాసులు స్వతంత్రమునకు మారుపేరుగ జీవించిరి. చాణుక్యుడు ఈ జీవన విధానమును పాటలీపుత్రమున పునః ప్రతిష్ఠ గావించిననూ కలి కారణముగ మూడు వందల సంవత్సరములకు మించి వెలు గొందలేదు.

శ్రీమాత సర్వస్వతంత్ర. సృష్టియందు జీవులకు కూడ ధర్మము నందించి స్వతంత్రత నిచ్చెను. ధర్మము ననుసరించుచూ స్వతంత్రులై జీవించువారు పాటలీపుత్రులు. పాటలీ కుసుమములు కూడ. ఇట్టివారు యోగ మార్గమున సూక్ష్మదేహమును నిర్మాణము గావించుకొని అమ రత్వము సాధించి, ధర్మమార్గమున చిరంజీవులై భూమిపై సంచరించు చుందురు. వీరి జీవన విధానమే యితరులకు మార్గ దర్శకము. స్థూల, సూక్ష్మ, కారణ లోకములలో విహరించుచూ భూమిపై శ్రీమాత దివ్య ప్రణాళికను నిర్వర్తింప చేయుచుందురు. వీరందరూ శ్రీమాత జ్ఞాన సంతానము. శ్రీమాతకు చేదోడువాదోడుగ నుందురు. వీరి దేహములు సూక్ష్మములు, అమరములు, సున్నితములు, సుకుమారములు. అవి పలుచగా పారదర్శకమై వంగకాంతిలో యుండును. వీరు శ్రీమాతకు అత్యంత ప్రీతిపాత్రులు. 'పాటలీ కుసుమప్రియా' అను నామము పుష్పముల వంటి ఈ చిరంజీవులకు సంబంధితమైనవి.

ఆరాధనా మార్గమున పార్వతీదేవి ఈ సూక్ష్మదేహమును పొందినది. ఆరాధన యందు క్రమముగ భక్తులకు అంతఃకరణమున యిట్టి దేహమేర్పడి విదేహానుభూతి కలుగును. విశిష్టమగు ఈ దేహముతో భూమిపై సంచారము చేయుట కూడ జరుగును. భౌతికమగు దేహ మున్నప్పుడే, దాని నుండి ఈ దేహ మేర్పరచుకొనవలెను. మానవ దేహమున జన్మించిన ప్రతి ఒక్కరూ ఈ దేహమును పొందుటయే ప్రథమ సిద్ధి. పార్వతికి జన్మించి శ్రీమాత ఈ మార్గమును ప్రకటించినది. "శుద్ధ" అను నామము నుండి వరుసగా ఈ ఆరాధనా క్రమము గోచ రించును. బుద్ధిమంతులు దీనిని గ్రహింతురుగాక!



# 774. 'మహతీ'

**మ**హత్తు రూపమున నున్నది శ్రీమాతయే అని అర్థము.

బ్రహ్మము నుండి సంకల్పముగ దిగివచ్చి కాలము ప్రకృతుల నేర్పరచి ఆ రెంటినీ సమన్వయించి మహత్తుగ వెలుగొందినది శ్రీమాత. ఈ మహత్తే చోటు. అందు భూత భవిష్యత్ వర్తమానకాలము లుండును. అష్ట ప్రకృతులుండును. జీవులుందురు. ఇది పారదర్శకమగు వెలుగుగ గోచరించును. చోటుగ వ్యాపించి వెలుగుచుండును. సృష్టికివియే మూలము. మహత్తు నుండియే లోకములన్నియు వరుస క్రమమున యేర్పడును. లోకముల యేర్పాటు కాలము ననుసరించి యుండును. కాలానుసారము లోకములు, జీవులు మహత్తు నుండి యేర్పడుదురు. మరల అందరూ మహత్తులోనికే కలసిపోవుదురు. ఈ మహత్తు ఏమీ లేనట్లుగ గోచరించును. కాని అన్నియూ దాని నుండే ఉద్భవించును. ఏమియు లేనట్లు కన్పించు చోటు నుండి సూర్యమండలములు, నక్షత్ర మండలములు, గ్రహ మండలములు, అందు జీవులు యేర్పడుచుందురు. ఇట్లు వెలుగుచుండు ఈ చోటే సృష్టి యందలి దైవము. దేవుడు, దేవత యనగా ఇదియే. ఇందుండియే విరాట్పురుషుడు పుట్టును. సమస్త దేవతా ప్రజ్ఞలు పుట్టును. ఈ మహత్తు నుండి ఇరువదియేడు తత్త్వములు పుట్టి అవి ఆధారముగ మన మెరిగిన సృష్టి యేర్పడును. దీని వివరణము పూర్వ నామములలో తెలుపబడినది.

# 775. 'మేరునిలయా'

శ్రీచక్ర మేరువు నందు నివశించునది శ్రీమాత అని అర్థము.

శ్రీచక్ర మేరువు శివస్థానము. శ్రీమాత పార్వతికి జనించి శివుని గూర్చి తపస్సు గావించి, తపస్సున క్రమముగ శుద్ధ మనస్కయై అటుపైన జపాపుష్పమువలె కోమలమై, ఓజోవతియై, కాంతి రూపమును ధరించి, యజ్ఞార్థముగ తపము గావించి, యజ్ఞరూపయై, యజ్ఞరూపమగు శివుని యందు ప్రియత్వమును హెచ్చుగా పొందినదియై అనితర సాధ్యమగు ఆరాధన గావించుచూ, శివుని తప్ప అన్యమునకు లొంగనిదియై స్థూల కారణ లోకములను దాటి మహత్తును చేరి మాహాత్మ్యముతో కూడిన అష్ట సిద్ధులను కూడ లెక్కచేయక శివస్థానమగు శ్రీచక్ర మేరువును చేరి శివునిచే గ్రహింపబడినది. ఆరాధన యందు యిట్టి సోపాన మున్నదని లోకములకు చాటి చెప్పినది.

శివస్థాన మనగా సృష్టికతీతమగు శాశ్వతమైన పరమపథము. ఇచ్చుటకు చేరిన జీవుడు బ్రహ్మమే యగును. ఇట్లు మహత్తును దాటి బ్రహ్మమును చేరుట జీవుల చరమ ఆశయము. ఇట్లు చేరినవా రందరునూ బ్రహ్మర్షులై శాశ్వతముగ వెలుగొందుదురు.

శ్రీచక్రమేరు శివశక్త్యైక స్థితి. శివునితో కూడియున్న శక్తియే శివశక్తి. అటుపైన ఐక్యత చెందుట సమాధి స్థితి. ఐక్యమున బ్రహ్మమే యుండును. సృష్టికాలమున బ్రహ్మమే శివశక్తియై యుండును. శివ

డాధారముగ శక్తి లోకములను సృష్టించుట, పోషించుట, తిరోధానము కావించుట చేయుచు నుండును. సర్వజీవులకును శివశక్తి స్థానమే గమ్యమై యున్నది. సర్వజీవులును ఈ గమ్యమును చేరుటకే సృష్టి నిర్వహింపబడు చున్నది. ఒక సృష్టి కాలమున పిపీలికాది జీవులందరును బ్రహ్మమును చేరలేరు గనుక పరంపరగ సృష్టి యేర్పడుచుండును. సృష్టికి కాలపరిమితి యున్నది. కాలము ననుసరించి సృష్టి పురోగమనము చెంది కొంత కాలము స్థితియందుండి తిరోగమనము చెందుచుండును. జీవునకు దేహ మేర్పడుట, దేహము పెరుగుట, పోషింపబడుట, తిరోగమనము చెందుట, హరింపబడుట జరుగుచూ జన్మ జన్మలయందును అనుభవ మును వృద్ధి పరచుకొనుచు, లోకానుభూతులను పొందుచు, ఆరోహణ క్రమమున లోకముల అనుభూతిని పరిపూర్తి గావించుకొని పరమ పదమును చేరును. పరమపదము చేరువరకు తీరికలేక జన్మలెత్తుచు నుండును. పరిపూర్ణస్థితి యందు మేరువును చేరి మేరు నిలయుడై యుండును. అటుపైన శివశక్తి కుమారుడై శాశ్వతకాలము వర్ధిల్లును. ఇట్లు జీవుని పరమపదమును చేర్చుటకు శ్రీమాత అనంతకాలము అనేకానేక విధముల అనుభవమును కలిగించు చుండును.



# 776. 'మందార కుసుమప్రియా'

**మం**దార కుసుమములన్న ప్రీతి కలది శ్రీమాత అని అర్థము.

ఆరాధన చేయువారు మందార పుష్పములతో శ్రీమాత నలంక రించుచూ ఆరాధన చేసినచో అత్యుత్తమ ఆశీర్వచనములు పొందగలరు. మందారములు కేవలము ఎఱుపురంగేకాక, పసుపు, తెలుపు, గులాబీ రంగులలో కూడ కలవు. ఎఱ్ఱమందారము సంకల్ప బలమును పెంచును. పచ్చ మందారము బుద్ధి బలమును పెంచును. తెల్ల మందారము సత్త్వగుణమును పెంచును. గులాబీ మందారము దుఃఖము, విచారము, భయము యిత్యాది వికారములను నిర్మూలించును. పై మలినములను తొలగించి ప్రాణశక్తిని పెంచును. పుష్పముల పూజ చేయువారు ఛిద్రమగు పుష్పములను వాడరాదు. విరిగిన, చిరిగిన, చీడ పట్టిన, మురికి సోకిన పుష్పములను పూజకు వాడరాదు. సువాసన లేని పుష్పములు వాడరాదు. వాడిన పుష్పములు వర్జనీయము. హచ్ఛిద్రము, కోమలములైన పుష్పములు శుభములు కలిగించును. పై తెలిపిన వర్జనీయమగు పుష్పములు వాడినచో అశుభము కలుగ గలదు.

పూవులేని పూజ ఫలించదు. పూవులు వాడునపుడు సహస్ర నామమున తెలిపిన పూవులను శ్రద్ధతో సేకరించవలెను. ఆరాధనకు శ్రద్ధ భక్తి అత్యంత ప్రధానమగు అంశములు.

మందార పుష్పమునకు ఐదు దళము లుండును. త్రిదళములు గల బిల్వపత్రము, పంచదళములుగల మందారము శివాశివులకు

ప్రియము కలిగించును. త్రిదళములు త్రిగుణములను సంకేతించును. పంచదళములు పంచభూత సృష్టికి సంకేతము. సృష్టి అంతయు పంచీకరణమే అని వేదములు తెలుపును. **(పాంక్తం వా ఇదగ్ం సర్వం)** పంచభూతములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ తన్మాత్రలు, పంచ కర్మేంద్రియములు, పంచ ప్రాణములుగా సృష్టి వెలువడును. వానికి త్రిగుణములు జోడై పదిహేను అంశములుగ (3×5) లింగ శరీర మేర్పడును. సృష్టికి, జీవునికి కూడ ఈ శరీర మున్నది. వీని నధిష్ఠించి పదహారవదిగ శ్రీమాత యున్నది. (షోడశి).

ప్రకృతి, పురుషుడు, త్రిగుణములు అనునది ఒక పంక్తి (5). త్రిగుణము లాధారముగా ఈ పంక్తియే దిగివచ్చు చుండును. ఇట్లు వరుస క్రమమున 5, 5, 5లుగ దిగివచ్చును. **(పాంక్తే నైవ పాంక్తగ్గం స్పృణోతీతి)** ఋషులు పంచముఖముగ సృష్టిని దర్శించిరి. శివుని పంచముఖు డనిరి. పంచాక్షరీ మంత్రము నేర్పఱచిరి. సంప్రదాయమున పంచముఖ ఆంజనేయుడు, పంచముఖి యగు గాయత్రి కలరు. ఐదు అంకెకు "మ" శబ్దము సంకేతము. సృష్టి అంతయూ మందారమే. అనగా పంచ దారులుగ సృష్టి యున్నదని సంకేతము. అట్టి మందార పుష్పమన్నచో శ్రీమాతకు ప్రియము.

మందార కుసుమము అనగా తెల్లజిల్లేడు పూవు అని అర్థ మున్నది. సంస్కృతమున తెల్లజిల్లేడును కూడ మందార మందురు. తెల్లజిల్లేడు సూర్యకాంతి ప్రభావముతో కూడినది. సూర్యగోళము నుండి ప్రసరించు కాంతి శ్రీమాత కాంతియే. ఈ విషయము ముందు నామము లలో వివరింపబడినది. కనుక తెల్లనికాంతి ప్రభావము కల తెల్ల జిల్లేడు పూవు శ్రీమాతకు ప్రియమైనది.

# 777. 'వీరారాధ్యా'

వీరులచే ఆరాధింపబడునది శ్రీమాత అని అర్థము.

వీరులనగా వీర్యవంతులు. వీర్యవంతు లనగా వీర్యమును తేజోబలముగ మలచుకొనినవారు. వీర్యము సద్వినియోగము చేయగల వారికి ఓజస్సు నిర్మాణమగును. ఓజస్సు వలన సహనము, బలము, కాంతి కలుగును. సామర్థ్యము వలన సత్కీర్తి కలుగును. బుద్ధిబలము మెండుగ నుండి ఇతరుల బాధలను తొలగించు శక్తి కలిగి యుందురు. ధైర్యము వీరి సహజగుణము. అనుమానము, భయము వీరి దరిచేరదు. ఆలోచన యందు అనిశ్చిత స్థితి యుండదు. ప్రవర్తనము పారదర్శకమై యుండును. అహంకార రహితులై యుందురు. ద్వైత భావము లుండవు. వీరులు మాటకు కట్టుబడి యుందురు. తమ యందు తాము ఆనంద ముగ నుండువారుగ వుందురుగాని కాముకులై ప్రపంచమును పీడించరు. ఇట్టి వారిచే పూజింపబడినది శ్రీమాత. ఇట్టివారు శ్రీమాతను పూజింప నవసరమేమి? అవసరము లేకయే నిత్యమూ పూజింపబడుచున్నది అని తెలుపుటలో శ్రీమాత మాహాత్మ్యము తెలియును. నిష్కారణముగ వీరు శ్రీమాతను పూజింతురు. వారి పూజలు పరహితార్థమే కాని స్వార్థము కొరకు కాదు. ఇట్టివారు చేయు పూజలే లోకహితార్థము కలిగింప గలవు.

# 778. 'విరాడ్రూపా'

**వి**రాడ్రూపముగ యేర్పడునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మము నుండి సంకల్పముగ ఉద్ధరించి 27 తత్త్వములుగ యేర్పడి యివి అన్నియునూ ఒక సమిష్టి రూపముగ యేర్పడినవి. ఈ రూపమునే విరాట్ అందురు. ఈ విరాట్ అనునది మొదట అండా కారముగ నేర్పడి అటుపైన విరాట్ పురుషునిగ యేర్పడినది. ఈ మొత్తము కార్యమును నిర్వహించునది సంకల్పరూపిణి యగు శ్రీమాతయే. ప్రథమముగ యేర్పడిన 27 తత్త్వములు ఈ క్రింది విధముగ నున్నవి. 1. కాలము, 2. ప్రకృతి, 3. మాయ, 4. మహత్తు, 5. సాత్విక అహం కారము, 6. రాజసిక అహంకారము, 7. తామసిక అహంకారము, 8. పంచ భూతములు (5), 9. పంచజ్ఞానేంద్రియములు (5), 10. పంచతన్మాత్రలు (5), 11. పంచ కర్మేంద్రియములు (5).

ఇట్లు మొత్తము 27 తత్త్వము లేర్పడగ వాటియందు సంకల్ప రూపిణి యగు శ్రీమాత ప్రవేశించినది. అపుడీ తత్త్వము లన్నియు ఒక అండాకారమై నిలచినది. ఈ అండమునే బ్రహ్మాండమని, విరాట్ అని అందురు. ఈ అండమే క్రమముగ ఒక దివ్య పురుషాకారముగ పరిణతి చెందినది. అట్లు విరాట్ రూపము యేర్పడెను. ఈ రూపమున ముఖమున అగ్ని, కన్నుల యందు సూర్యచంద్రులు, చెవుల యందు బృహస్పతి, నోటి యందు వరుణుడు, నాలుక కొనయందు సరస్వతి,

ముక్కుపుటముల యందు అశ్వినీ దేవతలు, చర్మమున వాయువు, ఫాలభాగమున త్రిమూర్తులలోని శివుడు, పాదముల యందు విష్ణువు, హృదయమందు వాసుదేవుడు, స్పందన శ్వాసల యందు గరుత్మంతుడు, కంఠమునందు వాగీశ్వరీ దేవతలు, బాహువుల యందు యింద్రుడు, శుక్రమున ప్రజాపతి– యిత్యాది దేవతలు యేర్పడిరని భాగవత పురాణ మున, తృతీయ స్కంధమున తెలుపబడినది.

ఈ మొత్తమును దైవముయొక్క విశ్వరూప మందురు. యజ్ఞ పురుషుడుగను, శ్రీ మహా విష్ణువుగను, శ్రీ లలితగను ఈ విరాడ్రూపము నారాధించుట వైదిక ఆచారమైనది. ఇందుండియే యక్షులు, రక్షులు, దేవతలు, దానవులు, మానవులు, పశుపక్ష్యాదులు, సర్పములు, వృక్షములు మొదలగు సమస్త జీవకోటి యేర్పడినది.



# 779. 'విరజా'

విగతమైపోయిన పాపములు గలది శ్రీమాత అని అర్థము.

పాప రహితమైన స్థితిని విరజాస్థితి అని అందురు. మహత్తున కీవలి లోకములన్నియు గుణములతో కూడి యుండును. గుణములున్న స్థితి యందు అహంకార ముండును. అహంకార మున్నచోట మలిన మున కవకాశముండును. తామసిక అహంకారమున పాపము మెండు. రాజసిక అహంకారమున కూడ పాపము మెండే. సాత్త్విక గుణమున్న చోట కూడ నే నున్నానను భావ ముండుటచే అహంకారమున కవకాశ మెక్కువ. నే నున్నానను భావమే అహంకారము. నిజమునకు బ్రహ్మమే తానుగ నున్నాడు. బ్రహ్మము మరచిన స్థితియందు మలిన మున్నది. మలినమును శుభ్రపరచుకొననిచో అది పెరుగుచు నుండును. శ్రీమాత స్థితి ఎట్టి మాలిన్యములు చేరని స్థితి. ఆమె సదా బ్రహముతోనే కూడి యుండును. సృష్టి నిర్వహణమున కూడ బ్రహ్మమును కూడియే యుండును. ఇది అనన్య సామాన్య స్థితి.

త్రిమూర్తులు త్రిగుణముల కధిపతులై సృష్టి నిర్వహణము చేయు నపుడు మలినములు సోకుచునే యుండును. వారు అను నిత్యము మలినములను నిర్మూలించుకొనుచు వారి వారి పదవులందు పదిల ముగ నుందురు. త్రిమూర్తుల స్థితియే యిట్లు వున్నప్పుడు ఇక యితరుల గురించి తెలుప పనిలేదు.

# 780. 'విశ్వతోముఖి'

**వి**శ్వము నందు ఏ దిక్కుననైనను ముఖము కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత అన్నిటా అంతటా చూచుచు అన్ని దిక్కుల యందు ముఖము కలదై యుండును. సేవించు భక్తులు ఏ దిక్కున నున్ననూ ఆ దిక్కున ప్రసన్నవదనముతో గోచరించును. అన్ని వైపులా నేత్రములు, ముఖములు కలది శ్రీమాత యని శృతి శ్రీమాతను ప్రశంసించు చున్నది. గుణాతీతయైన శ్రీమాత విశ్వవ్యాప్తమై దశ దిశల ముఖములు కలిగి సమస్తమును పర్యవేక్షణ చేయుచు నుండుటచే విశ్వతోముఖి అని ప్రశంసింపబడు చున్నది.

భక్తితో ఆరాధన చేయవలయును గాని నిజమునకు దిక్కులతో పనియేమి? అన్ని దిక్కులకు, దిక్పాలకులకు కూడ శ్రీమాతయే దిక్కై నపుడు ఆరాధకులకు దిక్కులతో పనిలేదు. శాస్త్రముల నెరిగినకొలదీ సహజము సామాన్యము అను సత్యము మరుగగు చుండును. శాస్త్ర మెరుగని భక్తునికి శ్రీమాత సులభసాధ్య. గోపికలకు లభించిన శ్రీకృష్ణుడు జ్ఞానులకు, తపస్విజనులకు, ఋత్విక్కులకు లభింపలేదు కదా! చదివిన కొలదీ కలిగిన జ్ఞానము అమ్మ అంతర్యామిత్వమును మరుగు పరచును. ఇట్టి అపాయము కలుగకుండుటకే అంతర్యామిత్వమును మరల మరల గుర్తు తెచ్చుకొనవలెను. పామరులగు భక్తులకు గల అనుభూతి విశేష

జ్ఞానము కలిగినవారికి కలుగకపోవుటలో గల రహస్యమిదియే. చదివిన కొలది సమవర్తనము, సమభావము, సమదర్శనము మరుగవు అవకాశము కలదు. ఇట్టి అపాయము నుండి భక్తు లెప్పుడును తమను తాము కాపాడుకొనుచుండవలెను. హెచ్చరికగ నుండవలెను.



# 781. 'ప్రత్యగ్రూపా'

**అం**తరంగమున ప్రత్యక్ ముఖముతో గోచరించునది శ్రీమాత అని అర్థము.

జీవుని రూపమున దైవమే యున్నప్పుడు దైవమెట్లు గోచరింప గలడు. తనయందు తానుగ యున్న దైవమును చూచుట యెట్లు సంభవింపగలదు. ఇంద్రియములద్వారా మనస్సుతో బాహ్యమునకు చూచు జీవుని లోపల నుండి దైవమే చూచుచున్నాడు. చూచువాని చూపుయందు, రుచి చూచువాని రుచియందు, స్పృశించువాని స్పర్శ యందు దైవముండి జీవుని కనుభూతి నిచ్చుచున్నాడు. దైవమునే చూడవలె నన్నప్పుడు తనయందు తనవలె యున్న దైవము తనకెట్లు కనపడగలడు? తనయందు తానుగ నున్న దైవము తనకు ప్రతిముఖమై ఎదురుగ కనిపించును. అట్లెదురుగ కనిపించినపుడే కదా భక్తుని కానందము. భక్తుల ననుగ్రహింప దలచినపుడు భక్తునిలో నుండియే ఈవలకు వచ్చి ప్రతిముఖుడై కనిపించును. ఇది అంతయు అంతరంగ దర్శనమే. ఇట్లు భక్తుల అంతరంగమున భక్తునికి ప్రతిముఖమై దైవము దర్శనమిచ్చును. దైవము భక్తునకు సుముఖుడైనపుడు ప్రసన్నుడై, వర మిచ్చుటకు ప్రత్యన్ముఖుడై నిలబడును. కనుకనే భక్తులు **'సుముఖోభవ, సుప్రసన్నోభవ, వరదోభవ, ప్రత్యన్ముఖోభవ'** అని వేడుకొనుచుందురు. ఈ విషయమున భక్తులు అదృష్టవంతులు. వారికి తమయందలి దైవము

ప్రత్యన్ముఖుడై దర్శన, స్పర్శన, సంభాషణాదులను గావించుచుండును. జ్ఞానుల కిట్టి దర్శనము క్లిష్టము. వారు దైవము తమయందు తాముగనే యున్నాడు అని భావించుటచే దైవము తానుగనే జ్ఞాని యందుండును. ప్రత్యేకముగ దర్శనము లుండవు. జ్ఞానికి దైవ భాషణము తమయందు వినిపించుట, అనిపించుట, స్ఫురించుటగ యుండును. ఎదురుగ కనపడి చెప్పినట్లుగ యుండదు. జ్ఞానికన్న భక్తుని కనుభూతులెక్కువ. భక్తుని అదృష్టమే అదృష్టము. శ్రీమాత ప్రత్యగ్రూపముతో భక్తుల ననుగ్రహిం చును.



# 782. 'పరాకాశా'

పరాకాశముగా నున్నది శ్రీమాత అని అర్థము.

ఆకాశము, మహదాకాశము, పరాకాశము ఇట్లు మూడు స్థితులలో ప్రకాశించునది శ్రీమాత. పంచభూతములకు మూలస్థానము ఆకాశము. త్రిగుణములకు, త్రివిధ అహంకారములకు మూలమైనది మహదాకాశము. సంకల్పము, కాలము, ప్రకృతిలకు మూలమైనది పరాకాశము. పరాకాశమే పరతత్త్వము. అదియే బ్రహ్మము. కాశమనగా వెలుగు. బ్రహ్మముగ వెలుగొందుచున్నప్పుడు శ్రీమాతను పరాకాశమందురు. అందుండి సంకల్పము, కాలము, ప్రకృతిగా వ్యక్తమగునపుడు మహదాకాశ మగుచున్నది. మహదాకాశము నుండి మహదహంకారము, సాత్విక అహంకారము, రాజసిక అహంకారము, తామసిక అహంకారముగ యేర్పడుచున్నవి. అందు సాత్త్విక అహంకారము నుండి దేవతలు, రాజసిక అహంకారము నుండి దేవతాశక్తులు, తామసిక అహంకారము నుండి పంచ భూతములు యేర్పడుచున్నవి. పంచభూతములలో ప్రధానముగ ఆకాశ మేర్పడి అందుండి వాయువు, అగ్ని, జలము, పృథివి యేర్పడుచున్నవి.

ఆకాశమనగా చోటు. రెండు వస్తువుల నడుమ, వాని లోపల నుండునది ఆకాశమే. అదియే బ్రహ్మము వెలుగు.

ఆకాశ దర్శనము ఒక దివ్యమగు అభ్యాసము మరియు అనుభూతి. వస్తువులను చూచుటకు అలవాటుపడిన మనసునకు, చోటును చూచుట

నేర్పవలెను. రెండు వస్తువుల మధ్యను, ఇద్దరి మనుష్యుల మధ్యను, రెండు వృక్షముల మధ్యను ఇట్లు చరాచర సృష్టిలో దృగ్గోచరమగు వస్తువుల మధ్యన గల చోటును చూచినచో అది ఆకాశమే అని తెలియ వలెను. ఆకుకును, ఆకుకును మధ్య నున్నది కూడ ఆకాశమే. నారీ నారీ నడుమ మురారి అనగా ప్రకృతి రూపముల నడుమ కనపడు ఆకాశమే కనపడని కృష్ణుడు. రూపముల నడుమ రూపముల లోపల అంతర్యామియై శ్రీమాత యున్నది. రెండు కొండల మధ్య గల ఆకాశమును చూడుడు, అతి అద్భుతముగ గోచరించును. అట్లే కనుబొమల మధ్యన కూడ ఆకాశమును చూచుట ధ్యాన యోగమున శ్రీకృష్ణుడు బోధించినాడు.

రెండు మెదడుల మధ్య ఆకాశమున్నది. రెండు కన్నుల మధ్య ఆకాశమున్నది. ముక్కుపుటముల మధ్య ఆకాశమున్నది. అంగిలియం దాకాశమున్నది. హృదయమందు ఆకాశమున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసల నడుమ ఆకాశమున్నది. లోకముల నడుమ ఆకాశమున్నది. మూలా ధారము నుండి సహస్రారము వరకుగల బ్రహ్మ రంధ్రమున నున్నది ఆకాశమే. సుషుమ్న యందు వెలుగుదారి అంతయు ఆకాశమే. చూచు వారికి చూడ ముచ్చటగునవి ఆకాశము, మహాదాకాశము, పరాకాశము. ఇది శ్రీమాత వెలుగని తెలియవలెను.



# 783. 'ప్రాణదా'

శ్రీమాత ప్రాణదాత అని అర్థము.

శ్రీమాత వలననే ప్రాణ మేర్పడుచు నున్నది. ఆమె బ్రహ్మమై యున్నప్పుడు ప్రాణ స్పందనము యుండదు. స్పందన ముండుటకు కారణము బ్రహ్మము నుండి ఈవలకు వచ్చిన సంకల్పము. బ్రహ్మ సంకల్పముగ బ్రహ్మము నుండి శ్రీమాత ఈవలకు రాగా ఆమెకును బ్రహ్మమునకు నడుమ గల అనుసంధానమే ప్రాణము. సంకల్పము బ్రహ్మమును చేరుటకే యిచ్ఛగించును. కాని సృష్టికార్యము నిర్వహించ వలెను కదా! కనుక సృష్టికి ఉన్ముఖమగును. బ్రహ్మము నందు యిచ్ఛ వుండుటచే అటునిటు ఊయల నూగుచుండును. బ్రహ్మము ఒక గమ్యము, సృష్టి మరియొక గమ్యము. ఉచ్ఛ్వాసమున సృష్టికి ఉన్ముఖ మగుట, నిశ్వాసమున బ్రహ్మమున కున్ముఖమగుట జరుగుచుండును. తత్కారణముగ స్పందన మేర్పడును. నిశ్వాసమున బ్రహ్మ స్పర్శ పొందుచు ఉచ్ఛ్వాసమున సృష్టి కార్యము చేయును. ఇట్లు ఉచ్ఛ్వాస నిశ్వాసలుగ ప్రాణ మేర్పడును. ఉచ్ఛ్వాసమున సృష్టి పురోగమనము, నిశ్వాసమున తిరోధానము కూడ చేయును.

యోగులు కూడ ఉచ్ఛ్వాసమును 'అహ'ముగను, నిశ్వాసమును "సహ"ముగను గుర్తింతురు. "సోహం" అను మంత్రము ద్వారా ధర్మముతో ముడిపడి జీవింతురు.

ప్రాణము స్పందనాత్మకము. స్పందనము విచ్చుకోలు, ముడుచు కోలుగను సాగును. విచ్చుకొనుట సృష్టి, ముడుచుకొనుట తిరోధానము. “అతడు”గ నున్న బ్రహ్మము “తాను”గ నున్న జీవుడుగ యేర్పడుటకు శ్రీమాత ఉచ్ఛ్వాసమును వినియోగించును. అట్లు శ్రీమాత ఉచ్ఛ్వాసమున జీవులు సృష్టింపబడుదురు. ఆమె నిశ్వాసమున జీవులు బ్రహ్మమును చేరుదురు. ఇట్లు ప్రాణ స్వరూపిణియై ఉచ్ఛ్వాస నిశ్వాసముల ద్వారా సృష్టి స్థితి లయములను శ్రీమాత నిర్వహించు చుండును. ఆమె అనుగ్రహముననే జీవులయందు ప్రాణములు నిలచును. ప్రాణములు హరింపబడుట కూడ ఆమె సంకల్పమే.

ఇట్లు ప్రాణ రూపమున కూడ శ్రీమాతయే యుండుటచే ఆమెను ప్రాణరూపిణి అందురు. అదియే తరువాతి నామము.



# 784. 'ప్రాణరూపిణి'

ప్రాణరూపమున నుండునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మము నుండి సంకల్పము యేర్పడినపుడే కాలము, ప్రాణము కూడ యేర్పడినవి. ఇవి అన్నియు శ్రీమాతయే. శ్రీమాత శ్వాస కాలమును దినములు, నెలలుగ లెక్కించదగును. కాలమునకు ప్రాణమునకు అనుసంధాన మున్నది. శ్వాసను బట్టి కాలము లెక్కలు తెలుసుకొన వచ్చును. శ్వాస లాధారముగనే గడియలు, విగడియలు యిత్యాది లెక్కలు ఋషు లేర్పరచినారు.

పంచప్రాణములు, పంచ ఉపప్రాణములతో దశ ప్రాణములుగ సృష్టి యందు శ్రీమాత స్పందించును. మూడు లోకములందు కూడ ఈ ప్రాణము లున్నవి. జీవులు భౌతిక లోకమున భౌతికమగు దశ ప్రాణములతోను, అట్లే సూక్ష్మ లోకమున సూక్ష్మమగు ప్రాణములతోను, కారణ లోకమున కారణ ప్రాణములతోను వశించి యున్నారు. జీవుడు స్పందనాత్మకు డగుటచే అతడు మరణింపడు. స్థూల ప్రాణము లాగి నపుడు స్థూలదేహము పడిపోవునే గాని జీవుడు మరణింపడు. అట్లే స్థూలదేహము వెళ్ళినపుడు కూడ మరణింపడు. శాశ్వతుడగు జీవుని యందు శ్రీమాత ప్రాణరూపమున యుండును. సర్వ జీవరాసుల యందు ప్రాణము శ్రీమాతయే.

# 785. 'మార్తాండ భైరవారాధ్యా'

**మా**ర్తాండ భైరవునిచే ఆరాధింపబడునది శ్రీదేవి అని అర్థము.

రాక్షస సంహారమునకై శివుడు అశ్వమునెక్కి భూమికి దిగి వచ్చెను. అట్టి శివునిచే ఆరాధింపబడునది శ్రీమాత అగుటచే ఈ నామ మేర్పడినది. మణిమల్లుడను రాక్షసుని సంహరించుటకు శివుడశ్వము నెక్కి భూమికి వచ్చెను. ఈ శివరూపమును మార్తాండ భైరవునిగ మహారాష్ట్ర దేశమున ఆరాధింతురు.

సూర్యునికి మార్తాండు డను పేరు కలదు. అతడు మృతి చెందిన అండమున పుట్టినవాడగుటచే ఈ నామమును పొందెను (స్కాంద పురాణము). అట్టి సూర్యనారాయణ మూర్తిచే శ్రీమాత నిత్యమూ ఆరాధింపబడు చున్నది. కనుకనే ఈ నామము వచ్చినది అని కూడ అర్థమున్నది.

మరణ భయము కలవారు భీరువులు. అట్టి గుంపును భైరవ మందురు. మృత్యుభీతి గలవారిచే మిక్కుటముగ ఆరాధింపబడును గనుక 'మార్తాండ భైరవారాధ్యా' అని మరియొక అర్థము చెప్పుదురు.

ఉత్తమమగు యత్నమును భైరవ మందురు. ఉత్తమోత్తమమైన యత్నముచే అహంకార మమకారములను జయించి సూర్యుడు అమిత కాంతివంతుడైనాడు. సహజమగు జ్ఞానమును పొందినాడు. ఆత్మ

జ్ఞానియై యున్నాడు. ఇట్లు సూర్యునివలె తనను ఆరాధించు బృందము సృష్టియందు భువర్లోకమున నున్నది. వీరిని మార్తాండ భైరవు లందురు. శ్రీమాత ఆరాధనము మార్తాండుని వలె నిర్వర్తించ వలెనని ఈ నామము సూచించు చున్నది.



# 786. 'మంత్రిణీ న్యస్తరాజ్యధూః'

**మం**త్రిణీ దేవియందు రాజ్యపాలనము, రక్షణ, శక్తులు నిక్షిప్తము చేసినది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత శివునితో కూడియుండుట కిచ్చగించును. కనుక మంత్రిణీ దేవిని సృష్టించి ఆమెయందు తమ సమస్త శక్తులను నిక్షిప్తముచేసి సృష్టి నిర్వహణా భారమును మంత్రిణికి అప్పచెప్పినది. మంత్రిణి సృష్టి నిర్వహణా భారమును నిర్వహించుచుండగా శ్రీమాత పరమశివునితో నర్తించుచూ ఆనందించు చుండును. ఇదియొక సౌలభ్యము.

అష్టసిద్ధులు, నవనిధులు తన అధీనమున నున్న సీతమ్మ హనుమంతునికి వాని నప్పజెప్పి రామునితో ఏకాంతమున రమించెనట. అట్లు హనుమంతుడు రామునికి మంత్రియై నిలచి రామరాజ్యము సుస్థిరము గావించెను.

మంత్రి యనగా రాజు భారమును వహించువాడు. రాజ్యభారము మంత్రి వహించగ, రాజు రాజ్యసభ యందు స్థితిగొని భువన విజయము గావించును. శ్రీమాత అట్టి మంత్రిని యేర్పాటు గావించుకొనెను. ఆమెయే మంత్రిణి. ఈ మంత్రిణీదేవికి శ్యామల అను నామము కలదు.

శ్రీమాత మంత్రరూపమే శ్యామల. మంత్రమునకు సిద్ధి శ్యామలా దేవియే అనుగ్రహించును. నిర్మలచిత్తముతో మంత్రోపాసనము చేయు వారిని శ్యామల అనుగ్రహించును. అష్టసిద్ధులు, నవనిధులు శ్యామలా

దేవియే అనుగ్రహింప కలదు. అంతేగాక శ్రీమాత దర్శన స్పర్శన సంభాషణాది అనుగ్రహమును కూడ కలిగింప గలదు. నిజమునకు సద్గురువు లందరూ యిట్టివారే. సత్సాధకులకు, శిష్టులకు యిహపర ములు గూర్చువారు సద్గురువులు. దైవమునకు భక్తునకు అనుసంధానము కూర్చగలరు. దైవమును చేరు ఉపాయమును కూడ తెలుపగలరు.

అన్ని మంత్రముల కన్న "ఈశ్వరుడు, తాను ఒక్కటే" అని చింతన చేయు మంత్రము ఉత్తమోత్తమ మగు మంత్రము. శ్యామలాదేవి గురు రూపమున ఈ మంత్ర ముపదేశించి భక్తులను కైవల్యపథమును చేర్చును. అనుస్యూతముగ యిట్టి మంత్రమును చింతన చేయుటయే భగవద్గీత యందు శ్రీకృష్ణుడొసగిన పరమోపదేశము **(అనన్యాశ్చింత యంతో మాం....)** ఇదియే తారక మంత్రము. ఈ మంత్రము సిద్ధించినపుడు దైవ యోగము సిద్ధించును. ఈ సిద్ధి సమస్త సిద్ధులకు ఆధారమై నిలచును. దేవితో నైక్యము కలిగించు మంత్రము నిచ్చునది కూడ శ్యామలయే.



# 787. 'త్రిపురేశీ'

**త్రి**పురముల కీశ్వరి శ్రీమాత అని అర్థము.

ఈ నామమునకు విస్తారముగా వివరణ మీయ నవసరము లేదు. ముందు నామములలో సవిస్తరముగ వివరింపబడిన అంశమే యిందునూ గోచరించును. ప్రజ్ఞ, శక్తి, పదార్థము అను మూడు స్థితులలో లోకములు, జీవులు యేర్పడుచున్నారు. మొత్తము సృష్టిని స్థూలముగ భూః, భువః, సువర్లోకములని పేర్కొందురు. అనగా పదార్థమయ లోకములు, వాని కాధారమైన శక్తి లోకములు, వాని కాధారముగ ప్రజ్ఞాలోకములు, ఈ మూడింటిగ శ్రీమాతయే యేర్పడి యున్నది. రక్షణ పోషణ ఆమెయే గావించు చున్నది. ఆమెయే ఈశ్వరి. త్రిపుర ముల కీశ్వరి. త్రిపురేశ్వరి.



# 788. 'జయత్సేనా'

**జ**యించు శక్తిసేనలు కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత శక్తిసేన జయింపరాని అంశము పదునాలుగు భువనములలో లేనే లేదు. లలితా సహస్ర నామమున శ్రీమాత శక్తిసేనా సమూహమును 66వ నామము నుండి ఎనుబది రెండవ నామము వరకు విస్తారముగ తెలుపబడినది. అవి క్లుప్తముగ యిట్లున్నవి.

1. సంపత్కరీ గజ సమూహము, 2) కోటానుకోట్ల అశ్వారూఢ సమూహములు, 3) రథారూఢ రాజ సమూహములు, 4) సర్వాయుధ హస్తుడు, 5) చక్రరాజ రథారూఢుడు, 6) గేయచక్ర రథారూఢుడు, 7) కిరిచక్ర రథారూఢుడు, 8) వహ్నిః ప్రాకారములు, 9) నకులీ శక్తులు, 10) తిథిశక్తులు, 11) బాలా, 12) మంత్రిణీ, 13) వారాహీ, 14) గణేశ్వరుడు, 15) విఘ్నయంత్రము, అస్త్రశస్త్రములు, 16) దశ నారాయణులు, 17) పాశుపతము, 18) కామేశ్వర అస్త్రము.

వీని వివరములన్నియు ఆయా నామములలో తెలుసుకొన వచ్చును. ఇట్టి సేన గల శ్రీమాత నిశ్చయ జయము కలది. అందువలన 'జయత్సేనా' అని కీర్తింపబడుచున్నది.

# 789, 790. 'నిస్త్రైగుణ్యా, పరాపరా'

త్రిగుణ రహితమైనది శ్రీమాత. పరము, అపరముగా నున్నది కూడ శ్రీమాతయే అని అర్థము.

శ్రీమాత త్రిగుణములతో కూడి సృష్టి నిర్మాణము చేయునపుడు అపరదేవిగా నుండును. త్రిగుణముల కావల త్రిగుణ రహితగను పరముగ నుండును. ఆమె పరమునందు, అపరమునందు కూడ ఏక కాలమున నున్నది కనుక ఆమె 'పరాపరా'.

సృష్టి యందు త్రిగుణముల కతీతముగ నున్న స్థితి పరస్థితి. త్రిగుణములతో నున్న సృష్టి అపరసృష్టి. ఇచ్ఛ, జ్ఞానము, క్రియ అపర స్థితులే. సమాధి మాత్రము పరస్థితి. పరము నుండి అపరమునకు సృష్టి యేర్పడును. అపరము నుండి పరమునకు చేరుటలో జీవుడు పరిపూర్ణు డగుచుండును. ఋణ బంధనము బంధనమే. గుణరహిత స్థితి మోక్ష స్థితి. ముక్తసంగులైన ఋషులు సమాధినే కోరుదురు. దేశమును బట్టి, కాలమును బట్టి, కర్తవ్యమును బట్టి వారు గుణముల యందు ప్రవేశించి జగత్కల్యాణమగు కార్యములనొనర్చి అటుపై గుణసంగము వీడి సమాధి యందుందురు. పగలు దివ్యకార్యముల నొనర్చుట, నిద్రించు సమయములో సమాధి యందుండుట వారి సహజ స్థితి. మహర్షులు సహజ సమాధి నందుండియే సర్వమును నిర్వర్తింతురు. శ్రీమాత ఎప్పుడునూ సహజ సమాధి యందే యుండును.

పరమునకు పరబ్రహ్మము అధిష్ఠానదైవము. అపరమునకు చతుర్ముఖబ్రహ్మ అధిష్ఠానదైవము. సృష్టి యందలి దేవతలు సహితము చతుర్ముఖ బ్రహ్మమునే ఆశ్రయింతురు. మహర్షులు, బ్రహ్మర్షులు పర బ్రహ్మము నాశ్రయింతురు. వేదమపరము. చతుర్వేదములు పరా పరములు.

అపరము నందున్నవారు పరమును తెలియవలెను. అటుపైన పరా అపరములందు వ్యాప్తి చెందవలెను. అపరమును నిరాకరించుట పూర్ణస్థితి కాదు. పరాపరములను సమదృష్టితో చూచుటయే సమగ్రస్థితి. ఈశావాస్య ఉపనిషత్తు దీనినే బోధించును. సమదర్శనులే తెలిసిన వారు అని శ్రీకృష్ణుడు భగవద్గీత యందు తెలిపినాడు.

భగవద్గీత, అష్టాంగ యోగము పరాపరమార్గము తెలుపు సాధనా గ్రంథములు. పగటియందు రాత్రియందు గూడ చూడగలుగుటయే ఋషి దృష్టి. అట్టివాడే పూర్ణుడు. హనుమంతుడు రాత్రియందు లంకలో పిల్లివలె తిరుగాడి సీతమ్మను వెదకెను. అతడు రాత్రియందు కూడ చూడగలిగినవాడు కనుక పూర్ణయోగి.

శ్రీమాత త్రిగుణాతీత అయినను త్రిగుణాత్మికగ కూడ యుండును. ఆమె మహత్తునకు ఈవల, ఆవల కూడ వ్యాపించి యున్నది. ఆమెయే నిజమగు పరాపర. ఆమె విద్య యందున్నది. అవిద్య యందు కూడ నున్నది. పగలుగను, రాత్రిగను కూడ యున్నది. జ్ఞానిగను, అజ్ఞానిగను కూడ యున్నది. ద్వంద్వాతీత అయిననూ ద్వంద్వములుగ కూడ యున్నది. ఆమె లేనిది సృష్టియందు గాని, పరమునందు గాని ఏమియు లేదు. పరము అపరము ఆమెయే.

# 791. 'సత్యజ్ఞానానందరూపా'

సత్యరూపము, జ్ఞానరూపము, ఆనందరూపము శ్రీమాత అని అర్థము.

సత్యము లేనిచోట జ్ఞానముండదు. జ్ఞానము లేని చోట ఆనంద ముండదు. అసత్య భాషణలు వ్యక్తిగత కర్మను సృష్టించు కొని బంధితు లగుదురు. పశువులవలె అహంకారము నందు, మనస్సు నందు, యింద్రియముల యందు, దేహము నందు బంధింపబడుదురు. బంధనము దుఃఖహేతువు. బంధలేమి ఆనంద కారకము. జీవుడు తానున్నా ననుకొనుట అసత్యము. అది అజ్ఞానము. అట్టి అజ్ఞానము అహంకారమునకు దారితీయును. అహంకారము బంధహేతువు. దైవమే తానుగా నున్నాడనుట సత్యము. దైవములేక తాను లేడు. సముద్రములేక అల లేదు. సముద్రమును మరచిన అల సంగము చెడి నశించును. దైవమును మరచిన జీవుడు అట్లే నశించుట జరుగును. జీవుడు సహజముగ ఆనంద స్వరూపుడు కాని తన ఉనికిని మరచిన జీవుడు, ఆనందమును కోల్పోవును. దైవమే తానుగ నున్నాడని మరచుటయే ఉనికిని మరచుట. తానే కాక సర్వజీవ రాశులు కూడ దైవమే అని తెలియవలెను. దైవమే కోటానుకోట్ల రూపమున, తన రూపమున నున్నాడని తెలియుట జ్ఞానము. అదియే సత్యము. అట్టి సత్య జ్ఞానములను మరచినవాడు ఆనందము నెట్లు పొందగలడు?

జీవుల రూపమున నున్న దైవమును మరచినవారికే కామ క్రోధములు, లోభ మోహములు, మద మాత్సర్యములు, రాగద్వేషము లేర్పడును. ఇవి అశుభములు. వీనిని ధరించిన అశుభమతులు ఆనందము కొరకు అన్వేషించుచూ తీరుబడి లేక జన్మలనెత్తుచు నుందురు. వీరి ఆనందాన్వేషణ ఎండమావుల వెంట నీటికై పడినట్లుండును.

ఆనందముగ నుండుటయే గాని ఆనందము వెదకుకొనుట యుండదు. ఆనందముగ నుండుటకు అన్నిటా అంతటా నిండిన దైవమును దర్శించుటయే మార్గము. అశుభ భావములు దరిచేర కుండుటకు కూడ యిదియే మార్గము. అంతటా అన్నిటా నిండిన దైవమును చూచుట సత్యస్థితి. అట్టివారికే జ్ఞానము, ఆనందము కూడ. ఈ మూడింటి యందు ఒకటి యున్నచోట మిగిలిన రెండును యుండును. ఏ ఒకటి లేకున్నను రెండవది యుండదు.



# 792. 'సామరస్య పరాయణా'

ప్రకృతి పురుషుల సమన్వయము వలన సామరస్యము కలుగును. శ్రీమాత అట్టి సామరస్య మూర్తి.

శ్రీమాత శివశక్తి స్వరూపిణి. తాను సగము శివుడు సగమై అన్యోన్య కారణముగ అంగాంగీ భావము పొందినది. ఎవరియందు ప్రకృతి పురుషులు సమభావము వహింతురో వారియందు సామరస్యము జనించును. ప్రకృతి పురుషుని అధిగమించినను, పురుషుడు ప్రకృతిని అధిగమించిననూ సామరస్యము కుదరదు. ప్రకృతి గొప్పదా? పురుషుడు గొప్పవాడా? శివుడు గొప్పవాడా? శక్తి గొప్పదా? ప్రజ్ఞ గొప్పదా? పదార్థము గొప్పదా? ఇట్టి ప్రశ్నలు పురాణములలో పరిష్కరింపబడినవి. ప్రకృతి లేక పురుషుడు లేడు. అట్లే పురుషుడు లేక ప్రకృతి లేదు. ఇరువురును సామరస్యము కలిగియుండుట గొప్ప స్థితి. అదియే యోగము. పరము ఇహము కన్న గొప్పదని భక్తులు తరచు భ్రమ పడుచుందురు. అట్లే ఇహము పరము కన్న గొప్పదని భౌతికవాదులు పలుకుదురు. ఇహ పరములు రెండును సామరస్యము పొందినపుడే జీవితము రసానుభూతియై యుండును. ఎక్కువ తక్కువ లున్నచోట సామరస్య ముండదు. అన్ని విషయముల యందు ఎక్కువ తక్కువలు లేని సమస్థితి ఆనంద దాయకము. ఎక్కువ ధన మున్ననూ కష్టమే. అది ఏమి చేయవలెనో తెలియక తికమక పడుదురు. అట్లే ఎక్కువ

దరిద్రమున్ననూ కష్టమే. ధనము, అధికారము మరి యే యితర అంశమైనను, ఎక్కువైనను తక్కువైననూ ఆనందము కలుగదు. ఎంత బాగున్ననూ ఎక్కువైనచో వెగటు పుట్టును. 'తినగ తినగ గారెలు చేదు' అను సామెత వలె ఏది ఎక్కువైనను తక్కువైననూ కష్టమే. ఉప్పు ఎక్కువైనచో అనారోగ్యము. తక్కువైననూ అనారోగ్యమే.

'అతి సర్వత్ర వర్జయేత్' అని పెద్దలు తెలిపిరి. అనగా అన్ని విషయములలోను అతిగ నుండరాదు. అతి వినయము, అతి భక్తి యిత్యాదివి వికారములగును గాని ఆనందము నీయవు. జీవితమున సమస్త విషయముల యందు సమతూకము ప్రధానము. సమతుల్యమే యోగము. సమభావమే శాంతి లక్షణము. సమదర్శనమే జ్ఞానము. ఇట్టి సమతుల్యము నిచ్చునది శ్రీమాత. ఆమె సామరస్య మిచ్చుటలో దిట్ట. భక్తులలో సమతుల్యముగ నుండు భక్తులు అరుదు. ఇహమును కాదనుకొని ఇహమును నిరాదరించు భక్తులకు ఇహ వైభవ ముండును. తెనాలి రామకృష్ణుడు ఇహపరములలో నేది కావలెనని అమ్మ ప్రశ్నించి నపుడు రెంటినీ కోరెను. కనుకనే కవులలో అతడు యోగిపుంగవు డయ్యెను. అట్లే ఋషులలో జనకుడు రాజర్షి అయ్యెను. ఋషులందరును రాజర్షులు కావలెనని కోరుదురట. ఇహపరములు, ప్రకృతి పురుషులు, ప్రజ్ఞా పదార్థములు సమభావముతో ఎచ్చట ఆదరింపబడునో అచ్చటనే సమగ్ర యోగము యుండును. కనుకనే ఉపనిషత్తులలో నిరాకరించువారు బ్రహ్మమును చేరలేరు అని తెలిపిరి. 'అనిరాకరణ మస్తు, అనిరాకరణ

మస్తు’ అని ఉపనిషత్తులు ఘోషించును. భార్య పిల్లలు, సంసారము, వృత్తి వ్యాపారము, ఉద్యోగము నిరాకరించి దైవమును చేరు ప్రయత్నము చేయువారు వెఱ్ఱివారు. అన్నిటా అంతటా వున్న దైవమును పై తెలిపిన వాటియందు కూడ దర్శించి సమన్వయించుకొన్నచో సామరస్య ముండును. బ్రహ్మర్షి అయిన వశిష్ఠుడు కుటుంబియే.



# 793. 'కపర్దిని'

**జ**టాజూటము ధరించిన శివుని భార్య అని అర్థము.

శిరోజములు ఊర్ధ్వముగ ముడివైచుకొను వారు కపర్దనులు. ఊర్ధ్వరేతస్కులగు ఋషులు వారి జటాజూటములను తలపాగవలె, గోపురమువలె ఊర్ధ్వమునకు బిగించి కట్టుకొందురు. తపస్సు చేయు నపుడు తపోధనుల ప్రజ్ఞ ఊర్ధ్వముఖమై నడినెత్తి దాటి యుండును. వారికి శిరోజములను సంస్కరించుకొను సమయముండదు. శిరోజ ములు పెరిగి జడలై వ్రేలాడుచుండగ అన్నిటినీ కలిపి పురి త్రిప్పి ఊర్ధ్వముగ ముడివైచుకొందురు. తపస్సు చేయువారందరికిని శివుడే ఆరాధ్యదైవము. శివుడు తన జటాజూటములను ఆకాశము నుండి అవతరించుచున్న గంగను బంధించి భద్రపరచుటకు అత్యద్భుతముగ చుట్టలు త్రిప్పుచు ముడి వైచెను. గంగ వేగము నరికట్టి సరళముగ భూమిపైకి ప్రవహింపచేసెను. అతడి శిరిముడి అందరికిని మార్గదర్శక మయ్యెను. ఇట్లు కపర్దనుల సంప్రదాయ మేర్పడినది.

శ్రీమాత శివుని గూర్చి తపస్సు చేయునపుడు సారూప్య భావము చెంది తాను కూడ అట్టి శిరిముడినే ధరించుట, పులిచర్మమునే వస్త్రముగ ధరించుట, త్రిశూలమును పట్టుకొని యుండుట నేర్చినది. అట్లు ఆమె కపర్దిని అయినది.

హిమాలయములలో నేటికిని శ్రీమాత శైలపుత్రి దర్శనమును ఋషిలిట్లు పొందుచు నుందురు. ఈ దర్శనము సర్వ శుభంకరము.

# 794. 'కళామాలా'

అరువది నాలుగు కళలను ధరించునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత శైలపుత్రి రూపము అరువది నాలుగు కళలతో శోభాయ మానముగ నుండును. శ్రీమాత సౌందర్య రూప మిదియే. పదహారు సంవత్సరముల కన్యగా మహా లావణ్యముతో కూడినటువంటి అంగము లతో ఈ రూపము శోభించు చుండును. శ్రీమాత యొక్క శైలపుత్రి రూపము ముగ్ధ మనోహర రూపము. కామదహనుడైన శివుడు కూడ మెచ్చి వరించు రూపమిది. ఈ రూపమునందు అరువది నాలుగు కళలు గలవు. పదహారు తిథులు నాలుగు పాదములతో ఏక కాలమున గోచరించినచో అరువది నాలుగు కళలు దర్శన మగును. ఈ కళల యందు అరువది నాలుగు విద్యలు ప్రకాశించును. ఇట్టి రూపము శ్రీమాతకే తగును. ఈ రూప దర్శనము ముందు ఇతర కాంతు లన్నియు వెలవెల బోవును. శ్రీమాత ఈ రూప దర్శనమునకే మహర్షులు సహితము తహతహ లాడుచుందురు.



# 795. 'కామధుక్'

**కో**రికలను పూరించునది శ్రీమాత అని అర్థము.

కామధేనువువలె భక్తుల కోరికలను శ్రీమాత పూరించు చుండును. జీవుల తరింపునకై శ్రీమాత నిర్వర్తించు కార్యములలో కామపూరణ మొకటి. కొన్ని కోరికలు తీర్చుట వలన జీవులకు వృద్ధి కలుగును. అట్టి కోరికలనే తీర్చుచు జీవులను పరితృప్తి గావించును. కోరికలు రెండు రకములు. ప్రేయస్సులు, శ్రేయస్సులు. కేవలము ప్రీతి కలిగించు నవి ప్రేయస్సులు. శ్రేయస్సు కలిగించునవి శ్రేయస్సులు. శ్రేయస్సు కలిగింపని కోరికల వలన జీవుడు బద్ధుడగు చుండును. అసురులు, దానవులు యిట్టి కోరికలనే కోరుచుందురు. వలదన్న వినరు. సత్త్వగుణ ప్రధానులు శ్రేయోదాయకములగు విషయములనే కోరుదురు. అట్టి కోరికలు తీర్చుట వలన వృద్ధి కలుగును.

కోరికలు తీర్చుట, తీర్చుకొనుట అను విషయమున శ్రీమాత దిట్ట. ఎవరి కెప్పు డేమి కావలయునో వారి కప్పుడది ఒసగును. కామపూరణమున ఆమెయే నిర్ణేత. ఆమె నిర్ణయములు అతి గంభీరమై యుండును. శ్రీమాత నారాధించువారు కోరికలన్నియు పూజా పీఠమున సమర్పించి శ్రీమాత నిర్ణయములను శిరసా వహించుట సముచితము. తమ యిష్టాయిష్టములను సమర్పణము గావించి శ్రీమాత అనుగ్రహించి నదే ప్రసాదముగ స్వీకరించుట నేర్వవలెను. ఇట్టి సమర్పణ మార్గమున

శ్రీమాత కామధేను స్వరూపము అవగాహన యగునుగాని యిష్టా యిష్టములలో జీవించువారికి శ్రీమాత అవగాహన దుర్లభము.

సృష్టి యందు కోరినవి లభింపవు. కోరకున్నను అనిష్టములు జరుగును. ఈ రహస్యమెఱిగి కోరక ప్రార్థించుట ఉపాయముగ పెద్దలు తెలిపినారు.



# 796. 'కామరూపిణీ'

**కో**రిన రూపము ధరించ గలిగినది శ్రీమాత అని అర్థము.

జీవులకు వారి వారి పరిణామమును బట్టి కోటానుకోట్ల రూపముల నేర్పరచినది శ్రీమాత. స్వభావమునకు తగిన రూపము నిచ్చుటలో శ్రీమాత సిద్ధహస్త. స్వభావమును దాటిన యోగులు, ఋషులు రూపబద్ధులు కారు. వారును కోరిన రూపములు ధరించు స్థితిని పొందుదురు. ఉదాహరణకు హనుమంతుడు కామరూపియే. శ్రీరామునికి చతుర్వేదములు ధరించిన వేదపండితుడివలె గోచరించును. లంఖిణికి భయము గొల్పు రూపమును చూపించెను. అసురులకు తన భీమ రూపము చూపించెను. లంకలోనికి, పాతాళములోనికి సూక్ష్మరూప మున ప్రవేశించెను. యుద్ధమున వజ్రరూపము ధరించెను. కోతులకు కోతులరూపమున కనిపించెను. రావణునికి రుద్రునివలె గోచరించెను. ఆంజనేయుడు స్వభావమును దాటిన సిద్ధుడు. అట్టివారిని రూపము బంధింపదు. ఆదిశంకరులు కూడ రూప విసర్జనము, రూప ప్రదేశము నిర్వర్తించి చూపిరి. జీవులు స్వభావములను దాటు వరకు తదను గుణములగు రూపములను పొందుచు, పరిణామము చెందుచు నుందురు. శ్రీమాత రూప మిట్టిదని నిర్దేశించుటకు వీలులేదు. కోరిన రూపము ధరింప గలదు. రూపమున కతీతమైన వెలుగుగ కూడ నుండగలదు. అవసరమును బట్టి శివునికి కూడ రూప మీయ గలదు.

బ్రహ్మమునకే రూపమిచ్చునది శ్రీమాత. బ్రహ్మమే అవతరించుటకు సంకల్పించినపుడు సహకరించి రామ రూపము, కృష్ణ రూపము నిచ్చినది. కనుకనే రామబ్రహ్మము, కృష్ణ పరబ్రహ్మము లేర్పడిరి. చోటునకు రూపమీయ గలిగిన మహిమ కలది శ్రీమాత. మహత్తు ఆమె పనిముట్టు. ఉన్నది లేనట్లుగ చేయగలదు. లేనిది వున్నట్లుగ చేయగలదు. కామ రూపిణి అయిన శ్రీమాత కామేశ్వరి కదా!



# 797. 'కళానిధి'

**క**ళలకు నిధి శ్రీమాత అని అర్థము.

సమస్త కళలకు, సమస్త విద్యలకు శ్రీమాతయే మూలము. కోటానుకోట్ల జీవులు అనేకానేక కళలతో నుందురు. జీవులను కూడ కళలని పిలుచు విధానమున్నది. కళను బట్టియే జీవులను గుర్తింతురు. జీవుల శిరస్సుల యందుగల కాంతులను బట్టి గురువులు శిష్యుల నంగీకరింతురు. వారి పెరుగుదలను కూడ ముఖము నందుగల కళ బట్టియే గమనించుచుందురు. సంవత్సరమున కొకసారి శిరస్సునందు గల కళను గమనించి అనుగుణమగు శిక్షణము కొనసాగించు చుందురు. జీవకళ, మాత జీవునియందు చూపు సాన్నిధ్యము. కళనిచ్చి రూపము నిచ్చునది శ్రీమాత. బ్రహ్మమానస పుత్రుల నుండి పిపీలికములుగా నున్న జీవులయందు తన కళను సాన్నిధ్య రూపమున నిచ్చును. శ్రీమాత నారాధించు వారియందు ఆమె సాన్నిధ్యము పెరుగుచు నుండగా ఆరాధకులు కళాత్మకు లగుచుందురు. విధి విధానముగ భక్తి శ్రద్ధలతో ఆరాధన చేయువారికి కళానిధియగు శ్రీమాత కళలను, విద్యలను ప్రసాదించుచు వారిని వృద్ధి పరచును.



# 798. 'కావ్యకళా'

**మృ**త సంజీవని శ్రీమాత అని అర్థము.

విద్యలన్నిటిలో ఉత్తమము, తారకము అగు విద్య మృతసంజీవని విద్య. ఈ విద్య కవియగు శుక్రాచార్యుని యందు శ్రీమాత నిక్షిప్తము చేసినది. శుక్రుని విశేషవిద్య అగుటచే మృతసంజీవని విద్యను కావ్యకళ అందురు. ఈ విద్యగలవారు మృతులను జీవింప జేయగలరు. మృత్యువు నుండి దాటింప గలరు.

సమస్త విద్యలు గల దేవగురువైన బృహస్పతికి మృతసంజీవని విద్య మాత్రము తెలియకుండెను. రాక్షస గురువైన శుక్రుని వశమున యున్న ఈ విద్యను నేర్వవలెనను తపనతో బృహస్పతి తన కొడుకైన కచుని శుక్రుని వద్దకు పంపెను. కచ దేవయాని ఉపాఖ్యానమందు ఈ విషయము సవిస్తరముగ వివరింపబడినది. మృతసంజీవని విద్య రహస్య విద్య. దానికి గురువు శుక్రుడు. శుక్రుని అనుగ్రహముననే సద్గురువులు సహిత మీ విద్యల నేర్తురు. మృత్యువును దాటు విద్యకన్న మించిన విద్య లేదు. అట్టి విద్యారూపమున శ్రీమాత శుక్రాచార్యుని యందు స్థితిగొని యున్నది.



# 799. 'రసజ్ఞా'

**ర**సజ్ఞానము శ్రీమాత అని అర్థము.

రసమనగా అనందానుభూతి. అది నవ విధములు. కనుకనే సృష్టి నవరసభరిత మందురు. పరము నుండి మూల ప్రకృతియై, త్రిగుణాత్మికయై, పంచభూతాత్మికయై సృష్టి రూపమున శ్రీమాత అవతరించినది. ఇట్లు పరము పదియవది కాగా, అట నుండి తొమ్మిది దశలలో, నవప్రకృతులతో సృష్టిగ తానే యేర్పడినది. ఈ తొమ్మిది ప్రకృతుల యందు తొమ్మిది విధములగు ఆనందానుభూతులు కలవు. ఇవియే నవరసానందానుభూతులు. వీని రూపమున శ్రీమాతయే యున్నది. పదార్థానుభూతి నుండి పరము వరకు గల నవరసాను భూతులను పరిణామక్రమమున జీవు డనుభవింపవచ్చును. అట్లు అనుభవించి నపుడే పరిపూర్ణుడగును. నవరసానుభూతులు పొంది రస స్వరూపుడగు భగవంతుని యందు చేరును. ఈ రస జ్ఞానమునకు శ్రీమాతయే అధి దేవత. ఆమె అనుగ్రహము లేనిదే యే అనుభూతియు లేదు. ఆమె అనుగ్రహమున్నచోట పరము వరకు సమస్త అనుభూతులు అరచేతి యందుండును.



# 800. 'రసశేవధిః'

రసనిధి శ్రీమాతయే అని అర్థము.

శేవధి అనగా అనంతమగు నిధి, అమితమగు నిధి. అనంతము, అమితము అగు రసానుభూతి నందించునది శ్రీమాతయే. శ్రీమాతయే లేనపుడు రసానుభూతి లేదు. అనుభూతి యుండుటకు అనుభూతి పొందువాడు, అనుభూతి రెండుగ నుండవలెను. పరమునందు వుండు టయే యుండునుగాని, తానుండుట యుండదు. బ్రహ్మము తానుగ యేర్పడినపుడే ఆత్మయగును. ఆత్మగ నున్నప్పుడే అనుభూతి యుండును. ఆత్మానుభూతి బ్రహ్మము స్థితి యందుండదు. పంచదారకు తీపిగ నుండు అనుభూతి యుండదు. పంచదారగ నుండును. ఇతరుల కది పంచదార కాని తనకు తాను పంచదార కాదు. అనుభూతి పొందుటకొక రుండినపుడు కదా! బ్రహ్మమును అనుభూతి చెందవచ్చును. బ్రహ్మము నకు బ్రహ్మ మనుభూతి నీయలేదు. బ్రహ్మము నుండి సంకల్పముగ యేర్పడిన శ్రీమాత బ్రహ్మానందము కలిగి యుండును. బ్రహ్మ మనంత మగుట వలన అనంతమగు అనుభూతి పొందు వంతు శ్రీమాతదే. ఆమె అందించిననే యితరులకు బ్రహ్మానంద మందును. ఆమె సంకల్పిం చనిచో యెవ్వరికినీ బ్రహ్మానందము దక్కదు. ఆమె నుండి యేర్పడిన జీవులు ఆమె ద్వారముననే అనంతమగు బ్రహ్మానుభూతిని పొందగలరు. జీవులకు తాము న్నామని తెలియుట శ్రీమాత వలననే. అట్టి ఎఱుక

లేనిచో అనుభూతి లేదుకదా! కనుక అనుభూతికి, రసానుభూతికి, అశేష రసానుభూతికి శ్రీమాతయే నిధి. ఆమెయే రసానుదేవత, రసనిధి, రసరూపిణి, రసజ్ఞ.

శ్రీలలితా సహస్రనామ మందలి

ఎనిమిదవ సంపుటము

సంపూర్ణము.



శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః ।

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రము

**ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః**

దేశకాలాపరిచ్ఛిన్నా సర్వగా సర్వమోహినీ ।
సరస్వతీ శాస్త్రమయీ గుహాంబా గుహ్యరూపిణీ ॥ 137

సర్వోపాధి వినిర్ముక్తా సదాశివ పతివ్రతా ।
సంప్రదాయేశ్వరీ సాధ్వీ గురుమండలరూపిణీ ॥ 138

కులోత్తీర్ణా భగారాధ్యా మాయా మధుమతీ మహీ ।
గణాంబా గుహ్యకారాధ్యా కోమలాంగీ గురుప్రియా ॥ 139

**స్వతంత్రా సర్వతంత్రేశీ దక్షిణామూర్తి రూపిణీ ।**
**సనకాది సమారాధ్యా శివజ్ఞానప్రదాయినీ ॥** 140

చిత్కళాఽఽనందకలికా ప్రేమరూపా ప్రియంకరీ ।
నామపారాయణప్రీతా నందివిద్యా నటేశ్వరీ ॥ 141

మిథ్యా జగదధిష్ఠానా ముక్తిదా ముక్తిరూపిణీ ।
లాస్యప్రియా లయకరీ లజ్జా రంభాదివందితా ॥ 142

భవదా వసుధా వృష్టిః పాపారణ్య దవానలా ।
దౌర్భాగ్య తూలవాతూలా జరాధ్వాంత రవిప్రభా ॥ 143

భాగ్యాబ్ధిచంద్రికా భక్తచిత్త కేకిఘనాఘనా ।
రోగపర్వత దంభోళిర్మృత్యుదారు కుఠారికా ॥ 144

మహేశ్వరీ మహాకాళీ మహాగ్రాసా మహాశనా ।
అపర్ణా చండికా చండముండాసుర నిషూదినీ ॥ 145

క్షరాక్షరాత్మికా సర్వలోకేశీ విశ్వధారిణీ ।
త్రివర్గదాత్రీ సుభగా త్ర్యంబకా త్రిగుణాత్మికా ॥ 146

స్వర్గాపవర్గదా శుద్ధా జపాపుష్ప నిభాకృతిః ।
ఓజోవతీ ద్యుతిధరా యజ్ఞరూపా ప్రియవ్రతా ॥ 147

దురారాధ్యా దురాధర్షా పాటలీ కుసుమప్రియా ।
మహతీ మేరునిలయా మందార కుసుమప్రియా ॥ 148

వీరారాధ్యా విరాడ్రూపా విరజా విశ్వతోముఖీ ।
ప్రత్యగ్రూపా పరాకాశా ప్రాణదా ప్రాణరూపిణీ ॥ 149

**మార్తాండ భైరవారాధ్యా మంత్రిణీ న్యస్తరాజ్యధూః ।**
**త్రిపురేశీ జయత్సేనా నిస్త్రైగుణ్యా పరాపరా ॥** 150

సత్యజ్ఞానానందరూపా సామరస్య పరాయణా ।
కపర్దినీ కళామాలా కామధుక్కామ రూపిణీ ॥ 151

కళానిధిః కావ్యకళా రసజ్ఞా రసశేవధిః । 152

# OTHER BOOKS THROUGH
# MASTER K. PARVATHI KUMAR

*The following books are available in: English (E), German (G), Spanish (S), French (F), Hebrew (H), Telugu (T), Hindi (HI) and Kannada (K) languages.*

| | | |
|---|---|---|
| 1. | Agni (E/G/S) | 60-00 |
| 2. | Amanaskudu (T/K) | 18-00 |
| 3. | Antardarsana Dhyanamulu (T) | 100-00 |
| 4. | Anveshakudu (T) | 60-00 |
| 5. | Asangudu (T) | 15-00 |
| 6. | Ashram Leaves (E/G/S) | 100-00 |
| 7. | Ayurvedic Principles (E) | |
| 8. | Bharateeya Sampradayamu (T/Hi) | 10-00 |
| 9. | Cow ('Govu' Mahatyam Vivarana) (E/T/K) | 20-00 |
| 10. | Devapi Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 11. | Dhanakamuni Katha (T) | 25-00 |
| 12. | Doctorine of Eternal Presence (E) | 10-00 |
| 13. | Gayatri Mantra - Avagahana (T) | 10-00 |
| 14. | Geetopanishad - Gnana Yogamu (T) | 25-00 |
| 15. | Geetopanishad - Karma Yogamu (T) | 20-00 |
| 16. | Geetopanishad - Sankhya Yogamu (T) | 25-00 |
| 17. | Geetopanishad - Karmasanyasa Yogamu (T) | 20-00 |
| 18. | Geetopanishad - Dhyana Yogamu (T) | 40-00 |

| | | |
|---|---|---|
| 19. | Good Friday (E/G/S/F/H) | 10-00 |
| 20. | Gurupaduka Sthavam (E) | |
| 21. | Health & Harmony (E) | 120-00 |
| 22. | Hercules-The Man and the Symbol (E/G/S/F) | 100-00 |
| 23. | Himalaya Guru Parampara (T/Hi) | 12-00 |
| 24. | Jupiter-The Path of Expansion (E/G/S) | 40-00 |
| 25. | Jyotirlinga Yatra (T) | 20-00 |
| 26. | Katha Deepika (T) | 40-00 |
| 27. | Listening to Invisible Master (E/G/S/F/H) | 20-00 |
| 28. | Lord Maitreya-The World Teacher (E/G/S/F/H) | |
| 29. | Maitreya Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 30. | Mana Mastaru Garu (T) | 60-00 |
| 31. | Mantrams-Their Significance and Practice (E/G/S) | 35-00 |
| 32. | Maria Magdalena (E/S/G/F) | |
| 33. | Marriage-A Sacrament (E) | |
| 34. | Maruvu Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 35. | Master C.V.V. (Birthday Message) (T) | 30-00 |
| 36. | Master C.V.V. Noothana Yogamu (T) | 20-00 |
| 37. | Master C.V.V. Yogamu (T) | 20-00 |
| 38. | Master C.V.V. Yogamu-Karma Rahityamu (T) | 10-00 |
| 39. | Master C.V.V. - May Call !(E/G/S) | 100-00 |
| 40. | Master C.V.V. - May Call ! II (E) | 100-00 |

| | | |
|---|---|---|
| 41. | Master C.V.V. The Initiator - Master E.K. The Inspiror (E) | 15-00 |
| 42. | Master C.V.V. - Saturn Regulations | 125-00 |
| 43. | Master E.K. - The New Age Teacher (E/G/S) | 70-00 |
| 44. | Mithila-A New Age Syllabus (E/G/S) | 100-00 |
| 45. | Occult Meditations (E/G/S) | 100-00 |
| 46. | Omkaram (T) | 30-00 |
| 47. | On Change (E/G/S) | 50-00 |
| 48. | On Healing (E/G/S) | 100-00 |
| 49. | On Love (E/G/S) | 50-00 |
| 50. | On Service (E/G/S) | 50-00 |
| 51. | On Silence (E/G/S) | 50-00 |
| 52. | Pranayamam (T) | 10-00 |
| 53. | Prayers (E/G/S) | 100-00 |
| 54. | Rudra (E/G/S) | 30-00 |
| 55. | Sankhya - The Sacred Doctrine (E/G/S) | 75-00 |
| 56. | Saraswathi - The Word (E/G/S) | 60-00 |
| 57. | Saturn-The Path of Systematised Growth (E/G/S) | 40-00 |
| 58. | Shodasopachara Pooja - Avagahana (T) | 10-00 |
| 59. | Sound-The Key and its Application (E/G/S) | 40-00 |
| 60. | Spiritualism - Business and Management (E/G/S) | 25-00 |
| 61. | Sri Dattatreya (E/G/S/T/Hi) | 33-00 |

| | | |
|---|---|---|
| 62. | Sri Gurupaduka Sthavam (T) | 30-00 |
| 63. | Sri Krishna Namamrutham (T) | 25-00 |
| 64. | Sri Lalitha-1 (T) | 40-00 |
| 65. | Sri Lalitha-2 (T) | 40-00 |
| 66. | Sri Lalitha-3 (T) | 40-00 |
| 67. | Sri Lalitha-4 (T) | 40-00 |
| 68. | Sri Lalitha-5 (T) | 40-00 |
| 69. | Sri Lalitha-6 (T) | 40-00 |
| 70. | Sri Lalitha-7 (T) | 40-00 |
| 71. | Sri Sastri Garu (E/G/S/F/T/H) | 40-00 |
| 72. | Sri Shiridi Sai Sayings (E/G/S/T/Hi) | 80-00 |
| 73. | Steps on Silence (E) | 75-00 |
| 74. | Suvarna Sopanamulu | |
| 75. | The Aquarian Cross (E/G/S) | 100-00 |
| 76. | The Aquarian Master (E/G/S) | 75-00 |
| 77. | The Doctorine of Ethics (E) | 35-00 |
| 78. | The Etheric Body (E/G/S) | |
| 79. | The Path of Synthesis (E) | 40-00 |
| 80. | The Splendor of Seven Hills (E/T/Hi) | 15-00 |
| 81. | The Teachigs of Lord Sanatkumara | 150-00 |
| 82. | The Theosophical Movement (E/G/S) | 60-00 |
| 83. | The White Lotus (E/G/S) | 20-00 |
| 84. | Time - The Key (E/G/S) | |

| | | |
|---|---|---|
| 85. | Uranus - The Alchemist of the Age | 150-00 |
| 86. | Venus - The Path of Immortality (E/G/S) | 80-00 |
| 87. | Violet Flame Invocation (E/G) | 60-00 |
| 88. | Vrutrasura Rahasyam (T) | 35-00 |
| 89. | Varunagraha Prabhavamu (T) | 22-00 |
| 90. | Wisdom Buds (E/S) | 20-00 |
| 91. | Wisdom Teachings of Vidura (E/G/S) | 80-00 |
| 92. | Moon & Spiritual Astrology (S) | |
| 93. | The Death & Reincarnation (S) | |
| 94. | Commentary on Om Namonarayanaya (S) | |
| 95. | Master Jesus, Life and Teachings (S) | |
| 96. | The Science of Ayurveda & Homoeopathy (S) | |
| 97. | The Teachings of Master D.K. (S) | |
| 98. | The Human Constitution (S) | |
| 99. | The Masters of Wisdom (S) | |
| 100. | The Path of Meditation (S) | |
| 101. | Stories for Disciples (S) | |
| 102. | Spirituality in Daily Life (S) | |
| 103. | Special Practices for Disciples (S) | |
| 104. | Fundamentals of Health & Healing (S) | |
| 105. | Ganesha, The Cosmic Lord of Groupings (S) | |
| 106. | Astrology and Healing (S) | |

# DHANISHTA OTHER PUBLICATIONS

| | | |
|---|---|---|
| 1. | Puranapurushuni Pooja Vidhanam (T) | 10-00 |
| 2. | Sarannavaratra Pooja Vidhanamu (T) | 30-00 |
| 3. | Sri Dattatreya Pooja Vidhanamu (T) | 10-00 |
| 4. | Sri Hanuman Chalisa (T) | 15-00 |
| 5. | Sri Mahalakshmi Pooja Vidhanamu (T) | 12-00 |
| 6. | Sri Rama Pooja Vidhanamu (T) | 10-00 |
| 7. | Sri Siva Hridayamu (T) | 5-00 |
| 8. | Sri Siva Pooja (T) | 15-00 |
| 9. | Sri Soukumarya Satakam (T) | 10-00 |
| 10. | Sri Surya Pooja Vidhanamu (T) | 7-00 |
| 11. | Sri Venkateswara Pooja Vidhanamu (T) | 8-00 |
| 12. | Vinayaka Vratakalpamu (T) | 25-00 |
| 13. | Vishnu Sahasranamam (T) | 12-00 |
| 14. | Sri Rama Charitramu (T) | |
| 15. | Sri Subrahmanya Pooja Vidhanamu (T) | 10-00 |
| 16. | Sri Yoga Ganapathi Pooja Vidhanamu (T) | 12-00 |
| 17. | Sri Lalitha Sahasranama Sthotram (T) | 10-00 |



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**"ధనిష్ఠ"** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువ లేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు "ధనిష్ఠ" 1992లో జన్మించినది.

**"ధనిష్ఠ"** మాస్టర్ పార్వతీకుమార్‌గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపములోను, పుస్తకముల రూపము లోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**"ధనిష్ఠ"** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును సద్గోష్ఠికై వలసిన వాతావరణమును - "జగద్గురు మందిరము"గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

## సంకలనకర్త : మాస్టర్ పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయి లకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ పార్వతీకుమార్**గారు. వారి బోధనలు లెక్కకుమించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియవచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసరణీయమై, ఆచరణ యోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించు చున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళారంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో – మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, *"మానవ సేవయే మాధవ సేవ"* అను మాటకు

సరియైన అర్థము యిదేనని మాస్టరుగారు తమ ప్రవర్తన ద్వారా తెలియ పరచుచున్నారు. మాస్టర్ పార్వతీకుమార్‌గారు బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక – మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, శతాధిక గ్రంథముల సంకలన కర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొనుచుండు ననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు మాస్టరుగారి దృఢ విశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశ విదేశములలో పరహితసేవ గావించుచున్నవి. "పరహితము పరమధర్మ" మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవద్ధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

**"శ్రీ**లలిత" అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతిమాసము 'నావాణి' దర్శన మాస పత్రికయందు ప్రచురింపబడుచున్నవి. పాఠకుల కోరికపై అమ్మవారి "సహస్ర" నామములను "శత" నామములు ఒక భాగముగ ప్రచురించుటకు సంకల్పించితిమి. ఇప్పటికి 800ల నామము లను 8 భాగములుగ ధనిష్ఠ ప్రచురించినది. ప్రస్తుతము 801 నుండి 900 వరకు 9వ భాగముగ అందించుచున్నాము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీర మగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారినుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారియందు, వారి భాషణయందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహపరములకు పరిష్కార మని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

**– ధనిష్ఠ**

# పరిచయము

**ల**లితాదేవి, శ్రీదేవి, దుర్గ, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమెయే మూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్త స్థితియందు సత్యముగను, వ్యక్త స్థితియందు మహాచైతన్యముగను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు, సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితి గొనుటకు వినియోగ పడును. అందులకే పారాయణము.

అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వ్యాఖ్యానము. సామాన్యులకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

- పార్వతీకుమార్

# విషయసూచిక

# శ్రీ లలిత



ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

# 801. 'పుష్టా'

బ్రహ్మము యొక్క తత్త్వముతో కూడినది గాన 'పుష్టా' అని శ్రీమాత పిలువబడుచున్నది.

బ్రహ్మము అనిర్వచనీయము. శూన్యము వలె గోచరించునది. అట్టి తత్త్వమునుండి, సంకల్పమునుండి ఉద్భవించి శూన్యమువలె గోచరించు తత్త్వమునుండి కాలమును, ప్రకృతిని, మాయను, మహత్తును, అటుపైన గుణములను, భూతములను గొనివచ్చి పూర్ణమగు సృష్టిగ యేర్పడునదిగాన శ్రీమాతయే పుష్ట. లోకములకు గాని, లోకేశ్వరులకు గాని, లోకులకు గాని, పుష్టి నిచ్చున దామెయే. ఎచ్చట పుష్కలత్వము, పుష్టి యుండునో అచ్చట వైభవ ముండును. పుష్టి, తుష్టి, వైభవము, అందము, వెలుగు, ఆనందానుభూతి యిత్యాది వన్నియూ పుష్టి లక్షణములే. శ్రీమాత పూర్ణము, బ్రహ్మము, శూన్యము. శూన్యమునుండి పూర్ణముగ సృష్టి నేర్పరచు నిపుణత శ్రీమాతదే. ఏమీ లేనట్లు గోచరించు ఆకాశమునుండి అన్నియూ సృష్టింపబడుట, పోషింపబడుట, పూర్ణమై నిలచియుండుట శ్రీమాత నిర్వహించు రసాయనము. బీజమునుండి మహావృక్షము యేర్పడినట్లు, శూన్యమునుండి పరిపుష్టమగు సృష్టి నేర్పరచుట శ్రీవిద్య. అమావాస్య నుండి పూర్ణిమ వరకు ఎట్లు చంద్ర కళలు వృద్ధి చెందునో అట్లు శూన్యము నుండి పూర్ణము నేర్పరచుట, పూర్ణముగ నిలచుట శ్రీమాత నిర్వహించు కార్యము.

ఋషులు, మహాత్ములు, సిద్ధులు శ్రీమాత అనుగ్రహముననే మహత్కార్యములను నిర్వహించు చుందురు. పరమగు బ్రహ్మము నుండి ఇహమగు సృష్టికి సమస్త సంపదలతో కూడిన సృష్టి నేర్పరచుట శ్రీమాత అనుగ్రహము వలననే యేర్పడును. కనుకనే శ్రీమాత అనుగ్రహము కలవాడే కలవాడు. ఆమె అనుగ్రహము లేనివాడు లేనివాడే. సంపద లున్ననూ మానసిక దరిద్రము ననుభవించువా రెందరో కలరు. అన్నియూ వున్ననూ అనుభవింపగలవా రెందరు గలరు? ఉన్నది అనుభవింప లేకపోవుట, ఆనందింపలేకపోవుట శ్రీమాత అనుగ్రహము లేకపోవు టయే. తృప్తి, తుష్టి, పుష్టి శ్రీమాత సాన్నిధ్యమున కలుగును గాని, వస్తు కనక వాహనాది సంపదలతో కలుగదు. ఉన్నత పదవులతో కలుగదు. పుష్టి కలవాడే నిజమగు ధనవంతుడు.

ఋషుల మార్గమున, జీవన విధానమున తుష్టి, పుష్టిలను చూడవచ్చును. అన్నము పెట్టుట, వస్త్రముల నిచ్చుట, విద్యలను నేర్పుట, యోగము నభ్యసింపచేయుట, గ్రంథములను రచించుట, వైద్యము చేయుట, బోధనలను యిచ్చుట, అందరిని ఆదరించుట వారి జీవితముల గోచరించును. దేనిని అమ్ముకొనుట యుండదు. అన్నము నమ్ముకొనుట, విద్య నమ్ముకొనుట ఆధునిక యుగమున గోచరించును. ఎచ్చట అమ్ము కొనుట యుండునో అచ్చట పుష్టి యుండదు. అమ్మను నమ్మినవాడు దేనినీ అమ్ముకొనడు. అన్నింటినీ అమ్మ అనుగ్రహముగ పంచును. రాజువలె జీవించునే గాని జీవితమున మానసిక దారిద్ర్య ముండదు.

శ్రీమాత అన్నియునూ బ్రహ్మమునుండి ఉదారముగ, ఉచితముగ అందించినది. ఈ సత్యమెరిగిన శ్రీమాత భక్తుడు అందరికిని అన్నింటినీ అందించునేగాని అమ్ముకొనడు. మహర్షులు చక్రవర్తులకు కూడ అపారమగు ధనము నందించిరే గాని ఇతరుల ఆశ్రయమున జీవించిన వారు కారు. అగ్రహారములను పొందినవారు కారు. ఇటీవలి కాలమున విద్యారణ్య మహర్షి విజయనగర సామ్రాజ్య స్థాపనకై యిట్టి మహాత్మ్య మును చూపినాడు. ధన మనగా శ్రీమాత సాన్నిధ్యమే గాని యితరము కాదు.



# 802. 'పురాతనా'

సనాతనముగ యున్నది గాన 'పురాతనా' అని శ్రీమాతను సంబోధింతురు.

ఎప్పుడునూ లేకుండుట లేనపుడు పురాతన మందురు. సృష్టి యున్నప్పుడూ లేనప్పుడూ కూడ శ్రీమాత యున్నది. ఆమె యుండుట వలననే సృష్టి యేర్పడుచున్నది. ఆమెలోనికే సృష్టి లయమగు చున్నది. ఆమె నుండియే జీవులు కూడ సృష్టి ప్రవేశము చేయుట, సృష్టినుండి ఆమెలోనికి నిష్క్రమించుట జరుగుచున్నది. ఆమె సంతతి కనుకయే జీవులు కూడ సనాతనులు. ఆమె అనుగ్రహముననే జీవులు తాము కూడ సనాతనుల మని తెలియుదురు. జీవులు నిజమునకు పుట్టరు, చావరు. పుట్టితిరని, చచ్చితిరని భావించుట అజ్ఞానము. ఇట్టి అజ్ఞానము నుండి రక్షించునది కూడ శ్రీమాతయే. పుట్టుటయు చచ్చుటయూ లేదని బోధించినంత మాత్రమున తెలియదు. ఎందరెన్ని రకములుగ బోధించి ననూ తెలియుట సాధ్యముకాదు. అమ్మ అనుగ్రహముననే అది సాధ్యమగును. తెలిసినవాడు తెలుపుట కూడ అమ్మ అనుగ్రహముననే జరుగును. తాను తెలిపితినని, తెలిసినవాడు అనుకొనిననూ నిజమునకు తెలియుట మాత్రము అమ్మ అనుగ్రహముననే జరుగును. సద్గురువులు తెలిసినవారు. వారు వందలాది శిష్యులకు తెలియపరతురు. కాని శిష్యులందరికినీ తెలియుట జరుగదు. ఏ ఒక్కనికో తెలియును. ఆ

తెలియుట వానియందు అమ్మ చూపిన అనుగ్రహమే కాని సద్గురువు కారణము కాదు. తెలుసుకొనిన శిష్యుడు కృతజ్ఞతా భావముతో సద్గురువు ద్వారా తెలిసినదని తెలియును కనుక సద్గురువు యందు కృతజ్ఞతా భావము కలిగి యుండును. సద్గురువు మాత్రము తాను తెలిపితినని భావించుటకు వీలులేదు. సద్గురువు కనుక అట్టి భావన కలిగి యుండడు. అహంకారి అయినచో సద్గురువు కానేరడు కదా! తానే తెలుపువాడగుచో తాను తెలిపినవా రందరికినీ తెలియవలెను కదా! ఇట్లు పురాతనమైన అమ్మ అనుగ్రహము వలననే జీవులు తాము పురాతనుల మని తెలియుదురు. జీవులు పురాతనులని వారికి తెలియజేయుటకే పురాతన యగు శ్రీమాత మరల మరల సృష్టి నిర్వహణము చేయుచున్నది.



# 803. 'పూజ్యా'

పూజింపబడునది శ్రీమాత అని అర్థము.

పూజలన్నియూ శ్రీమాతకే. ఆమెయే పరమ పూజ్యురాలు. బ్రహ్మమును పూజించుట వుండదు. బ్రహ్మము శ్రీ రూపముగా వ్యక్త మైనపుడే పూజలందుకొనుట యుండును. అందుకొని అనుగ్రహించుట యుండును. శ్రీమాత మహా చైతన్యరూపము. చైతన్య మున్నప్పుడే వినుట, కనుట, అనుగ్రహించుట, ప్రతిస్పందించుట యుండును. శివుని పూజించిననూ అనుగ్రహించునది శివాని యగు శ్రీమాతయే. ఉండుటగా బ్రహ్మముండును. అందు సమస్త ముండును గాని చేతనము కూడ వ్యక్తమై యుండదు. వ్యక్తమైనప్పుడే ఎఱుక యుండును. నిదురించు వానిని ప్రశంసించిన ఉపయోగమేమి? అతను మేల్కొనినపుడే ప్రశంసలు వినుట, ప్రతిస్పందించుట యుండును. కనుక బ్రహ్మము శ్రీగా మేలుకొని నపుడే, జీవుల కున్ముఖమై యుండును. బ్రహ్మాది దేవతలు కూడ బ్రహ్మము నుండి ఉద్భవించిన శ్రీమాతనే పూజింతురు. కనుక శ్రీమాత ప్రథమపూజ్య.

ఆమెను పూజించి ఆమె అనుగ్రహమును సాన్నిధ్యముగ పొందిన సనక సనందనాదులు, సప్తఋషులు, త్రిమూర్తులు కూడ పూజ్య స్థానమును అలంకరింతురు. శ్రీమాత సాన్నిధ్యము ప్రస్ఫుటముగ నున్న ప్రతి వస్తువు, ప్రతి జీవుడు పూజనీయు లగుదురు. ఎచ్చట ఆమె

సాన్నిధ్యముండునో అచ్చట మహిమ యుండును. జీవులకు స్ఫూర్తి నిచ్చును. పూజకు ప్రేరణ నిచ్చును. కొన్ని కొన్ని నదులు, పర్వతములు, వృక్షములు, జంతువులు, రాళ్ళు, లోహములు, మానవులు, దేవతలు పూజింపబడుటకు కారణము వానియందు శ్రీమాత సాన్నిధ్యమే. సాన్నిధ్య మెంత ప్రస్ఫుటముగ నున్న అంత పూజ్యభావము కలుగుచు నుండును.

దుష్టులు, దురహంకారులు, దుష్ప్రవర్తను లగువారు కూడ ఒకానొక సందర్భమున నమస్కరించుట, వినయము చూపుట యుండును. పురాణ పురుషుడగు శ్రీకృష్ణుడు కౌరవ సభాప్రవేశము చేయు సందర్భమున దుష్టుడగు దుర్యోధనుడు సభనుద్దేశించి, కృష్ణునికి ఎవ్వరునూ నమస్కరింపరాదని, కనీసము లేచి నిలబడరాదని శాసించెను. శ్రీకృష్ణుడు సభా ప్రవేశము గావించి, అందరినీ పరికించి, దుర్యోధనుని చూచి పలుకరింపుగ చిరునవ్వు నవ్వెను. అమాంతము దుర్యోధనుడు లేచి నిలబడి నమస్కరించెను. దానితో సభాసదు లందరునూ ఒక్కమారుగ లేచి నమస్కరించిరి. గ్రుడ్డిరాజగు ధృతరాష్ట్రుడు కూడ నిలబడి నమస్కరించెను. శ్రీకృష్ణుడు శ్రీలలితయే. సర్వచేత నాత్మకుడు. అతని చూపుతో దుర్యోధనుడు, సాన్నిధ్యముతో సభికులు చేతనా ప్రచోదనము చెంది లేచి నిలబడి నమస్కరించిరి. అట్లే అతని జీవితమున వృక్షములు, గోవులు, నదులు అతనియందు పూజ్యభావము వహించినవి. శ్రీరాముని చూచిన రావణునికి కూడ అప్రయత్నముగ లోనుండి పూజ్యభావము కలిగి వివశుడై నిర్వీర్యుడైనాడు. రామ కృష్ణాదుల యందు శ్రీమాత సాన్నిధ్యము పదహారు కళలతో నుండుటయే

కారణము. రాముని చూచిన మహర్షులు, బ్రహ్మర్షులు గోపికలై విరహ భావనను పొందిరి. అమ్మయే పూజనీయురాలు. ఆమె ఎవరియందు తొణికిసలాడునో వారందరునూ పూజనీయులే. సృష్టిలోని సమస్త పూజలు అమ్మకే చెందును. ఆమెయే పూజ్య *"సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"* అనుటలో కూడ ఈ సత్యమే తెలుపబడినది. శ్రీమహావిష్ణు వనినను, శ్రీ లలిత అనిననూ ఒక్కటియే. వారే యజ్ఞ రూపులు, విరాట్ రూపులు.



# 804. 'పుష్కరా'

పుష్కర మనగా పోషించునది అని అర్థము. శ్రీమాత సమస్తమును పోషించునదిగాన 'పుష్కరా' అని ప్రశంసింపబడుచున్నది.

ఎవరిని ఎవరు పోషించు చున్ననూ పోషించునది శ్రీమాతయే. పుష్కరముగ పోషించును కనుక పుష్కరా అని శ్రీమాతను పిలుతురు.

ఎచ్చట పుష్కలత్వము గోచరించిననూ అది పుష్కరమని తెలియ వలెను. పుష్కలముగ కమలములున్న కోనేరును పుష్కరమందురు. ఆకాశము కూడ పుష్కరమే. అంతులేని వెలుగుతో నిండియున్నది. గాన ఆకాశమును పుష్కర మందురు. భూమిని కూడ పుష్కరమందురు. భూమియందు కోటానుకోట్ల జీవులు వృద్ధి చెందుచు నుందురు. అద్భుతమగు పర్వతములతోను, నదులతోను, వనములతోను జీవకోట్ల తోను పుష్కలముగ నున్నది భూమి. సర్వ సంపదలూ భూమిపై లభించును. దేవతలు కూడ భూమిని దర్శించుటకు, భూమిపై విహరించుటకు ఇచ్చగింతురు. అట్టి భూమి శ్రీమాత పుష్కర రూపము.

క్షీరమును కూడ పుష్కర మందురు. పాలు సమగ్రమగు పోషణము నిచ్చును. కనుక పుష్కరమైనది. జంతువులు, మానవులు ప్రప్రథమముగ పాలతోనే పోషింపబడుదురు. పాలు పోషణ మిచ్చు టయే గాక దేహ కోశములను కూడ శుభ్రపరచును. ఆహారములలో పాలు ఉత్తమ స్థానమున నున్నవి. ఇట్టి క్షీరము రూపమున నున్నది

శ్రీమాతయే. పాలు, పెరుగు, వెన్న, నెయ్యి శిష్టాచారులకు ప్రధానమగు ఆహారము. పాలతో కలిపిన అన్నము, పెరుగుతో కలిపిన అన్నము, వెన్న, నేతి అన్నము శ్రీమాతకు ప్రియమగు ఆహారములు. వీనిని నైవేద్యముగ పెట్టినచో శ్రీమాత ప్రసన్నమగును.

పుష్కలముగ పాలనిచ్చు గోవులను కూడ పుష్కరము లందురు. వరి, గోధుమ యిత్యాది ఓషధులు కూడ పుష్కరములే. కోరికలను తీర్చు పుణ్య క్షేత్రములు, తీర్థములు పుష్కరములు. విస్తృతముగ పెరిగి నీడ నిచ్చు మఱ్ఱిచెట్టు కూడ పుష్కరమే. సద్గురువుల ఆశ్రమములు, అన్నదాన సత్రములు, దానధర్మములు జరుగు ప్రదేశములు కూడ పుష్కరములే. వీటి రూపమున నున్నది శ్రీమాతయే.

కమలములు, తామరపువ్వులు, నీలి కమలములు, భూమి చుట్టునూ గల ఏడవ పొర పుష్కరములు. భూమి ఏడవ పొరను పుష్కర ద్వీపమందురు. దానియందు భూమిని పరిపాలించు సనత్కు మారు డున్నాడు. అతనిని కూడ పుష్కరమని పిలుతురు. మహాభారతమున పుష్కరక్షేత్రము పరమ పావనమగు క్షేత్రముగ వర్ణింపబడినది. పుష్కర ద్వీపమును శ్వేతద్వీపమని కూడ అందురు.



# 805. 'పుష్కరేక్షణా'

**తా**మరుల వంటి కన్నులు కలది శ్రీమాత అని అర్థము.

తామర విశాలముగ నుండును. విశాలముగ కన్ను లుండుట అనగా విస్తారముగ చూడగలుగుట. స్థూల, సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ లోకముల నన్నింటిని చూడగలిగినది శ్రీమాత. కన్ను లుండియు చూడలేనివా రెందరో గలరు. స్థూలముగ కనపడు వానిని కూడ చూడలేనివారు కలరు. చైతన్య అవస్థను బట్టి చూచుట యుండును. పూర్ణమగు చేతనము గలవారు సమస్తమునూ క్షణములో చూడగలరు. చూడగలుగుట వలన కన్నులను పెద్ద కన్నులని కీర్తింతురు. అట్టి వారి కన్నులయందు కాంతి యుండును. ఆకర్షణ యుండును. లోతు యుండును. ఆ కన్నులందముగ నుండును. విశాలముగ నుండును. అమ్మ కన్నులను వర్ణించుట కలవి కాదు. సాక్షీభూతముగ సమస్తమునూ శ్రీమాత దర్శించుచుండును. జీవుల ప్రవర్తనలను లోనుండి, వెలుపల నుండి కూడ గమనించుచూ వారి వారి ప్రవర్తనల ననుసరించి కర్మఫలముల ననుభవింప చేయును. జీవుల కన్నుల నుండి కూడ సర్వమునూ దర్శించు చుండును.

ఆమె కన్నులు ఎల్లప్పుడును తెరచియే యుండును. సూర్య చంద్రు లామె కన్నులే. అహర్నిశలు అప్రమత్తతతో విచ్చిన కన్నులు కలదియై సృష్టి సమస్తమును పర్యవేక్షించు చుండును.

'పుష్కరేక్షణా' అనగా నీటియందు చూపుగలది. పుష్కరమనగా నీరు. నీటియందు కూడ చూచుట శ్రీమాత తత్త్వము. నీటియందు అనేకానేక జలరాశు లున్నవి. వాటిని పరిరక్షించుటకు నీటియందు కూడ చూపు నిలిపి యుండును. దేవతలను, మానవులను, రాక్షసులను పర్యవేక్షించు చుండును.

పుష్కరమనగా భూమి యని కూడ అర్థము. భూమిని, గ్రహ గోళములను, సృష్టిగోళములను తన చూపులతో కాపాడు చుండును.



# 806. 'పరంజ్యోతి'

**ఉ**త్కృష్టమైన జ్యోతి స్వరూపిణి శ్రీమాత అని అర్థము.

సృష్టి ప్రకాశమే పరంజ్యోతి. జ్యోతి అనగా కేవల జ్వాలా స్వరూపమగు జ్యోతికాదు. దీపపు వెలుగు రూపము కాదు. రూపము లేని వెలుగు శ్రీమాత. ఏమీ లేనట్లు గోచరించు పరతత్త్వము నుండి వ్యక్తమగు ప్రథమ ప్రకాశము. ఆదిత్యులకు గాని, సూర్యులకు గాని, చంద్రులకు గాని, నక్షత్రములకు గాని, అగ్నులకు కాని, విద్యుత్తునకు గాని మూలమగు వెలుగు. ఆ వెలుగే అన్నింటినీ వెలిగించును. కంటిపాప వెలుగునుండి పరము వరకు ఆ వెలుగే వ్యాపించును. ఈ వెలుగు లేక ఏదియూ వెలుగదు. దేవతలకు గోచరించు వెలుగు కూడ శ్రీమాతయే. వెలుగులకు మూలమగు వెలుగు శ్రీమాత.

వాక్కు కూడ శ్రీమాత వెలుగే. వాక్కు ద్వారా ప్రకాశము కలిగింప వచ్చును. ప్రచోదనము కలిగింపవచ్చును. ప్రచోదనము కలిగించు వెలుగు కూడ శ్రీమాతయే. ఆత్మలుగ జీవులయందు గల వెలుగు ఈ పరంజ్యోతి. జీవుల అవగాహనకు కూడ కారణ మీ వెలుగే. బుద్ధి రూపమున, చిత్తము రూపమున వెలుగొందుచు నుండును. ఏడు లోకము లందు శ్రీమాత వెలుగాధారముగనే లోక లక్షణము లేర్పడుచున్నవి. సత్త్వముగను, రజస్సుగను, తమస్సుగను వెలుగొందునది కూడ ఈ పరమగు వెలుగే.

దీనిని దర్శించుట, ధ్యానించుట, సమీపించుట ఆ వెలుగు తామే అని తెలియుట కొరకే. *"ఓం సత్యం పరం ధీమహి"* అని ఋషులు అష్టాక్షరిగా గాయత్రిని రూపించినారు, నిరూపించినారు కూడ. ఈ పరంజ్యోతియే సత్యము. దానిని అన్నిటా, అంతటా దర్శించుటే నిజమగు ఆరాధనము. కేవలము నామములకు, రూపములకు శ్రీమాతను పరిమితము చేయుట అవివేకము. నామములు రూపములు శ్రీమాతను దర్శించుటకు వాహికలని తెలియవలెను. కన్నులు చూచుట మాత్రమే కాక కన్నులలోని వెలుగును చూచుట ఆరాధన మగును. అట్లే మాటలు వినుట గాక మాటల యందలి ప్రకాశము వినుట ఆరాధన. అట్లే రుచి కేవలము జిహ్వకే పరిమితము చేయక రుచివలన జీవునికి కలుగు ఆనంద ప్రకాశము దర్శించుట ఆరాధనము. అట్లే స్పర్శ, వాసనల ద్వారా కూడ శ్రీమాత నెఱుగవచ్చును.

సత్పురుషులిట్లు సర్వము నందును శ్రీమాతను దర్శించుచూ అనుయాయులకు సర్వేంద్రియముల ద్వారా, వాక్కు ద్వారా, చేష్టల ద్వారా, శ్రీమాత స్పర్శ నందింతురు. పరంజ్యోతియైననూ ఇహము వరకూ వ్యాపించి దారుల నేర్పరచినది శ్రీమాత.



# 807. 'పరంధామ'

పరమే తన నివాసముగా గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత నిజస్థానము పరము. అచ్చట నుండి అన్నిటా అంతటా వ్యాపించును. అన్ని లోకములందు, అన్ని జీవులయందు వ్యాప్తి చెంది యుండునే గాని తన నిజస్థానము మాత్రము పరమే. ఆమె పురోగమనమే సృష్టి. తిరోధానమే లయము. ఆమె వ్యాప్తియే స్థితి. వ్యాప్తి యున్నంత కాలమే స్థితి యుండును. జీవులు పుట్టుట, పెరుగుట మరల కృశించుట కూడ నిజమున కామె వ్యాపనమే. తాను పెరిగితినని, వృద్ధి చెందితినని జీవుడు భావించును. ఎవరేయే రంగములు పురోగమించిననూ, వారి యందామె పురోగమనమే వారి పురోగమనముగ గోచరించును. ఎంత కండలు పెంచిననూ, పెంచితి ననుకొనిననూ వృద్ధాప్యమున అవి హరింపబడును కదా! నేను విద్య నభ్యసించితిని, నేను వృద్ధి చెందితిని, సాధించితిని అని జీవులు భ్రమ పడుదురు. ఆమె సాన్నిధ్యము పెరిగిన కొలది పెరుగుట యుండును. ఆమె సాన్నిధ్యము తరిగినకొలది తరుగుట యుండును. విద్యావంతులు, ధనవంతులు, శక్తివంతులు దీని నెరుగరు. ఈ సత్యము నెరిగినవారే నిజమగు శ్రీమంతులు.

శ్రీమాత త్రివిధములుగ ఎచ్చటెచ్చట వ్యాప్తి చెందునో అచ్చ టచ్చట వైభవము గోచరించును. శ్రీమాత భక్తులీ సత్యమెరిగి ఆమె సాన్నిధ్యమునకై తపింతురుగాని శక్తి కొరకు, ధనము కొరకు, విద్య

కొరకు తపింపరు. ఆమె సాన్నిధ్యము అనుగ్రహముగ పొంది క్రమముగ పరంధామమును కూడ చేరుదురు. అట్టివారినే నిజముగ పరంధామయ్య లని పిలువవచ్చును. బ్రహ్మర్షులు, సనక సనందనాదులు, బ్రహ్మవిదులు అట్టివారు. పరంధామమే జీవులకు శాశ్వత నిలయము.



# 808. 'పరమాణు'

అణువుల యందు పరముగ యున్నది శ్రీమాత అని అర్థము.

మహత్తుగ వ్యాపించిన శ్రీమాత అణువునందు పరమాణువై వ్యాపించి యుండును. అణువును శోధించుటలో ప్రస్తుతము శాస్త్రజ్ఞులు నిమగ్నులై యున్నారు. ఎంత శోధించిననూ యింకనూ శోధించు విషయము మిగులుచునే యున్నది. అణువునందలి విశేషమును తెలుసు కొనుచూ శాస్త్రజ్ఞులు విభ్రాంతు లగుచున్నారు. ఆధునిక యుగమున అత్యద్భుతమగు శాస్త్రపరిణామము సాగుచున్నది. భౌతికమగు అణువు నుండి సూక్ష్మము, సూక్ష్మతరము, సూక్ష్మతమము అగు విషయముల లోనికి శాస్త్రజ్ఞులు చొచ్చుకొని పోవుచున్నారు. బ్రహ్మాండమంతయూ బాహ్యముగ శోధించుట ఒక యెత్తు. అణువునందు శోధించుట మరియొక యెత్తు. అణువు నుండి బ్రహ్మాండ దర్శనము క్రమముగ శాస్త్రజ్ఞులకు గోచరించు అవకాశ మేర్పడుచున్నది. శోధించినకొలది నూతనమగు విషయములు గోచరించుచునే యుండును. బ్రహ్మాండము తెలియువరకు పరిశోధన సాగుచునే యుండును.

ఋషులు అణువునందు కూడ బ్రహ్మాండము నిండియున్నదని తపస్సు ద్వారా తెలిసికొనిరి. అణువునందు పరమాణువుగ శ్రీమాత యుండుటచే అణుశోధన ద్వారా ప్రస్తుతము శాస్త్రజ్ఞులు అమితమగు శక్తిని గమనించుచున్నారు. అణుశక్తి తెలిసినకొలది జ్ఞానము కూడ

పెరుగుచున్నది. వినియోగము మాత్రము సంస్కారమును బట్టి నుండ గలదు. అణుశక్తి ఎంత వినియోగకరమో, ఉపయోగకరమో, అంత విధ్వంసకరము కూడ. మహర్షులు తమలోనికి చొచ్చుకొనిపోయి ఆత్మ దర్శనమున బ్రహ్మాండమును తెలిసిరి. విశ్వాత్మను తెలిసిరి. పరమాత్మను తెలిసిరి. పరమాత్మయే పరమాణువని కూడ తెలిసిరి. తత్కారణముగ పరమ వినయవంతులైరి.

శ్రీమాత పరమాణు తత్త్వము తెలియుట యనగా సృష్టి సత్యమును తెలియుటయే. శ్రీమాత నెరిగినవారు మహత్తు, అణువు రెంటి యందు అమ్మ అస్థిత్వమును దర్శించి పరమానందభరితులై ఆమె నిపుణతను కొనియాడుచు శాశ్వతులై జీవించుచున్నారు.



# 809. 'పరాత్పరా'

పరమునకు పరము శ్రీమాత అని అర్థము.

భౌతిక ప్రపంచమునకు ఆకాశము పరము. ఆకాశమునకు మహత్తు పరము. మహత్తునకు మహత్తు పుట్టిన చోటు పరము. చోటే సమస్తమునకు పరము. చోటు నుండి ఎన్ని సృష్టులైననూ పుట్టవచ్చును. చోటునే బ్రహ్మము అని కూడ అందురు. చోటులో అన్నీ యిమిడి పోవును. ప్రకృతి, కాలము, సంకల్పము, మాయ యిత్యాదివి కూడ అందుండియే జనించును. చోటు నెవ్వరూ ఎరుగలేరు. అన్నిటికిని మూలమని తెలిసి దాని నెరుగువారు కూడ దానియం దిమిడి పోవుదురని తెలిసి, దానిని తెలుసుకొనుట వీలుపడదని తెలుసుకొనిరి. నీటియందు విద్యుత్తు వున్నదని తెలిసి విద్యుత్తును సాధించి శాస్త్రజ్ఞులు ఎన్నియో ఉపయోగకరమగు విషయముల నేర్పరిచిరి. నీటియందు విద్యుత్తు ఎట్లున్నది? అంతర్హితమై యున్నది. అట్లెందుకున్నదో ఎవరికిని తెలియదు. అది ప్రవాహముగ నున్నదని, శక్తిగ వినియోగపడునని తెలియును. ఎందుకున్నదో తెలియదు. అట్లే మన మున్నాము. ఉన్నాము గనుక చాల చేయుచున్నాము. ఉండుట ఆధారముగ ప్రజ్ఞ, శక్తి కలిగి యున్నాము. మన ముండుట అనగా ఏమి? ఎట్లు మనము ఉండుట జరిగినది? వున్నామని తెలియునుగాని, ఎట్లు వున్నామో తెలియదు. ఉండుట సత్యమని తెలుసు. ఉండుట ఎట్లు జరిగినదో

తెలియదు. ఉండుట వలన మేల్కొనుచున్నాము. లేనిచో మేల్కొనలేము కదా? మేల్కొనక ముందు మన మెట్లున్నాము? వున్నాము కనుకనే మేల్కొనుట జరుగుచున్నది. మేల్కొనిన తరువాత వున్నామని తెలియు చున్నది. ఈ తెలివి అంతకు పూర్వ మెక్కడ వున్నది? తెలివి పుట్టక ముందు కూడ వున్నాము. ఉండుట శాశ్వతము. అందుండి మేల్కొనుట, అటుపైన నే నున్నానని తెలియుట తెలివి వలన తెలుసుకొనుట జరుగు చున్నది. తెలిసికొనిన విషయములలో చిక్కుపడుట, మరల చిక్కుల నుండి విడిపించుకొనుట తీరుబడి లేక జరుగుచు నున్నది. కొందరు పదార్థములో చిక్కుపడుదురు. కొందరు కోరికలలో చిక్కుపడుదురు. కొందరు భావములలో చిక్కుపడుదురు. కొందరు సిద్ధాంతములలో చిక్కుపడుదురు. కొందరు విద్యలలో చిక్కుపడుదురు. కొందరు జ్ఞానములో చిక్కుపడుదురు. విద్యలలోను, శాస్త్రములలోను, జ్ఞానములోను చిక్కు పడినవారు కోరికలతో పదార్థములో చిక్కుపడిన వారిని చూచి జాలి పడుదురు. కాని వారు కూడ చిక్కు పడినవారే. ఇనుప పంజరములో చిక్కుపడిననూ, బంగారు పంజరములో చిక్కు పడిననూ, రెంటియందూ చిక్కుపడుట సమానము. నేను అను అహంకార భావము వలన చిక్కు తప్పదు. నే నున్నాను అను భావమే సమస్త చిక్కులకు కారణము. నిజమునకు చోటు యందేర్పడిన కోటానుకోట్ల బుడగలే సృష్టులు. సృష్టియందేర్పడిన కోటానుకోట్ల బుడగలే జీవులు. బుడగ ఎంత శాశ్వతమో నేను అంత శాశ్వతము. బుడగ పుట్టినచోటు నిజముగ శాశ్వతము. పరాత్పర స్థితి అవగాహన అయినవారు పరమహంసలై

జగన్నాటకమును వీక్షించుచూ అమ్మ వైభవమునకు ఆనందింతురు. అమ్మ అనగా చోటే. చోటునే తత్ అని, పరబ్రహ్మమని, పరమాత్మయని అనేక నామము లేర్పరచుకొని అందులో చిక్కుపడి వాదులాడుకొను వేదాంతులు, సిద్ధాంతులు, మతవాదులు సామాన్య జీవులకన్న గొప్ప వారేమీ కాదు. అందరూ మాయ యందున్నవారే. మాయను దాటి చోటు నందుండుట మోక్షము. అది కూడ ఒక నామమే. మోక్షమను పదమునందు భ్రమపడి ఆశించుచూ చనిపోవుదురు.



# 810. 'పాశహస్తా'

**పా**శము హస్తమున ధరించునది శ్రీమాత అని అర్థము.

ఎడమ భాగమున క్రింది చేతియందు శ్రీమాత పాశమును ధరించును. కోరికయే పాశము. కోరుట పరిపూర్ణము చెందని జీవులకు సహజము. పరిపూర్ణతకై ప్రయత్నించుటకు కోరుట అవసరము. కోరిక సిద్ధించినపుడు అపరిపూర్ణత తగ్గును. కోరికలను కోరుచు, వానియందు తృప్తి చెందుచూ, క్రమముగ ఉత్తమమగు కోరికలు కోరుచూ చివరకు శ్రీమాత సాన్నిధ్యమును కోరుట జరుగును. శ్రీమాత కామేశ్వరిగ జీవుల కోరికలను సిద్ధింపజేయును. కోరికలు ధర్మబద్ధమైనపుడు తదను గుణమగు జ్ఞానము వలననూ, క్రియ వలననూ సిద్ధించుచుండును. ఇట్లు సిద్ధించుటకు శ్రీమాతయే ఏమి కోరవలెనో, ఎప్పుడు కోరవలెనో, ఎట్లు కోరవలెనో నేర్పును. కోరికలు తీర్చుకొను విధానము కూడ జ్ఞానము రూపమున నేర్పును. ఇచ్ఛను, జ్ఞానమును అనుసరించి కోరిక సిద్ధించుటకు బడసిన క్రియాశక్తిని కూడ నందించును. ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులు ఆమె అధీనమున నుండుట వలన ఎప్పుడు ఎచ్చట ఏ విధముగ ఇచ్ఛను నిర్వర్తించవలెనో తానే తల్లియై, గురువై జీవులకు నేర్పుకొనును.

ధర్మము తప్పిననూ, కోరు విధానము తప్పిననూ, క్రియా విధానము తప్పిననూ, తదనుగుణ జ్ఞానము కొరవడిననూ జీవులు

బంధింపబడు చుందురు. ఈ బంధమే పాశము. ఏమి కోరవలెనో తెలియనిచో బంధము తప్పదు. నిర్వహణా జ్ఞానము లేనిచో బంధము తప్పదు. క్రియాశక్తి లేనిచో బంధము తప్పదు. ఎప్పుడు ఎక్కడ నిర్వర్తింప వలెనో తెలియనిచో బంధము తప్పదు. ధర్మమే తప్పినచో బంధము కఠినముగ నుండును. ఇట్లు పాశములు జీవుల కేర్పడుచుండును. అజ్ఞానమును బట్టి బంధముండును. జ్ఞానమును బట్టి మోక్షముండును. అపరిపూర్ణత వలన అజ్ఞాన ముండును. అనుభవము వలన జ్ఞానము కలుగును. అనుభవమును కలిగించుచు జ్ఞాన మేర్పరుచుట క్రమముగ జీవులను తానే ఉద్ధరించు కొనుచుండును. తెలిసినవారి ద్వారా తెలియని వారికి తెలియ జెప్పుచుండును. తానే స్వయముగ కూడ తెలియజెప్పు చుండును. ఇట్లు నిర్విరామముగ సృష్టి విద్యాలయమును జీవులకొరకు నెరపుచు నుండును. ఒక సృష్టి కాలము చాలనిచో మరియొక సృష్టి నేర్పరచును. జీవులకు శిక్షణ నిచ్చుటలో శిక్షించుట కూడ ఒక భాగమే. శిక్షణకే పాశము, అంకుశము హస్తమున ధరించును. భయపడిన వారికి అభయము కలిగించుటకు అభయ హస్తము కూడ నుండును. కోరికలు తీర్చుటకు వరద హస్తముండును. శిక్షణ నిచ్చు తల్లివద్ద వుండవలసిన సర్వనిపుణతలు ప్రదర్శించును. అన్నియూ ప్రేమతో నిర్వర్తించును గనుక ఆర్ద్రతను ప్రసరించు కన్నులుండును. శ్రీమాత పాశహస్తము అధర్మమును అనుసరించకుండుటకు హెచ్చరికగ కూడ పనిచేయును.

# 811. 'పాశహంత్రీ'

**బం**ధములను నిర్మూలించునది శ్రీమాత అని అర్థము.

బంధములను జ్ఞానముతోను, ధర్మముతోను శ్రీమాత జీవులకు నిర్మూలించును. అజ్ఞానము, అధర్మము బంధకారణము లగును. అజ్ఞానము వలననే అధర్మము కూడ యేర్పడుచుండును. అజ్ఞానమున నున్నవారికి అహంకారము తోడైనపుడు ధర్మాచరణము లోపించును. అట్టివారు బంధముల పడుదురు. బంధము తొలగవలెనన్నచో ధర్మము నాశ్రయింపవలెనని జీవులకు అనుభవపూర్వకముగ తెలియుచుండును. అమితభోజనము వలన అజీర్తి, కడుపునొప్పి కలిగినప్పుడు మిత భోజనము చేసియుండవలసినది కదా! అని అనిపించును. ప్రతి అతిక్రమణమునకు బంధమేర్పడి, తదనుగుణమగు అనుభవము రూపమున జ్ఞానమేర్పడి ధర్మము ననుసరించుట జరుగుచుండును. మమకారము వలన బాధలు కలిగినపుడు క్రమముగ మమకారములేని ప్రేమ ననుసరించుట జీవుడు నేర్చును. అహంకారము వలన బాధ లేర్పడినపుడు నిరహంకారమును నేర్చును. తొందరపాటు వలన తప్పులు జరిగినపుడు త్వరపడరాదని నేర్చును. పొరపాటు వలన చిక్కులు పడినపుడు పొరపాట్లు దిద్దుకొనుట నేర్చును. అశ్రద్ధ నుండి శ్రద్ధ నేర్చును. సోమరితనము నుండి చురుకుతనము నేర్చును. మరపు నుండి ఎఱుక నేర్చును. మృత్యుభీతి నుండి అమృతత్త్వము నేర్చును. ఇట్లు బంధముల

నుండి మోక్షమును సోపానక్రమమున నేర్చును. భౌతికము, మానసికము అగు బంధముల నుండి బయల్పడును. ఇట్లు పాశములన్నియూ జ్ఞానము వలన దాటును. ఇట్లు దాటుటకు వలసిన ప్రచోదనము లోనుండి కలిగించును. గురు రూపిణియై లోపల నుండి వెలుపల నుండి ప్రచోదనము గావించుచూ పాశములను హరింపజేయును. జీవులను బంధము నుండి ముక్తులను చేయును. అసత్యము నుండి సత్యమున జేర్చును. చీకట్ల నుండి ఉద్ధరించును. అమృతత్త్వము తమ నిజ స్థితియని జీవులకు తెలియజేయును.



# 812. 'పరమంత్ర విభేదినీ'

**త**న భక్తులపై ఇతరులు పన్ను కుతంత్రములను ధ్వంసము చేయునది శ్రీమాత అని అర్థము.

పురాణములలో దైవభక్తుల కథలను పఠించినచో ఈ నామ విశేషము సులభముగను, శీఘ్రముగను తెలియును. ఇతరులు భగవత్ భక్తులపై కుట్రలు పన్ని కష్టనష్టములకు గురిచేసినపుడు భగవత్ భక్తులు భగవంతుని ఆశ్రయింతురు. నిజమునకు కష్టనష్టములు కలుగు కాలములలో యితరమగు ఉపాయములు వెదకుకొనక భగవంతుని ఆశ్రయించుట నిజమగు భక్తులు చేయు పని. ఎంతటి విపత్కరమగు పరిస్థితుల నుంచియైనను భక్తులను రక్షించిన కథలు ఎన్నియో కలవు.

*"నమే భక్త్యా ప్రణశ్యతి"* అని శ్రీకృష్ణుడు గీతలో ఎలుగెత్తి చాటినాడు. నా భక్తులెన్నటికినీ నశింపరు అని తెలుపుటలో పై నామము ధ్రువమని తెలియుచున్నది. అట్లే భగవత్ భక్తులు ఒకానొకప్పుడు దురాచారుడై ప్రవర్తించిననూ దైవమే అతనిని స్వయముగ ఉద్ధరించు కొనును. మృత్యువు నుండి కూడ కాపాడును. రత్నాకరుడు, పుండరీకుడు, అజామీళుడు, ఇటీవలి కాలమున గుడిపాటి వెంకటచలం ఎట్లుద్ధరింప బడిరో అందరికినీ విదితమగు విషయము. చిన్న అగ్ని కారు చిచ్చై మహారణ్యములనెట్లు దహించివేయునో అట్లే భగవద్భక్తి ఎట్టి పాపముల నైననూ నశింపజేయును. నన్ను శరణుజొచ్చిన వారిని సర్వపాపముల నుండి ఉద్ధరించి మోక్షము నిత్తునని భగవానుడు పలికెను.

భక్తిని ఇనుమడింపజేసికొనుటకు భగవత్ భక్తులు భగవంతుని కథలగు దేవీ పురాణము, భాగవతము, రామాయణము యిత్యాది కథలను నిత్యపారాయణ గ్రంథములుగ చేసుకొని పఠించుచు నుండ వలెను. కేవలము వ్యాకరణము, తర్కము, వేదాంత చర్చ భక్తి రసమును పెంపొందింప లేవు. భగవంతుడు రస స్వరూపుడగుటచే భక్తికి ప్రతిస్పందించినట్లు ఇతర మార్గములకు స్పందింపడు. నేను వైకుంఠము నందుకన్న యోగులు, జ్ఞానుల హృదయములందుకన్న భక్తుల హృదయములలో వుండుట కిచ్ఛగింతును. “ఎవరు భక్తితో గానము చేతురో అచ్చటనే కూర్చుండుట కిచ్ఛగింతును.”

కర్మవశమునగాని, యితరుల కుతంత్రముల వలనగాని భక్తునికి కష్టనష్టములు వాటిల్లినపుడు భగవదారాధనమే ఉపాయము. ఇతర ఉపాయములను శోధించుట అవివేకము.



# 813, 814 'మూర్తా, అమూర్తా'

**రూ**పము గలది మరియు రూపము లేనిది శ్రీమాత అని అర్థము.

వ్యక్తమగునపుడు రూపముండును. వ్యక్తము కానపుడు అరూపముగ నుండును. ఆమె వ్యక్తా వ్యక్త స్వరూపిణి యని పూర్వ నామములలో వివరింపబడినది.

అక్షరమగు అవ్యక్తము నుండి క్షరమగు రూపముతో సృష్టి యేర్పడుచు నుండును. లోకములు, జీవులు యిట్లే రూపములను పొందుట, కోల్పోవుట జరుగుచుండును. చోటుగ నుండు శ్రీమాత పరమై యున్నది. అట నుండి తత్త్వములుగ మారును. మహత్తుగ మారును. త్రివిధమగు అహంకారముగ మారును. పంచభూతములుగ నేర్పడును. శబ్దములుగను, రంగులుగను, రూపములుగను మారును. ఇట్లు అవ్యక్తము నుండి అనేకానేక మార్పులను కలిగించుచు మూర్తి మంతమగు ఏక కాలమున అన్ని స్థితుల యందును పరముగను, రూపముగను ఏక కాలమున నుండుట ఆమె ప్రత్యేకత. రూపము నుండి ప్రారంభమగు ఆరాధనలు అరూపము వరకు భక్తులను కొనిపోవ గలదు. ఆమెను మూర్తిమంతముగను, అంతటా వ్యాపించిన తత్త్వముగ కూడ ఆరాధించు విధానమున్నది.

# 815 'అనిత్యతృప్తా'

**భ**క్తితో సమర్పించినపుడు భక్తికి తృప్తిపడునుగాని, సమర్పించిన వస్తువునకు తృప్తిపడునది కాదు శ్రీమాత అని అర్థము.

సాధారణముగ పారాయణ చేయువారు "నిత్యతృప్తా" అని పలుకుదురు. ఈ నామము "అనితి+అతృప్త" అనగా "అ+నితి+అ+తృప్త" అని తెలియవలెను. ఇచ్చిన వస్తువునకు తృప్తి పడువారు జీవులు. లౌకిక విలువలను బట్టి వస్తువులను గుర్తించుచూ ధనమిచ్చిరని, వెండి బంగారము లిచ్చిరని, ధాన్య మిచ్చిరని, పొలమిచ్చిరని, అగ్రహారము లిచ్చిరని, రాజ్యము లిచ్చిరని దానము పుచ్చుకొనువారు సంతసించుట, సంతసింపకుండుట వుండును. కాని దైవమట్లు కాదు. భక్తితో ఏమిచ్చి ననూ తృప్తి చెందును. శ్రద్ధా భక్తులు లేక ఏమి యిచ్చిననూ శ్రీమాత తృప్తి చెందదు. పత్రము, పుష్పము, ఫలము, నీరు యిత్యాదివి భక్తితో యిచ్చినచో తృప్తి చెందుదునని కృష్ణుడు గీతలో పలికెను. విదురుని భార్య అరటిపండు తొక్కలు భక్తితో సమర్పించినపుడు వానిని ప్రేమతో స్వీకరించెను. శ్రీరాముడు శబరి భక్తితో యిచ్చిన ఎంగిలి పండ్లను ఆనందముగ స్వీకరించెను. భక్తితో నేమిచ్చిననూ ఇది అది అనుకొనక స్వీకరించునది దైవము. భక్తిని స్వీకరించునే గాని వస్తువులను కాదు. వస్తువులను స్వీకరించి మురియు వారు సామాన్యులు. ఆడంబరముగ దైవము నారాధించుట కన్న శ్రద్ధా భక్తులతో ఉపచారములను చేయుచూ

ఆరాధించుట ముఖ్యము. ప్రచారము కొరకు, కీర్తి కొరకు, భక్తుల మని తెలియుట కొరకు చేయు పూజలు, ధరించు వేషధారణము, చూపు చేష్టలు, దైవమును దరి చేరలేవు. చూచుటకు వికారముగ నుండును. సహజమగు భక్తి వేరు. ఆడంబరమగు భక్తి వేరు, ఆడంబరమునకు లోకము మెచ్చునేమో గాని దైవము మెచ్చదు.

భక్తియందు హృదయ సమర్పణము, ఆత్మ సమర్పణము కూడ గావించు భక్తులు గలరు. సర్వ సమర్పణము చేసి వారు అమృత తుల్యులై శాశ్వతకాలము సృష్టియందు మార్గదర్శకులై నిలచి యున్నారు. వారి యునికి సద్భక్తులకే తెలియగలదు. నిజమగు భక్తులకు దైవము దాస్యము కూడ చేయును.



# 816. 'మునిమానస హంసికా'

**ము**నుల మానసము నందు హంసవలె విహారము చేయుచు నుండునది శ్రీమాత అని అర్థము.

మౌనముగ దివ్య స్మరణము చేయువారు మునులు. మననము వలన వారు మౌనముగ నుందురు. అవసరమగు మాత్రము భాషణము చేయుట, లేనిచో మననము చేయుచు మౌనముగ నుందురు. కేవలము మాటాడకుండుట వలన ఉపయోగము లేదు. అట్లున్నచో భావములు పరిపరి విధములుగ పోవుచుండును. మనసెచ్చటనో తిరుగుచు నున్నప్పుడు మౌనము భౌతికముగ నుండును గాని మానసికముగ కాదు. మనస్సునొక దివ్యనామముపై లగ్నము చేసినచో నామ స్మరణమున గల మనస్సు విషయలోలత పొందక నుండును. అట్టి పరిస్థితులలో కూడ మానసిక మౌనము దొరకక పోవచ్చును. మననమును నాలుకకు అప్పచెప్పి మనసు తిరుగాడ వచ్చును. కనుక నాలుక మెదపక మనసుతో స్మరణము చేయవలెను. అట్లు మననము చేయుచున్నంత సేపు మంత్రమునే వినుచుండుట, మంత్రరూపియగు దేవతను మానసికముగ దర్శించుట కూడ చేయవలెను. అప్పుడే ముని యగును. తరచుగ మననము చేయుచు, దర్శనము చేయుచు నుండుట వలన భక్తిని బట్టి దర్శన స్పర్శనాది అనుభూతులు కలుగు చుండును. క్రమముగ మనస్సును శ్వాసతో నిబద్ధనము చేసి వినుచూ, దర్శించుచూ నున్నచో ఆర్ద్రతను బట్టి శ్రీమాత క్రమముగ దర్శన

మిచ్చును. ముందుగ గజ్జెల వినికిడితో మొదలిడి, వేణుగానము వరకు నాదములు వినిపించుట, తదనుగుణమగు కళలు గోచరించుట, అటుపైన దర్శనమగుట జరుగును. హంసవలె హృదయమందు నర్తనమును కూడ దర్శింపవచ్చును. అపుడు పరవశమున ముని సాలోక్య, సామీప్య, సాయుజ్య, సారూప్యములను పొందును.

కాకతాళీయముగ పెదవులాడించుచూ, నాలుకను త్రిప్పుచూ మంత్ర పఠనము చేయువారు ఆడంబరులే గాని భక్తులు కానేరరు. పై తెలిపిన నియమము లన్నియు పాటించుచూ యుక్తమగు ఆహార విహారములు చేయుచూ, శుచి, శుభ్రతలను పాటించుచూ మంత్ర జపము నిర్వర్తించుట ప్రధానము. మునులు పై తెలిపిన మార్గములలో నాద బిందు కళను సతత మనుభవించుచు నుందురు. అట్టివారి హృదయములందు శ్రీమాత హంసవలె విహారము చేయును. అట్టి మునుల నాలుకల యందు వాగ్రూపమై శ్రీమాత ప్రకాశించును. కన్నుల నుండి ఆమె దివ్యదృష్టి ప్రసరించుచుండును. స్పర్శ నుండి స్వస్థతను చేకూర్చును. చేష్టల నుండి ఉద్ధరించును. మునులు శ్రీమాత వాహికలై లోకశ్రేయస్సు కలిగించుచూ జీవించుచు నుందురు.



# 817. 'సత్యవ్రతా'

**స**త్యమే వ్రతముగా గలది శ్రీమాత అని అర్థము.

సత్యమే బ్రహ్మము. సత్యమే పరము. సత్యమునుండి ఉద్భవించు శ్రీమాత సత్యమును వీడి యుండదు. సృష్టి నిర్మాణమున గాని, నిర్వహణ మున గాని, సత్యము వీడనిది శ్రీమాత. పతిని వీడని వారిని పతివ్రత లందురు. దైవమును వీడని వారిని దైవవ్రతు లందురు. ప్రియమును వీడని వారిని ప్రియవ్రతు లందురు. కృష్ణుని వీడని వారిని కృష్ణప్రియులు అని పిలుతురు. ఎవరు దేనిని వీడక ఆశ్రయించి యుందురో వారు దాని ప్రియులు. శ్రీమాత సత్యము నాశ్రయించి సర్వమును నిర్వహించును. సర్వమును జయించును. 'సత్యమేవ జయతే' అనునది ఆర్య ధర్మము. ఆర్ష ధర్మము. సత్యము నాశ్రయించినవారు లోకములను జయించి పరమునకు కూడ వ్యాపింతురు. అట్టి వారిని సత్య పరాక్రము లందురు. శ్రీరాముడు సత్యము నాశ్రయించి ముల్లోకములచే పూజింపబడు చున్నాడు. సృష్టి యున్నంతకాలము పూజింపబడును.

సత్యము నాశ్రయించు వారిని శ్రీమాత బ్రోవుచు నుండును. సత్యమును వీడినపుడు అపజయమునకు అవకాశ మేర్పడును. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ఈ క్రింది విధముగ వాగ్దానము గావించినాడు.

"ఎవడు నన్ను ఉద్దేశించి నేను నీవాడను, అని యాచించునో అట్టి వానికి సకల భూతముల నుండి నే నభయ మిచ్చుచున్నాను. ఇది నా వ్రతము."

శ్రీకృష్ణుడు గీతలో “నేను” అని సంబోధించినపుడెల్ల అతను బ్రహ్మము అని తెలియవలెను. శ్రీకృష్ణుడు బ్రహ్మము. శ్రీమాత బ్రహ్మము. శ్రీకృష్ణుడు రూపుగట్టిన సత్యము. శ్రీమాత సత్యము రూపు గట్టిన తల్లి. వారు సత్యప్రియులు.

దైవప్రియులు సత్యప్రియులై యుండవలెను. సత్యప్రియులుకాని దైవారాధకులు కపటులు. కపటము, సత్యము ఒకదానితో నొకటి పొసగవు. సత్యమున్నచోట కపట ముండదు. కపట మున్నచోట సత్య ముండదు. సత్యము కాలక్రమమున జయమును కలిగించు శాశ్వత కీర్తి పథమున నిలుపును. కపటము కాలక్రమమున నశించును. సంస్కారము పొందుచున్నకొలది జీవుడు, సత్యము రుచి నెరిగి సత్యమును తనయందు, పరిసరముల యందు పెంపొందించుకొను చుండును. నిరక్షరకుక్షి అయినను సత్యము నాశ్రయించినచో సమస్త జ్ఞానమును కాలక్రమమున పొందగలడు. సత్యములేని జ్ఞానము హీనాతి హీనము. సత్యమే జ్ఞానము గనుక, బ్రహ్మము గనుక సత్యము పునాదిగా సకల జీవనము సాగుట శ్రేయోదాయకము, రుచికరము. సత్యవ్రతుల జీవితమే స్ఫూర్తిమంతము.



# 818. 'సత్యరూపా'

**స**త్యమే రూపు కట్టుకొని అవతరించునది శ్రీమాత అని అర్థము.

అవసరమగునపుడెల్ల శ్రీమాత తన మాయచే తనదగు త్రిగుణముల నేర్పరచుకొని సత్యమగు రూపమును ధరించును. అనగా బ్రహ్మము రూపము గట్టుకొనిన పరిస్థితి. సత్యము, శివము, సుందరము కూడ. అందువలన ఆమె రూపము సర్వ శుభప్రదము, సర్వమంగళ ప్రదము. ఆ రూపము అమిత అందముగ నుండును. అనుపమానమగు సుందరమగు రూపమది. ఆ రూపమునకు అసురులైననూ ఆకర్షింప బడుదురు. ఈ సత్యమగు రూపమునే సహస్రనామ ఆరంభమున హయగ్రీవుడు వర్ణించినాడు. భగవద్గీతయందు శ్రీకృష్ణుడు పై సత్యమును ధ్రువపరచినాడు. ధర్మము లోకములందు లోపించినపుడెల్ల తాను అనగా బ్రహ్మము ఆత్మమాయను చేపట్టి గుణములగైకొని రూపమును ధరింతునని, ధర్మమును స్థాపింతునని పలికినాడు. సృష్టి నిర్మాణమునకు మూలమగు బ్రహ్మము అవసరమగుచో తన్నుతానే సృజించుకొనును. అందువలన అవతారమూర్తుల రూపములు అనుపమానము, అతి సుందరము, అజేయము అయి వుండును. ఆ రూపముల ఆరాధన చతుర్విధ పురుషార్థములను సిద్ధింపజేయును.

బ్రహ్మము యొక్క వామన రూపమునకు బలిచక్రవర్తి ఆకర్షితు డయ్యెను. శ్రీరాముని రూపమునకు స్త్రీలు, పురుషులు, ఋషులు, వానరులు, అసురులు కూడ ఆకర్షితులైరి. శ్రీకృష్ణుని రూప సౌందర్యమును గూర్చి చెప్పనవసరమే లేదు. ఇట్టి సత్యరూపములు అన్నియూ శ్రీమాత

రూపములే. ఈ రూపారాధనము వలన జీవులు నిస్సందేహముగ ముక్తిని పొందుదురు. రూపారాధనము యొక్క ప్రాశస్త్యము భారతీయులకన్న తెలిసినవారు లేరు. వ్యక్త రూపమును ఆశ్రయించుట, ఆరాధించుట వలన సులభముగ ముక్తి లభించును. పురుషార్థములు కూడ సిద్ధించును. అవ్యక్తారాధనము క్లిష్టము. రసమయముగ నుండుట సులభము కాదు. పన్నెండవ అధ్యాయమున గీత యందు ఈ సత్యమును కూడ కృష్ణుడు ధ్రువపరచినాడు. సత్యరూపారాధనము సర్వశుభప్రదము.

మహాత్ములగు సద్గురువులు, సత్పురుషులు సత్యము తెలిసిన వారు. వారియందు సత్యము స్థిరమై యుండును. సద్గురు వారాధన సత్యారాధనయే యగును. అట్టి ఆరాధనము వలన వారియందు సత్యము ప్రచోదనమై సత్యవంతులను చేయును. కనుకనే గురుశిష్య సంప్రదాయము లోకమున ప్రసిద్ధి చెందినది.

సత్య మేరూపమున ప్రచోదనమై వ్యాప్తిచెందునో వారందరునూ సత్యరూపులగుటచే వారు లోకమున సత్యమగు జయములను సాధింతురు. హరిశ్చంద్రుడు, నలుడు, యుధిష్ఠిరుడు త్రేతా ద్వాపర యుగములలో సత్య మెట్లు జయించునో నిరూపించినారు. ఈ కలియుగమున ఆధునిక కాలములో సత్యమును జీవన ప్రయోజనముగ అందుకొని, సత్యము నాశ్రయించి, సత్యవ్రతుడై సత్యరూపుడై గాంధీ మహాత్ముడైనాడు. దుష్కరమగు మహత్కార్యమును సాధించినాడు. సూర్యుడస్తమించని బ్రిటీష్ మహా సామ్రాజ్యమును జయించి భరత భూమిని దాస్య విశృంఖలముల నుండి విముక్తి గావించినాడు. సత్య వ్రతము, సత్యరూపము ఎంత మాహాత్మ్యము గలవో మరొకమారు నిరూపించినాడు.

# 819. 'సర్వాంతర్యామినీ'

సర్వమును అంతర్గతముగ నియమించునది గాన శ్రీమాత సర్వాంతర్యామినీ అని భావము.

అన్నిటి యందుండునది శ్రీమాత. సర్వమూ సృష్టించి అందు ప్రవేశించును. సచేతనముల యందు, అచేతనము లందు కూడ అంతర్గత చేతనై యుండునది. గృహము నిర్మించి గృహ ప్రవేశము చేసినట్లు చరాచర సృష్టి నిర్మాణము గావించి అందు ప్రవేశించును. ప్రవేశించి నియమించును. లోనుండి నియమింపబడుట వలన జీవులు, వస్తువులు ఆమె అధీనమున నుండును. అన్నిటికినీ ఆమెయే మూల బలము. ఉప్పు ఉప్పగ నుండుటకును, పంచదార తీపిగ నుండుటకును, వేపకాయ చేదుగ నుండుటకును, వృక్షములు పెరుగుటకును, జీవులు అనేక విధములుగ ప్రవర్తించుటకునూ ముఖ్య కారణముగ ఆమెయే యున్నది. అంతరంగమున ఆమె అదృశ్య అయినచో ఏ వస్తువునూ యుండదు. ఏ జీవియునూ యుండదు. ఏ లోకమునూ యుండదు. విద్యుత్తు నిష్క్రమించినపుడు తెరపై సినిమా ఎట్లు అదృశ్యమగునో, అట్లు సృష్టి, తిరోధానము గావింప గలదు. అట్లే పురోగమనము జరుపును. పుట్టుట పెరుగుట, తరుగుట నిష్క్రమించుట ఆమె లీలయే. విశ్వాత్మ అగుటచే కోటానుకోట్ల జీవాత్మలు ఆమెలోనికి నిష్క్రమింతురు. ఆమెలోనుండి వ్యక్తమగుదురు. వ్యక్తమైనపుడు వ్యక్తమగు వస్తువులందు

ఆమె వ్యాపించి యుండును. జీవుల నుండి వ్యక్తమగు వస్తువుల యందు (ఆస్తిపాస్తుల యందు) వారికి మమకారముండును గాని వాని లోనికి వ్యాపింపలేరు. తమ నుండి పుట్టినవారి లోనికి తాము వ్యాపించి యుండుట ఈశ్వరత్వము. జీవులు తమ రూపముపై ఈశ్వరత్వము సాధింపవచ్చును గాని తమ నుండి పుట్టిన వానిపై ఈశ్వరత్వమును పొందలేరు. జీవుడు సంకల్పముచే తమ అంగములను కదుపుట, వినియోగించుట, విశ్రాంతి నిచ్చుట చేయగలరు. వారియందు సంకల్ప ముగ నుండునది కూడ శ్రీమాతయే.

ఇట్లన్నిటి యందు చేతనగ యున్న శ్రీమాతను దర్శించు అభ్యాసము అంతర్యామి దర్శనా సాధన మగును. కొన్నిటియందే శ్రీమాతను దర్శించుట, మరికొన్నిటి యందు దర్శింప లేకపోవుట జీవుల అసమర్థత్వము. సమగ్ర దర్శనము గల యోగులు, సిద్ధులు, ఋషులు, భక్తులు అన్నిటా అంతటా శ్రీమాత అంతర్యామిత్వమును దర్శించుచూ విభూతి యోగమున యుందురు. అట్టి దర్శనమే సమ దర్శనమని, సమదర్శనము గలవారే పండితులని శ్రీకృష్ణుడు బోధించి నాడు. తన ప్రవర్తనమున అట్టి సమదర్శనమును సంపూర్ణముగ నిర్వర్తింప జేసి సమవర్తిగ పూజింపబడినాడు, పూజింపబడుచున్నాడు కూడ.



# 820. 'సతీ'

**స**త్యము యొక్క వ్యక్తరూపము గనుక సతి అని అర్థము.

సత్ అనగా బ్రహ్మము. అది అవ్యక్తము. బ్రహ్మము వ్యక్త మగుటకు సంకల్ప మేర్పడినపుడు సత్, సతీ యగును. బ్రహ్మము బ్రహ్మాణి యగును. బ్రహ్మాణి నామము తరువాతి నామము.

సత్‌యే సతి అయినది. సత్ లేని సతి లేదు. కనుకనే పురాణ ముల యందు సతి పతివ్రతగ తెలుపబడినది. పతి ననుసరించునది పతివ్రత. పతి యుండని చోట తానుండదు. శివునికి స్థానము లేని చోట శివాని కూడ యుండదు. అహంకారముచే దక్షుడు శివుని నిరాకరించినపుడు శివాని యగు శ్రీమాత తక్షణమే నిష్క్రమించెను. తత్ఫలితముగ దక్షుడు నశించెను. శివము లేనిచోట శివాని కూడ యుండదు గనుక మిగులునది శవమే. ఇది తెలుపుటకే దక్ష యజ్ఞము. సతీదేవి ఉత్కృష్టమగు మార్గదర్శి యగుటచే పతివ్రతలు పతుల యందు శివదర్శనము చేయుచు (అనగా సత్యదర్శనము చేయుచు) పతుల ననుసరించు మార్గ మేర్పడినది. అగస్త్యుని లోపాముద్రాదేవి నీడయై అనుసరించి యుండుట. వశిష్ఠుని అరుంధతీ దేవి అనుసరించుట, అత్రిని అనసూయాదేవి అనుసరించుట, వారి అవిభక్త స్థితిని తెలియ జేయును. ఇట్లు సతీదేవి సృష్టియందు స్త్రీలకు మార్గదర్శియై నిలచినది. పతియందు జగత్పతిని చూచుటయే పతివ్రతానిష్ఠ. ఇతరములను చూడక

పతియందలి శివునే దర్శించుచు జీవించిన సతులు గలరు. అట్టి సతులు పతులను కూడ సంస్కరింప జేసికొనిరి. సతీసహగమనము అనగా సర్వకాల సర్వావస్థలయందును పతితో కలసి నడచుట. రామునితో సహగమనము చేయుటకే జానకి వనవాసమునకు సంసిద్ధమైనది. సౌకర్యా సౌకర్యములు, కష్టనష్టములను భావింపని సతులు ఉత్తమోత్తమ మగు మార్గములలో పయనించిరి.

పతి దుర్మార్గుడైననూ పతి యందలి శివుని దర్శించుచూ పతులను వీడక, నిందింపక, కించపరచక జీవించిన తులసి, మండోదరి, తార ఇత్యాది స్త్రీలు మహా పతివ్రతల కోవలో చేరిరి. సజ్జనులగు పతుల యందు దైవమును చూచుట సులభము. దుర్జనులగు పతుల యందు చూచుట దుష్కరమగు కార్యము. అట్లు చూడగలుగుట చేతనే కొందర సురుల భార్యలు మహా పతివ్రతల కోవలో చేరి కీర్తింపబడు చున్నారు. వారు అమృతమయులై స్త్రీలకు మార్గదర్శకు లగుచున్నారు. రాముని యందు దైవమును చూచుట సులభము. రాముడు రావణుని యందు కూడ దైవమును చూచినాడు. అట్లే పై తెలిపిన పతివ్రతలు కూడ అంతర్యామి సాధనమున పరిపూర్ణులైరి.



# 821. 'బ్రహ్మాణీ'

శ్రీమాత బ్రహ్మమే అని అర్థము.

బ్రహ్మము యొక్క ఆనంద స్వరూపము శ్రీమాత. బ్రహ్మమును వ్యక్తము చేయునది శ్రీమాత. బ్రహ్మము నుండి సంకల్పముగ బ్రహ్మమే వ్యక్తమైనపుడు బ్రహ్మాణీ యగును. బ్రహ్మానందము బ్రహ్మాణీ. బ్రహ్మము స్త్రీ కాదు, పురుషుడు కాదు అది ఐక్యస్థితి. అనన్యస్థితి. అద్వైత స్థితి. మరియొకటి లేని స్థితి. అట్ట స్థితియందేమియునూ వున్నట్లు తెలియదు. ఒకటి రెండైనపుడు పరస్పరత్వము వలన ఆనందము కలుగును. అందుచే ఒకటి రెండగును. గాఢ నిద్రయందు ఆనంద మేమి కలదు. ఎరుక కలిగినపుడు కదా! ఆనందించుట. ఆనందము కొరకు బ్రహ్మము, బ్రహ్మాణిగ మారును. రెండుగ నున్నను నిజమునకు అది ఒకటియే. మేల్కాంచినపుడు తాను ఎరుకగ మారును. ఎరుక యేర్పడుట వలన పుట్టిన చోటుతో అనుసంధానము చెంది ఆనందించుట యుండును. అంతమాత్రమున మేల్కాంచినవాడు తనను తాను యిరువురిగ భావించు చున్నాడా? తానే మేల్కాంచెనని భావించును. తన ఎఱుకవలన మేల్కాంచితి నను భావన కలుగును. ఎఱుకయే లేనిచో తానున్నాడు అను ఎరుక కూడ లేదు. ఒకటి రెండైననూ నిజమున కది ఒకటియే. నాణెము ఒకటియే కాని బొమ్మ, బొరుసులుగ గోచరించును కదా!

ఒకటి రెండై, రెండు ఒకటితో అనుసంధానము చెంది,

ఆనందించు చుండును. బ్రహ్మము, బ్రహ్మాణీ అవిభాజ్యము. విభజింప బడనివి. విడదీయరానివి. ఇది శాశ్వత యోగ స్థితి. అర్ధనారీశ్వరత్వ మనగా నిదియే. ఇట్టి బ్రహ్మము అర్ధనారీశ్వరత్వము చెందిన తరువాతయే సృష్టి జరుగును. అపుడే సృష్టికర్త యగు బ్రహ్మ పుట్టుటకు వీలగును. నిజమునకు తరువాత నామము బ్రహ్మజనని. బ్రహ్మము ఎరుకగా మారి ఎరుక నుండి సృష్టి భావనము చేయగ చతుర్ముఖ బ్రహ్మ వ్యక్త మయ్యెను. ఎరుక లేనిదే కథయే లేదు. తెర వెలిగినపుడే వెండితెరపై సినిమా ప్రారంభమగును. ఉట్టి తెరపై సినిమా కథ జరుగదు. ఎఱుక యేర్పడిన వెనుక సంకల్పము కలుగును. మానవునకు కూడ యిట్లే జరుగును. మేల్కాంచిన వెనుక జీవుడు భావించుట ఆరంభించును. మేల్కాంచిన యింకనూ భావము కలుగ కుండని స్థితి వూహించినచో బ్రహ్మాణి అనగ నేమో తెలియును. జీవుడు మేల్కాంచి భావింపకుండ యుండునా? అట్లు వున్నచో యోగియే. అట్లుండు యోగికే బ్రహ్మా నందము కలుగును. యోగానందమే బ్రహ్మానందము. ఇదియే బ్రహ్మాణీ స్థితి.



# 822. 'బ్రహ్మజననీ'

**చ**తుర్ముఖ బ్రహ్మకు జన్మనిచ్చినది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత సృష్టి సంకల్పమును నిర్వహింపజేయుటకు చతుర్ముఖ బ్రహ్మను సృష్టించినది. చతుర్ముఖ బ్రహ్మయందు బ్రహ్మము, తాను, సంకల్పములను నిలిపినది. క్రియాశక్తి నేర్పఱచినది. ఈ నాలుగును నాలుగు ముఖములుగ పురాణములందు సంకేతింపబడినవి. మనము కూడ సంకల్పము ననుసరించి క్రియాశీలురమైనపుడు నలుగురమైనట్లే. నాలుగు ముఖములు కలిగినట్లే. మనమున్నామను స్థితి (1) బ్రహ్మము. ఉన్నామను ఎఱుక (2) బ్రహ్మణీ. ఎఱుక ఆధారముగ (3) సంకల్పము కలుగును. సంకల్పము (4) క్రియారూపము ధరించుట నలుగుర మగుదుము. ఇట్లు మనమునూ క్రియా యందున్నప్పుడు చతుర్ముఖ బ్రహ్మలమే. చతుర్ముఖ బ్రహ్మము నుండి దివ్య సంకల్పము నిర్వర్తింప బడును. అతనికి తనదగు యిచ్ఛలేదు. కనుక ముక్తుడై యుండును. మనము కూడ దివ్య సంకల్పమునే నిర్వర్తించునపుడు ముక్తులమై యుందుము. కాని స్వేచ్ఛ (స్వ+ఇచ్ఛ) యేర్పడినపుడు మనదగు సృష్టి చేసుకుందుము. చిక్కు లేర్పరచుకొందుము. దివ్యసంకల్పమునే అనుస రించినపుడు ముక్తులుగనే యుందుము. దివ్య సంకల్పము దివ్యేచ్ఛ గనుక ఫలములయం దాసక్తి యుండదు. క్రియ వలనే ఆనందము కలుగుచుండును. స్వేచ్ఛ కలిగినపుడే ఫలాసక్తి కూడ కలుగును. ఫలము

నం దాసక్తి వలన క్రియలో అడ్డదారులు తొక్కుట యుండును. చిక్కు పడుట యుండును. మన మేర్పరచుకొనిన సృష్టి మనమే పరిష్కరించు కొనవలెను. శ్రీమాత యేర్పరచు సృష్టి శ్రీమాత అదుపునందే యుండును. లోకహితమే యిచ్ఛగ ఆమె సృష్టి సంకల్పము చేయును. మనకు కూడ లోకహితమే మన యిచ్ఛగ మారినపుడు ముక్తిపథము లభించును. చతుర్ముఖబ్రహ్మ సృష్టి ఆరంభముననే తపస్సు గావించి పై జ్ఞానము పొంది నిష్కామముగ సంకల్పము ననుసరించి సృష్టి గావించెను. కనుకనే జీవులకు కూడ తనవలెనే సృష్టిగావింపుడని బోధించెను. *"సహ యజ్ఞా ప్రజా సృష్ట్వా"* అను గీతావాక్యము బ్రహ్మజ్ఞానము. బ్రహ్మవలె అట్టి జ్ఞానమున నిలచినవారికి శ్రీమాతయే జననియై సర్వమునూ నిర్వర్తించును. యజ్ఞార్థ జీవనమే నిజమగు బ్రహ్మజ్ఞానము. దీనిని నేర్చువరకూ జీవులు జన్మలెత్తుచూ నుందురు.



# 823. 'బహురూపా'

కోటానుకోట్ల రూపము గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతయే మహదహంకారమై రాజసిక అహంకారముగను (సృష్టికర్త), సాత్విక అహంకారముగను (సృష్టి పోషకుడగు విష్ణువు), తామసిక అహంకారమై (లయ కర్తయగు రుద్రుడు)గ యేర్పడును. సృష్టించుట, పోషించుట, సృష్టికి తిరోధాన మేర్పరచుటగ మూడహంకార ములై వెలసినది. ప్రజాపతులుగను, ఆదిత్యులుగను, రుద్రులుగను విస్తరించినది. వసువులుగను, పితరులుగను యేర్పడినది. కుమారులు గను, సప్త ఋషులుగను యేర్పడినది. వీని నుండియే సమస్త సృష్టి యేర్పడినది. లోకముల నేర్పరచినది. జీవుల నేర్పరచినది. నక్షత్ర మండలములను, సూర్యమండలమును, గ్రహమండలములను యేర్పరచినది. సృష్టి క్రమమును వర్ణించుట అలవి కాని పని. సృష్టి యందలి రూపములను లెక్కించుట కూడ అలవికాని పనియే. అన్ని రూపములు ఆమెవే. కనుక ఏ రూపము చూచినను ఆమెనే గుర్తించుట సాధనయైనది.

రూపములను మినహాయింపు లేక శ్రీమాతగనే భావించుట వలన సృష్టి జ్ఞానమునకు ద్వారములు తెరువబడెను. చూచువాని రూపమున, చూడబడు వస్తువు రూపమున, చూచుట అను ప్రక్రియ రూపమున యున్నది శ్రీమాతయే. ఇట్లు చూచుటయే జ్ఞానము. అనేక రూపములందలి శ్రీమాతను దర్శించుట వలన ఏకత్వము సిద్ధించును.

అసురులు, దానవులు, దైత్యులు, మనకి కిట్టనివారి రూపములుగ కూడ శ్రీమాతయే యున్నది. కిట్టని రూపముల యందు దర్శించుట ద్వేషము వలన వీలుపడదు. ఇష్టమగు రూపములందు దర్శించుట మోహము వలన వీలుపడదు. ఇట్లు రెండు కన్నులు పొడుచుకొని గ్రుడ్డివారై జీవులు చూచుచున్నా మను భ్రమతో జీవించు చుందురు. అంతకన్న మాయ యేమున్నది. శ్రీమాత ఆరాధనముననే ఆమె సృష్టి మాయను దాటగలము. బహురూపా నామము ఎంత అద్భుతమో అంత రహస్యము కూడ. "ప్రతి నిత్యమూ నన్నే చూచుచున్నారు. కాని నన్ను చూడరు. నన్నే వినుచున్నారు. కాని నన్ను వినరు." అని శ్రీమాత చమత్కరించినది. *"ఉతత్వః పశ్యన్ న దదర్శ వాచమ్. ఉతత్వః శృణ్వన్ న శృణోతి యేనామ్"* అనునది సరస్వతీ సూక్తము.



# 824. 'బుధార్చితా'

**బు**ధులచే అర్చింపబడినది శ్రీమాత అని అర్థము.

బుధులనగా తెలిసినవారు. బుద్ధి లోకమున జీవించువారు. ఆత్మ నెరిగిన వారు. బుద్ధియందు స్థిరపడి ఆత్మానుభూతిని పొందుచు, మనో ఇంద్రియ దేహముల నుండి వలసిన కర్తవ్యమును నిర్వర్తించు వారు. మనసునందే జీవించువారు మానవులు. బుద్ధియందు జీవించు వారు బుధులు. వీరు మానవులలో శ్రేష్ఠులు. మానవులకు మార్గ దర్శకులు. జిజ్ఞాసులగు మానవులకు మార్గమును చూపుటకు సమాజ మున అందుబాటులో నుండువారు. అట్టి బుధులచే శ్రీమాత అను నిత్యము అర్చింపబడుచున్నది.

బుధుల అర్చనకును, ఇతరుల అర్చనకును వ్యత్యాసమున్నది. జిజ్ఞాసువులగు భక్తులు మనస్సునందు స్థితిగొని అర్చింతురు. మనస్సు అర్చన చేయుచున్నప్పుడు బాహ్య విషయములపైకి ప్రసరించు చుండును. అటునిటు పరుగెత్తుచుండును. బాహ్యమున మనస్సు పరుగెత్తుచుండగ యాంత్రికముగ స్తోత్రపఠనము జరుగుచుండును. అట్టి పూజలు శ్రీమాతకు చేరవు. శ్రద్ధ వలన, భక్తి వలన, ఆర్ద్రత వలన, అమ్మను గూర్చిన తపన వలన క్రమముగ మనసు అంతర్ముఖమైనపుడు ధ్యాస చెదరక యుండును. క్రమముగ మనసు అంతరంగముచేరి, అంతరంగమందు అమ్మని ఆరాధించుట జరుగును. అంతరంగము నుండి శ్రీమాత తళు

కు బెళుకులు, గజ్జెలు, గాజుల చప్పుళ్ళు, ఆమె పరిమళపు వాసనలు తెలియుచుండగ యినుమడించిన ఉత్సాహముతో అర్చన జరుగను. క్రమముగ బుద్ధిలోకమగు హృదయము చేరుచుండగ సామీప్యమున అర్చన చేసిన భావమే యుండును. అడప దడప దర్శనములు జరుగుచు నుండును. అట్లు సాలోక్య సాయుజ్యము లేర్పడుచుండగ శ్రీమాత తత్త్వము ఆవిష్కరింపబడు చుండును. క్రమముగ బహురూప అయిన శ్రీమాతను దర్శనము గావించిన లోపల బైట కూడ నున్నది శ్రీమాతయే అని తెలియును. ఆమె రూపిగను అరూపిగను ఎట్లున్న తెలిసి అంతర్యామిగ, సర్వాంతర్యామిగ తెలియ గలదు. బుధులు శ్రీమాతను సర్వాంతర్యామిగ దర్శించుచూ అర్చింతురు. వారు బాహ్యాంతరముల చేయు సమస్త కార్యము పూజగనే సాగును. ఈ సత్యమునే భాగవతమున ప్రహ్లాదు డనుభవించు అనన్యభక్తిగ తెలిపిరి. *"పానీయంబులు త్రావుచున్, కుడుచుచున్, హాస నిద్రాదులు చేయుచున్."* సమస్తము దైవముగనే భావించుచు ప్రహ్లాదుడు జీవితము సాగించినాడని వర్ణించిరి. బుధులు చేయునది అనన్యభక్తి ఆరాధన అని తెలియవలెను.



# 825. 'ప్రసవిత్రీ'

ప్రసరించునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మసంకల్పమై అవతరించి ఒక నిర్దిష్టమగు వరుస క్రమమున సృష్టిని, జీవులను వ్యక్తపరచును గాన శ్రీమాతను ప్రసవించు తత్త్వము కలదిగా కొనియాడుదురు. మహత్తును, అందుండి మహదహంకారము లను, అందుండి తత్త్వములను ప్రసరించి బ్రహ్మాండము నేర్పరచును. దాని నుండి విరాట్ పురుషుని ఉద్ధరింపజేయును. అగ్ని, వాయువు, సూర్యుడు, వరుణుడు, బృహస్పతి, యింద్రుడు, విష్ణువు, రుద్రుడు యిత్యాది ప్రజ్ఞల కూడికగ విరాట్ పురుషుడేర్పడును. చతుర్వ్యూహముల నేర్పరచును. చతుర్ముఖ బ్రహ్మను, కుమారులను, ఏకాదశ రుద్రులను, ప్రజాపతులను, మనువులను, యిట్లు కోటానుకోట్ల దేవతలను, లోకము లను, జీవులను తన సంకల్పము నుండి ప్రసరింపజేసి సృష్టి నిర్మాణము గావించి పోషించి రక్షించును. ఈ సమస్తమునకు మూలము సంకల్పమే.

సమస్త జీవులయందు, దేవతలయందు కూడ ఆమె సంకల్పమే వర్తించును. సంకల్పమే లేనిచో జీవనమే యుండదు. ప్రతి జీవుడును నిద్ర నుండి మేల్కాంచుట శ్రీమాత సంకల్పమే. మేల్కాంచిన వెనుక అనుశ్రుతముగ చిల్లర సంకల్పము లేర్పరచు జీవులకు దినమంతయూ సాగును. మహర్షులకైననూ, సామ్రాట్టులకైననూ, సామాన్యునకైననూ, జంతువులకైననూ వర్తించుటకు సంకల్పమే ఆధారము. వృక్షములు

పెరుగుటకు అంకురశక్తి రూపమున ఆమె సంకల్పమే యున్నది. అణువుల యందు, దేహములయందు, గ్రహములయందు, సూర్యాది మండలములయందు శ్రీమాత సంకల్పమే వర్తించును, నర్తించును. ఆమె సంకల్ప వర్తనము ఎవ్వరునూ సంపూర్ణముగ వర్ణింపజాలరు.

"మనలో సంకల్పము లెట్లు కలుగుచున్నవి." అని ధ్యానముచేసి ఆ సంకల్పము పుట్టు చోటును లేక వెలుగును గాయత్రిగ అభివర్ణించి ఆరాధించిరి. ఆమెను సవితగ వర్ణించి, ఆమె సంకల్పమే సమస్తమునూ పోషించు చున్నదని, రక్షించు చున్నదని, ఆమెయే మాతృమూర్తి యని ఋషులు శ్లాఘించిరి.

ఎవని యందు ఎట్టి సంకల్పము కలుగునో, కలిగిన వెనుక తెలియుటయేగాని, యిట్లు కలుగవలెనని నిర్దేశించుటకు వీలు పడదు. తన సంకల్పముతోనే సృష్టికర్తను కూడ నియమించి పాలించును. ఆమె సంకల్పమునకు లొంగనిది లేదు. ఆమె నుండి పుట్టిన త్రిమూర్తులు సహితము ఆమెకు బద్ధులే. స్వతంత్రులు కారు.



# 826. 'ప్రచండా'

ప్రశస్తమగు భయమును కలిగించునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతను చండిగా ఆరాధించు సంప్రదాయమున్నది. చండి యనగా భయమునకే భయము. సృష్టి సమస్తమునకు చండ ముండులు భయమును కల్పించిరి. అట్టి చండ ముండులకు కూడ భయమును కలిగించునది శ్రీమాత. జీవులందరు పరతంత్రులే. ఆమె సంకల్పము నకు లోబడి వర్తించువారే. శ్రీమాత సంకల్పమును అనుసరించుటయే గాని అనుసరించకుండుటకు వీలులేదు. అనుసరించువారు శిష్టులు. వారు శ్రీమాత సాన్నిధ్యము ననుభవింతురు. ఆమె సర్వస్వతంత్ర కనుక ఆమె సాన్నిధ్యము స్వతంత్రానుభవము నిచ్చును. మోక్షము పొందిన జీవులు తాము మోక్షము పొందితిమని భావించినచో అహంకార వశమున సాన్నిధ్యమును కోల్పోవుదురు. కనుక మోక్షస్థితి కోల్పోవుదురు. ఆమె ఆజ్ఞను అనుసరించుట వలన మోక్షము నందుందురుగాని అనుసరణ లేనపుడు మోక్షము లేదు. జ్ఞానులు సహితము ఆమె సంకల్పము ననుస రించవలసినదే. మరి గతి లేదు. ఎట్టివారికైననూ శ్రీమాత దాసత్వము తప్పని సరి. స్వతంత్రించి ప్రవర్తించినచో మోక్షమదృశ్యమై బంధ మేర్పడును. బంధమే భయకారణము. బంధమున్నచోట భయ ముండును. భయపడిన వారిని చండ ముండు లావేశింతురు.

భయము కలిగినపుడు, భయము కలుగరాదు అని భావించిననూ భయము కలుగును. నిష్కారణముగ భయపడుచున్నా నని పించును.

భయపడకుడు అని తెలిపిననూ భయపడుదురు. ప్రస్తుతము సామాన్యు లందరినీ భయము పీడించుచున్నది. అగ్రరాజ్యములు సహితము భయము కారణముగ యుద్ధములు సాగించుచున్నవి. పదవుల యందున్నవారు, ధనము ఆర్జించినవారు ఎక్కువగ భయపడుచుందురు. భయముచే రకరకములుగ ఆత్మరక్షణా ప్రయత్నములు చేయుదురు. తమను రక్షించుకొనుటకు అనుమానము కలవారందరినీ హింసింతురు, దండింతురు, చంపుదురు కూడ. భయము వలననే దుష్కార్యములు చేతురు. భయమునకు కారణము ప్రాథమికముగ ధర్మము తప్పుట. చండ ముండులు భయము రూపమున జీవుల నావేశింతురు. అధర్మ స్వరూపమే వారు. ఎవరు నిర్వర్తించిన అధర్మము వారినే భయపెట్టును. కంసుడట్లే భయపడినాడు. భయపడి మితిమీరి దుష్కృత్యములు చేసినాడు.

భయమునకు విరుగుడు శ్రీమాత ఆరాధనము. శ్రీమాత స్మరణము అభయ మిచ్చును. ధర్మ ప్రచోదనము కలిగించును. ధర్మము ననుసరించువారు మృత్యువునకు కూడ భయపడరు. గర్వము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, ద్వేషము లేని యుధిష్ఠిరుడు తన సోదరుల కన్న నిశ్చలముగ నుండెడివాడు. నిశ్చింతగ యుండెడివాడు. అతడు దేనికిని భయపడలేదు. కేవలము అధర్మమునకే భయపడెను. కనుక ధర్మమూర్తిగ ప్రసిద్ధి గాంచినాడు. మృత్యువు కూడ అతనిని శాసింప లేకపోయెను. అతడు నూటికి నూరుపాళ్ళు శ్రీమాత సృష్టి ధర్మమునకు దాసుడు. చండీ అనుగ్రహము కలవాడు.

చండీమాతను ఆరాధించువారు ధర్మానుష్ఠానబుద్ధిని పొందుదురు. అట్లు పొందుటయే చండీహెూమము యిచ్చు నిజమగు బలము. అధర్మము లాచరించుచూ భయమువలన చండీ హెూమము లెన్ని చేసిననూ నిరుపయోగమే. ప్రచండి యగు శ్రీమాత ధర్మము స్వయముగ నేర్పును. అట్లు నేర్చుకొను బుద్ధి గలవారు చండి నారాధింప వచ్చును. దుష్టమగు ఆశయముల సిద్ధికి తాంత్రికులెందరో చండిని ఆశ్రయించి నశించిరిగాని సిద్ధిని పొందలేదు. స్వప్రయోజనములకు చండి ఆరాధన సిద్ధింపదు. కేవలము లోకహితమునకే చండి ఆరాధన సాగవలెను. దుష్టులకు చండి అతి భయంకరము. శిష్టులకు చండి అతి సుందరము.



# 827. 'ఆజ్ఞా'

**ఆ**జ్ఞా స్వరూపము శ్రీమాత అని అర్థము.

సృష్టియందు విధి నిషేధములు శ్రీమాత ఆజ్ఞాపించినది. ఇది ధర్మము, ఇది అధర్మము అని; ఇది విహితము, అవిహితము అని; చేయవలసినవి, చేయగూడనివి శ్రీమాతయే నిర్ణయము చేసినది. సృష్టి అంతయూ ధర్మక్షేత్రముగ యేర్పరచినది. ధర్మము నెఱిగి ప్రవర్తించుటచే సృష్టియం దానందింతురని అధర్మముగ ప్రవర్తించినచో దుఃఖపడుదురని ఆజ్ఞ కావించినది శ్రీమాత. కనుక ఆమెను 'ఆజ్ఞా' అని పిలుతురు. ఆమె ఆజ్ఞను అనుసరింపని వారెవరైననూ చిక్కుల బడక తప్పదు. సృష్టి ధర్మము నెఱిగి జీవించుటయే ఎవరికైననూ పరమావధి. హద్దులు మీరినచో యిక్కట్లు తప్పవు. కురుక్షేత్రమగు సృష్టిని ధర్మక్షేత్రముగ ఎరిగినవారే దానియందు దివ్య వైభవమును పొందగలరు. ఇతరులకు సృష్టియందలి జీవనము సమస్యగ నుండును.

సృష్టివిధానము తెలియని వారికే సమస్యలన్నియూ. ఎరిగిన వారి కే సమస్యలూ లేవు. మానవులకు తప్ప యితర జాతులకు సమస్యలు తక్కువ. మానవులకు శ్రీమాత స్వతంత్రత యిచ్చినను, స్వతంత్ర జీవనము ధర్మము నాచరించిన వారికే దక్కును. శ్రీమాత ఆజ్ఞను పాలించిన వారికే దక్కును. స్వతంత్రు లందరూ పరతంత్రులే. పరాధీనులే. పరము నకు అధీనులు.

# 828. 'ప్రతిష్ఠా'

సమస్తమునందు స్థితిగొని యున్నది శ్రీమాత అని అర్థము.

కేవలము సృష్టించుటయేగాక సృష్టించిన సమస్త లోకములందు, జీవులందు, చేతనా చేతన రూపములందు శ్రీమాత ప్రవేశించి స్థితిలోనే వుండును. ఇది ఆమె వాసుదేవ తత్త్వము. అంతర్యామిత్వము. మేధావులు ఎన్నో విషయములను సృష్టింపవచ్చును గాని వానియందు ప్రవేశించి వసింపలేరు. ప్రవేశించి వసించుట ఈశ్వరత్వము. ఊరి పొలిమేరలో పొలము కొనవచ్చును. కొన్న పొలము నాది అని అనుకొనవచ్చును. కాని ఊరిలో నున్నప్పుడు పొలములో ఏమీ జరుగుచున్నదో తెలియదు కదా! గృహ నిర్మాణములు చేయవచ్చును. గృహ ప్రవేశములను కూడ చేయవచ్చును. గృహము నాది అనుకొనవచ్చును. గృహము నందు తానున్నచోట తప్ప ఇతర గదులలో ఏమి జరుగుచున్నదో తనకు తెలియుచున్నదా? జీవుడు తన దేహము వరకే వ్యాప్తిచెంది వసించగలడు కాని తానేర్పరచిన వానిలోనికి వ్యాపింప లేడు. తన నుండి పుట్టి పెరిగిన పిల్లలయందు ఏమి జరుగుచున్నదో తాను గుర్తింపలేడు. తన నుండి పుట్టినవాటి లోనికి తాను వ్యాపించుట, వ్యాపించి తిష్ఠవేయుట అంతర్యామి ప్రజ్ఞకే వీలగును. కనుక అంతర్యామి ప్రజ్ఞ కలవారే సర్వవ్యాప్తి చెంద గలరు.

గజేంద్రుడు ఈశ్వర ప్రార్థనము మకరము నుండి విడుదలకై చేసెను. సర్వమూ తానేయై నిలచియుండు దైవము ఎవరో అట్టి వానిని

వేడుచున్నాను అని అంతర్యామి దైవము నారాధించెను. అంతర్యామి దైవమే సర్వమునూ వినగలడు, కనగలడు. అప్పటికప్పుడు ఎచ్చటనైననూ అవతరించగలడు. విశ్వమయుడగు దైవము విష్ణు రూపమున హుటాహుటిని యేర్పడి గజేంద్రుని రక్షించెను. ఎవడు జీవుల మాట వినగలడో, ఎవడు సర్వమునూ కనగలడో అట్టి దైవము నాకు దిక్కని గజేంద్రుడు వేడుకొనెను. కనుక దైవము అంతర్యామి, ఈశ్వరుడు సమస్తము వ్యాపించి యుండును. సర్వసాక్షియై యుండును. అవసరమగు నపుడు అప్పటికప్పుడు అవతరించును. నామ మేదైననూ, రూప మేదైననూ, అంతర్యామిని దృష్టియందుంచుకొని ఆరాధన చేయవలెను. భారతీయులు, అంతర్యామి దైవమును వివిధ నామములతో వివిధ రూపములందు ఆరాధించుట నేర్చిరి. అంతమంది దైవము లున్నారని కాదు. ఒకే దైవమును అనేక నామములతో అనేక రూపముల ద్వారా చేరవచ్చునని, రూపమేదైననూ, నామమేదైననూ అంతర్యామి యున్నాడని తెలిసి ఆరాధింతురు. అందులకే రాముడన్ననూ, రహీమ్ అన్ననూ, ఈశ్వరు డన్ననూ, అల్లా అన్ననూ, కృష్ణుడన్ననూ, క్రైస్తు అన్ననూ, ఏమని పిలచిననూ ఒకటే అని తెలిసియుండెడివారు. కనుకనే నిజమగు భారతీయులకు సర్వమతములు సమ్మతమే. ఈ అవగాహన కోల్పోయి నపుడు ఏకత్వము నశించి భిన్నత్వమేర్పడి కలహములు పుట్టుచుండును. రజోగుణ ప్రేరితులైనవారై ఒక నామముకన్న మరియొక నామము గొప్పదని, ఒక రూపము కన్న మరియొక రూపము గొప్పదని భావింతురు. ఒకే వెలుగు వెయ్యి దీపములుగ వెలిగినపుడు ఏ దీపము క్రిందనైననూ

చేరి బాగుపడవచ్చును. బాగుపడు ఉద్దేశ్యము లేనపుడు ఎన్ని దీపము లున్ననూ ఒక్కటే.

దైవము సమస్తము నందు సుప్రతిష్ఠము. అట్టి దైవమును లలితా సహస్రనామ స్తోత్రమున శ్రీలలితగ పేర్కొనిరి. ఈ సమగ్రమగు అవగాహన లేనిచో చేయు ప్రార్థనలు, ప్రయత్నములు అన్నియూ పరిమితములే.



# 829. 'ప్రకటాకృతి'

ప్రకటింపబడిన ఆకృతి కలది శ్రీమాత.

బ్రహ్మము అప్రకటితము. శ్రీమాతయే ప్రకటితము. బ్రహ్మము యొక్క ప్రకటిత రూపమే శ్రీమాత. సృష్టియందు శ్రీమాతయే దైవము. బ్రహ్మమున కామెయే దారి. జీవుడు బ్రహ్మమును చేరుటకు కూడ ఆమెయే ద్వారము. దర్శన మిచ్చునది శ్రీమాతయే. బ్రహ్మమును దర్శించుటకు వీలుపడదు. అనుభూతికి కూడ వీలుపడదు. కనపడునది, వినపడునది, అవగాహనకందునది అనంతమగు చైతన్యమే గాని దానికి ఆధారమగు బ్రహ్మము కాదు. బ్రహ్మముగ వుండుటకు వీలుపడవచ్చును. అట్లున్నప్పుడు వుండుటయేగాని, వున్నానను తెలివి యుండదు. అందు వలన సృష్టియందు జీవులు దైవముతో అనుసంధానము చెందుటకు ప్రకటితయగు శ్రీమాతయే ఆధారము. అప్రకటిత బ్రహ్మము కన్న ప్రకటిత బ్రహ్మము అందరకును సౌలభ్యము. నిజమునకు ఇరువురకు వ్యత్యాస మేమియూ లేదు. సృష్టియందలి దైవము ప్రకటిత దైవము. సృష్టికావలి దైవముతో మనకేల పని? శ్రీమహా విష్ణువన్ననూ, మహేశ్వరు డన్ననూ, మరెవ్వరైననూ కనపడుటయో, వినబడుటయో సూచనలు చేయుటయో జీవులకు ప్రయోజనకరము. ప్రత్యక్ష దైవముగ శ్రీమాత యుండగ పరోక్షమగు బ్రహ్మమును గూర్చి తహ తహ అవసరమా? ఆమెను చేరినవారు బ్రహ్మమును కూడ చేరినట్లే.

# 830. 'ప్రాణేశ్వరీ'

ప్రాణములకు ఈశ్వరి శ్రీమాత అని అర్థము.

ప్రాణముల నధిష్ఠించి యుండునది శ్రీమాత. ప్రాణములు ఐదు. ఉపప్రాణము లైదు. మొత్తము పది ప్రాణములు. ఈ పది ప్రాణములు స్థూలలోకములందు, సూక్ష్మలోకములందు, కారణ లోకములందు కలవు. అంతేగాక గుణములచే స్పర్శ చెంది సత్వ రజస్, తమో ప్రాణములుగ కూడ నుండును. ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానముగ ఐదు ముఖ్య ప్రాణము లున్నవి. కూర్మము, నాగము, ధనంజయము, దేవదత్తము, అను ఐదు ఉప ప్రాణము లున్నవి. దశ ప్రాణములును మూడులోకములలో నున్నవి (స్థూలము, సూక్ష్మము, కారణము లోకములు. ఇట్లు ముప్పది ప్రాణములు మూడు విధములుగ 90 ప్రాణములుగ నున్నవి. (వీని వివరములు మరియొక పుస్తకముగ వెలువడి యున్నవి.) ఈ ప్రాణము లన్నింటికినీ శ్రీమాతయే అధిష్ఠాన దేవత. జీవులకు స్వస్థత చేకూరుటకు ప్రాణములన్నియూ సమముగ వర్తింపవలసి యున్నవి. కనుక స్వస్థత కొరకు వైద్యము, ఔషధమెంత అవసరమో శ్రీమాత అనుగ్రహము కూడ అంతే అవసరము. కనుక అస్వస్థత కలిగినపుడు ఆరాధన కూడ ఔషధము వలె వినియోగింపబడును. రోగము లేర్పడినపుడు రోగి అంతరంగమున "ప్రాణేశ్వరీ, ప్రాణదాత్రీ, పంచాశత్పీఠరూపిణి" అని స్మరణము చేసుకొను చున్నచో రోగము త్వరితగతిని నశించును.

# 831. 'ప్రాణదాత్రీ'

ప్రాణముల నిచ్చునది శ్రీమాత అని అర్థము.

సర్వజగత్తును జీవింప చేయునది శ్రీమాత. శ్రీమాత అధీనముననే ప్రాణములు నిర్వర్తింబడుచుండును. సూర్యకిరణముల రూపమున, ప్రాణవాయువు రూపమున, నీటి రూపమున, అన్నము రూపమున జీవులకు అను నిత్యమూ ప్రాణము నిచ్చుచునే యున్నది. జగములను నిలబెట్టుచునే యున్నది. ప్రాణములు వచ్చుదారి, ప్రాణములు పోవుదారి శ్రీమాతకే తెలియును. శ్రీమాత అనుగ్రహము గల యోగులు, సిద్ధులు ప్రాణగతులను నిర్దేశింప గలుగుచున్నారు. ఇటీవలి కాలమున పరమ గురువగు మాస్టర్ సి.వి.వి. ప్రాణములపై స్వామిత్వమును సాధించి దేహమును వీడుట, దేహమున ప్రవేశించుట నిర్వర్తించి, తానందించిన భృక్త రహిత తారక రాజయోగ మార్గమున ప్రాణములను పునః పునః శరీరమున స్థాపించవచ్చునని అనుయాయులకు ప్రస్ఫుటముగ చూపినారు. తన అనుయాయులలో కొందరికి పోయిన ప్రాణములను మరల కొనితెచ్చి యిచ్చినారు. మహాప్రాణ మార్గములను శోధించి హస్తగతము గావించుకొనినారు. వారు నీలగిరులలోని దుర్గ పర్వత మందు వసించు సిద్ధులని వారి అనుయాయుల విశ్వాసము. దుర్గ అనుగ్రహము పొందిన అగస్త్యాంశ సంభూతులని మరికొందరి విశ్వాసము. అమ్మ అనుగ్రహము గల భక్తులకు ప్రాణము అరచేతిలోని విద్య అని తెలియవలెను.

# 832. 'పంచాశత్పీఠరూపిణి'

**పం**చాశత్ పీఠముల రూపము గలది శ్రీమాత అని అర్థము.

పంచాశత్పీఠములనగా ఏబది (50) పీఠములతో శ్రీమాత రూపుగట్టుకొని యున్నదని అర్థము. సంస్కృతమున అక్షరములు యేబదిగను, యేబది ఒకటిగను గుర్తించు సంప్రదాయ మున్నది. క్షకారము చేర్చినచో యేబది ఒక్క అక్షరము లగును. చేర్చకున్నచో యేబది అక్షరములే యుండును. అచ్చులు పదహారు, కచటతపాది హల్లులు ఇరువది ఐదు (25), శాంతములు ఎనిమిది. ళ, ఱ, క్ష మూడు. మొత్తము యాబది రెండు. తంత్రశాస్త్రములందు యాబది రెండు అక్షరములను గుర్తించి యాబది రెండు పీఠములను తెలుపుదురు. యాబది రెండు న్యాసములను తెలుపుదురు. ప్రతి మాతృకకు (ప్రతి అక్షరమునకు) పీఠమున్నది. కనుక యాబది రెండు పీఠములని భావింతురు. క్షకారమును, అకారమును మినహాయించినచో యాబది పీఠములే యుండును. నామము నందు యాబది పీఠములే తెలుప బడుటచే పండితుల నడుమ సుదీర్ఘమగు చర్చ సాగుచు నుండును. ఈ నామ వివరణ ప్రయత్నము తంత్రజ్ఞులకు కాక సామాన్యులకే సమర్పింపబడు చున్నది. కనుక ప్రస్తుత మీ విషయము చర్చనీయము కాదు. హయగ్రీవుడు, అగస్త్య మహర్షికి అందించిన నామము పంచాశత్పీఠమే.

అక్షరములన్నియూ శబ్ద సంకేతములు. శబ్దమునకు రూపములు. రూపము శ్రీమాతయే. శబ్ద రూపములను యంత్రములుగ భావించి ఆరాధింప వచ్చును. ఆ రూపమునందలి శబ్దము, ఆ రూపమునకు ప్రాణము. అందువలన రూపమును, అందలి శబ్దమును మనస్సు లగ్నముచేసి ధ్యానించినచో ఆ శబ్ద చైతన్యము ఉచ్చరించిన వారియందు తగు వికాసము కలిగించును. శబ్ద మాతృకను నిర్దిష్టముగను, స్పష్టము గను, బలముగను నిండు ఉద్దేశ్యముతో ఉచ్చరించవలెనని శిక్ష తెలుపు చున్నది. ఈ అక్షరములన్నిటికినీ ప్రజ్ఞా కేంద్రముల యందు నిర్దిష్ట స్థానములున్నవి. అవి ముందు నామములలో వివరించుట జరిగినది. ఆయా ప్రజ్ఞా కేంద్రములలో ఆయా దళములపై ఆయా అక్షరములను పై తెలిపిన రీతిలో న్యాసము చేసినచో తప్పక సాధకులకు చైతన్య వికాస మేర్పడును. అన్ని దళములయందు, అన్ని నామములు న్యాసము చేయుటవలన శరీరములు వికాసవంతమై సిద్ధి నిచ్చును. ఇంతవరకు విషయము అందరికినీ తెలియనగును. అటుపై గురు ముఖముగ లోతులలోనికి చొరబడ వచ్చును. షట్పద్మముల యందలి దళములే పీఠములు.



# 833. 'విశృంఖలా'

**వి**స్తృతముగ సంకెల నేర్పరచుచు తాను అందు యిమడనిది శ్రీమాత అని అర్థము.

సృష్టి అంతయూ సంకెలమయము. ఒకదానికొకటి లంకె వేసి యుండును. శృంఖల మనగా సంకెలలు. బంగారుమయము, వజ్ర మయము, మృడమయము అగు సంకెలలు కూడ బంధించునవే. పంజరము ఇనుముతో నున్నను, బంగారముతో యున్నను, రాగితో యున్ననూ పంజరము పంజరమే. ధన, ఋణ సంజ్ఞలాధారముగ, రజస్తమస్సు లాధారముగ ఏడు లోకములు సృష్టి చేయును. ఏ లోకమున నున్ననూ ఆ లోకము బంధించియే యుంచును. స్వర్గలోకము కూడ బంధించునదే. ఆలోకమే బంధనము లేనిది. లోకులందరునూ బంధితులే. త్రిలోకవాసులు కూడ అంతియే. త్రిమూర్తులు కూడ బద్ధులే. వారి వారి పనుల యందు నిబద్ధితులు. స్వచ్ఛందము కాని దంతయూ బంధమే. అట్టి స్వచ్ఛంద స్థితిని విశృంఖల స్థితి యందురు. దేహము, యింద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము యిత్యాది వన్నియూ శృంఖలములే. నేనున్నాను అను భావము కూడ శృంఖల స్థితియే. నిజమునకు తాను లేడు. తత్త్వమే తానుగ నున్నాడు. ఉన్నది శ్రీ తత్త్వమే. అది బ్రహ్మమే.

ఎంత విస్తృతముగ సృష్టి చేసిననూ తానేర్పరచిన సృష్టి శ్రీమాతను

బంధించదు. సృష్టిలోని అన్నిటియందు ఆమె యున్ననూ, ఏదియూ ఆమెను బంధింపదు. ఆమె కేదియూ బంధము కాదు.

దేహము బంధమని కొందరు భావింతురు. ఇంద్రియములు బంధించునని కూడ భావింతురు. భావములు బంధించునని మరికొందరు భావింతురు. అట్లే ధనము, వృత్తి, వుద్యోగ వ్యాపారములు, సంఘము, కుటుంబము– ఇవి అన్నియూ బంధములుగా భావించుచూ మోక్షము పేరున వీని నుండి తప్పించుకొనవలెనని, తప్పించుకొనుటకు ప్రయత్నించుచూ వెర్రివారగు వారు కోకొల్లలు. తప్పించుకొనవలెనని చూచువా రందరునూ వెర్రివారే. అనాదిగ భక్తి కార్యముల పేరున వెర్రిన పడినవారే మెండు. *“ఎవరి వెర్రి వారి కానందముగ”* కొంత కాలము గోచరించు చుండును. దేవర్షియైన నారదుడు కూడ మాయను పడిన సందర్భము లున్నవి.

ఉన్నది సత్యము. ఉన్నదానిని బ్రహ్మముగను, సత్యముగను దర్శించవలెనే గాని ప్రస్తుతమున గోచరించు బ్రహ్మమును నిరాకరించుచూ ఎక్కడునో దూరముగ పరమున్నదని, దైవమున్నాడని భావించుచూ అనాదిగ వెర్రిన పడినవారున్నారు. ఇప్పుడు యిక్కడ ప్రస్తుతమున గోచరింపబడునది, వినబడునది, జరుగుచున్నది, దానిని గమనించుచున్నవాడు, గమనించుట కూడ బ్రహ్మమే అని తెలిసి యున్నచో యిప్పటికిప్పుడు మోక్షమున నుండును. మరచినచో యిప్పటి కిప్పుడు బంధమున పడును. బంధములు చూచువారికి బంధములే

యుండును. బ్రహ్మమును చూచువారికి బ్రహ్మ ముండును. చూచువారి బుద్ధిని బట్టి చూడబడిన దానిని గ్రహించుట యుండును. ఉన్నది చూడక లేనిది వున్నట్లు చూచుట నిత్యమూ సంకెల వేయుచు నున్నది.

బ్రహ్మమును చూచుటను నగ్నస్థితి యందురు. నగ్న స్థితి యందే బ్రహ్మము గోచరించును. బ్రహ్మము ఆధారముగ అనేకానేక ఆవరణము లేర్పడినవి. వానినే వస్త్రము లందురు, లోకములందురు. లోకములను చూచినపుడు బ్రహ్మమును చూడలేరు, బ్రహ్మమును చూచినపుడు లోకము లుండవు. లోకము లుండుట, లేకుండుట చూచువాని బట్టి యుండును.

"నన్ను పొందదలచిన వారు నా వద్దకు నగ్నముగ రావలెను." అని కృష్ణుడు గోపికలకు తెలిపెను. అందలి రహస్యము పై తెలిపిన విషయము. భాగవతులలో శ్రీ శుకుడు అట్టి నగ్నుడని వర్ణించిరి. అట్లే ప్రహ్లాదుడు, అంబరీషుడు వంటి భక్తులు. వారికి బ్రహ్మమే సత్యము. చూడబడుచున్న జగత్తు అంతయూ బ్రహ్మముపై యేర్పడు బొమ్మ వంటిది. బొమ్మను చూచినపుడు తెర మరుగగును. తెరను చూచినపుడు బొమ్మ మరుగగును. భార్యను చూచినపుడు భార్య రూపములో బ్రహ్మమే యున్నది అని చూచుట విశిష్టమగు అద్వైతము. అట్లే దేనిని చూచిననూ బ్రహ్మమే ఈ విధముగ యున్నది అని తెలియవలెను. శ్రీమాత అట్టి స్థితియందుండి బృహత్తరమగు సృష్టి నిర్మాణము గావించుచున్నది. కనక ఆమె విశృంఖల.

# 834. 'వివిక్తస్థా'

**జ**నులు లేని ప్రదేశమున వుండునది శ్రీమాత అని అర్థము.

జనులనగా జన్మను పొందినవారు. శ్రీమాత జనోలోకమునకు, తపోలోకమునకు కూడ పూర్వము నుండి యున్నది. తాను వ్యక్తమైన వెనుక తపోలోకము, జనోలోకము, తపస్విజనులు, జనులు తన నుండి వ్యక్తమైనవి. తాను సత్యము గనుక సత్యలోకమున వుండును. సత్యలోకము నుండి లోకములను, అందు వసించు జనులను యేర్పరచినది. కనుక 'వివిక్తస్థా' అని కొనియాడబడుచున్నది.

జీవులు కూడ దైవారాధనకు నిశ్శబ్దమును కోరుదురు. జను లున్నచోట కార్యకలాపము లుండును. కార్యకలాపములున్నచోట వాతావరణమున అలజడి యుండును. అలజడి యున్నచోట ప్రశాంతత యుండదు. అశాంతియే యుండును. చోటు అంతయూ అశాంతితో అపవిత్రమగు చుండును. ప్రశాంతత కొఱకు ఏకాంతమును కోరుదురు. ఏకాంత ప్రదేశమున ప్రవేశించి స్వస్థతను పొందుచు నుందురు. కనుకనే ఎత్తైన శిఖర ప్రదేశములకు, పవిత్రమగు ప్రశాంత స్థలములకు, నదీ తీరములకు అవకాశమునుబట్టి, అవసరమునుబట్టి పోవుచు నుందురు. వివిక్త స్థలములే ప్రశాంతముగను, పవిత్రముగను వుండును.

పూర్వకాలమున ఏకాంతము, పవిత్రము అగు ప్రదేశములలో పుణ్యక్షేత్రములను పెద్ద లేర్పరచిరి. దైవ సాన్నిధ్యమున కుపయుక్తముగ

తీర్చిదిద్దిరి. ప్రయాణ సౌకర్యములు, వసతి సౌకర్యములు, భోజన సౌకర్యములు యేర్పరచుకొని పుణ్యక్షేత్రములయందు కార్యకలాపములు పెంచుకొనిరి. ప్రస్తుతము పుణ్యక్షేత్రములను ఆధునిక మానవుడు నివాస స్థలములుగ మార్చివేసేను. ప్రశాంతత, పవిత్రత, ఏకాంతము పుణ్యక్షేత్రములయం దంతంత మాత్రమే మిగిలియున్నది. పెద్ద పెద్ద మొత్తములు చెల్లించుచూ దైవమును శీఘ్రముగను, దగ్గరగను చూచితి మని భ్రమపడువారే ఎక్కువ. దైవ దర్శనమునకు వలసినది ప్రశాంతత, ఏకాంతము. అది లేనిచోట దైవమును దర్శించుట దుర్లభము.

ఎచ్చట ఏకాంత ముండునో అచ్చట దైవ దర్శనమున కవకాశ ముండును. ఎప్పుడు ఎవరికి దర్శనమైననూ ఏకాంతముననే దర్శనమైనది కాని జనబాహుళ్యమున కాదు. బహిర్ముఖమగు మనస్సు అనేకానేక విషయాసక్తులలో కొట్టుమిట్టాడు చుండును. మనసు అంతర్గతము గావించినపుడే ఏకాంతత లభ్యమగును. అంతరంగము నిర్జన ప్రదేశమే. అంతరంగమును చేరి ఆరాధన సాగించుట పవిత్రము. బహిరంగమును విడుటకు, అంతరంగము చేరుటకు పుణ్యక్షేత్రములకు పోవచ్చును. సద్గురువుల ఆశ్రమములకు కూడ పోవచ్చును. ఇంటి యందు కూడ ఏకాంతముగ నుండుటకు ఒక గదిని యేర్పాటు చేసుకొనవచ్చును. అందులకే దైవపూజకొక గది యేర్పరచుకొను సంప్రదాయ మేర్పడినది. వంటగదిలోనే పూజగది సౌకర్యమేమోగాని దర్శనప్రాప్తికి వినియోగ పడదు. పూజగది పవిత్రముగ నుంచుకొని ఆరాధన, జపతపములు, ధ్యానము, పారాయణము మాత్రమే సలుపుచు నున్నచో అది వివిక్త

ప్రదేశ మగును. వివిక్త ప్రదేశమున క్రమముగ శ్రీమాత చేరును. తన స్పర్శను పెంచును. దర్శనము కూడ యిచ్చును. దర్శనము సాధారణముగ అంతర్గతమే. బహిర్గతముగ కూడ లభించవచ్చును. శ్రీమాత వివిక్త స్థలమునందే స్థితిగొని యుండును గనుక స్పర్శన దర్శనాదులు కోరువారు ఏకాంత ప్రదేశములలో నుండుట అభ్యసింప వలెను మహర్షులు, తపోజనులు అట్టి ప్రదేశములలోనే యుందురు.



# 835. 'వీరమాతా'

వీరులకు తల్లి శ్రీమాత అని అర్థము.

వీరు లనగా జయించువారు. యజము వలన జయము కలుగునని భగవద్గీత తెలిపిన రహస్యము. మహాభారతము వివరించిన రహస్యము కూడ నదియే. యజ మనగా యజ్ఞార్థకర్మ. యజ్ఞార్థ కర్మ యనగా యితరుల హితము కొరకే కార్యములను చేయుట. అట్టి కార్యముల యందు స్వార్థము, అహంకారము హరింపబడును. అహం కారము ఎవరియందు నశించునో, ఎవరియందు హుతమగునో, లేక హతమగునో అట్టి వారిని వీరులందురు. అహంకారమును జయించిన వారే సమస్తమును జయింతురు. పాండవులలో యుధిష్ఠిరుడే నిజమగు వీరుడు. అతని వలననే జయము సిద్ధించినది. అతడు చివరకు మరణ మును కూడ జయించెను. వీరునకు అహంకార ముండదు. అహంకారి వీరుడు కాదు.

విశ్వామిత్రుడు వీరుడను అనుకొనెను. కాని వశిష్ఠుడే వీరుడని తెలిసినది. కనుక వశిష్ఠుని మార్గము ననుసరించెను. రావణుడు తాను వీరుడ ననుకొనెను. రాము డనుకొనలేదు. తనను గురించిన భావమే లేనివాడు రాముడు. హనుమంతుడు కూడ నట్టివాడే. హిరణ్యకశిపుడు తాను వీరుడ ననుకొనెను. నిజమునకు ప్రహ్లాదుడే వీరుడని తేలినది. ప్రాథమిక దశలో షణ్ముఖుడు తానే వీరుడ ననుకొనెను. కాని గణేశుడే

వీరుడని తేలినది. వీరమాత అను నామము ప్రాథమికముగ శ్రీమాతకు గణేశుని వలన యేర్పడినది. అటుపైన కుమారుడు కూడ శ్రీమాత కుమారుడుగ ప్రసిద్ధి గాంచెను.

యజము చేయువారు పొందు సిద్ధి నిజమునకు అహంకార హతమే. దక్షుడు యజ్ఞము ప్రారంభమున మితిమీరిన అహంకారిగ ప్రారంభించెను. యజ్ఞము పరిసమాప్తి యగుసరికి నిరహంకారి అయ్యెను. అతడు ప్రారంభించినపుడు యజ్ఞము కుయజ్ఞమే. సమాప్తి చెందుసరికి సుయజ్ఞమయ్యెను. పరహిత కార్యములు అహంకారముతో ప్రారంభించి ననూ త్రికరణశుద్ధిగ నిర్వర్తించినచో నిరహంకారము ఫలసిద్ధియై నిలచును. నిరహంకారులకే మాత అనుగ్రహము దక్కును. శుద్ధ సత్త్వమున నిలచినవారు శ్రీమాత అనుగ్రహపాత్రులు. ఆమె కుమారులై ప్రసిద్ధి గాంతురు. ప్రసిద్ధి అనగా ప్రశస్థమగు సిద్ధి. దైవాను గ్రహము కలవారే సిద్ధులలో ప్రసిద్ధులు. వారే నిజమగు వీరులు. ఎగిరెగిరి పడువారు వీరులు కారు.



# 836. 'వియత్ప్రసూః'

**ఆ**కాశమున ప్రసవించునది శ్రీమాత అని అర్థము.

తాను పరాకాశము. కాలము, ప్రకృతి, మాయలతో కూడి మహదాకాశ ముండును. అటుపైన 24 తత్త్వములతో కూడి ఆకాశ మగును. ఇట్లు ఆకాశమును ప్రకాశింపజేసి అందుండి భూత పంచకము, తన్మాత్ర పంచకము, ఇంద్రియ పంచకము, ప్రాణ పంచకమును ప్రసవింపజేయును. ఇట్లు ఒకటి నుండి మూడై, మూడు నుండి ఐదగును. అష్ట ప్రకృతులను ప్రసవించి తాను నవమ స్థానమున వివిక్తస్థయై యుండును. దశమున బ్రహ్మమై యుండును. ఇవి అన్నియూ పూర్వ నామములలో వివరముగ చెప్పబడినవి. పునః ప్రసక్తి అవసరము లేదు.



# 837. 'ముకుందా'

**ము**క్తి నొసగునది శ్రీమాత అని అర్థము.

జీవులు వివిధమగు పురుష ప్రయత్నముల ద్వారా ముక్తికొరకు ప్రయత్నింతురు. శ్రీమాత వారి వారి సమర్పణను బట్టి ముక్త స్థితిని అనుగ్రహించు చుండును. అంతేకాక తాను సంకల్పించినచో ఎట్టి వానికైననూ సద్యోఫలముగ ముక్తి నీయగలదు. అట్టి అనుగ్రహము కలది శ్రీమాత. జీవుల ప్రయత్నముతో సంబంధము లేక తానే సంకల్పించి ముక్తి నొసగిన సందర్భము లున్నవి.

శ్రీలలిత పురుష రూపమున, కృష్ణరూపమెత్తి తన పిల్లనగ్రోవితో గోపికలకు, తానుగ ముక్తి నొసగెను. శ్రీలలితయే, శ్రీకృష్ణుని రూపమని తంత్రరాజమందు నిర్ధారణ చేసిరి. *"లలిత స్కంధము కృష్ణమూలము"* అని భాగవతమున ప్రశంసింపబడు చున్నది. కృష్ణకథ శ్రీలలిత కథయే. పూతన వంటి భూతములనుండి, శిశుపాలుని వంటి దుష్టుని వరకూ వారి వారి అర్హతలతో సంబంధములేక ముక్తి నొసగి తనయందిమిడ్చు కొనెను. ధృతరాష్ట్రాదులతో పాటు కౌరవ సభలో అందరికినీ విశ్వరూప దర్శనము ప్రసాదించెను. తాను తలచినచో సంస్కారములతో సంబంధము లేకయే ముక్తి నివ్వగల స్థితి శ్రీలలితకి, శ్రీకృష్ణునికి మాత్రమే యున్నది. వారే ముక్తిదాతలు. 'ముకుందా' అను నామమ వారికే తగును.

# 838. 'ముక్తినిలయా'

శ్రీమాత ముక్తికి నిలయమని అర్థము.

ఎచ్చట శ్రీమాత యుండునో అచ్చట జీవులు ముక్తసంగులై యుందురు. ముక్తసంగులగు సనకాది కుమారులు, నారద మహర్షి, బ్రహ్మర్షులు, సప్తర్షులు, యోగీశ్వరులు, సిద్ధులు, మహాపుణ్యక్షేత్రములు, పుణ్యనదులు మొదలగున వన్నియూ ముక్తి నిలయములే. ఎచ్చట బంధముండదో అచ్చటనే ముక్తి యున్నది. బంధ లేమియే ముక్తి. దేహబంధము, మనోబంధము, గుణబంధము అధిగమించిన వారందరునూ ముక్త నిలయము చేరుదురు. ముక్తసంగులు గుణముల యందు, మనస్సునందు, దేహమునందు వర్తించుచున్ననూ బంధింప బడరు. నిరహంకారమువలన నిర్మమత్వము కలుగును. అట్టివారు సతతము ముక్తి నిలయులే. సృష్టి యందు శ్రీమాత విభూతిగ ముక్త సంగులు అన్ని లోకముల యందున్నారు. వారి ద్వారమున అందరునూ ముక్తి నిలయము చేరవచ్చును. జీవులకు ముక్తి అందుబాటులో నుండు టకే శ్రీమాత ముక్తసంగుల రూపమున అన్ని లోకములలోను అందు బాటులో నుండును.



# 839. 'మూల'

**మూ**లా నక్షత్ర రూపమున ప్రకాశించునది శ్రీమాత అని అర్థము.

మూల మనగా ఉత్పత్తి స్థానము. బ్రహ్మమే మూలముగ గలది శ్రీమాత. ఆ బ్రహ్మము నుండి అంకురశక్తియై, బీజమై, వృక్షమై, శాఖోపశాఖలై, ఛందస్సే పర్ణములై ప్రకాశించునది శ్రీమాత. శ్రీమాత మూలము బ్రహ్మము అగుటచే ఊర్ధ్వ మూలమని కృష్ణుడు పలికినాడు. సృష్టి వృక్షమునకు మూలము ఊర్ధ్వముగను, శాఖ లధోముఖములుగను, ఉపశాఖలు విస్తారముగను యేర్పడి ఛందోబద్ధముగ సృష్టి విప్పారును. వృక్షములందలి అంకురశక్తియే శ్రీమాత. బ్రహ్మము నుండి మహావృక్షము వలె వ్యాప్తి చెందును. సాధారణ వృక్షములకు మూలము భూమిలో నుండును. సృష్టి వృక్షమునకు మూలము పరాకాశములో నున్నది. అన్నిటికినీ మూలము శ్రీమాతయే.

జీవులకు మూలము సహస్రారమున నున్నది. అచట నుండి అంకురశక్తి అధోముఖముగ వ్యాప్తి చెందుచూ శిరస్సు, కంఠము, మొండెము, హస్తములు, పాదములు క్రమముగ నేర్పడును. శిరస్సు నుండి ప్రారంభమైన అంకుర శక్తి వెన్నెముక నందలి సుషుమ్న ద్వారా వెన్నెముక చిట్టచివరి తోక వరకూ వ్యాప్తిచెంది యుండును. వెన్నుపూస కొనను కూడ మూలమని అందురు. భౌతిక శరీరమునకు మూలాధార

మందలి ప్రజ్ఞయే ఆధారము. కనుక కొస చివరనున్న ప్రజ్ఞా కేంద్రమును మూలాధార చక్రమందురు. సహస్రారమునందు ఏమున్నదో మూలాధారము నందుకూడ అదియే ప్రజ్ఞ యున్నది. మూలాధారమున బిందు ప్రాయముగ నుండును. సహస్రారమున విప్పారి యుండును. కనుక సహస్రారమును వేయి పడగల పాము శిరస్సుగను, మూలాధారమును పాముతోక కొస భాగముగను, తోక నుండి శిరస్సు వరకు వ్యాప్తిచెందిన ప్రజ్ఞను కుండలినీ మహా చైతన్యముగను యోగులు దర్శించి వర్ణించిరి.

మూలా నక్షత్రము, మార్గశిర మాస ఆరంభమున గల ప్రజ్ఞగ జ్యోతిశ్శాస్త్రము తెలుపును. శీర్షము వరకు మార్గము అచట నుండియే ప్రారంభమగును కనుక శీర్షమును చేరు మార్గమని, మార్గశీర్షమని వర్ణించిరి. భగవద్గీతలో శ్రీకృష్ణుడు మాసములలో నేను మార్గశీర్షము అనుటలోని రహస్యమిదియే. కనుక మూలానక్షత్ర మత్యంత ప్రాముఖ్యము వహించినది. మూలా అను పేరు శ్రీమాతకు స్థిరపడినది.



# 840. 'విగ్రహరూపిణీ'

**రూ**పములను గూర్చుచూ విగ్రహముల నేర్పరచునది శ్రీమాత అని అర్థము.

నేనను ప్రజ్ఞగ బ్రహ్మము నుండి వ్యక్తమై వెలుగు లోకముల నుండి పృథివీలోకముల వరకు అష్ట ప్రకృతుల నేర్పరచి అన్ని లోకముల యందు రూపములను, ఆకారములను యేర్పరచునది శ్రీమాత. రూపము లందలి సౌందర్యము కూడ ఆమెయే. ప్రకృతి రూపములు అద్భుతములు. రూపముల బట్టి జీవులను గుర్తెరుగుటకు వీలగుచు నుండును. అష్ట ప్రకృతుల యందు రూపములు గలవు. వాని యందు నేనను ప్రజ్ఞ ప్రవేశించినపుడు ప్రకృతి రూపము లేర్పడుచుండును. నేనను ప్రజ్ఞ బ్రహ్మము, శక్తి. దానినే శివశక్తియని కూడ అందురు. ఈ శివశక్తి చుట్టునూ సూక్ష్మము నుండి స్థూలమునకు ప్రకృతి యేర్పడుచు నుండగా, అవి ఆధారముగా జీవులకు రూపము లేర్పడును. ఎవరెవరి స్వభావమును బట్టి వారి వారి కట్టి రూపములను ప్రసాదించు చుండును. కొన్ని రూపము లందముగను, కొన్ని అనాకారముగ నుండుట జీవ స్వభావమును బట్టి జరుగును. ఈ మొత్తము కార్యము నిర్వర్తించుటకు శ్రీమాతకు విశేషమగు సైన్యమున్నది. త్వష్ట, విశ్వకర్మ, మనువు యిత్యాది వారందరును స్వభావములను బట్టి జీవులకు రూపమేర్పరచు వారుగ శ్రీమాతచే నియమింపబడిరి. విశిష్ట రూపముల నుండి సామాన్య

రూపముల వరకు సమస్త జీవులకు రూపముల నేర్పరచుట ఒక మహత్తర కార్యము. ఈ కార్యమును అతి విశేషముగ నిర్వర్తించునది శ్రీమాత.

ఏడు లోకముల యందలి జీవులు వివిధమగు ప్రకృతులతో రూపములుగొని యుందురు. ఊర్ధ్వలోకములందలి ఆకారములు కాంతి వంతముగను, అందముగను యుండును. అవరోహణక్రమమున అధో లోకముల వరకు రకరకముల రూప సంపద కూర్చుట శ్రీమాత పనియే. అతి సున్నితమగు రూపములనుండి అతి మందముగ నుండు రూపముల వరకు గమనింపవచ్చును. భూలోకముననే ఏడుపొరలు కలవు. అట్లే ఏడు లోకముల యందు కలవు. నలుబది తొమ్మిది పొరలతో సత్య లోకమునుండి భూలోకము వరకు రూపములు విస్తారమై యున్నవి. ఈ విగ్రహ రూపములకు మూలము శ్రీమాతయే.



# 841. 'భావజ్ఞా'

**భా**వముల నెరుగునది గాన శ్రీమాత 'భావజ్ఞా' అని పిలువబడుచున్నది.

అందరి యందు నేను అను అంతర్యామి ప్రజ్ఞగ శ్రీమాత మూలమై యుండుటచే లోనుండియే సృష్టి సర్వమును ఎఱుగునది శ్రీమాత. అంతర్యామిత్వము చెందినవారికే యిట్టి సిద్ధి యుండును. భూమండలమునందు, చంద్రమండలమందు, గ్రహ మండలమందు సూర్య మండలములందు, జ్యోతిర్మండలములందు, నక్షత్ర మండలముల యందు, మొత్తము సృష్టి మండలమందు ఆయా మండలములలోనికి జీవులయందు యెట్టి భావనలు యేర్పడుచున్నవో లోనుండియే గమనించు చుండును. లోనుండియే పోషించు చుండును, రక్షించు చుండును. వృద్ధి నాశములు కలిగించు చుండును. లోనుండియే బోధించి ఉద్ధరించును. బోధ నడిగినవారికి బోధించును. బాధ అనినవారికి బాధ తీర్చును. కష్టనష్టములలో ఆదుకొనును. మితిమీరినచో శిక్షించును. తనకు సమర్పణము గావించుకొనిన వానిని పాపముల నుండి విముక్తి చేసి మోక్ష స్థితి యందుంచును. భావజ్ఞ అగుటచే తనలోని అంతర్యామికి నివేదన చేసుకొనుచు భక్తులు ఆమె వాత్సల్యము పొందుచు జీవించుచు నుందురు.

# 842. 'భవరోగఘ్నీ'

**భ**వరోగములను నశింపజేయునది శ్రీమాత అని అర్థము.

మరల మరల మరణించుట, మరల మరల పుట్టుట అను రోగమును నశింపజేసి అమృతత్త్వమును ప్రసాదించునది శ్రీమాత. అపరిపూర్ణులు పుట్టుచు, చచ్చుచు నుందురు. పరిపూర్ణులు పుట్టుక, చావు అను బాధల ననుభవింపక దేహములలోనికి ప్రవేశించుట, నిర్గమించుట చేయుదురు. గృహ ప్రవేశము, గృహ నిష్క్రమణము చేయుట వంటిది పరిపూర్ణుల దేహ ప్రవేశ నిర్గమములు. అపరిపూర్ణుల దేహప్రవేశము కారాగారమై బంధించును. నిష్క్రమము స్వచ్ఛందము కాక యుండును. ప్రవేశమున గర్భనరకము, జీవనమున పరిమితత్త్వము, నిష్క్రమణమున మరణయాతన యుండును. గర్భనరకము 90 రోజులు అనుభవ పూర్వకముగ సాగును. మరణయాతన చేసిన కర్మమును బట్టి అనుభవమునకు వచ్చుచుండును. నిష్క్రమణము వేయి నల్ల తేళ్లు ఒక్కమారుగ కుట్టినట్లు బాధ కలిగించునని పురాణములు చెప్పుచున్నవి. ప్రవేశము స్వచ్ఛందము కాదు. జీవనము స్వచ్ఛందము కాదు. నిర్గమము స్వచ్ఛందము కాదు. అన్నియూ బలవత్తరమై సాగును. మెడకు తాడు బిగించి పశువును లాగుకొని పోవుచున్నట్లుగ కాలము అపరిపూర్ణుడగు మానవుని ఈడ్చుకొని పోవుచుండును. ఏదియునూ తన వశమున నుండదు. వశ మగుచున్నట్లు భ్రమయేగాని ఏ

విషయముపైననూ స్వామిత్వ ముండదు. దీని కంతటికి కారణము అజ్ఞానము.

అజ్ఞానము వలననే జీవుడు తాను, నేను అని అహంకార పడును. అహంకారము వలన తాను యితరము, యితరులు అను భేదము లేర్పడును. తత్కారణముగ రాగద్వేషము లేర్పడును. తత్ఫలిత ముగ జీవిత మంతయూ కామక్రోధములతోను, లోభ మోహములతోను, ఈర్ష్యాసూయలతోను, మదమాత్సర్యములతోను నిండిపోవును. చిర కాలము తాను జీవించి యుండునని, అట్లు జీవించి యుండవలెనని తనకూ తనవారికి అన్నియూ ప్రోగుచేసుకొనుచూ, మృత్యువు సమీపింపగ భీతి చెంది బాధ నొందుచు మరణించును.

ఇట్లు ఎన్ని జన్మలు గడుచునో తనకే తెలియదు. ఉదయాస్త మయములవలె పుట్టుకలు, చావులు ఒక పరంపరగ సాగుచూ చేసిన పనులే చేసికొనుచు, జీవించుచు నుండును. తనకెందుకు కష్టములు కలుగుచున్నవో, దుఃఖములు కలుగుచున్నవో, తీరని రోగము లేర్పడు చున్నవో తెలియదు. ఇట్టి అంధకార జీవితము నుండి ఉద్ధరించు వారెవరు? అను ప్రశ్న ఉదయించి తపన చెందును. ఇట్టి చీకటిలో నున్న వారికి చిరుదీపమువలె శ్రీమాత దారి చూపును. *"అంత స్థిమిర మిహిర ద్వీపనగరీ"* చీకటిలో చిరుదీపము శ్రీమాతయే. చిన్న దీపము పరిసరములను వెలిగించును. కొంత దారి దొరకును. దొరికిన దారి యందు నడుచుచుండగ మరికొంత దారి కనిపించును. చిన్నదీపముతో

పెద్ద అడవిని కూడ చీకటిలో దాటవచ్చును. నడుచుచున్నకొద్ది చీకటి దారుల నుండి బైటపడవచ్చును. ఇట్టి ఆత్మ ప్రబోధనము చేయునది శ్రీమాతయే. అంతర్యామిగ లోనుండుటచే లోనుండి ప్రేరణ నిచ్చును. ప్రేరణ కారణముగ జిజ్ఞాస పెరుగును. జిజ్ఞాస ననుసరించి నడుచు చుండగ బోధనలు దరిచేరును. సత్సాంగత్యము, సద్గురుసేవ యిత్యాదివి లభించును. దాని వలన కొంత నిస్సంగ మేర్పడును. మోహము, మమకారము కరుగును. కొన్ని జన్మలకు మమకార, మోహములు కరగి చిట్టచివరగ అహంకారము కూడ కరగును. అపుడు నేనను జీవప్రజ్ఞ నేనను దివ్య ప్రజ్ఞతో ముడిపడును. అట్టు ముడిపడినపుడు పుట్టుచున్నప్పుడుగాని, మరణించు చున్నప్పుడుకాని ప్రవేశ నిర్గమ అనుభూతులే యుండునుగాని గర్భనరకము, మరణయాతన యుండదు. స్వచ్ఛందముగ దేహ ప్రవేశము చేసి అహింస, సత్యము, ధర్మము యిత్యాది సద్గుణములతో జీవన విభూతి ననుభవించుచూ యితరులకు కూడ మార్గదర్శకులై స్వచ్ఛందముగనే దేహ నిష్క్రమణము చేయుదురు. మహాత్ములందరూ మహాభినిష్క్రమణమిట్లే చేసిరి. వారందరూ శ్రీమాత భక్తులు. వారి ననుసరించు మార్గము లభించినపుడు ప్రక్కచూపులు లేక తథాగతులై ఆ మార్గముననే నడువవలెను.

ఇది అంతయూ శ్రీమాత సంకల్పముగ సాగుచు అపరిపూర్ణులగు జీవులు పరిపూర్ణులగు చుందురు. పుట్టుక, చావు అను రోగములుండవు. వచ్చి పోవుచునుండుట యుండును. అట్టివారు ఎంత సులభముగ

తల్లి గర్భము నుండి ఏతెంతురో అంత సులభముగ దేహము నుండి నిష్క్రమింతురు. గర్భము నుండి వెడలిన పద్ధతియందు గాని, దేహ నిష్క్రమణ పద్ధతి యందుగాని ఆయాస ముండదు. అంతయూ అనాయాసముగ సాగును. శ్రీమాత అనుగ్రహము యిట్టి అనాయాస జీవనము ప్రసాదించును. ఆమెయే 'భవరోగఘ్ని'. ఆమె యేర్పరచిన శిక్షకులే సద్గురువులు.



# 843. 'భవచక్ర ప్రవర్తినీ'

**జ**నన మరణ చక్రమును వర్తింపచేయునది శ్రీమాత అని అర్థము.

సృష్టి చక్రము పుట్టుక, పోషణము, వృద్ధి, క్షయము, మరణము కలిగించుచూ జీవులను జనన మరణములందు త్రిప్పుచు నుండును. కాలచక్రమున ఏడు లోకములు వచ్చుట పోవుట జరుగుచు నుండును. లోకములతో పాటు జీవులు కూడ పుట్టుట, మరణించుట యుండును. కాలమన్నియూ చేయుచు నుండును. జనన మరణ రహస్యములు తెలియనంతవరకు జీవులు జనన మరణములను పొందుచు నుందురు. సృష్టికర్మ యజ్ఞకర్మయని, యజ్ఞకర్మయే సృష్టియందు ప్రధానమని, యజ్ఞార్థ జీవనమే ధర్మజీవనమని ఎరిగి స్వహితము కొరకుగాక పరహితము కొరకు జీవించుట నేర్చునంతవరకు చక్రభ్రమణము తప్పదు. స్వర్గము కొరకు పుణ్యకార్యములు చేసిననూ పుణ్యము క్షీణించగనే స్వర్గము నుండి పతనము చెందుట తప్పదు. యజ్ఞార్థజీవన రహస్యము తెలిసి, యజ్ఞార్థము జీవించుచూ దైవయోగము చెందువారు చిరంజీవులై చక్రభ్రమణమునందు పడక లోకహితులై సృష్టికార్యమున సహకరించుచు నుందురు. వారికి జనన మరణము లుండవు. దైవ యోగమున వుండి దైవ విభూతిని సృష్టియందు పంచుచు నుందురు.

గీతయందు అష్టమ అధ్యాయమున శుక్ల, కృష్ణ పక్షములను దైవము పేర్కొనినాడు. "నన్ను ఎఱుగనివారు, నా యోగమున

(సంయోగమున) యుండనివారు పుణ్యకార్యములను చేయుచూ శుక్ల పక్ష మార్గమున స్వర్గమునకేగిననూ మరల స్వర్గానుభూతి పూర్తి యగు నంతనే కృష్ణ పక్షమున మర్త్యలోకమునకు (అనగా మృతి చెందుట, జన్మించుట అను లోకముల లోనికి ప్రవేశింతురు. ఇట్లు శుక్ల కృష్ణ పక్షములుగ దైవ యోగమున చేరని జీవులందరునూ శుక్ల కృష్ణ చక్ర భ్రమణమున నాచే త్రిప్పబడుచున్నారు. నేనే కాలము రూపమున సమస్తమునూ జీవ శిక్షణకై నిర్వర్తించుచున్నాను. యజ్ఞార్థముగ జీవించు వారందరూ శాశ్వతులై నా విభూతి యందున్నారు."

జీవులు దేవునివలె సనాతనులు, దైవాంశలు. వారికి నిజము నకు జనన మరణములు లేవు. ఈ సత్యమును మరచుటయే మృత్యువు. మృత్యువు వున్నప్పుడు పుట్టుక కూడ యుండును. అట్టివారు మరల శాశ్వతులగుటకే సృష్టియను విద్యాలయము. విద్య వలన అవిద్య నశించినచో విద్యాలయమున ఉత్తీర్ణులై శాశ్వతులగుదురు. ఉత్తీర్ణులు కానివారలు విద్యాలయముగ మరల మరల విద్య ననుభవించుచుండ వలసినదే. మరల మరల తప్పుటయే మరల మరల మరణము. తప్పిన వారు అదే తరగతి యందు చేరుటయే పుట్టుక. ప్రవర్తన యందు అజ్ఞానము పెరిగినచో క్రింది తరగతులకు కూడ చేరుదురు. ప్రవర్తన మెరుగు పడుచున్నకొలది ఉత్తీర్ణత కలుగుచు నుండును.

# 844. 'ఛందస్సారా'

**ఛం**దస్సుల సారము శ్రీమాత అని అర్థము.

పంచాక్షరీ, అష్టాక్షరీ, అనుష్టుప్, గాయత్రి యిత్యాది ఛందస్సులుగ శ్రీమాత సృష్టిరూపమున నున్నది. దినములు, పక్షములు, మాసములు, ఋతువులు, అయనములు, వత్సరములు, సంవత్సరములు (ఐదు వత్సరములు), ద్వాదశ సంవత్సరములు (12 × 5 = 60), ఇట్లనే కానేక ఛందస్సులతో కాలము అలరారు చున్నది. దినము కూడ జాములు, గడియలు, విగడియలు, ముహూర్తములు యిట్లు క్షణముల వరకు విభజింపబడి యున్నది. అరక్షణము కూడ యున్నది. ద్వాదశ వత్సరముల పైన యుగములు, మహాయుగములు, మన్వంతరములు, బ్రహ్మ పగలు, రాత్రి వరకు కూడ కాలచక్రము లేర్పడి యున్నవి. ఇట్టి మహాకాల చక్రమున పెద్దవి, చిన్నవి చక్రములు అనేకానేకములు వాని వాని ఛందస్సులతో వర్తించుచున్నవి.

గ్రహము లన్నిటికిని, వాటి వాటి ఛందోబద్ధమగు భ్రమణము లున్నవి. వైవిధ్యమగు ఛందస్సులతో వివిధ గ్రహములు ఒక సూర్య మండలముగ ఒకే సంగీతమున నిలచియున్నవి. సప్తగ్రహముల వైవిధ్య సంచారము సప్తస్వరములై సూర్యునితో చేరి సంయక్ గీతము (సంగీతము) నిర్వర్తించు చున్నవి. సృష్టి అంతయూ ఒక ఆలాపనే. అందులోని ఛందోబద్ధమైన రాగములే భర్గోదేవ మండలము, సవితృమండలము,

సూర్యమండలము, భూమండలములుగ యేర్పడి యున్నవి. ఈ మొత్తమంతయూ ఒక సంగీతము. ఛందోసారము. దీనిని ఎరిగినవారే తుంబుర నారదాది సంగీత విద్వాంసులు. సంగీత నృత్యములే సృష్టి సారముగ ఆది దంపతులగు శివాశివులు తమ అనంతమగు నాట్యము ద్వారా సమస్త దేవతలకు, జ్ఞానులకు, సిద్ధులకు సందేశ మిచ్చిరి. శృతి లయ ఛందస్సులతో కూడిన రాగములే సృష్టి కాధారము. ఆ రాగము లన్నియూ శబ్దమయము మరియు కాంతి మయము. నర్తించుచున్న శబ్ద కాంతులుగ, అప్సరసలుగ పెద్దలు వర్ణించిరి.

భారతీయ, సంగీత నృత్య శాస్త్రములతో సరిపోవు కళలు ప్రపంచ మున లేవు. ఇది నిస్సందేహము. జాముల యందు, ఉదయాస్త మయముల యందు, క్రతువులయందు, అయనముల యందు, వత్సరముల యందు, సంవత్సరముల యందు, గ్రహముల యందు, సూర్యమండలములయందు రాగములెట్లు నర్తించుచున్నవో, వర్తించు చున్నవో ఎరిగినవారు మన ఋషులు. వాని ననుసరించి నారదాది దేవర్షులనుండి శాస్త్రమునందుకొని సంగీత నృత్యముల నేర్పరచిరి. ఛందస్సులను తెలిపిరి. ఈ సమస్త ఛందస్సుల సారము శ్రీమాతయే అని తెలుసుకొని, ఆనందించి గురుశిష్య పరంపరగ అందించిరి.



# 845. 'శాస్త్రసారా'

శాస్త్రసారము శ్రీమాతయే అని అర్థము.

వేదము నెరుగుటకే శాస్త్రములు. వేదమనగా తెలియవలసినది. ఏది తెలిసిన ఇంకేమియూ తెలియనవసరము లేదో దానిని వేదమందురు. దానిని తెలియుటకే మానవులు తపస్సులు గావించిరి. ధ్యానములు చేసిరి. అష్టాంగ యోగము నభ్యసించిరి. సంయమమును పొంది వేదము తెలిసి దానిని చేరుటకు వలసిన సదుపాయముల నేర్పరచిరి. ఆ సదుపాయములే శాస్త్రములు. సదుపాయమనగా 'సత్'ను చేరుట కుపాయము. దేహ సౌకర్యము, ఇంద్రియ సౌకర్యము, మనోసౌకర్యము మాత్రమే సదుపాయమని సామాన్యులు భావింతురు. జీవాత్మ సదుపాయమే సదుపాయము. జీవాత్మ సతతము ఆనందముగ నుండుటకు 'సత్'తో కూడియుండుటయే ఉపాయము. దానికే శాస్త్రములు 'సత్' నెరిగిన వారి ద్వారా ప్రకటింపబడినవి. వారు రచించినవి కావు. కనుక అవి అపౌరుషేయములు.

శాస్త్రముల నెరుగవలె ననినచో శాస్త్ర విషయములందు కేవలము మనోప్రజ్ఞలను ప్రయోగించిన చాలదు. శ్రీమాతయే సర్వ శాస్త్రముల సారమని గుర్తెరిగి, శ్రీమాతను ఆరాధన చేయుచు శాస్త్రముల నభ్యసింపవలెను. శ్రీమాతను మరచి కేవలము మానసిక ప్రజ్ఞతో శాస్త్రముల నభ్యసించినచో తన మనస్సునకు తెలిసినదే శాస్త్రమని అనిపించును. గొట్టము నుండి ఆకాశము చూచి, ఆకాశము నెరిగితినని

భావించినట్లుండును. అందులకే శాస్త్రచర్చలు జరుగుచుండును. వాదములు జరుగుచుండును. పోటీలు పడుచుండుట, పండితులమని భ్రమపడుట యుండును. ఇట్టి వారి వలన లోకమున యెట్టి ప్రయోజనము లేదు. లోకహిత కార్యములకు తమను తాము సమర్పించుకొనక తమ గుర్తింపునకై సభలలో ప్రసంగములు చేయుట, ప్రజలను మభ్యపెట్టుట యుండును. సత్కారముల కొరకు, బహుమానముల కొరకు, బిరుదుల కొరకు జీవితము వెచ్చింపబడుచు నుండును.

“నన్నెరుగక శాస్త్రముల నెన్ని చదివినను ఫలిత ముండదు. నాతో కూడి శాస్త్రముల నెఱుగుము.” అని శ్రీకృష్ణుడు గీతలో పలికినాడు. దైవము నెరిగినవారే శాస్త్రముల నెరిగిన వారగుదురు. దైవ సాన్నిధ్యముతోనే శాస్త్రముల నభ్యసింపవలెను.

శాస్త్రములు కోకొల్లలుగ నున్నవి. ముఖ్యముగ 64 శాస్త్రములను ఆర్ష సంప్రదాయమున తెలుపుదురు. ఇవి అన్నియూ ముందు నామములలో పేర్కొనబడినవి. వేదము నెఱుగుటకు ముఖ్యముగా కావలసిన శాస్త్రములు : 1. జ్యోతిషము, 2. ఛందస్సు, 3. నిరుక్తము, 4. వ్యాకరణము, 5. కల్పము, 6. శిక్ష. వీనిని వేదాంగములందురు. శ్రద్ధా భక్తులతో తానుపాసించు దైవము, సద్గురువు సాన్నిధ్యమును అనుభవించుచూ ఈ శాస్త్రములను పఠింపవలెను. నిజమునకు దైవ గురు సాన్నిధ్యమే శాస్త్రములకు తాళము చెవి. శ్రీమాత అట్టి తాళపు చెవి. ఆమె అనుగ్రహమున్నచో తెలియని శాస్త్ర ముండదు. శాస్త్రముల సారము ఆమెయే. మహాకవులు, ఋషులు శాస్త్రముల నిట్లే నెరిగినారు.

# 846. 'మంత్రసారా'

**మం**త్రముల సారము శ్రీమాత అని అర్థము.

వేదమంత్రము లనేకములు. కోకొల్లలుగ నున్నవి. ఏకాక్షరీ (1), ద్వయాక్షరీ (2), త్రయాక్షరీ (3), పంచాక్షరీ (5), షడాక్షరీ (6), అష్టాక్షరీ (8), ఏకాదశాక్షరీ (11), ద్వాదశాక్షరీ (12), షోడశాక్షరీ (16), అష్టాదశాక్షరీ (18), ఏక వింశత్యక్షరీ (21), చతుర్వింశత్యక్షరీ (24). ఇట్లు ఎన్నియో మంత్రము లున్నవి. మననము చేయుచున్నకొలదీ రక్షించునవి మంత్రములు. శ్రీ లలితా సహస్రనామ స్తోత్ర మహా మంత్రము అతి విపులమైన మంత్రము. అదియే మహా మంత్రము, మహాయంత్రము, మహాతంత్రము. ఈ మంత్రముల సారమంతయూ మహాచైతన్యమే. ఒకే వెలుగు అనేక రూపములతో, అనేక కాంతులతో మహాసుందరముగ సృష్టి యందున్నది. సృష్టిని మించి కూడ యున్నది. రుచిని బట్టి మంత్రోపాసనములు సాగుచు నుండును. ఆయా కాంతులతో, ఆయా దివ్యరూపములతో గోచరించునది, రక్షించునది, ఉద్ధరించునది, నడుపునది శ్రీమాతయే.

సర్వమంత్రముల సారము, సర్వశాస్త్రముల సారము, సర్వ ఛందస్సుల సార మెఱిగితినని బాలుడైన ప్రహ్లాదుడు తండ్రియగు హిరణ్యకశిపునకు తెలిపెను. మహాచైతన్యమును మహా విష్ణు రూపమున నెరిగినవా డతడు. కనుక తెలియవలసిన దంతయూ తెలిసినదని

నిర్భీతిగ పలికెను. ఆచరణమున చూపెను. విష్ణుభక్తుడన్ననూ, శ్రీమాత భక్తుడన్ననూ, శివభక్తుడన్ననూ ఒక్కటియే. సృష్టి అంతయూ శివాశివమే. అన్య మేమియూ లేదు అని తెలియుటయే సారమును తెలియుట. అది తానే అని కూడ తెలియును. తానుగను, యితరముగను గోచరించు చున్నదదియే. ఇట్టి భావము స్థిరపడినపుడు తెలియని దుండుట యుండదు. దీనికి భక్తి ప్రధానము. అవిభక్తుడే భక్తుడు. సర్వమునూ తానే యైననాడు, ఆత్మభవుని, ఈశ్వరుని తెలియుటయే తెలియుట. ఈ మొత్తమంతయూ అదియే. మొత్తమున తాను కూడ యున్నాడు. ఇది అదియే అని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. "ఓం ఇతి యే తత్." ఎన్ని రకములుగ చెప్పుకున్ననూ మిగులునదదియే. ఎన్నియో రుచికరమగు వంటకము లున్నవి. అన్నియును ఆకలి తీరుటకే, తృప్తి కలుగుటకే. వేయి రకములుగ శ్రీమాతను వర్ణించుటలో అంతరార్థము మాత సాన్నిధ్య రుచి తెలిసి అందు స్థిరపడుటకే!

(గమనిక : మంత్రోపాసన మెట్లు చేయవలెనో, వాని సామాన్య నియమము లేమో తెలియుటకు గ్రంథకర్త రచించిన ***"మంత్రములు"*** అను చిన్న పుస్తకమొకటి యున్నది.)



# 847. 'తలోదరీ'

**హ**స్తమువంటి సన్నని నడుము కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత ఉదరము (పొట్ట) హస్తమువలె పలుచగ యుండును. ఆమె హస్తము కూడ తమలపాకువలె సున్నితముగ, కోమలముగ యుండును. మొత్తము రూపమే కోమలము, సున్నితము. అందు నడుము వున్నదో, లేదో అన్నట్లుండును. ఈ విషయము ప్రారంభముననే ప్రస్తుతింప బడినది (35వ నామము). మరల నడుమ కూడ ప్రస్తుతింప బడినది (శాతోదరీ). మరల ఇపుడు నవమ శతకమున ప్రస్తుతింప బడుచున్నది.

శరీరమున వాతము చేరకున్నచో నడుము సన్నముగ నుండును. సాధకులకు కూడ నడుము సన్నముగ నుండుట ముఖ్యము. లేనిచో శరీరము రోగములవాత బడును. శరీరము రోగగ్రస్తమైనచో భక్తి సాధనకు, యోగసాధనకు, ధర్మ కర్మ సాధనకు వినియోగపడదు. శరీరమే అవరోధము లేర్పరచినచో జీవు డవశు డగును. కనుక సముచితమగు ఆహారము, యోగాసనాభ్యాసము తప్పనిసరి యగును. స్వాధిష్ఠానము ప్రచోదన మగుటకే కటి ప్రదేశము బలముగను, సన్నము గను, నిట్టనిలువుగను నేర్పరచుకొను బాధ్యత భక్తునదే. వలసిన స్ఫూర్తి నివ్వమని శ్రీమాత నారాధింపవచ్చును. మూడు మార్లుగ శ్రీమాత నడుమును గూర్చి తెలుపుటలో, ఉపాసకులకు హెచ్చరిక కూడ యున్నదని తెలియవలెను. బొజ్జలు పెంచుకొనుట అపాయకరము.

# 848. 'ఉదారకీర్తి'

మహత్తరమైన కీర్తి కలది శ్రీమాత అని అర్థము.

మహత్తరముగా మొత్తము వ్యాపించునది లేక అంతటా వ్యాపించునది. 'ఉత్' అనగా ఊర్ధ్వముగా, 'ఆర' అనగా శీఘ్రముగా అని అర్థములు. ఊర్ధ్వమగు కీర్తి శీఘ్రముగా కలుగజేయునది శ్రీమాత అని అర్థము. 'ఉః' అనగా బిడ్డలు. 'ఆరాః' అనగా దేవతలు. దేవతలు తన బిడ్డలుగా కీర్తిపొందినది శ్రీమాత. ఉదార అను పదమునకు అనేక అర్థము లున్నవి.

శ్రీమాతను ఉపాసించువారు విశ్వవ్యాప్తమైన కీర్తి పొందుదురు. దేవతలకంటే మించిన కీర్తి పొందుదురు. ఆమె అందించు కీర్తి బాధారహితమైన కీర్తియై యుండును. శ్రీమాత ఇహ పర లోకములందు కీర్తి నందించగలదు. ఆరాధన యందు శ్రద్ధ, భక్తి యున్నచో శుచి శుభ్రతల యందు ఆసక్తి కలుగును. క్రమముగ మాలిన్యములు దేహము లందు తొలగును. నిరంతర ఆరాధన వలన మనోమాలిన్యము లుండవు. మాలిన్యము లేనివారియందు క్రమముగా శక్తి సామర్థ్యములు పెరుగును. తత్ఫలితముగ సంపద, కీర్తి దగ్గరగుచుండును. దురదృష్టము తొలగి అదృష్టము దరిచేరును. ఆరాధన యందు బుద్ధి పుట్టవలెనే గాని అట్టి బుద్ధి కలిగినచో దీపపు కాంతిలో చీకటి అదృశ్యమైనట్లు మాలిన్యములన్నీ తొలగి కీర్తి ప్రతిష్ఠలు కలుగుచుండును.

# 849. 'ఉద్ధామవైభవా'

కొలతలు లేని వైభవము కలది శ్రీమాత అని అర్థము.

ఆమె అనంతమగు ప్రకాశ మగుటచే, ఆ ప్రకాశమును కొలుచు వారెవరునూ లేరు. సృష్టి యందంతయూ ఆమె వైభవము నుండి పుట్టినదే. ఆమె నుండి పుట్టినవి ఆమెను కొలతలు వేయలేవు. కొలతలకే కొలత ఆమె.

దామ అనగా కొలతలు వేయువాడు. బంధించు త్రాడు. ఆమెను బంధించగల త్రాడు లేదు. బాలకృష్ణుని బంధించుటకు యశోద ప్రయత్నించి విఫలమైనది. ఎంత త్రాడు తెచ్చిననూ బాలకృష్ణుని నడుము చుట్టుకొలతలకు రాలేదు. అపుడు యశోద సంభ్రమాశ్చర్యములకు గురియై తన కుమారుడుగ గోచరించు బాలుడు విశ్వమూర్తి యని తెలిసి విస్తుపోయెను. కృష్ణుని వైభవమును ఎవ్వరునూ కొనియాడ లేకపోయిరి. అట్లే శ్రీమాత వైభవము కూడ. కొలతల కందని దైవము వైభవము కూడ కొలతల కందదు. ఉద్ధామ వైభవమూర్తి శ్రీమాత.



# 850. 'వర్ణరూపిణీ'

**వ**ర్ణముల రూపము శ్రీమాత అని అర్థము.

అక్షరములకు శబ్దరూపముగ రంగుల రూపముగ ఆకారము లుగా శ్రీమాతయే యేర్పడుచున్నది. అక్షరము తానే. క్షరము కానిది కదా శ్రీమాత! తనకు తానే శబ్దమై, వెలుగై, రూపమై వర్తించు చుండును. ఎన్ని రూపము లున్నవో అన్ని వర్ణము లున్నవి. అనగా రంగులు వున్నవి. శబ్దములు వున్నవి. ముందు నామములలో వర్ణ విశేషమును వివరించుట జరిగినది. అరువది నాలుగు వర్ణములతో అలరారు చున్నది శ్రీమాత అని తెలుపబడినది. అందువలన మరల వివరించు ప్రయత్నము చేయుట లేదు.



# 851. 'జన్మమృత్యుజరాతప్త జనవిశ్రాంతిదాయినీ'

**జ**ననము, మరణము, ముసలితనమూ అను బాధలచే తపించు జీవులకు విశ్రాంతి నిచ్చునది శ్రీమాత.

నిత్యమూ నిద్రయందు జీవులకు విశ్రాంతి ప్రసాదించుచున్నది. అవిద్యను తొలగించి శాశ్వతమగు విశ్రాంతిని కలిగించుచున్నది. ప్రళయమున కూడ జీవులకు విశ్రాంతి కలిగించు చున్నది. ఇట్లు మూడు రకములగు దుఃఖములకు మూడు విధములుగ విశ్రాంతి నిచ్చును. ఆత్మజ్ఞానము కలవారికి నిత్యవిశ్రాంతి. ఇతరులకు నిద్ర, ప్రళయము తాత్కాలిక విశ్రాంతి. జీవుల యందు కరుణతో ఇట్టి విశ్రాంతి నేర్పరచునది శ్రీమాత. విశ్రాంతిని కోరువారు తల్లి నాశ్రయించు టయే శ్రేయస్కరము.



# 852. 'సర్వోపనిషదుద్ఘుష్టా'

సమస్తమైన ఉపనిషత్తులు ఉచ్ఛైశ్వరముతో శ్రీమాతనే ప్రకటించు చున్నవని అని అర్థము.

ఉద్ఘుష్టా అనగా అధికముగా, వుత్తమముగ పలుకబడుట లేక ప్రకటింపబడుట, నిస్సంశయముగా, నిస్సందేహముగ నిశ్చయముగా ఉపనిషత్తులన్నియూ బ్రహ్మమునే ప్రతిపాదించుచున్నవి. శ్రీమాత బ్రహ్మమే. ప్రకటితము, అప్రకటితమగు బ్రహ్మముగా శ్రీమాత యున్నది. ఉపనిషత్తులన్నియూ అనేక విధములుగ బ్రహ్మమును ప్రతిపాదించుట, బ్రహ్మమును చేరుమార్గమును సూచించుట చేయు చున్నవి. మార్గము లనేకములైననూ గమ్యము బ్రహ్మమే. అన్ని ఉపనిషత్తులునూ బ్రహ్మమునే బోధించుచున్నవి. దేవీ స్వరూపమునే తెలుపుచున్నవి. ద్వైత భావమును నాశమొనర్చి బ్రహ్మ సామీప్యమును పొందించుట ఉపనిషత్తుల ఆశయము. అవిద్యను తొలగించునది ఉపనిషత్తు. వాని నడుమ నిజమైన భేదము లేదు. వేరు వేరుగ చెప్పిననూ ఒకే బ్రహ్మమును నిరూపించు చున్నవి. ఒక్కొక్క ఉపనిషత్తునందు బ్రహ్మము నిరూపణము ఒక్కొక్క రకముగ నున్ననూ ప్రతిపాదింపబడు బ్రహ్మమొక్కటే. అది శ్రీమాతయే.



# 853. 'శాంత్యతీత కళాత్మికా'

అతీత శాంతి కళగా శ్రీమాత యున్నదని అర్థము.

ఆకాశమందుండు వెలుగు లేక కళ శాంతికి చిహ్నము. అట్లు ప్రకాశించునది శ్రీమాతయే. అయినప్పటికి ఆమె నిజమగు కళ ఆకాశ కాంతిని కూడ అతిక్రమించి యుండును. అతీతమగు శాంతి ఆమె కళ. ద్వైతబుద్ధి యున్నచోట శాంతి యుండదు. నేను యితరము అని భావించుట ద్వైతబుద్ధి. ఇతరము కూడ తానే. తానే యితరముగ కూడ నున్నాడు. నిజమున కితరము లేదు. తానే యున్నాడు. ఈ సత్యమే శాశ్వత ఆనందము. అట్టి ఆనందరూపము శ్రీమాత.

"నేనే యున్నాను. నీవుగ కూడ నేనే యున్నాను. నా కన్న వేరుగ నీవున్నావని నీవనుకొనుచున్నావు. నిజమునకు నీవు లేవు. నేనే, నేనుగ, నీవుగ కూడ వున్నాను" అని శ్రీకృష్ణుడు అర్జునునితో పరమ రహస్యమును భగవద్గీత తొమ్మిదవ అధ్యాయమున తెలిపెను. నారాయణుడే నరుడుగ కూడ యున్నాడని కూడ తెలిపెను. అదియే రాజవిద్య యనెను. రాజ రహస్యమని కూడ పలికెను. ఎన్నిమార్లు చెప్పిననూ, ఎన్నిమార్లు విన్ననూ, చదివిననూ జీవులు మరతురు. కనుక నిజమగు రహస్యము రాజ రహస్యమని తెలుపుటలో గూఢార్థమిదియే. తెలిసినదే మరచుట వలన మరల మరల చెప్పవలసి వచ్చును.

సముద్రమే అలగ నున్నది. బంగారమే ఉంగరముగ నున్నది. మట్టియే కుండగ నున్నది కాని అల, ఉంగరము, కుండ చూచినపుడు

మూలము గుర్తుకు రాదు. భార్యను చూచినపుడు, భార్య అను భావమే గుర్తుకు వచ్చునుగాని, దైవమే భార్యగ వున్నదని గుర్తుకు రాదు. దేనిని చూచిననూ రూపము, నామము, వానితో గల సంబంధము మాత్రమే గుర్తుకు వచ్చునుగాని వాని కతీతమైన దైవము గుర్తుకు రాదు. గుర్తుకు వచ్చిననూ చూచువాడి రూపమున కూడ దైవమే వున్నాడని గుర్తుకు వచ్చునా? వచ్చినవారే ద్వైతబుద్ధి దాటినవారు. తాత్కాలికముగ దాటినను శాశ్వతముగను, అనుస్యూతముగను అట్టి స్థితి యందుండుట యోగేశ్వరు డగు శ్రీకృష్ణునికి మాత్రమే సాధ్యపడినది. కృష్ణ అను నామము శ్రీలలిత యొక్క మరియొక నామము. ఆమెయే యోగేశ్వరి. భేదబుద్ధి లేని శాశ్వత తత్త్వ మామెయే. కనుక శాంత్యతీత కళాత్మకా అని కీర్తింపబడు చున్నది. అతీతమగు శాంతి తన కళగా ప్రకాశించు చున్నది.



# 854. 'గంభీరా'

**లో**తులకందనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత లోతు లెవ్వరునూ ఎరుగలేరు. అంతము లేని తత్త్వ మది. సహస్రనామములలో వివరించుటకు వీలుపడనిది. వెయ్యి పడగల వాడు కూడ వర్ణింపలేడు. తెలుపువానిని బట్టి తెలియుచు నుండును. వివరించినవానిని బట్టి వివరింపబడును. ఎంత తెలిపిననూ తెలుపబడనిదే మిక్కుటముగ నుండును. ఆకాశపుటంచు లెవ్వరెరుగ గలరు? ఎఱుగు ప్రయత్నమున ఎఱుగుచున్నవాడు తాదాప్యము చెందుటయేగాని పూర్ణముగ తెలియుటకు వీలుపడదు. తెలియబడదని తెలియుటయే తెలివి. తెలిసినదనువాడు తెలియని వాడే. పరమ హంస యగు శ్రీరామకృష్ణుడు శిష్యుల ప్రార్థన మన్నించుటకై అనేక మార్లు శ్రీమాతను గూర్చి తెలియబరచుచూ, పరవశము చెంది మౌనముగ నుండిపోయెడువాడు. అటుపైన తెలివిని పొంది "ఏమి జరిగినది?" అని ప్రశ్నించెడివాడట. శిష్యులు నిస్పృహతో "ముహూర్తకాలముననే మీరు అమ్మ పరవశమున మునిగి మౌనులై ఆనంద బాష్పములు వర్షించుటయే జరుగుచున్నది. అంతకుమించి మాకెట్టి ప్రాప్తి లేదు. మీ అమితానందము చూసి ఆనందించుటయో, మీ మౌనమునకు నిస్పృహ చెందుటయో మాకు మిగులు చున్నది." అని వాపోయెడివా రట. "అమ్మ అతి గంభీర. ఆమెను గూర్చి ఏమని చెప్పగలను? భక్తి

కుదిరినచో మీకును నావంటి స్థితి కలుగును. అందులకై తప్పక ప్రార్థింతును.” అని రామకృష్ణుల వారు పూరడించెడి వారట. సప్త ఋషులు గాని, సనక సనందనాది కుమారులు గాని, నారదమహర్షి గాని, త్రిమూర్తులు గాని, ఎవ్వరైననూ ఆమెలోతు లెరుగుట అశక్యము. ఆమె అతి గంభీర.



# 855. 'గగనాంతస్థా'

గగనముల నడుమ నుండునది శ్రీమాత అని అర్థము.

గగనము లనగా ఆకాశములు. ఆకాశములు ప్రధానముగ మూడు. అవి పరాకాశము, మహదాకాశము, ఆకాశము. పరాకాశము బ్రహ్మము, మహదాకాశము శ్రీమాత మహత్తు. ఆకాశము పంచ భూతముల పుట్టుక చోటు. వీని వివరములు ముందు నామములలో తెలుపబడినవి. పరాకాశము నుండి సంకల్పము వ్యక్తమై ప్రకృతి, కాలము, చోటు యేర్పడును. ఆ చోటును మాయ యని, మహత్తని యందురు. అదియే మహదాకాశము. అందుండి త్రివిధములగు మహత్తు లేర్పడును. ఆ మహత్తుల నుండే దేవతాశక్తు లేర్పడును. అవి అన్నియూ (27) కూడి విరాట్ అను అండ మేర్పడును. ఆ అండము నుండి అగ్ని, వాయువు, సూర్యుడు ఆదిగా శక్తులతో కూడిన విరాట్పురుషు డేర్పడును. అతని బొడ్డు నుండి చతుర్ముఖ బ్రహ్మ సృష్టికర్తగ యేర్పడును. అటుపైన కుమారులు, రుద్రులు, ప్రజాపతులు, మనువులు ఆదిగాగల సృష్టి యేర్పడును. అటుపైన సృష్టి విస్తారమై పంచభూతము లేర్పడగ అందు ప్రధానముగ ఆకాశ మేర్పడును. ఈ మొత్తము నందు నిండినచోటు ఆకాశము ఏర్పడిన వానియందు, వానిలో వెలుపల నిండినది చోటే. ఖాళీగా కనపడుచోటు వస్తువుల లోపల కూడ యున్నది. అణువు లోపల అణువు బైట కూడ నిండియున్నది చోటే. ఇట్లంతటా వ్యాప్తి

చెందినది శ్రీమాత. నారాయణి అన్నది మరియొక పదము. *"అంతర్ బహిశ్చతత్సర్వం వ్యాప్త నారాయణ స్థితః ।"* అని వేదము ఘోషించు చున్నది. లోపల బైట అంతటా నారాయణుడే వ్యాపించి స్థితిగొని యున్నాడని అర్థము. గగనాంతస్థా అనిననూ అదే అర్థము. *"సయ ఏషో అంతర్ హృదయ ఆకాశః ।"* అని ఈ విషయమునే తైత్తిరీయమున ఉపదే శింపబడినది. అతడు హృదయాకాశమునందే యున్నాడు. అతడే పురుషుడు *(సయేక పురుషః)* అతడొక్కడే అన్నిటియందు వసించి యున్నాడు. ఇట్టి వానిని చూచుట సులభము మరియు కష్టము. కనబడుచునే కనబడడు. వినబడుచునే వినబడడు. ఉండియూ లేనట్లుండును. లేనిచోటు లేనే లేదు. కనుక చోటును ఖాళీ అని భావింపరాదు. అతడు నిండి యున్నాడని గుర్తెరిగి యుండవలెను. అన్నిటా, అంతటా, లోపల, బైట వ్యాపించి యున్నది అతడే. అతడన్ననూ ఆమె యన్ననూ ఒక్కటియే. దేవీ పరముగ మాత యనియు, శివ వైష్ణవ పరముగ అతడనియూ అనుట ఆచారము. నిజమునకు అది అనవలెను. ఎప్పటికప్పుడు ఇట్లు సమన్వయించుకొనుచునే యుండవలెను. అపుడే సత్యము స్థిరపడును.



# 856. 'గర్వితా'

గర్వించదగినది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత సృష్టి నిర్వహణమును దర్శించుచూ మహాశివుడు గర్వించ దగిన సమస్త గుణ విశేషములు శ్రీమాత యందే యున్నవి. ఆమెను ఏ గుణము నందునూ, సమర్థత యందునూ, చాతుర్యము నందునూ, అందము నందునూ, ప్రేమ యందునూ మించిన వారెవ్వరునూ లేరు. ఆమెకు ఆమెయే సాటి. ఆమె వలన శివుని కేపనియూ లేదు. సృష్టి యందంతయూ ఆమెయే చక్క బెట్టగల ధీమంతురాలు. ముచ్చట కెప్పుడైనా తాను తప్పించుకొను నేమోగాని నిజమున కవసరమే లేదు. మహాశివుడే మెచ్చుకొనదగిన స్థితి శ్రీమాతకే యున్నది. నటరాజుతో నృత్యమునకు కూడా ఆమెయే సరిజోడు. శ్రీమాత స్థానము సృష్టియందు అత్యంత గౌరవప్రదము. గర్వకారణము కూడా. ఆమె కనుకొనలలో అట్టి గర్వపు జీర తొణికిసలాడుచూ ఆమెకే తగినట్లుగ యుండును. నిజమునకు గర్వించుటకు అంతకు మించిన స్థితి యేమున్నది? ఆమెను చూచి శివబ్రహ్మము గర్వించును. ఆమె కుమారులగు త్రిమూర్తులు కూడ తల్లిని చూచి గర్వించు చుందురు. అమ్మలగన్న యమ్మ అగుటచే, సత్త్వ గుణోపేతు లందరునూ ఆమెను స్మరించుచూ అమ్మ భక్తులమని ఒకించుక గర్వముతో వున్ననూ తప్పు లేదు. పొరపడని గర్వము సముచితమే. అది ఆత్మ విశ్వాసమును ప్రకటించునే గాని మరి యితరము గాదు.

# 857. 'గానలోలుపా'

గానము నందాసక్తి కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత సంగీత ప్రియ. ఆమెకు సంగీతమనిన అమితప్రియము. గానాలాపన మాధుర్యమునకు ఆమె పరవశించును. వీణానాదమనిన అమితమగు ప్రేమ. తానే స్వయముగ వీణా వాయిద్యమును గావించు చుండును. సృష్టియే ఒక సంగీతముగ నేర్పరచినది శ్రీమాత. భక్తి రస ప్రధానమగు సంగీతమున కామె ప్రాధాన్యమిచ్చును. ప్రతి యింటను శ్రీమాత ప్రతినిధిగ సంగీత వాద్యము నొకటి పూజ్యప్రాయముగ యేర్పరచుకొను సంప్రదాయము భారతీయు లందున్నది. నేటికినీ సంప్రదాయమగు గృహములలో శ్రీమాత ప్రతిరూపముగ వీణను యేర్పరచుకొనుచుందురు. అతిథులకు వీణా దర్శనమును గావింతురు. శారదా రూపముగ వీణను ఆరాధించు సంప్రదాయమును దక్షిణాది యందు మెండుగ యున్నది. అమ్మ అనుగ్రహము గలవారే మృదు మధురమగు గానము నొనర్చగలరు. ఆర్తులై గాన మొనర్చు వారిని ఎన్నియో సందర్భములలో అప్పటికప్పుడు బ్రోచునది శ్రీమాతయే. నను బ్రోవమని చెప్పవే అని రామదాసు కీర్తించిననూ, త్యాగయ్య కీర్తించిననూ, అన్నమయ్య కీర్తించిననూ ఆలకించి దైవమును ప్రోత్సహించునది కూడ శ్రీమాతయే. గానమునకు లోబడి పరవశయై సాన్నిధ్య మిచ్చు తల్లి ఆమె. గాంధర్వ గానము నుండి పామరుల గానము వరకు అందరి గానములను ఆలకించును. భక్తి యున్నచోట ఆలాపన సహజము. ఆర్తితో ఆలాపన చేయువారికి సులభ సాధ్యమై నిలచును.

# 858. 'కల్పనారహితా'

ప్రాపంచిక వాసనామయమగు మాయాకల్పితములను దహింప చేయునది శ్రీమాత అని అర్థము.

జీవులు అవిద్యావసులై వాసనామయములైన ప్రాపంచిక భ్రమల యందు, భ్రాంతులయందు చిక్కుకొని సుఖదుఃఖముల ననుభవించుచూ, జనన మరణములను పొందుచూ నుందురు. ఈ వాసన లన్నియూ మాయా కల్పితములే. తన నారాధించువారిని ఇట్టి కల్పిత మాయ నుండి క్రమముగ ఉద్ధరించును. ఆమె మాయను ఆమె ఆరాధన బలముననే దాటుట సాధ్యము. మాయను కల్పించునది ఆమెయే. తొలగించునది కూడ ఆమెయే. ఆమె ఘటనా ఘటన సమర్థురాలు.

అంతేకాక కల్పాంతమున ప్రళయమేర్పడగా అట్టి ప్రళయమందు జీవులు లయము చెందక, నశించక, వుండుటకై తన కుక్షియందు ఇముడ్చుకొని రక్షించుకొనును. కల్పాంతమందు, జీవులు రహితము కాకుండగ రక్షించును. వాసనామయ రూపములతో జీవులు శ్రీమాత చిత్సాగరమున చేరి వసింతురు. మరల సృష్టి ఆరంభమున వారి వారి వాసనలు ఆధారముగ వారి పూర్వ స్థితులలో వాసనా బలముతో ప్రవేశించి అర్థాంతముగ ముగిసిన పరిణామ కథను మరల కొనసా గింతురు. ఈ విషయమునే గీత పదిహేనవ అధ్యాయమగు పురుషోత్తమ ప్రాప్తి యోగమున శ్రీకృష్ణుడు అర్జునునకు వివరించినాడు. వాసన లన్నియూ తీరువరకూ జీవులు జన్మ పరంపరలలో కొనసాగుచూ నుందురు. వాసనలనుండి రక్షించునది కూడ మరల శ్రీమాతయే.

# 859. 'కాష్ఠా'

పదునెనిమిది రెప్పపాట్ల కాలము కాష్ఠ అనబడును.

కాష్ఠా అనగా దాటియుండునది. అతిక్రమించి యుండునది. *"అత్యతిష్ఠద్దశాంగుళం"* పది అంగుళములు మించి యున్నది అని పురుష సూక్తము పలుకును. సృష్టిక్రమమును పది అంగములుగను, పదునెనిమిది అంశములుగను, 3, 5, 7, 9 అంగములుగను, యిట్లనేక విధములుగ ఋషులు వర్ణించిరి. సృష్టి అంతయును నిర్మించి అందు ప్రవేశించి, దానిని అతిక్రమించి కూడ యుండునది శ్రీమాత. అందువలన కాష్ఠా అని పిలువబడుచున్నది.

వృక్షము యొక్క బీజము, అందు అంకుర శక్తి, బోదె, కాండము, శాఖ, ఉపశాఖ, వర్ణములు పరిణమించిన రూప మగుటచే, అందు ప్రతిభాగము మొత్తము కూడా శివశక్తియే కనుక వృక్షము నుండియే యేర్పడిన కొయ్య బొమ్మను, కొయ్యముక్కను కాష్ఠమని, కాష్ఠరూపమున శ్రీమాత యున్నదని ఋషులు వర్ణించిరి.

కాలము కూడ శ్రీమాతయే గనుక రెప్పపాటు కాలము కూడ శ్రీమాతయే అగును. కాలస్వరూపిణిగా శ్రీమాతను రెప్పపాటు కాలమున కూడ దర్శించ వచ్చునని అర్థము.

తత్త్వమును కూడ కాష్ఠ యనియే పిలుతురు. వేదాంత వాక్యము లచే ప్రత్యక్షముగను, పరోక్షముగను తత్త్వము నిరూపింపబడుచున్నది. అట్లు నిరూపింపబడిన తత్త్వమును కూడ కాష్ఠ అందురు.

# 860. 'అకాంతా'

**పా**పమును, దుఃఖమును, నరకమును నశింపజేయునది శ్రీమాత అని అర్థము.

'అకము' అనగా నరకము. 'న అకము' లేక నాకము అనగా స్వర్గము. 'అకమును' అంతము చేయునది 'అకాంతా' అగుటచే శ్రీమాతను 'అకాంతా' అని ఋషులు సంబోధించిరి. పాపమునకు, దుఃఖమునకు, నరకమునకు అవిద్యయే కారణము. అవిద్య నంతము చేయుట శ్రీమాత హస్తగత విద్య. మాయ కాంతకాగా, ఆమె మాయాచ్ఛేదన శక్తి అకాంతయై యున్నది. మాయవలన వున్నది మరుగై, లేనిది వున్నట్లు కనిపించును. జ్ఞానము వలన మరల వున్నది గోచరించును. శ్రీమాత కాంత, మఱియు అకాంత కూడను నై యున్నది. కాంతార మనగా చీకటి, అకాంతారము వెలుగు. చీకటిన పడిన వారిని కాంతార వాసు లందురు. వెలుగు చేరిన వారిని అకాంతార వాసు లందురు. చీకటి వెలుగులుగ శ్రీమాతయే యున్నది. పూర్ణిమ, అమావాస్యలుగ కూడ ఆమెయే యున్నది. కృష్ణ, శుక్ల పక్షములు, దక్షిణాయన, ఉత్తరాయణములు, కాంతాకాంతలు, పుణ్యాపాపములు, సుఖ దుఃఖములు, హాని వృద్ధులు– ఇట్లు ఎన్ని ద్వంద్వములనైననూ ఏర్పరచగల దిట్ట శ్రీమాత. సురాసురులు కూడ అట్టి వారే. ఇట్లు ద్వంద్వమే సృష్టి కాధారము కనుక ఆమెయే విద్య అవిద్యలుగ అలరారు చున్నది. కాంతా ఆమెయే అకాంతా ఆమెయే.

# 861. 'కాంతార్ధవిగ్రహా'

సగము శరీరము శ్రీమాత, సగము శరీరము పరమశివుడుగా అర్ధనారీశ్వర తత్త్వమును కలిగి యున్నది శ్రీమాత అని అర్థము.

రూపము లన్నియూ ప్రకృతి పురుషుల సమాగమ పరమే. విద్యుత్తునకు రూపము లేదు. అది కనబడదు. కాని దాని వెలుగు కనబడును. విద్యుత్ వెలుగును చూచి విద్యుత్తు ఉన్నదని గ్రహింతుము. కనబడునది ప్రకృతి. కనపడనిది పురుషుడు. పురుషుడులేని ప్రకృతి లేదు. ప్రకృతిలేని పురుషుడునూ లేడు. పురముండిననే కదా పురుషు డుండుట! పురము కనపడును. అందు వసించు పురుషుడు కనపడడు. పురము వలన పురుషుడు తెలియును. పురుషుడు లేక పురమేర్పడదు. అంకురశక్తి గోచరింపదు. అంకురము గోచరించును. బీజము భూమిలో పాతినపుడు మొలచు శక్తి వలన బీజము పెరుగును. భూమి లేక బీజము పెరుగదు. బీజము లేక భూమి పెంచున దేమియునూ లేదు. సృష్టి యందు కనపడనిది ఆధారముగ కనపడునది క్రమముగ యేర్పడును. కనపడనిది శివుడు. కనపడునది శివాని. ఒకటిగ గోచరించున దేదియైననూ నిజమునకు రెండే. రెండు కానిచో గోచరింపదు.

ముందు నామములో అకాంత తెలుపబడినది. ఈ వివరణ ములో కాంతా అకాంతల పరస్పరత్వము వివరింపబడినది. కాంతలేని

అకాంత లేదు. అకాంత లేని కాంత లేదు. వెలుగున్నచోట చీకటి యుండును. చీకటి యున్నచోట వెలుగున్నది. చీకటి కావలి వెలుగే చీకటి కాధారము. *"ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్ ।"* అని వేదము తెలుపుచున్నది.

మిథునరాశి పైన తెలిపిన అర్ధనారీశ్వర తత్త్వమును ప్రకటించును. ఉత్తర దక్షిణములవలె, తూర్పు పడమరల వలె బ్రహ్మము సంకల్పమై ఒకదాని కొకటి ప్రత్యన్ముఖమైనపుడు సృష్టి అవతరించును. సృష్టి అంతయూ ప్రకృతి పురుషుల నిలయము. దానినే 'రాధామాధవమ్' అని కూడ అందురు.



# 862. 'కార్యకారణ నిర్ముక్తా'

**కా**ర్యకారణములు లేనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతకు చేయవలసిన కార్యము లేదు. చేయుటకు కారణము లేదు. నిత్య సంతుష్టులు చేయవలసిన దేమున్నది? పరిపూర్ణులకు కోరిక లుండవు. చేయవలసిన పనులేవియూ ఉండవు. సామాన్యుల వలె కార్యములకు కారణము లుండవు. వారు నిత్యానందులు. కారణము లుండుట వలన కార్యములు చేయువారు సామాన్యులు. వారికి కార్యము నుండి మరల కారణములు పుట్టు చుండును. కారణము నుండి కార్యము, కార్యము నుండి కారణములు ఎడతెగక సాగుచు నుండును. ఇట్లు కార్య కారణ చక్రమున అనేకానేక జీవులు తిరుగాడుచు నుందురు. కోరికయే కారణముగా కార్యములు సాగుచుండును. కోరికలు లేనిచోట చేయుటకు కారణము లేదు. కార్యమూ లేదు. అట్టివారు చేయు కార్యములు నిష్కారణములు.

పెద్దలు క్రీడలు సలిపినపుడు ఆనందము కోసమో, గెలుపు కోసమో ఆడుదురు. అచట ఆనందించవలెనను కారణ మున్నది. గెలువవలె నను కారణ మున్నది. అట్టివారు ఆడు ఆటలకు కారణ మున్నది. కనుక కోరిక యున్నదని అర్థము. ఆనందము కావలెనని, గెలుపు కావలెనని కదా! ఆడుటకు అట్టి కోరిక యుండుటచే దుఃఖము, ఓటమి కలుగవచ్చును. చిన్నపిల్లలు ఆటలాడుటకు కారణ ముండదు.

వారి క్రీడ సహజము. మూడు సంవత్సరముల పిల్లలకు ఆడుకొనుటయే యుండును కాని ఆనందము కోసము ఆడుకొనుచున్నామని తెలియదు. గెలుపుకోసము ఆడవలెననియూ తెలియదు. వారి క్రీడలు నిష్కారణము. అందువలననే సహజానందముతో ఆడుదురు. క్రమముగ ఐదు సంవత్సరము లేర్పడినపుడు కోరికలు కారణములుగ యేర్పడును. పై విధముగనే నారదాది మహర్షులు నిష్కారణముగ హరి భజన చేయుదురు. నిష్కారణముగ దైవమును తలచువారు పరిపూర్ణులు. వారికి దైవస్మరణ సహజము. బ్రహ్మర్షులు, కుమారులు, యోగీశ్వరులూ అట్టివారు. వీరందరునూ శ్రీమాత విభూతులు. సృష్టి నిర్వహణమున శ్రీమాతకు తోడ్పడువారు. పుణ్యము వచ్చునని, స్వర్గలోకము ప్రాప్తించు నని, ఊర్ధ్వలోకములో చరించవచ్చునని, దుఃఖములు నశించునని, బంధములు తొలగునని, కోరికలు తీరునని హరిభజన చేయువారు మెండు. సామాన్యులు దైవారాధన లన్నియూ కార్యకారణ సంబంధ ముతో ముడిపడి యున్నవి. అందువలననే ఎంత సమర్థత యున్ననూ, ఎంత జ్ఞాన మున్ననూ – ముక్తస్థితి కలుగదు.

శ్రీకృష్ణుడు భగవద్గీత యందు అర్జునునితో యిట్లనెను. “అర్జునా! ఈ మూడు లోకములలో నేను చేయవలసిన కార్యము ఏమియూ లేదు. అయిననూ క్రీడార్థము చేయుచున్నాను.” శ్రీకృష్ణుడు లీలామానుష మూర్తి. కోరికలు లేక వర్తించిన పురాణ పురుషుడు. కనుకనే అతని వర్తనము నర్తనమై నిలచినది. అతని వర్తనమున కారణము లేదు. కావున బంధము కూడ లేదు. తనకై సంకల్పించిన దేదియూ లేదు.

అతడు సంకల్ప సన్యాసి. పరిపూర్ణమగు యోగి. సంకల్పమును సన్యసింపనిచో యోగి కానేరడని బోధించెను కూడ. అట్లే అతడారంభ పరిత్యాగి. తానై పూనుకొని ఏదియూ ఆరంభించ లేదు. కాలమును, దేశమునూ బట్టి కర్తవ్యమును మాత్రమే నిర్వర్తించెను. అదియు క్రీడగ నిర్వర్తించెను. ఎట్టి పరమూ ఆశింపలేదు. ఎట్టి సంగమునూ పొందలేదు. ఆరంభ పరిత్యాగము నెంత చూపెనో, సంగ పరిత్యాగమును కూడా అంతే చూపెను. అతడు కార్య కారణముల కతీతుడై జీవించి పరిపూర్ణత్వ మున కుదాహరణముగ నిలచెను. అట్లే శ్రీమాత కూడ. జీవుల ఆర్తనాదములను ప్రళయమున విని వారి కొరకై సృష్టి గావించెనే గాని తన కొరకు కాదు. వారి కొరకే నిర్వహించెను. పరహితమే పరమ ధర్మమని తన నిర్వహణమున చూపెను. ఫలాసక్తి లేదు కనుక కోరికయూ లేదు. కనుక ఆమె కార్య కారణము లందు బంధింపబడదు.



# 863. 'కామకేళీతరంగితా'

**కో**రికల తరంగములయందు క్రీడార్థము విహరించునది శ్రీమాత అని అర్థము.

పదునాలుగు లోకములలో కోటానుకోట్ల జీవులున్నారు. పరిపూర్ణత కొరకు పరిపరి విధములుగ తపించుచూ, అవి సిద్ధించుటకై శ్రీమాత నారాధించు చున్నారు. వారి వారి కోరికలను విలాసార్థము తీర్చుటలో శ్రీమాత నిమగ్నమై యున్నది. అష్ట బాహువులున్ననూ ఆమెకు చేతినిండ పనియే. కాని ఏదియూ తన పని కాదు. పరార్థమే కాని స్వార్థములేని అద్భుత స్థితి యది. అవతార పురుషులగు శ్రీరాముడు, శ్రీకృష్ణుడు శతాధిక వర్షములు కార్యనిర్వహణ మందు అహర్నిశలు కృషి సలిపినారు. వారి జీవనములలో పరార్థమేగాని లేశమాత్రము కూడ స్వార్థము లేదు. కనుకనే మానవజాతికి శాశ్వత మార్గదర్శకులై నారు. మహత్తర కార్యములు నిర్వర్తించుచూ, అహర్నిశలు కృషి సలుపుట స్వార్థపరు లెట్లు చేతురో అదే శ్రద్ధతో నిస్వార్థముగ జేసినారు. సముద్రమందలి అలలవలె కార్యములు వారిని సమీపించినవి. సమీపించిన కర్తవ్యములను నిర్వర్తించిరే గాని, తాము సంకల్పించి చేసిన వేవియు లేవు. తమ కొరకని చేసిన కార్యము లేమియు లేవు. అట్టి జీవితములను యజ్ఞము లందురు. యజ్ఞార్థ జీవనులు స్వార్థపరుల వలె తీరుబడి లేక కార్యములను నిర్వర్తించుట అసామాన్యము. కోరికలు గలవారికి వానిని సిద్ధింపచేసికొనుటకు అహర్నిశలూ కృషి సలుపుదురు.

కోరికలు లేక అహర్నిశలు కృషి సలుపుట యజ్ఞమందు గల దీక్ష. అట్టి దీక్షను లీలాప్రాయముగ నిర్వర్తించుట అతి విశేషము. శ్రీమాత సృష్టి నిర్వహణ మట్టిది. "క్షణము తీరిక లేక దమ్మిడీ ఆదాయము లేక" కృషి సలుపువారు అలౌకికులే కాని లౌకికులు కారు. అట్టివారే లోకములను నియమింపగలరు. ఇతరులు లోకములందు బంధింపబడి యుందురు.

పదునాలుగు లోకములలో కార్యములు నిర్వర్తించుచూ అలౌకికయై విరాజిల్లుచున్న శ్రీమాత గుణవిశేషమును యెన్నుట అసాధ్యము.



# 864. 'కనత్కనక తాటంకా'

**మ**నోహరమగు ధ్వని చేయు బంగారు చెవికమ్మలు గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత బంగారు చెవిదుద్దులు మనోహరమగు శబ్దములు చేయుచు నుండును. ఎందుల కట్లు చేయును? ఆమె మహాచైతన్య స్వరూప. చైతన్యము కదలిక స్వభావముగా కలది. చైతన్య కదలికల వలన బంగారు లోలాకులు శబ్దములు చేయును. కాంతులను విర జిమ్మును. ఇది యొక రహస్యమును ప్రకటింపచేయు చమత్కారమగు నామము.

చెవులు వినికిడికి ప్రసిద్ధి. వినికిడి శబ్దములను వినును. దివ్య మగు వినికిడి నిశ్శబ్దమును వినును. నిశ్శబ్దము నందు నాదమున్నది. ఈ నాదము దశదిశల వ్యాపించును. చెవియొక్క వినికిడి దిక్కులను గ్రహించును. దశదిక్కులను గ్రహించును. విరాట్‌పురుషుని చెవులుగ బృహస్పతి అను దేవత పుట్టెనని భాగవత పురాణము తెలుపుచున్నది. బృహస్పతి దిక్కులను తెలియజేయునని కూడ తెలుపుచున్నది. పది దిక్కుల యందలి నాదమును వినగలుగుట బృహస్పతి ప్రజ్ఞ. వినుట బృహస్పతిగను, పలుకుట సరస్వతిగను ఋషులు తెలిపిరి.

శ్రీమాత దశదిక్కుల యందు గల నాదమును వినగలదు. బృహస్పతి ఆమె నుండి యేర్పడిన ప్రజ్ఞయే కదా! నాదముల వలన

వెలుగు లేర్పడును. శ్రీమాత చెవి దుద్దులు శబ్దమును, వెలుగును ప్రసారము చేయును.

శబ్దమును వినుచు వాని మూలమైన నాదమును చేరుట సాధన. శ్రీమాత నాదరూపిణి యగుటచే ఆమెను వినుటకు, ఆమె వెలుగును దర్శించుటకు ఆమె చెవి లోలాకులు చేయు శబ్దములను, కాంతులను దర్శించుటకై మనసు లగ్నము చేయవలెను. నిశ్శబ్దమును చేరిన మనసు నాదమును వినగలదు. వెలుగులను దర్శింపగలదు. అపుడు శ్రీమాత దశదిశల శబ్దముగను, కాంతిగను ఎట్లు వ్యాపనము చెంది యున్నదో దర్శించుచూ తన్మయత్వమును పొందవచ్చును.

శ్రీమాత ఆరాధనమున మనసు స్థిరపడి సుఖమగు స్థితి యందు నిలబడినచో ఆమె చైతన్య ప్రవాహమున యేర్పడుచున్న నాదములను, కళలను దర్శించుచూ ఆ ప్రవాహమున మునగవచ్చును. ఇది యొక ప్రత్యేకమగు ఆరాధనా విధానము. *'రామాంజనేయ సంవాద'* మను ప్రసిద్ధ గ్రంథమున ఈ విషయము నంతను గ్రహించి సాధకులు సాధనకు పూనుకొనవచ్చును.

నిశ్చలమగు మనస్థితిలో అనాహతమగు శబ్దము వినబడును. అనాహతమగు ప్రణవము వినుట ఆరంభమైనచో కాంతి దర్శనము కోకొల్లలుగ జరుగును. అటుపై మాత దర్శన, స్పర్శన, సంభాషణ, సాన్నిధ్యాదులను పొందవచ్చును.

# 865. 'లీలావిగ్రహధారిణీ'

**లీ**లకై అనాయాసముగ, అద్భుతముగ రూపములను ధరించు నది శ్రీమాత అని అర్థము.

భక్తుల కొరకై లీలాప్రాయముగ అనేకానేక అద్భుతమగు, అందమగు, కాంతివంతమగు రూపములను అప్పటి కప్పుడు ధరించి ఆశీర్వదించగల కాంతివంతమగు రూపములను ధరించి దర్శన మిచ్చు చుండును. భక్తుల కపాయము కలుగకుండ క్రమమగ తన కళల సాన్నిధ్యమును ప్రాథమికముగ నిచ్చి భక్తుని యొక్క స్థితిని బట్టి దర్శన మిచ్చును. మెఱపు, పిడుగు ఏకకాలములో దరిచేరినచో భరించుట కష్టము. మరణము కలుగవచ్చును. అకస్మాత్తుగ దర్శన మీయక అమ్మ హెచ్చరికగ వచ్చును. జాగరూకత వహించి నెమ్మదిగ దరిచేరును. ప్రేమగల తల్లియగుటచే క్రమదర్శన మభ్యసింపజేయును. భక్తుని యందు శుచి, కళ పెంచుచూ దర్శనము పొందు అర్హతను తానే కల్పించును. అటుపై చిరుదరహాసముతో దరి చేరును. పిల్లలతో ఆట లాడినట్లు, పాటలు పాడినట్లు, భక్తులతో ఆటలాడుట, పాటలు పాడుట, అనాయాసముగ విద్యల నభ్యసింపజేయుట, వారిని తీర్చిదిద్ది లోకోప కారమునకై వినియోగించి శాశ్వత కీర్తివంతులుగ చేయుట– ఇట్లనేక విధముల తన లీలలు చూపును. శ్రీమాత లీలా విగ్రహ రూపములను వర్ణించ శక్యము కాదు. ఆమె లీలకై ఎట్టి రూపముల నైననూ ధరింప గలదు. ఆమె కాళిదాసు ననుగ్రహించిన తీరు అద్భుతము, అమోఘము.

పిచ్చివానివలె తిరుగాడు వ్యక్తిని వేద వ్యాసునితో సమానమగు మహాజ్ఞాని గను, యోగిగను, కవిగను, ఋషి గను క్షణకాలమున తీర్చిదిద్ది తన లీలను చూపెను. *'శ్రీదేవి భక్త విజయము'* అను కావ్యమున శ్రీమాత భక్తులకు రూప దర్శన మిచ్చి లీలాప్రాయముగ ఎట్లు లోకోత్తర మహా పురుషులుగా తీర్చిదిద్దినదో వివరింపబడినది. భక్తిప్రపత్తులు పెంచుకొన దలచినవారికి ఈ గ్రంథము చక్కని దర్శన గ్రంథమై విరాజిల్లు చున్నది. ఎన్ని ఉదాహరణలు తెలిపిననూ ఆమె లీలలను, లీలావిగ్రహ రూపము లను, ఆ రూపములు ధరించు విధానమును వర్ణింప నెవ్వరికినీ శక్యము కాదు.



# 866. 'అజా'

శ్రీమాతకు పుట్టుక లేదు. ఆమె శాశ్వత. ఎప్పుడునూ ఉండునది. సృష్టి యున్ననూ లేకున్ననూ యుండునది. ఆమె నిజమునకు 'పర'యే. పరమే సంకల్పముగ తనను తాను ప్రకటించుకొని వెలుగై అష్టప్రకృతు లతో కూడిన లోకముల నేర్పరచి అందు జీవులను ప్రవేశింపచేయును. జీవులు కూడ తన అంశలే కనుక, తన సంతానమే కనుక శాశ్వతులు. కాని వారు శాశ్వతత్వమును కోల్పోయి పుట్టుచున్నామని భావింతురు. పుట్టుక అను భావమున్నప్పుడెల్ల మరణించుట అన్న భావము కూడ దానితోపాటే యుండును. శ్రీమాత పుట్టుక లేనిది కనుక మరణము లేదు. తానే నవవిధములుగ మార్పు చెందిననూ, అట్టి మార్పునకు గురి కాదు. మార్పునకు గురి అగుట మరణ మగును. ఆవిరి మంచి నీరైనపుడు, మంచినీరు మంచుగడ్డ అయినప్పుడు జరుగునది స్థితి మార్పే గాని అసలు వస్తువునకు హాని లేదు. బంగారము ఆభరణ మైననూ, బంగారమే కదా! రూపము ధరించి, నామ మేర్పరచుకొనుట వలన నామరూపములే తామని జీవులు భ్రమ చెందుదురు. ప్రత్తి వస్త్రమై చీర కావచ్చును. ధోవతి కావచ్చును. వాటిని స్త్రీ పురుషులు ధరింపవచ్చును. కాని మూలము ప్రత్తియే. జీవులు 'నేను' ప్రజ్ఞగ, అట్టి మూలమే అయివున్నప్పటికినీ లింగభేదము, జాతి భేదము, కుల భేదము, మత భేదము, రూప భేదము, నామ భేదములకు పట్టుబడి మూలమును మరచుదురు. ఇట్టి మరుపే మృత్యువు. మరపు గలవారు

మృత్యువున పడుదురు. కనుక పుట్టుచుందురు. ప్రతి జీవియూ నేను అను ప్రజ్ఞగ ఆత్మయే. 'నే'నను ఆత్మ 'నే'నను పరమాత్మనుండి యేర్పడిన దని, పరమాత్మయే ఆత్మగ నున్నదని ఆత్మ చుట్టునూ అష్ట ప్రకృతులు ఆవరణలు యేర్పరచుకొనినవని, అట్టి ఆవరణలలో విహరించునపుడు తన నిజస్వరూపమును మరువరాదని గుర్తెరిగినచో శాశ్వతు లగుదురు. అహంకారము, బుద్ధి, చిత్తము, పంచభూతములు, తన చుట్టూ యేర్పడిన అష్ట ప్రకృతులని తెలియవలెను. అట్లు తెలిసియున్నచో తాను 'నే'నను ప్రజ్ఞగ శాశ్వతుడని, అహంకారాది అష్ట ప్రకృతులు తనకు శ్రీమాత యేర్పరచిన సౌకర్యములని తెలిసి యుండును. అపుడు జీవితము, జగన్నాథ రథము వలె సాగును. లేనిచో అష్ట ప్రకృతులలో బంధింపబడి చావుపుట్టుకల చక్రములో కొట్టుమిట్టాడు చుండును. అట్టివారు చక్రము నుండి బయల్పడుటకు అమ్మ 'అజా' నామమును కీర్తింపవలెను.



# 867. 'క్షయవినిర్ముక్తా'

**క్ష**యము లేనిది శ్రీమాత అని అర్థము.

పుట్టుకేలేని శ్రీమాతకు మరణ మెట్లుండగలదు? చావు పుట్టుకలు జీవులకే. వారునూ శ్రీమాత ఆరాధనమున ఆమె సాన్నిధ్యము చేరినచో జనన మరణములను పొందరు.

ప్రతిజీవి హృదయమునందునూ శ్రీమాత యున్నది. హృదయ పీఠమున ఆమె నాహ్వానించి, అర్ఘ్యపాద్యాదు లిచ్చి, ఆచమన మిచ్చి, ఉపచారములు గావించుచూ సర్వాంగ సుందరముగ అలంకరించి ప్రార్థించినచో మానవులు మనోకక్ష్యనుండి హృదయకక్ష్యను చేరుదురు. ఇట్లు హృదయస్థులైనవారికి నిత్యానిత్య వస్తువివేకము సులభముగ కలుగును. శ్రీమాతయే నిత్య యని, యితరములు అనిత్యములని, అనిత్యములుగా గోచరించుచున్నవి శ్రీమాత లేక మాయ అని తెలియును. వాటి జోలికిపోక, నిత్యవస్తువులనే ఆశ్రయించినచో క్రమముగ తాము కూడ నిత్యులమే నని తెలియును. అపుడు హానివృద్ధులు, జనన మరణములు కూడ తమ చుట్టునూ జరుగుచుండగా, శ్రీమాత మహిమగ భావించు స్థితి కలుగును. హృదయ స్థానమును వీడక, శ్రీమాతతో సాలోక్య, సామీప్య, సాయుజ్య, సారూప్యములు యేర్పరచు కొనుట శ్రీమాత భక్తుల పురుషకారము. శ్రీమాత అనుగ్రహించుట సిద్ధి. ఆమె క్షయమునుండి, మరణమునుండి భక్తులకు విముక్తి నిచ్చును.

# 868. 'ముగ్ధా'

మనస్సు హరించగలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత రూపసౌందర్యము మనోహరము గావించగల శక్తి. ఆమె జగన్మోహిని. సృష్టి యందెవ్వరినైననూ ఆమె మోహపరచగలదు. త్రిమూర్తులలో ఎవ్వరైననూ ఆమె మోహమును దాటలేరు. ఇక యితరుల మాట చెప్పనేల? కపర్దనుడగు శివుడే శ్రీమాత మోహినీ రూపమును దర్శించి వికల మనస్కుడై ఆమె వెంటపడగ, పలుదేశములు త్రిప్పించి, అటుపై మోహమును తొలగించెను. ఆమె మోహనత్వమునకు అవధులు లేవు. సృష్టి యందెవరికినీ ఈ విషయమున మినహాయింపు లేదు. ఆమె సంకల్పించినచో ఎవ్వరైననూ మోహపరవశులు కాక తప్పదు.

మనోహరత్వము రెండు విధములు. మనసు పరవశము చెంది భక్తులు తాదాత్మ్యము చెందుట. ఇది ఉత్తమము, శ్రేయస్కరము. కోరదగి నది కూడ. అట్లుగాక మనసు వికలమై మూఢత్వ మేర్పడుట. మనసు నందు మలినములు కలవారికి మోహనత్వము వలన మూఢత్వము కలుగును. రావణుడు, భస్మాసురుడు, అసురులు మూఢత్వము చెంది నశించుటకు మోహమే కారణము. అట్లే శిష్టులకు, నిర్మల మనస్సు గలవారికి మనసు హరింపబడి జీవాత్మ పరమాత్మ ఐక్యస్థితి కలుగును. దీనిని 'సమాధి' అందురు. ఇట్లు శ్రీమాత శిష్టులకు సమాధిస్థితి, మూఢులకు గర్వభంగము కావించుటకు ముగ్ధరూపమున ప్రత్యక్ష మగు చుండును. దుష్టులు, శిష్టులు తన సంతానమే అగుటచే ఎవరి

నెట్లు ఉద్ధరించవలెనో వారి నట్లుద్ధరించుట ఆమె విలాసము. ఆమె సర్వలోక వశంకరి, సర్వదుష్టమృగ వశంకరి, సర్వసత్వ వశంకరి, సర్వరాజ వశంకరి. ఆమె వశీకరణ శక్తియే 'ముగ్ధ' నామము.

శ్రీరాముని ముగ్ధమనోహర రూపమునకు శిష్టాచారులు, పురుషులు, మహర్షులు కూడ ఆకర్షితులై పరవశము చెందిరి. అసుర స్త్రీలు కూడ అమితముగ ఆకర్షింపబడిరి. శ్రీకృష్ణుని విషయమున ఈ తత్త్వము చెప్పనలవి కాక నిలచినది. శత్రుసైన్యము కూడ అతని చిరునవ్వునకు ప్రాణములు సమర్పించెడివారు. యుద్ధమున అర్జునుడు గెలిచెననునది మాటయే గాని, కృష్ణుని వశీకరణ శక్తి శత్రువులను వివశులను, నిర్వీర్యులను గావించగ, అట్టి నిర్వీర్యులను అర్జునుడు జయించెను. కృష్ణుని మోహన రూపము షోడశ కళలతో కూడినది. అతని రూపము శ్రీమాత రూపమే. శ్రీమాతయే కృష్ణునిగ, శివశక్తిగ భారత కాలమున ధర్మసంస్థాపనము గావించెను.



# 869. 'క్షిప్రప్రసాదినీ'

**త**క్షణమే అనుగ్రహింపగల తల్లి శ్రీమాత అని అర్థము.

క్షిప్ర మనగా 'అప్పటి కప్పుడు', 'ఆ క్షణము' అని అర్థము. భక్తి గలవారిని శ్రీమాత అప్పటి కప్పుడు అనుగ్రహించి ఉద్ధరించుచు నుండును. త్రిమూర్తులలో శివునియందు యిట్టి శక్తి పురాణము లందు దర్శింతుము. *"సద్యోజాతాయ నమో నమః ।"* అని శివుని కీర్తింతురు. అప్పటి కప్పుడు ప్రత్యక్షమై అనుగ్రహించువాడు శివుడు. శీఘ్రముగ అనుగ్రహించువా డతడు. దుష్టు డైననూ, శిష్టు డైననూ తాననుగ్రహింప దలచినచో అనుగ్రహించుటయే గాని, మీనమేషముల లెక్కించి అను గ్రహించుట కాదు. శ్రీమాత శివశక్తిగా అట్లెందరినో అనుగ్రహించెను. సురులైనను, అసురులైననూ, మానవులైననూ, జంతువులైననూ, ఎవ్వరి నైననూ సరే, వారి అర్హతతో సంబంధము లేక అనుగ్రహించుట వలన శ్రీమాతను 'క్షిప్రప్రసాదిని' అందురు. గజాసురునికి శివుడు వరమిచ్చి నప్పుడు, శివుని కొరకు విష్ణువు హరిదాసు వేషము వేయవలసి వచ్చెను. "దుష్టాత్ములకిట్టి వరము లీయరాదు" అని విష్ణువు పలికినపుడు శివుడు చిరునవ్వు నవ్వి యూరకుండెనే గాని "యికపై అట్లు చేయను" అని అనలేదు. అంతియే కాదు. తన పద్ధతిలో తాను వరము లిచ్చుచునే యుండెను. ఇట్టి విధానము కూడ శ్రీమాత యందు ఉన్నది. ఆమె అనుగ్రహమునకు తీరుతెన్నులు లేవు. నియమ నిబంధనలు లేవు.

ఎవరి నెపుడు ఎట్లు అనుగ్రహించునో, ఎవ్వరునూ ముందుగ తెలియ లేరు. ఇట్లు అనుగ్రహించెనని చెప్పుకొనుటయే యుండును. ఇది శ్రీమాత క్షిప్ర ప్రసాదిని తత్త్వము. దైవవిలాసములలో అన్ని మహిమల కన్న ఈ మహిమయే అతి శ్రేష్ఠముగ గుర్తింపబడినది. దీని ననుస రించియే దైవ సంబంధిత మార్గములలో అనుగ్రహ మార్గము అతి శ్రేష్ఠమై నిలచెను. దైవమెప్పు డెవరినెట్లు ఉద్ధరించునో, ఎవ్వరునూ తెలుపలేరు. శ్రీకృష్ణుడు గోపబాలురను, గోపికలను, కుబ్జను, శిశు పాలాది దుష్టులను అనుగ్రహించిన విధానము ఋషులను కూడ ఆశ్చర్యచకితులను చేసెను. ఇట్టి అనుగ్రహ సన్నివేశము లన్నియూ దైవలీలలుగా శ్లాఘింపవలసిన విషయములే గాని, తర్కమున కందునవి కావు. తర్కము, మీమాంస, వ్యాకరణము, శిక్ష, కల్పము, జ్యోతిషము, యిత్యాది వేదాంగములను తెలిసినవారికి కూడ అనుగ్రహము కలుగక పోవచ్చును. పండితులైనంత మాత్రమున అనుగ్రహము కలుగక పోవచ్చును. అనుగ్రహమున్నచోట పామరులు కూడ పండితు లగుదురు.



# 870, 871. 'అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా'

**అం**తర్ముఖమైన చిత్తవృత్తిచే ఆరాధింపదగినది, బాహ్యాముఖ మగు చిత్తవృత్తికి అందనిది శ్రీమాత అని అర్థము.

ఆరాధన అంతర్ముఖమై సాగవలెను. బాహ్య ఆరాధనలు చిత్తవృత్తిని పరిపరి విధములుగ వికలము గావించు చుండును. మనస్సు నుండి చిత్తము (అనగా చైతన్యము) పంచేంద్రియములద్వారా బాహ్యాము లోనికి ప్రవహించి నిర్వీర్యమగు చుండును. చైతన్యమను నదీ ప్రవాహము మనసు ద్వారముగ బాహ్యములోనికి పంచ నదులుగ ప్రవహించి ప్రపంచమను సముద్రములోనికి నిత్యము యింకిపోవు చుండును. సింధునది ఐదుపాయలై సముద్రము పాలైనట్లు దివ్యచైతన్యము అహంకారము నుండి, బుద్ధి నుండి, చిత్తము నుండి బాహ్యములోనికి నిత్యమూ ప్రవహించు చుండగా మానవుడు నిర్వీర్యుడై వృద్ధాప్యము చెంది మరణము పొందును. జీవచైతన్యము బాహ్యామునకే అంకితము చేయక అంతరంగములోనికి మళ్ళించుట వలన సాధకుడు వీర్యవంతు డగును. మనసు బాహ్యామునకు ప్రసరింపచేయుటకు దైవ మింద్రియ ముల నేర్పరచెను. ఇంద్రియముల ద్వారా చైతన్యమూర్తి అయిన జీవుడు బాహ్యమును చూచుట, వినుట, రుచి చూచుట, స్పృశించుట, వాసన చూచుట చేయుచూ, బాహ్యానుభూతిని పొందుచు నుండును.

బాహ్యమును తెలుసుకొనును. బాహ్య జ్ఞానము నార్జించును. బాహ్య విద్యలను నేర్చును. ఐదవ సంవత్సరమునకు ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు వశమునకు వచ్చుటచే బాహ్యవిద్య నభ్యసించుటకు అక్షరాభ్యాస సంస్కారము ద్వారా స్వీకారము చుట్టును. చైతన్యము బాహ్యప్రసారమునకు ఉపక్రమించినప్పుడే అంతర్ముఖ ప్రసారమునకు కూడ ఉపక్రమింప వలెనని భరత ఋషులు నిర్దేశించినారు. పంచేంద్రియములచే బాహ్యానుభూతికి విద్యల నెట్లు నభ్యసింతురో అట్లే అంతరంగానుభూతికి, అంతరంగ విద్యలకు కూడ సున్నితముగ శ్రీకారము చుట్టవలెనని ఋషుల నిర్దేశము. అందులకే పంచాక్షరి యగు *'ఓం నమః శివాయ ।'* అను మంత్రముతో ఐదవ సంవత్సరమున విద్యాభ్యాస సంస్కారమును యేర్పరచిరి.

బాహ్యజీవనము ఒక జన్మకే పరిమితము. అంతర్ముఖ జీవనము జన్మజన్మలకు వలసిన సంస్కారము నిచ్చును. బాహ్యజీవనము క్షరము. అంతరంగ జీవనము అక్షరము. బాహ్యజీవనమునకు మరణము అంతము. అంతరంగ జీవనమునకు మరణ ముండదు. కనుక అక్షరమై నిలచును. బాహ్య జీవనమున క్షర పురుషుడు వృద్ధి చెందు చుండగా, అంతరంగ జీవనమున అక్షర పురుషుడు కూడ వృద్ధి చెందును. అక్షర పురుషుడు అక్షర విద్యల ద్వారా వృద్ధి చెందినచో, క్షర పురుషుడు మరణించిననూ హాని లేదు. అక్షర పురుషుడు జన్మింపక, వృద్ధి చెందక, క్షర పురుషుడే జన్మించి వృద్ధి చెందినచో మరణము, జననము అను చక్రమున అనంతముగ తిరుగుట జరుగును.

క్షర విద్య లావశ్యకము. కాని అక్షర విద్యలు అత్యావశ్యకము. అక్షర విద్యల ద్వారా అక్షర పురుషుడు జన్మించును. వృద్ధి చెందును. క్షర పురుషుని యందు అక్షర పురుషుడు జన్మించినచో జన్మలో మరియొక జన్మ కలిగినట్లు. దీనినే ద్విజత్వ మందురు. మానవుడు ద్విజు డగుట అత్యావశ్యకము. ద్విజత్వము నుద్దేశించని విద్యలు నిస్సందేహముగ వృథా విద్య లగును. శాశ్వతత్వము నొసగని విద్యలు కొరగాని విద్యలే అగును. *"సంప్రాప్తే సన్నిహితే కాలే నహి నహి రక్షతి డుకృఙ్ కరణే ।"* అని శంకరులు ఘోషించినారు. ఎన్ని బాహ్య విద్యలు నేర్చిననూ, మరణము నుండి రక్షింపలేవు.

అందులకే దివ్యజ్ఞాన మంతయూ అంతర్ముఖ మగుటకు, అంతర్ముఖ ఆరాధన చేయుటకు, అంతరంగమున చేరుటకు, తద్వారా మరణమును దాటుటకు నిర్దేశింపబడినది. భగవద్గీత, భాగవతము మరణమును గూర్చియే ప్రథమ పాఠమును కలిగి యున్నవి. యోగ విద్య యందు కూడ ప్రథమ సూత్రము చిత్తవృత్తిని నిరోధించ మనియే శాసించినది. చిత్తము యింద్రియముల వెంటబడి బాహ్యములోనికి ప్రవహించుటను తగుమాత్రముగ అరికట్టి అంతర్ముఖముగ అంత రంగము లోనికి ప్రవహింపచేయుటకే భజనలు, పూజలు, ఆరాధనలు నిర్దేశింపబడినవి. గురుమూర్తిని గాని, దేవతామూర్తిని గాని అంత రంగమున దర్శించుచూ ఆరాధింపమనియే సున్నితముగ నిర్దేశించినవి. సర్వభూతముల యందు ఈశ్వరుడు హృదయమునందే యున్నాడు.

కనుక ఆరాధకులు అంతర్ముఖులై హృదయ పీఠమున దివ్యమూర్తిని ఆవాహనము గావించి అర్ఘ్య పాద్య ఆచమనాదుల నిచ్చి, ఆసీనుని గావించి, ఆరాధించుట సంప్రదాయమై యున్నది. ఇట్టి ఆరాధన సత్ఫలము నిచ్చును. సాలోక్య సామీప్య సాయుజ్యముల నిచ్చును. బాహ్య ఆరాధనము లన్నియూ ఆడంబరములవలె కీర్తి, ప్రతిష్ఠల నిచ్చునేమో గాని ఆరాధకులను రక్షింపలేవు. అనగా మరణము నుండి రక్షింపలేవు. సమ్యక్ దర్శనము నీయలేవు. సత్యమగు అనుభూతి నీయలేవు. దైవమును వినుటకు, కనుటకు, స్పృశించుటకు తోడ్పడలేవు. బాహ్య ఆరాధన వలన శ్రీమాత లభించుట అసాధ్యమని తెలుపుటకే "బహిర్ముఖ సుదుర్లభా" అనియూ, అంతర్ముఖముగనే సమ్యక్ ఆరాధన జరుగునని ఈ రెండు నామములు కుండ బ్రద్దలు కొట్టినట్లు తెలుపు చున్నవి. ఈ విషయమున సదారాధకులు శ్రద్ధ వహించవలెను. సామూహికముగ ఆరాధనలు చేయవచ్చును. సమూహ మంతయూ తమ అంతరంగమునందే శ్రీమాతను దర్శించుటకు యత్నించవలెనే గాని, బహిర్ముఖముగ నటనాచాతుర్యము చూపినచో ఉపయోగము లేదు. ఇది నిస్సందేహము. ఈ నామమలు ఈ విషయమును రూఢి చేయుచున్నవి.



# 872. 'త్రయీ'

**మూ**డుగ నేర్పడునది శ్రీమాత అని అర్థము.

సర్వమూ త్రయీమయమే. సృష్టి అంతయూ మూడు ఆధారము గనే యేర్పడినది. ఒకటి మూడై, అటుపైన మూడు మూడుగ, గుణించు కొనుచు సృష్టి యేర్పడును. ఒక దేవత మూడు దేవతలై ముప్పై మూడు దేవతలుగ మూడు లోకము లేర్పడును. 1. వేదములు మూడు (ఋగ్, యజుర్, సామ వేదములు). 2. కాలములు మూడు. (వర్తమాన, భూత, భవిష్యత్ కాలములు). 3. పురుషులు ముగ్గురు (క్షర పురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడు). 4. శక్తులు మూడు (ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి). 5. లోకములు మూడు (భూలోకము, భువర్లోకము, సువర్లోకము). ప్రజ్ఞ, శక్తి, పదార్థముగ శ్రీమాత మూడగును. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు త్రిమూర్తులు. లక్ష్మి, పార్వతి, సరస్వతి ముగ్గురమ్మలు. అగ్నులు మూడు (త్రేతాగ్నులు). కర్త, కర్మ, క్రియ ఒక త్రయము. ఇట్లెన్నెన్నో త్రయములను చూడవచ్చును. అంతయూ మూడు, మూడు గనే యేర్పడినవని, ప్రధానముగ ఈ మూడును శ్రీమాతయే యని త్రయీవిద్య తెలుపుచున్నది. శ్రీమాత బీజాక్షరములు కూడ మూడే. ఐం, హ్రీం, శ్రీం అని, ఐం, క్లీం, సౌః అని యిట్లు మూడక్షరముల పొందిక లెన్నియో యున్నవి. ఓంకారము కూడ అ – ఉ – మ అని తెలుపబడినది. ఈ మొత్తము సృష్టి మూడక్షరములు. నిజమున కది

ఒక అక్షరమే. ఇది అంతయూ ఒక అక్షరమే అని *"ఓం ఇతి యేకాక్షరమ్।"* ఒక అక్షరమే బ్రహ్మణము చేయబడగ సృష్టి యేర్పడినది. శ్రీమాత త్రికూట, త్ర్యక్షరీ, త్రయీ, త్రిపుర, త్రికోణగ, త్రిగుణ, త్రిలోచనా, త్రిస్థా, త్రివర్గ, త్రిఖండ – యిట్లు త్రయీ నామము అనేక విధములుగ తెలుపబడినది. వివరించుట కేవలము ముచ్చట కొరకే.



# 873. 'త్రివర్గనిలయా'

ధర్మార్థకామములు త్రిలోకములుగ వ్యాపించినది శ్రీమాత అని అర్థము.

ఆమె స్థితి మోక్షము కాని ధర్మముగను, కామముగను, అర్థము గను యేర్పడును. ఆమె పరా యైననూ పశ్యంతి, మధ్యమ, వైఖరిగ యేర్పడును. ఇట్లు మరికొన్ని చెప్పుకొనుచు పోవచ్చును.

# 874. 'త్రిస్థా'

మూడు స్థానముల యందుండునది శ్రీమాత అని అర్థము.

భూలోకము, భువర్లోకము, సువర్లోకము మూడు స్థానములు. పదార్థము, శక్తి, ప్రజ్ఞ మూడు స్థానములు. ఇవియే వామనుని మూడు అడుగులు. ఆమె త్రివిక్రమ. మూడు రకములు వామన రూపమున మొత్తము విస్తరించి బలి ననుగ్రహించినది. మన యందు ప్రధానముగ సహస్రారము నందు, హృదయ మందు, మూలాధార మందు వసించి యున్నది.

# 875. 'త్రిపురమాలినీ'

**మూ**డు పురములు మాలగా కలది.

పై తెలిపిన మూడింటియందు తానే మాలగా వ్యాపించుటచే త్రిపురమాలిని అయినది. మాలయందు దారము వంటిదామె. "మణిమాల యందలి సూత్రమును నేను" అని కృష్ణ డనెను. *"సూత్రే మణిగణా యివ ।"*. మణులను కూర్పు చేయునటువంటి దారము వంటివాడను నేను అని చమత్కరించెను. మూడు 3, ముప్పదిమూడు 33 గను, 333 గను, 3,333 గను, 33,333 గను, 3,33,333 గను, 33,33,333 గను, 3,33,33,333 గను, 33,33,33,333 గను యిట్లు ఎంత విస్తారమైనను అందలి దారము ఆమెయే. మూడుగ వేయునదే ముడి. అదియే శ్రీముడి. అనగా అమ్మవేయు ముడి. మూడు ముళ్ళ మంగళ సూత్రబంధన మర్థ మిదియే. మూడు లోకము లందు దంపతు లొకటి అగుటకు శ్రీమాత అనుగ్రహము కొరకై వేయు ముడియే శ్రీముడి. ముడి యెప్పుడు వేసిననూ మూడుమార్లుగ వేయవలెను. అప్పుడే అది మంగళప్రద మగును. మూడు పువ్వులమాల శ్రీమాత. అట్టి మాలను త్రిపురమాల యని, త్రిపురమాలిని అని ఋషులు ప్రశంసించిరి.



# 876. 'నిరామయా'

ఆమయములు లేనిది శ్రీమాత అని అర్థము.

ఆమయములు అనగా దురవస్థలు, దుఃఖములు, అస్వస్థతలు, రోగములు, మలినములు, కాలుష్యములు, కామ క్రోధాది అరిషడ్వర్గములు, దురహంకారములు, అసమానత్వములు. ఇవి ఏవియునూ శ్రీమాతకు లేవు. శ్రీమాత అంతటి పవిత్రమూర్తి అయినపుడు ఆమె నుండి ఏర్పడు సృష్టి యందు మలినము లేర్పడుటకు కారణమేమి? అను ప్రశ్న పుట్టక తప్పదు. పవిత్రత నుండి అపవిత్రత పుట్టునా? శుద్ధము నుండి అశుద్ధము పుట్టునా? స్వస్థత నుండి అస్వస్థత లెట్లు పుట్టును? సృష్టియొక మహత్తరమగు అగ్నికార్యము. అగ్ని కార్యమున మహత్తరమగు జగత్కల్యాణము జరుగుచుండగా అజ్ఞాతముగ మలినము లేర్పడు చుండును. వానిని ఎప్పటి కప్పుడు నిర్మూలించు కొనుటకు అప్రమత్తత వహించవలెను. లేనిచో మలినము లేర్పడుటే కాక విజృంభించును. అన్నము వండుటకు పొయ్యి అవసరము. అన్నము వండబడు చుండగా పొయ్యియందు బూడిద యేర్పడు చుండును. పాత్రలకు బొగ్గుమసి పట్టును. వేడి ఎక్కువైనప్పుడు పాత్రలు కాలును. పొయ్యిని, పాత్రను శుభ్రపరచుకొనుట తప్పనిసరి. రాగి, వెండి పాత్రల వినియోగము ఆరోగ్యప్రదము. కాని యితర లోహపాత్రలకన్న వాటిని శుభ్రపరచుకొనవలసిన అగత్యము ఎక్కువగ నుండును. బంగారమున

మలినము చేరదు. కాని అది ఎప్పటి కప్పుడు చోరభయమును కలిగించును. దీపపు కుంది క్రిందనే చీకటి పొంచి యుండును. దూరమునకు వెలుగే గాని దగ్గరలోనే చీకటి యున్నది. ఎంత వెలుగేర్పడునో అంత సమీపముననే చీకటి అపాయ మున్నది. మహత్తర మగు చక్రవర్తులకు అపాయము యింటిలోనో, సమీపముననో యుండును. సంపంగి వృక్షమునకు, పుష్పమునకు గల సుగంధము యితర పుష్పములకు ఉండదు. నాగుపాములు కూడ అచ్చటనే పొంచి యుండును. అదితి యున్నచోట దితి కూడ యుండును. దేవత లున్న చోటునే అసురులు కూడ యుందురు. అట్లు సృష్టియందు అగ్నికార్యము జరుగుచుండగా మలినములకు కూడ తావేర్పడు చుండును. సృష్టి జీవులను అట్టి మలినములు క్రమ్మివేయవచ్చును. కాని శ్రీమాతకు అవియునూ అదుపుననే యుండును. ఎంతటి జ్ఞానులైననూ గర్వపడి భంగపడవచ్చును. శ్రీమాత కట్టి అపాయములు లేవు. కాని ఆమె ఆరాధకులకు అపాయమెప్పుడునూ పొంచి యుండును. అహంకారమే అతి సమీపమున పొంచియున్న అపాయము.



# 877. 'నిరాలంబా'

**ఆ**లంబనము లేనిది శ్రీమాత అని అర్థము.

సృష్టియందు సర్వజీవకోట్లకు శ్రీమాత ఆలంబనము. శ్రీమాతకు ఎవ్వరాలంబనము? ఎవరు ఆసరా? ఎవరిపై ఆధారపడును? తనపైనే తాను ఆధారపడును. తానెవ్వరిపైననూ ఆధారపడదు. సృష్టియందు సర్వశక్తుల కామె ఆధారము. కాని ఆమె నిరాధారియే. అందరికి ఆమె నాథ. ఆమె అనాథ. ఆమెకు ఆధారపడుటకు మరియొక తత్త్వము లేదు. విపత్కర సన్నివేశములలో త్రిమూర్తులు సహితము ఆమెపై ఆధారపడుదురు. కాని ఆమె ఎవ్వరిపైన నాధారపడుట కేదియును లేదు. ఆమె కామెయే ఆలంబనము. ఈ నామము - యిదివరకు కూడ వివరింపబడినది.

ఈ తత్త్వము ననుసరించియే యోగులు యోగీశ్వరు లగుదురు. కాని యోగీశ్వరులు కూడ యోగేశ్వరునిపై ఆధారపడుదురు. అట్టి యోగేశ్వరి శ్రీమాత. శ్రీమాత తనకు తానే ఆలంబనము. తనకు తానే ఆధారము. అందరికినీ తానున్నది. తన కెవ్వరునూ ఆధారపడుటకు లేరు. ఇది నిజమగు ఏకాంతస్థితి. అన్నియూ తనపై ఆధార పడినవే. తానెవ్వరిపైననూ ఆధారపడుటకు లేదు. యోగులు, భక్తులు కూడ ఈ నామము ననుసరించి యితరులపై ఆధారపడుట క్రమముగా తగ్గించుకొనుచూ, తమపై తామాధారపడుట నేర్తురు. కేవలము దైవముపై

తప్ప యితరములపై ఆధారపడుట వర్జింతురు. వారికి ఆస్తిపాస్తులు ఆధారము కాదు. తన చుట్టునూ చేరిన పరివార మాధారము కాదు. తమ దేహముపై కూడ వారు ఆధారపడరు. వారిపై ఆధారపడిన దేహముపై వారాధారపడుట యుండదు. తమ సిద్ధులపై కూడ ఆధార పడరు. విద్యలపై ఆధారపడరు. కేవలము తమ యందలి దైవముపైననే ఆధారపడి యుందురు. దైవమే సర్వోపాయమని, ఉపాధేయమని భావించి యితరము లాలంబనము కాక నిలతురు.



# 878. 'స్వాత్మారామా'

**త**నయందు తాను క్రీడించునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మమే శ్రీమాతగ జంటగ యేర్పడి ఒకదాని కొకటి ఉన్ముఖత్వము చెంది క్రీడించుటచేత తనతో తానే క్రీడించుచున్నదని, రమించుచున్నదని అర్థము. జంటగా ఆడుకొనుటకు తానే రెండగుట జరిగినది. తనకు తానే ఆడుకొనుటకు వీలుపడదు. ఒకటి రెండైనపుడే ఆడుకొనుటకు వీలుపడును. ఆనందించుటకు వీలుపడును. ఎఱుక యున్నప్పుడే ఆనంద ముండును. అందువలన బ్రహ్మము ఎఱుకగ నేర్పడెను. బ్రహ్మము చైతన్య మయ్యెను. గాఢ నిద్రలో అనుభూతి యేమున్నది? ఎఱుక లేనిదే అనుభూతి, ఆనందము లేదు. ఆత్మ అనుభూతి చెందవలెనన్నచో ఆత్మ చైతన్యముగ ఒకటి రెండై తీరవలెను. అనుభూతి పరాకాష్ఠకు చేరినప్పుడు రెండు ఒకటై పోవును. తన్మయత్వము చెందినపుడు కేవల ముండుటయే యుండును గాని అనుభూతి చెందుట యుండదు. సాయుజ్యము వలన అనుభూతి కలిసిపోయినచో అనుభూతి లేదు. అందువలన సారూప్యము చెందక సాయుజ్యమున నుండుట మేలని విశిష్టాద్వైతము యేర్పడినది. దైవమే తానుగ నున్నాడు. తానుగ నుండి దైవము నారాధించినచో ఆనంద ముండును గాని తాను దైవమే అయినచో ఆనంద మేమున్నది? బ్రహ్మజ్ఞాని తాను బ్రహ్మమే అని తెలిసిన వెనుక బ్రహ్మమే సమస్తమును దర్శించి, తానుగ నుండి

తనయందు, తన పరిసరముల యందు బ్రహ్మమునే దర్శించుచూ క్రీడించుచూ ఆనందముగ నుండుట, శాశ్వత ఆనందమున స్థిరపడుట ప్రశస్తమగు ఆహ్లాదమును కలిగించును. బ్రహ్మమే అయిపోయినచో ఆనందమేమియూ లేదు. ఇట్టివారు ప్రహ్లాదునివలె శాశ్వత ఆనందమున నిలుతురు. అట్లుగాక బ్రహ్మమునందు కలిసిపోయనచో అనుభూతి యుండదు. యుండుటయే యుండును. అందువలననే సమాధియందు కూడ నిర్బీజ నిర్వికల్ప సమాధి కన్న సబీజ సవికల్ప సమాధినే కోరు విధాన మేర్పడినది.

శంకర భగవత్పాదులు కూడ అద్వైత సిద్ధాంతము నేర్పరచిన తరువాత అనేకానేక స్తోత్రములను స్తుతించుచూ ఆరాధించుచూ కాలము గడిపిరే గాని ఊరక యుండలేదు. తనయందు, అఖిల భూతముల యందు బ్రహ్మమును దర్శించుచూ రమించుచూ యుండుట పరాకాష్ఠగా సిద్ధాంతీకరించినారు. కనుకనే భారతీయుల పంట పండినది. భక్తి జ్ఞాన వైరాగ్య రసముతో కూడిన స్తోత్రములు ప్రకటింపబడినవి. దైవమే తానుగ నుండును. తానుగ దైవసన్నిధిన నిలచి తననుండి దైవము ప్రకటిత మగుట ఆనందమునకు పరాకాష్ఠ. విశిష్టాద్వైతమే అద్వైతమునకు పరాకాష్ఠయై రసానుభూతిని దైవారాధకులకు అందిన ఫలము గావించినది. నారదాది దేవర్షులు, ప్రహ్లాదాది భక్తులు బ్రహ్మజ్ఞానులే అయి ఉన్నప్పటికినీ నిత్య స్మరణ మార్గమున ఆత్మారాములై నిలచిరి. ఇట్టివారికి శ్రీమాత కథానాయిక. అలమేలు మంగను ప్రాతిపదికగ అన్నమయ్య భగవంతునితో రసక్రీడ కావించి తదనుభూతిని కూడ

చూరగొనెను. జయదేవుని అష్టపదులు, గోపికల రసక్రీడలు దైవము నందు కామోత్కంఠతతో రసానుభూతిని పొందు మార్గమును కూడ ప్రకటించినవి. అనుభూతిని అనుభవించువాడు, అనుభవించబడు వస్తువు తప్పనిసరి. అందులకే శ్రీమాత బ్రహ్మమే యైననూ, రసానుభూతి కొరకే బ్రహ్మము నుండి తానుగ యేర్పడెను. బ్రహ్మము తానుగ యేర్పడుట వలన ఆత్మయైనది. ఆత్మయైనపుడే ఆత్మానుభూతి యుండును. ఈ విషయముననే అష్టమ అధ్యాయ ప్రారంభమున శ్రీకృష్ణుడు సున్నితముగ ప్రకటించెను. అధ్యాత్మము అనగా నిదియే.



# 879. 'సుధాస్రుతిః'

అమృత స్రావము శ్రీమాత అని అర్థము.

అమృతము సహస్రార పద్మమునుండి స్రవించును. సహస్రార పద్మమందలి కర్ణిక నుండి స్రవించి అనిర్వచనీయమైన ఆనందము భక్తుల కారాధనా మార్గమున కలుగుచుండును. భక్తితో కూడిన ఆలాపన యందు, ఆరాధన యందు ధ్యానమున అట్టి ఆరాధన వలన అమృతము స్రవించి జీవుడు అమృతత్వస్థితిని పొందును. అట్టివానికి మరణము లేదు. అమితమగు పరమశాంతితో ఆనందపరవశులై దేహమున వసించి అంత్యకాలమున దేహమును స్వచ్ఛందముగా త్యజించి బ్రహ్మైక్యమును చెందుటకు సహస్రార పద్మకర్ణికాస్రావము జరుగవలెను. అందులకే సమస్త సాధనలును. జపము, తపము, యోగము, సంగీతము, స్మరణ, భజన, శ్రవణము, ఆరాధనము, నాట్యము యిత్యాది మార్గములను జీవు లనుసరింతురు. ఏ మార్గము నందైననూ తన యందు, తన పరిసరములయందు దైవమే గోచరించుచున్న యెడల రసానుభూతి కలుగుచు నుండును. రసస్వరూపుడైన భగవంతుని దర్శించుచు, వినుచూ, స్పర్శించుచూ, సంభాషణలు చేయుచూ రసపానము చేయువారు పరమ భక్తులు. అట్టి అనురక్తిని కలిగించునది శ్రీమాత.



# 880. 'సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా'

**సం**సార పంక మందు నిమగ్నమై యున్నవారిని ఉద్ధరించు పండితురాలు శ్రీమాత అని అర్థము.

సంసార మనగా సమ్యక్ సార మనియు, సంసరణము వలన కలుగు బంధ మనియూ రెండు అర్థములు కలవు. సత్యము, ధర్మమూ మరచినవారికి సంసారము మహత్తరమగు సంబంధము. మరువని వారికి సమస్తమగు జీవనసారము రసానుభూతిని కలిగించుచూ ఆనందము నిచ్చును. ఏది నిస్సారమని భావించుచూ తప్పించుకొని తిరుగుటకు ప్రయత్నింతురో అందే సారము కూడ యున్నది. సమస్తము నందలి సారము శ్రీమాతయే. శ్రీమాతను దర్శించినచో సమస్తమునందు ఆనందము, అనుభూతియే యుండును. అంతయూ దివ్యముగనే గోచ రించును. ఇది అంతయూ "అదియే". ఉపనిషత్తు లెంత ఘోషించిననూ, ఎంత సాధన చేసిననూ ప్రస్తుతమున గోచరించుచున్నది "అదియే" అని భావన కలుగనిచో బంధమే మిగులును. కలిగినచో తక్షణమే మోక్షము కలుగును.

జీవితమందు సారములను, నిస్సారములను ఎంచుకొనుచూ ఎంత వివేకముతో జీవించిననూ నిస్సార విషయములు తారసపడును. దుఃఖములు కలుగును. కష్టములు కలుగును. నష్టములు కలుగును.

అసౌకర్యములు తరచు ఏర్పడు చుండును. తప్పించుకొనవలెనని ప్రయత్నించిననూ వీలుపడక యుండును. చూచువాని దృష్టినిబట్టి జగత్తు యున్నది. సృష్టిని దివ్యముగ చూచుచూ, ఆనందించువారు గలరు. మాయయని, నిస్సారమని, దుఃఖపంకిలమని భావించువారునూ కలరు. నిస్సారమగు వేము నములుచున్నప్పుడు క్రమముగా వేముకూడ తీయనగును. సారవంతము, రుచివంతము అని భావించుచూ గారెలు తినుచున్నచో అజీర్తిచేసి గారెలు చేదు అనిపించును. సారము, నిస్సారము అను విభజన చేయుచూ తెలిసినకొలదీ తెలిసినవానిని, వాని తెలివి యిక్కట్లు పెట్టుచు నుండును. "అంతయూ నీవే హరి పుండరీకాక్ష" అని భావించువానికి అన్నిట సారమే యుండును. అంతయూ దైవమే అని తెలిపిననూ నిలబడదు. 'ఇదియే', 'అదియే' అని ఎన్నిమార్లు చెప్పిననూ నిలబడదు. ఎందువలన నిలబడదు? నిలబెట్టునది శ్రీమాత కాని, తాను కాదు. తలపు నిచ్చునది తల్లియే. ఆమెయే "తలపులమ్మ తల్లి". అదియే గాయత్రి. ఆమె అనుగ్రహించినచో తక్షణమే యుద్ధారణ యుండును. అనుగ్రహ మెట్లు కలుగును? అనుగ్రహము కలిగినవారి జీవితములు తరచి చూచినచో కొన్ని ఉపాయములు తెలియును. వారి ననుసరించుటయే మార్గము. *"యద్యదాచరతి శ్రేష్ఠః ।"* శ్రేష్ఠు లెట్లు ఆచరించిరో అట్లాచరించవలెనని శ్రీకృష్ణుడు తెలిపినాడు. శ్రేష్ఠు లనగా నెవరు? అవతారములే అన్నిటికన్న శ్రేష్ఠములు. తరువాత శ్రేణిలో సప్త ఋషులు, మనువులు, యిత్యాదులు గోచరింతురు. వారు సర్వమూ *'ఆతని దివ్యకళామయ మని'* భావించి జీవించిరి. వారి ననుసరించి

నచో ధర్మము గోచరించును. తనకు తోచినదే ధర్మమను కొనుట అహంకారము. ధర్మాచరణము వలన, ధర్మమును పెద్దలు అనుసరించు మార్గములో అనుసరించుట వలన అమ్మ అనుగ్రహము కలుగవచ్చును. కలుగనంత వరకు శక్తివంచన లేక ధర్మము నాచరించుటయే మార్గము. ఇట్టి వారందరినీ అమ్మ వీక్షించుచునే యుండును. ఎప్పుడెవరి నెట్లు అనుగ్రహించునో నిర్ణయించలేము గాని ధర్మమాచరించుచూ ఆమె అనుగ్రహమునకై వేచియుండుట తియ్యనగు మార్గము. అనుగ్రహించు టలో అమ్మకన్న మించినవారు లేరు. ఆమెయే ఉద్ధరణ పాండిత్యము గలది.



# 881. 'యజ్ఞప్రియా'

**య**జ్ఞము ప్రియముగా గలది శ్రీమాత అని అర్థము.

సృష్టి ఒక మహాయజ్ఞము. సృష్టి యజ్ఞము జీవుల కొరకే. జీవుల శ్రేయస్సు కొరకే యజ్ఞము నిర్వహింపబడు చున్నది. నిర్వహించువారు దేవతలు. సంకల్పము, జ్ఞానము, క్రియాశక్తులను దేవతల కందించునది శ్రీమాత. జీవులు పరిణామము చెందుచూ పరిపూర్ణులు కావలెనని శ్రీమాత ఆకాంక్ష. తనకొరకే కాక యితరుల మేలు కూడ నుద్దేశించి చేయునది యజ్ఞము. అట్లు చేయు సర్వకార్యములు యజ్ఞములే. అట్టి యజ్ఞముల కామె ప్రీతి చెంది తోడ్పాటు గావించును. కనుకనే పరహితము నిజమగు యజ్ఞమని వాఙ్మయమున తెలుపబడినది. *"యజ్ఞమ్ కురుకర్మాణి ।"* అని అర్జుననకు శ్రీకృష్ణుడు బోధించెను. చేయుపని అంతయూ యజ్ఞార్థముగ చేయుమని అర్థము. ఇతరుల మేలు కొరకు జీవించుటయే నిజమగు జీవనము. అట్టి జీవితమును నిర్వర్తించినవారే మహాపురుషులు. అట్టివారి యందు శ్రీమాతకు ప్రీతి మెండు. యజ్ఞార్థజీవన కథలు వినుచూ, పఠించుచూ, స్ఫూర్తి చెందుచూ జీవితమును యజ్ఞముగ మలచుకొనుట ఆరాధకులకు ముఖ్యము.

భగవద్భక్తులు, శ్రీమాత ఆరాధకులు యజ్ఞార్థము జీవించుట వలన శుభపరములను శీఘ్రముగ పొందుదురు. తమ శ్రేయస్సు కొరకు మాత్రమే పూజలు గావించినపుడు ఆశీర్వచనము లంతంత మాత్రముగనే యుండును. ఆర్తులు, అర్థార్థులై పూజలు చేయువారు

– జీవులపై కరుణ, దయ, ప్రేమ కలిగి యున్నచో ఫలము లుండును గాని, కేవలము స్వహితమే ప్రధానముగను, పరహితము లేశమాత్రమే అన్నచో శ్రీమాత ప్రియము చెందదు. జీవుల సేవ శ్రీమాతకు ప్రియము కలిగించును. జీవులను సేవించుచూ, ఆదరించుచూ, ప్రేమించుచూ, ఆరాధనములు జరిపినపుడు జీవనము క్రమముగ యజ్ఞార్థమగును. స్వహితముకన్న పరహితమే మిన్నగ యున్నప్పుడు, శ్రీమాత వైభవములు కూడ కూర్చును. పరహితమే యజ్ఞము. లోకహితము కొరకు జరుగు యుద్ధము కూడ యజ్ఞమే అగును. అట్టి యజ్ఞమున మరణించిననూ జీవుడు ఉత్తమ గతులను పొందును. యజ్ఞమే జయమును కలిగించును. జయము, యజము అనునవి నాణెమునకు బొమ్మ బొరుసు వంటివి. యజ్ఞసమర్పణగ జీవనము సాగించినవారి యందు శ్రీమాత ప్రీతి చెందును.



# 882. 'యజ్ఞకర్త్రీ'

**య**జ్ఞము నొనర్చునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత యజ్ఞమందు ప్రియయే గాక యజ్ఞము నొనర్చునది కూడ ఆమెయే. యజ్ఞము నిర్వర్తించుటకు బ్రహ్మాణియై, పోషించుటకు విష్ణురూపిణియై, తిరోధానము గావించుటకు రుద్రాణియై– మొత్తము యజ్ఞమునకు యజమానురాలై విరాజిల్లు చుండును. యజ్ఞకర్తగా చతుర్ముఖ బ్రహ్మను నియమించి పాలించును. యజ్ఞకర్తయగు బ్రహ్మ శ్రీమాత ఆజ్ఞను పాలించుచూ, సృష్టి యజ్ఞమును గావించును. సృష్టి యందలి సమస్త దేవతలు, చతుర్ముఖ బ్రహ్మ ఆజ్ఞను పాలించు చుండగా అతడు శ్రీమాత ఆజ్ఞను సర్వధా నిర్వర్తించును. సృష్టి నిర్మాణమున సంకటము లేర్పడినచో సలహాల నిచ్చును. అవసరమగు నెడల తానే అవతరించి సంకటములను తీర్చును. నిజమునకు ఆమెయే యజ్ఞకర్త. బ్రహ్మాది దేవత లందరునూ ఆమె అనుచరులు.

జీవులు యజ్ఞమును నిర్వర్తించుకొను శిష్టాచార సంపన్నులు. శ్రీమాత నారాధించుచూ సమస్త దేవతల సహకారమును పొందుదురు. శ్రీమాత నారాధించునపుడు అందరి దేవతల ఆరాధనయూ జరిగినట్లే. అన్యదేవతారాధన అవసరము లేదు. నిజమునకు భారతీయ సంప్రదాయమున ఏ దేవత నారాధించిననూ ఆ దేవతను అంతర్యామి యొక్క ప్రతిరూపముగ భావించి ఆరాధించినచో సర్వాంతర్యామియే ఆ రూపమున సకలార్థములను ప్రసాదించును.

# 883. 'యజమాన స్వరూపిణీ'

**శి**వుని ఎనిమిదవమూర్తియైన దీక్షాస్వరూపిణి శ్రీమాత అని అర్థము.

శివుడు యజమానాత్మకుడైన దీక్షామూర్తి యని కీర్తింపబడు చున్నాడు. అతని అష్టమమూర్తిగా, ఆత్మగా శ్రీమాతయే యున్నది. ఆమెయే దీక్షాస్వరూపిణి. శివుడు ఈశానుడు. అతడు సృష్టి యజమాని. సృష్టికి ఈశ్వరుడు. అతని ఆత్మగా, అష్టమమూర్తిగా, శ్రీమాత వికాసించు చుండును. శివుడుగా ఆమె అహంకారమూర్తియై, సృష్టిపై స్వామిత్వము నెరపును. అటుపైన శివుని అష్టమమూర్తియై తానుండును. ఆమె యజమాన స్వరూపిణిగా, యజమానుని ఆత్మగా లింగపురాణము ప్రశంసించినది. లింగ పురాణ మందలి ఈ అంశమును, ఈ నామముగా సహస్ర నామమున హయగ్రీవుడు చేర్చి స్తోత్రమును పలికినాడు.

శ్రీకృష్ణుడు కూడ అష్టమమూర్తియే. సప్తలోకములందు జీవాత్మ లుండును. అటుపైన అష్టమముగా విశ్వాత్మ యుండును. విశ్వాత్మ రూపమునకు లోబడియే త్రిదహంకారమూర్తులు పనిచేయుదురు. కనుకనే శ్రీకృష్ణుడు, శ్రీలలిత అష్టమినాడు పూజింపబడుదురు. శుక్లాష్టమిన దుర్గను, కృష్ణాష్టమి (బహుళాష్టమి) న కృష్ణుని ఆరాధించుట సంప్రదాయ మైనది. ఇద్దరునూ అష్టమూర్తులే.

# 884. 'ధర్మాధారా'

ధర్మమే ఆధారముగా నున్నది శ్రీమాత అని అర్థము.

ధర్మమాధారముగా సృష్టి నిర్మాణము గావించునది శ్రీమాత. శ్రీమాత ధర్మస్వరూపిణి. సృష్టి యందంతయూ ధర్మముగా వ్యాపించును. ధర్మమే ఆధారముగా సృష్టి నిలచును. ధర్మము తప్పినచో సృష్టి అస్తవ్యస్త మగును. వ్యక్తిగతముగ ధర్మము తప్పిన జీవితములు, స్థిరములేక కష్ట నష్టములు, సుఖ దుఃఖములు యిత్యాదివి పొందుచూ దుఃఖము చెందుదురు. జీవితములు క్రింది మీదులై నడచుచుండును. అలజడులతో కూడిన నదీ ప్రవాహమున ప్రయాణమువలె నుండును. గ్రహములు, సూర్యమండలములు ధర్మము ననుసరించియే చోటున యితర ఆధారములు లేక నిలచి యున్నవి. భూమిపై జీవులు ధర్మము తప్పినపుడు భూమిపై అలజడులు యేర్పడును. జలప్రళయములు, అగ్ని ప్రళయము లేర్పడుటకు కారణము మానవజాతి యందేర్పడిన ధర్మాచరణ లోపమే. ఋతువులు క్రమములు తప్పుట, అతివృష్టి, అనావృష్టి లేర్పడుట, కరవులు, అరిష్టము లేర్పడుట మానవుల ఆచరణ యందు ధర్మలోప మేర్పడుట వలన జరుగును. ధర్మమే ఆధారము. సృష్టి యేర్పడినపుడు, ధర్మము నాచరించుట తప్పనిసరి యగును. ధర్మము నాచరించని జాతులకు భూమి నుండి అపాయము తగ్గును.

సృష్టి బలము ధర్మమే. కావున ధర్మము నాచరించువారే కాల క్రమమున బలవంతులగు చుందురు. అధర్మబలము శాశ్వత బలము కాదు. అది తాత్కాలికమే. మహత్తర సామ్రాజ్యములు, జాతులు ధర్మము

తప్పినపుడెల్ల నశించినవి. రావణుని అధర్మము మొత్తము లంకకు చేటు గావించినది. కుల నాశము, జాతి నాశము, అధర్మము వలన యేర్పడును. వంశ నాశమునకు కూడ అధర్మమే మూలము. ఎక్కడ ధర్మ ముండునో అక్కడ జయ ముండును అనునది సృష్టి ధర్మము. అదియే వేద ధర్మము. పాలకు లధర్మపరు లైనపుడు పాలనా ప్రాంతములు కరవు కాటకములకు గురి యగును. నదులు ఎండి పోవును. అడవులు మండిపోవును. అనూహ్యమగు రోగములతో పాడి నిచ్చు జంతువులు కూడ మరణించును. ప్రజలబట్టియే పాలకులు.

శ్రీమాత స్వరూపిణియైన ద్రౌపదీదేవి నిండుసభలో అవమానము లకు గురిచేయబడగా, కురువంశ నాశనము జరిగినది. నేటికినీ భరతభూమి శాపఫలముగా ఔన్నత్యమును పొందలేకపోవు చున్నదని పెద్దల అభిప్రాయము. స్త్రీ అవమానింపబడినపుడు భయంకరమగు ధర్మగ్లాని జరిగినట్లే.

ఋషుల నవమానించి యదువంశము నాశనమైనది. గోవుల వధద్వారా భూమిపై అధర్మము పెరుగుచునే యున్నది. స్త్రీలు, గోవులు, జ్ఞానులు అవమానింపబడుట మహత్తరమగు ధర్మగ్లాని. కలియుగమున పాతికశాతము ధర్మము కనీస ముండవలెను. అవినీతి, బంధుప్రీతి, శాసనోల్లంఘనము గావించుచు, శాంతికోసము ఎంత ప్రయత్నము చేసిననూ నిష్ఫలమే. ధర్మమాధారముగా జీవించినవారికి శ్రీమాత రక్షణ యుండును. లేనివారికి కష్టనష్టములు తప్పవు. ధర్మబోధ మిక్కుటముగ నున్ననూ ఆచరించువారు అంతంత మాత్రమే. ఆచరించి బోధించువారు కూడ అరుదుగ నున్నారు. సర్వఫలములకు శ్రీమాత ఆధారము. ఆమె నారాధించువారికి ధర్మాచరణ మొక బాధ్యత.

# 885. 'ధనాధ్యక్షా'

**ధ**నముకు శ్రీమాతే అధ్యక్షురాలు అని అర్థము.

ధనమునకు కుబేరుడు అధ్యక్షుడు. కుబేరునికి కూడ ఆమెయే అధ్యక్షురాలు. కుబేరుడు ఉత్తర స్థానమున నుండును. మనయం దుత్తర స్థానము సహస్రార పద్మము. ఆ పద్మమునకు ఆమెయే అధ్యక్షురాలు. సహస్రార అంబుజమున వసించునది శ్రీమాత. కనుకనే శివశక్తులకు కుబేరుడు మిత్రుడు, భక్తుడు కూడ. శ్రీమాత ఆధారమున సర్వసంపదలు సమకూరును. శివుని జటాజూట మందలి ఒక వెంట్రుకతో కూడ లక్ష్మి ధనము సమానము కాదని పురాణ గాథ లున్నవి. దైవముకన్న ధనము గొప్పదనుకొనుట అవివేకము. దైవారాధనమున దివ్యధన మంతయూ వశమగును. అందుబాటులోనికి వచ్చును.

ధనమనగా అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, ఇంద్రుడు, బృహస్పతి, వసువు, వరుణుడు, సోముడు – ఇవి వేదమున ప్రతిపాదింప బడిన ధనము. నిజమగు సంపద. ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులుగ మన యందు అగ్ని యున్నది. ప్రాణములుగ వాయు వున్నది. మన యందలి ఆత్మ తేజస్సుగ సూర్య డున్నాడు. పరిసరముల అవగాహన, అనుభూతి, ఆనందము, వృద్ధి రూపమున చంద్రుడు మనసుగ నున్నాడు. వసించుటకు వలసిన స్థిమితము, సుఖము యిచ్చు వసుదేవు డున్నాడు. పరిపాలనా దక్షత అందించు ఇంద్రుడు ఉన్నాడు. జ్ఞానము, వివేకము వ్యాప్తి కలిగించు బృహస్పతి యున్నాడు. స్పందనాత్మకుడుగ గరుత్మంతు

డున్నాడు. అతడు అమృతమును కొనితేగలడు. అమృతమే సోమము. సోమ మనగా ఉమతో కూడిన శివుడు. శ్రీహరిని మూపురముపై గరుత్మంతుడు గొనితెచ్చి సాన్నిధ్య మిచ్చును. ఇట్లు మన యందు సమస్త దైవసంపదను శ్రీమాత ఏర్పరచి, అట్టి సంపదకు అధ్యక్షురాలుగ శ్రీమాత సహస్రారముననే యున్నది. అట్టి మాతను విడచి యితర సంపద లెన్నుకొనువారు మూర్ఖులు. ఈశ్వరునితో సహా, అన్ని సంపద లను అందించగల ఐశ్వర్య రూపిణి ఆమె. అష్టైశ్వర్యములు, అష్టసిద్ధులు ఆమె హస్తగతములు. నిజమునకు సృష్టియందలి కల్పతరువు, కామ ధేనువు శ్రీమాతయే. ఆమె ఆరాధనమున అన్నియూ సిద్ధించును. వలసినది సద్బుద్ధియే. భక్తి, శ్రద్ధ, నిరంతరారాధనము ఉపాయములు.



# 886. 'ధనధాన్యవివర్ధినీ'

**ధ**నమును, ధాన్యమును వర్ధిల్లచేయునది శ్రీమాత అని అర్థము.

వర్ధిల్లజేయుట అనగా వృద్ధి పొందించుట. ధనము, ధాన్యము సమృద్ధిగ నుండుట వలన జీవులు నిశ్చింతగా వృద్ధి పొందుచు నుందురు. ధన మున్ననూ ధాన్యము దొరకక పోవచ్చును. కోటీశ్వరులకు కూడ సమయమునకు అన్నపానములు లభింపకపోవచ్చును. భోజన సుఖము అందరికినీ యుండదు. ధన సంపాదనమున తీరుబడిలేక తిరుగుచూ, అన్నసౌఖ్యములేక, అడ్డమైన అధ్వాన్నములను భుజించి, రోగగ్రస్తు లగువారు ఎందరో యున్నారు. సారములేని తిండి తినుచూ వైద్యమునకు కూడ లొంగని దీర్ఘవ్యాధులను సంక్రమింప జేసుకొను సంపత్తి యున్న నేమి? లేకున్న నేమి? ధనిక దేశములలో ధనిక కుటుంబములలో పోషణ నిచ్చు ఆహారముకన్న రోగముల నిచ్చు కూడు కుడుచువా రెందరో యున్నారు. ధనసంపాదన వ్యామోహమున పడి వేళకు పుష్టికరమగు భోజనము చేయని ఆధునిక మానవులు కోకొల్లలు. వారమున కొక మారు వండుకొనుచూ, చల్ల పెట్టెలలో దాచుకొనుచూ వారమంతయూ చద్దికూడు తిను ప్రవాస భారతీయులు ఎంత సంపన్నులైననూ లేనివారే! వేళపట్టున, ఇంటి భోజనము అప్పటి కప్పుడు వండినది భుజించువారు చక్కని పోషణమును పొందెదరు.

అన్నము నిజమగు లక్ష్మి. అన్నము బ్రహ్మమే. అన్నమును వర్జించుట, నిందించుట, అపరిశుద్ధ మగు మనసుతో భుజించుట,

అపరిశుద్ధ మగు భోజనము చేయుట, చద్దికూడు, పులిసిన పదార్థములు, వాసనతో కూడిన ఆహార పదార్థములు దేహమునకు పోషణ నీయవు. అపకారము కలిగించును. అన్ని ధర్మముల సాధనకును, సిద్ధికినీ దేహము ప్రధానము. దేహపరిపుష్టికి, తుష్టి, పుష్టి, శుచి గల ఆహారము ప్రధానము. అట్టి ఆహారమునకు ధాన్యపు దినుసులు ప్రధానము. వాటి రూపమున శ్రీమాతయే యున్నది.

ధనధాన్యముల సమగ్రరూప మెరిగి, వానిని భక్తి శ్రద్ధలతో పొందువారే ధన ధాన్యములు గలవారు. అట్టి ధన ధాన్యములు పంచువారు అపరిమత మగు వృద్ధిని పొందుదురు. ఇటి వృద్ధి నిచ్చునది శ్రీమాత.



# 887. 'విప్రప్రియా'

విప్రులయందు ప్రీతి గలది శ్రీమాత అని అర్థము.

విప్రు లనగా విశిష్ట మగు ప్రజ్ఞలు కలవారు. ముందు నామములలో చెప్పబడిన ధనమును గూర్చి, ధాన్యమును గూర్చి తెలిసినవారు. వానిని అనుభూతి చెందుచూ నుండువారు. శాస్త్రము లందించు జ్ఞానము నెరిగి, ఆచరించుచూ, యితరులకు మార్గదర్శకులై జీవించువారు విప్రులు. భావన, భాష ఆచరణల యందు అహింసలు పాటించువారు విప్రులు. త్రికరణ శుద్ధిని పొందినవారు. అనగా మనసు యందు, ఇంద్రియముల యందు, దేహమునందు మలినములను నిర్మూలించుకొని శుద్ధిగ నుంచుకొనువారు అని అర్థము. వారు అంతఃకరణముల యందు జీవించుచూ కాలమును, దేశమునుబట్టి బహిఃకరణముల ద్వారా ప్రకటితమగు చుందురు. ఆత్మ చైతన్యము, దాని ననుసరించు అహంకారము, బుద్ధి, చిత్తము, అంతఃకరణ చతుష్టయము. మనస్సు, ఇంద్రియములు, శరీరము బహిఃకరణములు. అంతఃకరణముల యందు అక్షరముగ పురుషు డుండును. అతడే జీవుడు. బహిఃకరణముల యందు క్షర పురుషు డుండును. జీవునికి వాహనముగ క్షరమగు దేహ ముండును. విప్రులు అక్షరముగ నుండి దైవసాన్నిధ్యముతో కూడి యుందురు. దైవము పురుషోత్తముడు. అతనితో కూడియున్న పురుషుడు అంతఃకరణవలన అక్షరుడై యుండును. బహిఃకరణమునకు కర్తవ్యమును బట్టి వ్యక్తమగు చుండును. అట్టివారు విప్రులు. సామాన్యులు మనసు ప్రధానముగ

యింద్రియములతో కూడి యింద్రియార్థముల పరితృప్తికై దేహమును వినియోగింతురు. వారు మనసేంద్రియ దేహము లందు క్షరపురుషులై జీవించుచూ జనన మరణ చక్రమున తిరుగుచూ నుందురు. శ్రేష్ఠులగు విప్రులు దైవముతో కూడి యుండి మనసేంద్రియ దేహములలో కర్తవ్యమును బట్టి వసింతురే కాని వారు అంతఃకరణ శరీరమున వసింతురు. కనుక మరణింపక మరణము సమీపించు చుండగ దేహమును త్యజింతురు. కనుక మరణము వారకి మరణ యాతన కలిగింపదు.

ఇట్టి విప్రుల యందు శ్రీమాతకు ప్రీతి ఎక్కువ. వీరి ద్వారమున సామాన్యులను సమీపించి, గురుత్వమును నెరపి వారిని కూడ విప్రులను చేయును. శ్రీమాతకు సామాన్యులకు నడుమ వారధివలె విప్రులు నిలుతురు. వారు అహింసాపరులు. సత్యప్రవర్తనులు. దొంగబుద్ధి లేనివారు. ఉచితమగు బహుమానములను స్వీకరింపనివారు. అంత శ్శుచి, బహిశ్శుచి గలవారు. స్వాధ్యాయము, ప్రవచనము, ప్రవృత్తి యందు గలవారు. ఈశ్వర సమర్పితముగ జీవితము నర్పించి జీవించు వారు. బ్రహ్మము వారియందు చరించును. వారు బ్రహ్మము నందు చరింతురు. ఇట్టి విప్రులు అమోఘులు. అనగా పాపము నశించినవారు. వారి దరిచేరి శుశ్రూష చేయుచూ వారినుండి అజ్ఞాన స్వరూపమును తెలుసుకొని, జ్ఞానమున నిలచుట సాధకునకు జీవన ప్రయోజనమై యున్నది. వారి రూపమున శ్రీమాతయే యున్నదని తరువాతి నామమున పేర్కొనుట జరిగినది.

# 888. 'విప్రరూపా'

**వి**ప్రుల రూపమున నున్నది శ్రీమాత అని అర్థము.

విప్రులను గూర్చి వివరణము ముందు నామమున సూచన చేయబడినది. సద్గురువులే విప్రులు. వారు శ్రీమాత సామీప్య, సాయుజ్య, సారూప్యములను పొంది శ్రీమాత ప్రతిరూపములుగ సృష్టియందు అన్ని లోకముల వ్యాపించి యున్నారు. సనక సనందనాది కుమారులు గను, దేవర్షి నారదుడుగను, సప్తఋషులుగను, వారి పరంపరగను సప్త లోకములందు గురుపరంపర ఏర్పడి యున్నది. వీరందరూ శ్రీమాత ప్రతి రూపములు. వారు శ్రీమాతకు సర్వసమర్పణము చేసికొనిన కారణముగ వారినుండి శ్రీమాతయే తనను తాను ప్రకటించుకొను చుండును. తత్కారణముగ గురుపరంపరాగత జ్ఞానము, మార్గము జీవుల కందుబాటులో యున్నవి. సర్వ జీవులను చేరుటకు ఈ గురు పరంపరను శ్రీమాత వాహికలుగ నేర్పరచుకొని వర్తించు చున్నది.

శ్రీమాత సత్యాన్వేషకులకు, సదారాధకులకు, గురు రూపమున సాన్నిధ్య మిచ్చుచు నుండును. గురువే సదాచార సంపన్నుడగు శిష్యుని వద్దకు తనకు తానుగ వచ్చును. పరీక్షిత్తు వద్దకు శుక మహర్షి అట్లు వచ్చెను. యుధిష్టిరుని వద్దకు కృష్ణు డట్లేతెంచెను. వివేకానందుని వద్దకు రామకృష్ణ పరమహంస అట్లేతెంచెను. అగస్త్యుని వద్దకు హయగ్రీవు డేతెంచి ఈ సహస్రనామము నందించెను. వ్యాస వాల్మీకుల

వద్దకు నారద మహర్షి యేతెంచి వారి కుపదేశముచేసి భాగవత రామాయణాది గ్రంథములను రచింపచేసి లోకోత్తరమగు ఉద్ధరణ గావించెను. ధ్రువుని వద్దకు, ప్రహ్లాదుని వద్దకు కూడ నారద మహర్షి తానే స్వయముగ వచ్చి, ఉపదేశముల నిచ్చెను. ఇటీవలి కాలమున గాయత్రీ ఉపాసన చేయుచున్న శ్రీమాన్ ఎక్కిరాల కృష్ణమాచార్యులవారి వద్దకు అగస్త్యమహర్షి- మాస్టర్ సి.వి.వి. తేజోమయ రూపమున ఉపదేశ మిచ్చి, కృష్ణమాచార్యులవారిని ఆచార్యుల స్థానమున అలంక రింపచేసెను. ఎందరో మహానుభావుల వద్దకు మహర్షు లేతెంచుట, వారిని ఉద్ధరించుట, గురు స్థానమున స్థిరపరచి శ్రీమాత దివ్య ప్రణాళికను నిర్వర్తింపచేయుచున్నది. ఇది ఆమె విప్రప్రియత్వమునకు నిదర్శనము. ఆమెను 'విప్రప్రియ' యని, 'గురుప్రియ' యని కీర్తించుట లోను, 'విప్రరూపా', 'గురురూపా' అని కీర్తించుటలోను గురు, విప్ర రూపముల నున్నది శ్రీమాతయే యని తెలియవలెను. సద్గురువు, శ్రీమాత వేరు కాదు. తానే బహురూపములు ధరించి జీవులను నడిపించును.



# 889. 'విశ్వభ్రమణకారిణీ'

విశ్వచక్రమును త్రిప్పుచున్నది శ్రీమాత అని అర్థము.

సృష్టి చక్రము తిరుగు చుండును. కాలచక్రము త్రిప్పుచూ నుండును. ఇది శ్రీమాత మహిమయే. తిరుగుట, కదలుట, చలముగ నుండుట ప్రకృతి లక్షణము. ప్రకృతి చంచల. తిరుగుచూ, కదలుచూ, మార్పు చెందుచూ నుండును. దీనివలననే పదార్థము తేలికగుట, బరు వగుట, సూక్ష్మ మగుట, సూక్ష్మతర మగుట జరుగు చుండును. పదార్థముకన్న నీరు, నీటికన్న అగ్ని, అగ్నికన్న వాయువు, వాయువు కన్న ఆకాశము, ఆకాశముకన్న మనస్సు వేగవంతములై తిరుగు చుండును.

లోకము లన్నియు పదార్థము యొక్క వివిధ స్థితులలో పేర్చబడి యుండును. జీవులు కోరికల చుట్టూ తిరుగుదురు. జీవులు కూడ త్రిప్పబడు చున్నారు. వారు పగలు, రాత్రి అనుభవించుటకు కారణము, భూమి తిరుగుటవలననే కదా! భూమి అహర్నిశలూ తనచుట్టూ తాను తిరుగుచూ సూర్యుని చుట్టూ తిరుగును. చంద్రుడు కూడ నట్లే భూమి చుట్టూ తిరుగును. గ్రహము లన్నియూ తమ చుట్టూ తాము తిరుగుచూ సూర్యుని చుట్టూ తిరుగుచున్నవి. సూర్యుడు కూడ అట్లే సవితృమూర్తి చుట్టూ తిరుగుచున్నాడు. సూర్యునికి సూర్యుడు సవితృమూర్తి. సూర్య మండలము, సవితృ మండలము చుట్టూ తిరుగుచూ నుండగా, సవితృ మండలము, ఆదిత్య మండలము చుట్టూ తిరుగును. ఇట్లు చిన్న

మండలములు పెద్ద మండలముల చుట్టూ తిరుగుచూ, తమ చుట్టూ తాము తిరుగుచూ నుండును. ఇట్లు చుట్టలు చుట్టలుగ సృష్టి చక్ర మేర్పడి యున్నది. ఈ మొత్తము చట్రములు (చక్రములు) అన్నియూ ఒకే కేంద్రము చుట్టునూ తిరుగుచు నున్నవి. ఆ కేంద్రమే 'అదితి'. ఆమెయే శ్రీమాత. ఆమెయే 'భ్రమి.' భ్రమణము కలిగించు శ్రీమాత శక్తి భ్రమి. శ్రీమాత భ్రమణకారిణి.

మండలములుగా సృష్టి యేర్పడుటకు కారణము భ్రమణశక్తియే. చిన్న చిన్న మండలములనుండి పెద్ద మండలముల వరకూ అన్నియూ తమ చుట్టూ తాము తిరుగుట, తమ మూలస్థానము చుట్టూ తిరుగుట జరుగుచున్నది. మూలము మాత్రము కదలక యుండును. స్థిరముగ నుండును. ఇరుసు స్థిరముగా నుండి చక్రమును త్రిప్పును. కనుకనే శ్రీమాత చక్రవర్తిని యైనది. చక్రమును త్రిప్పున దామెయే. ఆ చక్రమున అందరునూ తిరుగుచు నుందురు. ఆమె తిరగదు. వ్యాప్తి చెందును. ఇదియే చక్రశక్తి. ఈ చక్రమునే విష్ణుచక్ర మని, శ్రీచక్ర మని అందురు. శ్రీ చక్రమును త్రిప్పుచూ దానియందు ఇరుసుగా కదలక వసించి యుండును. ఆమెను లేక మహావిష్ణువును చక్రధారులుగా ప్రశంసింతురు.

చక్రము త్రిప్పువాడు చక్రవర్తి. తాను తిరుగక చక్రమును త్రిప్పును. సామ్రాజ్యమున తిరుగాడు చుండగా సింహాసనము నధిష్ఠించి పరిపాలించువాడు చక్రవర్తి యగునుగాని, ఆరాటపడుచూ అంతటా తిరుగువాడు చక్రవర్తి కాలేడు. తాను స్థిరముగ ఆసీనుడై సమస్తమునూ తన ఆజ్ఞచే పాలించుట చక్రవర్తిత్వము. శ్రీమాత ఆజ్ఞాశక్తియే సృష్టి చక్రమును త్రిప్పుచూ నున్నది. క్రమము తప్పక సృష్టి చక్రము తిరుగుచూ నుండుటకు కారణము ఆమె ఆజ్ఞాశక్తియే.

పిన్నలు పెద్దల చుట్టూ తిరుగవలెను. ఇది ధర్మము. భూ మండలము సూర్య మండలము చుట్టూ, సూర్య మండలము ఆదిత్య మండలము చుట్టూ, ఆదిత్య మండలము నక్షత్ర మండలము చుట్టూ తిరుగునట్లు పిన్నలు పెద్దల చుట్టూ తిరుగుట ధర్మము. శిష్యులు గురువు నాశ్రయించి మెలగుట, గురువు పరమ గురువునూ, పరమ గురువు పరమేష్ఠి గురువునూ, అతడు పరమేశ్వరుని ఆశ్రయింతురు. వాత్సల్యము కొలది శిష్యుల చుట్టూ గురువు ఆరాటపడుచూ తిరిగినచో, గురువు శిష్యు డగును. అనగా శిష్యులకు లోకువ అగును. అప్పుడప్పుడు అనుగ్రహించుటకు, వాత్సల్యము చూపుటకు శిష్యుల వద్దకు గురు వేగును. వ్యామోహముతో శిష్యుల చుట్టూ తిరిగినచో గురుత్వము కోల్పోవును. యజమాని పనివారితో అధికసఖ్యము చూపినచో పని వారికి లోకు వగును. ఎవరెవరిని ఆశ్రయించవలెనో సృష్టి విధానము చూపుచున్నది, సూర్యుడు భూమి చుట్టూ తిరుగడు. భూమి తన జీవుల చుట్టూ తిరుగదు. సెకనులు నిమిషము చుట్టూ, నిమిషములు గంటల చుట్టూ తిరుగుటయే గడియారము. ఇట్లు సృష్టి గడియారము అద్భుత ముగ నిర్వర్తింపబడు చున్నది. మహత్తరమగు సద్గురువులు కూడ తాము తిరుగక, లోకములను చక్కబెట్టు చున్నారు. తపస్సు చేయుచూ లోకములను చక్కబెట్టు తపోలోకవాసులు సత్యమున కతి చేరువలో నుందురు. వారికి చక్ర రహస్యము లన్నియూ తెలిసి యుండును. వశిష్ఠాది బ్రహ్మజ్ఞానులు అట్టి చక్రవర్తులు. సృష్టి యందలి చక్రవర్తు లందరునూ వశిష్ఠుని శిష్యులే.

# 890. 'విశ్వగ్రాసా'

విశ్వము తన ఆహారముగా గలది శ్రీమాత అని అర్థము.

సృష్టికర్త యగు శ్రీమాత, సృష్టిహర్త కూడను. సృష్టించి, వృద్ధి గావించి, హరించును. నారు, నీరు పోసి పంటను పండించి భుజించుట వ్యవసాయము. తాను పెంచి తానే తినుట అన్నదాత ఎట్లు చేయు చున్నాడో, అట్లే బ్రహ్మగా సృష్టించి, విష్ణువుగా పోషించి, రుద్రునిగా భుజించుట సృష్టియందు గమనింప వచ్చును. కాలము రూపమున పుట్టించుట, పెంచుట, హరించుట ప్రకృతిలో గమనింపవచ్చును. మహాకాలుడి రూపమున రుద్రుని ఆరాధింతురు. కాలాగ్ని రుద్రుడు, అగ్నులలో చివరివాడు. అతడు త్రికాగ్నికాలుడు. త్రికాగ్ని అనగా త్రికముల యందలి అగ్ని. పదార్థమున అగ్నిగ నుండి ఆ అగ్ని పదార్థ మున సమీకరణము చెందగా జ్వాల యగును. జ్వాల పెరుగగా, పదార్థము హరింప బడును. అగ్ని స్వరూపిణియై శ్రీమాత ఒకానొకప్పుడు పుట్టించును. ఒకపై పోషించును. ఆపై హరించును. బ్రహ్మముగ నుండు శ్రీమాత యిచ్ఛతో సృష్టి నేర్పరిచి, జ్ఞానముతో పోషించి, కాలము రూపమున భుజించును. మరల బ్రహ్మమై నిలచును. 'మహాగ్రాసా' అను నామము శ్రీమాత విశ్వరూప మందలి మూడవ భాగము.



# 891. 'విద్రుమాభా'

ఎఱ్ఱని కాంతివలె భాసించునది శ్రీమాత అని అర్థము.

సూర్యోదయమున ఎఱ్ఱని కాంతి దర్శింపవచ్చును. ఎఱ్ఱని వుల్లి పువ్వువలె కాంతి అంచులలో ఉగ్రమగు ఎఱుపుగను, సూర్యోదయ దర్శనము జరుగును. ఈ కాంతి దర్శనము జ్ఞానమును కలిగించును. పుంఖానుపుంఖములుగా జ్ఞానమును పెంచును. ఎఱ్ఱ పగడము వలె ఉదయమున గోచరించు సూర్యుడు, మధ్యాహ్నమునకు వజ్రకాంతిగ పెరిగి, సమస్తమునూ వెలిగించును. జ్ఞానాగ్ని రగుల్కొనవలెనే గాని, ఒకమారు రగుల్కొనినచో వజ్రకాంతి వరకు వృద్ధి చెందును. పగడము వలె గోచరించు సూర్యబింబము, ఆరుగంటల కాలములో వజ్రమై చూడనలవిగాని కాంతిబింబ మగును. జ్ఞానార్తులు శ్రీమాత విద్రుమ కాంతినే ఆరాధించగలరు. విద్రుమ కాంతి దర్శనము జరిగినచో అటుపై కథ అంతయూ శుభపరంపరలుగా జ్ఞానము విచ్చుకొనక తప్పదు. సమిధ యందలి అగ్ని రగుల్కొనినచో తప్పక జ్వాల యగును. శరీరము సమిధ వంటిది. అందు కుండలినీ అగ్ని ఉద్భవము శుభా రంభము. శరీర మందలి గణములలో వేడిమిగా అగ్ని యున్నది. అగ్నిని వాయువు సహాయమున, గురువు సహాయమున, ప్రాణాగ్నితో జోడించినచో, మూలాధారమున అగ్నికి సమీకరణము జరిగి కుండలిని జ్వాలయై ఊర్ధ్వగతిని బట్టును. అటుపై జ్వాలాకూలలయై ప్రజ్ఞా కేంద్రమున

అన్నింటినీ అనుసంధానము చేసి 'జ్వాలామాలిని'గా పరిణతి చెందును. హృదయము చేరుసరికి 'హేమమాలిని' యగును. ఆపైన శిరస్సును చేరి వజ్రకాంతితో ప్రకాశించును. సహస్రార పద్మమున 'మణిద్వీప'మై వెలుగును. వేయిసూర్యుల కాంతికి శుభారంభమే ఉదయించు సూర్య కాంతి. కనుక ఆ కాంతిని ఆరాధించుట విద్రుమను ఆరాధించుటయే. శ్రీమాత 'విద్రుమాభా'. అందులకే ఆరాధనా సమయమున ఎఱ్ఱని పువ్వులను అలంకరణము చేయుట సంప్రదాయమైనది. శ్రీమాత 'మందార కుసుమప్రియా' అని పిలువబడు చున్నది. ఎఱ్ఱ చందనము, ఎఱ్ఱని వస్త్రములు, కుంకుమ ఆరాధనమునకు ప్రధానమగు అనుపాన ములు. ఎఱ్ఱని బొట్టును భ్రూమధ్యమున ధరించుటకు కారణము కూడ నిదియే. 'సిందూర తిలకాంచితా', 'సిందూర కుసుమ ప్రియా' అను నామములు కూడ ప్రసిద్ధములు. జ్ఞానాగ్నిగా ఎఱ్ఱగ నుదయించి మనల నుద్ధరింపచేయు మాత 'విద్రుమ' అని తెలియవలెను.



# 892, 893. 'వైష్ణవీ, విష్ణురూపిణీ'

శ్రీమాత విష్ణువువలె శంఖ చక్ర గదా పద్మములను ధరించి విష్ణురూపమున గోచరించునని అర్థము.

నిజమునకు శ్రీమాత విష్ణువుగా త్రిమూర్తులలో గోచరించును. ఆమె జగన్మోహిని. అతను జగన్మోహనుడు. ఆమె తన రూప సౌందర్య మును సృష్టి నిర్వాహణ శక్తిని విష్ణువు నందు నిక్షిప్తము చేయుటచే శ్రీమాతవలెనే విష్ణు వుండును. నిజమునకు బ్రహ్మాండ పురాణము నందు శ్రీమాత యిట్లు పలికెను. "నా పురుషరూపమే గోపికా స్త్రీలను మోహింపచేసినది." అట్లే మహాభారత యుద్ధ ప్రారంభమున అర్జునుని దుర్గారాధన చేయుమని శ్రీకృష్ణుడు పలికెను. అర్జునుడు దుర్గాదేవి నారాధింపగ దుర్గ ప్రత్యక్ష్యమై యిట్లని పలికెను. "నీ రథమున సారథియై కూచుండు శ్రీకృష్ణుడను నేనే. నేనే శ్రీకృష్ణ రూపమున ధర్మసంస్థాపన కొరకు, సంచరించు చున్నాను. శ్రీకృష్ణుని అనుసరింపుము. నీకు జయము కలుగును." అని తెలిపినది.

కృష్ణుడు, విష్ణువు, శ్రీమాత యొకటియే. పరమ శివుడు మంకనుడు అను భక్తునకు విశ్వరూపము చూపగా మంకనుడు శివునికి నమస్కరించి "నీ పార్శ్వమున ప్రకాశించుచున్న స్త్రీమూర్తి ఎవరు?" అని తెలుసుకొన గోరెను. "నా పార్శ్వమున నున్నది నా మాయ. ఆమెయే త్రిగుణాత్మిక. సృష్టిని మోహింపచేయునది ఆమె. ఆమె మాయారూపిణి

యగు నారాయణి. నారాయణి, నారాయణుడు సృష్టియందు వైష్ణవీ రూపమున నుందురు.” అని పలికెను.

అట్లే పరాశరస్మృతి యందు యిట్లు చెప్పబడినది. దుర్గను, కాత్యాయనిని శుద్ధమగు మనస్సుతో పూజించినచో విష్ణులోకమును పొందవచ్చును. ఎన్నియో పురాణములు, శ్రీమాత పూజాఫలము విష్ణు లోక ప్రాప్తి గావించునని చెప్పుచుండును. ఈ మొత్తమునకును సారమే మనగా శ్రీమాతయే వైష్ణవి లేక విష్ణువు. పరమ శివుని మాయాశక్తి, సృష్టిని మోహింప చేయునది, పోషించునది, రక్షించునది ఆమెయే. ఆమె రూపము, కళలు, విష్ణువుగ గోచరించును. కనుక విష్ణు పూజ లన్నియూ వైష్ణవి దరిచేర్చును. వైష్ణవము అంతయూ శివ మహిమ.



# 894, 895. 'అయోని, యోనినిలయా'

**అ**యోని అనగా దైవము. యోనినిలయా అనగా నిలయ మందున్న దైవము అని అర్థము.

సృష్టి ఉన్ననూ లేకున్ననూ శ్రీమాత యున్నది. సృష్టి సంకల్పము బిందువుగా యేర్పడగా దాని చుట్టూ కాలము, ప్రకృతి, శక్తి త్రికోణ మేర్పడును. అటుపై ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తి త్రికోణ మేర్పడును. అటుపైన యితర త్రికోణము లేర్పడును. ఎన్ని లోకము లున్నవో అన్ని త్రికోణము లుండును. ఇన్నిటి యందు పుట్టని శ్రీమాత పుట్టినట్లుగను, త్రికోణముల యందు వసించి యున్నట్లుగను గోచరించు చుండును. ఆకాశ మందలి చంద్రుడు నీటిపై ప్రతిబింబించినపుడు నీటియం దున్న ట్లుండును. నీటి యందలి చేపలు చంద్రుని ప్రతిబింబమును నీటియందు చూచి అది కూడ తమవలెనే నీటియందు వసించుచున్న మరియొక జలచరమని భ్రాంతి చెందును. అట్లే సృష్టియందు గోచరించు చున్న శ్రీమాత త్రిలోకముల యందున్న ట్లుండును. నిజమునకు ఏ త్రికోణము నందు తానుండదు. తన సాన్నిధ్య ముండును. తాను 'అయోని' అనగా పుట్టనిది. కాని 'యోని నిలయ'గా గోచరించును. ఇదియొక మహత్తర యోగము.

*"పుట్టినట్లు తోచు, పుట్టకుండు"* అని భాగవతమున విష్ణు మహిమను కీర్తింతురు. శ్రీ మహావిష్ణువు శ్రీకృష్ణుని రూపమున యాదవుల నడుమ, గోపకుల నడుమ, పాండవ కౌరవాది రాజుల నడుమ, రాజర్షుల నడుమ, ఉద్ధవాది భక్తుల నడుమ, ద్వారకావాసుల నడుమ సంచరించి తన లీలావిలాసమును చూపెను. చిన్నతనము నుండి

అతని ననుసరించిన ఉద్ధవుడు అతని నిజరూపము తెలుసుకొన లేక పోయెను. కృష్ణ నిర్యాణము పిమ్మట, కృష్ణుని తలచుకొనుచు ఉద్ధవుడు శేష జీవితమును గడపెను. అతడి మహిమలను మరల మరల గుర్తు తెచ్చుకొనుచూ అతడెడింతటివాడో అని విస్తుపోయెను. కృష్ణచైతన్యము రుచి నెరిగి ఉన్మత్తుడివలె జీవించెను. విదురునితో సంవాదము చేసినపు డిట్లనెను. "మన నడుమ అతడు అనేక విధములుగ లీలలు చూపగా మనవంటివాడే అని భ్రమపడితిమి, కాని అతడు మన మూలమని తెలియలేదు. మిత్రులలో మిత్రుడుగను, బంధువులలో బంధువుగను, భక్తులకు దేవుడుగను, యోగులకు ఈశ్వరుడుగను, కాముకులకు కాముకుడుగను, భార్యలకు భర్తగను, శత్రువులకు శత్రువుగను గోచరించెనేగాని అతనిని గూర్చి నిర్ణయము చేయుట సాధ్యపడలేదు. వ్యాసాదులు కూడ మాయనుబడిరి. నీవు జ్ఞానివి కనుక అతని నొక జ్ఞానిగ చూచితివి. నేను స్నేహితుడిగ చూచినాను. మనమెట్లు చూచిన అట్లు కనిపించెనే గాని అతడు ఏదియునూ కాదు. కాని అన్నియూ అతడే." కృష్ణుడు పరమ పురుషుడు. పురాణ పురుషుడు. పుట్టినట్లు గోచరించెనే గాని పుట్టువాడు, గిట్టువాడు కాదు. ఎప్పుడునూ యుండెడి వాడు. తనను గూర్చి తానే భగవద్గీత యందు ప్రకటించుకొనెను. పలుమార్లు విశ్వరూప దర్శన మిచ్చెను. అతడు శ్రీమాతయే. పుట్టని శ్రీమాత పుట్టినట్లుగ గోచరించెను. ఆమె అయోని. యోనినిలయ మందు గోచరించును.

త్రికోణ బిందువుగ గోచరించి త్రికోణము లేర్పరచును. కాని కేవలము త్రికోణ బిందువే కాదు. బిందు మూలము కూడ ఆమెయే. ఆమె 'అదృశ్యా దృశ్య రహిత'. అట్లే 'అయోని యోని నిలయా.'

# 896. 'కూటస్థా'

**య**ంత్రమున నుండునది శ్రీమాత అని అర్థము.

కూటస్థ మనగా యంత్రము నందుండున దనియూ, నిశ్చలముగ నుండున దనియూ, వృశ్చిక, ధనుస్సు రాశుల మధ్యమున నుండున దనియూ, గిరిశిఖర మనియూ, పురద్వార మనియూ, నాగలికొన అనియూ, మాయ అనియూ అర్థములు చెప్పబడినవి.

యంత్ర మధ్యమున బిందువుగ నుండుటచే యంత్ర మేర్పడినది. త్రికోణమున బిందువే త్రికోణమున కాధారము. బిందువే లేనిచో త్రికోణము లేదు. ఏ యంత్రమున కైననూ బిందువు ప్రధానము. అనంతమగు చైతన్యము అవతరింపవలెనన్నచో బిందు రూపము దాల్చి అవతరించును. శ్రీ చక్ర మేరువు నందు గల బిందువు కారణముగ శ్రీ చక్ర మేర్పడు చున్నది. బిందువు వ్యక్తమైన పరబ్రహ్మము. అదియూ పరమాత్మ. అచటనుండి వరుసగా త్రికోణము లాధారముగ అవతరణము లేర్పడును. బిందు మూలమే త్రికోణముల కాధారము. ఈ పరమాత్మ బిందువే సహస్రారమున పద్మ మధ్యమున వెలుగొందు మణి. ఆ బిందువే అవతరణము చెందుచూ మూలాధారమున కూడ బిందువై భౌతిక లోకమునకు ఆధారమై యుండును. ద్వాదశ రాశులలో కూడ మూలాధార బిందువు వృశ్చికరాశి తుది, ధనుస్సురాశి మొదలు మధ్యమున నున్నది. దీనిని 'సర్పము కొన' అందురు. సహస్రారము

నందలి బిందువు సర్పము శిరస్సుపై నున్న మణిగా భావింతురు. మూలాధారము నుండి సహస్రారము వరకు ఈ సర్పము వ్యాప్తిచెంది యుండును. మూలాధారము కూటస్థమగు శ్రీమాతకు తుదిస్థానము. సృష్టి మూలాధారప్రజ్ఞ భూమి యందున్నది. సహస్రార ప్రజ్ఞ భర్గోదేవ మండల కేంద్రమున నున్నది. అటుపైన చైతన్యముగ శ్రీమాత యున్నది.

బిందువు వలననే సృష్టి స్థిరముగ నున్నది. వికారములకు గురికాక యున్నది. నిశ్చలముగ నున్నది. ఏ లోకమైననూ స్థిరముగ నుండుటకు శ్రీమాత ప్రజ్ఞయే ఆధారము. వరుసగా ఆరోహణ, అవరోహణ క్రమములలో బిందు తర్పణముల నేర్పరచుచూ లోకము లను దృశ్యమాన దర్పణములుగా ఏర్పరచును. బిందువు తిరోధానము చెందినచో దర్పణము లన్నియూ అదృశ్య మగును. సృష్టిని తన మాయా శక్తిచే అగుపడునట్లు, అదృశ్యమగునట్లు నిర్వర్తించును. లోకము లన్నిటికినీ ప్రవేశ నిర్గమ ద్వారములు ఆయా లోకములందలి బిందువులే. ఆరాధనకు కూడ బిందువే ప్రధానము. అందుకే బిందు దర్పణము.

దర్పణ లోకము లన్నియూ దర్శనాత్మకములై ఆనందము కలిగించును. శ్రీమాత మహిమ అని జ్ఞప్తి యందున్నప్పుడే సృష్టి సమ్యక్ సారమై గోచరించును. లేనిచో సృష్టి సంసారబంధమై చిక్కులు పెట్టును. శ్రీమాత కూటస్థ స్వరూపము తెలిసినవారికి నిశ్చలత్వ ముండును. స్థిరత్వ ముండును. గిరిశిఖరమువలె అచంచలమై బిందువు నాశ్రయించి

యుండును. నవపురి యగు సృష్టికి నవద్వారములుగ నవ బిందువు లున్నవి. అట్టిదే శ్రీకృష్ణుని ద్వారకాపురి. శ్రీచక్రమే దాని మేరువు నలంకరించి యున్నది శ్రీకృష్ణుడు లేక శ్రీలలిత. బిందురహస్యము తెలియనపుడు సృష్టియంతయూ మాయగ గోచరించును. రహస్యము తెలిసినవారికి సర్వలోకముల ప్రవేశము, గమనము యుండును. నారద మహర్షి అట్టివారిలో శ్రేష్ఠులు.



# 897. 'కులరూపిణీ'

**కు**లదైవముగా కొలవబడుచున్న శ్రీమాత అని అర్థము.

వంశాచారమును బట్టి ఆర్ష సంప్రదాయమున కులదైవము విరాజిల్లు చుండును. కులదైవమునే ఇలవేల్పు అని కూడ అందురు. వంశానుక్రమముగ ప్రతియింటనూ ఒక ఇలవేలుపు పూజింపబడు చుండును. ఆ ఇలవేలుపు రూపమున శ్రీమాతయే తరతరముల ఆ కుటుంబము యొక్క యోగక్షేమములను కాపాడుచుండును. శ్రీరామ పరివారము, శివపరివారము, లక్ష్మీనారాయణులు, శ్రీలలిత, ఆంజ నేయుడు, గణపతి, దత్తాత్రేయుడు, వేంకటేశ్వరుడు, గోపాలకృష్ణుడు, సుబ్రహ్మణ్యేశ్వరుడు భారతీయ కుటుంబములలో ఇలవేలుపులుగా ఆరాధింపబడు చున్నారు. తరము మారిననూ ఇలవేలుపులు మారరాదు. తమ పూర్వులు ఏ దైవరూపము నారాధించిరో, ఆ దైవ రూపమును షోడశోపచారములతో నిత్యమూ పూజింపవలెను. ఇట్టి నిత్యపూజ ఏ యింట జరుగునో, ఆ ఇంట సర్వశుభములు ఇలవేలుపు రూపమున శ్రీమాత అనుగ్రహించును. పూర్వుల సంప్రదాయమును విసర్జించినపుడు వారి ఆశీర్వచనములు, వారి ఉత్తమ సంస్కారములు కుటుంబమున కొనసాగవు. పూర్వులేర్పరచిన రక్షాకవచమును విసర్జించి నట్లగును. అపుడు కుటుంబములకు అపాయము లేర్పడుటకు అవకాశము కలదు. కులదైవము కులమును కాపాడును. కుల మనగా వంశము.

ఆధునిక కాలమున సద్గురువుల సమాశ్రయనము మెండుగ

నున్నది. గురుమార్గమున దీక్ష వహించిననూ, కులమార్గము, కులాచారము విసర్జింపరాదు. పూర్వులు, పెద్దలు అగువారు అనుసరించిన ఉత్తమ సంస్కార మార్గములను విసర్జించినచో బలము తగ్గును. పెద్దలిచ్చిన ఆస్తి కన్న పెద్ద లందించిన పూజాపీఠము చాల గొప్పది. ఆస్తులు తరగవచ్చును; పెరగవచ్చును. ఆస్తుల విషయ మెట్లున్ననూ పెద్ద లందించిన పూజాపీఠమును ఇంటిపెద్దగా భావించి నిత్యపూజలు గావించినచో ఆ యింటియందు శుభపరంపరలకు చక్కని పునాది వేసినట్లుండును. పునాదులను విస్మరించి అంతస్తులను పెంచు ప్రయత్నము మూఢత్వము.

అంతర్ముఖముగ ఆరాధనలు చేసుకొనుచున్ననూ బహిర్ముఖముగ ఇలవేలుపునకు నిత్యపూజలు గావించి తీరవలెను. కులమను పదము ఆధారముగ 'కుల కుండాలయా', 'కుల యోగినీ', కుల సంకేతపాలిని', కులామృతైకరసిక', 'కులాంగనా', 'కులాంతస్థా', 'కౌళినీ', 'కులేశ్వరి', 'కులోత్తీర్ణా' అను నామములు కూడా సహస్రనామము లందున్నవి. వానిని కూడ ఈ నామ సందర్భమున పునఃపరిశీలన చేసికొనుట ముఖ్యము. వానిని మరల ప్రస్తావించుట సముచితము.



# 898. 'వీరగోష్ఠీప్రియా'

వీరుల గోష్ఠియందు ప్రీతి గలది శ్రీమాత అని అర్థము.

వీరు లనగా అహంకార భావము తొలగినవారు. అహంకార భావము సమస్త అవిద్యలకు మూలము. అది తొలగినపుడు స్వతరబుద్ధి లేని ఆత్మభావమే యుండును. ద్వంద్వబుద్ధి యుండదు. వీరులు నిజ మగు యోగులు. వారి కంతటను దైవమే గోచరించును. వారి గోష్ఠి అంతయూ దైవమును గూర్చియే. దైవమహిమను కొనియాడుచూ అనంతకాలము రసానుభూతిలో నిమగ్నమై యుందురు. జీవితములు యాంత్రికములుగ సాగిపోవు చుండును. ప్రహ్లాదాది భాగవతుల వలెనూ, గోకుల మందలి గోపికలవలెనూ, నైమిశారణ్యము నందలి ఋషుల వలెనూ నిత్యము హరిభజన యందు నిమగ్నులై యుందురు. వీరి గోష్ఠియందు శ్రీమాత ఘనరూపిణియై, సత్యమగు సాన్నిధ్య మిచ్చును. శ్రీశుకుడు, సూతుడు, శౌనకాది మునులు, వైశంపాయనాది ఋషులు, సతతము దివ్యగోష్ఠి యందే యుందురు. వారందించినవే పురాణములు.

ఎక్కడ నిరహంకారియై భక్తుడు దైవమును గూర్చి జిజ్ఞాసువులకు ప్రవచన మిచ్చునో అచ్చట శ్రీమాత ప్రియముతో సాన్నిధ్య మిచ్చును.



# 899. 'వీరా'

నిరహంకార తత్త్వమై బ్రహ్మమే తానుగా అంతటా వ్యాపించినది శ్రీమాత అని అర్థము.

అహంకార మున్నచోట పరిమితత్వ ముండును. అట్టివారు వీరులు కారు. శ్రీమాత బ్రహ్మము యొక్క వెలుగుగా ప్రకాశించు చున్ననూ తాను బ్రహ్మమే అని తెలిసి యున్నది. బ్రహ్మమే తానుగ యున్నది గాని, తాను వేరుగ నున్నదని భావింపదు. *'బ్రహ్మోహమస్మి'* అను భావనే నిత్యభావన. *'అహమస్మి'* అని భావింపదు. ప్రత్యేకాత్మను అహమస్మి అని భావింతురు. అనగా 'నే' నున్నానని భావింతురు. ప్రతి వారికినీ నే నను భావన మిక్కుటము. నేను, నాది, నావారు అనుకొనుచూ పరిమితు లగుదురు. నేనను ప్రత్యేకభావనకు నిజమగు అస్తిత్వము లేదు. దైవమే తానుగ నున్నాడు. అతడే తానుగ నున్నాడు అని తెలియ జెప్పుటకే *'సోహమస్మి'* అను మంత్రము నిత్తురు. సోహమస్మి అనగా సః + అహమస్మి. 'సః' అనగా అతడు. అహమస్మి అనగా నే నున్నాను అని అర్థము. కనుక సోహమస్మి అను మంత్రోపదేశము- అతడే తానుగ నున్నాడు కాని, తాను ప్రత్యేకముగ లేదు అని తెలియజేయుటకు ఉపదేశింపబడును. అతడే తానుగ నున్నాడు అను భావన నిశ్చయమని నికరముగ తెలిసినపుడు అటుపైన అతడే యున్నాడు. నిజమునకు తాను లేదు అని తెలియును. అతడే బ్రహ్మము. బ్రహ్మమే యున్నాడు.

బ్రహ్మమే తానుగ యున్నాడు అని తెలియబడును. అపుడు నికరముగ తెలిసినపుడు అటుపైన అతడే యున్నాడు. నిజమునకు తాను లేడు అని తెలియును. అతడే బ్రహ్మము. బ్రహ్మమే యున్నాడు. బ్రహ్మమే తానుగ యున్నాడు అని తెలియబడును. అపుడు బ్రహ్మమునకు లోబడి అహంకార ముండును. అట్టివారు వీరులు.

అట్టి వీరులకు తల్లి శ్రీమాత. అందువలన ఆమె వీరమాత అని ముందు నామములలో తెలుపబడినది. వీరు లామె నారాధింతురు. అందువలన 'వీరారాధ్యా' అని తెలుపబడినది. వీరు లామె గోష్ఠి యందే జీవితము గడుపుదురు అనికూడా 'వీరగోష్ఠిప్రియా' నామమున తెలుపబడినది. వారందరి గమ్యము "వీరా". ఆమెయే శ్రీమాత. అహమస్మి, సోహమస్మి, బ్రహ్మోహమస్మి అన్నది సోపానక్రమము. శ్రీమాత ఈ మూడు స్థితులను దాటి తురీయమైన నాలుగవ స్థితి యందున్నది.



# 900. 'నైష్కర్మ్య'

కర్మము లేనిది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత కర్మలు లేనిది. సృష్టికర్మ యంతయూ ఆమె ఆధారముగ జరుగును. జరుగు కర్మ గాని, ఆ కర్మ ఫలము గాని ఆమె నంటవు. ఆమె చేయు కర్మలేమియు లేవు. ఆమెనుండి ఏర్పడిన త్రిగుణముల నుండి జీవలోకము లేర్పడును. జీవుల కర్మలన్నియూ త్రిమూర్తులచే పరిపాలింపబడు చుండును. కర్మలు పుట్టిన జీవులకే గాని, తనకు గావు. వెండితెరపై సినిమా కథవలె సృష్టికర్మ జరుగును. అందు సురులు, అసురులు, మానవులు, దైత్యులు, ఆదిత్యులు, సర్పములు, విహంగములు ఏర్పడును. పరస్పర విరుద్ధ భావములతో సృష్టి సినిమా కథవలె నడచును. కథలో నవరసము లుండును. ద్వంద్వము లుండును. జయాపజయము లుండును. ధర్మా ధర్మము లుండును. కష్టసుఖము లుండును. లాభ నష్టము లుండును. యుద్ధములు, మారణ హోమము లుండును. పుట్టుకలు, వివాహములు, మరణములు యుండును. కథ అంతయూ ఉత్కంఠగా సాగును. సన్నివేశము లన్నియూ వెండితెరపైనే జరుగును. కాని అవి ఏవియు వెండితెరను తాకలేవు. అట్లే సృష్టి కథ, సృష్టి కర్మము శ్రీమాత నంటలేవు.

కథలో శ్రీమాత కూడ అప్పుడప్పుడు పాత్రధారణము గావించి కర్మలంటక కర్మము లెట్లు చేయవచ్చునో సోదాహరణముగ చూపును.

రామకృష్ణాదుల కథ లట్టివే. తమనుండి కర్మమును నిర్వర్తింపచేయుటే గాని, తాము చేయక నుండుట రామకృష్ణుల కథలో చూపబడిన పవిత్రమగు, సున్నితమగు రహస్యము. కర్మల నిర్వర్తించు చున్ననూ అవి తమను అంటని విధానమును వారి నిర్వర్తనమున చూపిరి. నైష్కర్మ్య మనగా నేమో తెలిపిరి. శ్రీరాముడు మాత శ్యామల రూపము. శ్రీకృష్ణుడు శ్రీమాత సమగ్రమగు శ్రీలలిత రూపము. వారి జీవితములు నైష్కర్మ్య ప్రధానములు. వారి రూపమున అన్నియూ చేయుచూ, నేమియూ చేయకుండుట ఎట్లో శ్రీమాత నిర్వర్తించి చూపెను. యోగుల కదియే మార్గమై నిలచినది. ఆ మార్గముననే యోగులు, సిద్ధులు, ఋషులు, మునులు, రాజర్షులు, మహర్షులు, దేవర్షులు, బ్రహ్మర్షులు, కుమారులు నడచు చున్నారు. నైష్కర్మ్యము సిద్ధులలో కెల్ల ఉత్తమ సిద్ధి. శ్రీమాత నైష్కర్మ్య విధానమునకు కథానాయిక.

శ్రీలలితా సహస్రనామ మండలి

తొమ్మిదవ సంపుటము

సంపూర్ణము.



శ్రీ బాలా త్రిపురసుందర్యై నమః ।

# శ్రీ లలితా సహస్రనామ స్తోత్రము

## ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

పుష్టా పురాతనా పూజ్యా పుష్కరా పుష్కరేక్షణా ॥ 152

పరంజ్యోతిః పరంధామ పరమాణుః పరాత్పరా ।
పాశహస్తా పాశహంత్రీ పరమంత్ర విభేదినీ ॥ 153

మూర్తా ఽ మూర్తా నిత్యతృప్తా మునిమానస హంసికా ।
సత్యవ్రతా సత్యరూపా సర్వాంతర్యామినీ సతీ ॥ 154

బ్రహ్మాణీ బ్రహ్మజననీ బహురూపా బుధార్చితా ।
ప్రసవిత్రీ ప్రచండాఽ ఽజ్ఞా ప్రతిష్ఠా ప్రకటాకృతిః ॥ 155

ప్రాణేశ్వరీ ప్రాణదాత్రీ పంచాశత్పీఠరూపిణీ ।
విశృంఖలా వివిక్తస్థా వీరమాతా వియత్ప్రసూః ॥ 156

ముకుందా ముక్తినిలయా మూలవిగ్రహరూపిణీ ।
భావజ్ఞా భవరోగఘ్నీ భవచక్ర ప్రవర్తినీ ॥ 157

ఛందస్సారా శాస్త్రసారా మంత్రసారా తలోదరీ ।
ఉదారకీర్తి రుద్దామవైభవా వర్ణరూపిణీ ॥ 158

జన్మమృత్యుజరాతప్త జనవిశ్రాంతిదాయినీ ।
సర్వోపనిషదుద్ఘుష్టా శాంత్యతీత కళాత్మికా ॥ 159

గంభీరా గగనాంతస్థా గర్వితా గానలోలుపా ।
కల్పనారహితా కాష్ఠాఽకాంతా కాంతార్ధవిగ్రహా ॥ 160

కార్యకారణ నిర్ముక్తా కామకేళీతరంగితా ।
కనత్కనక తాటంకా లీలావిగ్రహధారిణీ ॥ 161

అజా క్షయవినిర్ముక్తా ముగ్ధా క్షిప్రప్రసాదినీ ।
అంతర్ముఖ సమారాధ్యా బహిర్ముఖ సుదుర్లభా ॥ 162

త్రయీ త్రివర్గనిలయా త్రిస్థా త్రిపురమాలినీ ।
నిరామయా నిరాలంబా స్వాత్మారామా సుధాసృతిః ॥ 163

సంసారపంక నిర్మగ్న సముద్ధరణ పండితా ।
యజ్ఞప్రియా యజ్ఞకర్త్రీ యజమాన స్వరూపిణీ ॥ 164

ధర్మాధారా ధనాధ్యక్షా ధనధాన్యవివర్ధినీ ।
విప్రప్రియా విప్రరూపా విశ్వభ్రమణకారిణీ ॥ 165

విశ్వగ్రాసా విద్రుమాభా వైష్ణవీ విష్ణురూపిణీ ।
అయోనిర్యోని నిలయా కూటస్థా కులరూపిణీ ॥ 166

వీరగోష్ఠీప్రియా వీరా నైష్కర్మ్యా నాదరూపిణీ ।

# OTHER BOOKS THROUGH MASTER K. PARVATHI KUMAR

*The following books are available in: English (E), German (G), Spanish (S), French (F), Hebrew (H), Telugu (T), Hindi (HI) and Kannada (K) languages.*

| | | |
|---|---|---|
| 1. | Agni (E/G/S) | 60-00 |
| 2. | Amanaskudu (T/K) | 18-00 |
| 3. | Antardarsana Dhyanamulu (T) | 100-00 |
| 4. | Anveshakudu (T) | 60-00 |
| 5. | Asangudu (T) | 15-00 |
| 6. | Ashram Leaves (E/G/S) | 100-00 |
| 7. | Ayurvedic Principles (E) | |
| 8. | Bharateeya Sampradayamu (T/Hi) | 10-00 |
| 9. | Cow ('Govu' Mahatyam Vivarana) (E/T/K) | 20-00 |
| 10. | Devapi Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 11. | Dhanakamuni Katha (T) | 25-00 |
| 12. | Doctorine of Eternal Presence (E) | 10-00 |
| 13. | Gayatri Mantra - Avagahana (T) | 10-00 |
| 14. | Geetopanishad - Gnana Yogamu (T) | 25-00 |
| 15. | Geetopanishad - Karma Yogamu (T) | 20-00 |
| 16. | Geetopanishad - Sankhya Yogamu (T) | 25-00 |
| 17. | Geetopanishad - Karmasanyasa Yogamu (T) | 20-00 |
| 18. | Geetopanishad - Dhyana Yogamu (T) | 40-00 |

| | | |
|---|---|---|
| 19. | Good Friday (E/G/S/F/H) | 10-00 |
| 20. | Gurupaduka Sthavam (E) | |
| 21. | Health & Harmony (E) | 120-00 |
| 22. | Hercules-The Man and the Symbol (E/G/S/F) | 100-00 |
| 23. | Himalaya Guru Parampara (T/Hi) | 12-00 |
| 24. | Jupiter-The Path of Expansion (E/G/S) | 40-00 |
| 25. | Jyotirlinga Yatra (T) | 20-00 |
| 26. | Katha Deepika (T) | 40-00 |
| 27. | Listening to Invisible Master (E/G/S/F/H) | 20-00 |
| 28. | Lord Maitreya-The World Teacher (E/G/S/F/H) | |
| 29. | Maitreya Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 30. | Mana Mastaru Garu (T) | 60-00 |
| 31. | Mantrams-Their Significance and Practice (E/G/S) | 35-00 |
| 32. | Maria Magdalena (E/S/G/F) | |
| 33. | Marriage-A Sacrament (E) | |
| 34. | Maruvu Maharshi Bodhalu (T/Hi) | 60-00 |
| 35. | Master C.V.V. (Birthday Message) (T) | 30-00 |
| 36. | Master C.V.V. Noothana Yogamu (T) | 20-00 |
| 37. | Master C.V.V. Yogamu (T) | 20-00 |
| 38. | Master C.V.V. Yogamu-Karma Rahityamu (T) | 10-00 |
| 39. | Master C.V.V. - May Call !(E/G/S) | 100-00 |
| 40. | Master C.V.V. - May Call ! II (E) | 100-00 |

| | | |
|---|---|---|
| 41. | Master C.V.V. The Initiator - Master E.K. The Inspiror (E) | 15-00 |
| 42. | Master C.V.V. - Saturn Regulations | 125-00 |
| 43. | Master E.K. - The New Age Teacher (E/G/S) | 70-00 |
| 44. | Mithila-A New Age Syllabus (E/G/S) | 100-00 |
| 45. | Occult Meditations (E/G/S) | 100-00 |
| 46. | Omkaram (T) | 30-00 |
| 47. | On Change (E/G/S) | 50-00 |
| 48. | On Healing (E/G/S) | 100-00 |
| 49. | On Love (E/G/S) | 50-00 |
| 50. | On Service (E/G/S) | 50-00 |
| 51. | On Silence (E/G/S) | 50-00 |
| 52. | Pranayamam (T) | 10-00 |
| 53. | Prayers (E/G/S) | 100-00 |
| 54. | Rudra (E/G/S) | 30-00 |
| 55. | Sankhya - The Sacred Doctrine (E/G/S) | 75-00 |
| 56. | Saraswathi - The Word (E/G/S) | 60-00 |
| 57. | Saturn-The Path of Systematised Growth (E/G/S) | 40-00 |
| 58. | Shodasopachara Pooja - Avagahana (T) | 10-00 |
| 59. | Sound-The Key and its Application (E/G/S) | 40-00 |
| 60. | Spiritualism - Business and Management (E/G/S) | 25-00 |
| 61. | Sri Dattatreya (E/G/S/T/Hi) | 33-00 |

| | | |
|---|---|---|
| 62. | Sri Gurupaduka Sthavam (T) | 30-00 |
| 63. | Sri Krishna Namamrutham (T) | 25-00 |
| 64. | Sri Lalitha-1 (T) | 40-00 |
| 65. | Sri Lalitha-2 (T) | 40-00 |
| 66. | Sri Lalitha-3 (T) | 40-00 |
| 67. | Sri Lalitha-4 (T) | 40-00 |
| 68. | Sri Lalitha-5 (T) | 40-00 |
| 69. | Sri Lalitha-6 (T) | 40-00 |
| 70. | Sri Lalitha-7 (T) | 40-00 |
| 71. | Sri Lalitha-8 (T) | 40-00 |
| 72. | Sri Sastri Garu (E/G/S/F/T/H) | 40-00 |
| 73. | Sri Shiridi Sai Sayings (E/G/S/T/Hi) | 80-00 |
| 74. | Steps on Silence (E) | 75-00 |
| 75. | Suvarna Sopanamulu | |
| 76. | The Aquarian Cross (E/G/S) | 100-00 |
| 77. | The Aquarian Master (E/G/S) | 75-00 |
| 78. | The Doctorine of Ethics (E) | 35-00 |
| 79. | The Etheric Body (E/G/S) | |
| 80. | The Path of Synthesis (E) | 40-00 |
| 81. | The Splendor of Seven Hills (E/T/Hi) | 15-00 |
| 82. | The Teachigs of Lord Sanatkumara | 150-00 |
| 83. | The Theosophical Movement (E/G/S) | 60-00 |
| 84. | The White Lotus (E/G/S) | 20-00 |

| | | |
|---|---|---|
| 85. | Time - The Key (E/G/S) | |
| 86. | Uranus - The Alchemist of the Age | 150-00 |
| 87. | Venus - The Path of Immortality (E/G/S) | 80-00 |
| 88. | Violet Flame Invocation (E/G) | 60-00 |
| 89. | Vrutrasura Rahasyam (T) | 35-00 |
| 90. | Varunagraha Prabhavamu (T) | 22-00 |
| 91. | Wisdom Buds (E/S) | 20-00 |
| 92. | Wisdom Teachings of Vidura (E/G/S) | 80-00 |
| 93. | Moon & Spiritual Astrology (S) | |
| 94. | The Death & Reincarnation (S) | |
| 95. | Commentary on Om Namonarayanaya (S) | |
| 96. | Master Jesus, Life and Teachings (S) | |
| 97. | The Science of Ayurveda & Homoeopathy (S) | |
| 98. | The Teachings of Master D.K. (S) | |
| 99. | The Human Constitution (S) | |
| 100. | The Masters of Wisdom (S) | |
| 101. | The Path of Meditation (S) | |
| 102. | Stories for Disciples (S) | |
| 103. | Spirituality in Daily Life (S) | |
| 104. | Special Practices for Disciples (S) | |
| 105. | Fundamentals of Health & Healing (S) | |
| 106. | Ganesha, The Cosmic Lord of Groupings (S) | |
| 107. | Astrology and Healing (S) | |

# DHANISHTA OTHER PUBLICATIONS

| No. | Title | Price |
|---|---|---|
| 1. | Puranapurushuni Pooja Vidhanam (T) | 10-00 |
| 2. | Sarannavaratra Pooja Vidhanamu (T) | 30-00 |
| 3. | Sri Dattatreya Pooja Vidhanamu (T) | 10-00 |
| 4. | Sri Hanuman Chalisa (T) | 15-00 |
| 5. | Sri Mahalakshmi Pooja Vidhanamu (T) | 12-00 |
| 6. | Sri Rama Pooja Vidhanamu (T) | 10-00 |
| 7. | Sri Siva Hridayamu (T) | 5-00 |
| 8. | Sri Siva Pooja (T) | 15-00 |
| 9. | Sri Soukumarya Satakam (T) | 10-00 |
| 10. | Sri Surya Pooja Vidhanamu (T) | 7-00 |
| 11. | Sri Venkateswara Pooja Vidhanamu (T) | 8-00 |
| 12. | Vinayaka Vratakalpamu (T) | 25-00 |
| 13. | Vishnu Sahasranamamam (T) | 12-00 |
| 14. | Sri Rama Charitramu (T) | |
| 15. | Sri Subrahmanya Pooja Vidhanamu (T) | 10-00 |
| 16. | Sri Yoga Ganapathi Pooja Vidhanamu (T) | 12-00 |
| 17. | Sri Lalitha Sahasranama Sthotram (T) | 10-00 |

**‘శ్రీలలిత’** నవమ శతక వివరణము

**శ్రీమతి కృష్ణకుమారి**

షష్ట్యబ్ది పూర్తి శుభ సందర్భమున భద్రాద్రి యందు

**శ్రీరామ పాద పద్మములకు సమర్పితము.**

శ్రీమతికి సకల సౌఖ్యములు,

సంపదలు, ఆయుస్సు, ఆరోగ్యము,

శ్రీరామ ప్రసాదమై ప్రాప్తించవలెనని ప్రార్థిస్తూ....

**22-9-2011**

భద్రాద్రి

**-పార్వతీకుమార్**

# శ్రీలలిత

## దశమ భాగము

(901 నుండి 1,000 వరకు నామములకు వివరణము)

10

మాస్టర్ పార్వతీకుమార్



ధనిష్ఠ

ప్రథమ ముద్రణ : 2012

ప్రతులు : 1,000



వెల : రూ॥ **40-00**

*ప్రాప్తిస్థానము :*

**జగద్గురు మందిరము**

(ది వరల్డ్ టీచర్ టెంపుల్)

'రాధామాధవమ్'

14-38-2, ముప్పిడి కోలనీ,

విశాఖపట్నం - 530 002.

ఫోన్ : 0891-2701531

e-mail : dhanishta@rediffmail.com

*ముద్రణ :*

ఎక్సేల్షియర్ ప్రింటింగ్ స్కూల్

విశాఖపట్నం – 530 016.

☏ 0891-2747320, 984 807 5132.



# ధనిష్ఠ

## స్వచ్ఛంద సేవా సంస్థ

**“ధనిష్ఠ”** అనగా ధనపూరిత దివ్యవాయువు. ధనమనగ దివ్య సంపద. అది కేవలము డబ్బుకాదు. డబ్బుతో సంపదను కొలువ లేము, కొనలేము. సంపద జీవన వైభవమునకు సంబంధించినది. మన శ్రుతులలో అగ్ని, వాయువు, ఇంద్రుడు, బృహస్పతి యిత్యాది దివ్య ప్రజ్ఞలను ధనమనిరి. ఆర్ష విజ్ఞానమే నిజమైన ధనము. అట్టి ధనమును కూర్పుచేసి వ్యాప్తి చేయుటకు “ధనిష్ఠ” 1992లో జన్మించినది.

**“ధనిష్ఠ”** మాస్టర్ పార్వతీకుమార్‌గారి వాక్కును సి.డి., ఆడియో, వీడియో క్యాసెట్ల రూపములోను, పుస్తకముల రూపము లోను భద్రపరచి సత్సాధకుల కందించునట్టి యజ్ఞార్థకర్మను చేపట్టినది.

**“ధనిష్ఠ”** ఒక చక్కని గ్రంథాలయమును, ధ్యాన మందిరమును సద్గోష్ఠికై వలసిన వాతావరణమును – “జగద్గురు మందిరము”గ ఏర్పరచి, ఆసక్తి కలవారికి ధ్యానము, స్వాధ్యాయము నేర్పుచున్నది.

## సంకలనకర్త : మాస్టర్ పార్వతీకుమార్

**మా**తృదేశము మొదలుగా ఉత్తర అమెరికా, లాటిన్ అమెరికా మరియు ఐరోపా ఖండములలోగల ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ప్రచోదనము కలిగించుచూ, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, యోగాభ్యాసము యిత్యాది విషయములలో బోధనలు గావించుచూ, పరమగురువుల మార్గానుయాయి లకు వెలుగుదారి చూపించు చున్న సత్సాధనా సంపత్తిగల నవయుగ యోగ మార్గదర్శి **మాస్టర్ పార్వతీకుమార్**గారు. వారి బోధనలు లెక్కకుమించి యున్ననూ, పలురకములైన విషయ, విజ్ఞాన బోధనలుగా తెలియవచ్చును. అవి బోధనలుగానే కాకుండా నిత్యజీవితమున అనుసరణీయమై, ఆచరణ యోగ్యమై, ఆచరించువారికి సత్యదర్శనమున సత్వర ఫలితముల నందించు చున్నవని తెలుపుట అతిశయోక్తి కానేరదు.

సాంఘిక, ఆర్థిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, కళారంగములలో వారి నిరంతర సేవలను గుర్తించి, గౌరవించి, ఆంధ్ర విశ్వకళా పరిషత్ **"డాక్టర్ ఆఫ్ లెటర్స్"** పట్టానందించి, ఆదర్శవంతమైన వారి సేవలను కొనియాడినది.

ఆర్థిక, సాంఘిక, సేవారంగములలో – మానవాళి మనుగడలో సుఖము, శాంతి పరిమళింపజేయు సూత్రముగా ఆధ్యాత్మికత అలరారినప్పుడే దానికి సాఫల్యత, సార్థకత ఉండునని, *"మానవ సేవయే మాధవ సేవ"*అను మాటకు

సరియైన అర్థము యిదేనని మాస్టరుగారు తమ ప్రవర్తన ద్వారా తెలియ పరచుచున్నారు. మాస్టర్ పార్వతీకుమార్‌గారు బాధ్యతగల గృహస్థులు, పేరున్న ఆర్థిక సలహాదారు, విజ్ఞానమును వికసింపజేయు గురువు, శారీరక – మానసిక రుగ్మతలను తొలగింపజేయు వైద్యులు, శతాధిక గ్రంథముల సంకలన కర్త, నిగర్వి, నిర్మల హృదయులు.

జ్ఞానము ఏ ఒక్కరికి చెందినది కాదనియు, జ్ఞానులు సైతము అందరునూ జ్ఞానమునకే చెందిన వారనియూ, జ్ఞానమే సరియగు వాహికల నెన్నుకొని తనను తాను ప్రకటించుకొనుచుండు ననియూ, అందుచే నిజముగా ఎవ్వరూ గ్రంథకర్తలు కాజాల రనియూ, సంకలన కర్తలే ననియు మాస్టరుగారి దృఢ విశ్వాసము. విశేష పరిజ్ఞానముగల ప్రతిభావంతు లైనప్పటికి సౌశీల్యముతో సామాన్యుల మిత్రత్వము నభిలషించు సమవర్తి.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి ఆధ్వర్యమున ఎన్నియో ధార్మిక సంస్థలు దేశ విదేశములలో పరహితసేవ గావించుచున్నవి. "పరహితము పరమధర్మ" మను ఆర్యోక్తి వారి జీవితమును నడిపించుచున్నది. భగవద్ధ్యానము, స్వాధ్యాయము, పరహితములకు త్రిధాబద్ధులుగా ఎందరో ఆస్తికులకు వారు ప్రపంచమున ప్రచోదనము గావించుచున్నారు. పరమగురు పరంపర వారి కాదర్శము.

**- ధనిష్ఠా ఫౌండేషన్**

# తొలిపలుకు

“**శ్రీ**లలిత” అను శీర్షికగా మాస్టర్ పార్వతీకుమార్‌గారు లలితా సహస్రనామములకు వ్యాఖ్యానము వ్రాయుచున్నారు. అవి ప్రతిమాసము ‘నావాణి’ దర్శన మాస పత్రికయందు ప్రచురింపబడు చున్నవి. పాఠకుల కోరికపై అమ్మవారి “సహస్ర” నామములను “శత”నామములు ఒక భాగముగ ప్రచురించుటకు సంకల్పించితిమి. ఇప్పటికి 900ల నామములను 9 భాగములుగ ధనిష్ఠ ప్రచురించినది. ప్రస్తుతము 901వ నామము నుండి 1,000 వ (సహస్ర) నామము వరకు 10వ (చివరి) భాగముగ అందించు చున్నాము.

మాస్టర్ పార్వతీకుమార్‌గారి వివరణము ఎల్లవేళల సత్సాధకుల నుద్దేశించియే యుండును. వారి భాష కూడ చాల సరళము. గంభీర మగు విషయములను పామరులకు సహితము అందించగల స్పష్టత ఆయన భాషణమందు, రచనలయందు గోచరించును. వారినుండి వెలువడిన విజ్ఞానాంశ మేదైననూ ఆచరణకు స్ఫూర్తి కలిగించునట్లుగ నుండును.

ఆవేశములేని ఆచరణ వారియందు, వారి భాషణయందు నిత్యము గోచరించు చుండును. ఆచరణయే ఇహపరములకు పరిష్కార మని వారి బోధనలు ప్రస్ఫుటము చేయుచుండును.

అందులకే ఈ ముద్రణము.

**– ధనిష్ఠ**

# పరిచయము

**ల**లితాదేవి, శ్రీదేవి, దుర్గ, మహాలక్ష్మి, మహాసరస్వతి, మహాకాళి, రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, ఇవియన్నియు జగదంబ నామములే. విశ్వ చైతన్యమే జగదంబ. ఆమె నుండియే త్రిగుణములు, పంచభూతముల సృష్టి ఏర్పడుచున్నది. ఇవియే ఆమె అష్ట ప్రకృతులు. అందలి చైతన్యమామెయే. అష్ట ప్రకృతులకు మూలము కనుక ఆమెయే మూల ప్రకృతి. సృష్టికి మూలాధారము ఆమెయే. అవ్యక్త స్థితియందు సత్యముగను, వ్యక్త స్థితియందు మహాచైతన్యముగను విరాజిల్లునదియే శ్రీమాత.

సమస్త దేవతామూర్తులు, గ్రహగోళములు, సర్వజీవకోటి శ్రీలలిత నుండి ఏర్పడినవే. ఆమె లీలావిలాసము, సృష్టివైభవము సహస్ర నామములతో కొనియాడబడినది. వర్ణన కతీతమైనను ఆమెను వర్ణించు ప్రయత్నము, ఆ మహా చైతన్యమున స్థితి గొనుటకు వినియోగ పడును. అందులకే పారాయణము.

అవగాహనతో కూడిన పారాయణము చేయుట వలన రుచి తెలియును. రుచియనగ వెలుగు. రుచియనగ అనుభూతి కూడ. అట్టి దర్శనము అందరికి దక్కవలెనని, అనుభూతి అందరికిని కలుగవలెనని ఋషుల ఆకాంక్ష. అవగాహన అనుభూతికి మార్గము చూపును గనుక వ్యాఖ్యానములు సరళముగనున్నచో అవగాహన సులభము. అందులకే ఈ వ్యాఖ్యానము. సామాన్యులకు వినియోగపడినచో ఈ ప్రయత్నము సఫలము.

- పార్వతీకుమార్

# మనవి

శ్రీలలితా సహస్రనామ వివరణము ఈ దశమ సంపుటితో పరిపూర్తియైనది. ఇది శ్రీమాత అనుగ్రహము. సద్గురు ఆశీః ఫలము. సహధర్మచారిణి సహకార ఫలము కూడ. సహృదయుల ప్రోత్సాహము కూడ తోడై ఉత్సాహకరముగ నిర్వర్తింపబడినది.

శ్రీలలితా సహస్రనామ వివరణము ఒక దివ్యానుభూతి. వివరణము చేయుటకు పూనుకొనిన వెంటనే ఒక దివ్య సంకల్పము ప్రవహించి వివరణము సాగుట దైనందినముగ జరిగినది. వ్రాయుటకు ముందు లేని ఊహలు, వ్రాయుచుండగ వచ్చెడివి. తమకు తాముగనే నామములు వివరణమును ప్రకటించుకొనుచున్న వను దృఢ విశ్వాసము కలిగెడిది. దానివలన తెలిసిన దేమనగ ఋషిప్రోక్తమగు ఈ నామములు సజీవములని. వానియందు శ్రీమాత చైతన్య విలాసము దర్శించుట నాకు దక్కిన ఫలము.

పండితుడను కాను. శాస్త్రముల నెరుగను. ఉపాసకుడనుకూడ కాదు. అన్నిట, అంతట దైవమును చూచుట అను విద్యను నేర్చుచున్న వాడను మాత్రమే. ఈ లిఖింపబడిన వివరణము నా తోటివారి కోరికే. తోటివారి రూపమున శ్రీమాత సంతతము సతతము ప్రకటించుచునే యున్నది. ఆ ఫలము చాలును. భక్తులకు, దైవమును చేరవలెనను ఆరాటపడు సాధకులకు ఈ నామ వివరణము

కరదీపికయై గోచరించును. వేయి నామములును శ్రీమాత చైతన్య విలాసమునే కీర్తించును.

అనంతము, శాశ్వతము, అనిర్వచనీయము, అప్రమేయము, అవిజ్ఞేయము, అలక్షణము, శాశ్వతము అగు బ్రహ్మము నుండి ప్రకటింపబడి అనేకానేక లోకములుగను, జీవులుగను, జీవరూపములుగను ఏర్పడుచు వినోదించు మహాచైతన్యమును ఎంత వర్ణించినను పూర్ణము కానేరదు. బ్రహ్మమునకే సాటియగు శ్రీమాత విలాసమును బ్రహ్మము నెరిగినవారే ఎరుగగలరు. చైతన్య విలాస దర్శనమే జీవుని బ్రహ్మైక్య స్థితియందుంచ గలదు. అదియును అమ్మ అనుగ్రహమే. అట్టి భాగ్యము అమ్మయే కలిగించినది.

నేను పుట్టినది కనకదుర్గమ్మ మండలమున (విజయవాడ). తల్లిదండ్రులు పెట్టిన పేరు 'పార్వతీకుమార్'. పార్వతి తల్లిగా సూచించు నామధేయమిడిన తల్లిదండ్రులకు కృతజ్ఞుడను. జగన్మాతయగు పార్వతి అనుగ్రహము పొందుటకు వలసిన మార్గము చూపిన గురుపరంపరకు సదా కృతజ్ఞుడను. సహకరించిన సహ ధర్మచారిణికి కూడ కృతజ్ఞుడను. ప్రతి ఉదయము నామ వివరణము చేయుచుండగ శ్రద్ధాభక్తులతో ఆమె రచనాయజ్ఞము గావించినది. రచించుచు తదనుగుణమగు అనుభూతిని పొందినది. సద్గురు ప్రసాదముగ సహచరించుచున్నది.

వివరణము పఠించువారందరిని కరుణామయి అయిన శ్రీమాత బ్రోచుగాక !

– పార్వతీకుమార్

# విషయసూచిక

# శ్రీ లలిత



ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

# 901. 'నాదరూపిణి'

**నా**దరూపము గలది శ్రీమాత అని అర్థము.

అనాహత మందలి నాదము ఉదాన ప్రాణ సహాయమున విశుద్ధిని చేరినప్పుడు శబ్దమగును. అనాహతమున నాదమును వినవచ్చును. అందలి నాదము ప్రాథమికముగ 'సోహం' అను ద్వయాక్షరీ శబ్దముగ వినబడును. ఈ శబ్దమునకు కారణము హృదయ స్పందనము. ప్రాణమున కీ అనాహత శబ్దమే ఆధారము. ఈ ద్వయాక్షరీ శబ్దమునకు ఆధారము ఏకాక్షరమగు ప్రణవము. ఓంకారమే ప్రణవము. ఓంకారము ప్రణవ నాదము. దాని అవతరణమే ప్రాణ శబ్దమగు 'సోహం'. ఇట్లు శబ్దము నుండి నాదమునకు ఆరోహణము చేయ వచ్చును. ఆహత శబ్దమగు 'సోహం' అనాహత నాదమగు 'ఓం'కారము నకు దారిచూపును. ఓంకార రూపమే నాద రూపము. ప్రణవమగు ఓంకారము మనయందు శిరస్సునుండి అధో ముఖముగ వ్యాపింపగ అనాహతమున అది ప్రాణమగు చున్నది. ప్రాణమునకు మూలము ప్రణవము. ప్రణవమునకు మూలము శ్రీమాత. ప్రణవ శిరస్సుపై శ్రీమాత యున్నది. శివుని నుండి శివశక్తియై శ్రీమాత నిలచి నపుడు ఓంకార మావిర్భవించును. అట్లు మన శిరస్సు నందు శివునితో కూడిన శివశక్తియై యుండగా ఓంకార మావిర్భవించి అవరోహణ క్రమమున నాదరూపమున పయనించును.

ప్రణవమునకు శిరస్సే బిందువు. అచట శివుడు శివానితో సంయుక్తమై వసించి యుండును. సృష్టి శిరస్సు నందును, భూమి శిరస్సు నందును, మానవుని శిరస్సు నందును, ఈ బిందువును దర్శించుచు నుండుట యోగసిద్ధి. *"ఓంకార బిందు సంయుక్తం, నిత్యం ధ్యాయంతి యోగినః ।"* ఈ బిందువే సర్వకామప్రదము, మోక్షప్రదము అయి ఉన్నది. అచ్చటనే నర నారీ రూపమున దైవము దర్శన మిచ్చును. అది 'నాదరూపిణి'. శ్రీమాత, శివుడు ఈ యిరువురిని నాదరూపులుగ ఋషులు కీర్తించిరి.

ఈ అనుభవ జ్ఞానమును పొందుటకు మనస్సును అంతర్ముఖము గావించి హృదయమందలి బుద్ధి గుహలో ప్రవేశింపవలెను. అటనుండి ప్రణవనాదము ననుసరించుచూ ప్రజ్ఞ ఊర్ధ్వముఖముగా పయనించి శిరస్సును చేరినచో ప్రణవ రూపము, నాదరూపము తెలియగలదు. ఈ మార్గమున రుచి గలిగినవారు అంతర్ముఖులై అంతఃకరణ శరీరమున నిలచి ధ్యానమున స్థిరపడు చుందురు. అట్టివారే తపస్విజనులు. ప్రజ్ఞ ఆరోహణము చేయుచుండగా తపోధను లగుచుందురు. వారికి నాద రూపము అవగత మగుచుండును.



# 902. 'విజ్ఞానకలనా'

**వి**జ్ఞానము కలిగించునది శ్రీమాత.

బ్రహ్మజ్ఞానమే విజ్ఞానము. అది శ్రీమాత వలననే కలుగవలెను. మరియొక మార్గము లేదు. శ్రీమాత విజ్ఞానము అనేక విధములుగ కలిగించును. బంధములను కలిగించి, అటుపై వైరాగ్యము కలిగించి బ్రహ్మము దిశగా నడిపించును. ఉపదేశము చేసి సున్నితముగ బ్రహ్మము దిశగా నడిపించును. అంతరంగమున స్వయముగ కూడ ప్రేరణ చేయ గలదు. జీవితమును కలతల పాలుచేసి కలనమొనర్చి అందుండి జ్ఞానోదయము కలిగింపగలదు. ఎట్లైననూ జీవులను బ్రహ్మము వైపునకు మళ్ళించుట తన కార్యముగ శ్రీమాత దీక్ష పూనుటచే ఆమె విజ్ఞాన కలన యైనది.

విజ్ఞాన మనగ బ్రహ్మము. అట్టి బ్రహ్మము నుండి వెలువడి బ్రహ్మమును ధరించి యుండును. బ్రహ్మమును ధరించి యుండుట వలన ఆమె 'విజ్ఞానకలన' యైనది. స్త్రీమూర్తి గర్భవతి అయిన క్షణమున అట్టి గర్భధారణమును 'కలన' మందురు. అట్లు బ్రహ్మమును ధరించిన తల్లి శ్రీమాత జీవులకు కూడ బ్రహ్మమును బీజప్రాయముగ ధరింపజేసి బ్రహ్మజ్ఞానులుగ తీర్చిదిద్దును. బ్రహ్మజ్ఞానులకే సృష్టి మాయారూపము తెలియును.

# 903. 'కల్యా'

సృష్టించు స్వభావము కలది శ్రీమాత అని అర్థము.

కేవలము సృష్టి కొరకే శ్రీమాత బ్రహ్మము నుండి వ్యక్తమగును. ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులను తన నుండి వ్యక్తము గావించి సృష్టి కార్యమును నెరపును. సృష్టి స్థితి లయములను కాలము రూపమున నిర్వర్తించు చుండును. అనుక్షణము ఏర్పడుట, ఉన్నట్లు గోచరించుట, అదృశ్యమగుటగా సృష్టి సాగుచుండును. నదీప్రవాహమున నదీజలము ఎల్లప్పుడునూ వున్నట్లు గోచరించును. కాని నిజమునకు జలము ప్రవహించుచునే యుండును. ఒక క్షణమున చూచిన జలము మరు క్షణమున అచ్చట నుండదు. కాని నది శాశ్వతముగ నున్నట్లు గోచరించును. నదీజలమున ఒకమారు పాదమిడి, వెలికి తీసి మరల పాద మిడినపుడు అదే నది యందు పాదమిడుట సాధ్యము కాదు. మరుక్షణమున ఆ నీరచట నుండదు. కనుకనే నదీ జలమున రెండు మార్లు స్నానము చేయుట నిజమునకు సాధ్యపడదని ఆర్యోక్తి. సతతము వచ్చిపోవు జలము నదిగా గోచరించు చున్నప్పుడు ఒక క్షణ మందున్న జలము మరియొక క్షణమున యుండదు.

ప్రతి ఉదయము సూర్యోదయము దర్శన మిచ్చుచుండును. సూర్యుడు నిన్నటివలెనే ఉదయించినట్లు గోచరించిననూ నేటి సూర్యోదయము నిన్నటి సూర్యోదయమువలె నుండదు. ఇట్లు కాల

ప్రవాహమున రజస్సు వలన పుట్టుక, సత్త్వము వలన స్థితి, తమస్సు వలన లయము అనుక్షణ మేర్పడుచుండును. సూక్ష్మముగ అనుక్షణము సమస్తమూ మార్పు చెందుచూ నుండును. సృష్టి యందన్ని వస్తువు లిట్లే యున్నవి. నిన్నటి వృక్షమునకు, నేటి వృక్షమునకు మార్పు యుండును. మారక స్థిరముగా వున్నట్లు గోచరించు సృష్టి మారుచు నుండును. జీవుల దేహములయందు కూడ యిట్టి మార్పు సూక్ష్మముగ జరుగుచు నుండును. దేహము పెరుగుట, కృశించుట, వ్యాధిగ్రస్థ మగుట, నశించుట కాలము రూపమున జరుగుచునే యున్నది.

కాల మాధారముగ కలవలె సృష్టి నేర్పరచినది శ్రీమాత కనుక ఆమె 'కల్య' అని పిలువబడుచున్నది. చాప క్రింద నీరువలె కాల మన్నియునూ నిర్వర్తించు చుండును. స్థూలదృష్టికి గోచరింపనిది ఆమె నేర్పరితనము. కదలుచునే కదలనట్లు కనపడును. కనుకనే ఆమెను 'నాగినీ' అని ప్రశంసింతురు. 'నాగము' అను శబ్దము, 'కల్య' అను శబ్దము ఒక్కటియే.'గ' అనగా గమనము. 'అగ' అనగా గమనము లేనిది. 'న అగ' అనగా గమనము లేనట్లు గోచరించుచూ గమించు చున్నది. కనుక ఆమె నాగమైనది. భూమి కూడ నాగమే. అమిత వేగముతో భూమి తనచుట్టూ తాను తిరుగుచున్నది. సూర్యునిచుట్టూ కూడ తిరుగుచున్నది. అందు వసించియున్న మానవులకు మాత్రము స్థిరముగ భూమిపై నున్నాము అను భావన యున్నది. భూమి తిరుగు చున్నట్లు కూడ తెలియదు. వేగముగా తిరుగుచూ తిరగనట్లు గోచరించు

శక్తి భూమి యందున్నది. అది శ్రీమాతయే. భూదేవి అని ఆమెను కొలుచు చున్నాము.

స్త్రీశక్తి అగపడనిది. స్త్రీల ఆలోచనల లోతు ఎవ్వరునూ ఎఱుగ జాలరు. సముద్రగర్భమున ఏమి యున్నవో ఎవరికి తెలియును? అట్లే శ్రీమాత కల్యతత్త్వము ఎఱుగజాలనిది. సృష్టి అంతయూ ఆమె ఏర్పరచిన యొక కల. కలల నేర్పరచుట యందు శ్రీమాతయే నేర్పరి. ఆమె కల లోనే త్రిమూర్తులు సహితము తీరుబడిలేక పనిచేయు చున్నారు. ఇక యితరుల మాట చెప్పనేల? బ్రహ్మమున నిలచినవారికే సృష్టికల తెలియును. బ్రహ్మమొక్కటియే సృష్టి కతీతము. కనుకనే మహర్షులు సహితము సృష్టి మాయలను, సృష్టి కలను దాటి బ్రహ్మమును చేరుటకు తపనము చెందుదురు. బ్రహ్మమును చేరి బ్రహ్మర్షులై, స్థిమితముగ నుందురు. అట్టివారే వశిష్ఠ, అగస్త్యులు మరియు సప్తర్షులు, సనక సనందనాదులు. వీరు సృష్టి కల యందు కూడ మేల్కొని యుందురు.



# 904. 'విదగ్ధా'

కొరుకుడు పడని, అవగాహనకు అందని నైపుణ్యము గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత అతి చాతురి. ఆమెకు గల నైపుణ్యము నందలి తళు కులే మహాత్ముల యందు యుక్తిగా గోచరించును. సమస్త నిపుణతలకు ఆమెయే మూలము. సృష్టి ఎంత నిపుణతతో నిర్వర్తించునో ఎవ్వరునూ ఎఱుగలేరు. ఆమె సృష్టి నిర్మాణము కూడ అతి నైపుణ్యముతో కూడినది. నిర్మాణము, నిర్వహణము, ఉపసంహారణము లందు ఆమెకు గల నేర్పు అనితర సాధ్యము.

సనక సనందనాదులకు గాని, సప్తఋషులకు గాని, త్రిమూర్తు లకు గాని, మరెవ్వరికి గాని ఆమె నైపుణ్యము కొరుకుడు పడదు. ఎప్పుడు ఎచ్చట ఎవరికి ఏమి జరుగునో ఎవ్వరునూ ఊహింపలేరు. జరిగిన వెనుక ఇట్లు జరిగినదని తెలియుటయే గాని, జరుగబోవునది తెలియగల వారెవ్వరునూ లేరు. కొరుకుడు పడని, అవగాహన కాని నిపుణతను 'విదగ్ధ' మందురు. దగ్ధ మనగా జీర్ణమగుట. శ్రీమాత సృష్టి ఉపాయము ఎవ్వరికినీ జీర్ణమగు విషయము కాదు. సృష్టి యందు జరుగు సంఘటనలను ఎవ్వరునూ అవగాహన చేసుకొనలేరు. కారణ ములు తెలియలేరు.

"ఎందుల కిట్లు జరిగినది?" అను ప్రశ్నకు సమాధానము సృష్టిలో లేదు. కైకేయికి దుర్బుద్ధి ఎందులకు పుట్టినది? దాసి ప్రేరణ మాత్రమున ప్రేమమూర్తి యగు కైకేయిలో అట్టి మార్పు రాగలదా? ధర్మాత్ముడగు యుధిష్ఠిరునికి ఆపద లెందుకు కలిగినవి? కంసునికి సోదరిపై అకస్మాత్తుగ ద్వేష మెట్లు కలిగినది? అకస్మాత్తుగ మిత్రులు శత్రువు లెట్లగుచున్నారు? నిష్కారణముగ ఏ పాప మెరుగనివారు ఎట్లు దాడులకు గురి యగుచున్నారు? కారణములు వెతుకుకొనుట వలన తికమకయే యుండును.

కొందరికి తీపి యిష్టము. ఎందుకు యిష్టము? అని ప్రశ్నించినచో సమాధానము లేదు. అట్లే కొందరికి కార మిష్టము. కొందరికి కొంద రన్న యిష్టము. కారణము తెలియదు. ఏవో పూర్వజన్మ కథలు, వృత్తాంత ములు తెలిపిననూ వానికి ఋజువుండదు. సర్వజ్ఞులగువారు క్షణ కాలమున మాయన పడుదురు. దానివలన కథ మలుపులు తిరుగును. అట్లెందుకు జరిగినది అని ప్రశ్నించి ఉపయోగము లేదు. తర్కము కొంతవరకే పనిచేయును. తర్కము కూడ తమకు తాము సరిపెట్టు కొనుటకే వినియోగపడును గాని అంతరంగమున సమాధానము అందదు. సర్దిచెప్పుకొనుట కొరకే తర్కము. రామ లక్ష్మణులతో సరి సమానమగు జ్ఞానము గల సీతమ్మ మాయలేడిని ఎందుకు కోరినది? ఇట్లు ఎన్నియో జరిగినవి, జరుగు చున్నవి, సమాధానము లేక యుండును.

తెలిసినవారు ఒక సత్యమును తెలుపుదురు. “ఎందుకిట్లు జరిగినది? అను ప్రశ్న మానుము. ఇట్లు జరిగినది అని సమాధాన పడుము.” తెల్ల ఆవుకు నల్లదూడ పుట్టును. ఎందువలన? అని ప్రశ్నించి నచో అందువలనని సమాధానము. ఎందువలనకు సమాధానము లేదు. సమాధానము లేని సన్నివేశములను భగవద్ లీల లనిరి. కృష్ణ లీలలలో ఎక్కువ భాగము సమాధానము లేనివే. సమాధానము తెలియ లేక ఋషులు కూడ లీలలుగా సరిపెట్టుకొనిరి. కనుకనే వేదాంత మంతయూ దైవలీల అని తెలుపుచున్నది.



# 905. 'బైందవాసనా'

బైందవ ఆసనమున కూర్చుండునది శ్రీమాత అని అర్థము.

బైందవ మను ఆసనము సర్వానందమయమగు ఆసనము. అతీతమగు శాంతి నిచ్చు ఆసనము. మనసు తన్మయము చెందిన స్థితి. శ్రీమాత అట్టి ఆసనమున యున్నది యని, ఆ ఆసనమున స్థితి గొని యున్నదని ఈ నామము వివరించు చున్నది.

త్రిగుణముల యందు జీవుడున్నప్పుడు ఆనందము, శాంతి అంతంతమాత్రముగ యుండును. మనసేంద్రియములకు లోబడినపుడు జీవుడు ఆటుపోట్లు చెందుచుండును. దేహమే తానై భావించి జీవించి నపుడు పశుతుల్యుడై బంధింపబడి యుండును. దేహము, యింద్రియము లతో కూడిన మనస్సు, త్రిగుణములు బంధ కారణములు. వాని నధిగమించిన స్థితి మోక్షకారణము. అట్టి స్థితి జీవప్రజ్ఞకు ఆజ్ఞా చక్రమున లభించును. కనుకనే అచట దైవమును ధ్యానింపుడని భగవద్గీత బోధించును. అచటనే జీవునకు 'శం'కర మగు స్థితి కలుగును. అదియే శ్రీకరము. అచటనే శాంతిమూర్తి యగు శ్రీమాత దర్శన మిచ్చును. అట్టి దర్శనమే సర్వానందకరము.

భ్రూమధ్యమున 'బైందవ'మను వృత్తాకార మున్నది. అదియే హాకినీ మండలము. ఆ మండలమునకు పైన గల వర్తులాకార బిందువును బైందవ మందురు. ఆ బిందువు నందు శ్రీమాత ఆసీనురాలై

యుండును. ఈ రహస్యము తెలిసిన ఋషులు హైందవాచారముగ బైందవ చిహ్నమును ధరించిరి. స్త్రీలు కాని, పురుషులు కాని ఫాల భాగమున వృత్తాకారమగు బిందువును ఉభయ సంధ్యలయందు ధరింపుడని బోధించిరి. ఆధునిక కాలమున యిట్టి బిందు ధారణము అనాగరికమని స్త్రీలు సహితము ధరించుట మానుచున్నారు. ఇది నిజమగు అనాగరికత. దైవభక్తులు ఆత్మవిశ్వాస మున్నచో బిందు ధారణము తప్పక చేయవలెను. విభూతి, చందనము, కుంకుమలతో ఫాలభాగమున అలంకరించుకొనుట, అట్లలంకరించు కొనునపుడు బైందవాసన యగు శ్రీమాతను స్మరించుట ఒక అద్భుతమగు క్రతువు. స్టిక్కర్లు అతికించుకొనుట కన్న చందనము, కుంకుమ దిద్దుకొనుట ఎక్కువ సహజము. చందన కుంకుమలలో కల ప్రజ్ఞ స్టిక్కర్లలో నుండదు.

వివేక భ్రష్టత్వము కారణముగ పురుషులు, స్త్రీలు కూడ బైంద వాసనమును మరిచిరి. కనుక జీవితమున ఆనందము, శాంతి, సౌఖ్యములు కరవగు చున్నవి. ఆరాటములు పెరుగుచున్నవి.

బిందువుల సమూహము బైందవ మని మరియొక అర్థము. బిందువుల సమూహములు లలాటమందు ఊర్ధ్వముగ ఒకదానిపై ఒకటి యున్నవి. ఇవి యన్నియూ ప్రజ్ఞ, పరమునందు లయము చెంది ఉదాత్తమగు స్థితియందు సాధకుని స్థిరపరచును. ఇవి మరల నవ బిందువులుగ శ్రీవిద్యా ఉపాసకులు దర్శింతురు. పదవది మహా

బిందువని, అదియే పరబ్రహ్మ మని కూడ తెలుపుదురు. దీనికి దారి ఆజ్ఞాచక్రము నుండి ఊర్ధ్వముగ నున్నది. ఈ బిందువులను వరుసగా ఈ క్రింది విధమున వివరింతురు.

1. బిందువు.
2. అర్ధ బిందువు.
3. రోదిని.
4. నాదము.
5. నాదాంతము.
6. శక్తి.
7. వ్యాపిక.
8. సుమన.
9. ఉన్మన.
10. మహా బిందువు.

ఉన్మన స్థితియందు కాలము కూడ యుండదు. అటుపైన మహాబిందువు శిరస్సుపైన రెండంగుళముల పైభాగమున వుండును. ఇది కేవలము సూచన కొరకే తెలుపబడినది. అనుభవ మార్గముననే వీనిని తెలియగలము.



# 906. 'తత్త్వాధికా'

**త**త్త్వము కన్న అధికురాలు శ్రీమాత అని అర్థము.

తత్త్వములు శ్రీమాత నుండి పుట్టినవి. అవి ఇరువది యేడు. ఇరువది యేడు తత్త్వములు చాలమార్లు తెలుపబడినవి. క్లుప్తముగ మరల వివరించుచున్నాను.

1. సంకల్పము. 2. కాలము. 3. ప్రకృతి. 4. మహత్తు. 5. త్రిదహంకారములు.

ఇవి ప్రధానమగు ఏడు తత్త్వములు. వీనినుండి పంచేంద్రియ ములు, పంచ కర్మేంద్రియములు, పంచ తన్మాత్రలు, పంచ భూతములు పుట్టును. మొత్తము ఇరువది యేడు. వీనికి మూలము శ్రీమాత. ఆమెయే పరబ్రహ్మ స్వరూపిణి కూడ.



# 907. 'తత్త్వమయీ'

**త**త్త్వము లన్నింటి రూపమున వుండునది శ్రీమాత అని అర్థము.

తత్త్వాధికయైన శ్రీమాతను తెలియవలెనన్నచో క్రమముగ తత్త్వము లన్నిటియందును శ్రీమాతనే దర్శించుట దీక్షగ కొనవలెను. భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము యిట్లు ముందు నామము లలో తెలిపిన అన్ని తత్త్వముల యందునూ శ్రీమాతను దర్శించుట ఆరంభింపవలెను. దర్శనీయమగు జగత్తును శ్రీమాతగ చూచినపుడు ఆమె అనుగ్రహము వలన సూక్ష్మదర్శనములకు తెర తీయబడును. అపుడు క్రమముగ వెలుగుల రూపమున, శబ్దనాదముల రూపమున దర్శనములు జరుగును. సర్వదేవతా దర్శనములు జరుగును. సర్వవిద్యా దర్శనములు జరుగును. త్రిదహంకారములకు అధ్యక్షులగు బ్రహ్మ విష్ణు శివ తత్త్వములు కూడ దర్శన మగును. అటుపైన మహద్దర్శనము, కాల దర్శనము తెలియును. సృష్టి రహస్యములు తెలియును. సంకల్ప మూర్తి యగు శ్రీమాత అననేమో తెలియును. అటుపైన తాను తెలియును. అనగా ఆత్మగ తా నెట్లున్నాడో తెలియును. ఆపై తా నున్నాడని, లేదని అనిపించు చుండును. శ్రీమాతయే తానుగ నున్నాడని తెలియును. తాను లేని స్థితి కూడ కలుగును. ఇట్లు ఉండుట, లేకుండుటగ నుండుట తెలియును. ఇట్లు తత్త్వమయియైన శ్రీమాత ఆరాధన క్రమోన్మీలనమున జరుగును.

కనబడునది చూడక, ఆదరింపక, ప్రేమింపక, కనబడని విషయములందు ఆసక్తి చెందుట మిథ్యావాదములకు దారితీయును. వాదమందు ఆసక్తి కొనువారికి రసానుభూతి మృగ్యమగును. అన్నిట అంతటా ఉన్నది శ్రీమాతయే అను సమభావము కలిగినవారికే సమ దర్శనము. అట్టివారే నిజమగు పండితులు. అనగా తెలిసినవారు. *"పండితాః సమదర్శినః ।"* అని భగవానుడు నిర్వచించుటలోని సత్య మిదియే.

అధికుల మని గర్వించువారు పండితులు కారు. అధములుగ గోచరించు వారియందు కూడ శ్రీమాత యున్నదని తెలిసి కరుణాదృష్టి కలిగి యుండువారు పండితులు. సాధన లేని కేవల పాండిత్యము వికారములే కలిగించును గాని సాకార, నిరాకారమగు తత్త్వము గోచరించదు.



# 908. 'తత్త్వమర్థ స్వరూపిణి'

**శి**వబీజ స్వరూపిణి శ్రీమాత అని అర్థము.

శివ తత్త్వము అంతటా వ్యాపించియున్న బ్రహ్మము. బ్రహ్మము సృష్టిగా ఏర్పడవలె నన్నచో ఒక బీజముండవలెను. శ్రీమాత బీజముగా బ్రహ్మము నుండి వ్యక్తమై, తన నుండి బ్రహ్మమును కోటానుకోట్ల జీవులుగను, రూపములుగను, లోకములుగను నేర్పరచును. బీజము లేనిదే అవ్యక్తము వ్యక్తము కానేరదు. బీజ మాధారముగనే అవ్యక్త మను వృక్షము యెట్లు శాఖోపశాఖలుగల వృక్షముగా వెలువడుచున్నదో అట్లు తత్త్వము వ్యక్తమగుటకు ముఖద్వారముగ శ్రీమాత యున్నది. అవ్యక్తము వ్యక్తమగుటకు తాను బీజమై నిలచియున్నది. లేనిచో సృష్టియూ లేదు, జీవులు లేరు. తత్వార్థము తెలియుట అను కార్యక్రమము లేదు.

'తత్ త్వం' అనగా అది నీవే అని అర్థము. అది అనగా బ్రహ్మము. జీవుడు బ్రహ్మమే అని తెలుపుటకు 'తత్ త్వం' అందురు. జీవు లందరూ శివుని అంశలే. బ్రహ్మమునే రూపమిచ్చి జీవులుగ ఏర్పరచునది శ్రీమాత. సముద్రమే అనేకానేక అలలుగా అయినది. అలలు వస్తుతః సముద్రమే. స్థితి భేదము చేత అలలైనవి. మట్టియే స్థితి భేదముచేత కుండ అయినది. ఆకాశమే స్థితి భేదముచేత వాయువు, అగ్ని, జలము, భూమిగ మారును. అసలు వస్తువే స్థితి భేదము చేత చాల వస్తువులుగ మారును. బంగార

మొక్కటే! నగలు అనేకములు. ఇట్లు ఏకమగు బ్రహ్మము అనేకము లుగ ఏర్పరచునది శ్రీమాత. ఆమెయే తన మాయచేత యిన్నింటి నేర్పరచును. రూపములు కల్పించి, స్థితి భేద మేర్పరచును. చూచువాడు గను, చూడబడు వస్తువుగను, చూచుట గను ఏర్పాటు చేయును. అట్లే భుజించువాడు, భుజింపబడు వస్తువు, భుజించుటగ ఏర్పడును. ఇట్లు శివమగు బ్రహ్మము నుండి కోటాను కోట్ల జీవుల నేర్పరుచును. నిజము నకు బ్రహ్మమే యిన్నిగా యేర్పడుటకు కారణము శ్రీమాత. 'తత్త్వార్థ స్వరూపిణి' ఆమెయే!



# 909. 'సామగానప్రియా'

సామగాన మందు ప్రీతి గలది శ్రీమాత అని అర్థము.

ఛందస్సులతో క్రమబద్ధముగాను, రాగయుక్తముగాను సాగు గానము సామగానము. ఆ గానము వినుట నేర్చినచో జీవునికి లయానుభూతి కలుగును. ఈశ్వరుని నుండి జీవుని ఈ గానముతోనే శ్రీమాత విడదీయును. మరల ఈ గానముతోనే దరిచేర్చును. విడదీయుటకును, దరి చేర్చుటకును శ్రీమాత వినియోగించు విద్య సామగాన విద్య. తానే స్వయముగ ఈ విద్యను వీణానాదముగ నిర్వర్తించును. ఆ వాదనము ననుసరించియే సృష్టికర్త సృష్టి నిర్మాణము, జీవ నిర్మాణము గావించును. నిర్మాణ మంతయూ ఛందోబద్ధము, రాగబద్ధము, తాళ లయాత్మకము. గమకములతో కూడిన గాన గమనము సామము. అది గంగావతరణమువలె సాగును. అందలి వంపు సొంపులు, నాట్య ప్రవాహము కన్నుల పండుగ కలిగించును. రసభరితమగు సంగీతము, వినినవారిని తన్మయపరచు చున్నప్పుడు స్వయముగ గానము చేయువారిని ఎంతగా అలరించును? ఆనంద పరచును? తన్మయ పరచును? అందువలననే శ్రీమాత సతతము వీణావాదనము చేయుచూ సృష్టి నిర్మాణము, నిర్వహణము గావించు చున్నదని తెలుపుదురు.

వీణావాదనమున తన్మయము చెందు శ్రీమాతకు సృష్టి నిర్మాణ

నిర్వహణములు పరమానందదాయక మగు కార్యమే గాని, భారముతో కూడినది కాదు. ఆనందహేలగా సమస్త సృష్టి సాగును. దీని నెఱిగిన నారదాదులు కూడ పదునాలుగు లోకములందు అమితానందముతో కర్తవ్యములను నిర్వర్తించు చుందురు. లేనిచో పదునాలుగు లోకముల సంచారము నిర్వర్తించుట ఎట్లు సాధ్యపడును? జీవితము ఆట పాటలతో సాగినపుడే ఆనందముగ నుండును గాని, బరువు బాధ్యతలు అని భావించువారికి బరువు పెరుగుచుండును. జీవితము భావనామయమే గనుక రస భావముతో జీవించు పుణ్యజీవులు గానమార్గమున జీవించి తరించిరి. ఎవ్వరునూ నిర్వహింపలేని అతి క్లిష్టమగు కార్యము లన్నింటినీ నిర్వర్తించిన శ్రీకృష్ణుడు వేణుగాన ప్రియుడే కదా! అతని స్మరణయే ఆనందకరము. అతని గాన స్పర్శ కలిగినవారు కష్ట నష్టములను లెక్క జేయక మహదానందముగ జీవించిరి.

జీవుని హృదయమున మంద్రగానము హృదయస్పందనముగ సాగుచుండును. ఈ మంద్రగానమును చేపట్టి, అభ్యసించి జీవులు హంస స్వరూపులై, పరమహంసలై హంసగానమున తేలియాడు చుందురు. రామకృష్ణ పరమహంస అట్టివాడు.



# 910. 'సౌమ్యా'

సౌమ్యముగ నున్నది శ్రీమాత అని అర్థము.

శివుని గూడిన వారందరూ సౌమ్యు లగుదురు. శివుడెవరితో కూడునో వారికి సహజముగ సౌమ్యత్వ మబ్బును. శివుని సోముడని కూడ పిలుతురు. సోము డనగా ఉమతో కూడినవాడని అర్థము. ఉమను కూడుటచేత అతడు సోము డయ్యెను. సౌమ్యు డయ్యెను. ఆహ్లాదకరు డయ్యెను. శివుడు అగ్ని స్వరూపుడు. అమిత తేజోవంతుడు. చూచినంత మాత్రముననే మన్మథుడు భస్మమయ్యెను. అట్టి తేజోవంతుని చేరి సౌమ్యత్వము కలిగించునది శ్రీమాత. శంకరునిగను, ఆహ్లాదకరుని గను, సౌమ్యుడిగను తీర్చిదిద్దినది శ్రీమాత. శ్రీమాతను కూడిన శివుడు శంకరుడు, మయస్కరుడు. మయస్కరు డనగా చల్లదనము కూర్చు వాడని అర్థము. శివుని శంకరునిచేసి, మయస్కరునిగ కూడ చేసిన ఘనత శ్రీమాతదే. దీనివలన శ్రీమాత ఎంత సౌమ్యురాలో తెలియ నగును. శివుని సోమునిచేసి, సౌమ్యునిచేసి, శంకరునిగను, మయస్కరుని గను మలచుకొని సోమయాగమును నిర్వర్తించు దిట్ట ఆమె. ఇంతకన్న నేర్పరి సృష్టియందు ఎవ్వరునూ లేరు.

కఠినులగు భర్తలను తీర్చిదిద్దుకున్న పతివ్రత లందరునూ శ్రీమాత భక్తులే. మూర్ఖులను కూడ ఋషులను చేసిన స్త్రీలు కలరు. శ్రీమాత నాశ్రయించినచో సర్వమూ సౌమ్యమే యగును.

# 911. 'సదాశివ కుటుంబినీ'

**స**దాశివుని కుటుంబమునకు ఆధారము శ్రీమాత అని అర్థము.

సదాశివ కుటుంబ మనగా వసుధైక కుటుంబము. సమస్త జీవకోటి శివభక్తుల కుటుంబమే. వారిరువురునూ అంతర్యామి స్వరూపులై, వాసుదేవమూర్తులై జగత్తంతయూ వ్యాప్తిచెంది జీవకోటి కాధారమై యున్నారు. శివుడు స్థాణువు. శ్రీమాత అతని ప్రజ్ఞ. జీవు డుండుట యనగా శివుడుండుటయే. జీవప్రజ్ఞగ నున్నది శ్రీమాత. ఈ రెంటినీ సత్ చిత్ లందురు. వారిరువురి ఆధారముగ జీవు డానందము చెందగలడు. జీవుని యందు యునికి శివుడు కాగా, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులతో కూడిన ప్రజ్ఞ శ్రీమాతయై యున్నది. వారి ఆధారమున జీవుడు వసించుట, సుఖించుట జరుగుచున్నది. జీవుడు సుఖముగ వసింపవలెనని భావించును. సుఖమునకు స్థిరము కూడ ఉండవలెను కదా! స్థిరము నిచ్చువాడు స్థాణువైన శివుడు. వైభవమును, సుఖ సౌఖ్యములను యిచ్చునది శ్రీమాత. కనుకనే వారి ఆరాధనము మంగళప్రదమై యున్నది. ప్రకృతి పురుష లన్ననూ, రాధామాధవు లన్ననూ, లక్ష్మీనారాయణు లన్ననూ యథార్థముగ శివశక్తి తత్త్వమే. వారిరువురూ ఎచ్చట సమపాళ్ళుగ నుందురో, అచటనే సమస్త వైభవ ముండును.

శివుడు స్మశానమున కూడ నుండగలడు. అచ్చట వైభవ ముండదు. జీవుడు స్మశాన జీవనము కోరడు. అతడు శాశ్వతముగను,

స్థిరముగను, ఆనందముగను వుండుట కిచ్చగించును. కనుక శివునితో కూడిన శ్రీమాత నారాధించవలెను. అమ్మ లేనిచోట అడుక్కుతినటమే యుండును. ఆమెయే అన్నపూర్ణ. ఆమెలేని కాశీపట్టణము స్మశానమే. శివునికి స్మశానమైననూ, మహాభవనమైననూ యొకటే. అత డతీతుడు. కాని జీవునికి స్థిరము, సుఖము అవసరమై యున్నది. కనుక కుటుంబము సుఖసౌఖ్యములతో నుండవలెనన్నచో అమ్మ ఆరాధనము కూడ జోడింప వలెను. కుటుంబమున పుత్రులు, పుత్రికలు, పౌత్రులు, ప్రపౌత్రులు, గృహము, వాహనములు, పాడి, పంట, మంగళప్రదమగు సంపద యిత్యాదివి యున్నప్పుడు, సంస్కారము, శుచి మిన్నగ నున్నప్పుడు అది సదాశివ కుటుంబముగ భాసించును.

సదాశివ కుటుంబమును ఒకింత పరిశీలించినచో వైభవ మన నేమో తెలియును. అది దివ్యవైభవముతో కూడి యున్నది. ఈ కుటుంబమున శివుడు బ్రహ్మము. శ్రీమాత ఇచ్ఛా జ్ఞాన క్రియా స్వరూపిణి. గణపతి సకల విద్యాపారంగతుడు. సుబ్రహ్మణ్యుడు సర్వ శక్తిమంతుడు. శివుని వాహనము ఆనంద స్వరూపమైన నంది. అమ్మ వాహనము ఉదాత్త చిహ్నమైన సింహము. గణపతి వాహనము యుక్తితో కూడిన ఎలుక. కుమారుని వాహనము సప్త ఆకాశములందు విహరించగల గరుడుని తనయుడైన నెమలి. ఈ కుటుంబమున అంద మున్నది. ఆనంద మున్నది. విద్య యున్నది. శక్తి సామర్థ్యము లున్నవి. అపరిమితమగు శుద్ధి యున్నది. వారికి లేనిది లేదు. వారి ఆవాసము సర్వసంపదలకు ఆలవాలమైన, ఉత్తమోత్తమమైన శిఖరమగు కైలాసము. ఎవ్వరైననూ కోరదగినది యిట్టి కుటుంబమే.

ఈ కుటుంబమున కలహములు లేవు. సమభావమే వ్యాప్తి చెంది యుండును. వారి నివాస నామము కూడ ఆనంద వనము. అదియే ఆనంద నిలయము. సదాశివ కుటుంబ పరివారము ప్రతి యింటను ఉండవలసిన చిత్రపటము.



# 912. 'సవ్యాపసవ్య మార్గస్థా'

**స**వ్య అపసవ్య మార్గము లందు ఉండునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత సూర్యమండలమునకు కుడి, ఎడమ మార్గములలో ప్రకాశించుచూ ప్రజ్ఞ, పదార్థములను పోషించుచూ యుండును. సృష్టికి కుడి ఎడమలు అత్యవసరములు. అవి లేనిచో సృష్టి లేదు. ఆమెనుండి దిగివచ్చు కుడి ఎడమ భాగములను అశ్వినీ దేవతలుగను, గరుత్మంతుని కుడి ఎడమ రెక్కలుగను, మహావిష్ణువు ఇరుప్రక్కల చేరిన శ్రీ భూ దేవతలుగను ఋషులు వర్ణించిరి. అశ్వినీ నక్షత్రము మొదలుకొని భరణి, కృత్తిక, రోహిణి నక్షత్రము లన్నియూ ఎడమకును; రేవతి, ఉత్తర, పూర్వాభాద్రాది నక్షత్రములు కుడికిని, రెండు హస్తములుగ జ్యోతిశ్చక్రము వ్యాప్తిచెంది యున్నది.




ఇట్లు అశ్విని కేంద్రముగ కుడిప్రక్కకు పదమూడు నక్షత్ర విభాగములు, ఎడమప్రక్కకు పదమూడు నక్షత్ర విభాగములుగ జ్యోతి

ర్మండలము ఏర్పడి యున్నది. దీనిని పన్నెండు రాశులుగ కూడ దర్శించవచ్చును. మేషమునకు ఎడమ భాగమున వృషభము, కుడి భాగమున మీనము రాశులను దర్శింప వచ్చును.

భూమిపై జీవులకు సూర్యగమనము మేషమునుండి వృషభము నకు, వృషభమునుండి మిథునమునకు గమనము చేయుచున్నట్లు గోచరించును. ఇట్లు ఆరుమాసముల గమనమున మేషము నుండి తులకు, ప్రజ్ఞాలోకముల నుండి పదార్థమయ లోకములకు సూర్యుని గమనము సాగును. మరల తులనుండి వృశ్చికము, ధనుస్సుల ద్వారా మీనము చేరి, అటుపై మేషమును సూర్యుడు చేరును. ఈ ఆరు మాసములు పదార్థమున చేరిన ప్రజ్ఞ మరల తన మూలస్థానమునకు చేరును. ఇట్లు పదార్థమున ప్రవేశించుట పదార్థమూలమును చేరుట, మరల పదార్థమునుండి నిష్క్రమించి నిజస్థానము చేరుటగ సూర్య గమనమును ఋషులు దర్శించిరి. మేషమునుండి తులవరకు జరుగు గమన మార్గము ఎడమదిశగా పయనించు మార్గము. దీనిని అపసవ్య మార్గమనిరి. మరల పదార్థమున చిక్కిన ప్రజ్ఞ తన నిజస్థానమునకు చేరుట సవ్యమార్గ మనిరి.

సహస్రార మందలి ప్రజ్ఞ మూలాధారమునకు చేరినపుడు అది అవరోహణ క్రమముగను, అటుపైన మూలాధారము నుండి ఆరోహణ క్రమమున సహస్రారము చేరుటను సవ్యమార్గమని తెలిపిరి.

రెండు మార్గములను నిర్వర్తించునది శ్రీమాతయే. సృష్టి చక్రమున అవరోహణ, ఆరోహణ క్రమమును ఏర్పరచి వానియందు జీవులను

ప్రవేశింపచేసి, దేహేంద్రియ మనస్సులను జీవుల కేర్పరచుచూ సృష్టి అనుభూతినిచ్చి, పరిపూర్ణులను జేసి మరల నిజస్థానమునకు చేర్చుట మొత్తము సృష్టి కథ. ఈ విధముగ సృష్టియందు పండినవారు రెండు మార్గములకును మధ్యస్థానమున నిలతురు. అది సూటిగ సుషుమ్న మార్గముగ మేషమునుండి తులకు యేర్పడి యుండును. సుషుమ్న మధ్యమార్గము కాగా, ఇడ, పింగళ ఎడమ, కుడి ప్రక్కల యుండును. ప్రజ్ఞను పరిపాలించువారు దేవతలుగను, పదార్థమును పాలించువారు రక్షస్సులుగను శ్రీమాత ఏర్పరచును. ఇట్లు అదితిగను, దితిగను యేర్పడి పరిపాలించును. రెంటికిని మూలము శ్రీమాతయే. అట్లే మధ్యమార్గమున నుండు యోగులకు కూడను యోగేశ్వరీదేవిగ మాతృస్థానము నలంకరించి యున్నది. ఇందు దేవయాన మార్గమునకు దేవయాని గను, పితృయాన మార్గమునకు శర్మిష్ఠగను ఏర్పడి పరిపాలించు చున్నది. క్లుప్తముగ చెప్పవలెనన్నచో వెలుగు చీకటుల మార్గమున నున్నది శ్రీమాతయే.



# 913. 'సర్వాపద్వినివారిణీ'

**అ**న్ని మార్గముల యందు గల ఆపదలను విశేషముగ తొలగించి అనుభూతి నిచ్చునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాతను స్మరణము చేయువారు, శరణు పొందువారు అన్ని మార్గముల యందు ఆనందమునే పొందుదురు. ఆపదలు చెందరు. వామమార్గమున భూమిపై ఐహిక సుఖము లనుభవించుచూ, దక్షిణ మార్గమున అంతటా దేవి సాన్నిధ్యమును కూడ పొందుచూ మధ్య మార్గమున శాశ్వతస్థితిని పొందువారు రాజయోగులు.

రాజయోగి సమస్త సృష్టి వైభవములను, భోగములను అనుభ వించుచూ శ్రీమాత సాన్నిధ్యమును కూడ పొందుచు నుండును. అతనికి ఇహపరము లందు భేదబుద్ధి యుండదు. సమదర్శనుడై సమస్తము నందును శ్రీమాతనే దర్శించుచు నుండును. సన్యాసము పేరున ప్రకృతి సౌఖ్యములను వర్జింపడు. అట్లని సంసారమున బంధింపబడడు. సన్యాసము పేరున సంసారమును పెంచుకొన్న సన్యాసు లెందరో కలరు. సన్యాసులకు విస్తారముగ ఆశ్రమములు, ఆస్తులు, లావాదేవీలు ఏర్పడుట హాస్యాస్పదము. రాజయోగి నిజమగు సన్యాసి. అన్నిటి యందుండియూ ఏమియూ అంటక యుండును.

సవ్యాపసవ్య మార్గము లందును, మధ్యేమార్గము లందునూ, కాలమును దేశమునూ బట్టి వర్తించు చుండును. ఏ మార్గము నందునూ

ఆపద లుండవు. ఆపదలు కూడ శ్రీమాతయే అని భావించును. కనుక ఆపదలు గోచరింపక శ్రీమాతయే గోచరించును. ద్వైతాద్వైతముల కతీతముగ విశిష్టాద్వైతమున యుండును. ద్వంద్వముల కతీతముగ యుండి ద్వంద్వములను కూడ సంగము లేక అనుభూతి చెందును. కృష్ణు డందించిన పరమోత్కృష్టమైన సమన్వయ మిదియే. జనకుడు ఆదిగ గల రాజయోగులు ఈ సమన్వయమున రాజయోగులై, శాశ్వతులై ప్రకాశించు చున్నారని అర్జునునకు బోధించెను. దీనినే శరణాగతి మార్గమని కూడ యందురు. అట్టి మార్గమున శ్రీమాత అనుగ్రహమున ఆపదలు లేక జీవింపవచ్చును. అట్టివానిని ఆపద లేమియూ చేయలేవు. ప్రహ్లాదుడు, అంబరీషుడు అట్టివారు.



# 914 'స్వస్థా'

**త**నయందే తా నుండునది శ్రీమాత అని అర్థము.

తాను బ్రహ్మము. తానే సంకల్పమైనది. అయిననూ బ్రహ్మ స్థితిని వీడదు. నిజస్థితిని వీడదు. సంకల్పము నుండి కాలము ప్రకృతి యగును. అయినను బ్రహ్మమును వీడదు. అటుపై శక్తిగ మారినను, త్రిశక్తి అయిననూ లోకములను, జీవులను ఏర్పరచిననూ, తాను బ్రహ్మముగనే యుండి యిన్నిటిగా వ్యాప్తి చెందును గాని మార్పు చెందదు. తన సహజస్థితి కోల్పోదు. స్వస్థానమును వీడదు. స్వస్థానము నుండియే వ్యాపించును. వ్యాప్తి చెందుట వేరు. మార్పు వేరు. ఎన్ని ఆభరణములుగ మారిననూ బంగారము బంగారముగనే యుండును. మట్టి మట్టిగనే యుండును. అన్ని వస్తువు లట్లుండవు. పాలు పెరుగైనపుడు పాలుగ నుండదు. నేయి అయినపుడు పాల స్వరూప స్వభావమే యుండదు. అట్లని పాలుగ నుంచిననూ కొంత కాలమునకు మురుగు కంపు కొట్టును. బంగారమట్లు కాదు కదా!

జీవులు కూడ సహజముగ ఆత్మవంతులైననూ ఆత్మలమని యెరుగక భిన్నమని నిర్వచించుకొనుచూ జీవింతురు. కనుక వారు స్వస్థులు కారు. మనిషినని, పురుషుడనని, స్త్రీనని, ధనవంతుడనని, హిందువునని, భారతీయుడనని భావించుట కద్దు. ఈ భావనలు స్వస్థత నీయవు. ఈ భావములు శాశ్వతములు కావు. పాలు మురిగినట్లు

అంత మొందును. తాను జీవుడనని, దేవుని ప్రతిబింబమని, అట్లే కన బడుచున్న సమస్తము దేవుని ప్రతిబింబమే యని, అవియునూ తనవలెనే జీవులని, సనాతను లని తెలిసియుండుట స్వస్థత. శ్రీమాతయే తానుగను, యితరముగను గోచరించు చున్నదని తెలియుట స్వస్థత. ఇతర మున్నదని మాత్రమే భావించుట అస్వస్థత. ఇట్టి అస్వస్థత లేనిది శ్రీమాత. శ్రీమాత సాన్నిధ్యమున చేరిన జీవుడు కూడ అట్టి స్వస్థతనే పొందును. తాను బ్రహ్మమని, సమస్తమూ బ్రహ్మమే యని, యున్నది బ్రహ్మమే యని, బ్రహ్మమే యిన్ని విధములుగ గోచరించు చున్నదని తెలిసియుండుట స్వస్థత. అట్టి స్వస్థత యందు ఉన్నది శ్రీమాత. అట్టి స్వస్థతను అనుగ్రహించున దామెయే.



# 915. 'స్వభావమధురా'

స్వభావముచేత మధురమైనది శ్రీమాత అని అర్థము.

మాధుర్యము అనుభూతులకు పరాకాష్ఠ. మధురానుభూతి జీవుని మురిపించి మరపించును. అట్టి మధుర అనుభూతిని అందరునూ అభిలషించుచు నుందురు. జీవులు తుదకు కోరు అనుభూతి యిదియే. మధుర భక్తియే ప్రేమ. అట్టి ప్రేమ రుచి చూచినవారు గోపికలు. వారు శాశ్వతముగ తమయందు కృష్ణ సాన్నిధ్యమును మధురముగా అనుభ వించుచూ జీవితమున తరించినవారు. జీవనము వారికి అనాయాస ముగ సాగినది. అన్నిటా అంతటా కృష్ణ దర్శన స్పర్శన సంభాషణాదులే వారు అనుభవించిరి. దేవర్షి యగు నారదుడు సహితము దైవమునందు వారికి గల మాధుర్యమును తిలకించి సంభ్రమము చెందెను.

ఇట్టి మధురభావము, భక్తి, ప్రేమ గోపికలకు ఎట్లు కలిగెనో నారదుడు విచారించి రహస్యమును కనుగొనెను. అది కేవలము దివ్యానుగ్రహమే అని తెలుసుకొనెను. శ్రీకృష్ణుడే గోపికలకు అట్టి మధురభక్తిని అనుగ్రహించెను అని తెలిసెను. అనుగ్రహమే అసలు వరమని తెలిసి కృష్ణుని తనకును అట్టి వరమిమ్మని ప్రార్థించెను. నీ వట్టి వాడవే కదా! అని కృష్ణుడు చమత్కరింపగ సందేహపడెను. "సందేహము, తర్కము మధురభక్తి యందుండవు నారదా!" అని కృష్ణుడు హెచ్చరింపగా ఉలిక్కిపడి 'శ్రీహరీ!' అని నారదుడు పాదములపై

బడెను. "నీ గానమున నీవు నిత్యము నన్నిట్లే అనుభవించు చున్నావు కదా! మరల సందేహమేల? నీవంటివారిని పూర్వము నీవు చూడలేదు. ఇపుడు గోపికలను చూచినపుడు నీకు ఉపమానము దొరికినది. నీవు సహజముగ భక్తి మాధుర్యమున తేలియాడుచుందువు. గోపికలను నీవంటివారిగ నే నను(గ్రహించితిని. మధురభక్తి సంపూర్ణ శరణాగతి చెందినవారికే అను(గ్రహింపబడును. నిజమునకు నేను అను(గ్రహించు టకు కారణ మేమియు నుండదు."

మధురభక్తి కలవారు సహజ సమాధి యందుందురు. వారి జీవిత మ(ప్రయత్నముగ అవలీలగ సాగుచుండును. సర్వ(ప్రయత్నములు దైవమే నిర్వర్తించును. ఇటీవలి కాలమున సక్కుబాయి, మీరాబాయి, రామకృష్ణులు అట్టికోవకు చెందినవారు. ఈ భక్తి శ్రీమాత అను(గ్రహము వలననే లభించగలదు.

దైవము నందు రుచి యేర్పడుట దైవ సంకల్పమే గాని మానవ కల్పితము కాదు. భక్తి, (ప్రేమ యిత్యాదివి కలుగవలెనే గాని కల్పించుకొన వీలులేదు. అవి కలిగినవారి స్వభావములు మాధుర్యముతో నిండును. వారు అభిలషణీయులుగ గోచరింతురు. అట్టివారే మధురాపురి వాసు లగుదురు.



# 916. 'ధీరా'

**జ్ఞా**న మిచ్చునది శ్రీమాత అని అర్థము.

'ధీ' అనగా బుద్ధి. బుద్ధి నిచ్చి రక్షించునది శ్రీమాత. బుద్ధిహీనత వలననే ఆపదలు కలుగును. జీవులకు జన్మనిచ్చి, అనుభవించుటకు వీలుగా మనస్సు, యింద్రియములు, శరీరముల నిచ్చి రక్షించు కొనుటకు బుద్ధిని కూడ శ్రీమాత యిచ్చినది. బుద్ధిని వినియోగించుకొని సృష్టిని అనుభూతి చెందమని ఆదేశించినది. బుద్ధి వినియోగమున విచక్షణ యుండును. ధర్మాధర్మములు తెలియును. సత్యాసత్యములు, నిత్యానిత్యములు, మంచి చెడులు– సమస్తము బుద్ధి యను వెలుగునందు గోచరించును. బుద్ధి జీవులకు దేవు డిచ్చిన వరము. దానిని పెంపొం దించుకొనవలె ననినచో దైవారాధనమే ఉపాయము. దైవమనగా సృష్టియందు వ్యాపించియున్న వెలుగు. ఆ వెలుగే జీవులలో కూడ బుద్ధిగ వెలుగుచు నుండును. దైవారాధనమున బుద్ధి యను వెలుగు వికాసము చెందుచుండును. ఆరాధనము లేనిచో వెలుగు కొడిగట్టిన దీపమువలె కాంతి తగ్గి నీరసించి నశించును.

పై కారణముననే ఋషులు ప్రాతఃకాలమున యేర్పడుచున్న వెలుగును దర్శించుచూ బుద్ధి ప్రచోదనమునకు గాయత్రీ మంత్ర గానము, జపము, ధ్యానముల నొసగిరి. జీవులలో గల బుద్ధియను వెలుగును రక్షించుకొనుటకు, పెంపొందించుకొనుటకు ప్రాతఃకాలము ననే చేయు ఆరాధనములు అత్యంత ఉపయోగకరములు.

బుద్ధి బలహీనపడినపుడు జీవుల స్వభావము బుద్ధిని కబళించి ప్రక్కదారిని పట్టించును. దీపము వెలుగుచుండగా నల్లని కొడి ఏర్పడి నట్లు బుద్ధి యను వెలుగునకు నీడవలె స్వభావ ముండును. బుద్ధి ప్రచోదనము నిత్యము గావించుకొననిచో కొడిగట్టు దీపము నీరసించి నట్లు బుద్ధి నీరసించును, నశించును కూడ. బుద్ధిని స్వభావ మనుస రించవలెనే గాని, మరియొక మార్గము లేదు. స్వభావమునకు బుద్ధి లొంగినచో కష్టనష్టములు తప్పనిసరి. కనుకనే దైవమిచ్చిన బుద్ధిని దైవప్రార్థనచే నిత్యమూ పెంపొందించుకొనుచు నుండవలెను. బుద్ధి రూపమున శ్రీమాత నిలచి జ్ఞానదీపమై వెలుగును. దాని ననుసరించుచూ జీవులు జీవన ప్రయాణము సాగించుకొనుట శ్రేయస్కరము. ప్రాతఃకాల ఆరాధనమునకు అంతరాయము లేర్పడుచున్నచో గుర్తించి హెచ్చరికగ మెలగుట, అలవాట్లను సరిదిద్దుకొనుట ముఖ్యము. జ్ఞానమిచ్చు శ్రీమాత సంసిద్ధయై యుండగ, అందుకొనకుండుట దురదృష్టము.



# 917. 'ధీరసమర్చితా'

ధీరులచే పూజింపబడునది శ్రీమాత అని అర్థము.

ధీరు లనగా బుద్ధిమంతు లనియు, జ్ఞానవంతు లనియూ తెలుపబడినది. జీవులు బుద్ధిమంతులు, జ్ఞానవంతులు అగుటకు శ్రీమాతయే కారణము. బుద్ధి జ్ఞానములను వారి కేర్పరచినది, వారి యందు పెంపొందించినది శ్రీమాతయే కదా! బుద్ధి జ్ఞానముల వలన సత్యధర్మముల నెఱిగి ధీరులు అజ్ఞానమను చీకటిని వీడి, ఆనందము గను, వైభవముగను జీవింతురు. తమ జ్ఞానమునకు, ఆనందమునకు, వైభవమునకు శ్రీమాతయే కారణ మని ఎఱిగి యుండుటచే కృతజ్ఞతా భావముతో, పూజ్యభావముతో, భక్తి భావముతో, ప్రేమ భావముతో శ్రీమాతను వారర్చింతురు.

నిజమగు ధీరులకు దైవారాధనము సహజము. ఆహారము స్వీకరించుట ఎంత సహజమో, దైవారాధన చేయుట కూడ అంతే సహజముగ నుండును. ఆత్మ మూలమెఱిగినవారు ఆరాధనము చేయక నుండలేరు. తమ ఉనికికి కారణమైన తత్త్వ మెఱిగినపుడు దానిని మరచుట ఎట్లు వీలగును?

నిజమునకు ధీరులే సంయక్ ఆరాధన చేయగలరు. వారు చేయు ఆరాధన తెలిసిచేయు ఆరాధన వంటిది. "తెలిసి రామచింతన

చేయవే మనసా” అని త్యాగరాజస్వామి కీర్తించినాడు. తత్త్వము నెఱిగి తాననగా ఎవరో ఎఱిగినవానికి తత్త్వారాధనమే మిగులును. తెలియక చేయు ఆరాధనలు సంయక్ ఆరాధనలు కావు. యథాలాపముగ అన్యచింతనతో చేయు ఆరాధన చేయువారికి రుచించదు. దైవమునకు రుచింపదు. ఆరాధన వలన రుచి కలుగవలె నన్నచో ఆరాధింపబడు దైవము యొక్క స్వరూప స్వభావములు తెలియవలెను కదా!

జీవుడు యింద్రియలోలుడై విషయాసక్తి యందు తగులుకొని, కామముచేతను, భయముచేతను, వేదనలచేతను బాధింపబడు చుండగా అన్యమనస్కుడై యాంత్రిక ఆరాధనలు సాగించు చుండును. అవి సంయక్ ఆరాధనలు కానేరవు. నిరపేక్షతో, ప్రేమతో, భక్తితో యినుమ డించిన రుచితో చేయు ఆరాధనలే సంయక్ ఆరాధన లగును. యథాలాపముగ వేడినచో తోటి మానవుడే ప్రతిస్పందింపడు గదా! దైవమెట్లు ప్రతిస్పందించును?

పాద నమస్కారము, నిత్య శుశ్రూష, సేవ యిత్యాదివి గావించుచూ, భక్తితో వేడిననే గాని, జ్ఞానులు బోధింపరని శ్రీకృష్ణుడు తెలిపినాడు. దైవతార్చన అవగాహనతో కూడి స్థిరచిత్తముతో చేయ వలెను. స్థిరచిత్తమే ఆరాధనకు ప్రాథమిక అర్హత నిచ్చును. “దేహాత్మ భావనతో చేయు పూజలు దైవమును చేరవు. బుద్ధ్యాత్మ భావనతో చేయు పూజలే చేరును. చిత్తమును శుద్ధిచేసుకొని, స్థిరపరచుకొని బుద్ధియందు ప్రవేశింపజేసి ఆరాధించుట వలన ఆరాధన ఫలవంత

మగును." వేమన యోగి ఈ విషయమునే వివరించుచూ "చిత్తశుద్ధి లేని శివపూజ లవి యేల?" అనెను.

ఆరాధకులు యమ నియమాదులు పాటించి, స్థిరచిత్తమును పొంది, అట్టి చిత్తమును బుద్ధియందు ప్రవేశింపజేసి దైవారాధనము గావించినచో అట్టి ఆరాధన సమ్యక్ ఆరాధన యగును. అట్లు ఆరాధించువారు ధీరులు. అట్టి ధీరులచే అర్చింపబడినది శ్రీమాత.



# 918. 'చైతన్యార్ఘ్య సమారాధ్యా'

**చై**తన్యమునే అర్ఘ్యముగ ఉపయోగించి పూజింపబడునది శ్రీమాత అని భావము.

శ్రీదేవి ఆరాధనమున చైతన్యమే అర్ఘ్యముగ సమర్పింపబడ వలెనని సూచన. చైతన్యమాధారముగ మనస్సు, యింద్రియములు, శరీరము కదలుచు నున్నవి. పనులు చేయుచు నున్నవి. మనస్సు, యింద్రియములు, శరీరము పనిముట్లు. చైతన్యమే యజమాని, జీవుడు చైతన్య స్వరూపుడు. నిజమునకు చైతన్యము శ్రీమాతయే. జీవునకు రూపమిచ్చునది కూడ ఆమెయే. తన చైతన్యముతోనే రూపమేర్పరచి, ప్రాణము పోసి వినియోగించుకొనుటకు మనసేంద్రియ దేహముల నిచ్చినది. ఆమె యిచ్చినది ఆమెకే సమర్పింపవలెను కదా! ఆరాధనము చేయువారు తమ భక్తికొలది రక రకముల సమర్పణములు శ్రీమాతకు చేయుచు నుందురు. అన్నము, వస్త్రము, ధనము, ఆభరణములు సమర్పించుచు నుందురు. కాని తమను తాము సమర్పించుకొనరు. తమను సమర్పించుకొనక తమకున్నవి సమర్పించుట పరిపూర్ణ సమర్ప ణము కాదు. అన్నియూ శ్రీమాత యిచ్చినవే. ఆరాధకుని ఉనికి కూడ శ్రీమాత యిచ్చినదే. తనను తాను సమర్పించుకొనుటయే ఆత్మ సమర్పణ మగును. అట్టి సమర్పణ శ్రీమాత ఆరాధనములలో పరమోత్కృష్టమైన ఆరాధన.

# 919. 'చైతన్య కుసుమప్రియా'

**చై**తన్య పుష్పమునందు ప్రీతి గలది శ్రీమాత అని అర్థము.

భక్తి పారవశ్యమున చిత్తము స్రవింపగ, స్రవించిన చిత్తమును ఆరాధనమున భక్తులు శ్రీమాతకు సమర్పింతురు. అట్టి స్రవమును కవులు పుష్పముతో పోల్చిరి. చైతన్య రసమే చైతన్య కుసుమము. చైతన్య కుసుమములతో ఆరాధించినపుడు శ్రీమాత ప్రీతి చెందును. దీనినే బంగారు పుష్పముల పూజ అని కూడ అందురు. ఇచ్చట బంగారు పుష్ప మనగా బంగారు లోహముతో చేయబడిన పుష్పమని అర్థము కాదు. చిత్తకాంతి ప్రాథమికముగ ఎఱ్ఱ బంగారపు కాంతివలె యుండును. ఆ కాంతియే వృద్ధి చెందినపుడు పచ్చ బంగారు కాంతివలె మెరయును. శ్రీమాత పూజకు ధనము ప్రధానము కాదు. భక్తి ధనమే ప్రధానము. భక్తి ధనముకన్న ధనము లేదు.

సత్యభామాదేవి భూసంపద కంతటికిని అధికారి. తన ధనముతో దైవమును పొందు సంకల్పమున విఫలమయ్యెను. రుక్మిణీదేవి భక్తి ధనమున కధికారి. రుక్మ మనగా బంగారము. ఆ బంగారము చైతన్య కాంతి. ఆ కాంతి వలన దైవము స్థితి కలుగును. కాని లోహము వలన కాదు.

భక్తులు మనోవాక్కాయ కర్మలయందు శుచిని పాటించుట, అహింస ప్రవృత్తిగా కలిగియుండుట, దొంగబుద్ధి లేకుండుట, అనుచిత

బహుమానముల నందుకొనకుండుట. శుచి శౌచము పాటించుట, లోపల బైట ఈశ్వరీ దర్శనమునకై యత్నించుట, సంతోషముగ నుండుట– యిత్యాది నియమములను పాటించుచూ, భక్తితో ఆర్ద్రతతో శ్రీమాత యందు రుచి కలిగి ఆరాధించునపుడు వారి చిత్తము బంగారు పుష్పము వలె వికసించును. అట్టి పుష్పమునందు యేర్పడు స్రవమును పొందుటకు శ్రీమాత అభియుక్తురాలై యుండును. ఈ కారణముచేత ఆమెను 'చైతన్య కుసుమప్రియా' అని హయగ్రీవుడు అగస్త్యునకు తెలిపినాడు.

పుష్పపూజ భక్తిమార్గమున యమ నియమాదులే. వాని ఆచరణమే పుష్ప సమర్పణము. అహింస ఒక పుష్పము, దొంగబుద్ధి లేకుండుట మరియొక పుష్పము– ఇట్టి ప్రవృత్తులే పూజకు పనికి వచ్చు పుష్పములు. కుమనస్కులై సంపెంగ, మల్లె వంటి పుష్పములతో ఆరాధించిననూ శ్రీమాత ప్రీతి చెందదు. నిర్మలమైన మనస్సు పూజకు ప్రధానము. అటుపైన చిత్త సమర్పణము.



# 920. 'సదోదితా'

**స**త్యమునందు అతిశయముగ ఉదయించునది శ్రీమాత అని అర్థము.

సత్ప్రవర్తనము కలవారి యందే శ్రీమాత ఉదయించి ప్రకాశించును. మనోవాక్ కర్మల శుద్ధియే, సత్య ప్రకాశమునకు దారి తీయును. భావము, మాట, చేతలయందు వైవిధ్యమున్నచోట ప్రకాశ ముండదు. సృష్టియందు మనము చూచు వాటన్నిటిలోను అత్యంత ప్రకాశవంతుడు సూర్యుడు. సూర్యుడట్లు ప్రకాశించుటకు కారణము అతని యందలి సత్యమే. సూర్యునికి సత్యవంతుడని మరియొక నామము కలదు. అతని యందు గల స్వచ్ఛమగు సత్యమే అతనికి ఇనుమడించిన ప్రకాశ మేర్పడుచున్నది. ఎచ్చట సత్యముండునో అచ్చట శ్రీమాత సాన్నిధ్యముండును. కనుక ప్రకాశముండును. జీవులు వికసించుటకు, ప్రకాశించుటకు సత్యమే ప్రధాన కారణము. ఎక్కడ సత్య ప్రకాశ ముండునో అక్కడ చీకటు లుండవు. అనగా అజ్ఞాన ముండదు. సత్యము పాటించు వారియందు శ్రీమాత సాన్నిధ్య మేర్పడి ఉదయమువలె ప్రకాశవంతమగును. ప్రకాశము పెరుగుకొలది పరిసరములు కూడ ప్రకాశవంతములగును. బుధ, శుక్రులు సూర్య సమీపమున అమిత కాంతివంతులుగ ఆకాశమున ప్రకాశించుచు నుందురు. బుధుడనగా జ్ఞానము, శుక్రుడనగా సౌఖ్యము. ఎచ్చట శ్రీమాత సాన్నిధ్య ముండునో అచ్చట జ్ఞానము, సౌఖ్యము వుండును. మనస్సు పూర్ణ చంద్రునివలె

ప్రకాశించును. క్రియాశక్తి కుజుని వలె కుమారత్వము వహించును. శ్రీమాత భక్తుల హృదయమున ఉదయించవలెనే గాని, ఉదయించుట ఆరంభించినది మొదలు పరంపరాగతముగ విజయములు, శుభములు చేకూరుచు నుండును.



# 921. 'సదాతుష్టా'

ఎల్లప్పుడూ సంతుష్టిగా వుండునది శ్రీమాత అని అర్థము.

ఈ నామము గురించి వివరించవలసిన దేమియూ లేదు.

సంతుష్టి అనగా సమ్యక్ తుష్టి. అన్నిటి యందు పరిపూర్ణత పొందినవారు తుష్టిగనే యుందురు. పుష్టి యున్నను తుష్టి లేనివారెందరో గలరు. ఎంత యున్ననూ లేని దానిని గూర్చి ఆలోచించుచూ బాధ పడువారు కూడ కలరు. ఉన్నదానిని అనుభవింపక లేని దాని గూర్చి విచారించినచో తుష్టి, సంతుష్టి యుండదు. లేని వానిని గూర్చి ఆలోచించు వారు వున్నది కూడ అనుభవింపలేరు. ఆనందింపలేరు. రావణుని వద్ద లేని ఐశ్వర్యము లేదు. కుబేరుడు సహితము తన బంటుగా ఆజ్ఞలను నిర్వర్తించు స్థితియందు రావణుడుండెను. ప్రపంచములో గల ఎందరో సౌందర్యవతులగు కన్యలు అతనిని వరించి అతని భార్యలైరి. పరాక్రమించి లోకములన్నియూ వశపరచుకొనెను. ఐనను తుష్టి లేక ఆరాటపడుచు అన్ని లోకములు నిర్విరామముగా తిరుగుచు నుండెను. తనకు లేనిది ఏదియైన యున్నచో అది తనదిగా అగుటకు సర్వవిధ ముల తాపత్రయపడెను. ఎంత పుష్టి యున్నను తుష్టి లేనివాడు రావణుడు.

ఏమియూ లేకున్ననూ, సదా తుష్టుడై వున్నవాడు రాముడు. రాజ్యము లేదు. ఐశ్వర్యములు లేవు. పరిచారకులు లేరు. ఆభరణములు లేవు. కట్టుకొనుటకు వస్త్రములు కూడ లేవు. ఐననూ వనము నందు

సీతారామ లక్ష్మణులు తుష్టిగనే వసించిరి. రాజ ప్రాసాదములలో వసించుట కన్న వనవాసమే బాగున్న దనిపించినది. రాముడు తుష్టుడు, సదా తుష్టుడు. అతని సాన్నిధ్యమున సీతా లక్ష్మణులు కూడ తుష్టులై యుండిరి.

వామనుడు పసిబాలుడు కాని సదా తుష్టుడు. బ్రాహ్మణ కుమారుడు. బలి చక్రవర్తి సమస్త ఐశ్వర్యములకు అధికారి. తుష్టి చెందుటకు పుష్కలముగ యున్న ఐశ్వర్యమును దానమిచ్చు వ్రతమును గైకొనెను. పుష్టికన్న తుష్టియే గొప్పదని తెలిసి తుష్టి కొఱకే దాన వ్రతమును ఆరంభించెను. వందల సంవత్సరముల పాటు దాన మిచ్చుచు నుండెను. వామనునికి దాన మీయబూనెను. వామనుడు తాను తుష్టుడని, సంతుష్టుడని దానము నందుకొన అవసరము లేదని తెలిపెను. వామనునికి పుష్టిలేదని బలి భావించెనే గాని, తుష్టుడైనవాడు పుష్టుడే. ఉన్నదానితో సంతృప్తి చెందువాడు సదా తుష్టుడు.

శ్రీమాత తుష్టి కలది, పుష్టి కలది కూడ. తుష్టి పుష్టులను అను గ్రహించునది కూడ ఆమెయే.



# 922. 'తరుణాదిత్యపాటలా'

లేత గులాబీ కాంతితో కూడిన రూపముగలది శ్రీమాత అని అర్థము.

లేత గులాబీ అతి కోమలము, సుకుమారము, కాంతివంతము. తెలుపునందు లేశ మాత్రము ఎఱుపు కలిపిన రంగు అది. తెల్ల కమల దళములు కూడ మొదలు భాగమున ఎఱ్ఱజీరతో కూడి క్రమముగ తెల్లదనమును ఆపాదించుకొనుచూ వ్యక్తమగును. సూర్యకాంతి కూడా ఉదయించునపుడు ఎరుపుగ నుండి క్రమముగ సిందూరముగను, బంగారముగను మారుచూ, చివరకు వజ్రమువలె మెఱయును. ఉదయించు చున్నప్పుడు, పెరుగుచున్నప్పుడు తరుణముగ నున్నది. అనగా ఎరుపుగ నుండును. చివరకు ఆదిత్య వర్ణము ధరించును. ఎరుపు నుండి తెలుపేర్పడుట తరుణాదిత్య తత్త్వము. ఎఱ్ఱజీరతో నుండు తెలుపుకాంతి అతి సున్నితముగ నుండును. శ్రీమాత నఖములు కూడ నిట్టి కాంతితోనే నుండును. హస్తములు, పాదములు కూడ అదే కాంతి. పెదవుల యందెరుపెక్కువుగ నున్ననూ ముఖమంతయూ గులాబి రంగుతో యుండును. కనుల యందు కూడ మంగళప్రదమగు ఎఱ్ఱ జీర గోచరించును. దేహమంతయూ లేత గులాబీ కాంతితో మెఱయు చుండును. అత్యంత ఆకర్షణముతో కూడిన కాంతి ఇట్లు మిశ్రమ వర్ణముగ యుండును. తెల్లని తెలుపు, ఎఱ్ఱని ఎఱుపు, పచ్చని పసుపు,

నల్లని నీలము ఇంత అందముగ నుండవు. ఇట్టి కాంతి శ్రీమాతకే చెల్లును. ఆమె యందు తెల్లని కాంతి చూచి 'గౌరి' యనిరి. నీలమైన కాంతిని చూసి 'శ్యామల' అనిరి. పచ్చని కాంతని చూసి 'హేమ' అనిరి. ఎఱ్ఱని కాంతిని చూసి 'విద్రుమ' అనిరి. నల్ల నీల కాంతిని చూసి 'నీల' అనిరి. ముత్యపు కాంతిని చూసి 'ముక్తా' అనిరి. నల్లని భయము గొలుపు కాంతిని చూసి 'కాళీ' యనిరి. కోపమును చూచి 'రౌద్రీ', 'కపిల వర్ణ' అనిరి. జగన్మోహినీ రూపమును చూచి 'పాటలా' అనిరి. పాటలా అనగా సమస్త కాంతుల సమన్వయము. ఒకానొక కాలమున పాటలీపుత్రము సమస్త విద్యలతో విలసిల్లి యుండుటచే ఆ నామమును ఆ కాలమున జ్ఞానులు ధృవ పఱచిరి. ఆనాటి పాటలీపుత్రమే దుర్దశ చెంది ఈనాటి పాట్నా అయినది.

శ్రీమాత తరుణాదిత్యపాటలీ వర్ణమును ఆరాధించువారు శుద్ధ సత్వ స్వరూపులగుదురు. ఆరాధనకు ఈ వర్ణమే సముచితము.



# 923. 'దక్షిణా దక్షిణారాధ్యా'

**ద**క్షిణము, అదక్షిణము మార్గములలో ఆరాధింపబడునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత కుడి ఎడమలు, దక్షిణ అదక్షిణములు. దక్షిణులనగా కార్యదక్షులు. అదక్షిణులనగా జ్ఞానులు. కర్మజ్ఞానములు కుడి ఎడమలుగా శ్రీమాత సృష్టి నిర్వహణా ఇచ్ఛను నిర్వర్తించుచుండును. ఇచ్ఛా నిర్వహణ మునకు కర్మజ్ఞానములు ప్రధానము. క్రియాశక్తి, జ్ఞానశక్తి లేక యిచ్ఛా పూరణము జరుగదు.

కొందరు కర్మ ప్రధానమని వాదింతురు. కొందరు జ్ఞానము ప్రధానమని వాదింతురు. కాని కర్మశూన్యులు, జ్ఞానశూన్యులు, ఇరువురును భ్రష్టులే అగుదురు. కర్మ ప్రధానమని, తదనుగుణమైన జ్ఞానమును పొందనిచో మూర్ఖులగుదురు. తెలియక వంట చేసినట్లు, యుద్ధము చేసినట్లు, వ్యాపారము చేసినట్లు, పనులు చేసినట్లు యుండును. తెలియక చేసిన వంట భుజింపలేరు. తెలివి లేని యుద్ధము మరణమునకు దారితీయును. తెలియక చేయు వ్యాపారము తీరని నష్టము కలిగిం చును. అట్లే తెలియక చేయు పని కష్టములు తెచ్చును. నాలుగు వర్ణముల వారు, వారు చేయు పనులు తెలిసి చేయవలెను. కర్మ ప్రధానమని, జ్ఞానహీనతతో కర్మ నిర్వర్తించిన వినాశమే కలుగును.

ఎట్లు చేయవలెనో తెలిసిననూ చేయకుండినచో యిచ్ఛ పూరింప

బడదు. ఎట్లు చేయవలెనో తెలిసియూ చేయకుండుట వలన జీవనము సాగదు. జ్ఞానము ప్రధానమని కర్మను విస్మరించినచో భ్రష్టత తప్పదు.

తెలిసినది ఆచరించుచూ సాగుట ప్రధానము. తెలిసినది ఆచరింపకుండినచో జీవన ప్రయాణము ఆగును. తెలియక ఆచరించినచో ప్రయాణమున ప్రమాదము తప్పదు. జీవునికి రెండు కన్ను లెట్లు ప్రధానమో అట్లే కర్మజ్ఞానములు రెండునూ ప్రధానములే. సూర్య చంద్రులిరువురునూ భూమికి అవసరము. శివశక్తులు రెండునూ సృష్టికి అవసరము. కర్మ జ్ఞానములలో ఏది ఎక్కువ ప్రధానమని అర్జునుడడుగగా కృష్ణుడు రెండునూ సరిసమానముగ ప్రధానమని తెలిపెను.

శ్రీమాత ఆరాధనము కూడ కేవలము కర్మకాండగా సాగుట కాక జ్ఞానముతో కూడినదై యుండవలెను. ఆమె కర్మజ్ఞానములచే ఆరాధింపబడవలెను.

జ్ఞానము లేక కేవలము పూజలు చేయుట నిరుపయోగము. అట్లని జ్ఞాన మార్జించుచు పూజలు మానుట కూడ నిరుపయోగమే. మొదటి వర్గము వారు మూర్ఖముగ మూఢ విశ్వాసమున బంధింపబడుదురు. రెండవ వర్గము వారు ఆరాధనము లేకపోవుట వలన తదనుగుణమైన అనుభూతి వికాసము లేక అహంకారులై విమర్శలు చేయుచు జీవింతురు. మహాజ్ఞానియైన శంకరులు కూడ నిత్యపూజలు నిర్వహించిరి. జ్ఞానము సత్త్వముతో కూడి యున్నప్పుడు ఆరాధన తప్పక యుండును. తమస్సుతో కూడినప్పుడే ఆరాధన అవసరము లేదని

పించును. ఫలితము భ్రష్టత్వమే. జ్ఞానము రజస్సుతో కూడినపుడు ఆరాధన యందు డంబముచేరి, డంబాచారులై ప్రచార మార్గమునపడి నశింతురు.

ఆరాధనము నుండి కలిగిన భక్తివలన అనుభూతి కలుగును. అనుభూతి జ్ఞానమునకు వికాసము నిచ్చును. ఇనుమడించిన జ్ఞానము భక్త్యారాధనము నినుమడింప జేయును. ఇట్లు భక్తి జ్ఞానములు రెండు రెక్కలుగా వినియోగపడి, ఆరాధకుడు విహంగమువలె ఊర్ధ్వలోకములకు ఎగబ్రాకును. ఇట్లు కుడి ఎడమలుగ ఆరాధన సాగవలెను.



# 924. 'దరస్మేర ముఖాంబుజా'

**చి**రునవ్వుతో కూడిన ముఖ కమలము కలది శ్రీమాత అని అర్థము.

చిరునవ్వు సౌభాగ్యకరము. ముఖమున చిరునవ్వు ప్రసన్నతను కలిగించును. ప్రసన్నవదనమే ధ్యానమున కుపయుక్తము. ఉపాసింప బడు దేవత ప్రసన్నమగుటకు ప్రసన్న వదనమునే ఆరాధింపవలెను. అనుగ్రహమున కదియే ప్రధానమగు రూపము. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, గణపతి, కుమారుడు, శంకరుడు- అందరునూ ప్రసన్న వదనులే. అనుగ్రహము కలవారికి ప్రసన్నమగు వదనముండును. దేవతలందరూ వారి వారి ముఖములందు గల ప్రసన్నత శ్రీమాత సాన్నిధ్యమే. దేవత లనుగాని, పెద్దలనుగాని ప్రసన్నులను చేసుకొనుటకు ప్రవర్తనము ప్రధానము. వారికి నచ్చిన రీతిలో ప్రవర్తించినపుడు వారు తప్పక ప్రసన్ను లగుదురు. ప్రార్థనతో పాటు ప్రవర్తనముకూడ ప్రధానమని తెలియవలెను. ప్రవర్తనము సరిగ నుండనపుడు ప్రసన్న వదనము దేవత యందు గోచరింపదు. శ్రీమాత ప్రసన్నురాలు కావలెనన్నచో శ్రద్ధా భక్తులతో కూడిన ఆరాధనముతోపాటు తోటి జీవులయందు వాత్సల్యపూరిత ప్రవర్తనము కూడ ప్రధానము. ఈ రెండునూ యున్న చోట శ్రీమాత ప్రసన్న వదనమును దర్శించు అర్హత కలుగును.

# 925. 'కౌళినీ కేవలా'

**కౌ**ళినీ కేవలా అనగా సృష్టి మధ్యమున ఏకాంతముగ నుండు నది శ్రీమాత అని అర్థము.

కౌళినీ అను నామము 94వ నామమున ప్రకటింపబడినది. కౌళినీ అనగా కులదేవత. కుల మనగా గుంపు, గృహము, దేహము, ప్రాంతము, దేశము, లోకము, సృష్టి. వీని మధ్యమున కేంద్రబిందువుగ శ్రీమాత యుండుట వలన పై తెలిపిన వన్నియూ ప్రాకారములుగ యేర్పడును. కేంద్ర మున్నచోట పరిధి యుండును. కేంద్రముగ అన్నిటి యందు నుండునది శ్రీమాతయే. ఆమెయే బిందురూపిణి. కేంద్ర బిందువుగ కౌళినియై యుండును. అనగా తన చుట్టునూ పరివార మేర్పడుచుండును. పరివార మెంత యేర్పడిననూ శ్రీమాత తానుగనే యుండును. తాను శివరూపిణి, బ్రహ్మరూపిణి. తాను తానుగనే యుండగా తన చుట్టునూ సమస్త మేర్పడుచుండును.

ఆమె కేవలయే అనగా తానుగనే యుండును. శివపరముగనే యుండును. తననుండి యేర్పడు శక్తులు సమస్తము అల్లుచు నుండును. అట్లు లోకాలోకము లేర్పడుచుండును. అన్నిటి యందు తాను తానుగనే యుండును.

తాను కేంద్రముగా తన చుట్టునూ పరిధు లేర్పడుచూ, పరి వారములు యేర్పడినపుడు, ఎంతటి వారైననూ తమను తాము మరతురు.

పరివార మోహమున పడుదురు. అహంకార మమకారము లేర్పడు చుండును. తాము తాముగ నుండక వికారము చెందుదురు. అపుడు బంధింపబడుట, పతనము చెందుట జరుగుచుండును. త్రిమూర్తులు కూడ శ్రీమాత మోహినీ శక్తికి అపుడపుడు లోబడుచుందురు. బ్రహ్మర్షులే శ్రీమాత అనుగ్రహమున కేవలముగ నుందురు.

ఇంత సృష్టి నిర్మాణము గావించియూ అందరునూ తనపై ఆధారపడి, తన నారాధించుచూ, ప్రశంసించుచు నుండగా కూడా శ్రీమాత శివపరయై యుండును. తాను తానుగనే యుండునుగాని, వికారములు చెందదు. ఇది కేవలము శ్రీమాతకే తగును. ఆమె ఆరాధన మున జీవులు కూడ కేవలత్వము ననుభవించుచూ కైవల్యమున నుండ గలరు.

శ్రీ కైవల్య పదంబు అనగా శ్రీపతి కేవలత్వమును పొందుటకు చేయు ప్రయత్నము. అట్టి ప్రయత్నమున వికారము లన్నియు తొలగి సహజ స్థితి యేర్పడును. తాను బ్రహ్మమే యని యెరిగి, సహజముగ నుండుట జరుగును.



# 926. 'అనర్ఘ్య కైవల్య పదదాయిని'

**అ**పరిచ్ఛిన్నమగు మోక్ష పదమును యిచ్చునది శ్రీమాత అని అర్థము.

కేవలమనగా తానుగ నుండుట. తాను బ్రహ్మమే. జీవుడు తాను బ్రహ్మమే, తనకన్న వేరేమియూ లేదు అని తెలుసుకొనినపుడు, యితరము లేవియూ లేక అంతయు బ్రహ్మమే అను స్థితి యందు ప్రజ్ఞ నిలచినపుడు మోక్ష స్థితి పొందినవాడుగ తెలియనగును.

జీవుడు శ్రీమాత నుండి పుట్టిన త్రిగుణముల నుండి పుట్టిన వాడగుటచే అతడు త్రిగుణములకు లోబడి యుండును. త్రిగుణములచే నియమింపబడి నడచును. ఇచ్ఛా జ్ఞాన క్రియలందు పరిభ్రమించుచు నుండును. త్రిగుణములు దాటిన స్థితియందు చేరుటకు శ్రీమాత అనుగ్రహము కావలెను. సాధారణముగ త్రిగుణములలో నుండి పుట్టిన జీవుడు మనస్సు, యింద్రియములు, శరీరము లాధారముగ బాహ్య ప్రపంచమున జీవించును. తాను త్రిగుణములచే నియమింపబడి, బంధింపబడి యున్నాడని కూడ తెలియదు. తన యందలి ఇచ్ఛ తనను నడిపించు చుండును. ఇచ్ఛా పూరణమునకు శ్రమించుచు జన్మ లెత్తుచు నుండును. తన యిచ్ఛ అనుకొనుచున్నాడేగాని యిచ్ఛచే నియమింపబడి నడచు చున్నాడని, యిచ్ఛ ఎట్లు తిప్పిన అట్లు తిరుగుచున్నాడని, యిచ్ఛ కారణముగనే భావము, భాషణము, కార్యము నిర్వర్తించు చున్నాడని తెలుసుకొనలేదు. ఇచ్ఛ వలన తాను త్రిప్పబడుచున్నాడా? స్వేచ్ఛగ

నున్నాడా? భావములు తనకు కలుగుచున్నవా? లేక తాను భావించు చున్నాడా? తన అనుమతి లేకయే తనయందు యిచ్ఛ, భావము కలుగు చున్నవి కదా! అట్టి స్థితిలో తన భావమని, తన యిచ్ఛయని తానను కొనుట భ్రమయే కదా! భావములు తనవైనచో, తాను భావింపకూడదు అని సంకల్పించినపుడు భావము లాగుట లేదు కదా! భావనము, భాష, కార్యము, కర్మము తనను నడిపించు చుండగా, తాను వాటిని నిర్వర్తించుచున్నాడని భ్రమపడును. జీవితము తన వశము గాక నడచుచుండును. ఇది సత్యము.

ఆత్మపరిశీలనము గావించుకొనినచో తాను కర్తయని భావించుట కేవలము భ్రమయే అని తెలియును. తనను నడిపించుచున్నవి త్రిగుణ ములని తెలియును. త్రిగుణములను నడిపించు చున్నది వాని మూలమైన మహాచైతన్యమని తెలియును. ఆ చైతన్యమే శ్రీమాత. అట్టి శ్రీమాత అనుగ్రహించినపుడే జీవుడు త్రిగుణములను దాటిన వాడగును. జీవుడు త్రిగుణములను దాటినపుడు అల సముద్రమును చేరినట్లుండును. అపుడు అల యుండనట్లుగ మహా చైతన్యమగు శ్రీమాత యుండును. మహా చైతన్యమే సమస్తము నందు వ్యాపించి యుండి యితరము గోచరింపని స్థితి యేర్పడును. అదియే బ్రహ్మము. కేవలము బ్రహ్మమే యున్నది అనునది కైవల్య పదవి లేక స్థితి. అట్టి స్థితిని అపరిచ్ఛిన్నముగ అంతరాయములు లేక నిరంతరమై యుండునట్లు అనుగ్రహించునది శ్రీమాత.

# 927. 'స్తోత్రప్రియా'

స్తోత్రము చేత ప్రీతి చెందునది శ్రీమాత అని అర్థము.

నమస్కారము, ప్రార్థన, గుణకీర్తనము, ప్రశంస, పరాక్రమ వర్ణనము, వైభవము, సౌశీల్యము- యిత్యాది అంశములతో కూడి స్తోత్ర ముండును. శ్రీమాతను స్తుతించినకొలది ప్రీతి చెందును. జీవులు కూడ స్తుతించినపుడు ప్రీతి చెందుదురు. విమర్శించినపుడు అప్రియు లగుదురు. స్తోత్రము లుచ్చరించువారు విమర్శలు చేయకూడదు. విమర్శలు చేసినచో స్తోత్రముల ఫలము చెడును. దైవస్తుతి, జీవనింద సామాన్యముగ అందరునూ చేయుచు నుందురు. ఇట్టి వారందరూ తెలియనివారు.

తెలిసినవారు దైవస్తుతి ఫలమును, ఆశీర్వచనమును పొంద గోరుదురు కనుక జీవనిందకు పాల్పడరు. జీవులయందు కూడ దైవమే యుండుటచే విమర్శ వర్జనీయమైనది. అవతార పురుషులు, మహాత్ములు విమర్శలు చేయక జీవించిన విధానమే శిష్టాచారుల కనుసరణీయము. వశిష్ఠ గౌతమాది బ్రహ్మర్షులు నిందలకు పాల్పడలేదు. అవతార పురుషు లగు రామకృష్ణాదులు నిందింపబడిననూ నిందించలేదు. నిందాస్తుతు లందు మౌనము వహించువారు మహాత్ములు.

నిందింపని ప్రవర్తనముతోపాటు స్తోత్ర పఠనము చేయు జీవుల యందు శ్రీమాత అత్యంత ప్రసన్నురాలగును. తనను స్తోత్రములు

చేయుచూ తన సంతానమగు జీవులను విమర్శించువారు, ద్వేషించు వారు, సహింపనివారు, శ్రీమాత ప్రీతికి పాత్రులు కాలేరు. ఈ రహస్యము 'స్తోత్ర ప్రియా' నామమున యున్నది. తనను పొగడుచూ తన వారిని దూషించినచో ఎవరు సహింపగలరు? దూషణ వలన వాక్కు అపవిత్ర మగును. వాక్కు రూపమున నున్నది శ్రీమాతయే. ఆమె వాగ్దేవి. నాలుక కొనయందు సరస్వతిగా స్థితిగొని యున్నది. కనుక వాక్కును అత్యంత పవిత్రముగ వినియోగించుచూ దేవతా స్తోత్రములను చేయవలె నన్నది నియమము. స్తోత్రముచే శ్రీమాత అనుగ్రహమును పొందదలచినవారు ఈ క్రింద తెలిపిన విషయములందు హెచ్చరిక కలిగి ప్రవర్తించవలెను.

1) అసత్యభాషణము 2) సత్యములేని ప్రియభాషణము మఱియు ప్రశంస 3) మాటలను మెలికలు త్రిప్పుట 4) అప్రియ భాషణము 5) విమర్శ 6) నింద 7) ద్వేషపూరిత భాషణము.

పై విధమగు భాషణములు జీవ చైతన్యమును విషపూరితము చేయును. ఇట్టివారు చేయు స్తోత్రములు శ్రీమాతకు ప్రియము కలిగింప లేవు.



# 928. 'స్తుతిమతీ'

స్తుతితో కూడిన మతి గలది శ్రీమాత అని అర్థము.

జగన్మాతయైన శ్రీమాత సురాసురులకు, సకల జీవులకు తల్లియగుటచే అందరియందు సద్గుణములనే చూచును. కనుకనే అందరియందు ప్రేమయే కలిగి యుండును. తల్లి తన పిల్లలందరి యందునూ మంచిని చూచును. చెడును విస్మరించును. ఆమె దండించి నపుడు కూడ ప్రేమతోనే దండించును. ద్వేషముండదు. తన పిల్లలను ఎవరైననూ నిందించినచో తాను సహింపలేదు. తానుగ తన పిల్లలను సరిదిద్దుకొనును. అసురులను సురలు నిందించిన ఒప్పుకొనదు. అట్లే అసురులు సురలను నిందించిననూ ఒప్పుకొనదు. ఒకరినొకరు మన్నించుకొన్నచో సంతసించును. ఎవరి నెవరు నిందించిననూ వూరుకొనదు. ఒకరినొకరు స్తుతించుకొనినచో ఆనందించును. తల్లి తండ్రులగు వారందరికినీ ఈ సత్యము తెలియును.

భాగవత సంప్రదాయమున కూడ తోటి జీవులలోని సద్గుణము లను వెదకి చూచుకొనుట తెలుపుదురు. జీవులలోని సద్గుణములను దర్శించుచూ దానిని ప్రశంసించుట వలన అంతర్యామి యగు దైవము సంతసించును. దుర్గుణములు చూచుటకు సంస్కారము లవసరము లేదు. సద్గుణ దర్శనమునకు ప్రయత్నము చేయునపుడు సంస్కారము లేర్పడును. ఎంత సద్గుణ దర్శనము చేతుమో అంత సంస్కారము పెరుగుచు నుండును. దర్శించి స్తుతించినచో స్తుతిమతుల మగుదుము.

స్తుతిమతు లనగా భట్రాజుల వలె యెప్పుడును పొగడుచూ నుండెడివారు కారు. కల్యాణ గుణములను దర్శించుచూ, దాని నంతర్యామి దైవముగా గుర్తించుచూ, లోన ప్రశంసించుకొనుచూ ఆనందముతో నిండిన మనసు కలిగినవారై యుందురు. జీవుల యందలి దైవమును దర్శించుచూ, లోలోపల దివ్యవైభవమును ప్రశంసించుకొనుచూ ఆనందించుట భాగవత మార్గము.

అట్లే శ్రీమాత తన సృష్టి యందలి సమస్తమునందు శివునే దర్శించుచు, ఆనందించుచు, స్తుతి చేయుచూ నుండును గనుక ఆమె స్తుతిమతి యైనది. తన వలనే సమస్తమునందు దైవమును దర్శించు జీవులను తా ననుగ్రహించుచూ నుండును. జీవులలోని స్తుతిమతులచే శ్రీమాతలోని స్తుతిమతిత్వము అవగాహన యగును. ఈ రహస్యము తెలిసి సద్గుణోపాసనము, సద్గుణ దర్శనము, సద్గుణము రూపమున గల దైవదర్శనము కీర్తనము చేయుట ఎవరు చేయుదురో వారిదే దివ్య వైభవము.



# 929. 'శ్రుతిసంస్తుత వైభవా'

**శ్రు**తులచే లెస్సగా స్తుతింపబడిన వైభవము గలది శ్రీమాత అని అర్థము.

శ్రుతి అను శబ్దము నాలుగు అంకెను తెలియపఱచును. శ్రీమాత సృష్టి చతుర్వ్యూహమై నడచును. పరా పశ్యంతి మధ్యమ వైఖరి అనునవి నాలుగు వాగ్రూపములు. అట్లే నలుగురు కుమారులతో కూడి విరాట్ వ్యూహమున్నది. వారే సనక సనందన సనత్కుమార సనత్సుజాతు లనియు, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ వ్యూహములని యందురు. దైవమును చతురాత్మ అని కూడ తెలుపుదురు. చతుర్భుజుడు గను, చతుర్ముఖుడుగను కూడ తెలుపుదురు. ఇవి అన్నియూ దివ్య వైభవముతో కూడినవి. కాలము కూడ నాలుగు వ్యూహములుగ వర్తించును. వేదములు కూడ నాలుగే. వర్ణాశ్రమములు కూడ నాలుగు. ఇట్లంతయూ నాలుగు నాలుగుగా దైవము వ్యాప్తిచెంది యున్నాడు. శ్రీమాతయే ఇట్లు వ్యాప్తిచెంది యున్నది. వీనినే వాఙ్మయ మంతయూ పరిచయముచేసి దాని వైభవమును వర్ణించు చుండును.

జీవుని అవస్థలు కూడ నాలుగుగా తెలుపుదురు. అవి వరుసగా జాగృతి, స్వప్నము, నిద్ర (సుషుప్తి), తురీయము. జీవుల ఈ నాలుగు అవస్థలకు దైవ మేర్పఱచిన నాలుగు వ్యూహములే ఆధారములు. అట్లే అహంకారమును కూడ నాలుగుగా తెలుపుదురు. తామసిక

అహంకారము, రాజసిక అహంకారము, సాత్త్విక అహంకారము, మహదహంకారము. ఏకస్థితి నుండి త్రిభుజ మేర్పడుట, త్రిభుజము నందు అంతకు పూర్వమున్న ఏకము వ్యాప్తిచెంది నాలుగగుట జరుగుచు నుండును. త్రిగుణముల నేర్పఱచి అందు శ్రీమాత తానే ప్రవేశించును. ఈ మహిమను వేదములు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు సంస్తుతి చేయుచు నుండును. ఇట్లు స్థితులచే వివరింపబడుచూ, ప్రశం సింపబడుచూ వుండునది శ్రీమాత.

సంస్తుతి అనగా పరిచయము చేయబడుచూ, ప్రశంసింప బడుచూ నుండుట. శ్రీమాత శక్తులు కూడ నాలుగుగా తెలుపుదురు. అవి వరుసగా శాంతి, విద్య, ప్రతిష్ఠ, నివృత్తి.



# 930. 'మనస్వినీ'

శ్రీమాత మనస్సు శ్రీమాతయందే ఆసక్తి కలిగి యుండునని అర్థము.

జీవుల మనస్సు పరిపరి విధములుగా పోవుచు నుండును. మనస్సు కన్న వేగమైనది మరియొకటి లేదు. క్షణములో అతి దూరము అతి వేగముగ పోవును. నిలిపిన చోట నిలువదు. మాట వినదు. జీవుడొకటి తలచిన మనసు మరొకటి తలపించును. "వలదన్న వినదే మనసు." వలదు, వలదు అని జీవుడు తెలిపిననూ మనస్సు వినదు. ఎంతటి వారికైననూ మనస్సు వినని సందర్భములు కలవు. దీని రహస్యమేమనగా జీవుల యందలి మనస్సు జీవుల ఆధీనము కాక యుండును. మనస్సును పుట్టించునది శ్రీమాత. కనుక మనస్సు ఆమె వశమున యుండును. మన వశమున యుండదు. శ్రీమాత నారాధించి ఆమె అనుగ్రహము పొందినచో మనస్సు సహకరించును. మనో సహకారమే జీవుడు కోరవలెను, మనసును వశము చేసుకొను యత్నము కూడదు. మనస్సు ఎవరి వశమున యుండదు. శ్రీమాత వశమున మాత్రమే యుండును. శ్రీమాతను మరచినవారిని మనస్సే రక రకము లుగా హింసింపగలదు. సింహికవలె పట్టి ఏడ్పించ గలదు, హింసింప గలదు. ఏనుగంతటి మనిషిని పీనుగను చేయగలదు. కారణము లేని భయము, ఆందోళన, అనుమానము, నైరాశ్యము, దుఃఖము కలిగింప

గలదు. ఇట్టి మనస్సును ఎవరు గెలవగలరు. కేవలము దైవచింతనము వలన మనస్సు ఊరట చెందును. మనస్సు తనదని భ్రమ పడక దైవము తనయందేర్పఱచిన మహిమ అని తెలిసి దైవమును ఆరాధించినచో మనస్సు పూర్ణ చంద్రునివలె ఆహ్లాదము కలిగించును, ప్రహ్లాదము కలిగించును, వెలుగులోకములను దర్శింప చేయును. శ్రీమాతను కూడ దర్శింపచేయును. అట్టి మనస్సు శ్రీమాతకు చెందినది కాని తనది కాదని తెలిసి వినయవంతుడై యుండవలెను. తెలియుటకు, తెలిసినది సమయమునకు స్ఫురించుటకు, స్ఫురించినది క్రమబద్ధముగ నిర్వర్తించుటకు మనస్సు ఆవశ్యకము. శ్రీమాత సమస్త సృష్టి నిర్మాణము, నిర్వహణము, తన మనస్సుతోనే చేయుచున్నది. ఆమె మనస్సే సర్వ జీవుల యందు ప్రతిష్ఠించినది. తత్కారణముగ జీవులు అనుభూతి చెందుచు యున్నారు. మనసే లేనిచో మహిమే లేదు. అనుభూతి విభూతి కూడ లేదు. శ్రీమాత మనస్వినీ వైభవము వర్ణింప నలవి కాదు.



# 931. 'మానవతీ'

ధర్మ ప్రమాణము ననుసరించి వర్తించునది శ్రీమాత అని అర్థము.

వేదములు, శాస్త్రములు, అవతార పురుషుల ప్రవర్తనములు, ఋషుల వర్తనములు, సద్గురువుల చేష్టలు ప్రమాణములు. అనగా ఆచరణీయములు. పై తెలిపిన వారందరికిని ప్రమాణము శ్రీమాత. ఆమెను ప్రమాణముగనే స్వీకరించి అందరునూ వర్తింతురు. ఆమె వర్తన మునే ప్రమాణముగ స్వీకరించి అపౌరుషేయములైన వేదము లేర్పడినవి. త్రిమూర్తులకు సహిత మామెయే ప్రమాణము. ఏది ధర్మము? ఏది అధర్మము? అని నిర్ణయము చేయుటకు ప్రమాణ మొకటి వుండవలెను కదా! శ్రేష్ఠులగు పెద్దలు ఆచరించినదే ధర్మముగా యితరులు కూడ ఆచరించెదరు కదా! సృష్టి యందలి పెద్దలందరకు శ్రీమాతయే పెద్ద దిక్కు. ఆమె ఆచరించినదే ప్రమాణము. అదియే ధర్మము. ఎవరినెట్లు సంరక్షించవలెనో జగన్మాతకు తెలిసినట్లు యితరులకు తెలియదు. ఎందులకిట్లు ప్రవర్తించినది అనునది తెలియదు. కాలక్రమముననే తెలియును. రాముని వాలి సంహారము నాటికిని, నేటికిని తెలియని వారికి చర్చనీయాంశమే. అట్లే సీతమ్మకు విధించిన అగ్నిపరీక్ష, పట్టాభిషేకా నంతరము పరిత్యాగము కూడ చర్చనీయాంశములై మిగిలినవి. కృష్ణావ తారమున అట్టి సన్నివేశములు కోకొల్లలుగ నున్నవి. పురాణములలో పుట్టలు పుట్టలుగ సన్నివేశములు గోచరించును.

అల్పబుద్ధి గలవారికి ప్రశ్నలు, సందేహములు మిగులును. సంస్కారము పెరుగుతున్నకొలది ధర్మ మవగాహన యగును. సామాన్య ధర్మములు, విశేష ధర్మములు, మహా ధర్మములుగ ధర్మము శ్రేణులలో యుండును. తనకు తెలిసిన ధర్మము ననుసరించుచూ యజ్ఞార్థముగ జీవించినచో క్రమముగ సంస్కారము పెరుగుచూ, వికారములు తగ్గుచూ, అవగాహనము పెరుగును. తనకు తెలిసిన కొద్ది ధర్మమును అనుస రింపనిచో ప్రమాదములు కలుగును. మానము కోల్పోవుట యుండును. అవమానము పాలగుట యుండును. మానమును కాపాడుకొనువారే మానవతులు, మానవంతులు. మాన మనగా ధర్మము. జాతి, కులము లను బట్టి ధర్మములున్నవి. వాని నెఱిగి అనుసరించుట మానవంతుడు చేయు పని. స్వల్పముగ గోచరించిననూ స్వధర్మమునే అవలంబించుట వలన మహాభయముల నుండి కూడ రక్షింపబడుదురని శ్రీకృష్ణుడు బోధించినాడు. ధర్మయుద్ధము చేయవలసిన క్షత్రియుడగు అర్జునుడు యుద్ధము చేయనని, సన్యసింతునని, హిమాలయములకు పోయి తపస్సు చేసుకుందునని పలికినపుడు, కృష్ణుడికి అర్జునుడిపై చాల జాలి కలిగినది. స్వధర్మము నవలంబింపమని, లేనిచో నశింతువని తెలిపెను. స్వధర్మము నవలంబించి మరణించిననూ యుత్తమ లోకములు కలుగును గాని స్వధర్మమును విసర్జించి పరధర్మము నాశ్రయించినచో వినాశము తప్పదు.

త్రాచుపామొకటి కాటు వేయరాదని, బుస కూడ కొట్టరాదని నిర్ణయించుకొని యుండగా హింసకు గురి అయినది. ప్రాణమునకు కూడ అపాయ మేర్పడినది. సిద్ధులు ఆ దారిన పోవుచు స్వీయ రక్షణమునకే

నీకు బుసకొట్టుట, అవసరమగుచో కాటువేయుట దైవ మిచ్చిన శక్తి. కాటు వేయకున్ననూ బుసకొట్టుట మానకుము అను హితబోధ ధర్మావలంబనమునకు తెలుపబడిన కథయే. అట్లే యింటిలో దొంగలు ప్రవేశించినపుడు అరచుట కుక్క ధర్మము. గాడిద అరచినచో దెబ్బలు తప్పవు. జంతువులకు, మానవులకు, దేవతలకు, రక్షసులకు, యక్షస్సు లకు, దైత్యులకు, దానవులకు, రుద్రులకు, వశువులకు, ఆదిత్యులకు, యితరులకు, దిక్కులకు, పంచభూతములకు ఎవరి ధర్మములు వారికి యేర్పడి యున్నవి. వాని ననుసరించుచూ మానవంతులై కీర్తి పొందుట శ్రీమాత 'మానవతీ' నామమున తెలియవచ్చును.



# 932. 'మహేశీ'

మహత్తునకు ఈశ్వరి అని అర్థము.

మహత్తును గూర్చి ముందు నామములలో వివరింపబడినది. మహేశ్వరీ నామము కూడ తెలుపబడినది. ఇప్పుడు 'మహేశీ' అను నామము తెలుపబడుచున్నది. మహేశ్వరుని భార్య కావున మహేశ్వరీ అనియు, మహేశుని భార్యగాన మహేశి అనియు స్త్రీ వాచకము. తత్త్వము స్త్రీయు కాదు పురుషుడు కాదు. తత్త్వము నుండి వెలువడిన సృష్టి సంకల్పమును స్త్రీ వాచకముగ సంబోధింతురు. కాని సృష్టి సంకల్పము నుండియే కాలము, ప్రకృతి, శక్తి యిత్యాది వేర్పడి మహత్తు యేర్పడును. సృష్టి సంకల్పమే సృష్టిలో దైవము. అది పురుషుడును కాదు, స్త్రీయును కాదు. పురుష వాచకముగ మహా విష్ణువని తెలుపుదురు. స్త్రీ వాచకముగ, జగన్మాతగ ఆరాధించుట ఆరాధకులకు సన్నిహితత్త్వ భావము, ప్రేమ భావము సహజముగ కలుగజేయును. అందువలన జీవులు దైవమును తండ్రిగ ఆరాధించుట కన్న, తల్లిగ ఆరాధించుట కిష్టపడుదురు. ఏ జీవికైననూ తండ్రి కన్న తల్లియే దగ్గర అనిపించును. తల్లితో చెప్పుకొనుట సులభము కనుక దైవమును శ్రీమాతగ ఆరాధించు విధానము ప్రాధాన్యత వహించినది. మహిమ గలవారు కూడ ఆరాధింతురు గనుక ఆమె 'మహేశీ'.

# 933. 'మంగళాకృతిః'

**మం**గళప్రదమైన ఆకారము గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత రూప మానందకరము, శుభకరము, క్షేమకరము, అదృష్టకరము. కనుకనే ఆమె దర్శనమునకై మహాత్ములు కూడ తపన చెందుదురు. అందము, ఆనందము, వైభవము, సుఖము, సౌఖ్యము, తుష్టి, పుష్టి, పరిపూర్ణతలు ఆమె దర్శన మాత్రమున కలుగును. జయము తథ్యము. ఆ రూపము మోక్షప్రదము. శ్రీమాత దర్శనము కన్న కోరదగిన దేదియు ఎవరికిని యుండదు. మంగళప్రదముగ జీవనము సాగుటకే జీవుడాశించును.

కనుక మంగళమగు రూపమునే ధ్యానము చేయవలెను. ప్రసన్న మగు వదనమును ధ్యానించుట ప్రధానము. ఊహకందినంత అంద మగు ముఖమును, చిరునవ్వు చిందుంచు చున్నట్లుగ వుండు ముఖమును ధ్యానించుట ప్రధానము. కన్నులు ప్రేమ పూరితములై ఆరాధకుని చూచు చున్నట్లు భావించుచూ ధ్యానించుట, కీర్తించుట చేయవలెను. లేదా అత్యంత కోమలమగు పాదములను, హస్తములను ధ్యానించ వచ్చును. ధ్యానమున కనువగు ఈ మంగళాకృతిని కూడ సహస్ర నామమున ముందుగనే తెలుపబడినది. అట్లే ధ్యానము కూడ రూప వర్ణముతో కూడియున్నది.

అర్చా రూపము ఎంత కాంతివంతముగను, అందముగ నుండునో అంత మనస్సు లగ్నమగుటకు అవకాశము కూడ కలుగును.

మనస్సు హరింపబడుటే ఆరాధనమునకు ఫలశ్రుతి. మనోహరణము వలన జీవుడు బుద్ధిలోకములో ప్రవేశించుట జరుగును. అపుడు బాహ్యము మరుగగును. అంతరంగపు లోతులలో ప్రవేశించుట జరుగును. అపుడే రస భావమునకు అవకాశముండును. కనుకనే అందమైన మూర్తులను ఆరాధనమునకు వినియోగించు సంప్రదాయ మేర్పడినది. మానవులు మనస్సు ప్రధానముగ జీవింతురు గనుక, మనస్సులతోనే ఆరాధనము చేయుదురు గనుక మంగళాకృతులు నారాధించు విధానము అత్యంత సౌలభ్యము కలిగించును. మనసు కరగనిచో దైవమునకు మార్గమే లేదు. మనస్సు బాహ్యము నుండి అంతరము చేరి, అంతరము నుండి హృదయాంతరములను చేరవలెను. అచటనే దివ్య దర్శన స్పర్శన భాషణమునకు అవకాశమున్నది. మరియొక మార్గము లేదు. శ్రీమాత యందుగల శ్రద్ధ భక్తి ప్రేమ యినుమడించుకొలది మనస్సు కరుగు అవకాశ మేర్పడుచుండును.



# 934. 'విశ్వమాతా'

**వి**శ్వమునకు తల్లి శ్రీమాత అని అర్థము.

శ్రీమాత విశ్వమునకు తల్లి అనగా విష్ణువునకు కూడ తల్లియే. విశ్వము విష్ణువైనపుడు విశ్వమాత విష్ణుమాత కూడను. విష్ణువునకే కాదు, బ్రహ్మ రుద్రాదులకు కూడ ఆమెయే తల్లి. ముగ్గురమ్మలకు కూడ తల్లి ఆమెయే. సృష్టికే తల్లి అయినపుడు సృష్టియందలి ఏ తత్త్వమున కైననూ ఆమెయే తల్లి. దేవతలకు, రాక్షసులకు, సజ్జనులకు, దుర్జనులకు కూడ తల్లియని తెలియవలెను. అందరికినీ తల్లి ఆమెయే గనుక అందరినీ ఆమెయే సంరక్షించుకొనును. సామ దాన భేద దండోపాయములతో తన సంతానమును తానే సంరక్షించుకొనును.



# 935. 'జగద్ధాత్రీ'

**జ**గత్తును ధరించునది శ్రీమాత అని అర్థము.

జగత్తు నిర్మాణము గావించి, వృత్తి నేర్పరచి, జగత్తు నందు ప్రవేశించి ధరించి పోషించి రక్షించునది శ్రీమాత. జీవులు ధరించునవి, జీవునిచే నిర్మింపబడలేదు. తాము ధరించు వస్తువులు, సంపదలు పొందియున్న స్వభావము తామేర్పరచ లేదు. వస్త్రములు, బంగారము, సంపదలు యిత్యాది వన్నియూ శ్రీమాత అనుగ్రహముగ పొందు చున్నారు. ఆమె అనుగ్రహముగ అనుభవించు చున్నారు. వాని యందలి స్వభావము తామేర్పఱచినది కాదు. వానికా స్వభావ మేర్పరచినది శ్రీమాత. కేవలము తమ వని మోహము చెంది యిబ్బందులు పడుచుందురు. తమకున్న వేవియూ తమవి కావు. తమ స్వభావము కూడ శ్రీమాత అందించినదే. దానిని పవిత్రముగ నుంచుకొనుట తమ బాధ్యత. నిర్మించునది, వృత్తు లేర్పఱచునది, రక్షించునది, పోషించు నది శ్రీమాతయే. మానవులు ధర్మకర్తలే కాని సృష్టియందు యజమాన్యాధికారము వారికి లేదు. సమస్తము ధరించునది శ్రీమాత కనుక సృష్టి యంతయు ఆమె సామ్రాజ్యము. తల్లి సామ్రాజ్యమున పిల్లలు బాధ్యతతో వర్తించి అనుభవించుటయే గాని, స్వంతము చేసు కొనుట దుఃఖమునకు దారితీయును.

# 936. 'విశాలాక్షీ'

**వి**స్తీర్ణమగు కన్నులు కలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత చూపు అతి విస్తారము. అన్ని లోకములయందు ఆమె చూపు ప్రసరించి యుండును. ఆమె చూపునకు, గ్రహింపునకు అందని కార్యకలాపము లుండవు. అన్నియూ చూచుచునే యుండును. జీవుల మనోభావములు, చేష్టలు, అందలి మంచిచెడ్డలు గోచరించుచునే యుండును. రహస్యములు, గోపనములు అనుకొనుచూ చేయు తంత్ర ములు, మోసములు గుర్తించి అనుగుణముగ శిక్షించుచు నుండును. జీవుల తమ మేధస్సు కందినంత మేఱకు చూతురు, గ్రహింతురు. ఎంతటి వారికైననూ సృష్టి అంతయూ గోచరింపదు. మొత్తము గోచరించు నది అంతర్యామి యగు శ్రీమాతకే. వారణాశి యందు జీవుల ననుగ్రహించుటకు విశ్వేశ్వరుడున్నాడు. అన్నము పెట్టుటకు అన్నపూర్ణ యున్నది. కాని అందరినీ గమనించుటకు విశాలాక్షి యున్నది కదా! యాత్రికులు విశ్వేశ్వరుని, అన్నపూర్ణను గుర్తింతురు. దర్శింతురు. విశాలాక్షిని అంతగా గుర్తింపరు. కాని అందరినీ గుర్తించునది, గమ నించునది గుప్తముగ నుండు విశాలాక్షియే. నిజమునకు కాశీక్షేత్రము విశాలాక్షి క్షేత్రమని తెలియవలెను.



# 937. 'విరాగిణీ'

వైరాగ్యము గలది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత రాగిణి, విరాగిణీ కూడను. ఎంత అనురాగమూర్తియో అంత వైరాగ్యమూర్తి కూడ. అమితమగు అనురాగముతో చతుర్దశ భువనముల నేర్పఱచును. జీవుల నేర్పరచును. స్వభావముల నేర్పరచును. ధర్మముల నేర్పరచును. రూపములను తీర్చిదిద్దును. పోషించును. వృద్ధి కలిగించును. సంరక్షించును. ఎన్నో రకములుగ ఆరాటపడును. అట్టి తల్లి నిర్లిప్తముగ యింత చేయుట ఆమెకే సాధ్యము. జీవులను మోహింపజేయును గాని తాను మోహమున పడదు. నిజమునకు ఆమె విరాగమూర్తి గనుకయే, అనురాగమూర్తి కూడ యైనది. విరాగులకే నిజమగు అనురాగ ముండును. పరమ ప్రేమ గలవారందరూ పరమ వైరాగ్యమున నుండువారే. అట్టివారి ప్రేమ, అనురాగము నిష్కారణము. జీవుల ప్రేమ లట్టివి గావు. అవి అహంకార మమకారముల కారణముగ యేర్పడి యుండునుగాని, నిజమగు ప్రేమగాని, అనురాగముగాని వారికి తెలియదు. వారి అనురాగమున యితరుల యెడల ద్వేష ముండును. శ్రీమాత అనురాగము, విరాగము ద్వంద్వాతీతమైనటువంటి నిష్కారణమగు తత్త్వము. బంధములేని ప్రేమ, అనురాగము లెచ్చట నుండునో అచటనే అనురాగ విరాగము లున్నవి. అట్టి స్థితిలో అనురాగము, విరాగము సమ భావముతో అంగీకరించుట యుండును.

శ్రీరామచంద్రుడు సీతమ్మను పరిత్యాగము చేయుటలో గల అనురాగ విరాగములు వారిరువురికే తెలియును. సీతా పరిత్యాగమున శ్రీరాముడు చూపిన ధర్మమే అనురాగ విరాగముల కుత్తమోత్తమ తార్కాణము. సీతమ్మపై రామునికి గల అనురాగ మనుపమానము, అద్వితీయము. అది సీతమ్మకు తెలియును కనుకనే పరిత్యజింపబడిననూ ఒకరిపై నొకరికి ప్రేమయే యున్నది గాని ద్వేష మిసుమంతయూ పొడచూప లేదు. అగ్నిపరీక్ష సందర్భమున గాని, పరిత్యాగ మప్పుడుగాని రాముని విరాగమున అనురాగము సడలలేదు. ఇట్టి మహోత్కృష్ట మగు ధర్మము అవతార పురుషుల జీవితములందే గోచరించును. అనురాగముతో జీవులను పోషించు శ్రీమాత విరాగము చూపుచూ అనురాగముతోనే శిక్షించును. శిక్షణము నిచ్చు తల్లి విరాగిణి అయిననూ రాగిణియే.



# 938. 'ప్రగల్భా'

పనులయందు ప్రౌఢభావము గలది శ్రీమాత అని అర్థము.

సృష్టి నిర్వహణము నందు ఆత్మవిశ్వాసము కలది శ్రీమాత. తాను నిర్వహించు కార్యములయందు ధైర్యము, స్థైర్యము చూపు లక్షణము గలది శ్రీమాత. కార్యములయందు సంసిద్ధత, నిర్దిష్టమగు భావము, దిశానిర్దేశము, నిశ్చలత్వము, బలము యుండవలె నన్నచో శ్రీమాత ఆరాధనము తప్పనిసరి అని తెలియవలెను. నిపుణతతో సమర్థవంతముగ మెలపువలె అనుభవ పూర్వకముగ నిర్వర్తించుట శ్రీమాత వద్దనే నేర్వ వలెను. ఒక మాటకు కట్టుబడి యుండుట, చేసిన నిర్ణయములకు ఎట్టి ఆటంకములు ఎదురగుచున్నను నిర్వర్తించుట, పనియందు కుతూహలము, శక్తి, బలము కలిగియుండుట ప్రగల్భ గుణము. ఇట్టి గుణము వలన సర్వకార్యసిద్ధి యుండును. కేవలము యిచ్ఛయే గాక తదనుగుణ జ్ఞానము, క్రియాశక్తి, సమయపాలనము ప్రగల్భ గుణములు. కాలమును, దేశమును, ధర్మమును నెరిగి నిపుణతతో పనులను నిరాటంకముగ నిర్వర్తించువారు ప్రగల్భులు.

ప్రగల్భ మనగా మితిమీరిన ఆత్మవిశ్వాసము గలది. మితి మీరిన ఆత్మవిశ్వాసము, అతిశయము కలవారి పనులలో పొరపాట్లు దొర్లుచుండును. అపజయములు, అవమానములు కలుగుచు నుండును. శ్రీమాత సృష్టి నిర్వహణ మట్లుండదు. ఏ కార్యము ఎప్పుడు ఎచ్చట

ఎట్లు జరుగవలెనో అట్లే జరిపించునది శ్రీమాత. సర్వలోకముల యందు సర్వకార్యములను అట్లు నిర్వర్తింపచేయుట వలన శ్రీమాతయే నిజమగు ప్రగల్భ. పైన వివరింపబడిన గుణములన్నియూ దరిచేరవలె నన్నచో శ్రీమాత ఆరాధనమున జీవులు శుద్ధులే గాక పరిశుద్ధులు కావలెను.

నిత్య సత్త్వమే పరిశుద్ధ గుణము. గుణాతీత యగు శ్రీమాత నవమ ప్రకృతి కాగా, ఆమె నిత్య సత్త్వగుణము అష్టమ ప్రకృతియై యున్నది. అష్టభుజియై అవతరించుచూ దుస్సాధ్యము, దుర్గమము అగు కార్యములను నిర్వర్తించుచు నున్నది. సప్తమ ప్రకృతి కట్టి సామర్థ్యము లేదు. సప్తమ ప్రకృతి యందు రజోగుణ దోషముండుట చేత సత్త్వగుణమునకు గల సామర్థ్య ముండదు. అగుణ ప్రకృతి యందు సత్యము దర్శనము కాదు. ధర్మము గోచరింపదు. మాయ ఆవరించి యుండును. అష్టమ ప్రకృతియగు సత్త్వము నందు పారదర్శకముగ కాల స్వరూపము తెలిసియుండును. రావణ కుంభకర్ణాదులు సప్తమ ప్రకృతియందు బద్ధులైరి. ధర్మాత్ములు సత్త్వము నాశ్రయించి అష్టమ ప్రకృతియందు నిలచి పరాప్రకృతికి, పరమ పురుషునకు చేరువలో నుండి కార్యమును నిర్వహింతురు. వారి ప్రగల్భత్వము కార్యముల యందు గోచరించును. అట్టివారు కేవలము ప్రగల్భముగ పలుకరు.



# 939. 'పరమోదారా'

ఉత్కృష్టమగు ఉదార గుణము గలది శ్రీమాత అని అర్థము.

ఉదార అనగా ఊర్ధ్వముఖమగు చైతన్యము. అగ్నిజ్వాల ఊర్ధ్వ ముఖముగనే ప్రజ్వరిల్లుచుండును. ఉత్తరదిశగా సాగు చైతన్యము ఉదార చైతన్యము. స్థూలము నుండి సూక్ష్మమునకు, సూక్ష్మము నుండి సూక్ష్మతరమగు కారణ లోకములకు, అటుపైన సూక్ష్మతమ మగు కారణాతీత లోకములకు ప్రసరించు లేక ప్రవహించు తత్త్వమును ఉదారత్వ మందురు. శ్రీమాత పరమోదార. అనగా పరము వరకు వ్యాపించియున్న చైతన్య స్రవంతి.

ఉదార గుణము స్థూల తత్త్వము నుండి విడుదల కలిగించును. చైతన్యము ఉదారమైనచో వున్నచోట నుండి ఊర్ధ్వముగ ప్రసరించును గాని పరిసరములలోనికి అవసరము బట్టియే ప్రవహించును. కేవలము భౌతికమగు విషయములందు పరిభ్రమణము చేయు చేతన చక్ర భ్రమణము చేయుచు సుడిగుండమువలె అధమ మగు భావముల యందు తిరుగాడు చుండును. దేహము దేహ సంబంధితమగు విషయ ముల యందే తిరుగాడు జీవులు ఉదారత్వము లేనివారు. తిండి, గుడ్డ, దేహ పోషణము, దేహ పరమైనటువంటి బంధుత్వములు, ఆప్తులు, వీనిని గూర్చే భావన చేయువారు పొట్టతో పాకు జంతువులు. భూమి నుండి భావపరముగ ఊర్ధ్వము సూక్ష్మము దివ్యము అగు

భావముల లోనికి సులభముగ సాగువారు కొంత ఉదార భావము గలవారు.

సర్పములు, నాగులు సమాంతరముగను, ఊర్ధ్వముగను కూడ పయనింప గలవు. అందువలననే వానిని దివ్య సర్పము లనిరి. అట్లే మానవులలో కూడ భౌతిక లోక సంబంధిత భావములలో చిక్కుబడి సర్పములవలె తిరుగాడు వారు దివ్య భావములను పొందలేరు. దివ్య భావముల యందు సహజమగు ఆసక్తి కలవారు భౌతిక భావములలో యిమడక ఊర్ధ్వముగ సాగుదురు. భౌతికమంతయూ మర్త్యమని, సూక్ష్మమంతయూ దివ్యమని తెలిసినవారు ఊర్ధ్వ భావములయం దాసక్తి గొనుచు ఆరోహణమునకు ప్రయత్నింతురు. అట్టివారే సాధకులు. ప్రయత్నమున ఊర్ధ్వమునకు గనుట సాధన. ఏ విహంగమును చూచి ననూ ఎట్లు ఊర్ధ్వముఖ మగుచున్నదో తెలియవచ్చును.

ఆకాశమునం దాసక్తి కలిగి ఆకాశమును చేరు ప్రయత్నమున చైతన్యము ఊర్ధ్వముఖ మగుచుండును. చైతన్యము ఊర్ధ్వముఖ మగు చుండుటనే కుండలినీ ప్రచోదన మందురు. భక్తి సాధనమున, యోగ సాధనమున క్రమముగ సాధకుడు భావములను ఊర్ధ్వముఖము పట్టించుచూ ఆ భావములే ఆలంబనముగ ఊర్ధ్వమునకు సాగవలెను. అందులకే స్తోత్రములు, సూక్తములు, భజనలు, ఆలాపనలు, గీతములు. వానిని నిర్వర్తించుచున్న సమయమున భావము స్థిరమైనచో పరిసరములు అదృశ్యమగును. పరిసరములన్నియు గమనించుచూ స్తోత్రములు

చేయువారు కేవలము తమ్ము తాము మోసగించు కొనుచుందురు. అట్టివారు భక్తులమని, యోగులమని భ్రమ పడుటయే యుండును. భక్తిపరము, యోగపరము అగు సాధన సాగుచుండగ పరిసరములయం దాసక్తి తగ్గి, వెలుగు లోకములయం దాసక్తి పెరుగును. వారికి పదార్థముపై పట్టు యుండదు. పదార్థములను గొప్పదనముకై దానము చేయుట ఉదారత్వము కాదు. వాని యందలి వ్యామోహము తమకు లేకపోవటము వలన అవసరమును బట్టి యితరుల కిచ్చుట సహజముగ సాగుచుండును.

ఒక పూలతీగ, దోసతీగ, పొట్లతీగ, దొండతీగ ఎట్లు ఆలంబన మును పట్టుకొని, ఊర్ధ్వమునకు సాగి పుష్పవంతము, ఫలవంత మగు చున్నదో అట్లే సాధకులు దైవమును లేక గురువును ఆలంబనముగ గొని ఊర్ధ్వమునకు సాగుట సహజమగు ఉదారత్వము కలుగుచుండును.

శ్రీమాత నారాధించు భక్తులు శ్రీమాత ఆలంబనముగ స్థూల ప్రకృతి నుండి సూక్ష్మము లోనికి ప్రవేశించుట ముఖ్యము. భూమిపై పరచుకొనక నిలువుగ వ్యాపించుటకు ప్రయత్నింపవలెను. అట్టి వారిని పరమున కూడ శ్రీమాత చేర్చును. పరమును చేరులోపు తనకు కలుగు భౌతికము, దివ్యము అగు సంపదను ఉదారముగ యితరుల కందింతురు. పరమోదారమగు శ్రీమాత తత్త్వమున నవావరణములు దాటుచున్న కొలది ఆనందము హెచ్చగుచు నుండును.

# 940. 'పరామోదా'

పరముచేతనే ఆమోదింపబడినది. అమితమగు కీర్తి పరిమళము గలది శ్రీమాత అని అర్థము.

కీర్తి రెండు రకములు. సహజము, శాశ్వతము అగు కీర్తి. అసహజము, అశాశ్వతము అగు కీర్తి. సహజమగు కీర్తికి పరిమళ ముండును. అసహజమగు కీర్తి దుర్వాసనతో వికారము కలిగించును. సత్యము, ధర్మము ననుసరించి నిష్కామముగ లోకహితమునకై, లోక శ్రేయస్సునకై నిర్వర్తింపబడు కార్యములు సంపెంగ, మల్లె, చంపకముల వలె సహజ పరిమళము కలిగి, చైతన్యమును వికసింపజేయును. యశస్సు, కీర్తి శాశ్వతములై లోకములకు హితమును కలిగించుచునే యుండును. సత్యము నెఱిగి ధర్మము ననుసరించుచు యజ్ఞార్థము జీవించినవారి జీవితములు, అనంతకాలము యితరులను చేతోవంతు లను చేయుచు నుండును. శ్రీమాత విజయము లన్నియూ అట్టివే. రామకృష్ణాది అవతారములు అట్టి శాశ్వతము, పరిమళ పూరితమగు కీర్తిని సంతరించుకొనుటకు కారణము అందలి సత్యము, ధర్మము, యజ్ఞార్థ జీవనము. ఋషుల జీవితములు, వారు యేర్పరచిన పుణ్యక్షేత్ర ములు, పుణ్య తీర్థములు కూడ అట్టి కీర్తివంతములు. కాలమెట్లు సాగుచున్ననూ దాని దర్శనము జీవులను తేజోవంతులను చేయుచు స్వస్థతను కూర్చును. అట్లే మహాపురుషుల ఆచరణము, బోధనములు శాశ్వతకాలము భూమి జీవుల నుద్ధరించుచు నుండును. ఎవరి కథ వినుట వలన చేతస్సు వికసించునో అట్టివారే యశోరూపులు.

సత్యము, ధర్మము, యజ్ఞార్థజీవనము లేని జీవితములు ఎంత గొప్పవిగ గోచరించిననూ అవి కాలక్రమమున నశించును. ఆ గొప్పదన మందలి వికారము కాలమే వెలికితీయును. కాలము అన్నియునూ గమనించుచు నుండును. సత్యవంతుల జీవితమును క్రమముగ వ్యాప్తి చేయుచూ, అసత్యవంతుల గొప్పతనములోని వికారములను బయల్పఱచి వారికి గల కృత్రిమమగు యశస్సును హరించును. వేమన కాలమందు వేమన యోగిని గుర్తించిన వారరుదు. అట్లే పోతన, కబీరు, సూరదాసు, తుకారాం, షిరిడీ సాయి, రామకృష్ణ పరమహంస, మాస్టర్ సి.వి.వి., అరవిందులు, రమణ మహర్షి, ఏసుక్రీస్తు వంటివారు జీవించియున్న కాలమున లోకమునకు అంతంత మాత్రమే తెలిసి యుండును. వారి దేహ త్యాగానంతరము కీర్తి.

మొదట కీర్తి కలిగించి తరువాత అపకీర్తి కలిగించునది కృత్రిమ మగు కీర్తి. కీర్తికాములై కీర్తి కొఱకు సత్కార్యములు చేయువారు కాలక్రమ మున కీర్తింపబడరు. కీర్తి కొఱకు కాక ధర్మము కొఱకు, సత్యము కొఱకు జీవించినవారి కీర్తి క్రమక్రమముగ వ్యాప్తిచెంది శాశ్వతమై నిలచి, యితరులకు మార్గదర్శకమై, తేజోవంతమై, స్ఫూర్తిదాయకమై, శాశ్వతమై యుండును.

ఆమోద మనగా సర్వసమ్మతి. సర్వానందము. శ్రీమాత పరామోదా. ఆమె సర్వలోకములు వ్యాప్తిచెందిన శాశ్వతమైన పరిమళ ముతో కూడిన కీర్తి కలది. ఆమె నాశ్రయించి సత్యమును, ధర్మమును

యెరిగి లోకహితార్థమై జీవించువారి జీవితముల నుండి ఆమెయే పరిమళించును. వారి జీవితములకు శాశ్వతత్వము, అమృతత్త్వము కలిగించును. శ్రీమాత ఆరాధకులు ధనమునకు, కీర్తికి లొంగినచో అపకీర్తి పాలగుచుందురు. గొప్పతనమునకై పాకులాడు వారికి దైవముపై భక్తి, శ్రద్ధ సన్నగిల్లుచు నుండును. "గొప్పదనము సుందరివలె ఆకర్షించును. మంచితనము మాతవలె పోషించును." సుందరి యొక్క సౌందర్యము అశాశ్వతము. గుణ సౌందర్యమే సౌందర్యము కాని, రూప సౌందర్యము భ్రమ కలిగించి నశించును. శ్రీమాత ఆరాధకులు శ్రీమాత ఆరాధనము వలన పొందు కీర్తి ప్రతిష్ఠలను ప్రక్కకు నెట్టి ఆరాధన పెంచుకొనుచూ, అమ్మ సాన్నిధ్యమును పొందుచూ లోకహితార్థము జీవింపవలెనే గాని ధనకాముడు, యశోకాముడు కారాదు.



# 941. 'మనోమయీ'

**మ**నస్సున స్థానము గొనునది గనుక మనోమయి శ్రీమాత అని అర్థము.

శుద్ధమగు మనస్సు క్రియాస్వరూపము. క్రియాశక్తి స్థానము అదియే. బుద్ధియందు జ్ఞానమయిగా శ్రీమాత వెలుగొందు చుండును. అచట శ్రీమాత జ్ఞానశక్తి స్వరూపిణి. జీవుల ఆత్మయందు ఇచ్ఛాశక్తి స్వరూపిణిగ యుండును. తన సంకల్పము జీవాత్మల కందించుచూ, వారి బుద్ధియందు జ్ఞానము కలిగించుచూ, వారి యందు మనస్సుచే క్రియలు నిర్వహించుచూ జీవులకు ఆనందము, అనుభూతి, తదనుగుణ మగు పరితృప్తి కలిగించు చైతన్య స్వరూపిణి శ్రీమాత. ఇచ్ఛా జ్ఞాన క్రియలే జీవన సర్వస్వము. దైవేచ్ఛ నెఱిగి, తదనుగుణమైన జ్ఞానము నెరిగి క్రియలను నిర్వర్తించుట ఋషులు చూపిన మార్గము. కనుకనే ప్రార్థనము, అధ్యయనము, యజ్ఞార్థ జీవనము మార్గములుగ బోధింప బడినవి. ఇచ్ఛ యందు శ్రీమాత రుద్ర రూపము. జ్ఞానమందు విష్ణు రూపము. మనస్సు యందు బ్రహ్మ రూపము. ఈ మూడును ఎవరి యందు సమన్వయింపబడి యుండునో అట్టివారి మనస్సు జీవితమును రసోపేతము చేయును. వారికే సృష్టి ప్రయోజనము, జీవన ప్రయోజ నము తెలియును. అట్లు తెలిసి జీవించుటకే సర్వ సాధనలును.

మనస్సు శుద్ధత్వమును వీడినపుడు సృష్టి అంతయూ తికమకగ కనిపించును. జీవితము కష్టనష్టములతో నిండును. భయము, అనుమానము, సందేహము, పొరపాట్లు యిత్యాది వన్నియూ కలుషిత మనస్సు యందు చేరును. సమన్వయము తగ్గి విమర్శ పెరుగును. విమర్శ, విచికిత్స, వాగ్వివాదములు, తనకు తోచినదే సత్యమని భావించుట యిత్యాది కలుషితము లన్నియూ మనోమాలిన్యములు. దర్శనము కరువై దృక్పథముల నేర్పరచుకొని తమ దృక్పథము ననుసరించని వారందరును మూర్ఖులు, అజ్ఞానులు అని భావించుచూ, తాము తెలిసినవారమని భావించుచూ, కష్టనష్టములు పొందుచూ, రోషావేశములు ప్రదర్శించుచూ, దుఃఖించుచూ జీవించు వారందరూ మనస్సున శుద్ధత్వము లేనివారు.

దైవ ప్రార్థనమునందు రుచి కలిగి దివ్య విషయములను తెలుసుకొనుట యందు ఆరాటము పెరిగినవారికి క్రమముగ మరల మనస్సు నిర్మల మగును. గొప్పదనము కొరకు పూజాదికములు గావించువారు శ్రద్ధ లేక, విధానము లేక, అడ్డదిడ్డముగ పూజలు చేయువారు నిర్మలులు కాలేరు. మనోమాలిన్యములు కలిగినవారి మనస్సుల యందు మాత దర్శనము ప్రప్రథమముగ జరుగును. అది స్ఫూర్తిదాయకమై యుండును. దర్శనము కలిగినదని గొప్పకు చెప్పుకొనినచో మరల మాలిన్య మావహించును.

దైవ మిచ్చిన మనస్సును, యింద్రియములను, శరీరమును నిర్మలముగ నుంచుకొను బాధ్యత మానవునిదే. మలినములే జ్యేష్ఠా దేవి యని, దరిద్ర పెద్దమ్మని ఋషులు తెలిపిరి. శ్రమించి పరిశ్రమించి నిత్యము మలినములను నిర్మూలించుకొనవలెను. ఆ బాధ్యత మానవునిదే. చక్కని అద్దమును బహూకరించినపుడు అందు మన ప్రతిబింబము సరిగా గోచరింపవలెనన్నచో ప్రతినిత్యము పరిశుభ్రము చేసుకొనుచు నుండవలెను. మరకలు పడిన అద్దము ప్రతిబింబమును సరిగా చూపదు. పూర్వకాలమున శిష్యులకు సద్గురువులు అనుష్ఠానమునకై రాగిచెంబుల నిచ్చెడివారు. వాతావరణ ప్రభావమున రాగి లోహము మెరుపును కోల్పోవుచుండును. నిత్యము దానిని శుభ్రపరచిననే వినియోగ విలువ అందును. చెంబు మెఱపును బట్టి శిష్యుని శ్రద్ధను సద్గురువులు గమనించు చుండెడివారు. శ్రద్ధ లేనివారికి జ్ఞాన మందించిననూ వృథా యగును గనుక వారికి బోధించెడివారు కారు.

దేవుడిచ్చిన మనస్సును, యింద్రియములను, శరీరమును శ్రద్ధగ పోషించు విషయమున అప్రమత్తత కలిగిన వారికి మనస్సునందే పరి పూర్ణమగు దర్శనము కాగలదు. మనస్సు ఇహపర వైభవమును కలిగింప గల ఏకైక సాధనము. ఇది తెలియనివారు మనస్సు చంపుకొనుట, దేహమును శుష్కింపచేయుట యిత్యాది పాశవికమగు మార్గముల ననుసరించుచు నిష్ఠాపరులమని భ్రమయందు జీవితమును కోల్పోవు చుందురు. యిట్టివారు శ్రీమాత సమగ్రత్వమును తెలియలేరు, పొంద లేరు.

*"క్షుత్పిపాసామలాం జ్యేష్ఠా మలక్ష్మీర్నాశయా మ్యహమ్ ।"*

అకాలపు ఆకలిదప్పికలను నేను నిర్మూలించుకొందును. అసమృద్ధి, అనుభూతి లేమి, నీవు తొలగించుము అను ప్రార్థన శ్రీ సూక్తమున ఈయబడినది.

పరిశుద్ధ జీవనము, మర్మములేని మనస్సు గలవారు మనోమయ దర్శనమును పొందగలరు.



# 942. 'వ్యోమకేశీ'

**ఆ**కాశమే కేశములుగా గలది శ్రీమాత అని అర్థము.

విరాట్ రూపిణియైన శ్రీమాత శిరస్సుపైగల కురు లనంతము. అవి ఆకాశమువలె వ్యాప్తిచెంది యుండును. ఆకాశమనగా అంతులేని వెలుగు. అది శ్రీమాత నిజస్థానము. అటునుండి తన్నుతానే తత్త్వము లను సృష్టించుకొని విరాట్ రూపిణియై వెలుగొందును. ఆమె పరాకాశ, మహదాకాశ, ఆకాశలుగా ముందు నామములలో వివరింప బడినది. ఆకాశముపై చోటు ఎంతవున్నదో ఎవరికిని తెలియదు. అట్లు అంతు పట్టని తత్త్వము సృష్టికొఱకై రూపమును దాల్చును. అంతులేని చోటు అండముగా ఏర్పడుట, అండమునుండి అగ్ని, వాయువు, వరుణుడు, సూర్యుడు- యిత్యాది సృష్టి ప్రజ్ఞ లేర్పడుట జరుగును. ఆ ప్రజ్ఞ లన్నియూ ఒక మూర్తిగా యేర్పడినపుడు ఆ మూర్తిని విరాట్ రూప మందురు. విరాట్ రూప మేర్పడుటకు ముందున్న అండమును విరాడ్ అందురు. అనంతాకాశము నుండి అండము, అండము నుండి రూపము యేర్పడగా రూపమునకు ఊర్ధ్వభాగమైన ఆకాశము కేశములుగ ఋషులు వర్ణించిరి. యిట్లు ఆకాశముగా వ్యాపించిన కేశములు గలదిగ శ్రీమాతను అభివర్ణించిరి. శ్రీమాతను వ్యోమకేశి అనియు, శివుని వ్యోమకేశుడనియు ఋషులు వర్ణించుచూ, ఆరాధింతురు. ఆకాశమే కేశములుగా గలవారు వ్యోమకేశులు.

మానవులు కూడా తమ శిరస్సుపై గల కేశములను అనంత తత్త్వమునకు అనుసంధానము చేయగల మార్గములుగ దర్శించవలెను. శిరో కేశములయందు శ్రద్ధ వహించి సంస్కరించుకొనుచుండవలెను. కేశములు శుభ్రముగను, మలినములు చేరకుండగను జాగరూకత వహించి యుండవలెను. శిరస్సు పైభాగము దైవము స్పృశించు భాగ మని జ్ఞప్తి కలిగి, తదనుగుణమైన శ్రద్ధ వహించి సంస్కరించుకొనుచుండ వలెను. పిచ్చుక గూడులవలె శిరోజములను తయారు చేసుకొనరాదు. మలినము లెట్టి పరిస్థితిలోను చేరరాదు. నిత్యమూ తలస్నానము చేయుట, తైలముతో పోషించుట, వారమున కొకమారు కుంకుడు, సీకాయ పొడి వంటి సహజమగు పదార్థములతో శుభ్రపరచుట వంటి ఆచార ములు పై జ్ఞానము నుండియే పుట్టినవి.

మానవుని శరీరము విరాట్ రూపునకు ప్రతీకయై యుండుటచే మానవుని కేశములను వ్యోమకేశములుగ భావింపవలెను.



# 943. 'విమానస్థా'

**వి**మానముల యందు సంచరించునది శ్రీమాత అని అర్థము.

విమానమను పదమునకు బహుళార్థములు కలవు. శ్రీమాత వానియందు వుండుట, విహరించుట చేయును.

1. ఆకాశమున సంచరించునవి విమానములు. వానియందు దేవతా రూపములతో శ్రీమాత విహరించుచూ సృష్టి పర్యవేక్షణ చేయుచు వుండును.

2. విమాన మనగా విశేషముగ భక్తుల మానములను కాపాడునది అని మరియొక అర్థము. అట్టి ప్రయత్నములో శ్రీమాత నిమగ్నమై యుండును. కనుక ఆమెను 'విమానస్థా' అని పొగడుదురు.

3. 'వి' అనగా అధికము, విశేషము. 'మ' అనగా కాంతి. 'అన' అనగా రథము. 'స్థ' అనగా వుండునది. అధికమగు కాంతియే రథముగా (దేహముగ) వుండుట వలన శ్రీమాత 'విమానస్థ' అని పిలువబడు చున్నది. కాంతి శ్రీమాత దేహమే. అది ఆమె వ్యక్తరూపము.

4. 'వి' విగతమైన మానము, పరిమాణము గలది అని మరియొక అర్థము. అనగా పరిమాణము లేనిది, అనంతమైనది అని అర్థము. శ్రీమాత బ్రహ్మమే గనుక ఆమె అనంతము. ఎంత యున్నది అన్నది ఎవరునూ కొలతలు వేయలేరు.

5. 'వి' విగతమైన పరిణామము గలది. అనగా మార్పు చెంద నిది, మార్పు అవసరము లేనిది, పరిపూర్ణమైనది అని మరియొక

అర్థము. జీవులు అపరిపూర్ణులు గనుక వారు పరిణామము చెంద వలసిన ఆవశ్యకత యున్నది. బాగుపడవలెనని, బాగుండవలెనని నిత్య ప్రయత్నమున యుండువారు జీవులు. అట్టి అవసరము లేనిది శ్రీమాత.

6. 'విమాన' మనగా వేదమని కూడ అర్థము కలదు. వేదము నందున్నది శ్రీమాతయే. తెలియవలసినది వేదము. అందులకే విద్య. జీవులు తెలియవలసినది శ్రీమాతనే. ఆమెను తెలుపుటకే వేద మేర్పడినది.

7. విశిష్టమైన ప్రమాణము అని కూడ మరియొక అర్థము. వేదములే ప్రమాణమని ఋషుల నిశ్చయము. వేదమునకు ప్రమాణము శ్రీమాత. ఆమె వేదములందు ప్రతిపాదింపబడుట వలన వేదములకు ప్రమాణ మేర్పడినది. కనుక ప్రమాణము లన్నింటికినీ ప్రమాణము శ్రీమాత.

8. విశిష్టమగు ప్రమాణములు గల శాస్త్రములందు సారముగా నుండునది శ్రీమాత. 'శాస్త్ర సారా' అని శ్రీమాత వర్ణింపబడినది.



# 944. 'వజ్రిణీ'

**వ**జ్రరూపము గలది శ్రీమాత అని అర్థము.

కారణ లోకమంతయూ వజ్రకాంతిలో నిండియుండును. ఆ లోకమున గలవా రందరునూ వజ్రము వంటి కాంతి శరీరములతో నుందురు. ఇట్టివారు కాంతివంతమగు శరీరములతో యుగముల తరబడి ఆ దేహమున అమరులై నిలిచియుందురు. లోక శ్రేయస్సునకై యజ్ఞార్థము జీవించు మహర్షులట్టివారు. వీరిని వజ్రాంగ దేహులందురు. వారి బలము, తేజస్సు అమితములై, అభేద్యములై యుండును. హను మంతుడు, గణపతి యిట్టి వజ్రాంగ దేహము గలవారు. హనుమంతునికి 'వజ్రాంగ బలి' అను నామ మున్నది. ఈ నామమే రూపాంతరము చెంది బజరంగ బలి యైనది. ఇట్టి వజ్ర శరీరములు ఉత్తమోత్తమ జీవు లకు ప్రసాదించునది శ్రీమాతయే. ఇట్టివారు అందరునూ బ్రహ్మమును పొందినవారే. అనగా బ్రహ్మజ్ఞానులు. శ్రీమాత బ్రహ్మ స్వరూపిణి గనుక ఆమె వజ్రిణి, వజ్రేశ్వరి అని కొనియాడ బడుచున్నది.

యోగీశ్వరు లందరునూ రక్తమాంస దేహముల నుండి బంగారు కాంతితో కూడిన సూక్ష్మ శరీరమును, అందుండి వజ్రకాంతితో కూడిన కారణ శరీరమును అమ్మ అనుగ్రహమున నిర్మాణము గావించుకొందురు. అట్టి వారిని నిర్మాణకాయు లందురు. పాల నుండి వెన్న, నెయ్యి తయారు చేసుకొన్నప్పుడు స్థూల దేహము నుండి సూక్ష్మ కారణ దేహమును

నిర్మాణము చేసుకొని మూడులోకముల యందు లోకశ్రేయస్సునకై వారు జీవింతురు. అమ్మ కనుసన్నలలో మెలగుచు సృష్టి కార్యములను చక్కబెడుదురు.

వజ్రిణీ దేవినే ఇంద్రాణిగా ఆరాధించు సంప్రదాయ మున్నది. ఇంద్రుడు వజ్రధారి కనుక వజ్ర అను నామమును పొందినాడు. అతని భార్యను ఇంద్రాణి అందురు. శచీదేవియే ఇంద్రాణి. శచీదేవి శ్రీమాత దివ్య రూపములలో యొక రూపము. ఇంద్రాణిని జగన్మాతగా ఆరాధించు సంప్రదాయము కూడ కలదు. ఈ సంప్రదాయము మిక్కుట ముగ ఉత్తర హిమాలయ ప్రాంతములలో యున్నది. ఇంద్రాణీ దేవి సంపత్కరీ యను తెల్లని ఐశ్వర్యకారకమగు యేనుగుల సమూహముతో యుండును. వజ్రిణీ ఆరాధనము సర్వ శుభంకరము.



# 945. 'వామకేశ్వరీ'

**వా**మకమగు ఎడమ భాగమునకు ఈశ్వరి శ్రీమాత యని యర్థము.

వామకేశి, వామదేవి, వామనయన, వామకేశ్వరి అను నామములు శ్రీమాత ప్రకృతి, శక్తులను ఉద్దేశించును. ప్రజ్ఞగ ఆమె దక్షిణేశ్వరి. ఆమె దక్షిణ రూపమగు ప్రజ్ఞను ఆరాధించు విధాన మొకటి యుండగా ఆమెను ప్రకృతిగా దర్శించి, ప్రకృతి శక్తులను ఆరాధించు విధానము కూడ యున్నది. నిజమునకు వామ, దక్షిణములు ఆమెయే. వామ భాగము ప్రకృతిగను, దక్షిణ భాగమును పురుషునిగను ఋషులు దర్శించి ఆరాధించిరి. దేవి ప్రజ్ఞారూప మంతయూ దక్షిణము. ప్రకృతి రూప మంతయు వామనము. ఆమె దక్షిణగా దక్షిణారాధ్య. దక్షిణామూర్తి రూపిణి గూడను. దాక్షాయణిగా కూడా వర్ణింపబడినది. ఇవి అన్నియూ ఆమె దివ్యప్రజ్ఞను సంకేతించును. అట్లే పై తెలిపిన వామపరమగు నామములన్నియూ ప్రకృతి, ప్రకృతి శక్తులను వర్ణించును. ప్రకృతి శక్తుల నారాధించు వారందరునూ వామాచార్యులు, వామాచారులని లోక ప్రతీతి. శక్తులను నమ్మినవారు కొందరు, ప్రజ్ఞలను నమ్మినవారు కొందరు. కుడి ఎడమలలో ఒక దానిని ప్రధానముగ భావించి రెండవ దానిని అశ్రద్ధ చేయుట తగని మార్గము. పరమును కోరి ఇహమును వర్జించుట, ఇహమును కోరి పరమును వర్జించుట తెలివి కాదు. ఏ కన్ను పొడుచుకొన్ననూ చూపు సమగ్రము కాదు. ప్రకృతి పురుషుల

ఇరువురి ఏకత్వమును ఆరాధించుట సముచితము. యోగులే యిట్టి సమదర్శనమును చేయుదురు. ప్రజ్ఞను, ప్రకృతిని వారు సమానముగ ఆదరించుట, ఆరాధించుట చేయుదురు.

ప్రకృతి లేని ప్రజ్ఞకు వైభవమే లేదు. గృహిణి లేని గృహము వలె కళా విహీనమై, బలహీనమై యుండును. ప్రకృతి, ప్రజ్ఞలు రెండునూ ఒకే తత్త్వము నుండి ఏక కాలమున ఉద్భవించును. రాధ లేని మాధవుని వలె, సరస్వతి లేక బ్రహ్మవలె, శివాని లేని శివునివలె అసమగ్రమై యుండును. ఆత్మ ఎంత ప్రధానమో బుద్ధి, మనస్సులు కూడ అంతే ప్రధానము. పాత్ర లేక పాలెట్లు వినియోగపడవో, ఉపాధి లేక సృష్టి లేదు. మిత్రావరుణులు యిరువురునూ సృష్టియందలి కుడి యెడమ రెక్కలు. అట్లే దక్షిణేశ్వరి వామకేశ్వరియును.



# 946. 'పంచయజ్ఞప్రియా'

**పం**చ యజ్ఞములు ప్రియముగా గలది శ్రీమాత అని అర్థము.

దేవ యజ్ఞము, పితృ యజ్ఞము, బ్రహ్మ యజ్ఞము, మనుష్య యజ్ఞము, భూత యజ్ఞము అనునవి పంచయజ్ఞములు.

దేవ యజ్ఞమనగా దేవతా ప్రజ్ఞల ఆరాధనము. దైవము యొక్క వివిధ ప్రజ్ఞలను దేవతలు అని పిలుతురు. వారిని ఆరాధించుట వలన ఆ ప్రజ్ఞలు మనలో మేల్కొంచి, మనలను కృతకృత్యులను చేయును. తదనుగుణమగు కార్యములందు నిమగ్నము చేయును. దేవతలు సృష్టి యజ్ఞము చేయుచున్నారు. దేవతారాధనము త్రికరణశుద్ధితో చేసినచో యజ్ఞార్థ జీవనమునకు ఇచ్ఛ కలుగును. తదనుగుణమగు జ్ఞానము క్రియ యేర్పడును. అపుడు మానవులు కూడ దేవతలవలె ప్రకాశించుచు నిష్కామముగ, నిష్కారణముగ సృష్టి యజ్ఞమున పాల్గొందురు. నిష్కామము యగు కార్యములను నిర్వర్తించుచూ జీవించుటయే మోక్షము.

దేవతలలో పితృదేవతలు ఒక వర్గము. జీవులకు దేహములను నిర్మించువారు పితృదేవతలు. పితృదేవతల ఆరాధనము వలన తుష్టి, పుష్టిగల దేహములు కలుగును. అంగ సౌష్ఠవము కలుగుట, అంగ వైకల్యము లేకుండుట పితృదేవతల ఆరాధనమున జరుగును. తల్లి దండ్రుల రూపమున, పూర్వీకుల రూపమున పితృదేవతల నారాధించుట

వేద సంప్రదాయము. వీరి ఆరాధనమున తుష్టి పుష్టి అంగ సౌష్ఠవము గల దేహము లేర్పడుటయే గాక పరంపరాగతముగ ప్రజాసృష్టి యజ్ఞము జరుగును. జీవులకు దేహ మేర్పరచుట ఒక యజ్ఞము. దేహము పొందిన మానవుడు పితృదేవతల యందు కృతజ్ఞతా భావము కలిగి, వివాహ మాడి దాంపత్య జీవితమున సత్సంతానమును కనుట ఒక యజ్ఞము. ఈ యజ్ఞము వలన పితృదేవతల ఋణము తీరును. దేహము పొందినవారు దేహములు జీవుల కేర్పరచవలెను. ఇది సృష్టి ధర్మము.

బ్రహ్మ యజ్ఞమనగా బ్రహ్మమును ఉపాసన చేయుచు దైవానుగ్రహముగ బ్రహ్మమును పొంది, బ్రహ్మము నుపాసించు మార్గమును యితరులకు బోధించుట. ఇట్టి యజ్ఞము వలన జీవులు బ్రహ్మమై నిలచును. బ్రహ్మమే సృష్టికిని, తనకును మూలము. ఆత్మకు మూలము బ్రహ్మమే. బ్రహ్మమే సర్వము నందున్నది. బ్రహ్మమును నిరాకరించు వాడు బ్రహ్మహత్య, ఆత్మహత్య గావించిన వాడగును. బ్రహ్మము నుపాసించుచు సర్వమును బ్రహ్మముగా దర్శించుచూ, సేవించుచు, బోధించుచు నుండుట బ్రహ్మయజ్ఞ మగును. ఈ యజ్ఞము శ్రీమాతకు చాల ప్రీతికరము.

నాలుగవ యజ్ఞము మనుష్య యజ్ఞము. తోటి మానవులు తన వంటి వారే గనుక వారికి సుఖ సౌఖ్యములు కలిగించు ప్రయత్నముగ జీవితము సాగించుట మనుష్య యజ్ఞమగును. శిక్షణ నిచ్చుట, సమర్థ వంతులను చేయుట, మిత్రత్వము చూపుట, హితము చేకూర్చుట,

ఇతరుల ఆనందమును చూచి ఆనందపడుట, శిక్షించకుండుట, ద్వేషించ కుండుట, అసూయ పడకుండుట యిత్యాది వన్నియూ మనుష్య యజ్ఞ సంబంధిత ప్రవర్తనమై యున్నది. ఇట్లు ఒకరి నొకరు మన్నించుకొనుట వలన శ్రీమాత ప్రీతి చెందును.

అట్లే భూతములయందు కూడ ప్రేమ కలిగి ఆదరించి పోషించుట భూత యజ్ఞమగును. జంతువులు, పక్షులు, క్రిమి కీటకములు, వృక్షములు యిత్యాది వన్నియునూ కూడ బ్రహ్మమే గనుక ఆయా వర్గ జీవులను మిత్రభావముతో పోషించుట వలన శ్రీమాత ప్రీతి చెందును.

ఇట్లు పంచ యజ్ఞములను నిర్వర్తించుకొనుచూ నిత్యజీవన యాత్ర గావించు మానవులయందు శ్రీమాత అమితముగ ప్రీతి చెందును. శ్రీమాత కూడ ఈ యజ్ఞమును నిర్వర్తించుచూ సృష్టి యజ్ఞము చేయు చున్నది. సృష్టి నిర్వహణమునకు మూలము ఈ పంచ యజ్ఞములే. వీనిని నిర్వర్తించు మానవులు శ్రీమాతకు అందివచ్చిన సంతాన మగుదురు. సనక సనందనాదులు, ఋషులు, యోగులు, మునీశ్వరులు, భక్తులు అట్టివారు.



# 947. 'పంచప్రేతమంచాధిశాయినీ'

**నా**లుగు కోళ్ళు, శయ్య గల మంచమునందు శయనించునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు, సదాశివుడు పంచప్రేతములు. ఇందు మొదటి నలుగురూ సృష్టియను మంచమునకు నాలుగు కోళ్ళవంటి వారు– నాలుగు కోళ్ళపై అమర్చిన శయ్యవంటివాడు సదాశివుడు. దానిపై శయనించునది శ్రీమాత.

నాలుగు కోళ్ళులేనిచో మంచము నిలువదు. శయ్యలేనిచో కూర్చుండుటకు కాని, పరుండుటకు గాని వీలుపడదు. ఇట్లు ఐదు అంశములతో నుండునది మంచము. మంచ అనగా మంచము. శ్రీమాత మంచము ఐదు ప్రేతములు. ఐదు అంశములుగ శ్రీమాత మంచ మున్నది. బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఈశ్వరుడు ప్రేతము లెట్లగుదురు? శ్రీమాత శక్తియే ఆ నలుగురి నుండి వ్యక్తమగు చుండును. శ్రీమాత లేనిచో వారు లేరు. శక్తి విహీనమగు రూపములనే ప్రేతము లందురు. అందువలన నాలుగు కోళ్ళుగ నున్న త్రిమూర్తులు, ఈశ్వరుడు ప్రేతములని సంబోధింపబడిరి.

సదాశివుడు నిశ్చలుడు, నిరాకారుడు, నిర్గుణుడు. భూతప్రేత నివాసియై యుండుటచే అతనిని కూడ ప్రేతముగ కీర్తించిరి. ఈ ఐదుగురితో కూడిన మంచమే సృష్టి. దానియందు శ్రీమాత

శయనించును కనుక 'పంచప్రేతమంచాధిశాయినీ' అని కీర్తింతురు. దానియందు కూర్చుండినపుడు పంచప్రేత ఆసన, శయన అని కీర్తించుట 249వ నామమున జరిగినది. సూర్య చంద్రాత్మక ప్రజ్ఞలు, త్రిగుణములు శ్రీమాత ఆధారముగనే సృష్టి నిర్వహణము గావించుచున్నవి. ఈ ఐదింటినీ కూడ పంచప్రేతముల మంచ అందురు. అట్లే సూర్య చంద్రాత్మక తత్త్వము, త్రిమూర్తులు మరియొక పంచ మంచ. తరువాతి నామమున పంచమి విశేషములు మరికొన్ని తెలుపబడును.



# 948. 'పంచమీ'

ఐదుగను, ఐదవదిగను నుండునది శ్రీమాత అని అర్థము.

వేదవ్యాస మహర్షి సృష్టి మొత్తమును ఐదుగ దర్శించి, రచించి యిచ్చెను. *"పాంక్తంవా ఇదగ్ం సర్వం"* అను శ్లోకము ఉపనిత్తు లందున్నది. ఈ సృష్టి అంతయూ ఐదుగ యేర్పడినది. ఐదు నుండి మొత్తము సృష్టి వ్యాపించినది. సృష్టి కార్యమంతయూ ఐదవ ఎక్కమే. ఐదు విశేషము లెన్నియో గలవు.

అమ్మ మూడు గుణములతో చతుర్వ్యూహము లేర్పరచును. మూడు, నాలుగు కూడినచో యేడగును. అట్లు ఏడు ఏడుగ లోకము లేర్పడినవి. ఏడు ఏడు జాతులు, యేడు వారములు, ఇట్లేడు ననుసరించి సృష్టిని వివరించు విధానమున్నది.

మూడుగ సృష్టిని వివరించు విధానమున్నది. సృష్టి మొత్తము ప్రజ్ఞ, శక్తి, పదార్థముగ వివరించు విధాన మున్నది. నాలుగుగ వివరించు విధానమున్నది. ఇచ్చుట ఐదుగ సృష్టిని దర్శించు విధానము కీర్తింపబడుచున్నది. ఉదాహరణకు సృష్టి నీ విధముగ తెలుపవచ్చును. 1. సంకల్పము 2. కాలము 3. ప్రకృతి 4. తత్త్వము 5. తత్త్వముతో మూడును కలిసి మహత్తుగ ఐదవది యేర్పడినది. తత్త్వము నందు ఐదంశము లున్నవి. సూర్యాత్మక ప్రజ్ఞ, చంద్రాత్మక ప్రజ్ఞ, త్రిగుణములు (త్రిమూర్తులు). తామస గుణము నుండి పంచభూతములు పుట్టినవి.

రాజసగుణము నుండి పంచకర్మేంద్రియములు, పంచజ్ఞానేంద్రియములు పుట్టినవి. సాత్త్విక గుణము నుండి ఐదు యింద్రియ ప్రజ్ఞలు పుట్టినవి. ఇట్లు గుణముల నుండి కూడ ఐదు ఐదు అంశములు పుట్టుకొచ్చినవి. హస్తములకు, పాదములకు ఐదు వ్రేళ్ళు వుండుటకు కూడ ఈ తత్త్వమే కారణము. శ్రీమాతకు ఐదు అంకె ప్రీతికరము అని ఋషులు దర్శించిరి.

జ్యోతిషమున ఐదవరాశి ఐదవ భావమును సూచించును. ఐదవ భావము తండ్రి కుమారునికి జన్మించుట తెలుపును. ఐదవ భావమును పరిశీలించి సంతానప్రాప్తిని తెలియుట జ్యోతిష్యులు చేయుదురు. ఏ జీవికైననూ తన సంతానమే అత్యంత ప్రీతికరము. అందున తల్లికి సంతానముపై ప్రీతి అమితము. శ్రీమాత పంచమభావ మందు అమితమగు ప్రీతి గలది కనుక, 'పంచమీ' అని కీర్తింతురు. సంఖ్యా శాస్త్రము మొత్తము తొమ్మిదంకెలతో కూడియున్నది. ఒకటి నుండి తొమ్మిది అంకెలు. అంతకు మించి అంకెలు లేవు. వాని నుండి యేర్పడినవి సంఖ్యలు. అంకెలలో మధ్యమ స్థానమున యుండునది ఐదు. ఐదు సర్వమునూ సమన్వయించును. సృష్టి మొత్తమును సమన్వ యించునది శ్రీమాతయే గనుక ఆమెను పంచమిగ గుర్తింతురు.

ఏడు ప్రజ్ఞలు, ద్వాదశ భావములు యేర్పఱచి సృష్టి నిర్వహణము చేయునది శ్రీమాత. సూర్యుని యందలి యేడు కిరణములే యేడు ప్రజ్ఞలు. సూర్యుడు సంచరించు రాశులు పన్నెండు. ఏడు పన్నెండుతో నిర్మించబడు రసాయనిక ద్రవ్యమే సృష్టి (12-7=5). ఈ రహస్యము

తెలిసినవారికి సృష్టి రహస్యము తెలియును. ఇటీవలి కాలమున ఈ రహస్యము తెలిసిన మహర్షి గ్రీకు దేశస్థుడైన పైథాగరస్. ఆ మహనీయుడు భరత ఋషియే యని దివ్యజ్ఞాన వ్యవస్థాపకురాలైన మేడమ్ హెలీనా పెట్రోవా బ్లావెట్స్కీ సూచించినది. ఆధునిక యుగమున గణిత శాస్త్రము నకు ఈ మహర్షియే పితామహుడు.

1. పంచామృతములు, 2. మాతృ పంచకము, 3. పంచాంగము, 4. పంచ గంగ, 5. పంచ మహాపాపములు, 6. పంచారామములు, 7. పంచ ఘృతములు, 8. పంచ సూతకములు, 9. పంచ సూక్తులు, 10. పంచ శుద్ధులు, 11. పంచ వారసులు, 12. పంచ భక్తులు, 13. పంచ స్వరములు, 14. పంచ ధాతువులు, 15. పంచ ధర్మములు, 16. పంచ దేవతలు, 17. పంచ తిథులు, 18. పంచ గవ్యములు, 19. పంచ కావ్యములు, 20. పంచ కషాయములు, 21. పంచక రహితములు, 22. పంచ ఋషులు, 23. పంచ కన్యలు, 24. పంచ పాండవులు. ఇట్లు పంచమీ ప్రీత అయిన శ్రీమాత అసంఖ్యాకమగు పంచకములను సృష్టియం దేర్పరచినది. పంచమీ తిథియందు స్థిరపడి యున్నది. పంచమి, దశమి, పౌర్ణమి, అమావాస్య ఆమెకు ప్రీతి కలిగించు తిథులు.



# 949. 'పంచభూతేశీ'

**పం**చభూతములకు ఈశ్వరి శ్రీమాత అని అర్థము. ముందు నామములో వివరింపబడినది.

# 950. 'పంచసంఖ్యోపచారిణీ'

**యా**బది నామములొక గుత్తిగా ఇరువది మార్లు శ్రీమాత కీర్తింపబడుచున్నది.

ఐదు అంకె కాగా యాభై సంఖ్య అగుచున్నది. పంచ సంఖ్య అనగా 50. ఇది అర్ధశతక మగుటచే ప్రసిద్ధి పొందినది. అందు పంచ దశకము లుండుట వలన అమ్మకు ప్రీతిపాత్రమైనది. ఐదుచే గుణింప బడిన యే సంఖ్య యైననూ అమ్మకు ప్రీతికరమే. దశమి (10), పంచదశి (15), పంచ వింశతి (25), పంచ దశకములు (5×10). ఇట్లు 5 అంకెతో కూడిన ఉపచారము లన్నియూ శ్రీమాతకు ప్రీతికరములు. ఐదు రేకులు గల పుష్పములతో పూజించినచో శ్రీమాత అమితముగా ప్రీతి చెందును. మందారము, పారిజాతము యిత్యాది పుష్పములన్న శ్రీమాతకు ప్రీతి.

# 951. 'శాశ్వతీ'

నిత్యురాలు శ్రీమాత అని అర్థము.

సృష్టి యందు, సృష్టికి పూర్వము వుండునది శ్రీమాత. పరముగ నున్న శ్రీమాత తన నుండి తాను యేర్పఱచుకొనుచు పదార్థము వరకు యేర్పడును. తన నుండి యేర్పడిన వాటికి కాలము రూపమున అంత మొనర్చుచుండును. తాను కాలమునకు కూడ అతీతమైన తత్త్వముగ నిలచియుండును. అన్నిటికీ మూల మామెయే. ఆమె అనాదిగ నున్నది. అనంతమై యున్నది. ఆమెకు ఆమెయే స్వామి. ఇతరులకు కూడ ఆమెయే స్వామిత్వము వహించును. ఆమె శాశ్వత. శాశ్వత కన్యక కూడను. పరమేశ్వరి కూడ ఆమెయే. కనుక కన్యకాపరమేశ్వరిగ ఆరాధింపబడు చుండును. పరమేశ్వరి కన్యకయే. ఆమెకు నాథుడు లేడు. ఆమె అనాథ నాథ. సర్వజ్ఞ. సర్వమూ తానై యుండెడిది.

జీవులందరూ కూడ శాశ్వతత్త్వమునకే పరితపింతురు. మార్పులతో కూడిన సృష్టిలో మార్పు చెందక యుండవలెనన్నచో ఎప్పటికీ ఎన్నడునూ మార్పు చెందని శాశ్వతీ తత్త్వము నాశ్రయించవలెను. బ్రహ్మమే శాశ్వతము. అదియే పరము. అదియే సత్యము. *"ఓం సత్యం పరం ధీమహి"* అను గాయత్రీ ఛందస్సుతో కూడిన మంత్రము నాశ్రయించినచో శాశ్వతత్త్వము కలుగును. అమ్మ అనుగ్రహముగ కలుగునని అర్థము.

# 952. 'శాశ్వతైశ్వర్యా'

శ్రీమాత ఐశ్వర్యము కూడ శాశ్వతమే అని అర్థము.

శ్రీమాత శాశ్వతముగాన ఆమె ఐశ్వర్యము కూడ శాశ్వతమే. ఆమె వెలుగే ఆమె ఐశ్వర్యము. ఆ వెలుగునుండియే అన్ని ఐశ్వర్యములు పుట్టినవి. ఈశ్వరుడు కూడ ఆమె వాడే. తన నుండి బ్రహ్మ విష్ణు మహేంద్రాది నాలుగు మంచపుకోళ్ళ నేర్పరచి సదాశివుని శయ్యగా యేర్పఱచుకొని ఆ శయ్యపై శయనించునది శ్రీమాత. సదాశివుడే ఈశ్వరుడు. అతనితో కూడియుండుటయే ఐశ్వర్యము. సదాశివుని కూడి సృష్టి అంతటా శివశక్తులూ వ్యాప్తిచెంది అనుభవించు చుండును. అట్టి అనుభూతియే ఐశ్వర్యానుభూతి.

'అ' అను అక్షరము బ్రహ్మమును తెలుపును. 'ఇ' అను అక్షరము బ్రహ్మ సంకల్పమును తెలుపును. బ్రహ్మము సంకల్పమున ప్రవేశించి నపుడు 'ఏ' అను శబ్దముగ మారును. బ్రహ్మ సంకల్పమున బ్రహ్మము మరల ప్రవేశించినచో 'అ' మరొకసారి 'ఎ'ని చేరినట్లగును. అపుడు బ్రహ్మము 'ఐ' అను శబ్దముగ మారును. తానే తన సంకల్పముగ మారి సృష్టి నిర్మాణము గావించి, ఆ సృష్టి యందు తానే ప్రవేశించి అనుభవించుట ఐశ్వర్యానుభూతి.

సంపద లేర్పఱచుకొనుట ఒక ఎత్తు. ఏర్పఱచుకొనిన సంపదను అనుభవింప గలుగుట మరియొక ఎత్తు. అనుభవమున కూడ శాశ్వత

ఆనందముండుట యింకొక ఎత్తు. అమ్మ ఐశ్వర్యమట్టి అనుభవము, ఆనందముతో నిండును. ఐశ్వర్యము వలన గర్వము కలుగవచ్చును. భయము, అనుమానము కలుగవచ్చును. ఇతరుల యెడల నీరస భావ మేర్పడవచ్చును. సంపద లందరికినీ ఆనంద మీయదు. ఈశ్వరునితో కూడియున్న వారికే సంపద ఐశ్వర్యముగ మారును. శ్రీమాత శాశ్వతముగ ఈశ్వరునితో కూడియుండును గనుక ఆమె ఐశ్వర్యము శాశ్వతము. శాశ్వత ఆనందకారకము.

దైవము నాశ్రయించి, ధర్మము ననుసరించుచూ జీవితము గడుపువారి వద్ద చేరు సంపదలు ఐశ్వర్యమై నిలచును. ధనార్జనము గావించుకొనుచూ సంపద లేర్పఱచుకొనువారి సంపదలు ఐశ్వర్యము కానేరదు. అట్టి సంపదలు దుఃఖహేతువు లగును.



# 953. 'శర్మదా'

**శ**మము నిచ్చునది శ్రీమాత అని అర్థము.

శమ మనగా అనిర్వచనీయమగు సుఖము. జీవుడు ఏ ప్రయత్న మైననూ సుఖము కొరకే చేయును. మోక్షమనిన శాశ్వతమగు సుఖము. మునులు, ఋషులు, దేవతలు కూడ సుఖముగ నుండవలెననే ప్రయత్నింతురు. క్రిమికీటకాదుల ప్రయత్నము కూడ నదియే. వచ్చిపోవు సుఖములను గమనించి, వదలని సుఖము కొరకై యత్నించు చుందురు.

సుఖప్రాప్తికే అహింస, సత్యము, ధర్మము యిత్యాది నియమము లీయబడినవి. చేయు పనులను బట్టి, మాట్లాడు మాటలను బట్టి మనసున కలుగు భావములబట్టి సుఖ ముండుట, లేకుండుట యుండును.

ధర్మమున నిలచినవారికే సుఖముండును. అధర్మమున సుఖ ముండదు. సుఖము కొరకు సంపదలు, రాజ్యములు, లోకములు కూడ గెలిచినవారు రావణ హిరణ్యకశిపుల వంటి అసురులు అయిననూ సుఖపడలేదు. వనము నందున్ననూ సీతారాములు సుఖపడిరి. సత్యము, ధర్మము ననుసరించు వారికి సుఖమునకు లోటు లేదు. మేడలు, మిద్దెలు, వాహనములు, ఆభరణములు యిత్యాదివి సుఖ మిచ్చునని భావించుట అజ్ఞానము. శ్రీమాతను ఆరాధించుటకు సత్ఫలము సత్యధర్మానుష్ఠాన సంకల్పమే.

# 954. 'శంభుమోహినీ'

**శం**భుని మోహింపచేయునది శ్రీమాత అని అర్థము.

శంభు డనగా ఆనంద స్వరూపుడు. ఆనందస్వరూపుడగు శివునే మోహింపజేయునది శ్రీమాత. మోహమునకు లొంగనివాడు శివుడు. అట్టి శివుని మెప్పించుట కేమి చేయవలెను? అతడు ఆదియోగి. ఆదితపస్వి. కనుక తపస్సు చేసినచో మెచ్చునని భావించి అనితర సాధ్యమగు తపస్సు గావించి, శివుని ప్రేమను సాధించినది శ్రీమాత. మోహము లేని శివుని మోహింప చేసినది. తాను శివుని మోహించి తపస్సు చేసినది. ఆమె తపస్సునకు కరుణించి మోహము చూపినవాడు శివుడు. అపుడు శంభుడు ఆనంద మోహనుడైనాడు. ఆమె ఆనంద మోహిని అయినది. జగన్మోహిని అయినది. శంభుమోహినయై సుఖము నకు, ఆనందమునకు పరాకాష్ఠగ నిలచినది. అజ్ఞానముతో కూడిన మోహము వేరు, శాశ్వతానంద మోహము వేరు.

శ్రీమాత నారాధించువారు ఆమె మోహనాకారమున కాకర్షింప బడి ఆమె ఆనంద సామ్రాజ్యమున ప్రవేశింతురు. అమ్మ ఆరాధనమున మోహ మేర్పడుట శుభంకరము. ఇతర మోహము లపాయకరము. మానవులకు మోహపడు గుణమున్నది. ఆ గుణమును శ్రీమాత ఆరాధన మునకై కైంకర్యము చేయుట చక్కని ఉపాయము.

# 955. 'ధరా'

**పృ**థివీ రూపము గలది శ్రీమాత అని అర్థము. సమస్త జగత్తులను ధరించునదని మరియొక అర్థము.

పృథివి శ్రీమాత రూపమే. భూమిపై గల సమస్త జీవులకు ఆమెయే తల్లి. అనేకమగు వనస్పతులను, ఓషధులను, పుష్ప ఫల వృక్షములను, లతా గుల్మములను ధరించి జీవులను పోషించును. జీవ నదులను వర్షాధారముగ నేర్పఱచుకొని జీవుల దప్పిక తీర్చుటయేగాక భూతలమును సారవంతము చేసుకొనుచు నుండును. సూర్యకిరణము లాధారముగ చేసుకొని ఉపరితలమును సారవంతము చేసుకొనును. పంటలను, ఫలములను, పుష్పములను, ఆకులను యేర్పరచి జీవుల ఆకలి తీర్చును. కొండలు, వనములు, అడవులు కలిగియుండి వాతావరణమును ఆహ్లాదకరముగా తీర్చిదిద్దుకొనును. తన చుట్టూ తాను తిరుగుచూ, సూర్యుని చుట్టూ తిరుగుచూ ఉత్తర దక్షిణాయనముల నేర్పఱచి, ఋతువుల నేర్పరచి జీవులకు వైభవము కలిగించును. చంద్రకిరణముల నాస్వాదించి భూమి ఉపరితలముపై మొలకెత్తుట, పెరుగుట, వృద్ధి చెందుట వంటి ఉత్పత్తి కార్యమును సమకూర్చును. లోపల అనేకానేక లోహములను, మణులను, రత్నములను ఏర్పరచుకొనును. ధరాతత్త్వము సృష్టిలో అమిత సుందరత్వముతో విరాజిల్లుచు నున్నది. దేవతలు సహితము భూమిపై జన్మింపవలెనని కోరుదురు.

అట్టి భూమిని, తమకు భూమిక అయిన తల్లిని నిరాదరణ చేయుట, నిర్లక్ష్యము చేయుట, అశుద్ధము చేయుట, కాలుష్యములతో నింపుట చేయు జీవులే దైత్యులు. వారు భూమికి భార మగుదురు. భూమిని తల్లిగ భావించి, గౌరవించి, తీర్చిదిద్దుకొనుచు పూజించుకొనెడి నాగరికపు జాతి భూమిపై నొకప్పుడుండెడిది. కృషికర్మ యజ్ఞకర్మగా భావించి ఋతువుల ననుసరించి, అనుగుణమగు పంటలను పండించి వారు జీవించెడివారు. ఎక్కువ పండించుకొనవలెనని దురాశతో మానవుడు రసాయనికమగు ఎరువులను తయారుచేసి అన్నమును, ఆహార పదార్థములను విషపూరితము చేసుకొని, దానిని భుజించి, భూమిపై గల జీవజాలమును నశింపచేసుకొను చున్నాడు. తన తెలివితో భూమిని కాలుష్యము చేయుచు నశింపు మార్గమున సాగుచున్నాడు.

భూమి దివ్య ప్రజ్ఞయని, శ్రీమాత అవతారమని స్ఫూర్తి చెందిన వారు ఆమె నారాధించుచూ కాలుష్య నిర్మూలనమునకై కృషి సలిపినచో అదియే భూమిపూజ యగును.

భూమిపై అనేకానేక దివ్యతీర్థము లున్నవి. దివ్యక్షేత్రము లున్నవి. ముఖ్యమైనవి యాబది పీఠములున్నవి (పంచాశత్పీఠ). కనుకనే శ్రీమాతను 'పంచాశత్పీఠరూపిణి' అని కీర్తింతురు. అత్యంత పవిత్రమగు పర్వత శ్రేణు లున్నవి. అందు దివ్యపురుషులు నివసించు విశాలమగు గుహలున్నవి. అవి అన్నియూ మణిమయ కాంతులతో ప్రకాశించుచూ స్వయం ప్రకాశములై యున్నవి. ఎందరో మహర్షులు, బ్రహ్మర్షులు

కూడ భూమియందు రహస్య జీవనములు గడపుచూ సృష్టి శ్రేయస్సునకై తపస్సుల నాచరించు చుందురు. సప్తఋషులు కూడ దేహములు ధరించి భూమిపై సంచరించు చుందురు. దత్తాత్రేయుడు, కపిలుడు, గణపతి, హనుమంతుడు భూమిపై నుండుట కిచ్చగించిన అంతర్యామి రూపులు. బ్రహ్మమానస పుత్రుడైన సనత్కుమారుడు కూడ భూమిపై నున్నాడు. దేవర్షి నారదుడు తరచు తన సంచారమున భూమికి దిగివచ్చి సంచరించు చుండును. మహనీయు లెందరో భూమిని జగన్మాతగ భావించి వసించుచున్నారు. వారందరి కొరకు శ్రీమాత భూమిని ధరించి ఇతర జీవులను భరించును.



# 956. 'ధరసుతా'

**ధ**రకు పుత్రికగా జన్మించునది శ్రీమాత అని అర్థము.

బ్రహ్మాండము నందు భూమి ఆవగింజంత యుండునని ఋషులు పురాణములలో పేర్కొనిరి. కాని ఆవగింజ అందచందములు అమిత ములు. అది ముందు నామములో వివరింపబడినది. మొత్తము సృష్టిని సంకల్పించి పదునాలుగు లోకముల సృష్టినేర్పరచిన శ్రీమాత అన్నిటికన్న చిన్నదైన భూమిపై భూమి పుత్రికగా అవతరించు చుండును. అది ఆమె వాత్సల్య భావము. కారుణ్య భావము. ప్రేమ భావము.

తల్లి కెంత సంతాన మున్ననూ ఆమె మనసెప్పుడునూ చివరి సంతానముపైనే మిక్కుటముగ నుండును. పెద్దవారెట్లునూ పెద్దవారే. వారి సంగతి వారు చూచుకొన గలరు. చిన్నవారి నెవరు చూతురు? అదియునూ గాక చిన్నవారికి కష్టము లెక్కువ. చిన్నవారి కష్టములను తాను స్వయముగ తీర్చుట తల్లి మనసు.

భూభారము తొలగించుటకు శ్రీమాత ఎన్నియో అవతారము లెత్తినది. దైత్య స్వభావము గలవారి నెందరినో లెక్కకు మిక్కుటముగ సంహరించి భూమిని కాపాడినది. సీతగ పుట్టి రావణాది ఘోర రాక్షస సంహారమునకు కారణమైనది. ద్రౌపదిగ పుట్టి ద్వాపర కలి సంధియందు వికటించిన ధర్మమును మరల స్థాపించుటకై ధార్తరాష్ట్రాది దుష్ట రాక్షసు లను సంహరించినది. గోదగ పుట్టి భక్తి భావమును పెంపొందింప

చేసినది. అవసరమును బట్టి భూమిపై తానే దేహము ధరించి భూమి నుద్ధరించు చుండును.

హిమవత్పర్వత రాజునకు కన్యకగ పుట్టి శైలపుత్రికగ భూమిపై శాశ్వతముగ నిలచినది. త్రిశూలధారిణియై, సింహవాహినియై, శార్దూల చర్మధారణము చేసి, కమండలము ధరించి హిమాలయములలో శాశ్వత ముగా స్థితి గొన్నది. భూమికి అభయ మిచ్చుటకై భూమి సుతగ భూమి పైననే యున్నది. 'ధరసుతా' నామము ఆమెకే తగినది.



# 957. 'ధన్యా'

**కృ**తార్థురాలు శ్రీమాత అని అర్థము.

శ్రీమాత సంకల్పసిద్ధి గూర్చి వివరింపవలసిన దేమున్నది. ఆమె సంకల్పింపగనే సిద్ధి సిద్ధముగ నుండును. ఆమెకు కలిగిన సంకల్పము తిరుగులేక నిరాటంకముగ, నిశ్చయముగ నిర్వర్తింపబడి సిద్ధి నిచ్చును. త్రిమూర్తులకైననూ ఆటంకములు కలుగునేమోగాని శ్రీమాత సంకల్పము తిరుగులేనిది. ఆమె కేవలము యిచ్ఛారూపిణియే కాదు, జ్ఞానరూపిణి, క్రియారూపిణి కూడ. సర్వసిద్ధులు ఆమె కను సన్నలలో మెలగుచుండును. ఆమె 'ధన్య' అని చెప్పుటలో విశేష మేమియూ లేదు.

శ్రీమాత నారాధించువారు కృతార్థులగుదురని తెలియవలెను. త్రికరణశుద్ధిగ ఆరాధనము చేయుచున్నచో వారి జీవితమును శ్రీమాతయే మలచును. సంకల్పములను శుద్ధి చేయును. అవాంఛనీయ మగు భావములు తొలగి వాంఛనీయమగు భావములే కలిగించును. వానిని నిర్వర్తించుకొను జ్ఞానమును కూడ స్వయముగ చెప్పుటగాని, సద్గురువుల బోధనల రూపమునగాని, సద్గ్రంథముల రూపమున గాని తెలియజేయును. ఇచ్ఛకు జ్ఞానము జోడించి క్రియకు వలసిన శక్తిని, స్ఫూర్తిని యిచ్చును. అపుడు కార్యములన్నియూ సిద్ధించుచు నుండును. జీవితమున అన్ని రంగముల యందు కృతకృత్యులను చేయును. దేవ

యజ్ఞములు, పితృ యజ్ఞములు, మనుష్య యజ్ఞములు, భూత యజ్ఞములు, బ్రహ్మ యజ్ఞము గావింపజేసి ధన్యులను చేయును. సంఘమున మార్గదర్శకులుగ తీర్చిదిద్దును. తల్లి గనుక గృహ సంపద, వస్తు సంపద, ధన సంపద, దివ్య సంపద యిత్యాది వన్నియూ సమకూర్చి రాజయోగులుగ స్థిరపరచును.

తమ నుండి కార్యములు సిద్ధించుట, పంచయజ్ఞములు నిర్వహింపబడుట గమనించుచున్న ఆరాధకుడు శ్రీమాత ఆరాధనమును అంతకంతకునూ పెంచుకొనుచు, అమ్మ ప్రతిభను, మహిమను చాట వలెనే గాని తనను చాటుకొను మమకారమున గాని, అహంకారమున గాని పడరాదు. ఈ ఒక్క అపాయమును గుర్తెరిగి అమ్మకు వినయ విధేయతలతో, కృతజ్ఞతా భావముతో ఆరాధన యందు యిమడవలెను గాని సంఘ గౌరవములకు, కీర్తికి మోహపడరాదు. అమ్మ సాన్నిధ్యమున కలుగు తుష్టి పుష్టి సాన్నిధ్యము యితరముల యందు లభ్యముకాదు. ఇది సత్యము. ఆరాధకులకు 'ధన్యా' నామము జీవన పరిష్కారము.



# 958. 'ధర్మిణీ'

ధర్మశీలము గలది శ్రీమాత అని అర్థము.

సృష్టి ధర్మసూత్రము నాధారముగ అల్లిక చేయబడినది. ధర్మమును ధరించిన వారిని ధర్మము రక్షించును. సృష్టియందు వసించుటకు ధర్మమే కీలక సూత్రము. ధర్మము ననుసరించనపుడు కర్మము బంధించును. కర్మము ధర్మానుసారమున్నచో సుఖము నిచ్చును. కనుకనే సృష్టి కర్మక్షేత్రమని, ధర్మక్షేత్రమని తెలుపుదురు.

సృష్టియందు అనేకానేక ధర్మము లున్నవి. సామాన్య ధర్మములు, విశేష ధర్మము లున్నవి. లోకమును బట్టి, కాలమును బట్టి, దేశమును బట్టి ధర్మములున్నవి. స్వభావములను బట్టి జీవులకు ధర్మము లున్నవి. జంతువులకు, మనుష్యులకు, దేవతలకు వారి వారి ధర్మము లున్నవి. వీనిని వివరించుటకు శాస్త్రము లున్నవి. ఇతిహాస పురాణములున్నవి. వీనిని తెలియజేయు విద్య యున్నది. ధర్మము నెఱిగి కర్మము నిర్వర్తించుట జరిగినచో సృష్టియందు సుఖము లభించును. ఘర్షణము లేక జీవనము సాగును. తమ పోషణమునకై యితర జీవులను హింసించినచో ధర్మము చెడును. స్వహితమును కోరువారు పరహితమును గూర్చి కూడ ఆలోచన చేయవలెను. తనకేది అహితమో అది యితరులు చేయ కూడదని భావించు మానవుడు తాను యితరుల కట్టి అహితము చేయరాదు. చేసినచో తిప్పలు తప్పవు.

జీవితమున కష్టనష్టములన్నియు ధర్మము వీడుట వలననే యేర్పడినవని తెలుసుకొని ధర్మము నాచరించుట జీవుడు ఆరంభించును. ధర్మము నచ్చకపోవుట కష్టనష్టములకు ముఖద్వారము తెరుచుట వంటిది.

సృష్టి యందలి వివిధ జీవుల ధర్మముల నెఱిగి సమన్వయించు కొని జీవించుట వలన జీవులు వృద్ధి చెందుచు నుందురు. ధర్మ మెప్పటికప్పుడు తెలియుటకు దైవారాధనము తోడ్పడును. దైవారా ధనము వలన ఆత్మప్రబోధము వృద్ధియగును. తప్పు చేయుచున్నప్పుడు లోనుండియే అంతరాత్మ ఘోషించును. తనయందు కలుగు అధర్మ ప్రేరణము నిర్జించును. దైవారాధనము ధర్మమును వృద్ధి చేయుటకే. అధర్మము నాచరించుచూ దైవము నారాధించుట జరిగినచో పతనము తప్పదు. అధర్మమును శిక్షింపబడుట ధర్మము. రక్షింపబడుట సృష్టి యందున్న ధర్మము. శ్రీమాతయే ధర్మరూపమున సృష్టియం దున్నది.



# 959. 'ధర్మవర్ధినీ'

**ధ**ర్మమును వృద్ధి పరుచునది శ్రీమాత అని అర్థము.

ధర్మమును వృద్ధి పరచుట శ్రీమాత ముఖ్య కార్యములలో నొకటి. ధర్మమును జీవులయందు వృద్ధి పరచి వారిని దైవము కడకు చేర్చుట అనునది శ్రీమాత సృష్టి కర్తవ్యములలో నొకటి. ఇది మహత్తర కార్యము. సామ దాన భేద దండోపాయములతో జీవులకు ధర్మమును నిరంతరము నేర్పుచునే యుండును. ధర్మము తప్పుట వలన కలుగు అసౌకర్యములను అనుభవించు జీవుడు క్రమముగ ధర్మము యొక్క ఆవశ్యకతను విలువను ఎఱిగి, ధర్మమవలంబించుట కిచ్చగించును. కష్టనష్టముల భయముతో ధర్మము నేర్చుట సామాన్యముగ జరుగుచుండును. నేర్చుకొను చుండగ అభ్యాసవశమున ధర్మము స్థిరపడు చుండును. సుఖ, సౌఖ్యములు ధర్మమునందే వున్నవని తెలియును. ధర్మ వ్యతిరిక్తమగు కార్యములు తాత్కాలిక సుఖ మిచ్చినప్పటికి ఉత్తరోత్తర పిశాచములవలె పీడించునని కూడ తెలియును. చేసిన ధర్మము జీవుల వెంట జన్మల తరబడి నడచి వచ్చుచుండగ చేసిన అధర్మము వదలని పీడయై పీడించుట జరుగు చుండును. అనుభవమున జీవుడు ధర్మపు విలువను తెలియుచు ధర్మాసక్తుడై ధర్మమునే పాలించుటకు నిర్ణయించుకొనును. అపుడతని యందు ధర్మమును నమ్ముట నుండి ధర్మము నచ్చుట అను పరిణతి యేర్పడును.

ధర్మమును నమ్ముటగాక ధర్మము నచ్చుట ఒక చక్కని పరిణామము. అట్లు నచ్చుట జరిగినపుడు సుఖ సౌఖ్యములకై ధర్మమును వీడుట యుండును. లబ్ధికై ధర్మమును వీడుట కూడ యుండును. అట్టి వారికి పతన ముండదు. హరిశ్చంద్రుడు, నలుడు, యుధిష్ఠిరుడు, శ్రీరాముడు నడచిన నడకట్టిది. మిన్ను విరిగి మీద పడ్డను ధర్మమునే నాశ్రయించి నిశ్చలమతులై నిలబడినారు. కనుకనే వారి చరిత్రము ఆచంద్రార్కము సృష్టియందు నిలబడి యున్నది.

చిన్నతనముననే ధర్మమును నేర్చుట అదృష్టము. అట్లే చిన్న తనముననే ధర్మమును కథల రూపమున నేర్పు తల్లిదండ్రులు లభ్య మగుట అదృష్టము (అనగా పూర్వజన్మ సుకృతము). చిన్న నాటి నుండి ధర్మము నేర్చినవారు ధర్మమును వీడుట సులభముగ జరుగదు. ధర్మమును నేర్పు తల్లి లభించిన జీవుడు అదృష్టవంతుడు. లేదా తండ్రియో, గురువో చిన్నతనముననే లభించిన అదియూ అదృష్టమే. అట్లు కానిచో కష్టనష్టములు పొందుచూ ధర్మము నేర్చుట జరుగును.

పాండురాజు కుమారులు పసితనముననే ధర్మమును హిమా లయముల యందలి ఋషుల వద్ద నేర్చిరి. ధృతరాష్ట్రుని కుమారులు హస్తినలో చిన్నతనముననే రాజకీయమును నేర్చిరి. భోగభాగ్యములకు లోబడిరి. ఆ వ్యత్యాసమే వారి జీవితములను నడిపించినది. దశరథుని కుమారులు నలుగురూ చక్రవర్తికి కుమారులైనప్పటికి చిన్నతనముననే వశిష్ఠాశ్రమమునకు చని విద్యలతో పాటు బ్రహ్మవిద్యలను కూడ నేర్చి

మరల రాజ గృహప్రవేశము చేసిరి. వారు ఆసాంతము బ్రహ్మవిదులై నిశ్చలముగ వర్తించిరి. రాముడెంతటి ధర్మాత్ముడో శత్రుఘ్నుడు కూడ ధర్మమున అంతటివాడే. వారి వారి ధర్మములను నలుగు రన్నదమ్ములు చక్కగ పరిపాలించిరి. ఇట్టి వృత్తాంతములే యితిహాసములు. అవి జీవులకు స్ఫూర్తి నిచ్చును.

అనంతమగు వాఙ్మయ రూపముననూ, ఋషుల రూపముననూ, రాజర్షుల రూపముననూ, సద్గురువుల రూపముననూ, తల్లిదండ్రుల రూపముననూ శ్రీమాతయే ధర్మమును జీవులకు నేర్పుచూ, ధర్మమును వృద్ధి చేయుచూ జీవుల నుద్ధరించును. ఇదియొక మహత్తర కార్యము.



# 960. 'లోకాతీతా', 961. 'గుణాతీతా' 962. 'సర్వాతీతా'

లోకములను, గుణములను, సర్వమునూ మించినది శ్రీమాత అని అర్థము.

మహత్తు నుండే లోకములు, గుణములు పుట్టును. మహత్తు, కాలము ప్రకృతి శక్తులనుండి పుట్టును. యేర్పడును. ఆ మూడింటికి పుట్టుక స్థానము శ్రీమాత. ఆమె బ్రహ్మస్వరూపిణి, బ్రహ్మమయీ. నిజమునకు బ్రహ్మమే. ఆమె బృహ్మణము (నిస్వాస) నుండి సృష్టి సంకల్పము పుట్టును. ఆ సంకల్ప మాధారముగ కాలము, ప్రకృతి, శక్తి యేర్పడును. ఆ మూడును సృష్టికి చోటుగ నేర్పడును. ఆ చోటునే మహత్తు అందురు. దాని నుండియే గుణములు, లోకములు, జీవులు, సృష్టి యందు తెలియబడునవి, తెలియబడినవి పుట్టును. ఆమె సృష్టించి నవే తెలియబడును. తెలుసుకొన్న వారియందు తెలివిగ కూడ ఆమెయే యున్నది. ఎంత తెలిసిననూ తెలియవలసినది యుండును. ఆకాశపు లోతెవరు తెలియగలరు. ఎవ్వరునూ తెలియలేరు. కనుక శ్రీమాతను గూర్చి గుణపరముగను, లోకపరముగను, విద్యాపరముగను వేదపరము గను ఎంత తెలిపిననూ దాని కతీతమై శ్రీమాత యున్నది. తెలియునది కొంతయే. తెలియనిది అనంతము. అది జీవుల అవగాహన కతీతము. గుణాతీతులగు ఋషులు, యోగులు కూడ తెలియలేరు. లోకాతీతులును

తెలియలేరు. సర్వమూ తెలియును అనుకున్నవారికి కూడ అందక యుండును. తాము తెలియలేము అని తెలియుటయే నిజమగు తెలివి. తెలిసినదనుకొనుట అజ్ఞానము.

అతీతమగు తత్త్వము నారాధించుటలో పరమ ప్రయోజన మొకటి యున్నది. గుణాత్మకులు, లోకస్థులు అగు జీవులు అతీతమగు తత్త్వము నారాధన చేయునపుడు వారు తామున్న లోకములనుండి, గుణముల నుండి, సర్వము నుండి తన్మయులై అతీతులగుదురు. నీట మునిగి వుక్కిరిబిక్కిరి యగుచున్న జీవుడు యొక్కమారుగ నీటి నుండి బైట పడినచో ఎంత సుఖముగను ఆనందముగనూ యుండునో అట్లే ఆరాధనమున జీవుడు సుఖమును, శాంతిని పొందును. శమము దక్కును. కాని మరల స్వభావము కారణముగ నీట మునిగినట్లు మునుగును. తన గుణములలోనికి, పరిసరములలోనికి మునుగును. ఇట్లు సంసార మున మునుగుచు, ఆరాధనమున తేలుచూ సంసారి సాగుచు నుండును. క్రమముగ ఆరాధనా బలమున నీటిపై తేలుచు పయనము సాగించినట్లు శ్రీమాత ఆరాధనమున లోకములందు, గుణములందు, సర్వమునందు శ్రీమాతనే దర్శించుచూ మునగక తేలియుండు స్థితిని పొందును. అయిననూ శ్రీమాత పూర్ణముగ తెలియదు. తెలియుటకై పడు ఆరాటమే తేలియుండుటకు ఉపాయమై యుండును.

# 963. 'శమాత్మికా'

**శ**మమే స్వరూపముగ గలది శ్రీమాత అని అర్థము.

ముందు నామముల యందు శ్రీమాత అతీత తత్త్వమును కీర్తించుట జరిగినది. ఈ నామమున శ్రీమాత శమ స్వరూపమును కీర్తించుచున్నాము. విషయముల కతీతముగ నున్నప్పుడే శమ ముండును. విషయములం దున్ననూ, అతీతముగ గూడ యుండ వచ్చును. అట్లుండుటకు శ్రీమాత ఆరాధన, ఉపాసన వినియోగపడును. ఆమె శమాత్మికగాన ఆమె నుపాసించువారుకూడ, భ్రమరకీటక న్యాయమున శమమును పొందగలరు. ఉపాసనా గుణమును బట్టి ఉపాసకులా గుణమును పొందుట సహజము. *'యద్భావం తద్భవతి'* అనునది సత్యము.

శ్రీమాత లోకాలోకములను వ్యాపించి యున్నది. లోకము లందుండుటచే లోకములు నిలబడి యున్నవి. లోకముల కతీతముగ నుండుటచే శాంతముగ, శమముగ కూడ నున్నది. లోకముల మునిగిన వారికి శమ ముండదు. లోకముల ప్రవేశింపని వారికి అనుభూతి, తదానందము వుండదు. మునిగి, మునగని వారు, అంటి, అంటనివారు రెండు విధముల ఆనందమును పొందుదురు. అదియే యోగవిద్య నేర్పు ఉపాయము. *"యోగః కర్మసు కౌశలం"* అని శ్రీకృష్ణుడు యీ ఉపాయమునే సూచించినాడు.

కృష్ణుడు సంసారము నందుండియు, సంసారముచే బంధింప బడలేదు. రాజకీయములం దుండియు, అందు మునిగిపోలేదు. గోపికల ప్రేమ యందున్ననూ తగులుకొనలేదు. గోప బాలుర నుండి చక్రవర్తుల వరకు ఎందరితో యున్నను, ప్రవర్తించినను, కార్యముల నిర్వర్తించిననూ తాను తానుగనే నిలచియున్నాడు. దేనినీ వర్జింపలేదు. దేనినీ కౌగలించుకొనలేదు. మోహమున్నట్లు మోహనుడై యున్నను విరాగిగనే యున్నాడు. అట్లని బైరాగులవలె ప్రవర్తింపలేదు. అన్నిటా వుండి లేనట్లు అన్నియూ నిర్వర్తించి యోగవిద్యకు ఉపాయము తెలిపినాడు. యోగజీవనమున కతడే అనుపమాన మగు ఉదాహరణము. అతడు శ్రమ స్వరూపుడు.

భావములకు, గుణములకు, లోకములకు అతీతమై శమ ముండును. అన్నిటికీ అతీతమై యుండునది శమము. అన్నింటికి అతీత మైనది పరమే! ఆత్మకు కూడ అతీతమైనది పరము. అదియే బ్రహ్మము. బ్రహ్మము నుండి పరమాత్మ, పరమాత్మనుండి గుణములు, గుణముల నుండి జీవాత్మములు, వారి నుండి బుద్ధి, మనస్సులు, వాని నుండి ఇంద్రియ శరీరములు ఏర్పడుచుండును. గుణముల సృష్టి మొదలుగ, సౌఖ్యము బంధము అగు ద్వంద్వము లున్నవి. సత్త్వగుణము నాశ్రయించి జీవుడు, నిత్య సత్త్వమున స్థిరపడినచో శమ ముండును. రజస్సున గాని, తమస్సునగాని శమ ముండదు. సత్త్వముతోగూడి బుద్ధిలోనికి ప్రవేశించి యుండువారు లోకమున శమము కలిగి యుందురు. శమము నకు మార్గ మిట్లున్నది :




జీవుడు రజస్తమస్సులకు లోబడినపుడు శమము కోల్పోవును. అపుడు సత్య ధర్మములు తెలియవు. తమకు తోచినది సత్యమని, ధర్మ మని భ్రమపడుదురు. వారి బుద్ధికి మబ్బువలె మాయ పొర క్రమ్మును. అక్రూరుడు, విదురుడు వంటి జ్ఞానులకు కూడ, సత్య దర్శనమున తికమక కలిగినది.

శ్రీమాత నారాధించు భక్తులు లోకములకు, గుణములకు, సర్వమునకు అతీతమగు శమ స్వరూపిణియగు శ్రీమాతను, సత్త్వము నాశ్రయించి ఆరాధించవలెను. సత్త్వగుణమే సత్యమునకు ముఖ

ద్వారము. జీవితమును సత్త్వ ప్రధానముగ మలచుకొనవలెను. అప్పుడు ఆరాధనమున శ్రీమాత అనుగ్రహించు శమమును పొందగలరు. శమమును మించిన శాంతి, సుఖము, భాగ్యములు లేవు.



# 964. 'బంధూక కుసుమప్రఖ్యా'

**బం**ధూక పుష్పము వలె ఎఱ్ఱని శరీర కాంతి కలది శ్రీమాత అని అర్థము.

బాలభానునివలె ఎఱ్ఱని కాంతితో నున్న పుష్పములు బంధూక వృక్షముల కుండును. వంగదేశమున ఈ వృక్షములు మెండుగ గలవు. దండక వనమునగూడ యిట్టి వృక్షములు కొల్లలుగ నున్నవి. వనములలో యీ పుష్పములు వృక్షముల నుండి రాలిపడి, నేల అంతయూ కాంతి వంత మగుచుండును. బాల సూర్యుని కాంతి కూడ యిట్లే యుండును.

శ్రీమాత బాల దర్శనమున యిట్టి కాంతితో నుండును. బాల దర్శనము, ఆరాధనమున ప్రథమ దర్శనము– సిందూర కాంతియే బాలకాంతి లేక బందూక కుసుమ కాంతి. పవిత్రమగు మనస్సున గోచరించు యీ కాంతి సర్వశుభప్రదము. నిర్మలమగు మనస్సు ఏర్పడుటకు పరిశుద్ధ జీవనము ఆవశ్యకము. పరిశుద్ధ జీవనము సాగించుచు, నిర్మలమగు మనస్సుతో శ్రీమాత నారాధించు వారికి బాల దర్శన మగును. అది మొదలుగ సిందూర కాంతిగను, అటుపైన కాంతితో కూడిన బాలగను దర్శనమగును.

నిర్మలమగు మనస్సు అనగా కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములంటని మనస్సు. నిత్యారాధనమున యీ మలినములు క్రమముగ తొలగవలెను. తొలగును గూడ. అట్లు మలినములు తొలగిన

మనస్సునకు, కన్నులు మూసి అమ్మను స్మరించిన వెంటనే, సిందూర కాంతి దర్శనమగును. కన్నులు మూసిన వెంటనే సిందూర కాంతి గోచరించుట దివ్యలోక దర్శనమునకు మొదటి అర్హత. బాహ్య విషయములుగాని, తత్సంబంధిత భావములు గాని ఓంకార ముచ్చరింపగనే అదృశ్యము కావలెను. ఉదయారుణ కాంతి యందు నిర్మల ఆకాశ మెట్లుండునో అట్లు కాంతి దర్శనము లోన కలుగవలెను. ఇట్టి సిద్ధి కలిగినవారికి త్వరలోనే బాల దర్శనము కాగలదు.



# 965. 'బాలా, 966. లీలావినోదినీ'

**బా**ల అనగా మూడు నుండి ఐదేళ్ళ వయసు గల చిన్నపిల్ల. అట్టి రూపమున ప్రథమ దర్శనమిచ్చునది శ్రీమాత అని అర్థము.

బాల దర్శనము, బాలకృష్ణ దర్శనము ప్రాథమిక దర్శనములై యున్నవి. భక్తులకీ దర్శనమే ప్రప్రథమమున జరుగును. ఈ దర్శనము సర్వమంగళప్రదము. హృదయమున బాలగా దర్శనమిచ్చు శ్రీమాత ఆరాధనా మార్గమున క్రమముగా కుమారి, సువాసిని, త్రిపురసుందరి దర్శనములను కూడ సోపానక్రమమున యిచ్చును. బాల లీలలకు ప్రసిద్ధి. భక్తులకు దర్శనమిచ్చి తన లీలలు చూపును. భక్తుని ద్వారా తన లీలలను కూడ నిర్వర్తింపజేయును. అట్లు జరుగునపుడు అది అంతయూ అమ్మ అనుగ్రహమే అని భావింపవలెను గాని తన ప్రతిభ అని ఆరాధకులు, భక్తులు అనుకొనరాదు. అట్లనుకొన్ననూ, ప్రవర్తించి ననూ అటుపై వృద్ధి యుండక పోగా పతనమునకు ద్వారములు తెరువబడును. ఆరాధనమున భక్తునికి వలసినది అమ్మ తత్త్వమునుండి పెరుగుటయే గాని బాహ్యాటోపములు, పటాటోపములు వర్జనీయములు. లేత మనస్సులకు (నిర్మల మనస్సులకు) బాల దర్శనము జరుగుట ఎంత వరమో అంత అపాయము కూడ. దర్శనానందము తమలోనే యిముడ్చుకొని, వృద్ధిపరచుకొనవలెనే గాని బజారుపాలు చేయరాదు. లోన అమ్మ ఆరాధనము వృద్ధి చెందినకొలదీ ఆరాధకుడు తత్త్వమున

పెరుగుచు, పక్వము చెందుచూ నుండును. పక్వముగ పండిన పండు సువాసనలు తమంత తాముగ పరిసరములకు వ్యాపించును. ఆరాధకుని నుండి శ్రీమాత లీలలు చూపుచుండగా తాను నిమిత్తమాత్రుడ నని గుర్తెరిగి, తన నుండి జరుగుచున్న దివ్య కార్యమంతయూ శ్రీమాత లీలగ చూడవలెను. బాలగ శ్రీమాత లీలావినోదిని. లీలలు చూపుట, లీలలను నిర్వర్తించుట, వినోదించుట యిత్యాదివి భక్తులు వాహికగ నిర్వర్తించు చుండును. అంతయూ ఆమె లీల అని భావించుచూ ఆరాధకుడు కూడ వినోదమున పాల్గొనవచ్చును. వినోదింప వచ్చును.

బాల దర్శనమైనవారు నూతన ఉత్సాహముతో, ఆనందముతో కార్యములను నిర్వర్తించు చుందురు. వారి స్వభావమున వినోదమొక భాగమై చేరును. వారి చుట్టునూ చేరినవారికి ఆ వినోదము ఆనందము, ఆకర్షణము కలిగించును. అట్లు ఆకర్షింపబడిన వారిని తమ కొరకై వినియోగించుకొనక, అమ్మ కార్యములందు నియమించి వారి వృద్ధికై తోడ్పడవలెను. అపుడానందముగ సామూహిక ఆరాధనములు దివ్య కార్య నిర్వహణములు సాగును. సర్వశ్రేయోదాయకమగు జీవన మేర్పడును.

మహాత్ము లందరునూ బాల దర్శనము కారణముగ సహజ వినోదాత్మకులై యుందురు. చిరుహాసము వారియం దెప్పుడునూ తొణికిసలాడుచు నుండును. చిలిపితనము కూడ తగు మాత్రము దృగ్గోచర మగును. అమ్మ రస స్వరూపిణి గనుక జీవితమున అన్ని

కార్యముల యందు రసాస్వాదనా యుక్తి యేర్పడును. కనుకనే బృహత్తర కార్యములను ఉల్లాసముగ నిర్వర్తింతురు. దిగులు, విచారము, భయము యిత్యాదివి వారి దరి చేరవు.

బాలా వినోదము తెలియవలెనన్నచో వ్రజమందున బాలకృష్ణుడు గోపబాలురతో నిర్వర్తించిన క్రీడలలో మిక్కుటముగ లభించును. భాగవతమున దశమ స్కంధము పూర్వభాగమంతయూ బాలా లీలా వినోదమే.



# 967. 'సుమంగలీ'

**శి**వునితో కూడి శాశ్వత మంగళప్రదమగు స్థితి యందున్నది.

భర్త గలవారే సుమంగలి అని పిలువబడుదురు. వారి దర్శనము శుభప్రదము. భర్త శివ స్వరూపుడు. అతడు పరమేశ్వరుడే. పరమేశ్వరుడే సృష్టికి భర్త. అతడు నిత్యుడు, శాశ్వతుడు. జననము, మరణము లేని వాడు. అట్టివాడు తన భర్త అయినపుడా స్త్రీ సుమంగళియే. మంగళ మనగా బ్రహ్మము అని అర్థము. బ్రహ్మ స్మరణము, బ్రహ్మ జిజ్ఞాస ఎవరికుండునో వారందరూ మంగళరూపులే. భక్తులు, యోగులు, మునులు, సిద్ధులు, మహాత్ములు, ఋషులు యిట్టి వారి దర్శనము మంగళప్రదము. అట్లే పుణ్యస్త్రీలు కూడ. అనగా భర్త గలవారు. భర్త కలిగిన మాత్రమునే స్త్రీ పుణ్య స్త్రీ అయినపుడు జగత్ భర్తను పొందినవారు ఎంతటి పుణ్యప్రదులు. శ్రీమాత స్మరణము కేవలము మంగళప్రదమే కాదు. సుమంగళము, సర్వమంగళము కూడా. ఆమె శివాని, సర్వ మంగళమునకు మంగళ. ఆమె స్మరణము, దర్శనము సర్వార్థ సాధకము. నిత్యము శ్రీమాత నారాధించువారు అశుభములు తొలగింపబడిన వారై శుభ పరంపరలను పొందుదురు. ఇది సత్యము.



# 968. 'సుఖకరీ'

సుఖమును కలుగచేయునది శ్రీమాత అని అర్థము.

సుఖ మిచ్చునది శ్రీమాతయే. శమము కలిగినపుడు నిజమగు సుఖము కలుగును. శమము కలుగుటకు సత్త్వ గుణమును ఆశ్రయించ వలెను. సత్త్వగుణ మబ్బుటకే ఆరాధనము. శ్రీమాత ఆరాధనమున సద్గుణము లబ్బినచో జీవుడు సత్త్వమున నిలబడును. సత్త్వమున నున్న వారిని ద్వంద్వములు బాధించవు. జీవితమున ఒడుదొడుకు లున్నను, లాభ నష్టము లున్నను, సౌకర్యా సౌకర్యము లున్ననూ సత్త్వగుణోపేతు లగువారు వ్యధ చెందరు.

సత్త్వగుణము యొక్క ఫలమే స్థిరచిత్తము. స్థిరచిత్తుడగుటకే ఆరాధన లన్నియును. అమ్మ ఆరాధనమున తన యందు, తన పరిసర ముల యందు అమ్మయే నిండియున్నదను విశ్వాసము మెండుగ యేర్పడు కొలది సుఖము లభ్యమగును. జీవులకు సుఖ మేర్పడును. మార్గములను కూడ అమ్మయే యేర్పరచి యున్నది. ఆ మార్గముల ప్రవేశించుటకు వలసిన అనురక్తి కూడ అమ్మయే అందించును. ప్రేరణ యిచ్చి జీవులను సన్మార్గములలో నడిపించి, వారికి సుఖము కలుగజేయును గనుక శ్రీమాత 'సుఖకరి'గా కీర్తింపబడుచున్నది.



# 969. 'సువేషాఢ్యా'

**శో**భనమైన వేషముతో కూడియున్నది గనుక 'సువేషాఢ్యా' అని శ్రీమాత పిలువబడుచున్నది.

వేషము తీర్చిదిద్దినట్లుండవలెను. అపుడది లక్ష్మీ పరమగును. శుభప్రదమగును. కట్టు, బొట్టు సంస్కారవంతమై యుండవలెను. సిరులు (జుట్టు) చక్కగ సంస్కరించుకొనుచూ నుండవలెను. వాటిని చక్కగ జడవేయుటయో, ముడి వేయుటయో చేయవలెను. విరబోసుకొని తిరుగరాదు. విరబోసుకొని తిరిగినచో జుట్టు ద్వారా శిరస్సులోనికి అసుర భావములు ప్రవేశించును. తదనుగుణమైన భాషణము ప్రవర్తనమునకు ప్రేరణ కలుగును. పురుషులైననూ, స్త్రీ లైననూ తైలముతో శిరోజములను పోషించుట, దువ్వుకొనుట, జడయో, ముడియో వేయుట, వారమునకొకసారి అభ్యంగన స్నానము చేయుట యిత్యాది సంస్కారములు సద్భావముల నుండి పుట్టినవి. అట్లే వస్త్రధారణ కూడ సంస్కారవంతమై యుండవలెను. భారతీయ సంస్కృతి యందు వస్త్ర ధారణమున గొప్ప సంస్కార మున్నది. మెడ నుంచి కాలి మడమల వరకు దేహమును వస్త్రములతో కప్పియించుకొనుట, వికారమగు అంగ ప్రదర్శనములు చేయకుండుట మన సంప్రదాయమున యున్నది.

అట్లే ఫాలమున కుంకుమ, గంధము, విభూతి, కస్తూరి, తిరు చూర్ణము యిత్యాది పవిత్ర పదార్థముతో బిందువునుగాని, రేఖలుగాని

తీర్చిదిద్దుకొనుట శుభప్రదము. లింగభేదము లేక హైందవు లందరును ఫాలభాగమున అలంకరించుకొందురు. అట్టి అలంకరణమున ఆజ్ఞా కేంద్రము ప్రచోదనము చేసుకొను క్రతువులు కూడ వున్నవి.

కట్టు, బొట్టు, శిరోజాలంకరణములతో బాటు తగు మాత్రము ఆభరణములు ధరించుట కూడ ప్రధానము. పుణ్య స్త్రీలైనచో తప్పక ప్రతినిత్యము సుగంధముతో కూడిన పుష్పములను కూడ ధరింపవలెను. సువేషము ఒక వ్రతముగా గొని భక్తితో, శ్రద్ధతో నిర్వర్తించుకొనినచో లక్ష్మి ప్రసన్నమగును.

దేహము దేవుడిచ్చినదని గుర్తించి, దేవాలయముగ భావించి, దానిని పరిశుభ్ర మొనర్చుచూ అలంకరించుకొనుట వలన పరిసరముల యందలి దైవీప్రజ్ఞలు దరిచేరుట, అసుర ప్రజ్ఞలు దూరమగుట జరుగును. సువేషము ద్వారా అబలలకు రక్షణము లభించును. భూత ప్రేత పిశాచములు, అసుర ప్రజ్ఞలు దరిచేరవు. ఇట్టి వేషధారణము ఆరాధనలో భాగముగ స్వీకరించవలెనని సందేశము.



# 970. 'సువాసినీ'

సర్వకాలము జీవించియుండు భర్త కలది శ్రీమాత అని అర్థము.

తన భర్త పరము. అది శాశ్వతము. తాను పరా. తాను శాశ్వతయే. ఇరువురునూ సృష్టికి పూర్వమేకమై యుండుట, సృష్టి సంకల్పమున ఇరువురిగ నుండుట, సృష్టిలో కూడ ప్రకృతి పురుషులుగ నుండుట. సృష్టి అనంతరము కూడ నుండుట కలవారు. వారు శాశ్వతులగుటచే వారి దాంపత్యము కూడ శాశ్వతము. తన భర్త మరణింపనివాడు, తానునూ మరణింపనిదే. కనుక శ్రీమాత శాశ్వతమగు సువాసిని.

హైందవ సంస్కృతి యందు భర్తకు భార్య, భార్యకు భర్త అత్యంత ఆవశ్యకమగు సంప్రదాయ మున్నది. కలసి జీవించుట, కలసి కర్తవ్యము నిర్వర్తించుట, కలసి సుఖదుఃఖము లనుభవించుట, కలసి గృహస్థ ధర్మము నిర్వర్తించుట, కలసి యాత్రలు చేయుట యిత్యాదివి నిర్దేశింప బడినవి. అట్టి విధమున ఇరువురు ఏకమగుట, ఒకే తత్త్వము యిరువురి యందు ప్రకాశించుట జరుగుట ద్వారా యిరువురునూ కలసి సిద్ధి పొందుదురు. ఇది నిరుపమానమైన సంప్రదాయము. ఆది దంపతులగు పార్వతీపరమేశ్వరు లట్టివారు. వారు సృష్టికి మాతా పితరులు.

భూమిపై జనించి, చరించిన వారిలో సీతారాము లట్టివారు. శివపార్వతు లాది దంపతులు కాగా, భూమిపై సీతారాములు ఆదర్శ దంపతులై నిలచిరి. సీతామహాలక్ష్మి ఎంత పతివ్రతయో శ్రీరాముడు

అంత పత్నీవ్రతుడు. పతివ్రతలు మెండుగ నున్నారు. పత్నీవ్రతులలో రాముని పేరొక్కటియే వినిపించును. కనుకనే రాముని ధర్మముతో సమానమగు ధర్మమే లేదు. ఒక పురుషుని కొక స్త్రీ, ఒక స్త్రీకి ఒక పురుషుడు అను సంస్కృతి ఉత్తమోత్తమ సంస్కృతి. భావమునందుకాని, భాషయందుకాని, చేష్టలయందు కాని పరపురుషుని తలచకుండుట పాతివ్రత్యము. అట్లే పర స్త్రీని తలపున రానీయకుండుట పాత్నీవ్రత్యము. అది సీతారాములకే తగినది. పార్వతీపరమేశ్వరులకే తగినది. అట్టి స్త్రీ పురుషులు దైవ సమానులే.

పతి, పత్ని ఉత్తమ సంస్కారము వలన ఆయుష్మంతుడై జీవించును. అట్లే పత్ని, పతి సంస్కారము వలన ఆయుష్మంతురాలై జీవించును. ఒకరినొకరు ప్రాణ ప్రజ్ఞలతో పోషించుకొను విధానము హైందవ ధర్మమున నున్నది. కనుకనే సువాసిని సంఘమున అత్యంత గౌరవముగ దర్శింపబడుచున్నది. భర్త గల స్త్రీ ఐశ్వర్యవంతురాలు. ఇతర సంపద లెన్నియున్ననూ భర్తలేని స్త్రీ సంపద లేనిది అని గుర్తించు విధాన మేర్పడినది. అట్టి వారిని కూడ గంగ, బాగీరథీ వంటి పవిత్ర మూర్తులుగ గౌరవించు విధానము ఈ సంస్కృతి యందే యున్నది. కాని వారు పూజార్హులు కారు. కుంకుమపూజ యిత్యాది పూజలు నిర్వర్తించు అధికారము కోల్పోవుదురు.

# 971. 'సువాసిన్యర్చన ప్రీతా'

**సు**వాసినీ స్త్రీలు చేయు పూజకు ప్రీతి చెందునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత నిత్య సువాసిని. శాశ్వత సువాసిని. సువాసిని స్త్రీల పూజలోని పరమోద్దేశ్యము తమ భర్తలు ఆయుష్షు, ఆరోగ్యము, ఐశ్వర్యము కలిగి యుండవలెననియే. తమ భర్తలు ఆరోగ్యవంతులు, ఐశ్వర్యవంతులు అయినచో తమ జీవితములు వైభవముగ సాగును. వారట్లు జీవించియున్న కాలమున, వారి సతులుగ తమకును సంఘము నందు కీర్తి ప్రతిష్ఠ గౌరవము దక్కును. భర్తల కొరకు భార్యలు చేయు పూజలకు శ్రీమాత త్వరితగతిని ప్రీతి చెందును. శ్రీమాత సతీదేవిగ ఆత్మాహుతి గావించుకొని పార్వతిగ జన్మించి, శివుని కొర్కై ఆరాటపడి తపస్సు గావించి, అతని అనుగ్రహము పొంది జగన్మాతయై కీర్తింప బడుచు యున్నది. శివుని భార్య అగుటవలననే తనకు జగన్మాత స్థానము లభ్యమైనది. భర్త ఔన్నత్యమే భార్యలు కోరుట హైందవ సంప్రదాయము.

కనుక పతుల ఔన్నత్యమునకై సతులు చేయుపూజ ఆమెకు అత్యంత ప్రీతికరము. ఒకానొకచో పతుల ప్రవర్తనము దుఃఖకరముగ నున్నను, పతన కారణమై యున్నను లేక వారి ఆరోగ్యములు మరణ దిశగ సాగుచున్ననూ సతులు స్థిరమతులై శ్రీమాత నర్చించి, మాత

అనుగ్రహముగ పతులను కాపాడుకొని ఉన్నతి కలిగించిన సన్నివేశ ములు కూడ చరిత్రలో వున్నవి. పురాణములయందు కూడ కోకొల్లలుగ యున్నవి.

పై కారణముగనే పుణ్య స్త్రీలు (అనగా భర్త కలవారు) లలితా పారాయణము, కుంకుమార్చన, బిల్వార్చన వ్యక్తిగతముగను, సామూహిక ముగను కూడ నిర్వర్తించుకొను చుందురు. ప్రతి శుక్రవారము సాయం సమయమున శుచియై, స్త్రీలు నేటికిని కుంకుమార్చన సహస్రనామ పారాయణముతో గావించి శ్రీమాతకు ప్రీతిపాత్రులై యున్నారు.



# 972, 973. 'ఆశోభనా శుద్ధమానసా'

**స**ర్వత్రా సౌందర్యము గలది శ్రీమాత. శుద్ధమైన మనస్సు గలది శ్రీమాత అని అర్థము.

శోభన మనగా దివ్య వైభవము. ఆశోభన మనగా సర్వత్రా వ్యాపించిన దివ్య వైభవము అని అర్థము. ఇట్టి వైభవము పరిశుద్ధ మగు మనస్సు గలవారికే సాధ్యము. కనుకనే రెండు నామములు కలిపి వివరింపబడుచున్నవి.

జీవుడు సహజముగ సౌందర్యవంతుడు. అతనికి స్థూలముగ మూడు ఆవరణము లేర్పడును. అందు మొదటి ఆవరణము త్రిగుణము లతో యేర్పడును. రెండవ ఆవరణము మనస్సుతో యేర్పడును. మూడవ ఆవరణము శరీరముతో యేర్పడును. ఈ మూడు ఆవరణములునూ పరిశుద్ధముగ నున్నవారు సౌందర్యవతులని శాస్త్రము చెప్పుచున్నది. అట్టివారు గుణసంపద, మనోసంపద, దేహ సంపద కలిగి యుందురు. ఎట్టివారైననూ వీరి దర్శనమున వశమై పోవుదురు.

కొందరికి దేహ సౌందర్యము మాత్రమే యుండును. మనో సౌందర్య ముండదు. అనగా మనోభావములు పరిశుద్ధములై యుండవు. ఇట్టివారు పొట్టనిండ పురుగులున్న మేడిపండువంటి వారు. అట్లే మనో సౌందర్యమున్ననూ దేహ సౌందర్యముండక పోవచ్చును. ఇట్టివారు పూజనీయులే. కాని వారి దర్శనము ఆకర్షణీయము గాకుండుటచే

సామాన్య జీవులు దరి చేరరు. వీరు సృష్టియందు కోకిలవంటి వారు. కోకిల చూచుటకు వికారముగ నుండును. కంఠ మాధుర్యము శోభనమై యుండును. కాని రామచిలుక వలె అందముగ యుండదు. రామ చిలుకకు కోకిలవలె మధుర స్వరముండదు. మధుర స్వర మున్ననూ రూపము అందముగ నుండకపోవుటచే తన రూపమును ఆకులమాటున దాచుకొని కోకిల కంఠమును మాత్రమే వినిపించును. ఇట్లెందరో మానవులు, జంతువులు, యితరజీవుల గూర్చి చెప్పవచ్చును. అట్లే గుణ సౌందర్యము లేనివారు యితర సౌందర్యము లెన్నియున్ననూ, శోభనవంతులు కాలేరు.

సర్వత్ర శోభన మనగా నిజమగు ఉదాహరణములు మనకు శ్రీరాముడు, శ్రీకృష్ణుల యందే గోచరించును. ఆభరణములున్నను లేకున్ననూ, ఆకులు ఈకలు ధరించిననూ వారు సౌందర్యముగనే గోచరింతురు. వారి అంగాంగముల యందు అందమున్నది. కాలి గోళ్ళ నుండి కన్నుల వరకు ఏ భాగమునకా భాగము అందముగనే యుండును. వారి కారూపము శ్రీమాత నుండి సంక్రమించినదే. సాధారణముగ అందమైన వారిలో కూడ అంగాంగ సౌందర్య ముండదు. ఏదో ఒక అంగము విషయమున కురూప ముండును. చిన్న చెవులో, చిన్న కళ్ళో, దిబ్బ ముక్కో, ఎత్తు మూతో– ఇట్లు కను ముక్కు తీరులో ఏదియో ఒక లోప ముండును. అట్లే యితర భాగములలో కూడ నుండవచ్చును. సర్వశః అందముగ నుండవలెనన్నచో రూపము, భావము, గుణము కూడ పరిపూర్ణమై, శుద్ధమై యుండవలెను. ఇంద్రాది

దిగ్దేవతల నుండి మానవులవరకు అనేకానేక రూపములలో ఏదో ఒక లోపముండును. ఏ లోపమూ లేని రూపము రాధాకృష్ణులది. వారికి మూలము శ్రీమాత. కనుకనే ఆమె రూపము సర్వత్ర శోభనము. ఆమె మనస్సు నిరుపమానమగు శుద్ధ మనస్సు. *"సర్వమంగళ మాంగళ్యే శివే..."* అని కీర్తించుట కామెయే తగినది. దానితో సమానమగు కీర్తనము శోభన విషయమున మరియొకటి లేదు.



# 974. 'బిందుతర్పణ సంతుష్టా'

శ్రీ చక్ర బిందు అభిషేకము వలన సంతుష్టి చెందినది శ్రీమాత అని అర్థము.

బిందువే సృష్టి మూలము. నిరాకారము, నిరామయము, అనిర్వచనీయము, శాశ్వతము, తెలియుటకు వీలుపడనిది, రూపము నామము లేనిది అగు తత్త్వము నుండి వెలువడు ప్రప్రథమ సంకల్పమే బిందువు. ఆ బిందు వాధారముగనే దివ్యములు, మర్త్యములు అగు లోకములు నవావరణములతో కూడి యేర్పడును. తత్త్వము నుండి సంకల్పమే ఉద్భవించనిచో సృష్టి యుండదు. నిద్రాణమై యున్నట్లున్న తత్త్వమునకు సూక్ష్మతమము అగు మేల్కొల్పే సంకల్పము. ఆ సంకల్ప మును బిందువందురు. బిందువు ఉద్భవించిన వెనుక కాలము, ప్రకృతి, శక్తి యేర్పడును. ఆ తరువాత మహత్తు, అహంకారము, గుణము లేర్పడును. ఆ తరువాత యింద్రియములు, భూతములు, మనస్సు యిత్యాది వేర్పడును. ఇన్నింటికీ మూలము బిందువు. ఆ బిందువును అభిషేకించుట వలన శ్రీమాత నిండుగ సంతసించును.

అట్టి బిందువు మానవుల సహస్రారమందు, మూలాధార మందు కూడ యున్నది. ఆ బిందువును సంతుష్టి చేయుటకే అభిషేకము. అభిషేకము వలన బిందువు సంతుష్టి చెందుచు నుండును. దాని చక్రములే శ్రీచక్ర బిందువు మరియు శివలింగము. లింగమనగా

అర్థము చిహ్నమనియే. అనిర్వచనీయమగు తత్త్వమునకు వ్యక్తమగు చిహ్న రూపమే బిందువు. బిందు చిహ్నమే లింగము కూడ. లింగ మందలి ఆకారము, బిందువందలి ఆకారము తత్త్వముయొక్క ప్రతిరూపములు. వాని ఆరాధనము నిజమునకు తత్త్వారాధనమే. బ్రహ్మోపాసనమే.

అభిషేకమునకు పంచద్రవ్యములు శాస్త్రములచే నిర్దేశింప బడినవి. అవియే పాలు, నెయ్యి, తేనె, పంచదార, కొబ్బరి నీరు. ఇవి పంచకోశములను శుద్ధిచేయు పానీయములు. వీనినే పంచామృతము లందురు. వీనిచే అభిషేకము చేయుట, వీనిని గ్రోలుట వలన పంచకోశముల యందు, పంచేంద్రియముల యందు పట్టు పడిన ప్రజ్ఞ వాని నుండి విడుదల చెంది ఆనందము పొందును.

దేవతా ప్రతిమలన్నియూ అవ్యక్తమగు తత్త్వమునకు ప్రతిరూప ములుగ భావించి, వానిని పంచామృతములతో అభిషేకించుచు కూడ యిట్టి సంతుష్టిని పొందవచ్చును. తెలిసి చేయు ఆరాధనము నందు ఆనందము అధికమై యుండును.



# 975. 'పూర్వజా'

**ము**ందు పుట్టినది శ్రీమాత అని అర్థము.

బిందువే మొదట పుట్టినది. అది పుట్టిన వెనుకే యితరము లేవియైనను పుట్టుట జరుగును. ఆమె పుట్టిన వెనుకే కాలము, ప్రకృతి, శక్తి పుట్టినవి. శ్రీమాత కన్న ముందు పుట్టినవారు లేరు. నిజమున కామె పుట్టనిది. ఎప్పుడూ వుండునది. పరముగా నున్న ఆమె తనకు తానుగ వ్యక్తమగును. ప్రకటించుకొనును. తనను తానట్లు ప్రకటించు కొని, తానాధారముగ యితరముల నేర్పరచును. తానే వ్యక్తము కానిచో కాలము లేదు, ప్రకృతి లేదు, శక్తి లేదు, వెలుగు లేదు. స్పందనము లేదు, మాయ లేదు, నాదము లేదు. తెలిసికొనుటకు కూడ ఏమియూ యుండదు. తెలుసుకొనువాడే లేనపుడు తెలుసుకొనుట అను ప్రక్రియే లేదు కదా! అంతకు ముందు తానే యున్నది. కనుకనే తనను తాను ప్రకటించుకొన గలదు. తానుండనిచో తనను తానెట్లు ప్రకటించుకొన గలదు. తాను తానుగ నున్నపుడు శాశ్వత బ్రహ్మమై యుండును. తన సంకల్పము చేతనే తనకు తాను ప్రకటించుకొనును. అటుపైననే యితరము లన్నియూ పుట్టును.

నిద్రయందు మనమున్నాము. కాని యున్నామని తెలియదు. మన మున్నామని తెలిసియున్నచో అది నిద్ర కాదు కదా! నిద్రయందు లేనట్లున్నాము. ఉంటామని తెలిసియే నిద్రపోదుము. నిద్ర సమీపింపగ

మన మున్నామను తెలివికూడ జారిపోవును. కేవలముండుటయే యుండును. కాని యెట్లున్నామో తెలియదు. ఎచ్చట నున్నామో తెలియదు. మన పేరు తెలియదు. వూరు తెలియదు. రూపము తెలియదు. దేనిపై పరుండినామో తెలియదు. ఏమీ తెలియదు. పురుషుడనని, స్త్రీనని, మానవుడనని కూడ తెలియదు. ప్రజ్ఞయని కూడ తెలియదు. నిద్ర నుండి మేల్కాంచినంతనే పై తెలిసిన వన్నియూ క్రమముగ తెలియును. నిద్రలోకి చనిన మార్గము తెలియదు. నిద్రనుండి మేల్కాంచిన మార్గము తెలియదు. నిద్రలోనికి చనుట, నిద్రలోనుండి బయల్పడుట అను మార్గము తెలిసినది ఒక్కరికే. ఆమెయే శ్రీమాత. జీవులకు నిద్ర కల్పించునది, మేల్కొలుపునది ఆమెయే. ఆమె మేల్కాంచిన వెనుకనే కుమారులు, త్రిమూర్తులు వంటివారు కూడ వ్యక్తమగుదురు. 'పూర్వజా' అను నామ మామెకే తగినది.



# 976. 'త్రిపురాంబికా'

త్రిపురములకు తల్లి శ్రీమాత అని అర్థము.

అష్ట ప్రకృతులు కూడినటువంటిది త్రిపురము. దీనియందే జీవులు సంచరింతురు. మూడు గుణములు ఐదుగా నున్న పంచభూతములు, పంచేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచ తన్మాత్రలు, పంచ ప్రాణములు కలిపి ఎనిమిది ప్రకృతులుగ తానేర్పరచి, అందు వివిధములగు జీవులను వారి సంస్కారము, పరిణామము బట్టి ప్రవేశింప జేసి వారి వృద్ధికై కృషి సలుపుచు నుండును. అన్నియును, అందరునూ ఆమె నుండే జనించి వర్తింతురు. మూడు పురములకు ఆమె మూడు గుణములు అధిదేవతలై పరిపాలించును. సత్త్వగుణము సృష్టి యందలి సమస్త ప్రజ్ఞను పాలించును. రజోగుణము శక్తులను పాలించును. తమోగుణము పదార్థమును పాలించును. ప్రజ్ఞ శక్తి పదార్థములే మూడు రకములును. మనయందు కూడ ప్రజ్ఞ శక్తి పదార్థము లున్నవి. అనేకానేక ప్రజ్ఞలు యేర్పడి, వాని నుండి శక్తులేర్పడి, వాని నుండి పదార్థ మేర్పడుచూ ఒక దానిపై ఒకటి ఆధారపడి యున్నది. పదార్థము నందు మార్పు గలుగుట, మారుచుండుట, కదలిక కలుగుట, యిత్యాది వన్నియూ శక్తి మూలముననే. శక్తి లేనిచో పదార్థము కదలదు. మార్పు చెందదు. జడమై యుండును. కనపడని శక్తి కనపడు పదార్థమును మార్చుచు నుండును. పదార్థ పురముల నేర్పఱచుచు నుండును. రూపముల

నమూనా లన్నియు సూక్ష్మముగ శక్తి లోకముననే యున్నవి. శక్తి లోకమునందలి నమూనాలను బట్టియే రూపము, రంగు యేర్పడును. కనుక పదార్థము కన్న శక్తి ముఖ్యమైనది.

శక్తికి మూలము ప్రజ్ఞ. ప్రజ్ఞ పెరిగినకొలది శక్తి పెరుగును. ప్రజ్ఞావంతులు శక్తివంతులను నడిపింపగ, శక్తివంతులు దేహవంతులను నడిపింతురు. ప్రజ్ఞ శక్తి పదార్థముగ సృష్టి అంతయూ నడచు చుండును. ప్రజ్ఞలను పరిపాలించునది సత్త్వగుణము, శక్తులను పరిపాలించునది రజోగుణము, పదార్థమును పరిపాలించునది తమోగుణము. ఈ మూడు గుణములు శ్రీమాతవే. మూడు గుణముల నేర్పరచి వానిచే సృష్టి నంతనూ నిర్వర్తించుచూ, వీక్షించుచు నుండు తల్లి త్రిపురాంబిక మరియు త్రిపురసుందరి. మూడు పురములకు మూడు గుణములు అధిదేవతలు. మూడు గుణములకు ఆమె తల్లి. మూడు లోకములు ఆమె ఎనిమిది ప్రకృతులే. తొమ్మిదవ ప్రకృతిగ పదవదియైన పరము నుండి ప్రకట మగును.



# 977. 'దశముద్రా సమారాధ్యా'

**ద**శ ముద్రలతో సమ్యక్ ఆరాధన చేయబడునది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత దశ స్థానములు జ్ఞప్తియందుంచుకొని ఆరాధన చేయవలెను. పరదేవతగా ఆమెది పదవ స్థానము. బిందువుగా తొమ్మిదవ స్థానము. అటుపైన అహంకారాది అష్టప్రకృతులుగ ఎనిమిది స్థానములు. మనము చూచునది, వినునది, అనుభవించునది అంతయూ ఆమెయే. అదితిగ, గాయత్రిగ, సావిత్రిగ, మహాలక్ష్మి, మహా సరస్వతి, మహారుద్రుడుగ ఆమె నవమ స్థానమును ముఖ్యముగ పూజింతుము. పదవదియైన పరాస్థానము పూజ కందనిది. తన్మయత్వమున మాత్రమే చేరగలిగినది. మిగిలిన ఎనిమిది స్థానములు తొమ్మిదవ స్థానమునకు చెందినవే. కనుక శ్రీలలితగ శ్రీమాతను పూజించుట, ఆమెనే పరముగ కూడ భావించుట, అష్ట ప్రకృతులతో కూడిన ప్రకృతి కూడ శ్రీమాతయే యని భావించుట సమ్యక్ భావమగును. అట్లు భావించి పూజించుట సమ్యక్ ఆరాధన మందురు. పరమే సృష్టిగ నున్నది అని తెలియుటయే సంపూర్ణ జ్ఞానము. సృష్టియందు కూడ దశ స్థానములలో నున్న పరమును చూడవచ్చును. అట్లు చూచిన ఋషులే *"ఓం ఇతి యేతత్"* అని పలికినారు. అనగా 'ఇది' 'అది'యే. అదియే ఇదిగ నున్నది. 'అది' అనగా పరము. 'ఇది' అనగా కనబడుచున్న సృష్టిజీవులు. అది కాని

దేదియూ లేదు. అది లేనిచో ఇది లేదు. 'అ' పరము. 'ఇ' ప్రకటింపబడిన 'పరము' లేక 'ఇహము'. సృష్టి అంతయు ఈం కారమే. 'అ' నుండి 'ఇ', 'ఇ' నుండి 'ఎ' అటుపైన 'ఐ'గ వ్యాపించునది 'ఉ' తత్త్వము. అచ్చు లన్నియూ అ, ఇ, ఉ లతోనే యేర్పడినవి.

దశ స్థానము లందునూ శ్రీమాత ఆనందముతో ఆవరించి యుండును. కనుక భౌతికము నుండి పరము వరకు ఆమెను దర్శించుచు, ఆనందించుచు, ఆమె ఆరాధనము చేయుచూ బ్రహ్మైక్యస్థితిలో నుండ వచ్చును. 'ముద్ర' అను పదమునకు ఆనందముతో ఆవరించి యుండుట అని అర్థము. ముత్ + ద్ర = ముద్ర. ముత్ అనగా ఆనందము. దానినే ముదము అందురు. సర్వము వ్యాపించిన ముదమును ఆముదము అందురు. 'ద్ర' అను శబ్దమునకు ఆవరించునది అని అర్థము. దీనివలన తెలియునదేమనగా ఇహపరమంతయూ శ్రీమాత ఆనంద రూపముగ దర్శించి ఆరాధించవలె ననియు, అట్టి ఆరాధనమే సమారాధన మనియూ తెలియుట.



# 978. 'త్రిపురా శ్రీవశంకరీ'

**శ్రీ** చక్రమున పంచమ చక్ర అధిష్ఠాన దేవత శ్రీమాత అని అర్థము.

నవ చక్రములకు అధిష్ఠాన దేవతలను పేర్కొనిరి. దశమము బిందువు. అందు ఎనిమిదవ చక్ర అధిదేవత త్రిపురాంబిక కాగా, ఐదవ చక్ర అధిదేవత త్రిపురాశ్రీ అని పిలువబడుచున్నది. తొమ్మిదవది యగు శ్రీమాత మహత్తుగ నుండి మూడహంకారములుగ ఎనిమిది, ఏడు, ఆరు చక్రములను నిర్మించును. అందు మొదటిది సాత్త్విక అహంకారము, రెండవది రాజసిక అహంకారము, మూడవది తామసిక అహంకారము. అవి వరుసగా ఎనిమిది, ఏడు, ఆరు చక్రములను అవరోహణక్రమమున అధిష్ఠించి యుండును. ఈ మూడహంకారము లాధారముగ సృష్టి పంచీకరణము చెందును. అనగా అంతయూ ఐదు ఐదుగ యేర్పడును. అవియే పంచ భూతములు, పంచ తన్మాత్రలు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు. వీనియందు కదలికకు, పోషణమునకు, వృద్ధికి పంచ ప్రాణములుగ తానే దిగి వచ్చును. ఇట్టి సృష్టి పంచీకరణమునకు అధిష్ఠాన దేవతగ, తాను త్రిగుణముల సమాహార ప్రజ్ఞగ అధిష్ఠించి యుండును. పంచసృష్టికి అధిదేవతగ త్రిపురాశ్రీ యుండగా మూడహంకారములకు అధిదేవతగ త్రిపురాంబికగ యుండును. ఇట్లు ముఖ్య స్థానములందు తననే

నియమించుకొని యుండును. గురుతర బాధ్యత నిర్వహణకు తానే తనను సృష్టించుకొనుచూ నిర్వహించును. ఇతరములకు తన అంశలు చాలును. అంశ అనగా ఆమె కిరణములే.

త్రిపురాశ్రీ ఆరాధనము వలన పై తెలుపబడిన పంచమముల గుత్తి ఆరాధకుల వశము చేయును. ఈ పంచవిధ సృష్టి వశమగుట యనగా మనసు వశమగుటయే. మనోవశము వలన సృష్టిలో జీవులు బంధింపబడక ఆనందముతో వసింతురు. మనో విజయము పొందిన వారు సృష్టిని ఆనంద నిలయముగ భావింతురు. శివుని నిలయము ఆనంద వనమనియూ, వేంకటేశ్వరుని నిలయము ఆనంద నిలయ మనియూ తెలుపుటలో అంతరార్థ మిదియే. శివకేశవులు సృష్టియం దెచ్చట యున్ననూ ఆనందముగనే యుందురు. త్రిగుణములను సమన్వయించుకొని పాంక్తముగ (ఐదుగ) యేర్పడిన సృష్టి యందు ఆనందముగ వసించుచు నుండవలె నన్నచో శ్రీమాతను 'త్రిపురాశ్రీ'గా ఆరాధింతురు.



# 979. 'జ్ఞానముద్రా'

**జ్ఞా**నముద్రతో నుండునది శ్రీమాత అని అర్థము.

ధ్యానము చేయునపుడు, జపము చేయునపుడు, స్తోత్రాదికములు చేయునపుడు, జ్ఞానము వెలుగుగా దర్శన మగుచుండగా జీవుని అహంకారము దైవముతో కూడి ఆనందము చెందు సమయమున అప్రయత్నముగ చూపుడువ్రేలు, బొటన వ్రేలు పరస్పర మాకర్షింపబడి కలిసియుండును. చూపుడు వ్రేలు అహంకారమునకు ప్రతీక. బొటన వ్రేలు దైవాంశయైన జీవుని ప్రతీక. ఈ రెండింటి సంగమము ఆనంద దాయకము. ఆ సంగమముననే ఈ జీవునికి జ్ఞానోదయమై వృద్ధి చెందుచు నుండును. వెలుగు దర్శనము, జ్ఞానవృద్ధి సమాంతరముగ సాగును. ఇట్టి అనుభూతి కలుగునపుడు ముద్ర లేర్పడును. భక్తి పారవశ్య మున, జ్ఞాన పారవశ్యమున అనేక ముద్రలు ఆనందము కారణముగ యేర్పడుచుండును.

ముద్ర లేర్పడుట వేరు. ముద్రలు పెట్టుకొనుచు కూర్చుండుట వేరు. రెండవ తరగతి వారికి ధ్యానము, జపము, స్తోత్ర పారాయణము చేయుచున్నామను అహంకార మెక్కువై తీవ్రత కలుగుచుండును. మొదటి వర్గము వారికి ఆనంద మెక్కువై హస్తముల యందలి దివ్య ప్రజ్ఞలు పరస్పర మాకర్షింపబడి, సమాగమము చెంది అందమైన ముద్రలు యేర్పడుచూ నుండును. నమస్కారము పెట్టుచూ కూర్చున్నచో చేతులు నొప్పులు పుట్టునేగాని అది నమస్కార ముద్ర కాజాలదు. తాను ఆరాధన

మున దైవమునకు సన్నిహిత మగుచుండగా నమస్కార ముద్ర యేర్పడి నచో దైవ సన్నిహితత్త్వ మున్నంత సేపు ముద్ర నిలబడి యుండును. ముద్ర పెట్టుకొని కూర్చుండుట ప్రయత్నపూరకము. ముద్రపడుట అప్రయత్నము. ఆనంద చిహ్నముగ పడును. ఆనంద మావరించినపుడు పడునదే ముద్రగాని, ముద్ర వేయుట వికారము. అట్టివారు పౌండ్రక వాసుదేవులే. కృష్ణుని చూచి అతని వలెనే అలంకారము చేసుకొని వేణువు, శంఖము, చక్రము, గద, పద్మము కూడ యేర్పరచుకొని, వాసుదేవుడనని పేరు మార్చుకొని సమకాలికుడుగ ఒకడుండెడి వాడట. అతడే పౌండ్రక వాసుదేవుడు. అత డపహాస్యము పాలైనాడు. ఏది ఫలమో అది ప్రయత్నమనుకొనుట అవివేకము. శ్రీమాత జ్ఞానముద్రకు కారణము ఆమె శివైక్యస్థితి. అది పరమానంద కారకము. అందువలన ఆమెది సహజ జ్ఞానముద్ర.



# 980. 'జ్ఞానగమ్యా'

**జ్ఞా**నముచే చేరదగినది శ్రీమాత అని అర్థము.

శ్రీమాత జ్ఞానరూపిణే. జ్ఞాన జ్ఞేయ స్వరూపిణి. ఆమె విగ్రహమే జ్ఞానము. జ్ఞానము నిచ్చునది కూడ ఆమెయే కనుక 'జ్ఞానదా' అని కూడ పిలువబడును. జ్ఞానము నిచ్చును (జ్ఞానదా). తెలియవలసినది తెలుపును (జ్ఞేయ). జ్ఞానము వైపునకు నడిపించును (జ్ఞానగమ్యా). అట్లు నడిపించుచూ ఆనందము కలిగించును (కౌముదీ). ఆనందముతో జీవుడుండగా ముద్రలను యేర్పఱచి ఆనందమున స్థిరపఱచును. అటుపైన తన విగ్రహ దర్శనము గావించును (జ్ఞాన విగ్రహ). ఇట్లు తల్లివలె అజ్ఞానమున పడిన తన సంతానమును తానే జ్ఞాన మిచ్చి తన వద్దకు చేర్చుకొనును. వారు జ్ఞానులుగ ప్రకాశించుచుండగా చూచి ఆనందించును. తన పనులలో అవసరమును బట్టి వారిని వినియో గించును.

శ్రీమాత కేవలము శివరూపిణి. ఆమెకు పరుడైన శివుడే ఉపాధి. సమస్త సృష్టి తన నాశ్రయించి, వ్యాప్తి చెంది వెలుగుచున్ననూ సృష్టిని ఉపాధేయముగ భావించదు. సత్యము, పరము, అనంతము, జ్ఞానమయము అగు శివునియందే దృష్టి కలిగియుండును. కుమారులకు, సప్త ఋషులకు, నారదాది మహర్షులకు, సమస్త దేవతలకు మార్గదర్శియై యున్నది. జ్ఞానమే మార్గమని, జ్ఞానమే గమ్యమని,

జ్ఞాన విగ్రహమై నిలచినది శ్రీమాత. ఆమెకన్న ఆదర్శమూర్తి సృష్టి యందు మరియొకటి లేదు. ఆమె ఆరాధనలోని ఆంతర్యము జ్ఞానము పొందుటయే. అదియే ఆరాధనా ప్రయోజనము. పరమ ప్రయోజన మదియే.



# 981. 'జ్ఞానజ్ఞేయ స్వరూపిణీ'

**జ్ఞా**నముచే తెలియదగినది శ్రీమాత అని అర్థము.

ఏమి తెలియవలెనో అది తెలుపుట, దానివలన జ్ఞానము కలుగుట జరుగుచుండును. తెలియవలసినది తెలియువరకు మానవుల జీవితము ఒడుదొడుకులతో నడచును. తెలియవలసినది జ్ఞానము, అనగా బ్రహ్మము. బ్రహ్మజ్ఞానము వలననే సృష్టి అవగాహన పరిపూర్ణమగును. అది తెలిసిన వారికి సత్యము, ధర్మము తెలియును. వారు యజ్ఞార్థము జీవించు చుందురు. స్వహితమును, సంఘహితమునకు సమర్పించి జీవించుట యజ్ఞార్థ జీవన మగును. గుణములు, యింద్రియములు ఆరాధనా మార్గమున శుద్ధ మగుచున్నకొలది ధర్మము దర్శన మగు చుండును. మనస్సు, గుణములు శుద్ధము కానపుడు ఎవరు చేయు పనులు వారికి ధర్మమే అనిపించుచుండును. ధర్మమే అవలంబించుచున్నా మనుకొనుచు ఎవరికి వారు కార్యము నిర్వర్తించు చుండగా అధర్మ మేర్పడుట జరుగు చుండును. కారణము సమ్యక్ దర్శనము లేకపోవు టయే. సమగ్రమగు ధర్మదర్శనము శుద్ధ మనస్కులకే గోచరించును. రజస్తమోగుణములతోను, కోరికలతోను కూడిన మనస్సు ధర్మమును గ్రహింపజాలదు.

జ్ఞానము వలన అగ్ని జనించును. జ్ఞానాగ్ని మలినములను దగ్ధము చేయును. సత్యమును, ధర్మమును దర్శింపచేయును. తెలియ

వలసినది జ్ఞానమే. జ్ఞానము తెలియుట అను మార్గముగను, జ్ఞానముగను శ్రీమాతయే యున్నది. ఆమెను ఆరాధించుట వలన జ్ఞాన మార్గములో నడచుటకు దారి దొరుకును. శరీరమందలి నాడులవలె సృష్టియం దనేకానేక మార్గము లున్నవి. సరియగు నాడి దొరకనిచో సుషుమ్న నెట్లు చేరలేమో, అట్లే సరియగు సాధనా మార్గము దొరకనిచో జీవులు భ్రమను పడి, భ్రమణము చెందుచు నుందురు.

ఎందరో గురువులు, మరెందరో ప్రవక్తలు, కోకొల్లలుగ ప్రబోధకులు, అశేషమగు బోధనలు– వీటన్నిటితో కూడి జ్ఞానమొక మహారణ్యము వలె గోచరించును. అట్టి అరణ్యమున దారి దొరకుట ఎట్లు? శ్రీమాతను దారికొరకు ఆరాధించినచో దారి దొరకును. ఆమే జ్ఞానమునకు వెలుగుదారిగ నున్నది. జ్ఞానముగ కూడ నున్నది. ఆమెయే మార్గము. ఆమెయే గమ్యము. గీతయందు శ్రీకృష్ణుడు "నేనే మార్గము, నేనే గమ్యము" అని తెలిపినాడు.

సద్గురువులు లభించుట, లభించకపోవుట, కుమతులకు గురువులు దొరకుట జీవుల బట్టియే జరుగును. సంకల్పసిద్ధిని బట్టి గురు దర్శనము, మార్గ దర్శనముండును. కుమతులకు కుమతులే లభింతురు. మోసము చేయువారికి మోసగాండ్రే లభింతురు. వంచకులకు వంచకుల రూపముననే దైవము తారసిల్లునని రుద్రసూక్తము చాటు చున్నది. బ్రహ్మమును కోరినవారికి, బ్రహ్మపదమును చూపు గురువులే దొరుకుదురు. ఇతరములు కోరువారికి వానికి మార్గము చూపించు

గురువులు దొరుకుదురు. ఇందరియందు శ్రీమాతయే వర్తించుచుందును. తెలియవలసినది కోరునంతవరకు తెలియవలసినది తెలుపబడదు. “నే నివ్వదలచినది, మీరు అడుగనంతవరకు మీరడిగిన విచ్చుచూ కాలక్షేపము చేయుచుందును” అని షిరిడి సాయిబాబా వెల్లడించుటలోని అంతరార్థ మిదియే.



# 982. 'యోనిముద్రా'

**యో**ని యందు సంతస మిచ్చునది శ్రీమాత అని అర్థము.

యోని యనగా తలక్రిందులుగ యుండు త్రికోణము. ఈ త్రికోణ మానంద మిచ్చును. ఈ త్రికోణమే బిందువునుండి వ్యక్తమై అటుపై నవావరణములుగ యేర్పడును. త్రికోణము లేనిదే సృష్టి లేదు. సృష్టి లేనిచో ఆనందము లేదు. ఆనందించుటకు త్రికోణము కావలెను. ఆనందించవలె నన్నచో, ఆనందించువాడు ఒకడుండవలెను. ఆనందించుట అను క్రియ యుండవలెను. కర్త, కర్మ, క్రియ త్రికోణ సంకేతము. కర్త క్రియను నిర్వర్తించుచూ, కర్మము ననుభవించు చున్నాడు. కర్త లేనిచో అనుభవించుట యుండదు. కర్త వున్ననూ, క్రియ లేనిచో అనుభవముండదు. క్రియ యున్ననూ, అనుభవించుట యుండవలెను కదా! అనుభవించుటకే క్రియ. అందులకే కర్త కృషి చేయును. కర్త కర్మ క్రియలుగ సృష్టియోని యున్నది. దానికి నడుమ బిందువున్నది. బిందువు నుండియే త్రికోణమగు యోని యుద్భ వించును. ఆ త్రికోణమే ఇచ్ఛా, జ్ఞాన, క్రియలు. ఇచ్ఛ లేనిదే క్రియ లేదు. క్రియ లేనిదే అనుభవము లేదు.

ఈ మూడునూ లేనిచో జీవు లేమి చేయగలరు? అందువలననే త్రిగుణముల నేర్పరచి అటుపై జీవులను పుట్టించును. ఆమె త్రిగుణాతీత. జీవులందరూ త్రిగుణాత్మకులు. కనుకనే వారికి యిచ్ఛ కలుగును. ఇచ్ఛ

ననుసరించి క్రియలు చేయుచూ జ్ఞానము పొందుచుందురు. అట్లు జ్ఞానము పొందుచుండగా ఆనంద మేర్పడుచుండును. జీవుల ఆనందము శ్రీమాత కానంద మిచ్చును. పసిపిల్లల ఆనందము తల్లికి ఆనందమిచ్చును కదా! ఇట్లు ఆనందము కలిగించుటకే యోని (త్రికోణము) నేర్పరచును. అందు జీవులు పుట్టి ఆనందము పొందు చుండగ, చూచుచు తా నానందించును. ఇచ్ఛా జ్ఞాన క్రియలలో ఇచ్ఛకు మూలము యోనియే. ఇచ్ఛ వలననే సమస్త సృష్టి నిలచుచున్నది. ఆనందము కొరకు అన్వేషించుచూ జీవులు తీరుబడి లేక తిరుగాడు చున్నారు. ఇది ఎంత అద్భుతము!



# 983. 'త్రిఖండేశీ'

త్రిఖండములకు ఈశ్వరి శ్రీమాత అని అర్థము.

త్రిఖండములు అనగా త్రికోణమందలి మూడు భుజములు. వాటి కామెయే మూలము. ఆమెయే స్వామిని, ఈశ్వరి కూడా. మూడింటి నేర్పరచి వానియందు ప్రవేశించి యున్నను, వాని నధిష్ఠించి కూడ యుండును. ఉదాహరణకు పరము నుండి పశ్యంతి, మధ్యమ, వైఖరీల నేర్పరచి వానియందు వ్యాపించి వసించి యున్ననూ, పరదేవతగ కూడ యుండును. తాను తురీయమందుండి జాగ్రత్ స్వప్న సుషుప్తులను కలిగించు చుండును. కాలమై యుండి భూత భవిష్యత్ వర్తమానములై యుండును. ప్రకృతిగ నుండి స్థూల సూక్ష్మ కారణ ప్రకృతులుగ కూడ నుండును. మూడు మూడుగ అన్నిటిని యేర్పరచుచూ వాని నధిష్ఠించి యుండును. అట్లు కోటానుకోట్ల త్రికోణముల నేర్పరచుచూ బిందువుగ వాని నధిష్ఠించి యుండును. అణువు నుండి బ్రహ్మాండము వరకిట్లే యుండును. అణువు నందు కూడ 'న్యూట్రాన్' (సత్త్వము), 'ఎలక్ట్రాన్' (రజస్సు), 'ప్రోటాన్' (తమస్సు)గా నేడు శాస్త్రజ్ఞులు గమనించుచున్నారు. అన్ని జీవులయందు సత్త్వ, రజస్, తమో గుణముల నేర్పరచి చైతన్యముగ వారిని పరిపాలించును. త్రిభుజములు లేనిచో సృష్టి లేదు. శ్రీమాత, శివుడు మాత్రమే యుందురు.

భూర్భువస్సువర్లోకములు మూడును మహర్లోకముల నుండి

జనించినవి. మహత్తుగ ఆమె ఈ మూడులోకముల నధిష్ఠించి యుండును. భూలోకము తమోగుణ ప్రధానమై యుండును. భువర్లోకము రజోగుణ ప్రధానమై యుండును. సువర్లోకము సత్త్వగుణ ప్రధానమై యుండును. ఈ మూడును మహత్తునుండే పుట్టినవి. అట్లే మహత్తు కూడ కాలము, ప్రకృతి, శక్తిల నుండి పుట్టినది. ఎన్ని విధములుగ చూచినను సృష్టి అంతయూ త్రికోణమే. సృష్టి నెరుగుటకు త్రికోణ విద్యను తెలియవలెను. దానినే త్రయీవిద్య అందురు. ఈ త్రయీ విద్యను సమస్తము నందు దర్శించుట జ్ఞానము. ఇట్టి జ్ఞానమును త్రయీవిద్య ద్వారా పొందిన గ్రీకు దేశస్థుడైన 'పైథాగొరస్' పాశ్చాత్య దేశములకు క్రీస్తు పూర్వము 500 సంవత్సరములో జ్ఞానభిక్ష పెట్టినాడు. తానిచ్చిన విద్యను "త్రీనోసోఫియా" అని నామకరణము చేసెను. 'త్రినో' అనగా 'త్రయీ', 'సోఫియా' అనగా 'విద్య'.



# 984. 'త్రిగుణా'

**మూ**డు గుణములు గలది శ్రీమాత అని అర్థము.

సత్త్వ, రజస్, తమస్సులు అను మూడు గుణములు శ్రీమాత ప్రకృతి. ఆమె దివ్య సంకల్పము కాగా సృష్టికొరకై తన ప్రకృతి నుండి మూడు గుణము లేర్పడును. అందు రజస్సు సృష్టికిని, సత్త్వము స్థితికిని, తమస్సు లయమునకును మూలమై యుండును. రజస్సున సత్త్వ తమస్సు లున్నవి. అట్లే తమస్సున సత్త్వ రజస్సులు వున్నవి. సత్త్వమున రజస్ తమస్సు లున్నవి. ఈ మూడు గుణములు విడదీయ రానివి. సృష్టి సర్గము యేర్పడుటకు రజస్సు ప్రధానముగ పనిచేయుచుండగా సత్త్వ తమస్సులు సహకరించును. అట్లే స్థితియందు సత్త్వ మధిష్ఠించి యుండగ రజస్ తమస్సులు సమన్వయింపబడి యుండును. అదే విధముగ లయమును తమస్సు కారణముగ పనిచేయుచుండగ సత్త్వ రజస్సు తోడ్పాటు గావించును. సృష్టి స్థితి లయములలో 'త్రిగుణ'యే పని చేయును. సృష్టికి త్రిగుణమైన శ్రీమాతయే ఆధారము. ఇట్లు తన లీలచే త్రివిధముగా నున్నది గాన 'త్రిగుణా' అని కొనియాడబడుచున్నది. ఆ త్రిగుణములకు శ్రీమాత సంకల్పమే ఆధారము.

త్రిగుణ అను శ్రీమాత నామమును, 'త్రిపథ' అని కూడ పలుకుదురు. 'త్రివర్గ' అని కూడ పలుకుదురు. 'త్రివిక్రమ' అని కూడ అనవచ్చును. 'త్రయీ' అనియు, 'త్ర్యయంబక' అనియు, 'త్ర్యక్షరీ'

అనియు, 'త్రికూట' అనియు, ఇట్లు త్రయీ నామము లెన్నియో శ్రీమాతను గూర్చి ఈ సహస్రనామమున కీర్తింపబడినవి. చతుర్వింశతి (24) నామములు శ్రీమాత త్రయీ తత్త్వమును కొనియాడుచున్నవి.



# 985. 'అంబ'

**అం**బ అనగా తల్లి అని అర్థము.

అన్నిటికి తల్లి ఆమెయే. ప్రప్రథమముగ గుణములకు తల్లిగ వెలసిల్లినది. త్రిగుణములే సృష్టి కాధారము. అందుండియే లోకములు, జీవులు పుట్టినవి. జీవులకు త్రిమాత లున్నారు. త్రిమాతలకు తల్లి శ్రీమాత. ఆమె ముగ్గురమ్మల మూలపుటమ్మ, అమ్మల గన్న యమ్మ గనుక అంబ అని పిలుచుట జరిగినది. అమ్మలెందరో గలరు. అమ్మలందరికి అమ్మ అంబ. అంబ అనుపదము విశిష్టమగు పదము. అంబశక్తి వలననే ముగ్గురమ్మ లేర్పడిరి. మూడులోకము లేర్పడినవి. ఆమె మూలశక్తి గనుక అంబ అని పిలువబడుచున్నది. అంబ అనగా అమ్మలకన్న విశిష్టమైనది.



# 986. 'త్రికోణగా'

త్రికోణ చక్రమును పొందినది శ్రీమాత అని అర్థము.

త్రికోణ చక్రమే యోని చక్రము. అదియే త్రిగుణ చక్రము. ఆ చక్రమును నిర్మించి తన్నుతాను ప్రవేశించుటవలన అష్ట ప్రకృతులతో కూడిన సృష్టి యేర్పడును. అష్ట ప్రకృతులకు త్రికోణమే ఆధారము. త్రికోణమునకు శ్రీమాత ఆధారము. త్రికోణము యొక్క ప్రాముఖ్యత ముందు నామములో తెలుపబడినది. ఇచ్ఛ, జ్ఞాన, క్రియలు త్రికోణముగ యేర్పడి అటుపైన ఎనిమిది త్రికోణము లేర్పరచును. అందు ఐదు త్రికోణములు పంచభూత సంబంధమై యుండును. మూడు త్రికోణ ములు గుణ సంబంధమై యుండును. అటుపైన తొమ్మిదవది యగు త్రికోణము అధిష్ఠాన త్రికోణమై యుండును. ఈ తొమ్మిది త్రికోణములు బిందు వాధారముగ వ్యక్తమగును. ఇట్లు శ్రీమాత సృష్టి చక్రమును యేర్పరచును. ఈ నవ త్రికోణముల చక్రము చుట్టునూ అష్ట ప్రకృతులు అష్టదళ పద్మముగ వికసించును. అవి ఆధారముగ షోడశ కళలతో సృష్టి వెలుగొందు చుండును. అట్టి సృష్టికి మూడు వలయాకార ప్రాకార ములు, దాని చుట్టును నలుచదరముగ పదార్థమయ సృష్టి, ఆ సృష్టికి నాలుగు ద్వారములు– తూర్పు పడమర ఉత్తర దక్షిణములుగ యేర్పడి యుండును. నలుచదరముగ యేర్పడిన సృష్టి భౌతికము. అందు వలయాకారముతో యున్న శ్రీచక్రము సూక్ష్మము.

మొత్తము సృష్టి విధాన మంతయు శ్రీ యంత్రమున నిక్షిప్తమై యున్నది. అందు బిందువు, త్రికోణములు, వృత్తాకార వలయము, చతుర్భుజ ప్రాకారము, ప్రధాన చక్రములు. చతురస్రమునకు మూలము త్రికోణము. అందెనిమిది త్రికోణములు. ఊర్ధ్వమునకు అథస్సునకు చెరి నాలుగు త్రికోణములుగ యేర్పడి యుండగ, వాని నధిష్ఠించి మూల త్రికోణము ఊర్ధ్వముగ నుండును. దాని కాధారమై బిందు వుండును. మొత్తము శ్రీచక్రము నారాధించుట ఒక సంప్రదాయము. కేవలము బిందు త్రికోణము నారాధించుట మరియొక పద్ధతి. మొదటి త్రికోణమే సమస్తమునకు ఆధారము గనుక ఆ త్రికోణమును బిందువుపై ఆధారపడి యున్నది గనుక క్లుప్తముగ బిందు త్రికోణము నారాధించుట త్రికోణగ ఆరాధించినట్లగును.



# 987. 'అనఘా'

**దుః**ఖము, వ్యసనము, పాపము లేనిది శ్రీమాత అని అర్థము.

దుఃఖము, వ్యసనము, పాపము జీవులకుండుట సహజము. కనుకనే వారు సృష్టి యందున్నారు. నేర్వవలసి యున్నారు. శ్రీమాత సృష్టిని అధిష్ఠించి యుండును. జీవులకొరకు సృష్టి చేయును. తనకొర కైనచో సృష్టియే అవసరము లేదు. తాను పరమే. ఆమెను అజ్ఞానమను పాపముగాని, వ్యసనముగాని, దుఃఖముగాని అంటజాలవు. గుణము, సంగము కలవారినే దుఃఖము, వ్యసనము, పాపము సృష్టియం దంటును. అంటక సృష్టి యందుండుట శ్రీమాతకే చెల్లును. పరమా నందము పొందుటకు అంటక సృష్టి యందుండుటయే ఉత్తమోత్తమ మని యోగులు దర్శించిరి. వారును అనఘులే. కుమారు లట్టివారు, సప్తఋషు లట్టివారు. వీరిని కౌమారసృష్టి అని తెలుపుదురు. వీరందరూ శ్రీమాత కుమారులే. సృష్టి యందు శ్రీమాత పనులే చేయుచు పరమా నందభరితులై యుందురు. వెయ్యి రూపముల కూడ శ్రీమాతయే యున్నది. అనఘులని చెప్పుకొనదగిన వారిలో పతివ్రతలగు అనసూయాది సప్త పత్నులను గుర్తించవలెను.

శ్రీమాత అనఘా రూపము అనసూయ, కళ, శ్రద్ధ, అరుంధతి, హవిర్భూ, గతి, క్రియ యిత్యాది పతివ్రతల యందు గోచరించును. అట్లే లోపాముద్ర రూపమున కూడ శ్రీమాతయే యున్నది. మండోదరి,

సీత, సావిత్రి, తార, ద్రౌపది రూపములయందు కూడ శ్రీమాత అనఘత్వ మహిమ గోచరించును. పుణ్యక్షేత్రముల యందు, పుణ్య తీర్థముల యందు, పుణ్య నదులయందు, వనముల యందు, పుణ్య పర్వతముల యందు అనఘత్వము నింపి జీవులను దుఃఖము, వ్యసనము, అజ్ఞానము అను పరిమితుల నుండి వుద్ధరించుచుండును. ఎవరి దర్శన స్పర్శన భాషణాదుల వలన పై మూడు అవకరములు తొలగునో ఆయా రూపముల యందు శ్రీమాత అనఘా తత్త్వమును దర్శింప వచ్చును.



# 988. 'అద్భుతచారిత్రా'

శ్రీమాత చరిత్ర అనూహ్యము అని అర్థము.

అద్భుత మనగా ఊహింప నలవి కానిది. ఏ నిమిషమున కేమి జరుగునో ఎవ్వరునూ వూహింపలేరు. భూకంపములు, అతి వృష్టులు, జలధులు పొంగుట యిత్యాది వన్నియూ ఎవరి వశముననూ వుండవు. ఒక జాతి వృద్ధి చెందుట, ఒక జాతి నశించుట, అగస్మాత్తుగ పతనము చెందుట, యిట్లెన్నియో జరుగుచుండును. ఎప్పుడు ఎవరికి ఎచ్చట ఏమి జరుగునో జీవు లెవ్వరునూ తెలియలేరు. జరిగిన వెనుక యిట్లు జరిగినదని భావించుటయే గాని, ఊహించి చెప్పుట కష్టము. శ్రీమాత లీలలే కాదు, ఆమె నడవడిక అవగాహన చేసుకొనుట ఋషులకైననూ కష్టమే. లలితమూర్తి యైన శ్రీకృష్ణ జీవితమున యిట్టి అద్భుత ఘటన లెన్నియో కలవు. బాలకృష్ణుడుగను, కుమారునిగను, ప్రౌఢునిగను అతడు గావించిన అద్భుతములు శ్రీలలిత అద్భుత చారిత్రమునకు మచ్చుతునకలు. భక్తుల ననుగ్రహించుటలోను, దుష్టు లను దండించుటలోను, నిజ వివాహములందు, భారత యుద్ధము నందు, అన్నిటికి మించి ద్రౌపతిని రక్షించు విషయమున కృష్ణుడు చూపిన లీలలు మహాద్భుతములు. అతడు అద్భుత చారిత్రుడు. శ్రీమాత కూడ దుష్ట సంహారమునందు, శిష్ట రక్షణయందు, సృష్టి స్థితి లయము లందు, యిట్టి అద్భుతములనే ప్రదర్శించుచుండును. దేవీ పురాణ మందలి ఆమె అద్భుత చారిత్రమే.

# 989. 'వాంఛితార్థ ప్రదాయినీ'

**కో**రిన కోరికల నిచ్చు స్వభావము కలది శ్రీమాత అని అర్థము.

భక్తితో ఎవరేమి కోరిననూ శ్రీమాత వారినట్లు అనుగ్రహించును. వరముల ఫలములు పొందు భక్తులు శ్రీమాత యందు యినుమడించిన భక్తి విశ్వాసము గలవారై ఆమె నారాధింతురు. శ్రీమాత కామధేనువు మరియు కల్పవృక్షము. ఆమె సకల దేవతామూర్తి, సర్వశక్తిమంతురాలు. అష్టైశ్వర్యములు ఆమె కనుసన్నలలోనే యుండును. కోరికలను తీర్చుచు, జీవులకు వృద్ధి కలిగించుచు నుండును. ఒకానొకచో కోరికల వలన హాని కలుగునని భావించినచో అట్టి కోరికల విషయమున మఱపు కలిగించును.

సత్త్వగుణమున నిలచి ఆరాధించువారు కోరిన కోర్కెలు వరము లుగ పొందుచు వృద్ధి చెందుదురు. రజోగుణ స్వభావము కలవారు కోరిన కోర్కెలు వారి కపాయము కలిగించుచు నుండును. అట్లే తమో గుణ సంపన్నులు కూడ కోరికలు సిద్ధించుట వలన అపాయమున పడుదురు. తపముచేసి వరములు పొందిన అసురుల కథ లున్నవి. వారు తాము కోరిన వరముల వలన దుఃఖములపాలై మరణించుట జరిగినది. సత్త్వగుణము ప్రధానముగ గలవారు తమ కోరికల ద్వారా వృద్ధి చెందుదురు.

వరములు కోరువారు తాము కోరిన వరము ఫలములకు వారే

బాధ్యులు. దేనివలన తాము వృద్ధి చెందుదురో శ్రీమాతకు తెలియును గనుక కోరక ఆరాధనము చేయుట ఉత్తమమని కొందరి మతము. పూజించువారు తమ బుద్ధి దైవవశమై యుండవలెనని కోరుట ఉత్తమ మని మరికొందరి మతము. బుద్ధి కర్మాధీనముగాక దైవాధీనము అగుట వలన కర్మఫలము లంటక జీవుడు పురోగతి సాధించునని వారి మతము. ధర్మముతో కూడిన అర్థకామములు మోక్షస్థితి యందుంచునని, చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం పూజ లాచరించ వలెనని శాస్త్ర ప్రమాణము. శ్రీమాత కరుణామయి మరియు దయార్ద్ర హృదయ గనుక తన్ను ఆరాధించిన వారి వాంఛితములను వారి కనుగ్రహించుచు నుండును అనునది సత్యము.



# 990. 'అభ్యాస అతిశయ జ్ఞాత్రి'

**అ**భ్యాసము వలన అతిశయముగ తెలియబడునది శ్రీమాత అని అర్థము.

ఆరాధన అంతర్గతమైనప్పుడు అభ్యాసము అతిశయించును. అంతరంగమందు ఆరాధనా మార్గమున చేరుటవలన అభ్యాసము రుచి పెరుగును. భక్తిశ్రద్ధలతో ఆరాధనను అభ్యసింపవలెను. అవగాహ నతో ఆరాధనము చేసినపుడు భక్తి శ్రద్ధ లినుమడించును. బహిర్గతముగ ప్రతిమకు చేయు ఆరాధనము ప్రాతిపదికగ భక్తి శ్రద్ధలు పెరుగును. ఇందులకు సందేహము లేదు. చిన్నతనముననే ఉపచారములతో కూడిన లఘుపూజ నభ్యసింపవలెను. పూజ చేయు విద్యార్థినీ విద్యార్థులయందు క్రమశిక్షణ, క్రమబద్ధత పెరుగును. క్రమముగ అది శ్రద్ధయై నిలచును. దినచర్య కూడ క్రమబద్ధమై యుండును. దైవమునకు పూజ చేయవలెను అను భావము అభ్యాసవశమున పటిష్ఠముకాగా దేవుని కొరకై ఉదయమే లేచుట, శుచి యగుట, పూజ చేయుట జరుగును. దేవుని కొరకు నిద్ర లేచుట ఒక మంచి సంస్కారము. పనిపాట్లకై నిద్ర లేచుట కన్న, దేవుని పూజ కొఱకై నిద్ర లేచుట నిస్సందేహముగ ఉత్తమ సంస్కారము. తినుటకై నిద్ర లేచువారు కలరు. వ్యాయామము కొఱకై నిద్ర లేచువారు కలరు. పనుల కొఱకై నిదుర లేచువారు కలరు. తంత్రములు, కుతంత్ర ములు కారణముగ నిదుర లేచువారు కలరు. దిన పత్రికలతో ఉదయము కాలము గడుపువారు కలరు. ఇట్టి వారికన్న తమ ఉనికికి

కారణమగు దైవము నారాధించువారు ఉత్తములు. ఇట్టి నిత్యారాధనము అభ్యాసము కాగా పుష్కర కాలములో అంతరంగ ఆరాధనమునకు తప్పక ప్రేరణ లభించును. అంతరంగ ఆరాధనము సమ్యక్ ఆరాధనమై లోనుండి దివ్య ప్రేరణలు కలుగును. దివ్య భావనలు కలుగును. వాని ననుసరించు చుండగా క్రమముగ జ్ఞానము కలుగును. అట్లు జ్ఞానమునకు బీజ మేర్పడుచుండగా సత్పురుషుల సమాశ్రయణము కలుగును. చుట్టునూ సత్సంగ మేర్పడి దైవజిజ్ఞాస పొంగుచు దివ్య జ్ఞాన మార్గముల ప్రవేశించును. అనంతమగు జ్ఞానము అందు ప్రవేశించు చుండగ శ్రీమాత లోతులు తెలియుచు జ్ఞాన పిపాసకుడై శ్రీమాత నెరుగు వ్యాపారముగ జీవితము సాగును. అదియే వ్యసన మగును. అభ్యాసమున అతిశయించి జ్ఞానమను ప్రజ్ఞ చురుకుగ సాగు చుండగ, తనను తెలియు మార్గమునందు శ్రీమాతయే ప్రవేశింపజేసి తానుగ భక్తుల ననుగ్రహించి సాక్షాత్కరించును. ఈ మొత్తమునకు పునాదిరాయి అభ్యాసమే.

ఆరాధన అభ్యాసమై నిలచుట వలన, అభ్యాసము వలన ఆరాధన స్థిరపడవలెను. ఏ అంశమైనను అభ్యాసము అగు వరకు క్రమము తప్పక నిర్వర్తించినచో అటుపైన అభ్యాసమువలన నిర్వహణము క్రమము తప్పక యుండును. అన్నపానీయాదులు అభ్యాసమైనట్లు ఆరాధనకూడ అభ్యాసమైనచో జీవుడు తప్పక సంస్కరింపబడును. తన్ను తాను సంస్కరించుకొనువాడు భక్తి మార్గములలో నిలచి, జ్ఞానము పొంది కృతార్థులగుదురు. కనుక అతిశయించిన అభ్యాసము ప్రధానము. అందులకే నిత్య పూజలు, నిత్య ప్రార్థనలు.

# 991. 'షడధ్వాతీతరూపిణీ'

**ఆ**రు మార్గములకు కూడ అతీతమైన రూపము కలది శ్రీమాత అని అర్థము.

అంతఃకరణము చేరి ఆరాధించు భక్తులకు అక్షరములు, పదములు, మంత్రములు, శబ్దములు, కాంతులు, కాంతి లోకములు దర్శన మగుచుండును. అక్షరము లన్నియూ మాతృకలే కావున వానికి శబ్దము, వర్ణము, అర్థము గోచరించుచూ, ఆరాధకుని ఆయా లోకము లందు నిమగ్నము చేయును. అక్షరముల కూడికలే పదములు. అందలి గుణింతములు గుణకారకములై రకరకముల వెలుగు దర్శనముల నిచ్చుచుండును. అక్షరమును బలముగను, స్వరముతోకూడి భక్తితో పలికినపుడు దంతపు చిగుళ్ళయందు నాలుక కొనచేయు స్పర్శ వలన కాంతులు పుట్టును. తదనుగుణమగు శబ్దముల భావములు తెలియును. ఇట్లు అంతఃకరణమున అక్షరములు, పదములు, మంత్రములు అనేకానేక వెలుగు లోకముల దర్శనము కావించు చుండును. ఇట్టి దర్శనములు మూల నుండి ఆజ్ఞా పద్మములు వరకు ఆరు విధములుగ గోచరించి ఆనందింపచేయును. షట్పద్మముల దర్శనము, అందు దళముల కాంతి గోచరించును. హాకినీ, సాకినీ, కాకినీ, రాకినీ, లాకినీ, ఢాకినీ దర్శన ములు కూడ జరుగును. సుషుమ్న యందు గల ఆరు ప్రజ్ఞా కేంద్రములు శ్రీచక్రమునందు దర్శింపవచ్చును. నిజమునకు మానవుని రూపము

ఒక శ్రీచక్రమే. అంతరంగము చేరి అంతఃకరణములు చేరినవారికి ఈ దర్శనములు అత్యంత శోభాయమానములై రుచిని పెంచును.

వీటన్నింటినీ మించి సహస్రారమున శ్రీమాత అతీత రూపమగు అంతర్యామి దర్శనమగును. అచ్చట శ్రీమాత సర్వవర్ణ ఉపశోభిత. అచ్చట అన్ని రకముల కాంతులు, శబ్దములు, మాతృకలు, ఆయుధము లతో కూడి సమస్త దేవతా ముఖములతో కూడియుండును. అది ఆమె విశ్వరూపము. అచట ఆమె విశ్వతోముఖి. ఈ దర్శనమున విశ్వమందలి సమస్తమును శ్రీమాతగనే దర్శింపబడుట సిద్ధించును. షడధ్వాతీత రూపయగు శ్రీమాతను దర్శించుటయే సిద్ధి.



# 992. 'అవ్యాజ కరుణామూర్తి'

నిష్కారణమగు కారుణ్యము గలది శ్రీమాత అని అర్థము.

మహాత్ముల కరుణకు కారణముండదు. వారియందు గల ప్రేమ భావమే కారణము లేకుండ యితరుల ననుగ్రహించు చుండును. ఆ ప్రేమ స్వరూపము శ్రీమాతయే. కొన్ని అనుగ్రహములకు కారణము లుండును. కొన్ని అనుగ్రహములకు ఎంత వెదికిననూ కారణము కనబడదు. పుట్టు దరిద్రునకు అకస్మాత్తుగ సంపద లభించవచ్చును. అకస్మాత్తుగ అతడున్న గుడిసెయందు లంకెలబిందలు లభించ వచ్చును. లేక లాటరీ తగలవచ్చును. చేపలను పట్టు వలలో ముత్యములు, పగడములు దొరకవచ్చును. ఏ సంపన్నునో కాపాడుట వలన అధిక మగు ధనము లభింప వచ్చును. ఇట్లు ఎన్ని ఉదంతములు లేవు! ఇట్టివి పాపపుణ్యముల కవగాహనకు మించి యుండును. పూర్వ పుణ్య మని కూడ చెప్పలేము. నేటికిని రాయలసీమలో వర్షము పడినపుడెల్ల కొందరికి వజ్రములు లభించుచుండును. ఇట్టి అనుగ్రహము లన్నియు అవ్యాజకరుణను తెలియచేయు చుండును. శ్రీమాత తన కరుణచే మూర్ఖుని విద్వాంసుని చేయగలదు. అట్టివాని విద్వత్తు ముందు విద్వాంసులు కూడ తలలు వంచవలసి యుండును. కాళిదాసు అట్టివాడే కదా! ఋషి, భగవత్ సమానుడు అగు వేదవ్యాస మహర్షి సహితము కాళిదాసుని తనంత వానిగ అభివర్ణించినాడు. వేదవ్యాసుని వలె పాండిత్యము పొందుటకు, జ్ఞానము బడయుటకు వేద వేదాంగములను

వివరించుటకు, పంచమ వేదము, ధర్మ స్వరూపము అగు మహా భారతము రచించుటకు ఎన్ని జన్మల విద్యాభ్యాసమైనను చాలదు. అట్టి వేదవ్యాస మహర్షి కాళిదాసును తనంతవానిగ కీర్తించుటకు శ్రీమాత కరుణయే కారణము. ఇట్లు విద్య, సంపద, శక్తి అనూహ్యముగ అనుగ్రహించుటలో శ్రీమాత కెవ్వరునూ సాటిలేరు. ఎట్టి మేధస్సు, విద్యాసంపత్తి, శక్తి సంపత్తి లేనివారెందరో ప్రస్తుత కాలమునకు కూడ ఉన్నత పదవుల నలంకరించుట, అపారమగు ధన సంపాదన చేయుట, మహాశక్తివంతులుగ రాణించుట చూచినపుడు, ఇది అంతయూ అమ్మ చూపు అవ్యాజకరుణ అని తెలియవలెను.



